# మెదకు సీమ విజ్ఞాన సర్వస్వము

ప్రధాన సంపాదకులు :

శాస్త్రుల రఘురామశర్మ, ఎం.ఏ.,

సహాయ సంపాదకులు:

శాస్త్రుల మధుశ్రీ, ఎం.ఏ., ఎల్.ఎల్.బి.

శ్రీదుర్గ ఎం.ఏ.,

**MEDAKUSEEMA VIGNANA SARWASWAMU**

Encyclopedia of Medak District in Telugu

Chief Editor - **SHASTRULA RAGHURAMA SHARMA,** M.A.



First Edition : September 2001

ప్రతులు : 1000

మూల్యము : **Rs. 1500 /-**

ప్రతులకు :

1. ప్రభా ప్రచురణలు
"శ్రీనిధి"
ప్లాట్ నం. 187, చంద్రానగర కాలని,
మచ్చబొల్లారం, అల్వాల్, సికింద్రాబాద్
ఫోన్ : 7861984

2. శాస్త్రుల రఘురామ శర్మ
గోమారం, శివంపేట మండలం,
మెదకు జిల్లా - 502313.

ముద్రణ :
మౌనిక గ్రాఫిక్స్
1-4-27/71/187, పద్మశాలి కాలని,
కవాడిగుడ, హైదరాబాద్.
ఫోన్ : 6212430

" మెదకు సీమ సాహిత్య పరిషత్తు సౌజన్యంతో "






శ్రీ నారా చంద్రబాబు నాయుడు
ముఖ్యమంత్రి, ఆంధ్ర ప్రదేశ్

## సందేశం

శ్రీ శాస్త్రుల రఘురామశర్మ మెదక్ జిల్లా సమగ్ర చరిత్రను గ్రంథరూపంలో వెలువరించడం ఎంతైనా ముదావహం.

పురా ప్రాభవ చరిత్రను, సంస్కృతీ వారసత్వాన్ని స్ఫూర్తిగా తీసుకుని సమాజం భవిష్యత్తును నిర్మించుకుంటుంది. మన దార్శనిక లక్ష్యాలకు, ప్రగతి వ్యూహాలకు ఈ నేపథ్యమే పటిష్ఠమైన పునాదివేళ్ళను సంతరించి పెడుతుంది.

ఈ "**మెదకు సీమ విజ్ఞాన సర్వస్వం**" గ్రంథం చరిత్రకారులకు, పరిశోధకులకు వినియోగపడగలదని, మెదక్ జిల్లా సమగ్రంగా పురోగమించేందుకు బహుధా ఉపకరించగలదని ఆశిస్తున్నాను.

నారా చంద్రబాబు నాయుడు






**కరణం రామచంద్ర రావు**
ఉన్నత విద్యాశాఖా మాత్యులు,
ఆంధ్రప్రదేశ్

**శ్రీ కరణం రాంచందర్‌రావు,** రాష్ట్ర ఉన్నత విద్యాశాఖామాత్యులు

## సందేశం

ఆచార పద్ధతుల ద్వారా భావితరాలకు అందింపగల మానసిక, భౌతిక సాధనాల స్వరూపమే సంస్కృతి. మనం సమాజంలో సహజీవులముగ అలోచించేది, చేసేది, సంపాదించేదంతా సంస్కృతియే.

"మానవుడు సమాజంలో సభ్యునిగావుంటూ ఆర్జించేవిజ్ఞానం, కళ, నీతి, చట్టం, ఆచారం మొదలైన నాటి సమాహారమే సంస్కృతి" అంటాడు టైలర్.

ఇంతటి విశాల స్వభావం కలిగిన సంస్కృతినీ విజ్ఞాన సర్వస్వాన్ని ఒక జిల్లాకు అన్వయించి చూసినపుడు అది జిల్లా సంస్కృతి అవుతుంది. జిల్లా సంస్కృతి ఇతర జిల్లాలకన్నా ప్రాంతాలకన్నా భిన్నంగా ఉన్నప్పుడు ఆజిల్లాకు చెందిన ప్రత్యేక సంస్కృతి, లేదా విశిష్టత అవుతుంది. అట్లే ఆంధ్రరాష్ట్రంలోని మెదకు జిల్లా యొక్క విశిష్టత సంస్కృతీ సంపదలు కోకొల్లలు. శ్రీ శాస్త్రుల రఘురామశర్మగారు "మెదకు సీమ విజ్ఞాన సర్వస్వమును" పేరిట నిరంతర కృషిసల్పి, జిల్లాలోని వనరులు, సాహితీ సంస్కృతులు, రాజులు, వారిపాలన, కవులు వారి రచనలు, దేవాలయాలు, సిరిసంపదలు మొదలగు వాటిని వెలికితీసి గ్రంథమును రచించి జిల్లావరకేకాక రాష్ట్ర స్థాయిలో కూడా పేరెన్నిక కవులుగా, రచయితలుగా సార్థకత పొందుచు జిల్లా సర్వస్వాన్ని పండితపామరులకందించినారు. దీనిని రాష్ట్ర, జిల్లా ప్రజలు సద్వినియోగం చేసికొని చరితార్థులౌతారని ఆశిస్తూ, శ్రీ శర్మగారు ఇటువంటి గ్రంథాలు ఇతోధికంగా రాయాలని ఆకాంక్షిస్తున్నాను.

**కరణం రామచంద్రా రావు**






**ఎస్. రామచంద్రా రెడ్డి**, ఎం.పి.
రాజ్యసభ

## <u>సందేశం</u>

ప్రియమైన శాస్త్రుల రఘురామశర్మ గారికి,

అనేక వ్యయప్రయాసాల కోర్చి మెదకు జిల్లా పూర్వ చరిత్రను వెలికితీసి స్వాతంత్ర్యానంతర సామాజిక, ఆర్థిక పురోభివృద్ధి సాహితీ సాంస్కృతిక పురోగమన విశదీకరణతో కూడిన "మెదకు సీమ విజ్ఞాన సర్వస్వము" జిల్లా వాసులకు జిల్లాయేతర తెలుగువారికి మీరు అందించడం అబినందనీయం, హోర్షదాయకం.

మీ ప్రతిభ అకుంఠిత కార్యదీక్ష పట్టుదల, సేవాభావము ఎంతయో శ్లాఘనీయం. మెదకు జిల్లా గురించి ఆది నుండి నేటివరకు సమగ్ర సమాచారం అందించుటకు మీరు చేసిన కృషి చిరస్మరణీయం. ఒక నిఘంటువుగా శాశ్వతంగా నిలిచిపోతుందని విశ్వసిస్తున్నాను. సాహితీ, సాంస్కృతిక రంగం పట్ల, మీ ఆసక్తి, అభిలాష ప్రశంసనీయము.

తెలుగు లోకానికి మరిన్ని వెలుగులు ప్రసాదించే మేధాశక్తి, ఆలోచనలు మీకు భగవంతుడు ప్రసాదించాలని ఆకాంక్షిస్తున్నాను.

**ఎస్. రామచంద్రా రెడ్డి**





ఎ. నరేంద్ర, ఎం.పి.
లోక్‌సభ

<u>శుభాకాంక్షలు</u>

శ్రీ శాస్త్రుల రఘురామశర్మగారు మెదకు సీమ విజ్ఞాన సర్వస్వమును ప్రచురించుట మెదకు పార్లమెంటు సభ్యునిగా ఆనందమును ప్రకటించుచున్నాను.

మెదకు జిల్లా సమగ్ర చరిత్రను, సంస్కృతీ నాగరికతలను, కళాసాహిత్యాలను మెదకు జిల్లాలోని దర్శనీయ స్థలాలను చక్కగా వివరించినారు.

శ్రీ శర్మగారి శ్రమను జిల్లా ప్రజలు గుర్తింతురని నమ్ముచున్నాను. మెదకు సీమ విజ్ఞాన సర్వస్వము మెదకు జిల్లా ప్రజల శాశ్వత సొత్తుగా నుండిపోవాలని ఈ గ్రంధము ఇంటింటా ఉండాలని ఆకాంక్షించుచున్నాను.

శ్రీ రఘురామశర్మగారిని భగవంతుడు సదా ఆయురారోగ్యాలతో కాపాడాలని మనసా కోరుకొంటున్నాను.

ఎ. నరేంద్ర






**ఎం. రాజయ్య;** ఎం.పి.

## సందేశం

మెతుకు సీమలో వెలసిన పండిత కుటుంబాల్లో శాస్త్రులవంశము సుప్రసిద్ధమైనది. ఆచటబుట్టిన చిగురుకొమ్మైన చేవ అనునట్లు ఈ వంశము నుండి సోమయాజులు, శాస్త్రులు, వేద, వేదాంత పండితులెందరో వెలసి జీవించి, జీవించుచున్నారు కూడ. అట్టి వంశాంకురాల్లో ఒకరు శ్రీ శాస్త్రుల రఘురామ శర్మగారు. వీరు కవులు, అవధానులు, రచయితలు కూడ.

జననీ జన్మభూమశ్చ స్వర్గాదపిగరీయసి అన్నట్టు తాను జన్మించిన మెతుకు సీమాంతర్గత, విశిష్ట సంస్కృతి, సంపద, కళాపోషణ, పరిపాలన, రాజులు, సంస్కృతాంధ్రకవులు, వారి రచనాదులను మరుగున పడియున్న వానిని వెలికి తీసి, నిరంతర కృషి సల్పి **"మెదకు సీమ విజ్ఞాన సర్వస్వం"** అను గ్రంధాన్ని రచించి భావితరాల వారికి ఉపయోగపడునట్లు రచించినారు. ఇట్టి మహాగ్రంధమును చదివి, జిల్లా చరిత్రను అవగాహన యొనర్చుకొనగలరని ఆశిస్తూ శ్రీ శర్మగారి లేఖిని నుండి ఇతోధిక గ్రంధములు వెలువడవలెనని అభిలషిస్తున్నాను.

**ఎం. రాజయ్య ,** ఎం.పి.






**వి. సునీత లక్ష్మారెడ్డి,** ఎం.ఎల్.ఏ
నర్సాపూర్ నియోజకవర్గం

## <u>అక్షర చందనము</u>

శ్రీ శాస్త్రుల రఘురామశర్మగారికి వందనములు,

మెదక్ జిల్లా యొక్క పూర్వకాలము మరియు వర్తమానకాలము యొక్క చరిత్రను **"మెదకు సీమ విజ్ఞాన సర్వస్వం"** అనే గ్రంథంలో ప్రచురింపబడినది.

ఈ గ్రంథం వ్రాసిన శ్రీ శాస్త్రుల రఘురామశర్మగారు మా నర్సాపూర్ తాలూకా మరియు మా స్వంత గ్రామము గోమారంకావడం నిజంగా గర్వించదగిన విషయం. ఇందులోని విషయాలు ముందు తరాలవారికి మెదక్ ప్రాంతం గురించి తెలుసుకోవడడానికి ఉపకరిస్తాయి. ఇది ప్రతి పాఠశాలలోను మరియు గ్రంథాలయంలోను ఉంచదగిన విషయంగా పరిగణిస్తున్నాను. ఈ గ్రంథం రచించిన శర్మగారిని అభినందిస్తున్నాను.

Reddy

**వి. సునీత లక్ష్మారెడ్డి**






**సునీత హనుమంతరావు పాటిల్**
అధ్యక్షులు, జిల్లా పరిషత్ మెదక్ జిల్లా

## సందేశం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతమైన మెదక్ జిల్లా గూర్చి ఆ జిల్లా వాసుల వివిధవృత్తుల, ఆచారవ్యవహారాల గూర్చి, జిల్లాలోని మాండలిక వ్యవస్థ - పంచాయితి రాజ్‌లోని వివిధ స్థాయిల్లో పేదలకు సేవ చేసి తెరమరుగైన అనేక మంది పెద్దలను గూర్చి ఈ గ్రంధంలో నేటి వారికి పరిచయం చేసారు.

జిల్లాలోని గుళ్ళు, గోపురాలు వాటి విశిష్టతను గూర్చి అనేక మంది ప్రాచీన రచయితల గూర్చి ఈ గ్రంధంలో వివరించారు. మెతకు సీమ వెనుకబాటుతనంతో పాటు అనేక అభివృద్ధి కార్యక్రమాలను కూడా సామాన్యులకు కన్నులకు కట్టినట్లు రచనచేసినందుకు శ్రీ శర్మగారు అభినందనీయులు. **"మెదకు సీమ విజ్ఞాన సర్వస్వం"** అన్ని విద్యాలయాల్లోను విద్యార్థులు చదువుట వల్లవారికి జిల్లా యొక్క గతచరిత్ర అవగతమవుతుంది. కనుక అందరూ చదవాలని కోరుతున్నాను.

**సునీత హనుమంతరావు పాటిల్**
అధ్యక్షులు, జిల్లా పరిషత్, మెదక్ జిల్లా






**ప్రేమచంద్రారెడ్డి,** ఐ.ఏ.ఎస్.
కలెక్టర్ మరియు జిల్లా మెజిస్ట్రేట్,
మెదక్ జిల్లా.

## సందేశం

మెదక్ జిల్లా చరిత్రను, సాధించిన అభివృద్ధిని ఆర్థిక, పర్యాటక రంగాలను మరియు సాహితీ సంస్కృతులను వివరిస్తూ,"**మెదకు సీమ విజ్ఞాన సర్వస్వం**" పేరిట సర్వాంగ సుందరంగా గంధాన్ని ప్రచురించి ఆవిష్కరణకు సిద్ధంగా యున్నదని తెలిసి చాలా సంతసించుచున్నాను. మన జిల్లా చరిత్రను మరియు ప్రగతికి ప్రతీకగా రచించిన గ్రంథకర్తను అభినందిచుంచున్నాను.

గ్రంధావిష్కరణ ఉత్సవ కార్యక్రమము జయప్రదము కాగలదని ఆకాంక్షిస్తూ

**ప్రేమచంద్రారెడ్డి,** ఐ.ఏ.ఎస్.



Phone : 040 - 3234815
040-3236911
Res : 040-7037585
Fax : 040-326045
Email : pstuvc@ap.nic.in

# పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

Lalitha Kala Kshetram, Public Gardens, Nampally, Hyderabad - 500 004. A.P.

## సందేశం



ప్రొఫెసర్ ఎన్. గోపి

మెదుకు సీమ విజ్ఞాన సర్వస్వము వెలువరిస్తున్నందుకు నేనెంతో సంతోషిస్తున్నాను. జిల్లాకున్న రాజకీయ, సామాజిక సాంస్కృతిక చరిత్రను ప్రత్యేకంగా కూర్చి అందించే పని ఒక రకంగా చరిత్ర పునర్నిర్మాణమేనని నా అభిప్రాయం. ప్రముఖ చరిత్ర పరిశోధకులు శ్రీ బి.ఎన్. శాస్త్రిగారు చాలా జిల్లాలకు ఈ విధంగా విజ్ఞాన సర్వస్వాలు సమకూర్చడం నాకు తెలుసు. ఆ పద్ధతిలో మెదకు జిల్లా సర్వస్వాన్ని కూర్చి అందిస్తుండడం ముదావహం. ముందుముందు మెదకు జిల్లాను అర్థం చేసుకునేందుకు, ఈ ఆధ్యయనంతో జిల్లా చరిత్రను నిర్మించేందుకు ఈ విజ్ఞానసర్వస్వం తోడ్పడుతుంది.

మెదకు జిల్లాకు అత్యంత ప్రాచీనమైన చరిత్ర వుంది. ప్రథమాంధ్ర ప్రభువులు శాతవాహనులు ఆ జిల్లాను పరిపాలించారని నిరూపించేందుకు కొండాపూరు తదితర ప్రాంతాల్లో జరిపిన తవ్వకాల్లో అనేక అవశేషాలు లభించాయి. విష్ణుకుండినులు, బాదామి చాళుక్యులు, రాష్ట్రకూటులు, కాకతీయులు, పద్మనాయకులు, కుతుబ్‌షాహీవంశస్థులు, అసఫ్‌జాహీలు ఇలా అనేక రాజవంశాలు పాలించాయి. దేశ స్వాతంత్ర్య పోరాటంలోనూ, హైదారాబాదు రాష్ట్ర విమోచనోద్యమంలోనూ మెతుకుసీమ నాయకులు పాలుపంచుకున్నారు. స్వాతంత్ర్యానంతరం జరిగిన మొదటి సాధారణ ఎన్నికల్లో సిద్ధిపేట లోకసభ స్థానం నుండి పోటీచేసిన తెలంగాణా పోరాటయోధుడు రావినారాయణరెడ్డి పండిట్ జవహరలాల్‌నెహ్రూకంటే ఎక్కువ ఓట్లు వచ్చాయి. మెదకు జిల్లా నుంచి చట్టసభల్లో ప్రాతినిధ్యం వహించిన నాయకులు కూడా చెప్పుకోదగ్గవారే. అంతెందుకు శ్రీమతి ఇందిరాగాంధీ సైతం మెదకు లోక్‌సభాస్థానం నుండి గెలుపొందారు.

తెలుగు సాహిత్య సాంస్కృతిక వికాసంలో మెదకు జిల్లాకు సముచితమైన ప్రాధాన్యత వుంది. కాళీదాసు వాఙ్మయానికి వ్యాఖ్యానం రచించి పండితలోకం ప్రశంసలందుకున్న కోలాచలం మల్లినాథసూరి మెదకుజిల్లా కొల్చారం ప్రాంతవాసి. ఆధునిక చిత్రకళారంగంలో మేటి డా. కాపు రాజయ్య, ప్రముఖ పద్యకవి డా. వేముగంటి నరసింహాచార్యులు, సరస్వతీ ఉపాసకుడు, అష్టావధాని అష్టకాల నరసింహరామశర్మ వంటి ఎందరో పేరుకెక్కిన ప్రముఖులను కన్నగడ్డ మెతుకుసీమ. ఈ విధంగా ఏ రంగంలో చూసినా మెదకు జిల్లాకు తనదైన ప్రత్యేకత ఉంది.

ఒక మారు గతంలోకి వెళ్ళి జిల్లా చరిత్రనంతా తవ్వి అక్షర నిధులుగా రాశిపోసి దాచుకుంటే అనేక ప్రయోజనాలున్నాయి. రాష్ట్రానికంతటికీ మెదకు సీమ గురించి తెలుస్తుంది. అంతేకాదు మెదకు జిల్లాలోని వర్తమాన, భవిష్యత్ తరాలకు తమ నేల గొప్పతనం తెలుస్తుంది. ఆ గొప్పతనం తెలిసి స్ఫూర్తి పొందడానికి కూడా ఈ విజ్ఞాన సర్వస్వం దోహదం చేస్తుంది.

ఇంత పెద్ద బాధ్యతను తలకెత్తుకున్న ఈ సంపుటం ముఖ్య సంపాదకుడు రఘురామశర్మ, ఆయనకు ఈ బృహత్ కార్యంలో సహాయసహకారాలందించిన వారందరినీ అభినందిస్తున్నాను.

**ఎన్. గోపి**, ఎం.ఏ., పిహెచ్.డి,
వైస్ చాన్సలర్

# మెదక్ జిల్లా పరిషత్ కార్యాలయం

సంగారెడ్డి






వై. రామారావు
ముఖ్య కార్యనిర్వహణాధికారి,
మెదక్ జిల్లా పరిషత్ కార్యాలయం

## <u>సందేశం</u>

శ్రీ రఘురామశర్మగారూ !

మెదక్‌జిల్లా సాంఘిక, సాహిత్య, సాంస్కృతిక మరియు జిల్లావాసుల ఆచార వ్యవహారాలు చారిత్రిక ప్రదేశాలు, పుణ్యక్షేత్రాలు వాటి విశిష్టతలను గూర్చి ఎందరికో తెలియని, వెలుగు చూడని అనేక విషయాలను ఎంతో శ్రమకోర్చి సేకరించి, విశ్లేషించి **"మెదకు సీమ విజ్ఞాన సర్వస్వం"** అనే చక్కని గ్రంథాన్ని సామాన్యులకు కూడా అర్థం అయ్యే భాషలో వ్రాసి చరితార్థులైనారు. సాహితీ మిత్రులందరూ ఈ సంకలన గ్రంథాన్ని తప్పక ఆదరించాలని, ఇటువంచి మంచి రచనలు చేయడానికి భగవంతుడు శ్రీ శర్మగారికి వారిని ప్రోత్సహించిన వారి కుటుంబసభ్యులకు, మిత్రులకు ఆయురారోగ్యాలు ప్రసాదించాలని కోరుకుంటున్నాను.

వై. రామారావు

**K.V. Ramana Chary,** IAS.,
Vice-Chairman & Housing Commissioner
Andhra Pradesh Housing Board




GRUHAKALPA, M.J.ROAD,
HYDERABAD - 500 001. (A.P)
Phone : Off. 4732063
Res. 3354281
Fax : 040-4732063



## సందేశం

పండితులు, సహృదయులు శ్రీ శాస్త్రుల రఘురామశర్మగారి సంపాదకత్వంలో ప్రకటితమవుతూన్న **"మెదకు సీమ విజ్ఞాన సర్వస్వము"** ఒక బృహద్గ్రంథం. బృహత్కథా రచయిత గుణాఢ్యుడు శ్రీ శాస్త్రుల వారికి ఆదర్శమేమో. మెదక్ జిల్లాలో జన్మించిన నాకు మెదకు సీమ విజ్ఞాన సర్వస్వము ఆమూలాగ్రంగా పరిశీలించాలన్న ఆసక్తి కలగడం సహజం. అయితే అశక్తత ఏమిటో తెలియదు కాని, విహంగ వీక్షణానికి మాత్రమే పరిమితమయ్యాను. ఈ వీక్షణంలో శ్రీ రఘురామ శర్మగారి విశేష కృషి, శేముషీ దురంధరత్వం. మెదకు జిల్లా చారిత్రక, భౌగోళిక, సాంస్కృతిక, సామాజికార్థిక స్థితిగతుల పట్ల, పరిపాలనా వ్యవహారం పట్ల వారికున్న పరిశోధనా పటిమ ద్యోతకమయ్యింది. 'చారిత్రక పర్వం'లో పేర్కొన్న విషయాలు,'మాండలిక వ్యవస్థ' లో వివరించిన అంశాలు గ్రంధవిస్తృతిని పెంచడానికి ఉపకరించాయేమోనన్నది నాకొచ్చిన అనుమానం. మెదక్ జిల్లా వాసుల స్థితిగతుల ప్రతిబింబిస్తూ శ్రీ శర్మగారు సల్పిన కృషి ప్రశంసనీయం. మున్ముందు మరెన్నో ఉత్తమ గ్రంథాలను ఆంధ్రభాషా మోషకు కంఠాభరణాలుగా అలంకరించే రీతిలో అందించాలని ఆశిస్తూ - అభినందిస్తూ.

రమణ

**రమణా చారి**




**B.N.SASTRY**

**EPIGRAPHIST, HISTORIAN**

President, Archaeological society of india (Reg.)

Editor - Musi Cultural, Historical & Literary Telugu Monthly


## అకాంక్ష

జిల్లా సర్వస్వములను సమకూర్చుట, ఆధునిక కాలమున మొదటి నుండియు గౌరవాదరములకు పాత్రమైనది. క్రీ.శ. అరనశతాబ్దము నాటి వరహమిహిరుని బృహత్సంహిత ననుసరించి మానసోల్లాసము కల్యాణి చాళుక్య చక్రవర్తి సోమేశ్వరునిచే వ్రాయబడినది.

కీ.శే. కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా ను ఆదర్శముగా గ్రహించి తెలుగున విజ్ఞాన సర్వస్వమును 3 సంపుటములలో పూరించినారు. కీ.శే. దేశోద్ధారక నాగేశ్వర రావుగారు 2 సంపుటములలో విజ్ఞాన సర్వస్వము వెలయించిరి. తెలుగుభాషాసమితివారుసర్వంకషముగా 16 సంపుటాలలో విజ్ఞాన సర్వస్వమును ముద్రించి ఆంధ్ర దేశమునకు మహోపకారమొనర్చిరి. నెల్లూరు, గుంటూరు, కడప జిల్లాల సర్వస్వములు ప్రకటింపబడినవి. నల్లగొండ, ఆదిలాబాదు, మహబూబ్‌నగరము జిల్లాల సర్వస్వములు ముద్రింపబడినవి. మెదకు జిల్లా సర్వస్వము వెలువడుచున్నది.

బ్ర.శ్రీ. శాస్త్రుల రఘురామశర్మగారు మేధా సంపన్నులు పట్టుదలకలవారు. తనుజన్మించిన మెదకు జిల్లా సర్వస్వమును రచింపవలెనను ప్రగాఢ ఆకాంక్షగలవారు. ధైర్యసాహసోత్సాహములుగల శర్మగారు ఏకాంగవీరులై మూడు సంవత్సరములు నిర్విరామ కృషిసలిపి మెదకు సీమ విజ్ఞాన సర్వస్వమును సర్వాంగ సుందరముగా రూపొందించినారు. ఈ సర్వస్వ రచనలో శర్మగారు ఎదుర్కొనిన ఆటంకములు అసంఖ్యాకములు. ఐనను పట్టుదలతో సర్వస్వ రచన పూర్తి గావించుట ఆయన ఆత్మస్థైర్యమునుకు నిదర్శనము.

జిల్లా విజ్ఞాన సర్వస్వ రచయిత అనేక ఇబ్బందులకు గురికావలసియుండును. సమాచార సేకరణము అతి క్లిష్టమైనపని. జిల్లాలోని ప్రతిగ్రామమును, ప్రతిచోటును సందర్శించి స్థానిక చరిత్రల సేకరింపవలెను. దేవాలయములు, ముఖ్యమైన కట్టడములు, శాసనములు సేకరింపవలెను. ప్రభుత్వశాఖల, విద్యాలయముల వివరములు సేకరింపవలెను. జిల్లా సాంస్కృతిక, సాహిత్య, కళ, రాజకీయ చరిత్రల సేకరింపవలెను. క్రీస్తు పూర్వము నుండి నేటి వరకుగల జిల్లా చరిత్ర పరిణామదశల సమాచారము, ఛాయాచిత్రసేకరణము వ్యయముతో సమయముతో కూడినపని.

బ్ర.శ్రీ. రఘురామశర్మగారు కడుశ్రమతో జిల్లాలోని పలు ప్రదేశములుదర్శించి 45 మండల పరిషత్తుల చరిత్రలు, అభివృద్ధి కార్యక్రమాలు సేకరించినారు. జిల్లా రాజకీయచరిత్ర, ప్రజల ఆచార వ్యవహారములు, పండుగలు మొదలైన విషయాలతోపాటు జిల్లాలోని కొందరు ప్రముఖుల చరిత్రలు. కవిపండితుల, కళాకారుల వివరములు చక్కగా పొందుపరచినారు. జిల్లా ప్రాంతమును తమ రాజ్యాంతర్గతముగ గ్రహించి పాలించిన రాజ చరిత్ర వ్రాయుటలో శర్మగారు తను చారిత్రిక పరిశీలనమును ప్రదర్శించినారు.

ఇట్టి జిల్లా సర్వస్వముల ప్రకటించుటకు లక్షల కొలది ద్రవ్యము, సంవత్సరములకొలది కాలము పట్టును. శర్మగారు కేవలము మూడు సంవత్సరములలో తనకు అనుకూలురైనవారి సహాయ సంపత్తులతో అపురూపరీతిలో చక్కని ముద్రణతో, మల్టీకలర్ ఛాయా చిత్రములతో రూపొందించినారు.

జిల్లాలో జన్మించి జన్మభూమి ఋణమును సర్వస్వరచన రూపమున తీర్చుకొనిన శర్మగారభినందనీయులు. జిల్లా ప్రజలు శ్రీ శర్మగారికి ఋణపడియున్నారని చెప్పుట అతిశయోక్తి కాదు. జిల్లాలోని సమస్త సమాచారమును తెలుపు ఈ సర్వస్వమును విద్యావంతులు, విద్యార్థులు, విద్యాలయాధి నేతలు, గ్రామపంచాయతులు, మండల, జిల్లా పరిషత్తులు, గ్రంథాలయములు కొన వలెనని కోరుచున్నాను. శాస్త్రుల రఘురామశర్మగారు ఇట్టి గ్రంథములనేకములు వ్రాయవలెనని వారికి ఆయురారోగ్య ఐశ్వర్యములు భగవంతుడు ప్రసాదించవలెనని మనఃపూర్వకముగా ఆకాంక్షించుచున్నాను.

బి.ఎన్. శాస్త్రి



శాస్త్రుల రఘురామశర్మ

శ్రీమంజీరనదీవిలాసగమనై స్సంతుష్టపల్లీజనాం
సీమాంసంస్కృతకావ్యపంచకసుధా సంజీవనీభూషితాం
సూర్యశ్రీపతిపార్వతీపతి లస త్త్రైకూటసంశోభితాం
విద్వన్మండలసేవితాం మెదకు నామ్నాభూషితాం భావయే.

# నామాట

ప్రతి మనిషికీ తనవారి గురించి తెలుసుకోవాలనే తపన, తాతముత్తాతల కతలేమో వినాలనే ఉత్సుకత ఉండడం సహజం.

తన జాతిని గురించి వారి నీతిని గురించి తెలుసుకోవాలని అనుకోవడం మానవనైజం. తానున్న భూమిని జన్మించిన జన్మభూమిని మరిచిపోయే మానవుడెవ్వడు ఉండడు.

సంకుచితత్వం నుండి విశాలత్వం వైపు వడివడిగా పయనించడం తన నుండి తనవారు, తనజాతివారు సోదర సమస్త మానవ జాతి తనదిగా భావించే స్థితికి ఎదగడం మానవుని మనుగడ. గతం వర్తమానానికి చరిత్ర, వర్తమానం భవిష్యత్తుకు చరిత్ర. గత చరిత్ర వర్తమానానికి పునాది. వర్తమానం భవిష్యత్తుకు నాంది.

గతాన్ని తెలుసుకుంటే వర్తమానంలో వ్యవహారం సుళువే అవుతుంది. అందుకే పురాణాలు, ఇతిహాసాలు గత ఘన చరిత్రను చాటే గ్రంథాలుగా కీర్తి కెక్కినవి. వరాహమిహిరుని బృహత్సంహిత, కల్యాణీచాళుక్య సోమేశ్వరుని అభిలషితార్థ చింతామణి భారత దేశంలో వెలసిన మొట్టమొదటి విజ్ఞాన సర్వస్వాలని చెప్పవచ్చు.

ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా విజ్ఞాన సర్వస్వాలకు ప్రథమ గణ్యమని అంటారు.

ఆంధ్రదేశంలో విశ్వదాత కాశీనాధుని నాగేశ్వర రావు పంతులు గారి సహాయంతో కొమర్రాజు లక్ష్మణ రావుగారు రచించిన తెలుగు విజ్ఞాన సర్వస్వం తెలుగులో వచ్చిన మొట్టమొదటి విజ్ఞాన సర్వస్వం.

ఆంధ్రుల చరిత్ర - సంస్కృతిని వెలువరించిన ఖండవల్లి లక్ష్మీరంజనంగారు సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశమును ఎనిమిది సంపుటాలలో ప్రచురించారు. తెలుగుభాషా సమితివారు 16 సంపుటాలలో తెలుగు విజ్ఞాన సర్వస్వాన్ని వెలువరించారు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వాల బాణిలో జిల్లా సర్వస్వములు వెలువడినవి. ఆంధ్రప్రాంత జిల్లాలైన నెల్లూరు- గుంటూరు కడప జిల్లాల విజ్ఞాన సర్వస్వాలు వ్రాయబడినవి.

తెలంగాణా ప్రాంతంలోని నల్గొండ, ఆదిలాబాద్, మహబూబ్‌నగర్ జిల్లా సర్వస్వములు ఒక్క చేలితో వెలువరించబడినవి.

మెదకు మండల సాహిత్యపరిషత్తు కార్యక్రమాలు బాగా సాగుతున్న రోజుల్లో 1980-1981లో పరిషదధ్యక్షులుగానున్న స్వర్గీయ ముదిగొండ అంగీరస శర్మగారు నేను మెదకు జిల్లా విజ్ఞాన సర్వస్వాన్ని రాయాలని ఎన్నోమార్లు అనుకోవడం జరిగింది. కాని కాలం మాకు సహకరించ లేదు కార్యక్రమం కాగితాలపైకి రాకుండానే ఆగి పోయింది.

చాలా సంవత్సరాల తర్వాత ఆదిలాబాదు జిల్లా సర్వస్వాన్ని చూసి సోదరులు శ్రీ మృత్యుంజయశర్మగారితో చర్చించడమైది. వారిప్రోత్సాహం నన్ను ఆలోచింపజేసింది.

ఎక్కడో ఏమూలనో తలపులగదిలో దాగిన ఉబలాటం ఒకనాటి ఆరాటం మళ్లీ పెల్లుబికింది. మెదకు జిల్లా విజ్ఞాన సర్వస్వానికి తెరలేచింది. అది బహుధాన్య విజయదశమీ పర్వదినం **"మెదకు జిల్లా విజ్ఞాన సర్వస్వం"** మెదడు నుండి కాగితంపైకి వచ్చిన శుభదిన మయ్యింది.

గ్రంధరచనకు ప్రణాళిక అవసరం, ప్రణాళికను సిద్ధంచేసికోడానికి కొంతకాలం పట్టింది. ఈ గ్రంధం కావ్యం కాదు కూర్చొని రాయడానికి, చరిత్రకాదు తెలుసుకొని రాయడానికి. ఎన్నో విషయాలు, ఎన్నో ఘట్టాలు స్వానుభవంలో రాయాలని ఉబలాటం. అందుకే జిల్లా పర్యటించాలని ఆరాటం.

మనస్సులోని మాటలను కాగితంపై రాసిన ప్రణాళికను సొంతంగా మొట్టమొదట పూజ్యులు భ్రాతృసమానులు శ్రీ కరణం రామ చంద్రరావుగారి చెవిన వేశాను. ఆ తర్వాత ఆనాడు రాష్ట్ర రోడ్డు రవాణా శాఖ మంత్రిగానున్న ఆత్మీయులు శ్రీ కల్వకుంట చంద్రశేఖర రావుగారికి వివరించాను. జిల్లా కలెక్టరు మాన్యులు శ్రీ రాజీవ్‌రంజన్ మిశ్రాగారితో సంప్రదించాను.

జిల్లా కలెక్టరుగారి సహాయంతో జిల్లా మొత్తం పర్యటించాను. కొండలు, కోనలు, గుళ్లు, గోపురాలు, కోటలు, గోడలు, సొరంగాలు, కందకాలు, కోనేరులు ఒకటేమిటి విన్నవి అన్నీ కనడానికి ప్రయత్నించాను. జిల్లాలో చాలా గ్రామాలు పరిశీలనాదృష్టితో పర్యటించాను. శాసనాలున్న స్థలాలను విశేష శ్రద్ధతో గమనించాను.

ఈ జిల్లాలో పుట్టిన వాణ్ణి, వివిధ కార్యక్రమాలలో జిల్లా ఎల్లలన్నీ చుట్టివచ్చిన వాణ్ణి. ( ముఖ్యంగా పంచాయత్‌రాజ్ ఉపాధ్యాయ సంఘానికి జిల్లా అధ్యక్షునిగా యం.యల్.సి. ఎన్నికల భారాన్ని మోసినవాణ్ణి) జిల్లాలో సుమారు నేను తిరుగని ఊరులేదు, నేను చూడని ప్రాంతం లేదు. ఐనా ఆనాటి చూపునకు నేడు ఈ కార్యక్రమంలో తిరిగిన చూపునకు ఎంతో తేడావుంది.

మెదకు జిల్లా చరిత్ర ఎప్పటి నుండి ప్రారంభించాలి ? అనేది ప్రశ్న. ఏ చిన్న ఆధారమైన చరిత్ర రచనకు ఉపకరిస్తుంది. కొండాపురం మెదకు జిల్లా చరిత్రకు ఒక వరం. ఇచ్చట జరిపిన త్రవ్వకాలు, త్రవ్వకాలలో లభించిన వస్తువులు, నాటి నాగరికతను, సంస్కృతిని, చూపుతూ చరిత్రకు ఆధార భూతములౌతున్నవి. ఆనాడు రాజులు వేయించిన శిలాశాసనాలు చరిత్రకు మూలాధారాలు.

ఆంధ్రదేశ చరిత్రను గురించిన పరిశోధనా గ్రంధాలు, చరిత్ర పుస్తకాలు, పురాతత్వ పరిశోధన శాఖ వారు ప్రచురించిన పత్రాలు మెదకు జిల్లా చరిత్ర రచనకు ఎంతో తోడ్పడ్డాయి. శ్రీ చిలుకూరి వీర భద్రరావు గారు రచించిన 'ఆంధ్రులచరిత్ర', ఖండవల్లి సోదరులు ప్రచురించిన "ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి", సురవరం ప్రతాపరెడ్డిగారి "ఆంధ్రుల సాంఘిక చరిత్ర", శ్రీ బి.యన్. శాస్త్రి గారి "ఆంధ్రుల చరిత్ర సంస్కృతి" క్షుణ్ణంగా చదివినాను. శ్రీ. బి.యన్. శాస్త్రిగారు రచించిన నల్గొండ, ఆదిలాబాద్, మహబూబ్‌నగర్ జిల్లా సర్వస్వాలు చూచినాను. చరిత్రకు కావలసిన విషయం సమగ్రంగా లభించింది. వీలైనంత మేరకు శాస్త్రిగారిని అనుసరించాను. అందుకు శ్రీ బి.ఎన్. శాస్త్రిగారికి సదాకృతజ్ఞుణ్ణి. చరిత్రరచనలో నాకు లభించిన ఆధారాల మేరకు మాత్రమే రాజవంశాలను పేర్కొన్నాను.

మెదకు జిల్లా ఒకనాడు ఈనాటి భౌతిక స్వరూపంలో లేదు. పడమటి భాగం కర్ణాటకలోను, తూర్పు భాగం కరీంనగరంలోను రాజకీయంగా ఉండేది. అందుకే మెదకు జిల్లాకు మధ్యన నడిబొడ్డు గానున్న మెదకు ప్రాంతాన్ని కేంద్ర బిందువుగా చేసికొని చరిత్ర రచనకు పూనుకొన్నాను. నిజానికి చరిత్రాంశంలో రాజవంశావళి మొత్తం చెప్పవలసిన పని లేదు. ఐనా మెదకు జిల్లా చరిత్రలో ఆ రాజ వంశీయుల చరిత్ర పెనవేసుకొని ఉన్నది.

శాతవాహనులు, విష్ణుకుండినులు, బాదామీ చాళుక్యులు, రాష్ట్రకూటులు, కల్యాణి చాళుక్యులు, కాకతీయులు, ముసునూరి వారు, కుతుబ్షాహీలు, ఆసఫ్‌జాహీలు, మెదకు ప్రాంతాన్ని పాలించినట్లు నా పరిశీలనలో తేలినది. బహమనీ సుల్తానులు, మొగలు రాజులు, మెదకును జయించినప్పటికి ఇక్కడ పరిపాలన చేసిన ఆధారాలేమీ లేవు.

ఇక్కడ చరిత్ర లేదని కాదు. కాని చూపించడానికి సరియైన ఆధారాలు ఇంత వరకు లభ్యం కాలేదు. అందుకే కొండాపురాన్ని కేంద్ర బిందువుగా చేసికొంటే అక్కడి త్రవ్వకాల్లో లభించిన వస్తుజాలం చరిత్ర రచనకు మూలం. చరిత్ర, అంటేనే రాజవంశాలు, వారి పోరాటాలు, రాజ్య విస్తరణలు, పరిపాలనా విధానాలు, కళా పోషణాదులు.

కాని నేను ఈ గ్రంథంలో వీటికంటే ఆయారాజుల కాలాల్లో ప్రజా జీవనం, సాహితీ సంస్కృతిక వైభవాలను గురించి నేటి తరాలకందించాలని ఆరాటపడ్డాను.

ఈ విషయంలో అనేక చారిత్రిక గంథాలను చదావాల్సి వచ్చింది. తెలుగునాట ఎన్నో రాజవంశాలు వెలిశాయి. యావదాంధ్రదేశాన్ని పాలించిన రాజవంశాలు తక్కువే. కాబట్టి ఈ ప్రాంతాన్ని పాలించిన రాజవంశావళి చరిత్ర మాత్రం వ్రాశాను. ఇందుకు వీలైనంత మేరకు చారిత్రికాధారాలను చూశాను. జిల్లాలో వెలసిన శాసనాలనెన్నింటినో పరిశీలించినాను. శాసనాల వివరణల్కై ఆంధ్రప్రదేశ్ పురాతత్వ పరిశోధనాశాఖ హైదరాబాదు వారిని సంప్రదించాను. వారి గ్రంధాలయంలో శాసన పరిశోధనా సంబంధిత (వాల్యూములు) సంచికలు చదివాను. వీటన్నిటి ఆధారంగా చరిత్ర క్రమాన్ని పాటించాను. శాతవాహనులు, విష్ణుకుండినులు, చాళుక్యులు, రాష్ట్రకూటులు, కళ్యాణీ చాళుక్యులు, కాకతీయులు, పద్మనాయకులు, కుతుబ్షాహీలు, అసఫ్జాలు, ఈ గ్రంధంలో చూపించిన రాజవంశాలు. ఢిల్లీ సుల్తానులు, బహమనీ సుల్తానులు మెదకు కోటను ఆక్రమించుకున్నట్లున్నది, కాని ఇక్కడ పరిపాలించిన ధాఖలాలు లేవు. అందుకే వారి చరిత్ర వ్రాయబడలేదు. ఈ ఆక్రమణ కూడా అతి తక్కువ కాలము మాత్రమే.

అందోలురెడ్డి రాజుల గురించి ప్రత్యేకంగా వ్రాయడమైనది. నిజానికి వీరేమీ స్వతంత్ర రాజులు కాకున్నప్పటికీ సదాశివరెడ్డి, రాణి శంకరమ్మ వంటి ప్రతాపశౌర్యధనులు నిజాం రాజ్యాన్ని గడగడలాడించినారు. ఒక్కొకప్పుడు సార్వభౌమత్వాన్ని ఎదిరించినారు. మెదకుసీమలో చాలా భాగం వీరి పరిపాలనలో ఉండేది. అందుకే అందోలు రాజుల చరిత్ర వ్రాయడమైనది.

స్వాతంత్ర్యోద్యమంలో మెదకు జిల్లాలో జరిగిన సంఘటనలు పాల్గొన్న ప్రముఖులను గూర్చి వివరించబడినది. నిజాం విమోచనోద్యమంలో మెదకు జిల్లా ప్రాంతం బహుప్రశంసనీయమైనది. మొట్టమొదటి ఆంధ్ర మహాసభ మెదకు జిల్లాలో జోగిపేటలో జరిగినది. నిజాం విమోచనోద్యమ భేరి ఇచట మ్రోగినది. అంతేకాక చిట్టచివరిదైన 13వ ఆంధ్రమహాసభ కూడా మెదకు జిల్లా కందిలోనే జరిగింది. హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమానికి నాంది, మంగళహారతులు మెదకు జిల్లాలోనే జరిగినవి.

నిజాం రాజ్యపు అంత్య ఘడియల్లో మెదకు జిల్లాలో రజాకార్లు సాగించిన రాక్షసచర్యల గురించి, ఆయా గ్రామాల్లో పర్యటించినపుడు వయో వృద్ధులనోట నాటి ఆగడాల వివరాలు విన్నాను. వాటిని గ్రంధస్థం చేశాను.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మెదకు జిల్లాలో జరిగిన పార్లమెంటు, అసెంబ్లీ ఎన్నికల వివరాలు, సెగ్మెంటు (నియోజక వర్గాల) మార్పులు, చేర్పులు, విజేతల వివరాలు అందించాను. జిల్లా నుండి ఎన్నికై దేశ ప్రధానిగా, రాష్ట్ర ముఖ్యమంత్రిగా, మంత్రులుగా పదవీ బాధ్యతల నిర్వహణలనుట్టంకించినాను. స్థానిక స్వపరిపాలనను చవి చూశాను.

పాలనారంగంలో మెదకు జిల్లాలోని వివిధ కార్యాలయాల పనితీరులను, అభివృద్ధి కార్యక్రమాలను చూప ప్రయత్నించినాను. ఇందుకు గాను జిల్లాలోని ప్రతి జిల్లా కేంద్ర కార్యాలయాన్ని దర్శించాను. అధికారులను వారి కార్యాలయ వివరాలందించమని అడిగినాను. అందించిన మేరకు అందించిన నాటి వరకు వివరాలను పొందుపరిచాను; కొన్ని శాఖల పుట్టు పూర్వోత్తరాల గురించి వ్రాసినాను.

సహకారసంఘ ఆవిర్భావాన్ని, అభివృద్ధి వివరాలను, వివిధ బ్యాంకుల తీరుతెన్నుల్ని, ఆర్థికరంగంలో చూపించినాను.

ప్రభుత్వశాఖల వివరాలు, బ్యాంకుల వివరాల 1998-99 నాటివి గ్రహించాను.

ముఖ్యంగా మెదకు జిల్లా చారిత్రికంగా, సాంస్కృతికంగా కళాత్మకంగా చాలా గొప్పనైనది. ప్రాచీన దేవాలయాల చరిత్రలు, కోటగోడలు, మెదకు దుర్గము, వివిధ దర్శనీయ స్థలాల గురించి వివరంగా వ్రాశాను. పర్యాటక కేంద్రాలను ప్రజలకు పరిచయం చేయడానికి ప్రయత్నించాను. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పర్యాటక శాఖ, పట్టించుకొంటే మెదకు జిల్లా పర్యాటక రంగం ఎంత అభివృద్ధి అవుతుందో చూపించినాను. ఈ శీర్షికలో దేవాలయాలతోపాటు చర్చిలు (క్రైస్తవ పూజా మందిరాలు) మసీదులు ఉట్టంకించినాను. అనేక చిత్రపటాలను రంగుల్లో ముద్రించాను. సాంస్కృతిక చరిత్రలో కళారంగానికి ప్రత్యేకత ఉంది. కవిత్వం, శిల్పం, కళానందాన్ని ఇవ్వడమేకాక చరిత్రను కూడా అందిస్తాయి. అందుకే లలితకళలను పేరు పేరునా ప్రస్తుతించాను.

సాహిత్యరంగం చాలా విశాలమైనది. గుణాఢ్యుని నాటి నుండి నేటి యువ కవుల వరకు వ్యాసం వివరంగా సాగింది. ఈ విషయంలో జిల్లాలోని కవుల వివరాల గురించి పత్రికాముఖంగా ఎన్నో మార్లు కోరినాను. కనిపించిన ప్రతి కవి మిత్రుని అతని గురించేగాక అతని పరిసరాల కవి మిత్రుల గురించి తెల్పమని కోరినాను. ఇద్దరో ముగ్గురో తమ వివరాలు పంపించారు. ఈవ్యాసాన్ని ప్రత్యేకంగా వ్రాయమని ఒకరిద్దరు మిత్రుల్ని కోరినాను. కాని ఆశించిన మేరకు వారినుండి ఫలితాన్ని పొందలేక పోయాను. ఈ వ్యాసం వ్రాయడంలో కొంత మేరకు సహకరించిన చిరంజీవులు చి. రామగిరి శివకుమార్ శర్మ, డా. గుమ్మన్నగారి బాలశ్రీనివాస మూర్తులను ప్రత్యేకంగా అభినందించక ఉండలేను. ఈ వ్యాసంలో ఇంకా పేర్కొనని కవులున్నారేమో? వారి వివరాలు లభ్యంకాక వ్యాసంలో పేర్కొనలేదు.

జిల్లాలో శిల్ప చిత్ర కళారంగం పరిపుష్టమైనది. ప్రాచీన శిల్పంతో పాటు అద్యతన శిల్ప చిత్రాలను గురించి చిత్రకారుల గురించి పేరుపేరునా వ్రాసినాను. ఐనా ఇంకా కొందరు కళాకారులున్నారేమో ? వారి వివరాలు లభ్యంకాక వ్రాయలేదు.

సంగీతం, నాట్యం, నాటకం, సినిమాటోగ్రఫీ గురించి అందిన మేరకు వివరాలనందించాను.

జిల్లాలో సాగిన 'జన్మభూమి' కార్యక్రమాలను ప్రత్యేకంగా వ్రాసినాను. అనేక మండలాల నుండి వివరాలందడంలో జరిగిన జాప్యం పుస్తక ముద్రణకు కొంత దోహదం చేసింది. లభించిన మేరకు జిల్లాలోని స్వచ్ఛంద సంస్థల వివరాలందించాను.

మెదకు జిల్లా శాసనాలన్నింటిని గ్రంథస్థం చేయడానికి పురావస్తు పరిశోధన శాఖ వారిని ఎన్నో పర్యాయాలు కలిసి శాసనాలనిమ్మని కోరినాను. కాని వారు అముద్రితములైన శాసనాలనిచ్చుటకంగీకరించలేదు. కేవలము 4 శాసనాలను మాత్రము ఇచ్చినారు. ఈవిషయంలో డా. శ్రీ ఎన్.ఎల్.ఎన్. ఆచార్య గారి ప్రోత్సహాన్ని మరువలేను. వారు సేకరించిన 20 శాసనాలను పీఠికతో సహా ఇచ్చినారు. అట్లే శ్రీ కాందూరి రామాచార్యులు భారతిలో ముద్రించిన శాసనాలను ఇచ్చినారు వారికి కృతజ్ఞతాంజలులు.

సుమారు మూడు సంవత్సరాల అవిరళ కృషికి ఈపుస్తకం దర్పణం. దీనిని సహృదయులు ఆదరిస్తారని, నా రచనా వ్యాసంగానికి వారి ఆశీస్సులందిస్తారని ఆశిస్తున్నాను.

అడుగగానే అభిప్రాయాలందించిన మాన్య శ్రీ ముఖ్య మంత్రి, **శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారికి**, ఉన్నత విద్యాశాఖామాత్యులు **శ్రీ కరణం రామచంద్రరావు గారికి**, పార్లమెంటు సభ్యులు **శ్రీ నరేంద్ర, శ్రీ రాజయ్య, శ్రీ రామచంద్రా రెడ్డి గార్లకు**, మెదకు జిల్లా శాసన సభ్యులకు, మెదకు జిల్లాలో పుట్టి I.A.S. గా ఎదిగిన సాహితీ మిత్రులు శ్రీ కె.వి. రమణాచారి గారికి, ఆంధ్ర దేశంలో గొప్ప చారిత్రికునిగా పేరొంది ఈ పుస్తకం వ్రాయడంలో సలహాలనందించిన సహృదయులు శ్రీ బి.ఎన్.శాస్త్రి గారికి, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయ కులపతి డా. యన్. గోపి గారికి, మెదకు జిల్లా కలెక్టరు శ్రీ ప్రేమ చంద్రారెడ్డి గారికి మెదకు జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీమతి సునీత హన్మంతరావు పాటిల్‌గారికి, సి.ఈ.ఓ, శ్రీ రమణారావుగారికి ప్రత్యేక ధన్యవాదములర్పిస్తున్నాను.

ఈ గ్రంధరచనలో అనేక కష్టనిష్ఠూరాలనెదుర్కొంటున్న సమయంలో నాకు ప్రోత్సాహాన్నీ కల్పిస్తూ నన్ను ముందుకు నడిపించిన నా అర్ధాంగి శ్రీమతి స్వయంప్రభను,.కుమార్తెలు సుధాశ్రీ, ఉషశ్రీలను అల్లుండ్లు మురళీ, అనంతరావులను అభినందిస్తూ ఆశీస్సులందిస్తున్నాను. సహసంపాదకులుగా గ్రంధరచనలో తోడ్పడిన కుమారుడు మధుశ్రీ, కోడలుశ్రీ దుర్గలను ఆశీర్వదిస్తున్నాను.

ఈ గ్రంధాన్నీ అన్ని విధాల సర్వాంగ సుందరంగా ముద్రించి యిచ్చిన మౌనికా గ్రాఫిక్స్ అధినేత శ్రీ సంతోష్ గారికి, ఓపికగా డి.టి.పి. చేసిన చి॥ శ్రీ సాయి రాధ కృష్ణకు కృతజ్ఞతలు.

ఈ గ్రంధముద్రణలో ముఖ్యమైనది ఆర్థికము. ఒక సందర్భంలో పుస్తకం అచ్చువేయనేమోయని వెనుకంజ వేసిన తరుణంలో నన్ను ముందుకు నడిపించిన మిత్రులకు, ప్రకటనలందించి మరియు నామాటపై, నా పనిపై విశ్వాసముంచి కార్యం సానుకూలం కావడానికై ఆర్థికంగా ఆదుకున్న అనేక మంది మిత్రులకు కృతజ్ఞతలు.

*ఈ మహాయజ్ఞంలో ఎందరో మహానుభావులు.*
*అందరికి వందనాలు !*

**శాస్త్రుల రఘురామ శర్మ**

# మెదకు జిల్లా పరిషత్తు సమావేశానికి సమర్పించిన పత్రం

**అశ్మక దేశ వాస ప్రతినిధులకు, మంజీరికాధినేతలకు, మెదకు జిల్లా నాయకులకు వందనములు అభినందనలు**

తొలి తెలుగురాజులు శాతవాహనుల నుండి నేటిదాకా విష్ణుకుండినులు, చాళుక్యులు, కాకతీయులు మొదలుగా గల వివిధ సామ్రాజ్యాల ఘన చరిత్రలకు ఆలవాలమై - విభిన్న, విశిష్ట, భాషా సంస్కృతులకు పట్టుగొమ్మయై - ఆంధ్ర దేశానికే మణిపూసయైనది మన **"మెతుకుసీమ"**.

సకల కథా ప్రపంచానికే మూలమైన **"బృహత్కథ"** ను అందించిన **"గుణాఢ్యుడి"**ని మహాకవి కళిదాసు కావ్యసౌరభాలను తన వ్యాఖ్యానాల ద్వారా అశేషమానవాళికి ప్రసరింపజేసిన **"మల్లినాథ సూరి"**ని **"అచ్చతెనుగు"** కావ్యాన్ని తొలుదొల్త ఆంధ్ర దేశానికి అందించిన **"తెలగ నార్యుడు"**ని ప్రసాదించిన కనకగర్భ - మన **"మెదక్ జిల్లా"**.

అద్యతన కాలాన - స్వాతంత్ర్య కేతన మెత్తి, నిజాం నిరంకుశ పరిపాలనమును ఎదురొడ్డి పోరాడిన సామాన్యుని ఘన చరిత్రను అక్కున చేర్చుకున్నది - మన **"మాతృమూర్తి"**.

ఒక్కసారి వెనుదిరిగి చూసుకుంటే కాలయవనిక చెఱిగిపోని విస్మృత ఘట్టాలు మధుర జ్ఞాపకాలు నిత్య సంఘర్షణా పథాలు ... ఎన్నో, ఎన్నెన్నో - దివ్య మంజీర తీరాన స్ఫూర్తి నిస్తుంటాయి.

భౌతిక పరిసరములచే ప్రభావితుడగు మానవుడు, తన అభివృద్ధికి అనుకూలముగా ఆ భౌతిక పరిసరములను మార్చుకొనుటకు సాగించిన కృషి పరిణామమే. ఈ స్ఫూర్తి దాయక చరిత్రకు మూలమగుచున్నది.

ఆ గతవైభవ సంస్కృతుల ఉదయాభ్యుదయములను పతనములను గుర్తెరుగుట వలన, అట్టి గతాను భవములు పరిజ్ఞానము వలన - మానవ జాతి ముందడుగు వేయుటకు మార్గము సుగమమగును.

విభిన్న ఆకర్షణలకు లోబడి, విపరీత ధోరణులు సమాజమందంతటా ప్రబలుతున్న సమయాన - మన చారిత్రక గీత వైభవ ఔన్నత్యాన్ని చాటిచెప్పి, స్ఫూర్తిని కలిగించడానికి - మన జన్మభూమి, పుణ్యభూమిని గురించి నవతరానికి అవగత మొనరించడానికీ ... మన చరిత్ర కాలగర్భంలో కలసి పోకుండా అక్షయంగా వెలుగొందడానికీ - నాటి నుండి నేటిదాకా మెదకు జిల్లా చారిత్రక పరిణామాలను ప్రస్తుతం జిల్లాలో భావితరాలకందిద్దామనే సదుద్దేశ్యంతో **"మెదక్ జిల్లా విజ్ఞాన సర్వస్వము"** ను రూపకల్పన చేయుట ప్రారంభించినాను.

మానవ జీవన విధానమునకు సంబంధించిన సాంఘికమగు సకల విషయాలు అనగా, సాధించిన ఘనకార్యములు నాగరికత, సంస్కృతి, రాజనీతి, మత విధానములు, సంగీత, సాహిత్య, శిల్ప నాట్య కళాది లలిత కళలు, ఆహార విహార వినోదములు, ఆచార వ్యవహారములు .... మొదలగు అపరిమిత విషయబాహుళ్యమును లభ్యమగు పరిమిత చారిత్రిక ఆధారములనుండి సంగ్రహించి, విమర్శనా దృష్టితో పరిశోధనా ఫలితములను సప్రమాణములతో సరిపోల్చి, సమన్వయించుచూ, అక్షరబద్ధం చేయవలసిన ఈ "విజ్ఞాన యజ్ఞం" లో స్వచ్ఛంద కుతూహలముతో ప్రజలు, చారిత్రిక, బాధ్యతతో ప్రభుత్వం పాలుపంచుకొనాలని నమ్రతగా వేడుకొంటున్నాను. - మరుగున పడిపోయిన చారిత్రికాంశాలతో అమూల్య నిధిగా మిగిలిపోగల ఈ మెదకు జిల్లా విజ్ఞాన సర్వస్వమును బ్రతుకు తేనియల ఊటను, ఇక్షుఖండాల మూటను, సురచిర మంజీర నాదాల మాతృమూర్తిని, సాక్షర మూర్తిగా నిష్టగా నిబద్ధతతో ఆవిష్కరిస్తానని నా హృదయ నివేదనము చేసుకుంటున్నాను.

విజ్ఞులైన మీరు సహృదయతతో నా ఈ చారిత్రి కాన్వేషణమును ఆమోదించి, ఆదరిస్తారని మాతృభూమికి శాశ్వతత్వాన్ని ప్రసాదిస్తారనీ - నిండు హృదయంతో ఆశిస్తున్నాను.

**శాస్త్రుల రఘురామశర్మ**

సంగారెడ్డిలో పత్రికా విలేకరుల సమావేశంలో విడుదల చేసిన పత్రం

# మెదక్ జిల్లా విజ్ఞాన సర్వస్వము

తెలుగుభాషా సమితివారు ప్రకటించిన విజ్ఞాన సర్వస్వములను చూచినప్పుడే మన జిల్లా వరకు కూడా ఒక పుస్తకమును వ్రాయవలెనని అనిపించినది. ఈ మధ్య ఒక మిత్రునియింట ఆదిలాబాదు సర్వస్వమును చూచుట జరిగినది. ఆ పుస్తకమును చూచిన తర్వాత నాలో అణగారిపోయిన ఆలోచన. ఒకసారి మళ్ళీ కార్యరూపము దాల్చుటకు మనఃఫలకము జేరినది.

నా జన్మస్థానము మెదకు జిల్లా. తెలంగాణములో మెదకు జిల్లాకొక ప్రత్యేకస్థానమున్నది. ఇక్కడి కొండాపూర్ శాతవాహనులు వెలసిన పవిత్రభూమి. ఈ జిల్లాలోనే టెక్మాల్‌లో మొదటి తెలుగు శాసనము లభించినది. పొటాంచెరువు ప్రాంతం జైనుల ఆరామభూమిగా చరిత్ర తెల్పుచున్నది. మెదకు దుర్గము - ఆందోలు - పాపన్నపేట అల్లాదుర్గము మొదలగుచోట్ల నేటికీదర్శనమిస్తున్న కళాసంపద నాటి తెలుగువారి సంస్కృతీ విలాసాలను వ్యక్తపరుచుచున్నవి.

కాళిదాస సంస్కృత మహాకావ్యాలకు. శ్రీ హర్షుని విద్వదౌషధమయిన నైషధానికి విశ్వవిఖ్యాతమయిన వ్యాఖ్యానములు చేసిన కోలాచలమల్లినాథసూరి మన జిల్లాలోనివాడు. అచ్చ తెలుగు కావ్యము యయాతి చరిత్రను వ్రాసిన తెలగనార్యుడు ఈ జిల్లావాడు.

మెదకు మండల సాహిత్యపరిషత్తులో పెద్దల సాహచర్యంలో ఎన్నోమార్లు మెదకు జిల్లా చరిత్ర - సాహిత్యము - కళల గూర్చి చర్చించుకొనుట జరిగినది.

నేను పంచాయతీరాజ్ ఉపాధ్యాయ సంఘం జిల్లా అధ్యక్షునిగా జిల్లామొత్తం సంచరించుట జరిగినది. అక్కడక్కడ కనిపించిన ప్రాచీన శిల్పసంపద నాకానందము కలిగించినది. ఇన్ని విషయములు. కలిసి మెదకుజిల్లా విజ్ఞాన సర్వస్వం వ్రాయాలని కోరిక కలిగినది.

ఈ గ్రంథములో భావితరాలవారికి మెదకు జిల్లా గత వైభవాన్ని చవిచూపించాలనే తపన. క్రీ.పూ. 3వ శతాబ్దం శాతవాహనుల కాలం నుండి నైజాం పరిపాలన వరకున్న చరిత్ర ఈ పుస్తకంలో వ్రాయబడుతుంది. స్వాతంత్ర్య పోరాటంలో మెదకు జిల్లా పాత్ర, రజాకార్ల తో జరిపిన పోరాటం చర్చింపబడుతుంది. జిల్లాలోని సాహిత్యం - కళలు - ప్రాచీన నిర్మాణాలు - శాసనాలు - సనదులు - ఫర్మానాలు భవితరాల వారికి అందించాలని, వర్తమానంలో మెదకు జిల్లా సాధిస్తున్న అభివృద్ధిని వివిధాంశాలలో చూపాలని నా కోరిక.

ఈ విషయంలో మెదకు జిల్లా విజ్ఞాన సర్వస్వరచనకు తెలిసిన విషయాలను, శాసనాలు - ఆచారాలు - గ్రామ విశేషాలు - గుడిగోపురాలు ప్రాచీన శిల్పఖండాలు - ఐ.ఎ.ఎస్. ఐ.పి.ఎస్. డాక్టరేటు, విదేశాలలోనున్న ఉన్నత విద్యావంతుల వివరాలు మొదలగు విశేష వివరాలను అందించాలని గ్రంథ ప్రాముఖ్యతను పెంచాలని కోరుతున్నాను.

శాస్త్రుల రఘురామ శర్మ

## ప్రవాసాంధ్రులకు రాసిన పత్రము

ప్రియతమ

ప్రవాస మంజీరికా వాసులకు ... (మెదకు వారికి)

నమస్సులు

నివాసము ప్రవాసమైనా, చెఱిగిపోని మధుర జ్ఞాపకాలకు ఆవాసం ఎవర్కైనా పుట్టినిల్లే. జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి ...

సురుచిర మంజీర నాదాలు, హృదయస్పందనలై వెలుగొందే మెతుకు సీమను మరువ గలమా! అందుకే .. దూరతీరాలలో ఉన్న మెదక్ జిల్లా వాసులను, మెదక్ జిల్లా ప్రాశస్త్యాన్ని భావితరాలకు అందించే మహత్కార్యానికి మనసారా ఆహ్వానిస్తున్నాను.

శాతవాహనుల నుండి నేటిదాక విష్ణుకుండినుల, చాళుక్యుల, కాకతీయుల ... వివిధ సామ్రాజ్యాల ఘన చరిత్రలకు ఆలవాలమై - విభిన్న, విశిష్ట భాషా సంస్కృతులకు పట్టుగొమ్మయై, మత సామరస్యానికి ప్రతీకయై ఆంధ్రదేశానికి మణిపూసయైనది మెతుకు సీమ..

సకల కథా ప్రపంచానికి మూలమైన బృహత్కథను రచించిన గుణాఢ్యుడిని, మహాకవి కాళిదాసు కావ్య సౌరభాలను తన వ్యాఖ్యానాల ద్వారా అఖండ భారతావనికి అందించిన "మల్లినాథ సూరి"ని అచ్చ తెనుగు కావ్యాన్ని ఆంధ్రదేశానికి తొలుదొల్త అందించిన తెలగనార్యుని కన్నభూమి మన మెదక్ జిల్లాయే కావడం మనకు గర్వకారణం.

స్వాతంత్ర్య పోరాటమేగాక, నైజాము రజాకార్లతో కూడా పోరాడి గెల్చి - మన గుండె నిబ్బరాన్నీ, అపూర్వ ధైర్య సాహసాలనూ అక్కున చేర్చుకున్నదీ మన మెదక్ జిల్లాయే. మన పార్లమెంట్ నియోజక వర్గము నుండి సమస్త భరతావనికి ఏలికగా శ్రీమతి ఇందిరాగాంధికి ప్రధానమంత్రి బాధ్యతలనూ ... ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధినేతగా అంజయ్యను అందించినది మన జన్మభూమి. ఇంకా మరెన్నో విశేషాలకూ, చారిత్రక అవశేషాలకూ ప్రత్యక్షసాక్షి మన జిల్లా.

అందుకే నాటి నుండి నేటిదాకా మెదక్ జిల్లా చారిత్రక పరిణామాలను, ప్రస్తుతం జిల్లాలో విలసిల్లుతున్న సరాంగీణ అభివృద్ధినీ గ్రంథస్థం చేసి - భావి తరాలకు అందించినట్లైతే - మన జన్మభూమి, పుణ్యభూమిని గురించి నవతరానికి అవగతమొనరించిన వారమౌతామన్న - సదుద్దేశ్యంతో **మెదక్ జిల్లా విజ్ఞాన సర్వస్వం రూపకల్పన** చేయడం ప్రారంభించినాను.

భారతావనికి ఎంతో దూరాన, మరెన్నో, ఉన్నత స్థానముల నలంకరించి, మాతృభూమికి ముద్దు బిడ్డలైవెలుగొందుతున్న మెదక్ జిల్లా జన్ములకు సముచితరీతిలో స్థానం కల్పించవలసిన ఆవశ్యకతను గుర్తించినాను. మరియు మెదక్ జిల్లా సువిస్తర చరిత్రను అక్షరబద్ధం చేయుటకగు వ్యయప్రయాసాలకు మీ సహకారాన్ని పొందడం కర్తవ్యంగా భావిస్తున్నాను.

ఇరవైరెండు వందల సంవత్సరాల చరిత్రను సుమారు 12 వందల పుటలలో, సుమారు 10 లక్షల రూపాయల వ్యయంతో ఎన్నో సుందర మందిరాల, శిల్పకళా చాతుర్యాల, శిలాశాసనాల వర్ణచిత్రాలతో .... సమగ్ర గ్రంథంగా రూపుదిద్దడానికి కృషి సల్పుచున్నాను. కావున మెదక్ జిల్లా వాసులుగా మీ ఉన్నతిని, మీ అనుభవాలను ఆశయాలను, ఆకాంక్షలనూ తెల్పే మీ పరిచయ పత్రాన్ని పంపగలరు. అంతేగాక మెదక్ జిల్లా ప్రవాసాంధ్రులకు కూడా ఈ విషయం తెల్పగలరు!

కాలగమనంలో అమూల్యనిధిగా మిగిలిపోగల ఈ మెదక్ జిల్లా విజ్ఞాన సర్వస్వానికి మీ హార్దిక, ఆర్థిక సహాయ సహకారాలను అందించాలని మనసారా కోరుకుంటూ.

**శాస్త్రుల రఘురామ శర్మ**

## మెదకు సీమ విజ్ఞాన సర్వస్వము రచనకు తోడ్పడిన గ్రంధములు

| | గ్రంధములు | రచన – ప్రచురణలు |
|---|---|---|
| 1. | తెలుగు విజ్ఞాన సర్వస్వము | తెలుగుభాషా సమితి |
| 2. | ఆంధ్రుల చరిత్ర సంస్కృతి | ఖండవల్లి లక్ష్మీరంజనం |
| 3. | ఆంధ్రుల సాంఘిక చరిత్ర | బాలేందుశేఖరం |
| 4. | ఆంధ్రదేశ చరిత్ర సంస్కృతి | బి.ఎస్.శాస్త్రి |
| 5. | ఆదిలాబాదు జిల్లా సర్వస్వం | ” |
| 6. | మహబూబ్‌నగర్ జిల్లా సర్వస్వం | ” |
| 7. | నల్గొండ జిల్లా సర్వస్వం | - |
| 8. | గోలకొండ చరిత్ర సంస్కృతి | |
| 9. | మెతుకు రాజుల చరిత్ర | చిదిరె లక్ష్మణ శాస్త్రి |
| 10. | తెలంగాణా శాసనములు | తెలుగు భాషా సమితి |
| 11. | శాసనపద్యమంజరి | - |
| 12. | కాకతీయ శాసనములు | డా॥ ఎన్.ఎల్.ఎన్. ఆచార్య |
| 13. | హైదరాబాదు స్వాతంత్రోద్యమ చరిత్ర | వెల్దుర్తి మాణిక్యరావు |
| 14. | మెదకు జిల్లా స్వాతంత్ర్యోద్యమ చరిత్ర | స్వాతంత్ర్యోద్యమ చరిత్ర పరిశోధనా సంస్థ హైదరాబాదు |
| 15. | శాసనాల సంచికలు | పురాతత్వ పరిశోధనా సంస్థ హైదరాబాదు |
| 16. | ప్రగతి | మెదకు జిల్లా సమాచార శాఖ |
| 17. | గోలకొండ కవుల సంచిక | సురవరం ప్రతాపరెడ్డి |
| 18. | మెదకు జిల్లాకవుల చరిత్ర | మల్యాల దేవీ ప్రసాద్ |
| 19. | మెదకు | రంగాచార్య |
| 20. | సాహితీ మంజీర | డా॥ జి. బాలశ్రీనివాస మూర్తి |
| 21. | రసతరంగాలు | మెదకు మండల సాహిత్య పరిషత్తు, నర్సాపూర్ శాఖ |
| 22. | తెలుగువాణి | ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక, 12-4-1975 |
| 23. | యయాతి చరిత్ర | పొనగంటి తెలగనార్యుడు |
| 24. | శివధర్మోత్తరం | కామినేని మల్లారెడ్డి |
| 25. | దోమకొండ సంస్థాన కవులు | డా॥ మేడవరపు అనంత కుమార శర్మ |
| 26. | శతాబ్దీయ గ్రంధము | ఆచార్య శిరోమణి శాస్త్రుల విశ్వనాథశర్మ |
| 27. | మెదకు జిల్లా గ్రామనామాలు | డా. పి. మాణిక్య ప్రభు |
| 28. | సిద్దిపేట దర్శిని | |
| 29. | పొటంచెరువు చరిత్ర | టి. మాణయ్య |
| 30. | మెదకు మండలము | ముడుంబై రంగకృష్ణమాచార్యులు |
| 31. | దేవాలయ వాస్తు శిల్పలక్షణములు | నాగాభట్ల మార్కండేయ శర్మ |
| 32. | ‘భారతి’ పత్రికలు | |
| 33. | ‘మూసీ’ పత్రికలు | |
| 34. | ఆంధ్రప్రదేశ్ పత్రికలు | |
| 35. | ‘మెదకు మండల సాహిత్య పరిషత్’ వార్షిక ప్రత్యేక సంచికలు | |
| 36. | మెదకు జిల్లాపై వివిధ పత్రికల ప్రత్యేక సంచికలు | |

శ్రీమాత్రేనమః

## అక్షరాక్షతా – శేషము

శ్రీమచ్ఛంకర పార్వతీ సుతవర, శ్రీలక్ష్మీవిఘ్నేశ్వర ః ।
శ్రీమద్వేంకటనాయకోకలి సురస్సీతాపతి శ్రేయవాన్ ।
శ్రీరాజేశ్వరి, శ్రీమయీ శ్రితజన స్సంరక్షిణీ, సాక్షిణీ ।
పాయాచ్ఛ్రీరఘురామశర్మసుకవిం, ధర్మార్థమోక్షశ్రియై ॥

మ ॥ "రుచిరశ్రీపద కూర్పునేర్పులగు నీరుక్కుల్ "మెదజ్మండ" లీ
(ర) రచితార్థుల్, రచితుల్ చరిత్రదెలియంరాగోరు నాంధ్రావళీ
సుచరి త్రార్థులు, నాయకాగ్రణిలు, సుశ్లోకుల్మదంబొంద, నీ
రచనా "మెత్కువినాణ సర్వమి"క రంజిల్లంగ పెంపొందుతన్"

తే ॥ గీ ॥ శాస్త్రులాన్వయదీపికల్ పొగనిలను, కవులు పండిత వర్యులు గాన కుశలు
- రెందరోగల్గిరీనాడు, యెదనునింపు, రాను "రఘురామప్రోత శ్రీరాముడొప్పు"

ఉ ॥ ఎందరుదాతలో, మరియునెందరునేతలొ, కర్తలెందరో
ముందుకురాగ పట్టుదల ముప్పిరియైగొన దీక్షతోడుతన్
సుందర మెత్కుగాథగల సుందరగ్రంథము నాంధ్రసంతతీ (తిన్)
పొందుగ చేతనిల్పితిని, ప్రోధవు శాస్త్రులవంశచంద్రికల్
సందడి జేయు నట్లు, "రఘురామ! స్వయంప్రభలందు మోక్షసన్"

ఉ ॥ శ్రీలలితాకళా విభవ, శీలసుశీల విలాసలోల, యీ
వేల" జూబ్లీహాల్ వేదిక మెచ్చెడి (నచ్చెడి) సత్కవీంద్రుగా
పాలక మాన్యులొప్పగను, పావన సుందర గాథలేర్పడన్
కాలము చిత్రమే మరచె, కబ్బముగాసుచరిత్ర వెల్వడన్

(మెత్కుచరిత్ర వెల్వడన్)

శ్రీనగర్ కాలనీ
ప్లాటు నెం : 34, అల్వాల,
సికిందరాబాదు - 500 010.
ఫోను : 7970080

మీచిన్నాన్న
శాస్త్రుల చంద్రమౌళి శర్మ. ఎం. ఓ. ఎల్.

శ్రీమాత్రేనమః

# అభినుతి

ఆత్మీయ సహోదరుడు శాస్త్రుల రఘురామశర్మ "**మెదకు సీమ సర్వస్వము**" ను గ్రంథాన్ని వెలువరించుట జిల్లాలో జన్మించిన వారేకాక, యావదాంధ్రావనికే గర్వకారణము. మూడు సంవత్సరాలుగా అహోరాత్రములు కృషిసల్పి, ఆర్థిక శారీరక, మానసిక శ్రమలకోర్చి పట్టుదల, ఏకైకదీక్షలతో ఈ గ్రంథమును సిద్ధముగావించుట అనితర సాధ్యముగాదంటే సత్యదూరముగాదు.

"కోటి రతనాలవీణ" గా పేరొందిన తెలంగాణాములోని జిల్లాలలో మెదకు జిల్లాకు సాంఘిక, సాంస్కృతిక, చారిత్రక, రాజకీయ, విద్యారంగాలలో విశిష్ట స్థానముంది. ఇతరమైన ఎనిమిది జిల్లాలతో ప్రత్యక్షసామీప్య సంబంధము కలిగి, భౌగోళికంగా తెలంగాణా నేలనొకటిగా కలుపుకొన్న జిల్లా " మెదకు" మాత్రమే తప్ప మరొకటి లేదు. అన్ని జాతులవారికి, విభిన్న మతసంస్కృతులకు, భాషా సంప్రదాయాలకు, ఆటపట్టై మేటికలయికగా రూపుదిద్దుకొన్నది. ఈనాటికి మెదకు జిల్లా పొలిమేరలలో త్రిభాషా సమ్మిళితమగు భాష వాడుక భాషగానున్నది. సహజసిద్ధమగు ప్రకృతి వనరులతో స్వయంసమృద్ధిచే, పరోపకారపరాణత్వము గలిగి నాలుగు జిల్లాల వారికి త్రాగునీటిని, తినుతిండిని సమకూరుస్తు " మెతుకు" సీమగా పేరుగాంచింది.

గతము లేకుంటే వర్తమానానికి చోటుండదు. భవిష్యత్తును భూతంగా మార్చేశక్తి వర్తమానానికే వుంది. అదే శాశ్వత భవిష్యత్తుకు మూలబీజమౌతుంది. అంటే గతచరిత్రకు ఎంత ప్రాముఖ్య తగలదో తెలుస్తుంది.

అందుకే సర్వస్వము అందరిసొత్తు. మెదకు జిల్లాకు చెందిన ప్రతి పౌరుడును ఈ గ్రంథమును తమస్వంతము చేసికొనుట తమ విధిగా, బాధ్యతగా గుర్తించాలని ఆశిస్తు శ్రీ రఘురామకృషి అభిరామంకావాలని మనస్ఫూర్తిగా ప్రశంసిస్తున్నాను.

ఇట్లు
వి. మృత్యుంజయ శర్మ, ఎం.ఏ.
విశ్రాంతాంధ్రోపన్యాసకులు
సిద్దిపేట

# విషయ సూచిక

## VI. ఆర్థికరంగము



## VII. పర్యాటకరంగం

ఫోటులు - 585



# మెదకు సీమ నామాంతరాలు

సజీవమైన మానవ సంస్కృతీ విలాసము ఎప్పటికప్పుడు మారుచుండును. మార్పు చైతన్యమునకు, జీవకళకు చిహ్నము.

ఒకనాడు కొండగుహలలో తలదాచుకొన్న మానవుడు ఆకాశ హర్మ్యలను నిర్మించుకొన్నాడు. పచ్చిమాంసాన్ని ఆరగించిన మనిషి అగ్నిని సృష్టించుకొని అణువిచ్ఛేదనందాకా కనుగొన్నాడు.

భవిష్యత్తుకు వర్తమానం, వర్తమానానికి గతం అంతామూలం నేటికినిన్న, నిన్నటికి మొన్న జరిగిన వాస్తవ పరిణామాలు తెలుసుకొనుటే చరిత్ర.

గత కాలపు అనుభవాలు భవిష్యత్తుకు పునాదులు. తాతముత్తాతల కతలే భావితరాలకు అనుభవ పాఠాలు. ఆ పరిజ్ఞానాన్నీ అంతా అందించే విషయాలే చరిత్ర పాఠాలు.

మానవ నిత్యసంఘర్షణా విధానాలు, సమస్యలు సాధించుటలోని సాధనాలు, సంఘప్రాదుర్భావాలు, సాంఘిక జీవనాలు, సాంస్కృతీ నాగరికతా విలసనాలు, ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లు, కట్టుబొట్లు, నివాసాలు, విలాసాలు, ఆచార వ్యవహారాలు, ఆటలు, పాటలు అన్నీ చరిత్రలో అంతర్భాగాలు.

రాజులు, రాజకుటుంబాలు, వారుగావించిన యుద్ధాలు, నాటిన జయస్తంభాలు, వ్రాయించిన శిలాశాసనాలు, వేయించిన నాణాలు, గుడులు, గోపురాలు, కావ్యాలు, గ్రంధాలు ఇవన్నీ చరిత్రకు ఆధారాలు.

ప్రకృతివైపరీత్యాలకు, మానవుని దుశ్చేష్టలకు కాలగర్భంలో కలిసిపోయిన చారిత్రిక సాక్షాలు శిధిలాలై, శకలాలై, అక్కడక్కడా చారిత్రికుల ఆశలకు ఊపిరి పోస్తుంటాయి.

అంతా సాక్షీభూతంగా చూపించడం చరిత్ర రచనలో సాధ్యంకాకపోవచ్చు. పూర్వీకుల పురాణాలు, గోచరిస్తున్న సాక్ష్యాలు సరిచూసుకొని ఆలోచనాలోచనంలో సవరించుకొని వ్రాసేదే నిజమైన చరిత్ర.

ఒక ప్రాంత చరిత్ర దేశ చరిత్రకు, ఒక జాతి చరిత్ర మానవ జాతి చరిత్రకు ఉపయుక్తాలౌతాయి.

మెదకు సీమ చరిత్ర సమగ్ర వికాసం, మెదకు సీమ విజ్ఞాన సర్వస్వం.

కాల పరిణామంలో మార్పు సహజం. ఈ మార్పు ఒక ప్రాంతానికి, ఒక జాతిజీవన విధానానికి, భాషకు, అన్నింటా వర్తిస్తుంది.

ఈనాడు మెదకు సీమగా పిలువబడుతున్న ప్రాంతం గతంలోకి వెళితే ఎన్నో నామాంతరాలు గోచరిస్తాయి.

# మెదకు జిల్లా భౌగోళిక - నైసర్గిక స్థితి

మెదక్ జిల్లా ఆంధ్రదేశమున పశ్చిమోత్తర భాగమునందు వ్యాపించి యున్నది. ఉత్తరమున 17° 28' - 18° 19' అక్షాంశముల మధ్య 77° 28' - 79° 10' ల తూర్పు రేఖాంశముల మధ్య విస్తరింపబడి యున్నది.

మెదక్ జిల్లాకు తూర్పున వరంగల్, నల్గొండ జిల్లాలు దక్షిణాన రంగారెడ్డి జిల్లా, పశ్చిమాన కర్ణాటక రాష్ట్రంలోని బీదర్ జిల్లా, ఉత్తరంలో నిజామాబాద్, కరీంనగర్ జిల్లాలు సరిహద్దులుగా నున్నవి.

మెదక్ జిల్లా వైశాల్యము 9699 చ.కి.మీ. కలదు. మెదక్ జిల్లా కేంద్రముగా సంగారెడ్డి పట్టణము కలదు. ప్రస్తుతము మెదక్ జిల్లా లో మెదక్, సిద్దిపేట, సంగారెడ్డి అను మూడు రెవిన్యూ డివిజనులు కలవు. జిల్లాలో 45 మండలములు, 1265 గ్రామములు కలవు.

1283 హిజ్రీ అనగా క్రీ.శ. 1854 లో మీర్‌మహబూబ్ అలీ - అసఫ్‌జాహీ బహద్దూర్ పరిపాలనా కాలంలో నిజాం రాజ్యము 5 సుభాలుగా విభజింపబడెను. ప్రతి సుభాకు ఒక సుబేదారు ఉండెడివాడు. ఈ అయిదు సుభాల క్రింద 17 జిల్లాలు ఉండెడివి. ప్రతి జిల్లాకు ఒక తాలుకుదారు (కలెక్టర్) పరిపాలనాధికారిగా ఉండేవాడు. ఆనాడు 'మెదకు' ఒక సుభాగా నుండెడిది. ఈ సుభాను 'గుల్షనాబాదు' అని పిలిచెడివారు. క్రీ.పూ. 200 సం.ల నుండి క్రీ.శ. 1300 వరకు గల చరిత్రనందు 'మెదక్ మండలం' అను పేరు ఎచ్చటనూ కానవచ్చుట లేదు.

ఒకప్పుడు మెదకు ప్రాంతమును 'కల్యాణీచాళుక్యులు' (కర్నాటక చాళుక్యులు) పరిపాలించినారు. కొంత కాలము 'గుల్బర్గా'- సుల్తానుల పరిపాలనలో నుండెడిది. ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర ప్రాంతాల కలయికను బట్టి ఆయా భాషల సాంగత్యముచే ఈ ప్రాంతము 'మిశ్రభాషా మండలము' గానే యున్నది.

బౌద్ధులయుగంలో, కాకతీయుల కాలంలో పొట్లచెరువు, కొండాపురం, విదర్భ (బీదర్), కళ్యాణి, నందగిరి (నాందేడు), మెదక్, వేములవాడ, బోధను, ఓరుగల్లు, కొలనుపాక, గోలకొండ, అనంతగిరి ప్రాంతములు ఏకపాలన క్రిందనుండెడివి.

గోదావరి నదికి ఉపనదిగానున్న మంజీరా నది మెదక్ జిల్లాలో ప్రవహించు చున్నందున ఈ దేశమునకు 'మంజీరికాదేశము' అను పేరు ఏర్పడి యుండవచ్చును.

మంజీరికాదేశము దంతపురికి దక్షిణమున ఉన్నట్లు బౌద్ధగ్రంధములందు చెప్పబడినది.

1905 కు పూర్వం జిల్లాలో మెదకు, రామాయంపేట, కల్పగూరు, టేకుమల్ల, అందోలు, తాలూకాలుండేవి. 1905 లో జరిగిన జిల్లాల పునర్నిర్మాణంలో కొన్ని మార్పులు వచ్చినవి. కల్పగూరు (సంగారెడ్డి), భగత్, సిద్ధిపేట, అందోలు, మెదకు తాలూకాలుగా ఆవిర్భవించాయి, టేకుమల్లను అందోలులోను రామాయంపేటకు చెందిన కొంత భాగాన్ని కామారెడ్డి తాలూకా నిజామబాదు జిల్లాలో కలిపారు. అప్పుడే మహబూబ్‌నగర్ జిల్లాలోని ఇబ్రహీంపట్నం తాలూకాను మెదకు జిల్లాలో చేర్చారు. అట్లే కరీంనగర్ జిల్లాలోని సిద్ధిపేట్ తాలూకాను మెదకు జిల్లాలో కలిపారు. 1920 లో వికారాబాద్ జిల్లాను, 1931 లో భగత్ జిల్లాను ఏర్పాటు చేయడం జరిగింది. అప్పుడు ఎల్లారెడ్డి తాలూకాను మెదకు జిల్లాలో విలీనం చేసారు. 1941-50 మధ్యకాలంలో సర్ఫ్-ఎ-ఖాస్, అత్రఫ్-ఎ-బల్దా, భగత్ జిల్లాలను రద్దుచేసి హైదరాబాదు జిల్లాను ఏర్పాటు చేశారు. 1905 లో జాగీర్దార్లను రద్దుచేయడంతో నర్సాపూర్, గజ్వేల్, తాలూకాలు ఏర్పడ్డాయి. 1954 లో వరంగల్ జిల్లాలోని జనగామ తాలుకాలోంచి తిగుల్‌నర్సాపూర్ ను వేరుచేసి గజ్వేల్‌లో విలీనం చేశారు. 1956 లో జరిగిన రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణలో నారాయణ్‌ఖేడ్, జహీరాబాద్ తాలూకాలకు సంబంధించి 1949 చ.కి.మీ భూమిని విలీనం చేయడం జరిగింది. ఇంతే కాకుండా నారాయణ్ ఖేడ్ తాలుకాలోని నవరగాంవ్‌ను నిజామాబాద్ జిల్లాలోని మద్నూర్ కు బదిలీ చేశారు. 1962లో సంగారెడ్డి తాలుకాలోని రామచంద్రా పురంలో భారత్ భారీ విద్యుత్ పరికరాల సంస్థను ప్రారంభించడంతో ఆ ప్రాంతాన్ని హైదరాబాదులో విలీనం చేసారు. 1980లో సదాశివ పేట, రామాయంపేట, దుబ్బాక, అనే మూడు తాలూకాలు క్రొత్తగా ఏర్పడ్డాయి. దీంతో మెదకు జిల్లాలో 11 తాలూకాలు ఏర్పడినవి. 15-1-1987న మండల వ్యవస్థ ఏర్పడునాటికి మెదకు జిల్లాలో

**1. సంగారెడ్డి,**

**2. మెదకు,**

**3. సిద్ధిపేట**

మూడు రెవిన్యూ డివిజన్లుగా నున్నవి.

**సంగారెడ్డి, డివిజనులో**

1. సంగారెడ్డి 2. సదాశివపేట, 3.జహీరాబాద్ తాలూకాలు.

**మెదకు డివిజనులో**

4. మెదక్ 5. నారాయణ్ ఖేడ్ 6.అందోలు, 7. నర్సాపూర్ 8. రామాయంపేట్ తాలూకాలు,

**సిద్ధిపేట డివిజన్‌లో**

9. సిద్ధిపేట 10. దుబ్బాక 11. గజ్వేల్ తాలూకాలుండేవి.

మండల వ్యవస్థతో జిల్లా 45 మండలాలుగా విభజింపబడినది.

## జిల్లాలోని మండలాలు

| | |
|---|---|
| 1. సంగారెడ్డి | 2. పటాన్‌చెరు |
| 3. రామచంద్రాపురం | 4. సదాశివపేట |
| 5. కొండాపూర్ | 6. మునిపల్లి |
| 7. జహీరాబాద్ | 8. కోహీర్ |
| 9. ఝరాసంగం | 10. రాయికోడ్ |
| 11. మనూర్ | 12. న్యాల్‌కల్ |
| 13. నారాయణ్ ఖేడ్ | 14. కల్హేర్ |
| 15. కంగ్టి | 16. మెదకు |
| 17. పాపన్న పేట | 18. కొల్చారం |
| 19. వెల్దుర్తి | 20. చేగుంట |
| 21. శంకరం పేట (R) | 22. రామాయంపేట |
| 23. శంకరం పేట (A) | 24. రేగోడ్ |
| 25. అల్లాదుర్గం | 26. టేక్మాల్ |
| 27. పుల్‌కల్ | 28. అందోల్ |
| 29. కౌడిపల్లి | 30. నర్సాపూర్ |
| 31. శివం పేట | 32. జిన్నారం |
| 33. హత్నూర్ | 34. సిద్ది పేట |
| 35. చిన్నకోడూరు | 36. నంగ్నూరు |
| 37. దుబ్బాక | 38. మిర్ దొడ్డి |
| 39. వర్గల్ | 40. తూప్రాన్ |
| 41. ములుగు | 42. దౌల్తాబాద్ |
| 43. గజ్వేల్ | 44. జగదేవపూర్ |
| 45. కొండపాక | |

## పర్వతాలు – గుట్టలు :

మెదకు జిల్లాలో బాలాఘట్ పర్వత శ్రేణికి చెందినగుట్టలవరుసలు, మరికొన్నిగుట్టలు ఉన్నాయి. కాని అవి అంత పెద్దవికావు.

గజ్వేలు - రామాయంపేట నుండి ఒక వరుస ఉత్తరదిశగా వ్యాపించి నిజామాబాదు జిల్లా దక్షిణప్రాంతంలోకి వ్యాపించి తిరిగి మరల ఈ జిల్లాలోకే ప్రవేశిస్తుంది. మరోకొండల వరుస జిల్లావాయువ్యమూల ప్రారంభమై తూర్పుదిశగా మెదకు వైపువ్యాపించింది, సిద్ధిపేట మండలం, చిన్నకోడూరు మండలంలోని పర్వతాలు (గుట్టలు) ఎత్తయినవి. ఈ కొండలు మినహాయిస్తే, తక్కిన ప్రాంతమంతా పీఠభూమి వలె యుంటుంది.

## నేలలు :

ఈ జిల్లాలో నేలలు ప్రధానంగా ఇసుక - దుబ్బ గలిగిన చెలకనేలలు - ఎర్రనేలలు - నల్లరేగడి నేలలుగా వర్గీకరించవచ్చును. సిద్ధిపేట - గజవెల్లి, నర్సాపూ ప్రాంతాల్లోని నేలలు ఎక్కువ భాగం చెలక నేలలు - రామాయంపేట. మెదకు ప్రాంతాల్లోని నేలలు దుబ్బ నేలలుగా పేర్కొనబడుతున్నాయి. సంగారెడ్డి - నారాయణఖేడ్ - జహీరాబాదు - జోగిపేట ప్రాంతాలు నల్లరేగడి నేలలు. నారాయణఖేడ్‌లో కొంత భాగం గులకరాళ్ల తో కూడిన పెద్ద ఎత్తైన దిబ్బలు వ్యవసాయానికి పనికిరాని నేల అధికంగా అగుపడుతుంది.

## నదులు – వాగులు :

మెదకు జిల్లాలో ఒకే ఒక్క నది మంజీరానది. ఈ నది జిల్లాకు పశ్చిమ సరిహద్దుల్లోనున్న కర్ణాటక రాష్ట్రంలోని బీదరు జిల్లానుండి నారాయణ ఖేడ్ (పాతతాలూకా)లో ప్రవేశించి ఆగ్నేయదిశగా సాగి జహీరాబాద్ - అందోల్ - సంగారెడ్డి (పాతతాలూకాల) సరిహద్దుగా ప్రవహించి ఉత్తరం వైపు మలుపు తిరిగి నర్సాపూర్ - మెదకు తాలూకాలలో పశ్చిమదిశగా ప్రవహిస్తూ నిజామాబాదు జిల్లాలో ప్రవేశిస్తుంది. మంజీరాకు ఉపనదిగా పసుపులేరు (హల్దీవాగు) గజవెల్లి తాలుకాలో పుట్టి మెదకు - రామాయం పేట తాలూకాలలో ప్రవహించి రామమడుగు గ్రామం వద్ద మంజీరాలో కలుస్తుంది.

ఇదిగాక కూడెల్లివాగు (మాండవ్యనది గా పిలిచేవారు) కడలేరు - నక్కవాగు మొదలైన చిన్నచిన్నవాగులు జిల్లాలో వర్షాకాలంలో మాత్రం ప్రవహిస్తాయి. ఇంతకు మించి చెప్పుకోదగిన నదులేవీ ఈ జిల్లాలో లేవు. కూడెల్లివాగు పోను పోను మరికొన్ని వాగులను చేర్చుకొని మానేరుగా మారినది.

మెదకు జిల్లాలో పెద్దనదులు లేనందున పెద్ద ప్రాజెక్టులేమీ లేవు. అందుచే వ్యవసాయము ప్రధానంగా చెరువుల మీదనే ఆధార పడవలసి వస్తుంది. పసుపులేరు (హల్దీవాగు) పైనిర్మించిన రిజర్వాయరు - ఫతేనహరు - మహబూబ్ నహరు - నల్లవాగు ప్రాజెక్టులు కొంతవరకు వ్యవసాయానికి నీటిపారుదల సౌకర్యాన్ని కల్గిస్తున్నాయి. మంజీరానది పై నిర్మించిన సింగూర్ ప్రాజెక్టు - సంగారెడ్డి రిజర్వాయర్లు. హైద్రాబాద్ త్రాగునీటి సరఫరాకే వినియోగింపబడుతున్నాయి. సింగూరు ప్రాజెక్టు నుండి అప్పుడప్పుడు నీటిని వదిలి నిజాంసాగర్ ప్రాజెక్టులోనికి వదులుతారు. ఆ నీరు నిజామాబాద్ పంట పొలాలకేగాని మెదకు పొలాలకు అక్కరకు రావు.

## వాతావరణము :

మెదకు జిల్లాలో వాతావరణం సాధారణంగా అక్టోబరు నుండి జూన్ వరకు పొడిగా ఉంటుంది. జూన్ నుండి సెప్టెంబరు వరకు వర్షాలతో తడిగా ఉంటుంది. జిల్లాలో సాధారణంగా ఫిబ్రవరి నెలలో గరిష్ఠం 27 డిగ్రీల నుండి 29 డిగ్రీలుగాను కనిష్ఠం 14 డిగ్రీల నుండి 17 డిగ్రీలుగాను ఉష్ణోగ్రత ఉంటుంది. అదే ఏప్రిల్ - మే నెలలో గరిష్ఠం 41 నుండి 44 డిగ్రీలుగా కనిష్ఠం 24 డిగ్రీల నుండి 26 డిగ్రీల ఉష్ణోగ్రత ఉంటుంది.

## వర్షపాతం :

జిల్లాలో సాధారణ వర్షపాతం 959 మి. మీ. దానిలో 810 మి. మీ. నైరుతి రుతు పవనాల వల్ల మరియు 149 మి. మీ. ఈశాన్య రుతుపవనాల వల్ల కలుగుచున్నది. జిల్లాలో నర్సాపూర్ తాలూక ప్రాంతంలో వర్షపాతం జిల్లాలో కెల్లా అధికంగాను నారాయణ ఖేడ ప్రాంతంలో జిల్లాలోకెల్ల తక్కువగాను ఉంటుంది.

ఈ శతాబ్దంలో 1970 సం||లో అత్యధికముగా వర్షాలు కురిసినవి అట్లే 1995-96 సం||లో అత్యల్పముగా వర్షాలు కురిసినవి - ప్రతి సంవత్సరము నవంబరు - డిసంబరు మాసాలలో బంగాళాఖాతము నందు ఏర్పడిన అల్పపీడనము వలన తుఫాను వర్షములు కురియుచుండును. ఈ వర్షములు కొన్ని ప్రాంతములందు ఉధృతముగ నుండి, అధిక వేగముతో వాయువులు వీచుచుండును.

**మేఘావృతము :**

నైరుతి రుతు పవనములు వీచుకాలమున ఆకాశము దట్టమైన మేఘములతో కూడియుండును. ముఖ్యముగా జూన్ నుండి సెప్టెంబరు వరకు ఈ వాతావరణముండును. తక్కిన కాలములో గాలిలో తేమ 15-25 శాతము వరకుండును. ప్రతిసంవత్సరము మే మాసము నుండి ఆగస్టు నెల వరకు వాయువులు వీచును.

**ఖనిజసంపద :**

మెదకు జిల్లాలో ఖనిజ సంపదలో చెప్పుకోదగ్గవి క్వార్ట్జ్ - ఇసుక - బంకమన్ను ( లిటరైట్) మాత్రమే. ఇందులో కూడా జిల్లాలో పలుగురాయి ఖనిజమే అధికంగా ఉంది. క్వార్ట్జ్ (పలుగురాయి). పలుగురాయి ఎక్కువగా జిల్లాలో వెల్దుర్తి మం || రామంతాపూర్ ; రాయ్‌కోడ్ మం|| ఉసేనాబాద్ ; పెద్దశంకరంపేట మం || గొట్టిముక్ల, తిమ్మాపూర్, చేగుంట మం || రాంపూర్, నర్సాపూర్ మం || మాదాపూర్, నర్సాపూర్ ; సంగారెడ్డి మండలంలోని మల్లెపల్లి, తేర్‌పోల్, కల్పగూర్; మెదకు మం || ల్లే రాయన్‌పల్లి - రామాయంపేట మం || కోమటిపల్లి లో ఉంది.

ఇది తెల్లగానుండి చిన్న పరిమాణములో నుండును, ఈ క్వార్ట్జ్ సీసము తయారీకీ పనికి వచ్చును. గుట్టలలో నుండి వెలికి తీసి బట్టీలలో వేడిచేసి పొడి చేయుదురు. ఈ పరిశ్రమ జిల్లాలో జిన్నారం మండలంలో మంబాపూర్ గ్రామసరిహద్దులో కలదు. ఈ ఖనిజము ద్వారా ప్రభుత్వమునకు సాలుసరి ఆదాయము ఒక కోటి రూపాయలు లభించుచున్నది.

**సున్నపురాయి :**

మెదకు జిల్లాలో సుమారు అంతటా సున్నపురాయి లభించేది. పల్లెలలో సున్నపు బట్టీలు పెట్టి సున్నము తయారు చేసేవారు. ఈ పరిశ్రమ శివంపేట - నర్సాపూర్ - వెల్దుర్తి - రామాయంపేట - సిద్దిపేట ప్రాంతాలలో ఎక్కువగా అగుపించేది. సున్నాన్ని ఇండ్ల నిర్మాణంలో వాడేవారు. సున్నము - ఇసుక కలిపి డంగు కట్టేవారు. వృత్తాకారంలో కాలువను రాతితో నిర్మించేవారు మధ్యన ఒక రాతిస్తంభమును లేక దూలమును పాతి దానికి ఒక పొడవైన దూలమును బిగించేవారు. ఈ దూలము నకు పశువుల జతను కట్టుదురు. ఈ దూలమునకు ఒక రాతిబిళ్లను గొలుసులతో కట్టి కాలువలో ఉంచెదరు.

పశువులు కాలువ చుట్టూ తిరుగు చుండగా రాతిబిళ్ల సున్నము - ఇసుకను మర్దన చేయుచు ముద్దగా చేయును. ఆ ముద్దను గోడల నిర్మాణంలో ఇటుకతోను - రాయితోను కలిపి వాడేవారు.

**రాయి :**

జిల్లాలో చిన్న గుట్టలు ఎక్కువగా ఉన్నాయి - ఈగుట్టలలో నుండి గృహనిర్మాణమునకు అనువైన రాయిని కొట్టి వెలికి తీస్తారు. జిల్లాలో లభించే ఈరాయి తెల్లగా - నల్లగా ఉంటుంది. ఇందులో కూడ గుండురాయి పునాదులలో వేయిటకు పనికి వస్తుంది, సరిగా మలచుటకు రాదు. దెబ్బకు పచ్చెలు పచ్చెలుగా మారుతుంది. అనుకున్న పరిమాణంలో రాదు. తెల్లగా - నల్లగా ఉండే మరో రకంరాయి అనుకున్న రీతిలో మలచుకోవడానికి వస్తుంది. ఈ రాయిని గ్రానైట్ (గనెట్‌రాయి) అని వాడుకలో ఉంది.

**కంకర :**

పరుపుబండ రాళ్లను కొట్టి చిన్న చిన్న పరిమాణంలో మార్చే రాయినే కంకర అంటారు. ఈ కంకర గృహనిర్మాణానికి ఉపయోగపడుతున్నది. వడ్డెర కులము వారు రాతిపని చేసేవారు. ఈ మధ్య కొన్ని యంత్రముల సహాయమున కంకర ఉత్పత్తిజరుగు చున్నది. కాని ఇప్పటికి జిల్లాలో వడ్డెరలే ఈ పరిశ్రమను చేపట్టి నిర్వహిస్తున్నారు.

జహీరాబాదు - పడమటి ప్రాంతంలో ఇండ్లకు ఉపయోగించేరాయి వేరు విధంగా ఉంటుంది. మట్టిదిబ్బలను గొడ్డళ్లతో నరుకుతారు. అట్లా చీలిన మట్టిగడ్డలను రాళ్ల ఆకారంలో మలుస్తారు. ఆ రాయిని గోడల నిర్మాణానికి ఉపయోగిస్తారు.

**ఇసుక :**

జిల్లాలో చెప్పకోదగ్గ వాగులు పసుపులేరు - కూడెల్లి వాగు, నక్కవాగు - వర్షాకాలంలో వచ్చే ప్రవాహాలతో వాగులో ఇసుక బాగానే పేరుక పోతుంది. వర్షాకాలం అంతంకాగానే ఇసుక రవాణా ప్రారంభిపబడుతుంది. మెదకు జిల్లా హైదరాబాదు - సికింద్రాబాదులకు దగ్గర కావున, ఇక్కడి నుండి లారీలలో ఇసుక ఎక్కువగా జంటనగరాల గృహ నిర్మాణానికి ఉపయోగపడుతుంది. ఇసుక వల్ల ప్రభుత్వానికి అధికంగా సాలుసరి ఆదాయం వస్తుంది.

**బంకమన్ను (లిటరైట్):**

జహీరాబాదుకు 10 కిలో మీటర్ల దూరంలో వున్న పైకాపూర్ - బూచిపల్లి రాయికోడ్ మండలం బీడికన్న గ్రామంలో బంకమట్టి నిల్వలు ఉన్నాయి. దీనిని సిమెంటు పరిశ్రమలో ఉపయోగిస్తారు.

**అమెథిస్టు :**

అమెథిస్టును సెమిప్రెష్షర్ స్టోన్‌గా, కటింగ్ పాలిషింగ్ స్టోన్‌గా, గ్రానైట్‌స్టోన్‌గా ఉపయోగిస్తారు.

॥భారతస్య ప్రతిష్ఠే ద్వే సంస్కృతం సంస్కృతీ తథా ॥

మెదకు జిల్లాలో

# సంస్కృతి - సంప్రదాయాలు - నాగరికత

# సంస్కృతి - సంప్రదాయాలు - నాగరికత

ఎన్నోశతాబ్దాల నుండి తెలుగువారి నాగరికత ఒక విలక్షణ మైనది. యావత్ భారతదేశమున తెలుగు జాతికి ఒక ప్రత్యేక మైన స్థానమున్నది. శాతవాహనుల మొదలు కొని వర్తమానము నకు ఒకసారి సంక్షిప్తముగా పరిశీలించినచో తెలుగు జ్ఞాతి నాగరికతా వైభవము సంస్కృతీ సంప్రదాయం నేటికిని అట్లేయున్నట్లు తోచుచున్నది. శాతవాహన కాలమున మెదకు జిల్లాలోని కొండాపురం పరిసర ప్రాంతాలను త్రవ్విచూచినపుడు ఆ త్రవ్వకాల్లో బయల్పడలిన ప్రాచీన వస్తుసామాగ్రి, మృణ్మయ (మట్టికుండలు) పాత్రలు, అలంకరణ వస్తువులు గృహోపకరణములైన వివిధములైన వస్తుసంపద ఆనాటి తెలుగువారి నాగరికతా వైభవమును చాటుచున్నవి. అంతేకాక త్రవ్వకాలలో బయటపడ్డ శిల్ప సంపదలోని స్త్రీ, పురుష విగ్రహములు గమనించినచో నాటి వేషధారణ, వస్త్రధారణ, అలంకరణ మున్నగునవి స్ఫుటముగా కన్పడుచున్నవి. ఆ త్రవ్వకాలలో మట్టిదిబ్బలక్రింద మగ్గిపోయిన ఇండ్లకు ఉపయోగించిన పెంకులు పరిచిన నాపరాళ్లు, అక్కడక్కడ అగుపడ్డ మురికి కాలవల నిర్మాణము ఆనాటి తెలుగు వారల గృహనిర్మాణ వైశిష్ట్యతను తెలుపుచున్నది. అలనాడెన్నడో కొండ గుహల్లో తలదాచుకొని జీవికను సాగించిన ఆదిమానవుని సంతతి ఇంతటి నాగరికత, వైభవ ప్రాభావముతో మున్న గృహములు నిర్మించుకొని రనగా ఆనాటి ఆంధ్రుల సంస్కృతీ నాగరికతలను ఆలోచింపవచ్చును. ఒక కొండాపురమే కాక జిల్లాలో అల్లాదుర్గం, కొల్చారం, నేటి ఇక్రిసాట్ ప్రాంతాలలో పురాతత్వ పరిశోధన శాఖవారు జరిపిన త్రవ్వకాల్లో బయల్పడలిన కళాసంపద ఆంధ్రుల సంస్కృతీ విలసనములకు దర్పణమని చెప్పవచ్చును. "ఇల్లును చూచి ఇల్లాలిని చూడమన్నారు" పెద్దలు, అంతటి క్రమబద్దం గా, కళావంతముగా ఇండ్లను వారు తీర్చిదిద్దినట్లు నిర్మించుకొనిరన్నచో వారి వేషభాషలు కూడా ఎంతో కళాస్పదముగనే యుండెననుటలో సందేహము లేదు.

నాటి నుండి నేటికి కూడా ఆంధ్రులు అందమును ఆరాధించుటలో ఆద్యులు. మెదకు జిల్లాలో 20,30 సంవత్సరాల క్రింది వరకు నిర్మింపబడిన ఇండ్లన్నీ చతుశ్శాల భవంతులతో నుండెడివి. ధనికులు తమ భవంతులను ఎక్కువగా మధ్యన అంగణము కలిగి నాలుగు వైపుల విశాలమైన గదులచే అంగణము చుట్టూ అధిక వైశాల్యము కలిగిన భవంతిగా పిలువబడు (మన్సాలగా), భవనములను నిర్మించేవారు. గ్రామముల్లోని గ్రామ పెద్దలు సంపన్నులు రెండంతస్తుల భవనములు కూడా నిర్మించుకొనేవారు. సామాన్యముగా ప్రతి యింటి ముందు ఒక వీధి అరుగు ఉండుట తెలుగింటి ప్రత్యేకత.

వీధి అరుగులు కూడా ఆ యింటి పెత్తనమును తెల్పుటకా ! అప్పట్లు వారి వారి స్థాయిని బట్టి యుండెడివి. నగరాలలో రెండంతస్థుల భవనాలుండుట నేటికిని కనబడును. ప్రతి యింటికి మంచి నీటి బావి వసతి ఉండుట కద్దు. కొన్ని కొన్ని గ్రామాలు చూచినచో పొడవైన వీధులు, వీధులకు ఇరువైపులాయిండ్లు అక్కడక్కడ కూడళ్లు కన్పడును. ఉదా. శివ్వంపేట, సదాశివపేట, సిద్దిపేట, జోగిపేట మొదలగునవి. ఈనాడు గృహనిర్మాణ మంతయు'ఆర్సీసీ' (RCC) పరమైనది. ఇటుకల తయారీ, ఇటుకలతో ఇల్లు కట్టుట శాతవాహనుల కాలం నుండే యున్నట్లుగా తెలియుచున్నది. ధనవంతులు, చతుశ్శాలాభవంతులు నిర్మించుకొనగా, మధ్యతరగతి వారు ఒంటి వసారా ఇండ్లను నిర్మించుకొనుట జిల్లాలో నేటికి అగుపడుచున్నది. నిరుపేదలు పూరిగుడిసెలలో నివసించేవారు ఈ నాటికి ఈ పరిస్థితులు ఇంకనూ కలవు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఇండ్లులేని నిరుపేదలకు, అల్పాదాయ వర్గాల వారికి ఇండ్లు నిర్మించు కొనుటకు ఎంతయో ఆర్థిక సహాయము చేయుచున్నది.

ఈ రకముగా మెదకు జిల్లాలో గృహనిర్మాణ విషయమున మానవ నాగరికత కనపడుచున్నది.

చదువుసంధ్యలతో కొందరు, వారివలె మేముండవలెనని మరికొందరు ధరించుటకు, సులభముగా యుండునని ఇంకొందరు ఈ మధ్యకాలమున పురుషులు ప్యాంట్లు, చొక్కాలు ధరించుచున్నారు. కాని నేటికిని పల్లెటూర్లలోని మధ్యవయస్కులను గమనించినచో పురుషులు ధోతి, చొక్కా, ధరించుటయే కన్పడును. ధోతీ, చొక్కాధారణలో కూడా ఒక్కొక్క కులం వారు ఒక్కోరకంగా కట్టుట అగుపడును. **బ్రాహ్మణుల్లో** తొమ్మిది మూరల ధోవతిని ముందు వెనుకలు పింజాలుపోసి కట్టుదురు. **వైశ్యులు** ముందుకు పింజాలుపోసి కట్టి ఆ పింజాలను పైకి చెక్కి వెనుకకు ఝుండా గోచితో కట్టుదురు. రెడ్లు ముందు పింజాలతో కాళ్ల వరకు వేలాడునట్లు చెక్కి వెనుకకు ఝుండా గోచితో కట్టుదురు. **కర్షకులు** ఇతరులు మోకాళ్ల పైకి పంచకట్టు కట్టుదురు, పైన నిండు చేతులతో కొందరు భుజముల వరకు చేతులతో కొందరు చొక్కాలు ధరించుట అగుపడును. భుజములపై ఉత్తరీయము కాళ్లకు కిర్రు చెప్పులు చేతులలో పొన్నుగర్ర బూర మీసాలు తెలుగు వారి ఠీవిని ప్రత్యేకముగా చాటిచెప్పెడివి.

స్త్రీలు నేటికిని చీర ధరించువారే ఎక్కువ, పైన రవిక ధరింతురు. చీర కట్టులో కూడా తెలుగు తనమునకు ఒక ప్రత్యేకత యున్నది. 30 సంవత్సరముల క్రితము వరకు బ్రాహ్మణస్త్రీలు 9 గజముల చీరను గోచీ పెట్టి చీర ధరించుట ఆచారముగానుండెడిది. పని పాటలు చేయు స్త్రీలు మోకాళ్లపైకి చీరను ధరించి వెనుకకు గోచీ పెట్టుట ఉండెడిది. కాని నేడు అందరు కూడా ఒకే రకముగా ఆరు గజముల చీరనే ధరించుచున్నారు.

కన్యలు రకరకములైన వస్త్రధారణలు చేసుకొనుట నేడు చూచుచున్నాము.

పురుషులు చేతివేళ్లకుంగరములు ముంజేతికి గొలుసులు, మెడలో గొలుసులు, ధనికులు అలంకరించు కొందురు. చేతి గడియారములు ధరించుట ఒకప్పుడు నాగరికతా లక్షణమైనను నేడు అది అత్యావశ్యక వస్తువైనది. స్త్రీలు నాటిన్నుండియు "ఆభరణ ప్రియులే", కలవారు వివిధములయిన ఆభరణములు ధరించుట చూతుము. ఈ తరమునకు ముందు తరం వారు ధరించే ఆభరణములు కంటే; తుస్సె; తీగ; కంకణాలు (మంజేతి); దండకడియాలు; వడ్డాణము; గెంటీలు, కాళ్ళకు వెండికడియాలు, సాలన్ కడియాలు; పట్టాగొలుసులు ధరించేవారు. ముక్కుకు ముక్కెర; తలలో నాగఫణి; కొప్పుదండ; మాంగల్యము చిహ్నములుగా ధరించెడివారు. నేటి స్త్రీలు గొలుసులు మొదలగు తేలికైన ఆభరణములు ధరించుట అగుపడుచున్నది. అక్కడక్కడ ప్రాచీనాభరణములే క్రొత్త క్రొత్త పేర్లతో ధరించుట కద్దు.

మెదకు జిల్లాలోని ప్రజలకు ముఖ్యమైన ఆహారము వరి అన్నము, ఇచట మెతుకు ఎక్కువగా లభించుట చేతనే నేమో ఈ సీమ "మెతుకుసీమ" అయినది. అన్నముతోపాటు జొన్నరొట్టె, మొక్కజొన్న, గోధుమలు, తయిదలు (రాగులు) చాలా తక్కువ. మోతాదులో ఆహరముగా వాడుదురు. పప్పన్నమునకు జిల్లాలో ప్రత్యేకతకలదు. పండుగలలో పప్పన్నము తినుట తప్పని సరి "పప్పులేని తిండి పాడుతిండి" యని ఇక్కడి వారిలోకోక్తి వివాహనిశ్చయమును "పప్పన్నము తినుట" అని వ్యవహరింతురు.

అన్నముతోబాటు పప్పు, కూరగాయలు, పులుసు, పప్పుచారు ఆహారముగా తీసుకుందురు. వేసవి కాలములో లభించిన మామిడి కాయలతో రకరకములయిన ఉరగాయలను పెట్టుకొని నిల్వయుంచి భుజించుట ఇచ్చటివారికిష్టము. నిమ్మ, టమాట, దోస, ఉసిరి, దుందెనముకాయ, రేణి, కలిమి కాయలతో ఉరగాయలు నిల్వచేసుకొని భుజింతురు. ఒకప్పుడు మక్క గట్క, తైద సంకటి, జొన్న సంకటి, పేదలు తీసుకొనుచుండెటివారు. సంవత్సరమునకు ఒకమారు సామాన్యముగా కార్తీక మాసమున వన భోజనములకు పోవుట కలదు. అంతేకాక అక్కడక్కడ జరుగు జాతరలోనికి సకుటుంబముగా పోయి వండుకొని తిని వచ్చుట ఇక్కడి ఆచారము. జిల్లాలో 'మాంసాహారులు' ఎక్కువగా గొఱ్ఱె, మేక, కోడి, కుందేలు, చేపలు, రకరకములైన పిట్టల మాంసమును ఆహారములో భుజింతురు. కొందరు అడవి పంది మాంసమును, మరి కొందరు పంది మాంసమును కూడా తినుట కలదు. పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, ఇక్కడి వారు ప్రీతికరముగా తిందురు. పాల కోవాతో రకరకములైన తీపి పదార్థములు చేసి భుజించుట ఇక్కడి వారికి ఇష్టము. ఈ మధ్యకాలంలో టీ, కాఫీలు ప్రతి ఇంటను సేవించుట ఎక్కువయినది.

ఈత, తాటి చెట్ల పానీయము కొందరు సేవింతురు. మరి కొందరు వివిధములయిన మత్తుపానీయములను సేవింతురు. మెదకు జిల్లాలో చాలా చోట్ల తమలపాకుల తోటలున్నవి. ''జర్దాపాన్'' (పొగాకుతో కూడిన తాంబూలము) నములుట ఇక్కడి చాలా మంది స్త్రీలలో అగుపడును. ఎక్కువగా బ్రాహ్మణ కులస్థులయందును, మహమ్మదీయులయందును ఈ అలవాటు అధికము. మగవారు కొందరు చుట్టలు, బీడీలు, సిగరేట్లు తాగుట కలదు.

తెలుగు వారి వివాహం గురించి ''తాళ్ళపాక తిమ్మక్క'', ''సుభద్రా కళ్యాణమున'' కడు రమ్యముగా వర్ణించినది. వైవాహిక కార్యములు తెలుగు వారందరికి ఒకే రకము అయినప్పటికీ పెండ్లితంతులలో అక్కడక్కడ మార్పులుండుట గమనింప వచ్చును. మెదకు జిల్లాలో పెండ్లి తంతు ఈ విధముగా నుండును :

వధూ వరులు ఒకరినొకరు చూసుకొని వివాహమునకు ఒప్పుకుందురు. కొందరిలో వధూవరుల ఒకరినొకరు చూసుకొన కుండుగనే పెద్దలు చూచి నిశ్చయించుట కలదు. వరదక్షిణ ఇచ్చు సంప్రదాయము వారి వారి స్థాయిని బట్టి నిర్ణయించుకొందురు. 40 సంవత్సరముల క్రితము మగ పిల్లవానికి ఆడపిల్ల దొరకుట అదృష్టముగా భావింపబడుచుండెడివి. కన్యాశుల్కము లేకున్నను ఆ రోజులలో వారి వారి స్థాయిని బట్టి వధువుకు ఆభరణములు, వస్త్రములు ఒప్పుకొనిననే కన్యనిచ్చెడివారు. వివాహమయినంత వరకు మగపిల్లవాని వైపు వారు ఆభరణముల విషయమున ఎక్కడ పేచీ వచ్చునోయని భయపడెడివారు. ఇప్పుడది సంపూర్ణముగా విపర్యయమయినది. ఆడపిల్ల అని తెలిసిన తోడనే భ్రూణహత్యలకు పాల్పడుట కూడా అక్కడక్కడ కన్పడుట చూడగా నేటి వరులు కోరే గొంతెమ్మ కోరికల ప్రభావమే అని చెప్పవచ్చును. ''మాటాముచ్చట" అయిన తరువాత ఒక మంచి రోజు చూసుకొని "వర నిశ్చయము" సలుపుట. ఆతరువాత కన్యానిశ్చయము సల్పుట ఆచారమయి యున్నది. ఈ మధ్య ఉభయ నిశ్చయములు వధువు ఇంటనే జరుగుట కన్పడుచున్నది. ఆ రోజే పెండ్లి పత్రికను వ్రాసుకొనుట జరుగును. "పసుపులు ముట్టుట" అను ప్రక్రియతో పెండ్లి పనులు ప్రారంభమగును. పెండ్లికి ముందు రోజు కొట్నము పెట్టుట అను ప్రక్రియ చేయుదురు. ఈ ప్రక్రియలో ప్రాచీన సాంప్రదాయము ప్రకారముగా కుందెనలో బియ్యము దంచుట, విసురాళ్ళలో పసుపును విసురుట చేయుదురు. ఈ కార్యముచే పూర్వీకులు వివాహమునకు ముందు వడ్లను దంచి బియ్యమును సిద్ధము చేయుట మొదలుకొని పసుపు విసురుట ఆదిగాగల వస్తు సంచయనము చేసెడివారని తెలియుచున్నది. ఈ కార్యక్రమమున బంధువులయిన ముత్తయిదువలు ఇంటి పరిసరములందున్న వారు వచ్చి పాల్గొనుట చూడగా ఆనాటి సంఘమునందలి ఐకమత్యము తెలియవచ్చుచున్నది.

ఈనాటికి బ్రాహ్మణేతరుల ఇండ్లలో 'మైలపోలు' అను కార్యక్రమము జరుపుదురు. మంగలిచే గోళ్ళుతీయించుట, అభ్యంగన స్నానము చేయించుట జరుపబడును. ఈ కార్యక్రమములోని అంతరార్థము పరాడగా పినాహాత్యార్యప పురుషులకు 'క్షౌరము' విధిగా చేయించెడివారని తెలియుచున్నది. లగ్నకార్యమునకు ముందు జరుగు -ఎదురు కోళ్లు- అనుతంతులో వధూవరుల ఇరువైపులవారు ఉత్సాహముగా బుకాగులాలను చల్లుకొనుట, చక్కెర కొబ్బరి పంచుకొనుట చూడగా మానసికోల్లాసమునకై ఐక్యతా రాగమునకు చేయు ప్రక్రియంతే అనిపించుచున్నవి. వివాహమున కాళ్ళు కడిగి కన్యాదానము చేయుట అనునది హైందవ సంప్రదాయము. ఈ కన్యాదాన సమయములో మహాసంకల్పమును పఠింతురు. అందు సమస్త దేవతలు సమస్తనదులు, సమస్త దేశాలు ఉట్టంకించడం వాటన్నింటి సాక్షిగా ఈ వివాహమని తెలుపడం జరుగును. ధర్మార్థ కామములందు తన కూతురుతో చరించవలెనని 'ధర్మేచ-అర్థేచ-కామేచ నాతి చరితవ్యా' అని ఆడపిల్ల తండ్రి కోరడం, అందుకు వరుడు -నాతిచరామి- అని పలకడం చూడగా హైందవ సంప్రదాయంలో దాంపత్య విలువలు ప్రస్ఫుట మగుచున్నవి. తెరకు అటూ ఇటూ గల దంపతులు జిలుకర బెల్లం ఒకరికొకరు తలపై ఉంచుకొనుట, కాళ్ళు త్రొక్కుట, పాణిగ్రహణం చేయుటలోని అంతరార్థం వారిద్దరు భవిష్యత్తులో అప్పటి నుండి శారీరకముగా, మానసికముగా ఐక్యమునొందుటకు పెద్దల అనుమతియేమెరా అనిపించును. "మాంగల్యధారణ" (పుస్తె కట్టుట) వివాహకాండలో సతాకసన్నివేశము. స్త్రీకి మాంగల్యము పరమ పవిత్రమయినదిగా, ముత్తయిదువ లక్షణముగా భావింపబడుచున్నది. ఆ తరువాత "కొంగులుముడి వేయుట" "నాగవెల్లి" చేయుట, వధూవరులకు ముత్తయిదువలు "ఒడిబియ్యము పోయుట", "పోలు తిరుగుట", "అరుంధతీ దర్శనము"తో పెళ్ళితంతు పూర్తగును. ఈ "ఒడిబియ్యము" పోయుట అనునది లగ్నమున ప్రారంభముకాగా ఆ తరువాత 5 సం॥ లోపు ఒకమారు ఒడిబియ్యము పోయుట తప్పనిసరి ఆచారముగానున్నది. అరుంధతీ దర్శనమును "సూరీయునారాయణా పొద్దుపొద్దాకశాయ పొద్దాక్శాయ సూరీయ నారాయణా" అనుపాట పాడుట మెదకు జిల్లాలో అంతటా ఆచారమయి యున్నది. ఈ పోలు తిరుగుటనే వైదిక కార్యక్రమంలో సప్తపదిగా సాప్తపదీనముగా (ఏడడుగుల నడకగా) చెప్పవచ్చును ఈ పెళ్ళితంతు పోలులో జరుగును. అనగా చాకలి బియ్యముతో 4 మూలల (చతురస్రపు) ముగ్గువేయును. దానినే ముత్యాలపోలు అని అందురు.

ఈ జిల్లాలో మేనరికపు పెళ్ళిళ్ళు ఎక్కువగానే జరుగును. మేనరికమనగా వరుడియొక్క మేనమామ కూతురు మేన మరదలు గా పిలువబడును. ఆమెకు అతడు మేనబావగా పిలువబడును. వారిద్దరి వివాహమును మేనరికము అందురు.

ఇక్కడ నాతి మేనరికమునునది మరియొకటి కలదు. అనగా వధువు తండ్రి తన స్వంత సోదరి కుమారుడయిన మేనరికము. అట్లుకాక తన చిన్ననాయన లేదా పెద్దనాయన కుమార్తెల యొక్క కుమారులకు ఇచ్చుటను నాతిమేనరికము. ఈ రెండుకాక ఏ సంబంధము లేని వారలకు జరుగు వివాహములు కూడా ఎక్కువగనే జరుగుచుండును.

జిల్లాలో అక్కడక్కడ విడాకుల ఘట్టాలు కూడా జరుగుచున్నవి. ఆర్థికముగా వెనుకబడిన వారిలో ఈ విడాకుల సంఖ్య ఎక్కువ. ఈ విడాకులు పొందగోరేవారు. కోర్టులనాశ్రయించుట చాలా తక్కువ. ఎక్కువ శాతం కుల సంఘాల పెద్దల మధ్యనే విడాకుల పంచాయితీలు జరుపబడును. సామాన్యముగా ఊరికావల ఏ మట్టిచెట్టు నీడనో ఈ విడాకుల పంచాయితీల వేదికలయి ఉండును. విడాకుల కాగితములు రాయువారు కూడా సామాన్యముగా గ్రామంలో ఏ ఒక్కరిద్దరో ఉందురు. పంచాయితీ తీర్పులు ఉభయుల కులపెద్దల ద్వారానే జరుగును. ఆ తీర్పులలో సామాన్యముగా ఎవరి పెట్టుపోతల వస్తువులను వారికి చెందునట్లుగా తీర్పులుండును. కొన్ని సమయాలలో పురుషునిది దోషమని తేలినచో స్త్రీకి 'మనోవర్తి' ఇప్పించుట కూడా జరుగను. స్త్రీ దోషమని తేలినయెడల మనోవర్తి ఇప్పించుట జరుగదు. సామాన్యముగా వారి సంతానము స్త్రీ వశమునందే ఉండును. కొన్నికొన్ని చోట్ల ఆ సంతానమునకు తండ్రి ఆస్తిలో భాగమిచ్చుట కూడా నిర్ణయింపబడును. ఈ విడాకులు న్యాయ పరముగా చెల్లకున్నను, కుల కట్టుబాట్లననుసరించి చెల్లుబాటగును. ఈ విడాకులు చాలా సందర్భములలో బాల్య వివాహములగుట చేతను, చదువు లేమి చేతను, ఎక్కువగా జరుగుచుండును. అంతేగాక పురుషుడికి లేదా అతని తల్లిదండ్రులకు అత్యాశకలిగి మరొక వివాహముచే ధనమును, ఇతోధికముగా పొందుదమను సమయంలో కూడా జరుగు చుండును.

ఇట్లు విడాకులు పొందిన వారిలో పునర్వివాహములు చేసుకొనిన స్త్రీ, పురుషులు కూడా జిల్లాలో ఎక్కువగా కనపడుదురు.

ఈ జిల్లాలో వరకట్నము అనేది ఒక పెద్ద పెను భూతమై, ఆడపిల్లల తండ్రుల పాలిట శాపమయి యున్నది. కూతుళ్ళ వివాహములకు వారి స్థాయిని మించి వరకట్నములకై వెచ్చించుట జరుగుచున్నది. కొందరు తండ్రులు తమ బిడ్డల వివాహం చేయుటకై స్థిరచరాస్తుల అమ్ముకొన్న సందర్భములు కలవు.

ఇంత కష్టపడి ఆస్తిపాస్తులమ్ముకొని చేసిన కూతుళ్ళ వివాహములు అక్కడక్కడ అత్యాశకు పోయినవారిలో రసాభాసయగుచున్నది. కొన్నిచోట్ల వరకట్నపు చావులు కూడా జిల్లాలో అపశృతిగ వినిపించుచున్నవి.

ఈ జిల్లాలో స్త్రీలకు, పురుషులకు చేయు ప్రత్యేక ఆచారములు కొన్ని గలవు. అందులో బాలురకు ఒకటి, మూడు, అయిదు సం॥ లోపు వయస్సులో పుట్టువెంట్రుకలు తీయుట ఆచారము.

సామాన్యముగా ఈ కార్యక్రమము తమ ఇలవేల్పుల గుళ్ళలో జరిపింతురు. బాలుని పుట్టు వెంట్రుకలను అతని మేన మామ ఒడిలో కూర్చుండబెట్టుకొని కొన్ని వెంట్రుకలకు బంగారు ఉంగరమును ఆభరణమును ఉంచి కత్తిరించును. పుట్టు వెంట్రుకలు తీసిన మేనమామకు బట్టలు పెట్టుదురు. అయిదు మార్లు మేనమామ పుట్టువెంట్రుకలు తీసిన తరువాత మంగలి మొత్తం వెంట్రుకలను కత్తిరించును. పుట్టువెంట్రుకలు తీయు సమయమున పూజ చేయుట కూడా ఆచారముగా కలుగును. పుట్టు వెంట్రుకలను ఒక క్రొత్త బట్టలో వేసి ఒక ముత్యము, ఒక పగడము, ఒక బంగారు పిసరు, ఒక రూపాయి వేసి మూట కట్టి సామాన్యముగా ఏ పుట్టలోనో వేతురు. ఆ తరువాత ఆ బాలునికి నెత్తికి నూనె పసుపు రాసి వేడినీట స్నానం చేయింతురు. ఇందులో కొంత ఆయుర్వేద వైద్యమున్నది. పసుపు క్రిమి సంహారిణి నూనె శరీరమునకింకిన ఆరోగ్యకరము. వేడి నీరు క్రిమిసంహారణముతో బాటు ఆరోగ్య ప్రదము.

బాలుని ఆయిదవ యేట- అమ్మమ్మగారి వారు పుట్టుపంచలు కట్టించుటు ఆచారము బ్రాహ్మణులలో ఎనిమిదవ యేటనుండి సామాన్యముగా పన్నెండేండ్ల లోపు వేదోక్తముగా ఉపనయన సంస్కారము జరుపుదురు. ఈ మధ్య కాలమున చదువులపేరిట ఉపనయనములు చాలా ఆలస్యముగా జరుగుచున్నవి. మొత్తము మీద పదహారు సంవత్సరముల వరకు ఉన్న బాలురకు ఉపనయనములు జరిపించుట తప్పని సరిగ ఆచరింపబడుచున్నది.

ఈ జిల్లాలో స్త్రీలకయి చేయు ప్రత్యేక కార్యక్రమాలు ఆచారాలు కొన్ని కలవు. బాలికకు సామాన్యముగా నెలలోపుననే అందరు నామకరణం చేయుదురు. ఆ రోజున చెవులు కుట్టించుట జరిపింతురు. మూడు సంవత్సరాల లోపు ముక్కుకిరువైపుల రంధ్రములు చేయించుట ఆనవాయితీ. బాలిక అయిదవ యేట అమ్మగారి వారు (మేనమామలు) "పుట్టుఒళ్ళి" కట్టింతురు. ఆ రోజు బాలికకు ఉదయాన్నే ఆభ్యంగన స్నానం చేయింతురు. తరువాత అమ్మమ్మ ఆ బాలికకు తీపి పదార్థము తినిపించి. కొత్త చీరను కట్టించి మెడలో బంగారు గుండ్లు గాని లేదా గొలుసుగాని లేక ఏదేని బంగారు ఆభరణాన్ని వేయుదురు బాలిక రజస్వలానంతరము ఉత్సవము చేయుట ఇక్కడి వేడుక. రజస్వలకాగానే ఒక కుర్చిపై కూర్చుండబెట్టి పెద్ద ముత్తయిదువలను పిలిచి చాకలిని పిలిచి తెల్లని గుడ్డను పరిపించి అందులో అయిదు దిక్కుల తమలపాకులు, అయిదు గౌరమ్మలు ఉంచుదురు. ముత్తయిదువలు చలిమిడి చేసి అనగా బియ్యము నానబెట్టి శక్కర బియ్యము దంచి అలాగే నువ్వులు బెల్లము దంచి వాటిని ముద్దలుగా చేసి ఒక కొబ్బరి కుడక కొంచెం నూనె కొంచ కుంకుమ మూడు గెనల పచ్చి జొన్నకట్టెను తెచ్చి దానికి సూదిని అమర్చి ఆతరువాత అమ్మాయిని "దడివెముందు" కూర్చుండ బెట్టుదురు.

('దడివెము'- పరిచినటు వంటి తెల్లబట్ట.) ఒక ముత్తయిదువను పిలిచి ఆ అమ్మాయిని దోసిలి పట్టుమని ఆకుడకలోని నూనె కుంకుమను పచ్చి జొన్న కట్టెతో అమ్మాయి దోసిలిలో ఒక్కొక్క చుక్క వేయుదురు.

ఈ సందర్భంలో "అల్లోనేరెడల్లో మా యమ్మ సీతమ్మ సమర్తలాడింది అల్లోనేరెడల్లో" మొదలయినటు వంటి పాటలను కూడా పాడుదురు. అమ్మాయి రెండు చేతులను కుంకుమ నూనెతో రాసుకొని ఆ చేతులను వెనకకి చూడకుండా గోడపై అయిదు చేతి గుర్తులను వేయింతురు. తరువాత పండ్లు, తీపిపదార్థములు, చిలిమిడి, కుడుకలతో ఒడి నింపుదురు. వచ్చిన ముత్తయిదువలకు పసుపు బొట్టు, చలిమిడి ముద్ద యిత్తురు. నాలుగవ రోజున సూర్యోదయాత్పూర్వమే అమ్మాయికి పసుపు నూనెతో స్నానం చేయించి వేడి వేడి సేవెల పాయసము తినిపింతురు. ఆ విధంగా పదమూడు రోజుల వరకు ప్రతి దినమూ రకరకములయిన పిండివంటలు తినిపింతురు. పదమూడవ రోజు తలస్నానం చేయించి కొత్త బట్టలు కట్టింతురు. అయిదు లేదా తొమ్మిది రకాల తీపిపదార్థాలు, ఫలహారాలు చేసి బంధువులను పిలిచి విందు చేయుదురు.

స్త్రీకి శారీరకముగా జరుగు మార్పులను ఆ బాలిక సున్నితముగా అర్థము చేసుకొనునట్లు ఆ సమయమున బ్యాక్టీరియా వైరస్‌లు (ప్రకృతి సంబంధమయినవి) ఏవి సోకకుండా పరిశుభ్రమయిన వాతావరణంలో ఉంచుట, బాలిక మనో వ్యథ చెందకుండా మానసికోల్లాసమును పొందునట్లుగా శరీరము దృఢ తరమగుటకును రకరకములయిన పిండివంటలు తినిపింతురని పించునున్నది.

అట్లే గర్భవతి అయిన అయిదు మాసములకు సీమంతోత్సవమును ఘనముగా జరుపుదురు ఆ రోజు దానిమ్మ, నిమ్మ, చింతపండు, పులుసు, పెరుగు, మామిడికాయలతో కూడిన అయిద రకాల చద్దుల చేయుట అలాగే చకిలాలు, అరిసెలు, కరియలు, మౌడుపులు, బేసన్‌లు మొదలగు ఫలహారములు కూడా చేయుదురు. అంతేకాక అయిదు రకాలయిన పుల్లని పండ్లను కూడా ఉంచుదురు. గర్భవతిని పీటపైన కూర్చుండ బెట్టి చుట్టూ ముగ్గులు పెట్టి పై ఫలహారములతో ఒడినింపి మంగళహారతిని ఇత్తురు. అదేవిధంగా ఆకుపచ్చని కొత్త బట్టలు ఆకు పచ్చని గాజులు ధరింపజేతురు. తలలో పూలు, చెంపకు కాటుకబొట్టు, కండ్లకు కాటుక, నుదుట తిలకము అలంకరింతురు.

కాళ్లకు పసుపురాయుట, కంఠమునకు గంధము, పుస్తెకు పసుపు నిచ్చుట ఆచారముగా పాటింతురు. ఈ కార్యక్రమమునకు బంధువులను ఆహ్వానించి విందు చేయుదురు. ఈ వేడుకనే "చద్దులచేయుట" "ఫలహారాలు చేయుట" "చద్దికుడుపు" "సీమంతము" అని వివిధములయిన పేర్లతో పిలుతురు. అలాగే గర్భిణి స్త్రీలకు 'కుంకుమపువ్వు' తో కూడిన పాలను కూడా ఇచ్చెదరు.

స్త్రీ జీవితంలో జన్మసాఫల్యముగా చెప్పుకునే సంతాన యోగ్యత లో ఆమెకు మానసికోల్లాసమును కలిగించి తమ వంశోద్ధరణ జరుగుతున్నందుకు పెద్దలు జరుపుకునే వేడుకే ఈ సీమంతము.

స్త్రీ ప్రసవమయిన ఇరవయ్యొక్కటవ నాడు పుట్టిన బిడ్డకు "నామకరణోత్సవము" చేయుట ఆచారము. ఈ కార్యక్రమమును "ఇరవయ్యొక్క దినము", "తొట్టెల", "పేరుబెట్టుడు", "బారసాల" ఇత్యాది వివిధములయిన పేర్లతో జరుపుకొందురు. ఆనాడు బంధువులందరినీ పిలిచి విందు చేతురు. సాయంకాలపు సమయంలో శిశువుకు తల్లిదండ్రులకు కొత్త బట్టలు పెట్టి ఓడిబియ్యము పోయుదురు. సామాన్యముగా కలవారిండ్లలో శిశువు చేతికి బంగారు కడియములు (ఒత్తులు), కాళ్ళకు వెండి కడియములు, మెడలో బంగరు గొలుసు, నడముకు వెండిగొలుసు, చేతి వేళ్ళకు ఉంగరములు కానుకగా ధరింపజేతురు. అంతేకాక రాగి వెండి కలిపిన తీగలతో చుట్టబడిన కడియములను శిశువుకు పెట్టుదురు. పూర్వకాలమున పిల్లలకు బొడ్డు క్రింద పసుపు కొమ్ముతో కాల్చేవారు. దీనినే "పుల్లెలు వేయుట" అని అందురు. శిశువును అలంకరించిన తొట్టెలో పరుండబెట్టి పెద్దలందరు శిశువు చెవిలో తమకు తోచిన పేర్లను చెబుతూ "కూ" అని శబ్దం చేయుదురు. అలాగే లాలి పాటలను పాడుదురు. అదే రోజు తల్లిని బావివద్దకు తీసుకువెళ్ళి చేదవేయించి అయిదు చేదలతో నీళ్ళు తోడించెదరు. అయిదు చెంబుల నీరు నింపించెదరు. అయిదుగురు ముత్తయిదువులు ఆ చెంబులను తొట్లె క్రింద అయిదు వైపుల బియ్యంగాని, వడ్లుగాని పోసి వాటిపై నీటిచెంబులను ఉంచెదరు. ఆ నీళ్లతో తెల్లవారి ఉదయం శిశువుకు స్నానం చేయింతురు.

ఇక్కడి ముత్తయిదువలయిన స్త్రీలు ఓడిబియ్యమును పోసుకొనుట ఆచారముగా తలంతురు. ఈ ఓడిబియ్యమును తల్లిగారు పోయుట ఆచారము. పసుపు నూనె కలిపిన బియ్యము. అయిదు కుడకలు, అయిదు రవికె కణుములు, అయిదు పోకలు, అయిదు ఖర్జూర పండ్లు అన్ని కలుపుటను ఓడిబియ్యమందురు. ఓడిబియ్యమును పోయువారు భార్యాభర్తలకు కొత్త బట్టలను కట్నముగా పెట్టుదురు. అయిదుగురు ముత్తయిదునలు స్త్రీకి చీరకొంగులో అయిదేసి మార్లు బియ్యమును పోయుదురు. ఈ ఓడిబియ్యము పోసుకొనుట ప్రతి ఐదు (5) సంవత్సరములకొకమారు తప్పక జరుపుకొందురు. తల్లిగారి వారు ఓడిబియ్యము పోయువారు లేకున్నచో తామే సమీపబంధువుల ఇండ్లకు పోయి వారితో పోయించుకుందురు.

మెదకు జిల్లాలో స్త్రీలు తమకయిన ప్రత్యేక నోములు నోముట కలదు. ఈ నోములకు భర్త ప్రక్కనుండుట ఆవసరం లేదు. ముత్తయిదువలు తామే స్వయంగా నోముకుందురు. అందులో ముఖ్యంగా "షోడశగౌరీ" వ్రతము, సంక్రాంతి నోములు ప్రధానమైనవి. అట్లే ఆషాఢ అమావాస్యకు "దశామవాస్య" అను పేరుతో శ్రావణ అమావాస్య రోజున "పోలాల అమావాస్య" గాను నోముకుందురు.

శ్రావణ మాసమున పెళ్ళైన మొదటి ఐదు సంవత్సరములు "మంగళగౌరీ" వ్రతం చేయుట స్త్రీలకు ప్రత్యేకము. శ్రావణ మాసంలో "వరలక్ష్మి" వ్రతం నోముట పుణ్యస్త్రీ లక్షణంగా తలపోతురు. కార్తీక మాసమున "చిలుకుద్వాదశి" నోము, ఆకాశ దీపపు నోములు చేసుకునుట ముత్తయిదువలు భాగ్యంగా తలంతురు. నోము నోమిన నాడు సాయంకాలము చుట్టు పక్కలనున్న ముత్తయిదువలను పిలుచుకొని "పసుపుబొట్టు" ఇచ్చుట ఇక్కడి ఆచారము. పసుపుబొట్టునే "పేరంటం" అని కూడా పిలుతురు. ఆ రోజు కుంకుమకాయను తీసుకొని ముత్తయిదువలు స్వయంగా తాము పిలిచే వారిండ్లకు వెళ్ళి బొట్టుపెట్టి తమయింటికి ఆహ్వానింతురు. అటుల వచ్చిన స్త్రీలను సగౌరవముగా కూర్చుండబెట్టి కాళ్ళకు పసుపు కంఠాన గంధము నుదుట కుంకుమ బొట్టు పెట్టి పుస్తెలకు పసుపునిత్తురు తలలో పూలు బెట్టి తమలపాకులు, పోకలు, పండ్లు, నానబెట్టిన శనగలు వాయినముగానిత్తురు.

మెదకు జిల్లాలో హిందువులు సామాన్యముగా సంవత్సరము న కొకమారు నోములు - వ్రతములు చేయుట ఆచారముగా పాటింతురు. సత్యనారాయణ వ్రతము, కేదారీశ్వర వ్రతము, వరలక్ష్మినోము, అనంతపద్మనాభ వ్రతములు చేయుట ఈ జిల్లాలో కనుపించును ఎక్కువగా సత్యనారాయణ వ్రతమును సంవత్సరమున కొకమారు చేయుదురు. ఈ జిల్లాలో కార్తీక మాసమున కేదారీశ్వర వ్రతము (కేదారి నోము) ఆచరించుట కలదు. వ్రతమునకుముందు ఇంటికి సున్నము వేయుదురు. మామిడాకుల తోరణములను కట్టుదురు. బంధువులను పిలుచుకొందురు. పిండివంటలు చేయుదురు. సామాన్యముగా ఈ నోములన్నియు సాయంకాల సమయములందే భక్తి శ్రద్ధలతో ఆచరింతురు.

మెదకు జిల్లాలో - గ్రహణములు మొదలగు పర్వదినములందు ప్రత్యేక పూజలు జరుపుదురు. గ్రహణములు పట్టినపుడు కొన్ని గంటలముందు నుండి భోజనము చేయకుందురు. గ్రహణమునకు ముందు నిలువ యుండు వస్తువులపై ధర్భ లేదా గరిక వేయుదురు. గ్రహణములను చూచుటకు ఆరుబయట పెద్ద పళ్లెములో నీరుపోసి అందులో ప్రతిబింబిమును చూతురు అద్దములకు మసి పూసి అందులోంచి చూచుట కూడా కలదు. గ్రహణ సమయములందు గర్భిణీ స్త్రీలను చీకటి గదిలో కదలకుండా పరుండ బెట్టుదురు. గర్భిణిలు గ్రహణ సమయమున తిరిగినచో గర్భస్థ శిశువులు అంగ వైకల్యము చెందుదురని నమ్మెదురు. గ్రహణ సమయమున స్నానములు చేసి జపతపాదులు చేయుదురు. గ్రహణానంతరము ఇండ్లను శుభ్రపరచుకొని దేవతాపూజలు చేసి వంటలు వండుకొని భుజింతురు. ఈ జిల్లాలో వైదిక కార్యక్రమముల కుమొదటి నుండియు కొదువలేదు.

భాగవతసప్తాహములు, గీతాయజ్ఞములు, రుద్రాభిషేకములు, మొదలగు దైవిక కార్యక్రమములు ఎక్కువగా జరుపబడును.

మెదకు జిల్లాలోని హిందువులు తమ పండుగలను అత్యుత్సాహముగా జరుపుకొందురు. తెలుగువారు సంవత్సరారంభమును "సంవత్సరాది" "ఉగాది" అను పేర్లతో పిలుతురు. ప్రతి పండుగదినమున స్త్రీ, పురుషులు, బాల, వృద్ధులు తలంట్లు పోసుకొని కొత్తబట్టలు కట్టుకొనుట సంప్రదాయము. ఉగాదినాడు తీపి, పులుపు, చేదు, వగరు, కారము రుచులుండునట్లు చింతపండు పులుసులో మామిడిముక్కలు, ఉప్పు, బెల్లము, మిరియాలు వేపపువ్వు, ఓమ, కొబ్బరిచూరు మిశ్రమమును "ఉగాది పచ్చడి" అను పేరుతో సేవింతురు. గ్రామస్తులందరు ఒక గుడిలో చేరి పురోహితునిచే పంచాంగ శ్రవణము చేయుదురు. రాబోయే సంవత్సరం యొక్క కాలమానమును వర్ష స్థితిని వారి వారి గోచారములను పురోహితుని ద్వారా తెలుసుకొందురు.

"శ్రీరామనవమి" నాడు తమ గ్రామంలోనో లేక సమీప గ్రామంలోనున్న విష్ణుఆలయంలో జరుగు శ్రీరామ కల్యాణమును భక్తి శ్రద్ధలతో తిలకింతురు.

మెదకు జిల్లాలోని పశ్చిమ ప్రాంతము "ఏరువాక పున్నమి" ను "ఏరొక్కపున్నమి" గా ఉత్సాహముగా జరుపుకొందురు. ఆనాడు తమతమ ఎడ్లను అలంకరింతురు. ఈ పండుగ సంపూర్ణముగా కర్షకుల పండుగ.

వినాయక చవితి రోజున తమ ఇండ్లలో వినాయక ప్రతిమను నిలుపుకొని పూజింతురు. వినాయకునకు ఉండ్రాళ్ళు నైవేద్యముగా నుంతురు. వినాయకుని నిలుపుకొనిన తర్వాత ఇంట్లోనుండి పూచికపుల్ల కూడా బయటికి పోనీయరు. అనగా ఏ వస్తువును అవతలి వారికి ఈయరు. ఈ మధ్య కాలమున వినాయక ఉత్సవాలను సామూహికముగా ఘనముగా జరుపుకొనుచున్నారు. నవరాత్రులలో మొదటిరోజు వినాయకుని ప్రతిష్ఠించి తొమ్మిది రోజులు పూజించి చివరి రోజు మహోత్సవముగా నిమజ్జనము చేయుదురు.

తెలంగాణా ప్రాంతమున స్త్రీలు భక్తి శ్రద్ధలతో జరుపుకొనే పండగ 'బతుకమ్మ పండగ' మెదకు జిల్లాలో ఆశ్వీజశుద్ధ ప్రతిపద నుండి తొమ్మిది దినములు ఈ వేడుకను స్త్రీలు జరుపుకొందురు. పళ్ళెములో పూలను పేర్చి "బతుకమ్మ" అందురు. స్త్రీలందరు గుడిలోనికి తాముపేర్చిన బతుకమ్మలను తీసికొని పోయి ఒకచోట పెట్టివాటి చుట్టూ చేతులు చరుస్తూ వంగి పాటలు పాడుదురు. తొమ్మిదవరోజు చద్దుల బతుకమ్మ పండుగను జరుపుకొందురు. పెద్ద పళ్ళెరమునందు వివిధ రకములైన పూలతో బతుకమ్మను పేర్తురు. ఐదురకములైన చద్దులను నైవేద్యముగా బతుకమ్మకర్పింతురు. సాయంకాలమున గ్రామములోని స్త్రీలందరు పెద్ద బతుకమ్మను, గౌరమ్మనును తీసికొని ఒక చోట నుంచి ఆడుకొందురు. ఆ తర్వాత బతుకమ్మను చెరువులో విడుచి వాయనములిచ్చు కొందురు. పసుపు కుంకుమలు పంచుకొందురు.

"దసరా" ఇది హిందువులకు పెద్ద పండుగ. మెదకు జిల్లాలో ఈ పండుగను ఘనముగా జరుపుకొందురు. ఎంత లేనివారయినను తమకు తమ పిల్లలకు కొత్తబట్టలనిప్పింతురు. కనీస ఆర్థికస్థితి బాగులేకున్నా పిల్లలకయినా కొత్త బట్టలు కుట్టింతురు. శాకాహారులు రకరకములయిన పిండివంటలను తీపి వంటలను చేసుకుందురు. మాంసాహారులు తప్పక మాంసమును భుజింతురు. భోజనాలయిన తదుపరి గ్రామస్థులందరు ఒకచోట చేరి అక్కడ నుండి గ్రామము పొలిమేరలు దాటి పోయి పాలపిట్టను చూతురు. సామాన్యముగా దసరా దినమునుసరించి ఆ దినమునకు అనుకూలమయిన దిశకు వెళ్ళుదురు. మంగళవారము పండుగ అయినచో తూర్పునకు, సోమ, శని వారములయినచో దక్షిణము వైపునకు బుధ గురు వారములు పశ్చిమమునకు ఆది శుక్ర వారములయిన ఉత్తరమునకు వెళ్ళుట మంచిదిగా తలంతురు. పాలపిట్టను చూచివచ్చిన తరువాత "జంబి" కి పోవుట ఈ పండుగయొక్క విశిష్టత. ఊరి బయట జంబి చెట్టు నకు పూజ సల్పుట ఆచారము. ఒకవేళ జంబి చెట్టు లేకున్నచో జంబి కొమ్మలను పాతి పూజింతురు. జంబికి పోవునప్పుడు ఆ ఊరి పటేలు ఆయుధపూజ చేయును. ఆ సమయమున గ్రామ ప్రముఖులందరికి పురోహితుడు కంకణములు కట్టుట ఆచారము. కంకణములు కట్టు సమయమున ప్రతి కులపెద్దను పిలిచి, బొట్టు కంకణము ఇత్తురు. ఈ ఆచారము ద్వారా గ్రామములలోని అన్ని కులముల వారికి సమాన గౌరవము ఇచ్చినట్లు అగుపడును.

వాలా గ్రామములలో చావిడి వద్దనో బురుజువద్దనో పతాకములు ఎగురవేతురు. జంబి చెట్టు క్రింద ఆ ఊరికరణము ఏవో తప్పుడులెక్కలు వ్రాయును. జంబి చెట్టును ఈ శ్లోకముచే పూజింతురు.

"శమీశమీయతే పాపం శమీ శత్రువినాశినీ
అర్జునస్య ధనర్ధారీ రామస్య ప్రియ దర్శనం"

జంబి ఆకును పెద్దల కిచ్చి నమస్కరింతురు. తోటివారలకిచ్చి ఆలింగనం చేసుకుందురు. జంబిచెట్టు చాలా దొరకని చోట్ల "ఆరె" చెట్టును కూడా పెట్టి పూజింతురు. జంబి ఆకుచోట ఆరె ఆకును ఇచ్చుట కూడా కలదు. జంబి ఆకును బంగారమని ఆరె ఆకును వెండి అని చెప్పుదురు.

ఇప్పుడిప్పుడు కొన్ని పట్టణాలలో దసరానాడు రావణ ప్రతిమను కాల్చుట జరుగు చున్నది. ఈ ఆచారము మెదకు జిల్లాకు మొదట నుండి ఉన్న ఆచారము కాదు. ఔత్తరాహులు ప్రత్యేకముగా బెంగాలీలు ఈ ఆచారమును పాటించుట జరుగుతున్నది.

"దీపావళి" ఈ రోజు సూర్యోదయా త్పూర్వముననే లేచి స్నానాదులు ముగించుకొని హారతులు తీసుకుందురు. "శేవెలు" నేటి ప్రత్యేక ఆహారము వివిధములయిన పిండివంటలు తీపి వంటకాలు చేయుదురు. నేడు మాంసాహారమును భుజింపరు. సాయంకాలమగుట తోడనే ఇళ్ళముంగిళ్ళలో పశువుల కొట్టములలో పెంటల పైన తులసిచెట్టు వద్ద దీపపు ప్రమిదలను వెలిగింతురు.

దీపాలను ఎక్కువగా వెలిగించుటచే దీపావళి పండగ ప్రత్యేకత. ఈ పండుగకు పెళ్ళయిన ఆడబిడ్డలను, అల్లుళ్ళను పిలుచుకొనుట తమస్తోమతకు తగినట్లు కట్నములు పెట్టుట ఆచారము. సామాన్యముగా కొత్త అల్లుళ్ళను. అనగా ఆ సంవత్సరంలో వివాహమయిన బిడ్డా అల్లుళ్ళను తప్పక పిలుతురు. దీపావళి సమయమున మూఢములు వచ్చినచో అల్లుళ్ళను ఆహ్వానింపరు. దీపావళినాడు ప్రత్యేకముగా రకరకములయిన బాణసంచాను కాల్చుట ఆచారము.

"సంక్రాంతి" తెలుగువారికిదొక ముఖ్యమయినపండుగ సూర్యుడు మకరరాశియందు ప్రవేశించిన సందర్భమును మకర సంక్రమణమందురు. ఇది ఖచ్చితముగా జనవరి **14** వ తేదీన వచ్చును. ఈ పండుగనాడు ఇంటిముంగిట కళ్ళాపి చల్లి పెద్ద పెద్ద ముగ్గులు పెట్టుదురు. కడపలు కడిగి వాటిపై పేడముద్దలు పెట్టిగరికచెక్కుదురు. ఆ పేడముద్దలకు పసుపుకుంకుమ పెట్టుదురు. ఇంటి వసారాలో ఒక మూలన నాలుగు మూలలా పెద్ద పేడ ముద్దలు పెట్టి వాటికిగరికచెక్కి పసుపు కుంకుమలు పెట్టివాటి చుట్టూ దారం చుట్టుదురు. వాటినడుమ నవధాన్యములు కుప్పలుగా పోయుదురు మధ్యలో బొమ్మను ఉంచుదురు. దానిముందర ఆవు పిడకలను కాల్చి వాటిపై కొత్త మట్టి గురిగిలో పాలను పొంగింతురు. ఈ రోజు ఆడవాళ్ళు గౌరమ్మను నోముదురు. ఐదు సంవత్సరములలోపు పిల్లలకు రేగుపండ్లు, జీడిపండ్లు, చెఱుకు ముక్కలు, చిల్లర నాణెములు, నువ్వులఉండలు తలపై పోయుదురు. ఈ కార్యక్రమమును బోడలు పోయుట అందురు. సంక్రాంతికి నువ్వులుండలు కట్టుట ప్రత్యేకము. ఈనాడు అక్కడక్కడ గంగెద్దువారు తమ గంగిరెద్దులను ఇండ్లముందుకు తీసుకువచ్చి వాటినాడించి రైతులిచ్చిన ధాన్యమును బట్టలను తీసుకొనిపోవుదురు. సంక్రాంతి ముందు నెల నుండి దాసర్లు "భూపాళము" లు పాడుతూ రాత్రులలో ఊర్లలో సంచరిచేవారు.

"కాముని పున్నమి" ఈ దినమున కొకరోజు ముందు రాత్రి అనగా ఫాల్గున శుద్ధ చతుర్దశి రాత్రి ఊరికావలికాండ్రు చప్పుడుతో ఇంటింటికీ తిరిగి కట్టెలు పిడకలు తీసుకొని పోయి ఊరిలోని మధ్యప్రాంతమున తీసుకువచ్చినకట్టె, పిడకలను చితిగా పేర్చి కాముని బొమ్మను అందులోపెట్టి కాల్తురు. ఈ ప్రాంతమును "కామునికంత" అంటారు. ఈ రోజు చిన్నలూ పెద్దలూ అనక అందరూ రంగులు చల్లుకుందురు. వివిధములయిన వేషములతో నిమ్నజాతులవారు అగ్రకులాల వారి గృహములకేగి వారిచ్చిన ధనమును తీసుకుందురు. అట్లే కొందరు స్త్రీలు యింటింటికి తిరుగుచు పాటలు పాడుతూ పైసలు వసూలు చేసుకుందురు.

ఇవికాక తొలేకాదశి, కృష్ణాష్టమి, శివరాత్రి మొదలగు పర్వదినములను కూడా పండుగలగా చేసుకుందురు.

కృష్ణాష్టమి రోజున అక్కడక్కడ "ఉట్లుకొట్టుట" ఆచారమయి యున్నది.

ప్రముఖ దేవాలయాలలో బ్రహ్మోత్సవము లను పేర విశేష పూజలు చేయుచు ఉత్సవములు జరుపుదురు. జిల్లాలో నేటికీ నాచారం నరసింహస్వామి బొంతపల్లి వీరభద్రస్వామి, ఝరాసంగం కేతకీ సంగమేశ్వర స్వామి, దేవాలయములలో బ్రహ్మోత్సవములు జరుపు చున్నారు. అట్లే జిల్లాలోని మరికొన్ని దేవాలయము లలో కూడా బ్రహ్మోత్సవములు జరుపబడుచున్నవి.

మెదకు జిల్లాలో మంజీర ఏడుపాయలుగా విభజింపబడి పారేచోట దుర్గాభవాని దేవాలయం కలదు. శివరాత్రి పర్వదినము ముందు మూడురోజుల నుండి శివరాత్రి అయిన తదుపరి మూడు రోజుల వరకు విశేష జన సందోహముచే జాతర సాగును. ఈ జాతరకు జిల్లాలోని మారుమూలలనుండే కాక హైదరాబాదు, సికిందరాబాదుల నుండి విశేషముగా భక్తులు తరలివత్తురు. మెదకు జిల్లాలోనే ఇది చెప్పకోదగిన జాతర. సుమారు లక్షకుపైగా భక్తులు ఈ జాతరలో పాల్గొందురు. ఈ జాతరలో బోనాలు తిరుగుట, బండ్లుతిరుగుట చూడముచ్చట గొలుపు దృశ్యములు.

తరువాత చెప్పుకోదగినది నాచారం నరసింహస్వామి జాతర. ఈ జాతర ఫాల్గుణ బహుళమందు జరుగును. జిల్లాలోని నలుమూలల నుండే కాక భాగ్యనగర వాసులు ఎక్కువగా ఈ జాతరకు విచ్చేయుదురు. ఈ జాతరలో "గరుడసేవ" "రథముతిరుగుట" చెప్పుకోదగిన ప్రత్యేకతలు. రథోత్సవం నాడు విశేష జనము పాల్గొందురు.

ఆ తరువాత చెప్పుపకోదగిన జాతర బొంతపల్లి వీరభద్రునిది, ఫాల్గుణ మాసమున ఈ జాతర జరుగును. ఈ జాతరకు జిల్లావాసులు భాగ్యనగర వాసులతో పాటు కర్ణాటక దేశము నుండి కూడా ఎంతో మంది భక్తులు పాల్గొందురు. ఈ జాతరలో బండ్లుతిరగుట రథము తిరుగుటతో పాటు అగ్నిగుండములు ప్రత్యేకమయినవి. అగ్నిగుండముల నగా చతురస్రముగా త్రవ్వబడినగుండములో ( పొడవు వెడల్పులు సుమారు ఆరుఫీట్లు కలిగి లోతు ఒక ఫీటు ఉండునట్టుగా గుండమును తయారు చేయుదురు) కట్టెలు పేర్చి అంటించి నిప్పు కణికలను చేయుదురు. ఆ అగ్నిలో ఇటునుండి అటు నడుతురు. దీనినే అగ్నిగుండములు త్రొక్కుట అందురు.

ఈ జిల్లాలో మూఢనమ్మకాలు కూడా ఎక్కువగానే ఉన్నాయి. బాణామతి, చేతవడి, దయ్యంపట్టుడు, సోమిడి మొదలయిన మూఢనమ్మకాలతో ప్రజలు ఎన్నోచోట్ల మోసపోవు చున్నారు. ఈ బాధలను పోగొట్టుకొనుటకై శిగాలూగేవారి దగ్గరికి పోయి వారు కోరిన వస్తు సామగ్రి ధనము ఇచ్చి వారి శిగాల ద్వారా తమ బాధలేవో మాయమయినవని తలచే వారు ఈ జిల్లాలో చాలామందే ఉన్నారు.

బాణావతి, చేతబడి, శిగాలు, మొదలగు మూఢ నమ్మకాలు, ముడుపులు గట్టుట మొక్కు బడులు చెల్లించుట, పశువులను బలి ఇచ్చుట మొదలగు మూఢాచారములు ఇచ్చట కలవు.

ఈ జిల్లాలో ఊర్లోచేయుట అనునొక ప్రత్యేక క్షుద్రపూజ కలదు. పశువులు రోగాలతో చచ్చినపుడు, కలరా మొదలగువ్యాధులు వ్యాపించినపుడు గ్రామదేవతలకు మొక్కుబడులు చేయుదురు. దానినే ఊర్లోచేయుట అందురు. గ్రామ మధ్యన ఊరడమ్మ అను దేవత ముందు బైండ్లవారు చిందులు వేయుచు శిగాలు ఊగుచుందురు, ఈ దేవతలకు బలిగా గొర్లను, మేకలను, దున్నపోతులను కోయుచుందురు.

చెరువు కట్ట పైకూడా ఇట్టి బలి కట్టమైసమ్మ పేర జరుపుదురు. ఈ మధ్యకాలమున బలి యిచ్చు ఆచారము చాలా తగ్గినదని చెప్పవచ్చును. ఈ విధమైన అనాగరిక ఆచార వ్యవహారములు పాతకాలమున జిల్లాలో ఎన్నోయుండేడివి.

కాలమునందలి మార్పు, చదువునేర్పు, సంస్కృతి చేర్పు, ప్రభుత్వపు తీర్పు ఇవన్నియు మూఢాచారములకు తెరదించినవని చెప్పవచ్చును.

మెదకుజిల్లాలో ఎక్కువగా హిందువులు కలరు. మహమ్మదీయులు, క్రైస్తవులు, సిక్కులు కూడా యిచ్చట నివసించుచున్నారు. హిందువులలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కులములవారు కలరు.

ఈ కులములలో కూడా ఎన్నో శాఖాభేదములు కలవు. బ్రాహ్మణులలో స్మార్తులు, శ్రీ వైష్ణవులు, ఆరాధ్యులు, మధ్వులు, వ్యాపారులు (కులకర్ణీలు) ఉన్నారు. క్షత్రియులలో సూర్యవంశ, చంద్రవంశ క్షత్రియులను భేదములున్నవి. శూద్రులలో చెప్పలేనన్ని భేదములున్నవి శూద్రజాతిలో వచ్చిన కులములు అనేకములు. అట్లే ఒకనాడు పంచములుగా, హరిజనులుగా నేడు దళితులుగా పిలువబడు వారిలో మాల, మాదిగ మొదలగు ఎన్నియెూ కుల భేదములున్నవి.

ఒకనాడు కేవలము వృత్తి ఆధారముగా పిలువ బడిన కులములు శాఖోపశాఖలుగా విస్తరిల్లి నేడు హైందవసంఘమును బలహీన పరచుచున్నవి.

మెదకు జిల్లాలో బ్రాహ్మణులు, వైశ్యులు, రెడ్లు, వెలిమ, మున్నూరుకాపు, జంగము, బంజ, కమ్మరి, వడ్ల, కంసాలి, కంచరి, కాశె, కుమ్మరి, చాకలి, మంగలి, గొల్ల, కురుమ, బెస్త, పద్మశాలి, కమ్మ (ఆంధ్రప్రాంతమునుండి వలస వచ్చిన వారు) ముదిరాజ, ఎరుకల, పెరిక, గౌండ్ల, సాతాని, దాసరి, మేదరి, బట్రాజు, వడ్డెర, దర్జీ, వంజరి, మాల, మాదిగ, మాలదాసరి, మాలజంగము, మోచీ, బైండ్ల, మొదలగు కులాలవారు తమతమ వృత్తులలో కొనసాగు చున్నారు. ఏవృత్తివారు ఆవృత్తియే చేయవలయునను నియమములేక వ్యాపారాది యితర వృత్తులలో సైతము ప్రవేశించుచున్నారు. ప్రభుత్వోద్యోగములలో ప్రవేశించుట చే వృత్తివిధాన మే మారినది.

మెదకు జిల్లా అడవులలో నివసించి వ్యవసాయమే ప్రధాన జీవనాధారముగా గల గిరిజనులలో ప్రధానముగా పేర్కొనదగిన వారు లంబాడీలు ముఖ్యులు.

ఒకకాలమున సంచార జాతులుగా అడవులలో తిరుగుచు పోటు వ్యవసాయమును చేసికొనెడువారు లంబాడీలు మెదకు జిల్లాలో నర్సాపూర్, జోగిపేట, మెదకు ప్రాంతములలో ఎక్కువగా కలరు. లంబాడీలు ప్రభుత్వము కల్పించు సదుపాయములను సద్వినియోగమొనర్చుకొనుచు వ్యవసాయమునందు చక్కని కృషి సల్పుచు, స్థిర నివాసము లేర్పరుచుకొని ఆర్థికముగా, ముందంజ వేయుచున్నారు. ఇప్పుడిప్పుడే వీరిలో విద్యావికాసములగుపడుచున్నవి. వీరి వేషధారణ, భాష, ఆచార వ్యవహారములు ప్రత్యేకముగా నుండును. అడవులలో నివసించుచున్నను నవీన నాగరికత వైపు పయనించుచున్నారని చెప్పవచ్చును.

మెదకు జిల్లా గిరిజనులలో పిట్టలవారు, అను ఒక తెగవారు కలరు. వీరు పిట్టలను, కుందేళ్లను వేటాడి వాటిని అమ్ముకొని జీవింతురు. అటవులలో లభించు పండ్లు, తేనె, గోందు మొదలగునవిసేకరించి వాటిని అమ్ముకొని జీవింతురు. వీరి బాషప్రత్యేకము. నేటికిని వీరిలో ఏ మాత్రము నవీన నాగరికత అలవడలేదని చెప్పవచ్చును.

మెదకు జిల్లాలో సంచార జాతులవారు కలరు. గంగెద్దు, బిచ్చము, విప్రవినోద, పిచ్చకుంట్ల, దాసర్లు శారదకాండ్రు, వీరముష్టులు, బాలసంత బుడు బుక్కులోళ్ళు, చిందువాదుగులు, జోగుల, మొదలగుకులములవారు నేటికిని స్థిర నివాసములు లేక భిక్షాటనమేవృత్తిగాగల వారెందరో ఈ జిల్లాలలో నున్నారు.

మెదకు జిల్లాలో వైదిక మతము అనాదిగా కొనసాగు చున్నది. వైదికమతమునందు శైవ, వైష్ణవ సంప్రదాయములుకలవారు యిచ్చటనున్నారు. కేవలము శివుని మాత్రమే ఆరాధించువారు వీరశైవులు, విష్ణువును మాత్రమే ఆరాధించు వీరవైష్ణవులు కూడా ఈ జిల్లాలో నివసించుచున్నారు.

హిందువులతో పాటు మహమ్మదీయులు, క్రైస్తవులు సిక్కులు ఇచ్చట సహజీవనమును గడుపుచున్నారు.

మెదకు జిల్లాలో మహమ్మదీయులు ప్రతిగ్రామము నందును ప్రతి పట్టణమునందును కలరు. వీరు మహమ్మదుప్రవక్త ప్రవచించిన ప్రకారము జీవనమును సాగింతురు. నిరాకారోపాసనలతో "అల్లా" దైవమును విశ్వాసమున జీవింతురు. మహమ్మదీయ మతాచారము ప్రకారము జననము మొదలు కొని ఖననము వరకు నిష్ఠగా ఆచారములను పాటింతురు.

మెదకు జిల్లాలో క్రైస్తవులు హిందూ మహమ్మదీయులతో సహ జీవనముగడుపుచున్నారు. మెదకు జిల్లాలలోని క్రైస్తవులు ఎక్కువగా హిందువుల నుండి మతాంతరీకరణ పొందిన వారున్నారు. కొందరు

తాతముత్తాతనుండి మతాంతరీకరణ పొందిన చో కొందరు ఈ మధ్యకాలమున పొందినవారు కలరు.

మెదకు జిల్లాలోని క్రైస్తవులకు మెదకు చర్చి ఆరాధ్యమందిరము. సంగారెడ్డి, జహీరాబాదు, రామాయంపేటల లో కూడా ప్రాచీన క్రైస్తవ మిషనరీలు, చర్చిలు కలవు. క్రైస్తవులు వారి మతసంబంధ మైన పండుగలను ఘనముగా జరుపుకొందురు.

క్రైస్తవులకు సంబంధించిన జనన, వివాహ, మరణాదులన్నియు చర్చితో ముడివడియుండును.

మెదకు జిల్లాలో సిక్కులు కూడా నివసించుచున్నారు. వీరు సంగారెడ్డిలో ఎక్కువగా యున్నట్లగుపడుచున్నది. సంగారెడ్డిలో సిక్కు గురుద్వార కూడా కలదు. సిక్కులు వారి మతాచారము ప్రకారము క్రమము తప్పక జీవనము సాగించుచు హిందూ, మహమ్మదీయ, క్రైస్తవులతో సహజీవనము సాగించు చున్నారు.

మెదకు జిల్లాలో జైనులు కూడా కొందరు వసించుచున్నారు. కాని వారి ఆచార వ్యవహారము లన్నియు హిందువుల వలెనే కొనసాగుచున్నవి.

మొత్తము నీద మెదకు జిల్లాలో ప్రాచీన కాలము నుండియు హిందువులే ఎక్కువగా నివసించుటచే వారి ఆచారవ్యవహారములు, కట్టుబాట్లు ఈ వ్యాసమున సంపూర్ణముగా వివరింపబడినవి.

# శాతవాహన వంశము

సమస్త ఆంధ్రప్రదేశమునేగాక యావద్దక్షిణా పథమును పాలించిన మొట్టమొదటి తెలుగు రాజులు, శాతవాహనులు.

అశోక చక్రవర్తి కళింగ యుద్ధానంతరము బౌద్ధమును స్వీకరించి మత ప్రచారమునకై తన జీవితమంతయు ధారపోసెను. అశోక చక్రవర్తి వేయించిన పదమూడవ శిలాశాసనమును "ఏవమేవ ఇహరాజ విషయేషు యవన కాంభోజేషు నాభకే నాభ పంక్తిషు, భోజ పితినిక్యేషు ఆంధ్రపుళిందేషు - సర్వత్ర దేవానాంప్రియస్య ధర్మాను శిష్ట మనువర్తంతే" అని కలదు. అనగా అశోకుని రాజ్యమునఅతని సామంతులుగా ఆంధ్రులున్నట్లు ఈ శాసనము వలన తెలియుచున్నది. మహాదేవ భిక్షువు, ఆంధ్రదేశమున బౌద్ధమత ప్రచారము చేయుటకు అశోక చక్రవర్తిచే నియమింపబడి ఆంధ్ర దేశమునంతయు సంచరించెను. అశోకచక్రవర్తి క్రీ.పూ.232 లో మరణించునాటికి, కరీంనగర్ మండలమున కోటి లింగాల ప్రాంతమును శాతవాహనుడు పరిపాలించు చుండెను.

ఉత్తరాపథమున అరాచకము ప్రబలియున్న సమయమున దక్షిణ భారతమును ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందట తీసుకొని వచ్చి శాంతి భద్రతలు నెలకొల్పి చక్కని పరిపాలన గావించిన రాజన్యులు శాతవాహన వంశీయులు. వీరు అసహాయ శూరులై, అరివీర భయంకరులై అప్రతిమాన ప్రతిభా విశేషములు కలవారైయుండిరి.

సుమారు నాలుగున్నర శతాబ్దుల కాలం పాలించిన శాతవాహనుల రాజ్యనిర్మాణమును తెలుసుకొనుటకు ఈ క్రిందివి ఉపకరించుచున్నవి.

1. శాసనములు
2. పురాణములు
3. దేవాలయములు
4. దేశవిదేశీయుల వ్రాతలు
5. సమకాలీన రాజవంశీయుల చరిత్ర
6. నాణెములు
7. శిల్పములు
8. బౌద్ధారామ విహార నిర్మాణములు
9. నగరములు
10. కథలు

## 1. శాసనములు :

శాతవాహన వంశీయులు వారి సామంత మాండలికులు వేయించిన ప్రాకృత శాసనములు. 24 కలవు.

నాసిక్, కోర్లే, క్షన్హేణ, నానేఘాట్, మ్యాకదోని, తదితర ప్రాంతములందును అమరావతి, బళ్ళారి ప్రాంతములందును శాసనములు లభించినవి.

మహిషక రాజైన ఖారవేలుడు వేయించిన హతిసంట శాసనము, గుంటుపల్లి శాసనములు వీరి చరిత్ర తెలుసుకొనుటకు ఉపయోగుడుచున్నవి. రుద్ర ధాముని జునాగఢ్ శాసనములో కూడా ఆంధ్ర శాతవాహనుల గురించి కలదు.

ఈ శాసనములందు, శాతవాహనులకు సంబంధించిన పదములు "సాత్రాహని రాష్ట్రము, సాత్రాహని హారము"లు ఇవేకాక సాతవాహనికోట సాతానకోటలు కర్నూలు జిల్లాలో కలవు. 'సాతవాహన పల్లె, సత్తనపల్లి' అనునవి గుంటూరు జిల్లాలోనూ 'సాతునూరు' కర్నూలు జిల్లాలోనూ, చిత్తూరు జిల్లాలో 'సాతంబాకు' కృష్ణా జిల్లాలోని 'సాతులూరు' "సాతుకొట్టని, సాతుపాడివు, సాతునాళొ, సదనపల్లె, సాతుళి, సతాసి, సాద." మొదలైనవి. విశాఖ జిల్లాలోనూ గ్రామాల పేర్లున్నవి. మెదకు జిల్లాలో సాత్వార్, సత్తేగావ్ వంటి పేర్ల గ్రామాలకుకలవు ఆదిలాబాద్ జిల్లాలో సాతనాల, పర్వతపంక్తి గలదు వీటన్నింటిలోను శాతవాహనుల సంబంధిత నామము ఉన్నట్లుగా తోచుచున్నది.

## 2. పురాణములు :

మత్స్య పురాణమున ఆంధ్ర శాతవాహన వంశీయులు 30 మంది రాజులు సుమారు. 450 సంవత్సరాలు పాలించినట్లును, వాయుపురాణమున 30 మంది రాజులు 411 సంవత్సరాలు పాలించినట్లు పేర్కొనబడినది.

పురాణములలోనే గాక బౌద్ధ జాతక కథలలోనూ, జైన మత గ్రంథాలలోను బృహత్కథ, గాధా సప్తశతి, లీలావతి కావ్యము వాత్స్యాయనము, ఆచార్య నాగార్జునుని గ్రంథములందును శాతవాహనుల ప్రసక్తి కలదు.

## 3. దేవాలములు - గుహాలయములు :

అజంతా గుహలలోని ఎనమిది, తొమ్మిది, పది, పన్నెండు, పదమూడు సంఖ్యలు గల గుహలు శాతవాహనుల నాటివి. ఎల్లోరా గుహాలయములందు పన్నెండు, పదిహేను అడుగుల ఎత్తుగల బౌద్ధ విగ్రహాలు (మహర్‌కోల్ సిర్వాళ్, వాయ్, కరాద్, కొరడనే, భాజ్, భేడ్సా, ఫితల్‌పురా, శైలర్‌వాడి, జున్నార్, తులజా, గణేషలేనా, సులేమాన్ కొండగుహలు) కొండెటే, నానాఘాట్, నాసిక్, క్షనేణ, కార్లే గుహాలయాలు శాతవాహనుల శిల్పకళాభిరుచిని తెల్పుచున్నవి.

## 4. దేశవిదేశీయులు - వ్రాతలు :

మౌర్యసామ్రాజ్యమున గ్రీకు రాయబారిగా మెగస్తనీస్ భారతదేశంలో పర్యటించి, పర్యటన అనుభవములను 'ఇండికా' గ్రంధమున వివరించెను. అందు భారత దేశమున మగధ రాజ్యము తర్వాత పేర్కొనదగినది 'ఆంధ్ర-రాజ్యము' ని నుడివెను. అది శాతవాహనుల రాజ్యమే.

## 5. సమకాలీన రాజవంశీయుల చరిత్ర :

మౌర్య, శుంగ, కాణ్వాయన, శక, యవన, చేదివంశపు రాజుల చరిత్ర శాతవాహనుల గురించి తెలుసుకొనుటకు ఉపయోగపడుచున్నవి.

మహారాష్ట్రమందున్న మహాసామంతుల, మహారటుల చరిత్రలు, క్షహరాట వంశీయుడగు 'నహపానుడు' రుద్రధాముడు కళింగ రాజగు ఖారవేలుడు, మొదలగు రాజన్యుల చరిత్రయందు శాతవాహనుల సమాచారము లభించుచున్నది.

## 6. నాణెములు :

శాతవాహనుల నాటి నాణెములు ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, ఒరిస్సా, మధ్యప్రదేశ్, కర్ణాటక, తమిళనాడు, ఉత్తరప్రదేశ్, బీహార్, బరోడా, ప్రాంతములందు లభించినది. ఇవి గుండ్రముగను చతురస్రములుగను, అండాకృతి గలవిగను ఉన్నవి. ఈ నాణెములపై రాజుల పేర్లు, గజము, అశ్వము, వృషభము, త్రిరత్న, స్వస్తిక, నందిపాద, ఉజ్జయినీ చిహ్నములు, ఢమరు, అంకుశము, సూర్యబింబం, చేపలతో కూడినసది, శంఖు, కమల, నార చిహ్నములు చెక్కబడిన నాణెములుండెడివి.

గౌతమీపుత్ర శాతకర్ణి, యజ్ఞశ్రీ శాతకర్ణి వేయించిన వెండినాణెములు లభ్యమైనవి.

శాతవాహనుల కాలమున మెదక్ జిల్లాలోని కొండాపురము ఒక మహానగరము. ఈ కొండాపురమున నాణములు తయారు చేయు 'టంకశాల' యుండెడిది.

శాతవాహనుల కాలమున ప్రాక్పశ్చిమ దేశాలతో వ్యాపారము సాగుచుండెననుటకు రోమను నాణెములు, అసంఖ్యాకముగా శాతవాహనుల సామ్రాజ్యమున లభించినవి.

## 7. శిల్పములు :

శాతవాహనుల కాలమున చెక్కించిన సాంచీస్తూప ద్వారములు ఎల్లోరా గుహలలోని దేవతల శిల్పములు అమరావతి చైత్య స్తూపములు వారి శిల్పకళానైపుణ్యమును చాటిచెప్పుచున్నవి.

అంతేగాక వారి చరిత్ర తెలిసికొనుటకు ఆధారమగుచున్నది.

## 8. బౌద్ధారామ విహార నిర్మాణములు :

శాతవాహనుల కాలంలో నిర్మించిన ఎల్లోరా గుహాలయములు, నాగార్జునకొండ, భట్టిప్రోలు, అమరావతి విహారములు, ఇటుకలతో నిర్మించిన స్తూపములు, రామతీర్థము, ధారపాలెం, గుంటుపల్లి, గుడివాడ మొదలగు ప్రాంతాలలోని ఆరామ విహార చైత్యాలయాలు శాతవాహనుల శిల్పకళా విజ్ఞతకు, నిర్మాణ కౌశల్యమునకు దర్పణములు.

## 9. నగరములు :

శాతవాహన కాలమున ప్రసిద్ధి పొందిన నగరాలు నేడు శిథిలరూపమున కనిపించుచున్నవి. ఈ నగర ప్రాంతములందు పురాతత్వశాఖవారు నిర్వహించిన త్రవ్వకాలలో ఆనాటి నగర నిర్మాణ స్వరూప స్వభావాలు వెల్లడగుచున్నవి.

ఆనాటి శిథిల నగరాలలో కొండాపురము ప్రతిష్ఠానము, ధాన్యకటకము, కోటిలింగాల, భట్టిప్రోలు, మూషికనగరము, పౌధన నగరము, నాసిక భరుకచ్ఛము, మలయగిరి, విజయదుర్గము, ధూళికట్ట, కళ్యాణము, భళి పట్టణము ముఖ్యమైనవి. ఈ నగరాలల్లో కొండాపురము ఈ నాటి మెదక్ జిల్లాలో కలదు.

## 10. కథలు :

హాల శాతవాహన చక్రవర్తి పేర శ్రీపాలితుడు 350 మంది కవుల రచనలతో 'గాథాసప్తశతి' ని వెలయించెను. ఈ గ్రంథము ద్వారా శాతవాహనుల విషయమునాటి నాగరికత విషయములు కొంత బయల్పడుచున్నవి.

ఈ విధముగా గ్రహింపబడిన చరిత్ర ఆధారముగ శాతవాహనుడు ఈ వంశ మూల పురుషుడై శాతవాహన సామ్రాజ్యమును స్థాపించినట్లును అతని తదుపరి 30 మంది రాజులు పాలించినట్లు తెలియుచున్నది.

## శాతవాహనుడు :

క్రీ.పూ. 245 - 231. మధ్యకాలమున, మౌర్యరాజుల సామంతునిగా గోదావరికి ఇరువైపులా విస్తరించియున్న భూభాగమును 'శాతవాహనుడు' పరిపాలించెను. ఇతడు తనపేరున నాణెములను ముద్రించెను. ఈ నాణెములపై 'సాధ్యాహన' అను లేఖనమున్నది. సాధ్యాహనుడే 'శాతవాహనుడు' శాతవాహనుడే - శాతవాహన వంశమునకు మూలపురుషుడు.

## శ్రీముఖుడు :

అశోక చక్రవర్తి అనంతరము మౌర్య సామ్రాజ్యపాలకులు బలహీనులగుటచే సామంతులు స్వతంత్రులైరి. ఈ సమయమున శ్రీముఖుడు స్వతంత్రుడై క్రీ.పూ 231 లో తన తండ్రి శాతవాహనుని పేర "శాతవాహన సామ్రాజ్యము"ను స్థాపించి తన పేర నాణెములు ప్రకటించెను. శ్రీముఖుని 'సిముకుడు' అని కూడా పిలుతురు.

శ్రీముఖుని పేర ప్రకటింపబడిన నాణెములు కోటిలింగాలలో లభించినవి. ఇతడు అపారసైన్యమును సమకూర్చుకొని ఆంధ్రదేశమునంతటిని జయించి మహారాష్ట్రమందున్న మహారటుల రాజ్యముల నొక్కొక్కదానినే జయించుచు విశాల సామ్రాజ్యము నేర్పరచెను. "మహారటి త్రణయికరో" కుమార్తె దేవీ నాగానికను తన తనయుడగు మొదటి శాతకర్ణికిచ్చి వివాహము జరిపించెను.

దీనితో బంధుత్వమేర్పరచుకొని 'పిష్టపురము' ను రాజధానిగ దక్షిణాపథమును క్రీ.పూ.231 నుండి క్రీ.పూ. 208 వరకు పరిపాలించెను.

శ్రీముఖుడు ప్రతిభావంతుడు మొదట ఈతడు జైన మతానుయాయిగా నుండి మహారటుల బాంధవ్యముచే వైదిక మతమును స్వీకరించెను. ఆంధ్రజాతికొక ప్రత్యేక స్థానము నేర్పరచి ప్రజానురంజకముగా పరిపాలనము గావించెను.

## కృష్ణుడు :

శ్రీముఖ శాతవాహనుని మరణానంతరము అతని కుమారుడు 'శాతకర్ణి' యుక్తవయస్కుడు కానందున, రాజ్యము అన్యాక్రాంతము కాకుండగ సామాంతుల మాండలీకుల సలహాలననుసరించి శ్రీముఖుని సోదరుడగు కృష్ణుడు లేక కన్హశాతవాహనుడు రాజ్య సింహాసనమును అధిష్ఠించెను.

ఇతని మహామాత్యుడు శ్రమణులకై నాసిక ప్రాంతమున గుహలను తెరిపించెను. ఇతని పాలనా కాలము క్రీ.పూ.208-క్రీ.పూ.198 వరకు.

## మొదటి శాతకర్ణి :

పిన తండ్రియగు కృష్ణుని అనంతరము, శ్రీముఖ శాతవాహనుని కుమారుడు 'మొదటి శాతకర్ణి' క్రీ.పూ.198లో శాతవాహన సామ్రాజ్యమును అలంకరించెను. ఈతడు కడు సమర్థుడైన రాజు.

మహారాష్ట్ర రాజగు 'మహారటి త్రణయికరో' తనయదేవి నాగానీక ఇతని భార్య. ఆమె రాజకీయ చతురత గలది. నిత్య సత్యవతి, మాసోపవాసిని. ఆమె 'నాసిక' లో వేయించిన శాసనము వలన శాతకర్ణి వీర, శూర, అప్రతిహత చక్ర, దక్షిణాపథపతి అని తెలియుచున్నది.

మొదటి శాతకర్ణికి మహారటి సహాయ సహకారాలు మెండుగా నుండెను.

మౌర్యవంశమును నిర్మూలించి, శుంగవంశ పుష్యమిత్రుడు క్రీ.పూ.187లో మగధ సామ్రాజ్యమును ఆక్రమించెను. ఈ సమయమున శాతకర్ణి విజృంభించి, తూర్పు మాళవ రాజ్యమును జయించెను. ఉజ్జయినీ చిహ్నములు గల శ్రీముఖ శాతవాహనుని నాణెములు మాళవమును జయించెననుటకు నిదర్శనములు.

సుసంపన్నమైన తీరాంధ్ర దేశమునకై శాతవాహన కళింగాదిరాజులు తరచు యుద్ధము లొనర్చుచుండిరి. శాతవాహన రాజ్యము విస్తరించుట సహింపలేని భోజక, పిఠళిక, మహిషకాదులు బలవంతుడైయున్న కళింగ ప్రభువుయగు మహిషక రాజగు 'ఖారవేలు' ని సహాయమర్థించి శాతవాహన రాజ్యభాగములపై దండెత్తుటకు ప్రోత్సహించిరి. క్రీ.పూ.181.లో ఖారవేలుడు కన్నా బెన్నా వరకు పురోగమించి మూషక నగర ప్రజలను భయభ్రాంతులుగా నొనరించినారని 'హాతీ-గుంఫా' శాసనము తెల్పుచున్నది.

పశ్చిమ ప్రాంతమందున్న శాతకర్ణి ఈ ముట్టడిని ఎరంగి అపారసైన్యముతో ఖారవేలుని ముట్టడించి, ఓడించి తరమి వేసినట్లు 'చుళ్ళ-కళింగ జాతకమున' అశ్మక రాజ్యాధిపతియగు శాతకర్ణి కళింగా ధీశుని ఓడించినట్లు తెల్పుచున్నది.

శాతవాహన సైన్యములు కళింగసైన్యమును వెన్నంటి తూర్పు తీరప్రాంతము వరకు తరిమివేసెను. దీనితో శాతవాహన రాజ్యము తీరాంధ్రము వరకు విస్తరించెను.

శాతకర్ణి యావత్తు దక్షిణాపథులను ఓడించి ఖారవేలుని గెల్చి కప్పములు గ్రహించెను. ఈ యుద్ధ విజయానంతరము శాతకర్ణి రెండు అశ్వమేధ యాగములను, ఒక రాజసూయయాగమును నిర్వహించెను. ఈ అశ్వమేధయాగ నిర్వాహణా కాలమున క్రొత్త నాణెములను ప్రకటించెను.

శాతకర్ణి వైదికమత నిరతుడు. ఈతడు అగ్నియాధేయ, అనారంభనీయ, ఆప్తోర్యామ, త్రిరాత్రదశరాత్ర త్రయోదశ రాత్రాది యజ్ఞములొనర్చి గో, హిరణ్య, భూదానములను అనేక మంది బ్రహ్మణుల కొసంగెను.

ఇతని భార్య దేవీ-నాగనీక పతియొనర్చిన క్రతువులు నిర్విఘ్న పరసమాప్తి నొందుటలో తోడ్పడిన పతివ్రత ఆమె "యజ్ఞహత ధీపనసుగంధమా, ధీర్ఘవ్రత సుగంధమా"- అని వర్ణింపబడింది.

సువిశాల సామ్రాజ్యమును క్రీ.పూ.198 నుండి క్రీ.పూ.179 వరకు అత్యంత ప్రతిభావంతముగా పరిపాలించెను. ఇతనికి 1. హాకుసిరి 2. శతశ్రీమత్ 3. శాతవాహన 4. వేదశిరి అను నలుగురు కుమారులుండిరి.

వేదశిరి "పూర్ణోత్సంగుడు" అను పేర తండ్రి అనంతరము శాతవాహన సామ్రాజ్యాధినేత అయ్యెను.

## పూర్ణోత్సంగుడు :

శాతకర్ణి అనంతరము కుమారులు నల్గురు పిన్న వయస్కులగుట చేత శాతకర్ణి భార్యదేవీ నాగనీక తన తండ్రి 'మహారటి' త్రణకైరో సహాయమున పరిపాలనా బాధ్యతలు నిర్వహించెను. ఆమె మరణానంతరము నల్గురు కుమారులు వారసత్వమునకై తగువులాడినట్లు తెలియున్నది. వారు రాజ్యమును విభాగించుకొని పాలించిరి.

'పూర్ణోత్సంగుడు' 'పైఠాన్' (ప్రతిష్ఠాన పురము)ను, శతసిరి తూర్పు మాళవ రాజ్యమును, శిరి శాతవాహనుడు శూర్పారక రాజ్యమును ఏలినట్లు తెలుస్తుంది.

రాజకుమారుల అంతః కలహములు నూతగాగొని కళింగ ప్రభువగు ఖారవేలుడు, ఆంధ్ర సామ్రాజ్యముపై దండయాత్రలు నిర్వహించెను. క్రీ.పూ.179 సం || న భోజక, పిఠలికాదుల రాజ్యములను ఖరవేలుడు జయించి తన 11వ విజయ రాజ్య సంవత్సరమున ఆంధ్రదేశముపై దండెత్తి

క్రిష్ణనది పరీవాహ ప్రాంతమందున్న పిత్రుండ (ప్రతిపాలపురం, భట్టిప్రోలు) నగరమును నిర్మూలించి ఆ ప్రాంతములోని శాతవాహన రాజునోడించెను. గుంటుపల్లి శాసనమున ఖారవేలుడు మహిషకాధిపతియని కలదు. ఈతని దండయాత్రలో మెదకు- ధార్వార్- నిర్మల్- భైంసా, మొదలగు ప్రాంతములను పూర్ణోత్సంగుడు కోల్పోయెను.

ఈ విధముగా తీరాంధ్రమును, ఇతర ప్రాంతములను కోల్పోయి పూర్ణోత్సంగుడు క్రీ.పూ.161 వరకు తక్కిన భూభాగమును మాత్రము పాలించెను.

## స్కంధ స్తంభి :

స్కంధస్తంభి శాతకర్ణి క్రీ.పూ.161 లో రాజ్య పీఠమునలంకరించి 18 సం|| లు పాలించెను. 'మత్స్యపురాణం' ననుసరించి ఇతడు పూర్ణోత్సంగుని తర్వాత రాజైనట్లు తెలియుచున్నది.

ఇతని పరిపాలన విశేషములు తెలియుటలేదు. ఈతడు శత్రువులాక్రమించిన భూభాగము పోగా మిగిలిన రాజ్యమును క్రీ.పూ.143 వరకు పరిపాలించెను.

## రెండవ శాతకర్ణి :

ఈతని పరిపాలన కాలము క్రీ.పూ. 143 నుండి క్రీ.పూ.86 వరకు. ఇతడు అరవీర భయంకరుడు, గొప్ప పరాక్రమశీలి. ఈతని పేర ప్రకటింపబడిన నాణెములు ఇప్పటి మెదక్ జిల్లాలోనూ ఉత్తర తెలంగాణ ప్రాంతమునందును, మహారాష్ట్రము, మధ్యప్రదేశం మాళవములందు లభించినవి.

ఖారవేలుడు ఆక్రమించిన భూభాగములను తిరిగి తన సామ్రాజ్యములో చేర్చెను. అపరిమిత సైన్యమును సమకూర్చుకుని శక రాజులనోడించి, మగధ, కళింగాధి రాజులనోడించి, చక్రవర్తిగా కీర్తి వహించెను.

రెండవ శాతకర్ణి ఆస్థాని 'వాసిష్ఠీపుత్ర ఆనందుడు' ఇతడు గొప్ప శిల్పకళాభిజ్ఞుడు. సాంచీస్తూప దక్షిణ ద్వారము పై ఒక శాసనము చెక్కించెను. రెండవ శాతకర్ణి చక్రవర్తిగా కీర్తి వహించి 58 సం|| లు విశాల సామ్రాజ్యమును అప్రతిహతముగా పరిపాలించెను.

## లంబోదరుడు :

క్రీ.పూ. 86 లో రెండవ శాతకర్ణి అనంతరము 'లంబోదరుడు' శాతవాహన సామ్రాజ్యాధిపతి అయ్యెను. ఇతడి కాలమున శక, యవన, కళింగ, ప్రహ్లావాదులు శాతవాహన రాజ్యమునాక్రమించుకొనిరి. లంబోదరుడు వారి ఆక్రమణ ఆపలేని స్థితియందుండి పోగా మిగిలిన రాజ్యమును మాత్రమే పాలించెను. 18 సం || లు పాలించి అతడు క్రీ.పూ. 68 లో దివంగతుడయ్యెను.

## అపీలకుడు :

లంబోదరుని అనంతరము. అపీలకుడు క్రీ.పూ. 68 లో రాజయ్యెను. శకరాజులు ఉజ్జయినీ నగరమును ఆక్రమించుటకు దండెత్తిరాగా 'అపీలకుడు' తన సైన్యముతో వారిని ఎదిరించి ఓడించెను. ఈ విజయమును పురస్కరించుకొని క్రీ.పూ. 58 లో 'విక్రమశకము' ను ఏర్పాటు చేసెను. ఈ విషయమును 'కాలకాచార్య' కథ... అను జైన గ్రంథము ధృవీకరించు చున్నది. ఇతడు కొన్ని నాణెములు వెలయించెను. ఇతడు 12 సం|| లు పరిపాలించి క్రీ. పూ. 56 లో పరమపదించెను.

## మేఘ స్వాతి :

మేఘస్వాతి క్రీ. పూ. 56 నుండి క్రీ.పూ 38 వరకు పరిపాలించెను. మేఘస్వాతి వేయించిన నాణెములు మహారాష్ట్ర, మధ్య ప్రదేశ్ మొదలగు ప్రాంతములందు లభించినవి.

## స్వాతి శాతకర్ణి :

మత్స్య పురాణానుసారము స్వాతి శాత కర్ణి క్రీ.పూ.38 లో రాజై 18 సం||లు పాలించినట్లు తెలియుచున్నది.

## స్కంధ స్వాతి :

స్కంధ స్వాతి క్రీ.పూ. 20 లో రాజై 7 సం|| పరిపాలించినట్లు పురాణాలు తెల్పుచున్నవి.

## మృగేంద్ర స్వాతికర్ణ :

స్కంధ స్వాతి అనంతరము మృగేంద్రస్వాతి కర్ణ మూడు సంవత్సరాలు మాత్రమే పరిపాలించెను. ఇతని పాలన కాలము క్రీ.పూ 13 నుండి క్రీ.పూ 10.

## కుంతల శాతకర్ణి :

క్రీ.పూ .10 లో శాతవాహన రాజ్య సింహాసన మదిష్ఠించి, వంశగౌరవమును, కీర్తిని, కుంతల శాతకర్ణి ఇనుమడింప జేసెను. ఇతడు శక రాజులతో యుద్ధములు చేసి విజయుడయ్యెను. "వాత్స్యాయన కామ సూత్రములు" 'బృహత్కథ' 'కావ్య మీమాంస' గ్రంథములందు కుంతల శాతకర్ణి ప్రశంసింపబడినాడు.

(ఇతని ఆస్థానమున శర్వవర్మ, గుణాఢ్యుడు ఉన్నట్లు తెలుయుచున్నది. గుణాఢ్యునికి, శర్వవర్మకు సంభవించిన వాగ్వివాదము వలన శర్వవర్మ రాజును ఆరుమాసాలలో సంస్కృత పండితుని గావింతునని పల్కెను. అట్లు గావించినచో తను ప్రాకృత, సంస్కృత దేశభాషలను త్యజింతునని గుణాఢ్యుడు ప్రతిన పూనెను. శర్వవర్మ 'కాతంత్రము' అను వ్యాకరణమును రచియించి అనుకున్న కాలమునకే రాజును సంస్కృత పండితునిగా చేయగా, గుణాఢ్యుడు తన ప్రతినమేరకు సర్వభాషలను త్యజించి 'పైశాచి' భాషనభ్యసించి రక్తాక్షరముల తో భూర్జర పత్రములపై ఆ భాషలో 'బృహత్కథ' అను గ్రంధమును రచించి రాజునకంపెను.

సంస్కృత భాషా వ్యామోహముననున్న రాజు ఆ గ్రంధమును నిరాకరింపగా గుణాఢ్యుడు ఒక్కొక్క పత్రమునే అగ్నికి ఆహుతి చేయుచుండెను. రాజా విషయము నెరింగి గుణాఢ్యుడిని దర్శించి గ్రంధ దహనో-ద్యమమును ఆపివేసెను. అప్పటికే ఆరు 'లంబకము' లలో అయిదు అగ్నికి ఆహుతికాగా ఒక్కటి మాత్రమే మిగిలినది. దానిని సోమదేవసూరి 'కథా సరిత్సాగరము' గా అనువదించినాడు. ఈ బృహత్కథ ప్రపంచ కథా సాహిత్యమున మొట్టమొదటిది. దీనిని గుణాఢ్యుడు మెదక్ జిల్లాలోని 'కొండాపూర్' ప్రాంతమందు రచించెనని అందురు.

బుధ స్వామి ఈ గ్రంధమును 'బృహత్కథ శ్లోక గ్రంధముగను, క్షేమేంద్రుడు 'బృహత్కథా మంజరి'గా రచియించిరి.

ఇతని పరిపాలనా కాలము క్రీ.పూ. 10 నుండి క్రీ.పూ 2 వరకు.

## స్వాతి వర్ణ: (స్వాతి కర్ణ)

క్రీ.పూ. 2 వ సం || లో రాజై 'స్వాతి వర్ణ' ఒక్క సంవత్సరము మాత్రమే పరిపాలించగల్గెను.

## మొదటి పులోమావి :

శాతవాహన రాజులలో 'పులోమావి' 15 వ వాడుగా 'మత్స్యపురాణము' పేర్కొనుచున్నది. 'మత్స్యపురాణానుసారము' పులోమావి మగధను పాలించు సుశర్మను సంహరించి అతని రాజ్యమునాక్రమించి, పాలించినట్లు తెలియుచున్నది. ఇతడు శక రాజులనోడించి వారాక్రమించిన శాతవాహన రాజ్య భాగాలను తిరిగి సంపాదించి దేశమున శాంతిభద్రతలు ఏర్పరిచి విశాల సామ్రాజ్యాధినేతగా కీర్తి గడించెను.

'పులోమావి' యే పటుమావిగా పేర్కొన బడినాడు. ఇతడు 24 సం || లు పాలించినట్లు 'వాయుపురాణము' తెల్పుచున్నది. ఐనప్పటికి ఇతడు క్రీ.పూ. 1 నుండి క్రీ.శ. 35 వరకు అనగా 36సం || లు పాలించెను.

## గౌరికృష్ణ :-(అరిక్త వర్మ) :

క్రీ.శ.35లో శాతవాహన రాజ్యపీఠము నలంకరించిన గౌరికృష్ణుడు 25 సంవత్సరాలు పాలించెను. ఇతడు శక రాజులను యుద్ధము నందెదుర్కొనెను. వాయుపురాణము ఇతనిని 'నేమి కృష్ణుడు' గా వర్ణింపబడినది. ఇతని పరిపాలనా కాలము క్రీ.శ. 35 నుండి క్రీ.శ.60 వరకు.

## హాల శాతవాహనుడు :

క్రీ.శ. 60 లో శాతవాహన సింహాసన మధిష్టించెను. ఇతడు విజేత, సరసుడు. ప్రతిష్ఠాన పురము రాజధానిగా ఐదేండ్లు మాత్రమే రాజ్యభారము వహించినట్లు మత్స్యపురాణము తెల్పుచున్నది.

సింహళ రాజ కన్యను ఈతడు వివాహమాడెను. ఈతని కాలమున గాథాసప్తశతి సంతరింపబడినది. 'లీలావతి కావ్యము' అభిదాన చింతామణి' 'దేశీనామమాల' గ్రంథములు హాలుని కీర్తి ప్రతిష్టలు కొనియాడుచున్నవి.

శాతవాహన రాజన్యులలో సాహిత్య పోషకునిగా, మహాకవిగా, సంస్కృత, ప్రాకృత భాషలను అభిమానించు వాడుగా కీర్తివహించిన హాల చక్రవర్తి క్రీ.శ.60 నుండి క్రీ.శ.66 వరకు పరిపాలించెను.

## మందూలకుడు :

హాల శాతవాహనుని అనంతరము 'మందూలకుడు' రాజై క్రీ.శ.66 నుండి క్రీ.శ.70 వరకు పరిపాలన గావించెను. 'వాయుపురాణము' ఈతనిని 'మందలక' గా పేర్కొనినది.

## పురేంద్రసేనుడు :

ఇతడు 21 సం|| లు ఏలినట్లు 'వాయుపురాణం' తెల్పుచున్నప్పటికీ 5 సం || లు మాత్రమే పాలించినట్లు మత్స్యపురాణము పేర్కొనుచున్నది. మొత్తం పైన ఈతని పాలనాకాలము క్రీ.శ .70 నుండి 75 వరకు అని చారిత్రకుల విశ్వాసము.

## సుందర శాతకర్ణి :

సుందర శాతకర్ణిని వాయుపురాణము శాతకర్ణిగా పేర్కొన్నది. ఈతడు రాజ్యపాలనమునకు వచ్చునాటికి శక రాజులు శాతవాహన రాజ్యము లోనికి చొచ్చుకొని వచ్చి అనేక రాజ్యభాగముల నాక్రమించిరి.

క్షహరాట వంశీయులు భూమకుని నాయకత్వమున విజృంభించి, సౌరాష్ట్ర, మాళవ, భూభాగములను ఆక్రమించిరి. ఈ ప్రాంతములందు భూమకుని నాణెములు లభించినవి. భూమకుని తర్వాత రాజ్యమునకు వచ్చిన నహపాణుడు ఉత్తర కొంకణము, దక్షిణమాళవము, సౌరాష్ట్ర, గుజరాతు, రాజస్థానములను జయించి, విశాల సామ్రాజ్యమును నిర్మించెను.

మొదటి మాళవ, కొంకణ, అపరాంతములు శాతవాహన రాజ్యము నందుండేవి. వాటిని నహపాణుడు ఆక్రమించెను. దీనితో ఆంధ్రదేశము పైఠను ప్రాంతము మాత్రమే 'సుందరశాతకర్ణి' ఏలుబడిలో ఉండెను. శకరాజుల యుద్ధములను 'పెరిప్లస్' వర్ణించాడు ఇతడు దక్షిణాపథరేవు పట్టణములను వర్ణించుచు పెద్దసారంగేను కాలమున కళ్యాణిరేవు పట్టణము ఉన్నతస్థితిలో ఉండెననియు 'సాండేర్స్' కాలమున శకరాజులు ఈ ఓడరేవునకు వచ్చు ఓడలను అడ్డగించి మళ్ళించుకొని పోవుచుండిరని వ్రాసినాడు. 'పెద్దసారంగేనస్' అనగా రెండవ శాతకర్ణి అనియు సాండెర్స్ అనగా 'సుందర శాతకర్ణి' అనియు ఊహింపవచ్చును.

సుందరశాతకర్ణి పరిపాలనాకాలము ఒక్క సంవత్సరం మాత్రమే అది క్రీ.శ. 75-76.

## చకోర శాతకర్ణి :

చకోర శాతకర్ణి పరిపాలన,అర్థ సంవత్సరము మాత్రమే సాగినది.

## శివ పార్వతి :

క్రీ.శ .76లో శివపార్వతి సింహాసనా సీనుడయ్యెను మత్స్యపురాణమున 25 సంవత్సరాలు పాలించినట్లు 'వాయుపురాణము' న 18 సంవత్సరాలు పాలించినట్లు కలదు. ఇతడు 'క్షహారాట' శక, యవన, పల్లవులు, ఆక్రమించిన రాజ్యభాగములు పోగా తక్కిన రాజ్యభాగములు పాలించెను ఈతని పాలనాకాలము క్రీ.శ. 76-104.

## గౌతమీ పుత్ర శాతకర్ణి :

శాతవాహన రాజులలో గౌతమీపుత్ర-శాతకర్ణి గొప్పయోధుడు. క్రీ.శ. 104 లో సింహాసన మధిష్టించునాటికి ప్రతిష్ఠానపురము చుట్టుప్రక్కల భూభాగములు మాత్రమే ఇతని ఏలుబడిలో ఉండెను.

గౌతమీపుత్ర శాతకర్ణి తల్లి గౌతమి బాలశ్రీ ఆమె నాసిక్‌లో రెండు శాసనములను వేయించెను. ఈ శాసనములు గౌతమీపుత్ర శాతకర్ణి బలపరాక్రమములు, విజయములు, పాలించిన రాజ్యముల పేర్లు తెల్పుచున్నవి. ఇతని తనయుడు పులోమావి తన 19వ రాజ్య సంవత్సరాన వేయించిన శాసనమందు ఇతని ప్రశంసయున్నది.

గౌతమీపుత్ర శాతకర్ణి - 'ఏకబ్రాహ్మణుడు' 'క్షత్రియ-దర్పమాన దర్పితుడు' అను బిరుదములు కలవాడు అసిక, అశ్మక, ములక, విధర్భ రాజ్యములను జయించి, క్షహరాట వంశమును నిర్మూలించి, 'క్షహరాట వంశ నిరవశేష కర, అను బిరుదమును వహించెను 'జోగల్తంబ' ప్రాంతమున లభించిన 'నహపాణుని' నాణెములపై గౌతమీపుత్ర శాతకర్ణి తన విజయ చిహ్నములను, తన పేరును తిరిగి చెక్కించుటను బట్టి 'నహపాణుని' పై విజయము సాధించినట్లు భావింపవచ్చును.

గౌతమీపుత్ర శాతకర్ణి సామ్రాజ్యమున నాసిక, అస్సక (అశ్మక), అసిక, ములక, కకుర, సౌరాష్ట్ర, అపరాంత, అనూప, విధర్భ, అకర, అవంతి ప్రాంతములు ఉన్నట్లు తెలియుచున్నది. వింధ్య, అచీవతి పారియాత్ర అనగా వింధ్య పర్వతములు, ఆరావళీ పర్వతములు. పశ్చిమ కనుమలలోని సహ్యాద్రి పర్వతములు, నీలగిరులకు పడమరనున్న కృష్ణగిరి మలయపర్వతములు, మహేంద్రగిరి, చకోర పర్వతము (శ్రీశైలం శ్రేణులు), సెలుగిరి, సింకణ పర్వతములు-గౌతమీపుత్ర శాతకర్ణి రాజ్యముననె ఉండెను.

ఈతడు "త్రిసముద్రతోయ పీతవాహనా" అని బిరుదము వహించినట్లు శాసనముల వలన తెలియుచున్నది.

అనగా ఇతని రథాశ్వములు మూడు సముద్రాల నీరు త్రావినవనియూ, ఇతను త్రిసముద్రాధిపతి అనియూ శాసనములందు వర్ణింపబడినది.

గౌతమీపుత్రుడు వేయించిన నాణెములపై చిత్రింపబడిన ప్రతిమలననుసరించి ఈతడు దృఢకాయుడు, స్ఫురద్రూపి, అని భావించుటకు అవకాశమున్నది. ఇతడు అరివీర భయంకరుడైన సమున్నత శరీరము కలవాడు. విశిష్టమైన వ్యక్తిత్వము కలవాడు. ఇతని శాసనములందు. "సమరసిరసి విజితరిపు సంఘాతుడు", "ఉదారపాలకుడు" ప్రజల సుఖ దుఃఖములు తెలుసుకొనువాడు. వైదిక ధర్మ నిరతుడు, ఆగమనిలయుడు, అని వర్ణింపబడినాడు.

బ్రాహ్మణులనాదరించి, వేదవిద్యల పోషించెననియూ చతుర్విధ ఫలపురుషార్థసిద్ధిని పొందిన మహామనీషియనియూ శాసనముల వలన తెలియుచున్నది. ఇతని తల్లి గౌతమీబాలశ్రీ. ఆమె ప్రోత్సాహముచే బౌద్ధ సన్యాసులకు, శ్రమణులకు, ఈతడు దానములు ఒసంగెను. ఇతనికి "అవిపన్న మాతృ శుశ్రూషక" అను బిరుదము కలదు. ఇతని పరిపాలినా కాలమున రాజ్యము సమున్నతస్థితి యందుండి, ఆంధ్రుల సత్కీర్తి దిగంతముల వరకు వ్యాపించెను. ఇతని కాలమందు ఆంధ్రులు సముద్రయాన మొనర్చి, ప్రాక్పశ్చిమదేశములలో వ్యాపారమునొనర్చిరి.

గౌతమీపుత్రశాతకర్ణి పరిపాలన కాలము క్రీ.శ.104 నుండి క్రీ.శ.125.

## రెండవ పులోమావి :

గౌతమీపుత్ర శాతకర్ణి కుమారుడైన వాసిష్టీపుత్రపులోమావి క్రీ.శ.125లో రాజ్యాధికారము చేపట్టెను. బాలశ్రీ వేయించిన నాసికా శాసనమునందు ఇతడు దక్షిణాపథేశ్వరుడు అని వర్ణింపబడినాడు.

కొల్హాపురమున కురువంశీయుల మూడు తరముల శాసనములున్నవి. 1. వాసిష్ఠీపుత్ర విలివాయకుర, 2. మాఠరీపుత్ర శివలకుర. 3. గౌతమీపుత్ర విలివాయకుర అనువారు రాజశబ్ద వాచ్యులు వీరు శాతవాహన సామంత రాజులైయుండిరి తర్వాత కాలమున వీరు స్వతంత్ర రాజ్యమును స్థాపించి ధనుర్బాణ చిహ్నములైన నాణెములను ముద్రించిరి ధరణి కోటలో పులోమావి శాసనము ఒకటి లభించినది. ఇతని నాణెములు ఆంధ్రదేశమున వివిధ ప్రాంతములందు లభ్యమైనవి.

శాతవాహన సామ్రాజ్య పశ్చిమ భాగము లందున్న సామంతులు స్వతంత్రులగుట వలన పులోమావి వారిని ఎదిరింపజాలక తక్కిన రాజ్యభాగములను మాత్రమే పరిపాలించెను. ఇతని పాలనాకాలము క్రీ.శ.125 నుండి క్రీ.శ.153.

## శివశ్రీ :(మూడవ పులోమావి)

శివశ్రీ - మత్స్యపురాణమందు శివశ్రీగా; కన్హేరి శాసనమందు, వాసిష్ఠీ పుత్ర శాతకర్ణిగా ఛత్రఫణ శాతకర్ణిగా జునాగఢ్, శాసనమందు, శాతకర్ణిగా నాణెములపై వాసిష్టీపుత్ర శివశ్రీగా పేర్కొనబడినాడు.

ఇతడు రెండవ పులోమావి సోదరుడు, ఇతడు 'కర్దమ' వంశీయుడగు రుద్రదాముని కుమార్తె 'రుద్రదమనిక' ను వివాహమాడెను. తమ వంశస్థులు కోల్పోయిన రాజ్యభాగములను జయించుటకు రుద్రదామునిపై దండెత్తెను కాని ఆ యుద్ధమందు ఓడిపోయెను. ఈ విషయము రుద్రదాముడు వేయించిన జునాగఢ్ శాసనమున దక్షిణపథపతి యగు శాతకర్ణిని యుద్ధమందు ఓడించి తనకు సమీప బంధువగుట వలన వదిలివేసినట్లు వ్రాయనబడినది. ఇతని కాలము క్రీ.శ.153 నుండి 160.

## శివస్కంధ :

శివశ్రీ తర్వాత శివస్కంధుడు రాజైనట్లు మత్స్యపురాణమున కలదు. ఇతని కాలమున రుద్రదాముని సంతతి వారు శాతవాహన రాజ్య భాగములను ఆక్రమించిరి. ఇతడు క్రీ.శ.160 నుండి 167 వరకు పరిపాలించెను.

## యజ్ఞశ్రీ శాతకర్ణి :

మత్స్యపురాణమున యజ్ఞశ్రీ శాతకర్ణి 29 సంవత్సరాలు రాజ్యము పాలనమొనర్చినట్లు కలదు. చిన్న గంజాము, కన్హేరి, నాసిక్ శాసనములలో ఇతని పేరు గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి గా పేర్కొనబడినది.

బేరారు, కొంకణ, సౌరాష్ట్ర మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఆంధ్ర దేశమునందు ఇతని నాణెములు లభించినవి.

యజ్ఞశ్రీ శాతకర్ణి తన పూర్వులు కోల్పోయిన రాజ్యభాగములను తిరిగి సాధించి రాజ్యమును విస్తృత పర్చెను. క్షహరాట వంశీయులైన రుద్రసింహ, జీవదాసులు అధికారమునకై పరస్పరము కలహించుకొనుచున్న కాలమున యజ్ఞశ్రీ శాతకర్ణి సైన్యమును సమకూర్చుకొని, కొంకణ సౌరాష్ట్ర ప్రాంతములను జయించెను.

యజ్ఞశ్రీ శాతకర్ణి గొప్ప విజేత. శాతవాహన సామ్రాజ్య పూర్వ వైభవమును పునరుద్ధరించిన మహావీరుడు. ప్రపంచ ప్రఖ్యాతి వహించిన మహాయాన శాఖకు చెందిన ఆచార్య నాగార్జునుని ఇతడు ఆదరించి విజయపురిలో పారావత మహావిహారమును నిర్మించి బౌద్ధమతాభిమానమును ప్రకటించుకొనెను.

## యజ్ఞశ్రీ శాతకర్ణి :

త్రిసముద్రాధిపతి అని బాలకవి 'హర్షచరిత్ర' లో ప్రశంసింపబడినాడు. టిబెట్ చైనా చారిత్రికులు కూడా- యజ్ఞశ్రీ శాతకర్ణి నాగార్జునాచార్యునకు చైత్యాలయము మహావిహారము నిర్మించి ఇచ్చెననియూ ధాన్యకటక మహాస్తూప శిలాప్రాకారమును నాగార్జునాచార్యుడు నిలిపెనని తెల్పినారు.

శాతవాహన వంశీయుడగు యువరాజు ఆచార్య నాగార్జునుని సంహరించెనియూ దాని పరిణామముగనే దేశమున విప్లవమేర్పడెననియూ సామంతుల తిరుగుబాటుతో శాతవాహన రాజ్యము నిర్మూలన మైనదనియూ కథా సరిత్సాగర గాథ తెల్పుచున్నది.

శకులతో యుద్ధమందుమునిగియున్న శాతవాహన రాజులను లెక్కింపక సామంత మాండలీక రాజులు బలవంతులై స్వతంత్ర రాజ్యములను స్థాపించిరి ఇట్టి సమయమునందే యజ్ఞశ్రీ శాతకర్ణి దివంగతుడయ్యెను ఇతని పరిపాలన కాలము క్రీ.శ.167 నుండి క్రీ.శ 196.

## విజయశాతకర్ణి :

యజ్ఞశ్రీ శాతకర్ణి తర్వాత క్రీ.శ. 196లో విజయశాతకర్ణి శాతవాహన రాజ్యమును పరిపాలించెను. ఇతని కాలమున కుర, చుటు ఇక్ష్వాకు వంశీయులైన సామంత మాండలిక రాజులు శక్తి యుతులై స్వతంత్రులైరి. నాగార్జునకొండలో విజయశాతకర్ణి శాసనములు లభించినవి. ఇక్ష్వాకులు విజయపురి ప్రాంతమున తిరుగుబాటు చేయుట గమనించి విజయశాతకర్ణి విజయపురిలో కొంత కాలముండెను. ఆ కాలముననే ఇచట శాసనము వేయించి యుండును. ఇతడు క్రీ.శ.196 నుండి క్రీ.శ. 202 వరకు పరిపాలించెను.

## చంద్రశ్రీ :

విజయశాతకర్ణి అనంతరము చంద్రశ్రీ శాతవాహన సింహాసన మధిష్ఠించెను. ఇతడు ఆంధ్రదేశమును మాత్రమే పాలించెను. మిగిలిన శాతవాహన రాజ్యభాగములన్నియూ ఆన్యాక్రాంత ములయ్యెను.

చంద్రశ్రీ నామమాత్రపు చక్రవర్తిగా సామంతులపై అధికార దర్పము ప్రదర్శింపక 10 సం || లు పాలించెను. ఇతని పాలనాకాలము క్రీ.శ. 202 నుండి క్రీ.శ. 212. ఇతనితో శాతవాహన వంశపు ప్రధానశాఖ అంతరించినది.

## నాల్గవ పులోమావి :

"అన్యస్తేషాం", అని పులోమావిని పురాణములందు వర్ణించుటచే పులోమావి శాతవాహన వంశ ప్రధాన శాఖకు గాక మరియొక శాఖకు చెందిన వాడుగా భావింపవచ్చును.

"పులోమావి" వేయించిన శాసనమొకటి 'మ్యాకదోని' లో లభించినది. ఇతడు ధాన్యకటక ప్రాంతము నుండి జ్ఞాతులచే తరుమబడి నేటి బళ్ళారి ప్రాంతమందున్న శాతవాహన విహార పాలకునిగ 8 సంవత్సరములు పాలించెను. ఇతని కాలము క్రీ.శ.212 నుండి క్రీ.శ 219.

ఈ కాలముననే శాతవాహన సామ్రాజ్యమున వివిధ ప్రాంతములందు వేర్వేరు రాజులు పాలించినట్లుగా శాసనముల ద్వారా నాణెముల ద్వారా తెలియుచున్నది.

కన్హేరి శాసనమున మాఢరీపుత్రశకసేనుడు అని కలదు. ఇతడు శకశాతకర్ణి అని భావింపబడుచున్నాడు తీరాంధ్రమున 'శకసద' (శకశాతకర్ణి) నాణెములు లభించినవి.

# శాతవాహనుల కాలమున ప్రజాజీవనము - సంస్కృతి

మెదక్ జిల్లా- అశ్మక దేశముగా శాతవాహనుల కాలమున పిలువబడినది. అశ్మకము శాతవాహనుల ఏలుబడిలో ఉన్నట్లుగా చరిత్ర తెలియజేయుచున్నది. కావున నేటి మెదక్ జిల్లా శాత వాహనుల ఏలుబడిలోనున్నట్లు స్పష్టమగుచున్నది.

ఆనాటి ప్రజల ఆచార వ్యవహారములు సాంఘిక జీవనము, కళాపోషణము, భాషావికాసము, మతము, మొదలగు విషయములను తెలుసుకొనుటకు నాటి శాసనములు, గుహాలయములు, దేవాలయ శిల్పము, గ్రంథములు ముఖ్యమైన ఆధారములు.

శాతవాహనుల కాలమున 'విక్రమాదిత్య' శకము క్రీ.పూ. 58 లో ప్రారంభింపబడినది. 'శాతవాహనశకము క్రీ.శ. 78లో ప్రారంభమైనది. నేటికిని శాతవాహనశకము బహుళ ప్రచారములోనున్నది.

## పరిపాలనా విధానము

శాతవాహన రాజులు సమర్థులైన పాలకులు వీరి రాజ్యము పశ్చిమ మోత్తరమున పుష్కర తీర్థము నుండి ప్రాగ్దక్షిణమున కడలూరు వరకు ప్రాగుత్తరమున కళింగ పట్టణం నుండి పశ్చిమ దక్షిణములందు వైజయంతి వరకు వ్యాపించి యుండెను.

శాతవాహనుల కాలమున రాజు సర్వస్వతంత్రుడు వారసత్వం పురుషులకు సంక్రమించు చుండెను. రాజుకు సంతానము లేకున్నచో లేదా పిన్న వయస్కులైన సంతానంకలచో రాజు తమ్ముడు గానీ, రాజకుమారుని తల్లిగాని రాజ్య భారము వహించుచుండిరి.

రాజకీయ వ్యవహారములందు స్త్రీలు కూడా ప్రధాన పాత్ర వహించుచుండిరి.

రాజధర్మములు ప్రజానుకూలముగ ఉండెడివి. వీరు కౌటిల్యుని 'అర్థశాస్త్రానురీతి' లో సుంకములను వసూలు చేయుట సక్రమ పద్ధతిలో ప్రజాధనమును వ్యయం పరుచుట ఉపద్రవములు వాటిల్లకుండ చూచుట, వర్ణాశ్రమ ధర్మాలను కాపాడుట వర్ణసంకరము కాకుండా చూచుట ప్రజలు గౌరవ జీవనము గడుపునట్లు పరిపాలన మొనర్చిరి. పాలనా సౌలభ్యమునకు సామ్రాజ్యమును 'రాష్ట్రము' లు (ఆహారము)గ విభజించిరి. అందు అసిక, అసక (ఆశ్మక) మూలక, సురట, కకుర, అపరాంత, అనూప, విధర్భ, అకర, అవంతి, వైజయంతి మొదలగు రాష్ట్రములు ముఖ్యమైనవి.

రాష్ట్రములను పాలించుటకు రాజప్రతినిధులు నియమింపబడుచుండిరి. పరరాజులను జయించి వారిని సామంతులుగ స్వీకరించు చుండిరి. సామంతులకు మహారథి, 'మహాభోజాధి' బిరుదములు ఇచ్చుచుండిరి. వీరి స్త్రీలు మహారథిణి, మహాభోజిణి, అను బిరుదములను ధరించుచుండిరి.

'మెగస్తనీసు' మగధరాజ్యము తర్వాత ఆంధ్ర రాజ్యము ఎన్నదగినదనియూ ఆ రాజులు 30 దుర్గములు, లక్ష కాల్బలము, 2 వేల గుఱ్ఱపు దళము వేయిగజ సైన్యము కల్గియుండిరనియూ ప్రజలు ప్రభువును గౌరవించు చుండిరనియు. ఇండికా గ్రంథమున తెల్పెను.

శాతవాహనుల కాలమున పట్టణములను నగరముల నిగమములని పిలిచెడివారు. నగర పాలనను రాజాధికారమునకులోబడి, విశేషాధికారములు పొందిన పౌరసంఘము నిర్వహించుచుండెను.

రాజు నుండి అధికారం పొందిన నాగరికుడు అను ప్రభుత్వోద్యోగి నగరపాలన బాధ్యతలు స్వీకరించి ప్రజలకు సదుపాయములు ఏర్పరచుచుండెను. ఈ విధంగా నగరములకు ప్రత్యేక పాలనా వ్యవస్థ ఉండేది.

సామ్రాజ్యమున నిగమములు (నగరములు) గాక 1. ఆహారములు 2. రాష్ట్రములు 3. జనపదములు ఉండెను. ఒక్కొక్క ఆహారమునకు ఒక్కొక్క పాలకుడు ఉండెను. మహామాత్య, అమాత్య, సేనాపతి, మహాతారక, క్రమ నిబంధకార, అను ప్రభుత్వోద్యోగులు పాలనా వ్యవహారములు సల్పుచుండిరి.

శాతవాహనాహారము, మామాలహారము గోవర్ధనహారము అను ఆహారములు శాతవాహన రాజ్యము నందుండెను.

జనపదమును, గుమిక (గ్రామము) అనేడివారు గ్రామమునకు గ్రామిక (గ్రామిణి = గ్రామాధికారి) పాలన చేయువాడు. గ్రామ పంచాయితీలు, గ్రామ సభలు వ్యక్తి హక్కులను రక్షించుచు, ప్రజాక్షేమము చేయుచుండెను.

భూమిపై సమిష్టి యాజమాన్యము ఉండెను వ్యక్తిగత కుటుంబ వ్యవసాయము ప్రజలకు అనుకూలముగ నుండెను. గ్రామాధికారులు రైతుల నుండి పన్నులు సకాలమున వసూలుచేసి ప్రభుత్వమునకు చెల్లించు చుండిరి సంతపన్ను చేపలు పట్టు పన్ను బంజరు భూములపై హక్కు ప్రకృతి సంపద కేంద్ర ప్రభుత్వ ఆధీనములో ఉండెడిది.

రాజాజ్ఞలననుసరించి రాష్ట్ర పాలకులుగ అమాత్యులు పరిపాలించుచుండిరి. మొత్తము సామ్రాజ్యమునకు మహాసేనాధిపతి పదవి ముఖ్యమైనది ఇతడు రాజ్యాంగ వ్యవహారములు నిర్వహించుటలో ప్రధాన పాత్ర నిర్వహించుచు రాజునకు అంతరంగిక కార్యదర్శిగా వ్యవహరించుచుండెను.

శాతవాహనుల సామ్రాజ్యమునందు వివిధ భాషలు మాట్లాడు ప్రజలుండిరి. అందు ఆంధ్రులు, మహారాష్ట్రులు, ద్రావిడులు, ఘూర్జరులు కళింగులు, కన్నడులు, శక యవన, పహ్లవాదులు కలిసి మెలసి సహజీవనము సాగించుచుండిరి.

## మతము

ఈ సామ్రాజ్యమున వైదిక జైన బౌద్ధమతములు వ్యాప్తిలోనుండెను. కాళిదాసు రఘువంశ మహాకావ్యమున శాతకర్ణి అను బ్రాహ్మణఋషి పేర్కొనబడినాడు. అతని సంతతివారే శాతవాహనులు కావచ్చును. శాతవాహనులు బ్రాహ్మణులు.

గౌతమీపుత్ర శాతకర్ణి క్షత్రియదర్పమాన మర్ధనుడని ఏక బ్రాహ్మణుడని నాసిక్ శాసనమందు వర్ణింపబడినాడు.

**వైదికము :**

శాతవాహనులు వైదిక మత నిరతులు యజ్ఞయాగాది క్రతువులు అనేకములు చేసినవారు. రాజుల పేర్లయందు వైదికమత సంబంధము కలదు. ఆనాడు మానవ జీవితమున షోడష సంస్కారముల ప్రాధాన్యత ఎక్కువగా కలదు.

జీవన కాలమున జరిపించు 15 కర్మలను పంచదశ కర్మలు అందురు మరణించిన పిదప చేయుకర్మను 'షోడశకర్మ' అందురు.

**పంచదశ కర్మలు :**

1. గర్భాధానము
2. పుంసవనం
3. సీమంతోన్నయనం
4. జాతకర్మ
5. నామకరణము
6. అన్నప్రాశనం
7. చౌలం
8. ఉపనయనము
9. ప్రాజాపత్యం
10. సౌమ్యం
11. ఆగ్నేయం
12. వైశ్వదేవం
13. సమావర్తనం
14. వివాహం
15. దేవయజ్ఞం.

వీటిలో 1 నుండి 8 వరకు అనగా గర్భాధానాది ఉపనయనపర్యంతం (ఏతాని పితృకర్మకానీ) పితృకర్మకములుగా 9 నుండి 12 వరకు ఆచార్య కర్మకములుగా చెప్పబడినవి 16 వ కర్మ పితృ యజ్ఞముగా పేర్కొనబడుచున్నది. ప్రజలు దైవపూజలు చేయుచు భక్తి ప్రపత్తులు కలిగి యుండిరి. శాసనములందు అష్టదిక్పాలకాది దేవతలకు నమస్కారములు చెప్పబడినవి. హాల చక్రవర్తి గాధాసప్తశతి యందలి ప్రజల సాంఘికాచార వ్యవహారములు చూడగా నాటి ప్రజలు దారునిర్మిత ఇంద్ర ప్రతిమలను పూజించుచుండెడి వారని తెలియుచున్నది. శివ విష్ణువుల ఆరాధన, రాధాకృష్ణుల ప్రేమగాథలు, కృష్ణుని లీలలు ఆనాడు వ్యాప్తిలో నుండెను.

క్షీరసాగర మథనము, లక్ష్మీ జననము, వామన చరిత్ర, బహుళ ప్రచారములో నుండెను. శివారాధకులు కూడా నుండిరి. శివాలయములు నిర్మింపబడి పూజింపబడు చుండెను. శివ పార్వతులప్రణయము, దక్షయజ్ఞధ్వంసము, శివ లీలలు వ్యాప్తి యందుండెను. చరకులను సన్యాసులు సోపార, సువర్ణముఖి, గోవర్ధన, ప్రాంతములందు మత ప్రచారము గావించుచుండిరి. శైవులలో పాశుపతులు, కాపాలికులు ఉండిరి.

శ్రీముఖుని కుమారుడైన మొదటిశాతకర్ణి వైదికమత నిరతుడు. అతడు అగ్న్యాధేయ, అనారంభణీయ భగలాదశరాత్రగర్గత్రి రాత్ర, గవామయన, ఆప్తుర్యామ. అంగీరసామయన, శతాతిరాత్ర, అంగిరసత్రిరాత్ర, చందోమపవమాన, త్రి రాత్రాధి క్రతువులు నాచరించెను. రెండు అశ్వమేధములేగాక రాజసూయయాగమును కూడా చేసెను. బౌద్ధమత విజృంభణమున అడుగంటిపోవుచున్న వైదికమతము నుద్ధరించుటకై పూనుకొనెను.

గౌతమీపుత్ర శాతకర్ణి వైదికమతోద్ధారకుడు అతడు ఇతని తల్లి బాలశ్రీ వేయించిన నాసిక్ శాసన మందు ఈ రాజు 'ద్విజవర కుటుంబ వర్ధనుడు' అని 'ఆగమునిలయుడు' అని 'ఏక బ్రాహ్మణుడు' అని 'వర్ణాశ్రమధర్మ- పరిత్రాత' యని వర్ణింపబడినాడు.

క్రీ.శ.1వ శతాబ్దంతో బౌద్ధమతము విశేషంగా వ్యాప్తి చెందింది. ఈ సమయమున విదేశీయులైన శక, యవన, పహ్లవాదులు రాజ్యములు నెలకొల్పి, వివిధమతములు అనుసరించిరి. బౌద్ధమత వ్యాప్తి, వైదిక మత క్షీణతకు, దారి తీసినది. శక యవన, పహ్లవాదులు, జైన, వైదిక, బౌద్ధ మతావలంబ కులైనారు. కావుననే గౌతమీపుత్ర శాతకర్ణి వైదిక మతోద్ధరణకు కంకణము కట్టుకొనెను.

నానేఘాట్ శాసనము వలన మొదటి శాతకర్ణి భార్యదేవీ నాగనీక, తన భర్త చేయు దానములకు తోడ్పడెను ఆమె మాసోపవాసిని, గృహతాపసి, చరిత బ్రహ్మచర్య, దీక్షాతతశీల, అని వర్ణింపబడెను.

గౌతమీబాలశ్రీ నాసిక్‌శాసనమున "సత్యవచన దాన, క్షమ, అహింసానిరత, తప, దమనియమోప వాసతత్పర రాజర్షి వధూలక్షణ సమన్విత" అని ప్రశంసింపబడినది.

## బౌద్ధం

ఆంధ్రులలో బౌద్ధమతాన్ని అనుసరించి స్వీకరించినవారున్నారు. బౌద్ధారామ విహారాలు, చైత్యాలయాల నిర్మాణాలకు ఆంధ్రులు సహకరించినారు. బౌద్ధ గ్రంథములు అనేకములు రచింపబడినవి.

## జైనం

శాతవాహనుల కాలమున వైదిక, బౌద్ధ మతాలతో పాటు జైన మతము ఆంధ్రదేశమున వ్యాపించి యుండెను.

మెదకు జిల్లాలో బౌద్ధమతం కన్నా జైన మత వ్యాప్తియే ఎక్కువగా యున్నట్లు చారిత్రక ఆధారములు ఉన్నవి. మెదక్ జిల్లాలోని 'పోట్లచెర్వు', 'కోలాచలము' నందలి త్రవ్వకములలో మహావీరుని ప్రతిమలు జైన సంప్రదాయ విగ్రహములు వెలువడినవి. కోలాచల మునందువెల్వడిన మహావీరుని విగ్రహము పొడవు 8 అడుగులు. జోగిపేట జైన జోగులకు నిలయము అచట ఒక పెద్ద జినాలయము ఉన్నదన్నట్లుగా ఒక ఐతిహ్యము కలదు. అది రానురాను జోగినాథేశ్వర ఆలయముగా మారినది.

అల్లాదుర్గము మొదలగు ప్రాంతములందును, మెదక్ జిల్లాకు అనుకొనియున్న కొలను పాకలో బ్రహ్మాండమైన జైన దేవాలయం కలదు వీటన్నింటిని పట్టి చూడగా - మెదక్ జిల్లాలో శాతవాహనుల రాజన్యుల కాలంలో జైనమతం చక్కగా పోషింపబడినదని చెప్పవచ్చు.

# సారస్వతము

శాతవాహనరాజులు కవి, పండితులను పోషించి లలిత కళలను ఆరాధించిరి. ముఖ్యముగా వీరి కాలమున ప్రాకృత సంస్కృత భాషలు ఆదరింపబడినవి. రాజులేకాక ధనికులు, సామాన్య ప్రజలు కూడి పండితులను ఆదరించి, పోషించిరి. ఆనాటి కవులలో హాలచక్రవర్తి ఎన్నదగిన రాజకవి.

## గాథాసప్తశతి

హాలశాతవాహనుడు స్వయముగా కవి పండితుడు. అతని ఆస్థానమందు అనేక కవులుండిరి. వారందరు ఉత్తమ కావ్య రచనా ధురీణులైయుండిరి. వివిధ దేశములనుండి వచ్చి కవులు హాలుని ఆస్థానమున తమ కవితలు విన్పించుచుండిరి. హాలుని ఆస్థానమందున్న శ్రీపాలితుడను కవి కవుల కవితల నుండి 700 గాథలను సేకరించి హాలుని పేర గాథాసప్తశతి రూపొందించెను. హాలుడు స్వయముగా రచించిన కథలు కూడా ఇందు కలవు.

శృంగార రస ప్రధానము గాథాసప్తశతి. హాలుని పట్టపురాణి మలయవతి మంచి పాండిత్యము గలది. 'గాథాసప్తశతి' లో 350 మంది కవులు రచనలున్నవి. అమిత అనురాగ అహకాది, కవులు, హాల హారకుంతాది రాజకవులు అనులక్ష్మి, అనులబ్ధ, రేనవంటి కవయిత్రులు ఉన్నారు.

ప్రకృతి శోభ, గ్రామీణ వాతావరణము శివపార్వతుల, లక్ష్మీనారాయణుల విపరీత రత్యాద్యవస్థలు ఈ గాథలందు వర్ణింపబడినవి.

హాలునకు, కవివత్సలుడు అన్న బిరుదు కలదు. గాథా సప్తశతి ముక్తక కావ్య సంగ్రహము. ప్రాకృత భాషలో ఛందో నిబద్ధ రచన. దీనిని అమరకుడు, అమరకము అనుపేర గోవర్ధనాచార్యుడు ఆర్యాసప్తశతి అనుపేర, విహారమిశ్ర విహార సతసయి అనుపేర సంతరించినారు. కాలబాలదేవ గంగాధర భట్టు భట్టశ్రీ మధురానాథశాస్త్రి మొదలగువారు గాథాసప్తశతికి టీకలు వ్రాసినారు.

సప్తశతిలో గ్రామీణుల జీవనవిధానము ఆచార వ్యవహారాలు, పల్లెపడుచుల, యువకుల ప్రణయ విషయములు, జ్యోతిష్య ప్రకృతి వర్ణనలు, నీతి సూక్తులు, శృంగార రస సరసగాథలు ఉన్నవి.

## బృహత్కథ :

శాతవాహనుల కాలము వెలసిన మరొక అపురూపు గ్రంథం 'బృహత్కథ'.

బృహత్కథ వెలువడుటకు వెనుక లోకమున ఒక ఐతిహ్యము కలదు.

జలక్రీడల సమయమున రాజు తన రాణులపైన నీళ్ళు చిమ్ము చుండగా - అందొకరాణి ఆ బాధ కోర్వలేక మోదకైర్దేవ- పరితాడయ (దేవా! నీళ్లతోనన్ను కొట్టకుము) అని సంస్కృతమందు పలుకగా - ఆ మాటను అపార్థం చేసుకొని రోజు మోదకములు తెప్పించెను, 'మా+ఉదక' శబ్ద సంధిని ఎఱుంగని మూర్ఖుడవని రాణి రాజును పరిహసించెను. రాజు అవమాన భరితుడై యుండగా శర్వవర్మాది మంత్రులు అతనిని అనునయించుటకు వచ్చిరి రాజు వారలతో ఎంత కాలములో నేను సంస్కృత భాషలో పండితుడను కాగలని అడుగగా గుణాఢ్య పండితుడు 12 సంవత్సరాలలో సంస్కృత భాషా కోవిదుని గావింతునని పల్కెను. అప్పుడు శర్వవర్మ రాజును తాను 6 మాసాలలో సంస్కృత పండితుని చేతునని పలికెను. శర్వవర్మ అట్లు చేసినచో తాను సంస్కృత ప్రాకృత దేశభాషలను త్యజింతునని గుణాఢ్యుడనెను. అందుకు శర్వవర్మ తన ప్రతిజ్ఞను నెరవేర్చకున్న తాను 12 సంవత్సరములు గుణాఢ్యుని పాదుకలు మోయుదునని పలికెను.

ఆ పంతం ప్రకారం - శర్వవర్మ కుమారస్వామిని ఆరాధించి కాతంత్రము అను వ్యాకరణము రచించి రాజును ఆరు మాసాలలో సంస్కృత భాషా పండితుని కావించెను. రాజు శర్వవర్మకు అగ్రహారముగ "భరుకచ్ఛనగరము" ఒసగిసన్మానించెను.

ప్రతిజ్ఞ ప్రకారం గుణాఢ్యపండితుడు సంస్కృత ప్రాకృత దేశ భాషలను త్యజించి అడవికేగి పైశాచిక భాషను అభ్యసించి రక్తాక్షరములతో భూర్జర పత్రములపై పైశాచీ భాషలో బృహత్కథను రచించి రాజునకు పంపెను రాజు ఆ గ్రంథమును నిరాకరించుటచే గుణాఢ్యుడు లిఖిత గ్రంథ పత్రములనొక్కొక్కటే చదివి అగ్నికి ఆహుతి కావించుచుండెను.

రాజునకు గ్రంథ దహనము తెలిసి స్వయముగా వచ్చి మాన్పించెను. అప్పటికే బృహత్కథ లోని ఆరు లంబకములలో ఐదు అగ్నికి ఆహుతికాగా ఒకటి మాత్రమే మిగిలెను దానిని సోమదేవసూరి, కథా సరిత్సాగరము గా సంస్కృతీకరించెను.

ఆచార్యగోవర్ధనుడు వ్యాసమహర్షికి గుణాఢ్యునిగా జన్మించెనని తెల్పెను.

ఇంత కథకు ఈ బృహత్కథకు వేదికమెదకు జిల్లాలోని కొండాపురం ప్రాంతము. కొండాపుర ప్రాంతముననె గుణాఢ్యపండితుడు 'బృహత్కథ' ను రచించెనని అందురు.

ఈ గ్రంథ మాతృక మృగ్యము క్రీ.శ. 9 వ శతాబ్దం ముందు బుధస్వామి 'బృహత్కథ' శ్లోక సంగ్రహమును రచించెను.

క్షేమేంద్రుడు ఈ గ్రంథమును 'బృహత్కథా మంజరిగా' సంస్కృతీకరించెను. క్షేమేంద్రుడు కూడా ఈ ప్రాంత వాసియే అని కొందరందురు.

## లీలావతి కావ్యము

మహారాష్ట్ర ప్రాకృతములో రచించిన గ్రంథము లీలావతి కావ్యం. 1800 ల అనుష్టుప్ శ్లోకములతో శృంగార వర్ణనలిందు కలవు. ఈ కావ్యమును కుతూహలుడు అను కవి రచించెను. ఇతడు బ్రాహ్మణుడు వేద వేదాంగ విదుడైన భూషణభట్టు కుమారుడు ఇతని తాత అధీత వేదత్రయుడైన బహుళాదిత్యుడు. బహుళాదిత్యుని భార్య సావిత్రి. భర్తనొక దివ్య మానవ గాథను ప్రాకృతమున చెప్పుమని కోరెను. బహుళాదిత్యుడు లీలావతిగాథను చెప్పెను.

లీలావతి సింహళరాజ కుమార్తె ఈమెనుహాల శాతవాహనుడు ద్రాక్షారామపరమేశ్వరాలయమున వివాహమాడెను. ఈ విషయమే ఈ కావ్యమందు వర్ణింపబడినది.

## వాత్స్యాయనీయము

వాత్స్యాయనుడు అనునాతడు ఈ గ్రంథమును రచించెను. ఇందు కామకళకు సంబంధించిన విషయములు కలవు. తమకు పూర్వమందున్న కామకళాచార్యుల మతములను విమర్శించి మానవ జీవితము సుఖసంతోషముల నందుటకు వాత్స్యాయనుడు ఈ గ్రంథమును రచించెను. దీనికి వివిధ భాషలలో సెక్కు అనువాదములు వెలువడినవి.

యశోధర మహారాజు కామసూత్రములకు జయమంగళ వ్యాఖ్యానమును రచించెను. వీరభద్రుడను పండితుడు క్రీ.శ. 15 లో కందర్ప చూడామణి అను వ్యాఖ్య రచించెను. క్రీ.శ.1789 లో భాస్కర సింహ కామసూత్రములకు వృత్తిని వ్రాసెను.

## ఆచార్య నాగార్జునుడు

మహాయాన బౌద్ధమతమునకు నూతన వికాస ఉత్తేజములను కల్పించిన మహామనీషి ఆచార్య నాగార్జునుడు మాధ్యమిక వాదమును మనదేశమునందే కాక ఖండాంతరములందు కూడా వ్యాప్తి చెందించుటలో మూల పురుషుడీతడు.

గౌతముడు తన తర్వాత 600 ఏండ్లకు నాగాహ్వయుడుగా జన్మించునని చెప్పినట్లు 'లంకావతార' సూత్రమందున్నది.

ఏడవయేట గండమున్నదని జ్యోతిష్కులు చెప్పుట వలన నాగర్జునుడు సన్యసించెనని అందరు. వైదికమత నిరతుడైన నాగార్జునుడు రాజాంతః పురమునకు వెళ్లివచ్చుచు పట్టుబడగా ఆగండము నుండి బయటపడినచో సన్యసింతునని ప్రార్థన మొనర్చిరాజదండనకు గురికాకుండా బయటపడి సన్యసించి అర్జునవృక్షము క్రింద తపమాచరించి నాగార్జున నామమున సిద్ధిగాంచెను.

బౌద్ధమత స్వీకారనంతరము తపమొనర్చి కాంచి నగర తారాదేవి ఉపాసనము సిద్ధిపొంది మహిమాన్వితుడయ్యెను. తంత్రశాస్త్రము మయూర విద్య స్వర్ణమాయా విద్యలను రసవాద విద్యలను మహానాగబోధిసత్వ వజ్రసత్వ, బుద్ధ అమితాదుల వలన తత్త్వోపదేశము పొంది సింహళము పోయి ప్రజ్ఞాపారమిత సూత్ర వైపుల్య 'సూత్ర గ్రంథము'లను, ధాతువుతో కూడిన కరిండికను సంపాదించి యజ్ఞశ్రీ శాతకర్ణి నిర్మించి ఇచ్చిన పారావత మహా విహారమున నివసించి మత ప్రచారమును ఒనర్చెను.

పారావత మహావిహారము 5 అంతస్థులవే 15 వందల గదులు కలది.

మొదటి అంతస్థు ఆరామము 500 గదులతో గజాకారములో ఉండును రెండవది 400 గదులలో 'సింహాకారము'లోను, మూడవ అంతస్థు 300ల గదులతో 'హయాకారము'లో కలదు . నాల్గవ అంతస్థు 200 ల గదులతో వృషభాకృతిలో, ఐదవ అంతస్థు 100 గదులతో కపోతాకృతిలో కలదు. దీనిపై జలాశయము నిర్మింపబడినది.

ఫాహియాన్ అను చైనా యాత్రికుడు ఈ విహారమును 'పోలోయీ' అని పిలిచెను. ఏడవ శతాబ్దమున భారతదేశమును సందర్శించిన హ్యుయాన్‌త్సాంగ్, శాతవాహన మహారాజు ఆచార్య నాగార్జునికై "పోలొమొలాలకీలిలో" నున్న సంఘరామమును నిర్మించెననియూ, అందు ఇదంతస్థుల భవనము ముఖ్యమైనదనియూ విహారములు చతుశ్శాలలనియూ- ప్రతి విహారము నందు బంగారపు బుద్ధ విగ్రహములుండెననియు చివరి అంతస్థులో బౌద్ధమత గ్రంథములు, క్రింది అంతస్థులో వంట భోజన సామాగ్రి ఉండెననియూ ఆ విహారమున బౌద్ధ ఉపాసకులు నివసించుచుండెడి వారనియు దానిని పారావత విహారము లేక పర్వత సంఘారామము లేక శ్రీ పర్వతము లేక నాగార్జున కొండ అని అందురనియు తెల్పెను.

నాగార్జునాచార్యుడు - రసాయన శాస్త్రజ్ఞుడు పాదరసము, వజ్రమును శుద్ధి చేసి ఔషధములు తయారు చేసి రోగము నయము చేయుటలో సులభం చేసెను. రసరత్నాకరము అను గ్రంథమును రచించెను. మూలకముల పరిశోధన చేసి కాయకల్ప చికిత్స వలన దీర్ఘకాలము జీవించునట్లు చేసెను. తాను ఆ ఔషధమును సేవించి చాలా కాలము జీవించెను శుశ్రుతుడు రచించిన శుశ్రుత గ్రంథమును సంస్కరించెను. కక్ష్యపుట తంత్రము, ఆరోగ్యమంజిరి వంటి గ్రంథములు రచించెను.

విష వైద్యం, నేత్రవైద్యం రోగములకు సంబంధించిన చికిత్సలను చేయు పద్ధతులను శిలా స్తంభములపై చెక్కించెను.

బౌద్ధమత గ్రంథాలను చెక్కించిన స్తంభములను అనేక ప్రాంతములందు నాటించెను.

నాగార్జునాచార్యుని శూన్యవాదము ఆదిశంకరుల మాయావాదమునకు దారి చూపించెను.

నాగార్జునాచార్యుడు రచించిన అనేక గ్రంథములలో కేవలం 24 గ్రంథములు లభించినవి. ఇవి టిబెట్, చైనా భాషలలోకి అనువదింపబడినవి.

1. ప్రజ్ఞాపారమిత శాస్త్రము
2. ప్రజ్ఞమూల శాస్త్రటీక
3. ప్రజ్ఞా ప్రదీపశాస్త్రకారిక
4. మూలమాధ్యమిక శాస్త్రము
5. శూన్యసప్తాది .
6. మధ్యాంతాను గమనశాస్త్రము
7. దశభూమి విభాసాశాస్త్రము
8. ద్వాదశవికార శాస్త్రములు
9. సమానశాస్త్రము
10. ప్రమాణ వివేచనము
11. ఉపాయకౌశల్య హృదయ శాస్త్రము
12. విగ్రహ వ్యావర్తిని మొదలగునవి ముఖ్యమైనవి.

శాతవాహనరాజులకు నాగార్జునాచార్యుడు వ్రాసిన లేఖను 'సహృల్లేఖ' అందురు. అశ్వఘోషుని ప్రశంస నాగార్జునాచార్య గ్రంథ ములందు కన్పించుచున్నది. కనుక ఈ ఆచార్యుని కాలము క్రీ.శ.137 నుండి 194.

# శాతవాహనుల నాటి సాంఘిక పరిస్థితులు

మానవుల సమిష్టినే సంఘము అందరు. మానవుల సమిష్టి జీవనమునే సంఘ జీవనము అందరు. మానవ సంఘమునందలి ఆచార వ్యవహారములు, మతము, ఆర్థికస్థితి, రాజకీయస్థితి, కళలు ఆటపాటలు మొదలగు విషయములను తెల్పునది సాంఘిక శాస్త్రము.

శాతవాహనుల కాలమున ప్రజాసాంఘిక జీవనము ప్రశాంతముగా ఉండినట్లు అగుపడుచున్నది. బ్రహ్మక్షత్రియ, వైశ్య శూద్రులను చాతుర్వర్ణ్య వ్యవస్థ ఉండెను. హాలిక, మహార్థక, గోళకాది శాఖలు చతుర్థకులము నందుండెను. బ్రహ్మచర్య, గార్హస్థ్య వానప్రస్థ సన్యాసములనబడు ఆశ్రమ ధర్మములు ప్రవర్తిల్లుచుండెను.

రాజులు వర్ణాశ్రమ ధర్మములను రక్షించుచుండిరి. వైదిక, బౌద్ధ, జైన మతానుయాయులు మతసామరస్యముతో సహజీవనము గడుపుచుండిరి.

గౌతమీపుత్ర శాతకర్ణి రాజసూయాది అశ్వమేధాది యజ్ఞములొనర్చిన మహానీయుడు. ఆ కాలముననున్న సామంతరాజులైన క్షహరాటులు, శకులు, పహ్లవులు మొదలైన రాజన్యులు వైదికమతావలంబులై యుండిరి. నహపాణుని అల్లుడు ఉషవదత్తుడు. అతడు బ్రాహ్మణులకు భూ, సువర్ణదానములు ఒసంగెడువాడు. శకరాజులలో పెక్కురు వైదిక మతమునననుసరించి దినమునకొక్క లక్షమంది బ్రాహ్మణులకు అన్నదాన మొసంగినట్లు శాసనములు తెల్పుచున్నవి.

గృహస్థులు పుణ్యక్షేత్రములు సందర్శించుచుండిరి. గుహలను తొలిపించుట ఆలయములను నిర్మించుట సత్రములను విహారములను నిర్మించుట ధర్మకార్యములు ఒనర్చుటవంటి సత్కార్యములు చేయుచు శాసన స్తంభములు నిలుపుచుండిరి. ఇట్టి కార్యక్రమములందు కుటుంబ సభ్యులందరూ పాల్గొన్నట్లు తెలియచున్నది.

వైదికమతముతో పాటు బౌద్ధము కూడా ఆదరింపబడినట్లు క్షత్రేరీ మొదలగు శాసనముల ద్వారా తెలియుచున్నది. గౌతమిపుత్ర యజ్ఞశ్రీశాతకర్ణి కాలమున గజసేన గజమిత్ర అను సోదరులు బౌద్ధ సంఘములకు గుహలు తొలిపించి దానముగానిచ్చిరి.

సాంఘిక వ్యవస్థలో కుటుంబ వ్యవస్థ ముఖ్యమైనది ఇంటి యజమానిని గృహపతి లేక గహపతి అని అనుచుండిరి. అతని భార్య గృహపత్ని కుటుంబ పోషణ వీరిద్దరి భాద్యత. అమరావతి క్షత్రేర శాసనముల వలన ఆనాడు సమిష్టి కుటుంబములు ఉన్నట్లు తెలియుచున్నది. తల్లీ కొడుకులు అన్యోన్యానురాగములతో ఉన్నట్లు అన్నదమ్ములు ప్రేమానురాగములతో ఉన్నట్లు గాథాసప్తశతిలో వర్ణింపబడినది.

స్త్రీలకు సంఘమున విశిష్ట గౌరవము లభించుచుండెను. నాగనీక, బాలశ్రీ మొదలగు రాజమాతలు రాజకీయ కార్యములందు ప్రముఖ పాత్ర వహించిరి. రాజులు ఆడంబరజీవనము గడుపుచుండిరి. రాజా స్థానములు వైభవోపేతములై ఉండెను. ఛత్ర చామరములు, ఖడ్గము, ధ్వజము, సింహాసనము కిరీటము ఆనాటి రాజలాంఛనములు.

రాజులు రాణివాసముస్త్రీలు శిరోకర్ణకంఠ భూషణములను రక్షాబంధములను హస్త కటి పాద భూషణములను ధరించెడివారు. ఆనాటి ప్రజలు ధనికులై వివిధములైన ఆభరణములనుధరించుచు ఆడంబర జీవనము గడిపెడివారు.

అజంతా, అమరావతీ మొదలగు శిల్పములందు, జాతక కథలందును, స్త్రీలు పురుషులు ధరించు అనేక ఆభరణములు కన్పించుచున్నవి.

**1. శిరోభూషణములు :** చటులా, తిలక, మణి మొదలగునవి.

**2. కర్ణ :** చూడామణి, మకరిక, మృష్టకుండలములు కొంత తాళ పత్రము, కర్ణికలు, త్రికంఠకములు, బాలికలు, మకరకుండలాలు, మృణాళకుండలములు.

**3. కంఠభూషణములు :-** యష్టి, అపవర్తకము, ప్రకాండకము, ఏకావళి, శీర్షకము, రత్నావళి, ఫలకహారం, కఠిక.

**4. రక్షాబంధములు :** కనకదోరము, జాలవలయము, మణిబంధనము, ఫలకవలయము, రత్నవలయము.

**5. హస్తభూషణములు :** కంకణము, అంగుళీయకము,

**6. కటి భూషణములు :** కాంచి, రత్నమేఖల, కాయబంధము, రశనము, మణిమేఖల.

**7. పాదభూషణములు :** మంజీరము, నూపురము, కంకిణి, ఇవిగాక ఉదరబంధము, వైకక్షము, ముక్తయజ్ఞోపవీతము మొదలుగాగల ఆభరణములు అసంఖ్యాకములుగానున్నవి.

ఈ ఆభరణము లన్నియు మెదక్ జిల్లాలోని కొండాపురం మరియు అమరావతి శిల్పములందు కన్పించుచున్నవి. బంగారు, మట్టి, ఎముక, శంఖములతో నిర్మించిన ఆభరణములెన్నియో లభించినవి. రాజులు, ధనాఢ్యులు, సన్నని నూలు వస్త్రములు ధరించెడివారు. కాయకష్టము చేయువారు దొడ్డుబట్టను (ముతక) ధరించెడివారు. వస్త్రములు వివిధములైన రంగుల్లో ధరించెడివారు.

అంతరీయము, ఉత్తరీయము, అనగా కట్టుబట్ట పై బట్ట తప్పక ధరించుచుండిరి సన్యాసినీ సన్యాసులు కాషాయ వస్త్రధారణ మొనర్చెడివారు.

పంచెలను విరుపుకట్టు, పంచెకచ్చము, మత్స్యహేళకము, హస్తిమండకము, గుల్ఫావలంభి అను వివిధ రకములుగా దోవతులను కట్టుచుండిరి.

పురుషులు తలపాగాలను ధరించి భుజముల పై నుండి వ్రేలాడునట్లుగా ఉత్తరీయములు ధరించెడివారు. వివిధములైన పాదరక్షలను ధరించెడివారు.

సౌందర్య పరిరక్షణకై ఆనాడు అనేక వస్తువులు సమకూర్చుకొనెడివారు. స్త్రీలను అలంకరించుటకు సైరంధ్రులు ఉండేవారు. గోళ్ళకు, పాదములకు గోరింటాకు (అలక్తకము) వాడుట మంగళ చిహ్నముగా భావించెడువారు. దువ్వెనలు, అద్దములు తైలపాత్రలు అంగరాగము, మాల్యములు వాడుకలోనుండెను.

స్త్రీలే కాక పురుషులుసైతము శిరోజములను పెంచుకొని జడలు కొప్పులు వేసుకొని పూలు తురుముకొనెడివారు.

## నిర్మాణములు

శాతవాహన కాలమున నిర్మాణములు కట్టడములు పటిష్ఠముగా నిర్మించెడివారు ! వాస్తు శాస్త్రజ్ఞుల బుద్ధినైపుణ్యానికి ఆనాటి నిర్మాణములు తార్కాణములు. నగరములు, పట్టణములు ప్రాకారముతో కూడుకొనియుండెను. ప్రాకారము చుట్టూ కందకము ఉండెడిది. బురుజులు, నలువైపుల ద్వారములు నిర్మించెడివారు.

ద్వారములు, ద్వారా తోరణములు ఆనాటి శిల్పకళా చతురత్వమునకు సోదాహరణములు.

అనేక అంతస్థుల భవనవములు నిర్మింపబడు చుండెను. అందు స్తంభములు సోపానములు, గదులు, వసారలు వలభులు అర్థచంద్రాకారపు కప్పులు భవనాంతరమునందు నివేశనములు, క్రీడా గృహములు, సిద్ధాంతములు, మండపములు, కపోతపాలికలు, గవాక్షములు కోశాగారములు, పూజాగదులు, ఉండెడివి.

సామాన్య ప్రజలు పెంకుటిండ్లలోను, పూరిగుడిసెల యందును నివసించెడివారు.

**శిల్పము** : శాతవాహనుల పాలనా కాలమున శిల్పకళ మహోన్నత స్థానమునాక్రమించినది. సాంచీద్వారము, అమరావతీ శిల్పములు, నాగార్జున కొండలోని శిల్పములు విశ్వవిఖ్యాతములైనవి. అజంతా, ఎల్లోరా, నాసిక్, కార్లా గుహాలయములందలి శిల్పములు చిత్రములు మనోజ్ఞమైనవి. జాతక కథలయందలి చిత్రములు అజరామరమైనవి.

ఆనాటి గుహాలయములు, ఇటుక కట్టడములు ద్వారములు ద్వారతోరణములు నేటికి కన్నుల పండుగ గావించుచున్నవి. బొజ్జన్నకొండపై గుహాస్థూపములు సమతల స్థూపములు కలవు, అమరావతి స్థూపము అన్నింటికన్నా పెద్దది అశోక చక్రవర్తి దీనిని అభివృద్ధి చేసెను. శాతవాహనుల కాలమునందు ఈ స్థూపము వింత శోభలను సంతరించుకొని శిల్పకళాశోభితమైన ప్రాకార కుడ్యముతో అపురూపముగానున్నది.

చిత్రములందు కరుణ, సుఖ దుఃఖములు సహజముగా చిత్రించబడి భావస్పష్టత గోచరించును.

ప్రాకార, బాహ్య ప్రదేశములందు జంతువుల బొమ్మలు స్తంభములపై బోధి వృక్షము, ధర్మచక్రము, నాగమక్ష, పూర్ణ, అర్ధ కలశములు, పూర్ణకుంభములు, త్రిరత్నములు మహాభినిష్క్రమణము, అస్త్ర విద్యాప్రదర్శనము చిత్రించబడినది. వందల కొలది కమలములు, స్త్రీ, పురుషుల బొమ్మలు జాతక కధలు బుద్ధుని జీవితములో సంభవించిన సంఘటనలు హాస్య రసము ఉట్టిపడే కుడ్యచిత్రములు శిల్పకళాసంపదకు ఉదాహరణలు.

మెదక్ జిల్లా కొండాపురం ప్రాంతమున 1973 -74 సంవత్సరములందు కొందరు వ్యవసాయపనులకై త్రవ్వకాలు జరుపగా ప్రాచీన కాలమునాటి శిల్పఖండములు లభ్యమైనవి. ఇందు ప్రాకారమునందలి వృక్షము చిత్రీకరించబడిన ఫలకము ఉష్ణీషఫలకము, చైతన్యఫలకము, ఛత్రావళి, శిల్ప ఫలక ఖండములు లభించినవి. ఇవన్నీ శాతవాహనుల కాలంనాటివని చారిత్రికుల అభిప్రాయము. ఈ శిల్పములు కొండాపూర్ ప్రదర్శనశాలయందు భద్రపరచబడినది. ఇంతేగాక ఇక్కడి త్రవ్వకాలలో లభించిన గృహోపకరణములైన విభిన్నములైన మట్టి పాత్రలు లభ్యమైనవి. వీటియందు రంగు పాత్రలు దీపపు సెమ్మెలు, పళ్ళెములు మూకుడులు మొదలగునవి ఆనాటి కుమ్మరుల హస్తకళాకౌశలమునకు అద్దము పట్టుచున్నవి.

కొన్ని పాత్రలపై బౌద్ధులకు పవిత్రములైన త్రిరత్నములు, తామరపుష్పము ధర్మచక్రములు చిహ్నములు ముద్రితమైనవి.

శాతవాహనుల కాలంనాడు ఉపయోగించిన కపిల వర్ణపు మట్టిపాత్రలు ఎరుపుపూత కలిగి, నిలువు, అడ్డము గీతలతో కన్న కేవలము నిలువు గీతలు, వరుసగీతలు బిందువుల వరుసలతో అలంకరింపబడి ఉన్న పాత్రలు మృణ్మయపాత్రలు, కొండాపూర్‌నందే గాక అరికమేడు అమరావతి, చంద్రవల్లి బ్రహ్మగిరి, మస్కి మొదలగు ప్రదేశములందు కూడా లభించినవి.

కొండాపూర్ త్రవ్వకములందు ధాన్యమును భద్రపర్చుటకు అనువుగా తయారు చేయబడిన పెద్ద పెద్ద గోళెములు లభ్యం కాగా వాటిని ప్రదర్శనశాలలలో ప్రజల సందర్శనార్థము అమర్చబడినవి. వీటిపై బ్రాహ్మీ అక్షరములు లిఖింపబడియుండుటచే అవి క్రీ.శ. 2వ శతాబ్దికి చెందినవని చెప్పవచ్చును.

కెమోలిన్ అను తెల్లని మట్టితో తయారు గావింపబడిన బొమ్మలు ఆనాటి శిల్పకళా చాతుర్యమును చాటుచున్నవి.

శాతవాహనులకాలమున భార్గజా (బ్రోచ్) రేవు పట్టణము నుండి పెంగాణి వస్తువులు ఎగుమతి అగుచుండేవని క్రీ.శ. 1వ శతాబ్దినందు వ్రాయబడిన పెరిట్లస్ అను గ్రంథమున వ్రాయబడినది.

ఉత్పాదకత లక్షణములను ప్రతిబింబించుచున్న మాతృదేవతా ప్రతిమ కొండాపూర్ నందలి ప్రదర్శనశాలలో అగుపడుచున్నది.

ఈ విధముగా శాతవాహనుల కాలంలో శిల్పచిత్ర కళలు బహుముఖ ప్రజ్ఞాపాటవములతో చూపరుల మనస్సులో ఆనందము కలిగించు చుండెడివి. వీరి కాలమున సంగీతము మొదలు లలితకళలు అన్నియు పోషింపబడినవి.

## రాజమార్గములు

బందరు రేవు నుండి ప్రాగ్దేశమునకు వెళ్ళేనౌకలు బయల్దేరెడివి. బందరు నుండి కృష్ణానదిపై ఓడలు బయల్దేరి మూసీ, కృష్ణాసంగమ స్థలము చేరెడివి. వాడపల్లి ప్రముఖ ఓడ రేవుగనుండెను. వాడపల్లి నుండి సరుకులు తీసికొని కళ్యాణి, తగర, పైఠన్, నగరములమీదుగ నాసిక్ చేరెడివారు. నాసిక్‌నుండి పశ్చిమతీరము ఓడరేవైన భరుకచ్ఛము చేరెడివారు. భరుకచ్ఛము ఓడరేవు పట్టణము నుండి సన్ననిమూలు బట్టలు, ద్రాక్ష రసము, రాగి, సీసము, పగడములు, సీనారేకు, వెండి బంగారం, చెకుముకి రాళ్ళు గోమేధికములు, దంతములు, పట్టువస్త్రములు పశ్చిమదేశములకు ఎగుమతి అగుచుండెను.

ఆంధ్రులు విదేశీ వర్తక వ్యాపారములు చేయుటతో ఆర్థికంగా బలపడిరి.

ఆకాలమున తెలంగాణమునందు మెదక్ జిల్లాలోని కొండాపురము, కరీంనగర్ జిల్లాలోని కోటిలింగాలు, ఆదిలాబాద్ జిల్లాలోని మహిషికనగరం, నిజామాబాద్ జిల్లాలోని బోధన పాలమూరు జిల్లాలోని భెక్కంవర్తక కేంద్రాలుగా నుండేవి.

వీటన్నింటికి బందరు వాడపల్లి భరుకచ్ఛమురేవుల నుండి రాజమార్గములు కలుపబడెను. వాసిష్ఠీపుత్ర పులోమావి ఓడరేవు చిహ్నములుగా గల నాణెములు తూర్పుతీరమునందు లభించినవి. ఆనాడు వర్తకులు తూర్పు సముద్రమునందు జావా సుమిత్ర బోర్నియో మొదలగు దీవులతోనూ, మలయా, బర్మా, సియోల, చైనా సింహళము, ఈజిప్టు, మెసపటోనియా, బాబిలోన్, రోమ్, మున్నగు దేశములతోనూ వర్తక వ్యాపారములు సాగించినట్లు ఆయా దేశములు నాణెములు లభించుటను బట్టి తెలియుచున్నది.

## వాహనములు

ఎద్దులబండ్లు, శిబికలు, రథములు, గజాశ్వవృషభములు, పడవలు, నాటి ప్రయాణ సాధనాలు.

# ఆర్థిక వ్యవస్థ

మౌర్య పరిపాలనా కాలమున చాణక్యునిచే వ్రాయబడిన కౌటిల్య అర్థశాస్త్రమును అనుసరించి శాతవాహన రాజులు పరిపాలించుచుండిరి. ప్రజలు ఆర్థికముగా బలపడి సౌఖ్యముతోనుండిరి. గ్రామములందు చర్మకారులు, గంధికులు, కుమ్మరులు, తెసకారులు, కాసాకారులు, మాలాకారులు, కాలికులు, తిలపిష్టకులు, ఒధయంత్రికులు, మారికులు, మణివారులు, సైలమకణులుమున్నగు వృత్తులవారుండిరి.

ఒక్కొక్క వృత్తి వారికై ఒక్కొక్క సంఘము ఉండెను. ఈ సంఘములను శ్రేణులు నికాయములు అని అందురు. సంఘ అధ్యక్షుడిని శ్రేష్ఠి అనేడివారు. ఈ సంఘములకు ప్రత్యేక కార్యాలయములు ఉండేవి. ధనికులు రాజభంధువులు, దాతలు ఈ సంఘములందు ధనము నిల్వయుంచు కొనెడివారు. దానిపై వచ్చు వడ్డీని ఏదైన ఒక ధర్మ సంస్థకు గానీ, సత్కార్యమునకు గాని వినియోగించెడివారు.

వర్తకులను వణిజ, నెగమ, అని పిలుచుచుండిరి. పల్లెలు, పట్టణములు తిరిగి వ్యాపారం చేసుకొనెడి వారిని 'సార్థవాహులు' అనెడివారు.

శాతవాహనులు వేయించిన నాణెములు వెండి, రాగి, సీసము, ప్రోటీన్, మొదలగు లోహములతోవివిధ పరిమాణములందు చేయబడేవి.

కార్షాపణము, సువర్ణము, పథకము, కుశనము అనునాణెములు వాడుకలో నుండెను.

**1** సువర్ణము = **35** కార్షపణములు

తొమ్మిది కార్షాపణములు = **8** కుశనములు

అనగా **1** కార్షాపణము = **8/9** కుశనము.

ఆనాడు వేయికార్షాపణముల మీద సంవత్సరమునకు తొంబై కార్షాపణములు వడ్డీ వచ్చుచుండెను.

నాసిక శాసనమునందు నహపాణుని అల్లుడైన ఉషవదత్తుడు 4వేల కార్షాపణములలో భూమిని కొని బ్రాహ్మణులకు దానం ఇచ్చెనని తెలియుచున్నది. ఆ శాసనములోనే అతడు కుంతికనికాయమున 2 వేల కార్షాపణముల ఉంచెను దానిపై నెలకు ఒక ప్రతీక వడ్డీ వచ్చుచుండెను. వేరొక నికాయమున వేయి కార్షాపణములను నెలకు 3/4 పడిక వడ్డీ వచ్చుచుండెను.

శాతవాహనులకు సంబంధించిన నాణెములు ఉత్తరప్రదేశ్, బీహార్, బరోడా రాష్ట్రములైన ఉత్తర భారతదేశమందు, దక్షిణా పథమున మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్, మైసూర్ మద్రాసు ప్రాంతములందు లభించినవి. ఇవి గుండ్రముగ చతురస్రంగా అండాకృతిలో ఉన్నవి.

గౌతమీపుత్ర శాతకర్ణి వేయించిన నాణెములు లభించినవి. ఈ నాణెములపై సింహ, గజ, అశ్వ, వృషభ, మానవ, వృక్షచైత్య, త్రిరత్న, ధ్వజ, స్వస్తిక, నందిపాదచిహ్నములును అడ్డగీతల రెండు వైపుల ఉండు గుండ్రని వస్తువు యొక్క చిహ్నము. అంకుశము, కిరణ ప్రసారయుత సూర్యబింబము శంఖము, కమలము నాగచిహ్నములు గలవు. ఈ నాణెములు కలకత్తా హైదరాబాద్ మ్యూజియమ్ లందును, కొండాపురం ప్రదర్శన శాలయందును ప్రదర్శించబడుచున్నవి.

## ఆచార వ్యవహారములు – ఉత్సవములు

శాతవాహనుల నాటి ప్రజల యొక్క ఆచార వ్యవహారములు శిల్పాలు, గాథాసప్తశతి, వాత్స్యాయనీయములు మొదలగు వాటివలన తెలియచున్నది.

1. దేవరవ్యాయము
2. రజస్వలయైన స్త్రీ ముఖమునకు వర్ణఘృత లేపనము
3. స్నాన సమయమున పసుపువాడుట
4. సురత కాలమున మధురాసేవనము
5. ప్రథమ సంగమానంతరము మదన క్రీడ ప్రదర్శనము
6. జంబూకషాయము ఉపయోగించుట
7. హరితాళ వస్తువులతో ముఖమునకు రంగు వేసుకొనుట
8. శిశువులకు దంతములు వచ్చు వరకు ఆలుమగలు కలియకుండుట.
9. అపశకునములు పాటించుట
10. పండుగల యందు వాయనములు ఒసంగుట.
11. వివాహము మంగళాచరణ పూర్వకముగా ప్రారంభించి శేషహోమనాగవల్లీ క్రియలతో పరిసమాప్తి గావించుట అనునవి కొన్ని ముఖ్యమైన ఆచార వ్యవహారములుగా నుండెడివి.

పండుగలు పర్వదినములయందు వీణావాద్యము, సంగీత సభలు నిర్వహింపబడు చుండెను. శంఖ, పలహ, మర్దలాది వాద్యములు వాడుకలోనుండెను.

గృహ పాత్రలలో బానలు, గరిటెలు, తబుకులు చెంబులు బాలీలు పాన పాత్రలు జాడీలు మృత్తికతోనూ, లోహములతోనూ నిర్మించి వాడు చుండిరి. తిలల నుండి తైలము చెఱకురసము నుండి బెల్లమును తయారు చేసుకొనుటలో ఆనాటి ప్రజలు ప్రవీణులైయుండిరి.

శాతవాహనుల కాలమున అనేక ఉత్సవములు నిర్వహింపబడుచుండెను.

1. హోళికోత్సవము
2. ఫాల్గుణోత్సవము
3. ఉత్పుల్లిక
4. చూత లతిక
5. మధూత్సవములు

ముఖ్యమైన ఉత్సవములు.

# ఆనాటి ప్రజావినోదములు

1. ఘటానిబంధనము
2. గోష్ఠీసమవాయము
3. సమాపానకము
4. ఉద్యానగమనము
5. యక్షరాత్రి
6. కౌముదీజాగరణము
7. సువసంతకము
8. సహకారభంజిక
9. అభ్యూష్యఖాదిక
10. భిసఖాదిక
11. నవపత్రిక
12. ఉదకక్ష్వేడిక (శృంగక్రీడ)
13. పాంచాలాను యానము (బొమ్మల పెళ్ళిళ్లు)
14. ఏకశాల్మలీ (కోతి కొమ్మచ్చి)
15. యవచతుర్థీ
16. అలోల చతుర్థీ
17. మదనోత్సవము
18. దమనభంజిక
19. హోలాక
20. అశోకోత్తంసిక
21. పుష్పాపచాయిక
22. చూతలతిక
23. ఇక్షుభంజిక
24. కదంబయుద్ధము

ముఖ్యమైవి.

వాత్స్యాయనుడు కామసూత్ర గ్రంథమున మొదటి అధికరణమునందలి మూడవ అధ్యాయమున విద్యా సముద్దేశ ప్రకరణమున చతుశ్శష్టికళలను పేర్కొనెను.

1. గీత
2. వాద్య
3. నృత్య
4. విశేషకచ్ఛేద్యము
5. తండుల కుసుమవళీ వికారము
6. పుష్పాస్తరణము
7. దశసవననాంగరాగము
8. మణిభూమికాకర్మ
9. ఆలేఖ్యం
10. శయన రచనము
11. ఉదకవాద్యము
12. ఉదకాఘాతము
13. చిత్రయోగము
14. మాల్యగ్రథన వికల్పము
15. శేఖరాకాపీడ యోజనము
16. నేపథ్య ప్రయోగము
17. కర్ణపత్ర భంగము
18. గంధయుక్తి
19. భూషణ యోజనము
20. ఐంద్రజాలము
21. కౌచుమారము
22. హస్తలాఘవము
23. విచిత్రశాఖమూసభక్ష్యవికారక్రియ
24. పానకరసరాగసవయోజనము
25. సూచీవాన కర్మ

26. సూత్రక్రీడ
27. ప్రహేళిక
28. ప్రతిమాల
29. దుర్వాచక యోగములు
30. పుస్తకవాచనము
31. కావ్యసమస్యాపూరణము
32. నాటకాఖ్యాయిక దర్శనము
33. తక్షకర్మ
34. పట్టికా వేత్ర వానవికల్పము
35. తక్షణము
36. వాస్తువిద్య
37. రూప్యరత్న పరీక్ష
38. ధాతువాదము
39. మణిరాగాకారజ్ఞానము
40. వృక్షాయుర్వేదయోగము
41. మేషకుక్కుటలావకయుద్ధ విధి
42. శుకశారికా ప్రలాపనము
43. ఉత్పాదన సంవాహన కేశమర్ద కౌశలము
44. అక్షరముష్టి కాకథనము
45. దేశ భాషా విజ్ఞానము
46. పుష్పశకటిక
47. నిమిత్తజ్ఞానము
48. మ్లేచ్ఛితా వికల్పము
49. యంత్ర మాతృక
50. ధారణమాతృక
51. సంపాఠ్యము
52. మానసి
53. కార్యక్రియ
54. అభిధానకోశము
55. ఛందోజ్ఞానము
56. ఛలితక యోగములు
57. క్రియాకల్పము
58. వస్త్రగోపనము
59. ద్యూతము
60. ఆకర్షక క్రీడ
61. బాలక్రీడ నకములు
62. వైణయికీయ విద్య
63. వైజయకీయవిద్య
64. వ్యాయమవిద్య.

ఈ చతుష్షష్ఠి కళలయందు ప్రజలు నేర్పరులై ఆర్థికముగా బలపడి, శాతవాహనుల సామ్రాజ్యోన్నతికి కృషిచేయుచు సుఖమయ జీవితము గడుపుచుండిరి.

ఆకాలమున హైందవులు తమజీవన యానమున షోడశ సంస్కారములకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చిరి.

# విష్ణుకుండినులు

ఇక్ష్వాకుల సామంతులుగ, మాండలికులుగ విష్ణు కుండినుల పూర్వీకులు మహబూబ్ నగర్ జిల్లాలోని అమరాబాదు (అమరావతి) ప్రాంతమును మాత్రము పాలించుచుండిరి. ఈ విష్ణుకుండిన రాజుల మూలపురుషుడు మహారాజేంద్రవర్మ.

విష్ణు కుండినులకు సంబంధించిన 9 తామ్రశాసనములు 2 శిలాశాసనములు లభించినవి.

1. ఈ పూరు తామ్ర శాసనము I
2. ఈ పూరు తామ్ర శాసనము II
3. రామతీర్థ తామ్ర శాసనము
4. చిక్కుళ్ళ తామ్ర శాసనము
5. తుండి తామ్ర శాసనము
6. ఇంద్రపాల నగర తామ్ర శాసనము
7. పొలమూరు తామ్ర శాసనము
8. ఖానాపూరు తామ్ర శాసనము
9. వేల్పూరు శిలా శాసనము
10. చైతన్యపురి శిలా శాసనము

విష్ణుకుండినులు మొదట కృష్ణా నదికి ఉత్తరముననున్న తెలంగాణములోని మహబూబ్‌నగర్ నల్గొండ జిల్లాల ప్రాంతముల నాక్రమించి రాజ్యము నెలకొల్పిరి. ఆకాలమున వాకాటకులు శక్తిసమన్వితులై దక్షిణాపథ పశ్చిమోత్తరములందు పరిపాలన సేయుచుండిరి. విష్ణుకుండిన వంశీయుడైన రెండవ మాధవ వర్మ వాకాటక రాజకుమార్తెను వివాహమాడి సంబంధ బాంధవ్యముల నెరపితమ రాజ్యమును సురక్షితముగా పాలించుచుండిరి.

విష్ణుకుండినుల చరిత్ర తెలుసుకొనుటకు శాసనములు కట్టడములు, దేవాలయములు, దుర్గములు, శిల్పసంపద, తోడ్పడుచున్నది.

శాసనములందు "దక్షిణాపథపతి" త్రికూట మలయాధిపతి "శ్రీపర్వత స్వామి పదానుధ్యాత" అనుబిరుదములు విష్ణుకుండినులకున్నట్లు వర్ణింపబడినారు.

విక్రమేంద్రవర్మ భట్టారకవర్మవేయించిన ఇంద్రపాలనగర తామ్రశాసనములందు రెండవ మాధవ వర్మ తూర్పు, దక్షిణ, పడమటి సముద్రములు, ఉత్తరమున రేవానది సరిహద్దులుగాగల భూమిని పరిపాలించినాడని వర్ణింపబడినది. అందుచే మెదకు జిల్లాప్రాంతము కూడా వీరి ఏలుబడిలోనున్నదని ఊహింపవచ్చును.

విష్ణుకుండినులు మొదట అమరాబాదులో, కొంతరాజ్య విస్తరణతో ఇంద్రపాలనగరమునకు, ఆతర్వాత సువిశాల సామ్రాజ్యమేర్పాటు చేసి కృష్ణాతీరమున నున్న అమరావతిని రాజధానిగా చేసికొనిరి.

విష్ణు కుండిన రాజులు మొత్తము 12 మంది కలరు వీరు క్రీ.శ. 358 నుండి క్రీ.శ. 624 వరకు 266 సంవత్సరములు పరిపాలించిరి.

## మహారాజేంద్రవర్మ

ఈ రాజన్యుని పూర్వీకులు ఇక్ష్వాకుల రాజ్యమున సామంత మండలాధీశ్వరులుగా యుండి యుండవచ్చును. మహబూబ్‌నగర్ జిల్లాలోని అమరాబాదు (అమరావతి) ను రాజధానిగా కృష్ణానదికి ఉత్తరతటమందున్న భూభాగమును పాలించు చుండిరి.

శాలంకాయన, ఆనందగోత్ర, పల్లవరాజులు ఒండొరులు కలహించు కొను కాలమున అమరాబాదు - ఏలేశ్వర ప్రాంతములందు తన అధికారమును సుస్థిరపరచుకొని క్రీ.శ. 358 నుండి క్రీ.శ. 370 వరకు స్వతంత్రుడై పరిపాలించెను.

## మొదటి మాధవవర్మ

మహారాజేంద్రవర్మ కుమారుడైన మొదటి మాధవ వర్మ తన తండ్రి యనంతరము క్రీ.శ.370 లో రాజ్యపాలనాధికారమును చేపట్టెను. ఇంద్రపాలనగర తామ్రశాసనమున "శ్రీ మహారాజేంద్రవర్మ సత్పుత్రేణ మహారాజ శ్రీ మాధవవర్మణః" అని ఈతని ప్రశంసగలదు.

ఈతడు అమరాబాదు నుండి కీసర-భువనగిరి ప్రాంతములవరకు తన రాజ్యమును విస్తరించెను.

ఈతని రాజ్యపాలనా కాలము క్రీ.శ.370 -398.

## మొదటి గోవిందవర్మ

మొదటి మాధవవర్మ మరణానంతరము క్రీ.శ.398 వ సంవత్సరమున సింహాసనమధిష్ఠించెను.

ఈతడు తన 37 వ రాజ్యసంవత్సరమున ఇంద్రపాల నగరమున వేయించిన తామ్ర శాసనమున "స్వభుజ బలోత్సాహ ప్రభావానురాగావాప్త స్వరాజ్యుడు." శౌర్యధైర్య ప్రతాపాను భావాదన్య సామంత క్రాంతరాజ్యాంతరుడు. శ్రీ పార్వతీయ పూర్వాపర క్షితిపతి పరంపరాహార మధ్య నిరుపమ విరాజితయా కౌస్తుభాయమాన యశోజన్ముడు. అని వర్ణింపబడినాడు.

గోవింద వర్మ పరిపాలనాకాలమందు విష్ణుకుండినుల రాజ్యము విస్తరించెను. మొదట సామంతునిగానున్న తర్వాత స్వతంత్రించి తోటి సామంత మాండలికుల జయించి మహారాజ పదవి నలంకరించెను.

గోవిందవర్మ "మూలరాజు" వంశీయుడైన పృథ్వీమూల రాజకుమార్తెయగు పరమ మహాదేవిని వివాహమాడెను.

ఇటీవల హైద్రాబాదు నగర సమీప మందలి చైతన్యపురి ప్రాంతమున మూసీనదీ తీరమున లభించిన ప్రాకృతశాసనము ఈ మహారాజు పేర వెలసిన "గోవిందరాజ విహారము" ను గూర్చి తెల్పుచున్నది. విహారము శిథిలమై పోయినది.

గోవిందవర్మ బౌద్ధమతానుయాయి. ఈతని కాలమున ఇంద్రపాలనగర మహావిహారము, గోవిందరాజ విహారము, ఫణిగిరి, తిరుమలగిరి, గాజులబండ, జగ్గయ్యపేట, రామిరెడ్డి పల్లి, నేలకొండపల్లి ప్రాంతములందు బౌద్ధవిహారములు - ఆరామములు చైత్యాలయములు ప్రసిద్ధిగాంచినవి. ఇవన్నియు నేటికి నామమాత్రావ శిష్టములైయున్నవి.

నాగార్జునకొండ, భట్టిప్రోలు, అమరావతి, కేసనపల్లి, మున్నగు ప్రాంతములందున్న బౌద్ధారామ విహారములు రాజాదరణలేక క్షీణించు కాలమున ఇంద్రపాలనగరమును రాజధానిగా గోవిందవర్మ బౌద్ధమునాదరించి, బౌద్ధ సంఘములను, బౌద్ధసన్యాసులను, బౌద్ధ ఛాత్రులను, బౌద్ధారామ విహారములను పోషించెను గోవిందవర్మ పరిపాలనాకాలము క్రీ.శ. 398 నుండి 435.

## రెండవ మాధవ వర్మ

రెండవ మాధవ వర్మ రాజ్యపాలనమునకు వచ్చుటతోడనే శాలంకాయన, ఆనందగోత్ర, పల్లవ, కదంబ రాజులపైయుద్ధమును ప్రకటించి వారందరిని జయించి, దక్షణ దేశమందున్న యితర రాజన్యుల రాజ్యముల నాక్రమించి దక్షిణా పథమంతటనే కాక దక్షిణ భారతమును సైతము పరిపాలించెను దక్షిణా పథపశ్చిమార్ధమున కుంతల దేశము నుండి ఉత్తరమున రేవానదీ పర్యంతము అజంతా ఎల్లోరా ప్రాంతము నుండి పశ్చిమ సముద్రము వరకు వాకాటకుల పరిపాలనలో నుండెను.

వాకాటక రాజైన రెండవ పృథ్వీసేనుడు రెండవ మాధవ వర్మ చేయుద్ధమునందోడి సంధిగా వించుకొని తన ఏకైక పుత్రికయును మహాదేవిని రెండవ మాధవ వర్మ కిచ్చి వివాహము గావించెను ఈమె కుమారుడే విక్రమేంద్ర వర్మ పృథ్వీ సేనుని యనంతరము సువిశాలమైన వాకాటక సామ్రాజ్యము విష్ణుకుండిన రాజ్యములో విలీనమయ్యెను.

రెండవ మాధవ వర్మ విష్ణు కుండిన రాజులలో గొప్ప ప్రజ్ఞాశాలి, పరాక్రమసంపన్నుడు, వైదికమత నిరతుడు, అగ్నిష్టోమ, వాజపేయ, పౌండరీక, అశ్వమేధ, రాజసూయాది సహస్ర క్రతువుల నొనర్చినవాడు, ఈ యాగములలో అశ్వమేధము - రాజసూయములు ముఖ్యమైనవి.

పదకొండు మార్లు దిగ్విజయ యాత్రలు చేసి, శత్రురాజులనోడించి ఏకాదశాశ్వ మేధయాగములు చేసినట్లు శాసనములందు వర్ణింపబడినాడు.

రెండవ మాధవవర్మ పట్టపురాణి పృథ్వీమూల రాజవంశ కుమార్తె ఈ మెయే పట్టపురాణి. ఈమెకు గల్గిన సంతానమే దేవవర్మ.

వేల్పూరు శిలాశాసనమున గోవిందవర్మ కుమారుడైన రెండవమాధవవర్మ, అతని కుమారుడు విక్రమేంద్రవర్మ ప్రశంసింప బడినారు. ఇందు పల్లవరాజు ప్రశంసయుండుట వలన పల్లవుని జయించిన పిదప వేల్పూరిలో ఈ శాసనము వేయించి యుండవచ్చును.

రెండవ మాధవ వర్మ వైదిక మతాభిమాని కావున అనేక యజ్ఞయాగాది క్రతువులు చేయుటేగాక అనేక శివాలయములు నిర్మించెను.

సామ్రాజ్యము విస్తరించినందున రాజధానిని ఇంద్ర పాలనగరము నుండి కృష్ణానది దక్షిణ తటమునగల అమరావతికి మార్చెను.

కీసరలో వెలిసిన కీసర రామలింగేశ్వరాలయము వీరికాలమున నిర్మించబడినది. ఈ ప్రాంతము విష్ణుకుండినుల చరిత్ర నిర్మాణమునకు తోడ్పడు కట్టడములు - దేవలయములు - కోటలునాణెములు - శిల్పసంపద కల్గియున్నవి.

విష్ణుకుండినులు సింహలాంఛనులు. వీరి శాసన కడియముల రాజముద్రిక పైగల చిహ్నము లంఘించు సింహము. కేసరిరామలింగేశ్వరాలయము వీరి రాజ చిహ్నము పేర నిర్మించినట్టిది.

ఆంధ్రదేశమున వెలసిన పురాతన రామలింగేశ్వరాలయములన్నియు విష్ణుకుండిన వంశీయుల కాలమున నిర్మింపబడినట్టివని ఊహింపబడుచున్నవి. మెదకు జిల్లాలో కూడ రామలింగశ్వరనామాంకితమైన ఆలయములున్నవి.

రెండవ మాధవ వర్మ గొప్ప విజేత, సమస్త మాండలికులకు చక్రవర్తి.

ఈతని జ్యేష్ఠభార్యమూలరాజవంశసంజాత. ఆమె కుమారుడు దేవవర్మ. ఈతని రెండవరాణి వాకాటక రాజకుమార్తె మహాదేవి. ఆమెకు మారుడు విక్రమేంద్రవర్మ.

రెండవ మాధవర్మ క్రీ.శ. 435 నుండి 470 వరకు పాలించెను.

## 5. దేవవర్మ

రెండవ మాధవ వర్మ, జ్యేష్ఠకుమారుడు, దేవవర్మతండ్రియనంతరము రాజయ్యెను. ఈతని గూర్చి ఈతని కుమారుడు మూడవ మాధవవర్మ వేయించిన ఈ పూరారు శాసనమున "క్షత్రియః అవసంక్య్ధ - ప్రవర్తిత - అప్రతిమ విఖ్యాతపరాక్రమస్య" అనివర్ణింపబడినాడు. ఈ శాసనము ద్వారా దేవవర్మ తన తండ్రి చేసిన యుద్ధములలో యజ్ఞయాగాది క్రతువులు నిర్విఘ్నముగా కొనసాగుటలో సహాయం పడెడివాడనియు తెలియుచున్నది. పల్లవులతో జరిగినయుద్ధమున ఈతడు మరణించియుండ వచ్చును. ఈతని పాలనా కాలము 3 సంవత్సరములే క్రీ.శ. 470 - 473.

## మూడవ మాధవ వర్మ

దేవ వర్మ యనంతరము ఆతని కుమారుడు మూడవ మాధవవర్మ విష్ణుకుండిన సామ్రాజ్యాధిపత్యము వహించెను. ఈతడు తన రాజధానిని అమరపురమునకు మార్చెను. నేటి గుంటూరు జిల్లాలోని అమరావతి యే అమరపురమని భావింపబడుచున్నది. ఈతనికి "త్రికూటమల యాధిపతి" అను బిరుదమున్నట్లు శాసనముల వలన తెలియుచున్నది.

డా. నెలటూరి వెంకటరమణయ్య గారి అభిప్రాయమున ఈతని రాజ్యము తూర్పున మలయ పర్వతములు - పశ్చిమమున త్రికూట పర్వతములు గల్గిన, రెండు పర్వత ప్రాంతముల మధ్యదేశము కావచ్చును.

మూడవ మాధవ వర్మకు దాయాదులతో యుద్ధము సంభవించెను రెండవ మాధవవర్మకు వాకాటకుల ఆడుబిడ్డయైన మహాదేవివలన జన్మించిన విక్రమేంద్రవర్మ, వాకాటకులదౌహిత్రుడు, వాకాటకరాజైన పృధ్వీసేనునకు మహాదేవి ఏకైక కుమార్తె. మహాదేవుని యనంతరము వాకాటక రాజ్యమును రెండవ మాధవవర్మ విష్ణుకుండిన రాజ్యములో విలీనమొనర్చెను. న్యాయముగా వాకాటక రాజ్యమునకు విక్రమేంద్ర వర్మ దౌహిత్రునిగా వారసుడు రాజ్యాధికారమునకర్హుడు కాని రెండవ మాధవ వర్మ వాకాటకరాజ్యమును విలీనమొనర్చుటచే జ్యేష్ఠ కుమారుడైన దేవవర్మరాజయ్యెను - ఆతని యనంతరము ఆతనికుమారుడు మాధవవర్మ రాజయ్యెను.

విక్రమేంద్ర వర్మకుమారుడైన ఇంద్ర భట్టారకవర్మ మూడవ మాధవ వర్మతో చాలాకాలము యుద్ధములు చేసి చివరకు విజయము సాధించెను.

మూడవ మాధవర్మ పాలనాకాలము క్రీ.శ. 473 -522.

## 7. విక్రమేంద్రవర్మ

విక్రమేంద్ర వర్మ రెండవ మాధవవర్మకు వాకాటక పృధ్వీసేన ఏకైక కుమార్తె మహాదేవి వలన జన్మించిన వాడు, న్యాయముగా వాకాటక రాజ్యమునకు వారసుడు. కాని జ్యేష్ఠుడగుటచేతను వాకాటక రాజ్యము విలీనమగుట చేతను దేవవర్మ రాజయ్యెను. దేవవర్మ అనంతరము అతని కుమారుడు రాజయ్యెను. విక్రమేంద్రవర్మ చాలాకాలము రాజ్యసింహాసన మునకై మూడవ మాధవ వర్మతో యుద్ధములు చేసెను. ఈతని యుద్ధములందు ఈతని కుమారుడు ఇంద్రభట్టారకవర్మ కూడా పాల్గొన్నట్లున్నది. మొత్తము మీద సుదీర్ఘ పోరాటముతో క్రీ.శ.522లో విక్రమేంద్ర వర్మ విష్ణుకుండిన, వాకాటక రాజ్యములకు సార్వభౌముడయ్యెను.

విక్రమేంద్రవర్మ శాసనములలో "మహారాజ శ్రీ మాధవ వర్మణః ప్రియపుత్రస్య, వాకాటక మహాదేవీ సుతస్య మహాకవేః పరమసౌగతస్య మహారాజశ్రీ విక్రమేంద్రస్యా" యనియు "ఉభయ వంశాత్మజాలంకార భూతః శ్రీమాధవవర్మణః ప్రియసూనోర్విష్ణుకుండిన, వాకాటక వంశద్వయా లంకృత జన్మనః, ప్రతాపోపనత సకల సామంత మంజరీ పింజరిత చరణ కమల యుగళస్య మహారాజ శ్రీ విక్రమేంద్ర భట్టారక వర్మణః" అని వర్ణింపబడినారు.

రామతీర్థ శాసనమున "మాతృపితృ పాదానుధ్యాతోభయవంశాత్మజాలంకార భూతః - శ్రీమాన్ విక్రమేంద్రాఖ్యా రాజాస్యాపిచానేకచాతుర్దన్త సమర శతసహస్ర సఙ్ఘట్ట విజయీ" యనియు చిక్కుళ్ల శాసనమున "విష్ణుకుండిన వాకాట వంశద్వయాలం. కృత జన్మనః శ్రీవిక్రమేంద్ర వర్మణః" యనియు పేర్కొనబడినారు.

విక్రమేంద్రవర్మ గొప్పపరాక్రమశాలి. తండ్రిమాధవ వర్మతో కలిసి వేల్పూరు స్కంధావారమునందుండి పల్లవులతో యుద్ధమొనర్చి విజయము సాధించెను.

ఈతడు బౌద్ధమతానుయాయి, మహాకవి తల్లిదండ్రులు వైదిక మతనిరతులైనను, తాతా-నాయనమ్మలవలె సుగత సిద్ధాంతములను అవలంబించెను ఈతడు బౌద్ధమత సంబంధమైన గ్రంథములను వ్రాసియుండ వచ్చును.

ఈతని పాలనా కాలము క్రీ.శ.522 నుండి 528.

## ఇంద్రభట్టారక వర్మ

విక్రమేంద్రవర్మయనంతరము ఆతని కుమారుడు ఇంద్రభట్టారకవర్మ రాజయ్యెను. ఈతడు బహుపరాక్రమశాలి. రాజ్యతంత్రజ్ఞుడు. అనేక యుద్ధములయందు విజయుడై విష్ణు కుండిన కీర్తి ప్రాభవముల నలుదిశలచాటెను.

రామతీర్థ శాసనమునందు "చతురుదధి నృపతి మణిమయూఖ విచ్ఛురిత పాదాంబురుహ పరమమాహేశ్వర. శ్రీమాన్ ఇంద్రవర్మాఖ్యరాజా" యనియు చిక్కుళ్ల శాసనమున "స్ఫురన్నిసిత నిస్త్రింశ ప్రభావభాసితాశేష జగన్మండలాధీప్సితస్య భ్రూభంగకార వినిర్ధూత సమగ్ర దాయాదస్య అనేక చతుర్దంత సమర సంఘట్ట ద్విరదగణ విపుల విజయస్య. సతతభూమి గోకన్యాహిరణ్య ప్రదాన ప్రతిలబ్ధ పుణ్యాజీవితోప భోగస్య, పరమమాహేశ్వరస్య మహారాజస్య, శ్రీ ఇంద్రభట్టారకవర్మణః" అనియు ఇంద్రపాల నగర శాసనమున "అనేక చతుర్దన్త విజయాధి గతాశేష చక్రవర్తి క్షేత్రాధిపత్యస్య స్ఫురత్ఖడ్గకర సహస్రావలీ పరిగత స్వభుజ దినకర ప్రభావ విధ్వస్తాశేష దాయాద మండల ఘనతిమిర పటలస్య శ్రీ ఇంద్ర భట్టారకవర్మణః" అని వర్ణింపబడినాడు ఈతనికి సత్యాశ్రయుడని బిరుదము కలదు.

ఇంద్రభట్టారకవర్మ పెక్కు అగ్రహారములను, గో సువర్ణ కన్యాదానములను బ్రాహ్మణుల కిచ్చినట్లు పైశాసనములద్వారా తెలియుచున్నది. ఈతడు పరమమాహేశ్వరుడు. నిత్యశివపూజాధురంధరుడు. ఈతడనేక ఘటికా స్థానములు నెలకొల్పెను. నేడు "ఘట్కేసర్" గా పిలువబడు కీసర సమీపమందున్న ఘటికేశ్వరము ఇంద్ర భట్టార వర్మ నెలకొల్పిన ఘటికా స్థానము.

ఈతడు తన కుమార్తె యగు ఇంద్ర భట్టారికను మేఖర ఈశానవర్మ కుమారుడైన శర్వవర్మకిచ్చి వివాహ మొనరించెను.

ఇంద్రభట్టారకవర్మ పరిపాలనాకాలము క్రీ.శ. 528 -556.

## విక్రమేంద్రభట్టారక వర్మ

ఇంద్ర భట్టారకుని జ్యేష్ఠకుమారుడు విక్రమేంద్రభట్టారక వర్మ. ఈతడు వేయించిన మూడు తామ్ర శాసనములు లభించినవి.

1. చిక్కుళ్ళ, 2. తుండి, 3. ఇంద్రపాలనగర తామ్ర శాసనములు. వీటియందు విక్రమేంద్ర వర్మ శైశవదశ యందే రాజ్యభారము వహించెనని తెలియుచున్నది.

ఇంద్రపాలనగర తామ్ర శాసనమున విక్రమేంద్ర భట్టారకునకు ఉత్తమాశ్రయుడని; ఇతని తండ్రికి సత్యాశ్రయుడని బిరుదములున్నట్లు వ్రాయబడినవి.

విక్రమేంద్ర భట్టారకుడు దాయాదులతో పోరాడవలసిన అవసరమేర్పడినది. మూడవ మాధవవర్మ వారసులు, బంధువులు రాజ్యమాక్రమించుటకు అలజడులు సృష్టించుచు యుద్ధమునకు కాలుదువ్వు చుండిరి. విక్రమేంద్రుడు వారందరితో పోరాడి విజయముగాంచెను.

పల్లవులకు విష్ణుకుండినులకు మొదటి నుండియు విరోధము కలదు. పల్లవ సింహవర్మ ఆంధ్ర భూభాగములపై పెద్దసైన్యముతో దండెత్తెను. విక్రముడు ధైర్యసాహసములతో పల్లవసైన్యమును ఛిన్నాభిన్న మొనరించి తరిమివేసెను. పిష్ఠ పురపాలకుడైన పృథ్వీమహారాజు మొదలైన సామంతులు స్వాతంత్ర్యమును ప్రకటించగా విక్రమేంద్రుడు వారి తిరుగు బాటునణచి వేసి సామ్రాజ్యమున చక్కని పరిపాలనా వ్యవస్థను ఏర్పరచెను. ఈతని పాలనాకాలము క్రీ.శ. 556-570.

## రెండవగోవిందవర్మ

రెండవ గోవిందవర్మ విక్రమేంద్ర భట్టారకుని కుమారుడు. తండ్రియనంతరము రాజయ్యెను. ఈతడు విక్రమాశ్రయ బిరుదాంకితుడు గోవింద వర్మ తన కుమారుడు నాల్గవ మాధవ వర్మ వేయించిన పొలమూరు తామ్రశాసనమున "అనేక సమర సంఘట్ట విజయినః, పరనరపతి మకుట మణిమయూఖావ దూత చరణయుగళస్య విక్రమాశ్రయస్య శ్రీ గోవిందవర్మణః" అని ఈపురు తామ్ర శాసనమున "అపరిమితబల పరాక్రమస్య, పరమధార్మికస్య, ప్రణత సకల సామన్తానేక గో, హిరణ్య, భూమిప్రదానస్య, మహారాజస్య శ్రీ గోవింద వర్మణః అని వర్ణింపబడినాడు.

ఈతనికాలము క్రీ.శ. 570 - 576.

## నాలుగవ మాధవవర్మ

నాల్గవ మాధవ వర్మ రెండవ గోవిందవర్మ కుమారుడు. ఈతడు క్రీ.శ. 576 లో తండ్రి యనంతరము విష్ణుకుండిన రాజ్య సింహాసన మలంకరించెను.

రాజైన వెంటనే సామంత మాండలికుల అలజడులనణచి వేసి రాజ్యమున శాంతినెలకొల్పెను.

రెండవ మాధవ వర్మవలె ఈ మహారాజుకూడా ఏకాదశాశ్వమేధయాగములు, వేయి అగ్నిష్టోమములు ఆచరించెను. అంతేకాక రెండవ మాధవ వర్మనెరవేర్చని "హిరణ్యగర్భ ప్రసూతయాగ" మొనర్చెను.

హిరణ్య గర్భమును నిర్మించి అందుండిదాత ప్రభవించును. యజ్ఞ పరిసమాప్త్యనంతరము ఆ హిరణ్యగర్భమును బ్రాహ్మణులకు దానమొసంగుటను హిరణ్య గర్భదానమనబడును. ఇది షోడశ దానములలో నొకటి.

నాల్గవ మాధవ వర్మకు జనాశ్రయుడను బిరుదము కలదనియు. హిరణ్యగర్భాది యాగములొనర్చిన వాడనియు పొలమూరు శాసనమున పేర్కొనబడినది. ఈ శాసనము లో 48వ రాజ్య సంవత్సరమున ఈతడు వేయించినట్లున్నది.

ఈతడు సోమవంశీయుడగు చంద్రగుప్తు నోడించి ఆతని తనయయగు చంద్రావతీ దేవిని వివాహమాడెను.

నాల్గవ మధవ వర్మ న్యాయపాలనము ఎన్నదగినది. న్యాయము చేకూర్చుటలో తన కుమారుని సైతము శిక్షించుటకు వెనుకాడని వాడని ఇతిహాసము గలదు.

ఈతని కుమారుడు మంచన. మంచన ఒకనాడు వాహ్యాళికేగు సమయమున అతనిరథ చక్రముల క్రింద ఒక నిరుపేద వృద్ధురాలి ఏకైక కుమారుడు పడి మరణించెనట. వృద్ధురాలు న్యాయము చెప్పమని రాజును వేడుకొనెను. రాజు ప్రాడ్వి వాకుల విచారించి తన కుమారుడని తెలిసియు మరణదండన విధించెనట. మల్లికార్జున స్వామి మాధవ వర్మన్యాయ నిర్ణయమునకు మెచ్చి మరణించిన బాలుని బ్రతికించి, ఉరిశిక్షకు గురియైన మంచన భట్టారకుని రక్షించి విజయ వాటికలో కనక వర్షము కురిపించెనట. ఈ కథ నిజమైనను కాకున్నను నాల్గవ మాధవ వర్మ దుర్గా మల్లీశ్వరుల భక్తుడగుట, అతని పరిపాలన న్యాయసమ్మత మగుట నిజము.

ఈరాజు క్రీ.శ. 576 నుండి 623 వరకు పాలించెను.

## మంచన భట్టారకుడు

నాల్గవ మాధవవర్మకుమారుడైన మంచన భట్టారకుడు క్రీ.శ.623 లో రాజ్య సింహాసనము లంకరించెను.

ఈతడు సింహాసనమునకు వచ్చునప్పటికే చాళుక్యులు ఆంధ్రదేశమును ఆక్రమింపదొడగిరి. చాళుక్యులతో జరిగిన ఘోరసంగ్రామములోనే నాల్గవమాధవవర్మ మరణించియుండ వచ్చునని చారిత్రికుల యభిప్రాయము.

మంచన భట్టారకుడు సామంత మాండలికులను సైన్యమును సమీకరించుకొని చాళుక్యులతో పోరుసల్పెను. ఈ యుద్ధములు చాలాకాలము సాగెను. ఈతడు సుమారు 23 సంవత్సరములు అజ్ఞాతవాసియై యుద్ధములొనర్చి, యుద్ధములతోనే జీవితమంతయు వెళ్లబుచ్చి ఆశయము సిద్ధింపక యుద్ధరంగముననే మరణించి యుండవచ్చునని కొందరు చారిత్రికుల యభిప్రాయము. ఏదేమైనను విష్ణుకుండిన వంశరాజ్యము మంచనభట్టారకునితో ముగిసినది.

# విష్ణుకుండినుల కాలంలోని సాంఘిక స్థితి

విష్ణుకుండినులు మొట్ట మొదట ఇక్ష్వాకుల వంశీయుల సామంతులు గా ఉండి, ఇక్ష్వాకులు బలహీనులైన సమయమున స్వతంత్రులై మహబుబ్‌నగర్ జిల్లాలోని అమరాబాదును రాజధానిగా మహారాజేంద్ర వర్మ క్రీ.శ. 358 లో విష్ణు కుండిన రాజ్యమును స్థాపించెను. ఈవంశమున 12 మంది రాజులు కలరు. సుమారు 266 సం||లు వీరు ఆంధ్రదేశమును పరిపాలించిరి. వీరువేయించిన శాసనములలో 9 తామ్రశాసనములు 2 శిలాశాసనములు లభించినవి. ఈశాసనములందు విష్ణుకుండిన రాజులు "దక్షిణాపథపతి త్రికూటమలయాధిప, శ్రీపర్వతస్వామి పాదానుధ్యాయులు" గా పేర్కొనబడినారు. విష్ణుకుండిన రాజ్యము కృష్ణాగోదావరీ నదులమధ్య ప్రాంతమందే కాక వాకాటక సామ్రాజ్యము కూడ తమరాజ్యములో కలుపు కొని దక్షిణాపథమును యావద్దక్షిణ భారతమును పరిపాలించిరి. విష్ణుకుండినుల రాజధానులు మొదట అమరాబాదు, తర్వాత ఇంద్రపాల నగరము తర్వాత అమరావతి నగరములు.

## పరిపాలన విధానము

విష్ణుకుండినుల పరిపాలన కాలమున ఆంధ్రదేశము మహోజ్జ్వలముగా భాసిల్లినది. వీరు బ్రహ్మక్షాత్ర తేజస్సును కలవారు. శౌర్యధైర్య ప్రతాపములచే పరరాజ్యములన్నింటిని జయించి సువిశాల సామ్రాజ్యమును స్థాపించిరి.

విష్ణుకుండినులు పరిపాలనా సౌకర్యార్థము దేశమును రాష్ట్రములుగా, విషయములుగా విభజించిరి. ఆకాలమున భూమిని నివర్తనములలో కొలిచేవారు-రాష్ట్రమునకు అధికారి రాష్ట్రికుడు. విషయమునకు అధికారి విషయాధిపతి. రాష్ట్రికుడు విషయాధిపతి ఆజ్ఞలకు లోబడి పరిపాలనా వ్యవహారములు సాగించుచుండిరి. రాజుచేయు దానములకు ఆజ్ఞాపిగా (ఆజ్ఞాపకుడు) స్వయముగా రాజుగానీ యువరాజు గానీ మహామాత్య సామంత రాష్ట్రికులు గానీ వ్యవహరించుచుండిరి. రహస్యాధికారి లేక అంతరంగికుడు రాజాజ్ఞలను అమలు పరుచుచుండెను. రాజులు నిరంకుశులైనను ప్రజాభిప్రాయమునకనుసరించి, అమాత్యుల సలహాలను పాటించి రాజ్యపాలనము చేయుచుండిరి.

మంత్రులు సామంతులు మాండలికులు సామ్రాజ్యపాలనలో రాజుకు సహకరించు చుండిరి. దండనాయకులు చమూపతులు సైనికులు యుద్ధమునందు విజయము సాధించుటలో ప్రభుభక్తి పరాయణులై యుండిరి. రాజ్యసరిహద్దులు రక్షించుటలో అలజడులనణుచుటలో రాజునకు తోడుగా సామాంత మాండలికులు చమూపతులు వ్యవహరించు చుండిరి.

విష్ణుకుండిన రాజులలో మొదటిగోవిందవర్మ బౌద్ధమతానుయాయియై అనేకస్థూపములను విహారములను చైత్యాలయములను నిర్మించెను. అట్లే అనేక దేవాలయము లను నిర్మించెను. రెండవ మాధవ వర్మ నుండి విష్ణుకుండిన రాజులందరు వైదిక మతావలంబులై వైదిక మతోద్ధరణకు పాటు పడిరి. రెండవ మాధవవర్మ, "ఏకాదశాశ్వమేధ బహుసువర్ణ పౌండరీకవాజపేయ క్రతు సహస్ర సర్వమేధ రాజసూయ పురుషామేధద్య హరసమ్య నుష్ఠిత శృతి విహితాశేష దుష్కరకర్మణా యాభుపో బర్బర్ మహి రాజశ్రీ మాధవ వర్మణః" అని వర్ణింప బడినాడు.

నాల్గవ మాధవ వర్మ వేయించిన పోలమూరు శాసనమున "క్రతు సహస్రయాజి హిరణ్యగర్భ ప్రసూతః ఏకాదశాశ్వమేధా వభృధస్నాన విఘట జగదేనస్కః సర్వభూాత పరిరక్షణా" అని వర్ణింపబడినారు.

రెండవ మాధవ వర్మవలె నాలుగవ మాధవవర్మ అనేక యజ్ఞములు ఒనర్చెను వీరు షోడశ మహాదానములను హిరణ్యగర్భదానములను బ్రాహ్మణుల కొసంగిరి. విష్ణు కుండినులు ఆచరించిన యజ్ఞములు, క్రతువులు చేసిన దానములూహించిన ఆరాజులెంతటి దాతృత్వము కలవారో వారిరాజ్యమెంతటి సుసంపన్నమైనదో ప్రజాజీవన విధానమెట్టిదో తెలుసుకొనుటకు వీలగుచున్నది. వీరికాలమున దేశము సుభిక్షమై శత్రువులదండ యాత్రలు లేక సుఖమయజీవనము ప్రజలుగడుపుచుండిరి.

విష్ణుకుండినుల వంశీయుల ఆరాధ్యదైవము శ్రీశైల మల్లికార్జునుడు, కర్నూలు జిల్లాయందలి నల్లమలకొండలలో వెలిసినాడు. ఈ కొండలనే శ్రీపర్వతము లేక శ్రీగిరి శ్రీశైలములందురు.

విష్ణుకుండిన ప్రభువులు అనేక దేవాలయములు నిర్మించిరి. విక్రమేంద్ర భట్టారక వర్మ పరమ మాహేశ్వరుడని శాసనములందు వర్ణింపబడినాడు.

# విష్ణుకుండినులు – భాష –సాహిత్యము

విష్ణుకుండినులు మొదట ప్రాకృత భాషనాదరించినను గోవిందవర్మ పరిపాలనాకాలము నాటికి సంస్కృతమును తమరాజభాషగా స్వీకరించిరి.

వీరికాలమున అనేక ఘటికాస్థానములు నెలకొల్పిరి వీరికాలమున వైదిక విద్యలందు నిష్ణాతులైన పండితులేగాక బౌద్ధ సాహిత్యము నందు పాండిత్యము గల మంత్రాచార్యులుండిరి.

బౌద్ధ పండితులలో దశబలబరి అను పండితుడు సర్వశాస్త్ర పారంగతుడని, గోవింద వర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము వలన తెలియుచున్నది. జనాశ్రయ బిరుదాంకితుడైన నాల్గవ మాధవ వర్మ పేర జనాశ్రయ చంధో విచ్చిత్తి వెలసి యుండ వచ్చును. ఈ గ్రంధము చంధ శాస్త్ర గ్రంధము, అవలారిక పద్యములు లభించుట లేదు ఈ గ్రంధమును నాల్గవ మాధవ వర్మ రచించెనో లేక గణస్వామి రచించెనో తెలియకున్నది. జనాశ్రయుని కాలమున వ్యాప్తిలోనున్న కవితలకు పద్యములకు ఈ గ్రంధమున వివరణగలదు. ఇందు ఐదవ అధ్యాయమున తెలుగు కవితకు సంబంధించిన గణ, యతి ప్రాసలనియమ నిబంధనలున్నవి. ఇందు శీర్షిక అను పద్యము చెప్పబడినది. శీర్షిక పద్యాంతమున గీతపద్యముండును. ఇది తెలుగు నందలిసీస పద్యము వంటిది. ఈ గ్రంధమున జాతి, ఉప జాతి పద్యములు ఆంధ్రకవిత్వమునకు ఛందస్సునకు అనుకూలముగా నున్నవి. ఇందు ద్విపద త్రిపద పద్యములున్నవి. ఈ గ్రంధమును బట్టి చూడగా విష్ణుకుండినుల కాలము నాటికి తెలుగు కవిత కలదా అని అనుమానము జనించుచున్నది.

విష్ణుకుండినులకాలమున వ్యాపారము చక్కగాసాగినది. విదేశ వ్యాపారానుకూల పరిస్థితులు, చక్కగానుండెను. ఆంధ్రనావికులు ధైర్యసాహసము లతో సముద్రములపై ఓడలు నడిపేవారు. విదేశ వ్యాపారకము వలన విష్ణుకుండిన సామ్రాజ్యము సిరిసంపదలతో తులతూగుచుండెను.

విష్ణుకుండినుల నాణెములపై ఓడ గుర్తులున్నవి, లంఘించు సింహపు గుర్తులున్న నాణెములు కూడ విష్ణు కుండినుల కాలము నందుండెను. రామతీర్థ, చిక్కుళ్ళ, పోలమూరు, ఇంద్రపాలనగరశాసనములకు అమర్చబడిన కడియములకు గల రాజ ముద్రికలపై లంఘించు సింహపు బొమ్మ, పూలకుండి కనిపించు చున్నవి.

విష్ణుకుండినుల నాణెములు ఆంధ్రదేశమున నల్గొండ మండలమున దొండపాడు గ్రామమున లభించినవి. ఏలేశ్వరము భువనగిరి, ఇంద్రపాల నగరము పణిగిరి ప్రాంతము అందు లభించినవి. తెలంగాణమున మెదకు జిల్లాలో కొండాపురమునందు కరీంనగరు జిల్లానందును కనుపించినవి. మధ్య భారతమున కూడ విష్ణుకుండినుల నాణెములు దొరికినవి ఏలమంచిలి వద్ద లభించిన నాణెములు విష్ణుకుండినులవే.

**శిల్పము:**

విష్ణుకుండిన రాజులు శిల్పకళకు ఎనలేని సేవ యొనర్చిరి. ఈ రాజులు వాస్తు శిల్పులను శిల్పకళాభిజ్ఞులను ఆదరించిరి. బౌద్ధారామ స్థూపములను దేవాలయములను నిర్మింప జేసిరి. ఈ రాజులు నిర్మించిన దేవాలయములు, గుహాలయములు శిల్పకళామతల్లికి ఆటపట్టులు. ఇంద్రకీల పర్వతము ఉండవల్లి, మొగలు రాజపురము నెల్లూరులోని భైరవకొండ, ఇంద్రపురములోని ఆలయాలు శిల్పకళావిలసితము లైనవి. ఈ ఆలయము లోని మండపములు చతురస్రాకార స్తంభములపై ఆధారపడి యుండును. మందిర ద్వారములన్నింటిలో ప్రక్కలోనున్న గూళ్ళలో ద్వారపాలకుల విగ్రహములు నిలుపబడినవి. ఈ విగ్రహములు జుట్టుముడితోను తలపై రెండు కొమ్ములతోనూ, విచిత్రాలంకారములతోను కనుపించును. స్థంబముల పైచెక్కబడిన లతలు, పనితనమునాటి శిల్పులచాతుర్యమును చాటుచున్నవి. దేవాలయస్తంభముల అడుగుభాగమున పూలకుండి, దానినుండి పుష్పములు బయటికి వచ్చునట్లు మహోద్భుతముగా చెక్కబడినవి. మండపముల అడుగు భాగములందు గోడలపై పంజాయెత్తి లంఘించుటకు సిద్ధముగానున్న సింహముల ప్రతిమలున్నవి.

ఈ విధముగా విష్ణుకుండిన రాజన్యులు లలితకళలల్లో ముఖ్యములైన సాహిత్యమును, శిల్పమును పోషించి, తమవంశ ప్రతిష్ఠ చిరకాలముండునట్లు గావించినారు.

# బాదామీ చాళుక్యులు

దక్షణాపథమును పరిపాలించిన రాజ వంశములలో చాళుక్యవంశము ప్రసిద్ధమయినది. ఈ వంశీయులు వివిధ ప్రాంతములందు వివిధ రాజ్యములను స్థాపించి పరిపాలించిరి. వారు

1. బాదామీ చాళుక్యులు
2. ముదిగొండ చాళుక్యులు
3. యలమంచలి చాళుక్యులు
4. సౌరాష్ట్ర చాళుక్యులు
5. వేములవాడ చాళుక్యులు
6. కళ్యాణీ చాళుక్యులు
7. పిఠాపుర చాళుక్యులు
8. నిరవద్యపుర చాళుక్యులు

వారి వారి రాజధానులనుబట్టి వారి వంశనామములతో శాఖలు పేర్కొనబడినవి. వీరిలో బాదామీ చాళుక్యులు, వేములవాడ చాళుక్యులు కళ్యాణీ చాళుక్యులు పేర్కొన దగినవారు. ఈ రాజవంశములు తెలంగాణా ప్రాంతమును సంపూర్ణముగా పరిపాలించినవి.

బాదామీ నగరమును రాజధానిగా పరిపాలించిన చాళుక్యులు బాదామి చాళుక్యులన బడినారు. వీరే సుమారుగా మిగిలిన చాళుక్య వంశములకు మూలము.

బాదామీ చాళుక్యులు పదకొండుగురు సుమారు 200 సంవత్సరములు దక్కను రాజకీయములందు ప్రధానపాత్ర వహించిరి. బాదామీ చాళుక్యరాజ్య స్థాపనతో దక్షిణాపథ రాజకీయములందు నూతన శకము ప్రారంభమైనది. ఇప్పటివరకు ఆంధ్రదేశమును పరిపాలించిన శాతవాహన, ఇక్ష్వాకుల, విష్ణుకుండిన, వాకాటక, **కదంబ, పల్లవ,** బృహత్పలాయనాది రాజవంశములన్నియు బ్రాహ్మణులవే. చాళుక్యులు చతుర్థకులజులు కొన్ని శాసనములందు క్షత్రియులుగా వర్ణింపబడినారు.

బాదామీ నగరము 'వాతాపి' నగరముగా ప్రసిద్ధిగాంచినది. ఈ నగరము దక్షిణాపథమున రాజకీయకేంద్రముగా గొప్ప వ్యాపారకేంద్రముగా నొప్పారినది. ఈ నగరమును బాదామీ చాళుక్యరాజులు అపురూప శిల్పసంపదతో శృంగారించిరి. దేవాలయములతో శత్రుదుర్భేద్యమయిన దుర్గముతో ఎత్తయిన నింగినంటు సౌధములతో విశాలమయిన రాజవీధుల సమస్త సౌకర్యములతో అలరారునట్లు తీర్చిదిద్దినారు.

బాదామీ చాళుక్యులు తెలంగాణ ప్రాంతము నంతయును పాలించిరి. కావున మెదకు జిల్లా ప్రాంతమంతయు బాదామీ చాళుక్యరాజుల పరిపాలనలో నున్నదని చెప్పవచ్చును.

## జయసింహ వల్లభుడు

జయసింహ వల్లభుని పూర్వీకులు రాయలసీమ ప్రాంతమున మొదట నివసించినట్లు కొంత కాలము ఇక్ష్వాకుల సామంతులుగా ఉండినట్లు చారిత్రకుల అభిప్రాయము. కొంతకాలము తరువాత కుంతల దేశముచేరి వాకాటక రాజ్యమున స్థిరపడి క్రమముగా ఆ ప్రాంతమున వారికి విధేయ సామంతులయి యుండిరి. వాకాటక సామ్రాజ్యము రెండవ మాధవవర్మ కాలమున విష్ణుకుండిన రాజ్యమందు విలీనము కాగా విష్ణుకుండినుల సామంతులుగా కొంత కాలము బాదామీ ప్రాంతమును పాలించిరి.

జయసింహవల్లభుడు బాదామీనగర ప్రాంతమున సామంతునిగా ఉండి క్రీ. శ. 500 నుండి 525 వరకు పరిపాలించెను.

## రణరాగుడు

రణరాగుడు జయసింహవల్లభుని కుమారుడు క్రీ.శ. 520 చాళుక్య సింహాసనమధిష్ఠించెను. ఆకాలమున 'మౌఖరి' వంశీయులు దక్కను ఉత్తర ప్రాంతము నేలుచుండిరి, మౌఖరి ఈశానవర్మ విష్ణుకుండిన ఇంద్రభట్టారకవర్మను ఓడించెను. మౌఖరి ఈశానవర్మతో రణరాగుడు స్నేహమును ప్రకటించెను. ఈ విధముగా విష్ణుకుండినుల సార్వభౌమత్వమును లెక్కించక అంతః కలహములను ఊతగాకొని స్వాతంత్ర్యమును ప్రకటించుకొనుటయే గాక విష్ణుకుండినుల రాజ్య భాగమును కూడా ఆక్రమించుకొనెను.

ఈతడు క్రీ.శ. 520 నుండి 540 వరకు పరిపాలించెను.

## మొదటి పులకేశి

రణరాగుని కుమారుడయిన మొదటి పులకేశి తండ్రి అనంతరము క్రీ.శ. 540లో సింహాసన మధిష్ఠించెను.

మొదటి పులకేశి తాత తండ్రులనాటి సామంతరాజ్యముతో సంతృప్తి చెందక, గొప్ప సైన్యమును సమీకరించుకొని క్రీ.శ. 546లో బాదామీ నగరమును స్వాధీనపరుచుకొని దానిని తన రాజధానిగా చేసుకొనెను. మొదటి పులకేశి మహారాజు యువరాజుగానున్న సమయమున మౌఖరి ఈశానవర్మకు సహాయపడి విష్ణుకుండిన ఇంద్రభట్టారకవర్మతో యుద్ధమొనర్చి అతనిని ఓడించి అతనికిగల 'సత్యాశ్రయ' బిరుదమును గ్రహించి తానా బిరుదమును ధరించెను.

మొదటి పులకేశి నిర్మించిన బాదామీ దుర్గము బలిష్టమయినది. బాదామీ దుర్గమును చేరువలో మొదటి పులకేశి నిర్మించిన దేవాలయములు, అతడు వేయించిన శాసనములు అనేక కట్టడములు శిథిల రూపమున కనిపించుచున్నవి.

మొదటి పులకేశి అగ్నిష్టోమ, అగ్నిచయన, వాజపేయ, బహుసువర్ణ, పౌండరీక, అశ్వమేధాది యజ్ఞములు చేసినట్లు శాసనములందు పేర్కొనబడినాడు. ఇతని రాణి దుర్లభదేవి బాట్పుర కుల సంజాత.

ఇతడు మహాకూటస్తంభకుల శాసనమున 'పృధ్వీవల్లభ' యనియు ఐనోలు శాసనమున '(శ్రీ)వల్లభ' అనియు పేర్కొనబడినాడు.

ఇతడు క్రీ.శ. 540 నుండి 566 వరకు పరిపాలించినాడు.

## మొదటి కీర్తివర్మ

మొదట పులకేశి జ్యేష్ఠ కుమారుడయిన కీర్తివర్మ క్రీ.శ. 566లో రాజయి సుమారు 30 సం॥ లు పరిపాలించెను.

వినయాదిత్యుని పణ్యాల తామ్ర శాసనమున మొదటి కీర్తివర్మ "పరాక్రమాక్రాంత వనవాస్యాది పరన్నృపతి మండల ప్రణిబద్ధ విశుద్ధ కీర్తిః కీర్తివర్మ పృథివీ వల్లభ మహారాజస్య" అని ప్రశంసింపబడినాడు. ఇతడు అరివీర భయంకరుడై మహాబల పరాక్రమోపేతుడై అనేక సామంత మాండలిక రాజ్యములను జయించి. చాళుక్య రాజ్యమున కలుపుకొనెను.

మొదటి కీర్తివర్మ కాలమున చాళుక్యరాజ్యము నల్దిశల వ్యాపించినది. అంగ, వంగ, కళింగ, వట్టూర, మగధ, మాద్రక, కేరళ, గాంగ, మూషక, పాండ్య, ద్రమిళ, చోళ, అలూపు, వైజయంతి, నళ, మౌర్య, కదంబ, కాలచురి, రాజుల జయించినట్లు చరిత్ర తెలుపుచున్నది. ఈతడు బాదామీ చాళుక్యవంశ కీర్తి ప్రతిష్టలను దిగంతములు వ్యాపింపజేసెను.

విష్ణుకుండినుల రాజ్య పతనానంతరము బాదామీ చాళుక్యులు తెలంగాణా ఆంధ్ర ప్రాంతములను సంపూర్ణముగా కైవసమొనర్చుకున్నారు. కీర్తివర్మ అనేక యుద్ధములందు విజయము సాధించి క్రీ.శ. 596 వరకు రాజ్యమును పరిపాలించెను. ఈతనికి సమస్త యుద్ధములలో ఇతని సోదరుడగు మంగళేశుడు సహకరించెను.

## మంగళేశుడు

కీర్తవర్మ సోదరుడయిన మంగళేశుడు అన్న మరణానంతరము చాళుక్య సింహాసనమధిష్టించెను. కీర్తివర్మ కుమారులుండగా మంగళేశుడు రాజగుటకు కారణము వారు పిన్నవయస్కులుగా నుండుట కావచ్చును లేక రాజ్యకాంక్షతో కావచ్చును.

కీర్తివర్మ యనంతరము కొందరు సామంతులు తిరుగుబాటు యొనర్చగా మంగళేశుడు వారితో భీకరముగా పోరాడి విజయములుసాధించెను.

కీర్తివర్మ జ్యేష్ఠ కుమారుడగు రెండవ పులకేశి తమకు చెందవలసిన చాళుక్య రాజ్యమును అప్పగింపక పినతండ్రి స్వయంగా పరిపాలించుట సహించలేక పోయెను. అమాత్య, దండనాయక, సేనాపతుల సహాయసహకారములతో మంగళేశుని సంహరించెను. మంగళేశుని పరిపాలనా కాలము క్రీ.శ. 596 నుండి 610.

## రెండవ పులకేశి

కీర్తివర్మ జ్యేష్టకుమారుడయిన రెండవ పులకేశి పినతండ్రియగు మంగళేశుని సంహరించి క్రీ.శ. 610 లో రాజయ్యెను.

ఇతడు గొప్పవిజేత. దాయాదుల అంతఃకలహములతో కొందరు సామంతులు తిరుగుబాటునొనర్చిరి. రెండవ పులకేశి ధైర్య సాహసములతో తిరుగుబాటు చేసిన ఒక్కొక్క సామంతరాజ్యముపై దండెత్తి వశపరుచుకొనెను. అప్పయిక సామంతుని భీమరధీతీరమున జరిగిన యుద్ధమందు ఓడించెను. తరువాత వనవాసీ రాజ్యముపై దండెత్తి కదంబులనోడించి, వారి రాజ్యమందలి ఉత్తర భూభాగములను తన రాజ్యమున విలీనమొనర్చు కొనెను.

పశ్చిమగాంగరాజు రెండవ పులకేశి శక్తి సామర్థ్యములను తెలిసి సంధిగావించుకొని తన కుమార్తెనిచ్చి వివాహముగావించెను. దీనితో పశ్చిమగాంగ చాళుక్యవంశములకు సంబంధమేర్పడెను.

పులకేశి ఉత్తర కొంకణము పై దండెత్తి అచటి పాలకులను జయించి తనరాజ్యాంతర్భాగముగా గ్రహించెను.

శ్రీహర్షుడు ఉత్తర భారతమునంతయు ఏకచ్ఛత్రాది పత్యమగా పరిపాలించుచు దక్షిణాపథముపై దృష్టిసారించి ప్రచండ సైన్యముతో వచ్చుచుండెను. శ్రీహర్షుడు దండెత్తి వచ్చుచున్న వార్తనెరింగిన పులకేశి గొప్పసైన్యముతో వింధ్య పర్వత సమీప మార్గమునందు అవరోధమును గలిగించి శ్రీహర్షుని సైన్యములను నర్మదానదీ తీరమున నెదుర్కొనెను. శ్రీహర్షుని సైన్యము చాళుక్యుల ధాటికాగలేక పలాయనము చిత్తగించెను. హర్షుడు పులకేశితో సంధిగావించుకొని మరలిపోయెను. ఈ యుద్ధము వలన రెండవ పులకేశి యావద్దక్షిణాపథ సార్వభౌమునిగా కీర్తిగాంచెను. మొదట పులకేశికిగల 'సత్యాశ్రయ' బిరుదమునితడు ధరించెను. 'ఏహ్యాల' తామ్ర శాసనమునందు "సమర సంసక్త సకలోత్తరాపథేశ్వర శ్రీహర్షవర్ధన పరాజయోపలబ్ధ పరమేశ్వరాపర నామధేయ సత్యాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజాధిరాజు" అని ఈతడు వర్ణింపబడినాడు. అంతేగాక పరమేశ్వరా, పరమభట్టారకా అనియు ఇతనిగూర్చి శాసనముల యందు కలదు.

రెండవ పులకేశి వేంగీరాజ్యమును జయించి రాజ ప్రతినిధిగా తనసోదరుడయిన కుబ్జవిష్ణువర్ధనుని నియమించెను.

కుబ్జ విష్ణువర్ధనుడు విష్ణుకుండిన రాజ్యముపై దండెత్తనాలోచించుసమయమున కళింగ సామంతులు తిరగుబాటు చేయగా వారినణుచుటకు పోయెను. అదను కనిపెట్టిన విష్ణుకుండిన మాధవవర్మ వేంగీరాజ్యము నాక్రమించుకొని క్రీ.శ. 623 లో పొలమూరు తామ్రశాసనము వేయించెను.

కుబ్జ విష్ణువర్ధనుడు కళింగ సామంతులను జయించి తిరిగివచ్చి, మాధవవర్మ నెదుర్కొని వేంగీనుండి తరిమి వేసి ఆతని రాజధానియగు బెజవాడను ముట్టడించెను. మాధవవర్మ సైన్యముతో తెలంగాణ ప్రాంతమునకు తరలిపోయి నేటి నలగొండ మండలమున మూసీనదీ తీరమున స్కంధావార మేర్పరచు కొనెను. కుబ్జవిష్ణువర్ధనుడు దండెత్తిరాగా మూసీనది తీరమున ఇరుపక్షముల వారికి మహాసంగ్రామము జరిగెను. అందు మాధవవర్మ సంహరింపబడెను. క్రీ.శ. 624 లో కుబ్జవిష్ణువర్ధనుడు విష్ణుకుండినులపై విజయము సాధించినందుకు గాను విష్ణుకుండినుల నాణెములపై 'విద్యుకల్తి' 'విషమసిద్ధి' అని చెక్కించెను. దీనితో తెలంగాణా ప్రాంతమంతయు బాదామీ చాళుక్యుల అధికార పరిధిలోనికి వచ్చినది.

రెండవ పులకేశి క్రీ.శ. 640 ప్రాంతమున రెండవ పర్యాయము పల్లవ రాజ్యముపై దండెత్తెను. పల్లవరాజయిన మొదటి నరసింహవర్మ ప్రచండ సైన్యముతో పులకేశి సైన్యములను ఎదుర్కొనెను. ఈ యుద్ధమున పులకేశి పరాజితుడై సైన్యమును నడిపించుకొని బాదామీ నగరము వైపు ప్రయాణము సాగించెను. కానీ నరసింహవర్మ పులకేశి సైన్యములను వెన్నంటి తరుముచూ పోయి బాదామీ కోటను ముట్టడించెను. ఈ యుద్ధమున నరసింహవర్మతో పోరాడుచూ రెండవ పులకేశి ప్రాణములను కోల్పోయెను.

అసమాన బలపరాక్రమోపేతుడై యావద్దక్షిణా పథ చక్రవర్తియై రెండవ పులకేశి అనేక దేవాలయములు నిర్మించి, కవిపండితుల నాదరించెను. ఇతడి పరిపాలనా కాలము క్రీ.శ. 610 నుండి 642.

## ఆదిత్య వర్మ

రెండవ పులకేశి మరణానంతరము అతని జ్యేష్ఠకుమారుడయిన ఆదిత్యవర్మ రాజయ్యెను. మూడేండ్లలోనే ఇతని సోదరుడు చంద్రాదిత్యుడు ఇతనిని పదవీభ్రష్టుని గావించి తాను రాజయ్యెను.

## చంద్రాదిత్యుడు

రెండవ పులకేశి రెండవ కుమారుడు చంద్రాదిత్యుడు- అన్నను తొలగించి రాజయినను 4 సం || లు మాత్రమే పరిపాలించెను. తమ్ముడిచే పదవీభ్రష్టుడయ్యెను. ఇతని పరిపాలనా కాలము క్రీ.శ. 645 నుండి 649

## మొదటి విక్రమాదిత్యుడు

రెండవ పులకేశి నాలుగవ కుమారుడు మొదటి విక్రమాదిత్యుడు అన్నయయిన రణరాగుని తొలగించి క్రీ.శ. 650 లో రాజయ్యెను. అన్నదమ్ముల పోరాటములలో సామంతులు స్వతంత్రులయిరి, విక్రమాదిత్యుడు తిరుగుబాటు చేసిన సామంత మాండలికులనణచివేసి, పల్లవులాక్రమించిన భూభాగములను కైవసము చేసుకొని, చోళ తుండీర మండలములను జయించి పల్లవ రాజ్యమును అల్లకల్లోల పరిచెను.

శాసనవములందితండు "సత్యాశ్రయ పృథ్వీవల్లభ మహా రాజాధిరాజ, భట్టారక" అని వర్ణింపబడినాడు. చిత్రకాంత అను పేరుగల అశ్వమునధిరోహించి విజయము సాధించెడివాడు.

విక్రమాదిత్యుడు తన కుమారుడగు వినయాదిత్యుని, మనుమడగు విజయాదిత్యుని ప్రచండ సైన్యముతో ఉత్తరాపథముపై దండెత్తపంపెను. వారు ఉత్తరాపథమునందు అనేక రాజ్యములపై విజయము సాధించిరి. ఈ సమయమున పల్లవరాజగు మొదటి పరమేశ్వర వర్మ చాళుక్య రాజ్యముపై దండెత్తి బాదామీనగరమును ముట్టడించి విక్రమాదిత్యుని ఓడించెను. పరమేశ్వర వర్మ బాదామీని ఆక్రమించుకొన్నంతనే ఉత్తర భారతమున యుద్ధమును చాలించి వచ్చిన వినయాదిత్య, విజయాదిత్యులు పరమేశ్వర వర్మను బాదామీ నగరము నుండి తరిమివేసి చాళుక్యరాజ్యము అన్యాక్రాంతము కాకుండ కాపాడిరి.

ఇతని పాలనా కాలము క్రీ.శ. 655 నుండి 681.

## వినయాదిత్యుడు

ఆదిత్యవర్మ కుమారుడయిన వినయాదిత్యుడు తండ్రి అనంతరము రాజ్యమునకు వచ్చి పూర్వ వైరముచే పల్లవులపై పలు దండయాత్రలు నిర్వహించెను. ఈ యుద్ధములలో ఒకమారొకరికి మరొక మారుమరియొకరికి గెలుపు లభించు చుండెను. కృష్ణానది దక్షిణ భూభాగములకై ఈ రెండు వంశములవారు తగువులాడుకొను చుండిరి.

వినయాదిత్యుడు కవి పండితులను పోషించి అనేక దేవాలయములకు అగ్రహారములనిచ్చెను.

ఇతని పరిపాలనా కాలము క్రీ.శ. 681 నుండి 696 వరకు.

## విజయాదిత్యుడు

వినయాదిత్యుని కుమారుడయిన విజయాదిత్యుడు క్రీ.శ. 696 లో రాజయి 37 సంవత్సరములు చాళుక్యరాజ్యమును పరిపాలించెను ఇతడు పల్లవులతో వైరభావము కలిగి అనేక యుద్ధములు చేసెను. యుద్ధములందు ఈతడి కుమారుడు రెండవ విక్రమాదిత్యుడు సహాయ పడుచుండెను. విజయాదిత్యుని సోదరి 'కుంకుమదేవి' ఇతడు 'పట్టడాకల్' నగరమున గొప్ప శివాలయమును నిర్మించెను నేడది సంగమేశ్వరాలయమని పిలువబడుచున్నది. ఈతని క్రీ.శ. 733 వరకు పరిపాలించెను.

## రెండవ విక్రమాదిత్యుడు

విజయాదిత్యుని అనంతరము అతని కుమారుడు రెండవ విక్రమాదిత్యుడు క్రీ.శ. 733 లో చాళుక్య సింహాసన మధిష్టించెను. ఇతని కాలమున శత్రురాజులు, సింధు, గూర్జరాతు ప్రాంతములను ఆక్రమించి స్థిరపడుటకు ప్రయత్నము చేసిరి. కానీ రెండవ విక్రమాదిత్యుడు వారిని అడ్డగించి ఆ ప్రాంతము నుండి తరిమివేసెను.

విక్రమాదిత్యుడు పల్లవుల రాజ్యసేనులపై దండెత్తి విజయములు సాధించెను. 'హైహయ' వంశపు రాజకుమారి 'లోకమహాదేవిని', కళాభ్రరాజ కన్య త్రైలోక్యమహాదేవిని రెండవ విక్రమాదిత్యుడు వివాహమడెను. లోకమహాదేవి పట్టణాకల్ నగరమున తన పేర లోకేశ్వరాలయమును నిర్మించెను. ఆ దేవాలయము ఇప్పుడు 'విరూపాక్ష' దేవాలయమని పిలువబడుచున్నది. ఈ నగరమునందు త్రైలోక్యమహాదేవియు ఒక ఆలయమును నిర్మించెను. విక్రమాదిత్యుని పరిపాలనా కాలము. క్రీ.శ. 733 నుండి 744 వరకు.

## రెండవ కీర్తి వర్మ

రెండవ విక్రమాదిత్యుని అనంతరము అతని కుమారుడు కీర్తి వర్మ రాజ్యపరిపాలనమును చేపట్టెను. కీర్తివర్మ కాలమున రాష్ట్రకూట వంశీయులు మాన్యఖేటమున బలవంతులయి యుండిరి. రాష్ట్రకూటుడయిన దంతిదుర్గుడు సైన్యమును సమకూర్చుకుని కీర్తివర్మ తో యుద్ధముచేసి అతనిని పదవీభ్రష్టుని గావించి చాళుక్యరాజ్యమును స్వాధీన పరుచుకొని రాష్ట్రకూట రాజ్యమును క్రీ.శ.755లో స్థాపించెను. కీర్తివర్మ పరిపాలనా కాలము క్రీ.శ. 744 నుండి 755 వరకు.

ఇంతటితో బాదామీ చాళుక్యరాజ్యము అంతరించినది.

# రాష్ట్రకూటులు

ప్రాచీనాంధ్ర సామ్రాజ్యములలో రాష్ట్రకూట సామ్రాజ్యమెన్నదగినది. రాష్ట్రకూటులు మొదటి బాదామీ చాళుక్య రాజుల సామంతులుగా మాన్యఖేట (మానుకోట) ప్రాంత పాలకులుగా రాజ్యము నేలుచుండిరి. వీరికి చాళుక్యులతో సంబంధ బాంధవ్యములుండెను. చాళుక్యరాజైన కీర్తివర్మను పదవీ భ్రష్టుని జేసి బాదామీని వశ పరచుకొని రాష్ట్రకూట రాజ్యమును స్థాపించిరి.

మెదకు జిల్లాలో ఈ రాజన్యులు వేయించిన శాసనములు లభించినవి. కావున మెదకు జిల్లా ప్రాంతాన్ని రాష్ట్రకూటులు పరిపాలించినారని చెప్పబడుచున్నది.

వీరు సుమారు 200 సంవత్సరములు యావత్ తెలంగాణ ప్రాంతమును పరిపాలించిరి.

## మొదటి ఇంద్రరాజు

రాష్ట్రకూట వంశమునకు ఈతడు మూలపురుషుడు. మొదటి ఇంద్రరాజు మాన్యఖేటము ప్రాంతమును చాళుక్యసామంతునిగా పాలించెను. ఈతని పాలనా కాలము క్రీ.శ. 696-710.

## మొదటి గోవింద రాజు

మొదటి ఇంద్రరాజ కుమారుడైన మొదటి గోవిందరాజు తండ్రి యనంతరము సింహాసన మధిష్టించెను. ఈతడు కూడా బాదామీ చాళుక్యులకు సామంతునిగానే యుండెను. ఈతని పాలనాకాలము క్రీ.శ. 710 నుండి 725.

## మొదటి కర్కరాజు

మొదటి గోవిందరాజు యనంతరము జ్యేష్ఠుడైన మొదటి కర్కరాజు పరిపాలనమునకు వచ్చెను. ఈతడు కూడా సమర్థుడు - యుద్ధ విద్యావిశారదుడు. అందుకే చాళుక్యరాజులు ఈతనితో బంధుత్వము నెరపిరి.

ఈయన పాలనా కాలము క్రీ.శ. 725-735.

## రెండవ ఇంద్రరాజు

మొదటి కర్కరాజు జ్యేష్ఠకుమారుడైన రెండవ ఇంద్రరాజు రాష్ట్రకూట సింహాసనమధిరోహించెను.

రెండవ ఇంద్రరాజు చాళుక్యరాజకన్యను కైరా వివాహమండపము నుండి తీసికొని వచ్చి రాక్షస పద్ధతిలో వివాహమాడినట్లు సంజముల శాసనము వలన తెలియుచున్నది.

ఈతని పాలన క్రీ.శ. 735-748.

## దంతివర్మ

రెండవ ఇంద్రరాజకుమారుడైన దంతి వర్మకడు సమర్థుడు.

బలపరాక్రమ శాలి. ఈతనినే దంతిదుర్గుడు అందురు. రాజ్యమునకు వచ్చుట తోడనే చుట్టు ప్రక్కలచిన్న చిన్న రాజ్యములను జయించి తన రాజ్యములో కలుపుకొని శక్తియుతుడయ్యెను.

చాళుక్య పల్లవ రాజులు ఒండొరులు సదాకలహించు కొనుచుండిరి. దంతివర్మ తన కుమార్తె యగు "రేవ" నుపల్లవ నందివర్మకు ఇచ్చి వివాహము జరిపించి బలవద్ మిత్రుత్వమును పొందెను. ఈ మిత్రుత్వముతో బలవంతుడై ప్రబలసైన్యముతో దంతివర్మ సౌరాష్ట్ర పాలకులగు చాళుక్యులను భరుకచ్ఛ ప్రాంత మునేలు ఘూర్జరులను యుద్ధములం దోడించెను.

ఈతడు బాదామీనగరముపై దండెత్తి బాదామీ చాళుక్యరాజగు రెండవ కీర్తివర్మను యుద్ధమున ఓడించి ఆ రాజ్యమును వశపరచుకొని రాష్ట్రకూట పతాకము నెగుర వేసెను. దీనితో బాదామీ చాళుక్యరాజ్య మంతమై రాష్ట్రకూట రాజ్యమారంభమైనది.

ఆతర్వాత ఈతడు కాంచి, కళింగ, కోసల, శ్రీశైలము, మాళవ, లాట, సింధు రాజ్యములను జయించి సువిశాలమైన సామ్రాజ్యము నేర్పరిచెను. ఈతని కాలము క్రీ. శ. 748 -758

## మొదటి కృష్ణరాజు (అకాలవర్షుడు)

దంతివర్మయనంతరము మొదటి కృష్ణరాజు రాజయ్యెను. దంతివర్మకు పుత్ర సంతానము లేదు. కావున సోదరుడైన కృష్ణుడు రాజ్యాధికారము వహించెను. ఈతనికి అకాలవర్షుడను బిరుదము కలదు.

ఈతడు రాజ్యాధికారమును చేపట్టగానే చాళుక్యవంశీయుడగు రాహిప్ప రాష్ట్రకూట రాజ్యభాగములపై యుద్ధ మొనరించి స్వతంత్ర రాజ్యమును స్థాపించెను. మొదటి కృష్ణరాజు రాహిప్పతో 8 సంవత్సరములు యుద్ధమొనర్చి రాహిప్పను రాజ్యభ్రష్టునిగావించి తిరిగి తన భూభాగము నంతయు తన యేలబడిలోనికి తెచ్చెను. అంతేగాక చాళుక్య రాహిప్పకు యుద్ధమున తోడ్పడిన వేంగీ చాళుక్య మొదటి విజయాదిత్యుని పై తన కుమారుడుగు రెండవ గోవింద వల్లభుని నాయకత్వమున ప్రచండ సైన్యమును పంపెను. ఆయుద్ధమున విజయాదిత్యుడోడిపోయి సంధిగావించుకొని రాష్ట్ర కూటులకు కేశ, బల, రాష్ట్రముల నప్పగించెను.

అకాలవర్షుడు పశ్చిమగాంగ వంశపు రాజగు శ్రీపురుషుని ఓడించి గంగవాడిని జయించి అతనిని సామంతునిగా చేసికొనెను.

ఈవిధముగా క్రీ.శ.758-772 వరకు పాలించెను.

## రెండవ గోవింద వల్లభుడు

అకాల వర్షుని జ్యేష్ఠకుమారుడైన రెండవ గోవింద వల్లభుడు తండ్రి మరణానంతరము రాష్ట్రకూట సామ్రాజ్యమునకు రాజయ్యెను.

ఈతడు తండ్రికి సాయమముగా అనేక యుద్ధములొనర్చి విజితుడయ్యెను.

ఇతనిని సువర్ణ గోవింద రాజని, ప్రభూత వర్షుడని పిలుతురు. ఈతడు క్రీ.శ.772-780 వరకు పాలించెను.

## ధ్రువరాజు

రెండవ గోవింద వల్లభుని సోదరుడైన ధ్రువరాజు అన్నను పదవీభ్రష్టుని గావించి క్రీ.శ. 780 లో సింహాసన మధిష్ఠించెను. ఈతడు మహాబల పరాక్రమవంతుడు. "నిరుపమ కలివల్లభ" "శ్రీవల్లభ," "ధారావర్ష" మొదలైన బిరుదములు ఈతనికి కలవు.

ఈతడు తూర్పు చాళుక్యులతో యుద్ధములొనర్చి విజితుడయ్యెను. వేంగిపాలకుడైన విష్ణువర్ధనుడు తనచే పరాజితుడై తన కుమార్తెను శీలమహాదేవిని ధ్రువరాజునకిచ్చి వివాహమొనర్చెను. ఈతడు 780-792 వరకు పాలించెను.

## మూడవ గోవిందుడు

ధ్రువరాజు మరణానంతరము అతని కుమారుడు మూడవ గోవిందుడు రాజ్యాధికారము వహించెను.

ఇతనికి శ్రీవల్లభ - జగత్తుంగ - జనవల్లభ - కీర్తినారాయణ- త్రిభువన ధవళ- ప్రభూతవర్ష- మొదలుగాగల బిరుదములు గలవు.

ఇతడు జీవిత కాలమంతము యుద్ధములందు గడిపిన యుద్ధ విద్యావిశారదుడు. పల్లవులతో, పశ్చిమ గాంగులతో-తూర్పు చాళుక్యులతో, ఘూర్జరులతో, ప్రతీహారులతో యుద్ధములు చేసి విజితుడయ్యెను.

గోవిందరాజు కాంచీ, వేంగీ దేశములపై దండయాత్ర నిర్వహించినట్లు రధనపుర శాసనము తెల్పుచున్నవి.

ఉత్తర భారత పాలకుడైన రెండవ నాగభట్టు గోవిందునకు వ్యతిరేకముగా వేంగీ చాళుక్య ప్రభువులతో సింధు ప్రాంతమున స్థిరపడిన అరబ్బులతోను సంధి సమాలోచనలు జరుపుట తెలిసికొని గోవింద రాజు అతని పై యుద్ధమును ప్రకటించి జయించెను. గంగా నది వరకు భూభాగములను జయించెను. గోవిందుడు ఉత్తర దిగ్విజయ యాత్ర జరుపుచున్న సమయమున చోళ-పాండ్య-కేరళ-గంగావాడి పాలకులు రాష్ట్రకూట రాజ్యము పై దండెత్తి నారు. గోవిందుడు ఉత్తర దిగ్విజయయాత్ర చాలించుకొని దక్షిణ ప్రాంతమున చేరి తన రాజ్యభాగములపై వచ్చిన రాజులనందరిని ఓడించి తరమి వేసెను. ఆ సమయమున సింహళదేశపు రాజు తనపై యుద్ధమును ప్రకటింప వలదని గోవిందునకు కప్పము చెల్లింతునని రాయబారమంపెను.

ఈ విధముగా గోవిందుడు అవిక్ర పరాక్రమముతో దక్షిణభారతమునే గాక ఉత్తర భారత భూభాగమును సైతము జయించి అనేక సామంత మాండలికులను గలిగి క్రీ.శ. 792 నుండి క్రీ.శ. 814 రాజ్యపాలన మొనర్చించెను.

## అమోఘ వర్షుడు

మూడవ గోవింద రాజు కుమారుడైన అమోఘవర్షుడు తండ్రి మరణానంతరము క్రీ.శ. 814 లో సింహాసన మధిష్ఠించెను. ఈతడు రాజగునాటికి చిన్న బాలుడు. అమోఘవర్షుడు యుక్త వయస్కుడగు వరకు మూడవ గోవిందుని సోదరుడును సౌరాష్ట్ర పాలకుడునగు కనక సువర్ణ వర్షుడు పాలనా వ్యవహారమును నిర్వహించెను. సూరతు శాసనమున కనకసువర్ణవర్షుడు, అమోఘవర్షుని రాజ్యమున సుప్రతిష్ఠుని జేసినట్లు వర్ణించబడినది. అమోఘవర్షుడు వేయించిన గంజము శాసనమున తనను పాటలమల్లుడు రాజ్యమున నెలకొల్పినట్లు తెలుపబడినది. దీనిచే పాటలమల్లుడే కనకసువర్షుడు కావచ్చునని చెప్పవచ్చును.

బాలుడైన అమోఘవర్షుడు సింహాసన మధిష్ఠించుట వలన సామంత మాండలికులు కొందరు స్వాతంత్ర్యమును ప్రకటించుకొనిరి. అమోఘవర్షుని విధేయ సామంతుడు బంకెయ వనవాసి రాజ్యపాలకుడు. ఈతడు రాజభక్తితో అంతః కలహములను రూపుమాపి అమోఘవర్షునకు అండగా నిలిచెను.

బంకేయ రాజభక్తికి మెచ్చి సార్వభౌముడు అతనికి వనవాసి, కుందుర్గము, బెల్‌గొదూ, కుందరారి, పుంగేరి రాష్ట్రములను పాలించు అధికారమొసంగెను.

క్రీ.శ. 848 లో తూర్పు చాళుక్య రాజగు గుణగాంక మూడవ విజయాదిత్యుడు రాష్ట్రకూట రాజ్య భాగములపై దండెత్తి ఆక్రమించుకొనెను. అమోఘవర్షుడు వేంగీ దేశము పై దండెత్తి గుణగాంక మూడవ విజయాదిత్యుని యుద్ధమునందోడించెను మేనత్త కుమారుడగుటచే సామంతుని గానుండునట్లు ఒడంబడిక చేసికొనెను.

గంగవాడిపాలకుడైన ఎఱయనీతి మార్గుడు, తోటి సామంత మాండలికులకూడగట్టుకొని రాష్ట్రకూటాధికారమును ధిక్కరించి స్వాతంత్ర్యమును ప్రకటించుకొనెను. అమోఘవర్షుడు తన సేనాని బంకేయ నల్లకేతను తూర్పు చాళుక్య విజయాదిత్యుని ప్రచండసైన్యముతో గంగవాడిపై యుద్ధమునకు బంపెను. వారు యుద్ధమున ఎఱయనీ తిమార్గుని ఓడించి బంధించిరి. ఎఱయనీతిమార్గుని శక్తి సామర్థ్యములు తెలిసికొన్న అమోఘవర్షుడు ముందు చూపుతో అతని కుమారుడైన బూతుగునికి తనకుమార్తె అబ్బలబ్బెను ఇచ్చి వివాహమొనర్చి మైత్రి చేసికొనెను.

అమోఘవర్షుని జీవిత కాలమంతయు నెక్కువగా యుద్ధములందే గడిచి పోయెను. ఈతడు స్వయముగా పండితుడు, కవి. ఈతనికి జైనమతముపై అభిమానముమెండు. తీరిక వేళలలో జైనమతాచార్యులతో మత విషయముల చర్చించువాడు ఈతడు కవి రాజమార్గము మొదలగు గ్రంధములను రచించెను జైనమత మీతనికాలమున రాష్ట్రకూట రాజ్యము నంతట వ్యాపించెను.

సువిశాల సామ్రాజ్యమునకు చిన్నతనముననే సార్వభౌముడై సుమారు 66 సంవత్సరాలు అజేయముగా పాలించెను.

ఈతని పాలనాకలము క్రీ. శ. 814 నుండి 880 వరకు.

## రెండవ కృష్ణుడు

అమోఘవర్షుని కుమారుడైన రెండవ కృష్ణుడు క్రీ.శ.880లో రాజ్యాధిపత్యము వహించెను. ఈతనికి అకాలవర్షుడని బిరుదము కలదు.

రెండవ కృష్ణుడు డాహల దేశాధీశుడైన కొక్కలుని కుమార్తెను వివాహమాడెను. ఈతని పరిపాలనా కాలమున వేంగీ దేశమును మూడవ గుణగ విజయాదిత్యుడు పాలించుచుండెను. అతడు కూడా స్వతంత్రేచ్ఛగలవాడు. కావున రాష్ట్రకూట రెండవ కృష్ణునెదిరించి స్వాతంత్రమును ప్రకటించుకొనెను. కృష్ణుడు అతని స్వాతంత్రమును అంగీకరించక మూడవ గుణగ విజయాదిత్యుని పై యుద్ధము ప్రకటించెను. కాని ఆయుద్ధమున రెండవ కృష్ణుడు పరాజయము పాలయ్యెను. గుణగ విజయాదిత్యుడు రెండవ కృష్ణుని ఓడించుటే కాక రాష్ట్రకూట రాజ్యాంతర్భాగముల నాక్రమించెను. రెండవ కృష్ణుడు బావ మరిదియగు సలిలుని ఆశ్రయించెను. విషయమును విన్న గణగ విజయాదిత్యుడు తన సేనానియగు పాండురంగనిని సైన్య సమేతముగా డాహిల రాజ్యము పైకి యుద్ధమునకు పంపెను. ఆ యుద్ధమున పాండురంగడు కృష్ణుని అతని బావమరిదిని ఓడించి సంధిగావించుకొనెను. దీనితో గుణగ విజయాదిత్యుడు కళింగ, దక్షిణాపథములపై సార్వభౌమాధి కారమును పొందెను.

క్రీ.శ. 892 లో గుణగ విజయాదిత్యుడు మరణించిన తర్వాత వేంగీ రాజ్యమునకు చాళుక్యభీముడు రాజయ్యెను. గుణగ విజయాదిత్యుని సోదరుడు యుద్ధమల్లుడు రాజ్యము నాక్రమించుటకై కృష్ణుని సాయముగోరెను. కృష్ణుడు యుద్ధమల్లునకు సహాయముగా వేంగి పై మరొకమారు యుద్ధమునకు వెళ్ళెను. చాళుక్య భీముడు వీరినోడించెను.

రాష్ట్రకూట రాజ్య విస్తరణకు రెండవ కృష్ణుడు అనేక కష్టాల పాలై దక్షిణ భారతమును సాధించెను. ఈ యుద్ధములందు కొత్త ప్రాంతములను జయించి పాత ప్రాంతములు గోల్పోయెను.

రెండవకృష్ణుడు జైన మతానుయాయి. జైన ఆదిపురాణ గ్రంధమును పూర్తిగావించిన గుణ భద్రుడు కృష్ణ రాజునకు గురువు.

ఈ విధముగా అకాలవర్ష బిరుదాంకితుడైన కృష్ణుడు 34 సంవత్సరాలు రాజ్య పాలన మొనరించి యెన్నోయుద్ధములు చేసి క్రీ.శ. 914 లో దివంగతుడయ్యెను.

## మూడవ ఇంద్రవల్లభుడు

ఈతడు రెండవ కృష్ణుని కుమారుడైన జగత్తుంగుని కుమారుడు. ఈతని తండ్రి యువరాజుగానే మరణించెను. పితామహుని మరణానంతరము మూడవ ఇంద్రవల్లభుడు క్రీ.శ. 914 న పట్టాభిషిక్తుడయ్యెను.

ఈతనికి "నిత్యవర్షుడు" అను బిరుదము కలదు. ఇంద్రుడు మొదట ఉజ్జయిని నగరము పై దండెత్తి దానిని ఆక్రమించుకొనెను. ఇతడు రాష్ట్రకూట రాజ్యభాగముల నాక్రమించిన కన్యాకుబ్జరాజగు మహిపాలుని ఓడించి కన్యాకుబ్జమును స్వాధీన పరచుకొనెను.

ఇంద్రవల్లభుడు తన కుమార్తెయగు రేవక నిర్మాణిని వేములవాడ చాళుక్య రాజైన II అరికేసరికిచ్చి వివాహము చేసెను.

ఇతని పాలనా కాలము క్రీ.శ. 914 - 929.

## రెండవ అమోఘవర్షుడు

రెండవ అమోఘవర్షుడు మూడవ ఇంద్రవల్లభుని జ్యేష్ఠ కుమారుడు క్రీ.శ. 929లో రాజ్యాధి కారమును వహించెను. ఈతడు ఒక సంవత్సరము మాత్రమే పాలించెను. ఈతని సోదరుడైన నాల్గవ గోవిందుడు అమోఘవర్షుని తొలగించి తాను రాజ్యాధి పత్యము వహించెను.

## (నాల్గవ) గోవిందుడు

నాల్గవ గోవిందుడు తన అన్నయగు రెండవ అమోఘవర్షుని పదవీభ్రష్టుని గావించి క్రీ.శ. 930 లో రాజ్యాధిపత్యము వహించెను. గోవిందరాజు సోదరుని రాజ్యభ్రష్టుని గావించుట వలన సామంతులాతనికి వ్యతిరేకులైరి.

గోవిందుడు వేంగి రాజ్యవ్యవహారములందు జోక్యము కల్గించుకొని లేని పోని చిక్కులు తెచ్చుకొనెను.

ముదిగొండ విజయాదిత్యుడు స్వతంత్రుడు కాగా అతనిని ఎదిరించి ఓడించెను. విజయాదిత్యునకు వేములవాడను పాలించు రెండవ అరికేసరి శరణుజొచ్చెను. అరికేసరి విజయాదిత్యునకు సాయము చేసెను. చేది రాజసైన్యముతో మూడవ ఇంద్ర వల్లభుని సోదరుడైన బద్దెగుడు యుద్ధరంగమున గోవిందుని ఓడించెను. గోవింద వల్లభుడు యుద్ధమునందోడి చోళమండలమున తలదాచుకొనెను.

## బద్దెగుడు

ఇంద్రవల్లభుని సోదరుడైన బద్దెగుడు అమోఘవర్షుడను బిరుదమును వహించి క్రీ.శ. 936 సింహాసనమధిష్ఠించెను.

బద్దెగుని కుమారుడు మూడవ కృష్ణుడు యువరాజు పదవిలో నుండి సమస్తరాజ్యభారము నిర్వహించెను. బద్దెగుడు తన కుమార్తెను గాంగవంశపు రెండవ బూతుగునకు ఇచ్చి వివాహము చేసెను.

## మూడవ కృష్ణుడు

బద్దెగుని యనంతరము మూడవ కృష్ణుడు రాజై క్రీ.శ. 939 నుండి 28 సంవత్సరములు పాలించెను.

కృష్ణుడు గాంగవాడి రాచమల్లునితో యుద్ధమొనర్చి అతనిని వధించి వాని రాజ్యమునాక్రమించి తన బావ బూతగునకుగాంగ రాజ్యమునిచ్చెను.

దక్షిణ అర్కాటు మండలమున గల శాసనములందు కృష్ణుడు 5వ రాజ్య సంవత్సరమున కాంచి-తంజై నగరముల జయించినట్లు కలదు.

ఈతనికి అకాల వర్ష-శ్రీ వల్లభ-అంక త్రినేత్ర-వనగజమల్ల, మొదలైన బిరుదములు కలవు.

మూడవకృష్ణుడు మహాపరాక్రమశాలి. చేది-మాళవఘూర్జర రాజులనోడించెను. చోళరాజగు పరాంతకుడీతని చేతిలో అపజయమొందెను. ఈతడు ద్రావిడ మండలము నాక్రమించెను.

కృష్ణరాజు రాష్ట్ర కూట రాజ్య పూర్వ వైభవమును స్థిరపరచి సామ్రాజ్యమును విస్తరింప జేసి క్రీ.శ. 967 వరకు పాలించెను.

## ఖొట్టిగ

కృష్ణరాజ సోదరపుత్రుడైన ఖొట్టిగ క్రీ.శ. 967 లో సింహాసనమధిష్ఠించెను. క్రీ.శ. 972 పారమార వంశజుడైన సీయకహర్షుడు మాన్యఖేటముపై దండెత్తెను. ఈ యుద్ధమున ఖొట్టిగ మరణించెను.

## రెండవ కర్కరాజు

ఖొట్టిగ కుమారుడైన కర్కరాజు క్రీ.శ. 972 లో సింహాసనమధిష్ఠించెను. ఈతని కాలము నాటికి రాష్ట్రకూట రాజ్యము పతనావస్థలోనుండెను.

బాదామీ చాళుక్య వంశమునకు చెందిన రెండవ తైలపుడు కర్కరాజునోడించి సింహాసనమాక్రమించి క్రీ.శ. 973 లో కల్యాణీ చాళుక్య రాజ్యమును స్థాపించెను.

రాష్ట్రకూటుల సామ్రాజ్యమునందు మెదకు జిల్లా భూభాగములున్నట్లు శాసనముల వలన తెలియుచున్నది.

రాష్ట్రకూటుల పాలనా వ్యవహారములందు చక్రవర్తి సర్వాధికారి. అతడు రాజధానిలో లేని సమయములందు యువరాజు కార్యములను చక్క బెట్టువాడు. యువరాజు పదవిలోనున్నవాడు ముత్యాల హారమును తప్పక ధరించ వలసి యుండెను. యువరాజు పదవి జ్యేష్ఠునకు మాత్రమే సంక్రమించు చుండెడిది.

# రాష్ట్రకూటులనాటి రాజకీయ సాంఘిక పరిస్థితులు

రాష్ట్రకూట రాజ్యమున పాలనా సౌలభ్యమునకు దేశము, రాష్ట్రము, విషయము, వాడి, భుక్తి గ్రామము, చిన్న గ్రామములుగ విభజింపబడియుండెను. నగరములను, పట్టణములను పాలించుటకు నగరపతులు లేక పౌరపతులు నియమింపబడు చుండిరి.

రాజస్థానములందు కవులు, పండితులు, శాస్త్రజ్ఞులు, వివిధ కళలలో ఆరితేరినవారు, పురోహితులు జ్యోతిష్యులు, ప్రాడ్వివాకులు ఉండెడివారు. అమాత్యులు, మహావిగ్రహి, సంధి విగ్రహి దండనాధులు, సామంతులు, మహా సామంతాధిపతులు, రాష్ట్రపాలకులు, పరిపాలనా విషయములందు రాజునకు చేయూతగా నుండెడి వారు. విషయాధిపతులు ఆవిషయము నందున్న అగ్రహారములను దానములను రక్షించుచు పన్నుల వసూలు కార్యక్రమములు చూచుచుండిరి.

గ్రామ కూటములు గ్రామ కూటుని ఆధీన మందుండెడివి. మూడవ గోవింద రాజు దనపుర శాసనమున 40 మంది సభ్యులున్న మహాజన సభ ప్రస్తావింపబడినది.

రాష్ట్రకూట సామ్రాజ్యమునందు గ్రామములో జన సభలుండెడివి. గ్రామములందు మేలావరము, కుడివరములందు ఆదాయ మార్గము లుండెను.

మేలావర ఆదాయము చక్రవర్తికి, కుడివర ఆదాయము మహా సభ వారి ద్వారా గ్రామాభివృద్ధికి వినియోగింపబడుచుండెను. గ్రామవివాదముల పరిష్కార బాధ్యత గ్రామాధికారి, గ్రామమహాజన సభా సభ్యులు నిర్వహించుచుండిరి.

ఉద్రంగ-ఉపరికర-భాగకర-భోగకర అను పన్నులు విధింపబడుచుండెను. సిద్ధాయము, భూతోత్పాత ప్రత్యాయశుల్కము, దండనశుల్కము, రాజోద్యోగుల వసతికై విధించు పన్నులు కూడా అమలు లోనుండెను. అంశకరము అనుపేర భూమిపన్ను ఉండెడిది పాలు-పెరుగు, వెన్న, నేయి, కూరగాయలు, పండ్లు తదితర నిత్యావసర వస్తువులపై వేయు పన్ను నుభోగకర మనెడివారు, భూమిపన్ను ధన రూపమున, ధాన్యరూపముననను వసూలు చేయబడుచుండెను.

గద్వాణము అనునాణెము బంగారునాణెము గద్వాణమునకు 2 కళంజులు. దినమున కొక గద్వాణము ప్రతి నావ నుండి వసూలు చేయుచుండిరి. స్వదేశమందలి-ఓడ రేవుల నుండి పశ్చిమ తీరములకు జేరునావలు ఒక రజత నాణెమును పన్నుగా యిచ్చుచుండెను.

సంతానహీనుల ఆస్తి వారి తదనంతరము రాజాధీనమగుచుండెను భూగర్భనిధి నిక్షేపములు, చందనము మొదలగు వృక్షములపై రాజుకే సర్వాధి కారముండెడిది.

శుక్రనీతి గ్రంథము రాష్ట్రకూటుల కాలమున రచింపబడెను. ఆగ్రంథము ప్రకారము రాజ్యాదాయమున ఆరింట మూడు భాగములు సైనిక వ్యయమునకు, ఒక భాగము మూలధనమునకు 2 భాగములు దానధర్మములకు రాజ్యపాలనా వ్యవహారములకు రాజాంతః పురవ్యయములకు వినియోగించు చుండిరి. రాష్ట్రకూట రాజ్యమున బ్రోచ్ లేక భరుకచ్ఛపము ప్రముఖమైన ఓడ రేవు పట్టణము.

కల్యాణి రేవు పట్టణము నుండి సన్నునూలుబట్ట ఇత్తడి, కలప విదేశములకు ఎగుమతి యగుచుండెను. బంగారు, వెండి నాణెములు ఆనాడు వాడుకలో గలవు. సువర్ణము, గద్వాణము, కలంజు, కాసు, అక్కము నాణెముల పేర్లు. నేతపని వారులకొక సంఘమున్నట్లు శాసనముల వలన తెలయుచున్నది. ఒక నిగమసభలో మొదటి అమోఘ వర్షుడైన రాష్ట్రకూట చక్రవర్తి మూలధనమును ఉంచి, దానిపై శాశ్వతముగా వచ్చు వడ్డీని కాలాను గుణముగ మార్పు చేయవలెనని శాసనమును వేయించెను.

**మతము :**

రాష్ట్రకూటులు హైందవ మతానుయాయులు. వీరు అనేక దేవాలయములు నిర్మించిరి. జైనమతానుయాయిలైన రాజులు కూడా రాష్ట్రకూటులలో కలరు. అమోఘ వర్షుడు, రెండవ కృష్ణుడు, జైన మతానుయాయులు.

మొదటి కృష్ణుడు ఎల్లోరాలోని 16 వ నంబరు గుహను నిర్మించెను. ఇందున్న శిల్పము వర్ణనాతీతము.

శిల్పకళా ప్రపంచముననే మకుటాయమానమైన ఎల్లోరాలోని కైలాసనాథ గుహాలయము, బాదామీ చాళుక్యుల కాలమునాటి పట్టడ కళ్లోని విరూపాక్ష దేవాలయములకన్న రెండింతల వైశాల్యము కలిగి, శిల్పసౌందర్యమున దానిని బోలియున్నది.

ఈ దేవాలయము ఆనాటి వైదిక మతాభిమానము శైవమునందలి ప్రేమను, రాష్ట్రకూట రాజుల శిల్ప కళాపోషణమును, హైందవమత ప్రాశస్త్యమును తెల్పుచున్నది.

ఈ ఆలయమును నిర్మించుటేగాక కృష్ణరాజు కాంచన మణిమయహారములను సమర్పించుకొనెననియు, గోవింద రాజు సామ్రాజ్యమందున్న 400 గ్రామాలను, 32 లక్షల బంగారు నాణెములను దేవాలయమునకు సమర్పించి తమ భక్తిని చాటుకొన్నట్లు చారిత్రక గ్రంథములు తెల్పుచున్నవి.

రాష్ట్రకూట రాజులలో కొందరు జైనమత సాంప్రదాయమును ఆరాధించిరి. ఐనను హైందవమును కించపరచలేదు. జైన మతానుయాయులైయుండియు. బ్రాహ్మణులకు అనేక అగ్రహారములనిచ్చిరి.

జైనులకు చైత్రశుద్ధ అష్టమి నుండి పౌర్ణమి వరకు పర్వదినములు. ఈ రోజులలో జైనులు ఉత్సవముల నిర్వహింతురు.

జైనదేవాలయములందు మహావీరునకు, తీర్థంకరులకు. నిత్యపూజలు, అంగరంగభోగములు, ధూపదీప నైవేద్యాదులు సక్రమముగా నిర్వహింప బడుచుండెను.

రాష్ట్రకూట సామ్రాజ్యమున రాజులు-సామంతులు ధనికులు, రాణివాసపు స్త్రీలు దేవాలయములకు, సంస్థలకు, విద్యాలయములకు అగ్రహారములను, సువర్ణాదిదానములను చేయుచుండిరి.

రాష్ట్రకూట రాజ్యమున ప్రజలు సుఖ సంతోషములతో జీవించుచుండిరి. యుద్ధ సమయములందు ప్రజలకు ఏ బాధలు కలుగ కుండెను.

## పాండిత్యము :

రాష్ట్రకూట సామ్రాజ్యమునందు అనేక మంది పండితులు, కవులు, శాస్త్రజ్ఞులు, వేద వేదాంగాదుల నభ్యసించినవైదికులు రాజులచే పోషింప బడుచుండిరి.

ధ్రువరాజు వేయించిన దూలియందాన శాసనమున వేదవేదాంగేతి హాస వ్యాకరణ పురాణమీమాంస తర్క-శాస్త్ర పండితులు దాన ప్రతి గ్రహీతలుగా వర్ణింపబడినారు. అనగా ఆనాడు అంతటి విద్యావంతులు కలరనియూహింప వీలగుచున్నది.

ఆరోజులలో దేవాలయములు, జైన మండపములు విద్యాలయములుగా భాసిల్లెడివి. ఈ విద్యాలయములకు రాజులు - రాజోద్యోగులు తమ యథోచితముగా భూహిరణ్యాదానముల నొనర్చు చుండిరి. విద్యార్థులకు ఉచిత భోజన వసతులు కల్పింపబడుచుండెను.

మూడవ కృష్ణరాజు కాలమున సలోత్గి అగ్రహారము పెద్ద సంస్కృత విద్యాలయము.

రాష్ట్రకూట సామ్రాజ్యము కాలమున లల్ల, ఆర్యభట్ట, వాచస్పతి, కుమారిల, శంకర భగవత్పాదాది మహామహులు జీవించి యనేక సంస్కృత గ్రంథముల రచించిరి.

మూడవ ఇంద్రరాజు ప్రకటించిన బేగముర శాసన రచయిత త్రివిక్రముడు. ఇతడు నలచంపూకావ్యము రచించెను.

హలాయుధుడు అను కవి 'కవిరహస్య గ్రంథము' ను రచించెను. ఇందు మూడవ కృష్ణరాజు ప్రశంసింపబడినాడు.

దంతివర్మ కాలమున అకలంక దేవుడు అను కవి "ఆప్తమీమాంస" భాష్యమును రచించినట్లు శ్రావణబెళగొళ శాసనము వెల్లడించుచున్నది. మాణిక్యనంది పరీక్షాముఖ సూత్ర తర్క గ్రంథము రచించెను.

కనకసువర్ణుని క్రీ.శ. 821 నాటి సూరత్ శాసనమును ధర్మోత్తరాచార్య విరచితమైన న్యాయబిందు టీకకు ధర్మోత్తరటిప్పణము రచింపబడినట్లు తెలియుచున్నది.

అమోఘ వర్షుని గురువగు జినసేనుడు హరివంశ రచయిత. అతడీ గ్రంధమున అమోఘవర్షుని కాలమందున్న రాజులను పేర్కొనెను.

జినసేనుడు అసంపూర్తిగా రచించిన ఆదిపురాణము అను జైనతీర్థంకరుల జీవిత చరిత్రలను అతని శిష్యుడు గుణ చంద్రుడు పూరించెను.

జినసేనుడు పార్శ్వాభ్యుదయమున కాళిదాసు మేఘసందేశమందున్న ప్రతి శ్లోక చతుర్థపాదమును గ్రహించి తన శ్లోకములంది మిడ్చెను.

శాకటాయనుడు అమోఘవృత్తి అను వ్యాకరణ గ్రంధమును, వీరాచార్యడు గణితసార సంగ్రహమును, అమోఘహర్షుడు కవిరాజమార్గమును, రచించిరి.

ఉభయ కవి చక్రవర్తి బిరుదాంకితుడైన పొన్న కవి శాంతి పురాణమును రచించెను.

మారసింహుని మంత్రి చాముండ రాముడు చాముండీ పురాణమును, రన్నమహాకవి అజిత పురాణమును రచించిరి.

ఈ విధముగా రాష్ట్రకూటులు మాన్యఖేట మును రాజధానిగా యావద్దక్షిణ భారతదేశమును పాలించి ఉత్తర భారత దేశమున కొంత భాగమును జయించి సువిశాల సామ్రాజ్యమును స్థాపించి, ప్రజానురంజకముగా కళలను పోషించుచు క్రీ.శ. 692 నుండి - 973 వరకు సుమారు 3 శతాబ్దములు పరిపాలించి భారత దేశ చరిత్రలో సముచిత స్థానమునాక్రమించిరి.

# కళ్యాణి చాళుక్యులు
# క్రీ.శ. 973 నుండి 1189

## కళ్యాణి చాళుక్యులు

- II భీమయుడు
  - అయ్యన I
    - విక్రమాదిత్య IV
      - II తైలపుడు (అహవమల్ల) 973-996
        - సత్యాశ్రయుడు 996-1008
        - దాసవర్మ లేకయశోవర్మ
          - త్రిభువనమల్ల విక్రమాదిత్య V (1008-1015)
          - అయ్యన II
          - జగదేకమల్ల జయసింహ I జయ సింహ 1015-1042
            - I సోమేశ్వర (1042 - 68)
              - II భువనైకమల్ల సోమేశ్వర 1068-76
                - త్రైలోక్యమల్ల బుయకరణ
                - III భూలోకమల్ల సోమేశ్వర 1126-38
                  - II పెర్మాడిజగదేకమల్ల 1138-49
                  - తైలపుడు 1149-62
                    - IV సోమేశ్వరుడు 1182-1200
                - మైలాలదేవి
              - విక్రమాదిత్య VI 1076-1126
              - జయసింహ
              - విష్ణువర్ధన విజయాదిత్య
            - ఆవల్లా దేవి



# కళ్యాణి చాళుక్యులు

## కళ్యాణీ చాళుక్యులు

మెదకు జిల్లా భూభాగం రాష్ట్రకూట వంశ పరిపాలానంతరము కళ్యాణీ చాళుక్యుల పరిపాలన క్రింద చేరినది. కళ్యాణీ చాళుక్యులు రాయలసీమ తెలంగాణ ప్రాంతములను కర్ణాటక మహారాష్ట్ర మధ్యప్రదేశ్ కళింగాది ప్రాంతములలో వీరి పరిపాలన మున్నట్లు చారిత్రికాధారములు కలవు. బాదామీ చాళుక్యరాజ్యము కన్న విశాలమయిన రాజ్యమును వీరు ఏర్పరచి పరిపాలించిరి. కళ్యాణీ చాళుక్యులు దక్షిణ భారత ప్రాంతములను ఏలిరి. వీరి రాజ్యమున వింధ్య పర్వతములు కలవు. కళ్యాణీ చాళుక్యులు తాము బాదామీ చాళుక్య వంశము వారమని చెప్పుకొని యున్నారు. 'రన్నకవి' కళ్యాణీ చాళుక్యులను బాదామీ చాళుక్య వంశజులు అని తెలిపినాడు. చాళుక్య వంశంతో ఛేది, కాళ్ళచూరి, వంశములతో వైవాహికాది సంబంధములున్నవి. రాష్ట్రకూట మూడవ కృష్ణుని కుమార్తె చాళుక్య రాజు కుమారుడయిన 'అయ్యన' ను వివాహమాడెను. వీరి కుమారుడు నాలుగవ విక్రమాదిత్యుడు. ఛేది రాజు కుమార్తె త్రిపురి పాలమడగు లక్ష్మణరాజు కుమార్తె విక్రమాదిత్యుని రాణులు. రాష్ట్రకూట వంశజుడగు 'బ్రహ్మహరట్టు' కుమార్తె తైలపుని వివాహమాడెను. మామ సహాయముచే తైలపుడు మాన్యఖేట రాజ్యము నవలీలగా జయించెను.

ఈ వంశీయుల తొలి రాజధాని మాన్యఖేటము మొదటిసోమేశ్వరుని కాలమున వీరి రాజ్యము కళ్యాణీ నగరమునకు మార్చబడినది. దానితో వీరు కళ్యాణీ రాజులయినారు.

## తైలపుడు

రాష్ట్రకూట మూడవ కృష్ణుడు క్రీ.శ. 968 లో మరణించెను. ఖోట్టిగుడు సింహాసన మలంకరించెను. ఇతడు సమర్థుడు క్రీ.శ. 972 లో సీయకవర్ష వాక్పతి మంజులు మాన్యఖేట నగరమును ముట్టడించి ఖోట్టగుని సంహరించిరి. ఖోట్టగుని తనయుడగు 'కర్కాలుడు' సింహాసనమధిష్టించెను. ఆ సమయమున బాదామీ చాళుక్య అన్వయుడయిన తైలపుడు మాన్యఖేటమును ముట్టడించి కర్కాలుని సంహరించి రాష్ట్రకూట రాజ్యమునాక్రమించెను. దానితో కళ్యాణీ చాళుక్యుల పరిపాలనము ప్రారంభమయినది.

క్రీ.శ. 976 నాటికి అతడు చక్రవర్తిగా కీర్తిగాంచినట్లు నొలంబరాణి రేవలదేవి శాసనమువలన తెలియుచున్నది. తైలపుని ఆజ్ఞచే అతని సేనాని బారపరాజు లాట దేశముపై దండెత్తి విజయము సాధించెను. తైలపుని కుమారుడయిన సత్యాశ్రయుడు కొంకణశిలాహర ఘూర్జరాధిపుల రాజ్యములపై దండయాత్రలు చేసి విజయం సాధించినట్లు రన్న మహాకవి గజా యుద్ధ కావ్యమున వర్ణింపబడినది.

తైలపుని రాజ్యము రట్టపాడిగ 7,50,000 ల సీమగా ప్రస్తుతింపబడినది. నేడు తెలంగాణా ప్రాంతమంతయు ఇతని రాజ్యమందుండెను. సామాన్య సామంత మాండలికునిగా ఉన్న తైలపుడు రాష్ట్రకూట రాజ్యము నంతరింపజేసి రాజ్యభాగమును విస్తృత పరిచి పారమార, చోళ, లాట, ఘూర్జర, పల్లికోట, భద్రక, వనవాసి మొదలయిన రాజ్యములను జయించెను. తైలపునకు రట్టుల, యాదవులు, కదంబులు, నోలంబులు మొదలుగా గలవారు సామంత మాండలికులుగా నుండిరి.

కాకర్త్య గుండన తనయుడగు గరుడ భేతరాజును హనుమకొండ విజయ పాలకునిగా నియమించెను. రాష్ట్రకూట వంశమున పుట్టిన 'జాకవ్వ' తైలపుని రాణి రన్న మహాకవి తైలపుని ఆస్థానమందుండెను. తైలపుడు జైన మతావలంబియై యుండెను.

ఈతడు జీవితంలో అధికభాగము యుద్ధము నందు గడిపి చాళుక్యరాజ్యమున చక్కని పరిపాలనా విధానమును ప్రవేశపెట్టి క్రీ.శ. 997 లో మరణించెను.

ఇతని పరిపాలనా కాలము క్రీ.శ. 965 నుండి 997.

## సత్యాశ్రయుడు

తైలపునకు సత్యాశ్రయుడు దాసవర్మ అను (యశోవర్మ) ఇద్దరు కుమారులు. తైలపుని మరణానంతరం పెద్దకుమారుడయిన సత్యాశ్రయుడు క్రీ.శ. 997 లో చాళుక్యరాజ్య సింహాసనము లంకరించెను.

కళ్యాణీ చాళుక్యరాజులకు సంబంధించిన శాసనములు అనేకములు కలవు. ఈ రాజవంశీయుల కాలమున కందూరు చోళులు కొన్ని శాసనములను ప్రకటించిరి. సత్యాశ్రయుడు తండ్రి సంపాదించిన రాజ్యమును విస్తృత పరిచెను. చోళరాజయిన రాజరాజు సత్యాశ్రయుని రాజ్యభాగములపై దండెత్తి క్రీ.శ. 1004 నాటికి ప్రట్టవాడి. గంగవాడి ప్రాంతముల నాక్రమించి స్వాధీన పరచుకొనెను.

చాళుక్య సత్యాశ్రయుడు క్రీ.శ. 1005 లో వేంగీ దేశమును ముట్టడించి ధర్మాన, ఎలమందల కోటలను స్వాధీనపరచుకొని గుంటూరు మండలమందున్న చేబ్రోలు ప్రాంతమున స్కందావాసరము ఏర్పరుచుకొనెను. ఆ సమయమున చోళరాజు చాళుక్య రాజ్యమును ముట్టడించగా సత్యాశ్రయుడు వేంగీ ముట్టడినాపి వెనకకు మరలి చోళరాజునోడించి తన రాజ్యమును రక్షించుకొనెను. ఈతనికి అకళంకచరిత్ర, ఇఱీవబెడంగ, అను బిరుదములు కలవు ఈతడు తన కుమార్తెయగు వృద్ధి మబ్బరసిని నోళంబరాజునకిచ్చి వివాహముగావించెను. ఈతని పరిపాలనా కాలము క్రీ.శ. 997 నుండి 1008.

## విక్రమాదిత్యుడు

సత్యాశ్రయునకు సంతానములేదు. అందుచేత అతని సోదరుడయిన దాసవర్మ (యశోవర్మ) కుమారుడయిన విక్రమాదిత్యుడు. క్రీ.శ. 1008లో చాళుక్య సింహాసన మధిష్ఠించెను. ఈతనికి 'త్రిభువనమల్ల' అను బిరుదమున్నది.

ఈతడు వేంగీ దేశముపై అనేక పర్యాయములు దండయాత్రలు సలపగా ఆ ధాటికి ఆగలేక వేంగీరాజయిన విమలాదిత్యుడు చోళరాజు నాశ్రయించెను. రాజేంద్ర చోళడు గొప్ప సైన్యముతో వేంగీని ముట్టడించి ఆక్రమించి విమలాదిత్యుని వేంగీ సింహాసనమున పునః ప్రతిష్ఠించెను.

విక్రమాదిత్యుడు జైన మతమున వలంబించెను. ఈతని పరిపాలనా కాలము క్రీ.శ. 1008-1014.

## అయ్యన

విక్రమాదిత్యుని సోదరుడయిన అయ్యన 1014లో రాజయ్యెను. చోళరాజేంద్రుడు విమలాదిత్యుని వేంగిలో ప్రతిష్ఠించిన పిమ్మట మాన్యఖేటమును ముట్టడించి ధ్వంసమొనర్చెను. రాజేంద్రచోళుడు కొలనుపాకపై దండెత్తి అయ్యనును సంహరించెను. ఈతని పరిపాలనా కాలము క్రీ.శ. 1014-1015 వరకు మాత్రమే.

## జయసింహుడు

జయసింహుడు అయ్యన విక్రమాదిత్యుల సోదరుడు. యుద్ధ నైపుణ్యము కలవాడు. అయ్యన యుద్ధరంగమున మరణింపగా జయ సింహుడు అమాత్య, సేనానాయక, దండనాయక, సామంత మాండలికుల సహాయమర్థించి చోళ సైన్యము నెదుర్కొని కొలనుపాక ప్రాంతమును తిరిగి స్వాధీన పరుచుకొనెను.

మల్లికామోద, జగదేకమల్ల, అనునవి ఈతని బిరుదములు. చాళుక్య జగదేకమల్లుడు పటంచెరువు రాజ్యమేలుచుండ అతని సామంతులు అన్నెమరసు అగస్తేశ్వరమున జగచిందుపండితునకు విద్యాభి దానమునకు, మూగదేశ్వర అన్నసత్ర నిర్వహణకు, చిమిలి గ్రామమును దానమిచ్చుచు రెండు శాసనములను ప్రకటించెను. క్రీ.శ. 1033లో మొదటిది, రెండవది క్రీ.శ.1038లో వేయించబడినది. జగదేకమల్ల జయసింహవల్లభుని కాలమున కూడలి సంగమేశ్వరమున శక సంవత్సరం 950 లో అనగా క్రీ.శ. 1028లో హెగ్గడ జోగిభట్టు సంకేశ్వర దేవరకు 4 నందాదీపములు పెట్టు సందర్భమున శాసనములు వేయించెను.

క్రీ.శ.1034లో జయసింహుడు శైవదీక్ష గైకొనెను. ఇతని పరిపాలనా కాలము నాటికి జైనమతము క్షీణించినది. జయసింహుని తండ్రి మాచిరాజు చంద్రరాజను కవిని పోషించెను. చంద్రరాజు 'మదనతిలక' అను కావ్యమును రచించెను. జయసింహుడు మెదకు జిల్లానానుకొనియున్న కొలనుపాక పట్టణమును అభివృద్ధి పరిచెను. జయసింహుని సామంతుడు 'కుందమరసు' ఇతడు అతులిత బల పరాక్రమసంపన్నుడు. ఈతని సోదరియైన అక్కదేవి కొంకణ ప్రాంతమును సంరక్షించు భారము వహించినది.

పాల్కురికి సోమనాథుని బసవపురాణమున బ్రహ్మరాశిపండితుడు తన శిష్యురాలగు రాణి సహాయమున రాజగు దేశింగు జైనము వీడి శైవమతమవలంబించునట్లు చేసెను. ఈ గాథ చే దేశింగే జయసింహుడు కాదగును. నోలంబరాజు కుమార్తె 'దేవలదేవిని' ఇతడు వివాహమాడెను. ఆమె తల్లి అస్థికలు గంగానదిలో కలిపి వచ్చిన విప్రునకు దానమిచ్చు సందర్భమున ఒక శాసనము వేయించెను. ఇతని మరొక రాణి సుగ్గల దేవి. ఆమె క్రీ.శ. 1029లో పాశుపతాచార్యుడయిన బ్రహ్మరాశిపండితునకు భూదానమునిచ్చెను. పాల్కురికి సోమన వర్ణించిన బ్రహ్మరాశిపండితుడు ఇతడే గావచ్చును.

జయసింహుడు చక్కని పరిపాలనా సంస్కరణలను ప్రవేశపెట్టి కవులనాదరించుచు విజయ పరంపరలతో పరిపాలించెను. ఈతని పరిపాలనలో మెదకు జిల్లా భాగము సంపూర్ణంగా ఉన్నట్లు స్పష్టముగా తెలియుచున్నది. ఇతని పరిపాలనాకాలం క్రీ.శ. 1015 నుండి క్రీ.శ. 1042 వరకు.

## మొదటి సోమేశ్వరుడు

జయసింహుని కుమారుడయిన సోమేశ్వరుడు క్రీ.శ. 1042 లో రాజ్యాధికారము నకువచ్చెను. ఇతడు మాన్యఖేటము నుండి రాజధానిని కల్యాణీ నగరమునకు మార్చెను. ఈతనికి ఆహవమల్ల, త్రైలోక్యమల్ల అనుబిరుదములున్నవి.

సోమేశ్వరుని సేనాని నాగవర్మ ఈతడు బ్రాహ్మణుడు నాగవర్మకు వింధ్యాధిపమల్ల శిరచ్ఛేదన, సేవణదిశాపట్ట, చక్రకోట, కాలకూట, ధరావర్ష దర్పోస్ఫోటన, మారసింఘ మదమర్దన అను బిరుదములున్నవి. నాగవర్మ మారసింహుని జయించెను. మారసింహుడు సోమేశ్వరుని దండయాత్రలందు ఓడి సంధిగావించుకొని తన కుమార్తెయగు లీలాదేవిని సోమేశ్వరునకిచ్చి వివాహము చేసెను. క్రీ.శ. 1040, 1063 నాటి శాసనములు సోమేశ్వరుని భార్యయగు లీలావతీ దేవిని ఆమెతండ్రియగు మారసింహుని ప్రశంసించినవి. చోళ చాళుక్య రాజ్యములకు తుంగభద్రనది సరహద్దుగా ఉండెను. కాని సోమేశ్వరుడా నదిని అధిగమించి చోళరాజ్య భాగములను జయించి చాళుక్యరాజ్యమున కలుపుకొనెను.

నోలంబవాడి పాలకులు చాళుక్య సామంతులయి యుండ సోమేశ్వరుడు కంపిలిలో ఒక రాజ ప్రాసాదమును నిర్మించినట్లు చోళశాసనములు వెల్లడించుచున్నవి.

సోమేశ్వరుడు వేంగీని జయించి తన సేనాధిపతియగు శోభనరసు అనువానిని వేంగీపుర వరాధీశ్వర అను బిరుదమునిచ్చి సామంతునిగా నిలిపెను.

చాళుక్యరాజ్యమందున్న కొలనుపాక లేక కొల్లిపాకకు సంరక్షకునిగా సింగన సిందేవరసును నియమించెను.

ఈ విషయములు ఆయా శాసనములందు చూపబడినవి.

మహాళవ భోజుడు క్రీ.శ. 1050 లో జరిగినయుద్ధమున మరణించెను. ఈ సమయమున చాళుక్య సేనాని పులకేశి కొంకణ ప్రాంతమునుండి బయల్దేరి కాంచీ నగరమును ముట్టడించెను. చోళసైన్యములను తుంగభద్రానదీ తీరమున చాళుక్య సైనికుల ఎదిర్చి ఓడించెను. ఈ యుద్ధ కాలమున రాజరాజనరేంద్రుడు నన్నయ, నారాయణభట్టుల సహాయమున చాళుక్యసోమేశ్వరునితో సంధిగావించు కొని క్రీ.శ. 1051 నుండి వేంగీ రాజ్యమును నిశ్చింతగా పాలించెను.

సోమేశ్వరుడు 25 సం. లు చాళుక్య రాజ్యమును పాలించెను. చోళులతో కూడలి సంగమేశ్వరమువద్ద సంభవించిన యుద్ధమున సోమేశ్వరుడు ఓడిపోయి ఖిన్నుడై క్రీ.శ. 1068 లో జీవితంపై విరక్తి చెంది కూడలి సంగమమున ప్రవేశించి ప్రాయోపవేశమున ప్రాణములర్పించెను. ఇతడు కడుసమర్థుడు. ఇతని సామంతులలో తెలుగు చోళులు, కాకతీయులు, యాదవులు ముఖ్యులు. ఈతని పరిపాలనా కాలము క్రీ.శ. 1042 నుండి క్రీ. శ. 1068.

## రెండవ సోమేశ్వరుడు

మొదటి సోమేశ్వరుని జ్యేష్ఠ కుమారుడు రెండవ సోమేశ్వరుడు తండ్రి అనంతరము చాళుక్యరాజ్య సింహాసనము అధిరోహించెను. ఇతనికి భువనైక మల్లుడను బిరుదము కలదు. విక్రమాదిత్య, జయసింహులు అను వారు ఇద్దరు ఇతని తమ్ములు.

చాళుక్య రెండవ సోమేశ్వరుడు నిరాడంబరుడు, చక్కని పాలకుడు శివభక్తి పరుడు ఇతని మంచితనమును చేతగాని తనముగా భావించిన ఈతని సోదరుడు విక్రమాదిత్యుడు సామంతులయిన కందూరిచోడ, కాకతీయుల సహాయముగొని అన్నను పదవీభ్రష్టుని గావించి, చాళుక్య సింహాసనము నాక్రమించెను. ఈతని కాలమున వేయింపబడిన శాసనములు ఆంధ్ర తెలంగాణా రాయలసీమ ప్రాంతములందు లభించినవి. సోమేశ్వరుడు క్రీ.శ. 1076 లో సోదరునితో సంభవించిన యుద్ధంలో మరణించి యుండును. ఇతని పరిపాలనా కాలము క్రీ.శ. 1068 నుండి క్రీ.శ. 1076.

## త్రిభువన మల్ల ఆరవ విక్రమాదిత్యుడు

రెండవ సోమేశ్వరుని సోదరుడు విక్రమాదిత్యుడు. అన్నను పదవీ భ్రష్టుని గావించి సింహాసనమధిష్ఠించెను. ఇతని సోదరుడు జయసింహుడు క్రీ.శ. 1080లో తిరుగుబాటు చేయగా విక్రమాదిత్యుడు అతని తిరుగుబాటు నణిచివేసెను.

ఈతడు రాజ్యముకు వచ్చిన సందర్భమును పురస్కరించుకొని తన పేర చాళుక్య విక్రమ శకమును అమలులోకి తెచ్చెను చాళుక్య విక్రమ శకముతో వెలసిన వందల కొలది శాసనములు కన్నడ, ఆంధ్ర, సంస్కృత భాషలలో నున్నవి. ఈతని శాసనములు ఆంధ్ర దేశమున లభించినవి.

చోళరాజు వీరరాజేంద్రుడు చాళుక్య విక్రమాదిత్యుని శక్తి సామర్థ్యమును గ్రహించి తన కుమార్తె నిచ్చి వివాహము చేసెను. వీరరాజేంద్రుడు మరణించిన సమయమున విక్రమాదిత్యుడు చోళదేశము నకేగి తన బావమరిదియగు అధిరాజేంద్రుని సింహాసనాధీశుని గావించెను.

విక్రమాదిత్యుడు క్రీ.శ. 1084 - 1086 లలో వేంగిపై దండయాత్రలు చేసెను. ఈతని సామంతులలో కాకతీయులు, హోయసళులు, కందూరిచోడులు సంపూర్ణ సహకారమొసంగి చక్రవర్తి విధేయులయి యుండిరి. విక్రమాదిత్యుని దండనాయకుడగు అనంతపాలయ్య క్రీ.శ. 1118లో వేంగినాక్రమించెను. విక్రమాదిత్యునకు సబ్బిసాయిర మండలమున (అనగా నేటి మెదకు జిల్లా ప్రాంతమున) వేడరాజులు, దొమ్మరాజులు, కొరివి సీమలో ముదిగొండ చాళుక్యులు. హనుమకొండ విషయమున కాకతీయులు, పానుగల్లు రాజ్యమున కందూరి చోళులు సామంతులుగా నుండి చక్రవర్తికి అనేక విధముల సహాయపడుచుండిరి. ఈతడు తన సామంతరాజయిన కాళచూరి పెర్మాడి దేవునికి తనకుమార్తెనిచ్చి వివాహము చేసెను.

అనంతపాల, గోవింద, లక్ష్మణులను వారు దండనాయకులుగా నుండిరి. త్రిభువన మల్ల ఆరవ విక్రమాదిత్యుడు అసాధారణ ప్రతిభావింతుడు సంస్కృతాంధ్ర కన్నడ భాషలనాదరించి పోషించెను. మహాకవి బిల్హణుడు ఇతని ఆస్థానమున నుండి విక్రమాంకదేవ చరిత్రమును రచించెను. విజ్ఞానేశ్వరుడను ధర్మశాస్త్ర వ్యాఖ్యాన కర్త ఈ రాజు ఆస్థానమునందుండెను.

విక్రమార్కుడు విశాల సామ్రాజ్యమును అతి సమర్థవంతముగా పాలించి క్రీ.శ. 1126లో మరణించెను.

## మూడవ సోమేశ్వరుడు

విక్రమాదిత్యుని కుమారుడు మూడవ సోమేశ్వరుడు తండ్రి అనంతరము చాళుక్యరాజ్య సింహాసనమలంకరించెను. వనవాసీ రాజ్యమును జయించి గంగావాడీ ప్రాంతములను తన రాజ్యమున కలుపుకొనెను.

సోమేశ్వరునకి భులోకమల్ల బిరుదమున్నది. ఈతని పేర వేయించబడిన శాసనములందు భూలోకమల్ల వర్షములు పేర్కొనబడినవి. ఈతడు సంస్కృతాంధ్ర కర్ణాట భాషలందు నిష్ణాతుడు. సర్వజ్ఞ చక్రవర్తి అను బిరుదముకలవాడు.

మానసోల్లాసము అను పేరు గల అభిలషితార్థ చింతామణి అను విజ్ఞాన గ్రంథమును స్వయముగా రచించి కవి పండితుల మన్ననలు పొందెను. ఈతని పరిపాలనా కాలము క్రీ.శ. 1126-1138.

## రెండవ జగదేకమల్లుడు

మూడవ సోమేశ్వరుని పెద్ద కుమారుడు పేర్మాడి జగదేకమల్లుడు. ఈతనికి ప్రతాపచక్రవర్తి అను బిరుదము కూడా కలదు. క్రీ.శ. 1143లో హోయసాళులు జగదేక మల్లుని ధిక్కరించి స్వాతంత్ర్యమును ప్రకటించిరి. కాళచూరి వంశీయులు శక్తి సమన్వితులయి స్వాతంత్రమును ప్రకటించుకొనిరి. ఇతని పిన తండ్రియు ఆరవ విక్రమాదిత్యుని కుమారుడయిన తైలపుడు సామంతుల సహాయమున స్వతంత్రుడగుటకు ఉద్యమించెను.

కాకతి రెండవ ప్రోలరాజు రెండవ జగదేకమల్లునకు సహాయముగా నుండి సామంతుల తిరుగుబాటు నణచి వేసెను. కుందూర నాడు పాలకుడయిన ఉదయన చోడమహారాజు కూడా జగదేకమల్లునకు అండగా నిలిచెను. జగదేక మల్లుని ప్రశంస గల శాసనములు తెలంగాణము నందు అనేక ప్రాంతముల లభించినవి. ఈతడు క్రీ.శ. 1138 - 1150 వరకు పరిపాలించెను.

## తైలపుడు

జగదేకమల్లుని పినతండ్రి ఆరవ విక్రమాదిత్యుని కుమారుడు అయిన తైలపుడు త్రైలోక్యమల్ల బిరుదాంకితుడయి కళ్యాణీచాళుక్య రాజ్య సింహాసనమధిరోహించెను. ఈతని కాలమున సామంతులందరు స్వతంత్రులయి నామమాత్రముగా చక్రవర్తిని మన్నించుచుండిరి.

ఆరవ విక్రమాదిత్యుని దౌహిత్రుడయిన కాళచూరి బిజ్జలుడు కరహాడ, తర్దవాడి మండలము లను పాలించుచు బలసమన్వితుడయి యుండెను. ఇతడు క్రీ.శ. 1156లో కళ్యాణీ నగరమునాక్రమించి తైలపుని పదవీభ్రష్టుని గావించెను. తైలపుని పరిపాలనా కాలము క్రీ.శ. 1150-1156.

తైలపుని కుమారుడు సైన్యమును సమకూర్చుకొని బిజ్జలునితో పోరాడి క్రీ.శ. 1163 నాటికి కళ్యాణీ నగరమును దాని పరిసర ప్రాంతమును ఆక్రమించి క్రీ.శ. 1179 వరకు పాలించెను.

ఈతని సహోదరుడు నాలుగవ సోమేశ్వరుడు కాళచురులను అణచివేసెను. కాని 1189వ సంవత్సరమున హోయసల రాజ వంశీయులు చాళుక్య వంశమును అంతరింపజేసిరి.

ఇంతటితో కళ్యాణీ చాళుక్యుల రాజ్యము అంతరించినది.

కళ్యాణీచాళుక్యులు బాదామి చాళుక్యుల వంశీయులమని చెప్పుకొనిరి వీరు వేద వేదాంగ ఇతిహాసములను పురాణములను శాస్త్రములను అభ్యసించినవారు. అప్రతిమాన ప్రతిభా సంపన్నులై పరాక్రమోపేతులై అరవీర భయంకరులై శత్రు దుర్భేద్యులైయుండిరి.

# కళ్యాణి చాళుక్యులనాటి సాంఘిక స్థితి

వీరు మయూరధ్వజులు, వరాహ లాంచనలు, వీరు వేయించిన శాసనములందు "సమస్తభువనాశ్రయ శ్రీ పృథ్వీ వల్లభ మహారాజాధిరాజ రాజపరమేశ్వర భట్టారక సత్యాశ్రయకుల తిలక." అని వర్ణింపబడినారు. రాజు సర్వాధికారములు కల్గియుండెను. సర్వ సైన్యాధ్యక్షునిగా ధర్మాసనాధ్యక్షునిగా రాజే వ్యవహరించెడివాడు.

రాష్ట్రకూట మూడవ కృష్ణుడు తన రాజ్యమున తల బరువు తమలపాకుల మూటపై 24 ఫణముల సుంకము విధించెను. చాళుక్యుల కాలమందు కూడా అంతే సుంకము విధింప బడుచుండెను. ఏ సామంత మండలేశ్వరుడైనను ఎక్కువ పన్ను వసూలు చేసిన యెడల వర్తక సంఘమునకు చెందిన సభ్యులు రాజునకు నివేదించెడివారు. రాజు న్యాయమును చేసెడివాడు.

క్రీ.శ. 1104లో బొప్పయ్యమన్నెయ దొర అనువాడు అగ్రహారములను దోచి విప్రులను వధించి నానా భీభత్సము చేయుచుండెను. ఈ విషయమును అగ్రహారము నందున్న ప్రజలు చక్రవర్తికి విన్నవించగా బొప్పయ మన్నెయను పదవి నుండి తొలగించెను. అంతేగాక అతని సంతతివారు అట్టి పదవిని భవిష్యత్తులో ఆశింపరాదని, త్రిపురాంతక మహాదేవుని సమక్షమున పశ్చాత్తాపపడి ప్రతినబూని తీర్థసేవనము ఒనరించ వలెనని శాసించెను.

కళ్యాణీ చాళుక్యుల కాలమున జైన, శైవ మతములు ప్రజలచే ఆరాధించబడు చుండెను. పండితులు కులగురువులుగా రాజులచే పూజింపబడుచుండిరి రాజులు సామంత మండలేశ్వరులు, రాజోద్యోగులు దేవాలయములను నిర్మించుచు ధూపదీపనైవేద్యాదులకై వివిధ దానములు చేయుచుండిరి. రాజులు గ్రహణ పుణ్యకాలములందు దేవాలయములకు, బ్రాహ్మణులకు అగ్రహారాది దానములు చేసెడివారు.

ఆనాడు వ్యక్తులకు సంస్థలకు విశిష్ఠసేవలొనరించన వారికి రాజలాంచనములు ఛత్రచామరాదులు ఇచ్చెడివారు. సహవాసిగళ్, అధిష్ఠాయక పదవులందున్న వారు చక్రవర్తికి అంగరక్షకులుగా ఉండెడివారు.

పండితులు ఉద్యోగులు మేధావులు రాజ్యపాలనలో రాజునకు తోడ్పడుచుండిరి. ఉద్యోగి మండలి అధ్యక్షునిగా యువరాజు వ్యవహరించు చుండెను. యువరాజు లాంఛనము కాంఠికము పుత్రులు, పుత్రసమానులైన వారు యువరాజులుగా పిలువ బడుచుండిరి.

బ్రాహ్మణులలో కొందరు క్షాత్ర ధర్మమును అవలంబించి మంత్రులుగను దండ నాయకులుగను సైన్యాధ్యక్షులుగను నియమింపబడుచుండిరి.

రెండవ తైలపుని దండనాథులలో బల్లుడు నాగదేవుడు అనువారు బ్రాహ్మణులు వారి వంశీయుల బ్రాహ్మణులు నాగై శాసనము నందు ఈ వంశీయులు ప్రశంస యున్నది. కాళిదాసు అతని ఐదుగురు కుమారులు దండనాథులుగా యుండిరి. జేష్ఠ్యుడైన బాచిరాజు చాళుక్య రాజ్య-సముద్ధరుడని కీర్తి గాంచెను. 3వ కుమారుడైన మధుసూదనయ్యా విష్ణువంశ సంభూతుడని అనేక సమరములలో విజయమును సాధించెనని చాళుక్య చక్రవర్తికి పాలనా విషయమును అభేద్యుడని కీర్తినొందెను.

అనంతపాలుడు అతని సోదరుడు చాళుక్యదండనాయకులుగా ప్రసిద్ధిగాంచిరి.

రవిదేవుడు గొప్ప సంగీత విద్వాంసుడే గాక చాళుక్య రాజ్యమున "సంధివిగ్రహి" పదవిని అధిష్ఠించెను. ఇతడు గొప్పదాతృత్యము గలవాడై చక్రవర్తి తనకిచ్చిన 3 గ్రామములను విప్రులకు అగ్రహారంగా నిచ్చెను.

శివారు దేవాలయమందున్న ఇద్దరు సంగీత విద్వాంసులకు ఇద్దరు దాసులకు ఇద్దరు నర్తకులకు మాన్యములు ఈయబడినవి.

క్రీ.శ. 1045లో ఒక జైనబసధి ఆవరణమందు గొప్ప నాటక శాల నిర్మింపబడినది. దేవాలయము లందు పూజాదికములు నృత్యగానాదులు నిర్వహించుటకు అగ్రహారాలు భూములు దానసీయబడినవి.

దాతలు ద్రవ్యనిధిపై వచ్చువడ్డీలో 15% గద్యాణములు దేవాలయ నిత్యదీపారాధనకు 25% గద్యాణములు 8% మంది ప్రవాసుల భోజనమునకు 2% గద్యాణములు పాచకులకు చెందునట్లు చూచుచుండిరి.

వివిధ నాణెములు ఆనాడు వాడుకలో యుండెను గద్యాణంలు పణములు, ఆగములు వీసము, కాణి వంటి నాణెములు వ్యాప్తిలో నుండెను.

చాళుక్యుల కాలమున వ్యాపార కేంద్రములుగా అనేక పట్టణములుండెను. సముద్ర వ్యాపారము చక్కగా జరుగుటకు రాజులు వర్తకులకు భద్రత కల్పించుచు తీరరేవు పట్టణములందు సమస్త సదుపాయాలు ఏర్పరుచుచుండిరి. వ్యాపార వస్తువులపై వివిధ రకములైన పన్నులు విధించ బడుచుండెను.

## భాష – సాహిత్యము

కళ్యాణీ చాళుక్యుల పాలనాకాలమున సంస్కృత భాష రాజభాషగా యుండెను. రాజభాష సంస్కృతమైనను. రాజశాసనములు సంస్కృత కన్నడ, ఆంధ్ర భాషలలో ప్రకటింపబడినవి.

కళ్యాణీ చాళుక్యుల పాలనాకాలమున అనేకమైన ఘటికాస్థానములు నెలకొల్పబడినవి. క్రీ.శ. 1058లో వాణస వంశీయుడైన మధుసూదనయ్యా మధుసూధ నాలయమునందు ఒక ఘటికను స్థాపించెను. ఆఘటికయందు 250 మంది బ్రహ్మచారులకు ఉచిత విద్యాభోజన వసతి సౌకర్యములు కల్పింపబడెను.

ఆ ఘటిక యందు 200 మంది విద్యార్థులు వేదమును, 50 మంది విద్యార్థులు శాస్త్రాభ్యాసమును ఒనర్చెడివారు. ముగ్గురు వేద పండితులు ముగ్గురు శాస్త్రమును అభ్యసించెడివారు గ్రంధాలయాచార్యుడు ఆఘటిక యందు విద్యార్థులకు బోధించుచుండిరి. ఉపాధ్యాయులలో భాట్ట దర్శనాచార్యునకు 30 మత్తులు భూమి ప్రభాకర మీమాంస బోధకునకు 45 మత్తులు భూమి గ్రంధాలయాచార్యునకు 30 మత్తులు భూమి ఘటికాస్థాన నిర్వాహకునకు 30 మత్తుల భూమి ప్రతి ఫలముగా ఈయబడెను.

రాణి మలయవతి వ్యాఖ్యాన ఉపాధ్యాయునకు 8 గద్యాణములు, ఋగ్వేదాచార్యునకు 12 గద్యాణములు అగ్నిహోత్రులకు బ్రాహ్మణులు 2 గద్యాణములు దానమిచ్చినట్లుగా గలదు.

అనంతముని అను జైనాచార్యుడు వ్యాకరణ, నిఘంటు గణిత, జ్యోతిష్య, శకున, విద్యలందును, మను గాంధర్వాలంకార మహాకావ్య నాటక అర్ధశాస్త్ర, ఆధ్యాత్మిక శాస్త్రము లందును ప్రవీణుడైయుండెను. ఈతని ప్రశంస క్రీ.శ. 1024 నాటి శాసనమందున్నది.

నరేంద్రసేన, నయసేనులు వ్యాకరణ శాస్త్రవేత్తలు. వారు చంద్రకాతంత్ర జైనేంద్ర శబ్దానుశాసన ధర్మ నిష్ణాతులు వీరు. గ్రామములందు పర్యటించుచు జైన మత ప్రచారము చేయుచు విద్యావ్యాప్తికి దోహదపడుచుండిరి.

శాంతినాధుడు అనువాడు జైన తార్కికుడు ఈతడు "సుకుమారచరిత్ర" అను గ్రంధమును రచించెను. ఈతడు సహజకవిగా పేరుగాంచెను

క్రీ.శ. 1070 'సంధి విగ్రహ' పదవిలోనున్న నాగవర్మాచార్యుడు గొప్పకవి మాత్తేభ వృత్తములలో "చంద్రచూడామణి" శతకమును రచించెను, పంప, రన్న, పొన్న, అను 'కన్నడ కవిత్రయము' అనువారు కళ్యాణీ చాళుక్యుల కాలమునందుండిరి.

గాంగసేనాని "చౌండరాయడు" క్షాత్రమున్న బ్రహ్మణుడు క్రీ.శ. 978 లో అతడు చౌండరాయ పురాణమును కన్నడమున రచించెను. ఇందు 24 తీర్థంకరులు 12 మంది చక్రవర్తులు 9 మంది బలభద్రులు 9 మంది నారాయణులు 9 మంది ప్రతినారాయణులు మొత్తము 63 మంది జీవిత చరిత్రలు గలవు ఇది కన్నడ భాషలో గద్య కావ్యము.

నాగవర్మ గొప్ప వ్యాకరణవేత్త ఈతడు "ఛందోంబుధి" అనువ్యాకరణమును వ్రాసెను. ఈ వ్యాకరణమును 19వ శతాబ్ద్యంతమున "కిటెల్" ప్రకటించి ఆంగ్లభాషలో విపులమయిన పీఠికను వ్రాసెను చాళుక్య జయసింహుని ఆస్థానమునందున్న దుర్గసింహుడు పంచతంత్ర కావ్యమును 5 ఆశ్వాసములలో ప్రౌఢముగా రచించెను.

జయసింహుని సామంతుడైన మాచరాజు "మదనతిలకో" గ్రంధమున 18 అధికరణములను 500 పద్యములు వ్రాసెను.

ఆహవ మల్ల సోమేశ్వరుని కాలముననున్న శ్రీధరాచార్యుడను జైన బ్రాహ్మణుడు "జ్యోతిషతిలకం" అను గ్రంథమును రచించెను. ఈతనికి గద్యపద్య విశారద అను బిరుదము గలదు.

నాగ చంద్రుడను కవి రచించిన "మల్లినాథపురాణము" అను ఈ కావ్యము 14 ఆశ్వాసములున్న చంపూకావ్యము. ఈ కావ్యమున 19 వ తీర్థంకరుని చరిత్ర వర్ణింపబడినది. 'పంపరామాయణము' - 'రామచంద్రపురాణము' లను ఈతడు రచించెను. రాముడు జినదీక్షను పొంది జైనమునిగావారి నిర్యాణమొందు విషయములు ఈకావ్యములందు వర్ణింపబడినవి. ఈతడు మల్లి నాథజినాలయమును నిర్మించెను.

నయసేనుడు "ధర్మామృత" కావ్యమును జైనమత పరముగ రచించెను 14 ఆశ్వాసములున్న ఈజైన మతసారగ్రంథము సంస్కృత పదసమాస భూయిష్టమైనది. క్రీ.శ.1145 ప్రాంతమున కర్ణపార్యుడు "నేమినాథపురాణము" రచించెను. ఈ గ్రంథమున 22వ జైనతీర్థంకరుడగు నేమినాథుని చరిత్ర వర్ణించుచు మహాభారత - కృష్ణలీలాగాథలను పొందు పరచెను.

క్రీ.శ. 12 వ శతాబ్దమున నాగవర్మ "కావ్యలోక" అను అలంకారశాస్త్రమును సూత్ర పద్యములతో రచించెను. ఈతడు "కర్ణాటక భాషాభూషణము"ను రచించెను. సంస్కృత భాషలో సూత్రములు, కన్నడమున సూత్రవ్యాఖ్యానములు రచించెను. "వస్తు కోశనిఘంటువు" న సంస్కృతపదములకు కన్నడ అర్థములీయబడినవి. ఈతడు రెండవజగదేకమల్లు నిగురువు.

నాగవర్మ శిష్యుడైన జన్నకవి "కర్ణాటకల్యాణ వారకము" అను వైద్య గ్రంథమును రచించెను.

జగద్దల సోమనాథుడు పూజ్యపాదుని సంస్కృత గ్రంథమును కన్నడ భాషలోని కనువదించెను.

రెండవ జయసింహవల్లభుని కాలమున వాదిరాజు "పార్శ్వనాథ చరిత్ర"ను వ్రాసెను. హేమసేనవిద్యాధనంజయుడు "రాఘవ పాండవీయము" అనుద్వ్యర్థి కావ్యమును రచించెను.

సోడ్డలుడు అనుకవి కాదంబరీ కావ్యచ్ఛాయలో "ఉదయసుందరీ కథ" నురచించెను.

కాశ్మీరవాసియగు బిల్హణుడు ఆరవ విక్రమాదిత్యుని ఆస్థానకవి, ఈతడు "బిల్హణీయం" అను కావ్యమును రసవంతముగావిరచించెను.

అరవ విక్రమాదిత్యుని ఆస్థానమున విజ్ఞానేశ్వరుడు అను కవి మితాక్షరి అను గ్రంథమున యాజ్ఞవల్క్యస్మృతికి వాఖ్యాన రూపముగా రచించెను. భూలోమల్ల మూడవ సోమేశ్వరుడు "అభిలషితార్థ చింతామణి" యను మానసోల్లాస గ్రంథమును రచించెను.

ఈ గ్రంథమున నూరు అధ్యాయములుగలవు పశుచికిత్స, రక్తపరీక్ష, వైద్యములు మొదలుగాగల విషయములందు చర్చించబడినవి. కల్యాణీ చాళుక్యుల నాటి ప్రజల ఆచారవ్యవహారములు, సంస్కృతి, సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక, మంత్ర, తంత్ర, శకునములుకు సంబంధించిన అనేక విషయములు ఈ గ్రంథమున పేర్కొనబడినవి.

ఆనాటి సంఘమున స్త్రీలు గౌరవింప బడుచుండిరి. వీరమాతలుగను, వీరపత్నులుగను, వీరవనితలుగను కీర్తింపబడినారు. అక్కమహాదేవి వీరవనిత. ఆమె సైన్యమును నడిపినట్లు యుద్ధములలో పాల్గొనినట్లు చారిత్రికాధారముగలదు.

విక్రమాదిత్యునిరాణి లక్ష్మీదేవి సకలశాస్త్ర ప్రవీణ. రాజ్యతంత్రము లెరిగిన వీరవనిత. ఆమె భర్తతో పాటు రాజ్యపాలనలో పాలుపంచుకొనెడిది.

ఈ విధముగా కల్యాణీ చాళుక్యులు మహాసామ్రాజ్యనిర్మాణ మొనరించి, అనేక దేవాలయములు నిర్మించి, అనేక ఘటికాస్థానముల నేర్పరిచి, విద్యాభివృద్ధికి కృషిచేసిరి, కవి, పండితులను పోషించుచు తాముస్వయముగాకవులై సాహిత్యాభివృద్ధికి చేయూతనొసంగిరి. ప్రజలను కన్న బిడ్డలవలె పరిపాలించుచు ఘన కీర్తి వహించిరి.

# కాకతీయులు

సామంత వొట్టి కులమున

దుర్జయ వంశములో

| | | | | |
|---|---|---|---|---|
| కాకతిపురపాలకుడు | - వెన్నరాజు | 825-850 | = | 25 |
| | - గుండరాజు | 850-875 | = | 25 |
| | - గుండరాజు | 875-900 | = | 25 |
| | - రాష్ట్రకూట గుండరాజు | 900-912 | = | 12 |
| కొరవి పాలకుడు | ఎఱ్ఱ రాజు | 912-940 | = | 28 |
| | బేత రాజు | 940-950 | = | 10 |
| | కాకర్త్య గుండన | 950-990 | = | 40 |
| అనుమకొండపుర పాలకుడు | గరుడబేత రాజు | 990-1030 | = | 40 |
| | ప్రోలరాజు | 1030-1075 | = | 45 |
| | బేతరాజు | 1075-1115 | = | 40 |
| | ప్రోలరాజు | 1115-1158 | = | 43 |



# కాకతీయులు

ఆంధ్రదేశ చరిత్రలో కాకతీయ సామ్రాజ్యము పేరెన్నికగన్నది. సుమారు 300 సంవత్సరాలుకు పైబడి యావదాంధ్రదేశమును ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందికి తెచ్చి ప్రజోపయోగ కార్యక్రమములు అనేకము గావించి, కవి పండితులను పోషించి, లలితకళలను ప్రోత్సహించి ఆంధ్ర సంస్కృతికి మహోపకారము గావించిన కాకతీయ సామ్రాజ్య చరిత్ర ఆంధ్రుల ఇతిహాసమునందొక సువర్ణాధ్యాయము. కానీ దురదృష్టవశమున కాకతీయులకు వారి మహత్తర సేవకు తగిన గౌరవ ప్రపత్తులు భారతీయ చరిత్రలో లభింపలేదు. భారత జాతీయ ఇతిహాసము నందు కొన్ని సందర్భములలో కాకతీయుల పేరు విస్మరింపబడుచున్నది.

కాకతీయ యుగచరిత్రను రచించుటకు సాధన సామాగ్రి తక్కువ లేదు. కాకతీయ రాజ్యమునకు నేటి తెలంగాణము గుండె వంటిది. కాకతీయ ప్రభువులు వారి సామంతులు రాజోద్యోగులు ఆయా సందర్భములలో అనేక శాసనములు వేయించినారు. ఆ శాసనములను పరిశోధించిన పక్షమున మనకు ఆనాటి చారిత్రికాంశములు, ప్రజల సామాజిక ఆర్థిక పరిస్థితులు, రాజుల కాలనిర్ణయములు తెలియనగును.

కాకతీయ రాజుల కాలమందు సంస్కృతాంధ్రములందు అనేక గ్రంథములు రచింపబడినవి. కాకతీయుల పతనానంతరము రచింపబడిన కొన్ని కృతులుకూడా కాకతీయుల చారిత్రిక విశేషములను తెల్పుచున్నవి. ముఖ్యముగా 'ప్రతాపరుద్ర చరిత్రము'. 'ఏకశిలానగర వృత్తాంతం' 'తెలుగు రాజుల చరిత్రము' అనునవి కొంతవరకు సత్యమయిన చారిత్రికాంశములతో కొంత కాల్పనిక గాథలతోనూ నిండిన ఇతిహాసములు. వీటన్నింటి వలన ఆ కాలమునాటి మత సాంప్రదాయములు, రాజ్యస్థితిగతులు ప్రజల ఆచార వ్యవహారములు మొదలగు విషయములు తెలిసికొనుటకు ఈ గ్రంథములు సాధనమగుచున్నవి.

పద్మనాయకులు, వెలుగోటి సురభివంశజులు మున్నగు ఉన్నత కుటుంబముల వారి చరిత్రములను, తెలుపు స్థానికకైఫీయత్తులు కూడా మనకు విరివిగా లభించుచున్నవి. వీటినుండియు కాకతీయులు పరిపాలనాంశములను తెలిసికొన వచ్చును.

కాకతీయ యుగమునందు నిర్మించిన సుప్రసిద్ధ దేవాలయములు ఆనాటి శిల్పకళా ప్రాశస్త్యమునే కాక ప్రజా జీవన విధాన వైఖరులను తెలుపుచున్నవి.

మహమ్మదీయ చారిత్రికులగు బర్నీ. 'అమీర్‌ఖుస్రూ' 'షంసేసిరాజ్' 'హఫీస్' అనువారి గ్రంథములు. ఇటలీ దేశీయుడగు 'మార్కోపోలో' 'ఇబన్‌బతూతా' వంటి వారి వ్రాతలు కాకతీయుల చరిత్ర రచనలో కొంత వరకు తోడ్పడుచున్నవి.

కాకతీయులనాటి స్థల, గిరి, వన, జల దుర్గములు ఆనాటి ప్రభుత్వ సైనిక సంపదను శక్తిసామర్థ్యములను తెలుపుచున్నవి. కాకతీయుల కాలమున నిర్మించిన జైన బసదులు దేవాలయములు శైవమత సంబంధమయిన గోడకీ మఠములు, సత్రములు, ఆనాటి పరిస్థితులను ప్రజల సాంఘికా చారములను తెలుసుకొనుటకు తోడ్పడు చున్నవి.

ఈ విధముగా కాకతీయులు ఆంధ్రదేశమును పరిపాలించిరను విషయమును స్పష్టముగా నిర్దిష్టముగా పై ఆధారముల వలన చెప్పవచ్చును.

ఆంధ్రదేశమున ఇంతటి సువర్ణాధ్యాయమును కలిగిన కాకతీయులు ఎవరు? ఎచటివారు? అను విషయమున చారిత్రికులలో అనేక భేదాభిప్రాయములు కలవు. వంశనామమయిన 'కాకతీయ' శబ్దము కూడా చారిత్రికులలో భిన్నాభిప్రాయములను కలిగించు చున్నది.

'కాకతీ' అను దేవతను ఆరాధించుటచే కాకతీయులయినారనియు,. కాకతి పురమునుండి పరిపాలన గావించుటచే కాకతీయులయినారను వాదములు సత్యములనిపించుచున్నవి "బయ్యారం చెరువు" శాసనమును కాకతి గణపతి సోదరి మైలాంబ వేయించెను. ఇందు వెన్నరాజు కాకతి నగరమునుండి పాలించుట వలన ఈ వంశీయులు కాకతీయులయి నారని తెలుపబడినది. మొదటి బేతరాజు వేయించిన కాజీపేట శాసనమునందును కాకతిపుర ప్రభువుగా తెలుపబడినది.

త్రిపురాంతక మందలి శాసనము వలన ఈ బేతరాజు 'కులపురము' కాకతి అను ప్రదేశమని తెలియనగుచున్నది.

వీటన్నింటిని చూడగా స్థలనామమే వంశనామమయినట్లు తెలియుచున్నది. ఈనాడు కూడా ఒక గ్రామము నుండి మరియొక గ్రామమున కు వలన పోయినవారిని మొదటి గ్రామపు పేరుతో పిలుచుట కనిపించుచున్నది. ఇంతకు కాకతి నగరం కాకతీయ వంశజులకు తొలి నివాసమా? అయిన కాకతి నగరమేది ? అను ప్రశ్న ఉదయించును.

ఒకప్పుడు కర్ణాటక రాష్ట్రమందున్న 'కందరపురము'(కందారపురము) కాకతి పురమని అదే కాకతి నగరమని కొందరి చారిత్రకుల ఊహ.

మొదటి బేతరాజు నేటి వరంగల్ జిల్లాయందలి 'మధిర' తాలుకా ప్రాంతమును (నతవాటి సీమను). 'మానుకోట' తాలూకా ప్రాంతమును (కొరివి సీమను) పాలించెను. కావున అతనికి ముఖ్యపట్టణమగు కాకతి పట్టణము ఈ ప్రాంతమున యుండెనేమో యని కొందరూహించుచున్నారు.

ఏదేమయినను కాకతీయులు ఆంధ్రదేశమున తమ వంశపు కీర్తి ఆచంద్రతారార్కము ఉండునట్లు గావించినారు.

కాకతీయులు చతర్థకులజులు కొన్ని శాసనములందు చంద్రసూర్య వంశములకు చెందిన వారనియు తెలియుచున్నది.

గణపతిదేవుని శాసనములలో కాకతీయులు క్షత్రియులుగను సూర్యవంశస్థులుగను పేర్కొన బడినారు. ప్రతాపరుద్రీయ కావ్యమున విద్యానాధుడు తన ప్రభువులయిన కాకతీయులను 'అత్యర్కేందు కుల ప్రసూతులు' గా వర్ణించినాడు అనగా సూర్య చంద్ర వంశములకన్ననూ మిన్న యైనదని చెప్పుట. కాకతీ గణపతి దేవుని సోదరి మేలాంబికను దుర్జయ వంశీయుడగు రుద్రుని కిచ్చి వివాహము చేసిరి. గణపతి దేవుని కుమార్తె గణపాంబ దుర్జయాన్వయుడయిన కోట బేతరాజునకు ధర్మపత్ని. వీటన్నింటిని బట్టి చూడగా కాకతీయులు చతుర్థకులజులనియే చారిత్రకులు నిర్ణయించినారు.

ఇంతటి ఘనకీర్తి వహించిన కాకతీయ ప్రభువులు 'మెదకు' జిల్లా ప్రాంతమును పాలించినట్లు జిల్లాలో వెలువడిన అనేక శిలాశాసనముల ద్వారా విశదమగుచున్నది.

## వెన్నరాజు

వెన్నరాజు కాకతి పురమును రాజధానిగా పాలించినట్లు "బయ్యారం చెరువు" శాసనము తెలుపుచున్నది. రాష్ట్రకూట రాజగు దంతిదుర్గరుడు బాదామీ చాళుక్య వంశమును నిర్మూలించి రాష్ట్రకూట రాజ్యమును స్థాపించెను. ఇతడు క్రీ.శ. 757 ప్రాంతమువాడు. వెన్నరాజు రాష్ట్రకూట సామంతునిగా నుండి దంతి దుర్గునకు అనేక యుద్ధములందు సహాయమొనర్చెను. మొదట వెన్నరాజు నాందేడు జిల్లాలోని కొంతభాగమును రాష్ట్రకూట సామంతునిగా కొంత పాలించియుండవచ్చును. ఈయన పరిపాలనా కాలము క్రీ.శ.750 నుండి 768.

## మొదటి గుండరాజు

వెన్నరాజు కుమారుడు గుండరాజు. తండ్రి అనంతరము కాకతిపురాధిపతి అయ్యెను. ఇతడు కూడా రాష్ట్రకూట సామంతుడిగా ఉండెను. మొదటి గుండరాజు బయ్యారము చెరువు శాసనమున ప్రశంసింపబడినాడు.

రాష్ట్రకూట రాజయిన దంతిదుర్గుని మరణానంతరం 'రాహప్ప' అను చాళుక్య వంశీయుడు రాష్ట్రకూట రాజ్యభాగములాక్రమించి పాలించసాగెను. రాష్ట్రకూట మొదటి కృష్ణవల్లభుడు రాహప్పతో అనేక సంవత్సరములు పోరాడి విజితుడయ్యెను. ఆ తరువాత 768 లో గంగవాడిని జయించి క్రీ.శ. 769 లో వేంగీ రాజ్యముపై దండెత్తెను. ఈ దండయాత్రలయందు మొదటి కృష్ణమరాజుకు కాకతి మొదటి గుండరాజు సేనానిగా విజయ సాధనలో తోడ్పడెను. మొదటి గుండరాజు చాలా కాలము జీవించి రాష్ట్రకూట రాజులయిన మొదటి కృష్ణవల్లభ, ప్రభూతవర్ష గోవిందరాజు, ధృవరాజు, మూడవ గోవిందరాజు, అమోఘ వర్షుల పాలనాకాలమున సైన్యాధిపతిగా దండినాథునిగా కీర్తిపొందెను. ఈతడు క్రీ.శ. 768-824 వరకు జీవించెను.

## రెండవ గుండరాజు

మొదటి గుండరాజు కుమారుడు రెండవ గుండరాజు ఈతడు రాష్ట్రకూట అమోఘవర్షుని సామంతునిగా దండనాథునిగా యున్నట్లు బయ్యారము చెరువు శాసనము వలన తెలియుచున్నది. ఇతని కుమారుని పేరును గుండరాజే. [illegible] రెండవ గుండరాజు తండ్రి మరియు కుమారుడు ముప్పురు పరశురామ శ్రీరామ శ్రీకృష్ణులవలె పరాక్రమవంతులని కీర్తింపబడినారు.

రెండవ గుండరాజు తూర్పుచాళుక్య రాష్ట్రకూట సేనానులతోపాటు యుద్ధములందు పాల్గొని అమోఘవర్షునికి విజయం చేకూర్చుటలో సహాయపడెను. ఇతని కాలము క్రీ.శ. 824 870.

## మూడవ గుండరాజు

రెండవ గుండరాజు కుమారుడు మూడవ గుండరాజు ఇతడు అమోఘవర్షుని సేనానిగా సామంతునిగా తండ్రి అనంతరము నియమితుడయ్యెను. అమోఘవర్షుడు క్రీ.శ. 880లో మరణింపగా అతడి కుమారుడయిన రెండవ కృష్ణునకు అండగా నిలిచెను. ఈతడే "కాకర్త్యగుండన" గా ప్రసిద్ధి నహించెను. ఇతడు క్రీ.శ.870 నుండి 895 వరకు రాష్ట్రకూట చక్రవర్తుల సేనానాయకునిగా వ్యవహరించెను.

## ఎఱ్ఱియరాజు

మూడవ గుండరాజు కుమారుడు కాకతీయ ఎఱ్ఱియరాజు రాష్ట్రకూట రెండవ కృష్ణ, మూడవ యింద్ర, రెండవ అమోఘవర్ష, నాల్గవ గోవింద, మూడవ అమోఘవర్షుల పాలనాకాలములందు సేనానాయకునిగను 'కురవాడిసీమను' పాలించు 'సామంతునిగను' ఉండెను.

ఎఱ్ఱియ రాష్ట్రకూట రాజన్యులకు అన్ని విధములుగా సహకరించుచు వారికి యుద్ధములందు విజయము చేకూర్చుచుండెను. క్రీ.శ. 934 లో కురవాడి సీమ ముదిగొండ చాళుక్య వంశజుడయిన బల్కి నిరవద్యుని వశముకాగా కాకతి ఎఱ్ఱియరాజు రాష్ట్రకూట రాజ్యమున నివసించెను. ఇతని కాలము క్రీ.శ. 895 నుండి క్రీ.శ. 940.

## బేతియరాజు

ఇతడు ఎఱ్ఱియరాజు కుమారుడు. మూడవ కృష్ణవల్లభుని కాలమున రాష్ట్రకూట సేనానిగా వ్యవహరించియుండెను. ఇతని కాలము క్రీ.శ. 940 నుండి క్రీ.శ. 950 వరకు

## నాల్గవ గుండరాజు

బేతియరాజు కుమారుడు నాలుగవ గుండరాజు. ఈతడు గొప్పశూరుడు. ఇతనినే 'పిండి గుండరాజు' అని అందురు. వేంగీపీఠమలంకరించిన దానార్ణవునకు అన్ని విధముల సహకరించెను.

ముదిగొండ చాళుక్యులను తరమి వేసి కొరవిసీమను ఆక్రమించి పాలించెను.

ఈతని కాలము క్రీ.శ. 950 నుండి క్రీ.శ. 990 వరకు.

## మొదటి బేతరాజు

మొదటి బేతరాజునే "గరుడ బేతరాజు" అని నామాంతరముగా పిలిచెడివారు. తండ్రి చాళుక్యరాజుల హితైషిగా కొరివిసీమనేలి, యుద్ధ రంగమున మరణించగా బేతరాజు నిరాశ్రయుడయ్యెను. ఆ సమయమున తండ్రి గుండరాజు సోదరియు విర్యాల ఎఱ్ఱసేనాని భార్యయునగు కామసాని, మేనల్లుడగు బేతరాజు దిక్కులేని వాడగుట సహింపక భర్తను సంప్రదించెను. ఎఱ్ఱసేనాని చాళుక్య చక్రవర్తినొప్పించి గరుడ బేతరాజును 'అనుమకొండ' విషయపాలకునిగా నియమింపజేసెను. ఈ విధముగా కాకతీయులు చాళుక్యుల సామంతులయిరి. ఇతని రాజ్యము కొరివి సీమ సరిహద్దు మొదలు ఈనాటి కరీంనగరు జిల్లాయందలి శనిగరము వరకు వ్యాపించియుండెను. ఈతడు వేయించిన శిలాశాసనమొకటి శనిగరమున లభించినది.

గరుడ బేతరాజు మహామండలికునిగా చాళుక్య చక్రవర్తులకు చేదోడు వాదోడుగా నుండి తన రాజ్యమును వృద్ధి చేసుకొని క్రీ.శ. 992 నుండి 1052 వరకు పాలించెను.

## మొదటి ప్రోలరాజు

గరుడ బేతరాజు కుమారుడు అయిన మొదటి ప్రోలరాజు తండ్రి అనంతరము క్రీ.శ. 1052లో ఈ అనుమకొండ విషయాధిపతి అయ్యెను. ఈతని తొలిశాసనము క్రీ.శ. 1053 లో శనిగరము గ్రామమున వేయింపబడినది. వేములవాడ రాజ్యమును భద్రగుడను చాళుక్యరాజు పాలించుచుండెను. కాకతి ప్రోలరాజు ఆతని యుద్ధమందు ఓడించి సబ్బిసాయిర మండలమునందు కొన్ని ప్రాంతములను వశపరుచుకొనెను.

కాల్పుర్తి, గుణసాగరములను జయించి కాకతిరాజ్యమును వృద్ధి పరిచెను. చాళుక్య త్రైలోక్య సోమేశ్వరుని ఆజ్ఞననుసరించి చక్రకూటమును కొంకణములను ఇతడు జయించెను. చాళుక్య త్రైలోక్యమల్ల చక్రవర్తి ప్రోలరాజు శక్తిసామర్థ్యముల నెరింగి కాకతి రాజ్యమును తన సామంత రాజ్యముగా పరిగణించెను. మొదటి ప్రోలరాజుకు "అరిగజకేసరి" అను బిరుదము కలదు. చాళుక్యులకు సామంతులుగా పరిగణింపబడినందున వరాహలాంఛనమును కాకతీయులు పయోగించిరి.

ప్రోలరాజు కేసరి తటాకమును నిర్మించెను. ఇది నేటికిని కేసముద్రము చెంతనున్న పెద్ద చెరువు.

ప్రోలరాజు చాళుక్య సామంతులుగా కాకతి రాజ్యమును క్రీ.శ. 1052 నుండి క్రీ.శ. 1076 వరకు పాలించెను.

## రెండవ బేతరాజు

మొదటి ప్రోలరాజు మరణానంతరము ఆతని కుమారుడయిన రెండవ బేతరాజు కాకతి రాజ్యము నలంకరించెను. చాళుక్య త్రైలోక్యమల్ల చక్రవర్తి దివంగతుడు కాగా జ్యేష్ఠకుమారుడయిన భువనైకమల్ల సోమేశ్వరుడు కళ్యాణీరాజ్య సింహాసనమధిష్ఠించెను. కానీ అతని తమ్ముడయిన విక్రమాదిత్యుడు అన్నతో యుద్ధమొనర్చి చాళుక్య సింహాసనమాక్రమించెను. ఈ యుద్ధమున రెండవ బేతరాజు విక్రమాదిత్యుని పక్షము వహించి సహాకరించెను. విక్రమాదిత్యుడు సింహాసన మధిష్టించిన వెంటనే తనకు సహాకరించిన సామంతులకు దండనాయకులకు వారి వారి రాజ్యభాగములపై సామంతాధిపత్యముతో పాటు కొన్ని బిరుదులనొసంగెను. కాకతి రెండవ బేతరాజుకు "విక్రమచక్రి" "త్రిభువన మల్ల" బిరుదములొసంగి సత్కరించెను. కాకతి రెండవ బేతరాజు చాళుక్య చక్రవర్తికి అత్యంత ప్రియమయిన వాడయి మునిగొండ చాళుక్య రాజ్యమున గల కొన్ని భాగములను సబ్బిసహస్రమున కొంత భాగమును తన రాజ్యమున కలుపుకొనెను. సబ్బిసాయిర మండలమును అనుమ కొండరాజ్యమున చేర్చుటలో బేతరాజు మంత్రియు రాజకీయ చతురుడు అయిన వైజన దండనాయకుడు పరిపాలనా సౌలభ్యమునకు సబ్బిసాహస్రము కాకతిరాజ్యమున నుండుట అవసరమని విక్రమాదిత్యునికి నచ్చజెప్పి తన ప్రభువునకిప్పించి యుండును. ఈ విషయము అనుమకొండ శాసనమందు కలదు.

కొలనుపాక ప్రాంత పాలకుడయిన పారమార జగద్దేవుడు విక్రమాదిత్యునిచే నియమింపబడియు చాళుక్యరాజ్య సామంతుడుగా నుండ సహింపక స్వతంత్రులుగా నుండదలచి శాసనములు వేయించుకొనెను. అంతేగాక కాకతి సామంత రాజ్యము నందున్న శనిగరమును దుద్దెడను ఈతడు ఆక్రమించెను ( దుద్దెడ నేటి కొండపాక మండలమున కలదు) కాకతి బేతరాజు జగద్దేవుని దురాక్రమణమును చక్రవర్తికి ఎరింగించి జగద్దేవుని రాజ్యభ్రష్టుని గావించి తిరిగి సబ్బిసహస్రమును సంపూర్ణముగా కాకతి రాజ్యమున చేర్చెను.

కాకతి రెండవ బేతరాజు క్రీ.శ. 1052 నుండి క్రీ.శ. 1108 వరకు పరిపాలించెను.

## దుర్గరాజు

రెండవ బేతరాజు పెద్దకుమారుడయిన దుర్గరాజు క్రీ.శ. 1108 లో కాకతిరాజ్య సింహాసన మధిష్టించెను. ఇతడు తండ్రివలె చాళుక్యచక్రవర్తికి విధేయ సామంతునిగా నుండక పాలమార జగద్దేవుని పాలవాస మేడరాజు మొదలగు సామంతుల ప్రోత్సాహము వలన స్వతంత్రునిగా వ్యవహరించెను. ఈతని సోదరుడయిన రెండవ ప్రోలరాజు ఇతని కుతంత్రములనెరిగి చక్రవర్తి సహాయముతో ఇతనిని పదవీభ్రష్టుని గావించెను. ఇతడు క్రీ.శ. 1116 వరకు పరిపాలించెను.

## రెండవ ప్రోలరాజు

రెండవ బేతరాజు రెండవ కుమారుడయిన రెండవ ప్రోలరాజు అన్నయగు దుర్గరాజును తొలగించి క్రీ.శ. 1116 లో కాకతీయ్య రాజ్యసింహాసనా సీనుడయ్యెను.

క్రీ.శ. 1139 లో చాళుక్య సోమేశ్వరుడు స్వర్గస్థుడుకాగా అతని పెద్దకుమారుడయిన రెండవ జగదేకమల్లుడు రాజయ్యెను. ఆ సమయమున తిరుగుబాటునొనర్చిన సామంతులను శిక్షించుటలో ప్రోలరాజు చక్రవర్తికండగా నిలిచి తోడ్పడెను.

ప్రోలరాజు చక్రవర్తి ఆజ్ఞానుసారము కందూరు భీమదేవ చోడునిపై దండెత్తెను. ఆ యుద్ధమున భీమదేవచోడునకు సహాయముగా కుమార తైలపుడు ఉండగా ప్రోలరాజు కుమారతైలపుని బంధించి చక్రవర్తి కుమారుడను గౌరవభావమున విడిచిపెట్టెను. యుద్ధరంగమును వీడి కందూరి భీమదేవచోడుడు అడవుల బట్టి పారిపోగా ప్రోలరాజు భీముని బంధించుటకై మన్ననూరు అడవులనన్నియు గాలించి కృష్ణానదిని దాటి శ్రీశైల మల్లికార్జున స్వామిని దర్శించి, అచట విజయశాసనమును వేయించి వెనుకకు మరలెను.

ప్రోలరాజు పోలవా రాజ్యముపై దండెత్తి వేడరాజునోడించెను. రామగుండ ప్రాంత పాలకుడయిన మేడరాజును కూడా ఆయుద్ధముననే ఎదుర్కొనగా ప్రోలరాజు ఆతనిని ఎదుర్కొనెను. వేడరాజు కాలికిబుద్ధి చెప్పి ప్రాణమ్ములన్ను నిలుపుకొనెను. ఈ యుద్ధమున జగదేకమల్లుడు కూడా పాల్గొనుటచే కాకతి ప్రోలరాజు యుద్ధనైపుణ్యమును, ప్రభుభక్తి పరాయణతను ప్రశంసించెను.

రెండవప్రోలరాజు తెలంగాణమునంతయు జయించి కళ్యాణీ చక్రవర్తికి విధేయసామంతునిగా నుండెను. ప్రోలరాజు పిఠాపుర చాళుక్యులకు సహకరించుచు వెలనాటి రాజేంద్ర చోళునితో యుద్ధమున తలపడెను. ఈ యుద్ధమున కాకతి ప్రోలరాజు మరణించియుండును. వెలనాటి రాజేంద్రచోళునకు అతని సామంతులయిన కోట హైహయ రాజునకు. "కాకతి ప్రోలనిర్దహన" అను బిరుదము కలదు.

ప్రోలరాజు నతవాటి సీమ పాలకుడయిన దుర్గరాజు సోదరి "ముప్పమాంబ" ను వివాహమాడెను. వీరికి రుద్రదేవుడు, మహాదేవుడు, హరిహరుడు, గణపతి, దుర్గరాజు అను ఏవురు కుమారులు కలిగిరి.

ప్రోలరాజు తొలుత జైన మతాభిమాని. తరువాత శైవ మతమును స్వీకరించి వ్యాపింపజేయుటలో తోడ్పడెను ఓరుగల్లు పట్టణమున స్వయంభూ దేవాలయమును నిర్మించెను. ఈ స్వయంభూస్వామి కాకతి వంశమునకు ఆరాధ్యదైవము.

కాకతి ప్రోలరాజు క్రీ.శ. 1116 నుండి క్రీ. శ. 1157 వరకు రాజ్యమును పాలించెను.

## రుద్రదేవుడు

కాకతి రెండవ ప్రొలరాజు పెద్దకుమారుడైన రుద్రదేవుడు క్రీ.శ. 1157లో సింహాసనమధిష్ఠించెను. ఈతడి రాజ్యాభిషేకము నాటికి చాళుక్య సామ్రాజ్యము అల్లకల్లోలముగా నుండెను. రెండవ జగదేక మల్లుని సోదరుడు మూడవ తైలపుడు సోదరుని ఎదిరించి ఆక్రమించుకొని కొంత భాగమును పాలించసాగెను. ఆరవ విక్రమాదిత్యుని దౌహిత్రుడగు కాలాచురిబిజ్జలుడు కళ్యాణీనగరముపై దండెత్తి మూడవతైలపుని తొలగించెను. ఈ విధముగా కళ్యాణీ చాళుక్య సామ్రాజ్యము మూడు ముక్కలయి ముగ్గురు పాలకుల వివిధ ప్రాంతముల నేలుచు తమ తమ ఆధిక్యతను ప్రకటించుచుండిరి. కాలాచురి బిజ్జలుడు కళ్యాణీ సామ్రాజ్యాంతర్భాగములోని సమస్త ప్రాంతమును తన ఏలుబడిలోనికి తెచ్చుకొన ప్రయత్నములు చేయుచుండగా కాకతి రాజులకు బద్ధ శత్రువులయిన పొలవాస అధిపతి మేడరాజును కందూరునాడు పాలకుడగు భీమదేవచోడులు తమకు తగిన సైన్యసహాయమునందించిన కాకతి రుద్రునిపై దండెత్తి విజయం సాధింతుమని వర్తమానం పంపిరి. బిజ్జలుడు గొప్ప సైన్యమును సమాయుత్త పరిచి తమ కుమారుడయిన కుమార మైలగి నాయకత్వమున సైన్యమును మేడరాజు సహాయార్థము పంపెను. మైలగిరి దేవుడు సైన్యమును కళ్యాణీ నగరము నుండి నడిపించుకొని మెదకు జిల్లాలోని పొట్ల చెరువు ప్రాంతమున విడిసెను. బిజ్జలుని సైన్యము మైలగి నాయకత్వమున వచ్చుచున్న విషయమును తెలుసుకొని నగునూరు దొమ్మరాజు, పొలవాస మేడరాజు తమ తమ సైన్యములను యుద్ధమునకు సిద్ధ పరిచిరి.

రుద్రదేవుడు చారుల వలన విషయము నంతయు తెలిసికొని కొంత సైన్యమును మైలగిరినెదుర్కొనుటకు జనగామ తాలుకాలోని ఆకునూరు ప్రాంతమున నిలిపెను. తక్కిన సైన్యమునకు స్వయంగా నాయకత్వము వహించి మొదట నగునూరును ముట్టడించెను. నగునూరు పాలకుడగు దొమ్మరాజుకు సహాయముగా పొలాస యువరాజయిన జగద్దేవుని నాయకత్వమున సైన్యము వచ్చి చేరెను. నగనూరు వద్ద జరిగిన భీకర సంగ్రామమున దొమ్మరాజు యుద్ధమునందు ఓడిపోయి పారిపోయెను.

రుద్రదేవుడు సైన్యమును ముందుకు నడిపి పొలవాస పై దండెత్తెను. కాకతి సైనికుల పోరాటమునకు భీతిల్లిన మేడరాజు గోదావరి దాటి ఆదిలాబాదు జిల్లాలోని అడవుల యందు తలదాచుకొనెను. పొలవాస విజయానంతరము రుద్రదేవుడు తనకనేక విధముల సహాయ సహకారము లందించిన గంగాధర మంత్రిని సన్మానించి నగునూరు రాజధానిగా సబ్బసాయిర మండలమును తన సామంతునిగా పాలించుటకు నియమించెను.

బిజ్జలుని సైన్యము పొట్ల చెరువు నుండి ఆకునూరు రాగా అక్కడ కాపుంచిన కాకతీయ సైన్యము మైలగిని అడ్డగించి ముందుకు సాగనీయక పోయెను. ఓరుగల్లు దారులన్నియు మూసి వేయబడెను. నగునూరు, పొలవాస రాజుల ఓటమి వార్త మైలగిదేవునకు తెలిసినది. మైలగి తన సైన్యమును వెనుకకి మరల్చి కళ్యాణీ నగరము దారి పట్టెను. రుద్రదేవుడు వారిని వెంబడించి కళ్యాణి కటకము వరకు తరుముచుపోయి బిజ్జలుని సైన్యమునకు విశేష నష్టము గావించెను. రుద్రదేవుడు జహీరాబాద్ (మెదకు జిల్లా), బీదరు పర్యంతము వ్యాపించియున్న భూభాగమును కాకతి సామ్రాజ్యమున చేర్చుకొనెను. బిజ్జలుని ఓటమితో కాకతీయులపై కళ్యాణీ చక్రవర్తుల ఆధిపత్యము అడుగంటెను. కాకతీయ సామ్రాజ్యము సర్వస్వతంత్రమై వెలుగొందెను.

కందూరు చోడులలో ప్రసిద్ధి వహించిన ఉదయన చోడమహారాజు పాలించుచుండెను. ఇతనికి భీమదేవ చోడుడు గోకర్ణదేవచోడుడు అనే ఇద్దరు కుమారులు కలరు. చోడులనోడించి రుద్రదేవుడు దండెత్తి రాగా భీమదేవుడు చారులవల్ల విషయము తెలుసుకొని భయపడుచుండెను. రుద్రదేవుడు కందూరు రాజ్యమున ప్రవేశించి రాజధాని యయిన వర్ధమానపురమును ముట్టడించి భీమదేవచోడుని పట్టి బంధించెను. తన విజయ చిహ్నముగా అచట రుద్రదేవుని కోటను నిర్మించెను. అటనుండి శ్రీశైలము వరకు తన రాజ్యమును విస్తరింపజేసెను.

భీమదేవ చోడుడు రుద్రదేవునితో సంధి గావించుకొని తాను సామంతునిగానుండ నంగీకరించి తన సోదరి పద్మావతీ దేవిని రుద్రదేవున కొసంగి వివాహము గావించెను. ఉదయన చోడుడు ఈ వార్తవిని ఆనందించి పద్మావతీ రుద్రదేవుల వివాహము అతి వైభవముగా నిర్వహించెను. కాకతి రుద్రుడు పానుగంటి ప్రాంతమున తన పేర రుద్ర సముద్రమను తటాకమును నిర్మించెను.

రుద్రదేవుడు పానుగంటి ప్రాంతముననున్న అనేక సామంత మాండలికుల నోడించెను. ఈ యుద్ధములలో తనకు సహాయపడిన రేచర్ల బేతిరెడ్డి, నామిరెడ్డి సోదరులకు ఆమనగల్లు, రాజ్యమును చెఱుకు కేతసేనాని తనయుడగు బొల్లయరెడ్డికి జమ్ములూరు రాజ్యమునిచ్చి సామంతులుగా స్థిరపరిచెను. ఈ జమ్ములూరు నేటి తిరుమలపురము మండలమున నున్న జములాపురమే.

కాకతి రుద్రదేవుడు తెలంగాణా ప్రాంతమంతయు జయించిన పిదప తీరాంధ్రముపై దృష్టిసారించెను.

వెలనాటిని జయించుటకయి రెండవ కుళోత్తుంగ రాజేంద్రచోళునితో యుద్ధమొనర్చెను. దాని ఫలితంగా శ్రీశైల త్రిపురాంతక ప్రాంతములు రుద్రదేవుని ఆధీనములోనికి వచ్చెను.

రుద్రదేవుడు వెలనాటి మూడవ గొంకరాజుతో యుద్ధము చేసి అతనిని సంహరించెననియు అందువల్ల ఆతని కుమారుడగు పృధ్వీశ్వరుడు పిష్ఠపురమునకు పారిపోయెననియు, కాకతి రుద్రుని ద్రాక్షారామ శాసనము వలన తెలియుచుచున్నది. ఈ విజయముల తరువాత కాకతీయ సామ్రాజ్యము ఉత్తరమున గోదావరి వరకు. దక్షిణమున శ్రీశైలం వరకు, పశ్చిమమున కళ్యాణి వరకు, తూర్పున తూర్పుకనుమల వరకు వ్యాపించెను.

తీరాంధ్ర యుద్ధములందు రుద్రదేవునకు చెఱకు, మల్యాల, విప్పర్ల, రేచర్ల, కొమురవెల్లి, మల్యాల, దండనాయకులు సాయం చేసి రుద్రదేవుని అభిమానము నకు పాత్రులయిరి.

దిన దిన ప్రవర్థమానమగుచున్న రుద్రదేవుని బలమునకు అసూయపడిన దేవగిరి యాదవ రాజగు జైతుగి రుద్రదేవునితో యద్ధమునకు తలపడెను. ఈ యద్ధమునందు కాకతి రుద్రుడు మరణించెను.

రుద్రదేవుడు కాకతీయ రాజన్యులలోగొప్ప ప్రతిభావంతుడు ఇతడు అసహాయశూరడై, శత్రుభయంకరుడయి స్వతంత్ర రాజ్య స్థాపన గావించెను. క్రీ.శ. 1162 "చిత్రభాను మాఘశుద్ధ త్రయోదశి శనివారం" నాడు స్వతంత్ర కాకతి రాజ్య స్థాపనకు గుర్తుగా రుద్రదేవుడు హనుమకొండలో రుద్రేశ్వర, వాసుదేవ, సూర్యదేవరలకు ఆలయములు నిర్మించి ప్రతిష్ఠచేయ సందర్భమున దేవాలయములకు 'మద్ది చెరువు' గ్రామమును దానముగా ఒసంగుచు శాసనము వేయించెను. ఈ శాసనమునందు ప్రోలరాజు విజయములు రుద్రదేవుని ప్రతాపములు వర్ణింపబడినవి.

ఈ విధముగా రుద్రదేవుడు కాకతి రాజ్యమును సర్వసత్తాక స్వతంత్రరాజ్యముగా నెలకొల్పి విశాల సామ్రాజ్యమును నిర్మించి అనేక సామంత మాండలికులను కలిగి, దేవాలయములను నిర్మించి, లలిత కళలను పోషించి, కాకతి వంశ ప్రతిష్ఠలను ఇనుమడింప జేసి క్రీ.శ. 1195లో స్వర్గస్థుడయ్యెను.

## మహాదేవ రాజు

రుద్రదేవుని అనంతరము అతనికి సంతానము లేకుండుటచే సోదరుడయిన మహాదేవరాజు రాజ్యాధిపత్యము వహించి 3 సంవత్సరాలు మాత్రమే పాలించెను. సోదరుని మరణమునకు కారణభూతుడయిన దేవగిరి యాదవ రాజగు జైతుగిపై పగసాధింపనెంచి మహా సైన్యముతో దండెత్తిపోయి యాదవ రాజ్యములోని కళ్యాణీ కటకమును వశపరుచుకొని ముందుకు సాగి దేవగిరి దుర్గమును ముట్టడించెను. ఈ సంకుల సమరమున మహాదేవరాజు మరణించెను.

ఈ యుద్ధమున మహాదేవుని కుమారుడయిన గణపతి దేవుడు కూడా పాల్గొనెను. గణపతి దేవుడు శత్రువులచే జిక్కి దేవగిరి రాజుల చెరసాల యందుంచబడెను.

మహాదేవుని భార్య 'బయ్యమాంబ'. ఈ దంపతులకు గణపతి దేవుడు, మైలమాంబ, కుందమాంబ అను ముగ్గురు సంతానము. మహాదేవుని పాలనా కాలము క్రీ.శ. 1195 నుండి 1198 వరకు.

## గణపతి దేవుడు

గణపతి దేవుడు యాదవరాజుల చెరసాలలో ఉండెను. మహాదేవుని మరణము, గణపతి దేవుని చెరసాల జీవితము కాకతీయ సామ్రాజ్యమున అల్లకల్లోలమును సృష్టించెను. ముదిగొండ చాళుక్య రాజయిన నాగతిభూపాలుడు విజృంభించి తన పూర్వీకులు కోల్పోయిన రాజ్యభాగముల నాక్రమింప దలచి కొరవి మండలమును స్వాధీన పరుచుకొనెను.

వెలనాటి రెండవ పృధ్వీశ్వరుడు కాకతి రాజ్యములోని మాండలిక రాజ్యము ఆక్రమించుకొని స్వాతంత్రమును ప్రకటించుకొనెను.

మూడవ కుళోత్తుంగ చోడుడు కాకతి రాజ్యభాగములను జయించుచు ముందుకు సాగి ఓరుగల్లు పట్టణమును ముట్టడించెను.

ఈ విపత్కర సమయమున కాకతి సేనానియు ఎలకుర్తి రాజ్యపాలకుడును రేచర్ల రుద్రారెడ్డి విశ్వాస పాత్రులయిన కాకతి సేనానుల అండదండలతో అంతరంగ శత్రువులనణచి వేసెను.

ముదిగొండ చాళుక్యరాజయిన నాగతి భూపాలుడు కాకతీయ సైన్యముల ధాటికి ఆగజాలక కొరవి మండలమును విడిచి పారిపోయెను.

ఓరుగల్లు పట్టణమును ముట్టడించిన మూడవ కుళోత్తుంగ చోడుడు రుద్రారెడ్డిని ఎదుర్కొనలేక యుద్ధరంగమందోడిపోయి వెనకకు మరిలి పోయెను.

రేచర్ల రుద్రాసేనాని మిర్యాల మల్యాల వంశీయులయిన మాండలికులతో కలిసి దేవగిరికి పోయి యాదవరాజయిన జైతునికి నచ్చచెప్పిరి. గణపతి దేవుని చెరసాల నుండి విడిపింప ప్రయత్నించిరి. జైతుగి దూరదృష్టి కలవాడు. కాకతి రాజ్యమున సంభవించిన పరిస్థితులనన్నింటిని గమనించి రాజు లేకున్నను రాజభక్తి పరాయణులచే తిరుగుబాట్ల అణిచివేతను గమనించి భవిష్యత్ దక్షిణాపథ రాజకీయ పరిస్థితులను ఊహించి, సంధిగావించుకొని గణపతి దేవుని బంధవిముక్తుని చేసెను. క్రీ.శ. 1199లో గణపతి దేవునకు పట్టాభిషేక మహోత్సవముజరుపబడినది.

గణపతి దేవుడు సింహాసనాధీశుడు కాగానే వెలనాటి రాజ్యముపై దండెత్తుటకు మల్యాల చౌండ సేనానిని పంపెను అతడు మొదట చోడిరాజును ఓడించెను. అతని వద్ద పృధ్వీశ్వరుడు దాచియుంచిన ధనరాశులను స్వాధీనపరుచుకొని కాకతీయ భండాగారమున చేర్చెను.

చోడరాజు గణపతి దేవునితో సంధిగావించుకొని తన ఇరువురు కుమార్తెలయిన నారమ, పేరమలను గణపతి దేవునికిచ్చి వివాహము నొనర్చెను. చోడిరాజు కుమారుడయిన జాయప్ప గణపతి దేవునికి అభిమాన పాత్రుడై కాకతీయ సైన్యాధ్యక్ష పదవిని పొందెను.

వెలనాటి పృధ్వీశ్వరుడు తన సామంతుడయిన చోడరాజు ఓటమిని అతని కోశాగారమందున్న తన ధనరాశులు పోవుటను తెలిసికొని, గొప్ప సైన్యముతో కాకతి సేనలనెదిర్చెను. ఈ యుద్ధమున పృధ్వీశ్వరుడు చంపబడెను. వెలనాటి చోడరాజ్యము కాకతీయ సామ్రాజ్యమున కలుపబడెను. నూతనముగా జయించిన వెలనాటి ప్రాంతమునకు పాలకునిగా తన బావమరిదియయిన జాయప సేనానిగా నియమించెను. ఈ యుద్ధమున నెల్లూరి చోడ ప్రభువగు తిక్క భూపాలుడు గణపతి దేవునకు సహాయముగా పాల్గొనెను. యుద్ధానంతరము తిక్క భూపాలుని అభ్యర్థనను మన్నించి నెల్లూరు నాక్రమించిన నల్లసిద్ధిని తరుమగొట్టి తిక్క భూపాలుని నెల్లూరు రాజ్యపీఠమునలంకరింప జేసెను. దీనితో నెల్లూరు తిక్క భూపతి తన రాజ్యమందున్న కడప మండలమును కాకతి రాజ్యమున చేర్చెను. గణపతి దేవుడు ఆ ప్రాంతమునకు గంగమసాహిణి అను కాయస్థుని సామంతునిగా నియమించెను.

క్రీ.శ. 1112 లో గణపతి దేవుడు పూర్వదేశ విజయమునకై బయలదేరెను. గణపతి దేవుడు మహారాజ నీతిజ్ఞుడు. ఈతడు కేవల యుద్ధ విజయముల వలననేకాక స్నేహబాంధవ్యములు కల్పించుకొని కూడా తన లక్ష్యములు సాధించెను. నిరవద్యప్రోలు (నేటి పశ్చిమ గోదావరి జిల్లాలోని నిడదవోలు) పాలకుడగు చాళుక్య వీరభద్రునికి గణపతి దేవుడు తన కుమార్తె యగు రుద్రాంబను ఇచ్చి వివాహము చేసెను. కోటవంశీయుడు అగు బేతరాజునకు కుమార్తెయగు గణపాంబనిచ్చి వివాహమొనర్చెను. సోదరి మేలాంబిక నతనాటి బుద్ధరాజు కుమారుడయిన రుద్రుని కిచ్చి వివాహము చేసెను. ఈ విధముగా గణపతి దేవుడు బలవంతులయిన వారిని తన ఆప్త వర్గములో చేర్చుకొనెను.

గణపతి దేవుని సేనానియగు ఇందులూరి సోమయ కొలని రాజ్యాధిపతియగు కేశవరాజును ఓడించి అతని రాజ్యభాగమును కాకతీయ రాజ్యములో చేర్చెను.

గణపతి దేవుడు కళింగమును పాలించిన అనియంక భీమునితో యుద్ధము చేసి నేటి గంజాము మండలములోని ఆస్కా వర్గలకు గల ప్రాంతమును జయించి స్వాధీన పరచుకొనెను. కాకతి సైన్యము గోదావరిని అధిగమించి గాంగరాజుల సామంతుల నోడించిరి.

తిక్క భూపతి కుమారుడు రెండవ మనుమసిద్ధి రాజ్యమును కోల్పోయె. తన ఆస్థానకవియు మంత్రియునయిన తిక్కన సోమయాజిని గణపతి దేవుని వద్దకు సహాయమర్థించ పంపెను. తిక్కన సోమయాజి రచించిన మహాభారతమును గణపతి దేవుడు శ్రద్ధగా విని అతనిని గౌరవించి అతనికి బహుమానముగా అతని కోరిక మేరకు మనుమసిద్ధికి సహాయపడుటకై సైన్యమును పంపెను.

కాకతీయ సైన్యములు తోడురాగ మనుమసిద్ధి యుద్ధంయొనర్చి శత్రువులను యుద్ధ రంగమున సంహరించెను. మనుమసిద్ధిని నెల్లూరు రాజ్యమునకు తిరిగి రాజుగా నొనరించెను. గణపతి దేవుడు ద్రవిడ దేశము దండయాత్ర సలిపి చోళ, హోయసల రాజ్యములను జయించెను.

గణపతి దేవుడు కాంచీ నగరమును జయించినట్లు గణపతి దేవునిచే వేయించబడిన శాసనము తెలుపుచున్నది. అంతేగాక గుంటూరు మండలము నందలి నాయనపల్లి గ్రామ శాసనము కూడా కాంచీనగర విజయమును తెలుపుచున్నది.

ద్రావిడ దేశమున చోడరాజ్యము అంతరించి పాండ్యులు బలవంతులయిరి. అందు జటావర్మ సుందర పాండ్యుడు దక్షిణ భారతమంతయు స్వాధీన పరచుకునెంచి కాంచీ పాలకుడును గణపతి దేవ చక్రవర్తి సామంతుడునగు సామంతభోజుని తొలగించి విజయగండ గోపాలుడు ఆక్రమించుకొనగా జటావర్మ సుందర పాండ్యుడు అతనిని తన సామంతునిగా స్వీకరించెను నెల్లూరు పాలకుడయిన రెండవ మనుమసిద్ధిని తనకు సామంతునిగా నుండమని పాండ్యుడు వత్తిడి చేసెను. మనుమసిద్ధి అందులకు అంగీకరింపక గణపతిదేవునకు వర్తమానము పంపెను. గణపతి దేవుడు మనుమసిద్ధి రాజ్యమును రక్షించుటకును పాండ్యుడిని అణచుటకును గొప్పసైన్యమును పంపెను. పాండ్యుడు తన సైన్యాధిపతియగు "కొప్పెరుంజింగని" నాయకత్వమున ప్రబల సైన్యమును పంపించెను. ఆ యుద్ధమున పాండ్యసైన్యములు పరాజయమును పొందినవి జటావర్మ సుందరపాండ్యుడు స్వయముగా మరికొంత సైన్యమును తీసుకొని నెల్లూరు రాజ్యమును ముట్టడించెను. ఈ యుద్ధమున మనుమసిద్ధి వీర స్వర్గమునలంకరించెను. జటావర్మ సుందర పాండ్యుడు విజయచిహ్నముగా నెల్లూరు, కాంచీ నగరములందు పట్టాభిషేకము నొనర్చుకొనెను.

గణపతి దేవుడు "రాయగజకేసరి" బిరుదాంకితుడు. ఈతడు వేయించిన నాణములపై ఇట్టి పేరు కన్పించుచున్నది. ధాన్యము కొలతకై 'కేసరిపుట్టి' అను కొలమానముండెను. 'కేసరి మాడలు' ఆనాడు వ్యాప్తిలో నుండెను.

ఈ విధముగా సమగ్రాంధ్ర దేశమును ఏకచ్ఛత్రాధి పత్యము క్రిందికి తెచ్చి తెలుగు భాషా సంస్కృతుల న్నాదరించి పాలించిన ఘనకీర్తి గణపతి దేవ చక్రవర్తికి కలదు. ఇతని పాలనా కాలము క్రీ.శ. 1199-1261.

## రుద్రమ దేవి

గణపతిదేవ చక్రవర్తి గారాల కూతురు రుద్రమదేవి చిన్నతనము నుండియే రాచరిక విద్యలను నేర్చుకొనెను. గుఱ్ఱపుస్వారీ, కత్తిసాము మొదలగు యుద్ధవిద్యలందు ఆరితేరినదయ్యెను. రాజనీతి తండ్రికడ నేర్చుకొనెను.

గణపతి దేవచక్రవర్తి జీవించియున్న కాలముననే రుద్రమదేవి కాకతీయ పరిపాలనా పగ్గములను చేత ధరించెను. ఆమె తెలివి తేటలకు, ఆమె ధైర్య సాహసములకు మెచ్చి విధేయ సామంత మాండలిక దండనాయకులు ఆమెను భక్తి ప్రపత్తులతో కొలచు చుండిరి. నెల్లూరు ప్రాంతము జటావర్మ సుందర పాండ్యుని సామంతునిగా వశమయ్యెను. కాకతీయ పరిపాలనా భారమును రుద్రమదేవి చేపట్టుటను విన్న దేవగిరి యాదవ రాజు కాకతీయ సామ్రాజ్యముపై దండెత్తుటకు వచ్చెను. ఓరుగల్లు కోటను ముట్టడించెను రుద్రమదేవి యుద్ధ వ్యూహము వలన యాదవ సైన్యము కోటలోనికి చొచ్చుకొని పోవు సమయమున బంధింపబడెను. మహాదేవునకు తక్కిన యాదవ సైన్యమును రప్పించు అవకాశము నీయక రుద్రమ దేవి మహాదేవుని తరుముచు వెన్నంటెను. రుద్రమదేవి మార్గమధ్యములోని బీదరు కోటను ముట్టడించి వశపరుచుకొని సిందాన్వయుడైన భైరవుని తన ప్రతినిధిగా నిలిపి ఓరుగల్లుకు తిరిగి చేరెను.

యాదవ మహాదేవరాజు తన సైనికులు కాకతీయులకు బందీలగుటకు దుఃఖించి వారిని విడిపించుకొనుటకు సంధిమొనర్చుకొని కోటి నిష్కములు యుద్ధాపరాధము క్రింద చెల్లించి తన సైన్యమును విడిపించుకొనెను.

బీదరులో సిందాన్వయభైరవుని శాసనము కలదు. అందు గణపతి దేవునకు రుద్రమదేవికి రాయగజకేసరి బిరుదమున్నట్లు తెలుసబడినది. ఈ విధముగా యాదవరాజు విషయమునెరింగిన కాకతీయ సామంతులు ఆమె సార్వభౌమత్వమునకు విధేయులైరి. అయినప్పటికి తీరాంధ్ర ప్రాంతము లందున్న కొందరు సామంతులు స్వాతంత్రము ప్రకటించుకొనిరి. క్రీ.శ. 1274లో కళింగ మొదటి భానుదేవుడు, వడ్డాది అర్జునదేవుడు కలిసి వేంగీదేశము పై దండెత్తిరి. కాకతీయ సేనానులయిన పోతిరాజు ప్రోలినాయకుడు వారినెదుర్కొని యుద్ధమందోడించి తరిమివేసిరి. వీరికి 'మత్తమాత్తంగ సింహ' 'ఉడ్డీయ రాయమానమర్దన' అను బిరుదములొసంగబడినవి.

నెల్లూరు రాజ్యమును వీర రాజేంద్రచోళుడు పాండ్యుల సామంతునిగా పాలించుచుండెను. కడప మండలమును వైదుంబులయిన కేశవదేవ సోమిదేవులు పాలించుచుండెను. కాకతీయుల సామంతునిగా కాయస్థ గంగయసాహిణి మేనల్లుడయిన. జన్నిగదేవుడు ఆ ప్రాంతమున నామమాత్ర పాలకుడయ్యెను. ఈ విషయమును గమనించి రుద్రమదేవి తన సామంతుడయిన నాగదేవ మహారాజును నెల్లూరుపై ప్రబలసైన్యముతో పంపెను అతడు రాజేంద్రచోడు నోడించి తరమివేసి రాజ్యమునాక్రమించెను. జన్నిగదేవుని గొప్పసైన్యముతో వైదుంబులపై పంపగా అతడు క్రీ.శ. 1268లో కేశవదేవ సోమదేవులనోడించి తన పూర్వ భూభాగములనన్నింటిని స్వాధీన పరచుకొనెను. జన్నిగదేవుని తర్వాత ఆతని సోదరుడు త్రిపురాంతక దేవుడు కాయస్థ సింహాసన మధిష్ఠించి గండికోట రాజధానిగా నెల్లూరు రాజ్యమును పాలించెను.

ఈతడు రెండు సంవత్సరములు మాత్రము పాలించి మరణించెను. త్రిపురాంత దేవుని తర్వాత కాయస్థ సింహాసనమును అతని సోదరుడు అంబదేవుడు క్రీ.శ. 1272 లో అధిష్ఠించెను. ఇతడు కాయస్థ రాజ్యమును సామ్రాజ్యముగా నిర్మింపదలిచి కాకతి రుద్రమకు వ్యతిరేకముగా పాండ్యులతో సమాలోచనములు చేయుచుండెను. తన గండికోట దుర్గమును శత్రుదుర్భేద్యముగా చేసి సైన్యమును సమీకరించుకొని రుద్రమదేవి నెదిరించుటకై వేచియుండెను. కంచి పాలకుడయిన విజయగండ గోపాలుడు నెల్లూరు రాజ్యముపై దండెత్తి నందులూరి వరకుగల భూభాగమునాక్రమించెను. ఈ సమయమున నెల్లూరు రాజ్యమును రెండవ మనుమసిద్ధి కుమారుడయిన ఇమ్మడి తిరుకాలత్తి దేవ చోడడు పాలించుచుండెను. కాయస్థ అంబదేవుడు క్రీ.శ. 1285లో నెల్లూరుపై దండెత్తి, దేవచోడుని ఓడించి, ఆ రాజ్యమున తన సామంతునిగా మనమగండ గోపాలుడిని నియమించెను. ఆ తరువాత అంబదేవుడు పాండ్యరాజ్యముపై దండెత్తి జటావర్మ సుందరపాండ్యుని సేనానియైన కొప్పెరుంజింగని సంహరించి కొంత భూభాగమును తనస్వాధీనము చేసుకొనెను. ఈ విధముగా అంబదేవుడు దక్షిణమున పాండ్యుల అధికారమును అణచి ఉత్తర ప్రాంత భూములను ఆక్రమింపసాగెను. ఈ విషయము అన్నియు క్రీ.శ. 1290లో వేసిన త్రిపురాంతక దేవాలయమునందలి శాసనముల వలన తెలియుచున్నది. ఈ త్రిపురాంతక శాసనములందు అంబదేవుని అజేయ పరాక్రమములు అతడు సాధించిన భూభాగములు వర్ణింపబడినవి. అంబదేవుడు శ్రీపతి గణపతిని జయించి రామ సహస్రమల్ల బిరుదము నొంది ఏరువమల్లిదేవుని కీర్తిశేషుని చేసెను. అల్లుగంగ, కేశవ, సోమిదేవుల, సెంత పాలకుడయిన మల్లికార్జునుని ఓడించెను. చెఱుకు బొల్లయ కుమారుడయిన రాజన్నకు తన కుమార్తెను ఇచ్చి అల్లునకు నందనపుర రాజ్యమును బహుమానముగా నిచ్చెను. అంబదేవుడు గండికోట ములికినాడు, రేనాడు, పెడకల్లెంటు, ఏరువ, పొత్తపి, సకిలి మొదలయిన సీమలను స్వాధీనపరుచుకొని వల్లూరు రాజధానిగా పాలించుచుండెను. అంతేకాక కాకతీయ సామ్రాజ్యము నుండి త్రిపురాంతకమును పలనాటి సీమలను గ్రహించెను. ఈ సమస్త యుద్ధములందు అంబదేవునకు కాకతీయులకు ఆగర్భ శత్రువులయిన దేవగిరి యాదవరాజులు, పాండ్యులు సంపూర్ణ సహకారమొనర్చిరి. ఇట్లు అంబదేవుడు క్రీ.శ. 1290 నాటికి సంపూర్ణ స్వతంత్రుడై త్రిపురాంతక శాసనమును వేయించెను.

ఈ విధముగా అంబదేవుడు స్వతంత్రుడై తన సామంత మాండలికులను సంహరించుటచే రుద్రమదేవి స్వయముగా నాయకత్వము వహించి నెల్లూరు రాజ్యముపై దండెత్తెను. అంబదేవుడు సైన్యమును సమీకరించుకొని కాకతీయ సేనల నెదిర్చెను. ఈ యుద్ధము క్రీ.శ. 1289లో జరిగినది.

ఈ యుద్ధమందు అంబరాజు మహారాణి రుద్రమను అంగరక్షకుడయిన మల్లికార్జున నాయకుని సంహరించెను. ఈ విషయము త్రిపురాంతక దేవాలయ శాసనము తెలుపుచున్నది. క్రీ.శ. 1289లోని చందుపట్ల శాసనము కూడా ఈ విషయమును ధృవ పరుచుచున్నది.

రుద్రమదేవి భర్త చాళుక్య వీరభద్రుడు. ఈ దంపతులకు ముగ్గురు కుమార్తెలు. జ్యేష్ఠ పుత్రిక ముమ్మడమ్మ కాకతి మహాదేవుని వివాహమాడెను. వారి కుమారుడు ప్రతాపరుద్రుడు. రుద్రమదేవి దౌహిత్రుడయిన ప్రతాపరుద్రుని దత్తత తీసుకొని యువరాజుగా ప్రకటించెను. రుద్రమదేవి అనంతరము ఇతడే రెండవ ప్రతాపరుద్రునిగా కాకతీయ సామ్రాజ్యమునకు వారసుడయ్యెను. శాసనములందు ఈతనిని కుమార రుద్రుడు, వీరరుద్రుడు, ప్రతాపరుద్రుడు అని వర్ణింప బడినాడు.

రుద్రమదేవి రెండవ కుమార్తె రుద్రమ ఈమె యాదవ ఎల్లణ దేవుని వివాహమాడెను.

రుద్రమదేవి మూడవ కుమార్తె రుయ్యమ. ఈమె మహామంత్రి ఇందులూరి అన్నయను పెళ్ళాడెను.

కాకతీయ మహాసామ్రాజ్యమును రుద్రమదేవి అతి సమర్ధవంతముగా పరిపాలించి ఆంధ్ర స్త్రీలోకమున కాదర్శ ప్రాయురాలై, మహారాణియై, చక్రవర్తినియై 28 సంవత్సరములు ప్రజానురంజకముగా కాకతీయ సామ్రాజ్యమును పరిపాలించెను. ఈమె పాలనా కాలము క్రీ.శ. 1262 -1289.

## ప్రతాప రుద్రుడు

కాకతీయ రుద్రమదేవి మరణానంతరం ఆమె దౌహిత్రుడు ప్రతాపరుద్రుడు క్రీ.శ. 1289 లో ఓరుగల్లు రాజ్య సింహాసనమలంకరించెను. ప్రతాపరుద్రుడు సింహాసనమధిష్ఠించు నాటికి అంబదేవ మహారాజు బలవంతుడై కాయస్థసామ్రాజ్యమును స్థాపించ ఉవ్విళ్ళూరుచుండెను. యాదవ పాండ్యులు కాకతిరాజ్యమునకు వ్యతిరేకముగా కుట్రలు పన్నుచుండిరి.

ప్రతాపరుద్రుడు అరివీర భయంకరుడు, రాజకీయ చతురుడు, యుద్ధతంత్రజ్ఞుడు. యువరాజుగానున్న కాలమునందే నాయంకర విధానమును ప్రవేశపెట్టి కాకతీయ సైన్యములకు శిక్షణనిప్పించి వ్యూహరచనా పద్ధతులను యుద్ధతంత్రమును నేర్పి సైన్యాధిపతులను గొప్ప సుశిక్షితులుగా చేసెను.

ప్రతాపరుద్రుడు కాకతీయ వంశ ప్రతిష్ఠనినుమడింప జేయుటకై కోల్పోయిన రాజ్యభాగములను ఆక్రమించుటకయి సైన్యమును పటిష్ఠపరిచి నాయంకర విధానమును ప్రోత్సహించెను.

ప్రతాపరుద్రుడు తన ప్రచండ సైన్యమును మూడు విభాగములుగా చేసి ఒకదానికి ఇందులూరి అన్నయ మంత్రిని సైన్యాధిపతిగా నియమించి, అంబదేవుని రాజ్యమును ముట్టడించ పంపించెను. ప్రచండ సైన్యముతో వచ్చిన అన్నయమంత్రిని ఎదిరింపజాలక అంబదేవుడు కోటవిడిచి పలాయితుడయ్యెనని కొందరు చారిత్రికులూహించగా యుద్ధరంగమున వీరమరణమొందెనని కొందరు భావించుచున్నారు.

అడిదము మల్లు నాయకత్వమున మరికొంత సైన్యముతో నెల్లూరు ముట్టడి సాగెను. నెల్లూరు పాలకుడయిన మనుమగండ గోపాలుడు ప్రాణములకు తెగించి పోరాడెను. అడిదం మల్లు చేతిలో గోపాలుడు సంహరింపబడెను. దీనితో "మనుమగండగోపాల శిరఃఖండన" అను బిరుదమును అడిదం మల్లు ధరించెను.

మరొకవైపునుండి యాదవరాజ్యముపై దండెత్తుటకయి గోనగన్నారెడ్డిని ప్రతాపరుద్రుడు పంపెను. గోనగన్నారెడ్డి వర్ధమాన పుర ప్రాంతమును పాలించుచు కాకతీయరాజ్య పశ్చిమ ప్రాంత రక్షకునిగా వ్యవహరింపబడుచుండెను. గన్నారెడ్డి సోదరుడు విఠల నరేంద్రుడు. ఈ సోదరులు ఇరువురు యాదవులా క్రమించిన అదవాణి, తుంబళములను జయించి రాయచూరు పై దండెత్తి ఆ దుర్గమును జయించి కృష్ణాతుంగభద్రానదుల నడిమి దేశముతో పాటు దక్షిణాంధ్ర భూభాగములను కాకతీయ సామ్రాజ్యమున విలీనమొనర్చిరి. ఈ విధముగా ప్రతాపరుద్రుడు చక్కని వ్యూహముతో ఏకకాలమున కాకతిరాజ్య పతనమును గోరిన యాదవ, పాండ్య, కాయస్థ రాజులను మట్టుపెట్టి కాకతీయ సామ్రాజ్య పురావైభవమును ప్రతిష్ఠించి ఆంధ్రదేశమును ఏకచ్ఛత్రాధి పత్యముగా పాలించెను. ఈ సమస్త యుద్ధములందు ప్రతాపరుద్రునకు ఇందులూరి అన్నయ మంత్రి, అడిదముమల్లు చెఱుకురాజన్న, గోన గన్నారెడ్డి మొదలయిన సామంత మాండలిక దండనాయక సేనాధిపతులు అండగానిలిచిరి.

ప్రతాపరుద్రుడు రాజగునాటికి ఢిల్లీని జలాలుద్దీన్ ఖిల్జీ పాలించుచుండెను. జలాలొద్దీన్ ఖిల్జీ సోదరకుమారుడు అయిన అల్లావొద్దీన్ ఖిల్జీ క్రీ.శ.1296 లో దేవగిరి యాదవరాజ్యముపై దండెత్తి భాండాగారమును కొల్లగొట్టి అందులోని ధనముతో స్వయముగా కొంతసైన్యమును సమీకరించుకొని జలాలొద్దీన్ ఖిల్జీ ని సంహరించి అల్లావొద్దీన్ ఖిల్జీ ఢిల్లీ సింహాసనాధీశుడయ్యెను. ఢిల్లీ సుల్తానుడగుటతోడనే అల్లావొద్దీన్ మలిక్ ఫక్రుద్దీన్, జూనా జాజు అను సేనానుల నాయకత్వమున క్రీ.శ. 1303 లో ఓరుగల్లును ముట్టడింప పంపెను. ఢిల్లీ సైన్యము గోదావరిని దాటి నేటి కరీంనగరు మండలమును చేరెను. ప్రతాపరుద్రుడు ఆ సైన్యములను ఎదిరించుటకై "పోతుగంటిమైలి" అను సేనాని నాయకత్వమున గొప్ప సైన్యమును పంపించెను.

గుడిశాల ప్రాంతమున ఘోర సంగ్రామము జరిగెను కాకతి సైన్యము ఢిల్లీ సేనలను వెంటాడుచు సంహరించుచుండిరి. దీనితో తురుష్క సైన్యము వెనుదిరిగి పోయెను. మొదటిసారిగా జరిపిన అల్లావుద్దీన్ ఖిల్జీ దండయాత్ర దీనితో విఫలమయ్యెను. కాకతి సైన్యము విజయోత్సాహమున ఓరుగల్లు చేరుకొనెను.

క్రీ.శ. **1309** లో అల్లావుద్దీన్ ఖిల్జీ మలిక్‌కాఫర్ అను సేనాని నాయకత్వమున రెండవ పర్యాయము ఓరుగల్లు ముట్టడించుటకు పంపెను. మలికాఫర్ మొదట దేవగిరి రామచంద్రరాజు ఆతిథ్యమును పొంది ఓరుగల్లు రాజ్య భాగమయిన సిరిపూరు దుర్గమును ముట్టడించి జయించెను. అటునుండి గోదావరిని దాటి హనుమకొండ పట్టణమును స్వాధీనపరుచుకొని ఓరుగల్లు కోటను ముట్టడించెను. ప్రతాపరుద్రుడు సకల సామంత మాండలిక సైన్యమును సమకూర్చుకొని దుర్గ రక్షణకై శత్రువులులోనికి చొరబడకుండా కోటబురుజులపై సైనికుల నియమించి కాపలాయుంచెను. నెలరోజుల నాటికి తురుష్కసేనలు అగడ్తనుదాటి మట్టి కోటలోనికి ప్రవేశించినవి. ప్రతాపరుద్రుడు మట్టికోట రక్షణకు సంపూర్ణమైన పటిష్టమైన ఏర్పాటుగావించెను. ఢిల్లీనుండిగాని దేవగిరి నుండిగాని అదనపు తురుష్క సైన్యమును రాకుండా ద్వారన్నియు మూసివేయించెను కాకతీయసైనికులు పౌరుషముతో పోరాడుచు తురుష్క సైన్యములందనేకుల సంహరించిరి.

మాలిక్కాఫరుకు కోటస్వాధీనమగునను ఆశ అడుగంటెను. అతడు కోటలోనికి ఆహారపదార్థముల నందకుండా చేసి దుర్గ పరిసర ప్రాంతమందున్న గ్రామములను తగులబెట్టి పంటపొలములను విధ్వంస మొనర్చి. కోటను స్వాధీనమొనర్చుకొను ప్రయత్నములు కొనసాగించెను.

ప్రజల హాహాకారములను విని చలించిన ప్రతాపరుద్రుడు మలిక్కాఫర్‌తో సంధిగావించుకొని నాటికి భండాగారముననున్న ఆరువేల ఖర్వారుల ధనమును, వంద గజములను సమర్పించి ప్రతియేడు ఢిల్లీ సుల్తానులకు కప్పము చెల్లింప నంగీకరించెను.

ప్రతాపరుద్రుని సామంతుడు నెల్లూరిని పాలించు రంగనాథచోడుడు కాకతీయ సామ్రాజ్యమునకు తిరుగుబాటు చేసి స్వాతంత్ర్యమును ప్రకటించుకొనెను. అట్లే కడపమండల రాజులయిన కాయస్థులు ప్రతాపరుద్రుని ఎదిరించిరి. ప్రతాపరుద్రుని ఆజ్ఞచే జుట్టమలెంక గొంకారెడ్డి కాయస్థ రాజుల తిరుగుబాటునణచి కడప మండలమును స్వాధీన పరుచుకొనెను. ప్రతాపరుద్రుడు గొంకారెడ్డిని గండికోట పాలకునిగా నియమించెను.

దక్షిణదేశమున సుందర పాండ్యుడు సోదరుల వలన రాజ్యభ్రష్టుడై ఢిల్లీసుల్తానులను శరణు వేడెను. ఢిల్లీసుల్తాను సుందర పాండ్యునికి రాజ్యమిప్పించుటకై ప్రతాపరుద్రుని ఆదేశించెను.

ఢిల్లీ సుల్తాను కోరికమేరకు ప్రతాపరుద్రుడు ముప్పిడి నాయకుని నాయకత్వమున ముట్టడి చేసెను. సుల్తాను సైన్యములు వీరి సహాయమునకై వచ్చెను. క్రీ.శ. 1316 లో అల్లావొద్దీన్ ఖిల్జీ మరణించుట వలన సుల్తాను సైన్యములు వెనుదిరిగిపోయెను. ముప్పిడినాయుడి కుమారుడయిన పెదరుద్రసేనాని నెల్లూరును స్వాధీన పరుచుకొనెను. ఈ సమయమున హోయసల మూడవ భల్లాళుడు విజృంభించి కాంచీనగరముతో పాటు తొండై మండలమును కలుకడ ప్రాంతముల నాక్రమించెను. పెదరుద్రసేనాని భల్లాళునెదిర్చి ఓడించి కాంచీనగరము నాక్రమించెను. ప్రతాపరుద్రుడు రేచర్ల ఎర దాచానాయుడు, మాదానాయుడు, మానవీరుడు, దేవిరినాయుడు మున్నగు సేనానులతో కలిసి నెల్లూరు ప్రాంతములకు వచ్చి పెద్దరుద్రునికి సహాయపడిరి. ఈ ఘోరయుద్ధమున పాండ్యులు పరాభూతులై వెనుదిరిగిరి.

ప్రతాపరుద్రుడు మానవీరుని కాంచీనగర పాలకునిగా నియమించెను. సుందరపాండ్యుని వీరదావలమున పట్టాభిషక్తుని గావించెను. ఈ విజయ చిహ్నములుగా క్రీ.శ. 1317లో శ్రీరంగము సకలవీధులందు దానశాసనములు వేయించబడెను.

అల్లావుద్దీను అనంతరము అతని కుమారుడు షియాబుద్దీన్ ఢిల్లీ పరిపాలకుడయ్యెను. అతని పరిపాలనా వ్యవహారములను మల్లిక్కాఫర్ చూచు చుండెను. అల్లావుద్దీన్ ఖిల్జీ కుమారులలో ఒకడయిన కుదబ్బద్దీన్ ముబారక్ మలికాఫర్‌ను చంపి షియాబుద్దీన్‌ను తొలగించి ఢిల్లీ సింహాస నమాక్రమించెను. ముబారక్ దక్కనుకు ఏతెంచి దేవగిరి హరపాల దేవుని తిరుగుబాటునణచివేసెను. ఓరుగల్లులో కప్పము వసూలు చేయుట కై ఖుస్రూఖాన్‌ను పంపించెను. ప్రతాపరుద్రుడు అతనికి బకాయితో కలిపి మొత్తము కప్పమును చెల్లించి వంద గజములు, 12 వేల అశ్వములు సమర్పించెను.

షియాజుద్దీన్ అను తుగ్లక్ వంశీయుడు ఖిల్జీవంశమును అంతమొందించి క్రీ.శ. 1320లో ఢిల్లీ సింహాసనమాక్రమించెను. ఈ గందరగోళ పరిస్థితులలో సామంత రాజులందరును ఢిల్లీ సుల్తానుకు కప్పమును కట్టుట మానివేసిరి. కాకతి ప్రతాపరుద్రుడు సైతము ఢిల్లీ సుల్తానుకు కప్పము కట్టుట మానివేసెను. అంతేకాక కంపిలి రాజ్యమును ముట్టడించి అంతకుముందే కుమార రాయుడా క్రమించిన రాజ్యభాగములను తిరిగి స్వాధీన పరుచు కొనెను. బీదరుపై దండెత్తి బీదరు కోటనాక్రమించెను.

క్రీ.శ. 1323లో ఢిల్లీ సుల్తానయిన షియాజుద్దీను తన కుమారుడయిన ఉలుగ్ ఖాన్‌ను ఓరుగల్లు దుర్గమును ముట్టడించ పంపించెను. ఉలుగ్ ఖాన్ ఓరుగల్లు దుర్గమును ముట్టడించెను. ప్రతాపరుద్రుని సైనికులు ఆ ముట్టడి నెదుర్కొని దుర్గమును రక్షించుచుండిరి. 5 నెలలు గడిచినను కోటస్వాధీనము కాలేదు.

ఉలుగ్‌ఖాన్ తన స్నేహితుడయిన ఉబేదుని మాయోపాయముచే ఘియాజొద్దీన్ తుగ్లకును దుండగులు సంహరించినారనే వదంతిని వ్యాపింపజేసి యుద్ధమును చాలించి ఢిల్లీ నగరమునకు ప్రయాణమై కొద్ది రోజులలో తిరిగివచ్చి ఓరుగల్లును ముట్టడించెను. ప్రమత్తులై ఉన్న ఓరుగల్లు సైనికులు ఈ ముట్టడికి దిగ్భ్రమ చెందిరి. ఉలుగ్ ఖాన్ పట్టుదలతో ఓరుగల్లు కోటను ముట్టడించి, వేలకొలది సైనికులను సంహరించి, భయానకము సృష్టించి కోట వశపరుచుకొని కోశాగారమును కొల్లగొట్టి ప్రతాపరుద్రుని బంధించి చెరపట్టి ఢిల్లీకి కొంపోయెను.

ప్రతాపరుద్రుడు ఆత్మాభిమాని. సుల్తాను చేతిలో కారాగార శిక్ష అనుభవించుట కన్న ప్రాణత్యాగము మేలని భావించి నర్మదా నదీ తీరమున ఆత్మాహుతి గావించు కొనెను.

ప్రతాపరుద్రుని పట్టపురాణి విశాలాక్షి. ఎల్లేడు శాసనమున లక్ష్మీదేవి యను మరియొకరాణి యున్నట్లు తెలియుచున్నది. ప్రతాపరుద్రుడు కాకతీయ మహాసామ్రాజ్యమును అతి వైభవముగా 35 సంవత్సరములు పాలించి, తెలుగు సంస్కృతీ విలసనమునకు చేయూతనందించి, లలిత కళలను పోషించి, ప్రజోపయోగ నిర్మాణములనేక ములను చేపట్టి చిరకీర్తినందెను.

కాకతీయ సామ్రాజ్యము ఆంధ్రదేశ చరిత్రలో ఒక సువర్ణాధ్యాయము.

# కాకతీయుల నాటి సాంఘిక చరిత్ర

ఆంధ్ర దేశము చాళుక్యుల తర్వాత అస్తవ్యస్తముగా అనేక రాజుల పరిపాలనలో మ్రగ్గి, రాజకీయముగా అల్లకల్లోలముగానున్న సమయమున యావదాంధ్రదేశమును ఏకచ్ఛత్రాధి పత్యము క్రిందకు తెచ్చి ఆంధ్రులకు సువర్ణాధ్యాయమునందించిన ఘన చరిత్ర కాకతీయులది.

కాకతీయ సామ్రాజ్యము కాకతి వెన్నరాజుతో క్రీ.శ. 757లో రాష్ట్రకూట సామంత రాజ్యముగా పరిపాలన ప్రారంభింపబడినది.

కాకతీయ మొదటి బేతరాజు క్రీ.శ 992లో చాళుక్య ప్రభువైన రెండవ తైలపరాజుచే హన్మకొండ విషయాధిపతిగా నియమితుడై, కొరవి సీమ సరిహద్దు మొదలు శనిగరము వరకుగల మధ్య భాగమును చాళుక్య సామాంతునిగా పాలించెను. ఆ తరువాత రాజైన రెండవ బేతరాజు, దుర్గరాజు, రెండవ ప్రోలరాజులు తమ రాజ్యమును విస్తరించుకొన్ననూ చాళుక్యులకు సామంతులుగానే యుండిరి.

క్రీ.శ. 1158లో సింహాసనాధిష్టుడైన కాకతీయ రుద్రదేవుడు చాళుక్యులను ఎదిరించి, చాళుక్య రాజ్యమైన జహీరాబాద్, బీదర్ వరకు తన రాజ్యమును విస్తరింప జేసి, సర్వస్వతంత్ర కాకతీయ సామ్రాజ్యమును స్థాపించెను.

రుద్రదేవుని తర్వాత మహాదేవుడు, గణపతి దేవుడు రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు వరుసగా స్వభుజ బల పరాక్రమములచే రాజ్యమును విస్తరింపజేయుచూ అప్పుడప్పుడు ఎదురు తిరుగుతున్న సామంత దండనాయకులను అణచుచు, ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలించినారు.

ఇంతటి మహత్తర సామ్రాజ్యము క్రీ.శ. 1323లో యవనుల దండయాత్రలతో ఛిన్నాభిన్నమైనది. కాకతీయులు మెదకు సీమను పాలించినట్లు అనేక ఆధారములున్నవి.

కాకతీయులు తమ పరిపాలనా వ్యవస్థను భవిష్యదృష్టితో రాజనీతి కనుకూలముగా అనేక నూతన సంస్కరణలతో సాగించినారు. రాజ్యమును నాడులుగను, స్థలములుగను, భూమి, వాడి, విషయములుగ విభజించిరి. నాయంకరవ్యవస్థను ప్రవేశ పెట్టి పాలనావిధానమున క్రొత్తమార్గమును అవలంబించినారు. (ఇది నేటి కంటోన్మెంటుల వంటిది) కాకతీయ రాజ్యమున రాజు సర్వస్వతంత్రుడు. పరిపాలనా విషయములందు రాజులకు తోడ్పడుటకు అమాత్యులు, మహామాత్యుడు, ప్రెగ్గడ, దండనాయకులు, గజ, అశ్వసైన్యాధికారులు, సర్వసైన్యాధ్యక్షుడు, సామంతమాండలికులు, మహా సామంతాధిపతులు, ఉండెడివారు.

# కాకతీయుల పరిపాలనా విధానము

మహాసామాంతాధిపతులలో చెఱకు, రేచర్ల రెడ్డివంశీయులు ముఖ్యులు. అంగరక్షకులు, అంతఃపురరక్షకులు వివిధములైనవారు రాజును, అంతంపురమును రక్షించుచుండి(. కాకతి రాజులకు రేచర్లరెడ్డి వంశీయులు, చెఱకు రెడ్లు, మల్యాల, విరియాల, గోన, కోట, కాయస్థ, కోన, నతవాడి, చాళుక్య, ఇందులూరి, వానిలాల, రేచర్లపద్మనాయకులు మొదలగు వారు సామంతులుగా నుండిరి.

సామాంత రాజ్యములు, కాకతీయ చక్రవర్తులకు కప్పము చెల్లించుచు, అవసర సమయములందు సైన్యసహాయమును అందించుచు, స్వయముగా యుద్ధములందు పాల్గొనుచూ విజయములను చేకూర్చుచుండిరి.

కాకతీయులకాలమున గ్రామీణవ్యవస్థ పటిష్టముగా నుండెను. ఆంధ్రదేశములో కాకతీయులనాడు ప్రజలు ప్రజాధికారమును కలిగియున్నట్లు శాసనముల ద్వారా తెలియుచున్నది. ఆనాడు గ్రామ సభలను 'అశేష ప్రజ', లేక 'సమస్తప్రజ' అని పేర్కొనెడివారు. కొన్ని చోట్ల 'అష్టాదశప్రజ' అని కూడా పేర్కొనుట జరిగినది. గ్రామములందున్న కరణములను స్థల కరణములని పిలిచెడివారు. కరణము, రెడ్డి, తలారి, పురోహితుడు, కమ్మరి, కంసాలి, చాకలి, మంగలి, శెట్టి, చర్మకారాదులు ఆనాటి అష్టాదశ వృత్తుల వారుగా పిలువబడుచుండిరి.

గ్రామ పరిపాలనలో రెడ్డి, కరణము ముఖ్యులు వీరు రైతులనుండి పన్నులను పంటల రూపములోనూ, నగదురూపము లోనూ వసూలుచేసి ప్రభుత్వ ధన, ధాన్యాగారాలకు చేర్చుచుండిరి.

కాకతీయుల కాలమున గ్రామసభలున్నట్లు తెలియుచున్నది. ఆనాటి రాజులు సామంత రాజులు, రాజోద్యోగులు భూదానములు చేయు సమయమున ఆగ్రామ సంఘాధ్యక్షులను ఒప్పించి, వారి సమక్షమున దానములు చేసెడి వారన్నట్లు శనిగరము, బెజ్జంకి, ఇంక్రియాల్ మొదలైన శాసనముల ద్వారా తెలుయుచున్నది. దీనితో ఆనాటి ప్రజా సంఘములకున్న ప్రాధాన్యత ప్రస్ఫుటమగుచున్నది.

ఆనాటి ప్రజలు తమకన్యాయము చేసిన సైన్యాధికారినైనాఎదుర్కొన్నట్లు శాసనములవలన తెలియుచున్నది.

కాకతీయుల కాలమున చాతుర్వర్ణవ్యవస్థ అమలులో ఉండెను. రాజులకు మంత్రి పురోహిత దండ నాయకులు సలహాలు నొసంగుచుండెడివారు. రాజోద్యోగులు 72 నియోగాలుగా విభజింప బడియుండిరి. వీరిని వినియోగించుటకు 'బాహత్తర నియోగాధిపతి' యుండెడి వాడు. గణపతిదేవ చక్రవర్తి కాలమున గంగయసాహిణి ఈ పదవి అలంకరించి యుండెను.

ఉన్నత పదవులందు అన్ని వర్ణములవారు నియమింప బడుచుండిరి.

## న్యాయము

రాజస్థానమునందు ప్రాడ్వివాకులు, ఉండెడివారు, వీరు అభియోగములను విచారించి అభిప్రాయములను రాజునకు తెల్పుచుండిరి. న్యాయనిర్ణేత సార్వభౌముడే. గ్రామములందు చిన్న చిన్న తగవులను రాజోద్యోగులు లేదా అష్టాదశ వర్ణములవారికి కలిగిన సమయసభలు పరిష్కరించెడివి. జార ధర్మాభిచరణమున్నట్లు క్రీడాభిరామము తెల్పుచున్నది. శిక్షలు కఠినముగాను క్రూరముగాను ఉన్నట్లు తెల్పుచున్నది. బీజచ్ఛేధము, కుక్షిచ్ఛేధము, శిరచ్ఛేదము వివిధ అవయవముల ఖండనము వంటి శిక్షలు ఆనాడు అమలులో ఉండెడివి. ఈ శిక్షలు అమలు పరచుటకు నగరములందును గ్రామములందును వీరభటులుండేవారు.

## పన్నులు

కాకతీయులు తమ రాజ్యమున వ్యవసాయమును అభివృద్ధి చేయుటకై ఎన్నో పెద్ద పెద్ద చెఱువులను త్రవ్వించిరి. కొన్ని చెఱువులు వేల ఎకరముల సాగునకు నేటికిని ఉపయోగపడుచున్నవి. అందు రామప్ప, లక్నావరము, బయ్యారం, ధర్మసాగరం, తోగర్‌పల్లి చెఱువు మొదలైన బృహత్తటాకములు చెప్పకొనదగినవి.

ప్రభుత్వాదాయమునకు భూమి శిస్తు ప్రధాన మైనది. నీరుపొలము,వెలి పొలము, అను పేర భూమిశిస్తును రెండు రకాలుగా వసూలు చేయుచుండిరి అవియే నేడు మాగాణి, మెట్ట అను పేరుతో పిలువబడుచున్నవి. రాచపొలము రైతులకు కౌలుకు ఇవ్వబడుచుండెను. భూమి కొలతలకు గాను, కేసరి పాటిగడ,పెనుంబాక, మానగడ, అను కొలబద్దలను ఉపయోగించెడి వారు.

కరణము, కొలగాడు భూమిని కొలచి సరిహద్దులను నిర్ణయించుచు ఆయా భూముల సారముననుసరించి పన్నులను విధించుచుండిరి. పంట పొలములు గల రైతుల నుండి 'పంగము' 'నీరువిడి' 'తోట సుంకము' పుట్టి, పహిండీ వంటి భూమి పన్నులను వసూలు చేసెడివారు. ఇవిగాక దర్శనము, అప్పనము ఉపకృతి, మొదలైన వృత్తి పన్నులు వసూలు చేయబడుచుండెను.

నూనెగానుగలపై, ఉప్పుకొఠారులపై, రాట్నము, మగ్గములపై సుంకములు విధింపబడు చుండెడివి. ఇల్లరి, పిల్లరి, మడిగ, అను సుంకములను వ్యాపారుల నుండి వసూలు చేసెడివారు. ముద్రపెంట, తలారి వంటి సుంకములు అమలులో ఉండెను.

రేవు పట్టణములపై కాకతీయ రాజులు ప్రత్యేక శ్రద్ధను చూపుచు వాటి అభివృద్ధికై ప్రత్యేక చర్యలు గైకొనెడివారు. ఎగుమతి, దిగుమతి సుంకములు రేవు పట్టణములందే వసూలు చేయబడుచుండెను. రేవు పట్టణములందు వివిధ వస్తువులపై విధించు సుంకముల వివరములు తెల్పుచు శాసనములు వేయింపబడినవి. ఇట్టి శాసనమొకటి మోటుపల్లి రేవునందు కలదు.

వృత్తి పన్ను విషయము వెలుగుంట్ల శాసనమున పేర్కొనబడినది. గొర్రెల పైనను మేకలపైనను (అడ్డపంట) అడ్డగట్టు సుంకము విధింపబడు చుండెను.

పన్నులు వసూలుచేయుటకు ప్రత్యేక స్థలములు నిర్ణయింప బడుచుండెడివి. వీటిని ఘట్టములు అనెడివారు.

**మతము :**

కాకతీయుల పరిపాలనా కాలమున జైన, శైవ, వైష్ణవమతములు దేశమంతా వ్యాపించియుండెను. తొలి కాకతి రాజులు జైన మతానుయాయులై ఉండినను రెండవ ప్రోలరాజు కాలము నుండి ఈ వంశీయులందరూ శైవ మతమును అవలంభించి యుండిరి. రాజ్యమున అచటచట జైన, శైవ మతానుయాయులు పరస్పరము కలహించు కొను చుండెడివారు. ఈ మత ఘర్షణలచే ప్రజలకు, ప్రభుత్వమునకు ఇబ్బందులు ఏర్పడుచుండెను.

**జైనము :**

కాకతీయ సామ్రాజ్యమున జైన మతమునకు ప్రజాదరణముండెను. మెదకు జిల్లాలోని 'పొట్ల చెరువు', 'కొల్చెల్మె', ప్రాంతములు జైనమత కేంద్రములుగా ప్రసిద్ధములు. అక్కడి త్రవ్వకాలలో, జైన విగ్రహాలు, జైన బసదులు, జైన దేవాలయము, బయల్పడినవి. కొల్చెల్మె గ్రామమున బయల్పడిన పార్శ్వనాధుని విగ్రహము సుమారు 6 అడుగులు ఎత్తుతో సుందరముగానున్నది. ఈ మధ్యకాలముననే పార్శ్వనాధుని దేవాలయమును గ్రామానికివతల జైన సంఘములు ఏర్పాటుచేసినవి.

పొట్లచెర్వు, ప్రాంతమున నేడు ఇక్రిసాట్ గా పిలువబడు చున్న ప్రాంతములలో జరిపిన త్రవ్వకాలలో జైన, శైవ, సంప్రదాయుల విగ్రహములు బయల్పడినవి.

కాకతీయులు మొదట రాష్ట్రకూట సామంతులు కావున సార్వభౌముల మతమును, అనుసరించిరి. ఆ తర్వాత రాజులు శైవమునే ఎక్కువగా ఆదరించినట్లు తెల్పుచున్నది.

రాజులు, జైనమునులకు జైనదేవాలయములకు సమస్త సౌక్యములు కల్పించుచు అనేక భూములను దానమిచ్చెడివారు. మొదటి ప్రోలరాజు మంత్రి అయిన బేతన అతని ధర్మపత్ని మైలమ జైన మతానుయాయి ఆమె హన్మకొండ పై కడలాలయ బసతిని నిర్మించి జైనమునుల కొసంగెను.

జైన పండితులు, గురువులు, అనేక గ్రంథములు రచించిరి. వీరు ప్రజలకు అనువైన భాషలలో మతప్రచారము కావించెడివారు. కొంత కాలము అతి వైభవముగా ప్రజలచే మన్నన పొందిన జైనమతము వీరశైవమత విజృంభణముచే పతనమైనది.

**శైవము :**

అద్వైత, బ్రహ్మ, ఏకాత్మ, పంచరాత్ర, అభేదాది, వాదములు శూన్యప్రకృతి, చార్వాకాది వాదములను ప్రజలలో ప్రచారము చేయుచు కొందరు పండితులు జైనమత సిద్ధాంతములను ఖండించుచుండిరి.

సామాన్య ప్రజలకు ఈ ప్రచారములు అర్థముగాక, అయోమయములో పడిపోవుచుండిరి. ఇట్టి సమయాన వీరశైవము ఒకవైపు వైష్ణవము మరొక వైపు మత ప్రచారములు కావించుట ప్రారంభింప బడినది. సులభమైన భాషలో ప్రజలకు అందుబాటైన పాటల్లో దేశీ కవితలలో శైవమత ప్రచారము జరిగినది. అప్పటికి కాలాముఖ, పాశుపత శైవములు వ్యాప్తిలోనికి వచ్చినవి.

కాకతి బేతరాజు, దుర్గరాజుల గురువైన శ్రీ రామేశ్వర పండితుడు కాలాముఖ శైవశాఖకు చెందినవాడై శ్రీశైల మఠాధిపతిగా నుండెను.

ఆలంపురము కాలాముఖ శైవమత కేంద్రమై యుండెను. బసవేశ్వరుడు కన్నడ, ఆంధ్రదేశములందు వీరశైవమును బహుళ ప్రచారముగావించిరి.

మల్లికార్జున పండితారాధ్యులు, నాచనసోమన మొదలైన కవులు తమ కవితలచే శైవ మత ప్రచారమును గావించెను. బ్రహ్మయ అను వీరశైవుడు 'గోరు' లో ఉన్న జైన బసదులను నేలమట్టము గావించెను.

మెదకు జిల్లాలోయున్న పొట్లచెర్వు జైనమతస్థులకు ఆవాస కేంద్రమైయుండెను. అచట 100 జైన బసదులుండెడివి. అక్కడగల 2000 మంది జైనులకు బలవంతముగా శైవమత దీక్షను ఇచ్చిరి. సిద్ధేశ్వర చరిత్ర లో హన్మకొండ పట్టణములోగల జైనమతానుయాయులను విశ్వేశ్వర శివ దేశికుల ప్రోత్సాహమున గణపతి దేవుడు హింసించి నట్లు వర్ణించబడినది. విశ్వేశ్వర శివ దేశికులు 36 జైన గ్రామాలను నాశనము చేసినట్లు తెలియుచున్నది. ఈ విధముగా కాకతీయుల సామ్రాజ్యమున జైన మతము ధ్వంసమై శైవము ప్రాచుర్యమునందినది.

రెండవ ప్రోలరాజు కాలము నుండి శైవమతము రాజమతముగా ప్రవర్ధిల్లినది.

త్రిపురాంతక, మల్కాపురశాసనములందు కాలాముఖ, పాశుపత, కాపాలిక (మహావ్రత) శివశాసన యామిల, సిద్ధ శాఖలు శైవమతశాఖలుగా నున్నట్లు వివరింపబడినది.

గణపతిదేవ మహారాజునకు గురువులైన విశ్వేశ్వర శివ దేశికులు వేదాధ్యయన సంపన్నులు, శైవాగమ శాస్త్రవేత్త, ఉత్తమ దేశికుడై యుండెను. ఆంధ్ర దేశమునందు మందడము, ద్రాక్షారామము త్రిపురాంతకము పుష్పగిరి మొదలైన ప్రదేశములవారు గోళకీ మఠములు నెలకొల్పబడినవి. ఈ మఠము లన్నింటిపై విశ్వేశ్వర శివదేశికులు ఆధిపత్యము వహించియుండిరి.

కాకతీయుల కాలమున రాజులు, రాణులు సామంతాధి పతులు, రాజోద్యోగులు, వందలకొలది శివాలయములు నిర్మించిరి. మెదకు జిల్లాలో కూడా కల్పుగూరు, నందికంది, రాజంపేట, బీరంగూడెం, అల్లాదుర్గం, ఎల్లారెడ్డిపేట తదితర ప్రాంతములందు కళాత్మకములైన దేవాలయము లెన్నియో నిర్మింపబడినవి. ఈ దేవాలయములలోని శిల్పకళ చిత్రకళ వర్ణనాతీతమైనది.

శివాలయములు విద్యాలయములుగా, శైవమతమును పరిరక్షించు అస్థానములుగా తెలుగువారి సంస్కృతికీ, ఆచార వ్యవహారములకు, మత సాంఘిక సంస్కరణములకు, ఆధ్యాత్మిక చింతనకూ, కేంద్రములుగా విలసిల్లినవి.

## వైష్ణవము :

కాకతీయ ప్రభువుల కాలమున వైష్ణవమతము కూడా ప్రజాదరణమును, రాజాదరణమును పొందినది. తమిళ దేశమున శ్రీ పెరంబుదూరులో జన్మించిన రామానుజాచార్యులు 'విశిష్టాద్వైత' మతము ను స్థాపించిరి. వైష్ణవ మతమును ఆళ్వారులు మత గురువులై ప్రచారము చేసిరి.

కాకతీయులు సువర్ణకేతనులు వారహ లాంఛనులు. తిరుపతి, మంగళగిరి, శ్రీ కూర్మము, అహోబిలం, భద్రాద్రి వంటి క్షేత్రములు వైష్ణవ మత కేంద్రములైనవి.

వైష్ణవమత వ్యాప్తిచే శైవ వైష్ణవుల మధ్య మత ఘర్షణలు ప్రారంభమైనవి. శైవులు లింగధారణ పవిత్రమైనదిగా భావింపగా, వైష్ణవులు చక్రాంకితములు పవిత్రతకు నిదర్శనములని ప్రచారము గావించిరి. శ్రీ రామానుజాచార్యులు అనేక శైవక్షేత్రములను వైష్ణవ క్షేత్రములుగా మార్చినట్లు శ్రీపతి భాష్యము తెల్పుచున్నది.

మెదకు జిల్లాలోని నగునూరు (నంగునూరు మండలం) లో గంగాధర మంత్రి వైష్ణవాలయములను నిర్మించి తన భక్తి ప్రపత్తులను చాటుకొనెను. ఈతడు స్మార్త బ్రాహ్మణుడు. కాకతి రుద్రదేవునకు అభిమాన పాత్రుడు పలనాటి సీమలో బ్రహ్మనాయుడు వీరవైష్ణవ మతమునకు అంకురార్పణ చేసి చాపకూడుతో సంఘ సంస్కరణకు పూనుకొనినాడు.

శైవ వైష్ణవములు ప్రజలలో తమ తమ ప్రభావములు చూపుతున్నప్పటికీ కాకతీయ రాజులు శివకేశవాద్వైత భావముననే మెలిగిరి. కాకతీయుల కాలమున శివాలయములు వైష్ణవాలయములు సమపాళ్లలో నిర్మింపబడినది.

మెదకు జిల్లాలోని కల్పగూరులో ఒకే దేవాలయములో చెన్నకేశవ స్వామి, వేణుగోపాలస్వామి, కాశీ విశ్వేశ్వరులకు మూడు దేవాలయములు నిర్మింపబడినట్లు నేటికి సాదృశ్యముగా కనబడుచున్నది. అంతేగాక హన్మకొండ లోని వేయిస్తంభాల గుడిలో శివకేశవ సూర్యులకు ఆలయములు నిర్మింపబడినవి.

ఈ విధముగా కాకతీయ రాజులు మత సహనము గల వారై అన్ని మతములను సమానదృష్టితో చూచిరి. రెండవ ప్రతాపరుద్రుని కాలము వరకు అద్వైత మత ప్రభావము ప్రబలముగా నుండి సవరాజమున బ్రాహ్మణాధిక్యము ఉండెడిది. క్రమక్రమముగా శైవమత వ్యాప్తిచే బ్రాహ్మణుల ఆధిక్యము తగ్గినది పాల్కురికి సోమనశైవమత వ్యాప్తితో బ్రాహ్మణాధిక్యత సన్నగిల్లినది.

అనేక జైనమత దేవతలు హిందూదేవతలు హైందవమత రూపుదిద్దుకొనబడినవి. కాకతమ్మ జోగులాంబ వంటి జైన దేవతలు దుర్గ, కాళి వంటి రూపములలో పూజలు ప్రారంభమైనవి. ప్రజలలో మూఢాచారములు, మూఢవిశ్వాసములు ప్రబలినవి. శివభక్తులు ఆవేశమావహింపగా గండకత్తెరలతో తమ తలలను కత్తిరించు కొనుచు తమ వీరభక్తిని ప్రకటించు కొనెడివారు. జంతుబలి, ఆత్మబలిదానం, సంఘమున ఆచారముగా నుండెడివి.

కాకతీయుల కాలమున ప్రజలు అనేక ఉత్సవములు సంబరముగా జరుపుకొను చుండిరి. గ్రామ దేవతలకు, ఏకవీర, కాకతమ్మలకు మైలారదేవునకు ప్రతీఏటా పండుగలు పర్వదినము లందు ఉత్సవములు, అతి వైభవముగా నిర్వహించుచుండిరి. తిరునాళ్లయందు ఉత్సవములందును కొందరు శిగమూగుచుండిరి. దేవత పూనిన వారు శిగమూగుచూ తమకు కావలసిన కొలువులు, బలులు నిర్వహించుడని ప్రజలను ఆదేశించుచుండిరి. దేవాలయములందు స్థానాపతులు, మాన్యులు, సానులు, నిబంధకారులు, పూజారులు, భండాగారికులు, శ్రీకర్ణము నట్టువకాండ్రు వాద్యకాండ్రు పాటకాండ్రు కాసెకారులు మాలాకారులు తదితర వృత్తి సంఘములవారు 72 మంది ఉండిరి వీరిపై స్థానాపతి నాయకత్వము వహించుచుండెను. ఆలయములకు అనుబంధముగా మఠములు సత్రములు వేదశాస్త్ర పాఠశాలలు నడపబడుచుండెను. విద్యాభ్యాసమొనర్చు బాలబాలికలకు ఉచిత విద్య భోజన వసతి సౌకర్యములు ఏర్పర్చబడుచుండెను.

దేవాలయములందు హరికథా కాలక్షేపములు పురాణ ప్రవచనములు, నాటక ప్రదర్శనములు, జరుపబడుచుండెను. విశ్వేశ్వర శివ దేశికులు స్థాపించిన మందడ సత్రమున బ్రాహ్మణులాది పంచముల వరకుగల అన్ని వర్ణములవారికి అన్నదానము చేయబడు చుండెను.

వీరశైవ, వీరవైష్ణవములు ప్రజలలో ఉద్రేకములు పెంచి మతఘర్షణలను సృష్టించినవి. ఈ కాలముననే బలిజలు, లింగాయతులు, జంగములు, తంబలులు, నంబులు, దాసరులు, ధాత్తాద వైష్ణవుల వంటి కులములు ఆవిర్భవించినవి.

**కులం :**

కాకతీయుల కాలమున బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర అను నాలుగు జాతులను బ్రహ్మ సృష్టించినట్లు ఆ చాతుర్వర్ణ్యముల వారిని ఉద్ధరించుటకు పుళింద వంశము తోడ్పడినట్లు, ఆ పుళిందవంశమున జన్మించిన మల్లినాయకుడు మహామండలేశ్వరుడగు కాకతి ప్రోలరాజునకు బంటు అయినట్లు మాటేడు శాసనము తెల్పుచున్నది. ఈ శాసనము ద్వారా వర్ణవ్యవస్థ కాకతీయులనాటికి పక్కాగా నున్నదని తెలియుచున్నది.

కాకతీయుల కాలమున అష్టాదశ వర్ణముల వారుండిరి. సంఘమున బ్రాహ్మణులకు గౌరవము ఉండెడిది. కాకతీయులు రాజ్యమున కులసంఘములు సాంఘిక జీవనమున ప్రధాన పాత్ర వహించెను.

వీటిని 'సమయము'లు అనెడివారు బ్రాహ్మణుల సమాజములకు 'మహాజనుల సమయము' అని పేరు వర్తకమును వైశ్యులు చేయుచుండిరి. వైశ్య సంఘమునకు 'నకర సమయము' అని పేరు. అర్చక సంఘములు కూడా 'శైవ సమయములు' 'వైష్ణవ సమయములు' అను పేరు వ్యవహరింపబడు చుండెను. దేవాలయమునందలి పనివారలు తమ వత్తి సంఘములను ఏర్పాటు చేసుకొని తమ తమ హక్కులను పరిరక్షించికొనెడివారు. ఈ సమయ సంఘములను అదుపులో ఉంచుటకు 'సమయసేనానులు' ఉండిరి. వీరు క్రమపద్ధతిలో సమయముల కార్యక్రమములు ఉండునట్లు సహకరించెడివారు. సమయ సంఘముల వారు స్థానికముగా కొన్ని పన్నుల వసూలు చేయుచు, వాటిని దేవాలయాభివృద్ధికి, సమయసభ్యుల అవసరాలకు వెచ్చించుచుండిరి.

కులపు కట్టుబాట్లు సమయసంఘముల ఆధీనమందు ఉండెడివి. ఎవరైనా నియమములను ఉల్లంఘించినట్లైతే సమయదండనము ఉండెడిది. ఓరుగల్లు లో జార ధర్మాసనము ఉన్నట్లు తెలియుచున్నది.

కాకతీయుల కాలమున కొన్ని దురాచారములు వ్యాప్తిలో ఉండెను. బాల్య వివాహములు, కన్యాశుల్కము, ఓలి నిచ్చి స్త్రీని వివాహమాడుట, వేశ్యలను కలిగియుండుట, ఒకరికన్నా ఎక్కువ మంది స్త్రీలను వివాహమాడుట, సతీసహగమనము ఆనాటి ఆచారములై యుండెను.

అష్టాదశ వర్ణముల వారు వర్ణాంతర వివాహములకు సుముఖులై యుండిరి. వర్ణాంతర వివాహములు జరుగుటలో అధికార ప్రాబల్యము ప్రముఖపాత్ర వహించినది. కాకతి రుద్రదేవుడు గణపతిదేవ మహారాజు, రుద్రమ, రుయ్యమల వివాహములు వర్ణాంతరములు. బ్రాహ్మణులు, క్షత్రియులు రాజవంశములతో సంబంధ బాంధవ్యములు కలిగి యుండిరి. గణపతి దేవుడు చోడ రాజ తనయలైన నారమ పేరమలను వివాహమాడెను. రుద్రమదేవి, చాళుక్య వీభద్రుడిని వివాహమాడినది. రుద్రమదేవి కుమార్తె రుయ్యమను ఇందులూరి అన్నయ మంత్రి పరిణయమాడెను. కాయస్థ అంబదేవుని కుమార్తె చెఱకురెడ్డి వంశీయుడగు రాజన్నతో వివాహము జరిగినది.

వివాహాది శుభకార్యములందు దేవతా ఉత్సవములందు దేవాలయము లందలి రంగమంటపములందు వేశ్యలు నృత్యములో నర్తించెడివారు. దేవాలయనర్తకులకు ప్రత్యేక గౌరవముండెడిది.

# ఆర్థిక స్థితి - వ్యవసాయము

కాకతీయుల పరిపాలనా కాలమున ఆంధ్రదేశము సిరిసంపదలతోతులతూగినది. వీరి కాలమున వ్యవసాయము ప్రజల ముఖ్య వృత్తిగా నుండెను. రాజులు వారి సామంతులు వ్యవసాయాభి వృద్ధికై బృహత్తటాకములను నిర్మించినారు. నదులకు ఆనకట్టలు నిర్మించి పంట కాలువలను త్రవ్వించి, నీటి పారుదల సౌకర్యము లేర్పరచినారు.

కాకతీయులచే నిర్మింపబడిన తటాకములలో

| | |
|---|---|
| 1. రామప్ప | 2. లక్నవరము |
| 3. పాకాల | 4. ధర్మసాగరము |
| 5. ఘనపురము | 6. విశ్వనాధ |
| 7. పిల్లలమఱ్ఱి | 8. గౌర |
| 9. చౌండ | 10. ఎరక |
| 11. లక్ష్మి | 12. నామ |
| 13. చాచ | 14. ఘనప |
| 15. ప్రోల | 16. తమ్మ |
| 17. ఉదయాదిత్య | 18. రుద్రలు |

ముఖ్యమైనవి. వీటన్నిటిని "సముద్రము" లు అని పిల్చెడివారు.

మూసీ, తుంగభద్ర, కృష్ణ, గోదావరి, పెన్నా, మంజీర, నదులు ప్రవహించు ప్రాంతములందు ఆనకట్టలు నిర్మించి, కాలువలు నిర్మించి వ్యవసాయానుకూలమైన నీటిపారుదల సౌకర్యములు కల్పించినారు.

ఆ కాలమున వరి, గోధుమ, చెఱకు, నీటి వసతులు గల భూములలో పండించెడివారు. ప్రత్తి, పప్పుధాన్యములు, తిలధాన్యములు, తైదలు, జొన్నలు, సజ్జ, మొక్క, మొదలగు పంటలు వర్షాధార భూములలో పండించెడి వారు. అల్లము, పసుపు, మిరప, కూరగాయలు, మొదలగు వాణిజ్య పంటలు కూడా పండించెడి వారు. సువాసనబియ్యము నిచ్చు వరిపంటలు పండించెడి వారు.

ఆకు తోటలు, పండ్ల తోటలు, విస్తారముగా నుండెడివి. ఆనాడు పశుసంపద అధికము. పాడిపరిశ్రమ వలన పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, జున్ను అధికముగా లభించెడిది.

రైతులు పండించిన పంటలను సరియైన ధరలకు విక్రయించు వ్యవస్థయుండెను. రైతులకు తగిన నీటివసతులను ఏర్పర్చుట చేత ప్రభుత్వమునకు పన్నుల రూపమున ఆదాయము లభించెడిది.

ఈ విధముగ కాకతీయులకాలము వ్యవసాయరంగము సుభిక్షముగా నుండుటచే ప్రజలు సుఖ సంతోషములతో జీవితమును గడుపుచుండిరి.

# పరిశ్రమలు

కాకతీయ సామ్రాజ్యమున నేతపనివారు, తమనేర్పరి తనమును వస్త్రములను నేయుటలో చూపుచుండిరి. సన్నని నూలుబట్టలు నేయుట వారి పని తనమునకు తార్కాణముగా నుండెను. అద్దకపు వస్త్రములు, కలంకారీ, వస్త్రములు. దేశ విదేశము లందు అమ్మబడుచుండెను. ఓరుగల్లు లో మఖ్మల్ బట్ట, రత్నకంబళములు, తివాసీలు నేయుచుండిరి. దేశములోనూ, విదేశములందునూ, ఈ వస్త్రమునకు మంచి గిరాకీ యుండెను, ఇక్కడి నుండి తూర్పు, పశ్చిమదేశములకు ఈ బట్టలు ఎగుమతి అగుచుండెను.

ఆనాడు తోలుబొమ్మలాట గ్రామసీమలందు వినోదమును కల్గించెడిది. తోలుబొమ్మలాటకు కావల్సిన వస్తు సామాగ్రిని గూర్చు పరిశ్రమలు వందలకొలది వృత్తిపనివారికి జీవనోపాధి కల్గించెడిది.

కాకతీయులకాలమున పంచలోహములతో అనేక విధములైన వస్తువులను పాత్రసామాగ్రిని తయారు చేయుచుండిరి. ఇనుము, ఇత్తడి, రాగి, కంచు లోహములతో వస్తువులు తయారుచేసెడివారు.

వడ్రంగులు, రంగులరాట్నములు, గృహోపయోగ వస్తువులను, ఆసనములను, దంతపు పెట్టెలను, లక్కబొమ్మలను, ఆటవస్తువులను తయారు చేయుచుండిరి.

ఓరుగల్లు పట్టణమున మట్టెవాడ అనే వీధిలో స్త్రీలు ధరించు మట్టెలు, వడ్డాణములు, వంకజేతి కడియములు, దండకడియములు విక్రయింప బడుచుండెను.

వ్యవసాయమునకు పనికివచ్చు కర్రు, గొర్రు, మొదలగు సామాగ్రిని, యుద్ధరంగమునకు అవసరమగు శిరస్త్రాణములు, కవచములు, కత్తులు, ధనువులు, ఫిరంగులు, బరిసెలు, తయారు చేయుటకు వివిధ ప్రాంతములలో కర్మాగారములు ఉండెడివి.

ప్రతి గ్రామమున కుటీర పరిశ్రమలుండి, స్వయంసమృద్ధములై ఉండెడివి.

కాకతీయ సామ్రాజ్యమున పరిటాల, కడప, గోలకొండ మున్నగు ప్రాంతాలలో విలువైన వజ్రాలు లభించెడివి. సముద్ర తీరస్థ ప్రాంతాలందు మంచి ముత్యములు లభించెడివి. ఆనాటి స్వర్ణకారులు వివిధములైన స్వర్ణాభరణములను సిద్ధముచేయు, కళాకారులై యుండిరి. ఆంధ్రదేశమున తయారు కాబడిన ఆభరణములు దేశ విదేశములందు విశేష ప్రాచుర్యమునొందెను.

అమీర్‌ఖుస్రూ, మార్కోపోలో, అబ్దుల్లా వాసఫ్, వంటి విదేశీ ప్రముఖులు కాకతీయ సామ్రాజ్యమును సందర్శించి ఆనాటి ఆంధ్రదేశమును వేనోళ్ల పొగడినారు.

ఓరుగల్లులో 'మడిసంత' 'మైలసంత' ఉండెను మడిసంతలో వివిధ ధాన్యములు, కూరగాయలు, నూనె, నేయి పదార్ధములు అమ్మబడుచుండెను. మైలసంతలో మాంసము, గ్రుడ్లు, చేపలు, అమ్మబడుచుండెను.

కాకతీయుల కాలమున సముద్ర వ్యాపారము నిర్భయముగా సాగెడిది. కృష్ణ, గోదావరీ, నదులు రవాణా సౌకర్యమునకు ఉపయోగపడు చుండెను. కృష్ణానదిపైనున్న 'ఓడపల్లి' రేవు పట్టణముగా ప్రసిద్ధము. ఇచటనుండి ఓడలు, తూర్పుతీర రేవులకు చేరి, అచ్చటనుండి సముద్రపై పయనించి తూర్పుదేశములకు, దీవులకు వెళ్ళుచుండెడెవి. సింహళము, మలయా, జావా, సుమిత్ర, కంబోడియా, చీనా, పర్షియా, మున్నగు దేశములతో వ్యాపారము సాగుచుండెను. నావలు, పడవలు, ఓడలు, నాటి సముద్ర మార్గమున ప్రయాణించుచుండెను.

భూమార్గమున పయనించుటకు చక్కని రాజమార్గములు ఉండెడివి. ఈ రాజమార్గములు వివిధ వ్యాపార కేంద్రములకు, వివిధరేవు పట్టణములకు, కలుపుతూ ఉండెడివి; భూమార్గమున ఎడ్లబండ్లు, దున్నలు, గాడిదలు, సరుకులను ఒక చోటనుండి మరొక చోటకు చేర్చుటలో ఉపయోగపడుచుండెను. గుఱ్ఱములు, పల్లకీలు, మేనాలు కంచడములు ప్రయాణ సాధనములుగా నుండెడివి. ధాన్యము, నూనె దినుసులు, సుగంధద్రవ్యములు, ముత్యములు, పగడములు, వస్త్రములు, ఇతరదేశములకు ఎగుమతి అగుచుండెడివి. వివిధ వస్తువులపై ప్రభుత్వము సుంకము విధించుచుండెడిది. సుంకాధికారులు న్యాయముగ ప్రభుత్వమునకు రావలసిన పన్నులు వసూలు చేసెడివారు. 'మోటుపల్లి' ఓడరేవులో ఒక శాసనమునందు సుంకములను గురించిన వివరణము కలదు. పన్నులు ఎగవేయువారికి, తప్పుడు సమాచారము అందించు వారలకు, తప్పుడు తూనికలుకొలతలు ఉపయోగించువారికి కఠిన శిక్షలు ఉండెడివి. సుంకములను నిర్బంధంగా వసూలుచేసెడివారు. వర్తకులకు దొంగల వలనగానీ, దోపిడీ దారుల వలనగానీ కష్ట, నష్టములు కలగకుండా అధికారులు చూచుచుండెడివారు.

కాకతీయులకాలములో ముఖ్యముగా ప్రతాపరుద్రుని కాలమునాటికి ముస్లిం వ్యాపారులు, తీరాంధ్ర రేవు పట్టణములందు ఉండి వ్యాపారము చేయుచుండిరి. స్వదేశ, విదేశ, ఉభయదేశ, నానాదేశ వర్తక సంఘములు ఉండెడివి. వీటిని 'వర్తక శ్రేణు' లనెడివారు. ఈ సంఘసభ్యులు ప్రభుత్వానుమతిని పొంది వ్యాపారముచేసెడి వారు. వర్తక సంఘములవారు అనేక దేవాలయములకు దానధర్మములు చేయుచుండిరి. ఆ సమయములందు కొన్ని దాన శాసనములను వారు వేయించిరి. వైశ్యులు, బలిజ, శెట్టి వంటి వారు విదేశీ వ్యాపారమును చేయుచూ దేశ ఆర్థిక స్థితిని పెంపొందించు చుండిరి.

వర్తక సుంకవులను వసూలు చేసి ఆ సుంకముతో వచ్చిన ద్రవ్యమును వ్యాపారాభివృద్ధి కార్యక్రములకు వెచ్చించుచుండిరి. అయ్యనవోలు వర్తకులు 500 మంది త్రిపురాంతక క్షేత్రమున వర్తకసంఘమును నెలకొల్పినట్లు కలదు. ఈ వ్యాపార సంఘములు దేవాలయ పూజాదులకు విరివిగా దానములు ఇచ్చుచుండిరి. విదేశ వ్యాపారముతో ప్రభుత్వాదాయము పెరుగుచుండెను. వ్యాపారులకు సదుపాయములు కల్పించుటలో ప్రభుత్వము తోడ్పడుచుండెను.

## నాణెములు :

కాకతీయుల కాలమున బంగారు, వెండి, సీసము, తగరము మొదలగు మిశ్రమలోహ నాణెములు వాడుకలో ఉండెడివి. వీటిని గద్యాణము లేక నిష్కము, మాడ, రూక, అడ్డుగ, వీసము, చిన్నము వంటి పేర్లతో పిలుచుచుండిరి.

ఒక రాజ్యమునందలి నాణెములు మరొక రాజ్యమునందు చెల్లుబాటు అగుటకు అవకాశ మున్నది. ప్రధాన నగరములందు రేవు పట్టణములందు దేశ విదేశ నాణెములు త్రవ్వకములలో లభించినవి. కాకతీయుల నాణెములు అధిక సంఖ్యలో లంభింపకున్ననూ శాసనములందునూ, సాహిత్య గ్రంథములందునూ నాణెముల ప్రస్తావన కలదు.

## తూనికలు :

కాకతీయుల పరిపాలనా కాలమున అంగడి వీధులలో అమ్మబడు తూనికలపై, కొలమానములపై ప్రభుత్వముద్రలు వేయ బడుచుండెను.

120 గురివింజల ఎత్తు = 1 తులము,

120 తులములు = 1 వీశె,

120 వీశెలు = 21 బారువా.

## భాష :

కాకతీయ రాజన్యుల పరిపాలనా కాలమున కన్నడము, తెలుగు, సంస్కృత భాషలు అత్యాదరణమును పొందినవి. కాకతీయ శాసనములు కన్నడ, సంస్కృతములందును, తర్వాత వెలసిన శాసనములు సంస్కృత భాషలోనూ, అత్యధికముగా తెలుగులోనూ కలవు. ఇవి గద్యములు గాను, గద్యపద్యాత్మకముగను కన్పించు చున్నవి.

హన్మకొండ, పిల్లలమఱ్ఱి మొదలగు శాసనములు చిన్న సంస్కృత కావ్యములవలెనున్నవి. మల్యాల గుండన, వేయించిన 'బూదపుర' శాసనమందు చిత్ర కవిత్వము కనుపించుచున్నది. ఈ శాసన రచయిత ఈశ్వరభట్టోపాధ్యాయుడు.

వీటన్నిటినిబట్టి చూడగ, కాకతీయుల సామ్రాజ్యమున తెలుగు, సంస్కృత, కన్నడ భాషలు ప్రాచుర్యము పొందినవి. సంస్కృతము రాజ సభలందు పండితులలో మాత్రమే ప్రచారములో నుండెను.

ఆనాటి జనుల వాడుక భాష స్వచ్ఛమైన తెలుగు, రాను రాను రాజభాష కూడా కన్నడము నుండి సంస్కృతము నకు, సంస్కృతము నుండి తెలుగునకు మారినది.

## విద్య :

కాకతీయ సామ్రాజ్యమున సమస్త విద్యలు అభివృద్ధి చెందినవి ఆనాడు ప్రముఖముగా దేవాలయములు విద్యాకేంద్రములుగా విలసిల్లినవి. శ్రీశైలము, పుష్పగిరి, మందడము, కొలనుపాక, వర్ధమానపురము మొదలగు ప్రాంతములందు వేదవిద్యలు నేర్పబడుచుండెను.

ఆంధ్ర దేశమున ఆనాడు గోళకీ మతములకు అత్యంత ప్రాధాన్యము కలదు. ఈ మతములు మత వ్యాప్తితో పాటు విద్యా సంస్థలుగా నుండెడివి. ఘటికాస్థానములను పేరుతో ఆనాటి పాఠశాల లుండెడివి. ఈ ఘటికాస్థానములకు రాజులు రాజాంతః పుర రాణులు, మాండలిక సామంత రాజులు విరివిగా భూ, హిరణ్యాది దానములొసంగు చుండిరి. ఈ సంస్థలు ఆ కాలమున సర్వ స్వతంత్ర్య సంస్థలుగా ఒప్పారుచుండెను. ఈ సంస్థలను సందర్శించు సమయములందు రాజులైనప్పటికీ ఎంతో భక్తి శ్రద్ధలతో గౌరవాదరములతో ప్రవేశించెడివారు.

ఈ విద్యా కేంద్రములందు గణితము, వ్యాకరణము, తర్కము, మీమాంస, జ్యోతిష్యము, ఆయుర్వేదము, ఛందస్సు, ఆగమ శాస్త్రములు బోధింప బడుచుండెడివి.

తొలుత ఈ విద్యాలయములలో అగ్రవర్ణముల వారు విద్యాభ్యాసమునొనర్చుచుండిరి. కాని ప్రతాప రుద్రుని పరిపాలనా కాలమునాటికే అన్ని వర్ణముల వారికిని విద్యాలయ ప్రవేశము, విద్యనభ్యసించు అవకాశము కల్పించబడినది. ఈ విద్యాలయములలో విద్యార్థులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు, విద్యాసంస్థలచే కల్పింపబడెడివి. వీటి నిర్వాహణకు రాజులు, అగ్రహార రూపములో, ఆదాయ మార్గములను కల్పించెడివారు.

## వైద్యము :

కాకతీయుల కాలమున ప్రజల ఆరోగ్య రక్షణకై వైద్యశాలలు, ప్రసూతి శాలలు, ఏర్పాటు చేసినట్లు సురవరం ప్రతాపరెడ్డి గారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' తెల్పుచున్నది.

## సాహిత్యము :

కాకతీయుల శాసనములు లఘుకావ్యముల వలె చిత్రకవిత్వము బంధ కవిత్వాదులతో లిఖింపబడినవి.

కాకతి రుద్రదేవుడు నీతిసారము అను గ్రంధమును సంస్కృత, ఆంధ్ర భాషలలో లిఖించెను. ప్రతాపరుద్రుని ఆస్థాన కవి గొప్ప పండితుడుఐన విద్యానాథుడు ఈతడు ప్రతాపరుద్ర యశో భూషణము అను అలంకార శాస్త్రమును రచించెను. ఈ గ్రంధములో ప్రతి అలంకారమునకు ఉదాహరణముగా ప్రతాపరుద్రుని కీర్తి ప్రతిష్ఠలు వర్ణింపబడినవి.

అగస్త్యుడు అను మహాకవి ప్రతాపరుద్రుని ఆస్థానమందుండెను. ఈతడు 'నలకీర్తి కౌముది', బాలభారతము, కృష్ణచరితము, మొదలగు 74 గ్రంథములు రచించెను. ఈ అగస్త్య కవి 'మధురావిజయకావ్య' రచయిత్రియు, కంపరాయల అర్ధాంగియగు గంగాదేవికి గురువు. శాకల్యమల్లడు అను కవి ఉదార రాఘవము, నిరోష్ఠ్య రామాయణము, మొదలగు కావ్యములు రచించెను. గంగాధరుడను కవీంద్రుడు 'మహాభారత కథ' ను నాటక రూపమున రచించి కీర్తి గాంచెను. గంగాధర కవి కుమారుడు నరసింహ కవి 'కాదంబరీ' నాటకము మున్నగు కృతులను రచించెను.

ఈ కాలమున ఎన్నియో ప్రసిద్ధ నాటకములు, వెలువడినవి. విశ్వనాథ పండితుడు రచించిన 'సౌంగధికా పరిణయము' అను వ్యాయోగము మాత్రము నేడు లభ్యమగుచున్నది. అప్పయాచార్యుడు అను జైన కవి 'జినేంద్రా కల్యాణాభ్యుదయము' అను కావ్యరచనలు చేసినట్లు కలదు. విద్యనాచార్యుడు ప్రమేయ చర్చామృతము, గండయభట్టు వేదాంత గ్రంథములకు వ్యాఖ్యానములు రచించెను. అధర్వణపండితుడు జైనపరముగా విరాట పర్వమును రచించుటయే గాక వ్యాకరణశాస్త్ర కారికలను-అదర్వణకారికావళిగా రచించినాడు.

కవిత్రయములో రెండవ వాడైన కవి బ్రహ్మ తిక్కనామాత్యుడు 'మహాభారతమును' విరాటపర్వమాదిగా ఆసాంతము రచించిన మహామనీషి కాకతీయుల కాలం నాటివాడే. తిక్కన మహాభారతము నందు వ్రాసిన తెలుగు పలుకుబడులు, తెలుగువారి ఆచార వ్యవహారములు, సంప్రదాయములు, కాకతీయుల కాలంనాటివే అని చెప్పవచ్చును. ఈతడు నిర్వచనోత్తర రామాయణమును కూడా రచించెను.

కాకతి ప్రతాపరుద్రుని కాలమున భాస్కర రామాయణము నలుగురు కవులతో రచింపబడెను. ఈ మహాకావ్యమున బాల, కిష్కింద, సుందర కాండలు మల్లికార్జున భట్టు. అయోధ్య కాండను కుమార రుద్రదేవుడు అనగా ప్రతాపరుద్రుడు, అరణ్యకాండము, యుద్ధకాండమున కొంత భాగమును హుళక్కి భాస్కరుడు మిగిలిన యుద్ధకాండమును అయ్యలార్యుడు రచించినారు. మల్లికార్జున భట్టు, భాస్కరుని కుమారుడు. కుమార రుద్రదేవ అయ్యలార్య భాస్కరుని శిష్యులు.

వేద వేదాంగములను, సర్వశాస్త్రములను క్షుణ్ణముగా అధ్యయన మొనర్చి, శైవమును స్వీకరించి ప్రజలకు అనువైన భాషలో అనేక కావ్యములు రచించిన ఆనాటి విప్లవ కవి పాల్కురికి సోమనాథుడు 'బసవపురాణము' 'పండితారాధ్య చరిత్ర', 'వృషాధిపశతకము' చెన్నమల్లు సీసములు, తుమ్మెద పదములు మొదలగు కావ్యములను రచించెను. ఈ కావ్యములందు.

ద్విపద, రగడ, మంజరి, కందము, సీసము, గీతము, మొదలగు ఛందములను ప్రవేశపెట్టి, సామాన్య ప్రజలకర్థమగునట్లు 'జాను తెనుగు' లో రచించెను.

వెన్నెల పదములు, తుమ్మెద పదములు, కోలాటపు పాటలు మొదలగు జానపద గేయ వాఙ్మయము ఈ కాలములో సృజింప బడినది.

కాకతీయుల కాలమున మల్లికార్జున పండితారాధ్యులు, మహావాక్కుల అన్నమయ్య, శివదేవయ్య మొదలగు శివకవులు శైవమత పరమగు కావ్యములను రచించిరి. మారన-మార్కండేయ పురాణము, కేతన. దశకుమార చరిత్రము, మంచన -కేయూర బాహుచరిత్రము, బద్దెన-నీతి శాస్త్రముక్తావళి ఈ కాలమందు వెలసిన ప్రసిద్ధ గ్రంధములు రావిపాటి త్రిపురాంతకుని - ప్రేమాభిరామము, మదన విజయము, అంబికా శతకము, మొదలగునవి కూడా ఈ కాలముననే వెలసినవి.

భోజమహాకవిచే రచింపబడిన 'చారుచర్య' అను వైద్యగ్రంధము భోజమహాకవి తెలుగునకు అనువదించెను. ఈతడు 'నీతిభూషణము' అను గ్రంధమును రచించెను. జాయపసేనాని 'నృత్య రత్నాకరము'. 'గీత రత్నావళి' అను గ్రంధములను నృత్య సంగీత పరముగా రచించెను. నృత్యరత్నాకరము నందు పేరిణి, రాసకము, చిందు, కందుకము, కోలాటము మొదలగు నృత్యరీతులు వర్ణింపబడినవి.

పాలంపేట యందలి రామప్పదేవాలయమున చూపబడిన నృత్యసుందరుల విగ్రహములు ఈ గ్రంధమునను సరించి మలచబడినట్లు ఊహింప బడుచున్నది.

**నాట్యము :**

కాకతీయ రాజుల కాలమునందు రాజసభలలో నాట్యము ప్రదర్శించుటకు ప్రత్యేక నర్తకీమణులు, ఆస్థాన నర్తకీమణులుగా యుండి గౌరవింపబడెడివారు. వేశ్యలు సకలకళా ప్రవీణులై యుండిరి. విశ్వేశ్వర శివదేశికుల అగ్రహారగ్రామమైన మండలం లోని విశ్వేశ్వరాలయ మున 10 మంది ఆటకత్తెలు, 16 మంది పాట కత్తెలు, ఇద్దరు ముఖరీవాద్య గాండ్రు, 8 మంది మార్థాంగికులు ఉన్నట్లు తెలియుచున్నది.

కాకతీయులు వేయించిన కొన్ని శాసనములలో నాట్యకత్తెల, వాద్యగాండ్ర ప్రస్తావన యున్నది. పండుగ దినములలోనూ, తిరునాళ్ళలోనూ, పర్వదినము లందునూ, దేవాలయములందు దేవదాసీల నృత్యములు నేత్రపర్వముగా ప్రదర్శింపబడెడివి. పేరిణీ నృత్యము. గోండ్లీ మొదలగు నృత్య విధానములు ప్రదర్శింప బడుచుండెను.

# శిల్పము

కాకతీయుల కాలమందు శిల్ప సంపద, మహోన్నతముగా వెలసినది. కాకతీయ శిల్పమొక ప్రత్యేకతను సంతరించుకొన్నది. కాకతీయుల శిల్పమునందు అసామాన్య దృఢత్వమును సూక్ష్మ పరిశీలనమూ, సౌందర్య పిపాసయూ కానవచ్చును. కాకతీయుల కాలమున ఉక్కుతో పోల్చదగిన నల్ల శిలలు అక్కడక్కడ ఎఱ్ఱని రాళ్లు శిల్పులు తమ శిల్పములకు పయోగించిరి. శిలలు వివిధములైన నగిషీపనులు, పండ్లు, పూవులు, జంతువుల రూపములు, మనుష్యుల ఆకారములు, దేవతా విగ్రహములు, వివిధములైన వస్త్రములతో ఆయుధములతో వివిధ భంగిమలలో మలచబడినవి. లోహాతి కఠినమైన ఈ శిలలు, శిల్పుల చేతియందు వెన్న ముద్దల వలె మెత్తబడిన వాయని యన్పించును. కాకతీయుల శిల్పమున వెలసిన దేవాలయములు ప్రపంచ ప్రఖ్యాతిని గాంచినవి. ఎత్తైన అధిష్ఠానము, శిల్పకళా విరాజమానమైన స్తంభములు, మంటపములు, తోరణ స్తంభములు, ఎత్తైన నందులు, వివిధాలంకార శోభితములైన విగ్రహములు, ద్వారములు, కాకతీయుల శిల్ప సంపదను వేనోళ్ల చాటుచున్నవి. కాకతీయుల శిల్పములో నంది విగ్రహములు శిల్పకళా శోభితములు. ఆనాటి కాలమున నూరుస్తంభాల గుడులు వేయిస్తంభాల గుడులు, మనోజ్ఞ శిల్పకళా సుందరములై అనేకములు విలసిల్లినవి.

హనుమకొండలోని వేయిస్తంభాలగుడి కాకతీయ శిల్పమునకు పరాకాష్ఠ మెదకు జిల్లాలో హత్నూర, అల్లాదుర్గములందు వేయిస్తంభాల గుడులు ఉండెడివని ప్రచారము కలదు.

ఈ దేవాలయము లందు శిల్పకళతో పాటు చిత్రకళకూడా ప్రదర్శింప బడినది. బేతిరెడ్డి భార్య ఎఱుకసాని నిర్మించిన ఎఱుకేశ్వరాలయములో రామాయణ, మహాభారత, శివలీలలకు సంబంధించిన అనేక చిత్రములు వివిధ వర్ణములలో కన్పించుచున్నవి. ఆనాటి సంపన్నుల గృహములందు పార్వతీ పరమేశ్వరుల, రాధా కృష్ణుల లీలలు, చిత్రింపబడెడివి. ప్రతాపరుద్రుని ప్రేయసి మాచల్దేవి, ఒక ప్రత్యేక చిత్రశాలను నిర్మించెను.

మెదక్ జిల్లాలో గూడా కాకతీయుల కాలమున నిర్మించిన నాటి ప్రత్యేక శిల్పకళతో అలరారుచున్న జీర్ణ, శిధిల దేవాలయములు కల్పగూరు, అల్లాదుర్గము, కొండపాక, దుద్దెడ, ఎల్లారెడ్డిపేట, మొదలగు ప్రాంతములందు గలవు. దుర్గ నిర్మాణమునందు గూడ కాకతీయుల శిల్పము కానవచ్చు చున్నది. ఓరుగల్లు, భువనగిరి, పానుగల్లు, ఇంద్రపురి, అనంతగిరి, మెదక్ దుర్గములు కాకతీయుల కళాసంపదను చాటుచున్నవని ఖండవల్లి వారి ఆంధ్రుల చరిత్ర సంస్కృతి నిర్ధారించుచున్నది.

**రామప్పదేవాలయము :** రామాయణ, భారత, భాగవతముల చిత్ర శిల్పములు ఇతర శిల్పములు - ప్రత్యంగుళము శిల్పకళాతోరణములు. ఆలయ ద్వారమున సరిగమలు పలుకు నట్టి నేత్రధారిణులగు ద్వారపాలికలు. శాస్త్రీయ శిల్పకళకు నీరాజనాలు.

## వృత్తులు

కాకతీయుల కాలమున, ఆంధ్రదేశము బట్టలనేతకు మిక్కిలి ప్రసిద్ధి గాంచినది. అనేక విధములగు వస్త్రములు, వాడబడుచుండెను. మణిపట్టు, భూతిలకము, శ్రీవన్నియ, మహాచీనీ, భావజతిలకము మొదలగునవి ఈ వస్త్రములలో కొన్నింటికి పేర్లు. ఓరుగల్లు పట్టణము కాకతీయుల నుండి నేటిదాకా తివాచీల నేతకు ప్రసిద్ధి గాంచినది. ఒకనాడు హైందవుల చేతిలోనున్న ఈ పరిశ్రమ నేడు మహమ్మదీయులచే నడుపబడుచున్నది. క్రీడాభిరామములో కాకతీయులనాటి ఓరుగల్లు పట్టణమును గూర్చిన అనేక విషయములు వర్ణింపబడినవి. ఆనాడు సంతలలో సంపంగి తైలమును అమ్మెడి వారట, కుట్టుపనివారు (దర్జీలు) వివిధములైన అంగరఖాలను రవికలను, కుట్టుచుండిరి.

ఆనాడు పట్టణములలో పూటకూళ్ళిండ్లు (హోటల్లు) ఉండెను. వీటిలో ఒకరూకకు కప్పురపు భోగి వంటకము అనగా సువాసననిచ్చు బియ్యముతో అన్నము, మంచి గోధుమ పిండి వంట, పంచదార, అప్పుడే కాచిన ఆవు నెయ్యి, అరటి పండ్లు, నాలుగైదు రకముల కూరగాయలు, పప్పు, వడియములు, అప్పడములు మంచి పెరుగుతో కూడిన భోజనము లభించెడిది. స్త్రీలు కన్నులకు కాటుక, కాళ్ళకు పారాణి, మొఖమునకు పసుపు, చేతులకు గోరింటాకు అలంకరణములుగ పెట్టుకొను చుండిరి. పాదములకు పసుపు రాసుకొనుట, లక్కరంగు వేసుకొనుట కూడా అలంకారములుగా భావించెడివారు. ఆనాటి స్త్రీలు అనేక విధములైన ఆభరణములు ధరించుచుండిరి. ముంగర, ముక్కెర నాగరం, దండకడియములు, వంకీలు, తోమాల దండ, మొలనూలు, ముత్యాల దండలు, చంద్రహారములు, ఉంగరములు, తాటంకములు, కమ్మలు, కంకణములు, వడ్డాణము. మొదలగు వివిధాభరణములను ధరించు చుండిరి.

ప్రజలు చలికాలమున 'కస్తూరి' వాడెడివారు. వివిధ సుగంధ ద్రవ్యములతో సిద్ధముచేసిన తాంబూలమును వేసికొనెడివారు. తాంబూలములకై తాంబూలకరండము లుండెడివి. పండుగ దినములలో కోలాటము, గోండి నృత్యము, వీధి భాగవతములు, నాటకములు, సంగీత సభలు, సాహిత్య గోష్ఠులు, ప్రజల వినోదార్థము జరుగుచుండెడివి. కోడి పందెములు వేష, మహిషయుద్ధములు నిర్వహింపబడుచుండెడివి. ఓమనగుంటలు, గిల్లిదండ, పాచికలు, పచ్చీసు, గచ్చకాయ లాట మొదలగు ఆటలు ఆనాడు ఆడుకొనెడివారు.

యుద్ధ సమయములందు యుద్ధమునకు పోవు భర్తలకు వీరతిలకము దిద్ది, వీరతాంబూలమిచ్చి, హారతి నిచ్చెడివారు.

గాయములు తగలిన యెడల వావిలాకు చిగుళ్ళు, ఉమ్మెత్త చిగుళ్ళు, జిల్లెడు ఆకులతో ప్రకృతి చికిత్స జరుపుచుండిరి. పంటపొలములందు పక్షిజాలమును భయపెట్టుటకు మంచెలపైకెక్కి వడిసెల రాళ్ళతో కొట్టి పారద్రోలెడి వారు. ఈ వడిసెలు యుద్ధ సమయములందు శత్రువులను పారద్రోలుటకు ఉపయోగింపబడెడివి.

ఢిల్లీ సుల్తాను దండయాత్ర సందర్భమున ఉలుఘఖాన్ ఓరుగల్లును గూర్చి చక్కగా వర్ణించెను. ఎటు జూచినను రెండు మైళ్ళ పొడవుతో, నీటి గొట్టములతో కూడిన తోటలు పచ్చని చెట్లతో కళకళలాడుచుండెను. ఆ తోటలయందు అరటి, పనస, చంపకము, మొగలి, మల్లెలు అసంఖ్యాకముగా నుండెను, ఓరుగల్లు నగరమున అక్కలవాడ, మట్టెవాడ, వెలిపాలెము, భోగము వీధి, మేదరవాడ, మోహరివాడ, దేవాలయములు, రాజాంతః పురములు, అశ్వగజశాలలు, సైనిక శిబిరములు, ఉండెనని అతని వర్ణనలయందు తెల్పినాడు.

ప్రతాపరుద్ర మహారాజు మొగసాలపై ఒక ఘటికాయంత్రము ఉండెడిది. పగలు ముప్పై ఘడియలు, రాత్రి ముప్పై ఘడియలు, ప్రతి ఘడియకొకసారి గంటకొట్టుచుండిరి. ఒక కుడుక గిన్నెకు రంధ్రం చేసి దానిని నీటి కుండలో ఉంచెడివారు. నీరు రంధ్రము ద్వారా గిన్నెలోనికి వచ్చి, గిన్నె నిండునంత వరకు గల సమయమున ఒక ఘడియగా లెక్కించి గంటలు కొట్టుచుండిరి. ఈ ప్రక్రియ నేటికినీ హిందువుల పెండ్లి సంధర్భమున 'ఘడి కుడుకలు' అను ఆచారముగా వ్యవహ రింపబడుచున్నది.

వినోద ప్రదర్శనములుగా పాటలరూపమున వీరగాధలు చెప్పుచుండిరి. వీరు గ్రామములందు సంచరించుచూ ధనికుల నుండి వ్యవసాయ దారులనుండి, ధన ధాన్య వస్త్రములను పొందుచుండిరి. వివాహ సమయములందును, యుద్ధ సమయము లందునూ తప్పెటలు, కాహళములు (కొమ్ము), బూరలు, శంఖములు; సన్నాయిలు, డోళ్లు, రుంజలు మ్రోగించు చుండిరి.

ప్రజలకు మూఢ నమ్మకములు ఎక్కువగా నుండెడివి. జ్యోతిష్యులు, భూత, భవిష్యత్తు, వర్తమానములను, తెల్పెడివారు. భూత, ప్రేత, పిశాచములను తొలగించు తాంత్రిక విద్య ఆనాడుండెడిది. ఆ కాలమున సోది చెప్పించుకొనుట, అంజనము వేయించుకొనుట వంటి నమ్మకములు వ్యాప్తిలో నుండెను.

ఈ విధముగా ఆంధ్ర దేశమునందు కాకతీయుల పరిపాలనా కాలము ఒక స్వర్ణయుగమని చెప్పవచ్చును.

# పద్మనాయకులు

## రేచర్ల పద్మనాయకులు

ఆంధ్రదేశమున ముఖ్యముగా తెలంగాణా ప్రాంతమున కాకతీయ సామ్రాజ్య పతానానంతరమున రేచర్ల పద్మనాయక వంశము పరిపాలించినది. మెదకు జిల్లా ప్రాంతము పద్మనాయకుల పరిపాలనలో నుండెను.

పద్మనాయకులు రేచర్ల గోత్రోద్భవులు వీరు కాకతీయుల సామంతులుగా, దండ నాథులుగా సైన్యాధ్యక్షులుగా, అంగరక్షకులుగావ్యవహరించిరి. కాకతీయ చక్రవర్తి యగు గణపతి దేవుని కాలము నుండి వీరి ప్రతిష్ఠ యినుమడించినది. ఈ వంశీయులు తెలంగాణము వారు. నల్లగొండ జిల్లాలోని ఆమనగల్లు వీరిజన్మ స్థానము. ఆమనగల్లు కందూరుచోడుల సామంతులకు, రేచర్ల రెడ్లకు రాజధానిగా నుండి ప్రసిద్ధి నొందిన పట్టణము.

పద్మనాయకుల మూల పురుషుడైన భేతాళ నాయకుడు అనుబిరుదము గల్గిన చెవ్విరెడ్డి కాకతి గణపతి దేవునిచే ఆమనగల్లుపాలకునిగా నియమింప బడెను. ఈతడు ఆమనగల్లు పిల్లలమర్రి ప్రాంతములకధిపతిగా నియమింపబడెను. గణపతి దేవ మహారాజు కొలువులో నుండి సామ్రాజ్య విజయములందు తోడ్పడు చుండెను.

బేతాళ నాయకునకు దాయానాయుడు-ప్రసాదిత్య నాయుడు అను ఇర్వురు కుమారులు. వీరు కూడా కాకతీయ సామ్రాజ్యపు కొలువు లో నుండి కాకతి రుద్రమదేవి దండయాత్రలలో పాల్గొనిరి.

అనేకయుద్ధములలో అసమాన ప్రతిభా విశేషములను చూపి అరవీరభయం కరుడై శత్రువుల చెండాడి కాకతి రుద్రమదేవికి విజయములు చేకూర్చి ఆమెచే "కాకతి రాజ్య స్థాపనాచార్య - రాయపితా మహ" అను బిరుదములను ప్రసాదిత్యనాయుడు పొందెను. దాయనాయుని కుమారుడు వెన్నమనాయుడు, ప్రసాదిత్య నాయని కుమారుడు సబ్బినాయుడు రుద్రమదేవి అవసాన కాలమందును ప్రతాపరుద్రుని ప్రారంభ కాలమున కాకతీయ సామ్రాజ్యమునకు తమ సేవలనందించిరి.

వెన్నమనాయుని కుమారుడైన ఎరదాచా నాయుడు కాకతి ప్రతాపరుద్రునకు అత్యంత ఆప్తుడై అతని దండయాత్రలయందు పాల్గొని విజయములు సాధించెను. నెల్లూరు మండలమందున్న సామంత రాజులు పాండ్యుల కలిసి కాకతీయ రాజ్యముపై తిరుగబాటు చేయగా ప్రతాప రుద్రుని పనుపున వారల నణచివేసెను. కాంచీ పాండ్యుల విజయము కాకతి సార్వభౌమత్వమునకు దోహదమైనది. అంతేగాక తురుష్కులకు కనువిప్పైనది.

ఈ విజయ పరంపరలతో ఎరదాచానాయకునకు "కంచిక వాట చూరకారా" అను బిరుదమును పంచ పాండ్యములను ప్రతాపరుద్రుడిచ్చి సన్మానించెను. క్రీ.శ. 1320 ప్రాంతమున కాకతి రాజ్యముపై తురుష్కులు దండ యాత్ర గావించిరి. ఎరదాచానాయుడు కాకతి సైన్యములతో బయలుదేరి మెదకు జిల్లాలోని పొట్లచెరువు ప్రాంతమున తురుష్క సైన్యముతో పోరాడియసువుల బాసెను. ఎరదాచానాయునితో పాటు నలదాచానాయుడు కూడా కాకతీయ సామ్రాజ్యమును సేవించిరి.

## మొదటి సింగమనేడు

ఎర దాచానాయని జ్యేష్ఠపుత్రుడు మొదటి సింగమనేడు. ఈతడు తండ్రితో పాటు కాకతీయ దండయాత్రలలో పెక్కింటిలో పాల్గొని విజయ కారకుడయ్యెను. క్రీ.శ. 1320-1321లో ఢిల్లీ సుల్తాను సైన్యములు ఓరుగల్లును ముట్టడించగా మొదటి సింగమనేడు కాకతి సేనావాహినిలో నుండి యువన సైన్యములను పారద్రోలెను. తిరిగి 1322-1323 సంవత్సరము ప్రాంతములో ఢిల్లీ సుల్తానగు ఘియాజుద్దీన్ తన కుమారుడైన ఉలుగ్ ఖానును ప్రచండ సైన్యములతో ఓరుగల్లు పైకి పంపెను. ఉలుగ్ ఖాన్ ఓరుగల్లు కోటను ముట్టడించి అనేక సైనికుల సంహరించి కోశాగారమును కొల్లగొట్టి ప్రతాపరుద్రుని బంధించి ఢిల్లీకి కొనిపోవుచుండగా మార్గమధ్యమున ప్రతాపరుద్రుడు ఆత్మాహుతి గావించుకొనెను. కాకతీయ సామ్రాజ్యము యువనుల హస్తగతమై ఓరుగల్లు 'సుల్తాన్‌పూర్' అనుపేరుగా మారినది. ఢిల్లీ పాదుషా ప్రతినిధిగా "వూలిక్" అనువానిని నియమించిరి. అతడు చేజిక్కిన హిందువుల నిర్దయగా వధించుచు, దేవాలయముల గూల్చుచు శిల్పకళను భగ్నమొనర్చుచు, స్త్రీలను చెరబట్టుచు బ్రాహ్మణుల హింసించుచు, అనేక దుష్కృత్యములొనర్చుచుండెను.

ఈ పరిస్థితులను గమనించి ముసునూరి ప్రోలయ కాపయ నాయకులు, పద్మనాయక ప్రభువైన మొదటి సింగమనేడు అతని సోదరులు, ప్రోలయ వేమారెడ్డి మొదలగు హైందవ వీరులు మహమ్మదీయులను ఓరుగల్లు నుండి పారద్రోలుటకు ముసునూరి కాపయ నాయకత్వమున ప్రచండ సైన్యముతో ఓరుగల్లు కోటను ముట్టడించి యవన సైన్యముల పారద్రోలిరి. క్రీ.శ. 1336 లో ఓరుగల్లు తిరిగి హైందవుల పరిపాలన లోనికి వచ్చి కాపయ నాయకుని ఆధీనములోనికి వచ్చెను.

ఆ తర్వాత కాపయనాయకుడు రాజ్యకాంక్షతో సోదర హైందవ ప్రభువులకానక వారి రాజ్యములను స్వాధీన పరచు కొనుయత్నాశలోనుండెను.

ఈ సమయమున సింగమనాయుడు తన తనయులతో కలిసి నేటి మహబూబ్‌నగర్ జిల్లా ప్రాంతమును, కృష్ణ, తుంగ భద్రా నదుల నడిమిప్రదేశమును జయించి తన రాజ్యమున జేర్చుకొనెను.

రాచకొండదుర్గ నిర్మాణమును ప్రారంభించి సైన్యమును పెంచి రాజ్య విస్తరణోద్యమ దీక్ష వహించెను.

కాపయనాయకుని సామంతులైన క్షత్రియులు, పద్మ నాయక ప్రభువైన సింగమనేని బావ మరిదియగు చింతపల్లి సింగమనాయుని జల్లపల్లి కోటలో బంధించిరి. సింగమనేడు జల్లపల్లి కోటను ముట్టడించెను. క్షత్రియులు సింగమనాయుని ధాటికి ఓర్వజాలక తంబళ్లబ్రహ్మజీ అను వానిని రాయబారిగా పంపిరి. అతడు రాయబారిగా వచ్చి మోసముతో సింగమనేనిని పొడచి పారిపోయెను. ఆ దారుణ సంఘటనతో సింగమనేడు తన కుమారులయిన అనపోతానాయుని మాదానాయిని పిలిపించి సోమ వంశ క్షత్రియుల రక్త ధారలతో తర్పణము ఇడువుడని అసువులబాసెను. పద్మనాయక రాజ్య సంస్థాపకుడు అప్రతిమాన ప్రతి భావంతుడు అయిన మొదటి సింగమనేడు ఈ విధముగా 1326 నుండి 1361 వరకు పాలించి కీర్తి శేషుడయ్యెను.

## అనపోతానాయకుడు

మొదటి సింగమనేనికి ఇద్దరు కుమారులు గలరు అనపోతానాయుడు జ్యేష్ఠుడు, రెండవ వాడు మాదానాయుడు. వీరు తండ్రియాజ్ఞననుసరించి సోమ వంశ క్షత్రియ సంహారమునకు పూనుకొనిరి.

అనపోతానాయుడు గొప్ప సైన్యమును సమకూర్చుకొని, సోదరులు సహాయముగా రాగా మొట్టమొదట జల్లపల్లి కోటను ముట్టడించి కనబడిన క్షత్రియుల నందరి సంహరించుచు కోటను స్వాధీన పరచు కొనిరి. కొందరు క్షత్రియులు కోట నుండి పారిపోయి నేటి కరీంనగర్ జిల్లాలోని మొలంగూరు కోటను జేరి చుట్టు పక్కల సామంత మాండలి కుల సాయమర్థించిరి.

అనపోతానేని, మాదానేనులు సైన్యముతో మొలంగూరు దుర్గమును ముట్టడించ బయలుదేరిరి. క్షత్రియ సైన్యము వారికి సహాయముగా ఎల్గందల, రామగిరి, పొలవాస దుర్గాధి పతుల సైన్యములు మొలంగూరు సమీపములోని చెంజర్ల గ్రామ సమీపమున నున్న విషయమును తెలిసికొని సైన్యమునచ్చటికి నడిపించి సోమవంశ క్షత్రియుల కనిపించిన వారినందరిని సంహరించి తండ్రికిచ్చిన మాట ప్రకారము క్షత్రియరక్తముతో తండ్రికి తర్పణమిడిచిరి.

ఈ భయంకర యుద్ధము క్రీ.శ. 1361. శార్వరి కార్తీక శుద్ధమందు జరిగినది. ఈ యుద్ధములో క్షత్రియులకు సాయముగా వచ్చిన దుర్గాధీశులలో కొందరు మరణించిరి. మరికొందరు కాలికి బుద్ధి చెప్పిరి.

ఈ యుద్ధమున విజయులైన అనపోతానేని, మాదానేని సోదరులు "సోమకుల పరశురామ" "జల్లపల్లి రణక్షోణి భారతి కమల్ల" అను బిరుదములు ధరించిరి.

ఈ యుద్ధమునకు సోమవంశ క్షత్రియులకు సహాయము గా వచ్చిన కొండ వీటి రెడ్డి రాజులు యుద్ధ భూమినుండి పారిపోవు చుండగా వారిని వాదానేడు వెన్నంటి శ్రీ శైలక్షేత్రము వరకు తరిమి ఆ ప్రాంతమునంతను స్వాధీన పరచుకొనెను. ఈ యుద్ధమున మాదానేని పిన తండ్రి కుమారుడైన నాగానేడు సహాయముగా నిలిచెను.

ఆకాలమున కొండవీటిని ప్రోలయవేమారెడ్డి పాలించుచుండెను. పద్మనాయకులు శ్రీశైలక్షేత్ర ప్రాంతమును స్వాధీన పరుచుకొనిన పిదప కొండవీటి రెడ్డి రాజ్యములోని ధరణి కోటను ముట్టడించిరి.

ప్రోలయవేమారెడ్డి కుమారుడు అనపోతారెడ్డి ప్రబలసైన్యముతో పద్మనాయకుల నెదిరించెను. కాని పద్మనాయకుల ధాటికాగ లేక అన పోతా రెడ్డి యుద్ధరంగము నుండి పారిపోవు చుండగా కతారి నాగానాయుడు అతనిని వెంబడించెను.

ధరణి కోటను వశము చేసికొనిన తర్వాత పద్మనాయక సోదరులు "జగనొబ్బగండ" రాయవేశ్యాభుజంగ" అనుబిరుదముల వహించిరి.

చెంజర్ల యుద్ధమున ప్రాణములు రక్షించుకొని పారిపోయిన సోమవంశక్షత్రియులు కొందరు భువనగిరి ప్రాంతమునకు వచ్చి పద్మ నాయకుని శత్రువుల కూడగట్టుకొని అనపోతానాయుని పై దండెత్తి సిద్ధమైయుండిరి.

శత్రుక్షత్రియుల యుద్ధసన్నాహముల ను వేగుల వలన తెలిసికొన్న అనపోతానేడు సైన్యసమేతుడై భువనగిరి దగ్గర గానున్న ఇంద్రాల గ్రామ సమీపమున మూసీనదీ తీరమున క్షత్రియసైన్యము నెదుర్కొనెను.

ఈ యుద్ధమున క్షత్రియులు, వారికి సహాయముగా వచ్చిన సామంతమాండలికులు పద్మనాయకులతో ఘోరముగా పోరాడిరి కాని పద్మనాయకుల భీకర కరవాల ధాటికి శత్రు కంఠముల నుండి కారుచున్న రుధిరము ఇంద్ర్యాల గ్రామ సమీపమున ముంగలి ప్రదేశమును ముంచి వేసి వరదలై మూసీ నదీ ప్రవాహమున కలిసిపారినది.

"వెసరిపుల కంఠ రక్తము - ముసురుకొని యెనిందిరాల ముందరి బయలనే మునిని ండిపారెనీచే - యసిధారల రాయరావున నపోతాంకా"

వెలనాటి వంశావళి ద్వారా ఈ విషయము తెలియుచున్నది ఆ తర్వాత భువనగిరికోటను స్వాధీన పరచుకొని "త్రిభువున రాయరావు" బిరుదము వహించెను.

అనపోతానాయుడు చెంజెర్ల-మొలంగూరు జల్లపల్లి - ధరణికోట - ఇంద్ర్యాల భువనగిరి యుద్ధములందు విజేయుడై తన రాజధానిని ఆమనగల్లు నుండి రాచకొండకు మార్చెను.

రాచకొండ దుర్గమును బలిష్టముగా శత్రుదుర్భేద్యముగా నొనర్చి పద్మనాయక రాజ్యమును సుస్థిరపరచెను.

ఆంధ్రదేశాధీశ్వర బిరుదమును వహించి ఓరుగల్లు నేలుచున్న కాపయనాయకుడు సింగమనేని హత్యకు పరోక్షముగా కారణభూతుండయ్యెను. సోమవంశ క్షత్రియులకు పరోక్ష సహాయమొనర్చెను. అంతేగాక పద్మనాయక రాజ్యమును కూడా కబలించి యావదాంధ్ర దేశమునకు కాకతీయుల వలె తాను సార్వభౌమత్వము స్వీకరించవలెనని ఉవ్విళ్ళూరుచుండెను.

ఆ సమయమున బహమనీ సుల్తానులు అల్లావుద్దీన్ బహమనీ అతని కుమారుడు మహమ్మద్ షా బహమనీలు కాపయనాయకుని రాజ్యముపై అనేక మార్లు దండెత్తి ధనాగారమును దోచుకొని ఓరుగల్లు రాజ్య సరిహద్దుల నాక్రమించుకొనిరి.

ఓరుగంటి సమస్త విషయముల నెరింగిన అనపోతా నాయుడు కాపయ నాయకునిపై దండెత్తి క్రీ.శ. 1368లో ఓరుగల్లును ముట్టడించిరి. కాపయనాయకుడు సైన్య సమేతుడై అనుమకొండ సమీపముననున్న భీమవరము వద్ద పద్మనాయకుల నెదుర్కొనెను. సంకుల సమరము జరిగి ఇరువంకల సైనికులధికముగా మరణించిరి. ఆయుద్ధమునతనతో పోరాడుచున్న కాపయనాయకుని అనపోతానాయుడు సంహరించెను.

కాపయనాయకుని మరణముతో క్రీ.శ. 1369లో ముసునూరి వంశ పాలనము అంతరించినది.

ఓరుగల్లు పద్మనాయకుల వశమైనది. ఈ విజయానంతరము అనపోతానాయుడు సుప్రసిద్ధ క్షేత్రమైన ఐనవోలు మైలారు దేవుని సందర్శించి తన విజయ సూచకముగా శాసనము వేయించి ఆదేవునకు అగ్రహార మొసంగెను. ఈ శాసనమున అనపోతానాయకుని విజయములు, ఆక్రమించిన దుర్గములు వివరించబడినవి.

కాపయనాయకునకున్న, "ఆంధ్రదేశాధీశ్వర, ఖడ్గనారాయణ హిందూరాయసురత్రాణ గాయ గోవాళ" ఆదిబిరుదములను పద్మనాయకులు ధరించిరి.

దీనితో పద్మనాయకుల రాజ్యము ఉత్తరమున గోదావరీ నది వరకును, దక్షిణము శ్రీశైలము, చేర్చిన కొండవీటి రాజ్యము, పడమర బహమనీ రాజ్యము వరకు వ్యాపించి యుండెను. ముఖ్యముగా తెలంగాణ ప్రాంతము పద్మనాయకుల ఏలుబడిలో నుండెను.

అనపోతానాయుడు ఈ విధముగా రాజ్య విస్తరణము గావించి పరిపాలనా సౌలభ్యమునకై రాచకొండ ప్రాంత దక్షిణ ప్రాంతముననున్న భాగమును దేవర కొండ ముఖ్య పట్టణముగా మాదానాయుని పాలకునిగా నియమించెను.

అప్పటి నుండి పద్మనాయక రాజ్యము రాచకొండ-దేవరకొండ రాజ్యములుగా పిలువబడిను రాచకొండ రాజ్యమును అనపోతానాయుడు, దేవరకొండ రాజ్యమును మాదానాయుడు పరిపాలించుచుండిరి. రాచకొండ, దేవరకొండ రాజ్యములు విడివిడిగా అన్నదమ్ములచే పాలింపబడినను వీరుపరస్పర సహాయ సహకారములు గల్గియుండిరి. వీరిపాలనాకాలము క్రీ.శ. 1361 -1384.

## రెండవ సింగభూపాలుడు

అనపోతానాయుని పెద్ద కుమారుడైన రెండవ సింగభూపాలుడు తండ్రి మరణించిన యనంతరము క్రీ.శ. 1384లో రాచకొండ రాజ్య సింహాసన మధిష్టించెను. ఈతని తమ్ముడు ధర్మానాయుడు.

రెండవ సింగభూపాలుని కుమార సింగ భూపాలుడని కూడా అందురు. ఈతనికి సర్వజ్ఞ అనుబిరుదము కలదు. రెండవ సింగభూపాలుడు రాజ్యాధికారమున కు వచ్చుటతోడనే విజయ నగరాధీశుడుగురెండవ హరిహరిరాయులు రాచకొండ రాజ్యము పై దండెత్తెను. ఈ దండయాత్ర సాళువ రామదేవుని నాయకత్వమున సాగినది.

రామదేవుడు రాచకొండ రాజ్య భూభాగమైన కొత్తకొండ ప్రాంతమును కృష్ణ, తుంగభద్రల మధ్యమున్న ఐజమండలమును ఆక్రమించెను. సింగభూపాలుడు సోదర సమేతుడై విజయనగర సేనల నెదుర్కొనెను. ఈ యుద్ధమున సాళువ రామదేవుడు అపజయమునంది సైన్యసమేతముగా పారిపోయెను.

క్రీ.శ. 1387 ప్రాంతమున సింగభూపాలుడు కళింగ దేశ విజయమునకు బయలు దేరి గోదావరీ తీర మందున్న బెండంపూడి-వేములకొండ ప్రాంతములను జయించి సింహాచల క్షేత్రమునందొక విజయ శాసనమును వేయించెను.

క్రీ.శ. 1397లో విజయనగర యువరాజగు రెండవ బుక్కరాయులు తండ్రి హరిహరిరాయల పనుపున మహబూబ్‌నగర్ జిల్లాలోని పానుగల్లు కోటను ముట్టడించెను. ఆ ముట్టడి సుమారు 2 సంవత్సరములు సాగి విజయనగర సైనికులు సింగమ నాయుని ఓడించి దుర్గమును స్వాధీన పరుచుకొనిరి. ఆ తర్వాత మెదకు దుర్గము కూడా విజయనగర సైనికుల వశమైనది.

ఇదే సమయమున హరి-హరరాయులు దేవరకొండ దుర్గమును కూడా ముట్టడించుటకు ఎఱకృష్ణనాయని నేతృత్వమున సైన్యమును పంపెను. కాని దేవరకొండ పాలకుడైన మాదానాయుడు విజయనగర సైన్యముల నెదిరించి పోరాడి ఎఱకృష్ణ నాయుని సంహరించెను. సింగభూపాలుని పాలనా కాలము క్రీ.శ. 1384-1399.

## రెండవ అనపోతానాయుడు

రెండవ సింగభూపాలునికి ఇద్దరు కుమారులు గలరు. జ్యేష్ఠుడైన రెండవ అనపోతానాయుడు తండ్రి మరణానంతరము రాచకొండ సింహాసన మధిష్ఠించెను. ఈతని సోదరుడు రావుమాదానేడు అన్నకు అన్ని విధముల తోడునీడగానుండెను.

రెండవ అనపోతానాయుడు క్రీ.శ. 1399న సింహాసన మధిష్ఠించునాటికి దక్షిణాపథ రాజకీయ ములుఅల్లకల్లోలముగా నుండెను. బహమనీ, విజయనగర, కొండవీటి పాలకులు రాజ్యకాంక్షచే ఒకరిపై మరొకరు యుద్ధములు నిర్వహించుకొను చుండిరి. రెండవ అనపోతానేడు పరిస్థితులను గమనించి అటు తురుష్కులకు యిటు హైందవ రాజులకు అనుకూలముగా లేక తటస్థ వైఖరి నవలంభించి సమయమునకై వేచియుండెను.

విజయ నగరాధీశులు పద్మనాయక రాజ్యభాగముల కొన్నింటిని వశపరచుకొనిరి. ఓరుగల్లును తమ స్వాధీనము చేసికొని గుండదండాధీశుని ఓరుగల్లు పాలకునిగా నియమించిరి. అనపోతా నాయుడు ఓరుగల్లును స్వాధీన పరచు కొనుటకై గొప్పసైన్యముతో బయలుదేరెను. గుండ దండాధీశుని నాయకత్వమున విజయనగర సైన్యములు అనపోతా నాయుని ఎదుర్కొనెను. పద్మనాయక సైనికులు ప్రాణములకు తెగించి పోరాడిరి. ఆయుద్ధమున అనపోతానాయుడు. గండదండాధీశుని సంహరించి. ఓరుగల్లును స్వాధీన పరుచుకొనెను.

రెండవ హరిహరరాయులు మరణింపగా సింహాసనమునకై తగవులాడుచున్న ఆతని కుమారులు సామ్రాజ్యరక్షణ భారమువహించలేదు.

ఈ సమయమున రెండవ అనపోతానాయుడు విజయనగర రాజ్యముపైదండెత్తి అంతకుముందు తాము గోల్పోయిన రాజ్యభాగములను వశపరచు కొనెను. మెదకు దుర్గము నాక్రమించియున్న విజయనగర సైనికులను తరిమి వేసి మెదకు సీమనుతమరాజ్యమున కలుపుకొనెను.

మరొకవైపు కొండవీటిరెడ్డి రాజ్యమున కుమారగిరిరెడ్డి పెదకోమటి వేమారెడ్డి పరస్పరము యుద్ధములొనర్చుచుకొనుచుండ సామంత మాండలికులు స్వతంత్రులగుటకు ప్రయత్నించు చుండిరి. బహిమనీ సుల్తాను ఫెరోజ్షా విజయనగర సామ్రాజ్య అధీనమునందున్న పానుగల్లు (మహబూబ్‌నగర్ జిల్లా) కోటనుముట్టడించెను.

ఇదే అదనుగా రెండవ అనపోతానాయుడు పానుగల్లు దుర్గమును చేరి బహమనీ సేనలతో తలపడెను. ఈ సమయమున విజయనగరాధీశులు పద్మనాయకులకు అండగానిలిచిరి. కోటలోనున్న విజయనగర సైనికులొకవైపు మరొకవైపు అనపోతానాయుని సైన్యముండగా మధ్యన ఫిరోజ్షాసైన్యము నలిగి పోయి సంకట స్థితి నెదుర్కొనెను. పోరుఘోరముగా సాగి వేలకొలది తురుష్కసైనికులు మరణించిరి. ఫిరోజ్షా క్షతగాత్రుడై ప్రాణములరచేత పట్టుకొని యుద్ధ రంగమునుండి పారిపోయెను. విజయనగర పద్మనాయక సైన్యములకు విజయము గలిగినది అంతకుముందు పానుగల్లుకోట పద్మనాయకులదేగాన విజయనగరాధీశులు కోటను అనపోతానాయని వశమొనర్చిరి.

పెనుగొంటి యుద్ధము జరుగుచుండగనే దేవర కొండ రాజ్యముపై కొండవీటి పెదకోమటి వేమారెడ్డి దండయాత్ర సలిపి రణరంగమున పెదవేదగిరిని సంహరించెను.

అనపోతానాయునికి విషయము తెలిసి క్రోధోద్రిక్తుడై తన కుమారుడైన సింగభూపాలుని, పెదవేదగిరి సోదరుడైన లింగమనేడును సహాయముగా గొని గొప్ప సైన్యమును తీసి కొని ప్రతీకారము తీర్చుకొనుటకై కొండవీటిని ముట్టడించెను. ఈ సమయమున విజయ నగర సైన్యములు పద్మనాయకులకు సహాయముగా వచ్చిరి. ఈ ఘోరయుద్ధమున పద్మనాయకుల ప్రతాపజ్వాలలకు పెదకోమటి వేమారెడ్డి సైన్యములు ఆహుతియైనవి. అనపోతానాయని కత్తి వేటుకు పెదకోమటి వేమారెడ్డి మరణించెను.

ఈ విధముగా అనపోతానేడు తన జీవితమంతయు పద్మనాయక కీర్తి ప్రతిష్ఠల నినుమడింప జేయుటకై అనేక యుద్ధములొనర్చి తమపూర్వులు గోల్పోయిన భూభాగములన్నింటిని స్వాధీన పరచుకొని పూర్వ వైభవము నినుమడింపజేసెను.

ఈతని పాలనా కాలము క్రీ.శ. 1399-1423.

## రావుమాదానేడు

రెండవ అనపోతానాయని సోదరుడైన రావు మాదానేడు అన్న అనంతరము 1423సంవత్సరములో రాచకొండసింహాసనమధిష్ఠించెను.

రెండవ అనపోతానాయుని కుమారుడు మూడవ సింగ భూపాలుడు చిన్నవాడైన కారణముగా రావుమాదానేడు తాత్కాలికముగా రాజ్యాధికారము వహించెను.

బహమనీ సుల్తానులు విజయనగర రాజ్యముపై దండెత్తిరి. ఆ సమయమున విజయ నగర రాజుల కోరికపై రావు మాదానేడు దేవరకొండ లింగమనేడు సైన్యములతో వెళ్లి బహమనీ సుల్తానులను తరిమివేసిరి. దీనితో విజయనగర రాజులకు పద్మనాయకులకు మిత్రత్వము అధికమైనది.

ఈతని కాలము క్రీ.శ. 1423-1430.

## మూడవ సింగభూపాలుడు

మూడవ సింగభూపాలుడు యుక్త వయస్కుడై పిన తండ్రిగారి నుండి రాజ్యమును పొందెను. ఈతడు క్రీ.శ. 1430 లో రాచకొండ సింహాసనమధిష్ఠించెను. ఇతనికి వసంతానేడు, కేసవనేడు, రుద్రధర్మానేడు అనుసోదరులు కలరు ఈతనికి కూడా సర్వజ్ఞ అను బిరుదము కలదు.

బహ్మనీ రాజైన అహ్మద్‌షా పద్మనాయకులపై పగసాధింపనెంచి దేవరకొండ లింగమనేడు విజయయాత్రలకు బయలుదేరిన సందర్భము చూచుకొని ఓరుగల్లును ముట్టడించి స్వాధీనము చేసికొని అజంఖానును దుర్గపాలకునిగానియమించి, తిరిగి వెళ్లుచు భువనగిరికోటను స్వాధీనపరచుకొని దానికి సంజర్‌ఖాన్ అనువానిని దుర్గపాలకుని నియమించెను.

మూడవసింగభూపాలుడు ఈ విషయమును తెలిసికొని మాదానేని, లింగమనేని సహాయమున ఓరుగల్లును స్వాధీన పరచుకొనెను.

క్రీ.శ.**1435** ప్రాంతమున భువనగిరి దుర్గాధిపతి యైన సంజర్‌ఖాన్ ఓరుగల్లు కోటను ముట్టడించి ఆక్రమించుకొనెను. సింగభూపాలుని పాలనాచివరికాలము నాటికి ఓరుగల్లు - భువనగిరి ప్రాంతములు బహ్మనీ సుల్తానులవశమైనవి.

సింగభపాలుడు సమర్థుడైన రాజైనప్పటికి పరిస్థితు లనుకూలింపక స్వరాజ్యభాగములనుకోల్పో వలసి వచ్చినది. బహ్మనీసుల్తానులు, గజపతులు పోటీలుపడి చెరొకవైపునుండి పద్మనాయక రాజ్యమును ఆక్రమించుచుండిరి.

ఈతని పాలనాకాలము క్రీ.శ.1430-1475. మూడవ సింగభూపాలుడు అవసానకాలమున రాచకొండ రాజ్యమంతరించి విజయనగర సామంతునిగా జీవితము ముగించెను. దేవరకొండను మాత్రములింగమనేడు శౌర్యప్రతాపములతో సుమారు క్రీ.శ. **1475** వరకు పాలించెను. ఆతని తర్వాత ఆతనిసోదరుడు సూరానాయుడు, కుమారుడు పర్వతరావు మనవడు లింగమనేడులు నామమాత్రముగా పాలించిరి.

సుమారు **110** సంవత్సరములు పద్మనాయకులు మొత్తము తెలంగణా ప్రాంతమును పాలించి తెలుగు జాతికి జాగృతిని కల్గించిరి. వీరు అనేక ప్రజాహిత కార్యములొనర్చికవి పండితులనాదరించి స్వయముగా కవులై గ్రంథములరచించిరి.

# పద్మనాయక సామ్రాజ్యంలో సాంఘిక స్థితి

కాకతీయ సామ్రాజ్యపతనానంతరము మహమ్మదీయులు ఓరుగంటి సామ్రాజ్యమును నాశనమొనర్చి హిందూదేవాలయములను నేల మట్టము గావించుచు, కళా సంపదను కకావికలొనర్చుచు కనిపించిన హైందవుల నెల్ల హతమొనర్చుచు హైందవ సంస్కృతిని నాశనముచేయుటకే ఉద్భవించినవారివలె రాక్షసమూకవలె ప్రవర్తించుచున్న సమయమున ఆంధ్ర దేశమునుండి తురుష్కముష్కరమూకలపారద్రోలి హైందవ సంస్కృతిని పునరుద్ధరించుటకై ముసునూరి కాపయనాయకుడు, కొండవీటి ప్రోలయవేమారెడ్డి, రేచర్ల సింగమనేడులు కలిసి ఓరుగల్లు విముక్తికై ప్రాణములొడ్డి పోరాడి హైందవ సామ్రాజ్యములను స్థాపించిరి. పద్మనాయకులు మొదట కాకతీయుల సైన్యమున పనిచేసి ఆతర్వాత రాచకొండ సంస్థానమునకు పాలకులై ఇంతింతై వటుడింత యైయున్నట్లు పరిసరప్రాంతముల జయించుచు కాకతీయ సామ్రాజ్యపతనానంతరము స్వతంత్ర రాచకొండ పద్మనాయక సామ్రాజ్యమును స్థాపించిరి.

పద్మనాయకులు తమ పరిపాలనమును కాకతీయ పాలనా విధానమునే అవలంబించిరి.

పద్మనాయక సామ్రాజ్యమున అనేక దుర్గములుండెను. వాటిలో రాచకొండ - దేవరకొండ - ఆమనగల్లు - ఓరుగల్లు - భువనగిరి - పానుగల్లు - మెదకు - మొదలగు దుర్గములు ప్రఖ్యాతమైనవి. దుర్గములందు సమర్థులగు దుర్గాధిపతులు దుర్గరక్షణ భారమును వహించుచు ఆయాప్రాంతములందు పాలకులైయుండిరి. రాజ్యము దుర్గములు - సీమలు - మండలములుగా విభజింప బడియుండెను. సీమల నేలుటకు రాజవంశీయులుగాని, మంత్రులుగాని, దండనాయకులుగాని, సేనాధిపతులు గాని నియమింపబడుచుండిరి. పద్మనాయకుల మంత్రులలో పెద్దన, పోతరాజు, అయ్యలార్యుడు, బాచన, సింగన, మొదలగు బ్రాహ్మణులు ప్రసిద్ధులు.

ప్రజలు ప్రభువులయెడ భయభక్తులుగల్గి సుఖ జీవనము గడుపుచుండిరి. యుద్ధ సమయములలో ప్రజలు అప్రమత్తులై శత్రువుల యునికిని పసికట్టి అవసరమైనచో యుద్ధరంగమున సహాయపడు చుండిరి.

పద్మనాయక పరిపాలనలో వైదిక ధర్మరక్షణకై అనేక దాన ధర్మములొనరించ బడుచుండెను. గ్రామములలో ద్వాదశవృత్తుల వారుండిరి. వారివారి వృత్తులలో కళాత్మక సంప్రదాయము ననుసరించు వారుండిరి. గ్రామమున, కరణము, తలారి, పూజారి ముఖ్యులు, నేరములు చేసిన వారికి కఠిన దండనలు అమలులో నుండెను.

పద్మనాయకుల కాలమున యుద్ధములెక్కువగా జరిగి ఆదాయమెక్కువగా సైనిక వ్యవస్థకే వ్యయమగుచుండెను. ప్రజల ఆర్థిక పరిస్థితి మెరుగుగా నుండెను. కాకతీయ కాలమందలి ఆర్థిక వ్యవస్థ పద్మనాయకులాచరించిరి. ఆ కాలమున ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయము. పద్మనాయక రాజులు వ్యవసాయభివృద్ధికై అనేక చెరువులను నిర్మించిరి. అనపోత సముద్రము, నాగసముద్రము, రాయసముద్రము వంటి బృహత్తరతటాకములు వీరికాలమున నిర్మించినవే వీరికాలమున చెరువులే కాక కాలువలు కూడా బాగుచేయించిరి. కుంటలు - బావులు - గుంటలు - నదులు - వాగులు వ్యవసాయమునకు జలా ధారములు. తెలంగాణ ప్రాంతమున నీటి కరువు ఏమాత్రములే కుండెను. సకాల వర్షములు, నీటిపారుదల సౌకర్యములు రైతులకు ఉపయుక్తములుగా నుండి పంటలు పుష్కలముగా పండు చుండెను. వరి- జొన్న- సజ్జ నువ్వులు, చెరుకు - ప్రత్తి - మిరప కూరగాయలు బాగుగా పండింప బడుచుండెను. ఆకుతోటలు- పండ్ల తోటలు చక్కగా పోషింపబడుచు తమలపాకులు- వివిధములైన ఫలములు పండింప బడుచుండెను.

ఈ కాలమున బ్రాహ్మణులు సైతము వ్యవసాయమును జీవనాధారముగా పరిగణించిరి. వస్త్రపరిశ్రమ-రంగులఅద్దకము-కలంకారి పరిశ్రమ అభివృద్ధి పథకములో నుండెను.

గ్రామములందు పంచాణమువారు వివిధములైన దేవతా విగ్రహములు, గంటలు, ఆయుధములు తయారుచేయుటలో నేర్పరులై యుండిరి. వీరే వంటపాత్రలను, ఇంటి సామానులను తయారు చేయువారు. కఱ్ఱతో వివిధములైన వస్తువులు చేయుటలో నేర్పరులైన వడ్రంగులుండిరి. బంగారు ఆభరణము లనుసిద్ధము చేయు కంసాలురకు కాలమున కొదువ లేకుండెను.

సంతలలోను, జాతర, తిరునాళ్లు మొదలగు వాటియందు వస్తువుల అమ్మకము జరుగు చుండెడిది. వైశ్య, బలిజమొదలగు కులములవారు దేశవాలి వ్యాపారము చేయుచుండిరి. కృష్ణాతీరమునున్న ఓడపల్లి ఆనాటి వ్యాపార కేంద్రమైయుండెను ఈ రేవుపట్టణమున్కై పద్మనాయకులు - రెడ్డిరాజులు - బహమనీలు పరస్పరము కలహించు కొనుచుండిరి.

భూమిపై వచ్చు ఆదాయములో 1 / 6 వంతు భూమిశిస్తు వసూలు చేయబడుచుండెను. వివిధ వృత్తులపైనను వృత్తిపన్ను వసూలుచేసెడివారు. దేశ, విదేశవ్యాపారములపై వివిధములైన పన్నులు న్యాయ సమ్మతముగా వసూలు చేయబడుచుండెను.

**మతము :**

పద్మనాయకుల సామ్రాజ్యమున హైందవ మతము మహోజ్వలము గావెలిగినది. పద్మనాయకులు మొదట శైవులు, తరువాత వైష్ణవులైనారు.

వైదిక, శాక్తేయ, శైవ, వైష్ణవమతములు, ఈ కాలమున వ్యాప్తి జెందినవి - వీరశైవమతాచారము ప్రకారము భైరవాలయములు, మైలారుదేవునిగుళ్లు, వెలసినవి. కాళి, దుర్గ, చండి, మహిషాసుర మర్దిని, పూజలధికమైనవి. గ్రామదేవతలగు కట్టమైసమ్మ, రేణుక, ముత్యాలమ్మ, ఏకవీర మొదలగు దేవతలకు పూజలు సల్పుచుండిరి. ప్రజలలో మౌఢ్యముగా మతకలహములంతగాలేవు.

## సాంఘిక పరిస్థితి :

పద్మనాయక రాజన్యుల కాలమున వర్ణాశ్రమ ధర్మము అములులోనున్నది. సనాతన వైదిక వృత్తి ననుసరించు బ్రాహ్మణులు తురుష్కుల దండయాత్రా ఫలితముగా కులవృత్తికి దూరమై రాజాస్థానములందు మంత్రిపదవులు, తదితర ప్రభుత్వోద్యోగములు నిర్వహించుట లేదా వ్యవసాయవృత్తినవలంబించుటకు దొడంగిరి. క్షత్రియులెక్కడనైనమున్నను బలహీనులుగా నుండి పరరాజులపంచలజేరిరి. వైశ్యులు, బలిజలు వ్యాపారమే ముఖ్యవృత్తిగాదేశ విదేశములలో సంచరించుచుండిరి. కమ్మ, రెడ్డి, వెలమ కులములవారైన చతుర్థజులు కొందరు వ్యవసాయ వృత్తిలోనే గాక రాజకీయములలో రాణించదొడగిరి.

ప్రజలలో శకునములపైనమ్మకము ఎక్కువ గానుండెను, పంచాంగము చూచిపనులను ప్రారంభించు చుండిరి. వేశ్యల పోషించుటలో పురుషులు పోటీపడుచు శృంగార ప్రియత్వము నముండిరి.

పురుషులు పంచె, అంగి, ఉత్తరీయము ధరించెడి వారు. స్త్రీలు రవిక, చీర ధరించుచుండిరి. వివిధ రంగులలోనున్న వస్త్రములను ధరించు చుండిరి, నాగపూజ, నాగులపంచమి వ్రతము వ్యాప్తిలోనుండెను పండుగలు వేడుకగా జరుపుకొనెడివారు. జాతరలు - ఉత్సవములలో భజనలు - కోలాటము - నాటకములు ప్రదర్శించు చుండిరి. కోళ్లపందెములు, మేషమహిషయుద్ధములు, వివిధములైన స్త్రీ, పురుషుల ఆటలు ప్రజా వినోదమునకై జరుపబడుచుండెను. వివాహములు కడువేడుకగా జరుపబడుచుండెను. రాజుల, ధనవంతుల ఇండ్లలో ఐదు దినములు పెండ్లి వేడుకలు జరిపెడివారు.

## సాహిత్యము :

పద్మనాయకరాజులు స్వయముగా కవి, పండితులగుటచే వారి ఆస్థానములందు అనేక పండితులు కవులు ఆశ్రయము పొందిరి. రెండవ - మూడవ సింగభూపాలురకు "సర్వజ్ఞ" అనుబిరుదము కలదు. వీరికాలమున అగ్రహారములు దేవాలయములు పాఠశాలలుగానుండి వేదవేదాంగేతిహాసపురాణ కావ్యనాటకములను, అలంకార శాస్త్రము, సంగీత, నృత్యాదికళలు నేర్పబడుచుండెను.

వేదాంత దేశికులు సుభాషితనీతి, తత్వసందేశము, రహస్య సందేశములను వేదాంత గ్రంధములరచించెను. అన పోతానాయుని ఆస్థాన విద్వాంసులలో పశుపతిపండితుని కుమారుడైన నాగనాధ కవి సంస్కృతమున "మదనవిలాస బాణము" రచించెను.

రెండవ సింగభూపాలుడు స్వయముగా కవి ఈతడు "రస్నార్ణవ సుధాకరము" అను లక్షణ గ్రంధమును, "రత్నపాంచాలిక" అను నాటకమును, "సంగీతసుధాకరము", నురచించెను. ఈతని ఆస్థానమున విశ్వేశ్వర కవిశేఖరుడు, చమత్కారచంద్రిక అను అలంకారగ్రంధమును రచించినట్లు సింగభూపాలుడు పేర్కొనెను. రాఘవుడనేడు సంస్కృత పండితుడు. ఈతడు రాఘనీయ వ్యాఖ్య రచించెను.

మూడవ సింగభూపాలుని ఆస్థానమున శాకల్యమల్లభట్టు అను మహాపండితుడు "నిరోష్ఠ్యరామాయణము", "ఉదారరాఘవకావ్యము, అవ్యయ సంగ్రహనిఘంటువుల రచించెను ఇతనికి చతుర్భాషా కవితామహ అనుబిరుదము కలదు.

ఈతని మనుమడు శాకల్య అయ్యలార్యుడు పద్మనాయకుల ఆస్థానకవియై భాస్కర రామాయణమును పూరించెను.

పద్మనాయకుల పరిపాలనాకాలమున తెలుగుకవులెందరో తమతమ కావ్యకన్యకల సృష్టించిరి.

'గౌరన' హరిశ్చంద్రోపాఖ్యానమును రచించెను ఈతడు సరససాహిత్యలక్షణ చక్రవర్తి బిరుదాంకితుడు ఈతడు లక్షణదీపిక - నవనాధచరిత్రమున్నగు గ్రంధములరచించెను.

సహజపండితుడు - నిరాడంబరుడు - భక్తకవి పోతనామహాత్ముడు ఈ కాలముననే "ఆంధ్రమహా భాగవతమును" రచించి నరాంకిత మొనర్చక రామాంకితమొనర్చెను పోతన "మహా భాగవతమును" రచించకముందు సింగభూపాలుని కోరికపై భోగినీదండకమును శృంగారరస ప్రబంధముగా రచించెను. వీరభద్ర విజయమును కూడాతదుపరి రచించినట్లు చెప్పబడుతున్నది.

పోతన తలిదండ్రులు శైవులు పోతన నిత్యశివ పూజాదురంధరుడు. రామనామానుజపతత్పరుడు. అందుకే రాజాస్థానపదవుల నిచ్చగించక హాలిక వృత్తిని చేబట్టి ఒకచేత హలమును, మరొకచేత కలమున న్నట్లుగా వ్యవసాయమును, కవితావ్యవసాయమును సాగించుచు తాను పలికేపలుకులు రామున్డే పలుకించుచున్నవన్నంత సహజ నిరాడంబరుడై "ఆంధ్రమహాభగవతామృత రసాన్ని" ఆంధ్రుల కంకింత మొనర్చిన పుణ్యాత్ముడు ఈ కాలమునవెలసిన వారలనే గాక తరతరాల తెలుగు వారల ధన్యుల జేసిన పోతన మహాకవి పద్మనాయకుల కాలము వాడు.

ఈ విధముగా పద్మనాయక రాజులు కాకతి రాజ్యపతనానంతరము స్వతంత్ర రాజ్యమును స్థాపించి తెలంగాణ ప్రాంతము మొత్తమును పాలించి హైందవ సంస్కృతిని పునరుద్ధరించి, అనేక జీర్ణ దేవాలయములు బాగుచేసి, కొత్త దేవాలయముల నెన్నింటినో కళాత్మక ముగా నిర్మాణము చేయించి, కవి పండితుల పోషించి, ప్రజానురంజకముగా సుమారు నూట యాబది సంవత్సరములు పరిపాలన గావించి చిరకీర్తినందిరి.

# కుతుబ్షాహీ రాజవంశము

## కుతుబ్షాహీలు రాజవంశము

సుమారు మూడున్నర శతాబ్దాల కాలము ఆంధ్రదేశమును అవిచ్ఛిన్నముగా పరిపాలించిన కాకతి రాజవంశము మహమ్మదీయుల దండయాత్ర ఫలితముగా క్రీ.శ. 1324లో పతనమై మహమ్మదీయ పరిపాలనము ప్రారంభమయినది. ఓరుగల్లును సుల్తానుపూరుగా మార్చి దేవగిరి పాలకుడయిన మాలిక్ బహనుద్దీన్ తెలంగాణా ప్రాంతముపై ఆధిపత్యము వహించి మాలిక్ మఖ్బూల్ నాయక్‌ను ఓరుగల్లు పాలనమునకై నియమించెను. మాలిక్ మఖ్బూల్ నాయక్ ఢిల్లీ సుల్తానగు ఉలుగ్‌ఖాన్ (మహమ్మద్ బిన్ తుగ్లక్) సామంతునిగా అధికారము నెరపు చుండెను. ఇతని పాలనమున తెలుగు ప్రజలు దుర్భర దరిద్రమును అనుభవించిరి. హైందవ సంస్కృతి అడుగంటినది. హైందవలు అనేక కష్టనిష్ఠురముల పాలగుచుండిరి. ఆ సమయమున ముసునూరి ప్రోలయనాయకుడు, రేచర్ల సింగమనేడు, కొండవీడు ప్రోలయ వేమారెడ్డి మొదలగు హైందవ వీరులు మహమ్మదీయ సర్దారులను పారద్రోచ్చి హైందవ సామ్రాజ్యములను స్థాపించిరి. పద్మనాయక సామ్రాజ్యమున మొత్తం తెలంగాణా ప్రాంతము సుమారు 110 సంవత్సరములు పాలింపబడినది. మెదకు జిల్లా ప్రాంతమంతయు పద్మనాయకుల ఏలుబడిలో నున్నట్లు వారిత్రకాధారముల వల్ల తెలియుచున్నది. ఇదే సమయమున దక్కనులో బహమనీ రాజ్యము స్థాపించబడి క్రీ.శ. 1347-1518 వరకు కొనసాగినది.

క్రీ.శ. 1500 ప్రాంతమున బహ్మనీ రాజ్యము ఐదు ముస్లిం రాజ్యములుగా విభజింపబడినది. 1. అహమ్మద్ నగర్ 2. బీజాపూర్ 3. గోలకొండ 4. బీరారు 5. బీదరు ముఖ్యపట్టణములుగా రూపొందినవి.

గోలకొండనేలిన కుదుబ్షాహీ రాజ్యము తెలంగాణా ఆంధ్ర ప్రాంతమునకు పరిమితమయినది.

మెదకు జిల్లాలోని కోహీర్ నుండి మొత్తము జిల్లా భూభాగము కుదుబ్షాహి పరిపాలనలోనుండెను. నేటి జహీరాబాద్, నారాయణ్ ఖేడ్ ప్రాంతములు బీదరు రాజ్యమందుండెను.

## సుల్తాన్ కులీ కుతుబ్షా

ఈతడుబహమనీ రాజయిన 3వ మహమూద్ షా కాలమున సుల్తాన్‌కు అత్యంత ఆప్తవర్గము లోని వాడయి కుద్బుల్ ముల్క్ అను బిరుదమును పొంది గోలకొండ ప్రాంతమును పాలించుటకు నియమింపబడెను.

గోలకొండ పూర్వము "మంగళార్గం" అనే పేరుతో పిలువబడేది. గోలకొండ దుర్గము కాకతీయుల కాలమున నిర్మించబడినది. క్రీ.శ. 1518 న మూడవ మహమ్మూద్ షా స్వర్గస్థుడయ్యెను. బహమనీ రాజ్యము కకావికలయినది. సమయమును చూచి సుల్తాను కులీ కుతుబ్ షా స్వాతంత్ర్యమును ప్రకటించుకొనెను. ఇతని పరిపాలనలో మెదక్ జిల్లాలోని కోహీర్ నుండి ఓరుగల్లు వరకున్న భూభాగముండెను. ఈతడు రాచకొండ పానుగల్లు, ఘనపురం, దేవరకొండ, నల్లగొండ, ఉర్లుగొండ అనంతగిరి దుర్గములన్నింటినీ ఆక్రమించుకొని నేటి కరీంనగర్ జిల్లాలోని మలంగూర్, ఎల్గందల, రామగిరి కోటను, కొండపల్లి, ఇంద్రకొండ దుర్గములను స్వాధీనపరుచుకొని కృష్ణా, గోదావరీ మధ్య ప్రాంతములను తన ఏలుబడిలోనికి తెచ్చుకొనెను.

సుల్తాను కులీకుతుబ్షా తన పాలనా కాలమునంతయు యుద్ధము లందే గడిపి సుమారు 70 దుర్గములనాక్రమించి విశాలమయిన సామ్రాజ్యమును స్థాపించెను. ఇతడు షియామతాను యాయి. ఇతనికి 1. హైదర్ 2. కుద్బుద్దీన్ 3. జంషీద్ 4. అబ్దుల్‌కరీం 5. దౌలత్ 6. ఇబ్రహీం అను ఆరుగురు కుమారులుండిరి.

ఈతడు క్రీ.శ. 1543 లో మూడవ కుమారుడయిన జంషీద్ కుదుబ్షా పన్నిన కుట్రలో మరణించెను.

## జంషీద్ కుదుబ్షా

జంషీద్ కుదుబ్షా తన సహచరుడయిన మీర్ మహమ్మద్ హమ్దానీతో కలిసి కుట్రపన్ని దైవ ప్రార్థన చేసుకొనుచున్న సమయమున తండ్రిని చంపించి గోలకొండ సింహాసనమధిష్టించెను.

ఈతని కనిష్ఠ సోదరుడయిన ఇబ్రహీం దేవరకొండ ప్రాంత పాలకునిగా నుండి ప్రాణాపాయ భయముచే బీదరు చేరి బీదరు సుల్తాను అగు బరీద్ సహాయమర్థించెను

బీదరు సుల్తాను బరీద్ గోలకొండపై దండెత్తెను. జంషీద్ కుతుబ్షా అహమ్మద్ నగర్ రాజయన నిజాముల్ ముల్క్ సహాయముతో క్రీ.శ. 1545-46 లలో నేటి మెదక్ జిల్లాలలోని పటాన్‌చెరు, కల్పగూర్ ప్రాంతములను జయించెను. ఆ తరువాత బీదరు సైన్యములను తరుముచు పోయి నారాయణ్ ఖేడ్ ప్రాంతమును ఆక్రమించుకొనెను.

జంషీద్ కుతుబ్షా రాజకీయచతురుడు ఈతడు క్రూరమనస్తత్వముతో దుష్ప్రవర్తనతో యుద్ధ తంత్రములొనర్చెడువాడు ఇతని సైనిక వ్యవస్థ యుద్ధ వ్యూహ రచనాశక్తి అసాధారణములయినవి. ఇతడు క్రూరుడయినప్పటికి కవితాభినివేశము కలవాడు. జంషీద్ కుతుబ్షా 67వ యేట వ్యాధి గ్రస్థుడై క్రీ.శ.1550లో మరణించెను. ఈతని సమాధి సుల్తాన్ కులీ సమాధికి చేరవలో కలదు. ఈ సమాధి గుంబజ్ నిర్మాణకౌశలము అత్యంత శోభాయమానమైనది.

ఇతని పాలనా కాలము క్రీ.శ.1543 నుండి 1550 వరకు.

## సుభాన్ కులీ కుతుబ్షా

జంషీద్ కుతుబ్షా మరణానంతరము అతని కుమారుడయిన సుభాన్‌కులీ కుతుబ్షా అతి చిన్న ప్రాయమున (7 సం|| లు) సింహాసనము అధిష్టించెను. ఇతని తరపున రాజమాత బిల్-ఖీస్-జమాన్ పరిపాలన సాగించినది. ముస్తఫా ఖాన్, సలాబత్ ఖాన్ అను నాయకులు రాజమాతకు సలహాదారులుగా నుండిరి. ఈ సమయమున వి యాదులు గోలకొండ కోటను స్వాధీనము చేసుకొనుటకు ప్రయత్నము చేయుచుండిరి. కులీ కుతుబ్షా ఆరవ కుమారుడయిన ఇబ్రహీం కుతుబ్షా గోలకొండ రాజ్యముపై దండయాత్ర చేయు సంకల్పములో నుండెను. పసివాడయిన రాజు అగుట, మంత్రులు యథేచ్ఛగా సంచరించుటచే ప్రజలు అనేక కష్టములపాలయిరి.

పానుగల్లు, కోయిల్‌కొండ మొదలగు ప్రాంత ప్రజలు, అమీరులు సుభాన్‌కులీ పరిపాలనకు విసిగి ఇబ్రహీంకులీని ఆహ్వానించిరి. ముస్తఫాఖాన్, సలాబత్ ఖాన్‌లు ఇబ్రహీం కుతుబ్షాకు సహాకరించిరి. గోలకొండ కోటలో బందితుడయియున్న జగదేవరావు బంధవిముక్తుడై సుభాన్‌కులీని బంధించి అతని అనుచరులను సంహరించెను.

## ఇబ్రహీం కుతుబ్షా

క్రీ.శ.1550లో ఇబ్రహీం కుతుబ్షా గోలకొండ నాక్రమించి సింహాసనమలంకరించెను.

ఇబ్రహీం కుతుబ్షా గోలకొండ రాజ్య పీఠమలంకరించి సుస్థిర పాలనము చేయుటకు తగిన ఏర్పాటు చేసెను. స్వామి ద్రోహులను శిక్షించి శత్రువులను మట్టుపెట్టి దుర్మార్గులను ప్రజాకంటకులను సంహరించెను. అంతః కలహములను అదుపుచేసి ప్రజాభ్యుదయము నకు పరిపాలనా సంస్కరణము ప్రవేశపెట్టెను. ఆపదలందు సహకరించిన ముస్తఫా ఖాన్‌ను "ఖానేఆజమ్" అను బిరుదమునిచ్చి సర్వాధికారిగా నియమించెను.

ఇబ్రహీం కుతుబ్షా అహమ్మద్ నగర్ సుల్తానుతో స్నేహభావము వహించి క్రీ.శ. 1557 లో బీజాపూర్‌పై దండెత్తెను. అహమ్మద్ నగర్ పాలకుడయిన నిజాంషా తమ సోదరి బీబీజమాత్‌ను ఇబ్రహీం కుతబ్షా కిచ్చి వివాహమొనర్చి బాంధవ్యమేర్పరుచు కొనెను. విజయనగర సైన్యముతో రామరాయలు 1562 లో అహమ్మద్ నగరము పై దండెత్తి అహమ్మద్ నగరంతో పాటు గోలకొండను కూడా దోచుకొనెను. కోయిలకొండ, ఘనపురము, పానుగల్లు ప్రాంత పాలకులు గోలకొండ రాజ్యముపై తిరుగుబాటు నొనర్చిరి. ఈ పరిస్థితులనన్నింటిని గమనించిన ఇబ్రహీం కుతుబ్షా గొప్పరాజ్యతంత్రమును నడిపి మహమ్మదీయ రాజులలో ఐక్యతను సాధించెను.

తురుష్కరాజులందరు కలిసి విజయనగర సామ్రాజ్యమును తుదముట్టించ పథకమును సిద్ధమొనర్చిరి.

బీజాపూర్ సుల్తాన్ ఇబ్రహీం ఆదిల్షా సోదరి బీబీ హదియా సుల్తానాను హుస్సేన్ నిజాంషా కుమారుడయిన మూర్తుజాకిచ్చి వివాహము, హుస్సేన్ నిజాంషా కుమార్తె చాంద్ బీబీని అలీ ఆదిర్షాతో వివాహములు జరుపబడినవి. షోలాపూర్ జిల్లాకై ఎల్లప్పుడు యుద్ధములొనర్చు ఈ సుల్తానులు సంబంధ బాంధవ్యములు పురస్కరించుకొని చాంద్ బీబీకి అరణముగా ఇచ్చుటకంగీకారము కుదిరెను. దీనితో షోలాపూర్ జిల్లా బీజాపూర్ రాజ్యమున శాశ్వతముగా కలిసిపోయెను. ఈ విధముగా మహమ్మదీయ నవాబులు సంబంధ బాంధవ్యములచే స్నేహబంధము కలుపుకొని 24-12-1564 న గోలకొండ, అహమ్మద్ నగర్, బీజాపూర్, బీదర్ సైనిక సమాఖ్యతో విజయనగర రాజ్యముపై దండయాత్రకు బయల్దేరిరి.

విజయనగర రాజయిన రామరాయలు సోదరులయిన తిరుమల రాయలు, వెంకటపతి రాయలు సహాయముతో ముస్లిం దండయాత్ర నెదుర్కొనుటకు సిద్ధపడెను. 5 వేల అశ్విక దళము, 5 వేల గజదళము, 50 కాల్బలముతో సైన్యమును రణరంగమున నిలిపెను. 24-1-1565 న యుద్ధము ఆరంభమయినది. యుద్ధరంగమున విజయనగర సైనికులు విజృంభించి సుల్తానుల సేనలను చికాకుపరిచిరి. 5000 విజయనగర ధానుష్కులు యవన సైన్యములను చికాకు పరిచిరి. వారు భీతావహులయి ప్రాణములను రక్షించుకొనుటకు యుద్ధరంగము నుండి పరిగెత్తుచుండిరి. సుల్తాను సైన్యములో వేలకొలది మరణించిరి. ఈ సమయమునందు తురుష్క సైనికులు ఫిరంగులలో గుండ్లకు బదులుగా రాగినాణములను, ముక్కలను నింపించి పేల్పించెను. దానితో విజయనగర సైనికులు 5000 మంది హతులయిరి. రామరాయలు స్వయముగా యుద్ధతంత్రమును నడిపెను. రామరాయలు కూర్చొను పల్లకిని మోయు బోయీలను ఒక మదపుటేనుగు తొండముతో పడవేయగా రామరాయలు పల్లకీ నుండి క్రింద పడిపోయెను. రుమీఖాన్ అను సేనాని రామరాయలను బంధించి హుస్సేన్ నిజాంషా చెంతకు కొంపోయెను. హుస్సేన్ నిజాంషా రామరాయలును హతమార్చెను. ఇంతటితో విజయనగర సామ్రాజ్య వైభవము అడుగంటినది. రక్షసితంగడి యుద్ధానంతరము ముస్లిం రాజ్యాల మైత్రి నిలువలేదు. తిరిగి ఒండొరులు కలహించుకొనుట ప్రారంభించిరి. ఈ ముస్లిం రాజ్య వ్యవహారముల జోలికి పోకుండా ఇబ్రహీం కుతుబ్షా గోలకొండరాజ్య విస్తరణకు ప్రయత్నించెను. రాజమహేంద్రవరము, సల్లిం కోట, వీరఘట్టలము మొదలగు ప్రాంతములను ఆక్రమించుకొనెను. క్రీ.శ. 1575 నాటికి వినుకొండ, కొచ్చరుల కోట, ఖంబం, కొండవీడు మొదలగు ప్రాంతములు గోలకొండ రాజ్యమున చేరిపోయెను.

ఈ విధముగా యావదాంధ్రదేశము గోలకొండ రాజ్యమున చేరిపోయినది. కులీ కుతుబ్షా రాజ్యాభివృద్ధికి కృషిచేసి ఉర్దూ, ఫారసీ, ఆంధ్ర, సంస్కృత భాషలనాదరించి కవి పండితులను పోషించి మల్కిభరాముని కీర్తి వహించెను.

ఇతని పాలనాకాలము 1550 నుండి 1580 వరకు.

## మహమ్మద్ కులీ కుతుబ్షా

ఇబ్రహీం కుతుబ్షా అనంతరము ఆతని మూడవ కుమారుడగు మహమ్మద్ కులీ కుతుబ్షా గోలకొండరాజ్య సింహాసనమధిష్ఠించెను. ఇతడు రాజగునాటికి బాలుడు. కావున ఇతని సోదరులు, సామంతులు తిరుగుబాటు నొనర్చిరి. మహమ్మద్‌కులీ కుతుబ్షా ధైర్యము తో తిరుగుబాట్లను అణచివేసెను. మీర్ జుమ్మాను ల్‌ముల్క్, మీర్ మునీం అర్దస్తానీ వంటి ముఖ్యులు మహమ్మద్ కులీకి పరిపాలనా విషయములలో అండగా నిలిచిరి. బీజాపూర్ సుల్తానగు ఇబ్రహీం అదిల్షాకు తన సోదరి చాంద్ సుల్తానాను ఇచ్చి వివాహము చేసి అప్పటి వరకు జరుగుచున్న నల్‌దుర్గ్ యుద్ధమును ఆపి సంధిచేసుకొనెను ఇది క్రీ.శ. 1581 లో జరిగినది. కృష్ణా, తుంగభద్రా నదుల నడిమి ప్రదేశమునకై విజయనగర బీజాపుర గోలకొండ రాజులు అనవరతము కలహించుచుండిరి. ఈ ప్రదేశమున గద్వాల్, ఐజే, అలంపూర్, రాయచూర్ దుర్గములుండెను.

మహమ్మద్ కులీ కుతుబ్షా సర్దారయిన అమీర్ ఉల్ ముల్క్ నాయకత్వమున ఉదయగిరి, కర్నూలు, గండికోట, గుత్తి ప్రాంతములాక్రమించి పెనుగొండ దుర్గమును ముట్టడించగా వెంకటపతి రాయలు సైన్యమును సమకూర్చుకొని వచ్చి గోలకొండ సైన్యమును ఓడించెను. ఈ కాలమునందే సామంతులు కొందరు తిరుగుబాటు నొనర్చిరి. ఈ తిరుగు బాటుదార్లను అమీన్ ఉల్ ముల్క్, చంఘీజ్ ఖాన్ అను సేనానులు అణచివేసిరి.

మహమ్మద్ కులీ కుతుబ్షా కాలమున హైదరాబాద్ నగరము సర్వాంగ సుందరముగా రూపుదిద్దుకొన్నది. ఇతడు అనేక క్రొత్త క్రొత్త కట్టడములను కట్టించెను. అతిసుందరమునయిన, ఎత్తయిన, కళాత్మకమయిన చార్మినార్ నిర్మాణము ఈతని కాలమందే జరిగెను. ఇతని భార్య భాగమతి అనియు ఆమె పేర వెలసినదే భాగ్యనగరమనియు ఐతిహ్యము కలదు. ఇతని పాలనాకాలము 1580 నుండి క్రీ.శ.1612 వరకు.

## సుల్తాన్ మహమ్మద్ కులీ కుతుబ్షా

మహమ్మద్ కులీ కుతుబ్షాకు పురుష సంతానము లేదు. ఈతడు తన సోదరుడుగు మీర్జా మీన్ పుత్రుడగు సుల్తాన్ మహమ్మదును పెంచి తన కుమార్తెయగు హయత్ భక్షీ బేగం నిచ్చి వివాహము చేసి తన వారసునిగా ప్రకటించెను.

అందుచే మహమ్మద్ కులీ కుతబ్షా మరణానంతరము సుల్తాన్ మహమ్మద్ కులీ కుతుబ్షా క్రీ.శ. 1612 లో గోలకొండ సింహాసన మధిష్ఠించెను. ఇతని పరిపాలనా కాలమంతయు రాజ్యము సుఖశాంతులతో విలసిల్లెను. మొఘల్ రాజ కుమారుడయిన షాజహాన్ తండ్రినెదిరించగా ఆతనికి సుల్తాన్ మహమ్మద్ కులీ కుతబ్షా సహకరించెను.

సుల్తాన్ మహమ్మద్ కులీ కుతుబ్షా కాలమున హైదరాబాద్ నగరము ఇతోధిక వృద్ధినొంది సుందరముగా తీర్చిదిద్దబడినది. ఈతనిచే "మక్కామసీదు" నిర్మాణమునకు అంకురార్పణ జరిగినది.

ఈతని పాలనాకాలము క్రీ.శ. 1612 నుండి క్రీ.శ.1626.

**అబ్దుల్లా కుతుబ్షా**

సుల్తాన్ మహమ్మదు కులీ కుతుబ్షా కుమారుడైన అబ్దుల్లా కుతుబ్షా తండ్రి మరణానంతరము గోలకొండ రాజయ్యెను. ఇతడు పట్టాభిషిక్తుడగు నప్పటికి 12 సంవత్సరముల బాలుడు. ఈతడు బాలుడగుటచే ఇతని మాతృశ్రీ హయత్బాత్ బక్షీబేగం రాజ్య వ్యవహారములు చూచుచుండెను. క్రీ.శ. 1629లో షేక్ మహమ్మద్ పేష్వాగా నియమింపబడెను. అతని చాతుర్యముచే రాజ్యమున అల్లకల్లోలములు మాన్పబడి శాంతి నెలకొనబడెను.

క్రీ.శ. 1628లో జహంగీర్ మరణించగా షాజహాన్ ఢిల్లీ సుల్తానయ్యెను. షాజహాన్ దక్కన్ రాజ్యమును జయింప సమకట్టి దక్షిణాపథ ముస్లిం రాజ్యములు తన సామంత రాజ్యములుగా నుండ గోరెను. తన రాయబారిగా అబ్దుల్ లతీఫ్ అను వానిని గోలకొండ రాజ్యమునకు పంపించెను. శాంతి కాముకుడయిన సుల్తాన్ కులీ కుతుబ్షా మొఘల్ రాయబారితో సంధి గావించుకొనెను. సంధి నియమము ప్రకారం ఢిల్లీ పాదుషాకు ప్రతి సంవత్సరం రెండున్నర లక్షల కప్పము చెల్లించుటకును ప్రార్థనా సమయమునందు ముఖ్యముగా జుమ్మనాటి ప్రార్థనలో మొఘల్ పాదుషా పేరు చేర్చబడుటకును బడంబడిక కుదిరెను.

కుతుబ్షా మహమ్మద్ సయ్యాద్ నాయకత్వమున గోలకొండ సైన్యమును, కర్నాటక రాజ్య భాగములను, జయించుటకు పంపించెను. 20000ల కాల్బలము, 500 గుఱ్ఱములు, 300ల గజములు కొంత శతఘ్ని దళము తో సయ్యాద్ గండిగోటను వశపరచుకొని, విజయనగరాధీశులయిన మూడవ వేంకటపతిరాయులను, మూడవ శ్రీరంగ రాయలను ఓడించి తూర్పు తీరాంధ్ర ప్రాంతమును జయించి, మదరాసును స్వాధీన పరచుకొని కర్నాటక సామ్రాజ్య పతనమునకు కారణభూతుడయ్యెను.

షాజహాన్ కుమారుడయిన ఔరంగజేబు తండ్రి అనుమతి పొంది తన కుమారుడయిన మహమ్మద్ సుల్తానును గోలకొండ కోటను ముట్టడించుటకు పంపించెను. క్రీ.శ. 1665 లో మొఘల్ సైన్యములు హైదరాబాద్ నగరమును ముట్టడించినవి. అబ్దుల్లా కుతుబ్షా మొఘలులతో సంధి చేసుకొని కోటి రూపాయలు అపరాధ రుసుముగా చెల్లించి తన కుమార్తెను ఔరంగజేబు కుమారుడయిన మహమ్మద్ సుల్తానునకిచ్చి వివాహము చేసి మొఘల్ సామ్రాజ్యమునకు సామంతుడుగా నుండటకు అంగీకరించెను.

ఇతని పాలనా కాలము క్రీ.శ. 1624-1672 వరకు.

## అబుల్ హసన్ తానీషా

అబ్దుల్లా కుతుబ్షా మరణానంతరము అతని మూడవ కుమార్తె భర్తయగు అబుల్హసన్ తానీషా గోలకొండ సింహాసనమధిష్ఠించెను. తానీషా రాజగుట తోడనే గోలకొండకు ప్రధానమంత్రిగా నున్న సయ్యద్ ముజఫర్ను అనుమానించి అతన్ని తొలగించి మాదన్నను ప్రధానమంత్రిగా నియమించు కొనెను. ఇది 1674 న జరిగినది. మాదన్నకు ఒక సోదరుడు కలడు. అతని పేరు అక్కన్న. అక్కన్న మాదన్నలు పింగళి వంశీయులు. అనేక బాషలు తెలిసినవారు. రాజకీయ చాతుర్యము కలవారు. తానీషా మాదన్నకు "సూర్యప్రకాశరావు" అను బిరుదమొసంగెను. మాదన్నకు సహాయకారిగ అక్కన్న నియమింపబడెను.

క్రీ.శ. 1674లో శివాజీ గోలకొండ రాజ్యముపై దండెత్తి రెండులక్షల హొన్నులు వసూలు చేసుకొని పోయెను. తిరిగి 1676 లో శివాజీ గోలకొండ పై దండెత్తెను. ఆ సమయమున మాదన్న తన మంత్రాగముచే శివాజీ తో సంధి చేసికొనెను. ఆ సంధి ప్రకారము శివాజీ దక్షిణ కర్ణాటక ప్రాంతములపై దండెత్తుటకు సైన్యములకగు మూడువేల హొణ్ణులు ప్రతి దినమూ తానీషా చెల్లించవలెను. శివాజీ జయించిన భాగములో సగము తానీషాకీయవలయును. తానీషా ధనము వెచ్చించిన విషయమునకు ప్రాధాన్యమీయక శివాజీ తాను జయించిన భూభాగములను తన యధీనమందే యుంచుకొనెను. దీనితో తానీషాకు మాదన్నకు మనస్పర్ధలు ఏర్పడినవి.

శివాజీ 1680 లో మరణించెను. శివాజీ మరణానంతరము ఔరంగజేబు దక్కను రాజ్యమును జయించుటకు తన కుమారుడయిన 'షా ఆలం' ను పంపెను. షా ఆలం ప్రచండ సైన్యముతో మాల్ఖేడ్ వద్ద జరిగిన యుద్ధమున తానీషా సైన్యమునోడించి హైదరాబాద్ పట్టణమును ముట్టడించి నానా భీభత్సము చేసెను.

విధిలేని పరిస్థితులలో తానీషా షాఆలంతో సంధిగా వించుకొని ప్రతి సంవత్సరము రెండు లక్షల హొణ్ణులు కప్పము చెల్లించుటకు అంగీకరించెను. అంతేగాక మొఘల్ చక్రవర్తి ఆదేశానుసారము అక్కన్న, మాదన్నలను ఉద్యోగముల నుండి తీసివేయుట కొప్పుకొనెను.

అంతఃపురమున జరిగిన కుట్రలు ముస్లిం సర్దారుల మూఢ మతాభినివేశముతో 21 మార్చి క్రీ.శ. 1686లో అక్కన, మాదన్నలు హత్య గావింపబడిరి.

ఔరంగజేబు సున్నీ మతస్థుడు. అబ్దుల్ హసన్ తానీషా షియామతస్థుడు ఔరంగజేబు బీజాపూర్‌నాక్రమించిన తరువాత క్రీ.శ. 1687లో గోలకొండను ముట్టడించి 8 మాసములు పోరాడెను. మాయోపాయముచే కోట తూర్పు ద్వారమును తెరిపించి సైన్యముతో కోటలో ప్రవేశించి అనేకమందిని చంపి అబుల్ హసన్ తానీషాను బంధించి గ్వాలియర్ కోటకు తరలించెను. గోలకొండలోని వజ్ర వైఢూర్యము లను కోట్ల కొలది ధనమును స్వాధీనం చేసుకొని గోలకొండ రాజ్యమును మొఘల్ సామ్రాజ్యాంత ర్భాగముగా చేసెను.

ఇతని పాలన క్రీ.శ. 1672-1687 వరకు ఇంతటితో కుతుబ్షాహీల పరిపాలనము అస్తమించినది.

# కుతుబ్షాహీల కాలంలో పరిపాలన, సాంఘికస్థితి

గోలకొండ సామ్రాజ్యము బహమనీ రాజుల నుండి కుతుబ్షావంశము వారికి సిద్ధించినది. మూల పురుషుడయిన సుల్తాన్ కులీ కుద్బుల్‌ముల్క్ ఈరాన్, టర్కీ సంస్కృతులు మూర్తీభవించిన వాడు. బహమనీ రాజులు ఈ రాజ్యమును పాలించుటచే ఇక్కడి సంస్కృతిని బహమనీ సంస్కృతి అని అంటారు. కుతుబ్షాలు పాలించిన తెలంగాణము సంస్కృతి ఒక విలక్షణమైనది.

కుతుబ్షాహీ వంశపు రాజులు తెలుగు భూమిని తమ మాతృ భూమి భావించిరి. తెలుగు స్త్రీలను వివాహమాడిరి. తెలుగు భాషను నేర్చుకొనుటయే కాక తెలుగులో కవిత్వము చెప్పిరి. తెలుగు కవులను పోషించి తెలుగు సంస్కృతి వ్యాపించుటకు తోడ్పడిరి.

వీరికాలమున స్వదేశమున హిందువులకు సర్వ స్వాతంత్ర్యములిచ్చి, హిందూమత విషయములో జోక్యము కలిగించుకొనక, హిందువులను ఉన్నతో ద్యోగములయందు నియమించిరి.

**పాలనా విధానము :**

కుతుబ్షాహీల రాజ్యమున రాజు సర్వాధికారి ప్రజాభిప్రాయమునకు రాజ్యాంగమున స్థానము లేదు. హిందూ, ముస్లింలను సమదృష్టితో చూచిరి. అధిక జనులున్న హిందువుల ఇష్టానుసారము మంగళవారము ప్రభుత్వ సెలవుదినముగా ప్రకటించిరి.

రాజు మరణింపగానే వారసుని ప్రకటన వెలువడు చుండెను. రాజు మరణించినరెండు మూడు దినములకు అతని శవ ఖననము జరిగెడిది. మరణించిన రాజుకు శ్రద్ధాంజలి ఘటించుటకు కొత్తరాజుకు శుభాకాంక్షలు తెలుపుటకు ఇతర దేశపు రాయబారులు వచ్చుచుండిరి. కుతుబ్షాహీల కాలమున ప్రధానమంత్రిని "వకాలే ముతల్లక్" లేక 'పీష్వా' అని పిలిచేవారు. ఇతడు దేశ విదేశ వ్యవహారాలను పాలనా విషయములను చూచుచుండెను.

"అమీర్ జుమ్లా" లేక "మీర్‌జుమ్లా" అను పదవి ఆదాయవ్యయములను చూచు ఉన్నతాధికారిగా నుండెను.

సైన్యాధ్యక్షుని 'వజారే ఔనుల్‌ముల్క్' అని పిలిచెడివారు. సమస్త సంబంధ వ్యవహారములు ఇతని స్వాధీనములోనుండెడివి. శిస్తు వసూలు చేయు అధిపతిని మజ్మయదార్ అని పిలిచేవారు. రాజ్యము యొక్క ఆదాయవ్యయములు చూచు అధికారిని 'నాజర్' లేక 'నాజరుల్ ముల్క్' అని పిలిచేవారు. రాజునకు ఆంతరింగికులుగా ప్రత్యేక కార్యదర్శిగా ఉండునతనిని "దమీర్" లేక "దమీరుల్ ముల్క్" లేక "ముల్షీ అల్ మామాలిక్" అని పిలిచేవారు.

ఫర్మానాలు (ఉత్తర్వులు) వ్రాయువారిని అమీన్ హిందుది అని పిలిచేవారు.

పట్టణ శాంతి భద్రతలను చూచు అధికారిని "కోత్వాల్" అని పిలిచిరి. ఈ విధముగా కుతుబ్షాహీల పరిపాలన వివిధ శాఖలతో విలసిల్లుచుండెడిది. న్యాయ విచారణమును రాజులు స్వయముగా చేపట్టి ఖాజీలు, పండితుల సలహాల మేరకు అభియోగములకు తీర్పులు చెప్పుచుండిరి.

కుతుబ్షాహీలు పరిపాలనా సౌలభ్యమునకై రాజ్యమును ఆరు సుబాలుగామున్పదియేడు సర్కారులుగా 517 శింతులుగా విభజించిరి. ఆనాడు మెదకు సూబా కేంద్రముగా నుండెను.

సంవత్సరమునకు రెండు పర్యాయములు హిజారా దార్ల నుండి భూమి శిస్తు వసూలు చేసి ప్రభుత్వ కోశాగారమునకు చేర్చ బడుచుండెను.

సంవత్సరమున కొకమారు భూమి శిస్తు వసూలుకయి వేలంపాట పెట్టేవారు. ఎక్కువపాట పాడిన వారికి శిస్తువసూలు చేయు అధికారమును ఇచ్చేవారు. వారిని ఇజారాదారులు అనెడివారు. ఇజారాదారులు ప్రభుత్వమునకు నిర్ణీతమయిన శిస్తును చెల్లించి రైతులను పీడించి శిస్తును ఎక్కువగా వసూలు చేసికొనేవారు. వీరికి న్యాయ విచారణ జరిపి నేరస్థులను శిక్షించు అధికారం ఉండుటచే యథేచ్ఛగా ప్రవర్తించుచు రైతులను బాధించుచుండిరి.

మాదన్న మహామంత్రి పదవి నధిష్టించిన తరువాత ఇజారాదార్ల పరిస్థితిని మార్చివేసి వేతన పద్ధతిపై అధికార్లను నియమించి శిస్తు వసూలు పద్ధతిని ప్రవేశ పెట్టెను.

భూజల మార్గములపై విధించు సుంకముల తో ప్రభుత్వమునకు అధికమైన ఆదాయము లభించుచుండెను. ఓడలు రేవులందు నిలిపి యుంచి నందుకు సుంకము వసూలు వేయబడుచుండెను. కొన్ని ప్రాంతములందీ ఎగుమతి దిగుమతుల సుంకము 2% మాత్రమే వసూలగుచుండెను. జాగీర్దారులు రాజునకు అవసరమైన సమయములలో సైనిక సహాయము చేయుచు ప్రభుత్వమునకు కొంత సుంకము చెల్లించుచుండిరి. ఇరాన్ ఇరాక్ దేశీయులయిన ముస్లిములు వ్యాపారము చేయుచు ధనవంతులయి యుండిరి.

కుతుబ్షాహీల కాలమున బంగారు, రాగి నాణెములు అమలు లోనుండెను. హొన్ను బంగారు నాణెము దక్కను రాజ్యములన్నింటలో హొన్ను నాణెము వాడుకలో నుండెను. రాజు పేరులోని మొదటి అక్షరము నాణముపై ముద్రించెడివారు. వీరి కాలములో మూడు రకముల నాణెములు కలవు.

"నార్, నూల్, పణము" అనునవి రాగి నాణెములు

| | | |
|---|---|---|
| **నాలుగు నార్‌లు** | : | **ఒక నూలు** |
| **ఎనిమిది నూల్‌లు** | = | **ఒక పణము** |
| **పదహారు పణములు** | = | **ఒక హొన్ను** |

రాజు మంత్రులు సూబాలలో పర్యటనలు సలిపి ప్రజాహిత కార్యక్రమములను పర్యవేక్షించు చుండిరి.

## మతము:

కుతుబ్షాహీ రాజులు హిందువులకు సర్వ స్వాతంత్ర్యము లిచ్చి వారి ఆచార వ్యవహారములల్లో జోక్యము కలిగించుకొన లేదు. వీరు ఇతర రాజ్యములపై దండెత్తినపుడు హిందూ దేవాలయములను హైందవ కట్టడములను ధ్వంసమొనర్చినను స్వదేశమున మాత్రము హిందూదేవాలయములకు అగ్రహార ములిచ్చిరి.

నేటి ఖమ్మం జిల్లాలోని నేలకొండపల్లి గ్రామమున గోపన్న అను రామదాసు జన్మించెను. అతడు అక్కన్న, మాదన్నలకు ఆత్మీయ బంధువు. అబుల్ హసన్ తానీషా గోపన్నను భద్రాచల ప్రాంత తహసీల్దారుగా నియమించెను. గోపన్న భద్రాచలమున గల శిథిల రామాలయమును పునర్నిర్మించెను. సీతారామమూర్తులకు అనేక ఆభరణములు చేయించెను. సకాలమునకు శిస్తు పంపకుండుట చేతను శిస్తు సొమ్మును ఆలయ నిర్మాణమునకు వెచ్చించుట చేతను ప్రభుత్వ ధన దుర్వినియోగము చేసెనను నెపముచే తానీషా తహసీల్దారగు గోపన్నను గోలకొండ చెరసాలలో బంధించెను. రామదాసుడయిన గోపన్న చెరసాలయందు శ్రీరామచంద్రుని అనేక కీర్తనలచే స్తుతించెను. ఒక్కొక్క మారు భగవంతుని వ్యాజనిందా, వ్యాజస్తుతులలో కీర్తించెను. అతని భక్తికి సంతసించి రామలక్ష్మణులు మారు వేషములలో తానీషాను దర్శించి ఆలయ నిర్మాణమునకు వెచ్చించిన ద్రవ్యమును చెల్లించిరి. తానీషా గోపన్న రామభక్తికి అచ్చెరువంది తన జీవితము ధన్యమైనదని తలంచి రామదాసును చెరసాలనుండి బంధవిముక్తుని చేసెను. భద్రాచల రామాలయ పూజాదికములకు, ధూప, దీప, నైవేద్యాదులకు భద్రాచలము, పాల్వంచ, శంకరగిరి పట్టి, భోగవరము, చెరుకూరు, వీరన్న పట్టణము అను గ్రామములను అగ్రహారములుగా నిచ్చెను.

ఈ విధముగా కుతుబ్షాల కాలమున హైందవము ఆదరింపబడినది. ఐనప్పటికీ రాజ్యమున అచ్చటచ్చట హిందువులపై దౌర్జన్యములు జరుగుచుండెను.

## ఆర్థికము :

దక్షిణభారత దేశమున గోలకొండ సామ్రాజ్యము ఆర్థికముగా సమున్నత స్థితిలోనుండెను. సారవంతమయిన భూములతో ప్రకృతి వనరులతో వ్యవసాయానుకూలమయిన భూములు ఈ రాజ్యమున నున్నవి. చెరువులు, ఆనకట్టలు, బావులు మున్నగు నీటిపారుదల సౌకర్యములుండుటచే వివిధములయిన పంటలు చక్కగా పండింపబడు చుండెను. అనేక పండ్లతోటలు పెంచబడుచుండెను.

గోలకొండ రాజ్యము వజ్రములకు ప్రసిద్ధిగాంచినది. దీనిని వజ్ర దేశమని పిలిచిరి. తెలంగాణా, కర్ణాటక ప్రాంతములలో 23 వజ్రపు

గనులుండెనని టెవరీజ్ పుస్తకమున వ్రాయబడినది. గండికోట, కోలారు ప్రాంతముల లోని వజ్రపు గనులల్లో 10,000ల కార్మికులు పనిచేయుచుండిరి. ఈ విషయములన్నియు 'గోలకొండే కీ తాలుఖాత్' అను పుస్తకములో వివరించబడినది. ఈ విధముగా వజ్రపు గనులచే గోలకొండ రాజ్యము సంపద్వంతమై యుండెను. గోలకొండ రాజ్యమున ఉక్కు, సీసము పరిశుద్ధి కర్మాగారములుండెను.

రాజ్యమున వస్త్ర పరిశ్రమ అభివృద్ధి దిశలో నుండెను. మెదకు జిల్లాలోని అల్లాదుర్గము, సిద్ధిపేట మొదలగు ప్రాంతములు నాణ్యమయిన పట్టు వస్త్రముల తయారీ కేంద్రములుగా నుండెను. సాధారణ వస్త్రములు కళంకారీ అద్దకములను పొంది మనోహరముగా నుండెడివి.

ఇత్తడి పరిశ్రమ గోలకొండ రాజ్యమున అభివృద్ధి చెందెను. రామాయంపేట, భిక్కనవోలు (భిక్కనూరు), సిద్దిపేట ప్రాంతములు ఇత్తడి పరిశ్రమకు కేంద్రములై యుండెను.

## విద్య :

కుతుబ్షాహీ రాజులు విద్యావంతులు, స్వయముగా కవులు, వీరి పాలనా కాలమున ప్రజలు విద్యావ్యాప్తికై పాఠశాలలను నెలకొల్పిరి. ఈ పాఠశాలలో హిందూ ముస్లిం భేదభావం లేక అందరకు ప్రవేశముండెను. కొన్ని గ్రంథాలయములు స్థాపింపబడినవి. గోలకొండ రాజ్యము విద్యకు కళలకు ఆవాసమయినది. అరబీ ఫారసీ ఉర్దూ భాషా సాహిత్యములతో పాటు తెలుగు సాహిత్యము కూడా వృద్ధి చెందినది. రాజ పర్మానాలు పారసీక భాషలో వ్రాయబడుచుండెను. ఇబ్రహీం కుతుబ్షా కాలమున లలితకళలు అభివృద్ధి చెందినవి. గొప్ప గొప్ప కవులు ముషాహిరాలలో పాల్గొనుచుండిరి. మహమ్మద్ కులీ కుతుబ్షా తాను రచించిన ఉర్దూ కవితలందు కొన్ని తెలుగు పదములు కనిపించుచున్నవి. అబుల్ హసన్ తానీషా పారశీకము తెలుగు భాషలలో కవిత్వము చెప్పువాడు. అతడు చెరసాలలో నున్నప్పుడు సహజ కవితా ధోరణులతో అనేక కవితలను వ్రాసెను. సుల్తాన్ కులీ కుత్బుల్ ముల్క్ పాలనా కాలమున కొండపల్లి ప్రాంతమున తెలుగు భాషలో శాసనములు వేయబడినవి. ఇబ్రహీం కుతుబ్షా ఆంధ్రభాషా భిమాని ఇతనిని కవులు మల్కిభరాముడని కీర్తించిరి. 1. అద్దంకి గంగాధరుడు 2. ఆసూరి మరింగంటి సింగరాచార్యుడు 3. కందుకూరి రుద్రకవి మొదలగు సుప్రసిద్ధులయిన కవి ప్రకాండులు ఇబ్రహీం కుతుబ్షా కాలములో గౌరవింపబడిరి.

ఇబ్రహీం కుతుబ్షా తరఫ్‌దారుగా మెదకు జిల్లాలోని పొట్లచెరువు ప్రాంతమును అమీన్‌ఖాన్ పాలించుచుండెను. వేదశాస్త్ర పండితుడు, సరససాహిత్యసంపన్నుడు, ఉభయ భాషా కవియైన మరింగంటి అప్పలాచార్యుడు, అమీన్‌ఖాన్‌చే సన్మానింపబడెను.

పొన్నగంటి తెలగనార్యుడు పొట్లచెరువు నివాసి. ఈతడు అచ్చతెలుగులో మొట్టమొదటి కావ్యమైన "యయాతి చరిత్ర" ను రచించెను.

ఈతడు "యయాతి చరిత్ర" ను కావ్యము వ్రాయుచున్న విషయము అమీన్‌ఖాను తెలుసుకొని తన ఆస్థాన పండితుడగు మరింగంటి అప్పలాచార్యుల వారిని తెలగనార్యుల వద్దకు పంపి యయాతి చరిత్ర కృతిని తనకంకితమిచ్చునట్లుగా కోరెను. ఈ విషయము యయాతి చరిత్రలోని 1వ అధ్యాయంలో 9-10 పద్యములందు స్పష్టమగుచున్నది. ఈ విధముగా తెలుగు భాషలోనే ఒక క్రొత్త ఒరవడిని పుట్టించి అచ్చ తెనుగు కబ్బమును వ్రాసిన తెలగనార్యుడు మెదకు జిల్లా వాసుడుగా చెప్పుకొనుట జిల్లా భాషాభిమానులకు గర్వకారణము. అంతేగాక కుతుబ్షాహీల కాలమున మల్కిభరామ నామాంకితుడయిన ఇబ్రహీం కుతుబ్షా పాలనలో అతని తరఫ్ దార్ అమీన్ ఖాన్ ఇంత చక్కని గ్రంథమును కోరి కోరి అంకితము పొందుట కుతుబ్షాహీల సరసతకు నిదర్శనము.

మహమ్మద్ కులీకుతుబ్షా ఉర్దూ, ఫారసీ, అరబ్బీ భాషలయందే కాక సంస్కృతాంధ్ర భాషలయందును పాండితీ ప్రతిభ కలవాడు. తెలుగున కవితల్లగలిగిన ప్రజ్ఞావంతుడు ఇతని పాలనా కాలమున తెలుగు శాసనములు వేయించబడినవి. శాసనములందును తెలుగు పద్యములు వ్రాయబడినవి. నేవతి కృష్ణయామాత్యుడు అను కవి ఈ కాలముననే వైష్ణవ మత సంబంధమైన రాజనీతి రత్నాకరమను గ్రంథమును రచించెను సుల్తాన్ మహమ్మద్ కుతుబ్షా కాలమున సారంగు తమ్మయ 'వైజయంతీ విలాసము' అను గ్రంథమును రచించెను.

అబ్దుల్లా కుతుబ్షా బ్రాహ్మణ భక్తి కలవాడు ఇతని ఆస్థానమున వేదవేదాంగ కోవిదులు కవి పండితులు అయిన గణనాధ పండితకవి, తులసి మూర్తి అను వారుండిరి. పదకవితా పితామహుడయిన క్షేత్రయ్య అబ్దుల్లా కుతుబ్షా దర్బారుకేతెంచి ఆస్థాన పండితుడగు తులసి మూర్తితో పండిత వాగ్వివాదమున పాల్గొనెను. ఈ విషయము క్షేత్రయ్య రచించిన పదముల వలన తెలియుచున్నది.

అబుల్ హసన్ తానీషా తెలుగు భాషాభిమానియై తెలుగు కవిపండితుల నాదరించి, పోషించెను. ఈయన కాలమున భద్రాచల ప్రాంత తహశీల్దారగు గోపన్న భద్రాద్రి రామునిపై ఎన్నియో కీర్తనలు రచించెను. రామదాసు కీర్తనలు పద్యములు ఆంధ్రదేశమందంతట ప్రచారములో నున్నవి.

కుతుబ్షాహీల పాలనలో మెదకు జిల్లాలో దోమకొండ సంస్థానము చేరి యుండెను. దోమకొండ సంస్థానము నేలిన ప్రభువులు తెలుగు సాహిత్యమును ప్రోత్సహించి తెలుగు కవులనాదరించి అనేక కావ్యములను వ్రాయించిరి. ఈ రాజవంశీయులు ఉద్దండ పండితులు మహాకవులు దోమకొండ సంస్థాన స్థాపకుడు కాచిరెడ్డి. ఇతడు విజయనగరాధీశుల దుర్గపాలకుడు.

సుల్తాను కులీ కాలమున తెలంగాణ ప్రాంతమునకేతెంచి మెదకు దుర్గ ప్రాంతమును భిక్కనవోలు రాజధానిగా పాలించెను. గోలకొండ కుతుబ్షాహీలకు మొఘల్ రాజ ప్రతినిధులకు ఆసఫ్ జాహీ వంశీయులకు దోమకొండ ప్రభువులు సామంత మాండలికులుగా సంస్థానాధీశులుగా వ్యవహరించిరి. ఈ వంశమున మల్లారెడ్డి యను కవి "శివధర్మోత్తరము" అను గ్రంథమును రచించెను. కామిరెడ్డికి అబ్దుల్లా కుతుబ్షా సనదునిచ్చినట్లు 'ఉమాపత్యభ్యుదయ' కావ్యమువలన తెలియుచున్నది. ఎల్లారెడ్డి అను ప్రభువు 'వాశిష్టము', 'లింగపురాణము' 'షట్చక్రవర్తి చరిత్రము', 'పద్మపురాణము' అను గ్రంథములు రచించెను. పట్టమట్ట సోమనాథ కవి 'బ్రహ్మోత్తర ఖండము' నాంధ్రీకరించి ఎల్లారెడ్డి ప్రభువునకు అంకితమిచ్చెను.

ఈ విధముగా కుతుబ్షాహీ రాజుల పాలనా కాలమున తెలుగు సాహిత్యము పోషింపబడెనని తెలుయు చున్నది.

# ఆసఫ్‌జాహీ రాజులు

## ఆసఫ్‌జాహీ రాజులు

టర్కీ దేశమునుండి భారతదేశమునకు వలసవచ్చి రాజ్యమును స్థాపించిన వారు ఆసఫ్ జాహీలు. ఈ వంశమునకు మూలపురుషుడు ఖాజా అబిద్ ఖాన్. ఇతడు క్రీ.శ. 1654లో భారతదేశమునకు వచ్చి షాజహాన్ చక్రవర్తి అనుగ్రహమునకై పాత్రుడై మొదట మునసబుదారుడిగా నియమింపబడి తర్వాత ఔరంగజేబునకు అంగరక్షకుడుగా దక్కన్ రాజ ప్రతినిధిగా నున్న కాలమున అతనితోనుండెను.

ఔరంగజేబు మొఘలు సింహాసనమధిష్ఠించిన తర్వాత ఖాజా అబీద్‌ఖాన్ 4000ల సైనికులకు అధిపతియయ్యెను. గోలకొండ ముట్టడిలో ఔరంగజేబునకు అన్ని విధముల సహాయపడుచు క్రీ.శ 1687లో ఆ యుద్ధమునందు మరణించెను.

ఇతని కుమారుడు మీర్‌షహబుద్దీన్‌ఖాన్. ఔరంగజేబు మీర్ షహబద్దీన్ ఖాన్ యొక్క ప్రతిభాపాటవములకు సంతసించి అతనికి ఘాజీఖాన్, ఫెరోజ్‌జంగ్ అను బిరుదములనొసంగి కొంత సైన్యమునకు అధిపతిని చేసెను. ఫెరోజ్ జంగ్ మాళవ, గుజరాతు రాష్ట్రముల సుబేదారుగా నియమింపబడి పరిపాలన మొనర్చెను. క్రీ.శ. 1710 లో ఫెరోజ్ జంగ్ దివంగతుడయ్యెను.

మీర్‌షహబుద్దీన్ కుమారుడు మీర్ ఖమ్రుద్దీన్. ఇతడు సమస్త విద్యలందు నిష్ణాతుడై ఔరంగజేబునకాప్తుడై 4000 ల సైనికులపై అధిపతియయ్యెను. తరువాత కొన్ని రోజులకు ఔరంగజేబు ఇతనికి చిన్‌ఖిలిచ్‌ఖాన్ అను బిరుదముతో సన్మానించి 5000ల సైన్యముతో అధిపతిని గావించి కర్ణాటక ప్రాంతమును పాలించుటకు రాజ ప్రతినిధిగా నియమించెను.

ఔరంగజేబు మరణానంతరం షాఆలమ్ మొగల్ చక్రవర్తి అయ్యెను. ఇతడు మీర్‌ఖమ్రుద్దీన్ ప్రతిభను గమనించి అయోధ్య ప్రాంతసుబేదారుగను లక్నో పట్టణపు ఫౌజుదారుగను నియమించెను. క్రీ.శ. 1714లో షా ఆలమ్ తర్వాత ఢిల్లీ సింహాసనమును ఫర్‌కుషయర్ అధిష్ఠించెను. ఇతడు మీర్ ఖమ్రుద్దీన్ పరిపాలనా దక్షతను గమనించి 'ఫతేజంగ్ నిజాముల్ ముల్క్' అను బిరుదమొసంగి 7000ల మునసబుదారీకి 7000 ల అశ్విక దళమునకు అధిపతిగా చేసి దక్కను సుబేదారుగా నియమించెను. మీర్ ఖమ్రుద్దీన్ తన అసాధారణ ప్రతిభచే దక్కన్‌లో సామంత మాండలిక ప్రభువుల తిరుగుబాటు నణచివేసెను. ఢిల్లీ సుల్తానునకు విధేయుడై అవసర సమయములందు చక్రవర్తికి సహాయములందించు చుండెను.

సయ్యద్ సోదరులు ఢిల్లీ సుల్తానులను తమ చేతిలోని కీలు బొమ్మలుగా చేసి ఆడించుచుండిరి సయ్యద్ సోదరుల చేతిలో ఫహోకుషయర్ మరి ఇద్దరు సుల్తానులు మాయోపాయమునకు బలి అయిరి. అ తరువాత మహమ్మద్‌షా ఢిల్లీ సింహాసనాధీశుడయ్యెను. ఇతడు సయ్యద్ సోదరుల ప్రవర్తనను కనిపెట్టి వారి ప్రత్యేకతను పోగొట్టి స్వయంగా పరిపాలన మొనర్చుచుండెను. సయ్యద్ సోదరులు మహమ్మద్ షాను మట్టుపెట్ట యోచించు చుండిరి. మహమ్మద్ షా సయ్యద్ సోదరుల శత్రువును జేరదీసి వారిని క్రీ.శ. 1721-1722 సంవత్సరమున హత్య చేయించెను. మహమ్మద్‌షా దక్కను సుబేదారుగానున్న నిజాముల్ ముల్క్‌ను తనకడ ప్రధానమంత్రిగా నుండుమని కోరగా నిజాముల్ ముల్క్ అందుకు సున్నితముగా తిరస్కరించెను.

ఢిల్లీ సుల్తానుల బలహీనతలు గమనించి అయోధ్యనవాబు, బెంగాలు సుబేదారు, స్వతంత్రతను ప్రకటించిరి. సిక్కులు, జాట్లు, రోహిలాలు, మహారాష్ట్రులు, స్వతంత్రరాజ్యములను స్థాపించిరి. ఇందు మహారాష్ట్రులు సమర్థులై అరివీరభయంకరులై యుండిరి. మహారాష్ట్రులు మొగలు రాజ్య భాగములలో కొన్నింటిని జయించి తమ రాజ్యమున కలుపుకొనిరి. తమ పాలనలోను, దక్కను రాజ్యభాగములోను బలవంతముగా పన్నులు వసూలు చేయుచుండిరి. దక్కన్‌లో మహారాష్ట్ర పాలకులు చౌతు, సర్దేశ్‌ముఖీ అను పన్నులు వసూలు చేయరాదని నిజాముల్ ముల్క్ శాసించెను కాని మహారాష్ట్రు లందుకు అంగీకరింపక పన్నులు వసూలు చేయు చుండిరి అపుడు గొప్ప సైన్యమును సమకూర్చుకొని నిజాముల్క్ మహారాష్ట్రము పై దండయాత్ర నిర్వహించి పరాజితుడయ్యెను. ఈ యుద్ధమునందు మహారాష్ట్రులచే సంధి చేసుకుని విశాల భూభాగమును వారికప్పగించెను.

క్రీ.శ. 1738లో భారతదేశము పై నాదిర్షా దండయాత్రలు నిర్వహించి ఢిల్లీ నగరమును స్వాధీనపరచుకొని విలువయిన ఆభరణములను వజ్రవైఢూర్యములను దోచుకొని ప్రజలను నిర్దాక్షిణ్యముగా హతమార్చుచుండెను.

ఢిల్లీ చక్రవర్తి నిజాముల్ ముల్క్‌ను కార్యము సానుకూలమగునట్లు చేయుమని కోరుకొనెను. అపుడు నిజాముల్‌ముల్క్ నాదిర్షాను కలిసి స్వదేశమునకు తిరిగి వెళ్లునట్లు ఒప్పించెను. నిజాముల్ ముల్క్ మాటను గౌరవించి అనేక ధనరాశులను అమూల్యములయిన మణిమాణిక్యములను బంగారములను స్వీకరించి నాదిర్షా స్వదేశమునకేగెను. క్రీ.శ. 1740లో ఢిల్లీ పాలనా వ్యవహారమును చక్కదిద్దిన నిజాముల్ ముల్క్ దక్కనుకు చేరవచ్చెను. ఇంతలోనే అతని కుమారుడయిన నాసర్‌జంగ్ అధికార దాహముచే తండ్రికి వ్యతిరేకముగా తిరుగుబాటు నొనర్చెను. నిజాముల్ ముల్క్ కుమారుని కారాగారమున బంధించెను.

నిజాముల్‌ముల్క్ ఔరంగబాదు కేంద్రముగా దక్కన్ సుబేదారుగా పరిపాలన చేయుచు అటు మొగల్ సామ్రాజ్య రక్షణా భారము వహించెను. మహారాష్ట్రుల దండయాత్రలు నిరోధించుటకు చక్కని ఏర్పాట్లు గావించి అనేక దుర్గములను బాగు చేయించి సైన్యమును అభివృద్ధి పరిచెను. రాజ్యమున అలజడులు లేకుండా కట్టుదిట్టముచేసి క్రీ.శ. 1743లో తిరుచునాపల్లిపై దండెత్తి విజయమును పొంది ఆ ప్రాంతమును తన సేనాని మహబ్బత్ యార్ జంగ్ ను పాలించుటకు నియమించెను.

క్రీ.శ.1746లో నిజాముల్ ముల్క్ ఔరంగాబాద్ నుండి గొప్పసైన్యంతో బయలుదేరి గోదావరిని దాటి నిజామాబాద్ జిల్లాలోని బాలకొండ దుర్గమును ముట్టడించి జయించెను.

క్రీ.శ. 1747లో అఫ్ఘనిస్తానమున నున్న అహమదబ్దాలీ రాజయ్యెను. అతడు గొప్ప సైన్యముతో భారతదేశముపై దండెత్తెను. మొఘల్‌చక్రవర్తి అఫ్ఘనిస్తాన్ రాజు ముట్టడికి భయపడి నిజాముల్ ముల్క్‌ను సైన్యముతో బయల్దేరి వచ్చి సహకరించు మని కోరెను. నిజాముల్ ముల్క్ సైన్యముతో పోవుచు మార్గమధ్యమున అనారోగ్యమునకు గురియై తన 79వ యేట క్రీ.శ. 1748లో బురహంపూరులో మరణించెను.

నిజాముల్ ముల్క్ సమర్థుడయిన పరిపాలకుడు రాజకీయ చతురత గలవాడు. ఐరోపా వర్తక సంఘముల వారు భారత తీర ప్రాంతములందు కోటలను నిర్మించుకొని వ్యాపారములలో జోక్యము కలిగించు కొనుచు వారికవసరమైన ఆయుధ సామాగ్రిని అందించి లాభపడుచుండిరి. ఈ వ్యాపారమున ఫ్రెంచి, డచ్చి, బ్రిటిష్ వర్తక సంఘములుండెను. నిజాముల్ ముల్క్ వారితో స్నేహము చేయుచు తన రాజ్య పరిపాలనా వ్యవహారమును నిర్వహించుచుండెను.

నిజాముల్ ముల్క్ దక్కను సుబేదారుగా ప్రజాశ్రేయస్సును కోరి చెరువులు కాలువలు త్రవ్వించి వ్యవసాయభివృద్ధికి తోడ్పడినాడు. ఇతడు దక్కను భూభాగమును 24 సంవత్సరములు పాలించెను.

నిజాముల్ ముల్క్ స్వయముగా కవి పండితుడు. ఫారసీ, అరబ్బీ, ఉర్దూ భాషలలో నిష్ణాతుడయిన వాడు. కవులను, పండితులను తన ఆస్థానమున నియమించి పోషించుచుండెను. నిజాముల్ ముల్క్ ఆస్థానము వివిధ దేశములకు సంబంధించిన రాయబారులతోను కవి, పండితులతోను కలకలలాడుచుండెను.

ఇతని పాలనా కాలము క్రీ.శ. 1724-1748 వరకు.

## నాసర్ జంగ్

నాసర్ జంగ్ క్రీ.శ.1710లో నిజాముల్ముల్కు, సయదున్నిసాబేగంలకు జన్మించెను ఈతడు బాల్యము నుండియు సకల విద్యలు నేర్చుకొని తండ్రి కడ పరిపాలనా విషయములను కూలంకషముగా తెలుసుకొనెను. నిజాముల్ముల్కు నకు 5 కుమారులు. 1. గాజిఉద్దీన్ ఖాన్ 2.నాసర్‌జంగ్ 3.సలాబత్‌జంగ్ 4. నిజామలిఖాన్ 5. బసాలత్‌జంగ్. వీరిలో జ్యేష్ఠుడైన గాజి ఉద్దీన్ ఢిల్లీ చక్రవర్తి దర్బారులో "అమీరులుమ్రా" అనుపదవిలో నుండెను. నాసర్ జంగ్ తండ్రి యనంతరము దక్కను సుబేదారుగా పదవినిచేపట్టెను, ఈతని సోదరులెవ్వరును అధికారమునకై ప్రాకులాడినట్లులేదు.

నాసర్ జంగ్ తండ్రి జీవించి యుండగనే రాజ్యమున లేని సమయమున తండ్రికి వ్యతిరేకముగా తిరుగుబాటొనర్చి తానే దక్కను సూబేదారునని ప్రకటించుకొనెను. నిజాముల్ముల్కు ఢిల్లీ నుండి వచ్చి కుమారుని కుట్రను తెలిసికొని నాసర్ జంగ్‌ను బంధించి కొన్నిదినములు చెరసాలలో నుంచి పుత్రవాత్సల్యముచే విడిచి పెట్టెను.

నిజాముల్ముల్కు మరణానంతరము నాసర్‌జంగ్ దక్కను సుబేదారగుటకు ఆతని ఆంతరంగికులు, సేనానులు సహాయపడిరి.

నిజాముల్ముల్కు దౌహిత్రుడైన ముజఫర్ జంగ్‌తానే దక్కను సూబేదారు పదవికి అర్హుడనని, తనతాత నిజాముల్ముల్కు దౌహిత్రుడనగు తననే వారసునిగా నియమించెనని తిరుగుబాటొనర్చెను. ఈతడు అదవాని - రాయచూరు ప్రాంతములను పాలించుటకు నిజాముల్ముల్కు చే నియమింపబడెను.

95 సర్కారులున్న విశాలమైన దక్కను సుబేదారి రాజ్యమున కర్నాటక ప్రాంత పాలకులు, కర్నూలు నవాబు, స్వతంత్రుల గుటకు యత్నించుచుండిరి.

ముజఫర్‌జంగ్ కర్నాటక - కర్నూలు నవాబులను తిరుగు బాటుకు ప్రోత్సహించి తనకు సహాయమొనర్చిన వారు స్వతంత్రులుగా నుండుట కొడంబడిక చేసికొనెను. అప్పటికి వ్యాపారనెపముతో చేరిన ఫ్రెంచి, డచ్చి, ఆంగ్లేయులు బలవంతులై తమప్రాబల్యమును పెంచుకొనుటకు చూచుచుండిరి.

ముజఫర్‌జంగ ఫ్రెంచి వారిని తనకు సహాయపడుమని అర్థించెను. ఆంగ్లేయులు దక్కను సుబేదారిలో అల్లోకల్లోల మైన తమ ఆధిపత్యము బలపడునని తలచి నాసర్ జంగ్‌ను తుద ముట్టింప ప్రయత్నములొనర్చు చుండిరి.

నాసర్‌జంగ్ కర్నూలు-కర్ణాటక నవాబుల తిరుగుబాటును అణచుటకు గొప్ప సైన్యముతో బయలుదేరెను. ఈ సైన్యమునకు షానవాజ్ ఖాన్‌సర్వ సైన్యాధ్యక్షుడుగా నుండెను..

ముజఫర్ జంగ్ సైన్య సమీకరణ గావించుకొని కర్నూలు కర్ణాటక నవాబుల, ఫ్రెంచి వారల సహాయముతో సర్వసన్నద్ధ ముగానుండెను. నాసర్‌జంగ్ మధ్య వర్తుల ద్వారా ముజఫర్ జంగునకు "యుద్ధము వలదనియు - తాను పాలించు ప్రాంతములలో స్వతంత్రుడుగా నుండ వచ్చనియు-బంధువుల మధ్య యుద్ధము జరిగిన యితరులకు మేలు జరుగునని" రాయబారమునంపెను. కాని ముజఫర్ జంగ్ ఈ రాయబారమొప్పుకొనక యుద్ధమునకు సిద్ధమయ్యెను.

పాండిచేరి ప్రాంతమున పోరు ఘోరముగా సాగెను. ముజఫర్ జంగ్, నాసర్ జంగ్ సైనిక పఠానులచే బంధింపబడెను. ఫ్రెంచివారు ముజఫర్ జంగ్‌ను చెరసాలనుండి విడిపించుటకు ఎన్నో మాయోపాయములు పన్నిరి. ముజఫర్ జంగ్‌ను దక్కను సుబేదార్‌గా ప్రతిష్ఠించి ఆరాజ్యమున తమ ఆధిపత్యమునను భవించుటకు సర్వవిధముల ప్రయత్నములొనర్చుచుండిరి.

ఈ విషయములన్నియు నాసర్ జంగునకు బ్రిటిష్‌వారు హెచ్చరించిరి. ఫ్రెంచివారి ఆధిపత్యము సాగునను భయముచే ఆంగ్లేయులు నాసర్ జంగ్ నకు సహాయ పడుటకు సిద్ధమైరి. కాని నాసర్ జంగ్ వారి మాటలను లెక్కింపక తన బందీగానున్న ముజఫర్ జంగ్ తననేమి చేయగలడని భావించి జింజిపాలకులపై దండెత్త సిద్ధపడుచుండెను.

ఫ్రెంచి వారు నాసర్ జంగ్ సేనానులలో అభిప్రాయ భేదములు కలిగించి కొందరిని ప్రలోభపెట్టి తమ వైపు మరల్చు కొనిరి.

మొహర్రం విషాద దినములలో నాసర్‌జంగ్ సైనికపటాలము నుండి బయటవెడలి నమాజుపూర్తి చేసి కొని తిరిగి వచ్చు చుండెను. శత్రుసైనికులు ఫిరంగులు పేల్చి నాసర్ జంగ్ సైన్యమును కలవర పరిచిరి నాసర్ జంగ్ యుద్ధమునకు సిద్ధమగునంతలోనే అతని తలనరికి వేయబడెను. నాసర్ జంగ్ శిరము ముజఫర్ జంగ్‌కు బహుమానముగా పంపి అతనిని చెర నుండి విడిపించిరి.

నాజర్ జంగ్‌నకు విశ్వాసపాత్రులైన అనుచరులు కొందరు అతని శవమును జాగ్రత్తగా ఔరంగాబాదునకు చేర్చి ఖననము చేసిరి.

నాజర్ జంగ్ తండ్రిని యెదిరించి తిరుగుబాటొనర్చి చెరసాలపాలై తండ్రి మరణానంతరము రాజైనను ఆతడు మూడు సంవత్సరములైనను ముచ్చటగా రాజ సౌఖ్యమునను భవించలేదు. ఈతని పాలన క్రీ.శ. 1748-1751.

## ముజఫర్ జంగ్

ముజఫర్ జంగ్ నిజాముల్ముల్కు దౌహిత్రుడు. ఇతని తల్లి పేరు ఖైరున్నిసా బేగం, తండ్రిషిదాయత్ మొహియుద్దీన్.

ముజఫర్ జంగ్ మాతా మహునికడ ఔరంగాబాదులో నుండి సకల విద్యల నేర్చుకొని రాజకీయ విద్యలలో రాటు తేరెను. ఆదవాని, రాయచూరు ప్రాంతములకు తాతచే పరిపాలకునిగా నియమింపబడెను.

రాజ్యకాంక్షచే తన తాత నిజాముల్ముల్క్ తననే వారసునిగా ప్రకటించెనని అతని మరణానంతరము ప్రచారము చేయించు కొని దక్కను సూబేదారు పదవిని పొందుటకు కుట్రలు పన్ని ఫ్రెంచి వారి సహాయమున మేనమామయని చూడక ఆతనిని సంహరించెను.

ఫ్రెంచి వారు ముజఫర్ జంగ్‌ను దక్కను సూబేదారుగా ప్రకటించిరి. కాని ఢిల్లీ సుల్తాను నాసర్ జంగ్ మరణవార్త నెరింగి నిజాముల్ముల్క్ జ్యేష్ఠకుమారుడైన గాజియుద్దీన్ ఖాన్‌ను దక్కను సుబేదారుగా నియమించెను. అతడు సైన్యయుతుడై ఢిల్లీ నుండి ఔరంగాబాదునకు ప్రయాణ మై మార్గ మధ్యములోనే మరణించెను.

దక్కను సూబేదారుగా ఫ్రెంచి వారిచే నియమింపబడిన ముజఫర్ జంగ్ వారి పై కృతజ్ఞతతో ఫ్రెంచి గవర్నర్ డూప్లేకు "జఫర్ జంగ్" అనియు అతని భార్యకు "జహానారాబేగం" అను బిరుదములొసంగి కృష్ణా నది దక్షిణ భూభాగ మంతయు ఫ్రెంచి వారికి కానుకగానొసంగెను.

బుస్సీనాయకత్వమున ఫ్రెంచి సైన్యము వెంటరాగా ముజఫర్ జంగ్ ఔరంగాబాదునకు ప్రయాణమయ్యెను. ముజఫర్ జంగ్ ఫ్రెంచి వారికి ఎక్కువ గౌర వాదరములును చూపుచు తమను కించపరచుచున్నారని భావించిన పఠానులు, మొగలు సైనికులు ఎదురు తిరిగి ప్రమాణమునకు అడ్డంకులు కల్పించిరి. క్రీ.శ. 1751న ముజఫర్ జంగ్ ఎదురు తిరిగిన సైన్యముతో పోరాడు చుండగా కర్నూలు నవాబగు హిమ్మత్ ఖాను తనకు జరుగుచున్న పరాభవమునకు కోపగించి ముజఫర్ జంగ్‌ను హతమార్చెను.

ఈ విధముగా ముజఫర్ జంగ్ ఆసఫ్జాల వంశస్థుడు కాకున్నను రాజ్యకాంక్షచే బంధుత్వమును సైతము లెక్కింపక మేనమామను చంపి సుబేదారుగా ప్రకటించు కొన్నప్పటికిని కనీసము సింహాసనమును అధిష్ఠింపలేక పోయెను.

## సలాబత్ జంగ్

సలాబత్ జంగ్ నిజాముల్ముల్క్ మూడవ కుమారుడు ముజఫర్ జంగ్ మరణానంతరము ఫ్రెంచి సేనాని బుస్సీరాజకీయ చాతుర్యంతో మొఘలు సేనా నాయకులను సంప్రదించి సలాబత్ జంగ్‌ను దక్కను సుబేదారుగా ప్రకటించెను. అందుకు సలాబత్ జంగ్ ఫ్రెంచి వారికి అనేక బహుమతులొసంగి వారికొసంగిన కృష్ణానదీ దక్షిణ భూభాగముల ను అప్పగించెను.

సలాబత్ జంగ్ ఫ్రెంచి సర్దార్ బుస్సీమాటకు విలువనిచ్చుచు రామదాస పండితుని దీవానుగా నియమించుకొనెను. బుస్సీ ప్రేరణమున సైన్యమును సమకూర్చుకొని పూనా నగరమును ముట్టడించెను. కానీ మహారాష్ట్ర సైనికులు సలాబత్ జంగ్ సైన్యమునోడించిరి. సలాబత్‌జంగ్ పీష్వాబాలాజీ బాజీరావుతో సంధి గావించుకొనెను.

సంధి ప్రకారము హసఫ్‌జా రాజ్యమందున్న బేరార్ ప్రాంతంలోని కొంత భాగమును సలాబత్ జంగ్ మహారాష్ట్రులకు అప్పగించెను. ఆ తరువాత బుస్సీ కోరికపై మచిలీ పట్టణ పరిసర ప్రాంతములను ఫ్రెంచి వారికి అప్పగించెను. దీనితో బుస్సీ ఆకాంక్ష నెరవేరినది. ప్రసిద్ధమగు ఓడరేవు పట్టణమైన మచిలీపట్టణము ఫ్రెంచి వారి స్వాధీనమయినది. తక్కిన ఐరోపా వర్తకులతో పోటీలో నిలుచుటకు ఫ్రెంచి వారికి మచిలీ పట్టణము అత్యధిక ప్రాధాన్యత వహించినది. బుస్సీ క్రీ.శ. 1753లో తన కార్యము నెరవేర్చుకొని ఫ్రెంచి సైన్యమును ఔరంగాబాదులోనే విడిచి ప్రయాణమయి వెళ్ళెను.

ఫ్రెంచి సైనికుల జీతభత్యములు చెల్లించుట సలాబత్ జంగ్ పై పడెను. ఔరంగాబాద్ ఖజానాలో ద్రవ్యములేనందున అప్పు చేసి ఫ్రెంచి సైనికుల జీతములు చెల్లించెను. ఈ పరిస్థితిని గమనించి ఆసఫ్‌జా సైనికులు తమకు కూడా జీతములిమ్మని బలవంత పరిచిరి.

బుస్సీ కర్ణాటక రాజకీయ పరిస్థితులను చక్కదిద్ది ఔరంగాబాదునకు తిరిగి వచ్చి ఫ్రెంచి వారి ఆర్థికస్థితి బాగులేదని సలాబత్ జంగ్‌కు తెలిపి అతని నుండి సైనిక వ్యయము క్రింద ఉత్తర సర్కారు జిల్లాలను సాధించెను.

అసఫ్‌జా దీవాను లష్కర్ ఖాను ఫ్రెంచి వారి ఆధిత్యమును బుస్సీ రాజకీయకుట్రను, గమనించి ఫ్రెంచి సైనికవ్యయమును భరించ జాలక రహస్యముగా ఆంగ్లేయులతో సమాలోచనములు జరుపసాగెను. అతడు ఫ్రెంచి వారి ప్రాబల్యమునణచుటకై ఫ్రెంచి వారు ఆక్రమించిన ఉత్తర సర్కారులందు పన్నులు వసూలు చేయు అధికారులను, ఫ్రెంచి వారికి పన్నులు చెల్లింప రాదని రహస్యముగా ఆజ్ఞాపించెను. పన్నులు వసూలగుటలో ఆటంకములు ఏర్పడుట వలన బుస్సీ సలాబత్ జంగ్ అనుమతిని పొంది గుత్తా పద్ధతిన పన్నులు వసూల చేయ సమకట్టెను. గుత్తేదారులు ప్రభుత్వముకు చెల్లించ వలసిన పన్నుల కన్న అధికమొత్తములో పన్నులు వసూలు చేయుచుండిరి. ప్రజలు పన్నుల భారము మోయలేక భూములను విక్రయించు స్థితికి వచ్చిరి. ఈ సమయమున లష్కర్ ఖాన్ మరణించెను. సలాబత్ ఖాన్ షానవాజ్ ఖాన్‌ను దివానుగా నియమించెను.

షా నవాజ్ ఖాన్ ఫ్రెంచివారిని ఔరంగాబాద్ నుండి పంపించు ప్రయత్నములు చేయుచుండెను. బుస్సీ పన్నులు వసూలు చేయుటకు ఇబ్రహీంఖాన్‌ను నియమించి స్వయముగా వెంట నుండినను ఫ్రెంచి వారి ఆర్థికస్థితి బాగుపడలేదు.

క్రీ.శ. 1756లో సలాబత్ జంగ్ బుస్సీని వెంటనుంచుకొని శ్రీరంగ పట్టణమును ముట్టడించెను. సావనూరు నవాబును బుస్సీ యుద్ధమందు ఓడించెను.

సర్దారుల అమాత్యుల కోరికమేరకు సలాబత్ జంగ్ అతని సోదరులయిన నిజామలీఖాన్, బసాలత్ జంగ్‌లను చెరనుండి విముక్తులను చేసెను. నిజామలీ ఖాన్‌కు నిజాముద్దౌల బిరుదమునొసంగి బీరారు ప్రాంత పాలకునిగా చేసెను. సలాబ జంగ్‌ను బీజాపూర్ ఆధవానీ ప్రదేశముల పాలకునిగా నియమించెను. షానవాజ్ ఖాన్ వత్తిడి వలన బసాలత్ జంగ్ బుస్సీని తొలగించెను. బుస్సీ రాజకీయ చతురుడు అతడు మహారాష్ట్రులతో సంబంధము లొనర్చుకొని మంత్రాంగములు. సాగించు చుండెను బుస్సీ సైన్య సహితుడై మహారాష్ట్రులతో ఏకమయి తన పదవికి ముప్పుతెచ్చునేమోనని సలాబత్ జంగ్‌నకు అనుమానము హెచ్చెను. అందుచే బుస్సీని తిరిగి తన రాజ్యమున పూర్వ పదవిలో నియమించెను.

షానవాజ్‌ఖాన్ గొప్ప సైన్యముతో దౌల్తాబాద్ కోటను ముట్టడించి జయించెను. కానీ ఆసఫ్‌జారాజ్య ఆర్థిక పరిస్థితి అధ్వాన్నముగానుండెను. సైనికులకు జీతములు చెల్లింపకుండుటచే సైనికులలో కవలవరము బయలుదేరినది బీరారు పాలకుడు నిజామత్ ఖాన్ ఈ విషయం తెలుసుకొని ఔరంగాబాదు వచ్చి సైనికుల జీత భత్యములు చెల్లించెను. నిజామలీఖాన్ వ్యవహారదక్షుడు సలాబత్ జంగ్ నుండి అధికారముద్రను గ్రహించి బసాలత్ జంగునకప్పగించి రాజ్యవ్యవహారములను చక్కదిద్దెను.

అధికార రాజముద్రికను బసాలత్ జంగ్‌నుండి పొందుటకు బుస్సీ తీవ్రంగా ప్రయత్నించి విఫలుడయ్యెను. నిజామలీఖాన్ ఔరంగాబాద్‌లో నివసించుట బుస్సీకి దుర్భరముగా నుండెను.

ఫ్రెంచి గవర్నర్ డ్యూప్లే బుస్సీని ఔరంగాబాదు నుండి కర్ణాటకకు రమ్మని ఆదేశించెను. ఔరంగాబాద్‌లో ఫ్రెంచివారి ప్రాణములకు ముప్పువాటిల్లిన విషయమును గ్రహించి బుస్సీ డుప్లే ఆజ్ఞానుసారము ఆసఫ్‌జా రాజ్యమును వీడి కర్ణాటక చేరెను. ఈ సమయమున సలాబత్ జంగ్ బ్రిటిష్ వారితో సంధికుదుర్చుకొనెను.

క్రీ.శ. 1760లో సలాబద్ జంగ్ సోదరుడగు నిజామలీఖాన్‌తో కలిసి మహారాష్ట్రుల రాజ్య భాగమును ముట్టడించెను. ఉద్గీరు ప్రాంతమున యుద్ధము జరిగెను. ఆ యుద్ధమునందు మహారాష్ట్ర వీరుల ధాటికి ఆగలేక ఆసఫ్‌జా సైన్యము వెనుకంజవేసెను. సలాబత్ జంగ్ మహారాష్ట్రులతో సంధిగావించుకొని వారికి బీజాపూర్ దౌల్తాబాద్ ప్రాంతములనప్పగించెను.

ఈ స్థితిగతులను గమనించి ఔరంగాబాద్ తిరిగిరాగానే నిజామలీ ఖాన్ సలాబత్ జంగ్‌ను బంధించి తానే రాజ్య భారము వహించెను.

సలాబత్ జంగ్ క్రీ.శ. 1763లో చెరసాల యందే మరణించెను.

## నిజామలీఖాన్

నిజామలీఖాన్ నిజాముల్‌ముల్క్, ఉమ్దాబేగం దంపతులకు క్రీ.శ. 1734లో జన్మించెను. ఇతడు ఉర్దూ, టర్కీ, అరబ్బీ, ఫారసీ భాషలను షేక్ మహమ్మద్ జమాల్ సాబ్ వద్ద అభ్యసించెను. చిన్న వయస్సులోనే అన్ని విషయములందారితేరిన వాడై నిజాముల్ ముల్క్ అభిమానమునకు పాత్రుడయ్యెను. దక్కన్ రాజకీయముల నవగాహన చేసుకొని ఫ్రెంచి వారి ఆధిపత్యమును తొలగింప ప్రయత్నించెను.

క్రీ.శ. 1760 లో సలాబత్ జంగ్ మహారాష్ట్రులచే ఓడింపబడి వారికి దౌల్తాబాద్, బీజాపూర్ దుర్గములనప్పగించుట సహింపక నిజామలీఖాన్ సోదరుని చెరయందుంచి ఆసఫ్‌జా రాజ్యపీఠము నలంకరించెను.

మహారాష్ట్ర నాయకులు మాధవరావు, రఘునాధ రావులు పరస్పరం కలహించు కొనుచుండగా నిజామలీ ఖాన్ వారిద్దరికి సంధిగావించెను. క్రీ.శ. 1763లో బీదర్ కోటలో సలాబత్ జంగ్ మరణించిన వార్తను విని నిజామలీఖాన్ పూనా యుద్ధమునాపి బీదరుకేతెంచి సోదరుని కంత్యక్రియలు నిర్వహించెను.

నిజామలీఖాన్ రాజ్యమందంతటా పర్యటించి పరిపాలన చక్కబరిచెను. క్రీ.శ. 1765లో కర్ణాటకపై దండెత్తి కర్ణాటక నవాబును ఓడించెను. కర్ణాటక నవాబు ఆంగ్లేయుల సహాయము నర్థించెను. విషయమును తెలిసిన నిజామలీ ఖాన్ షేక్ జంగ్‌ను మదరాసు పంపి ఆంగ్లేయులతో సంప్రదించి కర్ణాటక నవాబు సక్రమంగా కప్పము చెల్లించునట్లు ఏర్పాటు చేసెను.

ఉత్తర సర్కారులందు ఆంగ్లేయులు ఆధిపత్యం వహించి యుండిరి. విశాలభూభాగముపై ఆంగ్లేయులు అధిపత్యం వహించి యుండుటను నిజామలీఖాన్ వ్యతిరేకించి వారికనేకము ఆటంకములు కలిగించెను. క్రీ.శ. 1766లో ఆంగ్లేయులు నిజామలీఖాన్‌తో సంధిగావించుకొనిరి. ఈ సంధి మేరకు ఉత్తర సర్కారు ప్రాంతములయిన రాజమండ్రి ఏలూరు ముస్తఫానగర్ ప్రాంతములపై అధిపత్యమునకు బదులుగా ప్రతి సంవత్సరము 5 లక్షల ధనమునిచ్చుటకు అంగీకరించిరి. క్రీ.శ. 1769లో గుంరగంట జమీందారు నిజామలీఖాన్ అధిపత్యము నంగీకరించెను. శూరుడు యుద్ధతంత్ర నిపుణుడైన ఇబ్రహీం బేగుథంసా అనునతనికి జఫరుద్దౌలా బిరుదమొసంగి నిర్మల్ ప్రాంత అధిపత్యమునిచ్చెను. దీనితో ఉత్తర తెలంగాణా ప్రాంత పరిపాలనా వ్యవహారములు చక్కదిద్ద బడెను.

క్రీ.శ. 1773 లో దివాన్‌గా నున్న రుక్నుద్దౌలా హత్యకు గురికాబడెను. అతని స్థానమున అరుస్తుజాను దివానుగా నిజామలీ ఖాన్ నియమించెను.

గుంటూరు పాలకుడుగానున్న బసాలత్ జంగ్ ఆధిపత్యమునందున్న ఫ్రెంచి సైన్యములను తొలగించి ఆంగ్లేయులు అధికారమును కైవసము చేసుకొనిరి. నిజామలీఖాన్ ఆంగ్లేయుల చర్యను సహింపక ఫ్రెంచి సైన్యమును చేరదీసెను. బసాలత్ జంగ్ మరణానంతరము ఆంగ్లేయులు గత్యంతరము లేక నిజామలీఖాన్‌తో సంధి చేసుకొని ప్రభుత్వమునకివ్వ వలసిన పేష్కుసును చెల్లించి స్నేహముగా నుండిరి.

ఆంగ్లేయులు క్రీ.శ. 1792లో మైసూరు రాజ్యమందున్న శ్రీ రంగపట్టణమును ముట్టడించిరి. ఈ ముట్టడిలో ఆంగ్లేయులకు సహాయముగా నిజాం సైన్యము మీర్ ఆలమ్ సేనానిగా పంపబడెను. ఈ యుద్ధమున శ్రీరంగపట్టణ నవాబయిన టిప్పుసుల్తాన్ పరాజితుడై సంధిగావించుకొనెను. నిజాము సహకరించినందులకు మైసూరు రాష్ట్రమందున్న కడప బళ్ళారి ప్రాంతములను అనేక బహుమతులను ఆభరణములను ఆంగ్లేయులు కానుకగా సమర్పించిరి.

మహారాష్ట్రులు నిజాంరాజ్య ప్రజల నుండి చౌతు, సర్దేశముఖి మొదలైన పేర పన్నులను బలవంతముగా వసూలు చేయుచుండిరి. దీనితో ఆ సప్జారాష్ట్ర ఆదాయము దిన దినము క్షీణింపసాగెను. మహారాష్ట్రుల నీపన్నుల వసూలు నాపమని కోరుచు నిజామలీ ఖాన్ మీరాలంను పూనాకుపంపించెను. కాని మహారాష్ట్ర పీష్వా నానాఫర్నవీసు నిజాం కోరికను తిరస్కరించి లక్ష కాల్బలముతో నిజాంపై దండెత్తి వచ్చెను. నిజాం అలీఖాన్ ఆంగ్లేయల సహాయమును కోరగా వారు మహారాష్ట్రులతో బలవ ద్విరోధమును గొనుట శ్రేయస్కరము గాదని యోచించి నిజాంకు సైనిక సహాయమును తిరస్కరించిరి. ఖండాలా వద్ద జరిగిన ఈ యుద్ధమున మహారాష్ట్ర సైనిక శక్తి ముందు నిజాముద్దీన్ సైన్యములు వెనుకరిల్లినవి. పోరు ఘోరముగా జరిగెను. ఈ యుద్ధమున నిజాముద్దీన్ ఘోర పరాజయము పాలయ్యెను.

మహారాష్ట్ర పేష్వా నానాఫర్నవీసుతో నిజామలీ ఖాన్ సంధి కుదుర్చుకొని యుద్ధాపరాధము క్రింద మూడు కోట్ల ధనమును తపతీ నదీ పరీవాహక ప్రాంతమును, దౌలతాబాదు దుర్గ మును పీష్వాకు సమర్పించుకొనెను.

ఈ యుద్ధమున ఆంగ్లేయులు తనకు సహాయమందించ లేదని వారిపై వైరభావమును పూని నిజామలీ ఖాన్ ఫ్రెంచి సైనికులను తన రాజధానికి ఆహ్వానించెను. ఫ్రెంచి సైనికులకు సమస్త సదుపాయములు నేర్పరచెను. సైన్య నిర్వాహణమునకగు ఖర్చుల నిమిత్తము మొదకు మండలమును ఫ్రెంచి వారికి ధారాదత్తము చేసెను.

ఆంగ్లేయుల కార్యకలాపములకు దీనితో అవరోధములు కలిగినవి. తమ తప్పును తెలిసి కొన్న ఆంగ్లేయులు నిజాంను ప్రసన్నుని గావించుకొనుటకు అనేక ప్రయత్నములొనర్చిరి.

మహారాష్ట్ర పీష్వారాయంబారియగు కృష్ణచంద్రుడు శ్రీరంగపట్టణపు నవాబును సహాయముగా గొని చౌతుపన్ను కొరకు నిజాం నవాబును ఒత్తిడి చేయుచుండెను. వృద్ధుడగు నిజామలీఖాన్ ఎటు తోచక మంత్రియగు మీరాలంపై సమస్త రాజ్య పాలన భారమునుంచెను. యుక్తవయస్కుడై రాజ్యపాలనమునకు [illegible]ర్లారు చున్న అక్బరలీ రాజ్యమున తనకు సరియగు ప్రాధాన్యత లభించుట లేదని యెంచి తండ్రిపై తిరిగుబాటొనర్చెను. నిజామలీఖాన్ పుత్రుని దుందుడుకు చేష్టలకు చింతించి మంత్రియగు మీరాలందురాలోచనలకు లోనై కుమారుని బంధించి కారాగారమునునుంచెను.

అక్బరలీ ఆంతరంగిక మిత్రుల ఆలోచనలతో అందోలు (మెదకు) అధిపతి యగు రాజా సదాశివరెడ్డి అండకై స్వయముగా లేఖ వ్రాసి పంపెను. సదాశివరెడ్డి తన ఆప్తులకు ఈ విషయమునెరింగించిసైన్యమును సిద్ధము చేసికొని కాసాల గ్రామము ద్వారా పొటంచెరువుకు చేరిదండు విడిసెను, అచ్చట సైన్యమునుంచి సదాశివరెడ్డి నడిరేయిగోలకొండకు వెళ్లెను. నగర రక్షణాధికారియగు బదిరుల్లాఖానురెడ్డికి స్వాగతమన్నట్లుగా కోటద్వారమును తెరచెను. రాత్రమున వచ్చిన సదాశివరెడ్డిని జూచి కోటలో కొందరు శంకించిరి. వారికి సంస్థానాధిపతి బాకీపడియున్నధనమును గొనితెచ్చెనని లంబాడి యెద్దులపై తెచ్చిన ఇసుకసంచులనుజూపిబదిరుల్లా ఖాన్ వారికి నచ్చచెప్పెను.

సదాశివరెడ్డి నేరుగా అక్బరలీజాయున్న చెరసాలకేగి సుఖసుప్తుడైయున్న యువ రాజును మేల్కొలిపి భవిష్యత్కార్యములాలోచించి ఆతని బంధవిముక్తుని గావించివెంట నిడుకొని నవాబు శయన సౌధమునకు జేరెను. అలికిడి విన్న నవాబు తటాలున లేచి భటుల పిల్చెను. నవాబును బంధింపనేగిన యిరువురకు ఆశాభంగమయ్యెను. తెల్లవారినచో తమగుట్టు బయటపడునని అదేరాత్రి ధూలిపేట. బేగంబజారు, పీలు ఖనా మొదలగు వీధులలో అంగడులను కొల్లగొట్టితిను బండారములను, నగదురొక్కమును ఏనుగులపై వేసుకొని సూర్యోదయము వరకు పొట్లచెరువు గ్రామమునకు చేరుకొనిరి, అచ్చటనుండి వారి[illegible] సైన్యయుతులై సదాశివపేట, కోహీరుద్వారా బీదరు (బెడదకోట) చేరుకొనిరి. బీదరుకోట ఖిలాదారుగా శౌఖరొద్దీన్ యుండెను. అతడు యువరాజు వచ్చుట యెరిగి సర్వము ఆతని స్వాధీన మొనర్చెను.

నిజాంఅనుమతిచే మీరాలం సైన్యయుతుడై సదాశివరెడ్డిని శిక్షించుటకై బీదరు వెళ్ళియుద్ధ మొనర్చెను. ఆయుద్ధమునందు బలవంతుడును యుద్ధ విద్యా విశారదుడును అగు సదాశివరెడ్డి నిజాంసైన్యములను చిత్తుచేసి ఓడించెను.

అక్బరలీ తండ్రికి ఒక వర్తమానము పంపెను. ఆవర్తమానమున సదాశివరెడ్డికి మెదకు మండలమ ప్పగించి రాజ్య పాలనా వ్యవహారమున తనకు తగిన ప్రాధాన్యమిచ్చిన విప్లవమునాపుదును అని పేర్కొనెను.

నిజామలీఖాన్ కోపగించి ఫ్రెంచి పటాలమునిచ్చి మీరాలం సహాయార్థము పంపించెను. ఫ్రెంచి సైన్యముతో గూడిన నిజాం సైన్యము సదాశివరెడ్డిని ఓడించి బందీకృతుని చేసిరి. అక్బరలీ సైనికులకు లొంగిపోయి, ఆత్మాభిమానముచే విషము త్రాగి మరణించెను. సదాశివరెడ్డి గోలకొండ కోటలో బంధింపబడెను. చెరసాలనుండి తప్పించుకొనిన సదాశివరెడ్డి తిన్నగా రంగంపేట కోటకు చేరెను.

నిజామలీకి దిగులు పట్టుకొనెను ఒకవైపు పుత్రశోకము మరోవైపు బలవద్విరోధము ఎట్లయిన సదాశివరెడ్డితో సంధిగావించుకొన వలెనని నయ్యార్జంగ్, హైదరుద్దౌలా, బదిరుల్లాఖాన్ అనువారిని రంగంపేటకు నిజాం రాయబారమునకు పంపించెను. రాయబారులు ఉభయులకు ద్వేషభావము పొడసూపకుండ విశ్వాసము నెలకొల్పెదమని సదాశివరెడ్డికి నచ్చజెప్పి అతనిని తోడుకొని హైదరాబాదునకు వచ్చి గోలకొండ దుర్గమున అతనికి భోజనాది సకల సౌకర్యములు కలిగించి మాయోపాయముచే అతనిని చంపిరి.

క్రీ.శ. 1796లో నిజామలీఖాన్ పక్షవాత రోగమునకు గురియయ్యెను. ఆయన కుడి చేయిస్వాధీనము తప్పినది.

నిజాం అలీఖాన్‌తో వైరము తమ వ్యాపారమునకు, భవిష్యత్కార్యకలాపములకు నష్టము కలుగునని ఎంచిన ఆంగ్లేయులు నిజాంతో సంధి జేసికొన నిశ్చయించిరి. ఇందుకు ఆంగ్లేయరెసిడెంటైన జేమ్సు ప్రేంట్రిక్ నియమింపబడెను. సంధి గావించుకొనుటకు వచ్చిన పేట్రిక్‌ను నిజాం నవాబు గౌరవాభిమానములతో ఆహ్వానించి సంప్రదింపులకు సిద్ధమయ్యెను. క్రీ.శ. 1798 లో సంధి కుదిరినది. దీని ప్రకారము మొట్టమొదట నిజాం రాజ్యము నుండి ఫ్రెంచి సైన్యము తొలగింపబడినది. నిజాం నవాబు కుడిచేయి స్వాధీనము లేక పోవుటచే ఫర్మానాలపై పరిపాలనా వ్యవహార పత్రములపై సంతకము చేయుబాధ్యత నిజాం కుమారుడు యువరాజునగు సికిందర్‌జా స్వీకరించెను. సంధిషరతులపై కూడా సికిందర్‌జా యే సంతకము చేసెను.

మైసూరు సుల్తానైన టిప్పుసుల్తాన్ ప్రబల శక్తి సమన్వితుడు ఆంగ్లేయులకు పక్కలో బల్లెముమ లెనుండెను. టిప్పు సుల్తానును మట్టు పెట్టుటకు ఆంగ్లేయులు నిజాం సహాయమును కోరిరి. నిజాం సంధి ఒప్పందము ప్రకారము ఆంగ్లేయులకు సైన్య సహాయమునొనర్చెను. ఆ యుద్ధమున మహా యోధుడైన టిప్పుసుల్తాను ఘోరముగా పోరాడి ఆంగ్లేయుల చేత హతమయ్యెను.

నిజామలీఖాన్ కుమారుడు సికిందర్ జా సైన్యాధిపత్యము వహించి టిప్పు సుల్తాన్ తో యుద్ధమొనర్చి అతని మరణమునకు కారణమయ్యెను. అయినప్పటికీ సంధి ప్రకారము టిప్పుసుల్తాన్ రాజ్యభాగములో సగభాగము నిజాంకు రావలసి యుండగా ఆ సగభాగమును సైతము ఆంగ్లేయులు సైనిక వ్యయం క్రింద స్వాధీన పరుచుకొనిరి.

క్రీ.శ. 1803లో వ్యాధి గ్రస్తుడైన నిజామలీఖాన్ దివంగతుడయ్యెను.

## సికిందర్ జా

నిజామలీఖాన్ తెహరతున్నిసా బేగం కుమారుడు సికిందర్ జా ఈతడు తండ్రి అనంతరము క్రీ.శ. 1803లో ఆసఫ్‌జా హీ సంహాసనమధిష్ఠించెను. ఈతడు తండ్రి జీవనకాలముననే యువరాజుగా నుండి అనేక రాజరికపు పనులను ఆచరించెడివాడు. నిజామలీఖాన్ చివరి సమయమున పక్షవాత రోగ గ్రస్తుడై కుడిచేయి స్వాధీనము తప్పిపోయెను. అందుచే రాజ పత్రములు ఫర్మానాలు సైతము సికిందర్‌జా సంతకముతో వెల్లబాటు అయ్యెడివి.

సికిందర్ జా రాజ్యాధికారమునకు వచ్చిన వెంటనే ఆంగ్లేయులకు మహారాష్ట్రులతో యుద్ధము సంభవించెను. ఆంగ్లేయులు సికిందర్‌జాను సైనిక సహాయమును కోరిరి. కానీ సికిందర్‌జా వారు కోరినంత సైన్యమును పంపలేక కొంత సైన్యను మాత్రమే పంపించెను. ఆ యుద్ధమున మహారాష్ట్రులు ఓటమిపాలయిరి. మహారాష్ట్రుల నుండి గ్రహించిన పశ్చిమ మండలమును గోదావరీ పరివాహక ప్రాంతములను సికిందర్ జాకు ఆంగ్లేయులు ఒసంగిరి. దీనితో నిజామునకు విశాల భూభాగము పై ఆధిపత్యము లభించినది.

యుద్ధమున క్షతగాత్రులయిన సైన్యమును దేవగిరి దుర్గమున ఉంచుటకు ఆంగ్లేయులు నిశ్చయించిరి. కానీ దేవగిరి దుర్గాధిపతి వారికి ప్రవేశమీయలేదు. ఆంగ్ల సైన్యాధిపతి వెస్లీ సికిందర్ జాతో చేసుకొనిన సంధి ప్రకారము క్షతగాత్రులయిన వారిని నిజాం రాష్ట్రంలోని ఏ దుర్గమందయినను ఉంచుటకు ఒడంబడిక చేసుకొనిరి.

నిజాం దీవానుగా నున్న మీరాలం క్రీ.శ. 1808లో మరణించెను. అతని తర్వాత ఆస్థానమున సికిందర్ జా మునీరుల్‌ముల్క్‌ను దీవానుగా నియమించెను. నిజాంరాష్ట్ర పేష్కారుగా కాయస్థ వంశీయుడయిన చందూలాల్ నియమింపబడెను. చందూలాల్ ఉదార స్వభావి ప్రభుత్వ ధనమును నీళ్ళవలె విడిగా వ్యయపరుచుచుండెను. రాబడి తక్కువై సైనికుల జీత భత్యములు మందుగుండు సామాగ్రి కొనుగోలుకు కూడా కష్టమగుచుండెను. సికిందర్ జా సైన్య నిర్వహణకై ఆంగ్లేయులకు సంబంధించిన "పామర్" సంస్థ నుండి 60 లక్షల ద్రవ్యమును అప్పుగా స్వీకరించెను. దీనితో ఆంగ్లేయులు నిజాం ప్రభుత్వ ఆంతరంగిక వ్యవహారములలో జోక్యము కలిగించుకొనసాగిరి. సికిందర్‌జా ఆంగ్లేయుల నేమియు అనజాల లేకపోయెను. రాజపుత్రులయిన ముబారిజుద్దౌలా, షంషుద్దౌలా లకు ఆంగ్లేయుల వ్యవహారము నచ్చక వారినవహేళనము ఒనర్చుచుండిరి. ఈ అవహేళనమును భరించలేని రెసిడెంటు "రస్సెలు" సికిందర్‌జా తనకుమారులను గోలకొండ కోటలో బంధించుటకు అంగీకరింప చేసెను.

ఏడు సంవత్సరాల తర్వాత చెరసాల నుండి వారిని విడిపించెను.

చందూలాల్ చేయు అధికవ్యయముచే రాజకోశాగారము ఖాళీ అయినది. ప్రజాహిత కార్యక్రమములకు ఆటంకములు ఏర్పడినవి. ప్రకృతి వైపరీత్యముచే క్షామము ఏర్పడి నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశమునంటినవి. రాజ్యమున దోపిడీలు పెరిగి శాంతిభద్రతలు క్షీణించినవి.

క్రీ.శ. 1820 లో "మెట్‌కాఫ్" అను ఆంగ్లేయుడు నిజాం రాష్ట్రమునకు రెసిడెంటుగా నియమితుడయ్యెను. ఆతడు రాజ్య ఆర్థిక పరిస్థితులను సరిచేయుటకు అనేక చర్యలను తీసుకొనెను.

"పావుర్" సంస్థ నుండి సికిందర్ జా తీసుకున్న 60 లక్షల ఋణ మును బ్రిటిష్ కంపెనీ వారు తీర్చివేసిరి. అందుకుగాను సుల్తాను కీయవలసిన పేష్కుసుధనము తగ్గించుటకు నిర్ణయింపనయినది. ప్రజలనుండి రైతులనుండి వసూలు చేయుపన్నులు వేలము విధానముండుట సరికాదని ప్రతిజిల్లాకొక ఆంగ్లేయాధికారి పన్నుల వసూళ్ళకై నియమింప బడెను. ఈ వ్యవస్థనే "కల్కక్టరీ వ్యవస్థ" అని అనిరి. ప్రతిజిల్లాలోన్యాయస్థానములు ఏర్పరిచి, పోలీసు వ్యవస్థను సువ్యవస్థితము చేసిశాంతి భద్రతలను కాపాడెను.

ఈ సంస్కరణల ఫలితముగా రాజ్యమున సత్ఫలితములు కనిపించినవి కానీ రాష్ట్ర వ్యవహారము లందు ఆంగ్లేయులజోక్యము అధికమైనది.

ఈ పరిస్థితులందు గవర్నర్‌జనరల్ రాష్ట్ర పరిస్థితిని గమనించి ఆంగ్లేయుల జోక్యము తగ్గించుటకు రెసిడెంటు నిజాం అధికారమును గానీ చందూలాల్‌మాటనుగాని తప్పకమన్నింపవలయునను నిబంధనను ఏర్పరచెను. మెట్కాఫ్ తర్వాత మార్టిన్ రెసిడెంటు పదవీ బాధ్యతలు స్వీకరించెను.

సికిందర్ జా పరిపాలనా కాలము క్రీ.శ.1803 నుండి క్రీ.శ. 1829 వరకు.

## నాసిరుద్దౌలా

సికిందర్ జా జ్యేష్ఠ కుమారుడైన నాసిరుద్దౌలా క్రీ.శ. 1829 లో నైజాం రాజ్య పరిపాలనా బాధ్యతలు చేపట్టి 29 సంవత్సరములు పరిపాలించెను. ఇతని ఆధిపత్యమును ఢిల్లీ సుల్తాను అయిన అక్బరు షా ధృవీకరించెను. ఇతనికి 'మజఫరల్‌ముల్క్'. ఫతేజంగ్, రుస్తుమే దౌరాన్, అరస్తుమెజమ, నిజాముద్దౌలా అను బిరుదములను ఢిల్లీ సర్కారు నాసిరుద్దౌలాకిచ్చి సత్కరించెను. నాసిరుద్దౌలా ఉత్తర భారతమున తమకున్నట్టి జాగీరులను ఢిల్లీ సర్కారుకు గౌరవ పుర స్కారముగా సమర్పించుకొనెను.

నిజాం రాజ్యమున ఆంగ్లేయాధికారుల జోక్యము అధికముగా నుండుటను గమనించి గవర్నర్ జనరల్‌తో సంప్రదించి వారిని తొలగించెను.

చందూలాల్ ఉద్యోగ విరమణమగుట తోడనే రాంబక్షును పేష్కారుగా నియమించుకొనెను. సిరాజుల్‌ముల్క్‌ను వకీలుగా నియమించుకొనెను.

రాజ్యమున ఆర్థిక స్థితిని చక్కబరుచుటకు రెవిన్యూ శాఖోద్యోగులపై అజమాయిషీ చేయుటకు ఆమీనులను నియమించెను. అయినప్పటికీ రాష్ట్ర ఆర్థిక పరిస్థితియందు మార్పులు కలుగలేదు.

క్రీ.శ. 1830 లో నిజాం రాష్ట్రమున రెసిడెంటు పదవిలో స్టూవర్ట్ నియమింపబడెను. అతడు రాష్ట్రమంతయు పర్యటించి రాష్ట్ర ఆర్థిక స్థితిని బాగు చేయదలచి నివేదికలు సిద్ధం చేసి సంస్కరణలు సూచించెను. అయిననూ రాష్ట్రఆదాయం పెరుగక సైనిక సైనికేతర జీతభత్యములకు ఇబ్బంది పడవలసి వచ్చినది. క్రీ.శ. 1838 లో ఫ్రేజరు రెసిడెంటుగా నియమింపబడెను. బ్రిటిష్‌వారి సూచన మేరకు సిరాజుల్‌ముల్క్‌ను దివానుగా నియమించినప్పటికీ ఆతడు ఆర్థిక స్థితిని బాగుపరచలేక పదవి నుండి తొలగిపోయెను.

ఆకాలమున అరబ్బులు, రోహిలాలు అప్పులిచ్చి బలవంతంగా వసూలు చేయుచుండిరి. నాసిరుద్దౌలా వారి నుండి 4 కోట్ల ఋణం చేసి ప్రభుత్వమును అతికష్టముగా నడపుచుండెను. క్రీ.శ. 1853 లో మేజర్ డేవిడ్‌సన్ నిజాం రాజ్యమున రెసిడెంటుగా నియమింపబడెను. ఇతడు నైజాం రాజ్య ఆర్థిక పరిస్థితులను గమనించి బేరారు ఉస్మానాబాద్, రాయచూర్, జిల్లాలను ఆంగ్లేయులకప్పగించునట్లుగా ఒడంబడిక చేసుకొని నైజాం ఋణ భారమును తగ్గించెను. దీనితో నిజాం సర్కారునకు ఆర్థిక భారము తగ్గినను సారవంతమయిన భూభాగములు కోల్పోవలసి వచ్చినది.

నాసిరుద్దౌలా తన దివానుగా సాలార్జంగ్‌ను నియమించుకొనెను. సాలార్జంగ్ చక్కని పరిపాలనా దక్షత కలిగిన సమర్థుడు. ముందుచూపు కలవాడు. రాజ్యమున పరిశ్రమలు స్థాపించెను. క్రీ.శ. 1856 లో ఒక పారిశ్రామిక ప్రదర్శనము ఏర్పాటు చేయించెను. పన్ను వసూళ్ళకు పటిష్ఠమైన యంత్రాగమును రూపొందించి ప్రభుత్వ ఆదాయమును పెంచెను.

క్రీ.శ. 1857 లో నాసిరుద్దౌలా అనారోగ్య పీడితుడై మరణించెను. ఇతని పాలనాకాలము క్రీ.శ. 1829 నుండి 1857.

## అఫ్జలుద్దౌలా

నాసిరుద్దౌలా అనంతరము ఆతని జ్యేష్ఠ పుత్రుడయిన అఫ్జలుద్దౌలా క్రీ. శ. 1857 లో ఆసఫ్‌జాహి రాజ్య సింహాసనమధిష్ఠించెను. ఇతనికొక సోదరుడు కలడు. అతని పేరు రోషనుద్దౌలా.

క్రీ.శ. 1857 లో భారతదేశమున బ్రిటిషు పాలనకు వ్యతిరేకముగా సిపాయిలు తిరుగుబాటు నొనర్చిరి. దీనినే చారిత్రకులు "ప్రప్రథమ స్వాతంత్ర్యోద్యమము" అని అన్నారు.

నిజాం రాజ్యమున ఈ ఉద్యమము అతి స్వల్పముగా వ్యాపించెను. నిజాం నవాబు ఈ ఉద్యమమునకు ప్రోత్సాహమునిచ్చునని ఉద్యమకారులు తలంచిరి. కానీ అఫ్జలుద్దౌలా, అతని బంధువులు, జాగీర్దారులూ తదితర అధికారులు ఆంగ్లేయుల యెడవైరమును చూపక పైపెచ్చువారిని గౌరవించుచు ఉద్యమనాయకుల ప్రయత్నములకు విఘాతములేర్పరచు చుండిరి. హైదరాబాద్ నగరమున విప్లవకారులు ఉద్యమమును తీవ్రతరము ఒనర్చినారని రాజా నరేందర్ బహద్దూర్ ద్వారా తెలుసుకొని ఉద్యమమునణచుటకు సాలార్జంగ్ కట్టుదిట్టమగు చర్యలను చేపట్టెను. అదనముగా సైనిక పటాలము తెప్పించి విప్లవకారులలో కొందరిని హతమార్చి, కొందరిని బంధించి విప్లవ కారులనణచి వేసెను. సాలార్జంగ్ విప్లవకారులనణచుటకు అరబ్బుల సహాయము కోరెను. ఆనాటి విప్లవకారులలో "తుర్రేబాజ్ ఖాన్", "మౌల్వీఅల్లావుద్దీన్" పేర్కొనదగిన వారు. వీరు కోఠీ ప్రాంతమందున్న రెజిడెంట్ భవనమును ముట్టడించిరి. మేజర్ బ్రిగ్స్ నాయకత్వమున విప్లవకారులపై కాల్పులు జరిపింపబడెను. విప్లవకారులు అనేకులు మరణించిరి. కొందరు భీతచిత్తులై పారిపోయిరి. తుర్రేబాజ్ఖాన్ బంధింపబడెను. ఆతడు చెరసాల నుండి తప్పించుకొని పారిపోతుండగా క్రీ.శ. 1859 లో మెదకు జిల్లాలోని తూప్రాన్ ప్రాంతమున కాల్పులకు గురియై మరణించెను. అతని మృతదేహము హైదరాబాద్ నగరమున బహిరంగ స్థలమున వ్రేలాడదీయబడినది.

ఈ తిరుగుబాటు 2 సంవత్సరములలో ముగిసినది. ఈ పోరాటమున మహారాష్ట్రులు ప్రముఖపాత్ర వహించిరి.

మెదకు జిల్లాలో కూడా ఈ పోరాటమున పాల్గొని ధన, మాన, ప్రాణములను త్యజించినవారు ఎందరో కలరు.

క్రీ.శ. 1860 నాటికి విప్లవ కారులల్లో బలవంతులయి యున్న రోహిలాలు బంధిపబడిరి. ఎందరికో మరణశిక్షలు వేయబడినవి. ఈ విధముగా తొలి భారత స్వాతంత్ర్య సమరము నిజాం రాజ్యమున క్రీ. శ. 1860 లో అణచివేయబడినది.

ఆపత్కాలమున సంపూర్ణ సహకారమందిన అఫ్జలుద్దౌలాకు ఆంగ్లేయ ప్రభుత్వము పతకములు ఇచ్చి "స్టార్ ఆఫ్ ఇండియా" బిరుదమునిచ్చి సత్కరించెను. ఆంగ్లేయులకు చెల్లింపవలసిన 50 లక్షల రూపాయల ఋణము మాఫీ చేయబడినట్లు బ్రిటిష్ ప్రభుత్వము ప్రకటించెను. నిజాంరాజ్యమున రాయచూర్, గుల్బర్గా జిల్లాలు చేర్చబడినవి. ఈ విధముగా అఫ్జలుద్దౌలా ఆంగ్లేయులకు నమ్మినబంటుగా. ఆత్మీయునిగా నుండెను. క్రీ.శ. 1858 లో విక్టోరియా మహారాణి భారతదేశ పరిపాలనా భాధ్యతలు స్వీకరించెను ఢిల్లీ సుల్తాన్ నాణములు నిషేధింపబడి కొత్త నాణెములు అమలు లోనికి వచ్చినవి. భారత దేశమున బ్రిటిష్ వంశ పరిపాలన ప్రారంభమయినది.

నిజాం రాజ్యమున సాలార్జంగ్ మంత్రిత్వమున అఫ్జలుద్దౌలా చక్కని పరిపాలనా విధానవము ప్రవేశపెట్టెను. రాజ్యము 4 సుబాలు, 17 జిల్లాలు వివిధ తాలూకాలుగా విభజింపబడినది. మెదకు ఒక సూబా కేంద్రముగా నుండెను. జిల్లాకొక తాలుక్దారు, తాలూకాకొక తహసీల్దారు నియమింపబడిరి. న్యాయశాఖ, పోలీస్ శాఖ సంస్కరింపబడినవి. రాష్ట్రమందు విద్యాలయములు నెలకొల్పబడి ఫారసీ, అరబ్బీ, ఉర్దూ భాషలు నేర్పబడినవి. ఉర్దూ మాధ్యమముగా పాఠశాలలు నెలకొల్పబడినవి. తెలుగు పాఠశాలలు ప్రభుత్వ పరముగా లేవనిన అతిశయోక్తి కాదు.

అఫ్జలుద్దౌలా పరిపాలనా కాలము క్రీ.శ. 1857 నుండి క్రీ.శ. 1869 వరకు.

## మహబూబలీఖన్

అఫ్జలుద్దౌలా మరణానంతరము ఆతని కుమారుడు మహబూబలీఖన్ ఆసఫ్జా సింహాసన మధిష్ఠించెను. ఈతడు రాజగు నాటికి మూడు సంవత్సరముల బాలుడు. కావున రాజ్యపాలనా బాధ్యతల నిర్వహించుటకు సాలార్జంగ్, షమ్సులుమ్రా లు బ్రిటిష్ గవర్నరు జనరలు చే నియమింపబడిరి.

సాలార్జంగు నిజాం రాజ్యమున అటవీ, తపాలా, రెవెన్యూ, విద్య, వైద్యము, ఆరోగ్యము మొదలగు శాఖలను సంస్కరించి వాటిని ప్రజలకు అత్యంత ఉపయోగకర ముగా నుండునట్లుతీర్చిదిద్దెను.

మహబూబలీఖాన్ యుక్తవయస్కుడైన తదుపరి అప్పటిగవర్నర్ జనరల్ లార్డ్‌రిప్పన్ ఆతనికి సర్వాధి కారములొసంగెను. మహబూబ్ అలీ ఖాన్ పాలనా కాలమున సాలార్జంగ్ తర్వాత రెండవ సాలార్జంగ్, తర్వాత అస్మాన్‌జా, వికారులుమ్రా దివానులుగా నియమింపబడిరి. వీరితర్వాత మహారాజాసర్‌కిషన్ ప్రసాద్ బహదూర్ దివాన్‌గా నియమింపబడెను - మహారాజా సర్‌కిషన్ ప్రసాదు ఎన్నియెూ సంస్కరణలను ప్రవేశపెట్టి ప్రజాసౌకర్యము లనేర్పరిచెను.

మహబూబలీ ఖాన్ కాలమున అనేక పరిపాలనా సంస్కరణలు తేబడినవి. ఇంపీరియల్ సర్వీసు అనుసైనిక వ్యవస్థ కొత్తగా ఏర్పరచబడినది. పరిపాలనా సౌలభ్యమునకై "క్యాబినెట్ కౌన్సిల్" స్థాపించబడినది. ఈ కౌన్సిల్ నందు అమాత్యులు, అధికారులు, జాగీర్దారులు, వ్యాపారులు ప్రతినిధులగా నియమింప బడిరి. ఈ విధానమును "ఖానూన్చాముభారిక్" అని పేర్కొనిరి.

నైజాం రాజ్యమున కరువు కాటకములు వచ్చెను. దానితో రాజ్య ఆర్థిక స్థితి కుంటు పడినది. కరువు కాటకముల తట్టుకొనుటకు నైజాం ప్రభుత్వము 25 లక్షల రూపాయిలను ఋణరూపేణ విడుదలచేసెను. ఇండియా బ్రిటిష్ ప్రభుత్వము నిజాం రాజునకు రెండుకోట్ల రూపాయలను అప్పుగా నిచ్చెను.

అంతేగాక రాజ్యమున ఆర్థిక స్థితిని మెరగు పరచుటకు అనేక పథకముల రుపొందించి వాటిని అమలు పరచుటకై జి.సి. దివాకర్‌గారిని ఆర్థిక కార్యదర్శిగా నియమించెను. ఆతడు నిజాంరాజ్యస్థితిగతులును కూలంకషముగా విచారించి పొదుపుచర్యలను పాటింప సూచించెను. పొదుపుచర్యలలో భాగముగా మొదట లింగుసూగూరు జిల్లాను విడదీసి కొంతభాగమును గుల్బర్గా జిల్లాలోను మరికొంత భాగమును రాయచూరు జిల్లాలోను చేర్చి ఆనాటికి 17 జిల్లాలుగా నున్న రాజ్యమును 16 జిల్లాలుగా మార్చెను. దీనితో ఆనాటి నిజాం రాజ్యపాలనా విభాగములు 16 జిల్లాలుగా ఉండెను.

**తెలంగాణము :** 1. అత్రాఫ్‌బల్దా 2. మెదకు 3. నిజామాబాదు 4. ఆదిలాబాదు 5. కరీంనగర్ 6. వరంగల్ 7. నల్లగొండ 8. మహబూబ్‌నగర్.

**మహరాష్ట్ర ప్రాంతము :** 1. ఔరంగబాద్ 2. బీడ్ 3. పర్బిణి. 4. నాందేడ్ 5. ఉస్మానాబాద్.

**కర్ణాటక ప్రాంతము :** 1. గుల్బర్గా 2. రాయచూరు 3. బీదరు.

మహబూబలీఖన్ రాజ్యాభివృద్ధికి అనేక ప్రణాళికల చేసెను. ఈయన కాలమున విద్యాలయములు, వైద్యాలయములు, రహదారులు, నీటిపారుదలకై చెరువులు, కుంటలు కాలువలు నిర్మింపబడినవి.

మెదకు ప్రాంతమున మంజీరానదికి నిర్మించిన మహబూబ్‌నహర్ ఆనకట్ట కాలువలు ఈతని కాలమున నిర్మించబడి సుమారు రెండు వేల ఎకరముల భూమి సేద్యమునకు ఉపయోగపడినది బారాకమాన్ అనుపేరుగలగిన కాలువ మెదకు సమీపమున పిల్లికొట్టాల గ్రామ పరిసరములో నిర్మించబడినది. ఆకాలము నందలి సాంకేతిక నైపుణ్యమునకు చిహ్నముగా ఈ కాలువను పేర్కొన వచ్చును. క్రిందపసుపు టేరుప్ర వహించుచుండగా పైనుండి అనగా వాటిపై ఈ కాలువ 12 స్తంభముల ఆధారముగా నిర్మించబడినది. ఆంగ్లేయులతో బీరారు సమస్యపై పరిష్కారమునకు నవాబు సూచించెను. కాని ఈ సమస్యా పరిష్కారమున నిజాం రాజునకు ఎట్టి లాభము కలగలేదు. క్రీ.శ. 1902 లో బీరారు పై ఆంగ్లేయులకు నిజాం నవాబునకు ఒడంబడిక కుదిరినది. ఆ ఒప్పందము ప్రకారము బీరారు శాశ్వతముగా ఆంగ్లేయుల వశమైనది. అందుకుగాను నిజాం నవాబునకు ఆంగ్లేయులు సంవత్సరమునకు 25లక్షల రూపాయలు ఇచ్చునట్లును బీరారునందు బ్రిటిష్ పతాకముతో పాటు నిజాం పతాకము కూడా ఎగురవేయునట్లును 21 తో పులతో నిజాం నవాబునకు గౌరవ వందన మిచ్చునట్లు ఒడంబడిక కుదిరినది. నామమాత్రపు గౌరవము పొందిన నవాబు సారవంతమైన బీరారు ప్రాంతమును ఆంగ్లేయుల కప్పగించెను.

మహారాజా కిషన్ ప్రసాదు బహద్దుర్ దక్షత వలన మహబూబలీ ఖాన్ నిజాంరాజ్యమునందే కాక యావద్భారతమున ఉత్తముడు గా పేరుప్రతిష్ఠల దెచ్చుకొనెను. మహబూబలి బాదుషా ప్రజలు మహబూబేదక్కన్ అని పిలువదొడగిరి.

మహారాజా కిషన్ ప్రసాదు బహద్దూరు పూర్వీకులు నిజాం రాజుల కొలువులో పని చేసిరి. ఈతడు దివాన్ పదవీ నిర్వాహణలో అప్రమత్తుడై రాజ్యమును, రాజును కంటికిరెప్ప వలె కాపాడు చుండెను.

వైస్రాయి హైద్రాబాదు సందర్శించిన సమయమున మహబూబలి ఖాన్ జన్మదినోత్సవ సందర్భములందును కిషన్ ప్రసాద్ హైద్రాబాదు నగరమును వివిధ తోరణములతో చక్కని దీపాలంకరణతో అలంకరింప చేయువాడు.

ఈయన కాలమున హిందూ-మహమ్మదీయులు అన్యోన్యముగా కలిసిమెలసి జీవించుచుండిరి.

సర్ కిషన్ ప్రసాదు బహద్దూర్ ముస్లిం వనితలను వివాహమాడి మత సామరస్యమునకు దోహదమొనర్చెను. ఆ కాలమున హిందువులు తమ పండుగలతో పాటు మహమ్మదీయ పండుగలను కూడా ఆనందముగా పాటించుచుండిరి. ముఖ్యముగా మొహర్రం పండుగలో సర్వమతముల వారు పాల్గొనుట ఆనాటి మత సామరస్యమునకు నిదర్శనము.

క్రీ.శ. 1906-1907 కాలమున హైద్రాబాదు నగరమున మూసీనది పొంగి అఫ్జల్ గంజ్, దివాన్ దేవుడి, చాదర్‌ఘాట్, ప్రాంతములు జలమయ మయ్యెను. వేలకొలది ప్రజలు నిరాశ్రయులై విలపించిరి. అనేక గృహములు నేలమట్టమైనవి. అనేకులు ప్రవాహమున కొట్టుకొని పోయి మరణించిరి. మహబూబలిఖాన్ ఈ విషాద సంఘటనకు దుఃఖితుడయ్యెను. వరదల వలన సర్వస్వము కోల్పోయిన ప్రజలకు తక్షణ సహాయము చేయుటకు పాదుషా నిశ్చయించి నిరాశ్రయులైన వారికి గృహముల నిర్మించియిచ్చెను. ఆహారధాన్యములను సరఫరా యొనర్చి సర్వ విధముల వారికి తోడ్పడె.

మహబూబలీఖాన్ పాలనాకాలమున ప్రభుత్వ వ్యవహారములు ఉర్దూ - పారసీ భాషలలో నిర్వహింపబడుచుండెను.

మహబూబలీ పాదుషా వేటయందు అత్యంత ఆసక్తి కలవాడు. కుటుంబ సమేతముగా వేటకు బయలు దేరువాడు. పూర్వపు రామాయంపేట తాలుకా నేటి వెల్దుర్తి మండలంలోని కుకున్నూరు రామాయపల్లి అటవీ ప్రాంతములకు పాదుషా వేటకై వచ్చేవాడు. అడవులలో పెద్ద పులులు, చిరుతపులులు, లేళ్లు, జింకలు, అడవిదున్నలు, కుందేళ్లు, మొదలగు అటవీ మృగములుండెడివి. ఈ విషయములను నేటికిని కుకునూరు రామాయపల్లి గ్రామములందు వృద్ధులు కథలుగా చెప్పుకొందురు.

మహబూబలీఖాన్ క్రీ.స. 1911లో తీవ్ర అస్వస్థకులోనై మరణించెను. ఈతని మరణమునకు రాజ్యమునందలి ప్రజలందరు దుఃఖించిరి.

ఈతని పాలనాకాలము క్రీ.శ. 1869-1911 వరకు సాగినది.

## ఉస్మానలీఖాన్

మహబూబ్ అలీఖాన్ మరణానంతరము అతని కుమారుడు ఉస్మానలీఖాన్ క్రీ.శ. 1911లో సింహాసనాధీశుడయ్యెను. ఈతడు క్రీ.శ. 1886 లో జన్మించెను. చిన్నతనము నుండియే రాజకీయ వ్యవహారములందు మెళకువలు తెలుసుకొనెను. ఆంగ్లము, ఉర్దు, ఫారసీ, అరబ్బీ, తెలుగు భాషలలో పాండిత్యమును సంపాదించెను.

ఆనాటి వరకు పరిపాలించిన ఆసఫ్‌జా రాజవంశీయుల పాలనమున ఆర్థిక చిక్కులనేకముగా నుండెను. ఉస్మానలీఖాన్ కొంత కాలము స్వయముగా పరిపాలనా బాధ్యతలు స్వీకరించి జాగీరులను వశపరచుకొని ప్రభుత్వోద్యోగుల ద్వారా వాటి పరిపాలన నిర్వహింపజేసి రాజ భాండాగారములను ధన సంపత్తులతో నింపెను. పరిస్థితి మెరుగు పడిన తర్వాత జాగీర్దారులకు వాటి పాలనా బాధ్యతనప్పగించెను.

ఉస్మానలీఖాన్ అన్ని ప్రభుత్వశాఖలపై పర్యవేక్షణ సలిపి రాష్ట్రాభివృద్ధికి కృషి చేసెను. కిషన్ ప్రసాద్ పదవీ విరమణ గావించగా సాలార్జంగ్ దీవానుగా నియమింపబడి క్రీ.శ. 1914లో పదవీత్యాగము నొనర్చెను.

పరిపాలనా వ్యవహార నిర్వహణకు ఉస్మానలీ ఒక సలహా మండలి నేర్పరిచెను. ఈ సలహా మండలిలో హైదర్, అమీన్‌జంగ్, ఇమాంముల్క్ మొదలగు ముఖ్యులు సభ్యులుగా నుండిరి ఈ సలహామండలి రాష్ట్ర ఆర్థిక, పరిపాలనా, ప్రజాసంక్షేమ, కార్యక్రమములందు చొరవ చూపుచు రాష్ట్రాభివృద్ధికి తోడ్పడుచుండిరి.

నిజాం రాష్ట్రమున వైద్య, ఆరోగ్యముల ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత విద్యలు ప్రోత్సహింపబడినవి. బాలబాలికలకు క్రీడా సంస్థలను స్కౌటును ఏర్పాటు చేసి విద్యార్థుల మానసిక వికాసమునకు దోహదము చేసెను.

నీటి పారుదల సౌకర్యములేర్పరిచి వ్యవసాయభివృద్ధికై బృహత్ప్రణాళికల సిద్ధము చేసెను. నిజాం సాగర్, హిమాయత్‌సాగర్, ఆసఫ్ సాగర్, వంటి వాటిని నిర్మించి పంటకాలువలు త్రవ్వించెను. సర్ విశ్వేశ్వరయ్య ఇంజనీరు రూపకల్పన చేసిన నిజాంసాగర్ నిర్మాణమును అప్పటి ఛీఫ్ ఇంజనీర్ అలీనవాజ్ జంగ్ నిర్మాణ బాధ్యతలో నిర్మించబడినది.

మెదకు జిల్లా దురదృష్టమేమోకానీ ఈ నిజాం సాగర్ నిర్మాణముచే మెదక్ జిల్లాలోని ఎన్నో గ్రామములు, ఎంతో మంది ప్రజలు నిరాశ్రయులై ఇతర ప్రాంతములకు వలస వెళ్ళవలసి వచ్చినది.

సారవంతమైన భూములను మెదక్ జిల్లావాసులు కోల్పోవలసి వచ్చినది. నేటికిని శంకరంపేట మండలమునందలి కొప్పోలు మొదలగు గ్రామములు అప్పుడప్పుడు నిజాంసాగరు నీటి ముంపునకు గురికావలసి వచ్చును. కానీ నిజాంసాగర్ యందలి ఒక్క నీటిచుక్క కూడా మెదక్ జిల్లా వాసులకు ఉపయోగమునకు రావు. ఇక్కడి పంటపొలములు నిజాంసాగర్ నీటికి నోచుకొనలేవు. పై పెచ్చు అప్పుడప్పుడు నిజాంసాగర్ నీటిచే మెదక్ జిల్లాయందలి పంటపొలములు ముంపునకు గురియగుచు కర్షకులకు నష్టము కలిగించుచుండును. అంతేగాక జలచరములచే అప్పుడప్పుడు తీరవాసులకు బాధలు కలుగుట సహజము.

ఉస్మానలీఖాన్ పరిపాలనా కాలమున పరిశ్రములు అభివృద్ధి చెందినవి మెదక్ జిల్లాలోని సిద్ధిపేట పట్టు చేనేత పరిశ్రమలకు కేంద్రముగా విలసిల్లినది. బోధన్‌లో చక్కెర కర్మాగారము నిర్మింపబడినది సిర్పూర్ బలార్షాలలో కాగితపు పరిశ్రమలు నెలకొల్పబడినవి. ఓరుగల్లులో ఆజంజాహీ బట్టల మిల్లు స్థాపించబడినది. హైదరాబాద్ లో చార్మినార్, గోలకొండ సిగరేట్ కర్మాగారాలు నిర్మించబడినవి. ఆల్విన్ సంస్థ కర్మాగారము నెలకొల్పబడినది. నిజాం నవాబు పారిశ్రామిక ప్రదర్శనను ఏర్పాటుచేసి పరిశ్రమలకు ప్రోత్సాహము కలిగించెను.

ఈ విధముగా పారిశ్రామీకరణకు పునాదులు వేసిన కాలమున కూడా మెదకు జిల్లా నిజాం రాజ్యమునకు ముఖ్యపట్టణమగు హైదరాబాదునకు అతి సమీపములో నున్నప్పటికి వివక్షతకు గురియైనదని చెప్పక తప్పదు.

ఉస్మానలీ హైదరాబాదునందు ఉన్నతమైన కార్యాలయ భవనములు నిర్మించెను. హైకోర్టు, ఉస్మానియా వైద్యశాల, యునానీ దవాఖాన, ఆసఫ్‌జా లైబ్రరీ మొదలగు కళాఖండములు నేటికినీ చూపరులకు దర్శనమిచ్చుచున్నవి. హైదరాబాదు నగరమును సుందర నగరముగా తీర్చిదిద్దెను.

క్రీ.శ. 1917లో ఉస్మానియా విశ్వవిద్యాలయమును స్థాపించెను, 14 వందల ఎకరముల విస్తీర్ణమున విశ్వవిద్యాలయ భవన సముదాయములను నిర్మించి అందు విశ్వవిద్యాలయ ప్రధాన భవనమును నేత్ర పర్వమయిన కళాసంపదగా నిర్మాణమొనరింపజేసెను. విద్యార్థులకు వసతి గృహములు అందు భోజన సదుపాయములు ఏర్పర్చబడినవి. రాజభాషయైన ఉర్దూలో వందల కొలది శాస్త్ర సాంకేతిక గ్రంథములు రచింపబడి విద్యార్థులకు ఉపయుక్తములైనవి. ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు అనుబంధముగా వైద్య సాంకేతిక, న్యాయ వ్యవసాయ కళాశాలలు నెలకొల్పబడినవి. క్రీ.శ. 1923లో జాగీర్దార్ల కళాశాల స్థాపించబడినది.

నిజాం రాజ్యమున ప్రజా సౌకర్యములకై రైల్వే, తపాలా, రవాణా శాఖలు నెలకొల్పబడినవి.

నిజాం స్టేట్ రైల్వే నిర్వాహణతో పాటు నిజాం రోడ్డు ట్రాన్స్‌పోర్టు డిపార్ట్‌మెంట్ నెలకొల్పబడి బస్సులు ప్రవేశపెట్టబడినవి.

ఉస్మానలీఖాన్ ప్రాచీన కళాసంపద పరిరక్షణకై పురావస్తు శాఖను రూపొందించెను. ప్రాచీన కట్టడములను రక్షించుట శాసనములను సేకరించి ప్రచురించుట ప్రాచీన మానవావాసముల పరిశోధనలో త్రవ్వకములు జరుపుట మొదలగు కార్యక్రములు శ్రద్ధగా చేపట్టబడినవి. నిజామునకు చారిత్రక కట్టడములు రక్షించుటలో ఆసక్తి ఎక్కువ అందుచే అజంతా ఎల్లోరా గుహలు, వేయిస్తంభాల గుడి, కొలనుపాక, ఏలేశ్వరము, పిల్లలమర్రి మొదలగు ప్రాంతములందలి ప్రాచీన శిల్ప సముదాయములు రక్షింపబడినవి. మక్కామసీదు, చార్మినార్, గోలకొండ కుతుబ్షాహీల సమాధులు చెడిపోకుండా రక్షింపబడినవి అంతేగాక భువనగిరి, బీదర్, రాచకొండ, దేవరకొండ, జఫర్‌గళ్, మెదక్ వంటి దుర్గములు నశింపకుండా రక్షింపబడినవి.

ప్రాచీన నాణెములు సేకరించి జాగ్రత్త చేయబడినవి. పురావస్తుశాలలు నిర్మింపబడి వాటి నిర్వాహణ బాధ్యతలకై ఒక శాఖ ఏర్పాటైనది. భారత జాతి ప్రాచీన సంస్కృతిని పరిరక్షించి భావితరాల కందించుటకు కృషిచేయనైనది.

ఉస్మాన్ అలీఖాన్ తన మంత్రివుండలిని ఏడుగురు సభ్యులతో నియమించెను. హైద్రాబాద్ నగర కొత్వాలుగా శ్రీ రాజబహద్దూర్ వెంకట్రాంరెడ్డిని నియమించెను. నాటి మంత్రులు హైద్రాబాద్ రాష్ట్రమందు చక్కని పరిపాలనా సంస్కరణలు అమలు చేసిరి. రాజా వెంకట్రామా రెడ్డిగారు అనేక ప్రజాహిత కార్యక్రమాలను రూపొందించి విద్యాసంస్థలు నెలకొల్పెను. వీరి ప్రోత్సాహ సహకారములచే హైదరాబాద్ నగరమున 'రెడ్డి హాస్టల్' 'రెడ్డి వుమన్స్ కాలేజ్ వంటి విద్యాసంస్థలు స్థాపించబడినవి.

నిజాంఅలీఖాన్ కాలమున ఉత్తర హిందూస్థానము నుండి నైజాం రాజ్యముకు వచ్చి ఎందరో మహమ్మదీయులు నిజాం ప్రభుత్వమున ఉన్నత పదవులను పొందిరి. వారు స్థానిక ప్రజలను అధికారులను చిన్నచూపు చూచుచూ అవహేళన చేయుచుండిరి. తమకు సన్నిహితులైన వారిని బంధువులను ఉన్నత పదవులందు నియమించు చుండిరి. ఈ సమయమున నిజాం రాజ్యము నందలి అత్యధిక జనాభా కలిగిన హిందువులకన్న అత్యల్ప జనాభాగల మహమ్మదీయులు బంట్రోతు మొదలుకొని అధికారి పదవుల వరకు నియమింప బడుచుండిరి. మహమ్మదీయ బంట్రోతుకున్న విలువ ఆనాడు హైందవులైన పటేల్, పట్వారీలకు లభింపకుండెను. తమకు అన్ని రంగములందు అన్యాయము జరుగుచున్నదని భావించిన స్థానిక ప్రముఖులు, ఈ విషయమును నిజాం ప్రభువునకు విన్నవించిరి. ఉన్నత పదవులు కూడ తమకీయవలెనని స్థానికులు నిజాంను వత్తిడి చేసిరి.

నిజాం పరిస్థితులను గమనించి ముల్కీ పద్ధతిని ప్రవేశపెట్టుటకు 'ఫర్మానా' జారీచేసెను. ఈ ఫర్మానా ప్రకారము స్థానికులైన దేశీయులకే ప్రభుత్వోద్యోగములిచ్చు ఆచారము అమలు చేయబడినది.

క్రీ.శ. 1936లో ఉస్మాన్ అలీ ఖాన్ తన 25 ఏండ్ల పరిపాలనమును పురస్కరించుకొని రాజ్యమునందు 'సిల్వర్ జూబ్లీ' ఉత్సవములు (రజతోత్సవములు) వైభవముగా నిర్వహించు కొనెను. ఆ సమయమున హైద్రాబాద్ నగరమున సిల్వర్ జూబ్లీ హాలు నిర్మించబడినది.

నిజాం రాజ్యమున అనేక సంస్థానము లుండెను. మెదక్ జిల్లాలో - అందోలు (మెదకు) దోమకొండ సంస్థానములు ప్రధానమైనవి. రాజబంధువులకు కొన్ని గ్రామములు ధారాదత్తము చేయబడెను. వాటిని పాయగా అనెడివారు. జాగీర్దార్లు, జమీందార్లు, భూస్వాములు అనేకులు ఉండిరి. వీరికి లక్షల ఎకరముల భూమి స్వంతమైయుండెడిది. జమీందార్లు, దేశపాండ్యలు,, దేశముఖ్, జాగీర్దార్లు తమ భూములను రైతులకు కౌలునకిచ్చుచూ వారి నుండి ధన, ధాన్యరూపమున ప్రతిఫలము పొందుచుండిరి. అంతేకాక వారికి పండిన పంటలను ఎక్కువ మొత్తంలో వసూలు చేయుటలో నిర్దాక్షిణ్యముగా వ్యవహరించెడివారు. 'సర్ఫేఖాస్' అని రాజునకు ప్రత్యేకంగా తన స్వంత గ్రామములు భూములు ఉండెడివి. వాటినుండి వచ్చు ఆదాయమును రాజు తన స్వంతఖర్చులకు వినియోగించు కొనెడివాడు. ఈ విధముగా భూమిపై యజమాన్యము కొందరికి మాత్రమే కలిగి స్వంత భూమిని కలిగిన రైతులు అతి తక్కువగా నుండిరి.

ఏడవ నిజాం పరిపాలనలో అల్పసంఖ్యాకులైన మహమ్మదీయుల ఆధిక్యత అధికమైనది. హిందువులపై వివక్షతా భావం పెరిగినది. ఇది సహింపని హిందువులు సమైక్యతాభావమును అలవర్చు కొనవలెనని, హిందూ సంఘ సముద్ధరణకై కృషి చేయవలెనని నిశ్చయించుకొనిరి. తెలంగాణమున 8 జిల్లాలు, మహారాష్ట్రమున 5 జిల్లాలు, కర్ణాటకమున 3 జిల్లాలు నిజాం రాష్ట్రముననుండెను. ఈ మూడు భాషా ప్రాంతములందలి హిందువులు ద్వితీయ శ్రేణిపౌరులుగా జీవనం సాగింపవల్సి వచ్చుచుండెను.

నిజాం రాజ్యమున పాయగాలు, జాగీర్లు, సంస్థానములు 8061చదరపు మైళ్ల విస్తీర్ణము కలగి యుండెను.

నిజాంయొక్క స్వంత ఆస్తిగా పరిగణింపబడే సర్ఫేఖాస్ భూవైశాల్యము 8109 చదరపు మైళ్ళు. ఈ సర్ఫేఖాసు భూమి ఆదాయము నుండి 2 కోట్ల రూపాయలు ఆదాయము రాజునకు లభించెడిది.

నిజాం ప్రభుత్వ ఆధీనమందున్న భూమిని 'దివానీ' అనెడివారు.

దీనిపై వచ్చు ఆదాయమును ప్రజా సంక్షేమ కార్యక్రమలాకు, పరిపాలనా, సైనిక వ్యయములకు ఉపయోగించెడివారు. ఈ దివానీ ఆదాయమునుండి నిజాం రాజు 50 లక్షలు ఐవేజు గా పొందెడివారు. ఇతని కుమారులకు సంవత్సరమునకు 25 లక్షలు రూపాయలు వ్యయమగుచుండెను. ఈ ధనమంతయూ ప్రభుత్వ ఖజానా నుండే ఖర్చు చేయబడుచుండెను.

నిజాం అలీఖాన్ పరిపాలనా కాలమున ఇంగ్లీషు వారి పరిపాలనమునకు వ్యతిరేకముగా భారతదేశ మంతటా ఉద్యమం ప్రారంభమైనది. మహాత్మాగాంధీ నాయకత్వమున సమస్త భారతజాతి స్వాతంత్ర్య సముపార్జనకు నడుంబిగించినది. భారతదేశమున ఎటుచూచినను ఆంగ్లేయుల పరిపాలనము సహించని భారతీయులు తమ ధనమున ప్రాణములైనను త్యజించుటకు సిద్ధపడిరి.

స్వాతంత్ర్య సాధనే ధ్యేయముగా దేశమందు అంతట బ్రిటిష్ ప్రభుత్వమునకు వ్యతిరేకంగా సత్యాగ్రహములు నిర్వహింపబడుచుండెను.

దేశమున జరుగుచున్న పరిణామములు హైదరాబాద్ రాజ్యమందున్న మేధావులను జాగృత పర్చినని.

నైజాం రాజ్యమునందు అధిక సంఖ్యాకులైన హైందవులకు జరుగుచున్న అన్యాయములు, అల్పసంఖ్యాకుల ఆగడాలు, నిజాం నవాబు స్వవిలాసములకై వ్యయపర్చుచున్న ప్రభుత్వ ధనము, పెత్తందారీ వ్యవస్థతో కనీస వాక్ స్వాతంత్ర్యము కూడా లేని నిర్బంధమును కలిగిన ప్రజలలో స్వాతంత్రకాంక్ష ప్రతి ఫలించినది.

# ఆసఫ్ జాహీల నాటి సాంఘిక చరిత్ర

ఆసఫ్‌జాహీ రాజులు దక్కన్ భూభాగమును హైదరాబాద్ కేంద్రముగా 200ల సంవత్సరములు పరిపాలించిరి. వీరి పరిపాలనలో తెలంగాణా, కర్ణాటక, మహారాష్ట్ర భూభాగములుండెను. తెలుగు, కన్నడ, మహారాష్ట్ర ప్రజలు అన్యోన్యముగా సఖ్యముగా జీవించిరి.

నిజాం రాజ్యమున వివిధ మతానుయాయులుండిరి. ముఖ్యముగా హైదరాబాదు నగరము భిన్న మతముల భిన్న సంస్కృతుల వారికి నిలయమయి యుండెను. ప్రజలలో అధిక సంఖ్యాకులైన హిందువులైనప్పటికి అల్పసంఖ్యాకులైన ముస్లింలు రాజ్యమున ప్రముఖ అధికారులుగా నుండిరి. హిందూ మహమ్మదీయ సంస్కృతుల సమ్మిశ్రిత మయిన హైదరాబాదు సంస్కృతిని దక్కన్ సంస్కృతి అనిరి. నైజాం నవాబులు ఇస్లాం మతానుయాయులు. అతఃపూర్వము గోలకొండను పాలించిన కుతుబ్షాహీల వలె మతసామరస్యమును పాటించుటకు అసఫ్‌జాహీలు కొంత ప్రయత్న మొనరించిరి.

నిజాం రాజ్యము పరిపాలనా సౌలభ్యమునకు గాను 4 సుబాలుగా, 16 జిల్లాలుగా విభజింప బడియుండెను. నిజాం రాజులు ఢిల్లీ సుల్తానులచే దక్కన్ సూబేదారులుగా నియమింప బడుచుండిరి. కాలక్రమమున వీరు ఆంగ్లేయుల సామంతులుగా వ్యవహరింపబడిరి. రాజ్య పాలనమున నిజాం నవాబు సర్వాధికారం కలిగి యుండెను. నిజాం నవాబుల అత్యంత ఆప్తులయిన బంధువులకు బహుమానముగా ఈయబడిన భూభాగమును "పాయగా" అనెడి వారు. ఈ పాయలగాలపై సర్వాధికారము పాయగా యజమానికే యుండెడిది. ఈ భూభాగముపై ఏలాంటి ఆదాయము ప్రభుత్వమునకు చెందకుండెను. సైన్యాన్ని సమీకరించి అవసర సమయంలో నిజాంకు సాయపడాలనే ఉద్దేశంతో పాయగాలు రాజ బంధువుల కీయబడినవి. కొంత భూభాగము జాగీర్దారీ వ్యవస్థయందు ఉండెడిది. రాజులకు విశ్వాసపాత్రులయిన లేదా నచ్చిన వారలకు కొంత భూభాగమును ఇచ్చెడివారు. ఆ భూభాగముపై సంవత్సర మున కింత భరణమును జాగీర్దారులు ప్రభుత్వమునకు చెల్లించెడివారు. నిజాం రాజ్యమున కొన్ని సంస్థాన ములుండెను. సంస్థానాధిపతులు నిజాం రాజ్యమునకు సామంతులవలె వ్యవహరించుచుండిరి. వీరు కాక దేశ్‌ముఖ్, దేశ్‌పాండే వంటి అధికారములు కొన్ని ఉండెను. వీరికి కొన్ని వందల ఎకరముల భూములు ఉండెడివి.

పాయగా, జాగీర్, సంస్థానాధిపతుల పరిపాలనలు, పన్నుల వసూళ్ళు వారి స్వతంత్రాధీనములో నుండెడివి.

హైద్రాబాదు నగరమున ప్రాబల్యము అధికారము గలవారికి గౌరవముండెను. తాహుద్దరీ సరబస్తా పద్ధతులలో భూమిశిస్తు వసూళ్ళు అప్పగించ బడుచుండెను. సూబాకొక సూబేదారు, జిల్లాకొక తాలుక్దార్లు అధికారులుగా నుండిరి. ప్రతి జిల్లాలో కొన్ని తాలూకాలు ఉండెను.

1905 కు పూర్వం మెదకు జిల్లాలో

1.మెదక్ 2.రామాయంపేట 3. కల్పగూరు 4.టేకుమల్ల 5. అందోలు తాలుకాలు ఉండేవి.

1905లో జరిగిన జిల్లాల పునర్నిర్మాణములో కొన్ని మార్పులు చోటు చేసుకొని కల్పగూరు (సంగారెడ్డి) 2.భగత్ 3. సిద్దిపేట 4. అందోలు 5. మెదక్ తాలూకాలు ఆవిర్భవించాయి. కొంతకాలానికి సిద్దిపేట, నర్సాపూర్, గజ్వెల్ తాలూకాలు ఏర్పడినవి. 1931 నాటికి ఎల్లారెడ్డి తాలూకా మెదక్ జిల్లాలో విలీనమయింది.

తాలూకాకొక తహసీల్దారు అధికారిగా నియమింపబడుచుండెను. ఇతనికి రెవెన్యూ న్యాయ విచారణాధికారములు ఈయబడెను. ప్రతి తాలూకాలో ప్రభుత్వ ఆర్థిక వ్యయములకై ట్రెజరీలు నెలకొల్పబడెను.

భూమిశిస్తు అమల్దారి పద్ధతి ఏర్పాటయినది. జమాబందీ పద్ధతి ప్రవేశపెట్టబడినది. వ్యవసాయేతర భూములపై శిస్తు తగ్గింపబడి రైత్వారీ పద్ధతి అమలు లోనికి వచ్చినది. భూమి సర్వే చేయించబడి పదిగజముల నిడివిగల గొలుసుతో 3600 ల చదరపు గజముల విస్తీర్ణ విభాగములుగా ఏర్పరచబడినది. ఈ సర్వేకు గొలుసు క్రాసుకర్రలు ఉపయోగించిరి. భూవర్గీకరణ జరిపించి, మట్టివర్ణము, తేమ కలిగియుండు స్థితిననుసరించి శిస్తు విధింపబడెను.

1944 లో నిజాం ప్రభుత్వము హైదరాబాదు భగేలాల కంట్రాక్టు చట్టమును తెచ్చి వ్యవసాయదారుల వద్దనున్న జీతగాండ్రకు ( భగేలాలు, పాలెగాండ్రు, పాలేర్లు) రక్షణ కల్పించిరి. ఈ చట్టము ప్రకారము 12 సంవత్సరముల లోపు వయసున్న బాలురు వ్యవసాయపు భగేలాలుగా నియమింపరాదను నియమముండెను. కనీస వేతన చట్టము తేబడినది.

## శాంతి భద్రతలు

నిజాం రాజ్యమున పోలీస్ యంత్రాంగము రెవెన్యూ బోర్డు అధీనమునందుండి పని చేయుచుండెను. క్రీ.శ. 1884లో రక్షణ మంత్రిత్వ శాఖ ఏర్పడినది. 1885 లో నిజాం రాష్ట్ర ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు నియమిం పబడెను ఇతని . మొహత్మీమ్ అనెడివారు. మూడు జిల్లాలకొక నాయబ్ మొహత్మీమ్ నియమింపబడు చుండెను. మొహత్మీమ్ పదవిలో నియమింపబడిన కల్నల్ ఈ. యస్. బడ్ దస్తూరుల్ అమల్ జారీ చేయించి దుండగులు లొంగిపోవు వసతి కల్పించి శాంతియుత జీవనము గడుపునట్లు చేసెను.

1897 నుండి 1917 వరకు నిజాం రాజ్య ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసుగా హంకెన్ నియమింపబడి కొత్త సంస్కరణలను ప్రవేశపెట్టి ప్రజలకు ప్రశాంత వాతావరణమేర్పరచెను.

నిజాం రాజ్యమున పాయగావారు, జాగీర్దారులు, సంస్థానాధీశులు తమతమ అధికారాల పరధిలో పోలీసు శాఖల నేర్పరచుకొనిరి.

నిజాం ప్రభుత్వమున 1923 సంవత్సరములో రైల్వే పోలీసు శాఖ నియమింపబడెను. ప్రతి జిల్లాకొక కారాగారము ఏర్పాటు చేయబడెను.

## న్యాయము

నిజాం రాజ్యమున గ్రామాధికారులు పెద్దమనుషుల సహాయమున చిన్న చిన్న తగువులు పరిష్కరించుచుండిరి. వారి శక్తికి మించిన తగాదాలు సుబేదారులకు మునుసబుదారులకు పంపబడుచుండెను. నేరస్థులకు జుర్మానాలు శిక్షలు విధింపబడుచుండెను. శిక్షతీరు నేరస్థుల జాతి, మత, ఆచార ప్రయోజనములపై ఆధార పడియుండెడివి.

నిజాం రాజ్యమున 1885 లో న్యాయస్థానములు నెలకొల్పబడినవి. సివిల్ వ్యాజ్యములను పరిష్కరించుటకు మునుసబులు, నేర విచారణలకు మీర్ ఆగాలు నియమింపబడిరి. వీరు పరిష్కరించు నేరములన్నియు అదాలత్ ఫౌజ్‌దారీ బల్దాకు లోబడియుండెడివి.

క్రీ.శ. 1912లో రెవెన్యూ అధికారులకుండిన సివిల్ న్యాయతగవుల పరిష్కారవములు న్యాయస్థానములకు అప్పచెప్పబడినవి. క్రీ.శ. 1914లో అప్పీళ్ళ పరిశీలనకు న్యాయసంఘము ఏర్పాటయినది. న్యాయసంఘ సూచన మేరకు నిజాం ప్రభువు అంతిమ తీర్పు నిచ్చుచుండెను. అంతకు ముందున్న జాగీరు న్యాయస్థానములు హైకోర్టు పరిధిలోనికి తేబడినవి.

క్రీ.శ. 1927లో నిజాం ప్రభువుకు గల న్యాయాధికారము హైకోర్టు పరముగావింపబడినట్లు పర్మానా వెలువడినది.

క్రీ.శ. 1933లో న్యాయస్థానములను పర్యవేక్షించు అధికారము హైకోర్టు న్యాయమూర్తికి ఈయబడినది.

## విద్య

ఆసఫ్‌జాహి వంశీయులలో మహబూబలీ ఉస్మానలీ పాదుషాల కాలమున ఉరుదూ, అరబీ, పారశీ భాషలకు ఆదరణము హెచ్చుగా నుండెను. ఉర్దూ అధికార భాషగా ప్రకటింపబడెను.

19వ శతాబ్ది ఉత్తరార్థమున నిజాం రాజ్యమున విద్యావ్యాప్తికి చర్యలు గైకొనబడినవి. నిజాం రాజ్య ప్రధానమంత్రిగా నున్న మొదటి సాలార్జంగ్ బహద్దూర్ హైదరాబాద్‌లో దారుల్ ఉలూం అను విద్యాలయమును నెలకొల్పెను. కొంత కాలం తరువాత ప్రతి జిల్లా, తాలూకా కేంద్రములందు పారశీ, ఉర్దూ మాధ్యమము యిన పాఠశాలలు నెలకొల్పబడినవి.

1917లో విద్యాశాఖను ఏర్పరచి దానికొక ప్రత్యేక కార్యదర్శిని నియమించుట జరిగినది. పర్షియా భాషకు బదుల్లు పాఠశాలలో ఉర్దూ భాష ప్రవేశపెట్టబడినది. నిజాం రాష్ట్ర విద్యా విషయక సలహాదారుగా ఏ.టి. మేహ్యూ ఆంగ్లబోధన భాషగా ఒక విశ్వవిద్యాలయమును స్థాపించు ఆవశ్యకతను నిజాం నవాబుకు సూచించెను. కానీ నిజాం ప్రభుత్వం అతని సలహాను పాటించక 1918లో ఉర్దూ బోధన భాషగా ఉస్మానియా విశ్వ విద్యాలయము నెలకొల్పెను. 1911 నాటికి స్త్రీవిద్య కొరకై బాలికల పాఠశాలలు స్థాపించబడెను హిందువులలో బాల్యవివాహము, ముస్లింలలో ఘోషాపద్ధతి బాలికల విద్యాభ్యాసము నకు అవరోధముగా నుండెను.

ఈ విధముగా ఆసఫ్ జాహీ రాజులు తమ భాషాభిమానము చేతనైనను విద్యాభివృద్ధికి కొంత పాటుపడిరని చెప్పవచ్చును. కానీ రాజ్యములో నున్న తెలుగు, కన్నడ, మరాఠీ మాతృ భాషలుగా కలిగిన హిందువులకు మాతృభాష బోధనలో ప్రభుత్వ పరముగా ఒక పాఠశాలయైనను నెల కొల్పబడలేదు. ఆసఫ్‌జాహీ రాజులకు వారి మతము వారి భాష అనిన ప్రేమమెండు.

ఈ పరిస్థితులలో ఆంధ్రజన సంఘము, ఆంధ్ర మహాసభలు ఆంధ్ర సారస్వత పరిషత్తును స్థాపించి తెలుగు విద్యా వ్యాప్తికి మారుమూల పల్లెలలో సైతము ప్రయత్నించెను.

## వైద్యము :

నిజాం రాజ్యమున 1844లో వైద్యశాఖ నెలకొల్పబడినది. ఈ శాఖలో మొదట రెసిడెన్సు సర్జన్ జ్వర చికిత్సకై నియమింపబడెను. జ్వర చికిత్సకు మాత్రం వైద్యశాలలు స్థాపించబడినవి. రాజ్యమున దస్తూరుల్ అమల్ క్రింద రూపాయికి అణాచొప్పున వసూలు చేసి అందు ఒక పైసా వాటా ధనము వైద్య శాఖకు అందించబడినది. ఆ తర్వాత రూపాయికు 2 పైసలు వైద్యసెస్సు వసూలు చేసి వైద్యశాఖ ఖాతాకు జమచేయబడుచుండెను, ఆ కాలమున మశూచి, కలరా, ప్లేగు వ్యాధులన్నింటికి వ్యాధి నిరోధక టీకాలు వేయించబడెను. 1913 నాటికి సంచార చికిత్సాలయాలు రాజ్యమంతటా నెలకొల్పబడినవి. 1938 లో ఆయుర్వేద వైద్య విధానము పునర్వ్యవస్థీకరించబడి దేశీయ వైద్య విధానమునకు ప్రోత్సాహము లభించినది. 1940 నాటికి మారుమూల గ్రామంలో వైద్యము చేయు వైద్యులకు పరీక్షలు నిర్వహించి ఉత్తీర్ణులయిన వారికి యోగ్యతా పత్రములిచ్చి వైద్య చికిత్సలు అందరకీ అందుబాటులో ఉండునట్లు చేయబడినది. మలేరియా వ్యాధి నిర్మూలనకు చర్యలుగైకొనబడినవి. నిజాం రాజ్యమున కుష్టువ్యాధి సోకిన వారి సంఖ్య అపరిమితము గా నుండెను. కుష్టురోగులను గుర్తించి రోగ నివారణకు కేంద్రములు నెల కొల్పబడినవి. కుష్టువ్యాధి మహమ్మారి వ్యాధిగా వ్యాపించినది. దాని నివారణమునకై ప్రత్యేక ఆరోగ్య కేంద్రములు ఏర్పాటయినవి.

మెదకు జిల్లాలో మెదకు, సంగారెడ్డి, పట్టణములలో వైద్య శాలలు నెలకొల్పబడినవి.

## ఆర్థిక పరిస్థితులు :

ఆసఫ్ జాహీల పరిపాలనా కాలమున రాజ కోశాగారము ఎప్పుడు కూడా సంపూర్ణముగా లేదు. ఆర్థిక స్థితిని చక్కబరుచుకొనుటకు నిజామలీఖాన్ అఫ్జలు ద్దౌలా, నాసిరుద్దౌలాలు బ్రిటిష్ వారి వద్ద ఎన్నోమార్లు అప్పులు చేసిరి. అప్పులిచ్చిన ఆంగ్లేయులు నిజాం రాజ్యమున ఆధిపత్యమును చలాయించు చుండిరి. అఫ్జలుద్దౌలా ఆంగ్లేయులకు మంచి స్నేహితునిగా, ఆత్మీయునిగా, నమ్మిన బంటుగా మారెను. మహబూబలీ ఖాన్ పాలనా కాలమున రాజ్యమున సంభవించిన కరవు కాటకములను అధికమించుటకు ఆంగ్లేయ ప్రభుత్వము రెండు కోట్ల రూపాయలను అప్పుగా నిచ్చెను. అప్పటి గవర్నర్ జనరల్ లార్డ్ కర్జను నిజాం రాజ్య ఆర్థిక పరిస్థితిని మెరుగు పరుచు పథకములను రూపొందించి అమలు పరుచుటకు ఆర్థిక కార్యదర్శిగా జి.సి. దివాకర్ గారిని నియమించెను. అతడు నిజాం రాజ్య ఆర్థిక స్థితిగతులను గమనించి పొదుపు చర్యలను సూచించెను. ఈ విధంగా ఆర్థిక సంక్షోభంలో కూరుకు పోయిన ఆసఫ్జా రాజ్యము 7వ ఉస్మానలీఖాన్ కాలమున రాజ భాండాగారము రాజ సంపత్తులతో నింపబడెను. ఉస్మానలీఖాన్ పరిపాలనా కాలమునాటికి గ్రామసీమల్లో వడ్డీ వ్యాపారులు వ్యవసాయదారునకు ఋణములిచ్చి ఎక్కువ వడ్డీలు వసూలు చేయుటయే కాక వారిపై అధికారము చలాయించుచు వారు పండించిన పంటలను తమ ఇష్టం వచ్చిన ధరలకు కొనెడివారు. రైతులు అధిక మొత్తపు వడ్డీలతో నున్న ఋణములను తీర్చలేక భూములను ఆస్తులను విక్రయించుకొను పరిస్థితులు ఏర్పడుచుండెను.

## సహకారము :

1914 లో ఉస్మానలీఖాన్ ప్రభుత్వము సహకారోద్యమమునకు ఒక చట్టమును రూపొందించినది. తద్వారా సహకార రంగములను స్థాపించి రైతులకు తక్కువ వడ్డీకి ఋణ సౌకర్యములేర్పరుటుటకు తగిన చర్యలుగైకొనబడినవి. నైజాం రాజ్యమున హైదరాబాద్‌లో హైదరాబాద్ స్టేట్ బ్యాంక్ ఏర్పడి కొన్ని ముఖ్య పట్టణములలో శాఖలు ఏర్పరచబడినవి.

వ్యవసాయమును చేయురైతులకు స్వల్ప, దీర్ఘకాలిక ఋణ సౌకర్యము కల్పించుటకై భూమి తనఖా బ్యాంకులు నెలకొల్పబడినవి.

స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ పట్టణ ప్రాంతమందున్న వర్తకులకు వ్యాపారులకు జీతభత్యములు పొందు ఉద్యోగులకు ఇతర నిర్ధారిత ఆదాయము కలవారికి తక్కువ వడ్డీపై ఋణ సౌకర్యము కలిగించినది.

వ్యక్తిగత హామీల పైననం, నగల పైలనూ, స్థిరాస్తులపైననూ, వ్యవసాయ పారిశ్రామిక ఉత్పత్తుల పైననూ ఋణ సౌకర్యము కల్పించబడుచుండెను.

**ద్రవ్యము :**

నిజాం రాజ్యమున మొదట ప్రభుత్వేతర టంకశాల నుండెను. వీటిలో తయారగు నాణెముల విలువలలో తేడాలుండెడివి. నాసీరుద్దీన్ ఈ టంకశాలను మూసివేయించి, ప్రభుత్వ టంకశాలను ఒక దానిని స్థాపించెను ప్రజలు తమవద్దనున్న వెండిబంగారములతో టంకశాలకు గొంపోయి నిర్ణీత శుల్కకముతో నాణెములను సిద్ధము చేయించు కొనుచుండిరి. ఇవన్నియు గందరగోళ స్థితిని కలిగించినవి.

క్రీ.శ. 1904 లో చార్మినార్ ముద్రగల నాణెములు అమలులోనికి వచ్చిన తర్వాత ఒక స్థిర రూపమేర్పడినది. వీటిని మహబూబియా సిక్కాయనెడివారు. క్రీ.శ. 1919లో ఉస్మానియా సిక్కా డుకలోనికి వచ్చి బ్రిటిష్ వారి నాణెముల మార్పిడిలో ఇబ్బందులు తొలగింపబడినవి. ఈ ఉస్మానియా సిక్కా 1956 వరకు అమల్లో నుండెను.

క్రీ.శ. 1918 లో హైదరాబాద్ పేపర్ కరెన్సీ చట్టము అమలులోనికి వచ్చి నోట్లను ముద్రించుటకు ఒక ప్రత్యేక విభాగము ఏర్పరచబడినది. మొదట 10-100 విలువగల నోట్ల ముద్రింపబడి ఆ తరువాత 5-1 రూపాయి విలువ గలిగిన నోట్లు ప్రభుత్వముచే ముద్రింపబడినవి. రూపాయి, ఆఠాణ, చారాణా, దొవ్వానా, ఏకాణా, ఆదాణా, పైసా నాణములు టంకశాలలో ముద్రింపబడి లావాదేవిలగు చుండెను.

నిజాం నాణములను 'హాలీ' యని బ్రిటిష్ ఇండియా నాణములను కల్దారు అని వ్యవహరించుచుండిరి. హాలీ సిక్కా 1 రూ. కి 96 పైసలు, కల్దారు రూ.1 కి 64 పైసలు మారకపు రేటుగా నుండెను. కొలమానము ఒక నిశ్చితికి వచ్చినది.

| | | |
|---|---|---|
| **84 రూపాయల బరువు** | = | **ఒక శేరు** |
| **40 శేర్లు** | = | **ఒక మణుగు** |
| **మూడు అడుగులు** | = | **ఒక గజము** |
| **11 X 11 గజములు** | = | **ఒక గుంట** |
| | | **(121 గజములు)** |

**40 గుంటలు = ఒకర ఎకరము**

భూమి కొలతలు నిర్వహించు చుండిరి. గజము, ఫర్లాంగు, మైలు కొలమానములుగా నుండెను.

**మతము – ఆచారము:**

నైజాం రాజ్యమున హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు యుండిరి. వీరేకాక బౌద్ధ, జైన, సిక్కు మతానుయాయులు కూడా నివసించు చుండిరి. హిందువులలో బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను, చాతుర్వర్ణ్యములుండెను. అట్లే ఇతర మతములందును కూడా శాఖా భేదములుండెను.

దేవాలయములందు నిత్య పూజలు ధూప, దీప, నైవేద్యాలు సక్రమ పద్ధతిలో జరుపబడుచుండెను. దేవాలయములకు అగ్రహారములు, భూములు ఉండెను. ఆలయంలో పూజారులకు ప్రత్యేక క్షేత్రములుండెను. దేవల్ ఇనాం ఖిద్మతీ ఇనాం అని రెండు విధములుగా ఇనాం భూములుండెను. ఆలయ పూజారులకు ఆలయమునకు సేవచేయు ఇతరులకు కూడా ఇనాం భూములుండెడివి. పర్వ దినములలో ఆలయములందు ప్రత్యేక పూజలు, సేవాది కార్యక్రమములు నిర్వహింప బడుచుండెను. సంవత్సరమునకొక మారు బ్రహ్మోత్సవములు జరుగుచుండెను. ఈ బ్రహ్మోత్సవములలో వివిధములయిన వాహన ములపై ఉత్సవ విగ్రహముల నుంచి ఊరేగింప జేయువారు. బ్రహ్మోత్సవపు చివరి దినమున రథోత్సవము జరుపు చుండిరి. ఈ ఏడు దినములు జాతరలు సాగుచుండెను. చుట్టు ప్రక్కల గ్రామముల వారే కాక దూరదూరమునుండి ప్రజలు తండోపతండములుగా జాతరలలో పాల్గొనుచుండిరి.

మెదకు జిల్లాలో ప్రముఖముగా చెప్పుకొన దగిన జాతరల్లో ఏడుపాయల దుర్గాభవాని జాతర, నాచారం నరసింహస్వామి జాతర, జగదేవ్ పూర్ మండలంలోని నర్సాపూర్ కొండపోచమ్మ జాతర, బొంతపల్లి వీరభద్రస్వామి జాతర ప్రసిద్ధమయినవి ఇవే కాక జిల్లాలో చిన్న చిన్న జాతర లెన్నియో కలవు.

ప్రతి గ్రామమునందు గ్రామదేవతలగు పోతరాజు, కట్టమైసమ్మ కోటమైసమ్మ, ముత్యాలమ్మ, పోచమ్మ, దుర్గమ్మ మొదలగు దేవతలనారాధించుచు జంతువులను బలి ఇచ్చుచు బోనాలు తీయుచు కానుకలర్పించుట కన్పించును. ప్రతి గ్రామమున బొడ్రాయి ప్రతిష్ఠింపబడి యుండెడిది. సిగాలూగుట వంటి మూఢ భక్తి గ్రామములందు కనిపించేది. చేతబడి మొదలగు మూఢనమ్మకములు తన్నివారణార్థము మంత్రగాండ్రు భూత, ప్రేత, పిశాచ గణములకు బలులిచ్చుట ప్రబలియుండెను.

బాల్య వివాహములు, విడాకులు, కులమువెలి అంటరానితనము బానిసత్వము వంటి సాంఘిక దురాచారములు సర్వత్ర వ్యాపించి యుండెడివి. దసరా సంక్రాంతి, హోళి, ఉగాది, బతుకమ్మ పండుగ వంటి పండుగలు, కొత్తపెట్టుకొనుట, చెట్ల క్రిందికి పోవుట, పెద్దలకు బియ్యమిచ్చుట వంటి ఆచారములు సంప్రదాయానుసారము నిర్వహించ బడుచుండెను. ధనాఢ్యులు యజ్ఞ యాగాదులను సప్తాహములను నిర్వహించుచు బ్రాహ్మణ సంతర్పణలు బీదల కన్నదానములు చేయుచుండిరి. అధిక సంఖ్యలో ప్రజలు పాల్గొను ఏ కార్యక్రమముకైనా ముందుగా ప్రభుత్వామోదం పొందవలసి యుండెను. మత సంబందములైన ఉత్సవములు నిర్వహించుటకు అనుమతి సులభముగా లభించెడిది.

ఆసఫ్ జాహీల పరిపాలనలో 20వ శతాబ్దపు తొలి రోజుల వరకు హిందూ మహమ్మదీయ మత వైషమ్యము లేక అన్న దమ్ములవలె జీవించిరి.

పీర్ల పండుగలో హిందువులు దూలా ఆడుట పీర్లనెత్తుకొని ఊరేగుట మొదలగునవి ముస్లింలతో పాటు ఆచరించుచుండిరి.

ఉస్మానలీ ఖాన్ పాలనా చివరి దినములలో మహమ్మదీయ మత ఛాందసుల బోధనలచేతను. కాశిం రజ్వీ అను మతోన్మాది చూపిన ఆశల చేతను, ముఖ్యముగా స్వతంత్రానంతరం హైదరాబాద్ రాజ్యము శాశ్వతముగా స్వతంత్ర్యముగా నుండవలెనను గొంతెమ్మ కోరికచేతను, ఇస్లాం మతానుయాయుల్లో స్వార్థచింతన ప్రబలినది. ఉస్మానలీఖాన్ మత ఛాందస వాదమునకు వంత పాడినాడు. మసీదుల ముందు హిందువుల వాహన సేవాదులు వెళ్ళునప్పుడు వైవాహికాది శుభకార్యము లందును, చివరకు శవ యాత్రా సమయమునందును చేయు చప్పుళ్లను (డప్పుచప్పుడులను) నిషేధించిరి. అంతేకాక నమాజు వేళలలో దేవాలయములందు గంటలు కొట్టుట, శంఖములూదుట నిషేదింపబడినది. హిందువులను చిన్న చూపు చూచుట, అవమాన మొనర్చుట మహమ్మదీయు లకు పరిపాటియైనది. పల్లెపట్టుల్లో ప్రజలకు వివిధముల యిన వినోదములు రకరకము లయిన ఆటలు ఉండెను. బాగోతులు, చిరుతులు-వేయుట, నాటకములు, బుర్రకథలు, తోలు బొమ్మలాట, సర్కస్‌లను ప్రజలు ఉత్సాహములతో చూచుచుండిరి. బాలబాలికలు ఓమనగుంటలాట, కచ్చకాయలాట, బొడ్డెమ్మ ఆట, బొమ్మరిల్లాట, పుంజీతము చెడుగుడు, కోచికొమ్మచ్చి చిర్రగోనె, బొంగరాలాట, మొదలగునవి ఆడుచుండిరి. అట్టాచెమ్మ, పచ్చీసు ఆటలు మహమ్మదీయులతో అవతరించి యుండవచ్చును. ఆ ఆటల పేర్లే కాక దస్, పచ్చీస్, అట్ఠా, చవ్వా, తిగ్గీ, దుగ్గీ, త్రీష్ మొదలయిన శబ్దములు కూడా ఉర్దూ భాశలోనే పలుకుబడుచున్నవి. వీటికి ఎచ్చట కూడ తెలుగు పలుకు బడులు లేవు.

గ్రామములలో సాధనాశూరులు, గారడివారు, సాహసోపేతమయిన ప్రదర్శనలిచ్చుచు ప్రజలకు వినోదములు కలిగించుచుండిరి. పల్లెల యందు ప్రదర్శనలనొసంగు వారు ముందుగా గ్రామాధికారుల అనుమతి పొందవలసి యుండెను.

ఈ విధముగా ఆసఫ్ జాహీ నవాబులు సుమారు 200ల సంవత్సరములు ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర ప్రాంతముల ఏకచ్ఛత్రాధి పత్యముగా పాలించి మతసామరస్యముతో సర్వమతముల సమానముగా చూచి ప్రజోపయోగ కరమైన కార్యక్రమములను ఒనరించిరి.

చక్కని చరిత్రను సాధించిన నిజాం నవాబులలో చిట్టచివరకు పాలించిన నవాబు స్వార్థ పరుడుగా మత ఛాందసుడు గా చరిత్రలో చెరిగిపోని అపకీర్తిని కోరి తెచ్చుకొనెను.

# అందోలు రాజులు

కాకతీయ సామ్రాజ్యమున మెదకు జిల్లాయంతయు అంతర్భాగమై యుండెను. కాకతీయ సామ్రాజ్య పతనానంతరం 10-15 సంవత్సరములు మాత్రం ఢిల్లీ సుల్తానుల ఏలుబడిలో అల్లకల్లోలమై నాయకత్వము లేక పరిపాలనమనునది లేక దోపిడి దొంగల స్వైర విహారము సాగినది. ఆ సమయమున తురుష్క సేనానాయకులు హిందూజాతిపై, హిందూదేవాలయములపై జరిపిన భీభత్స మారణకాండను గని ముసూరి కాపయ నాయకుడు, పద్మనాయక ప్రభువులు ఏకమై గొప్ప సైన్యమును సిద్ధము చేసుకొని ఓరుగల్లు సామ్రాజ్యము నుండి మహమ్మదీయ సైన్యమును ప్రారద్రోలి హైందవ రాజ్యమును స్థాపించిరి.

పద్మనాయక రాజ్యాంతర్భాగమున మెతుకు సీమ మొత్తము పరిపాలింపబడెను. ఈ విషయములన్నియు చారిత్రక సత్యములు. పద్మనాయక రాజ్యమును బహమనీ సుల్తానులు నాశనమొనర్చిరి. తమరాజ్యమున కలుపుకొనిరి.

బహమనీ రాజ్యము 5 ముస్లిం రాజ్యములుగా విభజింపబడినది.

1. అహమ్మద్ నగర్ 2. బీజాపూర్
3. గోలకొండ 4. బీరారు
5. బీదరు

ముఖ్యపట్టణములుగా సామ్రాజ్యము మొత్తము 5 భాగములుగా విభజింపబడినది.

పద్మనాయకుల కడనో, ముసునూరి వంశంవారి కడనో, కాకతీయుల కడనో రాజోద్యోగము చేసిన వంశము నుండి రామినేడు వలసవచ్చి బహమనీ సుల్తానుల పూర్వ పరిచయమును పురస్కరించుకొని వారి రాజ్యాంతర్గతముగా నున్న కల్పగూరు ప్రాంతమును పొంది యుండెను.

రామినేడు కల్పగూరు ప్రాంతమును పొందిన కాలము పద్మనాయక రాజ్యము అంతమయిన తొలి రోజులు కావొచ్చునని ఊహించవచ్చును అనగా సుమారు 1400 నుండి 1450.

## రామినేడు

కాపుజాతి తెగలలో పాకనాటికాపు తెగకు చెందిన మునికోల గోత్రుడైన రామినేడు ఈ రాజ్యమునకు మూల పురుషుడు. ఇతనికి మనుసాని, అక్కసాని అను ఇరువురు భార్యలుండిరి. మాచిరెడ్డియను ఒక సోదరుడుండెను.

రామినేడు బహమనీ సుల్తానయిన ఫెరోజ్షా నుండి కల్పగూరు పరగణాను పొందెను. కల్పగూరు పరగణా మొత్తము నిర్జనమైనది బీడు భూములు గానున్నది. అంతేగాక ఆ ప్రాంతమున వ్యవసాయోగ్యము లైన భూములు లేవు.

కావున సేద్యమొనర్చుటకు అనువయిన తటాకములు, గ్రామములు నిర్మించుట ప్రథమ కర్తవ్యముగా భావించెను. అనుకూలవములైన క్షేత్రములన న్వేషించుచు మంజీరా నదీ తీరమునకు చేరువనున్న హరిజన కర్మాగారమగు "లందల" గల ప్రదేశమునకు వచ్చెను. అచ్చట చర్మములు కర చేయుటయు, తోలుతో వ్యవసాయపు పనిముట్లయిన తొండములు, బ్యారెండ్లు, చెప్పులు కుట్టి జీవనము గడపుకొను హరిజన కుటుంబవములుండెను. రామినేడు ఆ ప్రాంతమంతయు గాంచి వ్యవసాయయోగ్యమునకు అనువయిన ప్రదేశమని యెంచి హరిజనులను చేరదీసి వారి సహాయమునుచే అచ్చటనొక గ్రామమును విశాలమగు తటాకమును నెలకొల్పెను. లందల అను పేరు అందల -అందవోలు-అందోలుగా పరిణతి చెందినది. సుక్షేత్రములయిన ఆ ప్రాంతమున వ్యవసాయ మునభివృద్ధిలోనికి తెచ్చి క్రమక్రమముగా గ్రామాభివృద్ధి గావించెను. కొంత కాలము తరువాత గ్రామ దక్షిణ దిశకు గుట్టపై తన ఇష్టదైవమగు శ్రీ వేంకటేశ్వరాలయమును నిర్మించెను. సమీపమున ఏర్పరచిన తటాకమునకు తిరుమలనాథుని చెరువు అని పేరిడెను. తనకు సాయమొనర్చిన హరిజనులకే కాక ఎంతో మంది బీదసాదలకు భూములొసగి జీవనోపాధి కల్పించెను.

కొంత కాలమునకు రామినేడుకు ముసలారెడ్డి పోతిరెడ్డి అని ఇరువురు కుమారులు జన్మించిరి. మాచినేడుకు బుస్సారెడ్డి. అనంతారెడ్డి, అంకారెడ్డి అను ముప్పురు కుమారులు కలిగిరి.

రామినేడు తమ్ముడయిన మాచినేని చేయూతతో అందోలు పెదతాటి పల్లి, అనంతసాగరములను పెద్ద తటాకములను నిర్మించెను.

పెద్ద కుమారుడయిన ముసలారెడ్డికి కల్పగూరు. అందోలు గ్రామాధిపత్యమును చిన్న కుమారుడయిన పోతిరెడ్డికి పెద్ద తాటిపల్లి గ్రామాధిపత్యమొసంగెను.

రామినేడు ఆరంభదశలో కల్పగూరులో నుండి అనంతరము మంజీరా నది పరిఖాకృతిగా గల అందోలు గ్రామమునే రాజధానిగా చేసుకొని పరిపాలన చేసెను.

ఇతడు 1400 నుండి 1450 మధ్య కాలం వాడని చారిత్రికులు నిర్ణయించిరి.

## ముసలారెడ్డి

రామినేడు అనంతరము జ్యేష్ఠ పుత్రుడగు ముసలారెడ్డి యాజమాన్యమును స్వీకరించి కార్యదీక్షాధురంధరుడై తండ్రి సంపాదించిన భూభాగమును సేద్యోపయోగ్యము కావించుటకై గ్రామములు నిర్మించుట, చెరువులు త్రవ్వించుట ప్రథమ కర్తవ్యమని యెంచెను. పినతండ్రి అతని కుమారుల సహాయ సహకారములతో కర్తవ్యమును ప్రారంభించెను. పినతండ్రి పేర మాచిరెడ్డి పల్లి, తమ్ముని పేర పోతిరెడ్డి పల్లి, పినతండ్రి కుమారుడైన అనంతారెడ్డి పేర అనంతసాగరము అను గ్రామములను నిర్మించి వారలకు ఆయా గ్రామాధిపత్యముల నొసంగెను.

ఆయా గ్రామములలో నిరుపేదలకు జీవనోపాధి కల్పించి, అనేక భూములను సేద్యోపయోగమయిన సుక్షేత్రములుగా చేసి భూరి ధాన్యములను పండించెను ఇతనికి పెద్దారెడ్డి అను కుమారుడు కలిగెను.

ఈతని జీవిత కాలము క్రీ.శ. 1450-1491.

## పెద్దారెడ్డి

ముసలారెడ్డి యనంతరము కుమారుడైన పెద్దారెడ్డి అధికారమును చేపట్టెను. ఇతడు తండ్రితాతలకన్న యెక్కువైన ప్రజోపయోగ కార్యక్రమముల చేపట్టి పరిపాలనమున కూడా అశేష శేయుషీ దురంధరుడుగా కీర్తినందెను.

దేవాలయ, ఆరామ, తటాక, గ్రామ నిర్మాణములు సప్త సంతానములలో గణింపదగినవి. కావున పెద్దారెడ్డి వీటి నిర్మాణములో అతి శ్రద్ధవహించెను. తండ్రిగారైన, ముసలారెడ్డి పేర ముసలాపురమును, తనపేర పెద్దారెడ్డి పేట, శేరిపెద్దారెడ్డి పల్లె, వారివంశనామమున శేరిగూడెం గ్రామముల నిర్మించెను. వారి పూర్వీకుల జ్ఞాపక చిహ్నము కంసానిపల్లె, గ్రామమును నిర్మించి. ఆయా గ్రామములందు గొప్పతటాకముల త్రవ్వించెను.

ఈ గ్రామములన్నియు అందోలునకు దగ్గరలో గలవు ఈ విధముగా గ్రామ, తటాక నిర్మాణములు చేపట్టి పరిపాలనా భూభాగమున జనసంకీర్ణమునొనర్చి, భూములను సస్యశ్యామలమొనర్చుటలో పెద్దారెడ్డి ఆలోచన అనన్య సామాన్యము.

ఇతని కాలము 1491 నుండి 1515.

## అల్లమరెడ్డి చౌదరి

తండ్రియగు పెద్దారెడ్డి యనంతరము అల్లమరెడ్డి క్రీ.శ. 1515లో అధికారమును వహించెను.

ఈతడు బాల్యముననే సమస్త విద్యాబుద్ధులు బడసి యుద్ధ విద్యయందును, రాజనీతియందును ప్రవీణుడయ్యెను. ఈతనికి మన్సాని, పోసాని యను యిరువురు భార్యలుండిరి. ఇతనికి లక్ష్యభేదనమున అభిరుచిమెండు. ఈతని లక్ష్యచాతుర్యము గూర్చి కర్ణాకర్ణిగా గోలకొండ నవాబగు ఇబ్రహింకుతుబ్‌షాహివి ఈయని చాతుర్యమును చూడగోరి, విందుకై ఆహ్వానించెను. చార్‌మినార్ చిట్టచివర ఒక గిన్నె నుంచి దానిని భేదింపగోరెను. నవాబు కోరికచే అల్లమరెడ్డి అవలీలగా ఆగిన్నెను భేదించెను. నవాబు అద్భుతాశ్చర్యములతో అల్లమరెడ్డిని కౌగిలించుకొని స్నేహమొనరించెను.

అల్లమరెడ్డి తనపేర అల్లవేప్పట (అల్మాయపేట) అను గ్రామమును, భార్యలపేర పోసానిపల్లె, మనుసాని పల్లెయును గ్రామములు నిర్మించెను. పోసానిపల్లిని నేటికి ఖాసుబాగ్ పోసానిపల్లి యని ప్రజలువాడుకొందురు. ఈ గ్రామమున చక్కని కట్టడము గలిగిన 4 బావులు, ఫలవృక్షములతో గ్రామముచుట్టు దృఢమైన కోట గలదు.

అల్లమరెడ్డి తన యేలుబడిలో పరిపాలనా సౌలభ్యమునకై ఐదు గ్రామములు లేదా పది గ్రామములకు నొక చౌదరి అను అధికారిని నియమించెను.

తగవులను దీర్పనూర పెద్దలనునిల్పె అని ఈతడు వర్ణింపబడుటచే ఈతని పాలనా రాజ్యమున బ్రాహ్మణులలో సభాపతి, వైశ్యులలో పెదకోమటి, శూద్రులలో పెదబోయియని ప్రతి యూర పెద్దలను నియమించెను. వీరు కలహములు, జాతి వివరములు, పొలిమెర తీర్పులు మొదలగునవి పరిష్కరించు చుండిరి. ఇచ్చట పరిష్కారము కానివి చౌదరి పరిష్కరించు వాడు. అల్లమరెడ్డి పన్నులు వసూలు చేయుటకు సంకరి, దడవాయి అను వారిని నియమించెను. సుంకరి, సాలె, పటుకరి మొదలగు మగ్గములనేయు వారి పై మరియు యితర కుల వృత్తులపై వేయు పన్నులు వసూలు చేయు చుండెను.

గ్రామభద్రతకు భటులనునియమించి వారికి భటవృత్తి మాన్యముల నిచ్చెను. ప్రతి గ్రామమునకు కావలి వారు, మన్నెవారు, మంగలి, చాకలి, తలారి, బోగరి మొదలగు 12 రకముల పని వారు నియమించుచు వారందరికి మాన్యములనిచ్చెను.

అల్లమరెడ్డికి సంతానము లేదు. రామజోగియను సన్యాసి వర ప్రభావముచే ఈతని కొక కుమారుడు కలిగెను. రామ జోగిచే ఒక శివలింగమును గరుడాద్రి పై ప్రతిష్ఠింపజేసి ఆదేవునకు జోగి నాథుడను నామకరణ మొనర్చెను. అచ్చట ఒక గ్రామమును నిర్మించి దానికి జోగిపేటయని నామకరణ మొనర్చెను.

ఈ జోగినాధ స్వామి ఆలయనిత్య పూజా నైవేద్యములు సక్రమముగా జరుగునట్లు ఏర్పాట్లు గావించి ప్రతి సంవత్సరము చైత్ర శుద్ధ దశమి నాడు జోగినాధుని రథోత్సవము జరుపుటకు తగు నేర్పాట్లు గావించెను.

## రామారెడ్డి చౌదరి

అల్లమరెడ్డి చౌదరి యనంతరము అతని ఏకైక కుమారుడు రామారెడ్డి చౌదరి పరిపాలనమును హస్తగతము చేసికొనెను.

రామజోగి కరుణా వరప్రసాదుడైన రామారెడ్డి పరమశివ భక్తుడై నిత్యత్రి కాలశివ పూజాదురంధరుడై యుండెను. తన పాలనలోని భూభాగమును అభివృద్ధి యొనర్చుచు ప్రజలను కన్న బిడ్డలవలె చూచుచుండెను.

రామారెడ్డికి సాంబవ్వయును, కుమార్తె సదాశివరెడ్డి యనుకుమారుడును కలిగిరి.

ఈతడు 1595 - 1632 వరకు పాలించెను.

## సదాశివరెడ్డి

రామారెడ్డి మరణానంతరము సదాశివ రెడ్డి పాలనా బాధ్యతల స్వీకరించెను.

ఇతడు దైవ, బ్రాహ్మణ భక్తి గల వాడు. రాజనీతి కుశలుడు. వంశ పరంపరాగతముగా వచ్చిన రాజ్యమును చక్కగా పాలించుచు ధర్మప్రభువని కీర్తి నందెను.

ఈతనికి లింగాంబ యను కుమార్తె గలదు. ఈమెను శింగారారం గ్రామమునివాసియగు నరసింహారెడ్డికి ఇచ్చి వివాహము చేసి ఇల్లరికము నుంచుకొనెను.

సదాశివరెడ్డి తన పుర్వీకుల పేర శౌరి పెద్దారెడ్డి గూడెం గ్రామమునునిర్మించెను.

ఈతడు క్రీ.శ. 1650 స్వర్గస్థుడయ్యెను.

## పెద్దనర్సింహా రెడ్డి

సదాశివరెడ్డి యనంతరము అతని కుమార్తె లింగాంబ భర్తయగు పెద్దనర్సింహా రెడ్డి క్రీ.శ. 1650లో రాజ్యభారము వహించెను.

నర్సింహారెడ్డి శింగూరారు గ్రామమున ఒక పేదరైతునకు జన్మించెను. ఇల్లరికముగా వచ్చుటచే రాజ్యపాలనము చేయు నధికారమబ్బినది. ఇతడు గొప్ప రాజ్యనీతి కుశలుడు, అద్వితీయ ప్రతిభాశాలి, సర్వమత సామరస్యమునకై పాటుపడెను.

అకాలము దేశమున తురుష్కులు ప్రబలురై యుండిరి. పెద్దనర్సింహా రెడ్డి భవిష్యత్తు నూహించి సిద్దిబిలాలుడను తురుష్క యువకుని గొనిదెచ్చి సర్వసైన్యాధి పత్యము నొసంగెను.

సిద్దిబిలాలు దృఢకాయుడు, స్వామి భక్తి పరాయణుడు, ధైర్యసాహసములు గల్గిన కార్యదక్షుడు.

ఆ సమయమున దక్కను పీఠభూములపై దండయాత్రలు సల్పుచు ఔరంగజేబు ఈ ప్రాంతమునకు వచ్చెను. ఔరంగజేబు సేన్యాధి పతి ద్వారా తెలిసినది.

నర్సింహారెడ్డి తన సైన్యాధిపతియగు సిద్ది బిలాలును తోలుకొని ఔరంగజేబును కలిసెను. అనేక దేవాలయములు గూల్చివసీదులుగా మార్చిన ఔరంగజేబు మతదురాభిమానములకలవాడు. కాని నర్సింహారెడ్డి విషయమున తద్భిన్నముగా జరిగెను.

ఔరంగజేబు, నర్సింహారెడ్డికి వెంతుకు సర్కారు అను బిరుదమిచ్చి రాజ గౌరవ భూషణాదులను 700 (ఏడువందల) గ్రామములుగల విశాల రాజ్యమునకు సర్వాధిపత్యమును ప్రసాదించి తనకు విధేయుడుగా, సామంతుడుగా నుండునట్లు గావించెను.

పెద్దనర్సింహారెడ్డి పరిపాలనావ్యవహారమున కొత్త మార్గమవలింబించెను. పరిపాలనా సౌలభ్యమునకై రాష్ట్రమును, 18 (పదునెనిమిది) పరగణాలుగను, 14 పాళీలుగను, 35 మొగసాలలుగను విభజించెను.

వీటిపై మరియొక రాజప్రతినిధి కార్యాలయమును ఏర్పాటుజేసెను. ఓరుగల్లు (వరంగల్) సర్కారు, రామగిరిసర్కారు, మొలంగూరు సర్కారు, స్థంబాద్రి సర్కారులలో రాజప్రతినిధులను నియమించెను. వీటన్నింటికి(మెదకు) మెతుకు కేంద్ర ప్రభుత్వ కార్యాలయముగా నిర్ణయింపబడెను. దేశ పాండ్యాలు రైతుల నుండి పన్నులు వసూలు చేసి ప్రభుత్వమునకు చెల్లించుచుండిరి. మన్నెవార్, సర్ మన్నెవార్, నాడేగౌడ్, సర్ నాడేగౌడ్యను వారు దేశపాండ్యాల ఆజ్ఞానుబద్ధులై పన్ను వసూలులో తోడ్పడు చుండిరి. పన్నులు రెండు రకములు గానుండెను. నీరారంబము (మాగాణి) భూములకు ధాన్యరూపమున, కాడారంబము (మెట్ట) భూములకు ధనరూపమున, పన్నులువసూలు చేయబడుచుండెను. సుంకరులు, దడవాయులు ప్రభుత్వమునకు చెల్లించు పన్నుల ధాన్యమును కొలుచు వారుగా నుండిరి. ప్రజలలో ఈ రెండు విధముల పన్నులు చెల్లించుట అసమ్మతిగానుండెను. అంతేగాక కొలమానము యొక్క ప్రమాణము వివిధ ప్రాంతములలో వేరువేరుగా నుండెను. అందుచేత తన జేన చూపుడువేలు మరియు బొటన వ్రేలుల మధ్యదూరము =జిట్ట) తో నొక మానదండమేర్పరిచి తన్నిబంధన ప్రకారము మెట్ట, మాగాణి భూములన్నింటికి ధన రూపమున పన్ను చెల్లించుటకు శాసనము చేసెను. నర్సింహా రెడ్డి కురచవాడ గుట, అతని జేన కూడా కురు చదగుటచే భూవైశాల్యాను తగ్గి పన్నుల చెల్లింపులో వెనుకంజ వేసిరి. ప్రజారంజకుడైన పాలకుడగుటచే ప్రజల బాధలను తెలిసి కొని తన అంగుష్ఠ తర్జనీ మధ్య ప్రదేశమును భేదించి జానను బెంచి మరి యొక మానదండము నేర్పాటు చేసెను. ఈయన ధండము ప్రసిద్ధ దేవాలయ పురోభాగమున శిలతో నిర్మించి యుంచునట్లా జ్ఞాపించెను.

ఈ విధముగా తన శరీర భంగమును కూడా లెక్కించక ప్రజలమనోభీష్టము ప్రకారము పరిపాలన మొనర్చెను.

ఈతడు ప్రజోపయోగమునకై కొన్ని ముఖ్య గ్రామములకు బాటలు వేయించి అచ్చటచ్చట మార్గమధ్యమున బావుల ద్రవ్వించి ధర్మశాలలు నిర్మించెను. వ్యవసాయమే ప్రధానాదాయము కావున కొత్త పాతచెరువుల బాగు చేయించి వసతుల కల్పించెను. కొన్ని చెరువుల నిర్మించి నీటి వసతుల కల్పించెను. కొన్ని వైద్యశాలలు, చిన్న చిన్న బడులు ఏర్పాటుగా వించెను.

నర్సింహారెడ్డి తన ఆస్థానమున వేదవేదాంగ పారంగతులను, పండితులను, కళాకారులను చేరదీసి ఆశ్రయమిచ్చెను. కృష్ణమూర్తి శతకము, కపిలదేవ హూతి సంవాదము మొదలగు గ్రంధములు ఈయిన ఆస్థాన పండితులచే రచింపబడినట్లు తెలియచున్నది. కాని అవి ఇప్పుడు అలభ్యములు.

## నర్సింహారెడ్డి రాజ్యము

### రాజప్రతినిధి కార్యాలయములు

1. ఓరుగల్లు సర్కారు,
2. రామగిరి సర్కారు
3. మొలంగూరు సర్కారు
4. ఖంబాద్రి సర్కారు

### ప్రధాన స్థానములు

1. మెదకు సర్కారు
2. కౌలాసు సర్కారు
3. భువనగిరి సర్కారు
4. సన్గల్లు సర్కారు
5. మదులూరు సర్కారు
6. బికనూరు సర్కారు
7. మిర్జాపూర్ సర్కారు

### పరగణాలు

1. కల్వగూరు పర్గణ
2. విత్తటూరు పర్గణ
3. గజవెల్లి పర్గణ
4. మెతుకు పర్గణ
5. అడ్లూరు ఎల్లారెడ్డి పర్గణ
6. టేకుమాల పర్గణ
7. కోహీరు పర్గణ
8. హత్తినగరం పర్గణ
9. హన్నాబాదీ పర్గణ
10. మొలంగు పర్గణ
11. రామగిరి పర్గణ
12. ఖంబాద్రి పర్గణ
13. కోవెలకొండ పర్గణ
14. వేములకొండ పర్గణ
15. నస్కల్లు పర్గణ
16. తూపురాన్ పర్గణ
17. మోదులూరు పర్గణ
18. మనూరు పర్గణ
19. పట్లూరు పర్గణ
20. ఆలూరు పర్గణ
21. నర్సాపురం పర్గణ
22. ఇబ్రహీం పూర్ పర్గణ
23. మిర్జాపూర్ పర్గణ

### గౌరవపదవులు

1. మెతుకుసర్కార్
2. సర్‌దేశ్ పాండ్య
3. సర్ మన్నెవారి
4. సర్ నాడేగౌడ్
5. సర్ దేశాయి
6. రోషన్ చౌకి
7. బిక్తాచీనిషాన్

### రాజోచిత లక్షణములు

1. అంబారి ఏనుగు
2. పల్లకీలు
3. మోర్ఛల్ చౌరి
4. అబ్‌తాబ్ గిరి
5. ఖండేందు బైరుక్
6. నౌబత్‌నగారా

### ఆభరణములు :

1. సర్పెంచ్
2. కలిగిమ్మైతురాయి
3. భుజబందు
4. కంఠి
5. దుస్తుదందు

(ఈ విషయములన్నియూ పూర్వవంశావళి పత్రావళి నుండి గ్రహింపబడినవి.)

పెద్ద నర్సింహా రెడ్డి పూర్వీకులందరు శైవులు కాని నర్సింహా రెడ్డి విష్ణుభక్తి పరాయణుడు, శ్రీ రంగ స్వామి భక్తుడు ఈతడు క్రీ.శ. 1680 లో మరణించెను.

### లింగాయమ్మ

పెద్దనర్సింహా రెడ్డి మరణాంతరము ఆతని భార్య లింగాయమ్మ రాజకార్య నిర్వహణా భారమును వహించెను. రాజవంశమున జన్మించిన లింగాయమ్మకు రాజకార్య నిర్వహణ ప్రకృతిసిద్ధంగానే అలవడినది.

అంతేగాక భర్త పరిపాలనాకాలమున జరిగెడు అనేక కార్యక్రమములలో పాలుపంచుకొనుటచే రాచరికపు తంత్రములామెకు క్షుణ్ణముగా తెలిసినవి. తన తెలివితేటలచే రాజకార్య నిర్వహణ సక్రమంగా చేయుచుయెన్నియో నితర పట్టణములను స్వాధీనముచేసుకొనినది మరియు కొన్నినూతన నగరములనిర్మించినది. భర్తకు చేదోడు వాదోడుగానున్న సిద్దిబిలాలుని తన అంతరంగిక సలహాదారుగా నియమించి రాజతంత్రమును నడుపుచుండెను.

తన యజమానియగు నర్సింహారెడ్డి పేరు చిరస్థాయిగానుండు నట్లు సిద్దిబిలాలు అనేకచర్యలు గైకొనెను. నర్సింహారెడ్డి ప్రజలసంక్షేమమునకై ఎన్నియో కార్యక్రమములు చేపట్టియుండెను. బీదసాదలకు భూములొసగుటయు, గ్రామములకు కోట గోడలు నిర్మించుటయు, బందిపోటు దొంగలబాధలను, పిండారీల దౌర్జన్యములను నివారించుటయు, మహారాణిపేరిట లింగమ్మపేట, సిద్దిబిలాలుని పేర సిద్దిపేట, బిలాల్‌పురమను గ్రామములు అంబాజీపేట, శేరిపల్లె, సదాశివుని పేటయునిర్మింపబడెను.

రాజధానినగరమైన అందోలునగరమునకు దుర్భేద్యమైన మూడు ప్రాకారములు నిర్మించి దాని మధ్యభాగమున రాజకోట నిర్మించబడినది. ఈ రాజకోటయందు అందమగురాజమహల్ దాని సమీపముననే సిద్దిమహల్, శత్రువులుదాడి సల్పినచో నగర బాహ్య ప్రదేశములకు వెళ్లుటకు ఒక రహస్యసొరంగ మార్గము, రాణివాసము, నాట్యశాల, సభామంటపము (బొయ్యారము)? బొయ్యారమును, అశ్వశాల, గజశాల నిర్మింపబడినవి.

ఆకాలమున సైనికులు యుద్ధమునందు బర్సీలు, గండ్ర గొడ్డండ్లు, కత్తులు - బల్లెములు ఉపయోగించెడి వారు. కాని సిద్దిబిలాలుడు సైన్యమున భివృద్ధిపరచి అశ్విక దళము, గజదళము, పదాతిదళములకు, తుపాకులను, ఫిరంగులను యుపయోగించునేర్పు కలిగించెను.

శత్రురాజులకన్న పిండారుల దౌర్జన్యములు పగలనక రాత్రనక గ్రామములపై బడి దోచుకొనుట జరుగుచుండెను. అందుచేతనే ధనవంతములగు గ్రామములకు కోటలు నిర్మించి అందు సుశిక్షితులైన సైనికుల నిచ్చిరక్షణ కల్పించెను ముసలాపురం - పెద్దాపురం, జోగిపేట, ముదుమాణిక్యం, వెలిమకన్నె మొదలగు మున్నూరు గ్రామములకు కోటలు నిర్మించినటుల తెలియుచున్నది.

సిద్దిబిలాలుడు మహమ్మదీయుడై నప్పటికి సర్వమతసహనము గలవాడై యుండెను. మొత్తముమీద రాణి లింగయమ్మపాలనలో సిద్దిబిలాలుడు సర్వ స్వతంత్రము వహించి పాలనాపగ్గములు చేబట్టినట్లు తేలియుచున్నది

రాణిలింగాయమ్మ తనకు సంతానము లేకుండుటచే కృష్ణారెడ్డియను వానినిదత్తతగా స్వీకరించెను. క్రీ.శ.1692 లో మహారాణి స్వర్గస్థురాలయ్యెను.

## కృష్ణారెడ్డి

మహారాణి లింగా యమ్మ యనంతరము దత్తపుత్రడగు కృష్ణారెడ్డి పరిపాలకుడయ్యెను. ఇతడు వంశ మూలపురుషుడగు రామినేని సోదరుడైన మాచినేని సంతతిలోని వాడు. అమ్మన బోలు జమీందారు కుమార్తె రామాయమ్మను వివాహమాడెను. వివాహసందర్భమున అల్లునకు కట్నముగా భువనగిరితాలుకా లోని అమ్మనబోలు మరికొన్ని గ్రామములు ఈతనికి లభించెను.

కృష్ణారెడ్డి తన పేర మెదకు సమీపమున పసుపేరు తీరమున కృష్ణాపురము అను గ్రామమును నెలకొల్పి రామార్పణముగా బ్రాహ్మణులకు అగ్రహారముగా దానమొసంగెను.

ఈతడు క్రీ.శ. 1700 లలో మరణించెను.

## రామాయమ్మ

పతియనంతరము రాజ్యభారమును వహించి భర్త సోదరుడైన అనంతారెడ్డిని మహామంత్రిగాను, సిద్ధిబిలాలుని కుమారుడైన గులామును దండ నాయకునిగాను నియమించి పాలన యొనర్చెను.

రాణిరామాయమ్మ శిరిపురముమున్నగు 12 గ్రామములను ఆర్జించెను.

అవసానదశయందు తన చెల్లెలి కుమారుడగు బెల్లమరెడ్డిని దత్తపు త్రునిగా స్వీకరించెను బెల్లమరెడ్డికి లింగారెడ్డి యనునామాంతరముకలదు.

ఈమె 1700 -1705 వరకు 5 సం. మాత్రము పాలించెను.

## లింగారెడ్డి

రాణీరామాయమ్మ అనంతరము దత్తపుత్రుడైన లింగారెడ్డి క్రీ.శ. 1705లో పాలనాదండమును చేబూనెను. ఇతని భార్య శివ్వాయమ్మ దైవభక్తి గల్గినది. దంపతులు సంతాన లేమిచే అనేక దేవతా పూజలొనరించిరి.

లింగారెడ్డి సిరిపురమునకు పెద్ద తటాకమును నిర్మించి -పరిసర గ్రామముల రైతులకు సేద్యోపయోగము అగునట్లు కుంటలు బావులు త్రవ్వించెను. తన పేర లింగాపురము భార్యపేర (శివ్వాయమ్మపేట) శివంపేటను నిర్మించెను.

లింగారెడ్డి పూజలకు మెచ్చి ఒక నాటి రాత్రి స్వప్నములో బాలుడు లభించునని అతని ఇష్టదైవము చెప్పెను. అట్లే జరిగినది. ఒక వృక్షాచ్ఛాయలో రోదించుచున్న బాలుడగుపించెను. చూచి పుత్రవాత్సల్యమున బాలుని ఎత్తుకొని హృదయమున హత్తుకొని ఇంటికి చేర్చెను. మంత్రి పురోహిత దండనాథుల సమక్షమున ఆశిశువును దత్తతాస్వీకారము చేసుకొని వెంకట నరసింహ రెడ్డి అని నామకరణ మొనర్చెను.

## రాజ వెంకట నరసింహా రెడ్డి

లింగా రెడ్డి అనంతరము దత్తపుత్రుడైన వెంకట నరసింహ రెడ్డి 1920 లో పరిపాలన మారంభించెను.

ఇతడు అద్వితీయ పరాక్రమౌదార్యములతో పరిపాలనము గావించెను. ఇతని కాలమున సిద్ధి ఖిలాలుని పుత్ర ద్వయంలో అబ్దుల్లా అను వాడు మహామంత్రి గాను, సిద్ధి గులాం అను వాడు సేనా నాయకుని గానుండిరి. రెడ్డి సామ్రాజ్యక్షేమము దృక్పథముననుంచుకొని పాలించ చుండెను. ఈతని పాలనలో భువనగిరి ప్రాంతములో కూడా కొన్ని గ్రామాలు కలవు. ఆ ప్రాంతరైతులు భూముల సేద్యమున కనుకూలముగా బావు చెరువులులేనందున వ్యవసాయమున ష్టమగుచున్నదని మొరపెట్టుకొనిరి. అందుచే నర్సింహారెడ్డి ఆ ప్రాంతమున వాపీకూప తటాకముల నిర్మింపచేసెను.

ఒకమారు కల్పగూరు ప్రాంతమున పరిశీలించుచు మృగయాసక్తుడై యుండెను. వేటకై తిరుగుచు గౌడిచర్ల గ్రామ పొలిమేరలో అలసి ఒక చెట్టునీడను విశ్రమించెను. నిద్రలేచు సరికి ఆకలి దప్పిక కాసాగెను. ఆ వైపు ఒక కాపు కన్నియ తండ్రికి గంపలో అన్నము పెట్టుకొని పోవుచుండెను. రాజు కోరికపై ఆమె అతని ఆకలి దప్పులను చల్లార్చెను. ఆ కాపు కన్య రూపురేఖా విలాసములకు సంతసించి యామె తల్లి దండ్రులకు తన అంతరంగికుని ద్వారా తన అభిమతమును తెలిపి పాణిగ్రహణము చేసికొనెను ఆమెయే శంకరాంబగా వాసికెక్కినది.

నర్సింహారెడ్డి భార్యాలోలుడయి రాచకార్యము లన్నింటిని వదిలి అంతఃపురమును వదలకుండెను. వ్యవహారములన్నియు విచారశూన్యములైనవి. సమయమును గమనించిన సిద్ధిసోదరులు స్వార్థమునకై అపరిమిత ద్రవ్యమును వ్యయము చేయుచుండిరి. కోశాగారములోని ధనము కర్పూరము వలె కరిగి పోయినది. ధనము అవసరమగు కొలది ప్రజలపై పన్నుల భారము అధికముగా పడజొచ్చెను. రాజ్యమున అలజడుల ప్రారంభమైనవి. అశాంతి ప్రబలినది. సిద్ధి సోదరుల చర్యలు కఠిన తరములైనవి.

ఎట్టకేలకు రాజు విషయమునంతయు గ్రహించెను. సిద్ధి సోదరుల క్రూరత్వమును గని పెట్టెను. వెంటనే వారిని పదవుల నుండి తొలగించి కొంత కాలము స్వయముగా తానే నిర్వహించెను. రాచకార్యముల సరిజూచుచుమెల్ల మెల్లగా పూర్వస్థితి వచ్చు నట్లు చక్కబరచెను.

వెంకటరావు పంతులును మంత్రి గాను, కేసన పంతులును సేనాధిపతి గాను, లక్ష్మీ నారాయణను కోశాధికారిగాను, శంభురెడ్డికి రక్షణ బాధ్యతల నొప్పగించెను.

పదవీచ్యుతులైన సిద్ధి సోదరులు కొద్దికాలమునకు పశ్చాత్తప్తులై క్షమాపణ గోరిరి. తిరిగి వారిని చిన్న చిన్న ఉద్యోగములలో నియమించెను. కాని వారు పయోముఖ విషకుంభములై సమయమునకై వేచియుండిరి.

ఒకానొక సమయమున మాయోపాయమున నర్సింహారెడ్డిని విందుకు ఆహ్వానించి విషాన్న ప్రయోగముతో చంపిరి.

## రాణి లింగాంబ

వెంకట నర్సింహారెడ్డి యనంతరము అతని భార్య శంకరాంబ రాజ్యాధిపత్యము వహించవలసి యుండెను. కానిసిద్దీ సోదరులకుతంత్రము, ఖాజాబాబు అనువాని రాజకీయ దుర్నిర్ణయములు శంకరాంబను రాజ్యాధికారిణి గాకుండు నట్లుగా జేసినవి.

శంకరాంబ అత్తగారైన శివ్వాయమ్మసాకినవొక బాలుడు జీవనరెడ్డి యనునతడుండెను. అతనిని సింహాసనమునకై తగవులాడుమని యాతని బంధువులును, సిద్ధి సోదరులు పురికొల్పిరి. జీవనరెడ్డి శంకరాంబ రాజనీతిజ్ఞతకు భయపడి తన కపాయము సంభవించునని యాలోచించి పలాయన మయ్యెను. సిద్ధి సోదరులు ఖాజాబాబు జీవనరెడ్డి భార్యయగు లింగాంబను రాజ్యాధి కారిణిగా చేయనెంచిరి.

ఖాజాబాబు రాజకీయ చతురుడు నిజాం నవాబు వద్ద పలుకు బడిగలవాడు తన పలుకుబడిను పయోగించి లింగాంబయే రాజ్యాధికారిణియని హుకుంనామ బడసి సదాయులింగమాంబయను బిరుదము నిప్పించెను. లింగమాంబ పేరునకు రాజ్ఞియే కాని సమస్తాధికారములు ఖాజాబాబూఖాన్‌పై యుండెను.

అకాలమున బాజీరావు కుమారుడగు మాధవ రావు పీష్వా నిజాం అలీఖాన్ తనకీయవలసిన చౌత్ సర్‌దేశ్‌ముఖ్ రుసుము చెల్లింపలేదని స్వీయ మంత్రియగు నానాఫర్నవీసును క్రీ.శ. 1763 లో నిజాం రాష్ట్రమును కబళింప పెంపెను. వృద్ధుడైన నిజాం. నవాబు పిష్వాల ధాటికి ఆగలేక సంస్థానాధిపతుల సహాయార్థియై లేఖలు వ్రాసెను.

ఆందోలు సంస్థానము నుండి శంకరాంబ తాను నిజాం నవాబునకు సహాయముగా వెల్లుదునని కొంత సైన్యమును వెంట నిడుకొని యుద్ధోచిత వేషమున పురుషుని వలె నిజాం కొలువు కూటమునకు చేరెను.

యుద్ధము ప్రారంభమైనది. యుద్ధమున పీష్వాల సైన్యముముందు నిజాం సైన్యములు ఆగలేక పోయెను. పీష్వాల తుపాకుల ముందు నిజాం సైన్యముల ఈటెలు, కత్తులు పనిచేయ లేక పోయినవి. శంకరాంబ సైనికుల కపజయము గల్గినను నిద్రబోక వైరివర్గమును దుసుమాడ ఆలోచించుచుండెను. సర్వసేనానాయకుడగు శంభురెడ్డి, లక్ష్మినాయకుడు, గలిసి నొకతంత్రము పన్నిరి.

పరిసరములలో నున్న పశువులను ప్రోగుచేసివాటి కొమ్ములకు కరదీపికలుగట్టి అదేరాత్రి కొంత సైన్యమునాయిత్త పరిచియుద్ధ సన్నద్ధులైరి, శతఘ్నులనాయత్తపరచిరి. శంకరాంబనొక ఉతమా శ్వము నధిరోహించి పీష్వా సైన్యముల పైబడెను.

ఆకస్మికముగా రణభేరి విన్న పీష్వాసైనికులు ఉలికిపడి తటిల్లునలేచిరి. వేలకొలదికరదీపికలు, పదాతివర్గము, గజదళము, ఆశ్వదళములు కనపడజొచ్చెను.

రాణిమావటివాండ్రు మత్త గజములను పీష్వాసైన్య వాహిని మధ్యభాగమునకు పోనిచ్చి వారిని చెల్లా చెదరుగావించగా సైనికులు శతఘ్నులు పేల్చిరి. అర్ధరాత్రము, నిద్దర మబ్బులు, ఎదురుగా విచిత్రముగా వేలకొలది కరదీపికలు పీష్వా సైన్యములు బిత్తరపోయినవి యుద్ధరంగము నునున్న వారు ప్రాణముల గోల్పోయిరి. పెక్కురు కాలికి బుద్ధి జెప్పిరి తెల్లవారుసరికి పీష్వాసైన్యము లేదు.

రాణి శంకరాంబ నిజాంనవాబు కడకరిగి విజయవృత్తాంతము నెరింగించెను. వీరోచితలక్షణము లతో నున్నరాణిని జూచి నవాబు సంతసించి "రాయెబాగిన్" (రాజ్ఞిశార్దూల) యనుబిరుదమును ప్రసాదించి తనకు విజయము చేకూర్చినందులకు నలుబదివేల ఆదాయము గల జాగీరులు బహూకరించెను. సంస్థానాధుపతులెవ్వరేని హైద్రాబాదుకువచ్చిన స్థానిక ప్రముఖ నాయకు లుస్వాగతమిచ్చి సత్కరించునట్లు శాసించెను. శంకరాంబతన సంస్థాన వృత్తాంతము నెరింగించెను. జరిగిన కుట్రలతెలిసికొనిన నవాబు శంకరాంబకే సంస్థానాధిపత్యమువచ్చునటుల సనదును (అధికారపత్రము) ప్రసాదించి కొంత సైన్యమును వెంటనిచ్చి శంకరాంబను సగౌరవముగా సాగనంపెను.

శంకరాంబ ఈవిధముగా స్వరాజ్యమున కేతెంచి క్రీ.శ.1764 లో రాజ్యాధి కారమును హస్తగతముచేసికొనెను.

## రాజ్ఞిశార్దూల బిరుదాంకిత శంకరాంబ

శంకరాంబ రాజ్యాధికారమును చేబూనగనే తన పతికాలముననున్న కేసన్నపంతులును మహా మంత్రిగను, మరియు కోశాధిపతిగను నియమించెను. శంభారెడ్డి సర్వసైన్యాధిపతిపదవినిచ్చి గౌరవించెను. వారి ఉత్తమ సలహా సంప్రదింపులనను సరించి రాజ్యపాలనము సాగుచుండెను. విపక్షమునకు చెందిన రామారెడ్డిని, భూమారెడ్డిని, లింగారెడ్డిని, రామారావు మరియునా రాయణరావు అను వెలిమదొరలను, సిద్దిసోదరులను దుర్గములో బంధించెను. ఖాజాబాబునకు మరణదండన విధించినది కాని ఆతడు తప్పించుకొని పారిపోయెను. రాజ్యమున ద్రోహులుతలెత్త కుండ కట్టుదిట్టములు చేసెను.

సిద్దప్ప - వీరప్ప యనుశిరిపురంరైతులు, హత్తినగరము (హత్నూం) జమీందారులగు వెలిమలు, పన్నులు చెల్లించకుండుటెగాక రాణిని నీచోక్తులచే బరిహసించిరి, అబలపాలనము అసమర్ధమని దుష్ప్రచారము చేయజొచ్చిరి.

శంకరాంబ రాష్ట్రమున అరాచకత్వమును రూపుమాపసమకట్టినది. శిరిపురమునకు, హత్తినగర మునకు ప్రయాణము నిశ్చయించి మంత్రిదండ నాధులకు తెల్పినది. సైన్యమును వెంటనిడుకొని ప్రయాణమైనది. ముందుగాకొందరు భటులువెళ్ళి ప్రజలను గ్రామము వెలుపలికి రాకుండానరికట్టిరి కాని నీచోక్తులతో పరిహసించిన మల్లారెడ్డి ఉపాయముచే తప్పించుకొని పారిపోయెను.

సిద్దప్ప- వీరప్పలు బేహోరులవలె నటించుచు సైన్యమును కన్నుగప్పి గ్రామములవిడిచి పలాయనమ్మైరి.

శంకరాంబ శిరిపురము నుండి హత్తి నగరమునకు ప్రయాణము సాగించినది. మార్గ మధ్యమున మల్లారెడ్డి తుంటరి చేష్టలకు కోపగించినదై వానిని బంధించి తనెక్కిన ఏనుగు వెనుక కాలుకు గట్టించి ఈడ్చుకొనుచు హత్తినగరము ప్రవేశించెను. మల్లారెడ్డికి గల్గిన దుర్గతి తమకు పట్టునని అచటి జమీందారులు దేవేరికి దాసోహమని చెల్లించవలసిన మొత్తము కప్పముల చెల్లించిరి. మల్లారెడ్డి చివరకు రాణిపాదాక్రాంతుడై క్షమాపణ వేడుకొనగా దయాంత రంగయగు రాణియాతని బంధ విముక్తుని గావించెను.

శత్రుకూటములోని వారందరు కలిసి రాణిశంకరాంబను ఓడించ పన్నాగములు పన్నిరి. ప్రత్యక్షముగా గాక పరోక్షపద్ధతిలో రాణిని హింసించ పూనుకొనిరి.

రాణి శంకరాంబ సమస్తపుణ్యక్షేత్రముల దర్శించ బయలుదెరెను. ఆమెవెంట ఈ శత్రు కూటమి వారు మిత్రుల చందమున వెంటనుండిరి. ఒకచోట మహారణ్యమున ప్రయాణము సాగుచుండగా దారి దప్పించి నిర్జన కీకారణ్యములో నామెనొంటరి దానిని జేసి విడిచివచ్చిరి.

అందోలు నగరమునకు చేరి రాణిశంకరాంబ మార్గ మధ్యమున జ్వర పీడితురాలై మరణించినదని ప్రజలకు నమ్మబల్కిరి.

హిమవంతరెడ్డి యను వాని నిజాంప్రభువునకు జూపి అతని పేర ఆజ్ఞాపత్రమునుగై కొని యితనిని రాజ్యపట్టాభిషిక్తుని జేసిరి. హిమవంతరెడ్డి రాజై రుక్కుమమ్మను పెండ్లాడి రాజ భోగములనుభవించు చుండెను. నామ మాత్రమునకు హిమవంతరెడ్డి రాజు కాని రాజు ద్రోహిలు రాజ చక్రమును త్రిప్పుచుండిరి.

మహారణ్యమున విడువబడిన శంకరాంబ దైవయోగమున ఎట్లో ఆ అరణ్యమును దాటి త్రోవతె న్నుగానక తిరిగి తిరిగి సుమారు ఏడు సంవత్సరాలకు హైదరాబాదు చేరిత నవాబును దర్శించెను. వీరోచి వేషములో శంకరాంబను జూచిన నవాబు కృశించిన శరీరము, ధూళి ధూసరితమైన వల్కలములతో నున్న ఆమెను గుర్తించలేదు. శంకరాంబ నిజవృత్తాంత మంతము విన్న నవాబు తనకు ఆమె చేసిన పూర్వపు మేలును తలచుకొని ఆమెకు జరిగిన మోసమునకు చింతించి ఓదార్చి కొంత సైన్యము నిచ్చి రాణిని స్వస్థానమునకు రాజలాంఛనములతో బంపెను.

రాణి రాజధానికి చేరగనే ప్రజలందరు సంతోషముతో ఎదురేగి స్వాగతమిచ్చిరి ప్రతిపక్షులు పలాయనమ్మైరి. శంకరాంబ శుభముహూర్తమున అమాత్య బంధు మిత్రపరివారముతో కొలువు కూటము నలంకరించెను. హిమవంతరెడ్డిని మరియు దొరికిన ప్రతిపక్షుల నందర కారాగారముననుంచెను.

శంకరాంబ తనతండ్రి పేర సంగారెడ్డి పేటను తల్లి పేర రాజంపేటను నిర్మించి తన పేర శంకరంపేట పాపన్నపేటలు నిర్మించెను.

శంకరాంబ రాజ్యమును 20 పరగణాలుగా విభజించెను. ఈమె ఆ రాజ్య ఆదాయము ఏడు లక్షలు, ఈమెకడ 5000 తురగములుండెను. పుల్లారెడ్డి, శంభురెడ్డి, శేరీలకు అధికారులైయుండిరి.

ఈమె కాలమున సంస్థానము అభివృద్ధి పొంది తేజోవంతమై మెతుకు రాజుల చరిత్రయందు మహోజ్వలముగా భాసించినది.

వయసు పైబడిన శంకరాంబ రాచకార్యము లందు విరక్తి కలదై అప్పటికి బందీలు గానున్న విపక్షులనందర విముక్తుల జేసినది. భగవత్కైంకర్యమే శ్రేయస్కరమని ఆధ్యాత్మిక వృత్తి కి జేరినది.

వెంకట్రావుపంతులు కేసన్న పంతులు ఈ విషయమున ఆమెకు దోహదమొసంగిరి. శ్రీ రంగ క్షేత్రము నుండి ప్రసాదమును గొని దెచ్చి అఖండ దీపములచేస్వామిని వేంచేపు చేసి అందోలుగ్రామమున శ్రీ రంగనాథ దేవాలయమును నిర్మించెను. ఆలయ నిర్వాహణమును స్వయముగా చేపట్టి నిత్యనైమిత్తిక ధూపదీపనైవేద్యాలకు తన స్వంత రాజ మహలు నుండి సరఫరా చేయుచు వై భవముగా నుత్సవములు జరిపించెను.

ఇతర కైంకర్యములకు ఆయాపనులకు క్షేత్రములొసంగెను ఇస్తరాకులమడి, సంగీతంమడి, పూలమడి, యనినేటికిని వ్యవహారమున గలవు.

ఆలయ ప్రాంగణమున బ్రాహ్మణుల సత్రము, అద్దాల మంటపము, 3 దివ్య పుష్కరిణులు నిర్మించెను. ఈ ఆలయపు విమానగోపురము పైనున్న చక్రము, సింహద్వారము పైనున్న గాలిగోపురము వైకుంఠ ద్వారము మహోన్నతమై చూపరులమెడలు వెనుక పడునటులున్నవి. శ్రీ రంగ పట్టణము ఆలయమును బోలి అందలి శిల్పకళానైపుణ్యము ప్రాకార నిర్మాణము సర్వాంగ సుందరమై యున్నది.

అందోలునకు సమీపమున కిచ్చన్నపల్లి యను గ్రామమున వెంకటేశ్వర స్వామిని ప్రతిష్ఠించి స్వామి సన్నిధానమున దివ్యమగు పుష్కరిణిని నిర్మించి భగవత్కైంకర్యమునకు వైష్ణవులనియోగించి ఆగ్రామమును వారలకు అగ్రహారముగా దానమిచ్చెను.

శంకరాంబ రాజ్యనిర్వహణము నందును, దేవ బ్రాహ్మణ భక్తియందును మిన్నయని పేర్కొన వచ్చును. శంకరాంబ సంతానము లేకుండుటచే సదాశివరెడ్డి యనునొక బాలునిదత్త పుత్రునిగా గైకొనెను.

క్రీ.శ. 1774 లో శంకరాంబ రాచపుండు వ్యాధిచే పరలోక గతురాలయ్యెను. నేటికిని మంజీరాతీరమున ఈమె సమాధి (శంకరమ్మగుడి) గలదు.

శారదకాండ్రు మొదలగు జానపద కలాకారులు ఈమె కథను రెండు రాత్రులు వీరరసముట్టి పడునట్లుగా నేటికి చెప్పుదురు.

## సదాశివ రెడ్డి

శంకరాంబ మరణించిన నాటికి సదాశివరెడ్డి చిన్న బాలుడు ఐనను సదాసివరెడ్డిని సింహాసనమెక్కించి ఇతని తండ్రియగు రాజన్న రాజవ్యవహారముల చూచు చుండెను సదాశివరెడ్డి తల్లి రంగమ్మ ఇతనికి నలుగురు సోదరులు కలరు.

శంకరాంబ కాలమునకు కుతంత్రములు నడిపి హిమవంతరెడ్డి అతని భార్యకు రుక్కమ్మ బంధువుల ప్రేరణముతో అధికారమునకు ఆరాటు పడుచుండిరి. అంతఃపురమున అంతఃకలహములు ఆరు సంవత్సరములు సాగినవి. చివరకు నిజాం అలీబాదుషా కలిగించుకొని క్రీ.శ. 1780లో సదాశివరెడ్డియే అధికారము గలవాడని మంత్రియగు అదుస్తజాద్వారా పరిష్కరించెను.

సదాశివరెడ్డికి సంపూర్ణాధికారము వచ్చుసరికి సంస్థానపు సాలుసరి ఆదాయము సుమారు 12 లక్షలు.

సదాశివరెడ్డికి 1. శివ్వాయమ్మ 2. లింగాయమ్మ 3.పార్వతమ్మ 4. గంగమ్మయను నల్గురు భార్యలుండిరి.

పార్వతమ్మయను నామె గద్వాల ప్రభువగు సోమనాద్రి భూపాలుని కూతురు. ఈమె వివాహ కాలమున కన్యాదాత షోడశ మహాదానములను దాసదాసీజనముల నిచ్చుటే గాక, కుడికాలికి బంగారు కడియము, ఎడమకాలికి వెండి కడియము, మెడలో రత్నాల హారమును, ముఖమున పచ్చలుదాపిన కలికితురాయగల యమూల్యాలంకార శోభితమైన పంచకల్యాణి యగుశ్వేతాశ్వమునొసగి మూడు వేల ఈటెల భట వర్గము నరణముగా నిచ్చెను. తక్కిన ముప్పురు భార్యలెచ్చటి నుండి వచ్చిరో తెలియదు.

వివాహానంతరము రాజన్న చౌదరి తనకుమారుడు రాజ్యపాలనా సమర్థుడయ్యెనని గ్రహించి అతని కప్పగించెను. రాజన్నచౌదరి రాజ్యవ్యవహార సౌకర్యములకై హీరపంతులు కృష్ణపంతుకరాడోను పంచోత్రి యనువారిని అచ్చటచ్చట రాజప్రతినిధులుగా నియమించెను. వారు స్వార్థపరులై ప్రజల నుండి పన్నులు వసూలు చేయుచు దిగమింగచుండిరి. ప్రజలను పన్నులకై ఎక్కువగా బాధించు చుండిరి.

సదాశివరెడ్డి రాజ్యాధికారము చేపట్టగనే విషయములన్నింటిని కూలంకషముగా గ్రహించెను. స్వార్థపరులైన ఉద్యోగులచే ఎప్పటికైనను ముప్పు గలుగునని గ్రహించి వారలను ఉద్యోగముల నుండి తొలగించెను.

అదే కాలమున అనావృష్టిచే క్షామమేర్పడినిది. బీద ప్రజలు తిండి లేక మల మల మాడు చుండిరి. అప్పుడు సదాశివరెడ్డి ప్రభుత్వపుధాన్యాగాదెల నుండి బీదలకు ధాన్యమునిచ్చి కాపాడెను.

తనతల్లి పేర రంగమ్మపేట ( రంగంపేట) గ్రామము ను నిర్మించి రాజధానిని అందోలునుండి రంగంపేటకు మార్చుకొనెను.

నేటికిని రంగంపేట గ్రామములో ఆనాడు నిర్మించిన కోట గోడలు, బురుజులు కలవు.

తండ్రి రాజన్న చౌదరిని వెలగొందలు సర్కారును నల్లగన్నలకు ఓరుగల్లు, రామగిరి, మెులంగిరి, స్థంబాద్రి సర్కారులను రాజప్రతి నిధులుగా జేసెను.

నిజాం రాష్ట్ర పొలిమేర భూములకు నీటి పంపకములో కలహములారంభమైనవి. తాలెముల-కొండ తాలుకాలో నిజాం ప్రభుత్వోద్యోగియైన నాదర్‌ఖాన్ సంస్థాన్‌రైతులకు నీరిచ్చుట మాన్పించెను. నీరులేక ప్రజలకు కరువేర్పడినది. స్వీయ ప్రభుత్వమునకు నష్టమేగాక ప్రజల పంటల నష్టపరిచి నందులకు హైద్రాబాదు నగర మధ్యభాగమున నాదర్‌ఖాన్‌ను నరికి చంపెను. ఈ వార్త నిజాం అలీఖాన్ కు తెలిసి కూడా బలవిద్విరోధ మని భయపడెను. నవాబుదండనాయకులు సమయము చిక్కిన పుడెల్ల సంస్థాన మందిలి పొలిమేర ప్రజలను దోపిడి చేయుచుండిరి. అందుకు ప్రతిగా సదాశివరెడ్డి వారి జాగీరులనుండి బాదుషా స్వంత ఖర్చులకై బండ్లపై ధనమును గొనుపోవుచుండ పెద్దాపుర గ్రామసమీపమున నవాబు బండ్లను కొల్లగొట్టి అట్టిధనముచే సైన్యమునభివృద్ధి పరచి ప్రతీకారము తీర్చుకొనెను.

ఈ సమయమున పీష్వా రాయబారి యగు కృష్ణ చంద్రుడు శ్రీరంగ పట్టణపు, నవాబును సహాయముగా తీసికొని చౌతుపన్ను కొరకు నిజాం నవాబును ఒత్తిడి చేయుచుండెను. నిజాంనవాబు వృద్ధుడగుటచేతను, రాజ్యమున అప్పుడప్పుడు కల్గుచున్న సమస్యల చేతను, రాజ్యభారమును మంత్రియగు మీరాలంకు అప్పచెప్పెను.

యుక్త వయస్కుడై రాజ్య పాలనమునకు వ్విళ్లూరుచున్న యువరాజైన అలీజా తండ్రికి ఎదురు తిరిగి తిరుగు బాటొనర్చెను. మంత్రి ఆలోచనముచే నవాబు కుమారుని బంధించి చెరసాలలో వేయించెను.

అలీజా అంతరంగికుడు, నగర రక్షణాధికారి యగు బదిరుల్లాఖాన్ సదాశివరెడ్డికి ఈ విషయము నెరింగించి సహాయము చేయుమని కోరెను. అప్పటికే నిజాం నవాబు తో స్నేహము చెడిన సదాశివరెడ్డికి ఇది చక్కని తరుణముగా తోచినది. వెంటనే మేనమామలగు శంభురెడ్డిని, పుల్లారెడ్డి ని పిలిపించి యువరాజు స్వహస్త లిఖిత లేఖను చూపి వారి అభిప్రాయమును సలహాను కోరెను. వారిరువురి యాలోచన తనయాలోచనతో కుదిరినది. ఒకవైపు నిజాం నవాబుకు బుద్ధిచెప్పుట మరియొకవైపు భావి బాదుషా కానున్న అలీజాకు సాయమొనర్చుట.

సర్వసైన్యాధిపతియగు శంభురెడ్డి, కనుసాని పల్లి సిద్ధాగౌడు, కోహీరులక్ష్మారెడ్డి బస్వాపురం కృష్ణా రెడ్డి ఆలూరి పోచదాసుడు, మరవెల్లిమన్నె పాపడు మొదలగు శూరాగ్రేసరులువెంటరాగా గద్వాల ఈటెల వారు మరి కొంత సైన్యము తోడుండుగా సదాశివరెడ్డి హైద్రాబాదునకు ప్రయాణమయ్యెను.

పత్నులందరిని అందోలు నగరిలో నుంచి అంతఃపుర రక్షకులుగా బల్లెము వెంకట రాయులను, బొబ్బిలి గ్రామం లక్ష్మీ నాయంకుని ఎంరికొంత సైన్యమునుంచెను. సైన్యము, సైన్యాధి పతులు వెంటరాగా సదాశివ రెడ్డి కాసాల గ్రామము మీదుగా పొట్ల చెరువు గ్రామమునకు జేరి దండు విడిసెను.

అదే రాత్రి కొందరు ముఖ్యులతో కార్యాలో చనము గావించి గోలకొండ కోటను జేరెను. నగర రక్షణాధికారి బదియుల్లా ఖాన్ కోటతలుపులు తెరిపించెను. సాదాశివరెడ్డి కొన్ని ఎద్దుల పై ఇసుక సంచులు వేసుకొని కోటలోనికి ప్రవేశించెను. సంస్థానాధిపతి నవాబుకు బాకీపడియున్న ధనమును ఎద్దులపై వేసుకొని వచ్చుచున్నాడని బదియల్లా ఖాన్ అడిగిన వారికి నమ్మబలికెను. రెడ్డి నేరుగా అలీజా ను బంధించిన స్థలమునకేగి అలీజా తో విషయమును సంప్రదించెను. అలీజాను తోలుకొని నవాబు శయన సౌధమునకు జేరి అతనిని బంధింప ఆలోచించిరి. కాని నవాబు వీరి అలికిడి విని రక్షకభటుల హెచ్చరించెను. సదాశివరెడ్డి అలీజాలు తామనుకొన్న కార్యము నెరవేరక కోట నుండి బయల్పడి ధూల్ పేట, బేగంబజారు, ఫీల్ఖానా మొదలగు వీధులలో అంగడులను కొల్లగొట్టి ధనమును ఏనుగులపై నిడుకొని సూర్యోదయము వరకు తిరిగి పొట్ల చెరువు గ్రామము చేరు కొనిరి. అచ్చట నుండి సైన్యసమేతముగా సదాశివపేట, బెడద కోట (బీదర్) చేరిరి. అచట రౌఖరొద్దీన్ కోహీరు ద్వారాఖిలాదారు గానుండెను. అతడు యువరాజొచ్చుట యెరింగి సర్వము వీరి స్వాధీన మొనర్చెను. ఇదంతయు 28-6-1795 నాటి రంజాన్ పండుగ నాడు జరిగినది.

తెల్లవారు సరికి హైద్రాబాదులో అల్లకల్లోలము బయలుదేరినది. రాత్రి సదాశివరెడ్డి రాక అలీజా యువరాజును చెర విడిపించు కొని పోవుట నగరమున జరిగిన దోపిడీలు బహుళ ప్రచారమైనవి. ఆనాడు రంజాన్ పండుగ, నవాబు పూర్వాచార ప్రకారముగా ఈదుగాకు వెళ్లి నమాజు చేయవలసి యుండెను. కాని జరిగిన వృత్తాంతము అతనిని భయకంపితుని గావించినది. ఈదుగాకు బదులుగా మక్కా మసీదులోనే నమాజు గావించెను వేగులవలన సదాశివరెడ్డి, అలీజాలు బెడద కోటను (బీదరు) వశపరచుకొని నారని వార్త యందినది.

నవాబు అబ్దుల్లాఖాన్ అను సేనానాయకునకు అమిత సైన్యమునిచ్చి రెడ్డిని, అలీజాను బంధించి తెమ్మని బీదరు కు పంపెను.

ఎప్పటి కప్పుడు గోలకొండ వార్తల సేకరించుచున్న సదాశివరెడ్డి, సైన్యమును సిద్ధముచేసి కొని కృష్ణాపురము అడవులలో మాటు వేసియుండెను.

నవాబు సైన్యమునకు రెడ్డి సైన్యమునకు అ అడవులలో సంకులసమరము జరిగెను. దళపతియగు లక్ష్మారెడ్డి, మన్నెపాపడు సిద్దయ్యగారు మొదలగు వారు ఈటెబలముతో నవాబు సైన్యము పైబడిరి. నవాబు సైనికులు తుపాకులు బేల్చిరి.

రెడ్డి సైన్యము దుర్గము నుండి దెచ్చిన ఫిరంగులను నవాబు సైన్యముపై బేల్చిరి నవాబు సైన్యము వెనుకంజ వేయ జొచ్చెను. అబ్దుల్లాఖాన్ తన బలము పలుచబడుట జూచి కరవాలము చేబూని సదాశివ రెడ్డిపై కురికెను. అబ్దుల్లాను గాంచి రెడ్డి గుర్రము బెదిరి పైకెగురగా రెడ్డి తలకు బదులు గుర్రము కాలికి కత్తి పోటు తగిలినది. అంతలోనే సదాశివరెడ్డి అదను జూచి అబ్దుల్లా ఖాన్ శిరమును ఖండించెను. హతుడైన సైనాని జూచి హతశేషులైన సైనికులు పారిపోయి నవాబుకు జరిగిన వృత్తాంతమెరింగించిరి.

సదాశివ రెడ్డి ధైర్య సాహసములకు భయపడిన నవాబు స్వయముగా జయింపజాలమని విశ్చయించి ఫ్రాన్సు వారి సహాయమును గోరెను, ఫ్రాన్స్ సేనాని రేమండు (మొయిసిరాం) మరఫిరంగులను మరికొన్ని నవీన ఆయుధోపకరణములను తీసికొని సోల్జర్ల (ఫ్రాన్స్ సైన్యము) తో బీదరు కోటకు పయనమై గోపనపల్లి శివారులో దండువిడిసెను.

సదాశివరెడ్డి ఫ్రాన్స్ సైన్యమునెదురించ తన సైన్యమును సిద్ధపరిచి సోల్జర్లను ఢీకొనెను. ఫ్రాన్స్ వారివి నవీన ఆయుధములు మరియు మరఫిరంగులు, వాటి ముందు సదాశివరెడ్డి సైన్యము తుపాకులు బలహీనమైనవి, ఒటమి తప్పదని గుర్తించిన సదాశివరెడ్డి మిత్రుడగు అలీజా ను ఔరంగాబాదనకు పంపితాను రహస్యముగా తప్పించుకొని ఆందోలునకు పయనమయ్యెను.

సదాశివరెడ్డి వే హతుడైన అబ్దుల్లా కుమారుడు హుమ్నాబాద్ బందేలి నాయకత్వమున అందోలును ముట్టడింప నవాబు సైన్యములతో బయలుదేరెను. అచ్చట పటేలు రాముడు నవాబు సైన్యముల నెదిరించెను. అబ్దుల్లా వెనుక నుండి పటేలు రాముని తలనరికి వేసెను. ఈ విషయములు ఆందోలునకు అందినవి. అంతఃపుర రక్షణకు ఎన్ని బల్లెము వెంకటరాయుడు, బొబ్బిలి గామ లక్ష్మీ నాయకుడు సైన్య సమేతముగా కోటద్వారముల తలుపులు బిగించి బురుజులపై ఆయుధ పాణులై రణమునకుసిద్ధము గానుండిరి.

పఠాను యువకుడు సంగారెడ్డి నుండి బయలు దేరి మూడు యామముల వరకు అందోలు జేరెను. నవాబు సైనికులు కోట నలువైపుల ముట్టడించి కోట ద్వారములను ఛేదింపనేనుగులను పురిగొల్పిరి. కాని ద్వార రక్షకులు బురుజులపై నుండి తుపాకులను బేల్చి ఏనుగులను కొంత సైన్యమును హతముగావించిరి. సైనికులు రాత్రి పూట కోటలో ప్రవేశింప ప్రయత్నించిరి. కాని సాయంకాలమున కోట భేదింపబడుట దుస్సాధ్యమని యెంచి చెరువుకట్ట సమీపమున దండు విడిసి మద్యపానమత్తులై నిద్రించిరి.

ఆ రాత్రి గద్వాల రాచకూతురైన పార్వతమ్మ ధైర్యముతో వారినెదిరించ ఉపాయమాలోచించినది వెంకట రాయని బిలిచి పగతుర పరిస్థితి తెలుసుకొని చెరువుకు గండి పెట్టమని ఆదేశించినది.

చెరువు నీటిలో మందుగుండు మొదలగు యద్ధ సామాగ్రి తడిసి కొట్టుకొని పోయెను. సైన్యముకకావి కలైనది.

తెల్ల వారేసరికి సైన్యమును సమాయత్త పరుచుకొని వీరావిత వేషమును ధరించి అశ్వమునధి రోహించి కోట ద్వారములు తెరపించి శత్రు సైన్యముల పైబడెను. పఠాను యువకుడు, బందెల్లిపిడి కత్తుల వేబుని యుద్ధమునకు వచ్చిరి, ఘోరయుద్ధము జరిగినది పార్వతమ్మ అపరకాళి వలె శత్రుమూకను ఖండించుచు యుద్ధరంగమును రక్తసిక్తము గావించుచుండెను. వెంకటరాయుని చేతిలో బందెల్లి హతుడయ్యెను. పఠాను యువకుడు పార్వతమ్మకు అంగరక్షకుడు గానున్న లక్ష్మీనాయకుని కత్తిపోటున సంహరించ యత్నించగా పార్వతమ్మ ఒడుపున ఆయువకుని కత్తి పోటున నరికి వేసెను. సైన్యము వెల్లా చెదురై గోలకొండ పారిపోయి జరిగిన వృత్తాంతమునంతయు నవాబుతో చెప్పిరి.

నవాబు వృత్తాంతమంతయు విని పుత్ర వాత్సల్యము తో అలీజాను తోడి తెచ్చుటకు మీరాలంను హైదరుద్దౌలాను ఔరంగాబాదునకు పంపెను. వారు ఔరంగాబాదునకు వెళ్లి అలీజాను సంప్రదించి అతని ఒప్పించి తోడు కొని వచ్చుచుండిరి. అలీజా మార్గ మధ్యమున విషముగైకొని మరణించెను.

గోలకొండకు చేరువరకును అలీజా ఏనుగు అంబారీ పైక్షేమముగా నేయున్నాడని అందరు తలంచిరి. కాని తండ్రి తనయుని శవమునే గాంచెను. ఈ విధముగా అలీజా తండ్రినెదిరించి వివిరికి తండ్రికి మొగము జూపించ లేక మరణించెను.

నిజాంనవాబు ఒక వైపు పుత్ర దుఃఖము మరి యొక వైపు బలవద్విరోధము మరియొకవైపు వృద్ధాప్యము కింకర్త వ్యతావిమూఢుడై మంత్రులను సమావేశపరిచెను. మీర్‌నయార్జంగ్, హైదరుల్లా, బదిరుల్లా ఖాన్ లతో తనకెట్లులైనను సదాశివరెడ్డితో సంధి గావింపుడని కోరెను. వారు రంగం పేటకు చేరి సదాశివరెడ్డితో నయవచనములు పలికి సంధి కంగీకరించునట్లొనర్చిరి.

సదాశివరెడ్డిని తోలు కొని నిజాం నవాబు కడకు చేరిరి. అప్పట సదాశివరెడ్డికి రాచమర్యాదలు సలిపిరి. సదాశివరెడ్డి చే చంపబడిన అబ్దుల్లా కుమారుడు దుర్గ రక్షకుడుగా నుండెను. తన తండ్రిని చంపిన రెడ్డిని చంపి పితరుణము తీర్చుకొన దలచినవాడై ఒకనాటి రాత్రి నిద్రించియున్న సదాశివరెడ్డి శిరచ్ఛేదమొనరించెను.

కొందరు సైనకులు రంగంపేటకు బంపబడిరి. వార్తలువిన్న రాణులలో లింగాయమ్మ పగ వారితో చేత చిక్కిన దానికన్న ప్రాణత్యాగము మేలని కత్తి పోటున ఆత్మహత్య గావించు కొనెను. పార్వతమ్మ సైనికుల చేతికి చిక్కక తప్పించు కొనెను. శివాయమ్మా శత్రువులకు పట్టుబడెను.

నవాబు సైనికులు కోశాగారమునకు సంబంధించిన పత్రములున్నయు అగ్గిపాలుచేసి ధన ధాన్యములను దోచుకొని శివాయమ్మను వెంటనిడు కొని నవాబును జేరిరి. నిజాం నవాబు శత్రుశేషమును గురించి సైనికులను ప్రశ్నించెను. బందీగా గొని తేబడిన శివ్వాయమ్మను వెళాకోలమొనర్చెను అందుకు ప్రతిగా శివ్వాయమ్మ ధైర్యముతో నవాబునెదిరించి తనకు పతిశోకము - నవాబునకు పుత్రశోకము సమానమని పలికెను.

మొత్తము మీద నిజాం నవాబు తనకు రాణి శంకరమ్మ చేసిన సహాయమును జ్ఞాప్తికిదెచ్చుకొని శివ్వాయమ్మను వదిలి వేసి ఆమె ఏలుబడిలో కొంత భాగమును మనువృత్తిగా ప్రసాదించెను.

సదాశివరెడ్డి కాలము క్రీ.శ. 1774 నుండి 1798.

## శివాయమ్మ

సదాశివరెడ్డి మరణానంతరము నిజాం నవాబు అనుగ్రహము చే క్రీ.శ. 1799లో శివాయమ్మ పరిపాలన ప్రారంభించినది. నిజామలీఖాన్ బాదుషా సదాశివరెడ్డి యందలి ద్వేషముచే కొంత భూభాగమును తానుంచుకొని మిగిలిన సుమారు ముప్పాతిక రాజ్యభాగము శివ్వాయమ్మకు మనువృత్తికై నొసగినట్లు తెలుయుచున్నది.

పరిపాలనా భారమును వహించి సవతియగు పార్వతమ్మను చేరదీసినది. తనకు మిగిలిన మెదకు మండల భూభాగములో పెక్కు భూములను బ్రాహ్మణులకు దానమిచ్చినది. అనేక పుణ్య కార్యక్రమముల నాచరించినది. ఈమె క్రీ.శ. 1804లో మరణించినది.

## పార్వతమ్మ

శివ్వాయమ్మ మరణానంతరము క్రీ.శ. 1806లో పార్వతమ్మ పరిపాలనారంభించినది ఈమెకు నిజాం సర్కారు సికిందరజా బహద్దూర్. సంస్థానధిపత్యమును ప్రసాదించెను. ఈకాలమున సంవత్సర సంస్థాన ఆదాయము 2,90,000-00 (రెండులక్షలు తొంబదివేలు) ఉండినట్లు పార్వతమ్మ కిచ్చిన సనదులో కలదు. ఈ సంస్థానాధిపతులకు నిజాం నవాబునుండి "ఫర్ఖున్దు బునియాద్" అను అమూల్య మైన బిరుద ఈయబడినది.

ఈమె తన అవసాన కాలమున తన బంధువులలో చేరిన నర్సింహారెడ్డి యనుబాలుని దత్తత తీసికొనెను.

పార్వతమ్మ క్రీ.శ. 1808లో మరణించెను.

## నర్సింహా రెడ్డి

పార్వతమ్మ యనంతరము క్రీ.శ. 1808 లో దత్తపుత్రుడైన నర్సింహారెడ్డికి అదికారము లభించినది. ఇతని జన్మస్థానము మెదకు సమీపమునందలి పైతర యనుగ్రామము.

నిజాం నవాబు ప్రధానామాత్యుడగు మీర్ అలా బహద్దుర్ నార్సింహారెడ్డికి అధిపత్య అధికారపత్ర మొసంగెను ఈతని భార్య శ్రీమతి కేశమ్మ ఈమె కడవెరుగు దేశముఖుల కూతురు.

ఇతడు ఆంధ్ర పారసీక, ఉర్దూ భాషల యందు పాండిత్యము సంపాదించి పారసిక భాషలో స్వయముగా కొన్ని గ్రంధములు రచించి మహారాజా బహదూర్ నాసిరద్దౌలా వలన రాజ బహద్దూర్ అను బిరుదమును పొందెను. ఈతని కాలమున స్వరాజ వంశావళీ యను గ్రంధము రచింపబడెను. ఈతడు కవి పండితుల పోషించుచు భోగలాలసత్వముచే ప్రజలపై అధికముగా పన్నులు వేసి హింసించెను. చివరకు తనభోగలాల సత్వముతో జరిగిన దానికి చింతించి పశ్చాత్తాప పడెను.

## కేశాయమ్మ

నార్సింహారెడ్డి మరణానంతరము క్రీ.శ. 1847 లో అతని భార్యయగు కేశాయమ్మ రాజ్య భారము వహించెను. సిరాజుల్‌ముల్క్ బహద్దూర్ కేశాయమ్మ కు రాజ్యాధి పత్యమును ప్రసాదించెను.

పతి కాలమున వచ్చిన అపకీర్తిని పోగొట్టుటకై సాహసవంతముగా ప్రజల బాగోగుల జూచుచు పరిపాలన మొనర్చెను. ఈమె ప్రజారంజనముగా పరిపాలన యొనర్చుటచే నిజాం ప్రభువు "రామెషర్జన్" అను బిరుదము నొసంగెను. ఈమెకు సంతానము లేదు కాన పొడిచెన్‌పల్లి వాసియగు దుర్గారెడ్డిని దత్త పుత్రునిగా తీసికొని క్రీ.శ. 1865లో మరణించెను.

## వేంకటదుర్గారెడ్డి

రాణి కేశాయమ్మ యనంతరము వేంకటదుర్గా రెడ్డి అధికారమునకు రావలయును. కాని తల్లి చని పోవు నాటికి చాలా చిన్న వాడు గావున సంప్రదాయాను సిద్ధముగా ఆనాటి నిజాం ప్రభువు యొక్క ప్రధానామాత్యుడు ముఖ్యారుల్‌ముల్క్ క్రీ.శ. 1870లో సంస్థానాధి పత్యము సనదు నొసంగెను.

వేంకట దుర్గారెడ్డి కడు చిన్నవాడగుట చే నిజాం ప్రబువు సంస్థాన వ్యవహారిక బాధ్యతలు వహించి దుర్గారెడ్డి పోషణము ను, విద్యబుద్ధుల నేర్పాటులోను బాధ్యత వహించెను.

ఇప్పటూరు దేశముఖులైన రామారెడ్డి గారి కూతురు వేంకట లక్ష్మాయమ్మ తో వివాహము జరిగెను.

ఈతడు దయార్ద్రహృదయుడు ఈతని పాలనా కాలమున ఒక మారు వర్షాభావముతో గొప్పకరువు సంభవించెను. బీదలు అన్నోదకములకు తల్లడిల్లుచుండిరి. ఆసమయమున దుర్గారెడ్డి స్వంత ధాన్యాగరమునుండి ధాన్యమును పంపి ప్రజల ఆకలిబాధల నుండి కాపాడెను.

ఈతనికి శంకరమ్మ యను కుమార్తె కలదు. దుర్గారెడ్డి క్రీ.శ. 1899లో మశూచి సోకి మరణించెను.

## రాణి శంకరమ్మ

దుర్గారెడ్డి యనంతరము అతని భార్య వేంకట లక్ష్మాయమ్మ సంస్థానాధిపత్యము వహింప వలసియుండెను. కాని పుత్రికా ప్రేమచే తల్లి తనకూతురు పేరనే నవాబుతో సంస్థానాధిపత్యము హక్కును పొందెను.

అప్పటికి శంకరాంబది చాలాచిన్న వయసు తల్లీ కూతుర్లు ఇద్దరు మాత్రమే రాజ ప్రాసాదమున బిక్కుబిక్కు మని యుండిరి. సంస్థానవ్యవహారములు చక్కబెట్టువారు లేకుండిరి.

నిజాం నవాబు సంస్థానమును తన ఏలుబడి లోనికి స్వాధీనముచేసి కొని తల్లీ బిడ్డల జీవనోపాధికై తగు వేతనము లొసగు చుండెను.

లక్ష్మాయమ్మ జీవనము కడు పవిత్రమైనది అనేక తీర్థయాత్రలు చేసినది. రామార్చనము ఆమె దినచర్య కుమార్తెను కడు గారాబముగా పెంచి పెద్ద చేసి విద్య నేర్పించినది. యుక్త వయస్సు రాగానే తన మేనల్లుడగు వెంకట ప్రతాప రెడ్డి కిచ్చి వివాహము చేసి ఇంట్లో ఇల్లరికముంచు కొనినిది. కొంత కాలము సుఖముగా గడచినది. తీర్థ యాత్రలకై బిడ్డ అల్లునితో గూడి లక్ష్మాయమ్మ బయలుదేరినది. ప్రయాగలో కలరా వ్యాధిసోకి అల్లుడు మరణించెను. సంస్థానము తిరిగి అనాధయైనది.

నిజాం నవాబు అనుమతిని పొంది లక్ష్మాయమ్మ లక్ష్మీరాజుల పల్లి నివాసి యగు రామారెడ్డి గారి ద్వితీయ పుత్రుడు రామచంద్రారెడ్డిని దత్త పుత్రునిగా స్వీకరించినది కాని శంకరమ్మ తన మరిది కుమారుడైన శ్రీనివాస రెడ్డిని దత్తత తీసి కొనినిది. రామచంద్రారెడ్డికి గద్వాల సీతారమా భూపతి కుమార్తెయగు లక్ష్మీ దేవమ్మతో వివాహము జరిగినది. శంకరమ్మ తన దత్త పుత్రుడైన శ్రీనివాస రెడ్డికి శ్రీమతి సావిత్రి తో వివాహము జరిపించినది.

తల్లీ కూతుళ్ల వివాదము తమ కుమారుల కొరకై పెరిగినది. చివరకు వీరి వివాదము కోర్టు వ్యవహారముల వరకు వచ్చి ఢిల్లీ సుప్రీం కోర్టుకెక్కినది. కోర్టు సంస్థానమును రెండు భాగములొనర్చి రామచంద్రారెడ్డికి, శ్రీనివాస రెడ్డికి, చెరిసగము చెందునట్లు పరిష్కరించినది.

ఇంత జరిగినను వీరు పేరునకు మాత్రమే సంస్థానాధిపతులు. సదాశివరెడ్డి వరకు మాత్రమే సంస్థానము వీరి సంపూర్ణాధికారమునందుండెను. ఆ తర్వాత సదాశివ రెడ్డి మరణముతో సంస్థానాధి కారములు నిజాం నవాబు హస్త గతమొనర్చుకొనెను, రాణి శివ్వాయమ్మ కాలము నుండి వీరికి జీవన భృతి మాత్రము నవాబు ధనా గారము నుండి వేతనముగా లభించుచుండెను. వీరు ఏపని చేయవలయునన్నను నవాబు అనుమతి పొందవలసి యుండెను. నిజమునకు సదాశివరెడ్డి తోనే వీరి రాజ్యము అంతరించినదని చెప్పవచ్చును.

మొత్తము మీద తురుష్కుల ఏలుబడిలో మెదకు జిల్లా ప్రాంతమును అజేయముగా చాలా కాలము స్వతంత్రముగా పాలించిన రాజవంశమని చెప్పవచ్చును.

# రాజకీయ చైతన్యము

## మెదకు జిల్లాలో స్వాతంత్ర్య సమరయోధులు

(స్వాతంత్ర్యోద్యమ చరిత్ర పరిశోధనా సంస్థ, హైదరాబాదు వారి సౌజన్యంతో)

| | పేరు | గ్రామము | మండలము |
|---|---|---|---|
| 1. | వెంకటరాజేశ్వర జ్యోషి | శంకరంపేట (ఎ) | |
| 2. | కంది శ్రీనివాసరావు | కంది | |
| 3. | నూతి శంకరయ్య | టేక్మాల్ | |
| 4. | గోపు భూమలింగం | అల్లీపూర్ | చిన్నకోడూరు |
| 5. | మండల పోచాగౌడ్ | మెదకు | |
| 6. | దమ్మ రామాగౌడ్ | కూచనపల్లి | మెదకు |
| 7. | బచ్చువెంకటేశ్వర గుప్త | సదాశివపేట | |
| 8. | గడిండ్ల లింగమయ్యగౌడ్ | సదాశివపేట | |
| 9. | రామచంద్రరావు కులకర్ణి | అంతారం | సదాశివపేట |
| 10. | మునిపల్లె రాంచందర్ | సదాశివపేట | |
| 11. | వెల్దుర్తి మాణిక్యరావు | వెల్దుర్తి | |
| 12. | కె. వెంకట రాజయ్య | అచ్చంపేట | |
| 13. | కాళ్ల మాణయ్య | అల్లాదుర్గం | |
| 14. | కాశి నర్సింలు | పుల్కల్ | |
| 15. | చుట్టుకులచెన్నయ్య | జోగిపేట | |
| 16. | దోండేరావ్ జాదవ్ | అంతరాగాంవ్ | |
| 17. | యస్.వి. పురుషోత్తమాచారి | టేక్మాల్ | |
| 18. | దొడ్ల నారాయణ | టేక్మాల్ | |
| 19. | చయనులవారి సదాశివ శర్మ | టేక్మాల్ | |
| 20. | లచ్చిరెడ్డి | పేరూర్ | మెదకు |
| 21. | ఎస్. బక్కయ్య | శంకరంపేట | |
| 22. | పెద్ది బాలయ్య | సోలిపేట | శంకరంపేట (ఆర్) |
| 23. | పోతరాజు లింగయ్య | మడూరు | శంకరంపేట (ఆర్) |
| 24. | చింతకింది రాములు | ,, | |
| 25. | ఈరని నారాయణ | ,, | |
| 26. | అక్కమొల్ల శివయ్య | ,, | |
| 27. | చిట్యాల దుర్గయ్య | ,, | |
| 28. | బిరద్దార్ గిరప్ప | ,, | |
| 29. | అరిగె సదానందం | అల్లాదుర్గం | |
| 30. | మహిందర్ కర్ చిన్నారం | జహీరాబాద్ | |
| 31. | మల్కాజి నారాయణరావు | మెదకు | |
| 32. | ఎం. రాకిష్టయ్య | సంగారెడ్డి | |
| 33. | మన్నె హన్మంతు | పోచారం | పుల్కల్ |

| | పేరు | గ్రామము | మండలము |
|---|---|---|---|
| 34. | శివరాం రాములు | జహీరాబాదు | |
| 35. | వూదెల ఎల్లయ్య | - | |
| 36. | ర్యాగళ్ల మాణయ్య | సదాశివపేట | |
| 37. | జంగం రాజమల్లయ్య | కొల్లూర్ | |
| 38. | గౌడుగు అంజయ్య | ,, | |
| 39. | జంగిటి మలయ్య | - | |
| 40. | కానుగు నారాయణ | మెదకు | |
| 41. | బీమరి పోచయ్య | | |
| 42. | సనుబాల శంకరప్ప | వెల్మకన్నె | కౌడిపల్లి |
| 43. | విజయసింహ | సంగారెడ్డి | |
| 44. | కొంపల పోచయ్య | జక్కాపురం | చిన్నకోడూరు |
| 45. | పితలాపురంబాలయ్య | అల్లీపూర్ | చిన్నకోడూరు |
| 46. | కుంట్ల ఎల్లయ్య | జక్కాపురం | ,, |
| 47. | బొందుగుల దేశాయి రెడ్డి | సిద్దిపేట | |
| 48. | మజ్జిగ ఈశ్వరయ్య | అల్లాదుర్గం | |
| 49. | మంకెన సంగయ్య | | |
| 50. | జిన్నారాయుడు గారి రాముడు | రామాయపల్లి | శంకరంపేట (ఆర్) |
| 51. | బోనకుర్తి బాలయ్య | అల్లాదుర్గం | |
| 52. | గువ్వరామయ్య | కట్టెల వెంకటాపూర్ | అందోల్ |
| 53. | ఏ. నర్సింహా రెడ్డి | గొల్లపల్లి | జగదేవ్‌పూర్ |
| 54. | వి. వెంకటరాజి రెడ్డి | ,, | ,, |
| 55. | వి. లింగారెడ్డి | ,, | ,, |
| 56. | కస్తూరి కృష్ణమాచారి | సంగారెడ్డి | |
| 57. | కె. చినలింగయ్య | టేక్మాల్ | |
| 58. | శెట్టి చంద్రప్ప | ,, | |
| 59. | రావికోటి రఘురాములు | ,, | |
| 60. | మాణిక్ రాజయ్య | ,, | |
| 61. | గజవాడ రాములు | ,, | |
| 62. | చిప్పశివరాజు | ,, | |
| 63. | సాంబశివరామయ్య | ,, | |
| 64. | శేకాపురం సంగమేశ్వరరావు | కోహీర్ | |
| 65. | బత్తుల వీరయ్య | టేక్మాల్ | |
| 66. | చల్లా వీర సంగప్ప | ,, | |
| 67. | ఓంకార్ దుర్గాజీ | సదాశివపేట | |
| 68. | బి. సత్యనారాయణ | | |
| 69. | మంగలిరాములు | | |
| 70. | గొల్లగూడెం అంజయ్య | | |

| | పేరు | గ్రామము | మండలము |
|---|---|---|---|
| 71. | శివన్న గారి నర్సారెడ్డి | దొంగల ధర్మారం | రామాయంపేట |
| 72. | నారెడ్డి నారాయణ రెడ్డి | అల్లీపూర్ | చిన్నకోడూర్ |
| 73. | సాదరాజారాం | మెదకు | |
| 74. | బైండ్ల లక్ష్మయ్య | - | |
| 75. | శివాజీ | సంగారెడ్డి | |
| 76. | రామస్వామి | ,, | |
| 77. | సోమశివయ్య | ,, | |
| 78. | కమ్మరి వెంకయ్య | ,, | |
| 79. | కె. అడివప్ప | ,, | |
| 80. | బండారి మల్లాగౌడ్ | దొంగల ధర్మారం | రామాయంపేట |
| 81. | నాగారం అంతయ్య | నారాయణ ఖేడ్ | |
| 82. | చీనూరి వెంకటరాం | కూచన పల్లి | మెదకు |
| 83. | నీరడి శంకరయ్య | కొల్లూర్ | గజ్వేల్ |
| 84. | విఠల నర్సయ్య | వెల్దుర్తి | |
| 85. | కట్ల వెంకటస్వామి | వెల్దుర్తి | |
| 86. | విఠల శ్రీరాములు | వెల్దుర్తి | |
| 87. | కె. సోమశేఖర రావు | వల్లూరు | |
| 88. | గాండ్ల బుచ్చప్ప | శంకరంపేట | |
| 89. | మగ్దూం మొహియుద్దీన్ | ఆందోల్ | |
| 90. | ఆర్. నర్సింహా రెడ్డి | కూచనపల్లి | |
| 91. | పి. జగపతిరావు | ఖాజీ పల్లి | మెదకు |
| 92. | జి. నర్సింలు | సంగారెడ్డి | |
| 93. | పోచయ్య | - | |
| 94. | కోవూరి మొగులయ్య | సదాశివపేట | |
| 95. | కట్ల వెంకటస్వామి | మెదకు | |
| 96. | బిచికె శంకరయ్య | అల్లాదర్గం | |
| 97. | కల్యాణ్ రావు | సదాశివపేట | |
| 98. | సి.హెచ. లింగయ్య | మెదకు | |
| 99. | చయనుల సదాశివశర్మ | టేక్మాల్ | |
| 100. | మిన్సూర్ మాణయ్య | సదాశివపేట | |
| 101. | మజ్జిగ చంద్రయ్య | అల్లాదుర్గం | |
| 102. | డి. నర్సింహారెడ్డి | పాటిఘనపురం | మెదకు |
| 103. | కూచని రాజయ్య | సదాశివపేట | |
| 104. | గొల్లగూడెం అంజయ్య | ,, | |
| 105. | వెంకటేశం | ఖాజీపల్లి | మెదకు |
| 106. | ఉప్పు చంద్రప్ప | టేక్మాల్ | |
| 107. | మడిరాంరెడ్డి | కోహీర్ | |

| | పేరు | గ్రామము | మండలము |
|---|---|---|---|
| 108. | గంజెం నారాయణ | ఖాజీపల్లి | మెదక్ |
| 109. | రామరాజు వెంకటేశ్వర రావు | మెదకు | |
| 110. | పోలరామయ్య | పల్కల్ | |
| 111. | వెంకాగౌడ్ | పొడిచెన్‌పల్లి | పాపన్నపేట |
| 112. | వీరబోయిన భూమయ్య | ఖాజీపల్లి | మెదక్ |
| 113. | సంతపురి రఘువీరారావు | - | |
| 114. | గొల్ల నారాయణ | ఖాజీపల్లి | మెదక్ |
| 115. | ద్రోవోజిగారి అంజయ్య | ,, | |
| 116. | గంట నారాయణ | ,, | |
| 117. | మడిగల ఆగమయ్య | శంకరంపేట | |
| 118. | మహంకాలి నారాయణ | ,, | |
| 119. | రామాచారి | ,, | |
| 120. | అప్పారావు షెట్కార్ | నారాయణ్ ఖేడ్ | |
| 121. | కె. లింగన్న | కడ్పల్ | |
| 122. | ఎం. రాములు | సదాశివపేట | |
| 123. | బి. వెంకటరత్నం | పటన్‌చెరు | |
| 124. | మెట్ల భూమయ్య | శంకరంపేట | |
| 125. | గుజ్జరి రామయ్య | ,, | |
| 126. | కొడిపాకలింగన్న | టేక్మాల్ | |
| 127. | నర్సింహారావు | ఘనపురం | |
| 128. | మంకెన సంగయ్య | అల్లాదుర్గం | |
| 129. | జగదీశ్వరయ్య | నాగులపల్లి | తూప్రాన్ |
| 130. | ఎన్. అంతయ్య | నారాయణఖేడ్ | |
| 131. | తేడుదెల్ల బక్కప్ప | సదాశివపేట | |
| 132. | వీర్‌కుమార్ | సంగారెడ్డి | |
| 133. | కృష్ణమూర్తి | పోచారం | |
| 134. | జట్ల భూతల్లి | శంకరంపేట (ఎ) | |
| 135. | దత్తయ్య | ,, | |
| 136. | పి. నాగోజి | మెదకు | |
| 137. | బసవమాణయ్య | జోగిపేట | |
| 138. | ఎల్లుగా | జక్కాపురం | చిన్నకోడూర్ |
| 139. | హన్మంతరావు పట్వారి | గణపురం | |
| 140. | కోవూరి రత్నయ్య | సదాశివపేట | |
| 141. | గాలయ్య స్వామి | ,, | |
| 142. | రేజింతల ఈశ్వరప్ప | ,, | |
| 143. | బాంచ రాలు | ,, | |
| 144. | కమ్మరి అడివయ్య | ,, | |

| పేరు | గ్రామము | మండలము |
|---|---|---|
| 145. తేరుపల్లి వీరయ్య | ,, | |
| 146. గున్నాల రామయ్య | ,, | |
| 147. అయ్యవారి గోపయ్య | మానేపల్లి | |
| 148. బాల్‌రెడ్డి | మెదకు | |
| 149. జె. రాంరెడ్డి | సంగారెడ్డి | |
| 150. రామస్వామి | ,, | |
| 151. వీరారెడ్డి | ,, | |
| 152. వీరమల్లాగౌడ్ | ,, | |
| 153. ఎల్లా లక్ష్మయ్య | ,, | |
| 154. శ్రీరాం రాములు | ,, | |
| 155. రాంచందర్ | అంతారం | |
| 156. తుడుం ఆశయ్య | హుస్నాబాద్ | |
| 157. డిప్పడపల్లి విఠలయ్య | పటన్‌చెరువు | |
| 158. గుండు సిద్దయ్య | సదాశివపేట | |
| 159. చంద్రశేఖర సిర్వాణి | ,, | |
| 160. ఎర్ర వీరక్రిష్ణ | ,, | |
| 161. గంజి నారాయణ | ,, | |
| 162. నాగారపు నారాయణ | ,, | |
| 163. కోహీర్ రామచందర్ | ,, | |
| 164. వెంకటరాం | కూచన్‌పల్లి | మెదక్ |
| 165. బి. నారాయణ రెడ్డి | మానెపల్లి | |
| 166. నారాగౌడ్ | పేరూార్ | |
| 167. కోనాపురి విఠల్ | శంకరంపేట | |
| 168. శివలింగం | సదాశివపేట | |
| 169. సూరారం బాలయ్య | ,, | |
| 170. ఆకుల హనుమయ్య | పోల్కంపేట | |
| 171. చిన్నారం సాయిలు | కొల్చారా్ | |
| 172. శెట్టి అడివప్ప . | పాపన్నపేట | |
| 173. చాకలి మల్లయ్య | కొల్చారా్ | |
| 174. కె. నారాయణ రెడ్డి | మానేపల్లి | |
| 175. జొన్నవాడ రాములు | యశ్వంతరావు పేట | |
| 176. మర్పల్లి వీరయ్య | ముద్దాయిపేట | |
| 177. చుక్క ఎల్లయ్య | చిన్నకోడూరు | |
| 178. కోహీర్ బసవప్ప | కోహీర్ | |
| 179. గొల్లగూడెం మల్లయ్య | సంగారెడ్డి | |
| 180. నారాయణ రెడ్డి | ,, | |

# భారత స్వాతంత్ర్య పోరాటంలో మెదకు జిల్లా

భారతదేశమున ఆంగ్లేయ పరిపాలనమునకు వ్యతిరేకముగా సాగిన స్వాతంత్ర్యోద్యమము నిజాం రాజ్యమున మెలమెల్లగా ప్రాకినది.

నైజాం రాజ్యమునందు స్థానికులు రెండవ శ్రేణి పౌరులుగా జీవించుట, మాతృభాషపై ప్రభుత్వమున కున్న చిన్న చూపు, పెత్తందారీ వ్యవస్థలో ప్రజలకు కలుగుచున్న కడగండ్లు, హైద్రాబాద్ రాష్ట్ర నాయకులు భారత స్వాతంత్ర్య సంగ్రామమున పాల్గొనుటకు దోహద మొనర్చినవి.

భారతదేశమునకు సంపూర్ణస్వాతంత్ర్యము లభించినచో నిజాం రాజ్యం కూడా అంతరించి స్వతంత్ర భారతదేశాంతర్భాగమై ప్రజా పరిపాలనము పొందునని నాటి నాయకులు విశ్వసించిరి.

తేది 1-09-1901 లో శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారు తమ మిత్రులైన రాజా నాయని వెంకటరంగారావు బహద్దూర్, రావిచెట్టు రంగారావు తదితరుల సహాయ సహకారములచే హైద్రాబాద్ నగరమున మొట్టమొదట తెలుగు వారి గ్రంథాలయముగా శ్రీ కృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయము ను స్థాపించిరి. తెలుగు వారిలో గ్రంధ పఠనాసక్తిని పెంచి వారి సంస్కృతీ, ఆచార వ్యవహారములను సంరక్షించుకొను దీక్ష కలిగించి తద్వారా రాజకీయ స్వాతంత్ర్య చైతన్యమును పెంపొందించుట ముఖ్య ఉద్దేశ్యముగా ఈ గ్రంథాలయము ప్రారంభింపబడినది.

శ్రీ ఆదిపూడి సోమనాథరావు, శ్రైలవరపు నరసింహ శాస్త్రి, కోదాటి నారాయణరావు, వంటి మహనీయులు తెలంగాణమున గ్రంథాలయోద్యమ వ్యాప్తికి విశేష కృషి గావించిరి. అంతే గాక తెలంగాణములోని మారుమూల పల్లెలలో తిరిగి శిలాశాసనములను కనుగొని, నాటి ప్రతిబింబములను తీసియుంచిరి.

1907-1908 లో మచిలీపట్టణమునందు ఆంధ్ర మహాసభ జరిగినది. ఆ మహాసభలో పాల్గొనుటకై - నిజాం రాజ్యమునుండి కొందరు తెలుగు నాయకులు వెళ్ళిరి. అక్కడి మహోపన్యాసములకు ఉత్తేజితులైన తెలంగాణ నాయకులు తమ ప్రాంతమందు అట్టి మహాసభలను నిర్వహించుట-తెలుగువారియందు భావజ్వాలలను దీప్తి యొనర్చుట యని భావించిరి.

క్రీ.శ. 1920లో భారతదేశమున స్వాతంత్ర్య పోరాటం జరుగుచుండగా - హైద్రాబాద్ రాజ్యమున అన్ని జిల్లాలలో నిజాంకువ్యతిరేకముగా ఉద్యమం ఆరంభమైనది.

# మెదకు జిల్లాలో స్వాతంత్ర్యోద్యమము

హైదరాబాద్ రాష్ట్రంలో స్వాతంత్ర్య సమరానికి మొట్ట మొదట మెదకు జిల్లానే శంఖాన్ని పూరించింది. ఆంధ్రోద్యమం ద్వారా ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావుగారు 1920లో రాష్ట్రంలో ప్రజాచైతన్యానికి బీజావాపన చేసినారు. అది పదేండ్లలో పెరిగి, మహాసభ రూపంలో సాటిలేని సాహితీ వేత్త శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతన మెదకు జిల్లా జోగిపేటలో వికసించినది. అట్లే విజృంభించి తుది పోరాటం సలుపటానికి సంకేతంగా జరిగిన తుది ఆంధ్రమహాసభ సర్దార్ జమలాపురం కేశవరావుగారి అధ్యక్షతన మెదకు జిల్లాలోని కందిలో జరిగింది. ఈ విధంగా మొదటి మహాసభలో రెడ్డిగారు కలంపోటు పొడిచిందీ, చివరి మహాసభలో కత్తి ఝుళిపించి నిరంకుశ రాచరికాన్ని అంతం చేయటానికి తుదిపోరాటంలో సర్దార్ జమలాపురంగారు దూకింది కూడా మెదకు జిల్లా నుండి జరుగుట విశేషము.

జోగిపేటలో జరిగిన ప్రథమాంధ్ర మహాసభకు శ్రీ అనంత వెంకట రావు దేశ పాండ్యే ఆహ్వాన సంఘ అధ్యక్షులు, సదాశివపేట వాస్తవ్యులు శ్రీ బచ్చు వేంకటేశ్వర గుప్త కార్యదర్శులుగా ఉండి మహాసభ తర్వాత కూడా కార్యక్రమాలను సాహసోపేతంగా సాగించినారు. ప్రజా ఉద్యమాల నిర్వహణ విషయంలో కానీ వాటి ప్రయోజకత్వాన్ని ఇనుమడింపజేయు విషయంలో కాని ఆంధ్ర పితామహుల ముందుచూపు మరే ఉద్యమంలోనూ కానరాదు. అట్టిదే ఆంధ్రమహాసభలతో పాటు ఆంధ్ర మహిళాసభలు జరుపుట. ఇట్లా ఎన్నింటినో పేర్కొనవచ్చు. ఈ విధంగా తర్ఫీదు పొందిన మహిళలు జంకు, భయములేక స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన గలిగినారు.

స్వామి రామానంద తీర్థ గారితో సంప్రదించటానికిని, వారిని సెంట్రలు జేలు నుండి సంగారెడ్డి డాక్ బంగళాలో దించినారు. ఇది మజ్లిస్ వారికి నచ్చలేదు. అదే సమయంలో డాక్ బంగళా సమీపంలో ఒక బహిరంగ సభ జరిపి కాంగ్రెసువారిని తూలనాడినారు. ఆవేశ పరులయిన ముస్లింలు సంగారెడ్డి గ్రామవీధులలో నినాదాలిస్తూ తిరిగినారు. గాదె శంకరయ్య గ్యాసునూనె దుకాణాన్ని బద్దలు కొట్టి పీపాలు పగులకొట్టి వీధులలో పారబోసి నిప్పంటించారు. అగ్ని భయం నుండి కాపాడటానికి కార్యకర్తలయిన సర్వశ్రీ మహంకాళి నారాయణ, జి. నర్సయ్య, మల్యాల దేవి ప్రసాద్, పరుశురామసింగ్ మంగళి, ఆగమయ్య, జానకిరామశర్మ, మేరు శంకరయ్య, సంగయ్య, శంకరయ్య, లక్ష్మణకుమార్, కె. వెంకయ్య, వీర్‌కుమార్ మొదలయినవారు కుండలతో నీరు చేది పోస్తూ మంటలనార్పినారు.

ఆ తరువాత కలిసికట్టుగాను, ధైర్యంగా నుండ వలసిందిగా ప్రజలను ఉద్బోధించారు. పోలీసులు మంట పెట్టినవారినే మనలేదు. కాని కాంగ్రేసు ప్రముఖులయినవారిని నిర్బంధించినారు. పాపన్నపేట గ్రామానికి చెందిన సర్వశ్రీ మ్యాకల అడివప్ప, మందరి లక్ష్మయ్యగారలు సత్యాగ్రహం చేసి అరెస్టయినారు.

## టేక్మాల్

1947 మే 16 నాడు టేక్మాల్ గ్రామంలో ఆర్యసమాజం ఉత్సవంలో పాల్గొనటానికి వచ్చిన ప్రముఖ నాయకులయిన సర్వశ్రీ వినాయక రావు విద్యాలంకార్, పండిత నరేంద్రజీ గారలతోబాటు ఎస్. వెకటస్వామి గంగారాం, మాణిక్యరావు, రామస్వామి గారలు రాత్రి రెండుగంటలకు తిరిగి వెళ్ళుతుండగా రజాకారు పఠాణులు వీరి మీదకు తుపాకీ పేల్చినారు. గంగారాం గారి నడుముకు గుండు తాకింది. మరొకటి నరేంద్రజీ గారిని దూసుకుంటూ పోయింది. మరోసారి వేసుకున్న పథకం ప్రకారం ప్రజానాయకులను చూడగానే "అల్లాహోఅక్బర్" అని రజాకారులు కత్తులు ఝుళిపించుకుంటూ పైబడ్డారు.

మహంకాళి నారాయణగారు యుక్తితో తప్పించి బసవమాణయ్య మొదలయిన ముగ్గురు నాయకులను సురక్షిత ప్రదేశానికి తీసుకపోగలిగినాడు. ఇటువంటి సమయంలో మనోనిబ్బరం ఉండుటే మహాగొప్ప.

శ్రీ చైనుల సదాశివ శర్మగారు గ్రంథాలయ మందు స్టేట్ కాంగ్రేస్ జిందాబాద్ అనే నినాదాలు మిన్నుముట్టగా జాతీయ పతాకాన్ని ఎగురవేసి సత్యాగ్రహము చేసినారు వెంటనే పోలీసులు నిర్బంధించి జేలులో వేసినారు వీరు మొదట ఆంధ్రమహాసభలోనూ ఆ తర్వాత కాంగ్రెసులోను సభ్యులయి నిరంతరంగా ప్రచార ప్రబోధాలు చేసినారు. స్థానిక ముస్లిముల బెదిరింపులకు, అధికారుల దౌర్జన్యానికి బెదిరిపోలేదు. సనాతన బ్రాహ్మణులయినా సంఘ సంస్కార ప్రియులు సంఘాభివృద్ధికి పాటు పడ్డారు. ఆస్తి నష్టమయినా వెరువలేదు.

## సదాశివపేట

1947 అక్టోబర్ 24 దసరాపండగ. ప్రజలు పండగ సంబరంలో ఉన్నారు. అటు రజాకారులు అల్లరి చేయడానికి పథకం వేసుకున్నారు. స్థానిక రజాకార్ నాయకులు షర్ఫోద్దీన్, అజమలిఖాను వీధిలోనికి రాగానే పరిసర గ్రామాల రజాకారులు "అల్లహోఅక్బర్" అని నినాదాలు చేస్తూ చేరుకున్నారు. మొదట రెండు కిరసనాయిలు దుకాణాలను బద్దలు కొట్టారు నూనెడబ్బలను అంచలంచలుగా నిలుచున్న రజాకారులు అందిస్తూ పోగా ఇట్లా 60 డబ్బాలు చేతులు మారినవి వాటిని అడ్తీ దుకాణాలమీద కుమ్మరించి నిప్పంటించినారు. రేటు సంగప్ప అనే వర్తకుడు తన దుకాణానికి తోరణం కడుతుండగా అతనిపై కిరసనాయిలు పోసి అగ్గిపుల్లతో సజీవ దహనం చేసినారు మంటలు ఆకాశాన్నంటుతున్నవి, దుకాణాలు కాలి బూడిదయినవి.

మీదట బీదరు గంజును కాలబెట్టిన దుర్ఘటన వలె జరిగింది. చూస్తుండగానే 15 లక్షల ఆస్తి మంటకలిసింది. కాలబెట్టిన కిరసనాయిల్ విలువనే 50 వేలకు మించింది. ఈ ఘోరమయిన దహనకాండ సమాచారాన్ని వెంటనే భారత ఉపప్రధాని సర్దార్ పటేల్‌కు తెలియ జేయబడింది. సంతృప్తి కరమయిన విషయం ఏమిటంటే "పోలీస్ చర్య" ను విజయవంతంగా జరుపుతూ త్రోవలో సదాశివపేట చేరగానే ప్రజలు హర్షధ్వానాలు చేయుచూ స్వాగతం పలికారు. అప్పుడు జనరల్ జె.ఎన్. చౌదరిగారు మందహాసం చేయుచూ మీదట పంపిన విజ్ఞప్తి పత్రాన్ని ప్రజలకు చూపినారు. అది చూసిన ప్రజలు ఆనందంతో పొంగిపోయారు.

## కూచనపల్లి

మెదకు పట్టణానికి సమీపంలో ఉండే కూచనపల్లి వాస్తవ్యులయిన సర్వశ్రీ శివనూరు వెంకటరాం. బాలాగౌడ్, వంగలి లక్ష్మయ్య, నర్సింలు, వెంకయ్య, ఎల్లయ్య, దమ్మురామాగౌడ్ గారలు తమ గ్రామంలో జండా వందనం చేసి స్టేట్ కాంగ్రెస్ జిందాబాద్ అని నినాదాలు చేస్తూ సత్యాగ్రహం చేశారు పోలీసులు నిర్బంధించి తీసుకవెళ్లారు.

## అల్లిపురంలో అఘాయిత్యం

సిద్దిపేటకు 12 మైళ్ళదూరంలో ఉంటుంది. స్థానిక కార్యకర్త రాధాకిషన్‌రావుగారు కాంగ్రెసు పిలుపునందుకొని 1947 సెప్టెంబరు 4న జండావందనం జరుపాలని నిశ్చయించినారు చుట్టు గ్రామాలయిన పోల్కంపల్లి, యఁల్లాయెంవల్లి, కోచగుట్టపల్లి మొదలియున గ్రామాల వారు కూడా జండా వందనంలో పాల్గొనటానికి వచ్చారు. ఈ వార్త తెలిసిన అల్లిపురం గ్రామందొర పోలీసులకు మిలటరీకి తెలియజేసారు.

ప్రజలు సమావేశానికి రాగానే నిజాం మిలిటరీ కాల్పులు జరిపింది. వడ్ల లక్ష్మయ్య మరణించాడు. కొమ్మెర నర్సయ్య, సామెల నర్సయ్య తీవ్రముగ గాయపడ్డారు. ప్రజలు భయపడి చెల్లాచెదరయ్యారు. పోలీసులు ఇండ్లలో చొరబడి దోచుకున్నారు. ఈ దొంగలించిన సరకు సుమారు 10 వేల వరకు ఉంటుంది. పోలీసులు రాధాకిష్ రావును నిర్బంధించారు.

కోడూరు గ్రామ పటేలు శ్రీరంగారెడ్డి రజాకారుల దౌర్జన్యానికి గురయ్యారు. అట్లే ఖాదిరాబాదులో దుగ్గిశెట్టి విశ్వనాథంగారి తండ్రిని కారుచిచ్చులో పడవేసి సజీవ దహనం చేసినారు. ఇంటిలో జొరబడి ఆస్తిని దోచుకున్నారు. ఆర్య సమాజం ఎన్నికల సందర్భంగా రాయకోడు గ్రామానికి ఆర్యసమాజ నాయకులు వచ్చినారు. అదను చూచి స్థానిక మజ్లిసువారితో కుమ్మక్కయి పోలీసులు కాల్పులు జరిపారు. 11 మంది వెంటనే ప్రాణాలు విడిచారు. ఇండ్లలో జొరబడి దోచుకోవడమే కాక మానభంగములు కూడా చేశారు. దోచిన సామానును చేరవేయటానికి 4 రోజులు పట్టింది. ఊరు దోచినాక ఇండ్లకు నిప్పంటించినారు.

సర్వ(శ్రీ) మారుతి, గాండ్ల బక్కప్పగారలను చంపి వారి లక్షల ఆస్థిని దోచుకున్నారు. అటులే డప్పు రాజయ్యగారి వుూడు లక్షల ఆస్థిని కూడ అపహరించారు.

తూప్రాన్‌లో బిదురు రాజయ్యగారు కాం(గ్రెసు (ప్రచారం చేసినందుకు రజాకార్లు ఇల్లు దోచారు.

అటులే (ప్రజలను నిజాం సర్కారుకు విరుద్ధంగా తిరుగుబాటు చేయవలసిందిగా (ప్రచారం చేసినందుకు బజారు రాములును పోలీసులు నిర్బంధించటానికి (ప్రయత్నించారు కాని తప్పించుకొని అజ్ఞాతంగా (ప్రచార కార్య(క్రమం సాగించారు. వెల్దుర్తి (గ్రామం నుండి (శ్రీ) విఠల నర్సయ్య నాయకత్వంలో కొమిరిశెట్టి విశ్వనాథం భూమయ్య, భూమిరెడ్డి మొదలయిన ఎనమండుగురు యువకులు తూ(ప్రాన్ వెళ్ళి జండావందనం చేశారు. మెదకు సమీపంలోని కిష్టాపురం, ఎల్లగూడెం, జాటుపల్లి, తిగుళ్ళ (గ్రామాలలో సుమారు 200 మంది కార్యకర్తలను కాం(గ్రెసు (ప్రచారం చేస్తున్నారని పోలీసులు అరెస్టులు చేశారు. సిద్దిపేటలో (శ్రీ)రాజిరెడ్డి మొదలయిన అయిదుగురు యువకులను నిర్బంధించారు. ఊరిపై దాడి చేయడానికి స్థానికులు సరిపోరని హైదరాబాద్ నుండి అదనంగా రజాకారులను పిలిపించి అల్లరి చేసినారు. అందోలు తాలుకాలోని ఆరె, ఇటిక్యాల, కాయిదంపల్లి, కాడిపాక, బూరుగుపల్లి, నిజాంపురం (గ్రామాలలో రజాకార్లు, పోలీసులు కలిసి ఇండ్లు దోచుకున్నారు. ఇదే తాలూకాలోని రాగయ్యపేటపై దాడిచేయగా ఇద్దరు మరణించారు. అంతటితో వారి రాక్షసత్వం ఆగలేదు. ఇండ్లకు నిప్పంటించడానికి పూనుకోగా (గ్రామస్తులు దుడ్డుక(రలు పట్టుకొని (ప్రతిఘటించారు. కాని తుపాకి కాల్పులకు చెదిరి పోవలసివచ్చింది . ఆ తర్వాత ఇండ్లలో జొరబడి విచ్చలవిడిగా దౌర్జన్యం సలపినారు. జోగిపేటకు చెందిన (శ్రీ)బసవమాణయ్యగారు చూపిన సాహసం అనన్య సామాన్యం. అతను సత్యా(గహం చేసి జేలుకు వెళ్లారు. కానీ దేశీయులు రజాకార్లు పెట్టు హింసలకు గురి అవుతుంటే జేలులో పడి ఉండలేక పోయాడు. (ప్రజలు మధ్య ఉండి రజాకార్లను (ప్రతిఘటించుటే కర్తవ్యమని నమ్మిన సత్యా(గహం చేసి జేలుకి వెళ్ళారు. కానీ దేశీయులు రజాకార్లు పెట్టు హింసలకు బలవుతుంటే జేలులో పడి ఉండలేకపోయాడు. (ప్రజల మధ్య ఉండి రజాకార్లను (ప్రతిఘటించుటే కర్తవ్యమని నమ్మిన మాణయ్యగారు లంబాడీవేషం వేసుకొని జేలునుండి తప్పించుకొని చివరి వరకు (ప్రచ్ఛన్నంగా నిజాం పోలీసులను రజాకార్లను ఎదుర్కుంటూ (ప్రజలకు ధైర్యం కలుగజేశారు.

శంకరం పేట చైతన్యంగల (గ్రామం. జిల్లా కాం(గ్రెస్ కమిటీ కార్యదర్శులుగా ఉన్న వెంకటరాజేశ్వర జోషి ఈ ఊరివాడే. ఎనమండుగురు కాం(గ్రెస్ కార్యకర్తలతో సత్యా(గహం చేయగా పోలీసులు అరెస్టు చేశారు. వారిలో గాండ్ల బుచ్చయ్య తదితరులు ఉన్నారు.

ఉద్యమ కాలంలో స్టేట్ కాంగ్రెసు మెదకు జిల్లా కమిటీకి శ్రీ జె. రామిరెడ్డిగారు అధ్యక్షులుగను, కస్తూరి కృష్ణమాచారి అడ్వొకేటు ఉపాధ్యక్షులుగను, వెంకట రాజేశ్వర జోషి కార్యదర్శిగాను ఉండి ఉద్యమాన్ని విజయవంతంగ నడిపారు. జోషిగారిని గూర్చి ఒక్కమాటలో చెప్పాలంటే మెదకు జిల్లాలో జరిగిన చైతన్యం కాంగ్రెసు వారి జాతీయతత్వ ప్రచారం శ్రీ జోషిగారి నిరంతర కృషి ఫలితమే, వారు పద్మశాలీయులు అభివృద్ధికి ఎంతో కృషి సలిపినారు. మెదకు జిల్లాలో జరిగిన సత్యాగ్రహం యొక్క విశేషమేమిటంటే మొత్తం రాష్ట్రంలో మెదకు వారే అధిక సంఖ్యలో ఉన్నారు. అందులోను విశేషమేమిటంటే సత్యగ్రహు లందరు అయితే బీదలు లేక మధ్యతరగతికి చెందిన కిందిస్థాయి వారు. దీన్ని బట్టి కాంగ్రెసు ప్రభావం కింది తరగతి వారి మీదనే పడిందని అట్టివారే నిజమయిన కాంగ్రెసు వాదులుగ సత్యాగ్రహం చేసి దేశభక్తిని ఋజువుపరుచుకున్నారని స్పష్టమౌతుంది. వీరిలో సర్వశ్రీ ఆర్. నరసింహారెడ్డి, మల్కాజి నారాయణ, సోమలింగం, జగన్నాథ్ రెడ్డిగారలు ముఖ్యులు.

స్టేటు కాంగ్రెసు ఆదేశానుసారం 1947 ఆగస్టు 15 నాడు మెదకులో జండావందనము చేయటానికి శ్రీ చోళలింగయ్య యాదవ్‌గారి కృషి వలన శంకర రావు తోటలో సభ ఏర్పాటు చేయటం జరిగింది. ఇది తెలిసి 300 మంది రజాకార్లు ఆయుధాలతో వచ్చి బెదిరించి రక్తపాతం జరుగుతుందన్నారు. కానీ ప్రజలు సాహసించి జండా ఎగురవేసి తీరారు. దీని వలన ప్రజలలో ఆత్మవిశ్వాసం కలిగింది. భారతీయ వైమానిక దళంలో చేరిన శ్రీ లింగయ్య 1942లో నేతాజీ పిలుపు మేరకు ఐ.ఎన్.ఏ.లో చేరి నేతాజీ నిర్యాణం తర్వాత స్వగ్రామమైన మెదకు వచ్చి కాంగ్రెసు ప్రచారం చేసినారు. 1947లో సత్యాగ్రహం చేసి జేలుకు పోయారు. వీరు గ్రామగ్రామం తిరిగి వెనుకబడిన తరగతుల వారిలో చేసిన తీవ్రమయిన ప్రచార ఫలితముగా విరివిగ సత్యాగ్రహంలో పాల్గొన్నారు. శాలిపేట గ్రామం నుండి సర్వశ్రీ బక్కయ్య బాల నర్సయ్య, చాకలి బాలయ్య, చంద్రయ్య, దుర్గయ్య, ఎడ్ల నరసయ్య, పోచయ్య, బాలయ్యగార్లు పాల్గొన్నారంటే సామాన్యం కాదు. అట్లే మెదకు గ్రామం నుండి సర్వశ్రీ చోళలింగయ్య, లక్ష్మయ్య, ముత్తాయికోట లక్ష్మయ్య, బైండ్లలక్ష్మయ్య, మల్లయ్య నాగోజీ ఆర్. నరసింహారెడ్డి, నారాయణ, మల్కాజి నారాయణ రావు, మండలి పోచాగౌడ్, పోచయ్య, రాజారం రామయ్య, ముత్తాయిపల్లి రాజిరెడ్డి, కట్ల వెంకటస్వామి, ఆర్ వెంకటేశ్వరరావు గారలు సత్యాగ్రహం చేసి జేలుకు వెళ్లారు. అట్లే మానేపల్లి అనే చిన్న పల్లెటూరు నుండి సర్వశ్రీ భూమయ్య, గంగయ్య వేంకటరాజయ్య, వీరయ్యగారలు సాహసోపేతంగా సత్యాగ్రహం చేసి మానెపల్లి అనే తమ ఊరుపేరుకే మాన్యత తెచ్చారు. సర్వశ్రీ భీమారి బాలయ్య మాంధాపురం, పేరవారు భీమయ్య కాజిపల్లి, ఎరబోయిన భూమయ్య కాజిపల్లి,

జగపతిరావు మాందాపురం, బీమారి కిష్టయ్య పేరూరు, లక్ష్మారెడ్డి మాందాపురం, లక్ష్మయ్య మడూరు, పోతరాజులింగయ్య ధర్మవరం, మల్లాగౌడ్ కుమాయుపల్లి, ముత్తయ్య, ధరపల్లి నర్సింలు మడూరు నారాయణ, కాజీపల్లి నారాయణ, మక్దూంపూర్ రామాగౌడ్, పేరూర్ రామచంద్రరావు, సున్నం సత్తయ్య మెదకు, మడూరు శివయ్య పొడిచన పల్లి, వెంకాగౌడ్ గార్లు సత్యాగ్రహం చేయుటవలన వారి వారి గ్రామాలలో కాంగ్రెసు పట్ల ఆదారాభిమానాలు కలిగినవి.

ఈ విధంగా మెదకు జిల్లాలో ఎన్నోచోట్ల ఎంతోమంది త్యాగధనులు స్వాతంత్ర్య పోరాటంలో ధైర్యసాహసాలతో పాల్గొని ఉద్యమానికి ఊపిరి పోశారు.

హైదరాబాదు స్వాతంత్ర్యోద్య చరిత్ర

**రచయిత : వెల్దుర్తి మాణిక్యరావు సౌజన్యంతో**

# మెదక్ జిల్లాలో సాగిన ఉద్యమాలు

## ఆంధ్రజన సంఘము :

12-01-1921 న హైద్రాబాదు నగరమందు 'కార్వే' పండితుని అధ్యక్షతన సంఘ సంస్కరణ మహాసభ నిర్వహింపబడినది. ఈ సభలో మహారాష్ట్ర, కర్నాటక, నాయకులు తమ మాతృభాషలో ఉపన్యసించిరి. కానీ శ్రీ ఆలంపల్లి వేంకటరామారావు గారు తెలుగులో ఉపన్యాసం ఆరంభించగానే, సభికులలో ఉన్న మహారాష్ట్ర , కన్నడిగులు ఉపన్యాసమునకు ఆటంకములు కల్గించిరి. ఈ చర్యను అవమానముగా భావించిన తెలుగు నాయకులు మాడపాటి హన్మంతరావు, కొండా వెంకటరంగారెడ్డి, ఆదిరాజు వీరభద్రారావు, మందుముల నర్సింగరావు, బూర్గుల రామకృష్ణ రావు ప్రభృతులు ఆ రాత్రి శ్రీ టేకుమాళ్ళ, రామారావు గారింట్లో సమావేశమై 'ఆంధ్రజన సంఘము' నేర్పాటు గావించిరి.

4-4-1921 న కొండా వెంకట రంగారెడ్డి అధ్యక్షతన 'ఆంధ్ర జన సంఘము' నకు నియమావళి రూపొందింపబడి శ్రీ రాజగోపాలరెడ్డిగారు అధ్యక్షులుగాను, మాడపాటి హన్మంతరావుగారు కార్యదర్శిగాను నియమింపబడిరి.

1-4-1923 న హన్మకొండ పట్టణమున జరిగిన మహాసభలో కేంద్ర, జిల్లా ఆంధ్రజన సంఘముల నియమావళి ఆమోదింపబడినది. ఆంధ్ర మహాజన సంఘ కార్యక్రమములకను కూలముగా నీలగిరి పత్రిక, తెనుగు పత్రిక, గోలకొండ పత్రికలు ప్రచురింపబడుచూ తెలుగువారి సాహితీ, సాంస్కృతి కాభివృద్ధికి, రాజకీయ చైతన్యమునకు ఎనలేని కృషి చేసినని. ఆ కాలమునందు పత్రిక చదువుట పాపముగా ప్రభుత్వము, జాగీర్దార్ల వంటి చిన్న చిన్న పాలకులు ఆంక్షలు విధించినప్పటికి తెలుగు వారి గుండె నిబ్బరమును పత్రికలు పెంచినవి.

## ఆంధ్రమహా సభలు :

ప్రథమాంధ్ర మహాసభ జోగిపేట తెలంగాణామున ప్రత్యేకముగా తెలుగు ప్రజలలోనవ చైతన్యము కలిగించుటకు, తెలుగువారిలో అణగారియున్న ప్రతిభా వ్యుత్పత్తులను, స్వాతంత్ర్య కాంక్షను మేల్కొల్పుటకు మాడపాటి హన్మంతరావు గారి అధ్వర్యమున క్రీ.శ. 1928లో తెలంగాణా ఆంధ్ర మహాసభ రూపుదిద్దుకొన్నది.

క్రీ.శ. 1930 మార్చి 3,4,5 తేదీలలో అనంత వెంకట్రామ్ గారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా మెదక్ జిల్లా జోగిపేటలో ప్రప్రథమాంధ్ర మహాసభ దిగ్విజయముగా సాగినది. ఈ మహాసభ జోగిపేట వ్యాపారుల అండ దండలతో ప్రారంభింపబడినది. సురవరం ప్రతాపరెడ్డి గారి అధ్యక్షతన "ఆంధ్రదేశపు మట్టి అది మాకు కనకమ్ము" అనే ప్రబోధ గీతాలాపనతో ప్రారంభమై ఆంధ్ర మహాసభ జరిగినది. ఈ సభకు హైద్రాబాదు నుండి ఆరుట్ల రాంచెంద్రా రెడ్డి, రావినారాయణ రెడ్డి, వెంట 15 మంది వాలంటీర్లు సైకిళ్లపై వచ్చిరి. సభలో విధిగా సహపంక్తి భోజనములు సాగినవి. మహిళలకై ప్రత్యేకముగా మహిళాసభ జరిగి శ్రీమతి నడింపల్లి సుందరమ్మ మొట్టమొదటి ఆంధ్రమహా సభ అధ్యక్షురాలుగా ఎన్నికైనది.

సభలో ప్రధానముగా నాటి సాంఘిక సమస్యలను చర్చించిరి. సాంఘిక, దురాచారములు గానున్న బాల్య వివాహములు, వితంతు వివాహముల మీద వాటికి వ్యతిరేకముగా తీర్మాణములు చేయ బడినవి. ఈ సభకు అనేక మంది అనుబంధ ఉద్యమముల నాయకులు, కార్యకర్తలు ఉపస్థితులైనారు.

ఆంధ్ర మహాసభ గ్రంధాలయోద్యముపై ఎక్కువ శ్రద్ధ చూపినది. ప్రజ్వరిల్లిన గ్రంధాలయో ద్యమం మెదక్ జిల్లాలోని జోగిపేటలో మొట్ట మొదటగా ప్రతి స్పందించినది. అట్లే ఆంధ్ర మహాసభ భాషా చారిత్రక సంస్థలపై వర్తక సంఘాలపై మొదట శ్రద్ధ చూపుట జరిగినది.

కాలంగడిచిన కొద్ది, రైతు సమస్యలతోనూ, కార్మిక సమస్యలతోనూ సంబంధం పెట్టుకొని ఆందోళన చేయుట ఆరంభించినది. ఈ ఉద్యమం నాటికి, నేటికీ , గర్వింపదగినదిగా చెప్పొకోవచ్చును. ఈ విధముగా ప్రధమాంధ్ర మహాసభను జోగిపేటలో జరుపుట ద్వారా పోరాటాల చరిత్రలో మెదక్ జిల్లా అగ్రస్థాన మలంకరించినది.

"ఆంధ్రదేశపుమట్టి, అది మాకు కనకమ్ము" అన్న జాతీయ గీతంతో మొదలైన మొట్టమొదటి తెలంగాణ ఆంధ్ర మహాసభ కు వేదికయ్యైన మెదక్ జిల్లా ఆంధ్ర మహాసభా పర్వమునందలి చిట్టచివరి పదమూడవ మహా సభకు ఆధిత్యమిచ్చినది.

క్రీ.శ. 1946 లో మెదక్ జిల్లాలోని 'కంది' గ్రామంలో 13వ ఆంధ్రమహాసభ నిర్వహింపబడినది. ఈ మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా మెదక్ జిల్లాకు చెందిన బచ్చు వెంకటేశం గుప్తగారు కార్యదర్శిగా జయరాం రెడ్డిగారు ఉండిరి. జేతే లక్ష్మయ్య, కందికిషన్ రావులు ఎంతేని సహాయమందించిరి ఆంధ్రమహా సభకు జమలాపురం కేశవరావు అధ్యక్షత వహించిరి.

ఈ ఆంధ్ర మహాసభ కార్య కలాపములచే ప్రజలలో నవచైతన్యము కలిగి స్వాతంత్ర్య పిపాస పెరిగి, రాచరిక వ్యవస్థపై మనస్సు తిరిగి, ఉద్యమకారులపై గౌరవాభిమానములు పెరిగి ప్రజా పోరాటములను నిర్వహించుటకు ఆసక్తి కలిగినది.

ఈ సమావేశములలో రాష్ట్ర కాంగ్రెసుపై గల నిషేధమును తొలగించుటకు, జిల్లాలో ఖద్దరు పరిశ్రమకు, మద్యపాన నిషేధముకు ఆయుర్వేద వైద్యమునకు అనుకూలవముగా తీర్మానవములు చేయబడినవి.

వ్యవసాయము, ఆర్థిక పరిస్థితి, విద్య, స్త్రీ విద్య, నిర్భంద విద్య, మాతృభాషా బోధన వ్యాయామశాలల స్థాపన, హరిజనాభివృద్ధి, ఎట్టిచాకిరీ నిర్మూలన, లంచగొండితనం మొదలగు విషయములై సభలో వివరంగా చర్చింపబడి తీర్మానములు చేయబడినవి.

ఈ సభలలో విశేశ కృషిగావించిన శ్రీ వేంకట రాజేశ్వర జోషి, శంకరంపేట గారికి జిల్లాపౌరులు, ఎంతగానో ఋణపడియున్నారు. వీరు ముఖ్యముగా జిల్లాలోని చేనేత పారిశ్రామికులకై సంస్థలను నెలకొల్పి, వారి అభివృద్ధికై ఎనలేని కృషి చేసిరి.

మహాసభ తీర్మానములను అనుసరించి మెదక్ జిల్లాలోని నాయకులు, జిల్లా అంతట పర్యటించి వీలైన చోట్ల గ్రంధాలయములు, వయోజన పాఠశాలలు ఏర్పాటు గావించిరి. సంగారెడ్డి, సిద్దిపేట, జోగిపేటలలో గ్రంధాల యాలు స్థాపించబడి తద్వారా విద్యా విజ్ఞానముల వ్యాప్తికై కృషిచేయబడెను.

ఆనాడు కర్షకులు తమ బావుల క్రింద సేద్యము చేసుకొన్ననూ 'తరీధార గా' ప్రభుత్వం పన్నులు వసూలు చేయుచుండెను. ఈ పన్ను విధానమును వ్యతిరేకించి, బావుల క్రింది సేద్యమునకు 'ఖుష్కి-ధార'గా తీసుకొనవలెనని పోరాటం చేయబడినది. వీలైనంత వరకు ఇందుకు విరుద్ధవముగా చేయబడెను తీర్మానములకు అప్పీలు చేయు బాధ్యత సంస్థలోగల న్యాయ వాదులు తీసుకొని రైతాంగమునకు తోడ్పడిరి.

కొన్ని రోజుల పోరాటం తర్వాత తెలంగాణా మహాసభా ప్రాతినిధ్యంపై రైతుల కోరికకు అనుగుణ్యంగా ప్రభుత్వము పరిష్కారము చేసినది.

నిజాం నిరంకుశ పరిపాలనలో ఆంధ్ర మహాసభ జరుగవలెనన్నను, కాక ఏదేని చిన్న బహిరంగ సభ గ్రామములో జరుగ వలెనన్న, ప్రభుత్వము యొక్క అనుమతి అవసరం. అంతేగాక ఆ సమావేశము ఏ తేదిన ఎప్పుడు ఎక్కడ జరిగేది, ఎవరు వచ్చేది, ఉపన్యాసకుల పేర్లతో వారు మాట్లాడు విషయాలతో వివరంగా, లిఖితపూర్వకంగా ప్రభుత్వమునకు తెలియపర్చ వలసి యుండెడిది. ఇంత జరిగినప్పటికీ అనుమతి లభించుట రాజాధీనమై యుండెడిది. సభలలో ఉపన్యసించు వారిపై సభ నిర్వాహకుల పై చివరికి, సభలో పాల్గొనే ప్రేక్షకులపై కూడా ప్రభుత్వం ఆంక్షలు పెట్టి అనేక బాధలకు గురిచేయు చుండెడిది.

ఖద్దరు ధరించుట చేయరాని నేరముగా, సభలలో ఉపన్యసించుట రాజద్రోహవముగా భావింపబడుచుండెను.

1942లో భారతదేశ మంతటా 'క్విట్ ఇండియా' ఉద్యమం ఆరంభింప బడినపుడు హైద్రాబాద్‌లో కాంగ్రెసు సంస్థకు సంబంధించి వారందరినీ ప్రభుత్వం నిర్బంధించి, కారాగారములు నింపినది. ఆ పోరాటములో జిల్లాలోని కొందరు కార్యకర్తలు, హైద్రాబాద్ కార్యకర్తలతో కూడి నైజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా పోరాటం చేసిరి.

అపుడే ఈ జిల్లాలో కూడా కాంగ్రెసు సంస్థను, వాలంటీర్ దళాలను, ప్రతీ గ్రామంలో గ్రామ కమిటీలను ఏర్పాటు చేసి బలపర్చినది.

ఆంధ్ర, మహారాష్ట్ర, కర్నాటక ప్రాంతములలో వేర్వేరుగానున్న సంస్థలు విలీనమైనవి. ఈ సంస్థలన్నియూ కాంగ్రెసు సంస్థకు స్వాధీనమైనవి. ఒక పటిష్టమైన రాజకీయ సంస్థగా రూపొందినది. ఆ సంస్థకు శ్రీ రామానంద తీర్థగారు తొలి అధ్యక్షులుగా నుండిరి. వారి అధ్వర్యంలో రాష్ట్రమంతటా రాజకీయ విప్లవం వర్ధిల్లి నైజాం పతనమునకు కారణమైనది.

మెదక్ జిల్లాలో ప్రతీ తాలుకాలో, ప్రతీ గ్రామంలో కాంగ్రెసు కార్యాలయములు స్థాపింపబడినవి.

ఈ విధముగా మెదక్ జిల్లా భారత స్వాతంత్ర్య పోరాటంలో తన వంతు పాత్రను నిర్దిష్టంగా నిర్వహించుచూ, స్థానిక నిరంకుశ ముష్కర ప్రభుత్వము నకు వ్యతిరేకంగా పోరాటం సల్పుచూ, విశాల దృక్పథముచే, భావి భారత నిర్మాణ పుటాలోచనతో భారతీయ స్వాతంత్ర్య సంగ్రామమున పాలు పంచుకొన్నది.

## గ్రంధాలయోద్యమము :

హైద్రాబాదులో కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం స్థాపనతో గ్రంధాలయోధ్యమము ప్రారంభమైనదని చెప్ప వచ్చును.

మెదకు జిల్లాలో కూడా గ్రంధాలయోద్యమము ముమ్మరముగా సాగినది.

మొట్టమొదట 1922లో జోగిపేటలో జోగినాధాంధ్ర గ్రంధాలయము అక్కడి యువకులు వ్యాపారులు చొరవతీసికొని ప్రారంభించిరి. 1923లో సంగారెడ్డిలో ఆనంద గ్రంధాలయము స్థాపించబడినది. 1924లో సిద్ధిపేటలో ఉమామహేశ్వర ఆంధ్రభాషా నిలయము ప్రారంభించ బడినది.

తెలంగాణా ప్రజలలో విజ్ఞానం పెంపొందకుండా ప్రభుత్వం గస్తీనిశాన్ శాసనం ప్రకటించినది. ఈ శాసనం ప్రకారం ప్రభుత్వ అనుమతి లేకుండా గ్రంధాలయం, పాఠశాల, వ్యాయామశాల మొదలైనవేవీ స్థాపించరాదు. ఇంతటి కఠిన శాసనములున్న కాలమున గ్రంధాలయముల నేర్పరచుట అసాధారణ విషయము.

ఆంధ్ర మహాసభ స్థాపనతర్వాత గ్రంధాలయోద్యమము మెదకు జిల్లాలో మరింత విస్తరించినది.

1935లో బి.వెంకటరాజేశ్వర జ్యోషి కార్యదర్శిగా ఆందోలు తాలూకాలోని చౌటకూరలో శ్రీ లక్ష్మీ నరసింహ గ్రంథాలయం, పెద్దశంకరం పేటలో మార్కాండేయ గ్రంథాలయం, డాకూరులో సచ్చిదానంద గ్రంథాలయం, రామంచలో జైహింద్ గ్రంథాలయం, సదాశివపేటలో ఆంధ్ర విజ్ఞాన గ్రంథాలయం నెల కొల్పబడినవి.

జిల్లాలో ఈ ఉద్యమ నిర్వాహణలో ఆనాటి గ్రామీణ యువకులు చురుకైన పాత్ర నిర్వహించిరి.

సాహిత్యాన్ని సామాన్య ప్రజలు కూడా కొని చదువుటకై మెదకు జిల్లాకు చెందిన వెల్దుర్తి మాణిక్యరావు నేతృత్వంలో అణాగ్రంధమాల ముద్రణా సంస్థను హైద్రాబాదులో స్థాపించిరి. ఈ సంస్థ ద్వారా సుమారు 40 పుస్తకములను ముద్రించి అణాకు ఒకటి చొప్పున అందించి తెలుగు భాషావికాసాన్ని అందరికి అందుబాటు లోనికి తెచ్చుట జరిగినది.

## ఆర్యసమాజం :

నిజాం పరిపాలనలో హిందువులను చిన్న చూపు చూచుట అల్పసంఖ్యాకులైన మహమ్మదీయులను అతి గౌరవముగా చూచుట జరుగు చుండెను. అచ్చటచ్చట నిమ్నకులములవారిని ప్రలోభ పరిచియో, భయపెట్టియో హిందూ మతము నుండి మహమ్మదీయ మతములోనికి మార్చుచుండిరి.

ఈ విషయములను గమనించి హిందూమత సంరక్షణమునకై హైందవులలో భయమును పోగొట్టి జాగృతిని కల్గించుటకై ఆర్యసమాజము స్థాపించబడినది. హిందూ మత సంరక్షణతో పాటు ప్రజలలో విద్యాసాంఘిక, రాజకీయ చైతన్యము కల్గించుటకు ఆర్య సమాజము విశేషముగా కృషి చేసినది.

మెదకు జిల్లాలో ఆర్య సమాజ కార్యక్రమములను విశేషకృషితో నిర్వహించిన వారిలో బసవ మాణయ్య ఎక్కిలి సిద్దప్ప, బాసెట్టి శివరాం, కటుకంరాములు ప్రముఖులు గా పేర్కొనవచ్చును.

ఆకాలమున సదాశివ పేట నివాసియగు కటుకం రాములు వితంతువగు భ్రమరాంబికాదేవిని వివాహమాడి సంఘసంస్కరణమును ఆచరణలో చూపించిన మహామహుడు.

## యంగ్ మెన్స్ ఆంధ్ర అసోసియేషన్ :

హైద్రాబాదు లో క్రైస్తవులు యంగ్ మెన్స్ క్రిస్టియన్ అసోసియేషన్‌ను స్థాపించి క్రైస్తవులలో ఐక్యతను, మత ప్రచారమును సాధించుచుండిరి.

వెల్దుర్తి మాణిక్యరావు మనసున ఈ సంస్థ ప్రభావము చూపినది. వెంటనే యంగ్‌మెన్స్ ఆంధ్ర అసోసియేషన్ అను సంస్థను స్థాపించి కార్య దర్శిగా నుండి తెలుగు భాషా వృద్ధి తెలుగు వారి సాంఘిక జీవన పురోభివృద్ధికై అనేక విషయములను చర్చించెడివారు. మాణిక్యరావు గారు మెదకు జిల్లా వెల్దుర్తి గ్రామవాస్తవ్యుడు.

# కమ్యూనిస్టు పోరాటం

ఈ పరిస్థితులలో ప్రజలకు అండగా నిల్చి, ప్రజా పోరాటముల ద్వారా ఫ్యూడల్ వ్యవస్థను రూపుమాపుటకు, రజాకార్ల దురంతాలకు వ్యతిరేకముగా సాయుధపోరాటానికి సన్నద్ధం చేసి నీ గోరి కడ్తం కొడుకో -"నైజాం సర్కారోడా" అంటూ నైజాంరాజ్యంను అంతంచేయడానికి పంతంపూనిన వారు ఆనాటి కమ్యూనిస్టులు. ప్రజలలో తామై, నిత్యజీవన పోరాటాన్ని కొనసాగించి తమ పాటలద్వారా, మాటలద్వారా ప్రజలలో రాజకీయ చైతన్యాన్ని ప్రజ్వలింపజేసి, ప్రాణాలకు తెగించి, పోరాటానికి ఆరాటపడిన వారు కమ్యూనిస్టు యోధులు. అమాయకులైన ప్రజలకు ఆయుధాలను అందించి, వాటి వాడకం నేర్పి, గెరిల్లా యుద్ధంలో తీర్చిదిద్ది, అటు రజాకార్లను ఇటు నిజాం నవాబు సైన్యములను ముప్పతిప్పలు పెట్టి మూడు చెఱువుల నీళ్లు త్రాపుటకు కమ్యూనిస్టు సంస్థ ఆవిర్భవించినది.

ఆ సంస్థ లో ప్రథమగణ్యులు రావి నారాయణరెడ్డి గారు. కమ్యూనిస్టు పార్టీ ఉద్యమ నిర్మాతగా రావి నారాయణరెడ్డి గారు ప్రజాభిమానమును పొందిరి. బద్దం ఎల్లారెడ్డి, అరుట్ల రాంచంద్రారెడ్డి, కమలాదేవి, రాజబహద్దూర్ గౌడ్, మొదలగు వారు నిజాం రాజ్యంలో కమ్యూనిస్టులకు నాయకత్వము వహించిరి.

మెదక్ జిల్లాలో-కమ్యూనిస్టు నాయకుల్లో ప్రజాకవి మఖ్దూం మొహియొద్దీన్, గురువారెడ్డి, సంగప్ప, నారాయణరెడ్డి (సంగారెడ్డి) ఆవునూరి చారి, కేవల్ కిషన్, ఎస్. బాల్‌రెడ్డి, వై. గోపాల్‌రెడ్డి, సి. హెచ్. విఠల్ రెడ్డి, వంటి ప్రముఖులు అగ్రశ్రేణి నాయకులుగా ప్రజాభిమానములను పొందిరి.

నిజాం రజాకార్ల దురంతలకు, వ్యతిరేకముగా మెదక్ జిల్లా సాయుధ పోరాట విప్లవ కారులు, చరిత్రలో విశిష్ట స్థానమును సంపాదించిరి. రజాకార్ల నుండి ప్రజలకు రక్షణ కల్పించుటలో తమ వంతు కర్తవ్యమును నిర్వహించిరి.

# భూదానోద్యమం

స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత భూమిలేని నిరుపేదల కొరకు ఆచార్య వినోబాభావే భూదానోద్యమును చేపట్టిరి.

దేశమంతట పర్యటించుచు భూస్వాముల నుండి తాను భూదానమున్నుగైకొనుచు, అక్కడే యున్న భూమిలేని నిరుపేదలకు అట్టి భూమిని పంపిణి చేయుటే భూదానోద్యమముగా ఆచార్యులు ప్రారంభించిరి.

ఆచార్య వినోబాభావే గారి ఉద్యమమునకు మంచి స్పందన లభించినది. దేశంలో వారెక్కడ పర్యటించినను వేల కొలది ఎకరములు భూస్వాములు భూదానము గావించిరి.

ఆ పర్యటన పరంపరలో 1950 మధ్యకాలంలో తూప్రాన్ మార్గమున పయనించుచుండిరి. కూచారం గ్రామ సమీపమున కొందరు పేదలు తమకు భూమిలేదని ఆచార్యులతో విన్నవించుకొనిరి.

కూచారం గ్రామ భూస్వాములు శ్రీనివాసరావు, బన్సీధర్‌లాల్‌గార్లు ఆచార్యుని తమ గ్రామమునకు రావించుకొని 20 (ఇరువది) ఎకరములు భూదానమొనర్చిరి. అట్టి భూమిని ఆచార్యులు వెంటనే ఆ గ్రామ నిరుపేద రైతులకు నొసంగిరి.

జహీరాబాద్ మండలమునందలి రంజోల్ గ్రామ నివాసులైన శ్రీ సూడె గోపాల్ రెడ్డిగారు భూదానోద్యమంలో 18 ఎకరములు దానము చేసినట్లు వారి మనమడు డా. సూడె కృష్ణా రెడ్డిగారు తెలిపిరి.

# స్వాతంత్ర్య సమరయోధులు

## వెల్దుర్తి మాణిక్యరావు

మెదకు జిల్లాలో వెల్దుర్తి నేడొక మండల కేంద్రము. ఒకనాడు నిజాం నవాబులనెదిరించి భారత జాతీయ జెండా ఎగుర వేసిన వీరగడ్డ. అట్టి గడ్డ పై పుట్టిన మహామనీషి వెల్దుర్తి మాణిక్యరావు.

1913 లో వెల్దుర్తి గ్రామంలో శ్రీ వెంకటేశ్వర రావు శ్రీమతి రుక్మిణి దంపతులకు మొదటి సంతానంగా మాణిక్యరావు గారు జన్మించిరి.

మెదకు పట్టణంలోని ఉన్నత పాఠశాలలో వీరి ప్రాథమిక విద్య సాగి మెట్రిక్యులేషన్ ఉత్తీర్ణతనందిరి. ఉన్నత విద్యాభ్యాసము కోసము హైద్రాబాదు చేరిరి.

ఆ రోజులలో స్థానిక భాషయైన తెలుగునకు గౌరవము లేకుండుటే కాదు తెలుగును ఒక హీన భాషగా పరిగణించుచుండిరి. ఆ సమయంలో తెలుగు భాషకు తెలుగువారి సంస్కృతీ సంప్రదాయాలకు, తెలుగు ప్రజల సర్వతో ముఖాభివృద్ధికై ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారు కృషి సల్పుచుండిరి. వారి బోధనలకు ప్రభావితుడైన మాణిక్యరావు ఆ ఉద్యమంలో చేరి ఆంధ్ర మహాసభ కార్యదర్శి పదవి నిర్వహించిరి. సురవరం ప్రతాపరెడ్డి గారి ప్రోత్సాహంతో గోలకొండ పత్రికకు సహాయ సంపాదకులుగా మద్యపాన నిరోధక మాసపత్రిక కు తెలుగు ఉర్దూ భాషలలో సంపాదకులుగా పని చేసిరి.

స్వాతంత్ర్య సమర యోధులు హయగ్రీవాచారి, బూర్గుల రామకృష్ణరావు, పి.వి. నర్సింహారావు, కాళోజీ నారాయణరావు, దాశరథి, కాటం లక్ష్మీనారాయణ సురవరం ప్రతాపరెడ్డి మాడపాటి హన్మంతరావు గార్లతో కలిసి మాణిక్యరావు గారు స్వాతంత్ర్యోద్యమంలో చురుకుగా పాల్గొనినారు. ఎన్నో మార్లు జైలు శిక్షను అనుభవించిరి. ఎంతో కాలము రహస్యజీవితమును గూడా గడిపిరి.

ఒకవైపు స్వాతంత్ర్య సంగ్రామంలో రాజకీయ జీవితము, మరొకవైపు మేధాసంపత్తి రంగాలలో కవిజీవితము ఒక దాని నొకటి అల్లుకొని పెనవేసికొనినవి. వీరు తమ రచనల ద్వారా ప్రజలను చైతన్యవంతులను చేయుటకు ఎనలేని కృషి సల్పిరి.

మాణిక్యరావు గారు భావుకులు. వీరి భావుకతకు వీరు రచించిన 'నెలవంక' 'నలమహారాజాక్కడి' 'ఎక్కడున్నది శక్తి' మొదలగు కవితలు మచ్చుతునకలు.

స్వాతంత్ర్యోద్యమ కాలంలో 'గోల్కొండ' ప్రజాసాహితి, జనధర్మ, జనత, భారతి, తెలుగు భూమి, ఆంధ్ర పత్రిక, ఆంధ్రజనత, కృష్ణాపత్రిక, ప్రజామిత్ర, యుగవాణి, మద్యపాన వ్యతిరేక పత్రిక వంటి తెలుగు పత్రికలలోను, 'తర్కి-ముస్కి-రాత్' వంటి ఉర్దూ మాసపత్రికలోను కవితలు, వ్యాసాలు లేఖలు వ్రాసి ప్రజలను చైతన్యవంతులు చేసేవారు.

వివిధ పత్రికలలో ఉర్దూ - ఇంగ్లీషు - మరాఠీ - కన్నడ భాషలలో కూడా రచనలు చేసిరి.

'అణాగ్రంధమాల' కు సంపాదకునిగా 'స్వాతంత్ర్య సమర సంచిక కు సంకలనకర్తగా, 'హైద్రాబాద్ రాజ్యాంగ సంస్కరణలు' 'ఖాదీ' 'సర్దార్ జమలాపురం కేశవరావు జ్ఞాపకాలు' 'హైద్రాబాదు స్వాతంత్ర్య చరిత్ర' వంటి గ్రంధాలను రచించుటేగాక అనేక రేడియో నాటికలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, కథలు, గేయాలు వ్రాసిరి అట్లే 'టచ్ బేరర్స్ ఆఫ్ ఫ్రీడం మూవ్‌మెంట్స్' అనే పుస్తకాన్ని ఆంగ్లంలో రచించిరి. ఈ ఇంగ్లీషు పుస్తకాన్ని భారత ప్రభుత్వము దేశంలోని అన్ని భాషలలోనికి అనువదింపజేసినది.

వెల్దుర్తి మాణిక్యరావు గారు అనేక సన్మానములు పొందిరి. ఉపరాష్ట్రపతిగానున్న శంకర్‌దయాళ్ శర్మ రాష్ట్రపతి జ్ఞానీ జైలు సింగ్‌లు మాణిక్యరావు గారిని సన్మానించిరి. ఎన్నో సందర్భములలో ఎందరో ప్రముఖులచే మాణిక్యరావు గారు సన్మానింపబడిరి.

1935 నుండి 1986 వరకు వ్రాసిన కవితలను 'మాణిక్యవీణ' పేరుతో కవితా సంకలనాన్ని ప్రచురించిరి.

మాణిక్యరావుగారు రాష్ట్రస్వాతంత్ర్య సమరయోధుల సంఘంలో ఎన్నో పదవుల నిర్వహించిరి.

హైద్రాబాదులోనే నివాసమేర్పర్చుకున్నా జన్మభూమిని మరువక వెల్దుర్తి మాణిక్యరావుగా పిలువబడిన వీరు ...పరమపదించిరి.

వెల్దుర్తి మాణిక్యరావుగారు స్వాతంత్ర్య సమరయోధులుగా, కవిగా, పాత్రికేయునిగా వెల్దుర్తి గ్రామానికే కాక మెదకు జిల్లాకే గర్వ కారణమని చెప్పవచ్చును.

# బస్వమాణయ్య

మెదకు జిల్లా స్వాతంత్ర్య సమర యోధులలో అతిపిన్న వయస్సులో పదహారవ ఏటనే పాల్గొనిన మహామహుడు బస్వమాణయ్య.

బస్వమాణయ్య 1923 నవంబర్‌లో జోగిపేట లో జన్మించిరి. స్థానికంగా ఏడవ తరగతి చదువుచున్న మాణయ్య స్వాతంత్రోద్యమం వైపు తన దృష్టిని సారించెను. స్వాతంత్ర్య పోరాట నేపథ్యంలో1947 లో మిలిట్రీవారు వీరి యింటిని చుట్టిముట్టి అరెస్టు చేసి జైలులో నిర్బంధించిరి.

నిజాం రాష్ట్రంలో పోలీసుల జులుం అధికముగా నుండెను. 'ఖాసిం రజ్వీ' ఆగడములు తెలంగాణా ప్రజలను భయభ్రాంతులను గావించుచుండెను.

ఈ విషయమును గూర్చి చర్చించుటకై బస్వమాణయ్య సర్దార్ వల్లబ్బాయ్ పటేల్‌ను కలిసి ఇచ్చటి దైన్య పరిస్థితిని వివరించెను. తిరుగు ప్రయాణములో బస్వమాణయ్యను నిజాం పోలీసులు అరెస్టు చేసి చంచల్‌గుడా, గుల్బర్గా, ఔరంగాబాద్, సంగారెడ్డి జైళ్లలో నిర్బంధించిరి.

స్వాతంత్ర్యానంతరము మానవ సేవయే మాధవ సేవగా నెంచి జోగిపేట ప్రాంతాన్ని అభివృద్ధి పరచుటకై అనేక కృషి సల్పిరి.

1957 సార్వత్రిక ఎన్నికలలో అందోల్ నియోజక వర్గము నుండి స్వతంత్ర అభ్యర్థిగా పోటీ చేసి కాంగ్రెస్ అభ్యర్థి రుక్నొద్దీన్ ఓడించి విజయమును సాధించి శాసన సభ్యునిగా ఎన్నికైనారు.

వీరు శాసన సభ్యులుగా పలుప్రజాసమస్యలపై వందేమాతరం రామచంద్రరావు, వావిలాల గోపాల కృష్ణయ్యలతో కలిసి ప్రభుత్వాన్ని నిలదీసెడి వారు. 18 సంవత్సరములు జోగిపేటకు సర్పంచుగా నుండి గ్రామ పంచాయతిని మేజర్ గ్రామపంచాయతి స్థాయికి గొని వచ్చిరి.

బస్వమాణయ్య శాసనసభ్యునిగా సర్పంచ్‌గా నున్న సమయంలో గ్రామీణ అభివృద్ధికి అనేక సంక్షేమ కార్యక్రమాలను చేపట్టిరి. రహదారుల నిర్మాణము, మంచినీటి సౌకర్యము, గ్రామీణ ప్రాంతాలకు రవాణా సౌకర్యము మొదలగు ప్రజోపయోగ కార్యక్రమాలు వీరు చేపట్టిరి.

జయప్రకాష్ నారాయణ్ సిద్ధాంతాలకు అనుగుణంగా వ్యవహరించుచు అనేక సాంఘిక కార్యక్రమాలలో పాల్గొనేవారు.

జోగిపేట పార్క్‌లో గాంధీ విగ్రహ ప్రతిష్ఠ జోగిపేట బస్టాండ్ ఈయన సాధించినవే.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి వెంగళ్‌రావు ముఖ్యమంత్రిగానున్న సమయంలో రవీంద్ర భారతిలో బస్వమాణయ్యను తామ్రపత్ర పురస్కారంతో గౌరవించిరి.

ఆ కాలంలో మెదకు జిల్లాలో అధిక విద్యావంతులలో బస్వమాణయ్యగారొకరు. వీరున్యాయ శాస్త్రంలో పట్టాపుచ్చుకొనినారు.

ఒకేసారి శాసనసభకు ఎన్నికైనప్పటికి వారి సేవలు నేటి తరానికి ఆదర్శప్రాయమైనవి.

# కేవల్‌కిషన్

మెదకు జిల్లాలో చిన్న శంకరంపేట మండలంలో తుర్కల మాందాపూర్ గ్రామంలో కేవల్ నారాయణ మున్నమ్మ ముద్దుల బిడ్డడుగా కేవల్ కిషన్ క్రీ.శ. 1920లో జన్మించిరి.

హైద్రాబాదు ఉస్మానియా యూనివర్సిటీలో ఎం.ఏ. వరకు విద్యాభ్యాసమొనర్చిరి. ఆ కాలములో అంతటి విద్యావంతులుండుట చాలా అరుదు.

చదువుతున్న రోజుల్లోనే జోగిపేటలో ప్రథమాంధ్ర మహాసభలు ఆయనను రాజకీయ జీవితం వైపు మరల్చినవి. క్రీ.శ. 1936లో ఎం.యస్.రామ్ నలినీ బుకేష్ గుప్త, యస్. ఎ. డాంగే ఆధ్వర్యంలో దేశవ్యాప్తంగా కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భవించింది.

కేవల్ కిషన్ విద్యార్థి దశలోనే కమ్యూనిస్టు పోరాట కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొనేవాడు.

మెదకు డివిజన్‌లో కాట్ర్యాల్, పాతూర్, అక్కన్నపేట, జక్కన్నపేట, మాసాయిపేట తదితర గ్రామాలలో అనేక భూపోరాటాలు చేసి నిరుపేద రైతాంగానికి వేలాది ఎకరముల భూములనిప్పించి వాటిపై ప్రభుత్వ పరంగా శాశ్వత హక్కుల నిప్పించినాడు.

ఈ కార్యక్రమంలో భాగంగా కేవల్‌కిషన్ తిరుగని గ్రామంలేదనడం అతిశయోక్తి కాదు. పేదల్లో తానూ పేదవాడై వాళ్ళు పోసిన గంజి తాగినాడు. లంబాడోళ్లయిండ్లలో జొన్న గటిక తిని కడుపు నింపుకున్నాడు. ఇళ్ళు లేని వారికి ఇళ్ల స్థలాలు ఇప్పించినాడు. అప్పట్లో తహసీల్దార్ ఉద్యోగమిస్తామని ప్రభుత్వం సందేశం పంపితే వద్దు పొమ్మన్నాడు. బీద సాదల కోసం పోరాటం సాగించినాడు.

మెదకు పట్టణంలోని దుబ్బితోటలో 120 ఎకరాల తాతలనాటి స్వంత భూమిని పేదలకు పంచినాడు. వారందరికి ఇండ్లు కట్టించినాడు. అది నేటికి 'కేవల్‌కిషన్ బస్తీ' గా పిలువబడుతున్నది.

మెదకు ప్రాంతంలోని ఓ చరువు నిర్మాణంతో అనేక మందిపేదవారి జీవితాలకు భంగం వాటిల్లుటను గమనించి ఆ చెరువు నిర్మాణాన్ని ఆపించేప్రయత్నం చేసినాడు. నిజాం నవాబు మిలటరీ దళాల కాపలాతో చెరువు కట్ట నిర్మాణం పూరించినాడు. చెరువు నీటిలో పేదలయిండ్లు మునిగి పోయే పరిస్థితి సంభవించింది.

కేవల్ కిషన్ ఉగ్ర నరసింహుడైనాడు. జనసమీకరణ చేసి చెరువుకట్టకు గండి పెట్టినాడు పేదల యిండ్లు నీటిపాలుగాకుండా కాపాడినాడు.

ఎక్కడ అన్యాయం జరిగితే అక్కడ కేవల్ కిషన్ ప్రత్యక్షమై బీదల పక్షాన పోరాడేవాడు. దోపిడీ దారుల, పెత్తం దారుల గుండెల్లో బల్లెంగా నిలిచేవాడు.

నిజాం రాజ్య విమోచనోద్యమంలో చురుకుగా పాల్గొన్నాడు.

స్వతంత్ర్యం వచ్చిన తరువాత తొలి సార్వత్రిక ఎన్నికలలో పీపుల్స్ డెమొక్రటిక్ ఫ్రంట్ తర పున మెదకు శాసనసభా నియోజక వర్గానికి పోటీచేసి కేవలం 900 ఓట్ల తేడాతో ఓటమి చెందినాడు. ఆరుట్ల రామచంద్రారెడ్డి ఆధ్వర్యంలో కేవల్ కిషన్ రాష్ట్ర కమ్యూనిస్టు నాయకునిగా గుర్తింపు పొందినాడు. ఆయన స్ఫూర్తితో చిలుముల విఠల్‌రెడ్డి, నల్లమలగిరి ప్రసాద్, చంద్ర రాజేశ్వరరావు వంటి వారు కామ్రేడ్లుగా ఎదిగినారు.

తేది 26 డిసెంబర్ 1960 న నిరుపేదల ఉద్ధరణలో భాగంగా నేటి వెల్దుర్తి మండలం మాసాయి పేట గ్రామానికి వెళ్లి పని ముగించుకొని తిరిగి వచ్చే సమయం లో రాత్రి 11 గంటల-పోలంపల్లి చౌరస్తా వద్ద కేవల్‌కిషన్ మోటర్ సైకిలును లారీ ఢీ కొన్నది. కేవల్ కిషన్, అతని అనుచరుడు యిరువురూ ఆ ప్రమాదంలో మరణించినారు. మరణించిన చోట కేవల్ కిషన్ ప్రతిమను నిర్మించినారు. ఇప్పటికి ఆ సమాధి వద్ద ప్రతి సంవత్సరం జాతర సాగుతుంది. ఈ ప్రమాదాన్ని పెత్తందారీ కుట్రగా ప్రజలు నమ్ముతారు.

ఈ విధముగా మెదకు జిల్లాలో ధనవంతుల యింట పుట్టి గొప్ప విద్యావంతుడై పేదవారికోసం తన ధన, ప్రాణాలను సర్వస్వం అర్పించిన కేవల్‌కిషన్ నేటికి చిరస్మరణీయుడు.

## మఖ్దూం మొహియుద్దీన్

సమసమాజ నిర్మాణమే ధ్యేయంగా జీవితాన్ని సమాజం కోసం అర్పించిన త్యాగధనులలో మఖ్దూం మొహియుద్దీన్‌కు మెదకు జిల్లా మాణిక్యంగా వర్ణించవచ్చు.

మఖ్దూం మొహియుద్దీన్ మెదకు జిల్లా అందోలులో జన్మించి క్రీ.శ.1908లో జన్మించెను. ఈతని తండ్రి గౌస్ మొహియుద్దీన్ తాలూకా ఆఫీసులో సూపరింటెండెంట్లు గా పని చేసేవాడు. మఖ్దూం నాలుగేళ్ల వయసులోనే తండ్రి మరణించి నాడు. మఖ్దూం తల్లి పునర్వివాహము చేసికొన్నది. మఖ్దూంను అతని పిన తండ్రి బషిరుద్దీన్ మహమ్మదీయ మత వాతావరణంలో పెంచినాడు.

మఖ్దూం మెదకు ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో మెట్రిక్యులేషన్ పాసై ఉన్నత విద్యకోసం హైద్రాబాదు చేరినాడు.

భారతదేశం అంతటా స్వాతంత్ర్య ఉద్యమం ప్రారంభమైంది. గాంధీజీ నాయకత్వంలో జాతీయ కాంగ్రేస్ ప్రత్యక్ష ఉద్యమం నడపడానికి సంకల్పించింది.

ఈ సమయంలో అక్బర్ అలీఖాన్ వంటి కొందరు యువకులు సత్యాగ్రహంలో చేరి అరెస్టుకాబడిరి. ఈ విషయం హైద్రాబాద్ ముస్లిం యువకులు కొందరిని ప్రభావితం చేసింది ఆ రోజుల్లో ఫతేపూర్ నుండి వచ్చే 'నిగార్' అనే మాసపత్రికలో రాసే రాతలు ముఖ్యంగా ముస్లిం యువకులను కదిలించి వీరిలో హేతువాద దృష్టిని రేకెత్తించినవి.

ఈ పరిస్థితులలో మఖ్దూం కవి తాత్మమేల్కొని సామ్రాజ్యవాదానికి, దారిద్ర్యానికి, కిరాతకత్వానికి, నైతిక పతనానికి వ్యతిరేకంగా సామాజిక ప్రయోజనాల కోసం **1933-1934** లో అనేకగేయాలు మఖ్దుం కలం నుండి జాలువారినవి. కాలంచెల్లిన పెట్టుబడి దారీకళ, సాహిత్యం పై అనేక రచనలు గావించినాడు. 'అతీష్కదా' (అగ్నిగుండం) తెలంగాణా, అంధేరా, ఇంతేజార్ (నిరీక్షణ) లాంటి అనేకగేయాల మాలలను అల్లినాడు.

**1936-38** లో కామ్రేడ్స్ అసోసియేషన్ను స్థాపించి యువకులలో రాజకీయ పరిజ్ఞానాన్ని కల్గించి వేదికగా దానిని తీర్చి దిద్దినాడు.

ఈ కామ్రేడ్స్ అసోసియేషన్ ద్వారా వందలాది మంది యువ కార్యకర్తలు తయ్యారైనారు.

గవర్నమెంటు సిటీ కాలేజి లెక్చరర్ పదవికి రాజీనామా యిచ్చిన మఖ్దూం కమ్యూనిస్టు పార్టీ ఫుల్ టైమ్ కార్యకర్తల విప్లవదళంలో చేరినాడు.

జాతీయ నాయకుల అరెస్టుకు నిరసనగా సామ్రాజ్యవాద, నిజాం కిరాతక చర్యలను నిరసిస్తూ ఒక బహిరంగ సభలో ప్రసంగించిన మఖ్దూం పై కేసు పెట్టి ప్రభుత్వం అతనికి జైలు శిక్షవిధించింది. జైలులో రామానందతీర్థ, అచ్యుతరావు దేశ్పాండే, బిర్దీచాంద్ చౌదరీ, ఆర్. యస్. దివాన్ల సాహచర్యం లభించింది.

మఖ్దూం ట్రేడ్ యూనియన్ రంగంలో ప్రవేశించి వజీర్ సుల్తాన్ టొబాకో, చార్మినార్ సిగిరేట్స్ ఫ్యాక్టరీ కార్మికుల వివాదం పరిష్కరించే త్రైపాక్షిక రాజీబోర్డులో ప్రతినిధిగా పని చేశాడు. సింగరేణి గనులకార్మిక యూనియన్, షహబాద్ సిమెంటు వర్కర్స్ యూనియన్, గుల్బర్గా కాటన్ టెక్స్టైల్స్ వర్కర్స్ యూనియన్, మున్సిపల్ వర్కర్స్ యూనియన్లను స్థాపించి నాయకత్వం వహించినాడు.

కలకత్తాలో జరిగిన రెండవ కమ్యూనిస్టు కాంగ్రేసుకు హాజరై హైద్రాబాదుకు రైతాంగ సాయుధ పోరాటం నడిపేందుకు సమ్మతించి ఆ ఉద్యమంలో అరెస్టయినాడు. ఆ నిర్బంధకాలంలో 'ఖైదు' అనే ప్రఖ్యాత గేయాన్ని రచించినాడు.

మొదటి సాధారణ ఎన్నికలలో హైద్రాబాద్లో పోటీచేసి ఓడిపోయినాడు. డాక్టర్ జయసూర్య లోకసభస్థానం ఉంచుకొని హుజూర్నగర్ శాసన సభా స్థానాన్ని వదలుకొనగా ఉపఎన్నిక జరిగినది. ఆ ఉపఎన్నికలో మఖ్దూం గెలిచినాడు.

వియన్నాలోని ప్రపంచ ట్రేడ్ యూనియన్ సమాఖ్య ప్రధాన కార్యాలయంలో పని చేయుటకై 1953 లో మఖ్దూం ఎన్నుకోబడినారు.

1957 'చాంద్‌తార్‌కాబన్' (తారాచంద్రుల కారడవి) అనే అద్భుతగేయాన్ని వ్రాసినారు. ఇందులో భారత స్వాతంత్ర్య సంగ్రామంలోని వివధ దశలు వర్ణింపబడినవి.

ఇంతటి విప్లవయోధుడు, ప్రఖ్యాతకవి, ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడయిన మఖ్దూం మొహియుద్దీన్ 1969 ఆగస్టు 25న అంతిమ శ్వాసను వదిలినాడు.

## వెంకటరాజేశ్వర జ్యోషి

భారత స్వాతంత్ర్య సమరంలో తమ సర్వస్వాన్ని ధారపోసి చెరసాలలు చంద్రశాలలుగా, కొరడా దెబ్బలు పూబంతులుగా భావించి భారతమాత ధాస్యశృంఖలాల విడగొట్టే యజ్ఞంలో భాగస్వాములైన మహామహులకోవలో చెప్పుకోదగిన మనిషి మనీషి వెంకట రాజేశ్వర జ్యోషి.

మెదకు జిల్లాలో నేటి మండల కేంద్రమైన పెద్దశంకరంపేటలో క్రీ.శ. 1913లో వెంకన్న రమాబాయి పుణ్య దంపతులకు శ్రీ వెంకట రాజేశ్వర జ్యోషి జన్మించారు.

ప్రాథమిక విద్యను, వైదిక విద్యను అభ్యసించిన జ్యోషి తొలుత కుల వృత్తియైన పౌరోహిత్యం చేస్తూ పంచాంగ రచన గావించేవారు. పత్రికా పఠనం ద్వారా ఆయనలో జాతీయతా భావాలు అంకురించి భారత మాత సేవలో తరించాలనే కోరిక కలిగింది.

పెద్ద శంకరంపేటలో ఆనాటికి నాల్గవ తరగతి వరకున్న పాఠశాల స్థాయిని తగ్గించుటకు విద్యాశాఖాధికారులు పూనుకొనగా జ్యోషి దీనిని ప్రజలతో చర్చించి ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉద్యమం లేవదీసి చివరకు విజయం సాధించారు.

ఆకాలంలో పత్రికా పఠనం రాజద్రోహంగా భావింపబడేది. ఐనప్పటికి గోలకొండ పత్రికను తెప్పించుకొని చదివి జాతీయ ఉద్యమ విషయాలను తెలుసుకొనేవాడు. స్థానిక విషయాలను పత్రికా ముఖంగా అందరుకు తెలుపుటకై గోలకొండ తదితర పత్రికలలో విలేకరిగా పనిచేశారు.

క్రీ.శ. 1930లో గోలకొండ పత్రికలో పనిచేస్తున్న ఉన్నత వెంకట రామయ్యతోను, మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాప రెడ్డి, యం. రామచంద్రరావు వంటి వారితో పరిచయం ఏర్పడిన జ్యోషి ఆంధ్రోద్యమంలో చేరి ఉద్యమ ఆశయాలను ప్రజలకు తెలియ పరిచారు. దీనిని అప్పటి పటేలు, పట్వారీలు, ప్రతిఘటించారు.

జ్యోషిగారు 1937 లో మెదకు జిల్లా తరపున ఆంధ్ర మహాసభ కార్యావర్గ సభ్యునిగా ఎన్నికైనారు. 1938 లో కాంగ్రేసు చేపట్టిన సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. 1939లో ఆంధ్రమహాసభ స్థాయి సంఘం సభ్యునిగా ఎన్నికైనారు.

జోగిపేటలో జరిగిన ఆంధ్రమహాసభ కార్యక్రమంలోను అల్లాదుర్గంలో జరిగిన జండా వందన కార్యక్రమములోను జ్యోషిగారు చురుకుగా పాల్గొన్నారు.

క్రీ.శ. 1942 నుండి క్రీ.శ. 1946 వరకు ఆంధ్రమహాసభ మెదకు జిల్లాకార్యదర్శిగా, 1943 నుండి 1958 వరకు ఆంధ్రసారస్వత పరిషత్తు కార్యవర్గ సభ్యులుగా, 1946 నుండి 1952 వరకు స్టేటు కాంగ్రేసు మెదకు జిల్లా కార్యదర్శిగా పనిచేసినారు.

జ్యోషిగారు స్వాతంత్ర్యసమర సమయంలో డిటెన్షన్ చట్టం కింద సెక్షన్ 119 ప్రకారం 26 ఆగస్టు 1947లో అరెస్టు గావింపబడినారు. వీరిని కొద్ది రోజులు చంచల్‌గూడా సెంట్రల్ జైలులో ఉంచి తర్వాత సంఖ్య ఎక్కువౌతున్న కొద్ది వీరిని గుల్బర్గా జిల్లా సెంట్రల్ జైలుకు మార్చారు. ఈ జైలు జీవితంలో విపరీతమైన కొరడా దెబ్బలను కూడా అనుభవించిరి వీరు 26 సెప్టెంబరు 1948లో జైలు నుండి విడుదల కాబడినారు.

జ్యోషిగారు పెద్దశంకరంపేట తొలి గ్రామ సర్పంచుగా ఏకగ్రీవముగా ఎన్నుకోబడినారు. 1952లో జరిగిన తొలి శాసనసభ పోటీ చేసి అత్యధిక మెజార్టీతో ఎన్నికై 1957 వరకు శాసనసభ్యునిగా ప్రజా సేవ గావించినారు. 1950లో ప్రభుత్వ గృహ పరిశ్రమల స్టేటు బోర్డు సభ్యునిగా పనిచేసినారు. పెద్ద శంకరంపేటలో చేనేత కార్మికులకు చేనేత పారిశ్రామిక సంఘాన్ని స్థాపించి వారి అభివృద్ధికి తోడ్పడినారు.

1972 నవంబరు 1న ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ సందర్భంగా భారత ప్రభుత్వం అందజేసిన తామ్రపత్రాన్ని అప్పటి రాష్ట్ర గవర్నర్ ఖందూ భాయి దేశాయి నుంచి అందుకొన్నారు. మరొక సన్మాన పత్రాన్ని అప్పటి ఉపరాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకట్రామన్ చే రాజభవన్‌లో 27 ఏప్రిల్1986 లో అందు కొన్నారు. మాడపాటి హన్మంతరావు శతజయంతి ఉత్సవాల సందర్భంగా 17 జులై 1985లో ఒక రజత పత్రాన్ని అప్పటి ముఖ్యమంత్రి యన్.టి. రామారావు చేతుల మీదుగా అందుకున్నారు.

ఇంతటి స్వాతంత్ర్య సమరయోధులు మెదకు జిల్లా కాంగ్రేస్ భీష్మునిగా పేరొందిన శ్రీ వెంకటరాజేశ్వర జ్యోషి 11 మార్చి 1992 లో స్వర్గస్థులైనారు.

# చయనుల వారి సదాశివశర్మగారి

మంగసోమయాజి రాజయ్యా, రాధమ్మగార్ల సప్తమ సంతానంగా దుర్మతి నామ సంవత్సరము పాల్గుణ శుద్ధనవమి నాడు ఆర్ద్రనక్షత్రాన అందోలులో జననం. ఎనిమిదవ సంవత్సరం నిండేలోపే చయనుల వారి రామకృష్ణయ్యా, రుక్మమ్మగార్ల దత్తపుత్రుడుగా టేక్మాలుకై పయనం. 12 వ యేట ఉపనయనం. 18వ యేట రుక్మమ్మగారి దౌహిత్రి లక్ష్మీబాయి (సుందరమ్మగారి పుత్రి)తో వివాహం.

చిన్ననాటి నుండే విద్యాపిపాసమైన ఆసక్తిమెండుగా ఉండటంతో, పలువురు జ్ఞాన మూర్తుల వద్ద వివిధ విషయాలపై చదువుకోవడం జరిగింది. వేదవిద్యాసముపార్జన బ్ర॥ శ్రీ ॥ వే॥ రావికోటి పిర్థల శాస్త్రి, శంకరంపేట, దమ్మన్నగారి వెంకన్న, టూర్గులపల్లి, వేంకటరాజశర్మ, వీరి దగ్గర నేర్చుకున్న ప్రాథమిక విద్యకు, స్వయంకృషితో ఎన్నెన్నో గ్రంథాల నాధారం చేసుకుని, వేదవిద్యలో షోడశాంతం వరకు అన్నిప్రక్రియలు చేయగలిగిన స్థాయికి తన్ను తాను చేర్చుకున్నారు. సంస్కృతం, హిందీ, తెలుగు, ఆంగ్లం, ఉర్దూ భాషలలో ఏ గ్రంథాన్నైనా అర్థంచేసుకొన గలిగి, మరొకరికి సులభ గ్రాహ్యమయ్యేట్లుగా చెప్పగలగటం ఆయన తనకు తానుగా నేర్చుకున్న విద్య.

తెలుగు సాహితీరంగాన ముఖ్యంగా ఆయన చదవని ప్రక్రియ లేదంటే అతిసయోక్తి కాదు. పదకోశాల నుండి ప్రబంధాల దాకా, పద్యాల నుండి పత్యాలదాకా, వివర్శనలనుండి వ్యాఖ్యానాల దాకా,నాటకాలనుండి నవలల దాకా, కార్లమార్క్స్ నుండి కాణరెదం దాకా గోసాయి చిటికెల నుండి గీతామృతం దాకా, ఆంధ్ర మహా భారతం నుండి ఆధునికాంధ్ర సాహిత్యం దాకా ఆయన స్పృశించేసి పుస్తకం లేదేమో! అమేత పఠనాసక్తి, అచ్చెరువు గల్పించే గ్రహణసక్తి, అన్నిటినీ మించి విశ్లేషణా సామర్థ్యం ప్రత్యేక స్థానంలో కూర్చొబెట్టాయి.

జ్ఞాన సముపార్జనకు కాలపరిమితితో సంబంధం లేదని, ఏ డిగ్రీలకో పరిమితం కాదని తెలిసిన వారైనను, కాలానుగుణ్యాంగా, లోకరీతిని అనుసరించి, మౌలికంగా ఉర్దూ మాధ్యమంలో అలీగఢ్ మెట్రిక్ పరీక్షలోనూ, తెలుగులో ఆంధ్ర సారస్వత పరిషత్తు వారిచే నిర్వహింపబడు పిశారద పరీక్షలోను ఉత్తీర్ణత నందారు. ఆయన వైవిధ్యానికి తార్కాణమే హోమియో వైద్యవిధానంలో బి. యస్‌సి. బి మరియు యమ్.డి.హెచ్. డిగ్రీల సముపార్జన. ఆ తర్వాత యమ్.ఆర్.పి ద్వారా కొన్ని సంవత్సరాలు ఆయుర్వేద, హోమియోపతి వైద్యంలో ప్రజారోగ్యసేవ.

భగవద్దత్తమైన గంభీరమైన స్వరానికి తోడు సుస్వరాలను జేర్చి ఆయన పాడితే అదోలోకం. ఆయన గాత్ర మార్దవానికి హార్మోనియం జతులు జోడించి సాగే పాటలు, భజనలు, పామర జనానికి, పండిత వర్గానికి మరపురాని మధుర గట్టాలు.

శర్మగారి పురాణ ప్రవచనం లో పద్యాలు చదివే పద్ధతి సిగూర్థుమైన శాస్త్ర్యార్థాలను అలవోకగా, అలతి అలతి పదాల లో సాగిపోతు ఉంటే శ్రోతలు మంత్ర ముగ్ధులయ్యే వారు.

నైజాం పరిపాలనా కాలంలో ఇది అత్యంత సాహసోపేతమైన కార్యం అని కార్యం అని అప్పట్లో అందరికీ తెలుసు. పర్యవసానంగా ఘుండావందనాన్నికై ముస్లింల వ్యతిరేకత, ప్రాణాలొడ్డైనా కార్యక్రమం జరిపించాలని శర్మగారి నాయకత్వంలో పట్టుదల, నాటికాలంలో అనితరసాధ్యాలు. ఈ విధంగా రాజకీయ చైతన్యాన్ని పుణికి పుచ్చుకున్నవారై స్వాతంత్ర్యో ద్యమంలో చురుకుగా పనిజేశారు. టెక్మాల్‌లో స్వతంత్ర్య భారత పతాకాన్ని ఎగుర వేసిన దానికి శిక్షణగా జైలు పాలయ్యాడు.

గుల్బర్గా జైలులో ఖైదీలలాగా బరువు పనులు అప్పగిస్తే, వాటిని నిరాకరించి రాజకీయ ఖైదీలకు అలాంటి పనులనివ్వడానికి వీలు లేదని చెప్పగలిగే సాహసం ఆయన సొత్తు. క్షమాపణ ఇస్తే వదలిపెడ్తామని, శిక్ష తగ్గిస్తామని అడిగినా. అలాంటి ప్రసక్తే లేదని ఏనాడిక్కడకు రావడానికి తయార య్యాయేమో ఆనాడే అన్ని పరిణామాలకు సిద్ధపడే ఉన్నామని అనగలిగిన స్థిత ప్రజ్ఞుడాయన.

జైలులో జరిగే దురాగతాలకు వ్యతిరేకంగా పోరాడగా ప్రత్యేక సెల్‌లోకి మార్చినా రవ్వంత తొణకని ధీరత్వమాయన స్వంతం. మిగతా సహ జైలర్ల ధర్నాతో మామూలు సెల్‌లోకి మార్చ వలసి వచ్చిందే తప్ప ఇబ్బందులకు వెరచి తానేమి మార్పుకోని వ్యక్తి ఆయన 9 నెలల పైగా జైలు జీవితం గడిపినా, బయటకు రాగానే తనతో సంబంధంలేని చర్యపై తనపై వారెంటు ఉండటంలో తిరిగి రహస్య జీవనానికి వెళ్ళవలసి రావడం, ఆ కారణంగా రెండు నెలలపైగా నైజాం దాటి షోలాపూర్‌లో 8 కుటుంబ సభ్యులను ఉంచి స్వాతంత్ర్య సమరంలో పాల్గొంటూ కాలం. వెళ్ళబుచ్చాల్సి వచ్చినా ధైర్యాన్ని వీడలేదు.

స్వాతంత్ర్య సముపార్జనానంతరం ఎన్నో సాంఘిక కార్యక్రమాల్ని చేస్తూ రాయన స్వేచ్ఛా వాయువులు వీచినంత మాత్రాన సరిపోదని, గ్రామాభ్యుదయమే దేశాభ్యుదయానికి పట్టుగొమ్మని విశ్వసించారు. గ్రంధాలయ స్థాపన, గాంధీ భవన నిర్మాణము, స్వచ్ఛందంగా కొన్నాళ్ళు స్కూలు విద్యార్థులకు చదువు, విద్యావిషయకంగా నాడు వేసిన పునాదులు. కో-ఆపరేటివ్ సొసైటి, పశువైద్యశాల, ప్రాథమిక ఆరోగ్య కేంద్రం జూనియర్ కాలేజీ నిర్మాణాలలో ప్రముఖ పాత్ర ఆయన సాంఘికో ద్యమంలో కలకాలం నిలిచే కార్యక్రమాలు రెండు మార్లు గ్రామ సర్పంచ్‌గా బాధ్యతలను స్వీకరించి గ్రామాభ్యుదయానికెంతో తోడ్పడ్డారు. జిల్లా గ్రంధాలయ సభ్యులుగా కొంత కాలం పని జేశారు. చుంచనకోటనందలి విఠాల చంద్రమౌళి శాస్త్రీగారి వద్ద శ్రీవిద్యాదీక్షను స్వీకరించారు.

తత్ఫలితంగా శ్రీచక్రార్చనను స్వీకరించి ముఖ్యంగా శుక్రవారాలలో మహాపూజను కావించే వారు. ఈశ్వరాలయానికి ప్రక్కనే రాజరాజేశ్వరీ మందిరం, ఆదిశంకరుల ఆలయాల నిర్మాణాలను కావించారు. దానితో బాటు ప్రతి సంవత్సరం మూడు రోజుల పాటు ఉత్సవ కార్యక్రమాన్ని జరిపించారు.

ఓ సాంఘిక కార్యకర్తగా, రాజకీయ ధురంధరుడుగా, స్వాతంత్ర్య సమరసేనానిగా, వైద్యుడుగా, విద్యావిషయ పరిజ్ఞాన సింధూవుగా, ఆధ్యాత్మిక గురువుగా, పరమ సాహసిగా జీవించిన శర్మగారు తేది 19-4-97న కీర్తి శేషుశేషులైనారు.

## జి. రాంరెడ్డి

జాకన్నగారి రాంరెడ్డిగారు "స్వాతంత్ర్యసమర యోధులు" వీరు " మెదకు జిల్లా పిత " గా పేరు గాంచినారు. స్వర్ణాంధ్రప్రదేశ్ ఉత్సవాలలో భారతదేశ అధ్యక్షులైన కె. ఆర్. నారాయణన్ గారిచే లాల్‌బహదూర్ స్టేడియంలో 01.11.1997 నాడు తామ్ర పత్రముచే సత్కారింపబడినారు.

వీరు మెదకు జిల్లాలోని కొండాపూర్ మండలం తేరుపోలు గ్రామములో 1906 సంవత్సరమున శ్రీమతి పార్వతమ్మ, శ్రీ జూకారెడ్డిగారలకు ప్రథమ సంతానంగా జన్మించినారు. వీరిది మధ్యతరగతి వ్యవసాయ కుటుంబము. వీరి ధర్మపత్ని సత్యవతమ్మగారు, వీరికి కుమారులు సుదర్శనరెడ్డి, మోహనరెడ్డి మరియు కుమార్తె భారతి కలరు.

**విద్యాభ్యాసము :** స్వగ్రామము అయిన తేరుపోలులో ఉర్దూ మీడియంతో విద్యను ఆరంభించినారు. పిదప సంగారెడ్డిలో ఆ తరువాత హైదరాబాదులో మెట్రిక్యులేషన్, సిటీ కాలేజీ నుండి డిగ్రీ పూర్తి చేసినారు. "లాక్లాసు సర్టిఫికేటు కోర్సులో" ఉత్తీర్ణులై న్యాయవాద వృత్తిని చేపట్టినారు. 1952 సంవత్సరంలో "ప్రథమ శ్రేణి ప్లీడరు" గా పరిగణింపబడినారు.

**రాజకీయరంగ ప్రవేశము :** వీరు మొట్ట మొదట కమ్యూనిస్టు పార్టీ సానుభూతిపరులు. తదుపరి కొండా వెంకటరంగారెడ్డిగారి ప్రేరణవల్ల కాంగ్రేసులో చేరి దేశ స్వాతంత్ర్య ఉద్యమంలో క్రియాశీలక వ్యక్తిగా ముందంజ వేసినారు. కందిలో జరిగిన చివరి ఆంధ్రమహా సభకు ఆహ్వాన సంఘ కార్యదర్శిగా పని చేసిరి. జిల్లా కాంగ్రేసు సంఘ సభ్యులుగా జిల్లాలో పర్యటించి స్వాతంత్ర్య సమర ఉద్యమమునకు సారధ్యము వహించిరి. మెదకులో జరిగిన జండా వందన కార్యక్రమములో వీరి కృషి కొనియాడదగినది. వీరి ప్రభావముచే అనేక మంది క్రియాశీలక కార్యకర్తలు రంగములో దిగి రజాకార్ల ఘాతక చర్యలను ధైర్యముతో ఎదిరించినారు.

ఈ కార్యకలాపాల ఫలితముగా గుల్బర్గా జైలులో 13 నెలలపాటు 1947 సంవత్సరము ఆగస్టు నుండి సెప్టెంబరు 1948 వరకు కారాగార శిక్షణ అనుభవించినారు.

మొట్టమొదటి శాసనసభలో నర్సాపూర్ నియోజకవర్గం నుండి ఎన్నికైయ్యెఐ సంవత్సరములో శాసన సభ్యులుగా ప్రజాసేవా మొనరించినారు. రాష్ట్ర కాంగ్రేసు సభ్యులుగాను, జిల్లా ప్రణాళిక సంఘ సంఘ సభ్యులుగాను "జాగీర్‌దారీ సెటిల్‌మెంటు బోర్డు" మెంబరుగానూ, వివిధ పదవుల నిర్వహించిరి. వెట్టి చాకిరీ నిర్మూలన ఉద్యమములో పాల్గొని విస్తృతముగా ప్రచారం చేసిరి. వయోజన విద్యకై రాత్రి పాఠశాలలను సంగారెడ్డిలోని తమ గృహములో ప్రారంభించి అనేకులకు మార్గదర్శులైరి. దళితులతో సహపంక్తి భోజనాలను ఏర్పాటు చేసి అస్పృశ్యతో నివారణోద్యమానికి నాంది పలికిరి. గ్రంథాలయోద్యమము ద్వారా ఆనంద గ్రంథాలయము సంగారెడ్డిలోను, సదాశివపేటలో, విజ్ఞాన గ్రంథాలయము, ముబారక్ పురములో హనుమాన్ గ్రంథాలయములను స్థాపించి ప్రజలలో పఠనాభిషను పెంపొందించి తద్వారా విజ్ఞాన సముపార్జనకు మార్గదర్శకులైరి.

వయోభారముపై బడినప్పటికిని ప్రభుత్వ కార్యక్రమమైన మంజీర అక్షరప్రభ కార్యక్రమములను నిరక్షరాస్యుల వద్దకు చేర్చుటకు నిస్వార్థ సేవలందించినారు. అంతిమ దశ వరకు సంఘ సేవ కార్యకలాపాలను చురుకుగా నిర్వర్తించుచు ఇతరులకు మార్గదర్శకమైన జీవితమును గడిపినారు.

శ్రీ జె. రామారెడ్డి తన 92వ సంవత్సరములో 03.03.98న పరమపదించినారు.

ఈత్యాగ జీవితను రెండు కళ్లను మరణాంతరము దానమిచ్చి ఇద్దరి గుడ్డివాళ్లకు కనుచూపు కలిగించి జీవితములోనేకాక మరణానంతరము కూడా ప్రజా సేవకుడుగా సేవలందించి అమరులయినారు.

# మెదకు జిల్లాలో రజాకార్లు

ఆలా హజ్రత్ మీర్ ఉస్మాన్ అలీ ఖాన్ పాదుషా గా పేరొందిన నిజాంనవాబు- ఒక మారు "రహబరే దక్కన్" అను ఉర్దూ దిన పత్రికలో తన ఆంక్షలను "బందేనా ఖూస్ హువా సున్కే నిదాయే తక్బీర్ జలలా ఆహిగ యారిషైయే జున్నార్సేభీ" ని ఉటంకించుచూ వెలిబుచ్చినాడు- దీని భావము ధ్వని వినినంతనే శంఖనాదము ఆగి పోయినది -హిందువుల మత చిహ్నములపైననూ, జంధ్యముల పైననూ, అగ్ని జ్వలించినది.

ఈ వాక్యములచే - గోలకొండ సామ్రాజ్యము చిరస్థాయిగా మహమ్మదీయ రాజ్యముగానేయుండి, హిందువులు పాలితులుగానే యుండ వలయుని, తమ అధిపత్యము వారిపై ఎల్లవేళలా సాగవలెననియూ, అతని కోరిక యున్నట్లుగా తెలియుచున్నది. అంతేగాక, ఆనాటి పాలకులు హైందవులను కడు నీచముగా చూచినట్లు, మత సహనము లేక, స్వమత దురహంకారమున విర్రవీగినట్లు స్పష్టమగుచున్నది.

క్రీ.శ. 1927లో ఇస్లాం మతానుయాయుల సర్వతోముఖాభి వృద్ధికి, నిజాం రాష్ట్ర ముస్లింల అభివృద్ధి కొరకై "ఇత్తేహాదుల్ ముస్లిమీన్" అనే సంస్థ నెలకొల్పబడినది. బహద్దూర్ యార్ జంగ్ ఆ సంస్థ కు అధ్యక్షుడైన పిదప దానిని పెంచి, పోషించి పెద్ద చేసినాడు.

క్రీ.శ. 1945లో లాతూర్ లో వకీలుగానున్న ఖాసీం రజ్వీ అను మతోన్మాది మజ్లిస్ - వ- ఇత్తేహాదుల్ ముస్లిమ్ సంస్థకు అధ్యక్షుడై హైద్రాబాద్ సంస్థానమును ఇస్లాం మత రాజ్యముగా తీర్చిదిద్ద దలిచెను. ఉద్రేక పూరితములైన ఉపన్యాసముల ద్వారా మహమ్మదీయులలో హైందవ విద్రోహ భావములను రేకెత్తించి, వారిని కరకు కసాయివారలుగా మలుచ ప్రయత్నించినాడు. ఖాసీం రజ్వీ ఏబదివేల సైన్యమును సమకూర్చి, సైనిక శిక్షణనిచ్చి వారికి, రజాకార్లు అనే నామకరణం చేసినాడు. ఈ రజాకార్లతో రాజ్యమందంతటా దౌర్జన్య కాండలు నిర్వహించుటకు పథకములు రూపొందించినాడు.

26-7-1944 లో నిజాం ప్రభువు- సుబే దక్కన్ అనే దినపత్రికలో - బ్రిటిష్ ప్రభుత్వంతో స్నేహ బాంధవ్యములను కల్గించుకొనిన సంస్థానము లందు ముఖ్యముగా దక్కను పీఠభూమి. ఈ సంస్థానములో బాధ్యాతాయుత ప్రజా ప్రభుత్వ స్థాపనము నిరర్ధకము... అని "రాజే - ప్రత్యక్ష పాలనకు ప్రజా ప్రతినిధిగా ప్రవర్తించును. రాజ్యపాలనా విషయములందు రాజులకు సర్వాధిపత్యము లుండును. ప్రజాస్వామ్య ప్రాతినిధ్యమును కలిగి సక్రమ పాలన జరుపును. అని పేర్కొనినాడు."

ఈ విధముగా నిజాం నవాబు, తన సర్వాధిపత్యము శాశ్వతముగా నుండునని ప్రకటించుకొని - ముస్లింలు అల్ప సంఖ్యాకులుగా, ఉండవీలు లేదని భావించి ఉత్తర హిందుస్థానము నందున్న రాష్ట్రముల నుండి వేలసంఖ్యలో ముస్లింలను హైద్రాబాద్ రాష్ట్రమునకు రప్పించి వారికి అన్ని విధముల సహాయ సహకార ములందించినాడు. రాష్ట్రమందున్న హిందువులను పీడించి, దరిద్రులను చేసి యూనియన్ ప్రాంతములకు తరలి వెళ్ళు పరిస్థితులను కల్పించినాడు.

నిజాం నవాబు పోలీసు, మిలటరీ బలగములను సిద్ధ పర్చియుండెను. రజాకార్ల సైనిక బృందము కూడా నిజాం నవాబుకు రక్షణలో నుండెను. మజ్లిస్ అధ్యక్షుడైన 'ఖాసీం రజ్వీ' రజాకార్ల సైనిక పటాలమునకు ఫీల్డు మార్షల్‌గా వ్యవహరించెను. నిజాం పోలీస్ శాఖాధిపతియైన దీన్ యార్ జంగ్ బహద్దూర్ రజాకార్ల సైనిక కార్యక్రమములను రూపొందించుటలో తోడ్పడెను. మజ్లిస్ కార్యాచరణ సంఘమందు ఏడుగురు సభ్యులుండిరి. వారిలో ముగ్గురు సైనిక శాఖలో కెప్టెన్ పదవినైననూ, మేజర్ పదవి, మెకనికల్ ఇంజనీరింగ్ పదవినైనను, నిర్వహించి యుండిన వారై యుండ వలెనని ఉండెను. నిజాం రాష్ట్రమందున్న 10 దినపత్రికలు, వార, పక్షపత్రికలు మజ్లిస్ కార్య కలాపములకు ప్రచారమిచ్చుచుండెను.

రజాకార్ల జీత భత్యములకు, ఆహార పానీయములకు దినమునకు 30 వేల రూపాయలు వ్యయము అగుచుండెను. రజాకార్ల సంఖ్య పెరిగి ఈ వ్యయము పెరుగ సాగినది. గులాం మొహినోద్దిన్‌లు ఈ సంస్థను క్రమశిక్షణలో నుంచు భాద్యతను స్వీకరించిరి. యద్ధములు, మందుగుండు సామాగ్రి సమకూర్చబడినవి. ప్రయాణ సాధనము లైన జీపులు, ట్రక్కులు, మోటరుసైకిళ్ళు వారికి సమకూర్చ బడినవి.

నిజాం నవాబు రాజ్యంలోనున్న నిమ్నకుల స్థులను, ప్రలోభపెట్టి వారిని ఇస్లాం మతాంత రీకరణమునకు బలవంత పెట్టెను. ఈ ప్రయత్నములను ఆర్యసమాజ సంస్థ వారు ధైర్యముగా నెదుర్కొనిరి.

ముస్లిం దర్గాలు, మసీదులు, పురాతన దుర్గములు, విశ్రాంతి భవనములు రజాకార్ల నివాసమునకై కేటాయింపబడినవి. ప్రతి దినము ఖాసిం రజ్వీ, రజాకారు నాయకులకు ఆదేశములు అందజేయు చుండెను. ఏదో ఒకచోట గృహదహనములు, దోపిడీలు జరుగుచుండెను. అమాయకులైన ప్రజలను వరుసగా నిలబెట్టి షాహే ఉస్మాన్ జిందాబాద్, వలియద్ బహద్దూర్ జిందాబాద్, అను నినాదములు చేయుచూ నిర్దాక్షిణ్యముగా కాల్చిచంపెడి వారు. కొందరు కత్తులతో, జంబియాలతో, యువకుల కంఠములను నరుకుచు, నరరూప రాక్షసుల వలె ప్రవర్తించుచుండిరి.

పట్టపగలు మానవత్వమును సమాధి కట్టి వయస్సు తారతమ్యము లేకుండా అనేక మంది స్త్రీలను పట్టి బంధించి, మానభంగ మొనర్చి, సంహరించెడివారు, పురుషులను చెట్లకు కట్టి వేసి వారిముందే వారి స్త్రీలను ఘోరముగా మానభంగమొనర్చుచుండిరి. పసిపిల్లలను, తల్లి తండ్రులముందే నేలకు విసిరికొట్టి చంపెడివారు. పసిపిల్లల గుండెలలో బల్లెములతో పొడిచి చిలుక్కొయ్యలకు తగిలించే వారు గడ్డి వావులను పూరి గుడిసెలను, భవనాలను దహనమొనర్చెడి వారు. ప్రాణభీతితో పరుగులెత్తుతున్న వారిని బంధించి, పొడిచిచంపి తగలబడుతున్న ఇండ్లలోనికి విసిరి వేసేడివారు. రైలుబండ్లనాపి ప్రజలను దోచుకొని నానా హింసలకు గురిచేసి, రైలు డబ్బాలకు నిప్పంటించి తగలబెట్టెడివారు.

మెదక్ జిల్లాలో రజాకార్ల ఆగడాలు చవిచూడని పల్లె, పట్టణమూ లేదనిన అతిశయోక్తి కాదు, సదాశివపేటలో గంజి భవనాలను, ప్రజలందరూ చూచుచుండగనే అగ్నికి ఆహుతి చేసిరి. కోహీర్, రాయికోడ్, అసద్‌గంజ్, అల్లాదుర్గం సిద్దిపేట, అల్లిపూర్ మొదలైన అనేక చోట్ల ప్రజలను చిత్రహింసలకు గురిచేసి ప్రజల ధన, మాన, ప్రాణములను హరించిరి.

నిజాం రాజ్యము ఇస్లామిక రాజ్యముగా రూపొందించ వలెనని ఆనాటి మతదురభిమానుల ఆకాంక్ష. నిజాంసుల్తాన్, రజాకార్లకు సర్వాధికారములు దత్తతచేసి పోలీసు, మిలటరీ అదికారయంత్రాంగము అన్ని విధముల వారికి సహాయము చేయునట్లు ఆదేశమిచ్చెను. దీనితో రజాకార్లు బరితెగించి అనేక దాడులుసల్పి విపరీతమైన ధనమును దోచుకొని రాజ్యమున అల్లకల్లోల పరిస్థితులు సృష్టించిరి.

# నైజాం రాజ్యము భారతదేశములో విలీనమగుట

భారతదేశమునకు 1947 ఆగస్టు 15వ తేదీన స్వాతంత్ర్యము లభించినది. అప్పటివరకు ఆంగ్లేయులతో లోపాయికారీగా ఉంటూ పరిపాలన చేస్తున్న నైజాం తాను స్వతంత్రుడైనట్లు భావించాడు. స్వతంత్ర్య భారతదేశంలో నైజాం రాజ్యం విలీనం కావాలని ప్రజలందరి కోరికను మన్నించక నిరంకుంగా రాజ్యకాంక్షచే స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొన్నాడు, ఇందుకు అంగీకరించని ప్రజలు ఉద్యమాన్ని ప్రారంభించారు.

నైజాం వ్యతిరేక పోరాటంలో మెదకు జిల్లా ప్రత్యేక చరిత్రను కల్గియున్నది. ఆంధ్ర మహాసభ మొదలు కొని కమ్యూనిస్టు ఉద్యమం వరకు ప్రతి ఉద్యమంలోను మెదకు జిల్లా పాలు పంచుకొనినది.

నిజాం ప్రభుత్వ పాలనలో తెలంగాణాలో ఫ్యూడల్ వ్యవస్థ లక్షణాలు కలవు. హైద్రాబాదు రాజ్యంలో నిజాం నవాబు ప్రసాదంగా జాగీర్దార్లకే న్యాయ పాలన, పోలీసు అధికారాలుండెడివి. వీటిపై నిజాం నవాబుకు ప్రత్యక్ష పాలన లేకుండెను.

మెదకు జిల్లాలో ఆనాడు 267 జాగీర్లుండెడివి. వీరు కాక దేశముఖ్, దేశ్‌పాండేలుండిరి. గ్రామములలో పోలీస్ పటేల్, మాలీపటేల్, పట్వారీలు పాలనాయంత్రాంగంలో భాగ స్వాములై రాజకీయ ప్రాబల్యం కలిగి భూమి పై ఆధిపత్యం కల్గియుండేవారు.

జిల్లాలో 267 జాగీర్లేకాక పాపన్నపేట, దొంతి, దుబ్బాక సంస్థానములుండెను. ఈ సంస్థానాధీశుల ఆధీనంలో కొన్ని గ్రామములుండెడివి. ఆగ్రామములలోని భూమి మొత్తము వేల ఎకరములలో సంస్థానాధీశుల ఆధీనంలోయుండెడివి. ఆభూమిని కౌళ్లకిచ్చి రైతుల నుండి లక్షల రూపాయలు వసూలు చేసెడివారు. ఆగ్రామములలో జరుగు మంచి చెడ్డల న్నింటికి సంస్థానాధీశులైన దొరలే భాద్యులుగానుండిరి.

నిజాం సుల్తాను 21-9-47 న ఒక ఫర్మానా ద్వారా తనకు సద్భావమున్నదని మోసపూరిత ప్రకటనగా వించినాడు. ఆ ఫర్మానాలో తన తండ్రిగారగు మహబూబలీఖాన్‌ను జ్ఞాపకం చేయుచు హిందూ ముస్లింలు రెండు కళ్ళవంటి వారని తనతండ్రి భావించెడివారనియు, మంత్రి మొదలు సామాన్య సేవకుని వరకు ఇట్టి భావమే ఉండవలెనని మోసపూరిత ప్రకటనగావించెను. ఒకవైపు హిందూ ముస్లింలను సమానముగానే చూచుచున్నానని పలుకుచూ అల్ప సంఖ్యాకులుగానున్న ముస్లింలను అధికము చేయుటుకై ఇతర రాష్ట్రముల నుండి రప్పించి, వారికి వివిధ సహాయ సహకారము లందించెను. రాజ్యమునందలి హిందువులను పీడించి యూనియన్ ప్రాంతములకు తరలివెళ్ళు పరిస్థితులు కల్పించెను.

ఉస్మానలీఖాన్ భారతదేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించుట వలన తాను సర్వ స్వతంత్రుడని హైదరాబాద్ డుమీనియ్ సర్వ స్వతంత్ర రాజ్యమని ప్రకటించుకొన్నాడు. బ్రిటిష్‌వారు హైదరాబాదు వదులుటచే తాను సంపూర్ణ స్వాతంత్రాధికారినయినానని భావించినాడు. భారత ప్రభుత్వము వత్తిడి చేసిన పిదప బ్రిటిష్ ప్రభుత్వంతో ఎట్టి ఒడంబడిక నిజాం ప్రభుత్వమునకు కుదిరి యుండెనో అదే విధమగు ఒడంబడికను భారత ప్రభుత్వముతో తేది 29-11-1947న యధాతథపు ఒడంబడికను కుదుర్చుకు న్నాడు. దీనినసరించి విదేశ వ్యవహారములు సమాచారము, రహదారులు, రైలు మార్గములు, రక్షణ వ్యవహారములు భారత ప్రభుత్వ ఆధీనములో నుండును తక్కిన పాలనావ్యహారములు, శాంతి భద్రతలు నిజాం ప్రభుత్వ ఆధీనములో నుండును.

నిజాం నవాబు సైనిక శక్తిని, ఆయుధములను, మందుగుండు సామాగ్రిని పెంచుకొనుటకై ఒప్పంద విషయమున కాలయాపన మొనర్చుచుండును. దీనికి తొడు ఖాసింరజ్వీ ప్రలోభము ఉస్మానలీఖాన్ లో ఆశను పెంచినంది. దుర్మార్గులైన రజాకార్ల సంఖ్యను పెంచి నైజాం రాజ్యమునందు అధిక సంఖ్యలో నున్న హిందువులను ఊచకోత కోయుటకు పన్నిన పన్నాగములపైకూడా ఆతని అంగీకారము కలదు.

ఇట్టి సందర్భములో పాకిస్తాన్ అధ్యక్షుడు జనాబ్ మహమ్మద్ అలీ జిన్నా క్వెట్టాలో ఇట్లు ప్రకటించెను.

"హైదరాబాద్ సంస్థానమెుక స్వతంత్ర రాజ్యము భారతదేశమునకు అనాదినుండి న్యాయ పరిశీలనము ఉత్కృష్ట నైతిక విధానము కలదు. ఒక సంపూర్ణ స్వతంత్ర సర్వాధిపత్యము ననుభవించుచున్న రాజ్యమును బలవంతంగా గాని హింసా మార్గమునగానీ తనలో చేర్చుకొనుట సమంజసముగాదు".

ఇదే సమయమున పాకిస్తాన్ విదేశంగ మంత్రి జఫురుల్లా ఖాన్ "హైదరాబాద్ సంస్థానమనిన మాకు సంపూర్ణమగు సానుభూతి కలదు. ఈ సంస్థానమును విలీనమొనర్చుకొనుటకు భారతదేశము ఎందుకు ఒత్తిడి చేయుచున్నదో నాకర్థమగుట లేదు" అని ప్రకటించినాడు.

పాకిస్తాన్‌రేడియో ప్రత్యేక ప్రసారాలలో నిజాం నవాబు స్వతంత్రుడుగా ఉండవలెనని భోధించినది. అక్కడి నాయకులు ప్రజలు కూడా నిజాం నవాబుకనుకూలముగా స్పందించిరి.

భద్రతా సంఘమున అర్జెంటైనా సభ్యుడయిన జోసే ఆర్సెస్ నిజాం వాదన న్యాయ సమ్మతమని ప్రకటించెను.

తేది 30-7-1948 న బ్రిటిష్ ప్రధనిగా చర్చిల్ ఇట్లు ప్రకటన చేసినాడు

భారతదేశం నుండి ఆంగ్లేయపాలకులు నిష్క్రమించిన తరువాత భద్రతా సంఘ సభ్యత్వ గౌరవమున్న 52 రాజ్యములలో 39 రాజ్యములు హైదరాబాద్ రాజ్యముకన్న చిన్నవి.

వీటిలో 20 రాజ్యములు హైదరాబాద్ రాజ్యమువలె చుట్టూ యూనియన్ ప్రాంతములుండుట చే తాళము వేసిన పెట్టెవలె నుండును. హైదరాబాదునకు ఎటువైపునూ సముద్ర సౌకర్యము లేదు. స్విట్జర్‌లాండ్, జగస్లోవేకియా మొదలగు రాజ్యములు సముద్రయాన సౌకర్యములు లేకున్ననూ సర్వ స్వతంత్ర రాజ్యములు గా మనగలుగుచున్నవి. ఈ కామన్స్‌సభ హైదరాబాద్ రాజ్యమునకు గల స్వతంత్ర సర్వాధిపత్యము నిర్వివాదాంశము". అని గుర్తించుచున్నది.

తేదీ 30-4-1948 లో స్పెక్టేటర్ అను పత్రికలో "దక్షిణ భారత ప్రాంతమును మహమ్మదీయులు సర్వాధిపత్యముతో హైదరాబాద్ ను పాలించుచున్నారు". అని సంపాదకీయము వ్రాసినది.

స్పెక్టేటర్ పత్రికా సంపాదకునకు చారిత్రక పరిజ్ఞానం లేనేలేదని చెప్పవచ్చును. నిజాముల్‌ముల్క్ ఆసఫ్‌జా 18 వ శతాబ్దిలో ఢిల్లీ చక్రవర్తిచే దక్కన్ సుబేదారుగా నియమింపబడెను. అనగా ఆసఫ్‌జాహీల పాలనము 200 సం. లు మాత్రమే.

నిజాం నవాబునకు అనుకూలముగా బ్రిటిష్ పత్రికా విలేఖరులు, ఏజెంట్లు ప్రపంచమునందు అంతటా ప్రచారముగావించినారు.

కానీ నిజాంసుల్తాన్ శ్రేయస్సుకోరిన వారందరును అతడు భారత యూనియన్‌లో చేరవలెనని నచ్చచెప్పినారు. లండన్ జాతీయ ముస్లిం సమితి కార్యదర్శి- అబ్దుల్‌ఘనీ 9-5-48 నాడు ఇట్లు ప్రకటించెను.

"నిజాం సుల్తాన్ పట్టుదల అవివేకము అసమంజసము. బ్రిటిష్ పార్లమెంటు సభ్యులకు భారతదేశ ఆంతరంగిక వ్యవహారములో జోక్యం కలిగించుకొను అధికారం ఎంతమాత్రమూ లేదని గ్రహించకపోవుట శోచనీయము".

29-6-1948 న న్యూయార్క్‌నుండి వెలువడు హెరాల్డ్‌ట్రిబ్యూన్ అను పత్రిక సంపాదకీయ మునందు "డొమీనియన్ ప్రాంతములావరించియున్న నిజాం రాజ్యము భారతదేశ ఆధీనము కాకతప్పదు. దేశము నందలి ఇతర సంస్థానాధీశుల వలె నిజాం సుల్తాన్ సౌకర్యములు పొందివారిననుసరించుట ఉత్తమము. భారతదేశము నందు నిజాం అంతటి వాడు కాలమునకు ఎదురీదుట భావ్యమనిపించు కొనదు" అని వ్రాసినది.

ఎంతమంది ఎన్ని రకములుగా చెప్పినను నిజాం నవాబు ఉస్మానలీఖాన్ మూర్ఖముగా ప్రవర్తించి భారత ప్రభుత్వమునెదుర్కొనుటకు సిద్ధపడినాడు. నిజాం సైన్యము పశ్చిమ ప్రాంతమందలి నల్‌దుర్గ్, తల్మడ్, తురారీ, మురుద్, ఉస్మానాబాద్ తదితర ప్రదేశములలోను తూర్పుదిశలో కోదాడు, వైరా, మధిర, సూర్యాపేట లందును, ఔరంగాబాద్, రాయచూర్, గుల్బర్గా, హైదరాబాద్ లందు నింపబడినది.

ఉస్మాన లీఖన్ భద్రతా మండలికి తన రాజ్యవ్యవహారములని వేదించుటకైతన ప్రతినిధిగా మొమిన్ నవాజ్‌జింగ్‌ను పంపించి తాను సర్వస్వతంత్ర రాజ్యముగా నుండునట్లు కోరినాడు. భారత ప్రతినిధిగా సర్‌రామస్వామి మొదలియార్ తనవాదనను వినిపించినాడు. ఈ విషయమును తెల్చలేనిస్థితికి జేరినది.

హైదరాబాదు రాష్ట్రమున భారత ప్రభుత్వ ప్రతినిధిగనున్న కె.యం.మున్షీగారు ఇక్కడి సమస్త విషయములును ఎప్పటికప్పుడు భారత ప్రభుత్వమునకు తెలియజేయుచుండిరి. రజాకార్ల కార్యకలాపములను, ప్రభుత్వదమన నీతిని పోలీసు, మిల్ట్రీ వారి దౌర్జన్యములను, ఢిల్లీకి తెలుపబడుచుండెను.

ఎట్టకేలకు భారత ప్రభుత్వము హైద్రాబాదు రాజ్యముపై పోలీసుచర్య జరుపుటకు నిర్ణయించినది. భరతప్రభుత్వ ఉపప్రధానమంత్రి సర్దార్ వల్లాభ్భాయి పటెల్‌గారి చొరవతో. చక్కని పథకముతో రాజ్యము నలువూలల నుండి ఒక్కసారిగా భరత సేనలు చుట్టుముట్టినవి.

ఉత్తరవఋన ఔరంగాబాదు, పడమర షోలాపూర్, ధక్షిణమున కర్నూలు, వాయువ్యమున ఆదిలాబాదు, ఆగ్నేయమున విజయవాడ, నైరుతిన రాయచూరు ప్రాతంములనుండి ఒకేమారు సైనికచర్య ప్రారంభమైనది. బోంబాయినుండి బయలుదేరిన సైన్యమునకు మేజర్ జనరల్ డి.యస్.బ్రార్. మద్రాసునుండి వెడిలిన సైన్యమునము ఎ.వి.రుద్ర, బెరారు నుండి బయల్వెడలిన సైన్యమునకు బ్రిగేడియర్ శివదత్తుసింగ్, షోలాపూర్ నుండి బయల్వెడలిన సైన్యమునకు మేజర్ జనరల్ జే.యన్.చౌదరి నాయకత్వమువహించిరి. వైమానిక శాఖాధికారి ఏర్‌వైస్‌మార్షల్ ముఖర్జ్ భారతసైన్యములకు సహాయముగావచ్చెను. 13 వ సెప్టెంబరు 1948 నాటి ఉదయము 4.00 గం.లకు పోలీసుచర్య ప్రారంభమైనది. బెజవాడ, షోలాపూర్ మార్గముల నుండి ముఖ్యమయిన దాడులు మొదలయినవి.

జనరల్ జె.యన్. చౌదరి నాయకత్వమున బయల్దేరిన సైన్యము సెప్టెంబరు 13 వ తేదీనాడే ఉస్మానాబాద్ జిల్లాలోని తుల్జాపూర్, పర్భిణి జిల్లాలోని మాణిక్‌గడ్, గణేర్గావ్, ఔరంగాబాద్ జిల్లాలోని జాల్నా పట్టణములు ఆక్రమింపబడినవి. భారత విమానములు బీదర్, వరంగల్ విమానాశ్రయములపై బాంబులు వేసినవి.

సెప్టెంబరు 14 వ తేదీన దౌల్తాబాద్, జాల్నా, ఔరంగాబాద్ పట్టణములను వశపరుచుకొని షోలాపూర్ సికిందరాబాద్ పట్టణముల మధ్యనున్న రాజేశ్వర్ పట్టణమును భరతసైన్యము ఆక్రమించినది. ఉస్మానాబాద్, నిర్మల్ దుర్గములు భారతసైన్యమలకు వశమయినవి.

15 వ సెప్టెంబర్ నాడు మరూద్‌లోనున్న సెకెండ్ హైదరాబాద్ ఇన్‌ఫెంట్రీ 25 పౌండర్ల బ్యాటరీ లాతూరు వైపు పరిగెత్తినది. లాతూర్ నుండి జహీరాబాద్‌వెళ్ళుటకు రైలులో బయలుదేరుతుండగా భారత విమానములు బాంబులు విసిరినవి.

నిజాం సైనికులు రైలు దిగి ట్రక్కులలో పరిగెత్తనా రంభించిరి. ఆ ట్రక్కులు కొన్ని ర[illegible] ప్రక గుంతలలో పడిపోయినవి, హుమ్నాబాద్, జాల్నా యూనియన్ సైన్యము వశమైనవి.

16 వ సెప్టెంబర్ నాడు భారత సైన్యములు ముందుకు వచ్చుచుండగా థర్డ్ హైదరాబాద్ ఇన్‌ఫెంట్రీ ఎక్కెల్లి వంతెనను ధ్వంసమొనర్చి భారత సైన్యము రాకకు ఆటంకమేర్పరిచినది. యూనియన్ సైన్యము వంతెనను తాత్కాలికముగా నిర్మించు కొని ముందుకు సాగి జహీరాబాద్ పట్టణమును వశపరుచుకున్నవి.

17వ తేదీన యూనియన్ సైన్యము మెదకు జిల్లాలోని పటాన్‌చెరు ప్రాంతములోనికి వచ్చినది. నిజాం సైనికులు అచట వంతెనను ధ్వంసమొనర్చి రోడ్డుపై బాంబులను ప్రేలుడు పదార్థములను ఉంచిరి. భారత సైనికులు రోడ్డు పక్క బాంబులు పరిచియుండుట గమనించి పక్క మార్గమున పయనించి హైదరాబాద్ నగరం చేరిరి. ఆనాటి సాయం సమయమున 5 గంటలకు భారత సైన్య పురోగతిని తెలుసుకొన్న నిజాం ప్రభువు తనకు అపజయము తప్పదని ఎంచి సీజ్ ఫైర్ ఆజ్ఞనలను జారీచేసి యూనియన్ సైన్యము నిరాఘాటముగా రావచ్చునని ప్రకటించెను.

17-9-1948న అల్లాహజరత్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ ప్రజాభ్యుదయమే తన జీవిత ధ్యేయమని నక్కవినయములు పలుకుచు యుద్ధ విరమణ గావించుటకు ఆజ్ఞలొసంగి భారత సైన్యము బొల్లారం రావచ్చునని తాత్కాలిక పరిపాలనకై మంత్రి వర్గము నేర్పాటు చేయుచున్నానని ఫర్మానా జారీ చేసెను.

సెప్టెంబర్ 18 సాయంకాలం 4 గంటలకు భారత సైన్యము బొల్లారం చేరినది. ప్రజలు జయజయ ధ్వానములలో భారత సైన్యములకు స్వాగతములు పలికిరి. నిజాం సైన్యాధ్యక్షుడైన ఎల్. ఎడ్రూస్ ఆయుధములను త్యజించి మేజర్ జనరల్ జె. యన్. చౌదరీ గారికి లొంగిపోయెను.

19 సెప్టెంబర్ 1948న కోరలుడిగిన త్రాచుపామైన నిజాం నవాబు ముస్లి రాజ్యములకు హైదరాబాద్ రాజ్య స్థితిగతులను వివరించెను. పరిపాలనా విషయమున జె. యన్. చౌదరి గారికి రాష్ట్ర ప్రజలు సహకరించ వలసిందిగా కోరుచూ ఫర్మాన జారీ చేసెను.

ఈ విధంగా శాంతి భద్రతలకై హైదరాబాద్ రాజ్యం పై పోలీస్ చర్య జరిపిన భారత ప్రభుత్వం -4 దినములలో విజయం సాధించి భారత ప్రజలకానందం చేకూర్చినది.

దీనితో భారత దేశమున మరో ముస్లిం రాజ్యమును శాశ్వతముగా పాలించ వచ్చునని ఎంచిన ఆసఫ్‌జాహీ వంశపు చిట్ట చివరి రాజైన ఉస్మానలీఖాన్ ఆశలు అడియాశలయినవి. ఎన్నో ఏండ్లనుండి స్వాతంత్ర పిపాసతో అనేక కష్టనిష్టురములకు మానావమానములకు ఓర్చుకొని భయంకరమైన దాస్యమున వంగి ప్రజా పరిపాలనమును చూడవలయునన్న ఆంధ్రుల కోరిక నెరవేరినది.

## మెదక్ జిల్లాలో లోక్‌సభ నియోజక వర్గాలు, పార్లమెంట్ సభ్యులు - మెదక్ నియోజక వర్గము

| సంవత్సరము | పేరు | పార్టీ |
|---|---|---|
| 1952 | జయసూర్య | పి.డి.యఫ్ |
| 1957 | పి.హన్మంతరావు | కాంగ్రెస్ |
| 1962 | పి. హన్మంతరావు | కాంగ్రెస్ |
| 1967 | సంగం లక్ష్మీబాయి | కాంగ్రెస్ |
| 1970 | మల్లికార్జున్ | కాంగ్రెస్ |
| 1977 | మల్లికార్జున్ | కాంగ్రెస్ |
| 1979 | శ్రీమతి ఇందిరా గాంధి | కాంగ్రెస్ |
| 1984 | పి. మణిక్య రెడ్డి | తెలుగుదేశం |
| 1989 | యం. బాగారెడ్డి | కాంగ్రెస్ |
| 1991 | యం. బాగారెడ్డి | కాంగ్రెస్ |
| 1996 | యం. బాగారెడ్డి | కాంగ్రెస్ |
| 1998 | యం. బాగారెడ్డి | కాంగ్రెస్ |
| 1999 | ఆలె నరేంద్ర | బి.జె.పి |
| **సిద్దిపేట నియోజక వర్గము** | | |
| 1975 | జి. వెంకటస్వామి | కాంగ్రెస్ |
| 1977 | జి. వెంకటస్వామి | కాంగ్రెస్ |
| 1979 | నంది ఎల్లయ్య | కాంగ్రెస్ |
| 1984 | విజయరామారావు | తెలుగు దేశం |
| 1989 | నంది ఎల్లయ్య | కాంగ్రెస్ |
| 1991 | నంది ఎల్లయ్య | కాంగ్రెస్ |
| 1996 | నంది ఎల్లయ్య | కాంగ్రెస్ |
| 1998 | రాజయ్య | తెలుగుదేశం |
| 1999 | రాజయ్య | తెలుగుదేశం |

| **రాజ్యసభకు ఎంపికైన మెదకు ప్రముఖులు** | | |
|---|---|---|
| ఎస్. రామచంద్రా రెడ్డి | దుబ్బాక | తెలుగుదేశం |

# మెదకు జిల్లా శాసనసభ్యులు

## 1952-1957 ప్రథమ శాసనసభ హైద్రాబాద్ స్టేట్

| క్ర.సం. | నియోజకవర్గము | ఎన్నికైనవారు | పార్టీ |
|---|---|---|---|
| 1. | మెదకు | శ్రీ వెంకటేశ్వరరావు | కాంగ్రెస్ |
| 2. | రామయంపేట | శ్రీ ఆరుట్ల రామచంద్రారెడ్డి | పి.డి.యఫ్ |
| 3. | సిద్దిపేట | శ్రీ ఎ. గురువారెడ్డి | పి.డి.యఫ్ |
| 4. | రాజగోపాల్‌పేట | శ్రీ కె. నారాయణ రెడ్డి | స్వతంత్రుడు |
| 5. | గజ్వేల్ | శ్రీ పెండెం వాసుదేవ్ | పి.డి.యఫ్ |
| 6. | నర్సాపూర్ | శ్రీ జె. రాంరెడ్డి | కాంగ్రెస్ |
| 7. | అందోల్ (జనరల్) | శ్రీ వెంకటరాజేశ్వరజ్యోషి | కాంగ్రెస్ |
| 8. | అందోల్ (రిజర్వ్) | శ్రీ లక్ష్మణ్ కుమార్ | కాంగ్రెస్ |
| 9. | జహీరాబాద్ | శ్రీ గుండేరావు యశ్వంతరావు | కాంగ్రెస్ |

## (1957-1962) రెండవ శాసనసభ ఆంధ్రప్రదేశ్

| క్ర.సం. | నియోజకవర్గము | ఎన్నికైనవారు | పార్టీ |
|---|---|---|---|
| 1. | మెదకు | శ్రీ వెంకటేశ్వరరావు | కాంగ్రెస్ |
| 2. | దొమ్మాట | శ్రీ అనంత రెడ్డి | పి.డి.యఫ్ |
| 3. | సిద్దిపేట | శ్రీ పి.వి. రాజేశ్వర రావు | కాంగ్రెస్ |
| 4. | గజ్వేల్ | శ్రీ ఆర్. నర్సింహా రెడ్డి | కాంగ్రెస్ |
| 5. | నర్సాపూర్ | శ్రీ గుండం వీరయ్య | కాంగ్రెస్ |
| 6. | సంగారెడ్డి జనరల్ | శ్రీ కస్తూరి కృష్ణమాచారి | కాంగ్రెస్ |
| 7. | సంగారెడ్డి రిజర్వ్ | శ్రీ కె. అనంతయ్య | కాంగ్రెస్ |
| 8. | అందోల్ | శ్రీ బస్వ మాణయ్య | కాంగ్రెస్ |
| 9. | జహీరాబాద్ | శ్రీ బాగారెడ్డి | కాంగ్రెస్ |
| 10. | నారాయణ్‌ఖేడ్ | శ్రీ అప్పారావు షెట్కార్ | కాంగ్రెస్ |

## (1962-1967) మూడవ శాసనసభ

| క్ర.సం. | నియోజకవర్గం | ఎన్నికైనవారు | పార్టీ |
|---|---|---|---|
| 1. | మెదకు | శ్రీమతి కేవల్ ఆనంద దేవి | సి.పి.ఐ |
| 2. | రామాయంపేట | శ్రీమతి రెడ్డి రత్నమ్మ | కాంగ్రెస్ |
| 3. | దొమ్మాట | శ్రీ ఖాజామొహినొద్దీన్ | - |
| 4. | సిద్ధిపేట | శ్రీ సోమేశ్వర్ రావు | - |
| 5. | గజ్వేల్ | శ్రీ సైదయ్య | కాంగ్రెస్ |
| 6. | నర్సాపూర్ | శ్రీ సి.హెచ్. విఠల్ రెడ్డి | సి.పి.ఐ |
| 7. | సంగారెడ్డి | శ్రీ పి. రామచంద్రారెడ్డి | కాంగ్రెస్ |
| 8. | సదాశివపేట | శ్రీ సి. రాజనర్సింహ | కాంగ్రెస్ |
| 9. | జహీరాబాద్ | శ్రీ యం. బాగారెడ్డి | కాంగ్రెస్ |
| 10. | నారాయణ్‌ఖేడ్ | శ్రీ దేశ్‌పాండే రామచంద్ర రావు | - |
| 11. | అందోల్ | శ్రీమతి సంగం లక్ష్మీదేవి | - |

## (1967-1972) నాల్గవ శాసనసభ

| క్ర.సం. | నియోజకవర్గం | ఎన్నికైనవారు | పార్టీ |
|---|---|---|---|
| 1. | మెదకు | శ్రీ రామచంద్రారెడ్డి | కాంగ్రెస్ |
| 2. | రామాయంపేట | శ్రీమతి రెడ్డిరత్నమ్మ | కాంగ్రెస్ |
| 3. | దొమ్మాట | శ్రీ యం. భీంరెడ్డి | కాంగ్రెస్ |
| 4. | సిద్ధిపేట | శ్రీ వి.బి. రాజు | కాంగ్రెస్ |
| 5. | గజ్వేల్ | శ్రీ సైదయ్య | కాంగ్రెస్ |
| 6. | నర్సాపూర్ | శ్రీ సి. జగన్నాధరావు | కాంగ్రెస్ |
| 7. | సంగారెడ్డి | శ్రీ సి. నర్సింహారెడ్డి | స్వతంత్రుడు |
| 8. | జహీరాబాద్ | శ్రీ యం. బాగారెడ్డి | కాంగ్రెస్ |
| 9. | నారాయణ్‌ఖేడ్ | శ్రీ శివరావు షెట్కార్ | కాంగ్రెస్ |
| 10. | అందోల్ | శ్రీ సి. రాజనర్సింహ | కాంగ్రెస్ |

## (1972-1978) ఐదవ శాసనసభ

| క్ర.సం. | నియోజకవర్గం | ఎన్నికైనవారు | పార్టీ |
|---|---|---|---|
| 1. | మెదకు | శ్రీ కరణం రామచంద్రరావు | స్వతంత్రులు |
| 2. | రామాయంపేట | శ్రీ యం. కొండల్‌రెడ్డి | స్వతంత్రులు |
| 3. | దొమ్మాట | శ్రీ యస్. రామ చంద్రా రెడ్డి | కాంగ్రెస్ |
| 4. | సిద్దిపేట | శ్రీ ఎ. మదన్ మోహన్ | కాంగ్రెస్ |
| 5. | గజ్వేల్ | శ్రీ సైదయ్య | కాంగ్రెస్ |
| 6. | నర్సాపూర్ | శ్రీ జగన్నాధరావు | కాంగ్రెస్ |
| 7. | సంగారెడ్డి | శ్రీ పి. రామచంద్రారెడ్డి | కాంగ్రెస్ |
| 8. | అందోల్ | శ్రీ రాజనర్సింహ | కాంగ్రెస్ |
| 9. | నారాయణ్ ఖేడ్ | శ్రీ యం. వెంకటరెడ్డి | స్వతంత్రులు |
| 10. | జహీరాబాద్ | శ్రీ యం. బాగారెడ్డి | కాంగ్రెస్ |

## (1978-1983) ఆరవ శాసనసభ

| క్ర.సం. | నియోజకవర్గం | ఎన్నికైనవారు | పార్టీ |
|---|---|---|---|
| 1. | మెదకు | శ్రీ యస్. లక్ష్మారెడ్డి | కాంగ్రెస్ |
| 2. | రామయంపేట | శ్రీ ముత్యంరెడ్డి / టి. అంజయ్య. | కాంగ్రెస్ (8-4-1981 నుండి) |
| 3. | దొమ్మాట | శ్రీ ఐరేని లింగయ్య | కాంగ్రెస్ |
| 4. | సిద్దిపేట | శ్రీ ఏ. మదన్‌మోహన్ | కాంగ్రెస్ |
| 5. | గజ్వేల్ | శ్రీ సైదయ్య | కాంగ్రెస్ |
| 6. | నర్సాపూర్ | శ్రీ చిలుములు విఠల్ రెడ్డి | సి.పి.ఐ |
| 7. | సంగారెడ్డి | శ్రీ నర్సింహారెడ్డి | కాంగ్రెస్ |
| 8. | అందోల్ | శ్రీ సి. రాజనర్సింహ | కాంగ్రెస్ |
| 9. | నారాయణ్‌ఖేడ్ | శ్రీ శివరావుషెట్కార్ | కాంగ్రెస్ |
| 10. | జహీరాబాద్ | శ్రీ యం. బాగారెడ్డి | కాంగ్రెస్ |

## (1983-1985) ఏడవ శాసనసభ

| క్ర.సం. | నియోజకవర్గం | ఎన్నికైనవారు | పార్టీ |
|---|---|---|---|
| 1. | మెదకు | శ్రీ కరణం రామచంద్రరావు | తెలుగుదేశం |
| 2. | రామాయంపేట | శ్రీ టి. అంజయ్య | కాంగ్రెస్ |
| 3. | దొమ్మాట | శ్రీ ఐరేని లింగయ్య | కాంగ్రెస్ |
| 4. | సిద్ధిపేట | శ్రీ ఎ. మదన్‌మోహన్ | కాంగ్రెస్ |
| 5. | గజ్వేల్ | శ్రీ అల్లంసాయిలు | తెలుగుదేశం |
| 6. | నర్సాపూర్ | శ్రీ సి. జగన్నాధరావు | కాంగ్రెస్ |
| 7. | సంగారెడ్డి | శ్రీ పి. రామచంద్రారెడ్డి | కాంగ్రెస్ |
| 8. | అందోల్ | శ్రీ హట్కార్ లక్ష్మణ్‌జీ | కాంగ్రెస్ |
| 9. | నారాయణఖేడ్ | శ్రీ యం. వెంకటరెడ్డి | తెలుగుదేశం |
| 10. | జహీరాబాద్ | శ్రీ యం. బాగారెడ్డి | కాంగ్రెస్ |

## (1985-1990) ఎనమిదవ శాసనసభ

| క్ర.సం. | నియోజకవర్గం | ఎన్నికైనవారు | పార్టీ |
|---|---|---|---|
| 1. | మెదకు | శ్రీ కరణం రామచంద్రరావు | తెలుగుదేశం |
| 2. | రామాయంపేట | శ్రీ ఆర్. శ్రీనివాస్ రెడ్డి | బి.జె.పి |
| 3. | దొమ్మాట | శ్రీ డి. రామచంద్రారెడ్డి | తెలుగుదేశం |
| 4. | సిద్ధిపేట | శ్రీ కల్వకుంట చంద్రశేఖర రావు | తెలుగుదేశం |
| 5. | గజ్వేల్ | శ్రీ బి. సంజీవరావు | తెలుగుదేశం |
| 6. | నర్సాపూర్ | శ్రీ చిలుముల విఠల్‌రెడ్డి | సి.పి.ఐ |
| 7. | సంగారెడ్డి | శ్రీ పి. రామచంద్రారెడ్డి | కాంగ్రెస్ |
| 8. | అందోల్ | శ్రీ యం. రాజయ్య | తెలుగుదేశం |
| 9. | నారాయణ ఖేడ్ | శ్రీ శివరావు షెట్కార్ | కాంగ్రెస్ |
| 10. | జహీరాబాద్ | శ్రీ యం. బాగారెడ్డి | కాంగ్రెస్ |

## (1990-1995) తొమ్మిదవ శాసనసభ

| క్ర.సం. | నియోజకవర్గం | ఎన్నికైనవారు | పార్టీ |
|---|---|---|---|
| 1. | మెదకు | శ్రీ నారాయణ రెడ్డి | కాంగ్రెస్ |
| 2. | రామాయంపేట | శ్రీ ఎ. విఠల్ రెడ్డి | కాంగ్రెస్ |
| 3. | దొమ్మాట | శ్రీ సి.హెచ్. ముత్యంరెడ్డి | తెలుగుదేశం |
| 4. | సిద్దిపేట | శ్రీ కల్వకుంట చంద్రశేఖర్ రావు | తెలుగుదేశం |
| 5. | గజ్వేల్ | శ్రీమతి గీతారెడ్డి | కాంగ్రెస్ |
| 6. | నర్సాపూర్ | శ్రీ చిలుముల విఠల్ రెడ్డి | సి.పి.ఐ |
| 7. | సంగారెడ్డి | శ్రీ పి. రామచంద్రారెడ్డి | కాంగ్రెస్ |
| 8. | అందోల్ | శ్రీ దామోదర్ రాజనర్సింహ | కాంగ్రెస్ |
| 9. | నారాయణ్‌ఖేడ్ | శ్రీ కిష్టారెడ్డి | కాంగ్రెస్ |
| 10. | జహీరాబాద్ | శ్రీ నర్సింహారెడ్డి | కాంగ్రెస్ |

## 1995-1999 పదవ శాసనసభ

| క్ర.సం. | నియోజకవర్గం | ఎన్నికైనవారు | పార్టీ |
|---|---|---|---|
| 1. | మెదకు | శ్రీ కరణం రామచంద్రరావు | తెలుగుదేశం |
| 2. | రామాయంపేట | శ్రీ దేవర వాసుదేవ రావు | తెలుగుదేశం |
| 3. | దొమ్మాట | శ్రీ సి.హెచ్. ముత్యం రెడ్డి | తెలుగుదేశం |
| 4. | సిద్దిపేట | శ్రీ కల్వకుంట చంద్రశేఖర్ రావు | తెలుగుదేశం |
| 5. | గజ్వేల్ | శ్రీ డా. విజయరామారావు | తెలుగుదేశం |
| 6. | నర్సాపూర్ | శ్రీ చిలుముల విఠల్ రెడ్డి | తెలుగుదేశం |
| 7. | సంగారెడ్డి | శ్రీ సదాశివరెడ్డి | తెలుగుదేశం |
| 8. | అందోల్ | శ్రీ రాజయ్య / బాబుమోహన్ | తెలుగుదేశం 1998 నుండి |
| 9. | నారాయణ్‌ఖేడ్ | శ్రీ విజయపాల్‌రెడ్డి | తెలుగుదేశం |
| 10. | జహీరాబాద్ | శ్రీ బాగన్న | తెలుగుదేశం |

## 1999 పదకొండవ శాసనసభ

| క్ర.సం. | నియోజకవర్గం | ఎన్నికైనవారు | పార్టీ |
|---|---|---|---|
| 1. | మెదకు | శ్రీ కరణం రామచంద్ర రావు | తెలుగుదేశం |
| 2. | రామాయం పేట | శ్రీ ఎ. విఠల్ రెడ్డి | కాంగ్రెస్ |
| 3. | దొమ్మాట | శ్రీ సి.హెచ్. ముత్యంరెడ్డి | తెలుగుదేశం |
| 4. | సిద్దిపేట | శ్రీ కల్వకుంట చంద్రశేఖర్ రావు | తెలుగుదేశం |
| 5. | గజ్వేల్ | శ్రీ ఏ. సంజీవరావు | తెలుగుదేశం |
| 6. | నర్సాపూర్ | శ్రీమతి వాకిటి సునీతారెడ్డి | కాంగ్రెస్ |
| 7. | సంగారెడ్డి | శ్రీ సత్యానారయణ | బి.జె.పి |
| 8. | అందోల్ | శ్రీ బాబూమోహన్ | తెలుగుదేశం |
| 9. | నారాయణ ఖేడ్ | శ్రీ కిష్టారెడ్డి | కాంగ్రెస్ |
| 10. | జహీరాబాద్ | శ్రీ ఫరీదుద్దీన్ | కాంగ్రెస్ |

# అంధ్ర ప్రదేశ్ విధానసభ మండలి శాసనమండలికి ప్రాతినిధ్యం వహించిన మెదకు జిల్లా ప్రముఖులు

| | |
|---|---|
| శ్రీ ఐరేని లింగయ్య | దుబ్బాక |
| శ్రీ వెంకట నర్సింహా చారి | తూప్రాన్ |
| శ్రీ యస్. లక్ష్మారెడ్డి | జోగిపేట |
| శ్రీ సి. జగన్నాథరావు | నర్సాపూర్ |
| శ్రీ ముత్యం రెడ్డి | చిన్న శంకరంపేట మండలము |
| శ్రీ కె. రంగారెడ్డి | కొడకండ్ల గజ్వేల్ |
| శ్రీ టి. లక్ష్మారెడ్డి | జహీరాబాద్ |

# మెదకు జిల్లా నుండి ఎన్నికై పదవులను నిర్వహించిన ప్రముఖులు

## ప్రధానమంత్రి నియోజక వర్గంగా మెదకు



మెదకు జిల్లాకు భారతదేశ రాజకీయాలలో ఒక సమున్నత ప్రత్యేక స్థానము కలదు. 1977 సార్వత్రిక ఎన్నికలలో పరాజయంపాలై ప్రధానమంత్రి పదవి కోల్పోయిన శ్రీమతి ఇందిరాగాంధి 1980 లో జరిగిన మధ్యంతర ఎన్నికలలో మెదకు పార్లమెంటరీ నియోజక వర్గము నుండి పోటీ చేసి ఘన విజయమును సంపాదించి భారత ప్రధాన మంత్రి పదవినలంకరించిరి.

అప్పటి వరకు మెదకు నియోజకవర్గపు పేరు తెలియని చాలా మందికి ప్రధాన మంత్రి నియోజక వర్గంగా తెలిసిపోయినది.

ప్రధాన మంత్రి నియోజక వర్గంగా మెదకు జిల్లా కీర్తినందుటేగాక పారిశ్రామికముగా అభివృద్ధి నందినది. అప్పుడే మెదకు జిల్లాలో పరిశ్రమలు స్థాపించిన వారికి ప్రత్యేక రాయితీలు అనేకముగా నీయబడి పారిశ్రామిక ప్రగతి ప్రారభమైనది.

ఆర్డినెన్స్ ఫ్యాక్టరి మెదకు జిల్లాలో ఏర్పాటగుట ఇందిరా గాంధి మెదకు ప్రజలకిచ్చిన వరంగా భావించ వచ్చు.

# ముఖ్యమంత్రిని అందించిన మెదకు జిల్లా

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా, కేంద్ర కార్మిక మంత్రిగా పదవులను అధిష్ఠించిన శ్రీ టి. అంజయ్యగారు మెదక్ జిల్లా భానూరులో జన్మించిరి.

పేదరికంతో చదువుసాగక 7వ తరగతి వరకు మాత్రమే చదువుకొనిన అంజయ్యగారు తుపాకుల కర్మాగరంలో కార్మికునిగా జీవనమును ప్రారంభించిరి.

ఒక సామాన్య కార్మికునిగా బ్రతుకు వెళ్లదీసిన అంజయ్యగారు ముఖ్యమంత్రి స్థానంలో ఉండి కూడా సామాన్యుల గురించి, కార్మికుల గురించి ఆలోచించేవారు.

నిజాం రాజ్యంలోని నిరంకుశత్వం భారత దేశంలో సాగుతున్న బ్రిటిష్‌పాలన, ఈ రెంటిపై సాగుతున్న సమరాలు అంజయ్యలో దేశభక్తిని ప్రేరేపించాయి. అంజయ్యగారు అనేక కార్మిక సంఘాలకు నాయకత్వం వహించాడు. 1952 లో హైద్రాబాద్ రాష్ట్ర జాతీయ కార్మిక సంఘాల సమాఖ్యకు అధ్యక్షుడైనాడు.

1972లో శ్రీ పి.వి.నర్సింహారావు గారి మంత్రివర్గంలో, ఆ తర్వాత శ్రీ వెంగళరావుగారి మంత్రివర్గంలో కార్మిక మంత్రిగా పనిచేసి కార్మికుల శ్రేయస్సుకై ఎన్నో పథకాల నిర్దేశించినాడు. 1980లో ఇందిరాగాంధి నాయకత్వంలోని మంత్రి మండలిలో కూడా కేంద్ర కార్మిక మంత్రిగా నియమింపబడి సమర్థతతో తన శాఖను నిర్వహించినాడు.

ఏ ఉన్నత పదవిలోనున్నప్పటికీ నిరాడంబరుడుగాని గర్విగా పేరుతెచ్చుకొనిన శ్రీ టి. అంజ్యగారు ముఖ్యమంత్రిగా బాధ్యతల స్వీకరించిన తదుపరి రామాయంపేట శాసనసభకు ఏకగ్రీవముగా ఎన్నికైనారు. రాష్ట్ర శాసనసభ చరిత్రలో ఏకగ్రీవముగా ఎన్నికైన శాసన సభ్యుడు శ్రీ టి. అంజయ్యగారు మాత్రమే.

1983లో కూడా రామాయంపేట శాసన సభా నియోజక వర్గము నుండే శాసనసభ్యునిగా పోటీచేసి గెలుపు సాధించినారు.

# వివిధ పదవులనలంకరించిన ప్రముఖులు

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత కూడా హైద్రాబాద్ స్టేట్‌ను నైజాం ప్రభువు తన రాజ్యాన్ని భారత దేశంలో విలీనం చేయకుండా స్వతంత్రదేశంగా మనడానికి తీవ్ర ప్రయత్నములు చేసెను.

సర్దార్ వల్లబ్భాయి పటేల్ హోం మంత్రిగా తీసికొనిన సైనిక చర్యల ఫలితముగా హైద్రాబాద్ రాష్ట్రము భారత దేశంలో విలీనమైనది.

హైద్రాబాద్ రాష్ట్రమునకు శాసనసభ ఎన్నికలు. 1952 లో మొట్టమొదటి సారిగా జరిగినవి. ఆ శాసన సభకు మొత్తము 175 మంది శాసన సభ్యులు ఎన్నిక కాబడిరి.

తొట్టతొలుత ఏర్పడిన హైద్రాబాద్ రాష్ట్ర శాసన సభకు మెదకు జిల్లా నుండి 9 (తొమ్మిది) మంది శాసన సభ్యులు ఎన్నిక కాబడినారు. హైద్రాబాదు రాష్ట్ర మొట్టమొదటి ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామ కృష్ణారావు గారుండిరి.

మెదకు జిల్లాలో శాసన సభాస్థానములు అనేక మార్పులు చెందినవి. ఆయా మార్పులు నియోజక వర్గములందు చూడవచ్చును. ఒకే శాసనసభా నియోజక వర్గము నుండి ఒక రిజర్వు అభ్యర్థి మరియు ఒక జనరల్ అభ్యర్థి ఇరువురు ఎంపికగుట మొదటి, రెండు ఎన్నికలలో జరిగినది. ఇట్టి నియోజక వర్గములు మెదకు జిల్లాలో అందోలు, సంగారెడ్డి స్థానములందుండేవి. మూడవ శాసనసభలో మెదకు నుండి 11 మంది శాసన సభ్యులు ఎన్నికైరి. నాల్గవ శాసన సభ నుండి నేటి వరకు శాసన సభా స్థానము ఏలాంటి మార్పులు లేక పది నియోజక వర్గములుగానున్నవి. 1967 నాటి నుండి అందోలు - గజ్వేల్ నియోజక వర్గములు యస్.సి.లకు రిజర్వు చేయబడియున్నవి.

మెదకు జిల్లా నుండి ఎన్నికైన శాసన సభ్యులలో కొందరు ప్రముఖులు పలు ఉన్నత పదవుల నలంకరించినారు.

సిద్దిపేట నియోజక వర్గము నుండి ఎన్నికైన శ్రీ పి.వి. రాజేశ్వరరావు గారు శాసనసభ ఉపసభాపతిగా మెదకు జిల్లాకు వన్నె తెచ్చిరి.

నాల్గవ శాసనసభలో సిద్దిపేట నియోజక వర్గము నుండి ఎన్నికైన శ్రీ వి.బి. రాజుగారు. రెవెన్యూ మంత్రి పదవినలంకరించిరి.

ఐదవ శాసనసభలో నర్సాపూర్ నుండి ఎన్నికైన శ్రీ సి. జగన్నాథ రావు గారు ఉపసభాపతిగా, సిద్దిపేట నుండి ఎన్నికైన శ్రీ ఏ. మదన్ మోహన్ గారు రాష్ట్ర సాంకేతిక విద్యా మంత్రిగా పదవీ బాధ్యతలు నిర్వహించినారు.

ఆరవ శాసన సభ మెదకు జిల్లాకు గర్వ కారణమైనదని చెప్ప వచ్చును. రామాయంపేట ఉప ఎన్నికలలో రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య గారు ఎన్నికై మెదకు జిల్లాకు ప్రాతినిథ్యము వహించిరి. ఇదే శాసనసభలో జహీరాబాద్ నుండి వరుసగా ఎన్నికగుచు వచ్చిన శ్రీ యం. బాగారెడ్డి గారు

పంచాయత్‌రాజ్ శాఖ మంత్రిగా, సిద్దిపేట నుండి ఎన్నికైన శ్రీ మదనమోహన్‌గారు ఆరోగ్య మంత్రిగా అందోలు నుండి ఎన్నికైన శ్రీ సి. రాజనర్సింహగారు రాష్ట్ర మంత్రిగా, నర్సాపూర్ శ్రీ సి. జగన్నాధ రావు గారు ఎక్సైజ్ హోం శాఖల నిర్వహించుటేకాక రాష్ట్ర ఉపముఖ్య మంత్రిగా పదవీ బాధ్యతల నిర్వహించిరి.

1983 లో జరిగిన ఏడవ శాసనసభ రాష్ట్ర చరిత్రలో ఒక కొత్త అధ్యాయమును సృష్టించినది. ఈనాటి వరకు కాంగ్రెసు పార్టీ మాత్రమే అధికారమునకు అందుబాటులో ఉండగా తెలుగుదేశం ప్రాంతీయ పార్టీ ఆవిర్భవించి తొమ్మిది నెలలలో అధికారము చేపట్టినది. ఈ శాసనసభలో మెదకు నియోజకవర్గము నుండి ఎన్నికైన శ్రీ కరణం రామచంద్ర రావుగారు పంచాయత్ రాజ్ శాఖా మాత్యులుగా పదవిని స్వీకరించి తగు న్యాయమును చేకూర్చిరి.

1985 లో జరిగిన రాష్ట్ర శాసనసభ మధ్యాంతర ఎన్నికలు జరిగినవి. మెదకు శ్రీ కరణం రామచంద్ర రావు గారు తిరిగి పంచాయత్‌రాజ్ శాఖా మాత్యులుగా, కొంత కాలము సహకార శాఖామాత్యులుగా పదవీ బాధ్యతలు నిర్వహించిరి. అందోలు నియోజక వర్గము నుండి ఎన్నికైన శ్రీ రాజయ్యగారు రాష్ట్ర ఆర్థిక, విద్యుత్ శాఖ మంత్రిగా కొంత కాలము నిర్వహించిరి. ఈ సభలోనే సిద్దిపేట నుండి ఎన్నికైన కే. చంద్రశేఖర్ రావు గారు కరవు మంత్రిగా బాధ్యత స్వీకరించిరి.

1990 లో జరిగిన తొమ్మిదవ శాసనసభలో గజ్వేల్ నుండి ఎన్నికైన శ్రీమతి గీతారెడ్డి గారు రాష్ట్రమంత్రి వర్గమున స్థానమును సంపాదించి జిల్లా నుండి ప్రప్రథమ మహిళా మంత్రిగా పేరొందిరి. ఇదే శాసనసభకు సంగారెడ్డి నియోజక వర్గమునకు ఎన్నికైన శ్రీ పి. రామచంద్రా రెడ్డి గారు కొంత కాలము శాసనసభాపతిగా మరికొంత కాలము భారీ పరిశ్రమల శాఖామంత్రిగా పదవీ బాధ్యతలను నిర్వహించిరి.

1995 లో జరిగిన పదవ శాసనసభకు మెదకు నుండి ఎన్నికైన శ్రీ కరణం రామచంద్ర రావు గారు పంచాయత్ రాజ్ శాఖను తిరిగి స్వాధీనము చేసికొనిరి. 1996లో ప్రభుత్వములో వచ్చిన మార్పుతో శ్రీ నందమూరి తారక రామారావుగారు ముఖ్య మంత్రి పదవికి దూరముకాగా వారి అల్లుడు ఆనాటి రెవెన్యూ మంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారు ముఖ్యమంత్రి పదవినలంకరించిరి. వారి మంత్రి వర్గమున సిద్దిపేట శాసన సభ్యులు శ్రీ కల్వకుంట చంద్రశేఖర రావు గారు రవాణా శాఖామాత్యులుగా పదవీ బాధ్యతలను స్వీకరించిరి.

1999 లో పదకొండవ శాసనసభకు ఎన్నికలు జరిగినవి. తెలుగుదేశం పార్టీ తిరిగి అధికారమును చేపట్టినది. ఈ సభకు మెదకు నుండి ఎన్నికైన శాసనసభ్యులు శ్రీ కరణం రామచంద్ర రావు గారు మంత్రి వర్గములో స్థానమును పొంది ఉన్నత విద్యాశాఖను నిర్వహించుచున్నారు.

శ్రీ కల్వకుంట చంద్రశేఖర్ రావుగారు ఉపసభాపతి పదవిని కూడా చేపట్టినారు.

# స్థానిక స్వపరిపాలనా సంస్థలు

అసఫ్జాల పాలనాకాలంలో సఫాయి మొదలగు పారిశుధ్య కార్యక్రమాలకై స్థానిక పన్నుల విధింపు ఉండేది. మహబూబలీఖాన్‌కు దివాన్‌గానున్న సర్ సాలార్జంగ్ పరిపాలనా సంస్కరణములు నెన్నింటినో ప్రవేశ పెట్టెను.

1887లో అప్పటి వరకున్న పన్నుల విధానమున మార్చి భూమిశిస్తుపై ఒక శాతము రోడ్ల పన్నును విధించెను. ఆ తర్వాత ఆపన్ను స్థానిక అవసరములకు సరిపోనందున భూమి శిస్తులో రూపాయికి ఒక అణా చొప్పున స్థానిక పన్ను వసూలు చేయుటకు ఆదేశములీయబడినవి.

ఈ పన్ను వలన స్థానిక అవసరములు పూర్తి చేయవలెనని నిర్ణయించబడినది. రాష్ట్రమున రోడ్లు, పాఠశాలలు, వైద్యశాలలు, విశ్రాంతి భవనములు నిర్మించుటకు ఇట్టి డబ్బు వినియోగింపబడేది.

1988లో నిజాం రాష్ట్రమున లోకల్ ఫండ్ శాఖ నెలకొల్పబడినది. స్థానిక పన్నుల ద్వారా వచ్చే ఆదాయము లోకల్ ఫండ్ నిధికి చేర్చబడుచుండెను. ఈ నిధి దుస్తూరుల్ అమల్ ద్వారా వ్యయము చేయు వ్యవస్థ రూపొందించబడినది.

లోకల్ ఫండ్‌కు పురపాలక సంఘముల ఆదాయము, ఆస్తిపన్ను, స్థానిక పన్ను మొదలగునవి చేర్చబడు చుండెను.

"దుస్తూరుల్ అమల్" వలన జిల్లా కేంద్రములందు జిల్లా బోర్డులు, తాలుకాలలో తాలూకా బోర్డులు స్థాపించబడినవి. ఈ బోర్డుల పర్యవేక్షణకు హైద్రాబాదులో సెంట్రల్ బోర్డు నెలకొల్పబడినది. జిల్లా బోర్డుకు కలెక్టరు, తాలూకా బోర్డుకు తహసీల్‌దారు అధ్యక్షులుగా నుండేవారు.

జిల్లా బోర్డులో కలెక్టరుతో కలిసి 14 మంది సభ్యులుండేవారు. వీరిలో 7 ప్రభుత్వాధికారులు, 7 అధికారేతరులు నియమింపబడుచుండిరి. ప్రభుత్వాధికారులలో 1 రెవెన్యూ అసిస్టెంటు, జిల్లా ఇంజనీరు, పోలీసు సూపరింటెండెంట్, ఒక తహసీల్ దారు, స్థానిక పాఠశాల ప్రధానోపాధ్యయుడు, జిల్లా వైద్యాధికారి ఉండేవారు. అధికారేతరులలో జిల్లా కలెక్టరు ఎంపిక చేసిన జమీందారులు, న్యాయవాదులు పెద్ద వ్యాపారులు ఉండేవారు. ఈ సభ్యుల కాలపరిమితి మూడు (3) సంవత్సరాలుండేది. తాలూకా బోర్డులలో 5 సభ్యులుండేవారు. తర్వాత వీరి సంఖ్య 8కి పెంచబడినది.

1917-1918 సంవత్సరము నుండి శిస్తుపై రూపాయికి 13 పైసలు స్థానిక పన్నుగా నిర్ణయింప బడెను. ఈ పన్నులో గ్రామపోలీసు నిధికి 4 పైసలు, రోడ్ల నిధికి 2 పైసలు, స్థానికాభివృద్ధి నిధికి 4 పైసలు, విద్యా వైద్యాలయములకై 3 పైసలు ఖర్చు చేయబడుచుండెను.

1918-1919లో ఈ నిధుల కేటాయింపు మార్చబడినిది. విద్యకు 3 పైసలు, వైద్యమునకు 2 పైసలు, రోడ్లకు 2 పైసలు, ప్రజోపయోగ నిర్మాణములకు 5 పైసలు నిర్ణయింపబడినది.

క్రీ.శ. 1928-1929లో పట్టణాలకు, గ్రామీణ ప్రాంతాలకు నిధులు ప్రత్యేకింపబడినవి. క్రీ.శ. 1940 వరకు జిల్లా బోర్డుకు చెందిన విద్యాలయములు పని చేసే ఉపాధ్యాయులకు స్థానిక నిధుల నుండి జీతము చెల్లింపబడుచుండెను. 1929-1945 మధ్యకాలమున స్థానిక సంస్థల అభ్యున్నతికి అనేక చర్యలుగైకొనబడినవి.

దేశ స్వాతంత్ర్యనంతరము గ్రామసీమల అభివృద్ధివైపు దృష్టి సారించనైనది.

క్రీ.శ. 1951లో హైద్రాబాదు గ్రామ పంచాయతీల చట్టము అమలు పరచబడినది.

క్రీ.శ. 1956లో మొదటి హైద్రాబాదు జిల్లా బోర్డుల చట్టము రూపొందించబడినది. ఈ చట్టము 1959లో రద్దు గావింపబడినది.

బల్వంతరావు మెహతా కమిటీ సూచనల ద్వారా ఆంధ్రప్రదేశ్ పంచాయత్ రాజ్ యాక్టు 1959లో ప్రవేశపెట్టబడినది. దీనితో గ్రామ పరిపాలన మొత్తము స్థానిక స్వపరిపాలన విధానముగా మారినది. గ్రామ స్థాయిలో గ్రామపంచాయితి తాలుకా స్థాయిలో పంచాయితి సమితి జిల్లా స్థాయిలో జిల్లాపరిషత్తులు ఏర్పాటైనవి.

కొంతకాలము పంచాయితి సమితి బ్లాకులుగా తాలూకాకు 2 చొప్పున కొన్ని చోట్ల ఏర్పాటైనవి.

మెదకు జిల్లాలో ప్రతి తాలూకాకు ఒక పంచాయతి సమితిగాక హత్నూర, సదాశివపేట, రామాయంపేట, దుబ్బాక, మిర్జాపూర్, వర్గల్, బ్లాకులుండేవి.

ప్రతి గ్రామపంచాయతికి ఆ ప్రాంత జనాభాను బట్టి వార్డు మెంబర్లు ఎన్నికయ్యేవారు. వార్డు మెంబర్లు సర్పంచును ఎన్నుకొనేవారు.

1980 పంచాయతీ ఎన్నికల నుండి సర్పంచ్ ఎన్నిక ప్రజలతో నేరుగా జరుపబడుచున్నది. పంచాయితీ సమితి బ్లాకులు మెదకు జిల్లాలో ఇవి ఉండేవి.

| పంచాయితి సమితి | బ్లాకు |
|---|---|
| 1. నర్సాపూర్ | 1. హత్నూర |
| 2. మెదకు | 2. రామాయంపేట |
| 3. జోగిపేట | |
| 4. గజ్వేల్ | 3. వర్గల్ |
| 5. సిద్దిపేట | 4. దుబ్బాక |
| 6. పాటంచెరు | 5. సదాశివపేట |
| 7. జహీరాబాదు | 6. మీర్జాపూర్ |
| 8. నారాయణఖేడ్ | |

1964లో బ్లాకులు పోయినవి. కేవలము పంచాయతి సమితులు మాత్రము మిగిలినవి. రామాయంపేట - దుబ్బాక, సదాశివపేటలలో పంచాయతి సమితులు ఏర్పడినవి. మొదట గ్రామ పంచాయితి సర్పంచులు పంచాయితి సమితి అధ్యక్షుని ఎన్నుకొనేవారు.

1980 నుండి పంచాయితి సమితి అధ్యక్షుని ప్రత్యక్ష పద్ధతిన ప్రజలే ఎన్నుకున్నారు.

జిల్లా పరిషత్తులో పంచాయితి సమితి అధ్యక్షులు ఎం.ఎల్.ఎ.లు, ఎం.పి.లు, ఎం.ఎల్.సి.లు సభ్యులైయుందురు. వీరిలో నుండి ఒకరిని జిల్లా పరిషత్ అధ్యక్షునిగా వీరు ఎన్నుకొందరు అధ్యక్షులైనవారు రెండు పదవుల నిర్వహించరాదు.

క్రీ.శ. 1985 ఆంధ్రదేశంలో పంచాయిత్‌రాజ్ చట్టము మార్చబడినది. ఆనాటి ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారకరామారావు మదిలో మెదిలిన గ్రామీణ స్వరాజ్యము, పరిపాలనా వికేంద్రీకరణలు కొత్త పుంతలు త్రొక్కినవి. తాలూకాలను విభజించి రెవెన్యూ మండలాలుగా మార్చబడినవి. పంచాయితి సమితులు విభజింపబడి మండల ప్రజా పరిషత్తులుగా మార్చబడినవి. మెదకు జిల్లాలో 11 తాలూకాలు, 11 పంచాయతి సమితుల స్థానే 45 మండలాలు ఏర్పాటైనవి. ప్రతి మండలమున రెవెన్యూ, మండల ప్రజాపరిషత్తు కార్యాలయములు ఏర్పాటైనవి.

మండల ప్రజాపరిషత్తునకు 1987 జనవరిలో అధ్యక్ష ఎన్నికలు ప్రత్యక్షపద్ధతి ద్వార ప్రజల నుండి నేరుగా జరిగినవి. మండల ప్రజాపరిషత్తులో ఆ మండలము నందలి గ్రామ పంచాయితీ సర్పంచులు సభ్యులుగానుందురు.

1993లో గ్రామీణ పంచాయితి రాజ్ చట్టము దేశ వ్యాప్తముగా మార్చబడినది. ఈనాటివరకు 3 అంచెలుగానున్న విధానము 4 అంచెలుగా మారినది.

గ్రామ పంచాయతితో పాటు మండల పరిషత్తునకు కై మండల ప్రాదేశిక నియోజక వర్గ సభ్యుల ఎన్నుకొనుట అవసరమైనది.

మండల జనాభాను బట్టి గ్రామాలలో (ఎం.పి.టి.సి.) మండల పరిషత్ నియోజకవర్గములు (మండల పరిషద్ టెరిటోరియల్ కాన్స్టిట్యూయెన్సి) ఏర్పాటైనవి. ఇక్కడి నుండి ఎన్నికైన ఎం.పి.టి.సిలే మండల పరిషత్ సభ్యులుగా నుందురు. వీరి నుండే మండల అధ్యక్ష, ఉపాధ్యక్ష ఎన్నికలు జరుపబడును. ఇది పరోక్ష పద్ధతి.

ప్రతి మండలము ఒక జిల్లా పరిషత్ నియోజక వర్గమైయుండును. జడ్.పి.టి.సి. (జిల్లా పరిషద్ టెరిటోరియల్ కాన్స్టిట్యుయెన్సి) మండల ఓటర్లచే ప్రత్యక్షముగా ఎన్నిక కావలయును. ఎన్నుకోబడిన జడ్.పి.టి.సి. జిల్లా పరిషత్తులో సభ్యుడగును. జడ్.పి.టి.సి.ల నుండే జిల్లా పరిషత్ అధ్యక్ష ఉపాధ్యక్షులు పరోక్ష పద్ధతిన ఎన్నిక కాబడుదురు.

మండల పరిషత్తులందు గ్రామ సర్పంచులు, జిల్లా పరిషత్తునందు మండలాధ్యక్షులు ఎక్స్ అఫిషియో సభ్యులుగా పాల్గొందురు.

మండల పరిషత్తులో సంబంధిత ఎం.ఎల్.ఎ. మరియు ఎం.పి.లు జిల్లా పరిషత్తులో జిల్లాకు సంబంధించిన ఎం.ఎల్.ఎ. మరియు ఎం.పి.లు ఎక్స్ అఫిషియో సభ్యులుగా పాల్గొందురు.

1987 నుండి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో రిజర్వు చేయుటేగాక మహిళలకు కూడా 3 పంచాయతి ఎన్నికలలో రిజర్వేషన్ విధానము ప్రవేశ రిజర్వేషన్ పెట్టబడినది. కల్పింపబడినది. ఎస్.సి., ఎస్.టి., బి.సి.లకు

## రాజ్యాంగపు పదకొండవ అనుసూచికలో పంచాయితీ సంస్థలకున్న అధికారాలు-

1. వ్యవసాయం, వ్యవసాయ విస్తరణ
2. భూమి అభివృద్ధి, భూ సంస్కరణలు అమలు, భూముల ఏకీకరణ, భూసార రక్షణ.
3. చిన్న తరహా నీటి పారుదల, నీటి నిర్వహణ, నీటి వాలు అభివృద్ధి
4. పశు సంవర్ధన, పాడి పరిశ్రమ, కోళ్ళ పరిశ్రమ.
5. మత్స్య పరిశ్రమ
6. సామాజిక అడవులు. చేలల్లో చెట్లు పెంచుట
7. చిల్లర అటవీ ఉత్పత్తులు
8. లఘు పరిశ్రమలు, ఆహార పదార్థాలను శుభ్రపరుచుట (ప్రాసెస్)
9. ఖాదీ, గ్రామ, కుటీర పరిశ్రమ
10. గ్రామీణ గృహ నిర్మాణం
11. మంచినీరు
12. ఇంధనం, పశుగ్రాసం
13. రోడ్లు, కల్వర్టులు, వంతెనలు, ఫెర్రీలు జలమార్గాలు, ఇతర రాకపోకల సాధనాలు
14. గ్రామీణ విద్యుదీకరణ విద్యుచ్ఛక్తి పంపకం
15. సాంప్రదాయేతర విద్యుచ్ఛక్తి వనరులు
16. పేదరిక నిర్మూలనా కార్యక్రమాలు
17. విద్య- ప్రాథమిక, సెకండరీ పాఠశాలలు
18. సాంకేతిక శిక్షణ, వృత్తి విద్య
19. వయోజన, అనియత విద్య
20. గ్రంథాలయములు
21. సాంస్కృతిక కార్యక్రమాలు
22. మార్కెట్లు, సంతలు
23. ఆరోగ్యం, పారిశుధ్యం, ఆసుపత్రులు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, చికిత్సాలయములు.
24. కుటుంబ సంక్షేమం
25. స్త్రీ, శిశు అభివృద్ధి
26. సాంఘిక సంక్షేమం, వికలాంగుల, బుద్ధి మాంద్యంకల వారి సంక్షేమం
27. బలహీన వర్గాలు, ప్రధానంగా అనుసూచిక వర్గాల, అనుసూచిత జాతుల సంక్షేమం
28. ప్రజాపంపిణీ వ్యవస్థ
29. సామాజిక సంపత్తులు నిర్వహణ

# మెదకు జిల్లా పరిషత్తు

ఆంధ్రప్రదేశ్‌లో 1959లో ప్రవేశ పెట్టబడిన పంచాయితి యాక్టు ప్రకారం మెదకు జిల్లా పరిషత్తు ఏర్పాటైనది. రాజ్యంగం 11వ అనుసూచితలోని అధికారాలన్నీ జిల్లా పరిషత్తునకు లభించిన వి. ముఖ్యముగా పంచాయితీ రాజ్ వ్యవస్థలో గ్రామీణ విద్యావకాశాలు పెరిగినవి. ప్రతి పల్లెలో పాఠశాలలు ప్రారంభింపబడినవి. జిల్లా పరిషత్తు యాజమాన్యమున అనేక ఉన్నత పాఠశాలలు ప్రారంభింపబడి గ్రామీణ ప్రాంతాలలో విద్యాభివృద్ధి గావింపబడుతున్నది.

దాహార్తిలో కొట్టుమిట్టాడుతున్న అనేక గ్రామాలకు రక్షిత మంచినీటి సరఫరా కల్పించుటలో జిల్లా పరిషత్తు శ్రద్ధాసక్తులను కనబరచున్నది.

పల్లెపల్లెకు రహదారి వసతులు కల్పించుటకై రోడ్లు వేయించుటలో జిల్లా పరిషత్తు చురుకైన పాత్ర వహించుచున్నది.

ఇవియేకాక వ్యవసాయం, ఆరోగ్యం, మొదలైన ప్రజోపయోగ కార్యక్రమాలలో జిల్లా పరిషత్తు ప్రాధాన్యత వహించుచున్నది.

## మెదకు జిల్లా పరిషత్ అధ్యక్షులు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఆర్ నర్సింహారెడ్డి | 1-12-59 | నుండి | 26-1-1962 |
| 2. | జె. రాంరెడ్డి | 27-1-1962 | „ | 22-3-1962 |
| 3. | బాగారెడ్డి | 23-3-1962 | „ | 31-8-1964 |
| 4. | జగపతిరావు | 1-9-1964 | „ | 31-3-1971 |
| 5. | పి. నర్సింహారెడ్డి | 1-4-1971 | „ | 15-2-1976 |
| 6. | ముత్యంరెడ్డి | 7-7-1981 | „ | 9-5-1985 |
| 7. | లక్ష్మీకాంతరావు | 18-5-1985 | „ | 8-7-1986 |
| 8. | డి. రామకృష్ణ | 2-5-1987 | „ | 19-5-1992 |
| 9. | శ్రీనివాస్ గౌడ్ | 20-3-1995 | „ | 3-2-2000 |

# జిల్లాపరిషత్ మొట్టమొదటి ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులు

| | మండల పరిషత్తు | జడ్.పి.టి.సి. |
|---|---|---|
| 1. | సంగారెడ్డి | ఆర్. శ్రీనివాస్ గౌడ్ |
| 2. | పటన్‌చెరు | ఎమ్. జైపాల్ |
| 3. | రామచంద్రాపురం | కె. పాపిరెడ్డి |
| 4. | కొండాపూర్ | బి. విజయకుమార్ |
| 5. | సదాశివపేట | బి. మాణయ్య |
| 6. | మునిపల్లి | ఎమ్. శ్రీనివాస్ |
| 7. | రాయికోడ్ | ఎమ్. ఏసురత్నం |
| 8. | కోహీర్ | శ్రీమతి శాంతమ్మ |
| 9. | ఝరాసంగం | స్వామిదాస్ |
| 10. | జహీరాబాద్ | మహిమూద్‌మియా, |
| 11. | న్యాల్‌కల్ | చంద్రప్ప |
| 12. | మనూర్ | ఎమ్. రాజలక్ష్మణ్ |
| 13. | నారాయణ ఖేడ్ | భూమయ్య |
| 14. | కంగ్టి | శ్రీమతి మందాబాయి |
| 15. | కల్హేర్ | పి. రామాగౌడ్ |
| 16. | రేగోడ్ | జి. రాజేందర్ |
| 17. | పెద్దశంకరంపేట | శ్రీమతి బి. లలిత |
| 18. | అల్లాదుర్గం | శ్రీమతి సక్కుబాయి |
| 19. | అందోలు | పి. నారాయణ |
| 20. | పుల్కల్ | శ్రీమతి కె. శాంతమ్మ |
| 21. | టెక్మాల్ | శ్రీమతి జమునమ్మ |
| 22. | పాపన్నపేట | శ్రీమతి మీరాబాయి దేశ్‌పాండె |
| 23. | మెదకు | ఎల్. లక్ష్మీరెడ్డి |
| 24. | కొల్చారం | శ్రీమతి కరుణ మల్లారెడ్డి |

| | | |
|---|---|---|
| 25. | కౌడిపల్లి | శ్రీమతి మాధవి |
| 26. | నర్సాపూర్ | డి. లష్కర్ |
| 27. | హత్నూర | పి. వెకటేశం |
| 28. | జిన్నారం | డి. రామకృష్ణ |
| 29. | శివంపేట | వి. లక్ష్మారెడ్డి |
| 30. | తూప్రాన్ | టి. సత్తయ్య |
| 31. | వర్గల్ | బి. యాదాగౌడ్ |
| 32. | గజ్వేల్ | పి. రఘుపతిరావు |
| 33. | ములుగు | జి. ఎల్లాగౌడ్ |
| 34. | జగదేవ్‌పూర్ | చెరుకులక్ష్మారెడ్డి |
| 35. | దౌల్తాబాద్ | ఆర్. రత్నారెడ్డి |
| 36. | కొండపాక | నర్రాకేశవరెడ్డి |
| 37. | నంగ్నూర్ | డి. మల్లయ్య |
| 38. | చిన్నకోడూర్ | పి. మల్లేశంగౌడ్ |
| 39. | సిద్దిపేట | శ్రీమతి బి. విజయ |
| 40. | మిర్దొడ్డి | శ్రీమతి యం. ఉమాదేవి |
| 41. | దుబ్బాక | శ్రీమతి విమలమ్మ |
| 42. | రామాయంపేట | శ్రీమతి చాంద్‌బీ |
| 43. | చిన్నశంకరంపేట | శ్రీమతి సునంద |
| 44. | చేగుంట | టి. వెంకటగౌడ్ |
| 45. | వెల్దుర్తి | శ్రీమతి భాగ్యమ్మ |

# పంచాయితీరాజ్ ఇంజనీరింగ్

మెదక్ జిల్లా పంచాయితీరాజ్ ఆధ్వర్యంలో వివిధ రోడ్ల నిర్మాణము, జిల్లా పరిషత్ పాఠశాలల నిర్మాణము మరియు మరమ్మత్తు చేపట్టి జిల్లాను అభివృద్ధి పథములో నడిపించుటకు దోహద పడుచున్నది. పంచాయితీరాజ్ శాఖ ద్వారా జిల్లాలలో ఈ క్రింద వివరించిన వివిధ అభివృద్ధి కార్యక్రమా · వాటి సంక్షిప్త సమాచారము చూపబడినది.

| వరుస సంఖ్య | పథకము పేరు | 1995-96 | | 1996-97 | | 1997-98 | | 1998-99 | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | చేపట్టిన పనులు | ఖర్చుచేసిన సొమ్ము | చేపట్టిన పనులు | ఖర్చుచేసిన సొమ్ము | చేపట్టిన పనులు | ఖర్చుచేసిన సొమ్ము | చేపట్టిన పనులు | ఖర్చుచేసిన సొమ్ము |
| 1. | ఆర్.ఆర్.యు | 223 | 173.23 | 77 | 231.28 | 298 | 304.66 | 183 | 267.70 |
| 2. | ప్రత్యేక గ్రామీణ రహదారుల నిర్మాణము | 16 | 23.96 | 1 | 60.12 | 21 | 258.59 | 30 | 238.73 |
| 3. | కనీస అవసరముల పథకము (ఎస్.సి.పి) | | | | | | | | |
| 4. | కనీస అవసరముల పథకము (మెయిన్) | 13 | 11.81 | 12 | 17.96 | 10 | 24.41 | 11 | 25.80 |
| 5. | చిన్న నీటి వనరుల (ప్లైన్) | 110 | 7.36 | 8 | 16.60 | 5 | 5.18 | 21 | 3.04 |
| 6. | చిన్న నీటి వనరులు (య్.సి.పి) | - | - | 4 | 1.16 | 16 | 2.63 | 1 | 0.30 |
| 7. | మండల పరిషత్తు భవనము | 2 | 2.15 | - | - | 1 | 19.16 | | 10.72 |
| 8. | 15% జే.ఆర్.వై | 93 | 9.63 | 86 | 91.90 | 80 | 67.19 | 87 | 93.12 |
| 9. | జె.ఆర్.వై (ఒ.బి.టి.) | 2 | 2.20 | 262 | 288.20 | 87 | 95.70 | - | - |
| 10. | ఇ.ఎ.యస్. | 8 | 12.50 | 71 | 200.00 | 134 | 203.94 | 111 | 241.53 |
| 11. | తుఫాన్ భవనముల నిర్వహణ గ్రాంటు | - | - | - | - | - | - | - | - |
| 12. | ఉన్నత పాఠశాలల అదనపు గదులు | 2 | 3.00 | - | - | - | - | - | - |
| 13. | పాఠశాల భవన నిర్మాణము (యస్.ఎఫ్.సి.) | - | - | - | - | - | - | - | - |
| 14. | శాసనసభ నియోజకవర్గ నిధుల (ఎ.సి.డి.పి) | 58 | 35.41 | 45 | 25.68 | 28 | 5.02 | - | - |
| 15. | షుగర్‌కేన్ | - | - | 16 | 15.74 | 9 | 5.20 | - | - |
| 16. | తుఫాను పనులు | 77 | 7.07 | - | - | - | - | - | - |
| | **మొత్తము** | **604** | **288.32** | **582** | **948.64** | **689** | **991.58** | **451** | **935.46** |
| | **ఉపాధి హామి పథకము** | | | | | | | | |
| 1. | భవనములు | 2 | 3.00 | - | - | - | - | - | - |
| 2. | రోడ్లు | 8 | 125.00 | 13 | 13.75 | 21 | 13.50 | - | - |
| 3. | చిన్ననీటి పథకము | | | | | | | | |
| 4. | వాటర్ షెడ్ | | | | | | | | |
| | **నాబార్డ్ పథకము** | | | | | | | | |
| 1. | నాబార్డు (ఆర్.ఐ.డి.ఎఫ్. - 2) | | | | | | | 6 | 148.00 |
| 2. | నాబార్డు (ఆర్.ఐ.డి.ఎఫ్. - 3) | | | | | | | 7 | 235.50 |
| 3. | నాబార్డు (ఆర్.ఐ.డి.ఎఫ్. - 4) | | | | | | | 12 | 703.40 |
| | **మొత్తము** | **10** | | | | | | **25** | **1086.90** |

## పంచాయితీరాజ్ ఇంజనీరింగ్ శాఖ

| క్ర.సం. | సైజు | పశువుల సంఖ్య | కుటుంబ సభ్యులు | నిర్మాణ వ్యయం | ప్రభుత్వ సబ్సిడీ సన్న / చిన్నకారు భూమిలేని కూ॥లి/ షె.కు. / షె.తె. వారికి | సబ్సిడీ ఇతరులకు |
|---|---|---|---|---|---|---|
| 1. | ఘ.మి. | 2-3 | 3-4 | 4,500/- | 2500/- | 2000/- |
| 2. | ఘ.మీ. | 4-6 | 5-8 | 6,300/- | 2500/- | 2000/- |
| 3. | ఘ.మీ. | 7-9 | 6-12 | 7,200/- | 2500/- | 2000/- |

## మున్సిపాలిటీలు

మెదక్ జిల్లాలో సంగారెడ్డి, సిద్దిపేట, సదాశివపేట, జహీరాబాద్ పట్టణాలు మున్సిపాలిటీలుగానున్నవి మెదక్ పట్టణమునందు నగర పంచాయితీ కలదు. క్రీ.శ. 2000 సంవత్సరంలో జరిగిన ఎన్నికలలో ఈ క్రింది వారు ఎన్నికైనారు.

| మున్సిపాలిటీ పేరు | అధ్యక్షుల పేర్లు |
|---|---|
| సంగారెడ్డి | శ్రీమతి కారం పద్మ |
| సిద్దిపేట | శ్రీమతి గట్టు అపర్ణ |
| సదాశివపేట | బి. సత్యానారాయణ |
| జహీరాబాద్ | అల్లడి నర్సింలు |
| మెదక్ నగర పంచాయితీ | శ్రీమతి కొండన్ సావిత్రి |

# సాధారణ పరిపాలన

మెదకు జిల్లాకు కేంద్ర పట్టణము సంగారెడ్డి. నిజాం నవాబుల కాలమున హైదరాబాదునకు (గోలకొండకు) సంగారెడ్డి అతి సమీప పట్టణము కావున మెదకు జిల్లాకు సంగారెడ్డిని కేంద్రముగా ఆనాటి నవాబులు గావించిరి.

| హైదరాబాదు రాష్ట్రంలో | మెదకు జిల్లాలో |
|---|---|
| దివానులు - | 551 గ్రామములు |
| సర్ఫేఖాస్ (నిజాంజాగీరు) | 13 గ్రామాలు |
| జాగీరులు | 364 గ్రామాలు |
| మొత్తము | 928 గ్రామాలు |

స్వాతంత్ర్యానంతరము కూడా సంగారెడ్డియే ముఖ్య పట్టణముగా కొనసాగుచున్నది. మెదకు పట్టణము జిల్లాకు కేంద్రము కావలయునని ప్రజలలో తీవ్రమయిన కోరికలున్నప్పటికీ ఎన్నో పర్యాయములు ప్రభుత్వమునకు వినతి పత్రములు, నిరసనలు తెలిపినప్పటికి మెదకు కేంద్రపట్టణముగా గుర్తింపబడలేదు. ముఖ్యముగా మెదకు పార్లమెంటరీ ఎన్నికలలో నిలుచున్న అభ్యర్థులు తాము గెలిచినచో మెదకు ముఖ్య పట్టణముగా గావింతుమని ప్రచారమొనరించుకొని గెలిచిన తరువాత మరిచిపోవుట జరిగినది, మెదకు పార్లమెంటరీ నియోజక వర్గమునకు ప్రాతినిధ్యం వహించిన శ్రీమతి ఇందిరా గాంధీ ప్రధానమంత్రిగా నుండియు తాను ఎన్నికలలో మెదకును ముఖ్యపట్టణముగా చేయుదునను వాగ్దానమును నెరవేర్చకుండిరి.

మెదుకు జిల్లా 1. సంగారెడ్డి 2. మెదకు 3. సిద్ధిపేట అను మూడు డివిజన్లుగా విభజింప బడినవి. జిల్లాలో ప్రభుత్వ కార్యక్రమములను అమలుచేయుటకు కల్కక్టరు నియమింపబడును. జిల్లా కల్కక్టరు ఐ.ఏ.ఎస్ స్థాయి కలవారయి అనుభవము కలవారయి యుందురు. కల్కక్టరు తరువాత జిల్లా అధికారిగా జాయింట్ కల్కక్టర్ అధికారం నెరపు చుండును. జాయింట్ కల్కక్టరు కూడా ఐ.ఎ.ఎస్ స్థాయి కలవారయి ఉండును. ఇతని పరిధిలో రెవెన్యూ ఎక్సైజ్ పౌర సరఫరాలు ఉండును. ఆ తరువాత డి.ఆర్.ఓ (డిస్ట్రిక్ట్ రెవిన్యూ ఆఫీసర్) ఉండును.

జిల్లాలో ఏర్పాటయిన మూడు డివిజన్లలో డివిజనల్ అధికారిగా సబ్ కల్కక్టర్ లేదా రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్ (ఆర్.డి.ఓ) నియమింపబడును. ఆర్.డి.ఓ.లు పదోన్నతులపై వచ్చిన వారు గాని లేదా నేరగా నియుక్తులైన వారుగాని అధికారులుగా ఉందురు.

1987 కు పూర్వము జిల్లాలో 11 తాలూకాలు ఉండెడివి అవి

1. జహీరాబాదు
2. సదాశివపేట
3. సంగారెడ్డి
4. అందోలు
5. నారాయణ్‌ఖేడ్
6. మెదక్
7. రామాయంపేట
8. దుబ్బాక
9. సిద్ధిపేట
10. గజ్వేల్
11. నర్సాపూర్

సంగారెడ్డి డివిజన్ పరధిలో జహీరాబాద్, సదాశివపేట్, సంగారెడ్డి, నారాయణ్ ఖేడ్ నాలుగు తాలూకాలు. మెదక్ డివిజన్‌లో జోగిపేట, మెదక్, నర్సాపూర్, రామాయంపేట తాలుకాలు. సిద్ధిపేట డివిజన్‌లో దుబ్బాక, సిద్ధిపేట, గజ్వేల్ తాలూకాలు ఉండెడివి.

1975 నాటికి ముందు మెదకు జిల్లాలో 8 తాలూకాలే. 1975 సంవత్సరములో సదాశివపేట, రామాయంపేట, దుబ్బాక తాలూకాలు ఏర్పడి జిల్లాలో 11 తాలూకాలయినవి. 1987 లో నాటి ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారకరామారావు గారి ఆలోచనా తరంగంలో పరిపాలనా వికేంద్రీకరణమునకై మండల వ్యవస్థ రూపొందించబడి మెదకు జిల్లాలో 45 మండలములు ఏర్పాటు చేయబడినవి.

ప్రతి తాలూకాకు ఒక గెజిటెడ్ తహశీల్దారు నియమింపబడుచుండెను. తాలూకాలో అచ్చట గ్రామములను బట్టి రెవిన్యూ సర్కిళ్ళు (ఫిర్కారు) ఉండెడివి. ప్రతి ఫిర్కాకొక రెవిన్యూ ఇన్స్పెక్టర్ నియమింపబడుచుండెను.

గ్రామమునకు ఒక మాలీపటేలు, పోలీస్‌పటేలు, పట్వారీ అను ముగ్గురు గ్రామాధికార్లు నియమింపబడుచుండిరి. ఈ పదవులు వారి వంశపారంపర్యముగా వచ్చుచుండెను. 1978 సంవత్సరమున ప్రతి రెవిన్యూ గ్రామమునకు రెండు పటేల్‌గిరిలలో ఒకటి తొలగింపబడి పటేలు, పట్వారి అను ఇద్దరు అధికార్లు మాత్రమే ఉండెడివారు. 1985 సంవత్సరమున పటేల్ పట్వారీ వ్యవస్థ రద్దుచేయ బడినది. వంశపారంపార్య హక్కు తొలగించబడినది. రెండు మూడు గ్రామములకొక (వి.ఎ.ఓ) గ్రామ పరిపాలనాధికారి నియమింపబడి ఆ గ్రామములలోని భూమిశిస్తు, శాంతి భద్రతలు మొదలగు అధికారములు కలిగినవాడైయుండును.

జిల్లాలో మండల వ్యవస్థ రూపొందించిన పిదప 45 మండలములుగా విభజింపబడినది. ప్రతి మండలమున మండల రెవిన్యూ కార్యాలయము. మండల పరిషత్ కార్యాలయము ఏర్పాటు చేయబడినవి.

## జిల్లాలోని మండలములు

1. సంగారెడ్డి
2. పటాన్‌చెరు
3. రాంచంద్రాపురం
4. కొండాపూర్
5. సదాశివపేట
6. మునిపల్లి
7. రాయికోడ్
8. కోహీర్
9. ఝురాసంగం
10. జహీరాబాద్
11. న్యాల్‌కల్
12. మనూర్
13. నారాయణ్‌ఖేడ్
14. కంగ్టి
15. కల్హేర్
16. పెద్దశంకరంపేట
17. రేగోడ్
18. అల్లాదుర్గం
19. అందోలు
20. పుల్కల్
21. టేక్మాల్
22. పాపన్నపేట
23. మెదక్
24. కొల్చారం
25. కౌడిపల్లి
26. హత్నూర్
27. జిన్నారం
28. నర్సాపూర్
29. శివ్వంపేట
30. తూప్రాన్
31. వర్గల్
32. గజ్వేల్
33. ములుగు
34. జగదేవ్‌పూర్
35. దౌల్తాబాద్
36. నంగ్‌నూర్
37. కొండపాక
38. చిన్నకోడూర్
39. సిద్దిపేట
40. మిరిదొడ్డి
41. దుబ్బాక
42. రామాయంపేట
43. చిన్నశంకరంపేట
44. చేగుంట
45. వెల్దుర్తి

జిల్లా కల్క్టరు రెవిన్యూ మెజిస్ట్రేట్ అధికార విధులనే కాక జిల్లాలో సమస్త శాఖలపై అధికారము కలిగియుండును. 1956 కు పూర్వము కలెక్టరు రెవిన్యూ అధికారిగా మాత్రమే విధులు నిర్వహించుచుండెను. ఆ తరువాత కల్క్టరు యొక్క విధి నిర్వాహణ పరిధి విస్తృత మొనరింపబడినది. జిల్లా కల్క్టరు రాష్ట్రప్రభుత్వ పక్షమున జిల్లాలో జరుపబడు సమస్త అభివృద్ధి కార్యక్రమములకు ప్రతినిధిగా నుండును. జిల్లా అభివృద్ధి కార్యక్రమము లందు తత్ సంబంధమయిన సమావేశములందు కల్క్టరు అధ్యక్షులుగాయుండి జిల్లా ప్రణాళికను ప్రణాళికామండలిచే ఆమోదింప జేయును. జిల్లాలో సంభవించు కరువు కాటకములు అంటువ్యాధులు తుఫాన్ మొదలగు ప్రకృతి భీభత్సములు నివారించుటలో కల్క్టరు రాష్ట్రప్రభుత్వ పక్షమున అధికారమును కలిగియుండును.

# రెవిన్యూ శాఖ

రెవిన్యూ అనగా భూమిశిస్తు లేదా పన్ను-వసూలు అని చెప్పవచ్చును.

నిజాం రాష్ట్రమునందు భూమిశిస్తు విధానము ఇట్లుండేది. నిజాం రాష్ట్రమున జాగీర్లు, సర్ఫేఖాస్ గ్రామాలు, పాయగాలు, సర్కారీ గ్రామాలు అని పలురకములుగా నుండెడివి.

నిజాం రాష్ట్రమున భూమిశిస్తు వసూలు చేయుటకు తాలూక్దార్లు దేశ్‌ముఖ్, దేశ్‌పాండ్యాలు పట్వారీలు నియమింపబడిరి. తాహద్దరీ, సరబస్తా అను రెండు పద్ధతుల్లో భూమిశిస్తు వసూలు చేయబడుచుండెను. పలుకుబడిగల వ్యక్తులు హైదరాబాద్‌లోనే యుండి కొన్ని గ్రామములను భూమిశిస్తు వసూలుకై గుత్తాకు తీసుకొనెడి వారు. వీరు ప్రభుత్వమునకు ముందే ధనమును చెల్లించి ఆ తరువాత భూమి శిస్తు వసూలు చేసికొనెడివారు. జాగీర్దారులు వసూలు చేయు శిస్తు పద్ధతిని 'సరబస్తా' అనుచుండిరి.

కొన్ని ప్రదేశములలో రైతుల నుండి నేరుగా భూమిశిస్తు వసూలు చేయబడుచుండెను. ఈ శిస్తును అమానీ అను చుండిరి. తాలూకా గుత్తేదారులు ఒకటికన్న యెక్కువ తాలూకాలలో కూడా శిస్తు వసూలు బాధ్యత గ్రహించుచుండిరి. వీరికి శిస్తు వసూలుపై కొంత కమీషను ఇవ్వబడుచుండెను.

భూమిశిస్తు ధన ధాన్య రూపమున వసూలగుచుండెను. శిస్తు చెల్లించినచో భూమిని సాగుచేయు అధికారము రైతులకు లేకుండెడిది. పంటలు వచ్చుకాలమున శిస్తు పెంచబడుచుండెను. శిస్తు వసూలు దౌర్జన్యముగా బలవంతముగా చేయబడుచుండెను. ఈ పద్ధతిని సంస్కరించుటకు బ్రిటిష్ రెసిడెంట్లు రస్సెల్, మెట్కాఫ్ ప్రయత్నించి విఫలమయిరి. శిస్తు చెల్లించుటకు రైతులు షాహుకారులైన వడ్డీ వ్యాపారులను ఆశ్రయించవలసి వచ్చుచుండెను. శిస్తులను చెల్లింపజాలని రైతులు తమ భూములను ఇళ్లను విడిచి ఇతర ప్రాంతములకు వలస వెళ్ళుచుండిరి.

క్రీ.శ. 1853 లో సర్ సాలార్‌జంగ్ ప్రధాన మంత్రి పదవిని చేపట్టెను. అస్తవ్యస్తముగానున్న భూమిశిస్తు విధానమును చక్కబరిచి రైతులకు మేలు కలిగించెను. అతడు కంట్రాక్టు పద్ధతిని రద్దుచేసి శిస్తు వసూలుకయి ప్రభుత్వోద్యోగులను నియమించెను. క్రీ.శ. 1864లో రెవెన్యూబోర్డు ఏర్పాటు చేయబడినది. నిజాం రాష్ట్రము **14** జిల్లాలు **74** తాలూకాలుగా విభజింపబడినది. ప్రతిజిల్లాకు ఒక తాలూక్దార్ ఇద్దరు సహాయ తాలూక్దార్లు నియమింపబడిరి తాలూకాకు తహశీల్దారును నియమించి న్యాయ నిర్ణయ అధికారమును కూడా ఇవ్వటం జరిగినది.

ప్రతి జిల్లాలో ప్రతి తాలూకాలోను ట్రెజరీ కార్యాలయములు ప్రారంభింపబడినవి.

క్రీ.శ. 1867 లో మూడు నాలుగు జిల్లాలకొక సూబా చొప్పున కొన్ని సుబాలు ఏర్పాటు చేయుట జరిగినది. యెల్లందల్, ఇందూరు ఆదిలాబాద్. మెదకు జిల్లాలు ఒక సూబాగా ఏర్పడెను.

ఈ సూబాను మెదక్ సూబా అనెడివారు. సూబాకు అధికారిగా సూబేదార్ లేదా సదర్ తాలూక్దార్ నియమింపబడేవారు. వీరు తమ పరిధి జిల్లాలలోని తాలూక్దార్లపై ఆధిపత్యము కలిగియుండి సివిల్, క్రిమినల్, రెవిన్యూ అధికారవ్ములు కలిగియుండిరి. క్రీ.శ. 1872 లో భూమిశిస్తు మల్‌దారీ ఏర్పడినది. క్రీ.శ. 1865-66 నాటికి భూమి కొలత ఈ విధముగా నుండెడిది.

పది గజముల పొడవు గల గొలుసుతో కొలిచి 3600 చ.గజాలకు ఒక బీగా కింద విభజించుచుండిరి. పన్నుల కొరకై భూమి తరీ, ఖుష్కీ అని రెండు విధములు విభజింపబడినది. తరీ భూములను 4 విధములుగను, ఖుష్కీ భూములను 3 రకములుగను విభజించి ఒక్కొక్క రకమయిన భూమికి ఒక్కొక్క రకమయిన శిస్తు విధింపబడు చుండెను. మట్టిరంగు లోతు రీతులననుసరించి భూవర్గీకరణ జరుగుచుండెను. 1875-76 లో ఇనాం భూములకై ఒక కమీషన్ నియమింపబడినది. క్రీ.శ. 1890 తరువాత భూముల సర్వే సెటల్‌మెంట్ కార్యక్రమములు చేపట్టబడి 11 గజముల పొడవుగల గొలుసు, దండము పద్ధతిలో సర్వే నిర్వహింపబడినది. 11 x 11 = 121 చదరపు గజములు ఒక గుంట. 40 గుంటలు = ఒక ఎకరము. తరి, ఖుష్కీ భూములను సర్వే చేసి సర్వేనంబరు విధానము ప్రవేశపెట్టబడినది.

నైజాం రాష్ట్రమున పోలీస్ చర్య జరిగిన సెప్టెంబర్ 1948 తరువాత అప్పటి జాగీర్లన్నీ రద్దుచేయబడినవి. రెవెన్యూ బోర్డు పునర్ వ్యవస్థీకరింపబడినది. క్రీ.శ. 1852 లో నెలకొల్పబడిన కోర్ట్ ఆఫ్ వార్డ్సు రెవెన్యూ బోర్డులో విలీనం చేయబడినది. క్రీ.శ. 1950 నాటి హైదరాబాద్ జిల్లా అధికారుల చట్టముననుసరించి అవ్వల్ తాలూక్దార్లు, కలెక్టర్లుగా పిలువబడిరి. దువ్వల్ తాలూక్దార్లు డిప్యూటీ కలెక్టర్ అసిస్టెంట్ కలెక్టర్లుగా పిలువబడిరి.

క్రీ.శ. 1950 నాటి హైదరాబాదు వ్యవసాయ ఆదాయపు పన్ను చట్టం ప్రకారం 1950 నీటిపారుదల చట్టం ప్రకారం హైదరాబాద్ ప్రభుత్వం రెండు విధములయిన పన్నులను విధించినది. పై రెండు చట్టములు 1959 లో రద్దుచేయబడి తరీ, ఖుష్కీ భూములపై ప్రత్యేకపన్ను విధింపబడినది. క్రీ.శ. 1957 లో వాణిజ్య పంటల చట్టము, ల్యాండ్ రెవిన్యూ సర్‌చార్జ్ చట్టములు చేయబడినవి. ఈ చట్టములు 1962 లో రద్దు కావింపబడినవి. 1967 లో భూమిశిస్తు చట్టము వరి భూములపై 35% మెట్టభూములపై 75% శిస్తు పెంచబడినది.

ప్రతి సంవత్సరం ఏప్రిల్ నెల మొదటి మూడు వారములలో గ్రామాధికారులు పంటలు శిస్తు వసూలు చేయుచుండిరి. మెదకు జిల్లాలో శిస్తు తరి భూములకు ఎకరమునకు 12 నుండి 25 రూ. మెట్టభూములకు ఎకరమునకు 1 రూ. నుండి 8 (ఎనమిది) రూ. పన్ను వసూలు చేయబడుచుండెను. ఈ పన్నుపై 25% లోకల్ ఫండ్ కూడా వసూలు చేయుట జరుగు చుండెను. 1983 సంవత్సరమున మెట్టభూములపై పన్నును తొలగించి కేవలము లోకల్ ఫండు మాత్రము వసూలు చేయుటకు ఆదేశములీయబడెను.

## భూసంస్కరణలు

భారత దేశము మొదటి నుండియు వ్యవసాయైక దేశము. కావున బలవంతులు వీలైనంత ఎక్కువ మొత్తములో భూమిని సంపాదించెడివారు. గ్రామమున గలిగిన మొత్తము భూమి ఒకే వ్యక్తి ఆధీనములో నుండెడిది. జాగీర్లు - పాయగాలు ఇట్టివే. జాగీర్దార్లు కొన్ని గ్రామములందలి మొత్తము భూమికి హక్కుదార్లై ఉండిరి. దేశ్‌ముఖ్‌లు, దేశ పాండేలు, పటేలు, పట్వారీలు ఎక్కువ భూమికి యజమానులై భూస్వాములుగా, జమీన్‌దార్లుగా పిలువబడుచుండిరి. ఎంత ఎక్కువ భూమియున్న అంత గౌరవముగా భావింపబడుచుండెను. తమకు కలిగిన భూమిని ఆ ప్రాంతములందలి కర్షకులకు వ్యవసాయమునకై బటాయిలేక కవులు రీతిలో ఇచ్చి పండిన పంటలో సగము భూస్వాములు పొందెడివారు. అంతేగాక పేద ప్రజలను తమ వద్ద పాలేర్లుగా (జీతగాండ్లు) కొద్ది పాటి వేతనములనిచ్చి యుంచుకొని వ్యవసాయ పనులన్నింటిని వారితో చేయింతురు. ఈ జీతగాండ్లతో వెట్టిచాకిరీ చేయించుకొనుచు వారికెప్పుడో అవసరానికిచ్చిన ధనముతో వారి జీవితమంతయు తమ వద్ద పాలేర్లుగా నుండునట్లు గావించెడివారు. భూస్వాములు తమ పాలేర్లను చాలహీనముగా జూచుచుండిరి. రైతులు భూస్వాముల భూములను ఎన్నెండ్లు వ్యవసాయముచేసినను ఆ భూమిపై ఎట్టి హక్కు యుండ కుండెడిది. పైగా తాము చేసిన భూమిని భూస్వాములు ఇతరుల కిచ్చు చుండెడివారు. దీనితో కౌలుదారులకు రక్షణ లేక పోయినది. భూస్వాములకు కౌలుదార్లకు మధ్య అవాంతర భేదమేర్పడినది. క్రీ.శ. 1939-40 సంవత్సరమున నిజాం ప్రభుత్వము వ్యవసాయ భూముల అన్యాక్రాంత నిరోధక చట్టము ప్రవేశ పెట్టినది. ఎవరైనను తమ భూముల ఇతరులకు అమ్మదలచినచో ఈ చట్టము ప్రకారము జిల్లా తాలుక్దారు అనుమతి పొందవలసివచ్చినది.

ఆతర్వాత క్రీ.శ. 1944-45 సంవత్సరమున హైదరాబాదు ఆ సామీషిక్మీ చట్టము అమలులోనికి వచ్చినది. ఈ చట్టము ప్రకారము క్రీ.శ. 1932-42 సంవత్సరముల మధ్యకాలమున సాగుచేసిన కౌలుదార్లకు రక్షణ కల్పించనైనది. అ భూములపై వారికి పరిమిత హక్కు కల్పించనైనది.

కాని ఈ శాసనములేవియు సక్రమరీతిలో అమలు పరచబడలేదు. కౌలుదార్లకు సంపూర్ణ న్యాయము కలుగలేదు. రైతులైన కౌలుదార్లు భూస్వాములైన జమీందార్ల చేతను. జాగీర్దార్లచేతను అణచబడుట ఆగలేదు. అందుకే "దున్నేవానిదే భూమి" అను నినాదములో కమ్యూనిస్టు పార్టీ ప్రజా ఉద్యమములు నిర్వహించినది. దీనితో కమ్యూనిష్టులు నిజాంకు వ్యతిరేకముగా ప్రవర్తించినారు.

భారతదేశమునకు స్వాతంత్ర్యము లభించినది. నిజాం రాష్ట్రముపై పోలీస్ యాక్షన్ జరిగినది.

క్రీ.శ.1949 లో జాగీర్లు రద్దు గావించ బడినవి. ఈ సమయమున కొందరు జాగీర్దార్లు తెలివితో తమ ఆధీనములోనున్న భూమిని కౌలుదార్లకు అమ్మకొనిరి. మరికొన్ని చోట్ల కౌలుదారులు తమ సాగు చేయు భూములను తమ స్వంతము చేసికొనిరి. మొత్తము మీద భూస్వాముల బెడద కౌలుదార్లకు తప్పినది. క్రీ.శ. 1949 లో వ్యవసాయ సంస్కరణలకై ఒక కమిటీ వేయబడినది. ఈ కమిటి (సిఫారసుల) సూచనలననుసరించి క్రీ.శ. 1950 లో హైద్రాబాదు కౌలుదారీ చట్టము అమలు పరచబడినది. దీనితో సాధారణ రక్షిత కౌలుదారీ హక్కుల పత్రములు తయారు చేయబడి ఆమోదింపబడిన కౌలుదార్లకు ధృవీకరణ పత్రములీయబడినవి.

క్రీ.శ. 1955 నాటి హైద్రాబాద్ రాష్ట్ర ఇనాముల రద్దు చట్టము అమలు పరచబడినది. ఈ చట్టము ప్రకారము ఇనాంభూములను రైతువారీ భూములుగా మార్చుటకు చర్యలుగైకొనబడినవి కాని ఈ చట్టము సక్రమరీతిలో అమలు పరచబడలేదు. కావున క్రీ.శ. 1973లో ఆంధ్రప్రదేశ్ ఇనాముల రద్దు చట్టము అమలు లోనికి వచ్చినది. ఈ చట్టము ప్రకారము ఇనాంభూములు పట్టా భూములుగా మార్చబడినవి.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర భూ గరిష్ఠ పరిమితి చట్టము తేబడినది. దీనితో వ్యవసాయ భూమి పరిమితమైనది. గరిష్ఠపరిమితికెక్కువ భూములున్న వారు మిగులు భూములను ప్రకటించి ప్రభుత్వాధీనమొనర్చిన ప్రతిఫలము పొందు అవకాశము ఈ చట్టము వలన కలిగినది. ఈ చట్టము ప్రకారము మెదకు జిల్లాలో 1961 నాటికి మొత్తము 20 మంది మిగులు భూమిని సుమారు 400 ఎకరములు ప్రకటించిరి.

క్రీ.శ. 1973 ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమునకు శ్రీ పి.వి. నర్సింహారావు గారు ముఖ్యమంత్రిగా నుండి ఆంధ్రప్రదేశ ప్రభుత్వ భూపరిమితి చట్టమును అమలులోనికి తెచ్చిరి. ఈ చట్టము ప్రకారము సామాన్య భూమిలో మాగాణి (తరి) 10 ఎకరములు ఖుష్కి (మెట్ట) 25 ఎకరములు తోటలు 35 ఎకరములు ఒక కుటుంబమునకు పరిమిత భూమిగా ప్రకటించబడినది.

ఈ శాసనము ప్రకారము భూయజమానులు తమకు తావము స్వచ్ఛందముగా తమకున్న భూమిని ప్రకటించుకొనుటకు అవకాశమీయబడినది. ఈ సీలింగ్ యాక్ట్ ప్రకారము మెదకు జిల్లాలోని మిగులు భూమిని ప్రభుత్వము ప్రజలకు పంపిణీ చేసినది.

ఈ చట్టము నిజమునకు మధ్యతరగతి భూస్వాములను మాత్రమే స్పృశించినదని చెప్పవచ్చును. వందల ఎకరములున్న భూస్వాములైన (దేశ్‌ముఖ్‌లు) దొరలు చట్టములోని లొసగులను ఆధారముగా చేసికొని తమ ఆర్థిక స్తోమతతో కోర్టులలో తమ కేసులను నాన్చుచు నేటికిని అట్టి భూములను అనుభవించుచున్నారు. అట్లు కాక మరికొందరు లోపాయకారీగా అమాయకులైన రైతులకు అమ్మి ధనవంతులైనారు మరికొందరు బినామి పేర్లతో యాజమాన్యపు హక్కును గల్గి అనుభవించుచున్నారు.

క్రీ.శ. 1971 సంవత్సరమున ఆంధ్రప్రదేశ ప్రభుత్వము పట్టాదారు పాసుపుస్తకముల పంపిణీ చేయుటకు శాసనమొనరించినది. దీని ప్రకారము మెదకు జిల్లాలో పాసుపుస్తకములు పంపిణీ చేయుచున్నారు.

## రెవెన్యూ సదస్సులు

రెవెన్యూ రికార్డుల తాజా సమాచారాలతో ప్రజల సమక్షంలో నమోదు చేయడం ప్రజలు ఎదుర్కొంటున్న భూమి సమస్యల పరిష్కారానికి రెవెన్యూ సదస్సులు జిల్లాలో నిర్వహించడం జరిగింది. ఇప్పటి వరకు దర్యాప్తు పూర్తి చేసి 59287 దరఖాస్తులు పరిష్కరించడం జరిగింది.

**బలహీన వర్గాలవారికి ఇచ్చిన ఇళ్ళ స్థలముల వివరములు- మెదక్ జిల్లా**

| వివరములు | 1995-96 | 1996-97 | 1997-98 | 1998-99 | 1999-2000 | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| బలహీన వర్గాలవారికి ఇళ్ళ స్థలములు | 10339 | - | - | 23710 | 7563 | 41612 |

**బలహీన వర్గాలవారికి ప్రభుత్వ భూమి పంపిణీ**

| 1995-96 | | 1996-97 | | 1997-98 | | 1998-99 | |
|---|---|---|---|---|---|---|---|
| లబ్ధిదారులు | ఎకరములు | లబ్ధిదారులు | ఎకరములు | లబ్ధిదారులు | ఎకరములు | లబ్ధిదారులు | ఎకరములు |
| 3738 | 3721.11 | 408 | 1684.00 | 2034 | 2283.34 | 2094 | 1813.26 |

మెదకు జిల్లాలో ప్రభుత్వ ఉత్తర్వు నెంబరు 508 / రెవెన్యూ (ఎసైన్ -1) డిపార్టుమెంటు తేది 25-10-95 ననుసరించి జిల్లాలో ఇప్పటివరకు పరిష్కారము చేసిన ఆక్రమణల వివరములు.

| పరిష్కరించబడిన అభ్యర్థనలు | విస్తీర్ణం చ.గ. | త్రోసిపుచ్చిన అభ్యర్థనలు |
|---|---|---|
| 3158 | 339786.6 | 1918 |

# జిల్లాలో పని చేసిన కలెక్టర్లు

| కలెక్టర్ పేరు | | పని చేసిన కాలం |
|---|---|---|
| 1. నవాబ్ ఖాసీం జంగ్ బహదూర్ | - | 1947-48 |
| 2. గోవిందరావు దేశపాండే | - | 1948-49 |
| 3. పరమానంద్ దశ్‌లాల్ దలాల్ | - | 1949-50 |
| 4. పండిత్ శ్రీధర్ రావు | - | 1950-50 |
| 5. పండిత్ గోవింద్ రావు | - | 1950-51 |
| 6. మహమ్మద్ నసీర్‌ఖాన్ | - | 1950-51 |
| 7. మహమ్మద్ హబీబుద్దీన్ | - | 1951-52 |
| 8. ఎన్. దుర్గయ్య | - | 1952-53 |
| 9. ఎస్.ఎ.ఖాదర్ | - | 1953-55 |
| 10. బి.పి.ఆర్. విఠల్ | - | 1955-56 |
| 11. కుంజ్‌బిహారీ లాల్ | - | 1956-57 |
| 12. ఎస్.కె.సాల్ | - | 1957-59 |
| 13. ఆదిశేషయ్య | - | 1959-59 |
| 14. ఎస్.కె.సాల్ | - | 1959-59 |
| 15. టి.ఎన్.కపూర్ | - | ఆగస్టు 1959-ఆగస్టు 62 |
| 16. సి.ఎన్.శాస్త్రీ | - | ఆగస్టు 1962-జూలై 64 |
| 17. ఖాదీర్ అలీఖాన్ | - | జూలై 1964-డిసెంబర్ 65 |
| 18. ఎస్.ఎస్ రామారావు | - | డిసెంబర్ 1965-జూలై 1966 |
| 19. రాజమణి | - | జూలై 1966- జనవరి 1968 |
| 20. వి.పి. రామారావు | - | జనవరి 1968-జూన్ 1969 |
| 21. ఎస్. చక్రవర్తి | - | జూన్ 1969-జూన్ 1971 |
| 22. ఎస్. పేములు | - | జూన్ 1971 -నవంబర్ 1973 |
| 23. మహమ్మద్ మహమూద్ అలీ | - | నవంబర్ 1973-జూలై 1975 |

| | | |
|---|---|---|
| 24. వి. చాంగ్సన్ | - | జూలై 1975 - ఏప్రిల్ 1977 |
| 25. ఇ.వి.ఎస్. శర్మ | - | ఏప్రిల్ 1977 - సెప్టెంబర్ 77 |
| 26. జి. నిరంజన్ రావు | - | సెప్టెంబర్ 1977 - ఏప్రిల్ 79 |
| 27. టి.ఎస్.ఎస్.స్వామి | - | ఏప్రిల్ 1979 - జూలై 1979 |
| 28. జె. బాపురెడ్డి | - | జూలై 1979 - ఏప్రిల్ 81 |
| 29. కుమారి గాయత్రీ రామచంద్రన్ | - | ఏప్రిల్ 1981 - ఏప్రిల్ 1982 |
| 30. జయేందర్ సింగ్ | - | ఏప్రిల్ 1982 - ఏప్రిల్ 83 |
| 31. ఆర్.సి. సామేల్ | - | ఏప్రిల్ 1983 - అక్టోబర్ 1983 |
| 32. ఆర్. హృదయరంజన్ | - | అక్టోబర్ 1983 - ఏప్రిల్ 1986 |
| 33. మహ్మద్ షఫీ - ఖుజ్-జమాన్ | - | జనవరి 1986 - ఏప్రిల్ 1988 |
| 34. డాక్టర్ జె.సి. మహంతి | - | ఏప్రిల్ 1988 జనవరి 1990 |
| 35. శ్రీమతి లతాకృష్ణరావు | - | జనవరి 1990 - ఏప్రిల్ 1992 |
| 36. డి.ఆర్.గర్గ్ | - | ఏప్రిల్ 1992 - నవంబర్ 1993 |
| 37. ఎ. విద్యాసాగర్ | - | నవంబర్ 1993 - ఏప్రిల్ 94 |
| 38. డి.సి. రోశయ్య | - | ఏప్రిల్ 1994 - డిసెంబర్ 1996 |
| 39. రాజీవ్‌రంజన్ మిశ్రా | - | డిసెంబర్ 1996 - నవంబర్ 1999 |
| 40. శ్రీమతి శాంతకుమారి | - | 12-11-99 కొనసాగుచున్నారు |

## జిల్లాలో పుట్టిన ఐ.ఏ.యస్.లు

| క్ర.సం | పేరు | జన్మ స్థలం | | అంశము |
|---|---|---|---|---|
| 1. | శ్రీ నర్సింగ్ రావు | చిన్నగొట్టిముక్ల<br>మండలము : శివంపేట | - | ఐ.ఎ.ఎస్ |
| 2. | శ్రీ నాగిరెడ్డి | పెద్దారెడ్డి పేట<br>మండలము : పుల్కల్ | - | ఐ.ఎ.ఎస్ |
| 3. | శ్రీ రమణాచారి | సిద్దిపేట | | ఐ.ఎ.ఎస్ |

# శాంతి భద్రతలు

మానవునిలోని ఆకలిబాధ, తోటివానికున్న సుఖ సంతోషాలు తనకు కలుగాలనే తపన, స్వార్థం, ఈర్ష్య, అసూయ, మొదలగు గుణాలే మానవుని నేరస్తునిగా, కసాయివానిగా వులుచుననుటలో సందేహం లేదు. ఆదిమానవుని నుండి కూడా ఈగుణాలున్నవి.

శాతవాహనుల నుండి ఆసఫ్‌జాహీరాజులు వరకు తమ పరిపాలనా కాలములలో ప్రజారక్షణకు తగు ఏర్పాట్లు గావించినట్లు చరిత్ర తెలుపుచున్నది. ఆకాలాలలో గ్రామ రక్షణ దళాలున్నట్లు చారిత్రికా ధారములు కలవు. ప్రతి గ్రామమునకు బురుజులు - కోటగోడలు కందకాలు ఉండి దోపిడీలు, దుండగులు మొదలగు వారి బారి నుండి రక్షింప బడుచుండెను. ఆరోజు ప్రభుత్వాలు గ్రామాలలో గ్రామ పరిపాలనతో పాటు గ్రామ రక్షణ బాధ్యతను కూడా చేపట్టుటకు తగు వ్యవస్థనేర్పరిచిరి. రాజుల కాలమున సైనిక వ్యవస్థ మాత్రమే యుండెను. ప్రత్యేకముగా రక్షణ వ్యవస్థకై పోలీసు వ్యవస్థ వంటిది లేకుండెను.

కాకతీయ పరిపాలనమున గ్రామాధికారులుగా కరణము రెడ్డి - తలారి ముఖ్యులు. వీరిక్రింద గ్రామ రక్షకులు నియమింపబడుచుండిరి. గ్రామమున జరిగిన నేరములను గ్రామాధికారులే పరిష్కరించు చుండిరి.

కాకతీయుల కాలమున రాజోద్యోగులు 72 నియోగాలుగా విభజింపబడియుండిరి. వీరిపై బాహత్తర నియోగాధిపతి అను అధికారియుండే డివాడు. ఆ కాలమున నేరములకు వేయబడు శిక్షలు అతి కఠినముగా నుండెను. శిరఛేదము, అవయవ ఖండనము వంటి కఠిన తరమైన శిక్షలుండుటచే నేరములు బహుస్వల్పముగా జరుగుచుండెను. పూర్వము మొగలు సైన్యము నుండి తొలగింపబడిన సైనికులు ముఠాలుగా నేర్పడి గ్రామములపై బడి దోపిడీలు చేసెడివారు. వీరుగాక థగ్గులు, పిండారీలు, రోహిలాలు సాయుధులై ముఠాలుగానేర్పడి గ్రామములలో జొరబడి నిర్భయముగా ప్రజలను బెదిరించి దోపిడీలు సాగించెడివారు.

క్రీ.శ. 1865 నాటి వరకు నిజాం రాజ్యమున క్రమబద్ధమైన పోలీసు వ్యవస్థలేకుండెను. క్రమ రహిత దళములు, సేవకులు, నిజామత్‌లు, గ్రామసేవకులు, శాంతి భద్రతల పరిరక్షణకు బాధ్యులైయుండిరి నేరస్థులను గుర్తించి నిర్భంధించుపనులు మన్నేవార్లు, ముచుకూర్లు చేయుచుండిరి. జిల్లాలోని శాంతి భద్రతలు జిల్లా అధికారియగు తాలుక్దారు పర్యవేక్షణలోనుండెను. ఈ తాలుక్దార్లు తమ స్వంత పనులకు ఎక్కువ ప్రాధాన్యము నిచ్చి తమ క్రింది ఉద్యోగులకు బాధ్యతలనప్పగించి వీరు హైద్రాబాదులో విలాసమయ జీవితము గడుపు చుండిరి.

తాలుక్దారు క్రింద పని చేయు ఉద్యోగులు, అధికారులు గ్రామములందలి గ్రామ సేవకులకు (ముచుకూర్లు) సరియైన వేతనములు నీయుక బాధించెడివారు.

గ్రామ సేవకులు వేతనములందక శాంతి భద్రతల కాపాడుటలో అలసత్వము వహించుచుండిరి. వారికి తమ విధులను నిర్వహించు ఆసక్తి యుండకుండెను.

సర్‌సాలార్‌జంగ్ బహద్దూర్ ప్రధాని పదవిని చేపట్టెను. అతడు నిజాం రాజ్యమున శాంతి భద్రతల నెలకొల్పుటకు అనేక చర్యలు చేపట్టెను.

క్రీ.శ. 1865లో క్రమబద్ధమైన పోలీసు శాఖ నిజాం రాష్ట్రమున నెలకొల్పబడినది. ప్రతి జిల్లాకొక పోలీసు అధికారి "మొహత్మీమ్" నియామకము జరిగినది. మెదకు జిల్లాకు కూడా "మొహిత్మీన్" నియమింపబడెను. ప్రతి తాలుకాలో ఒక "అమీన్" నియమింపబడెను. ప్రతి పోలీస్ స్టేషన్‌లో ఒక జమేదార్ (హెడ్‌కానిస్టేబుల్) 8 మంది పోలీసులు నియమింప బడిరి. కొన్ని పోలీసు చౌకీలు ఏర్పరచబడినవి.

ప్రతి చౌకీలో ఆరుగురు పోలీసులు, ఒక దఫేదారు నియమింపబడెను. రాష్ట్ర పోలీసు శాఖ రెవెన్యూ బోర్డు ఆధీనములోను జిల్లా పోలీసు యంత్రాంగము తాలూక్దారులు ఆధీనములోను పని చేయుచుండెను. క్రీ.శ. 1867లో రెవెన్యూ బోర్డు నుండి పోలీసు శాఖను తప్పించి పోలీసు మంత్రిత్వశాఖతో పాటు పోలీసు సచివాలయము నెలకొల్పబడినది.

ప్రతి మూడు జిల్లాలకొక పోలీసు డివిజన్‌ను ఏర్పాటు చేసి నాయబ్ మొహత్మీన్ అను అధికారిని నియమించుట జరిగినది. క్రీ.శ. 1884లో రాష్ట్ర పోలీసు అధికారిగా ఇన్స్‌పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ నియమింపబడెను. రాష్ట్రమున మొట్టమొదటి ఇన్స్‌పెక్టర్ జనరల్ ఇ. యస్. లడితో నియమింపబడెను. ఈతడు రాష్ట్రమున సాగుచున్న రోహిలాల దోపిడీ, దౌర్జన్యములనంత మొందించుటకై క్రీ.శ. 1985లో దస్తూరుల్ అమల్ అను శాసనము తెచ్చెను. దీని ప్రకారము దుండగులకు దోపిడీ దారులైన దొంగలకు, రోహిలాలకు ఉపాధి. వసతులు కల్పించి వారిని సన్మార్గపు వర్తకులుగా చేయు ప్రయత్నములు సాగినవి.

క్రీ.శ. 1897లో నిజాం రాష్ట్ర ఇన్స్‌పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్‌గా హంకెన్ నియమింపబడెను. ఈతడు క్రీ.శ. 1917 వరకు ఆ పదవిలో నుండెను. ఈతడు పోలీసు శాఖలో అనేక నూతన సంస్కరణములను ప్రవేశపెట్టెను. దగ్గులు - ఠక్కులు పిండారీ ముఠాలు రాష్ట్రమున అరాచకమును, భీభత్సమును సృష్టించుచుండిరి. హంకెన్ వీరి అరాచకములను అరికట్టి ప్రజలకు ప్రశాంత వాతావరణములను కల్పించెను. ఇందుకు ధగ్గీడ కమిటి పేర నేర నిరోధక శాఖను ఏర్పాటు చేసెను.

నిజాం రాజ్యమున జాగీర్దారులు, పాయగా దారులు స్వంత పోలీసు సిబ్బంది కలిగియుండిరి. వీరు నేరస్థులను ప్రోత్సహించుచు, దోపిడీ దారులకు, దొంగలకు ఆశ్రయ మొసంగుచు నిజాం ప్రభుత్వ పోలీసు యంత్రాంగమునకు ఆటంకములు కల్గించుచుండిరి. జాగీరు పోలీసులను నిజాం ప్రభుత్వ పోలీసుశాఖలో కలుపుకొని జాగీరు ప్రాంతములలో జరుగు దోపిడీలు అరికట్టబడినవి.

నిజాం రాష్ట్రమున ప్రత్యేక సిక్కు పోలీసుదళ ముండెడిది హంకెన్ ఈ పోలీసు దళమును కూడా ప్రభుత్వ పోలీసు యంత్రాంగములోనికి తీసికొని వివిధములుగానున్న పోలీసుల నందరిని ఏకీ కృతము గావించి పోలీసు వ్యవస్థను బలోపేతము చేసి రాష్ట్రమున శాంతి భద్రతలను కాపాడెను.

హంకెన్ పోలీసుల శ్రేయస్సుకై అనేక నిర్ణయములగైకొనెను. పోలీసులకు శిక్షణ నొసంగుట, ప్రత్యేక దుస్తులు, వాటి తయారి కొక కర్మాగారము నెల కొల్పెను. పోలీసు స్టేషన్లకు నూతన భవనముల నిర్మించెను. అందుచే నేటికిని పోలీసుశాఖను హంకెన్ పోలీసు అని, పోలీసు ఇన్స్పెక్టరు కార్యాలయమును హంకెన్ కచేరి అని పిలుచుట కద్దు.

క్రీ.శ. 1922 లో న్యాయ, పరిపాలనా అధికారములు వేరు చేయుట వలన జిల్లా కలెక్టర్ల పరిధి పాలనా పరమునకే పరిమితమైనది. ఇన్ని సంస్కరణములు అమలు పరచినను నేరముల సంఖ్య తగ్గలేదు. న్యాయస్థానములు శిక్షలు కఠినముగా విధించకుండుట, బెయిలు మంజూరి చేయుట మొదలగు వాటి వలన క్రీ.శ. 1930 నాటికి పోలీసు శాఖ స్థాయి ప్రజలలో సన్నగిల్లినది. కొందరు పోలీసు అధికారులు విధి నిర్వాహణమును సక్రమముగా సాగించనందున క్రీ.శ. 1937లో న్యాయ విచారణాధికారము, శిక్షలు విధించు అధికారము తాలుక్దారుల కప్పగించబడినది. దీనితో రాష్ట్రమున తిరిగి శాంతి భద్రతలు ఏర్పడినవి.

1947 ఆగస్టు 15న భారత దేశమునకు స్వాతంత్ర్యము లభించినది. కాని నిజాం నవాబు తన రాష్ట్రమును భారత దేశములో విలీనమొనర్చుట కు అంగీకరించలేదు పైగా తన ప్రత్యేక రాజ్యముగా మహమ్మదీయ రాజ్యముగా నేర్పరుచు ప్రయత్నములు గావించెను. కాశిం రజ్వీయను మతోన్మాది భారత దేశంలో నైజాం రాజ్యము మహమ్మదీయ మతరాజ్యమునే కావాలని రజాకార్ ఉద్యమము లేవదీసెను. నైజాం ప్రభుత్వ పోలీసు యంత్రాంగము రజాకార్లకు తగురీతిలో సహాయమొనర్చుచుండిరి.

1948 సెప్టెంబర్ 13న భారత సైన్యములు నైజాం రాజ్యముపై పోలీసు చర్యగైకొని నిజాం రాజ్యమును నలువైపుల నుండి ముట్టడించినవి. 1948 సెప్టెంబర్ 17 సాయంత్రము నాలుగు గంటలకు మేజర్ జనరల్ జె.యన్. చౌదరి నాయకత్వమున మెదకు జిల్లాలోని పోటాన్‌చెరు ప్రాంతమునకు చేరెను. నిజాం నవాబు మహబూబలీఖాన్ ప్రతిఘటనను చాలించి భారత సైన్యములకులొంగి పోయెను.

ఈ విధముగా ఆంధ్రప్రదేశ్‌లో హైద్రాబాద్ స్టేట్ భారత దేశమున విలీనమగుటలో కూడా మెదకు జిల్లాకు ప్రత్యేకత కలదు.

# సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు

| క్ర.సం. | పేరు | పనిచేసిన కాలం | | |
|---|---|---|---|---|
| 1. | ప్రతాప్‌రెడ్డి | 2.11.1953 | - | 2.1.1955 |
| 2. | ఎఫ్.ఎస్. దేవార్స్ | 12.1.1955 | - | 17.7.1955 |
| 3. | ప్రహ్లాద్ సింగ్ | 1.8.1955 | - | 30.10.56 |
| 4. | ఎం.యస్ హుస్సేన్ | 05.12.1956 | - | 23.9.59 |
| 5. | కె.వి.వి. సుబ్రమణ్యం | 24.9.1959 | - | 15.5.62 |
| 6. | మహమ్మద్ బిన్ మహమ్మద్ | 16.5.1962 | - | 2.8.64 |
| 7. | సి. రాఘవేంద్రరావు | 24.8.1964 | - | 14.4.65 |
| 8. | ఎ.ఎఫ్. డయాస్ | 11.8.1965 | - | 30.10.67 |
| 9. | జి.ఎస్. రెడ్డి | 22.11.1967 | - | 18.7.69 |
| 10. | ఎస్. చంద్రశేఖరన్ | 18.9.1969 | - | 12.10.69 |
| 11. | పి.జగన్మోహన్ | 13.10.1971 | - | 9.1.74 |
| 12. | సి.అంజనేయరెడ్డి | 1974 | - | 31.10.75 |
| 13. | ఎ.ఎస్.బోస్ | 21.02.1975 | - | 15.11.76 |
| 14. | జనక్‌రాజ్ | 17.12.1976 | - | 6.5.79 |
| 15. | డి.విష్ణుమూర్తి | 7.5.79 | - | 21.4.80 |
| 16. | పి.వి. నాయుడు | 21.4.1980 | - | 10.4.81 |
| 17. | కె.ఆర్.నందన్ | 10.4.1981 | - | 15.5.82 |
| 18. | పి.వి. శేషగిరిరావు | 16.5.1982 | - | 5.7.82 |
| 19. | కె. అరవిందరావు | 17.7.1982 | - | 8.1.84 |
| 20. | ఎస్.వి. నర్సింహులు | 8.1.1984 | - | 16.6.84 |
| 21. | ఎస్.ఎ. హుడా | 16.6.1984 | - | 24.1.85 |
| 22. | టి.పి. దాస్ | 2.2.1985 | - | 24.10.86 |
| 23. | ఎం.బాబూరావు | 25.10.1986 | - | 2.5.88 |
| 24. | పి.వెంకయ్య | 3.5.1988 | - | 18.4.89 |
| 25. | ఎన్. సాంబశివరావు | 18.4.89 | - | 25.1.92 |
| 26. | ఎం. మాలకొండయ్య | 25.1.1992 | - | 22.1.94 |
| 27. | ఎన్. వి. సురేంద్రబాబు | 22.1.1994 | - | 13.6.94 |
| 28. | టి.కృష్ణరాజు | 15.6.1994 | - | 15.6.95 |
| 29. | ఎ.కె. సింగ్ | 5.6.1995 | - | 18.6.97 |
| 30. | టి.కృష్ణప్రసాద్ | 18.6.1997 | - | 8-7-98 |
| 31. | ద్వారకతిరుమలారావు | 16-7-98 | - | 28-9-200 |
| 32. | వి.వి. గోపాల కృష్ణ | 19-10-2000 | - | --- |

## మెదకు జిల్లాలో పోలీసు శాఖ

| | | | |
|---|---|---|---|
| 1. | జిల్లా పోలీసు అధికారి పేరు | : | వి.వి.గోపాలకృష్ణ ఐ.పీ.ఎస్ |
| 2. | జిల్లాలోని డివిజన్‌లు | : | 5 |
| | డివిజనల్ అధికారులు | : | 5 |
| 3. | పోలీసు సర్కిళ్లు (పేర్లు) | : | 18 |
| 4. | పోలీసు స్టేషన్ల సంఖ్య | : | 57 |
| 5. | మహిళా పోలీసు స్టేషన్లు | : | 1 |
| 6. | మహిళా ఎస్.ఐ.ల సంఖ్య | : | 1 |
| | మహిళా కానిస్టేబుళ్ల సంఖ్య | : | 9 |
| 7. | జిల్లాలోని కానిస్టేబుళ్ల సంఖ్య | : | 1670 |
| 8. | ఒక పోలీసు స్టేషన్‌లో ఉండే సిబ్బంది వివరములు | : | 10 నుండి 60 వరకు |
| 9. | రిజర్వు పోలీసుల సంఖ్య | : | 485 |
| 10. | సి.ఐ.డి వ్యవస్థ - వివరములు | : | - |
| 11. | పక్కా భవనములుగల పోలీసు స్టేషన్ల సంఖ్య | : | 36 |
| | నిర్మాణములో ఉన్న పోలీసు స్టేషన్ల సంఖ్య | : | 5 |
| | ప్రైవేటు గృహాలలో ఉన్న పోలీస్ స్టేషన్ల సంఖ్య (Located in S.I. quarters and HQrts PSS) | : | 3 |
| 12. | హోంగార్డుల సంఖ్య | : | 220 |

## మెదక్ జిల్లాలోని నేరాల జాబితా

| 1. సంవత్సరం | దొంగతనము | దారి దోపిడీలు | హత్యలు | వర్గ పోరాటాలు | రాజకీయ నేరాలు | మానభంగాలు | ఎనకౌంటర్లు |
|---|---|---|---|---|---|---|---|
| 1960 | - | - | - | - | - | - | - |
| 1970 | - | - | - | - | - | - | - |
| 1980 | - | - | - | - | - | - | - |
| 1981 | 288 | 6 | 18 | 4 | 40 | 4 | 116 |
| 1990 | 753 | 74 | 38 | 4 | 91 | 4 | 234 |
| 1999 | 460 | 15 | 45 | 8 | 75 | 24 | 100 |

# న్యాయ శాఖ

చరిత్ర తెలిసినప్పటి నుండి న్యాయము రాజాధీనమై యుండెను. రాజు చెప్పినదే న్యాయమను నానుడి ప్రజలలో ప్రబలి యుండెను.

శాతవాహన కాలమున గ్రామ పరిపాలనమునకై నేటి గ్రామపంచాయతీలను పోలిన గ్రామసభలుండెను. కాకతీయుల కాలమున కూడా ఇట్టి గ్రామసభలున్నట్లు తెలియుచున్నది. గ్రామసభలలో గ్రామపెద్దలు గ్రామణి సభ్యులుగా నుండేవారు. చిన్న చిన్న తగవులు వీరే తీర్చువారు. పెద్ద తగవులేర్పడినపుడు రాజసభలో ప్రాడ్వివాకులు, న్యాయాధీశులు తీర్చువారు. కొన్ని సమయములలో న్యాయసలహాలను మంత్రుల ద్వారా గాని ప్రాడ్వివాకుల వలనగాని తెలిసికొని రాజు న్యాయము చెప్పువాడు.

నిజాంనవాబుల కాలంలో న్యాయము జాగీర్దారుల, సూబేదారుల, వశమైనది.

మొదటి సాలార్జంగ్ క్రీ.శ. 1855లో నిజాం రాష్ట్రమున న్యాయ వ్యవస్థ నేర్పాటు చేసెను. మున్సిఫ్, మీర్ అదాలత్‌లను నియమించెను. 1865లో నిర్దుష్టమైన అధికారములుగల తాలూకా తహసీల్‌దార్‌లు, జిల్లా తాలూక్దార్ల నియామకము జరిగినది. వీరు నేర విచారణ గావించుచు న్యాయము చెప్పుచుండిరి. 1875 సంవత్సరంలో మజ్లిస్ అదాలతులాల్య ప్రధాన అప్పీళ్ల న్యాయస్థానముగ ఏర్పడినది. జిల్లా తాలుక్దార్లకు సహాయపడుటకు మదద్గార్ అదాలత్‌లు పేర వ్యాజ్య పరిష్కారమునకై నెలకొల్పబడినవి. జాగీర్దారులున్న చోట్ల వారే తమ ఆధీనములోని గ్రామమైయుండెను.

1922వ సంవత్సరంలో రెవెన్యూశాఖ నుండి న్యాయ శాఖ వేరుగావించబడినది. తాలూకా కేంద్రములందు మున్సిఫ్‌లు నిజాం నిర్వహించు న్యాయపరమైన అధికారములు 1927లో హైకోర్టుకు అప్పగింప బడినవి. 1933లో హై కోర్టు న్యాయాధిపతి హోదా కలిగిన న్యాయపర్యవేక్షణాధికారి నియమింపబడెను. పోలీస్ యాక్షన్ జరిగి నిజాం పరిపాలన అంతమైనది. అప్పటి వరకున్న సాదిరె అదాలత్‌లు జిల్లా కోర్టులుగ మార్చబడినవి.

మెదకు జిల్లాలో నిజాంపరిపాలనములో సంగారెడ్డి, మెదకు జోగిపేట, సిద్దిపేట, నారాయణ్‌ఖేడ్, జహీరాబాద్, మున్సిఫ్ అదాలత్‌లు అనుపేర న్యాయస్థానములుండెను. వీటి భవనములన్నియు ఒకే రీతిగా నిర్మింపబడినవి.

ప్రస్తుతము మెదకు జిల్లాలో జిల్లా కేంద్రమైన సంగారెడ్డిలో

1. జిల్లాకోర్టు (డిస్ట్రిక్ట్ సెషన్ జడ్జ్ కోర్టు)
2. అడిషన్‌ల సెషన్ జడ్జ్ కోర్టు
3. సీనియర్ సివిల్ జడ్జ్ కోర్టు
4. జూనియర్ సివిల్ జడ్జ్ కోర్టులు పని చేయుచున్నవి.

మెదకు, జోగిపేట, నారాయణఖేడ్, జహీరాబాద్, సిద్దిపేట, గజ్వేల్, నర్సాపూర్‌లలో జూనియర్ సివిల్ జడ్జ్ కోర్టులు కలవు.

ఇవికాక న్యాయశాఖలో అనేక మార్పులు వచ్చినవి. సంచార న్యాయస్థానములు మొదలగునవి ఏర్పాటైనవి.

## న్యాయ మూర్తులు

| క్ర.సం. | జడ్జి పేరు | పనిచేసిన కాలం |
|---|---|---|
| 1. | ముర్తుజాఖాన్ | నవంబర్ 1956 - 1958 సెప్టెంబర్ 11 |
| 2. | హమీద్‌బిన్ షబీర్ | 12 సెప్టెంబర్ 58 - 59 జూన్ 19 |
| 3. | నజుముద్దీన్ | 20 జూలై 59 - 61 జూన్ 6 |
| 4. | జె.ఎన్. వాఘరే | 15 జూన్ 65 - 65 జూన్ 14 |
| 5. | బి.ఆర్. చలపతిరావు | 10 అక్టోబర్ 66 - 66 అక్టోబర్ 14 |
| 6. | కె.హెచ్. భూషణరావు | 15 అక్టోబర్ 66 - 69 జూన్ 9 |
| 7. | పి. సత్యానంద్ సాగర్ | 10 జూన్ 69 - 71 అక్టోబర్ 3 |
| 8. | జి. రామానుజులు నాయుడు | 4 అక్టోబర్ 69 - 71 ఆగస్టు 26 |
| 9. | మిర్జా ఖాసింబేగ్ | 27 ఆగస్టు 71 - 72 మార్చి 23 |
| 10. | వై. వాసుదేవరావు | 24 మార్చి 72 - 72 నవంబర్ 10 |
| 11. | డి. మధుసూదన్‌రావు నాయుడ | 11 నవంబర్ 72 - 75 జనవరి 28 |
| 12. | మీర్ షంషుద్దీన్ అలీఖాన్ | 29 జనవరి 75 - 75 సెప్టెంబర్ 30 |
| 13. | మహబూబ్ ఇలహిఖాన్ | 1 డిసెంబర్ 75 - 76 డిసెంబర్ 14 |
| 14. | బి.వి. నర్సింహం | 15 డిసెంబర్ 76 - 77 సెప్టెంబర్ 23 |
| 15. | పి.వి. రాజేశ్వర్ రావు | 24 సెప్టెంబర్ 77 - 78 ఫిబ్రవరి 7 |
| 16. | పి. రంగయ్య | 8 ఫిబ్రవరి 78 - 79 మే 2 |
| 17. | మోహనరామిరెడ్డి | 3 మే 79 - 80 మే 31 |
| 18. | జె. కోటం రెడ్డి | 1 జూన్ 80 - 81 ఏప్రిల్ 6 |
| 19. | జె. వేణుగోపాల్ రావు | 7 ఏప్రిల్ 81 - 82 ఏప్రిల్ 30 |
| 20. | టి.వి. విద్యాసాగర్ | 1 మే 82 - 84 మే 6 |
| 21. | రూపేందర్‌పర్‌షాద్ సెహగల్ | 7 మే 84 - 87 మే 15 |
| 22. | ఎం. శ్రీనివాస రావు | 16 మే 87 - 88 జూన్ 15 |
| 23. | కె. తారానాథ్ | 9 జూన్ 88 - 90 మార్చి 30 |
| 24. | వై. వెంకటేశ్వరరావు | 31 మార్చి 90 - 92 జూలై 29 |
| 25. | డి.ఎస్.ఆర్. అంజనేయులు | 30 జూలై 90 - 95 జూన్ 30 |
| 26. | పి. లక్ష్మణ్ రెడ్డి | 4 జూలై 95 - 96 మార్చి 10 |
| 27. | డి. అప్పారావు | 13 ఏప్రిల్ 96 - 96 మే 17 |
| 28. | కె.సి. భాను | 1 జూన్ 97 - 97 సెప్టెంబర్ 10 |
| 29. | వి. జగ్‌పాల్‌రెడ్డి | 26 సెప్టెంబర్ 97 - |

# విద్యారంగము

మెదకు జిల్లా మేధా సంపదలో మేటియైనది. ప్రపంచ పాండితీ లోకానికి పాఠాలు చెప్పే వ్యాఖ్యానాలు ఈ గడ్డపై పుట్టిన మహామహోపాధ్యాయ మల్లినాధుని మహిమాన్విత ఘంటము నుండి జాలువారినవి.

సాహితీ లోకానికి ప్రపంచ కథా సాగరము నందించిన గుణాఢ్యుడిక్కడి వాడే.

ఎందరో మహామహులు, విద్యావేత్తలు ఈ మెదకు గడ్డపై జన్మించి ఎంతో ఘన కీర్తిని పొందినారు. కాని నేడు మెదకు జిల్లా విద్యారంగమున చాలా వెనుకబడి యున్నదని చెప్పక తప్పదు. ఇందుకు కారణములనేకములు, ముఖ్యముగా మూడు శతాబ్దాల నిరంకుశ పరిపాలన ప్రజలలోని చైతన్యాన్ని పటాపంచలు చేసి అజ్ఞానాంధకారంలో అలమటించేటట్లు చేసింది.

స్వాతంత్ర్యం వచ్చే నాటికి మెదకు జిల్లాలో ఒకే ఒక్క ఉన్నత పాఠశాల మెదకులో ఉండేది. అక్కడక్కడా ప్రభుత్వ పరంగా ప్రాథమిక పాఠశాలలుండేవి అందులోను మాతృభాష తెలుగు మాధ్యమంగా కాక ఉర్దూ మాత్రమే నేర్పబడేది. తాలూకా మొత్తంలో ఉండే ఒకటో, రెండో పాఠశాలలలో వేళ్లమీద లెక్కింప తగినంత విద్యార్థులుండేవారు ప్రజలకు చదువంటే చాలా దూరం ఉండేట్లుగా నాటి ప్రభుత్వాలు ప్రయత్నించేసేవి. రాను రాను కాలం తెచ్చిన మార్పులు విద్యారంగంపై కూడా ప్రభావాన్ని చూపాయి. మెదకు జిల్లా హైద్రాబాదుకు సమీపంలో ఉండుటచే ఇక్కడి విద్యార్థులు ఎక్కువగా నగరంలోనే చదువుకొనేవారు.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మెదకు జిల్లాలో విద్యావ్యాప్తి ఆరంభమైనదని చెప్పవచ్చు.

1955 నాటికి మెదకు జిల్లాలో కేవలము 5 ఉన్నత పాఠశాలలు ఉండేవి, క్రమ క్రమముగా పాఠశాలల సంఖ్య పెరుగుతూ వచ్చింది.

పంచాయత్ రాజ్‌వ్యవస్థలో విద్యారంగానికి పెద్దపీట లభించింది. పంచాయతీ రాజ్‌కు విద్యా వ్యవస్థను అప్పగించుటతో పల్లెపల్లెల్లో పాఠశాలలు ప్రారంభమైనాయి. విద్యార్థుల సంఖ్య పెరుగసాగింది.

ఈనాడు మెదకు జిల్లాలో 1490 ప్రాథమిక పాఠశాలలు 283 ప్రాథమికోన్నత పాఠశాలలు, 288 ఉన్నత పాఠశాలలు పని చేయుచున్నవి. ఇవి కాక 7 గురుకుల ఆవాస విద్యాలయములు 1 కేంద్రీయ పాఠశాల, 1 నవోదయ పాఠశాల, 3 సెంట్రల్ బోర్డు పాఠశాలలు కలవు.

22 జూనియర్ కళాశాలలు, 6 డిగ్రీ కళాశాలలు, 2 పోస్టు గ్రాడ్యుయేషన్ సెంటర్లు, 3 ఐ.టి.ఐ లు, 1 జిల్లా విద్యా మరియు శిక్షణా సంస్థ (డైట్), 3 పాలిటెక్నిక్ కళాశాలలు ప్రభుత్వ పరముగా నడుచుచున్నవి.

ఇవిగాక జిల్లాలో ప్రైవేటు యాజమాన్యమున ప్రాథమికోన్నత పాఠశాలలు, కొన్ని గుర్తింపునందిన **ఉన్నత** పాఠశాలలు కలవు. ప్రైవేటు యాజమాన్యమున నడుచుచున్న జూనియర్ కళాశాలలు, డిగ్రీ కళాశాలలు, ఇంజనీరింగ్ కళాశాలలు, ఐ.టి.ఐ లు కూడా మెదకు జిల్లాలో కలవు.

ఇవిగాక ఈ జిల్లాలో సంస్కృత పాఠశాలలు, వేద పాఠశాలలు, అరబ్బీ పాఠశాలలు, స్వచ్ఛంద సంస్థల ద్వారా నడపబడుచున్నవి.

## అక్షరాస్యత :- మంజీరా అక్షర ప్రభ :

మెదకు జిల్లాలో నిరక్షరాస్యతా నిర్మూలనకై 'మంజీరా అక్షర ప్రభ' అను పేరుతో సంపూర్ణ అక్షరాస్యతా ఉద్యమము 1-11-1992 రోజున ప్రారంభింపబడినది. ఈ అక్షరాస్యత ఉద్యమంలో చదువుకొన్న ప్రతి ఒక్కరూ భాగస్వాములు.

9 సంవత్సరాల నుండి 45 సంవత్సరాల మధ్య వయస్సుగల 8,43,045 మంది నిరక్షరాస్యులను గుర్తించి 6,15,467 మంది నిరక్షరాస్యులను నమోదు చేసికొనుట జరిగినది. నమోదు చేసి కొనిన నిరక్షరాస్యులకు చదువు నేర్పడానికి 41,552 మంది స్వచ్ఛంద బోధకులను గుర్తించుట జరిగి వారి ద్వారా నిరక్షరాస్యతా నిర్మూలన కార్యక్రమము విజయవంతముగా సాగి 2.51 లక్షల మందిని సాక్షరులుగా చేయుట జరిగినది.

సంపూర్ణ అక్షరాస్యత కార్యక్రమము 31-3-1995 తో ముగిసినది. నేర్చుకొన్న చదువు మరిచి పోకుండా నూతన అక్షరాస్యులకు అక్షరాస్యతానంతర కార్యక్రమము ప్రారంభించుటకు సాక్షరతా మిషన్ న్యూఢిల్లీ వారు 1-3-1995 రోజున అక్షరాస్యతానంతర ప్రణాళికను ప్రారంభించిరి.

మెదకు జిల్లాలో ఈ అక్షరాస్యతానంతర కార్యక్రమము 15-8-95న ప్రారంభించబడినది.

1995నాటికి మెదకు జిల్లాలో అక్షరాస్యులు 6,01,869 మంది కలరు. వీరిలో పురుషులు 4,26,073, స్త్రీలు 1,75,796 ఉన్నారు. జిల్లా అక్షరాస్యతా శాతము 32.5%, పురుషులు-37%, స్త్రీలు-17.7%.

మెదకు జిల్లాలో వీటన్నింటికి తోడుగా 944 అనియత విద్యా కేంద్రములు గలవు వీటిలో 16,368 బాలురు 9,407 బాలికలు విద్యాభ్యాసము చేయుచున్నారు. ఓపన్‌స్కూల్‌విధానము, 'నేనుబడికి పోతా' పథకము, రాత్రి పాఠశాలలు వయోజన విద్యాపథకము నిరంతర విద్యాకేంద్రములు జిల్లాలోని నిరక్షరాస్యతను పోగొట్టుటకు తీవ్రమైన కృషి సల్పుచున్నవి.

మెదకు జిల్లాలో బాలకార్మికులకై ప్రత్యేకముగా 40 ప్రాథమిక పాఠశాలలు ఏర్పాటు చేయబడినవి. ఇవి ముఖ్యముగా బీడీ కార్మికుల పిల్లలకై 37 పాఠశాలలు ఉన్ని పరిశ్రమలో పని చేస్తున్న బాలల కొరకు 3 పాఠశాలలు ఏర్పాటు చేయబడినవి.

ఈ జిల్లాలో అంధులకై ప్రత్యేకముగా పాఠశాల ఏర్పాటు గావింపబడి 24 అంధబాలబాలికలు ఈ పాఠశాలలో చదువు కొనుచున్నారు.

## నిరంతర విద్యా కేంద్రాలు :

మెదకు జిల్లాలో అక్షరాస్యతానంతర కార్యక్రమంలోభాగంగా నిరంతర విద్యా కేంద్రములు ప్రారంభింపబడినవి.

జిల్లాలో 451 నిరంతర విద్యాకేంద్రాలు 64 నోడల్ నిరంతర విద్యాకేంద్రాలు మంజూరియైనవి. ఇవి మండలమునకు పది చొప్పున నడుపబడును, ఇప్పటికి 450 కేంద్రములు ప్రారంభించబడినవి.

ఈ నిరంతర విద్యా కేంద్రాలు మారుమూల గ్రామాలలో గ్రంధాలయాలుగా, సమాచార సాంస్కృతిక కేంద్రాలుగా నూతన అక్షరాస్యులకే కాక యితరులకు కూడా ఉపయోగపడుచున్నవి. ఈ కేంద్రాలలో వార్తా పత్రికలు, వార పత్రికలు, ఆట వస్తువులు వివిధ రకములైన పుస్తకములు అందుబాటులోనుండును.

నిరంతర విద్యాకేంద్రము మంజూరుకు గ్రామస్థులే స్వయంగా నిధులు సమకూర్చు కొనవలయును. 10 వేల రూపాయలు కార్పస్ ఫండ్గా బ్యాంకులో 5 సంవత్సరముల డిపాజిట్ చేసినచో కేంద్రము మంజూరి అగును. ప్రభుత్వము వెంటనే మొదటి సంవత్సరము 20 వేల రూపాయలు మంజూరి చేయుదురు. అందులో 10 వేల రూపాయలు నాన్‌రికవరి క్రింద మిగిలిన 10 వేల రూపాయలు రికవరి పద్దుల క్రింద ఖర్చు చేయబడును. రెండవ సంవత్సరము నుండి 4 సంవత్సరముల వరకు ప్రతియేడు 10 వేల రూపాయలు విడుదల చేయబడును.

నిరంతర విద్యాకేంద్రాలు లెర్నర్స్ అసోసియోషన్ మరియు ప్రేరక్‌ల బాధ్యతలో నడపబడును. 450 మంది ప్రేరక్‌లకు, లెర్నర్స్ అసోషియేషన్ సభ్యులకు పూర్వపు తాలూకా కేంద్రాలలో శిక్షణ ఈయబడినది.

జిల్లాలో ప్రస్తుతం 450 నిరంతర కేంద్రాలకు లెర్నర్స్ అసోసియేషన్లు కార్పస్ ఫండ్ రూపేణ రూ.5 వేల నుండి 10 వేల రూపాయల వరకు జిల్లా మొత్తంలో 31.92 లక్షల రూపాయలు వివిధ బ్యాంకులలో డిపాజిట్ చేయబడినవి. వీరికి మ్యాచింగ్ గ్రాంటుగా 59.74 లక్షల రూపాయలు ప్రభుత్వము ద్వారా మంజూరి గావించబడినవి.

నిరంతర విద్యా కేంద్రాలు చక్కగా నడచుటకై సమీక్షా సమావేశాలు మండల స్థాయిలో జరుగును. మండలములోని ప్రముఖులు, అధికారులు, పాఠశాలల ప్రధానోపాధ్యాయులు, ఎం.ఆర్.పి లు సమావేశమై కేంద్రాలు ప్రారంభించుటకు, అవి చక్కగా నిర్వహింపబడుటకు చర్చింతురు.

ఈ విధముగా మెదక్ జిల్లాలో నిరక్షరాస్యతను పోగొట్టుటకు అనేక విధములైన చర్యలుగైకొన బడుచున్నవి.

## జిల్లా ప్రాథమిక విద్యా పథకము :

భారత రాజ్యాంగ చట్టంలో ప్రాథమిక హక్కుల్లో భాగంగా ఆర్టికల్ 45 ద్వారా దేశంలోని 14 సంవత్సరాలలోపు బాలబాలికలందరికి నిర్బంధంగా ఉచిత ప్రాథమిక విద్యని అందించాలని రాజ్యాంగంలోనే ఒక అంశంగా రూపొందించడమైనది. ఈ విషయంలో 1966, 1971, 1976, 1986 మరియు 1992లో ప్రభుత్వం ఏర్పరచిన వివిధ విద్యా కమిటీలు అనేక సూచనలు చేసాయి. ఆయా సూచనలు దృష్ట్యా 1992లో ప్రభుత్వం నూతన విద్యా విధానాన్ని ప్రకటించింది. ధేశంలోని 14 ఏళ్ళలోపు బాల బాలికలందరికి ఉచిత విద్య అందించాలనీ, తద్వారా నిరక్షరాస్యతని పూర్తిగా నిర్మూలించాలని ప్రకటించింది. ఈ గమ్యాన్ని చేరడానికి ప్రభుత్వము వివిధ పథకాల ద్వారా కృషి చేయటం జరుగుతున్నది.

## పూర్వ ప్రాథమిక విద్య :

మాతాశిశు ఆరోగ్య పరిరక్షణకు మరియు శిశు సమగ్ర అభివృద్ధిని ఆశయంగా 1982 నుండి సమగ్రశిశు అభివృద్ధి (ఐ.సి.డి.ఎస్) పథకాన్ని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేస్తున్నాయి. ఈ పథకంలో భాగంగా 0+ నుండి 6 సంవత్సరాల పిల్లలకు అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా పౌష్టికాహారంతో పాటు 3 నుండి 6 సంవత్సరాల పిల్లలకు పూర్వ ప్రాథమిక విద్యా కార్యక్రమాలను కూడా అందించడమౌతుంది. దీని ద్వారా పిల్లలలో మానసిక పరిపక్వత, శారీరక ఎదుగుదల, సామాజిక మరియు భావోద్వేగ అభివృద్ధిని సాధించగలుగుతున్నారు.

మానవ జీవితంలో మొదటి 5 సంవత్సరాలు వారి తదుపరి వికాసానికి అతి ప్రధానమైనవి. ఈ దశలో అందించే పూర్వ ప్రాథమిక విద్య ఆయా వ్యక్తుల తదుపరి దశల అభివృద్ధి పునాది వంటిది. కాగా, దేశంలోని సమగ్ర శిశు అభివృద్ధి కేంద్రాల ద్వారా కేవలం 11% మంది శిశువులకు మాత్రమే తమ సేవలను అందించటం వలన పూర్వ ప్రాథమిక విద్యాకేంద్రాలను విస్తరించే ప్రయత్నంలో జిల్లా ప్రాథమిక విద్యా కార్యక్రమం ఒక ముఖ్యమైన మైలురాయిగా చెప్పుకోవచ్చు.

## బాలకార్మికులు – విద్య:

ఎన్ని పథకాలు ప్రవేశపెట్టినప్పటికి పేదరికం, కుటుంబ రాబడి, సామాజిక వెనుకబాటుదనం, తల్లిదండ్రుల అవిద్య, అందుబాటులో పాఠశాల లేకపోవడం, పాఠశాల ఉన్నప్పటికి బోధన అకర్షణీయంగా లేకపోవడం వంటి అనేక కారణాలు బాలల విద్యా హక్కును కాలరాయడం వల్ల, బడి ఈడు పిల్లలు బాల కార్మికులుగా (రేపటి కార్మికులుగా) కర్మాగారాలలో, పొలాల్లో, వెట్టిచాకిరీలో హోటళ్ళలో పని చేయడానికి నెట్టి వేయబడుతున్నారు బడి పిల్లల బాల్యం చీకటిమయం అవుతుంది.

అంతర్జాతీయ బాలల హక్కుల సమావేశం బాలల బాల్యం బాలల హక్కు అని నొక్కి చెప్పింది.

## అందరికీ విద్య :

విద్యా వ్యవస్థలో గుణాత్మకమైన మార్పులు తేవడానికి 1986లో ప్రకటించిన నూతన విద్యా విధానంలోని అందరికీ విద్య (ఎడ్యుకేషన్ ఫర్ ఆల్) బడి పిల్లలందరికి వర ప్రసాదమైంది. సామాజిక పరంగా ప్రజల సహకారంతో సాధించవలసిన సార్వత్రిక ప్రాథమిక విద్యారంగంలో సంపూర్ణ ఫలితాలు సాధించాలంటే ఖచ్చితమైన ప్రణాళిక మరియు ఆచరణ ద్వారా సార్వత్రిక ప్రాథమిక విద్యను సాధించాలనే పట్టుదలపైనే మనం ప్రస్తుతం ప్రయాణం చేయడం జరుగుతున్నది.

ప్రాథమిక విద్యారంగం అభివృద్ధి కోసం మనదేశంలో తొలుత కొన్ని విదేశసంస్థల సహకారంలో బీహార్ రాష్ట్రంలో బీహార్ విద్యా ప్రాజెక్టు, రాజస్థాన్‌లో లోకజుంబిష్, శిక్షాకర్మి ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలో ఉత్తర ప్రదేశ్ విద్యా ప్రాజెక్టు, ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యా పథకము (ఎపెప్) ప్రవేశ పెట్టబడ్డాయి.

ఈ విధంగా పలు రాష్ట్రాల్లో ప్రాథమిక విద్యారంగంలో సాధించిన అంశాలను పరిగణనలోకి తీసుకొని ఈ రంగాన్ని వికేంద్రికరణ ద్వారా మరింత విస్తృత స్థాయిలో అభివృద్ధి చేయడమే కాకుండా బడి ఈడు పిల్లలందరిని బడిలో చేరిపించి అందరికి విద్యా అందించు లక్ష్యముతో మన దేశములోని ఎంపిక చేసిన కొన్ని రాష్ట్రాల్లో జిల్లా ప్రాథమిక విద్య పథకము (డిపెప్) 1993 - 94 నుండి ప్రవేశం జరిగింది.

ప్రాథమిక విద్యను మరింత ప్రోత్సహించే విషయంలో కొన్ని విదేశీ సంస్థల సహకారంతో తొలివిడతగా జిల్లా ప్రాథమిక విద్యా పథకమును (డిపెప్) మధ్యప్రదేశ్, అస్సాం, హర్యానా, మహారాష్ట్ర, కర్ణాటక, తమిళనాడు, కేరళ రాష్ట్రల్లో అమలు చేస్తున్నారు. మన రాష్ట్రంలో ఈ పథకం ఒ.డి.ఎ సహకారంతో 1996-97 విద్యా సంవత్సరం నుండి అమలు జరుగుతుంది.

# మెదక్ జిల్లాలో జిల్లా ప్రాథమిక విద్యా కార్యక్రమాలు ( డిపెప్)

కేంద్రీకృతమైన విద్యా విధానం పద్ధతి ద్వారా సార్వత్రిక ప్రాథమిక విద్యలో ఫలితాలను సాధించలేమన్న భావనే జిల్లా ప్రాథమిక విద్యా పథకం అంకురార్పణగా చెప్పవచ్చును.

జిల్లాను ఒక యూనిట్‌గా తీసుకొని, ఆ జిల్లాలోని స్థానిక సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు, ఉపాధ్యాయులతో చర్చలు జరిపి గ్రామ స్థాయిలో విద్యారంగం అభివృద్ధి కోసం చర్యలు తీసుకోవడానికి నిర్దిష్టమైన ప్రణాళికలు చేయడం వలన సార్వత్రిక ప్రాథమిక విద్యలో గుణాత్మకమైన మార్పులు తీసుకురావచ్చును.

మన రాష్ట్రంలో విద్యాపరంగా, ముఖ్యముగా స్త్రీల అక్షరాస్యతలో, జాతీయ స్థాయిలో స్త్రీల అక్షరాస్యత కన్న తక్కువ వున్న జిల్లా మరియు సంపూర్ణ అక్షరాస్యత కార్యక్రమం అమలు చేయబడుతున్న జిల్లాలలో జిల్లా ప్రాథమిక విద్యా కార్యక్రమం మొదటి దశలో అమలు చేయడం జరిగింది. అవి విజయనగరం, నెల్లూరు, కర్నూలు, కరీంనగర్, వరంగల్లు, ఈ పథకం 2002-03 సంవత్సరము వరకు అమలులో ఉంటుంది. దీనికి రూ. 172.72 కోట్లు మంజూరయ్యాయి.

రెండవ దశలో జిల్లా ప్రాథమిక విద్యా కార్యక్రమం 14 జిల్లాలలో 1998-99 నుండి అమలు చేయబడుతుంది.

ఈ జిల్లాలకు నిధులు ప్రపంచ బ్యాంకు ద్వారా సమకూర్చబడుతున్నది. ఈ 14 జిల్లాలు వరుసగా శ్రీకాకుళం, విశాఖపట్నం, గుంటూరు, ప్రకాశం, చిత్తూరు, కడప, అనంతపురం, మహబూబ్ నగర్, ఖమ్మం, నల్గొండ, రంగా రెడ్డి, నిజామాబాద్, అదిలాబాద్ మరియు మెదక్. ఈ పథకం 2002-2003 వరకు అమలులో ఉంటుంది, దీనికి రూ.710.967 కోట్లు మంజూరయ్యాయి.

**జిల్లా ప్రాథమిక విద్యా పథకం ( డిపెప్)**
**ఆశయాలు, ఉద్దేశ్యాలు :**

ప్రాథమిక పాఠశాల పిల్లలకు అందుబాటులో ఉండే విధంగా చేయటం.

5 నుండి 11 సంవత్సరాల మధ్య వయస్సు గల బాలబాలికలకలందరికి ప్రాథమిక పాఠశాలలో నమోదు అయ్యేవిధంగా చూడడం. పాఠశాల చేరిన తరువాత పిల్లలను తిరిగి బడి మానకుండా ఉండే విధంగా చేయడం.

ప్రాథమిక తరగతులలో బాలబాలికలందరికి గుణాత్మకమైన విద్యను అందించుట ద్వారా తరగతికి నిర్దేశించిన సామర్థ్యాలను పొందే విధంగా చేయడం.

ప్రాథమిక పాఠశాలలో 1వ తరగతిలో చేరిన ప్రతి 100 మంది బాలబాలికల్లో 50 మంది మాత్రమే ప్రాథమిక విద్యను పూర్తి చేయగలుగుతున్నారు. మిగిలిన 50 మంది మధ్యలోనే బడి మానవేస్తున్నారు.

ఈ పరిస్థితి ఇలానే కొనసాగినట్లైతే దేశంలోని బాలబాలికలందరు విద్యావంతులు కావడానికి మరెన్నో దశాబ్దాలు పట్టవచ్చు. ఈ పరిస్థితి నివారించే ఆశయంతో జిల్లా ప్రాథమిక విద్యా కార్యక్రమము బాలికలు విద్యకు మరియు వెనుకబడిన తరగతులకు చెందిన బాలబాలికల విద్యకు అధిక ప్రాధాన్యత నిస్తున్నది.

ప్రస్తుతం ఉన్న నమోదు, నిలుపుదల మరియు అభ్యాసన స్థాయిలలో బాల, బాలికల వ్యత్యాసము మరియు వివిధ సామాజిక తరగతులకు చెందిన బాలురు- బాలికల మధ్యగల వ్యాత్యాసాన్ని 5 శాతానికి తగ్గించటం.

ప్రస్తుతం ప్రాథమిక తరగతిలో ఉన్న డ్రాప్- అవుట్ రేటును 10% కన్నా తక్కువ చేయడం.

బాలబాలికలలో ప్రస్తుత సామర్థ్య స్థాయి కన్నా 25% పెంపుదలని సాధించడం.

ఇందుకోసం పాఠశాలలో నమోదు అయివుండి కూడా పాఠశాలలకు హాజరు కాని మరియు చదువు మధ్యలో మానివేసిన బాలబాలికలను అనియత విద్య కార్యక్రమంలో చేర్చించి, వారి చదువుకు ఆటంకం లేకుండా చూడటం.

గ్రామస్థులకు ప్రాథమిక విద్యలో తగినంత ప్రాధాన్యత ఇవ్వడానికి పాఠశాల విద్యా కమిటీలను ఏర్పరచి ప్రజలచేత ప్రజల కొరకు పాఠశాల స్థాయి విద్యా ప్రణాళికను తయారు చేసి దాని అమలుకు కృషి చేయడం.

**డిపెప్ ఆశయ సిద్ధి కొరకు ఈ క్రింది కార్యక్రమాలను చేపట్టడం జరుగుతుంది :**

256 నూతన ప్రాథమిక పాఠశాలలను స్థాపించడం. 256 నూతనంగా స్థాపించిన పాఠశాలలకు భవన నిర్మాణము. 115 భవనాలు లేని ప్రాథమిక పాఠశాలలకు పక్కా భవన నిర్మాణము. 256 నూతనముగా స్థాపించిన పాఠశాలల్లో ఇద్దరు ఉపాధ్యాయులు (వీరిలో ఒకరు విద్యా వాలంటీర్) చొప్పున నియమించడం. 1216 అదనపు తరగతి గదులను నిర్మించడం. 300 అవసరమైన ప్రదేశాలలో పూర్వప్రాథమిక విద్యా కేంద్రాలను ఏర్పాటు చేయడం. 112 ప్రత్యామ్నాయ పాఠశాలలను స్థాపించడం. 1819 పాఠశాలకు విద్యాపరమైన వస్తువులను కొనుగోలు చేయడానికి రూ. 2000/- సమకూర్చడం. 5200 మందికి ప్రాథమిక పాఠశాలలో పని చేయుచున్న ఉపాధ్యాయులందరికి బోధన అభ్యాస ప్రక్రియలో అవసరమయ్యే సామాగ్రిని కొనుగోలు చేయుటకు రూ. 500 సమకూర్చడం.

ఉపాధ్యాయ కేంద్రానికి రూ. 2000/- సమకూర్చడం.

## విద్యావ్యాప్తి సమాజం బాధ్యత

వ్యక్తుల కలయిక సమాజం, పిల్లల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, గ్రామములోని యువకులు మహిళలు- ఇలా అందరూ కలిసి యున్నప్పుడే అది సమాజం అవుతుంది.

ప్రభుత్వాలు ఎన్ని ప్రణాళికలు చేసినప్పటికి సమాజం ప్రభుత్వ కార్యాక్రమాలకు తమ వంతు తోడ్పాటు అందచేసినప్పుడే అవి విజయవంతం అవుతాయి.

నిరక్షరాస్యులైన బాలబాలికలను అక్షరాస్యులుగా మార్చి వారి భవిష్యత్తుకు ఒక అర్థాన్ని, ఒక గమ్యాన్ని కల్పించే జిల్లా ప్రాథమిక విద్యా పథకం విజయవంతం కావాలంటే గ్రామములోని మహిళా సంఘాలు, యువజన సంఘాలు, పాఠశాల విద్య కమిటీ సభ్యులు అందరూ కృషి చేయవలసిన అవసరము ఎంతో ఉంది. అందుకే ప్రభుత్వం ఈ పాఠశాల విద్యాకమిటీల స్థాపన ఆవశ్యకతను గుర్తించింది. వాటికి కొన్ని బాధ్యతలనప్పగించింది.

**పాఠశాల విద్యా కమిటీల బాధ్యత :**

పాఠశాల విద్యా కమిటీలు తమ గ్రామములో ఎప్పటికప్పుడు సర్వేలు నిర్వహించి తమ అవసరాలు ఎమిటో తామే గుర్తించి తగు విద్యా ప్రణాళికలను పాఠశాల స్థాయిలో సిద్ధం చేసుకోవాలి.

పాఠశాల కమిటి సభ్యులు కనీసం నెలకొకసారి సమావేశము అవ్వాలి. ఆ సమావేశాలలో ఈ క్రింది అంశాల గూర్చి ముఖ్యంగా చర్చించాలి.

గ్రామములోని బడిఈడు పిల్లలు పాఠశాలలో నమోదగుటకు తీసుకుంటున్న చర్యలు, ఫలితాలు.

* బడిలో చేరిన పిల్లలు బడి మానకుండా తీసుకుంటున్న చర్యలు, ఫలితాలు.
* పాఠశాల పనితీరు
* చదువులో పిల్లల ప్రగతి
* బోధనకుపయోగపడే సాధనా సంపత్తిని సమకూర్చడం.
* గ్రామానికి జిల్లా ప్రాథమిక పథకం క్రింద ఇవ్వబడిన సదుపాయాలు, వాటి వినియోగం.
* పాఠశాల భవన నిర్మాణము గురించి.

ఉపాధ్యాయుల కొరత ఉన్నచోట, ఆయా గ్రామాల్లో చదువుకున్న నిరుద్యోగుల సేవలను వినియోగించడం.

పాఠశాలలకు అందించిన దృశ్యశ్రవణ పరికరాల పూర్తి వినియోగం గురించి గ్రామములో ఉండే బడిఈడు పిల్లలందరినీ గుర్తించి వారిని బడికి పంపించి, వారికి విద్యాబుద్ధులు నేర్పించడానికి ప్రవేశ పెట్టిన జిల్లా ప్రాథమిక విద్యా పథకం సక్రమంగా అమలు కావాలంటే పాఠశాల విద్యాకమిటీ సభ్యులతో పాటుగా, సమాజములోని ఇతర వ్యక్తులందరూ గ్రామాలలో విద్య యొక్క ప్రాముఖ్యతను ప్రచారము చేస్తూ పిల్లలను బడికి పంపేటట్లుగా మరియు బడిలో చేరిన విద్యార్థులు బడిలో కొనసాగేలా చూడాలి.

పాఠశాల అవసరాలను గుర్తించి భవన నిర్మాణమునకు అవసరమైన స్థలమును. ఇతర వనరులతో పాటుగా ముఖ్యంగా, శ్రమదానం తదితరమైన సహాయ సహకారలను సమకూర్చి, కేటాయించిన నిధులను తామే సద్వినియోగపరచాలి. పాఠశాల వార్షిక బడ్జెట్‌ను రూపొందించుకోవాలి.

**జిల్లా ప్రాథమిక విద్యా పథకంలో మహిళలకు ప్రాధాన్యత :**

విద్యా వ్యవస్థలో గుణాత్మకమైన మార్పులు తీసుకురావడానికి జిల్లా ప్రాథమిక విద్యా పథకంలో ఆడవారికి తగిన ప్రాధాన్యత, బాధ్యత ఇవ్వడమైనది.

1. తమకు, తమపిల్లలకు చదువు తప్పని సరిగా కావాలనే డిమాండ్‌ని మహిళలు కోరడానికి అవకాశం.
2. మహిళా ఉపాధ్యాయుల నియామకం.
3. బాలికల కోసం ప్రత్యేకమైన మరుగుదొడ్ల ఏర్పాటు
4. ఉపాధ్యాయులలో మహిళల పట్ల సదవగాహన కోసం కృషి.
5. అంగన్‌వాడి కేంద్రాలు లేని గ్రామాలలో ప్రాథమిక విద్యా పాఠశాలలకనుబంధంగా పూర్వ ప్రాథమిక విద్యా కేంద్రాలు ఏర్పాటు చేసుకోవడం.

**తల్లిదండ్రుల బాధ్యత** :

జిల్లా ప్రాథమిక విద్యా కార్యక్రమం గ్రామీణ పిల్లల భవిష్యత్తుని దృష్టిలోవుంచుకొని రూపొందించిన కార్యక్రమంగా చెప్పుకోవచ్చును. కేవలం ఆటపాటలతోనూ, లేదా తల్లిదండ్రులకు పనిలో సహాయపడుతున్నారనే నేపంతో పిల్లల ఉజ్వల భవిష్యత్తు తల్లిదండ్రులు గుర్తించడం లేదు.

తమ పిల్లలు చదువుకోవటం వలన తమ కుటుంబాలు బాగుపడతాయి సమాజం బాగు పడతుందనే దృక్పథం తల్లిదండ్రులకు కలగాలి. తద్వారా వ్యక్తిగత అభివృద్ధితో పాటుగా దేశంలో శాస్త్ర సాంకేతిక రంగాల్లో మనం మరింత గణనీయమైన ప్రగతిని సాధించడానికి వీలవుతుంది.

గ్రామానికి అందుబాటులో వున్న పాఠశాలలకు తమ పిల్లలను పంపించడం ప్రతి తల్లిదండ్రుల కర్తవ్యంగా భావించాలి. పాఠశాలకి వెళ్తున్న తమ పిల్లలు బడి మానకుండా తల్లిదండ్రులు శ్రద్ధ వహించాలి.

తల్లిదండ్రులు తమ పిల్లలను బడికి తప్పనిసరిగా పంపించాలి. బడికి వెళ్తున్న పిల్లలు బడి మానకుండా చర్యలు తీసుకోవాలి.

పాఠశాలలో చదువుతున్న తమ పిల్లల చదువు తీరును తల్లిదండ్రులు ఎప్పటికప్పుడు గమనించాలి.

కనీసం నెలలో రెండు మార్లు పాఠశాల ప్రధానోపాధ్యాయుడితో సమావేశమై తమ పిల్లల చదువు తీరుపై విచారణ చేయాలి.

ఆడపిల్లల చదువు పట్ల సదవగాహన పెంపొందించుకొని వారి విద్యాభివృద్ధి కోసం మరింత ప్రోత్సాహాన్ని అందించడం తల్లిదండ్రులు తమ బాధ్యతగా స్వీకరించాలి.

## శిశు విద్యాకేంద్రాలు

జిల్లాలో తక్కువ స్త్రీ - అక్షరాస్యత ఉన్న మండలము లను ఎంపిక చేయడం జరిగినది. అందులో తిరిగి తక్కువ స్త్రీల అక్షరాస్యత గల గ్రామాలను పదింటి చొప్పున ఎంపిక చేసి మాతృసంఘాలను ఏర్పాటుచేసి వారి ద్వారా నియమింపబడిన చొప్పున (Instructors) మరియు ఆయాల ద్వారా (మునిపల్లి, ఝురాసంగం, రాయికోడ్, న్యాల్‌కల్, కంగ్టి, కల్హేర్, మనూర్, కొల్చారం కౌడిపల్లి, మరియు హత్నూర్ మండలములలో) శిశు విద్యా కేంద్రాలు ఏర్పాటు చేయడము జరిగినది. వారికి తగిన శిక్షణ కార్యక్రమాలు కూడా ఏర్పాటు చేయడం జరిగినది.

ఒక బృహత్ ఆశయంతో అందరికి విద్య అందించాలనే లక్ష్యంతో చేపట్టిన జిల్లా ప్రాథమిక విద్యా కార్యక్రమం, బాధ్యత కలిగిన పౌరులు, ప్రభుత్వం, ప్రభుత్వేతర సంస్థలు సంఘీ భావంతో పనిచేసినప్పుడు ఈ కార్యక్రమం తప్పకుండా విజయవంతం అవుతుంది. తద్వారా ప్రభుత్వ ఆశయం నెరవేరుతుంది.

## పత్యామ్నాయ పాఠశాలలు (Alternative Schools)

జిల్లాలో 200 కన్నా జనాభా తక్కువగా ఉన్న పాఠశాలలు లేని 112 నివాస ప్రాంతములలో ప్రత్యామ్నాయ పాఠశాలల నేర్పరచడం జరిగినది. ఇందులో విద్యా కమిటీ సూచించి నియుక్తం చేసిన బోధకునికి నెలకు రూ. 400/- చొప్పున వేతనము చెల్లించడం జరుగుతున్నది. పాఠశాల వసతిని ఏర్పాటు చేయటకు ప్రత్యామ్నాయ పాఠశాల కమిటీకి సుమారు రూ. 3000/- వరకు విడుదల చేయనైనది.

## బాలికల ప్రోత్సాహితులు

**(Girl Child Promotors)**

జిల్లాలో స్త్రీ అక్షరాస్యతాశాతం 0 నుండి 9.5 వరకు గల గ్రామములు 900 వరకు గలవు. వాటిలో బాలికల యొక్క నమోదు, నిలకడ పెంచడము, డ్రాపవుట్ రేటుని 5% కు తగ్గించడము కొరకు బాలికల ప్రోత్సహితులను నియమించడము జరిగినది. వీరికి నెలకు రూ. 400/- చొప్పున మరియు వీరితో నమోదు చేయబడిన బాలిక 80% ఉపస్థితి ప్రతినెల అయినచో ఒక బాలికకు రూ. 20/- చొప్పున ప్రోత్సాహకముగా ఇవ్వబడుతుంది. వీరికి తగిన శిక్షణ ఇవ్వడానికి సన్నాహాలు చేయబడుతున్నాయి.

## బ్రిడ్జి కోర్సులు :

గ్రామాలలో చిన్నతనములో బడికి వెళ్ళనివారు, అనేక కారణాల వలన వివిధ పనులు చేయుచున్న బాలకార్మికులు, ఖాళీగా వున్నవారు పాఠశాలకు వెళ్ళడానికి వీలుగా జిల్లాలో 68 బ్రిడ్జి కోర్సు కేంద్రములను ఏర్పాటు చేయుటము జరిగినది. ఇందులో కూడా ఒక బోధకుని నియమించి నెలకు రూ. 400/- చొప్పున చెల్లించడము జరుగుతుంది.

## మండల రిసోర్స్ పర్సన్ :

ప్రతి మండలమునకు, పట్టణప్రాంతములకు ఇద్దరు చొప్పున వ్రాత మరియు మౌఖిక పరీక్షల ద్వారా ఎంపిక చేసిన ఉపాధ్యాయులను మండల రిసోర్సు పర్సన్‌లుగా నియమించడము జరిగినది. వీరు వారి మండలములో జరుగు అన్ని విద్యా కార్యక్రమాలలో పాల్గొంటూ, గుణాత్మక విద్యను అందించడానికి ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులకు తగిన సూచనలనిచ్చెదరు. వీరు నెలలో కనీసం 20 పాఠశాలలను పర్యవేక్షించెదరు. వీరు మండల విద్యాధికారి లేదా సహాయవిద్యా పర్యవేక్షణాధి కారి ఆధ్వర్యంలో పని చేయుదురు. వీరికి జిల్లా మరియు రాష్ట్రస్థాయిలో శిక్షణ ఇవ్వడము జరిగినది.

మండల బాలికల అభివృద్ధి అధికారి (Mandal Child Development Officer).

మండల స్థాయిలో బాలికల విద్యను పెంపొందించుటకు మండల బాలికల అభివృద్ధి అధికారులను 50 మందిని నియమించుటకు సన్నాహాలు చేయుబడుచున్నవి. వీరు వారి మండలములో గల శిశు విద్యాకేంద్రాలు (ECE Centre) మరియు బాలికల ప్రోత్సాహితులకు (Girl Child Promotors) తగిన సూచనలు వెుందలగు అందచేయుదురు.

# గురుకుల పాఠశాలలు (ఎ.పి.ఆర్.ఇ.ఐ)

గ్రామీణ ప్రాంతములలో నివసించుచు ఆర్థికముగా వెనుకబడి, ప్రతిభావంతులైన విద్యార్థులకు చక్కని విద్యనందించు ఉద్దేశ్యముతో స్థాపించిన విద్యాలయాలేగురుకుల పాఠశాలలు ఈ వ్యవస్థ 1971 లో ప్రారంభించబడినది. విద్యార్థుల సమగ్ర మూర్తిమత్వాన్ని పెంపొందించి, విజ్ఞాన వికాసాన్ని అభివృద్ధి పరచే ప్రయత్నమే ఆవాస విద్యాలయాల ఆకాంక్ష.

అందుకే ఈ విద్యాలయాలు గ్రామాలకు దూరంగా సమస్త సదుపాయాలతో నిర్మింపబడినవి. గురు శిష్యుల సంబంధం నిరంతరంగా సాగి విద్యార్థులలో గురువుల పట్ల గౌరవము, గురువులకు విద్యార్థులపై వాత్సల్యము కలుగునట్లు వారిలో సత్సంబంధముండుటకై ఆచార్యులకు ఆవాసగృహాలు, శిష్యులకు నివాస స్థలాలు ఒకే చోట కల్పించడం గురుకుల విద్యాలయాలలోని ప్రత్యేకత.

విద్యార్థులలో సృజనాత్మక శక్తిని పెంపొందించే ప్రయోగ శాలలు, పఠనాభిలాషను, నూతన విషయ పరిగ్రహణాభిలాషను పెంపొందించే గ్రంథాలయాలు. మేధా సంపత్తితో పాటు శారీరక పోషణను పెంచే యోగాసనాలు, వ్యాయామాలు, క్రీడలు, ఇచ్చట నిర్వహించబడతాయి.

ఈ పాఠశాలల్లో విద్యార్థులకు ఉచిత వసతి మరియు చక్కని భోజన సౌకర్యము కల్పించబడును.

వెనుకబడిన విద్యార్థులకు దోషాభావ సంపూర్తి కార్యక్రమములు, ప్రతిభావంతులైన విద్యార్థులకు వారి ప్రతిభను పెంపొందించుకొనే కార్యక్రమములు రూపొందించబడును.

క్విజ్, రచనావ్యాసంగములు, వక్తృత్వము చిత్రకళ మొదలగు పాఠ్యేతరాంశములు విద్యార్థుల సృజనాత్మక శక్తిని పెంపొందించే కార్యక్రమములు నిర్వహించబడును.

ఆంధ్రప్రదేశ్ గురుకుల విద్యా సంస్థ (ఎ.పి.ఆర్.ఇ.ఐ. సొసైటీ)

మెదకు జిల్లాలో 1983లో లింగంపల్లి లో బాలురకు మెదకులో బాలికలకు గురుకుల పాఠశాలలు ఏర్పాటు చేయబడియున్నవి. ఆ తర్వాత 1988 లో దౌలతాబాద్ లో వెనుకబడిన తరగతుల విద్యార్థులకై (బాలుర) పాఠశాల ఏర్పాటు చేయబడినది.

లింగంపల్లి మరియు మెదకు గురుకుల పాఠశాలలో 5 నుండి 10 వ తరగతి వరకు బోధింపబడుచు ఈ మధ్యకాలమున ఇంటర్ మీడియట్ క్లాసులు కూడా నడపబడుచున్నవి. ప్రతి తరగతిలో రెండు సెక్షన్లుండి ప్రతి సెక్షన్ లో 36 నుండి విద్యార్థులుందురు.

ట్రైన్డ్ గ్రాజ్యుయెట్ టీచర్లు (టి.జి.టి)

పోస్టు గ్రాజ్యుయెట్ టీచర్లు (పి.జి.టి)

నిరంతరము విద్యార్థుల వెన్నంటి యుండి విద్యాభ్యాసంలో తోడ్పడుదురు. శారీరక విద్యకై ఒక పి.ఇ.టి. యుండుటే గాక విద్యాలయము నందు బాలుర కవసరమైన కనీస వైద్య సదుపాయమునకై ఒక స్టాఫ్ నర్సు పని చేయుచుండును.

ఈ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు డిప్యూటి డి.ఇ.వో. ర్యాంకులో నుండి ప్రిన్స్‌పాల్‌గా వ్యవహరింపబడును.

ఈ గురుకుల విద్యావ్యవస్థ ఎ.పి.ఆర్.ఇ.ఐ సొసైటీని జూచి సోషల్ వెల్ఫేర్ డిపార్టుమెంటు వారు తమ ఆధీనములో పాఠశాల లేర్పాటు చేసే ఒక సంస్థను ప్రారంభించిరి.

ఈ సంస్థ ద్వారా మెదకు జిల్లాలో 1983 లో హత్నూర మరియు నల్లవాగులలో బాలురకు. రామక్కపేట, చిట్కుల్‌లలో బాలికలకు గురుకుల పాఠశాలలు ప్రారంభింపబడినది. 1996 లో ఈ పాఠశాలలు జూనియర్ కళాశాలలో అప్‌గ్రేడ్ చేయబడినది. ఒక హత్నూర్ లో మాత్రమే ప్రత్యేకముగా జూనియర్ కాలేజి ఏర్పాటు చేయబడినది.

1998లో రామాయంపేటలో బాలికలకు, తొగుటలో బాలురకు గురుకుల పాఠశాల ప్రారంభింపబడినది. 1999 లో సింగూర్‌లో పాఠశాల ప్రారంభింపబడినది.

నారాయణ్‌ఖేడ్ లో బాలురకై మొదట ఉన్నత పాఠశాల ఏర్పడి ఆ తర్వాత అన్నింటితో పాటు జూనియర్ కాలేజీగా అప్‌గ్రేడ్ చేయబడినది.

ఈ సంవత్సరం, మెదకు జిల్లాకు కేంద్ర ప్రభుత్వం ద్వారా మూడు గిరిజన గురుకుల పాఠశాలలు మంజూరియైనవి.

కల్హేర్, కౌడిపల్లి, మెదకు మండలాలలో ఈ పాఠశాలలు 1999 డిసెంబర్ నాటికి ప్రారంభమగుచున్నవి.

కౌడిపల్లిలో ఏర్పాటు చేయు గిరిజన గురుకులంలో కేవలము బాలికలకు మాత్రమే ప్రత్యేకించబడినది.

రాష్ట్ర ప్రభుత్వము టేక్మల్, నారాయణ్ ఖేడ్, మండలాలకు ఆశ్రమ పాఠశాల ఏర్పాటుకు అనుమతినిచ్చింది.

ఈ విధముగా మెదకు జిల్లాలో విద్యావ్యాప్తికై అనేక విధాలుగా ప్రభుత్వము కృషి సల్పుచున్నదని చెప్పవచ్చును.

## అల్లూరి సీతారామరాజు గిరిజన గురుకుల పాఠశాల - నర్సాపూర్

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే ప్రప్రథమంగా జన్మభూమి కార్యక్రమంలో నిర్మించబడిన గురుకుల పాఠశాల, మెదకు జిల్లా నర్సాపూర్‌లో ప్రారంభింపబడినది.

నర్సాపూర్ పట్టణానికి కిలోమీటరు దూరంలో మెదకు రహదారిలో సువిశాలమైన ప్రదేశంలో ఎత్తైన గడ్డపై ఈ పాఠశాల ఏర్పడింది.

నర్సాపూర్ శాసన సభ్యులు శ్రీ చిలుముల విఠల్ రెడ్డిగారి అవిరళ కృషితో ఈ పాఠశాల రూపురేఖలు దిద్దుకొనినది.

తే.17-12-1997 నాటి శుభ ముహూర్తమున ముఖ్యమంత్రి జన్మభూమి స్ఫూర్తిదాత శ్రీ నారా చంద్రబాబు నాయుడుగారి కరకమలములచే శంఖుస్థాపన చేయబడి 2.5 కోట్ల రూపాయలతో చక్కని భవన సముదాయములో నిర్మింపబడుచున్నవి.

ఈ పాఠశాలల నిర్మాణము జన్మభూమి కార్యక్రమములో జరిగినందున 30% నిధులు విరాళ రూపమున అవసరము.

ఈ భవనాల నిర్మాణమునకు మొట్టమొదటగా నాటి శాసన సభ్యులు విఠల్ రెడ్డిగారి కోరిక మేరకు ప్రముఖ సినీ నిర్మాత శ్రీ డి. రామానాయుడుగారు 18 లక్షల రూపాయలు విరాళముగానొసగిరి.

పాఠశాల భవనమునకు 56 లక్షలు అంచనా వేయబడినవి అందులో 18 లక్షలు రామానాయుడిగారి విరాళము. అందుచే పాఠశాల భవనము వారి పేర నిర్మింపబడినది.

ఇంకను ఈ పాఠశాలకు అనుబంధంలో నిర్మింపబడుచున్నది. డార్మెటరీ బ్లాకు నిర్మాణముల వ్యయములో తమవంతుగా ఈ క్రింది పేర్కొనిన దాతలు విరాళములనొసంగిరి ఈ బ్లాకు నిర్మాణపు అంచనా రూ. 8.4 లక్షలు.

| | |
|---|---|
| శ్రీ పర్వతనేని కామేశ్వరరావుగారు | 60,000 |
| శ్రీ సచ్చిదానంద రెడ్డిగారు | 60,000 |
| శ్రీ ఇందర్‌రాజ్ అగర్‌వాల్‌గారు | 6,00,000 |
| శ్రీ గ్లాండ్ ఫార్మా | 60,000 |
| శ్రీ మోహన్‌లాల్ అగర్వాల్ | 1,80,000 |
| శ్రీ యం.వి.కె.యల్.యన్. రాజు | 1,80,000 |
| శ్రీ యస్.ఎ.యమ్.కె.ఆర్.జి. పిస్టన్స్ | 1,80,000 |
| శ్రీ పి.వి.రావు మోల్డ్‌టెక్ ప్లాస్టిక్స్ | 60,000 |
| మొత్తము | **13,80,000** |

అట్లే 5 లక్షలచే నిర్మింపబడుచున్న ప్రిన్స్‌పాల్ క్వార్టరుకు యం. యస్. జయంకృష్ణ అల్యూమినియమ్స్‌వారు.

ఇన్స్‌ట్రక్టర్ క్వార్టర్ల నిర్మాణము 16.96 లక్షలు అంచనులో యం. యస్. హెట్రో డ్రగ్స్ లిమిటెడ్‌వారు.

5.25 లక్షలతో నిర్మింపబడుచున్న హెల్త్‌క్లినిక్ కొరకు యం. యస్. న్యూల్యాండ్ ల్యాబ్‌వారు.

స్టాచూ నిర్మాణానికి శ్రీ రామిరెడ్డి గారు గ్రానేట్ రాళ్ళను శ్రీ యన్. వి. రత్తయ్య దివ్యశక్త గ్రానైట్‌వారు విరాళములు నొసంగిరి.

ఈ గురుకుల పాఠశాల మెదకు జిల్లాలోనే ఒక గొప్పనైన పాఠశాలగా పేర్కొనబడుచున్నది.

ఈ గురుకుల పాఠశాల యందు 5వ తరగతి నుండి 10వ తరగతి వరుకు విద్యాబోధన జరుగును.

ప్రతి తరగతిలో 2 సెక్షన్లుండును. సెక్షనుకు 30 మంది చొప్పున మొత్తము పాఠశాలలో 300 మంది విద్యాభ్యాస మొనరింతురు.

గత సంవత్సరము 5,6,7 తరగతులు మాత్రము ప్రారంభమైనవి. 8వ తరగతి కూడా ఈ సంవత్సరమే ప్రారంభమగుచున్నది.

ఈ పాఠశాల ముున్ముందు ఇదో్ధిక అభివృద్ధినంది జూనియర్ కళాశాల, కళాశాల స్థాయికి ఎదుగుటకు సంపూర్ణ వసతులు కలవని చెప్పవచ్చును.

# నవోదయ పాఠశాల - వర్గల్

భారతీయ కేంద్ర ప్రభుత్వము గ్రామీణ ప్రాంతాలలో విద్యాభివృద్ధి గావించుటకై ఏర్పరచిన ప్రత్యేకమైన ఆవాస విద్యాలయమే నవోదయ పాఠశాల.

మెదకు జిల్లాలో వర్గల్ మండల కేంద్రమునకు సమీపమున నవోదయ పాఠశాల 1986-1987 విద్యా సంవత్సరమున ఏర్పాటు గావింపబడినది. ఈపాఠశాల రాజీవ్ రహదారికి సుమారు మూడు కిలో మీటర్ల దూరమున వర్గల్ చేరువలో నిర్మించబడినది.

42 ఎకరముగల విశాలమైన మైదానములో చక్కని భవన సముదాయముతో ఈ నవోదయ పాఠశాల ఏర్పాటైనది.

ఈ పాఠశాల యందు ఆరవ(6) తరగతి నుండి 12వ తరగతి వరకు సెంట్రల్ సిలబస్‌తో బోధింపబడును. ఈ పాఠశాల యందు విద్యార్థినీ విద్యార్థులకు ప్రత్యేక వసతి సౌకర్యములు కల్పింపబడినవి.

బాలబాలికలకు సంగీతం నేర్పించుటకు, క్రీడలలో శిక్షణ నిచ్చుటకు, ప్రత్యేక ఉపాధ్యాయులు కలరు. అత్యవసర పరిస్థితులలో వైద్య చికిత్సల నందించేందుకు విద్యాలయ ఆవరణంలో 'క్లినిక్' ఏర్పాటు చేయబడినది. వివిధ రకాల పుస్తకాలతో కూడిన గ్రంధాలయము ఇచ్చట కలదు. కంప్యూటర్ విద్యను కూడా విద్యార్థుల అందుబాటులోనికి తెచ్చి ప్రవేశము కల్పించుటకు ప్రయత్నము చేయబడు చున్నది.

# వృత్తి విద్య

విద్యతో పాటు వివిధ వృత్తులను నేర్పి భావి జీవనంలో కేవలము ఉద్యోగములకొరకు మాత్రమే చదువు అన్నట్లుగాక విజ్ఞానికే విద్య అనియు, వృత్తితో జీవనోపాధియని తెల్పుటకై మెదకు జిల్లాలో 15 ఉన్నత పాఠశాలలో వృత్తి విద్యా కోర్సులు ప్రవేశపెట్టబడినది.

కోర్సులు :

1. హౌస్ వైరింగ్ మరియు డొమెస్టిక్ ఎలక్ట్రికల్ ఎప్లియన్స్

2. నిట్టింగ్, గార్మెంటు మేకింగ్, ఎంబ్రాయడరీ డార్నింగ్, లాండ్రి మరియు డ్రై క్లీనింగ్

3. ఫ్లాపు మిషనరీ రిపేర్స్, సర్వీసింగ్ మరియు జనరల్ మెకానిజం.

4. రేడియో ట్రాన్సిస్టర్, టి.వి. రిపేరింగ్, సర్వీసింగ్.

5. హార్టికల్చర్ మరియు హార్టికల్చర్.

పై కోర్సులు నిర్వహించుటకు గాను 15 ఉన్నత పాఠశాలలో 39 పార్ట్‌టైం బోధకులు పని చేయుచున్నారు. మరియు పై కోర్సులలో ప్రాక్టికల్స్ బోధించుటకు సంబంధిత ముడిపదార్థములు కొనుగోలు జరిపి సరఫరా చేయబడుచున్నది.

## పారిశ్రామిక శిక్షణ సంస్థలు – ఐ.టి.ఐ

ప్రభుత్వ పారిశ్రామిక శిక్షణా సంస్థ సంగారెడ్డిలో కలదు. ఈ సంస్థలో వివిధ రకములైన ట్రేడ్‌లు బోధింపబడుచున్నవి.

హత్నూరులో యస్.సి, యస్.టి బాలురకై ఆవాస పారిశ్రామిక శిక్షణా(రెసిడెన్షియల్ ఐ.టి.ఐ) సువిశాల భవనాలతో సమస్త సదుపాయములతో ప్రయోగశాలతో, హాస్టలు భవన సముదాయముతో నిర్వహింపబడుచున్నది.

## సామాజిక సాంకేతిక పథకం

గ్రామీణ ప్రాంత నిరుద్యోగ యువతకు ఉపాధి అవకాశాల కోసం చూస్తున్న మహిళలకు భారత ప్రభుత్వ మానవ వనరుల శాఖ నిర్వహిస్తున్న ఈ పథకం ఉచిత శిక్షణకు, స్వయం ఉపాధికి మార్గము చూపుచున్నది.

మెదకు బాలికల పాలిటెక్నిక్ కళాశాల ఆధ్వర్యంలో ఈ పథకం విజయవంతంగా నడుపబడుచున్నది. ఈ పథక నిర్వహణకు కేంద్ర ప్రభుత్వము 14 లక్షల రూపాయలు మంజూరి చేసినది. ఈ పథకము 1994 లో ప్రారంభించి 1998 నాటికి 860 మందికి శిక్షణ ఈయబడినది.

ఈ పథకమును గ్రామాలలోనే నిర్వహిస్తారు. సాంకేతిక పరమైన శిక్షణతో పాటు వివిధ చేతి వృత్తుల పనులలో శిక్షణ ఈయుడం వలన గ్రామీణ ప్రాంతాలలోని స్త్రీ, పురుషులలో ఆర్థిక, సామాజిక స్థాయి పెంపొందించుటకు దోహద పడుచున్నది.

ఈ శిక్షణకు ఎంపికయ్యే వారు ఎలాంటి ఫీజు చెల్లించ వలసిన పని లేదు. శిక్షణాకాలంలో అభ్యర్థులకు ఎలాంటి స్టైఫండు కూడా ఈయబడదు.

## పాలిటెక్నిక్ కాలేజీలు

సాంకేతిక విద్యారంగమున మెదకు జిల్లా కొంత వరకు అభివృద్ధి పథములోనే యున్నదని చెప్పవచ్చును.

జహీరాబాదులో ప్రభుత్వ పాలిటెక్నిక్ కాలేజి కలదు. ఈ సంస్థలో వివిధ రకములైన ట్రేడ్లు బోధింపబడుచున్నవి.

మెదకులో బాలికలకై ప్రత్యేకముగా ప్రభుత్వ పాలిటెక్నిక్ కాలేజి కలదు. ఈ సంస్థలో చదువు విద్యార్థినులకై ప్రత్యేక హాస్టళ్ల సౌకర్యము కూడా కలదు.

గజ్వేల్‌లో యస్. సి. విద్యార్థులకై ప్రత్యేకముగా ప్రభుత్వ పాలిటెక్నిక్ కాలేజి ఏర్పాటు చేయబడినది. ఈ సంస్థలో చదువు విద్యార్థులకు కూడా హాస్టళ్ల సదుపాయము కలదు.

## సాంకేతిక కళాశాలలు

మెదకు జిల్లాలో రెండు ఇంజనీరింగ్ కాలేజీలు కలవు. ప్రజ్ఞాపూర్ పరిసరాలలో రాజీవ్ రహదారిపై మైనారిటీ సంస్థ పక్షాన సయ్యద్ హాషీం సైన్స్ అండ్ టెక్నాలజి పేరుతో ఇంజనీరింగ్ కాలేజి నిర్వహింప బడుచున్నది.

నర్సాపూర్‌కు మూడు కిలో మీటర్ల దూరంలో సంగారెడ్డి సంగారెడ్డి రహదారిపై బి.వి.రాజు ఇన్స్‌ట్యూట్ ఆఫ్ టెక్నాలజి పేరుతో ఇంజనీరింగ్ కాలేజి ప్రైవేటు యాజమాన్యమున నడపబడు చున్నది.

## ప్రభుత్వ జూనియర్ కళాశాలలు

మెదకు జిల్లాలో 1999 విద్యాసంవత్సరము నాటికి 23 ప్రభుత్వ జూనియర్ కళాశాలలు పని చేయుచున్నవి. మండల వ్యవస్థ ఏర్పడినవాడు ప్రతి మండలమున జూనియర్ కాలేజి కనీస అవసరముగా పేర్కొనబడినను ఆ లక్ష్యము నెరవేర లేదు.

ప్రభుత్వ జూనియర్ కళాశాలలే కాక ప్రైవేటు యాజమాన్యమున కూడా జూనియర్ కళాశాలలు ఈ జిల్లాలో నడుపబడుచున్నవి. పూర్వపు తాలుకా కేంద్రములన్నింటిలోను, సిద్ధిపేట, మెదకు, సంగారెడ్డిలలో రెంటి కన్న ఎక్కువగాను ప్రైవేటు జూనియర్ కాలేజీలు కలవు.

ఇప్పటికి కూడా మెదకు జిల్లాలో తగినన్ని ప్రభుత్వ జూనియర్ కళాశాలలు లేవని చెప్పవచ్చును. ఎందరో విద్యార్థులు 10వ తరగతి వరకు చదివి ఇంటర్ చదువుటకు వసతులు లేక మానివేసిన వారనేకులు ఈ జిల్లాలో ఉన్నారు.

## ప్రభుత్వ డిగ్రి కళాశాలలు

మెదకు జిల్లాలో సిద్ధిపేట - మెదకు - జోగిపేట - సంగారెడ్డి - సదాశివపేట, జహీరాబాదు, గజ్వేల్ లో డిగ్రి కళాశాలలు కలవు.

మెదకు జిల్లాలో మొట్టమొదటి డిగ్రి కళాశాల సిద్ధిపేటలో స్థాపించబడినది. శ్రీ రాజేశ్వరరావుగారి అనన్యసామాన్యమైన కృషితో 1956 విద్యా సంవత్సరమున సిద్ధిపేటలో డిగ్రి కళాశాల ప్రారంభించబడినది.

30 ఎకరాల సువిశాలమైన ప్రదేశములో దూరంలో పెద్ద భవనము నిర్మించబడినది.

ఈ కళాశాలలో ఆర్ట్స్, కామర్స్, సైన్సు సబ్జెక్టులు బోధించబడును. నూతనముగా ప్రవేశ పెట్టబడిన డైరీ, ఫిషరీ, ఎలక్ట్రానిక్స్ మొదలగు కోర్సులు ఈ కళాశాలలో బోధింపబడుచున్నవి.

ఈ డిగ్రి కళాశాలలో చదివిన విద్యార్థులెందరో ఉన్నత పదవులలోనున్నారు.

ఈ కళాశాలలో పోస్టుగ్రాడ్యుయేషన్ కోర్సులు కూడా ప్రవేశ పెట్టబడినవి.

మెదకు జిల్లాలో సిద్ధిపేట తర్వాత ఏర్పడిన రెండవ డిగ్రి కళాశాల జోగిపేటలో నెహ్రూ మెమోరియల్ డిగ్రి కాలేజి పేరున గలదు.

ఎత్తైన ప్రదేశమున విశాలమైన భవనమున ఈ కళాశాల కలదు. సమస్త వసతులతో, ప్రయోగ శాలలతో ఈ కళాశాల విద్యార్థులకు చక్కని విద్యనందించు చున్నది.

మెదకులో ప్రభుత్వ డిగ్రి కళాశాల సంగారెడ్డిలో బాలికలకు ప్రత్యేకముగా ఒకటి మరియు కో-ఎడ్యుకేషన్ తారా డిగ్రి కాలేజి ఒకటి కలదు. సదాశివపేటలో గజ్వెల్ జహీరాబాద్‌లో ప్రభుత్వ డిగ్రి కళాశాలలు కలవు.

ఇవిగాక తూప్రాన్‌లో సిద్దిపేటలో ప్రైవేటు యాజమాన్యమున డిగ్రీ కాలేజీలు నడపబడుచున్నవి.

ఉన్నత విద్యనభ్యసించుటకు తపాల నుండి ప్రతి నిత్యము కళాశాలలకు హాజరు కాలేని విద్యార్థుల కొరకై సంగారెడ్డి, మెదకు సిద్దిపేట, జహిరాబాద్, నర్సాపూర్‌లలో అంబేడ్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం హైద్రాబాద్ వారి అధ్యయన కేంద్రములు కలవు.

## పోస్టు గ్రాడ్యుయేషన్ సెంటర్ – మిర్జాపూర్

మెదకు జిల్లా విద్యారంగంలో అభివృద్ధి పథాన ఆడుగిడుచున్నదని చెప్పుటకు ఇక్కడ నెలకొల్ప బడుతున్న ఉన్నత విద్యా కేంద్రాలే సాక్షాలు. భాగ్యనగరానికి అతి సమీపాన నుండుటచే చదువు పై యుత్సాహమున్నవారు హైద్రాబాదులోనే చదువు కునేవారు. మొదట మెదకు జిల్లాలో సిద్దిపేటలో డిగ్రీ కాలేజి ప్రారంభించునంత వరకు ఇక్కడ ఉన్నత విద్యాల యాలే లేవు అని చెప్పవచ్చు.

తర్వాత తర్వాత డిగ్రి కాలేజీలు, పోస్టుగ్రాడ్యుయేషన్ సెంటర్‌లు ఏర్పడినవి ఇప్పటికి మెదకు జిల్లాలో పోస్టు గ్రాడ్యుయేషన్ కోర్సులు సిద్దిపేట, మిర్జాపూర్‌లో మాత్రమే కలదు.

మెదకు జిల్లా పారిశ్రామికముగా అభివృద్ధి నందుచున్నది. పంచదార పరిశ్రమలు మొదలుకొని ఫార్మాస్యూటికల్ పరిశ్రమల వరకు యిక్కడ నెలకొల్పబడినవి. ఈనాడు జిల్లాలో ఎలక్ట్రానిక్స్, ఎలక్ట్రికల్, స్టీల్, సిమెంటు, డ్రగ్స్, ఐస్, వంటి కర్మాగారాలెన్నో విస్తృతంగా అభివృద్ధి చెందినవి.

ఈ విధముగా పరిశ్రమలు అభివృద్ధి నొందుచున్నప్పటికి ఆయా పరిశ్రమలకు సంబంధించిన కోర్సులు, విద్యాబోధనా పరిశోధనలు యిచ్చుట లేవు. అందుచే తత్సంబంధీకులను యితర చోట్ల నుండి పిలుపించుకొన వలసిన అవసరమేర్పడు చున్నది. మెదకు జిల్లా పారిశ్రామిక వేత్తలు జాతీయ, అంతర్జాతీయ మార్కెట్‌లో పోటీని తట్టుకోవడం కొరకు ఇతర దేశాల సాంకేతిక పరిజ్ఞానాన్ని తీసికొని వస్తూత్పత్తికొన సాగించ వలసి వచ్చుచున్నది. ఈ పరిస్థితిని అధిగమించుటకు విద్యార్థులకు కొత్త కోర్సులనందించుటకు ఉస్మానియా విశ్వ విద్యాలయము వారు పూనుకొనినారు.

ఈ నేపథ్యంలోనే విశ్వవిద్యాలయము హయ్యర్ ఎడ్యుకేషన్ టు రూరల్ ఏరియాస్ (గ్రామీణ ప్రాంతాలకు ఉన్నత విద్య) అనే నినాదంలో పోస్టు గ్రాడ్యుయేషన్ సెంటర్లను గ్రామీణ ప్రాంతాలలో నెలకొల్పుచున్నారు.

అందులో భాగంగానే మొట్టమొదటి సారిగా మెదకు జిల్లాపై దృష్టి కేంద్రీకరించి యం.యస్.సి. కెమిస్ట్రీ కోర్సులో షుగర్ టెక్నాలజీ మెడిసినల్ కెమిస్ట్రీ గ్రాడ్యుయేషన్ సెంటర్‌లో ప్రారంభించారు. కేవలం షుగర్ టెక్నాలజి పేరుతో ఎం.యస్సి కెమిస్ట్రీ (షుగర్ టెక్నాలజి) గా మార్చమని విద్యార్థులు కోరగా 1989 లో అట్లు మార్పుగావించ బడినది.

ఈ కోర్సును మిర్జాపూర్‌లో ప్రవేశపెట్టడానికి ప్రధాన కారణము ఇక్కడ అందుకు సంబంధించిన అనువైన పరిస్థితులు కలవు. ప్రాక్టికల్ నాలెడ్జి ఇచ్చుట యన్.యస్.యఫ్ అందించుచున్నది అంతేగాక ఈ పి.జి. సెంటర్ లో 15 ఎకరాలలో చెరుకు పంట పండింపబడుచున్నది.

ఇలాంటి వసతులున్న పి.జి. సెంటర్ దేశంలోనే మొట్టమొదటిదైన కాన్పూర్ షుగర్ టెక్నాలజి ఇన్స్టిట్యూట్ కాగా రెండవదిగా మిర్జాపూర్‌ను చెప్పవచ్చు.

మెదకు జిల్లాలో విస్తృతంగా ఫార్మాస్యుటికల్ పరిశ్రమలు అభివృద్ధి చెందుచున్నవి. ఈ రంగంలో ప్రవేశమున్న అభ్యర్థుల కొరత అధికంగా కలదు. అందుకై మిర్జాపూర్ పి.జి. సెంటర్‌లో 1993-94 నుండి మెడిసిన్ కెమిస్ట్రీ అనే కొత్త కోర్సు ప్రారంభించబడినది. అంతేగాక 1994-95 నుండి బి.ఫార్మసి కూడా ప్రారంభించబడినది.

## వేద సంస్కృత పాఠశాలలు

ప్రాచీన కాలంలో విద్యను నేర్చుకొనుటకు గురువుల వద్దకు విద్యార్థులు వెళ్లేవారు.

గురువులు తమయిండ్లలో శిష్యులను ఉంచుకొని ఉచిత భోజనములనిచ్చుచు వేద విద్యను, సంస్కృతాన్ని నేర్పించేవారు. ఒక్కొక్క గురువు వద్ద పది మంది వరకు విద్యార్థులు చదువు కొనేవారు.

అటువంటి పాఠశాలలో మెదకు జిల్లాలో స్వాతంత్ర పూర్వము చెప్పుకొన దగినది. తొగుట గ్రామంలోని వేద సంస్కృత పాఠశాల ఈ పాఠశాలలో వేదము, సంస్కృతము, నేర్పేవారు. అంతేగాక పౌరోహిత సంబంధమైన షోడషకర్మలను నేర్పబడుచుండెను.

మెదకు జిల్లాలో చెప్పుకొన దగిన వేద పాఠశాల శంకరా ద్వైత వైదిక పాఠశాల శివంపేట, శ్రీ శాస్త్రుల విశ్వనాధ శర్మ గారి అనన్యమైన కృషితో ఈ పాఠశాల ఏర్పాటు గావించబడినది. శ్రీ విశ్వనాధ శాస్త్రి గారు ఈ పాఠశాలను స్థాపించి స్వయముగా వ్యయప్రయాసలకోర్చి ఆతర్వాత కేంద్ర ప్రభుత్వముచే గుర్తింపునంది

సంవత్సరమునకు ముప్పదియైదు వేల రూపాయల గ్రాంటును మంజూరి చేయించినారు. ఈ పాఠశాలలో యజుర్వేదము సాంగముగా నేర్చుకొనిన విద్యార్థులు మెదకు, కరీంనగర్, నిజామాబాద్, వరంగల్లులో ఎందరో కలరు. వేద విద్యతో పాటు సంస్కృతమును కూడా నేర్పి ఉస్మానియా విశ్వ విద్యాలయము వారి సంస్కృత డి.వొ.యల్.బి.ఓ.యల్, పరీక్షల నిప్పించుచుండిరి అంతేగాక ఈ సంస్థకు అనుబంధముగా ప్రాచ్య కళాశాలను ఏర్పాటు చేయుటకు శ్రీ శాస్త్రి గారు ఎంతో ప్రయత్నము సల్పి కొంతకాలము ప్రాచ్యకళాశాల నడిపించిరి.

నాచారం దేవాలయంలో శంకర మఠము వారి నిర్వహణలో వేద, సంస్కృత పాఠశాల నిర్వాహింపబడుచున్నది. ఈ పాఠశాలలో చదువు విద్యార్థులకు ఉచిత భోజన వసతి సౌకర్యములతో విద్య గరపబడుచున్నది.

సిద్దిపేటలో కోటిలింగాల గుడిలో యతివర శ్రీ మదనానంద స్వామి వారి శుభాశీస్సులతో వేద పాఠశాల నడపబడుచున్నది. ఈ పాఠశాల లో చదువు విద్యార్థులకు కూడా ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పింపబడుచున్నది.

వర్గల్ సరస్వతి క్షేత్రమున మరియు జగదేవ్‌పూర్ గ్రామమున వేద సంస్కృత పాఠశాలలు, విద్యార్థులకు ఉచిత భోజన వసతులతో నడపబడుచున్నవి.

ఈ విధముగా మెదకులో ఆర్షవిద్యను కాపాడుటకు ప్రముఖ వ్యక్తులు, సంస్థలు ఇతోధిక కృషి సల్పుచున్నవి.

## అరబ్బీ పాఠశాలలు

నవాబుల కాలంలో జిన్నారం మండలంలోని శివానగర్ గ్రామంలో 1944 ప్రాంతంలో ముస్లిం పెద్దల కృషి ఫలితంగా జామియా అరేబియా పాఠశాల ఏర్పాటైనది.

ఈ పాఠశాలలో అరబ్బీ, ఉర్దూ, ఫారసీ, ఇంగ్లీషు భాషలు నేర్పబడును. ఇచ్చట బాల బాలికలకు ప్రత్యేక తరగతులు నిర్వహింపబడుచున్నవి.

ఈ పాఠశాలలో వరంగల్, మహబూబ్‌నగర్, హైద్రాబాద్, మెదకు విద్యార్థులే కాక బీదర్, హుమ్నాబాద్ మొదలైన ప్రాంతాల నుండి కూడా విద్యార్థులు విద్యార్జనకై వత్తురు. ఎనిమిదేళ్ల నుండి విద్యాభ్యాసం జరుపబడును.

ఈ పాఠశాల మహమ్మదీయుల చందాలతో నడపబడుచున్నది.

# పచ్చశాల

మెదకు జిల్లాలో వెలసిన ఒక ప్రత్యేక పాఠశాలె పచ్చశాల. డక్కన్ డెవలప్‌మెంట్ సంస్థ ఆధ్వర్యంలో ఝురాసంగం మండల మాచ్నూర్ గ్రామ శివార్లలో ఈ పాఠశాల నెలకొల్పబడింది.

ఆర్థిక స్థోమత లేక చదువుకోలేని విద్యార్థులకు చదువు మధ్యలో మానిన విద్యార్థులకు పచ్చశాల ఒక ఆశాజ్యోతి.

1993 జనవరిలో ఈ పచ్చశాల ప్రారంభింప బడినది. ప్రకృతిలీనమైన ప్రకృతి మాతనారాధిస్తూ చదువుతోపాటు చేతివృత్తులలో శిక్షణనూ ఇచ్చే సంస్థ ఈ పచ్చశాల.

ఈ పచ్చశాల గదులు గువ్వమ్మటాలనం పోలివుండి వుంచుప్రాంతాలలోని ఇగ్లూ ఇండ్ల మాదిరిగా ఉంటాయి. పాఠశాల గదులకు చిలుక, పిచ్చుక, నెమిలి పావురం, పాలపిట్ట, కోకిల, గోరింక పేర్లున్నాయి.

తొమ్మిది సంవత్సరాల నుంచి పదునాలుగు సంవత్సరాలున్న నిమ్న కులాలలకు చెందిన, ముఖ్యంగా బడిమానేసిన విద్యార్థులకు ఇక్కడ ప్రత్యేక తరహాలో విద్యబోధింపబడుతుంది. విద్యతో పాటు చేతివృత్తులైన వడ్రంగం-కుట్టు-బుక్‌బైండింగ్, కమ్మరి, కుమ్మరి, ఇటుకల తయారీ, మేస్త్రీపని, ఫార్మకల్చర్, ఆయుర్వేద మందుల తయారీ తదితరములలో శిక్షణ ఇస్తారు.

ప్రతి రోజు పాఠశాల ప్రారంభం కన్న ముందు అసెంబ్లి కార్యక్రమం జరుగుతుంది అరగంట పాటు జరిగే ఈ కార్యక్రమంలో నిన్నటి రోజున విద్యార్థులు నేర్చిన కార్యక్రమం పై చర్చ జరుగుతుంది. ఆ తర్వాత మధాహ్నం మూడుగంటల వరకు విద్యా బోధన, ఐదింటి వరకు వివిధ వృత్తుల శిక్షణ నిర్వహించ బడుతుంది. అన్నీ పాఠశాలల లో వలె ఇచ్చట వేసవి సెలవులుండవు. వ్యవాసాయ పనులు అధికంగా ఉండే సమయంలో, (నాటు కోత మొదలైన సమయాల్లో) కుటుంబాలకు సహకరించేందుకు, ఆయా పనుల్లో శిక్షణ పొందేందుకు సెలవులనిస్తారు.

ఈ పచ్చశాలలో విద్యార్థులకుపయుక్తంగా ఒక గ్రంథాలయము, ఒక టి.వి. (వీడియో) ఏర్పాటు చేయబడినవి.

సందర్శకులు చూసేందుకు వీలుగా ఇక్కడి విద్యార్థులు తయారు చేసిన వస్తువులు ప్రదర్శనగా నుంచినారు.

ఈ పాఠశాలకు మాచ్నూర్‌కు చుట్టు పక్కలున్న కుప్పానగర్, బర్దీపూర్, కిష్టాపూర్, గ్రామాల నుండి 150 మంద విద్యార్థులు విద్యాభ్యాసం చేస్తున్నారు.

**టీచర్ల నియామకాలు** :- ప్రభుత్వము విద్యకు అధిక ప్రాధాన్యత ఇస్తున్నందుకు నిదర్శనంగా జిల్లాలో జిల్లా కమిటీల ద్వారా టీచరు పోస్టుల భర్తీ చేపట్టి మొత్తం 2662 టీచర్ల నియామకం చేపట్టుట జరిగినది.

| | |
|---|---|
| 1994-95 | 674 |
| 1995-96 | 99+614 |
| 1997-98 | 51 టి.ఎమ్. +20 ఉర్దూ మీడియం |
| 1998-99 | 955 |
| 1999- 2000 | |
| మొత్తము | |

**ప్రాథమిక పాఠశాలలు – విద్యార్థులు 1997- 98**

| | బాలలు | బాలికలు | కో-ఎడ్యుకేషన్ | మొత్తము |
|---|---|---|---|---|
| స్టేట్ గవర్నమెంట్ | 1 | 2 | 34 | **37** |
| మం.ప్ర.ప | 9 | 26 | 1306 | **1341** |
| ప్రి అన్ఎయిడెడ్ | 0 | 1 | 8 | **9** |
| బి.సి | 61509 | 51263 | | **112322** |
| ఎస్.సి | 21478 | 19795 | | **43973** |
| ఎస్.టి | 8868 | 4454 | | **13322** |

**ప్రాథమికోన్నత పాఠశాలలు**

| | బాలలు | బాలికలు | కో-ఎడ్యుకేషన్ | మొత్తము |
|---|---|---|---|---|
| ప్రభుత్వ | -- | 1 | 8 | **9** |
| యం.పి.పి | 4 | 2 | 216 | **222** |
| ప్రి ఎయిడెడ్ | - | - | 2 | **2** |
| ప్రి అన్ఎయిడెడ్ | - | - | 50 | **50** |
| **విద్యార్థులు** | | | | |
| బి.సి | 26883 | 19451 | | **46334** |
| ఎస్.సి | 8462 | 6049 | | **14511** |
| ఎస్.టి | 1723 | 702 | | **2425** |

## ఉన్నత పాఠశాలలు

| ప్రభుత్వ స్కూలు. | బాలలు | బాలికలు | కో-ఎడ్యుకేషన్ | మొత్తము |
|---|---|---|---|---|
| ప్రభుత్వ | 4 | 1 | 14 | 19 |
| జిల్లా పరిషత్ | 3 | 13 | 222 | 238 |
| ప్రీ ఎయిడెడ్ | - | 1 | 5 | 6 |
| ప్రీ అన్ఎయిడెడ్ | - | - | 25 | 25 |
| ఎ.పి.ఆర్.ఇ.ఐ.ఎస్ | 2 | 1 | 0 | 3 |
| ఎ.పి.ఆర్.డబ్ల్యు.ఆర్.ఇ.ఐ.ఎస్. | 3 | 3 | - | 6 |
| మొత్తము | 12 | 19 | 266 | 291 |

## హైయ్యర్ సెకండరి స్కూల్స్

| | | బాలలు | బాలికలు | మొత్తము |
|---|---|---|---|---|
| 1. | కేంద్ర విద్యాలయము | 609 | 537 | 1146 |
| 2. | బి.డి.ఎల్. పబ్లిక్ స్కూల్, భానూర్ | | | |
| 3. | భారతీయ విద్యా భవన్, ఆర్.సి.పురమ్, బి.హెచ్.ఇ.ఎల్. | 2293 | 1766 | 4059 |
| 4. | హైయ్యర్సెంకడరి స్కూల్, ఆర్.సి.పురమ్, బి.హెచ్.ఇ.ఎల్. | | | |
| 5. | జవహర్ విద్యాలయ | | | |
| | వర్గల్ | 293 | 134 | 427 |
| | బి.సి | 208 | 102 | 310 |
| | ఎస్.సి | 175 | 105 | 280 |
| | ఎస్.టి | 64 | 30 | 94 |

## జిల్లాలోని మొత్తం విద్యార్థులు

| | బాలురు | | బాలికలు | | మొత్తం |
|---|---|---|---|---|---|
| బి.సి | 39831 | + | 23358 | = | **63189** |
| ఎస్.సి | 11534 | + | 6388 | = | **17922** |
| ఎస్.టి | 2567 | + | 638 | = | **3205** |
| ఎ.పి.ఆర్.ఇ.ఐ.ఎస్ | 747 | + | 277 | = | **1024** |
| ఎ.పి.ఎస్.డబ్ల్యు.ఆర్.ఇ.ఐ.ఎస్. | 1163 | + | 987 | = | **2150** |
| ఇతరులు | 14326 | + | 14329 | = | **28655** |
| మొత్తం విద్యార్థులు | **70168** | + | **45977** | = | **116145** |

## జిల్లాలో 10వ తరగతి ఫలితాలు

| **1997-98 మార్చి** | హాజరైనవారు | పాస్ | |
|---|---|---|---|
| బాలలు | 10017 | 40402 | 40.35% |
| బాలికలు | 5403 | 2413 | 44.64% |
| మొత్తము | **15420** | **6455** | **41.86%** |
| **1998 సెప్టెంబర్** | | | |
| బాలలు | 10214 | 5391 | 52.78% |
| బాలికలు | 5029 | 2867 | 52.81% |
| మొత్తము | **15643** | **8258** | **52.79%** |

## జిల్లా విద్యాశాఖపై ప్రభుత్వ వ్యయము

| వరుస సంఖ్య | పథకము పేరు | 1995-96 | 1996-97 | 1997-98 | 1998-99 (రూ. లలో) |
|---|---|---|---|---|---|
| 1. | ప్రభుత్వ ఉన్నత పాఠశాలలకు ఫర్నిచర్ | - | - | 1.60 | 3.00 |
| 2. | ప్రభుత్వ ఉన్నత పాఠశాలలకు లైబ్రరీ | - | ప్రభుత్వ 0.04 | 7.92 | - |
| 3. | పాఠశాలలకు పాఠ్యపుస్తకాల పంపిణీ | 3.00 | 3.00 | 3.05 | 3.05 |
| 4. | 1998 పాఠశాలల విద్యాచట్టం ప్రకారం | - | 3.00 | 3.05 | 3.05 |
| 5. | ఒ.బి.సి. పథకము క్రింద లైబ్రరీ(పిఎస్ & యూపిఎస్) పుస్తకముల కొనుగోలు | | - | - | 31.54 |
| 6. | అనియత విద్య | - | - | - | 79.99 |
| 7. | ఒకేషనల్ ఎడ్యుకేషన్ | - | - | 4.43 | 4.55 |
| 8. | దృశ్యశ్రవణ విద్య | - | - | 47.87 | - |
| 9. | తక్కువ మహిళా అక్షరాస్యత గల ప్రాంతములలోని ప్రాధమిక పాఠశాలలకు ప్రధానోపాధ్యాయ పోస్టుల మంజూరు చేయుట | - | - | ఎల్.బి-414<br>ప్రభుత్వ-12<br>మొ. పోస్టులు -426 | - |
| 10. | వెనుకబడిన ప్రాంతములలో 237 నూతన ప్రాథమిక పాఠశాలలు ప్రారంభించుట | - | - | 31 పాఠశాలలు | - |
| 11. | ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక | - | - | - | - |
| 12. | మధ్యాహ్న భోజన పథకం | - | - | - | - |
| 13. | పదవ ఆర్థిక కమీషన్ | - | 44.10 | 37.00 | - |
| | **మొత్తం** | **3.00** | **47.54** | **104.49** | **110.39** |
| | **మొత్తం** రూ. 3, 64, 99, 379 | | | | |

# మెదకు జిల్లా గ్రంధాలయ సంస్థ

పరోక్షంగా ఆంగ్లేయుల, ప్రత్యక్షంగా నైజాంల పరిపాలనలో అంతర్భాగంగా ఉండిన తెలుగు ప్రజలు. పాలకుల సంప్రదాయాలకు, నియమనిబంధనలకు తలఒగ్గి నిలబడాల్సిన అగత్యం ఏర్పడడం, అదే విధంగా మూఢాచారాలు, అశాస్త్రీయ విషయాలతో కర్తవ్యవిమూఢులై ఉన్న తరుణాన ప్రజలను జాగృతమొనర్చి, చైతన్యవంతులను చేయడానికీగాను గ్రంథాలే ఉత్తమ మార్గాలని ఎంచి, ప్రజలను పుస్తకాలు చదివించేట్లు చేసేందుకు, గ్రంథాలను ప్రజలకు అందుబాటులోకి తెచ్చేందుకుగాను గ్రంథాల యోద్యమము ప్రారంభమైంది.

తెలుగువారిలో ఉప్పొంగిన స్వాతంత్ర్య కెరటాలు 'ఆంధ్ర మహాసభగా' అవతరించి మెదకు జిల్లాలో ప్రప్రధమంగా ఉత్సవాలను జరుపుకునాన్న తరుణంలో గ్రంధాలయోద్యమ వ్యాప్తికి విశేషమైన కృషి జరిగింది.

మెదకు జిల్లాలో 1922 లోనే జోగిపేటలో జోగినాదాంధ్ర గ్రంధాలయం అక్కడి స్వాతంత్ర్య పిపాసగల యువకులు, వ్యాపారులు చొరవ తీసుకొని ఏర్పాటు చేసినారు. 1923 లో సంగారెడ్డిలో ఆనంద గ్రంథాలయం స్థాపించబడినది. 1924లో సిద్ధిపేటలో ఉమామహేశ్వర ఆంధ్రభాషా నిలయం ప్రారంభించ బడినది. 1935లో ెంకట రాజేశ్వర జోషి కార్యదర్శిగా శ్రీ రామచంద్ర సంస్కృతాంధ్ర గ్రంధాలయం స్థాపించబడినది. చౌటకూరులో లక్ష్మీనరసింహ గ్రంధాలయం పెద్దశంకరంపేట, మార్కండేయ గ్రంధాలయం, డాకురులో సచ్చిదానంద గ్రంధాలయం, రామంచలో జైహింద్ గ్రంధాలయం, సదాశివపేటలో ఆంధ్ర విజ్ఞాన గ్రంధాలయం స్థాపించ బడ్డాయి. వెల్దుర్తి మాణ్యకరావు గారు మెదకు జిల్లా నివాసి, వీరు అణా గ్రంథమాలను హైద్రాబాదులో స్థాపించి 40 పుస్తకాలు ముద్రించి, అణాకొకటి చొప్పున అందించినారు.

1957 లో హైద్రాబాద్ పబ్లిక్ లైబ్రరీ యాక్టు అమలు లోకివచ్చినది.

మెదకు జిల్లాలో 1958లో జిల్లా కేంద్రమైన సంగారెడ్డిలో జిల్లా కేంద్ర గ్రంధాలయమును స్థాపించబడినది.

తే. 25-2-1959న సిద్దిపేటలో తే. 16-3-59న జోగిపేటలో 31-5-1959న మెదకు లో తే. 25-12-1962న గజ్వేల్‌లో శాఖా గ్రంధాలయాలు స్థాపించబడినవి.

1975-76 నాటికి 16 శాఖా గ్రంధాలయముల ఒక బుక్ డిపాజిట్ సెంటర్‌ను తెరిచి ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ లైబ్రరీల 1961లో సంవత్సరపు నియమావాల నాధారముగా 11 గ్రామీణ గ్రంధాలయాలు ప్రారంభింపబడినవి.

జిల్లాలోని మారు మూల గ్రామాలలో సైతం గ్రంధాలయాల స్థాపన జరిగినది.

మెదకు జిల్లాలో నేడు 46 శాఖా గ్రంథాలయములు పని చేయుచున్నవి. 6 గ్రామీణ లైబ్రరీలు ఒక పుస్తక సమీకృత కేంద్రములు గలవు.

ఇవికాక ప్రైవేటు గ్రంథాలయాలు, పంచాయతి గ్రంధాలయం కూడా జిల్లాలో పని చేయుచున్నవి.

మెదకు జిల్లాలోని మొత్తము గ్రంధాలయాలలో తెలుగు 151906, ఆంగ్లము 17318, హింది 12044, ఉర్దూ 14119 మొత్తము 195387 పుస్తకములు కలవు.

మెదకు జిల్లా గ్రంథాలయములందు సభ్యులుగా పురుషులు 14576, స్త్రీలు 1263 బాలురు 1787 మొత్తము 17626 కలరు.

మెదకు జిల్లాలో నేటికి 18 గ్రంథాలయములు స్వంత భవనములు కలిగియున్నవి. 6 గ్రంధాలయ భవనములు నిర్మాణదశలోనున్నవి 22 గ్రంథాలయములు అద్దెభవనములందు నడుపబడుచున్నవి.

జిల్లాలో ఇంతవరకు ప్రత్యేకంగా బాలల కొరకు గ్రంధాలయము స్థాపించబడలేదు. కాని జిల్లా కేంద్ర గ్రంథాలయము సంగారెడ్డిలో మాత్రము ఒక ప్రత్యేక బాలల విభాగము అనుబంధితమైయున్నది ఐనప్పటికి శాఖా గ్రంధాలయాలలో ఇంత వరకు బాలల కొరకు ప్రత్యేక సౌకర్యం ఏర్పాటు చేయడం కాని, కనీసం పెద్దలతో పాటు పిల్లల ఉపయోగార్థం సమిష్టి ప్రయోజనాన్ని కల్గించే పుస్తకాలుగాని లేవు. రెండో, మూడో బాల సాహిత్యానికి సంబంధించిన పత్రికలు మాత్రము తెప్పించబడుచున్నవి.

మెదకు జిల్లాలో ఎక్కడ కూడా స్త్రీలకు ప్రత్యేక గ్రంధాలయమలు లేవు.

రాజారామ మోహన రాయ్ లైబ్రరీ ఫౌండేషన్ కలకత్తా వారు జిల్లా గ్రంధాలయ సంస్థకు పుస్తకాలను సరఫరా చేయుచున్నారు. ఈ ఫౌండేషన్ 1975-76 లో 4894 పుస్తాకాలను జిల్లా గ్రంధాలయ సంస్థకు దాని ఆధీనములోని శాఖా గ్రంధాలయాలకు సరఫరా చేయుటకు ఇచ్చినది.

జిల్లా గ్రంధాలయ సంస్థ నిరక్షరాస్యతా నిర్మూలనకు జ్ఞాన సముపార్జనకు ప్రభుత్వ బాధ్యతల దృష్టియందుంచుకొని తన పరిమితమైన పరిధిలో పుస్తకాల నందించుచున్నది.

# గ్రంధాలయసంస్థ అధ్యక్షులు

| పేరు | కొనసాగిన తేది | | |
|---|---|---|---|
| శ్రీ బి. వెంకటరామారావు | - | | |
| శ్రీ వెంకటనర్సింహాచారి | - | | |
| శ్రీ సి. గోపాల్‌రెడ్డి | 28-5-68 | నుండి | 7-1-73 |
| శ్రీ ఎస్. నర్సింగ్‌రావు | 11-6-73 | ” | 7-3-78 |
| శ్రీ జి. నర్సింహారెడ్డి | 28-3-78 | ” | 28-7-81 |
| శ్రీ ఎస్. రాంరెడ్డి | 18-1-82 | ” | 1-7-82 |
| శ్రీ పశుపతినాథ్ | 20-9-82 | ” | 30-6-86 |
| శ్రీ విజయపాల్‌రెడ్డి | 7-8-88 | ” | 6-1-90 |
| శ్రీ జెట్టినాగేశ్వర్‌రావు | 6-4-92 | ” | 7-9-96 |
| శ్రీ మదన్‌రెడ్డి | 7-5-99 | ” | -- |

# ఉద్యోగ కల్పనాసంస్థ (Employment Exchange)

సమాజమున తమ కులవృత్తులొనర్చుట, వ్యవసాయము, మొదలగు పనులలో విద్యావంతులకు ఆసక్తి తగ్గినది. విద్యావంతులైన యువకులు ఎక్కువగా ప్రభుత్వోద్యోగముల వైపు తమ దృష్టిని మళ్లించు చున్నారు. విద్యావంతులు ఉద్యోగములు చేసి సుఖపడవచ్చునని తల పోయుచున్నారు.

ప్రభుత్వము విద్యావంతులైన యువకులు ఉద్యోగమును కాంక్షించు వారికై ఒక సంస్థనేర్పాటు చేసినది. ఈ సంస్థయందు ఉద్యోగార్థులైన యువకులు తమ పేర్లను నమోదు చేసి కొనవలయును. వివిధ సంస్థలలో ఏర్పడు ఉద్యోగ ఖాళీల వివరములు ఉద్యోగ కల్పనా సంస్థకు పంపబడును. ఈ సంస్థ తమ వద్ద నమోదు చేసికొనిన వారిలో అర్హులైన వారిని ఆయా ఉద్యోగములకు పరీక్షలకై పంపును.

ఈ సంస్థ ఉద్యోగార్థులకు, ఉద్యోగము, నిచ్చు సంస్థలకు మధ్య వారధి వలె పని చేయును.

మెదకు జిల్లాలో ఉద్యోగ కల్పనా సంస్థ కార్యాలయము సంగారెడ్డి యందు కలదు.

ఉద్యోగ కల్పనా సంస్థయందు 31-12-1998 నాటికి 1,19,765 మంది ఉద్యోగార్థులుగా నమోదు కావింపబడినారు. ఇందు 25128 మంది స్త్రీలు కలరు.

మెదకు జిల్లాలో 1989 ఆగస్టు మాసము నుండి ఉద్యోగ ఉపాధి సంస్థ సంగారెడ్డి కార్యాలయమునందే కాక మొబైల్ రిజిస్ట్రేషన్ ద్వారా మెదకు మరియు సిద్దిపేట పట్టణాలలో కూడా నమోదు గావించుకొనుచున్నది. జిల్లా కలెక్టరుగారి ఆదేశములననుసరించి ప్రతి నెలలో మొదటి సోమవారము మెదకు పట్టణము నందును, రెండవ సోమవారము సిద్దిపేట పట్టణమునందును క్యాంపులు నిర్వహించి ఉద్యోగార్థులను నమోదు చేసికొనుట జరుగుచున్నది.

నిరుద్యోగులైన విద్యావంతులకు తగినన్ని ఉద్యోగములు లభించుట కష్టమగుచున్నది. అందుకు ప్రభుత్వము ఆలోచించి విద్యావంతులు తమ కాళ్లపై తాము నిలబడునట్లుగా స్వతంత్ర జీవనము గడుపుటకై తగు సూచన లిచ్చుటకు ఎంప్లాయిమెంటు కార్యాలయము నందు ప్రత్యేక విభాగము నేర్పరిచినది. ఈ విభాగమునకు ఉత్సాహవంతులు కలిగిన విద్యావంతులెందరో దర్శించుచు తగు ప్రోత్సాహమును పొందుచున్నారు. 1999 లోనే 7847 మంది ఈ విభాగమును దర్శించిరి. అందు 113 మంది స్వతంత్ర జీవనమున ప్రారంభించిరి.

1959 ఎంప్లాయ్‌మెంటు యాక్టు ప్రకారము ఏ సంస్థయైనను పదిమంది కన్న ఎక్కువ ఉద్యోగులు అవసరమైన ఎడల ఎంప్లాయిమెంటు ఎక్స్‌చేంజి ద్వారానే పొంద వలయునని కలదు.

మెదకు జిల్లాలో ప్రైవేటు యాజమాన్యమున అనేక ఫ్యాక్టరీలు పని చేయుచున్నవి. ఒకవేళ ఈ ఫ్యాకటరీలు మెదకు జిల్లా వాసులకు న్యాయముగా ఈయ వలసిన ఉద్యోగములిచ్చినచో ఇచ్చట నిరుద్యోగ సమస్యయుండనే యుండదు. కాని వీరు స్థానికులకు అవకాశములీయక స్థానికేతరులను ఉద్యోగములందు తీసి కొనుచున్నారు. అంతేకాక ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజిని కూడా మోసగించుచున్నారు. ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజిలో కూడా కొందరు అక్రమముగా స్థానికేతరులు నమోదు చేసికొనిన సందర్భములు కూడా కలవు.

మొత్తము మీద మెదకు జిల్లాలో పరిశ్రమలు అధికముగా నున్నప్పటికి స్థానికులకు నిరుద్యోగ సమస్య ఎప్పటి వలెనేయున్నది.

ప్రస్తుతము మెదకు జిల్లా ఉపాధి సంస్థయందు నమోదు కావింపబడిన వారి వివరములు మొత్తము 15-7-92 నుండి కంప్యూటర్‌లోనికి ఎక్కించబడినది.

ప్రభుత్వము వికలాంగులకు నెలకి రూ. 50.00 అలవెన్సుగా ఇచ్చుచున్నది.

కార్యాలయమునందలి లైవ్ రిజిష్టర్ ప్రకారం 31-12-98 నాటికి

| క్ర.సం. | విద్యార్హతలు గలవారు | మొత్తము | యస్.సి | యస్.టి | బి.సి |
|---|---|---|---|---|---|
| 1. | మెట్రికులేట్స్ | 53757 | 13864 | 2106 | 32872 |
| 2. | ఇంటర్ మీడియట్స్ | 25379 | 1374 | 210 | 10494 |
| 3. | పట్టభద్రులు | 7006 | 948 | 80 | 3455 |
| 4. | స్టెనోగ్రాపర్లు | 964 | 186 | 48 | 548 |
| 5. | టైపిస్టులు | 7475 | 800 | 150 | 3022 |
| 6. | యస్.జి.బి.టి.లు | 924 | 92 | 11 | 404 |
| 7. | బి.యి.డిలు | 2470 | 158 | 9 | 965 |
| 8. | డిప్లమాహోల్డర్లు | | | | |
| | ఎ. సివిల్ ఇంజనీరింగ్ | 686 | 71 | 16 | 300 |
| | బి. మెకానికల్ ఇంజనీరింగ్ | 2122 | 198 | 56 | 769 |
| | సి. ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ | 638 | 55 | 18 | 263 |
| | డి. ఇతరులు | 2620 | 186 | 23 | 836 |
| 9. | ఐ.టి.ఐ | 9138 | 924 | 246 | 4632 |
| 10. | ఎ.యన్.యమ్. | 605 | 371 | 5 | 128 |
| 11. | నర్స్ | 153 | 68 | 1 | 52 |
| 12. | నిరక్షరాస్యులు మరియు మెట్రిక్ కన్న తక్కువ చదువరులు | 5528 | 1777 | 615 | 2380 |
| | మొత్తము | **1,19,765** | **21,072** | **3,589** | **60,804** |

# స్వయం ఉపాధి కల్పన

## (పి.యం.ఆర్.వై)

విద్యావంతులైన నిరుద్యోగులకు ఉపాధి కల్పించే ఉద్దేశ్యంతో కేంద్రప్రభుత్వం ప్రవేశపెట్టిన ప్రధానమంత్రి రోజ్‌గార్ యోజన మెదకు జిల్లాలో సత్ఫలితాలనిస్తున్నదని చెప్పవచ్చును. ఈ పథకము 1993-94 ఆర్థిక సంవత్సరమున ప్రారంభింపబడినది.

పరిశ్రమల శాఖ ఆధ్వర్యంలో నిర్వహిస్తున్న ఈ పథకం ద్వారా లబ్ధిపొంది అనేక నిరుద్యోగులు ఆర్థికంగా స్వావలంబన దిశలో పయనిస్తున్నారు.

కనీసం ఎనిమిదవ తరగతి ఉత్తీర్ణులైన నిరుద్యోగ యువతీయువకులు లేదా ఆరుమాసాలు తక్కువ కాకుండా ఏదేని ప్రభుత్వ సంస్థ ద్వారా శిక్షణ పొందినవారు ఈ పథకం ద్వారా లబ్ధిపొందవచ్చును. 24 వేల (ఇరువదినాలుగు వేల) రూపాయల వార్షికాదాయం కలిగిన కుటుంబంలోని వారు, పథకం ప్రారంభించ వలసిన ప్రాంతంలో మూడు సంవత్సరాలకు తక్కువ కాకుండా శాశ్వత నివాసమున్న వారు పి.యం.ఆర్.వై. ద్వారా లబ్ధి పొందుటకు అర్హులు. 2001 నుండి 40 వేల రూపాయల ఆదాయమునకు పెంచనైనది.

సంవత్సరంలో మూడు నెలలకు ఒకమారు ఈ పథకం ఇంటర్వ్యూలు జిల్లా పరిశ్రమల కేంద్ర అధికారుల ఆధ్వర్యంలో సంబంధిత మండల పరిషత్తు అధికారి, బ్యాంకర్ల సమీక్షలో నిర్వహిస్తారు.

మొదట ఈ పథకము ద్వారా ఋణము పొందుగోరు అభ్యర్థులు నేరుగా జిల్లా పరిశ్రమ కేంద్ర కార్యాలయమునకు దరఖాస్తులు పంపుకొన వలయును, ఒకవేళ పంపలేని పరిస్థితులలో నేరుగా ఒరిజినల్ సర్టిఫికెట్లతో ఇంటర్వ్యూకు హాజరు కావచ్చును. ముందుగా దరఖాస్తు చేసికొన్న అభ్యర్థులకు కాల్ లెటర్లు పంపబడును.

జిల్లా (టాన్స్‌ఫోర్సు) కమిటిచే ఎంపికైన నిరుద్యోగులకు మాత్రమే బ్యాంకర్ల రుణసదుపాయం కల్పింతురు.

పి.యం.ఆర్.వై రుణాల రికవరీ విషయంలో ప్రభుత్వం కఠినంగా వ్యవరించుటకై జిల్లాస్థాయిలో జాయింట్ రికవరీ కమిటీని ఏర్పాటు చేసినది. ఇందులో లీడ్ బ్యాంకు అధికారి, సంబంధిత మండల రెవెన్యూ అధికారి, మండల పరిషత్తు అభివృద్ధి అధికారి, పోలీసు సబ్-ఇన్స్‌పెక్టరు, బ్యాంకు అధికారులు సభ్యులుగానుందురు. రుణాలు చెల్లించని వారిపై కేసులు నమోదు చేసే అధికారం ఈ కమిటీకి కలదు. ఆస్తులను జప్తు చేసే అధికారం కూడా ఈ కమిటీకి ఈయబడినది.

పి.యం.ఆర్.వై క్రింద వ్యాపారరంగానికి ఒక లక్ష రూపాయలు, పారిశ్రామిక రంగానికి రెండు లక్షల రూపాయల వరకు కూడా అనుమతించ వచ్చును.

ఇద్దరు లేదా అంత కంటే ఎక్కువ అర్హులైన వ్యక్తులు సంయుక్తంగా ఏర్పడిన భాగస్వామ్య ప్రాజెక్టుకు పదిలక్షల రూపాయల వరకు రుణసదుపాయం కల్పించే అవకాశము కలదు.

మొత్తము మీద చదువుకొని ఉద్యోగాలు లేవని బాధపడక తమకాళ్లపై తాము నిలబడుటే కాక తమలాంటి కొందరు నిరుద్యోగులకు కూడా నిలువనీడ కల్పించే ప్రధాన మంత్రి రోజ్‌గార్ యోజన నిజముగా యువశక్తికి ఒక వరమని చెప్పవచ్చును.

మెదకు జిల్లాలో ఈ పథకం క్రింద 1997-98 సంవత్సరానికిగాను యూనిట్లు మంజూరి కాబడినవి. అంతేగాక స్వయం ఉపాధి పథకాలపై 575 మందికి జిల్లా పరిశ్రమల శాఖ ద్వారా శిక్షణ ఈయబడినది.

| సంవత్సరము | లక్ష్యము | మంజూరి | సాధ్యము | లక్ష్య ధనము (రూ. లక్షలలో) |
|---|---|---|---|---|
| 1993-94 | 75 | 93 | 64 | 32.19 |
| 1994-95 | 800 | 657 | 476 | 223.2 |
| 1995-96 | 840 | 951 | 670 | 271.95 |
| 1996-97 | 840 | 891 | 587 | 243.05 |
| 1997-98 | 880 | 1107 | 752 | 346.33 |
| 1998-99 | 1063 | 1233 | 383 | 179.90 |

# ముఖ్యమంత్రి యువశక్తి పథకము

## (సి.యం.ఈ. వై)

విద్యావంతులైన నిరుద్యోగులైన గ్రామీణ యువకులలో నిరాశా నిస్పృహలను పారద్రోలి వారిలోని మానవ వనరులను సహజ సిద్ధమైన చైతన్యాన్ని పెంపొందించి, ఉపాధి కల్పించి తద్వారా రాష్ట్రాన్ని, దేశాన్ని సర్వతో ముఖాభివృద్ధి దిశలో పయనింప జేయడానికి ఏర్పాటు చేయబడిన పథకమే ముఖ్యమంత్రి యువశక్తి పథకము.

ఈ పథకమును గురించి ఆలోచన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారిది. ఈ పథకము తే. 1-12-1996 రోజున ముఖ్యమంత్రి చే ప్రవేశ పెట్టబడినది.

ఈ పథకము క్రింద 5 నుండి 10 మంది యువకులు ఒక జట్టుగా ఏర్పడి తమవంతుగా 15 వేల రూపాయలు పొదుపు చేసినచో ప్రభుత్వపరముగా 85 వేల రూపాయలు సబ్సిడితో కూడిన అప్పు మంజూరి చేయబడును. లక్ష రూపాయలు పై బడిన పథకమును చేపట్టుదలచినచో బ్యాంకు ద్వారా రుణము ఇప్పించబడును.

మెదకు జిల్లాలో ముఖ్యమంత్రి యువశక్తి పథకము ద్వారా మొదటి సంవత్సరంలో 342 గ్రూపులు లక్ష్యంకాగా 330 గ్రూపులకు రుణ సహాయము లభించినది.

1997-98 సంవత్సరముకు గాను మొత్తము 580 గ్రూపులకు ఆర్థిక సమయాన్నీ అందజేసేందుకు లక్ష్యాన్ని విధించింది. మెదకు జిల్లాలో యువశక్తి పథకం ద్వారా 2050 మంది యువకులు లబ్ధిపొందినట్లు అంచనా.

ఈ పథకం ద్వారా సహాయం పొందగోరు వారు కనీసం 7వ తరగతి పాసైయుండి గ్రూపుగా ఏర్పడినప్పటి నుండి మూడు నెలల పాటు దినమున కొక రూపాయైన పొదుపు చేయవలెను.

జన్మభూమి, శ్రమదానం కార్యక్రమాలతో పాటు ప్రభుత్వం చేపట్టే వివిధ సంక్షేమ కార్యక్రమాలలో పాల్గొనవలసిన ఆవశ్యకత ఈ పథకాల లాభోక్తులకు గలదు.

ఈ పథకం ద్వారా లబ్ధిపొందిన యువజన సంఘాలలో చురుకైన కార్యకర్తలను గుర్తించి వారిలో ఒకరిని మండలానికి ప్రేరక్‌గా (సి.యం.ఇ.వై సమన్వయ కర్త) నియమింతురు. ప్రేరక్‌లు కేవలం ముఖ్యంమంత్రి యువ శక్తి పథకం అమలుకే గాక కుటుంబ నియంత్రణ అక్షరాస్యత మొదలగు సంక్షేమ కార్యక్రమాలలో ప్రజలను జాగృతి పరచవలసిన వారుగా వ్యవహరింతురు.

ఈ విధముగా యువకులలో, స్వయం పోషకత్వమును పెంపొందించుటే గాక సాంఘిక సంక్షేమ కార్యక్రమాలలో పాల్గొని నాయకత్వ లక్షణాల నింపు కొనునట్లుగా సిద్ధము చేయుటచే ఈ పథకము ఫలవంతమగు చున్నది.

# జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ

## డి.ఆర్.డి.ఎ

మెదకు జిల్లాలో చిన్నరైతుల అభివృద్ధి సంస్థగా Small Farmers Development Agency (S.F.D.A) 1975వ సంవత్సరంలో 317 క్రమ సంఖ్యగా రిజిస్ట్రేషన్ చేయబడినది.

ఈ సంస్థ ద్వారా జాతీయ గ్రామీణాభివృద్ధి కార్యక్రమములు (Integrated Rural Development Programs) 1978-79 నుండి ప్రారంభమైనవి.

తేది 2-10-1980 నాటి నుండే జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ (District Rural Development Agency)గా రూపాంతరము చెంది అనేక ప్రజోపయోగ కార్యక్రమములను చేపట్టి విజయవంతముగా నిర్వహించుచున్నది.

ఈ సంస్థకు అధ్యక్షులుగా జిల్లా కలెక్టరు, కార్యనిర్వహణాధికారిగా ప్రాజెక్టు డైరక్టరు ఉందురు.

1991-92 నుండి ఈ సంస్థ ద్వారా 1,13,1971 మంది లాభోక్తులు 1976.66 లక్షల రూపాయలు సబ్సిడి రూపమున పొందినారు.

గ్రామీణాభివృద్ధి సంస్థ ద్వారా (D.R.D.A).

1. ఐ.ఆర్.డి.పి. : (జాతీయ గ్రామీణాభివృద్ధి) (Integrated Rural Development Program).

2. డి.డబ్ల్యు.ఎ.సి.ఆర్.ఎ : (డ్వాక్రా) (గ్రామీణ స్త్రీ, శిశు సంక్షేమము) (Development of Women, Children in Rural Areas).

3. టి.ఆర్.వై.ఎస్.ఇ.ఎమ్.(ట్రైజం) : గ్రామీణ యువక శిక్షణ (Training of Rural Youth for Self Employment). పథకములు చేపట్టబడినవి.

1. ఐ.ఆర్.డి.పి : ఈ పథకము ద్వారా గ్రామీణ ప్రాంతములను ఆర్థికంగా అభివృద్ధి పరచుటకై అనేక చర్యలు చేపట్టబడినవి ముఖ్యముగా

1. వ్యవసాయము : చిన్నకారురైతులకు బావులు లేదా బోర్లు త్రవ్వకము, ఇంజన్లు లేదా మోటార్లు అమర్చుటము.

2. పట్టుపరిశ్రమ: పట్టుపురుగుల పెంపకమున గ్రామీణులకు శాస్త్రీయ పద్ధతులను బోధించి అందుకు అవసరమైన ఆర్థిక సహాయమొనర్చుట.

3. పండ్లతోటల పెంపకము: క్రొత్తవంగడాలను, శాస్త్రీయంగా అంటు కట్టిన పండ్ల మొక్కలను పంపిణీ చేసి డ్రిప్ ఇరిగేషన్ వంటి నూతన పద్ధతుల ద్వారా పండ్లతోటల పెంపకమున మెళుకువ చూపుచు ఆర్థికసాయమొనర్చుట.

**4. మత్స్య పరిశ్రమం:** చేపల పెంపకమునందలి మెళుకువల చూపుట, చేప విత్తనముల సరఫరా, వలలు మొదలగువాటి సరఫరాలకై ఆర్థిక సహాయమొనర్చుట.

**5. పాడి పశువుల పెంపకము :** గ్రామీణ ప్రాంతములందు చిన్నవ్యవసాయదారుల ఆర్థికాభివృద్ధికై పాడిగేదలను ఇప్పించుట.

ఇంతేగాక చిన్నచిన్న పరిశ్రమలు, చిన్న వ్యాపారముల చేయుటకై ఆర్థిక సహాయమొనర్చుట

| | 1991-92 లక్షల రూ. | 1992-93 లక్షల రూ. | 1993-94 లక్షల రూ. |
|---|---|---|---|
| | లాభోక్తులు - ధనసహాయము | లా ధ | లా. ధ |
| 1. లక్ష్యం | 8624 - 215.61 | 7520 - 188.00 | 8833 - 277.60 |
| 2. విడుదల | 11504 - 272.05 | 8619 - 201.03 | 1017 - 264.28 |
| 3. గ్రౌండింగ్స్ | 8699 - 191.0 | 7435 - 161.90 | 6265 - 125.49 |

**II. డ్వాక్రా**

గ్రామీణ ప్రాంతాలలో స్త్రీలకొరకై ప్రత్యేకముగా ఏర్పాటు చేయబడి ఈనాడు రాష్ట్ర వ్యాప్తంగా మహిళా చైతన్యమునకు దోహదకారియైన ఈ డ్వాక్రా పథకము మెదకు జిల్లాలో 1988-89వ సంవత్సరమున ప్రారంభింపబడినది. ఈ పథకమునందు గ్రామీణ ప్రాంతాలలో దారిద్ర్యరేఖకు దిగువనగల కుటుంబాలలోని స్త్రీలు 15 మంది కలిసి ఒక గ్రూపుగా ఏర్పడి పొదుపుచేయడం ప్రారంభించాలి. రోజుకు ఒక రూపాయిచొప్పున పొదుపు చేస్తూ 15 మంది కలసి నెలకు కనీసం 450 రూ. బ్యాంక్ ఖాతాలో తమ గ్రూప్ పేర జమచేయాలి. పొదుపు చేసిన డబ్బును కొంతకాలము తర్వాత గ్రూపులోని వారి అవసరాలకు అప్పుగా తీసికొనుట జరిగి స్వయం ఆర్థికాభివృద్ధికి దోహదం చేస్తుంది.

ఈ గ్రూపు ఏదైన ఒక ఆర్థిక కార్యకలాపం చేపట్టాలి. వీరికి డి.ఆర్.డి.ఎ. నుండి రివాల్వింగ్ ఫండ్ మొదటి విడతగా 12,500 రూపాయలు ఈయబడుతుంది.

మెదకు జిల్లాలోని డ్వాక్రా మహిళలు చేపట్టిన వివిధ రకాల కార్యక్రమాలు.

1. విస్తర్లు కుట్టుట
2. అలంకార వస్తువులు తయారు చేయుట
3. చెప్పుల తయారి.
4. ఆహార ఉత్పత్తుల తయారి (అప్పడాలు, వడియాలు మొదలగునవి)
5. ముత్యాల ఆభరణములు
6. రెడీమేడ్ దుస్తులు
7. ఎంబ్రాయిడరీ వస్తువులు
8. చెక్కబొమ్మలు
9. ఉన్ని వడకడం
10. కంబళ్లు (గొంగళ్లు)

11. అద్దాల ఎంబ్రాయిడరీ
12. మట్టిపాత్రలు
13. లేసులు
14. చీపుర్లు తయారి
15. పాడి పరిశ్రమ
16. కోళ్ల పెంపకం
17. రాళ్లు కొట్టడం
18. తుంగచాపలు అల్లడం

మొదలైనవి దిగ్విజయంగా నిర్వహిస్తున్నారు.

డ్వాక్రా మహిళలు అక్షరాస్యత, పొదుపు కుటుంబ సంక్షేమం, పరిసరాల పరిశుభ్రత, ఆరోగ్య కార్యక్రమాలు, మొక్కలు నాటడం, మద్యపాన నిషేధం, వరకట్న నిషేధం, శ్రమదానం, జన్మభూమి కార్యక్రమాలలో పాల్గొంటూ అభివృద్ధి పథాన పయనిస్తూ తమవంతు కర్తవ్యాన్ని నెరవేరుస్తున్నారు.

## జిల్లాలో డ్వాక్రా ప్రగతి

1999-2000 సంవత్సరమునకు గాను జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ వారు 5000 పొదుపు సంఘాలను 21 మహిళా బ్యాంకులను అదనంగా ఏర్పాటు చేయడానికి లక్ష్యంగా పెట్టుకున్నారు. ఇప్పటివరకు 3987 పొదుపు సంఘాలను, 6 మహిళా బ్యాంకులను ఏర్పాటు చేయడం జరిగింది.

902 గ్రూపులకు 2.26 కోట్ల రూపాయల రివాల్వింగ్ ఫండ్ విడుదల చేయడం జరిగింది. దీనితో పాటుగా 1060 గ్రూపులకు 57 లక్షల మాచింగ్ గ్రాంటు విడుదల చేయబడింది.

1999-200 సంవత్సరంలో పొదుపు సంఘాలకు బ్యాంకుల నుండి ప్రత్యక్ష ఋణం ద్వారా 2000 గ్రూపులకు 4.00 కోట్ల రూపాయల ఆర్థిక సహాయం అందించడం లక్ష్యంగా పెట్టుకోవడం జరిగింది. దీని నిమిత్తం మొదటి దశలో 20 మండలాలలో 2వ దశలో 25 మండలాలలో బ్యాంకులు పొదుపు సంఘాల మధ్య అవగాహన సదస్సు ఏర్పాటు చేయబడింది.

ఇదే సదస్సులో 'ఎ' గ్రేడు గ్రూపులను గుర్తించి సంబంధిత బ్యాంకులతో ఋణము ఏర్పాటు ప్రయత్నము జరుగుతున్నాయి. మొదటి దశలో 20 మండలాలలో సదస్సులు జరిగినవి. వివిధ బ్యాంకుల వారు 800 గ్రూపులకు ఋణం ఇవ్వడానికి ఏర్పాటు చేయబడింది. 2వ దశలో జరుగుచున్న సదస్సులలో మిగిలిన లక్ష్యం పూర్తి చేయబడుతుంది.

ఈ ఋణ సౌకర్యం ద్వారా గ్రామీణ మహిళలకు పొదుపు సంఘాలలో ప్రస్తుతమున్న క్రెడిట్ గ్యాపును పూర్తి చేయడం జరుగుతుంది. దళారుల బారి నుండి వారిని కాపాడడమే కాకుండా వడ్డీ రూపంలో పేద వర్గాల నుండి ధనిక వర్గాలకు వనరుల బదిలీకి అడ్డుకట్ట వేయడం జరిగింది.

## డ్వాక్రా బజార్లు :

మెదకు జిల్లా పొదుపు సంఘాలు సుమారు 15 కోట్ల రూపాయలు పొదుపు చేయడమే కాకుండా అనేక రకాల ఉత్పత్తులను చక్కని నైపుణ్యంతో, పోటీ మార్కెట్‌లో తట్టుకునే విధంగా తయారు చేస్తున్నారు.

వారి ఉత్పత్తులకు మార్కెట్ సౌకర్యం కలిగించడానికి రాష్ట్ర వ్యాప్తంగా హైదరాబాద్, విజయవాడ నగరాలలో మొదలగు డ్వాక్రా బజార్లు నిర్వహించడం జరిగింది. ఈ బజార్లలో మెదక్ జిల్లా డ్వాక్రా సంఘాలు సుమారు ఒక కోటి రూపాయల ఉత్పత్తులను అమ్మగలిగాయి.

ఇదే కాకుండా శాశ్వత ప్రాతిపదికన పటాన్‌చెరులో డ్వాక్రా బజారు నెలకొల్పడం జరిగింది. గుమ్మడిదల చెక్క బొమ్మలు, నర్సాపూర్ విస్తరిప్లేట్లు, రాంచంద్రాపురం చెప్పులు, జహీరాబాద్ జూట్ వస్తువులు, బ్యాగులు, చందంపేట ముత్యాల ఆభరణాలు ఈ అమ్మకాలలో అగ్రభాగన నిలిచాయి.

ఇదే విధంగా పూర్వపు తాలూకా కేంద్రాలలో ప్రతి చోట డ్వాక్రా బజార్లు శాశ్వత ప్రాతిపదికన నిర్మించాలని జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ భావిస్తున్నది.

## డ్వాక్రా - శిక్షణా కార్యక్రమం

డ్వాక్రా సభ్యులు తాము చేపట్టిన ఆర్థిక కార్యకలాపాలకి అవసరమగు ఆధునిక శిక్షణ ఇవ్వబడుతున్నది. జిల్లాలోని వివిధ మండల కేంద్రాలలోను, సంగారెడ్డిలో స్థాపించబడిన సాంకేతిక శిక్షణ అభివృద్ధి కేంద్రంలోను జూట్ బ్యాగుల తయారీ, టైలరింగ్, విస్తరి ప్లేట్లు తయారీ, నారతో అలంకార వస్తువుల తయారీ మొదలగు ట్రేడులలో శిక్షణ జరుగుచున్నది.

ప్రస్తుతం 165 మంది మహిళలకు 10 ట్రేడులలో శిక్షణ ఇవ్వబడుతున్నది. ఆర్థిక కార్యక్రమాలలోనే కాకుండా డ్వాక్రా పొదుపు సంఘాలకు కావలసిన వ్యవస్థాగత శిక్షణ, రిజిస్టర్ల నిర్వహణ, సమావేశాల నిర్వహణ, సామాజిక బాధ్యత మొదలగు అంశాలపై జిల్లా సాంకేతిక శిక్షణ అభివృద్ధి కేంద్రంలో అనుభవజ్ఞులచే శిక్షణ ఇవ్వబడుచున్నది. ఇంతవరకు 215 మంది మోటివేటర్లకు 10 మంది అదనపు గ్రామ సేవికలకు 16 మంది గ్రామాభివృద్ధి అధికారిణులకు శిక్షణ ఇవ్వబడినది.

## జిల్లాలో మహిళా బ్యాంకులు

మెదక్ జిల్లాలో జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థవారు ఆయా ప్రాంతాలలో 40 పొదుపు సంఘాలతో మహిళా బ్యాంకులను ఏర్పాటు చేస్తున్నారు. ఇందులో భాగంగా పటాన్‌చెరు, జహీరాబాద్, రామాయంపేట, రాయపోల్, కుకునూరుపల్లి, ధర్మారెడ్డిపల్లి ప్రధాన కేంద్రాలుగా చుట్టుప్రక్కల గ్రామాలను క్లష్టరు గ్రామాలుగా గుర్తించి ఆ గ్రామాలలోని పనితీరు బాగానున్న పొదుపు సంఘాలతో మహిళా బ్యాంకులను ఏర్పాటు చేశారు.

పటన్‌చెరు మహిళా బ్యాంకు ఇప్పటికి 11.00 లక్షల రూపాయల టర్నోవర్‌తోను, జహీరాబాద్ మహిళా బ్యాంకు 8.00 లక్షల రూపాయల టర్నోవర్‌తోను గ్రామీణ మహిళల పరపతి అవసరాలను తీరుస్తున్నాయి. ఇదే విధంగా మొదటి దశలో మరో 15 మహిళా బ్యాంకులను నెలకొల్పాలని జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ లక్ష్యంగా పెట్టుకుంది.

పేదరికంలోనున్న మహిళల కుటుంబ అవసరాలను సత్వరమే తీర్చుటలో ఈ మహిళా బ్యాంకులు ఎంతో ఉపయోగపడుతున్నాయి.

# ట్రైసెమ్ (TRYSEM) Training of Rural Youth for Self Employment

## గ్రామీణ యువత శిక్షణ

ఈ కార్యక్రమము మెదకు జిల్లాలో చక్కగా నిర్వహింపబడుచున్నది.

గ్రామీణ యువకులకు వివిధ ట్రేడులలో శిక్షణనిచ్చి, శిక్షణానంతరము ఆర్థిక సహాయ మొనర్చివారిలో కొత్త ఆశలను రేపి శక్తివంతులైన యువకులుగా తయారుచేయుటే ఈ ట్రైజమ్ ముఖ్యోద్దేశ్యమైయున్నది.

ఈ పథకము ద్వారా 1993-94 నాటికి 848 మంది యువకులకు శిక్షణ ఈయబడినది.

సి.ఐ.టి.ఆర్.ఎ. ద్వారా ఆధునిక పనిముట్ల పంపిణి.

(జి.కె.వై.) గంగా కల్యాణీ యోజన ద్వారా చిన్న నీటి వనరుల ఏర్పాటులకై గ్రామీణాభివృద్ధి సంస్థ కృషి సల్పుచున్నది.

ఈపైన తెలిపిన పథకములన్నింటిని ఒకచోటచేర్చి (ఎస్.జి.ఎస్.వై.) "స్వర్ణ జయంతి గ్రామీణ స్వరోజ్‌గార్ యోజన" అనే పథకం ప్రారంభింపబడినది.

ఈ (ఎస్.జి.ఎస్.వై) చిన్న చిన్న ఉత్పాదనల సంస్థలను ప్రోత్సహించడం తద్వారా లబ్ధిపొందిన ప్రతికుటుంబాన్ని మూడు సంవత్సరాలలో దారిద్ర్యరేఖ నుండి విముక్తి కల్పించి కనీసం నెలకి రూ. 2000 ఆదాయం ఉండునట్లుగా చేయడం లక్ష్యంగా ప్రారంభింపబడినది.

స్వర్ణజయంతి గ్రామస్వరోజ్‌గార్ పథకం క్రింద సహాయం పొందిన లబ్ధిదారులను స్వరోజ్‌గారి అని పిలుస్తారు. ఈ స్వరోజ్‌గారి వ్యక్తిగతంగా లేదా గ్రూపులుగా యుండవచ్చు. ఎస్.జి.ఎస్.వై. స్వయం సహాయక సంఘాలకు ప్రాముఖ్యతనిస్తుంది. వ్యక్తిగతంగానైనా, గ్రూపుఐనా దారిద్ర్యరేఖకు దిగువననున్న వారికి మాత్రమే ఈ పథకం వర్తిస్తుంది.

### స్వయంసహాయక సంఘాలు

పేదలలో నిబడీకృతమైన శక్తిని, ఒక సంఘము ద్వారా ఐకమత్యంగా ఇతోధిక వృద్ధి సాధించుకొనుట లక్ష్యంగా స్వయం సహాయక సంఘాలు ఏర్పాటగుచున్నవి.

డి.ఆర్.డి.ఎ. ద్వార ఆ స్వర్ణరోజ్‌గార్ పథకంలో స్వయం సహాయక సంఘములు రివాల్వింగ్ ఫండ్ రూపాయలు 25,000/- ల వరకు పొందవచ్చును.

మెదకు జిల్లాలో ఇప్పటి వరకు 15748 స్వయం సహాకబృందాలు 236200 మంది సభ్యులతో 14.25 కోట్ల రూపాయల పొదపు మొత్తాలతో పని చేయుచున్నవి.

6277 గ్రూపులు రివాల్వింగ్ ఫండ్‌గా 855.16 లక్షల రూపాయలు పొందినవి.

ఈ స్వర్ణ జయంతి గ్రామ స్వరోజ్‌గార్ యోజన జాతీయ సామాజిక పథకాలను కొన్నింటిని ప్రవేశ పెట్టింది.

### I. వృద్ధాప్య పెన్షన్

ఈ పథకం ద్వారా మెదకు జిల్లాలో 46590 మంది వృద్ధులకు నేటికి నెలకు 75 రూపాయల

చొప్పున అందించబడుచున్నది. ఇప్పటివరకు అందించిన సహాయం రూ. 177.28 లక్షలు.

**II. కుటుంబ సహాయపథకం :**

ఈ పథకం ద్వారా 450 కుటుంబాలు లబ్ధిపొందినవి. దారిద్ర్య రేఖకు దిగువనున్న కుటుంబంలో వ్యక్తి (యజమాని) పాముకాటు వల్ల లేదా ప్రమాదవశాత్తుగా మరిణిస్తే ఆ కుటుంబానికి రూ. 10,000 ఆర్థిక సహాయం లభిస్తుంది.

**III. గర్భిణీ స్త్రీల సహాయ పథకం :**

దారిద్ర్యరేఖకు దిగువనున్న గర్భవతులైన స్త్రీల పోషకాహారమునకై రూ. 500 చొప్పున సహాయం లభిస్తుంది. ఈ పథకం ద్వారా మెదకు జిల్లాలో 7620 మంది లబ్ధిపొందినారు.

**IV. దీపం పథకం**

ఈ పథకం ద్వారా 29501 మంది డ్వాక్రా మహిళకు వంటగ్యాస్ కనెక్షన్లు ఈయబడినవి.

ఈ విధముగా మెదకు జిల్లాలో గ్రామీణాభివృద్ధి సంస్థ (డి.ఆర్.డి.ఎ) గ్రామీణ యువతీ యువకులలో, దారిద్ర్యరేఖకు దిగువనున్న వారలలో ఆశాజ్యోతులు వెలిగించి, ఆర్థిక సామాజిక అభివృద్ధికి దోహదం చేయుచున్నది.

## స్వయం సేవా గ్రూపులు

| క్ర.సం. | బ్యాంకు పేరు | మొత్తం | 'ఏ' కెటగరీ | ఎస్.హెచ్.జి. బ్యాంక్ లింకు 2000-2001 | | |
|---|---|---|---|---|---|---|
| | | గ్రూపులు | | ఎన్ని గ్రూపులు | రూపాయలు | బాలెన్స్ |
| 1. | అల్లహబాద్ బ్యాంక్ | 3 | 4 | 5 | 6 | 7 |
| 2. | ఆంధ్రా బ్యాంక్ | 156 | 114 | 27 | 1.96 | 87 |
| 3. | కెనరా బ్యాంక్ | 1358 | 1010 | 212 | 27.22 | 798 |
| 4. | సి.బి.ఐ | 367 | 291 | 40 | 10.48 | 251 |
| 5. | కార్పొరేషన్ బ్యాంక్ | 98 | 69 | 69 | 9.50 | 0 |
| 6. | ఇండియన్ బ్యాంక్ | 166 | 124 | 5 | 0.59 | 119 |
| 7. | ఎమ్.జి.బి. | 6363 | 3596 | 1507 | 251.44 | 2089 |
| 8. | ఎస్.బి.హెచ్. | 1517 | 1220 | 395 | 48.37 | 825 |
| 9. | ఎస్.బి.ఐ. | 3304 | 2148 | 552 | 69325 | 1596 |
| 10. | సిండికేట్ బ్యాంక్ | 822 | 570 | 139 | 16.56 | 431 |
| 11. | యూకో బ్యాంక్ | 131 | 96 | 33 | 3.30 | 63 |
| 12. | వైశ్య బ్యాంక్ | 23 | 17 | | | 17 |
| 13. | పి.ఎన్.బి. | 63 | 40 | 3 | 0.30 | 37 |
| 14. | యూ.బి.ఐ. | 163 | 116 | 75 | 10.75 | 41 |
| | **మొత్తం** | **14634** | **9497** | **3068** | **451.37** | **6429** |

# సాంఘిక సంక్షేమశాఖ

మెదక్‌జిల్లాలో సాంఘిక సంక్షేమ శాఖ షెడ్యూల్డ్ క్యాస్ట్ (దళితుల) అభివృద్ధికై వివిధ పథకముల ద్వారా సేవ చేయుచున్నది.

మెదక్‌జిల్లాలో షెడ్యూల్డ్ క్యాస్ట్ విద్యార్థుల విద్యాభివృద్ధికై ప్రత్యేకముగా 88 వసతి గృహములు నడుపబడుచున్నది. సాంఘిక సంక్షేమ శాఖ ద్వారా నడుచుచున్న వసతి గృహాలు బాలురకు 69, బాలికలకు 15 కలవు.

ఈ వసతి గృహాలలోని విద్యార్థులకు పుస్తకవములు మరియు నోటు పుస్తకవములు, తినుకంచములు, గ్లాసులు, బెడ్డింగు, ట్రంకు పెట్టెలు మరియు సంవత్సరమునకు (2) రెండు జతల దుస్తులు సరఫరా చేయబడుచున్నవి.

ఈ వసతి గృహాలలో 15 స్పెషల్ హాస్టల్స్‌గా 9,10 తరగతుల వారికి మాత్రము వసతి కల్పింపబడుచు ఆంగ్లము, గణితము, సామాన్య

**సాంఘిక సంక్షేమ శాఖ మెదకు జిల్లా బడ్జెట్ 1999-2000 1999 సెప్టెంబర్ వరకు**

| వ.సం. | స్కీమ్ | బడ్జెట్ రిలీస్డ్ | ఎక్స్‌పెండీచర్ | బెనిఫిషరీస్ |
|---|---|---|---|---|
| 1. | ప్రభుత్వ వసతి గృహాలు | 366.47 | 90.03 | (9925) బోర్డర్స్ (88) హాస్టల్స్ |
| 2. | పోస్ట్ మెట్రిక్ స్కాలర్‌షిప్పులు | 113.20 | 70.61 | (1547) రినివల్స్ స్టూడెంట్స్ |
| 3. | ప్రిమెట్రిక్ స్కాలర్‌షిప్పులు | 8.55 | 12.70 | (30383) స్టూడెంట్స్ |
| 4. | బ్రైట్‌బాయస్ స్కీం | 13.25 | - | (150) స్టూడెంట్స్ |
| 5. | స్కాలర్‌షిప్ టూ చిల్డ్రెన్ ఆఫ్ దోస్ ఎంగేజ్డ్ ఇన్ అన్‌క్లీన్ ఆక్యుపేషన్. | 1.50 | 1.50 | (182) స్టూడెంట్స్ |
| 6. | ఫైనానషియల్ అసిస్టెంట్ టూ ఎస్.సి. అడ్వకేట్స్ | 0.48 | - | (4) లా గ్రాడ్యుయేట్స్ |
| 7. | టైలరింగ్ ట్రైనింగ్ సెంటర్ | 3.27 | 0.98 | (1) సెంటర్ |
| 8. | ఇంటర్ క్యాస్ట్ మ్యారేజ్ | 1.50 | 0.70 | (7) కపుల్స్ |
| 9. | లాండ్ అక్విసీశన్ | 50.00 | 51.06 | |
| 10. | వాక్ టూ స్కూల్ | 32.13 | 32.00 | (7731) చిల్డ్రెన్ |

శాస్త్రవము, హింది విషయవములలో ప్రత్యేక ట్యూటర్లచే శిక్షణ నిప్పించబడుచు విద్యార్థుల విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నవి.

వసతి గృహాలలో భోజన వసతితో పాటు విద్యార్థుల విద్యాభివృద్ధికై 7వ తరగతివారికి 'మాబడి' 10 వ తరగతి వారికి 'పాఠశాల' మ్యాక్జిన్లు తెప్పింప బడుచున్నవి. మానసికోల్లాసమునకై, ప్రాపంచిక జ్ఞానమునకై దిన పత్రికలు తెప్పించబడును.

శరీర దార్ఢ్యత పెంపొందియుటకై ఆటలు ఆడించబడుచు అవసరమైన ఆటసామాగ్రి తెప్పించబడుచున్నది.

వసతి గృహాల నిర్వాహణకై ప్రభుత్వమునుండి రూ. 366.40 లక్షలు మంజూరియై విడుదల కాగా 30-9-99 నాటికి 90.03 లక్షలు ఖర్చు చేయబడినవి.

మెదక్ జిల్లాలో 41 బాలుర 12 బాలికల వసతి గృహాలు ప్రభుత్వముచే నిర్మించబడి చక్కని వసతులతో కలవు.

కాలేజి విద్యనభ్యసించు యస్.సి. విద్యార్థినీ విద్యార్థులకై ప్రత్యేకముగా వసతి గృహవములు ప్రారంభించబడినవి సంగారెడ్డిలో బాలురు 52 మంది, సిద్దిపేటలో బాలురు 88 మంది, సిద్దిపేటలో బాలికలు 27 మంది హాస్టల్ సౌకర్యము నొందుచున్నారు.

### పోస్టుమెట్రిక్ ఉపకార వేతనవములు :

ఇంటర్మీడియెట్, డిగ్రీ, పి.జి. పాలిటెక్నిక్, ఐ.టి.ఐ. విద్యార్థులైన యస్.సి.లకు 1547 మందికి గాను ప్రభుత్వము 113.20 లక్షల రూపాయలు విడుదల చేయగా ఇప్పటికి 70.61 లక్షలు పంపిణీ చేయునైనవి.

### ప్రిమెట్రిక్ ఉపకారవేతనవములు :

మూడవ తరగతి నుండి 10వ తరగతి వరకు చదువుచున్న యస్.సి. విద్యార్థులకు 30383 మందికిగాను రూ. 12.70 లక్షలు ప్రభుత్వము విడుదల చేయుట జరిగినది.

అపరిశుభ్ర వృత్తి చేయువారి పిల్లలకు వేతరి మొదలగు వారికి 3వ తరగతి నుండి 10వ తరగతి వరకు చదువు విద్యార్థులకు 182 మందిని ఒక్కొక్కరికి రూ. 500 చొప్పున మంజూరి చేయబడుచున్నది.

విద్యార్జనలో చురుకైన విద్యార్థులకు ప్రత్యేకముగా సంగారెడ్డిలోని సెంట్ జోసెఫ్ హై స్కూల్‌లో చేర్పించి ప్రత్యేక శిక్షణకుగాను ప్రతి విద్యార్థికి రూ. 20,000/-ల చొప్పున జిల్లాలో 1995-96లో 45 మందికి 1998-99లో 85 మందికి 1999-2000 లో 20 మందికి మొత్తము 150 మందికి ఉపకార వేతనములు ఈయబడుచున్నవి.

**న్యాయము:**

న్యాయవాద విద్య (యల్.యల్.బి) చదివిన వారికి 3 సంవత్సరములు ప్రత్యేక శిక్షణ నిచ్చుటకుగాను నె 1 కి రూ. 500/- చొప్పున జిల్లాలో నలుగురికి ఈయబడుచున్నది.

ఇంతేగాక వీరికి ఎనొరోల్ మెంటు ఫీ రూ.585/- లు మరియు పుస్తకముల కొనుగోలుకై రూ. 3000/- మంజూరి చేయబడినది.

**శిక్షణ:**

సంగారెడ్డి కుట్టు శిక్షణాకేంద్రమునందు యస్.సి. మహిళలకు నె 1 కి రూ. 40.00లు స్టైఫండుగా యిచ్చుచు ఒక సంవత్సరము శిక్షణ ఈయబడుచున్నది. శిక్షణ పొందిన వారికి ఒక కుట్టు మిషన్ ఉచితముగా ఈయబడుచున్నది.

**కులాంతర వివాహములు:**

కులాంతర వివాహములు చేసికొనిన జంటలకు 10,000/- రూపాయలు (పదివేలు) ప్రోత్సాహకము ఇన్‌సెంటివ్‌గాను డి.ఆర్.డి.ఎ నుండి 5000 రూపాయలు బ్యాంకు నుండి అప్పుగా రూ. 5000 యిప్పించబడుచున్నవి. 1995 నుండి 1999 వరకు 71 కులాంతర వివాహములు చేసికొనిన యస్.సిలకు 7.1 లక్షలు రూపాయలు ప్రోత్సాహకము లీయనైనవి 1999-2000 సంవత్సరములో 0.70 లక్షల రూ. 7 జంటలకు మంజూరియైనవి.

**తిరిగి బడికి పథకము :**

పాఠశాల మానివేసిన పిల్లలను తిరిగి పాఠశాలకు పంపుటకై వేసవి సెలవులలో ప్రత్యేకముగా విద్యాబోధన చేయించి వారిని తిరిగి పాఠశాలకు వచ్చునట్లుగా చేయునైనది. ఇందుకుగాను 32 లక్షల రూపాయలు వ్యయము కాబడినవి.

**కమ్యూనిటీ హాలులు :**

మెదకు జిల్లాలో 81 కమ్యూనిటీ హాళ్లు మంజూరికాగా 69 యిప్పటికే పూర్తియైనవి 12 వివిధస్థాయిలలో నిర్మాణములోనున్నవి.

**డాక్టర్ బి.ఆర్. అంబేడ్కర్ భవనము :**

మెదకు జిల్లా కేంద్రమైన సంగారెడ్డిలో 50 లక్షల రూపాయలతో బి.ఆర్. అంబేడ్కర్ భవనముల నిర్మాణమగుచున్నది.

**ఇండ్ల స్థలాలు :**

మెదకు జిల్లాలో బలహీన వర్గాలకు ఇండ్ల స్థలాలు యిచ్చుటకై 37081 మంది లాభోక్తులకు 1559.27 హెక్టారు భూమి సేకరించనైనది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| యస్.సిలకు | 962 మందికి | 459.25 హె. భూ. | యస్.టి.లకు | 1957 మందికి | 75.74 |
| బి.సి.లకు | 20634 మందికి | 813.50 | | | |
| ఓ.సి.లకు | 4861 మందికి | 210.78 | | | |
| **మొత్తము** | **37081 మందికి** | **1559.27 హె.భూ.** | | | |

# మెదక్ జిల్లాలోని వెనుకబడిన కులాల (తరగతుల) సంక్షేమం

మెదకుజిల్లాలో వెనుకబడిన తరగతుల సంక్షేమము కొరకై ప్రభుత్వము వివిధ పథకాలను ప్రవేశపెట్టుచున్నది.

వెనుకబడిన తరగతుల వారికి రుణములను మంజూరి చేసి వారు ఆర్థికముగా ఎదుగుటకై ప్రభుత్వము సహాయము చేయుచున్నది.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము వెనుకబడిన కులాల అభ్యున్నతికై అనేక పథకములు ప్రవేశ పెట్టినది. ముఖ్యముగా ఈ తరగతులకు చెందిన కులాల బాలురు విద్యాభివృద్ధి సాధించుటకై అనేక చర్యలు, ప్రోత్సాహకములు ప్రకటింపబడుచున్నవి.

మెదకు జిల్లాలో వెనుకబడిన తరగతుల (కులాల) బాలబాలికలు గణనీయముగా విద్యాభివృద్ధి నందుటకై వసతి గృహాలు, ప్రోత్సాహకాలు (స్కాలర్‌షిప్‌లు) మొదలగునవి ఏర్పాటు చేయబడినవి.

మెదకు జిల్లాలో 64 విద్యార్థుల వసతి గృహాలు (2) రెండు ఆశ్రమ పాఠశాలల వసతి గృహాలు కలవు. ఇందులో 11 వసతి గృహాలు బాలికలకు ప్రత్యేకించబడినవి. ఈ వసతి గృహాలలో మొత్తము 5665 మంది విద్యార్థులకు ప్రవేశము కల్పించబడినది.

జిల్లాలో 53 బాలురకు, 11 బాలికలకు హాస్టళ్లు కేటాయించబడినవి.

వసతి గృహాములలో 3వ తరగతి నుండి 7వ తరగతి వరకు చదువు విద్యార్థులకు 1 కి రూ. 270 చొప్పున 8 నుండి 10వ తరగతి వరకు చదువు విద్యార్థులకు 13 రూ. 330 చొప్పున మెస్ చార్జీలు, విద్యార్థులకు నెలకు రూ. 20, విద్యర్థినులకు 25 సబ్బులు, నూనె మొదలగు వాటికై మంజూరి చేయబడుచున్నవి ప్రతి విద్యార్థికి సంవత్సరమునకు రెండు జతల దుస్తులు ఉచితముగా సరఫరా చేయబడుచున్నవి. నోటుపుస్తకములు ఈ యబడుచున్నవి. పాఠ్యపుస్తకములు సంబంధిత విద్యాసంస్థల ద్వారా ఒసంగబడుచున్నవి.

66 బి.సి హాస్టల్‌లో 23 హాస్టళ్లు ప్రభుత్వముచే నిర్మితమైన చక్కని భవన సముదాయముతో కలవు. ఇంకను పాడిచన్‌పల్లి, బూరుగుపల్లి గ్రామాలలో భవనములు నిర్మాణ దశలోనున్నవి.

1999-2000 సంవత్సరమునకుగాను రూ.3,12,84,600/- ప్రభుత్వముచే విడుదల చేయబడి 1999 అక్టోబర్ నెల చివరి వరకు 1,11,42,930/- రూ. ఖర్చు చేయబడినది.

మెదకు జిల్లాలో సంగారెడ్డిలో వడ్డెర కులస్థులకు, గజ్వేల్‌లో గొల్లకురుమలకు ఆశ్రమ పాఠశాలలు, వసతి గృహములు నడపబడుచున్నవి ఇందులోని విద్యార్థులకు మిగిలిన బి.సి.హాస్టళ్లలో నుండు వసతులే కల్పించబడును.

## పోస్టుమెట్రిక్ ఉపకారవేతనములు

ఇంటర్ మీడియట్, డిగ్రీ, పాలిటెక్నిక్ మరియు పోస్టు గ్రాడ్యుయేట్ విద్యార్థులకు ఉపకార వేతనములు మంజూరి చేయబడుచున్నవి.

| | యస్.యం.హెచ్. | డేస్కాలర్ |
|---|---|---|
| 1. ఇంటర్ | 250-00 నెలకు | 115 నెలకు |
| 2. డిగ్రి | 250-00 నెలకు | 150 నెలకు |
| 3. పి.జి | 525-00 నెలకు | |

(సంబంధిత వసతి గృహాలకు)

పై విధముగా 1999-2000 సంవత్సరమునకు రూ. 1,51,000/- విడుదల చేయబడినది అందులో నుండి అక్టోబర్ 1999 వరకు రూ. 41,49,662/- 62 కళాశాలల 5314 మంది విద్యార్థులకు పంపిణీ చేయబడినవి.

## ఐ.టి.ఐ.

మెదకు జిల్లలో సంగారెడ్డి మరియు పొటాన్‌చెరులో రెండు ఐ.టి.ఐ ప్రభుత్వ సంస్థలు వివిధ కోర్సులతో నడపబడుచున్నవి. ఈ విద్యార్థులకు నెలకి రూ. 150/- చొప్పున మంజూరి చేయ బడుచున్నవి. ఈ విద్యాసంవత్సరములో రూ. 2,20,000/-ప్రభుత్వ నిధులు విడుదలకాగా అందులో నుండి అక్టోబరు 99 నాటికి రూ. 1,32,728/- 221మంది విద్యార్థులకు పంపిణీ చేయనైనవి.

## ఫీజుల రెమ్యునరేషన్

సంబంధిత విద్యాసంస్థల ప్రతిపాదనల మేరకు ట్యూషన్ మరియు స్పెషల్ ఫీజులు బి.సి విద్యార్థులకు మంజూరి చేయబడుచున్నవి.

1999-2000 విద్యాసంవత్సరమునకు రూ.6,00,000/- ప్రభుత్వముచే విడుదల చేయబడినవి.

## ఆదరణ

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము కొత్తగా ప్రవేశపెట్టిన 'ఆదరణ' పథకము వెనుకబడిన తరగతులకు చెందిన వివిధ వృత్తి పని వారల అభివృద్ధికి తోడ్పడుచున్నది ఈ పథకమునందు ఆధునికమైన చేతి పనిముట్లు మరియు చిన్న యంత్ర సామాగ్రి వెనుకబడిన తరగుతులలోని వృత్తిపని వారల ఆర్థిక స్థోమత పెంచి పనిలో నైపుణ్యమును అభివృద్ధి పరచుటే ఆశయముగా ప్రారంభింపబడినది.

రూ. 10.53 కోట్ల సబ్సిడి రూ.6.33 కోట్ల రుణము మరియు రూ. 1.82 కోట్ల లబ్ధిదారుల వాటాలతో మెదకు జిల్లాలో 30,205 మంది వృత్తి పని వారలకు సహాయమునందించు లక్ష్యముగా నిర్ణయము జరిగినది.

ఈ పథకము క్రింద లబ్ధిదారుల ఇష్టము మేరకు పనిముట్లు సరఫరా చేయుట జరుగు చున్నది. ఈ పథకము క్రింద 10-6-98 వరకు మెదకు జిల్లాలో 3593 మందికి 5103 పరికరరములు మండల స్థాయిలో పంపిణి చేయునైనది.

# ప్రత్యేక వసతి గృహములు

మెదకు జిల్లాలో 11 ప్రత్యేక వసతి గృహములు కలవు. ఈ వసతి గృహములలో 9,10 తరగతులు చదవు విద్యార్థులు మాత్రమే ఉందురు. ఈ వసతి గృహములో నుండు విద్యార్థులకు ప్రత్యేకముగా ఆంగ్లము, సామాన్యశాస్త్రము, గణితము, హింది బోధించుటకైనె 1 కి రూ. 500 లు ట్యూటర్‌కు వెచ్చించుచు ప్రత్యేక బోధన చేయించబడుచున్నది.

### మెదక్ జిల్లాలోని స్పెషల్ హాస్టల్ల పట్టిక

| వ.సం | హాస్టల్ పేరు | సాంక్షన్డ్ స్ట్రెంత్ | రినీవల్ | ఫ్రెష్ | మొత్తము |
|---|---|---|---|---|---|
| 1. బాలలు | సంగారెడ్డి | 100 | 73 | 27 | 100 |
| 2. బాలలు | తోగర్‌పల్లి | 75 | 40 | 35 | 75 |
| 3. బాలలు | దిగ్‌వాల్ | 100 | 63 | 37 | 100 |
| 4. బాలలు | జోగిపేట | 120 | 86 | 32 | 120 |
| 5. బాలలు | హత్నూర | 120 | 100 | 20 | 120 |
| 6. బాలలు | చిన్నకోడూరు | 110 | 87 | 23 | 110 |
| 7. బాలలు | గజ్వేల్ (ఎ) | 100 | 68 | 32 | 100 |
| 8. బాలలు | రామాయంపేట | 120 | 59 | 61 | 120 |
| 9. బాలలు | కొల్చారం | 100 | 90 | 10 | 100 |
| 10. బాలలు | సర్దెనా | 100 | 90 | 10 | 100 |
| 11. భాలికలు | జోగిపేట | 60 | 30 | 30 | 60 |
| | మొత్తము | **1105** | **773** | **332** | **1105** |

| జిల్లాలోని విద్యార్థి వసతి గృహాలు - పట్టిక | | | | | | |
|---|---|---|---|---|---|---|
| వ.సం | | హాస్టల్ పేరు | సాంక్షన్డ్ స్ట్రెంత్ | రినీవల్ | ఫ్రెష్ | మొత్తం |
| 1. | బాలురు | సంగారెడ్డి | 100 | 73 | 27 | 100 |
| 2. | బాలికలు | సంగారెడ్డి | 75 | 65 | 10 | 75 |
| 3. | బాలురు | పటాన్‌చెరు | 75 | 30 | 45 | 75 |
| 4. | బాలికలు | రాంచంద్రాపురం | 60 | 25 | 25 | 50 |
| 5. | బాలురు | తోగర్‌పల్లి | 75 | 40 | 35 | 75 |
| 6. | బాలురు | సదాశివపేట | 120 | 62 | 58 | 120 |
| 7. | బాలికలు | సదాశివపేట | 75 | 65 | 10 | 75 |
| 8. | బాలురు | దిగ్వాల్ | 100 | 63 | 37 | 100 |
| 9. | బాలురు | జహీరాబాద్ (ఎ) | 100 | 90 | 10 | 100 |
| 10. | బాలురు | జహీరాబాద్ (బి) | 120 | 95 | 25 | 120 |
| 11. | బాలురు | మలచెల్మా | 50 | 40 | 10 | 50 |
| 12. | బాలురు | ఝరాసంగం | 65 | 45 | 20 | 65 |
| 13. | బాలురు | రాయ్‌కోడ్ | 120 | 100 | 20 | 120 |
| 14. | బాలికలు | న్యాల్‌కల్ | 50 | 35 | 15 | 50 |
| 15. | బాలురు | కంగ్టి | 60 | 53 | 7 | 60 |
| 16. | బాలురు | క్ల్వైర్ | 80 | 73 | 7 | 80 |
| 17. | బాలురు | మెదక్ | 120 | 39 | 81 | 120 |
| 18. | బాలురు | సర్దెనా | 100 | 90 | 10 | 100 |
| 19. | బాలురు | బూరుగుపల్లి | 75 | 34 | 41 | 75 |
| 20. | బాలురు | పొడ్చన్‌పల్లి | 75 | 48 | 27 | 75 |
| 21. | బాలురు | కొత్తపల్లి | 100 | 84 | 16 | 100 |
| 22. | బాలురు | టెక్మాల్ | 75 | 33 | 42 | 75 |
| 23. | బాలికలు | అల్లాదుర్గం | 75 | 32 | 43 | 75 |
| 24. | బాలికలు | శంకరంపేట (ఎ) | 75 | 62 | 13 | 75 |
| 25. | బాలికలు | జోగిపేట | 60 | 30 | 30 | 60 |
| 26. | బాలురు | జోగిపేట | 120 | 88 | 32 | 120 |
| 27. | బాలురు | శంకరంపేట (ఎ) | 140 | 110 | 30 | 140 |
| 28. | బాలురు | పుల్కల్ | 75 | 65 | 10 | 75 |
| 29. | బాలురు | రేగోడ్ | 100 | 80 | 20 | 100 |
| 30. | బాలురు | రామాయంపేట | 120 | 59 | 61 | 120 |
| 31. | బాలురు | డి. ధర్మవరం | 75 | 53 | 22 | 75 |
| 32. | బాలురు | నార్సింగి | 100 | 80 | 20 | 100 |
| 33. | బాలురు | చేగుంట | 120 | 73 | 47 | 120 |
| 34. | బాలురు | మాసాయిపేట | 100 | 89 | 11 | 100 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 35. | బాలురు | కొల్చారం | 100 | 75 | 25 | 100 |
| 36. | బాలురు | ఎల్దుర్తి | 100 | 80 | 20 | 100 |
| 37. | బాలురు | నర్సాపురం | 100 | 83 | 17 | 100 |
| 38. | బాలురు | కౌడిపల్లి | 120 | 108 | 12 | 120 |
| 39. | బాలురు | గోమారం | 75 | 71 | 4 | 75 |
| 40. | బాలురు | హత్నూర | 120 | 100 | 20 | 120 |
| 41. | బాలురు | సిర్‌పురా | 80 | 48 | 32 | 80 |
| 42. | బాలురు | దౌల్తాబాద్ | 50 | 40 | 10 | 50 |
| 43. | బాలురు | కానుకుంట | 75 | 68 | 7 | 75 |
| 44. | బాలురు | సిద్దిపేట (ఎ) | 120 | 92 | 28 | 120 |
| 45. | బాలురు | సిద్దిపేట (బి) | 100 | 81 | 19 | 100 |
| 46. | బాలురు | మిట్టపల్లి | 75 | 52 | 23 | 75 |
| 47. | బాలురు | తడ్కపల్లి | 75 | 51 | 24 | 75 |
| 48. | బాలురు | వెల్కటూర్ | 100 | 73 | 27 | 100 |
| 49. | బాలురు | గుజ్జలగొండి | 100 | 77 | 23 | 100 |
| 50 | బాలురు | నంగనూరు | 100 | 84 | 16 | 100 |
| 51. | బాలురు | తోర్నాల్ | 100 | 84 | 16 | 100 |
| 52. | బాలురు | చిన్నకోడూరు | 110 | 87 | 23 | 110 |
| 53 | బాలికలు | కొండపాక | 50 | 38 | 12 | 50 |
| 54. | బాలురు | దుబ్బాక | 100 | 75 | 25 | 100 |
| 55. | బాలికలు | దుబ్బాక | 100 | 81 | 19 | 100 |
| 56. | బాలురు | మిర్‌దొడ్డి | 75 | 60 | 15 | 75 |
| 57. | బాలురు | గజ్వేల్ (ఎ) | 100 | 28 | 32 | 100 |
| 58. | బాలురు | గజ్వేల్ (బి) | 50 | 34 | 16 | 50 |
| 59. | బాలికలు | గజ్వేల్ | 50 | 40 | 10 | 50 |
| 60. | బాలురు | వరంగల్ | 75 | 51 | 24 | 75 |
| 61. | బాలురు | తూప్రాన్ | 120 | 90 | 30 | 120 |
| 62. | బాలురు | తిగుల్ | 75 | 50 | 25 | 75 |
| 63. | బాలికలు | ములుగు | 50 | 42 | 8 | 50 |
| 64. | బాలురు | జగదేవ్‌పూర్ | 100 | 71 | 29 | 100 |
| **గొట్టి కాపర్ల (గొల్లకురుమల) హాస్టళ్లు** | | | | | | |
| 65. | బాలలు | (ఎ/ఎస్) సంగారెడ్డి | 50 | 25 | 25 | 50 |
| 66. | బాలలు | గజ్వేల్ | 50 | 25 | 25 | 50 |
| | | మొత్తము : | **5765** | **4207** | **1558** | **5765** |

| క్ర.సం | | సంఖ్య | మంజూరియిన బోర్డర్ల సంఖ్య | ప్రస్తుతమున్న బోర్డర్ల సంఖ్య |
|---|---|---|---|---|
| 1. | సాంఘిక సంక్షేమ బాలుర వసతి గృహాలు | 69 | 8100 | 7480 |
| 2. | సాంఘిక సంక్షేమ బాలికల వసతి గృహాలు | 15 | 2300 | 90 |
| 3. | ఆనందనిలయము బాలికల వసతి గృహాలు | 2 | 200 | 90 |
| 4. | ఆనందనిలయము బాలుర వసతి గృహాలు | 1 | 100 | 68 |
| 5. | బిక్షుకుల వసతి గృహాలు | 1 | 50 | 16 |
| | మొత్తము | **88** | **10750** | **9925** |

| వ.సం | స్కీమ్ | 1999-2000 | | లబ్ధిదారులు | రిమార్క్స్ |
|---|---|---|---|---|---|
| 1. | ప్రభుత్వ హాస్టల్ | 3,12,84,600 | 1,11,42,930 | 5665 బోర్డర్స్<br>64 హాస్టళ్లు | 64 (ప్రభుత్వ హాస్టళ్ళు), 53 బాలలు, 11 బాలికలకు ఈ హాస్టల్స్, 4955 బాలలు బాలికలు మరియు 710 మొత్తము(5665) విద్యార్థులు |
| 2. | ఆశ్రమ్ స్కూల్స్ హాస్టల్స్ | 6,41,930 | 2,92,285 | 100 బోర్డర్లు<br>2 హాస్టళ్లు | |
| 3. | పోస్ట్-మెట్రిక్ ఎస్/షిప్ | 1,51,00,000 | 41,49,662 | 5314 బి.సి విద్యార్థులు | కవరింగ్ (12) కాలేజిలు |
| 4. | రి-అంబర్స్‌మెంట్ ఆఫ స్పెషల్ ఫీస్, ట్యూషన్ ఫీస్ | 6,00,000 | - | - | ప్రపోసల్స్ ఆర్ అవేటడ్ ఫ్రంమ్ ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూషన్స్. |
| 5. | ఐ.టి.ఐ విద్యార్థులకు స్టైఫెండ్ | 2,20,000 | 1,32,728 | 221 విద్యార్థులు | - |
| 6. | నోటు పుస్తకముల పంపిణి | - | - | - | అన్ని హాస్టళ్లకు ఎడ్యుకేషన్ డిపార్టుమెంటు ద్వారా ఉచితముగా నోటు పుస్తకాల పంపిణి. |
| 7. | స్పెషల్ హాస్టల్ | 1,57,000 | - | - | పనిచేయుచున్న స్పెషల్ హాస్టళ్లలో (10)బాలలవి, (1) బాలికలవి |
| 8. | నోటుపుస్తకాల పంపిణి | - | - | - | అన్ని ప్రభుత్వ బి.సి హాస్టళ్లకు నోటు పుస్తకముల పంపిణి |
| 9. | యూనిఫార్మ్ డ్రెస్సెస్ టూ బోర్డర్స్ | 9,17,000/- | - | | Necesary action is being taken for purchase of cloth |
| 10. | ఇంటర్ కాస్ట్ మ్యారేజెస్ | | 5,000/- | - | One proposal is under scrutiny. |

# షెడ్యూల్డు కులముల సేవాసహకార సంస్థ

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వము షెడ్యూల్డ్ కులముల వారి అభ్యున్నతికై ఒక సేవా సహకార సంస్థను ఏర్పాటు చేసినది. ఈ సంస్థ మెదకు జిల్లాలో సంగారెడ్డి కేంద్రముగా పని చేయుచున్నది.

ఈ సంస్థ యొక్క దారిద్ర్యరేఖ క్రిందనున్న షెడ్యూల్డు కులముల వారికి ఆర్థిక సహాయమును అందించుచు వారి జీవన స్థాయిని పెంపొందించి తద్వారా వారికి సంఘమున గుర్తింపు తెచ్చుటకై ప్రయత్నించుచున్నది. దీనికి అనువుగా వ్యవసాయము, చిన్నతరహా నీటి సేద్యము పండ్లతోటలు పెంపకము పట్టుపరిశ్రమ, కూరగాయలు, పూలతోటలు, పాడిగేదెల పెంపకము, భూమికొనుగోలు, భూమి అభివృద్ధి వంటి ఎన్నో కార్యక్రమములను చేపట్టి ఆర్థికముగా ఎదుగుటకై ప్రోత్సహించుచున్నది. జోగినులు మరియు పాకీపనివారు మొదలైన వారికి పునరావాస పథకమును గల్పించి వారిలో ఆత్మస్థైర్యమును కల్పించుచున్నది. ఇవియేకాక రాష్ట్ర శాఖ వారు సూచించు యితరమైన అభివృద్ధి కార్యక్రమముల చేపట్టుట జరుగుచున్నది.

మెదకు జిల్లా షెడ్యూల్డు కులముల సేవాసహకార సంస్థ వారు చేపట్టుచున్న కార్యక్రమములు.

## 1. సామూహిక వ్యసాయ బావులు

ఈ పథకము క్రింద ఒక్కొక్క బావికి రూ. 27,200/- రూపాయలు జవహర్ రోజ్‌గార్ యోజన నిధుల నుండి ఖర్చుచేయబడును. ఇట్టి బావి మంజూరి కొరకు మండల అభివృద్ధి అధికారి కార్యాలయ సిబ్బందిచే 2 1/2 ఎకరములు (రెండున్నర ఎకరములు) విస్తీర్ణము ఒకే దగ్గర కలిగియుండి ఇద్దరు లబ్దిదారులు ఉన్నటు వంటి వారిని గుర్తించి వారి భూములకు సంబంధించిన ఎంజాయిమెంటు (అనుభవ పత్రము) సర్టిఫికేటు మరియు అట్టిభూమిలో ఎటువంటి బావి మంజూరి చేయనట్లు ధృవీకరించిన ప్రతిపాదనలు ఈ సంస్థకు పంపించబడును. వాటిని సరిచూచి సక్రమమైన ప్రతిపాదనలను భూగర్భజల పరిశోధన శాఖ వారికి పంపి వారిచే సర్వేజరిపించి వారి సిఫారుసుమేరకు జిల్లా కలక్టరుచే మంజూరి చేయబడును. ఇట్టి బావికై ఇచ్చు ధనము ఉచితముగా నీయబడును.

ఈ పథకములో నేటికి 800 బావులను 217 లక్షల ఖర్చుతో త్రవ్వించుట జరిగినది.

## 2. బోరుబావులు

మూడు నుండి ఎనిమిది మంది లబ్దిదారులు ఒకేచోట కనీసము 10 ఎకరముల (పది) విస్తీర్ణము కల్గియున్నచో ఈ పథకము క్రింద ఒక్కొక్క బోర్‌వెల్‌కు రూ. 52,900/- మంజూరి చేయబడును.

ఇట్టి డబ్బులో 50% జాతీయ షెడ్యూల్డు కులముల మరియు తెగల ఆర్థికాభివృద్ధి సంస్థ నుండి రుణముగాను మిగిలిన 50% డి.ఆర్.డి.ఏ నుండి సబ్సిడీగాని యస్.సి.ఏ నుండి సబ్సిడిగాని ఒక్కొక్కరికి రూ. 5000/-లు మించకుండా మంజూరి చేయబడును.

ఈ పథకములో నేటికి 100 బోర్‌బావులు 52.9 లక్షలు ఖర్చుతో త్రవ్వించనైనవి.

## 3. విద్యుత్ మోటర్లు

ఈ పథకము క్రింద నేటికి 2275 విద్యుత్ మోటర్లు మంజూరి చేయనైనవి. ఇందులో 5 హెచ్.పి. మోటరుకు రూ. 10,000/- (పది వేల రూ.) చొప్పున 3 హెచ్. పి. మోటారు కు రూ. 8700/- (ఎనిమిది వేల ఏడు వందల రూ.) చొప్పున మంజూరి చేయనైనవి.

## 4. ఫిల్టరు పాయింటు

ఈ పథకము క్రింద ఒక్కొక్క ఫిల్టరుకు రూ. 20,000/- (ఇరువైవేల రూ.) ఖర్చు చేయుట జరుగును. వీటి ఎంపికకు కనీసము ముగ్గురు లబ్ధిదారులు 3 3/4 ఎకరముల విస్తీర్ణము ఒకే దగ్గర కల్గియుండ వలయును. ఈ పథకమునందు 50% జాతీయ షెడ్యూల్డు కులముల మరియు తెగల ఆర్థికాభివృద్ధి సంస్థ (యన్.ఎస్.ఎఫ్.డి.సి) నుండి రుణముగాను మిగిలిన 50% యస్.సి.ఏ క్రింద సబ్సిడిగా ఒక్కొక్క పాయింటుకు 5000 రూ. (ఐదువేల రూ.) మించకుండా మంజూరి చేయబడును.

## 5. ఎత్తిపోతల పథకము

షెడ్యుల్డు కులములకు చెందిన చిన్నసన్నకారు రైతుల నీటి వసతిలేని భూములకు నది లేదా వాగు మొదలగు నీటి వనరుల నుండి ఎత్తిపోతల ద్వారా నీటి వసతి కల్పించుట. ఇట్టి పథకము అమలు చేయుటకై ఒకే దగ్గర 25 ఎకరములు అందుకు మించి యుండవలయును.

ఇందులో 50% యన్.యస్.యఫ్.డి.సి క్రింద రుణముగాను మిగిలిన 50% ఎస్.సి.ఎ క్రింద సబ్సిడిగాను ఒక్కొక్కరికి 5000/- మించ కుండా మంజూరి చేయబడును.

## 6. పండ్లతోటల పెంపకము

డాక్టరు అంబేడ్కర్ పండ్లతోటల పథకము క్రింద రూ.8130 (ఎనిమిది వేల ఒకవంద ముప్పది రూ.) ఖర్చు చేయబడును. వీటి ఎన్నికకు లబ్ధిదారునకు 1 1/4 ఎకరము భూమి నీటి వనరుల గలదై యుండ వలయును. మరియు ఒకే గ్రామములో 10 ఎకరములకు తక్కువగాకుండా యుండ వలయును. ఈ పథకము యాభై శాతం యన్.యస్.యఫ్.డి.సి. క్రింద రుణముగాను మిగిలిన 50% డి.ఆర్.డి.ఏ సబ్సిడి రూపంలో మంజూరి చేయబడును.

ఈ పథకము ద్వారా నేటికి 500 ఎకరములలో రూ. 40.6 లక్షలు మంజూరి ఈయబడినవి.

## 7. పూలతోటలు

ఈ పథకము క్రింద మల్లె, కనకాంబరం, చావంతి, బంతి పూల తోటలు పెంచుటకు నిర్ణయించనైనది. ఒక్కొక్క రైతు అర ఎకరము నుండి ఒక ఎకరము వరకు సాగు చేసికొన వచ్చును. చామంతి, బంతి సీజనుల తోటలు మల్లె మాత్రము ఒకసారి వేసినచో 7 నుండి 10 సంవత్సరముల వరకు పూత పూయును. దీనియొక్క యూనిటు కాస్టు ఎకరము రూ. 13,000/- (పదమూడు వేల రూ.) కనకాంబరం పూల నుండి అధిక లాభమును పొందవచ్చును అనగా ఒక ఎకరాకు 35,000 నుండి 40,000 రూ. వరకు పొందవచ్చును. సంవత్సరములో 8 మాసములు పూలువచ్చును. ఒకసారి వేసిన కనకాంబరం తోటను 3 నుండి 4 సంవత్సరముల వరకు ఫలసాయము పొందవచ్చును. దీని యూనిట్ కాస్టు ఎకరాకు 11,600/- రూ. మంజూరి చేయవచ్చును.

## 8. కూరగాయల తోట

కూరగాయల పెంపకమునకై లబ్ధిదారునకు కనీసము అర ఎకరము విస్తీర్ణము నుండి నీటి వసతి కలిగియుండవలెను. ఈ పథకము క్రింద ఎకరాకు రూ. 3000/- (మూడు వేల రూ.) సంస్థ ద్వారా రుణ రూపమున మంజూరి చేయబడను.

## 9. ఫ్రూట్‌నర్సరీ

ఈ పథకము క్రింద ప్రతి సంవత్సరము 10 యూనిట్లు యూనిట్ ఒక్కింటికి రూ. 12000/- చొప్పున మంజూరి చేయుదురు.

## 10. భూసంరక్షణ

ఈ పథకము క్రింద ప్రభుత్వముచే ఆలాటు చేయబడిన సీలింగ్ సర్‌ప్లస్ ల్యాండ్, మరియు అసైన్ ల్యాండ్ భూములు చదును చేయుటకు ఎకరా ఒక్కింటికి రూ. 1200/- చొప్పున మంజూరి చేయబడును. ఈ పథకము ద్వారా నిరుపయోగము గానున్న భూములు సాగులోనికి తెచ్చుటకు సంస్థ ద్వారా కృషి జరుగుచున్నది.

## 11. పట్టుపరిశ్రమ

ఈ పథకమునందు లబ్ధిదారునకు 1 1/4 ఎకరములు నీటి వసతి గల్గిన భూమియుండ వలయును, ఒకే గ్రామములో 10 ఎకరములకు తక్కువగాకుండా పథకము అమలు చేయబడును. ఈ పథకము క్రింద 13300/- మంజూరి చేయబడును ఇందులో 30% రుణముగను 20% మార్జిన్ మనీగను 50% డి.ఆర్.డి.ఎ సబ్సిడి రూపముగను మంజూరి చేయబడును.

నేటికి 100 ఎకరములకు 13.3 లక్షలు మంజూరి చేయనైనవి.

## 12. పాడిగేదెల పెంపకము

ఈ పథకము క్రింద రెండు గేదెలకు రూ.10200/- మంజూరి చేయబడును.

ఈ పథకమును మంజూరి చేయు గ్రామమున పాలసేకరణ కేంద్రము, మరియు పశువైద్యశాలయుండ వలయును.

## 13. భూమి కొనుగోలు పథకము

ఈ పథకము క్రింద షెడ్యుల్డు కులముల వ్యవసాయ కూలీలకు మెట్టభూమి 2 ఎకరములు, ఎకరమునకు రూ.10000 /- మించకుండా లేదా ఎకరము మాగాణి ఎకరమునకు 24000/- మించకుండా కొనుగోలు చేసి పంపిణీ చేయుట జరుగును. ఇట్టి భూమి కొనుగోలుకు ముందు ఈ సంస్థ ఏ.పి.ఓ. (వ్యవసాయాధికారి) భూమి సారవంతమని ధృవీకరించవలయును. తదుపరి భూగర్భ జలపరిశోధన వారు సర్వేచేసి నీరు పుష్కలముగానున్నదని ధృవీకరించ వలయును. భూమి ధర లబ్ధిదారు అంగీకరించిన తదుపరి కొనుగోలు కమిటీచే ఖరీదు చేయబడును. ఇందుకు 20% మార్జిన్ మనీగా రూ. 5000/- సబ్సీడీగా మిగిలినది బ్యాంకు రుణముగా నుండును.

దీని ఎన్నికకు సంబంధిత మండల రెవెన్యూ అధికారి భూమిలేని వ్యవసాయ కూలీలుగా గుర్తించి ధృవీకరించవలెను.

## 14. పాకీ వారి పునరావాస పథకము

ఈ సంస్థ ద్వారా పాకీవారికి 250 మంది లబ్ధిదారులకు రూ.37.50 లక్షలతో ప్రత్యామ్నాయ జీవన భృతిని కల్పించబడినది.

వీరికి చిన్నతరహా వ్యాపార పథకాలకై ఆర్థిక సహాయము చేయనైనది.

## 15. జోగినీ పునరావాసం

ఈ సంస్థ మెదకు జిల్లాలో నేటికి 302 మంది జోగినులను గుర్తించి వారిని జోగినీ వృత్తి నుండి విముక్తి చేసి వారికి పునరావాసము కల్పించినది.

ఈ సంస్థ ఇప్పటి వరకు 102 మంది జోగినులకు వృద్ధాప్య పెన్షన్ మంజూరి కొరకు ప్రతిపాదనలు సంబంధిత ఆర్.డి.ఓ.లకు పంపబడినవి. 10 మంది జోగినులకు చంద్రికలు అల్లుటయందు శిక్షణ యిప్పించబడినది. 23 మంది జోగినులకు చర్మా రీలింగ్ నందు శిక్షణ యిప్పించనైనది. 20 మంది జోగినులకు కుట్టు శిక్షణ యిప్పించనైనది, 77 మంది జోగినులకు వివిధ స్కీములు మంజూరి చేయనైనవి. మిగిలిన వారికి పునరావాసముకై స్కీమల నిచ్చుటకు ప్రయత్నము జరుగుచున్నది. జోగినులలో 32 మందికి గృహ వసతి కల్పించబడినది.

## 16. బాండెడ్ లేబర్ పునరావాసము

ఈ పథకము క్రింద 12857 మందిని గుర్తించి వివిధ స్కీముల ద్వారా పునరావాసము కల్పించనైనది. బండెడ్లు, పాడిపశువులు మొదలగునవి యిప్పించనైనవి.

ఇందుకు 9.25 లక్షల రూపాయలు వ్యయపరచుట జరిగినది.

## 17. పౌల్ట్రీ ఫారం

గజ్వేలు నందలి పౌల్ట్రీ ఫారంను పునరుద్ధరించి 12 మంది హరిజనులకు ఒక్కొక్కరికి 500 కోడి పిల్లలను ఇచ్చుట జరిగినది.

ఈ విధముగా మెదకు జిల్లాలో షెడ్యూల్డు కులముల వారి అభ్యున్నతికి ఈ సంస్థ ఇతోధికముగా కృషి సల్పుచున్నది.

## షెడ్యూల్డు కులముల సంక్షేమం

షెడ్యూల్డు కులముల సంక్షేమం కొరకు ప్రభుత్వము ఎన్నో రకాలుగా సహాయము అందజేస్తున్నది. అంతే కాకుండ వారి ఆర్థిక పరిస్థితి కొరకు ఎన్నో రకముల పథకములను చేపట్టి ఆర్థికాభివృద్ధి కొరకు పాటు పడుచున్నది.

| క్ర.సం. | పథకము పేరు | 1995-96 | 1999-2000 |
|---|---|---|---|
| 1. | ఐ.ఆర్.డి.పి | 2768, 376.377 | 340, 26.664 |
| 2. | హార్టికల్చర్ | 827, 14.588 | 622, 27.839 |
| 3. | పశు సంరక్షణ | 38, 1.94 | - |
| 4. | యువతకు ప్రోత్సాహకము | 503, 58.45 | 45, 9.670 |
| 5. | పారిశుద్ధ పనివారలకు | 503, 32.120 | 226, 24.145 |
| 6. | పాదరక్షలు తయారీ | 22, 2.14 | 1, 0.17 |
| 7. | మహిళా ఉపాధి పథకము | 231, 2.130 | - |
| 8. | శిక్షణా కార్యక్రమములు | 67, 0.162 | - |
| 9. | సి.ఎమ్.ఇ.వై | - | 99, 3.29 |
| 10. | భూమి కొనుగోలు | 465, | 71.11 |
| | **మొత్తము** | **4047, 559.197** | **1438, 93.128** |
| | మొత్తము లబ్ధిదారులు | : | **22402** |
| | **1995 నుండి 1999-2000 వరకు** | | |
| | మొత్తము విలువ | : | రూ. **2322.945** లక్షలు |

# షెడ్యూల్డు తెగల సంక్షేమం

షెడ్యూల్డు తెగలు అభివృద్ధి కొరకు వారు నివసించే ప్రాంతాలలో విస్తృతముగా ప్రభుత్వము వివిధ సంక్షేమ కార్యక్రమాలు అమలు చేయుట జరుగుచున్నది.

ఎన్.ఎస్.ఎఫ్.డి.సి. పథకము క్రింద ఒక్కో యూనిట్‌కు రూ. 0.30 నుండి రూ.3.16లక్షల రూపాయలు వరకు గిరిజన యువతకు ఉపాధి పథకాలు చేపట్టేందుకు సహాయము చేయుట జరుగుచున్నది.

వ్యవసాయ రంగంలో షెడ్యూల్డు తెగల వ్యవసాయ అభివృద్ధి రూ. 10.00 లక్షల ఖర్చుతో 376 సేద్యపు బావులకు విద్యుద్దీకరణ చేయుట జరిగినది.

ముఖ్యమంత్రి యువశక్తి పథకము ద్వారా గిరిజన సంఘములకు 365ఆర్థిక సహాయము అందజేయబడుచున్నది.

చైతన్యం పథకము క్రింద రు.68.12 లక్షల అంచనాలతో 100 వృత్తి పనుల వారికి మరియు 526 మంది భూమిలేని గిరిజన నిరుపేదలకు వివిధ పథకముల ద్వారా ఆర్థిక సహాయము అందజేయబడుచున్నది.

మెదక్ జిల్లా నర్సాపూర్ గ్రామంలో షెడ్యూల్డు తెగల విద్యాభ్యాసం కొరకు రూ. 2.70 కోట్ల వ్యయంతో రెసిడెన్షియల్ పాఠశాల నిర్మాణం జరుగుచున్నది.

విద్యారంగంలో షెడ్యూల్డు తెగల బాలబాలికలకు విద్యాభ్యాసం కొరకు ఉపకారవేతనములు, నోటు పుస్తకములు మరియు దుస్తులు మొదలైనవి అందించబడుచున్నవి.

ప్రతిభావంతులైన షెడ్యూల్డు తెగల బాలబాలికలను గుర్తించి వారిని అందుబాటులో ఉన్న ఉత్తమ పాఠశాలలో విద్యాభ్యాసం కొరకు చేర్పించడం జరుగుచున్నది.

# స్త్రీ శిశు సంక్షేమం

మెదకు జిల్లాలో స్త్రీ శిశు సంక్షేమశాఖ ద్వారా స్త్రీలను అన్ని రంగాలలో పైకి తీసుకురావడానికి ప్రభుత్వం కృషి చేస్తుంది.

మహిళా ఉద్యోగినుల కొరకు మెదక్ జిల్లా కేంద్రమైన సంగారెడ్డిలో 1 హాస్టల్ భవనము మంజూరీ అయినది. 6 నెలల నుండి 6 సంవత్సరములలోపు పిల్లలకై జిల్లా యందు 7 క్రేషలు, 7 బాల్వాడీలు, 2 స్త్రీ సంక్షేమ కేంద్రములు మరియు బాలికల కొరకు 4 బాలసదనములు నడుపబడుచున్నవి.

## ఐ.సి.డి.యస్. పథకము :

మెదక్ జిల్లాలో 1636 మథర్ కమిటీలను ఏర్పాటు చేయడమయినది. ఐ.సి.డి.యస్. పథకము క్రింద రూ. 123.66 లక్షలు సుమారు 85,530 లబ్దిదారులకు పంపిణీ చేయడము జరిగినది.

జిల్లాలోని 76 గ్రామాలలో (11 సంవత్సరాల నుండి 15 సంవత్సరాలు) కిశోర బాలికలకు బ్రిడ్జి కోర్సు నిర్వహించడము జరుగుతున్నది. జిల్లా యందు 453 అంగన్వాడి భవనములు, 3 ప్రాజెక్టు కార్యాలయ భవనముల నిర్మాణము మరియు 232 అంగన్వాడీ కేంద్రాలలో చేతిపంపులు వేయడం జరుగుచున్నది. ఇందుకు గాను రూ. 305.00 లక్షలు మంజూరి అయినది.

## బాలికా సంరక్షణా పథకము :

ఈ పథకము ద్వారా బాలికలను స్కూళ్లలో చేర్పించి చదువు చెప్పించుట బాలికలకు లాంగ్‌టర్మ్ డిపాజిట్లు ప్రభుత్వ ఆర్థిక సహాయముతో చేయుట మరియు 18 సంవత్సరములు నిండిన తరువాతనే బాలికలు పెండ్లి చేసుకొనుటకు ప్రోత్సాహము చేయుట జరుగుతుంది. 96-97 సం॥ లో 1835 మంది బాలికల కొరకు సుమారు 0.85 లక్షలు వినియోగించుట జరిగినది. 1997-98 సం॥ లో రూ. 0.85 లక్షలతో 1662 మంది బాలికల కొరకు వినియోగించుట జరిగినవి. 1998-99 సం॥ లో రూ. 0.14 లక్షలతో 260 మంది బాలికల కొరకు వినియోగించనైనవి.

## బాలికా సమృద్ధి యోజన :

ఈ పథకము 4వ విడత జన్మభూమి కార్యక్రమము గాంధీ జయంతినాడు ప్రారంభించుట జరిగినది. ఈ పథకము క్రింద రూ. 2.00 లక్షలు 400 మంది ఆడపిల్లలుకు ఒక్కొక్కరికి 500 చొప్పున ఆగష్టు 15 మరియు సెప్టెంబరు 15, 1997 మధ్యకాలంలో పుట్టిన ఆడపిల్లలకు పంపిణీ చేయుట జరిగినది.

రూ.3.46 లక్షలు 692 మంది ఆడపిల్లల కొరకు 1-10-97 నుండి 31-03-1998 మధ్యకాలంలో జన్మించిన ఆడపిల్లకు పంపిణీ చేయుట జరిగినది. రూ. 2.73 లక్షలు 546 మంది ఆడపిల్లల కొరకు 01-01-1999 తరువాత పుట్టిన ఆడపిల్లలకు పంపిణీ చేయుట జరిగినది.

# అల్ప సంఖ్యాక వర్గాల ఆర్థిక సంస్థ

మెదకు జిల్లాలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ అల్పసంఖ్యాక వర్గాల ఆర్థిక సంస్థ 1986 లో ప్రారంభింపబడినది. అల్ప సంఖ్యాక వర్గాల ఆర్థికాభ్యున్నతికై తక్కువ వడ్డీ పై బ్యాంకుల ద్వారా అప్పులనిప్పించుచు మార్జిన్ మనీగా ఈ సంస్థ కొంత ధనము సాయము చేయుచున్నది.

1991 జనాభాలెక్కల ప్రకారము అల్ప సంఖ్యాక వర్గాలవారు మెదకు జిల్లాలో 2,90,839 మంది కలరు. వారిలో మహమ్మదీయులు 2,61,395 క్రైస్తవులు 28,533, బౌద్ధులు 183, సిక్కులు 533, జైనులు 195 మంది నివసించుచున్నారు.

మైనారిటీస్ కార్పొరేషన్ మూడు ముఖ్యమైన కార్యక్రమములను చేపట్టినది.

### 1. బీద తనమును పోగొట్టుట (యాంటి పావర్టి ప్రోగ్రామ్)

ఈ పథకము ప్రకారము దారిద్ర్యరేఖకు దిగువనున్న అల్ప సంఖ్యాక వర్గము వారికి రూ.15,000/- మించని యూనిట్ బ్యాంకు ద్వారా మంజూరి చేయించి రూ. 3750-00 (మూడు వేల ఏడు వందలలో) మార్జిన్ మనీగా సంస్థ ద్వారా యిచ్చి నిత్య సంపాదన పరులుగా చేయుట.

### 2. స్వయం ఉపాధి పథకము

ఈ పథకము ద్వారా అల్ప సంఖ్యాక వర్గాల వారిలోనున్న విద్యావంతులైన యువతీ యువకులకు రూ. 3,00,000 మించని అప్పు బ్యాంకు ద్వారా 50,000 మార్జిన్ మనీగా యిచ్చి వారు స్వయముగా జీవనోపాధినొందుటకు ప్రోత్సహించుట.

### 3. కేంద్ర అల్పసంఖ్యాక వర్గాల అభివృద్ధి మరియు ఆర్థిక సంస్థ

ఈ సంస్థ అల్పసంఖ్యాక వర్గాల వారిని ఆర్థికముగా ఆదుకొనుటకై ఉద్దేశింపబడినది. ఈ సంస్థ ద్వారా మైనారిటీలకు అప్పు రూపమున మరియు మార్జిన్ మనీ రూపమున ధన సహాయమొనరించుటకు కొన్ని స్కీములను రూపొందించినది. ఈ సంస్థ ద్వారా పేదరికమున మగ్గుచున్న స్త్రీలకు మరియు యువకులకు తక్కువ వడ్డీపై అప్పులిచ్చి స్వయం ఉపాధి పథకములను అమల పరచుకొనునట్లు ప్రోత్సహించుచున్నది.

మెదకు జిల్లా మైనారిటీస్ కార్పొరేషన్ 1998 - 99 సంవత్సరమున 554 కుటుంబములకు మార్జిన్‌గా 44,29,000 (నలుబది నాలుగు లక్షల ఇరువది తొమ్మిది వేల రూ.) పంపిణీ చేసినారు.

కేంద్ర అల్పసంఖ్యాక వర్గాల అభివృద్ధి మరియు ఆర్థిక సంస్థ ద్వారా వివిధ స్కీంలలో ఆర్థిక రుణ సదుపాయంచే నెలకొంటున్న కొన్ని స్వయం ఉపాధి పథకాలు

| క్ర.సం | స్కీం పేరు | యూనిట్ ఖర్చు | ఆర్థిక సహకారము అందించు సూచనలు | | | |
|---|---|---|---|---|---|---|
| | | | ఎన్.ఎమ్.డి.ఎఫ్.సి | ఎ.పి.ఎస్.ఎం.పి.సి. | రుణగ్రస్తుని వాట | బ్యాంక్ లోన్ |
| 1. | టైలరింగ్ | 16,000 | 25% | 10% | 10% | 55% |
| 2. | రిఫ్రిడ్జరేషన్ ఏయిర్ కండిషన్ | 10,000 | 25% | 10% | 10% | 55% |
| 3. | లేత్ మిషిన్, జెనరల్ ఇంజనీరింగ్ | 1,00,000 | 25% | 10% | 10% | 55% |
| 4. | కూరగాయలు - పండ్లు | 8,500 | 25% | 10% | 10% | 55% |
| 5. | చెప్పుల దుకాణాలు | 25,000 | 25% | 10% | 10% | 55% |
| 6. | వీడియోగ్రఫీ | 45,000 | 25% | 10% | 10% | 55% |
| 7. | మెడికల్ షాప్ | 1,00,000 | 25% | 10% | 10% | 55% |
| 8. | రెగ్జిన్ వర్క్స్ | 25,000 | 25% | 10% | 10% | 55% |
| 9. | బేకరి | 25,000 | 25% | 10% | 10% | 55% |
| 10. | పాన్‌షాప్ | 15,000 | 25% | 10% | 10% | 55% |
| 11. | టి.వి. రేడియో సర్వీసింగ్ | 15,000 | 25% | 10% | 10% | 55% |
| 12. | బ్యాటరీ సర్వీసింగ్ | 16,000 | 25% | 10% | 10% | 55% |
| 13. | ఆర్క్ వెల్డింగ్ | 25,000 | 25% | 10% | 10% | 55% |
| 14. | గ్యాస్ వెల్డింగ్ | 8,000 | 25% | 10% | 10% | 55% |
| 15. | మాంసం దుకాణం | 12,500 | 25% | 10% | 10% | 55% |
| 16. | ఆటో రిక్షా | 50,000 | 25% | 10% | 10% | 55% |

**1999 - 2000 సంవత్సరమున సంస్థ ద్వారా చేపట్టుటకు నిర్ణయించిన టార్గెట్**

| క్ర.సం | పథకముల పేర్లు | భౌతిక | మార్జిన్ మనీ | అభ్యర్థి వాట | బ్యాంక్ లోన్ | మొత్తము లోన్ |
|---|---|---|---|---|---|---|
| 1. | పేదరికం నిర్మూలన పథకము | 373 | 14.17 | - | 41.78 | 55.95 |
| 2. | స్వయం ఉపాధి పథకము | 320 | 64.00 | 32.00 | 224.00 | 320.00 |
| 3. | ఎన్.ఎమ్.డి.సి. | 237 | 39.55 | 11.30 | 62.15 | 113.00 |
| 4. | సి.ఎం.ఇ.వై. | 69 | 6.90 | - | - | - |
| 5. | డి.ఓ.ఎమ్.డబ్ల్యు.యు.ఎ. | 50 | 7.50 | - | - | - |
| 6. | స్కాలర్‌షిప్‌లు | - | 5.05 | - | - | - |
| 7. | వొకేషనల్ ట్రేనింగ్ | - | 6.00 | - | - | - |
| 8. | హెల్త్ క్యాంప్స్ | - | 1.20 | - | - | - |
| 9. | తత్కాల్ స్కీం | 110 | 7.70 | - | - | - |
| | **మొత్తం** | **1159** | **152.07** | **43.30** | **327.93** | **488.9** |

# వైద్య - ఆరోగ్య శాఖ

ప్రాచీన కాలమున రాజుల ఏలుబడిలో ప్రజా సంక్షేమ కార్యక్రమములు జరుపుబడుచున్నట్లు కొన్ని గ్రంధముల ద్వారా తెలియుచున్నది. ముఖ్యముగా తెలుగుదేశాన ఆంధ్ర మహాభారత గ్రంధమును పరిశీలన గావించినచో నాటి ప్రజాసంక్షేమ కార్యక్రమములు బయటపడును. తిక్కన గారి కాలమున ఆనాటి రాజులు జూపిన ప్రజా సంక్షేమ కార్యక్రమములు ఆంధ్ర మహా భారతమునందగు పడుచున్నవి. నారద ధర్మజ సంభాషణమున వైద్యుల నియామకమున్నట్లు తెలియు చున్నది. నేడు జరుపబడుచున్నంత విశాల ప్రాతిపదికన కాకున్నను కొంత మేరకు ప్రజారోగ్యమును గూర్చినాటి ప్రభుత్వములు పట్టించుకొన్నట్లుగు అగుపడుచున్నది. క్రీ.శ.1844 సంవత్సరమున నిజాం రాష్ట్రమున వైద్యశాల స్థాపించబడినది. తద్వారా మెదకు జిల్లాలో కూడా వైద్యాలయములేర్పాటైనవి.

మొదట వైద్య చికిత్సా కార్యక్రమములను రెసిడెన్సీ సర్జన్ నిర్వహించు చుండెను. వైద్యశాలల పర్యవేక్షకునకు సహాయకునిగా వాజిమ్‌దవాఖానే జాత్ అనుపదవి ఏర్పాటై ఆ పదవిలో జిల్లా కొరకు నియమింపబడుచుండిరి.

క్రీ.శ. 1889 లో దస్తూరుల్ అమల్ అను శాసనము ద్వారా భూమిశిస్తులో రూపాయికి ఒక అణాచొప్పున (1/16 రూపాయి) స్థానిక రుసుము వసూలగుచుండెను. ఆస్థానిక పన్ను నుండి ఒక్క పైసా (1/96 రూ.) ఆరోగ్య శాఖకు అందించ బడుచుండెను. క్రీ.శ. 1918-19 నాటికి ఈ చెల్లింపు ఒక పైస నుండి రెండు పైసలకు పెంచబడినది.

క్రీ.శ. 1890 నాటికి మెదకు జిల్లాలో మెదకు- సిద్ధిపేట - సంగారెడ్డి - జోగిపేటలో చికిత్సాలయము నెలకొల్పబడినది.

క్రీ.శ. 1897 లో ఈ ప్రభుత్వ చికిత్సాలయము లందు శవాలుంచు గదులు ఏర్పాటు చేయనైనవి. ముస్లింశవాలకై ప్రత్యేక గది ఏర్పాటు చేయబడినది.

క్రీ.శ. 1912 పారిశుధ్య శాఖ నెలకొల్పబడినది. ఈ శాఖ వైద్యశాఖ డైరక్టరుగారి ఆధీనమున పని చేయించుండెను. ఆ కాలమున జిల్లా సర్జను జిల్లా శానిటరీ విభాగమునకు కూడా అధికారిగా నుండెను. 1912 - 1913 లో జిల్లాలలో సంచార వైద్యశాలలు ప్రారంభింపబడినవి. అంటువ్యాధుల నిరోధమునకై టీకాలు వేయుట ఆరంభమైనది. మొట్ట మొదట మశూచి టీకాలు మాత్రము వేయు చుండేవారు.

**1999 - 2000 సంవత్సరమున సంస్థ ద్వారా చేపట్టుటకు నిర్ణయించిన టార్గెట్**

| క్ర.సం | పథకముల పేర్లు | భౌతిక | మార్జిన్ మనీ | అభ్యర్థి వాట | బ్యాంక్ లోన్ | మొత్తము లోన్ |
|---|---|---|---|---|---|---|
| 1. | పేదరికం నిర్మూలన పథకము | 373 | 14.17 | - | 41.78 | 55.95 |
| 2. | స్వయం ఉపాధి పథకము | 320 | 64.00 | 32.00 | 224.00 | 320.00 |
| 3. | ఎన్.ఎమ్.డి.సి. | 237 | 39.55 | 11.30 | 62.15 | 113.00 |
| 4. | సి.ఎం.ఇ.వై. | 69 | 6.90 | - | - | - |
| 5. | డి.ఓ.ఎమ్.డబ్ల్యు.యు.ఎ. | 50 | 7.50 | - | - | - |
| 6. | స్కాలర్‌షిప్‌లు | - | 5.05 | - | - | - |
| 7. | వొకేషనల్ ట్రేనింగ్ | - | 6.00 | - | - | - |
| 8. | హెల్త్ క్యాంప్స్ | - | 1.20 | - | - | - |
| 9. | తత్కాల్ స్కీం | 110 | 7.70 | - | - | - |
| | **మొత్తం** | **1159** | **152.07** | **43.30** | **327.93** | **488.9** |

# వైద్య - ఆరోగ్య శాఖ

ప్రాచీన కాలమున రాజుల ఏలుబడిలో ప్రజా సంక్షేమ కార్యక్రమములు జరుపుబడుచున్నట్లు కొన్ని గ్రంధముల ద్వారా తెలియుచున్నది. ముఖ్యముగా తెలుగుదేశాన ఆంధ్ర మహాభారత గ్రంధమును పరిశీలన గావించినచో నాటి ప్రజాసంక్షేమ కార్యక్రమములు బయుటపడును. తిక్కన గారి కాలమున ఆనాటి రాజులు జూపిన ప్రజా సంక్షేమ కార్యక్రమములు ఆంధ్ర మహా భారతమునందగు పడుచున్నవి. నారద ధర్మజ సంభాషణమున వైద్యుల నియామకమున్నట్లు తెలియు చున్నది. నేడు జరుపబడుచున్నంత విశాల ప్రాతిపదికన కాకున్నను కొంత మేరకు ప్రజారోగ్యమును గూర్చినాటి ప్రభుత్వములు పట్టించుకొన్నట్లగు అగుపడుచున్నది. క్రీ.శ.1844 సంవత్సరమున నిజాం రాష్ట్రమున వైద్యశాల స్థాపించబడినది. తద్వారా మెదకు జిల్లాలో కూడా వైద్యాలయములేర్పాటైనవి.

మొదట వైద్య చికిత్సా కార్యక్రమములను రెసిడెన్సీ సర్జన్ నిర్వహించు చుండెను. వైద్యశాలల పర్యవేక్షకునకు సహాయకునిగా వాజిమ్‌దవాఖానే జాత్ అనుపదవి ఏర్పాటై ఆ పదవిలో జిల్లా కొరకు నియమింపబడుచుండిరి.

క్రీ.శ. 1889 లో దస్తూరుల్ అమల్ అను శాసనము ద్వారా భూమిశిస్తులో రూపామికి ఒక అణాచొప్పున (1/16 రూపాయి) స్థానిక రుసుము వసూలగుచుండెను. అస్థానిక పన్ను నుండి ఒక్క పైసా (1/96 రూ.) ఆరోగ్య శాఖకు అందించ బడుచుండెను. క్రీ.శ. 1918-19 నాటికి ఈ చెల్లింపు ఒక పైస నుండి రెండు పైసలకు పెంచబడినది.

క్రీ.శ. 1890 నాటికి మెదకు జిల్లాలో మెదకు- సిద్ధిపేట-సంగారెడ్డి-జోగిపేటలో చికిత్సాలయము నెలకొల్పబడినది.

క్రీ.శ. 1897 లో ఈ ప్రభుత్వ చికిత్సాలయము అందు శవాలుంచు గదులు ఏర్పాటు చేయన్నైనవి. ముస్లింశవాలకై ప్రత్యేక గది ఏర్పాటు చేయబడినది.

క్రీ.శ. 1912 పారిశుధ్య శాఖ నెలకొల్పబడినది. ఈ శాఖ వైద్యశాఖ డైరక్టరుగారి ఆధీనమున పని చేయించుండెను. ఆ కాలమున జిల్లా సర్జను జిల్లా శానిటరీ విభాగమునకు కూడా అధికారిగా నుండెను. 1912 - 1913 లో జిల్లాలలో సంచార వైద్యశాలలు ప్రారంభింపబడినవి. అంటువ్యాధుల నిరోధమునకై టీకాలు వేయుట ఆరంభమైనది. మొట్ట మొదట మశూచి టీకాలు మాత్రము వేయు చుండేవారు.

వైద్యశాలకు 8 కి.మీ. దూరమందున్న గ్రామములకు వైద్య సహాయము అందజేయ వలయునను ఉద్దేశ్యముతో సంచార వైద్యశాలలు నెలకొల్పబడినవి. క్రీ.శ. 1913 వ సంవత్సరమున మెదకు జిల్లాలో ఇట్టి ఏర్పాటు గావింపబడినది.

మెదకు చర్చి అధీనమున ఒక వైద్యశాల ఏర్పాటు గావింపబడినది. జహీరాబాద్ తాలూకాలోని రంజోల్‌లోను ఒక మిషనరీ దావాఖానా ఏర్పాటు చేయునైనది. అట్లే రామాయంపేట యందు మెదక్ చర్చి ఆధీనమున ఒక ప్రసూతి వైద్యశాల ఏర్పాటు గావింపబడినది. 1917 లో వైద్యశాఖయందు పారిశుధ్య శాఖ విలీనం కావింపబడినది. నిజాం ప్రభుత్వము వైద్యుల జీతభత్యములు తప్ప తక్కిన వైద్యాలయ వ్యయమంతము స్థానిక నిధుల నుండి భరించునట్లు నిర్ణయించినది. మెలమెల్లగా మెదకు జిల్లాలోని అన్నితాలుకా కేంద్రముల యందును ప్రభుత్వ ఆస్పత్రులు నెలకొల్ప బడినవి.

1940 నాటికి పల్లెలలో వైద్యము చేయు వారికి పరీక్షలు నిర్వహించి యోగ్యతా పత్రములిచ్చి వారికి కొంత ఆర్థిక సహాయమును కూడా ప్రభుత్వము కల్పించినది. గ్రామ వైద్యులకు ఆర్థిక సహాయము చేయుటను ప్రభుత్వము జిల్లా బోర్డులకు అప్పగించినది. ఆర్థిక సంక్షోభము వలన అవి ఆ పనిని చక్కగా నిర్వహించలేక పోయినది.

క్రీ. శ. 1938 లో దేశీయ వైద్యవిధానమును ప్రోత్సహించుటకై ఆయుర్వేద, యునాని వైద్య విధానము పునర్వ్యవస్థీకరింప బడినది. ఈ వైద్యులకు ఆర్థిక సహాయము ఏర్పాటు చేయబడినది.

మెదకు జిల్లాలో 1940 కి పూర్వము అడపాదడపా ప్లేగు వ్యాధి తీవ్రముగా వ్యాపించి వందల కొలది ప్రాణములు పోవుచుండెను. ఆనాడు ఈ వ్యాధిని "ఎలుకలు పడుట" అనేవారు ఎలుకల చేత ప్లేగు వ్యాపించెడిది. గ్రామమున ఈ వ్యాధిని ఒక యింట సోకినదే తడువుగా ప్రజలు తమ ఇండ్లను విడిచి గ్రామమున కావల దూరంగా గుడిసెలు వేసుకొని నివసించేవారు. మెదకు జిల్లాలో ఈ వ్యాధి చిట్టచివరగా 1944 లో వ్యాపించినది. ప్రభుత్వము ఈ వ్యాధిని అరికట్టుటకు ఎన్నియో చర్యులు గైకొనినది.

ఈ జిల్లాలో కలరా వ్యాధిచే కొన్ని వేల జనులు మరణించియుండిరి. జిల్లాయందంతటా కలరా వ్యాధి ఒకప్పుడు కాకున్న మరొక్కప్పుడు వ్యాపించుచుండెను. వాతావరణ కాలుష్యము నీటి కాలుష్యములచే ఈ వ్యాధి సంక్రమింపబడును. ఈ వ్యాధి నివారణకు జిల్లావైద్య సిబ్బంది అనేక చర్యలుగైకొనియుండుటచే అదుపులో యున్నదని చెప్పవుచ్చును.

మెదకు జిల్లాలో ప్రజలను ముఖ్యముగా పసిపిల్లలను త్వరగా పరలోకములకు పంపించు వ్యాధి మశూచి, ఈ వ్యాధి నివారణకు ప్రభుత్వము అనేక చర్యలు గైకొన్నది.

ఈ వ్యాధిని నిరోధించుటకై టీకాలను ప్రవేశపెట్టి ప్రజలలోనున్న మూఢ విశ్వాసాలను తొలగించి వైద్య సహాయము అందించినది.

జిల్లాలో చలిజ్వరములచే చనిపోవువారి సంఖ్య అధికముగా నుండెను. ఈ చలి జ్వరములను వైద్యులు మలేరియా జ్వరముగా గుర్తించిరి. ఈ జ్వర నివారణకు సరియగు వైద్యసహాయములందించిరి. ప్రజలలోని భయమును పోగొట్టుటకు ప్రభుత్వము ప్రయత్నించినది. ఈ వ్యాధి దోమల ద్వారా వ్యాపించును. మలేరియా నివారణకై 1952 లో ప్రభుత్వము ప్రత్యేక చర్యలు గైకొన్నది. మలేరియా కంట్రోల్ యూనిట్ ఏర్పాటు చేయబడినది.

1954లో జాతీయ మలేరియా నిరోధక కార్యక్రమములు రూపొందించబడ్డవి. మలేరియా కంట్రోలు యూనిట్ ద్వారా గ్రామములలోని ప్రతి యింటికి నెలకొక పర్యాయము డి.డి.టి. పౌడర్ మందును పిచికారీ చేయించబడుచుండెను. గ్రామములలోని వీధులు, మురికి వాడలు మోరీలలో డి.డి.టి చల్లుటచే దోమలు నివారణ గావింపడు చుండెను. మలేరియా వ్యాధి గ్రస్తులకు ప్రత్యేకమయిన క్వినైన / క్లోరోక్విన్ మాత్రలు పంపిణీ చేయబడు చుండెను. మొత్తము మీదమెదకు జిల్లాలో మలేరియా వ్యాధి, అదుపులోనే యున్నదని చెప్పవచ్చును. ఈ వ్యాధిని గుర్తించుటకు రక్త పరీక్ష సాధనము. రక్త పరీక్ష ద్వారా వ్యాధిని గుర్తించి తగు ఔషధ సేవనము చేసినచో మలేరియా మహమ్మారి నుండి రోగిని తప్పింపవచ్చును.

వైద్య మరియు ఆరోగ్య శాఖ అధికారి గారి కార్యాలయము సంగారెడ్డి జిల్లా మెదక్ గారి నుండి అన్నిజాతీయ ఆరోగ్య కార్యక్రమములు జిల్లా అంతట అనగా జిల్లాలో గల అన్ని ప్రాంతాలలో రాష్ట్ర ముఖ్యమంత్రి, ఆరోగ్య శాఖ మంత్రి, ఆరోగ్య సెక్రటరీ, ఆరోగ్య శాఖ సంచాలకులు హైదరాబాద్ గారి మరియు జిల్లా కలెక్టరు గార్ల యొక్క సూచనలు, సలహాలు మరియు ఉత్తర్వుల ప్రకారము మరియు కేంద్ర వైద్య ఆరోగ్య శాఖ సూచనలమేరకు ప్రజాసంక్షేమ జాతీయ ఆరోగ్య కార్యక్రమములు జరుగుచున్నవి.

## జాతీయ ఆరోగ్య కార్యక్రమములు

1. జాతీయ కు.సం కార్యక్రమము
2. జాతీయ మలేరియా నిర్మూలన కార్యక్రమము
3. జాతీయ కుష్ఠు నివారణ కార్యక్రమము
4. జాతీయ క్షయ వ్యాధి నివారణ కార్యక్రమము
5. జాతీయ మాతాశిశు పరిరక్షణా కార్యక్రమము
6. జాతీయ వ్యాధి నిరోధక టీకాల కార్యక్రమము
7. జాతీయ పల్స్ పోలియో కార్యక్రమము.
8. జాతీయ స్పెషల్ పల్స్ పోలియో కార్యక్రమము.
9. జాతీయ ఫైలేరియా నిర్మూలన కార్యక్రమము
10. జాతీయ ఏయిడ్స్ కంట్రోలు కార్యక్రమము
11. జాతీయ ఎపిడెమిక్ కంట్రోలు కార్యక్రమము

12. జాతీయ పాఠశాలల ఆరోగ్య కార్యక్రమము
13. జాతీయ అంధత్వ నివారణ కార్యక్రమము
14. జాతీయ అయోడిన్ డెఫిసియన్సి సీజన్ కార్యక్రమము
15. జాతీయ జిల్లా మాస్ మిడీయా ప్రచార విభాగము
16. జాతీయ శిక్షణావిభాగము కొండాపూర్
17. (జాతరలు) fairs & festival కార్యక్రమము
18. ప్రపంచ ఆరోగ్య దినోత్సవము. W.H.O. day Celebration World Health Organisation day on every 7th April.
19. World Health Organisation day on every 11th July.
20. జాతీయ Aids day celebration on 1st Dec of every year.
21. Anti - Leprosy day Celebration on 30th of January every year.
22. జనన మరణముల నమోదు కార్యక్రమము
23. (Q.C.H ) పునరుత్పత్తి శిశు సంక్షేమ కార్యక్రమము

జాతీయ మశూచి నిర్మూలన కార్యక్రమము మరియు ప్లేగు కార్యక్రమములు నిర్మూలించబడినవి.

## కుటుంబ సంక్షేమ కార్యక్రమము :-

భారతదేశములో పెద్దసమస్య జనాభా ఎదుగుదల. ఈ సమస్య అరికట్టుటకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు ఎంతగానో కృషి సలుపుచున్నవి. ఇందులో ప్రజలు స్వచ్ఛంద సంస్థలు చాలా అవసరము. దీనిని మొదట కుటుంబ నియంత్రణ కార్యక్రమమనిరి. తర్వాత కుటుంబ సంక్షేమ కార్యక్రమముగా మారినది ఈ కార్యక్రమము 1963-64 నుండి ప్రారంభమైనది. 1975-77లో ఎమర్జెన్సి పీరియడ్‌లో తప్పనిసరిగా ఆపరేషను నిర్వహించారు. తర్వాత బలవంతము చేయక వాళ్ళకు నచ్చజెప్పి కుటుంబ సంక్షేమ ఆపరేషన్లు సాగుచున్నవి.

ఈ కుటుంబ సంక్షేమ కార్యక్రమములో 2 పద్ధతులు గలవు.

1. శాశ్వత పద్ధతి 2. తాత్కాలిక పద్ధతి

**1. శాశ్వత పద్ధతి లో శస్త్ర చికిత్సలు :-** అనగా పురుషులకు 'V' వాసెక్టమి, 'T' Tubectomy స్త్రీలకు గలవు. ఇప్పుడు లేటెస్ట్‌గా B.H.T బటన్ హుక్ ట్యూబెక్టమి శస్త్ర చికిత్స స్త్రీలకు చేయుచున్నారు. అదేరోజు ఆపరేషన్ తర్వాత ఇంటికి పంపించుచు ప్రభుత్వముచే పారితోషికము కూడా పొందుతున్నారు.

**2. తాత్కాలిక పద్ధతులు** :- స్త్రీలకు O.P. Oral Pills అనగా మాలా 'N.D' నోటి ద్వార వేసుకొనెడి మాత్రలు. D.U.D Dotra Uterus Dexine , అనగా కాపర్ T, లూపు అనియు కూడా అంటారు ఇవి Uterus లో అమర్చుతారు. డయాఫ్రం అనే పరికరము Uterus లో వుంచితే పిల్లలు కలుగకుండా పనిచేస్తాయి.

ఇక పురుషులకు నిరోధ్‌లు వాడుకలోనున్నవి ఇవి కూడా గర్భాన్ని నిరోధించును.

## జాతీయ కుష్టు నివారణ కార్యక్రమము

సమాజములో కుష్టు రోగులను చిన్నచూపు చూస్తున్నారు ఆదరణలేదు. రోగులు కూడా వారికున్న వ్యాధిని సమాజమునకు చెప్పు కోకుండా సిగ్గుతో యుంటున్నారు. కుష్టునివారణకై M.D.T. అనగా Multi - Drug Therophy అను ఈ Programme ఒకప్పుడు 1989లో ప్రారంభమైనది, 1000 జనాభాలో 10 కేసులు ఉండేవి. ఇప్పుడు 1000 జనాభాలో 2 కేసులు మాత్రమే ఉన్నవి. ఈ కార్యక్రమము చాలా సఫలము గానున్నది.

## జాతీయ క్షయ వ్యాధి నివారణ కార్యక్రమము

ఈ వ్యాధి చాలా భయంకరమైనది, జ్వరము, దగ్గు, మున్నగు వాటి వలన నీరసించి బక్కచిక్కి చనిపోతారు.

రాష్ట్రంలో మెదకు జిల్లాను మోడల్ జిల్లాగా Q.D.A. Project వారి సహాయముతో R.N.T.P (అనగా Reviced National Tuberclosis Programme ) 1-4-1996 నుండి ప్రారంభమైనది. ఈ కార్యక్రమము 18 నెలల కొరకు మొదలైనదీ. దీనికి 116.75 లక్షలు కేటాయించనైనది. దీని ద్వారా చికిత్స సంపూర్ణముగా జరుగుచున్నది.

## మాతాశిశు సంరక్షణ కార్యక్రమము

ఈ కార్యక్రమములో తల్లీ పిల్లలు సంరక్షణ జరుపబడుచున్నది. తల్లి గర్భము దాల్చిన అనంతరము అనగా 16 వారముల నుండి తల్లికి T.T సూదిమందు, ఎనీమిక్ కాకుండా I.F.T drug & folic tabs మున్నగునవి ఇస్తూ ఆయాలచే ప్రసవము చేయించుట, ఆరు ప్రాణాంతక వ్యాధులు అనగా డిఫ్తీరియా, టెటెనస్, కోరింత దగ్గు, శంకసర్ది, టి.బి., మరియు మీజిల్స్ టీకాలు ఒక సంవత్సరములోపు పిల్లలకు పూర్తిగా యిప్పించు కార్యక్రమంలు జప్పించబడును.

## పల్స్ పోలియో కార్యక్రమము

P.P.I వ్యాధి నిరోధక టీకాల కార్యక్రమలో ఉండగా పల్స్‌పోలియో కార్యక్రమము 1995-96 నుండి గైకొని యిప్పటి వరకు ప్రతి సంవత్సరము డిసెంబరు, జనవరి నెలలో పోలియో 0-5 వయస్సు గల పిల్లలుకు వేయబడు చున్నవి. మరియు స్పెషల్ పల్స్-పోలియో కార్యక్రమ 1999 మార్చి నెలలో పోలియో కేసులు వచ్చిన ప్రాంతము మరియు చుట్టుప్రక్కలో చేపట్టిరి.

## ఫైలేరియా నిర్మూలన కార్యక్రమము

ఫైలేరియాను భోదకాలు వ్యాధి అందురు. ఈ వ్యాధి క్యులెక్స్ అను దోమకాటు వలన వచ్చును. కావున దోమల నిర్మూలనము చేయుట, నీరు నిల్వవుండ కుండా చూచుట. సకాలములో వైద్యుల సలహాలు ఇచ్చుట మున్నగు చర్య గైకొనబడుచున్నది.

## ఎయిడ్స్ కంట్రోల్ కార్యక్రమము

ప్రస్తుత ప్రపంచ మంతటను ఇది పెద్ద సమస్య. ఈ వ్యాధి ఇతర దేశాల నుండి మనదేశమునకు పాకినది. ఇది కేవలం అపరిచిత లైంగిక సంబంధము, రక్తమార్పిడి, సూదులు ఇంజక్షన్ ద్వారా వ్యాప్తి చెందుతున్నది. ఈ క్రిములు శరీరములో ప్రవేశించిన 8 సంవత్సరములలో రోగి కృశించి బక్కచిక్కి చివరకు చనిపోవును. కావున శ్రీరామ చంద్రుని వలె ఒకే భార్యతో కాలము గడుపుకోవడమే ఈ వ్యాధి నివారణకు మార్గము.

## ఎపిడెమిక్ కంట్రోల్ కార్యక్రమము

ఈ కార్యక్రమములో జిల్లా అంతట అంటు వ్యాధులు అనగా కలరా, వాంతులు - విరోచనాలు ప్రబల కుండా చర్యలు తీసుకొనబడుచున్నవి.

## పాఠశాలలో ఆరోగ్య కార్యక్రమము

ఈ కార్యక్రమములో బడికిపోవు పిల్లల ఆరోగ్యము చక్కదిద్దుట ఎలాంటి మైనర్ / మేజర్ జబ్బులనైనా గుర్తించుట సరియైన వైద్యసేవలు అందించుట జరుగును. మరియు 1985 ఆగస్టులో అప్పటి ముఖ్యమంత్రి గారు శ్రీ ఎన్. టి. రామారావు చిరంజీవ సుఖీభవ అను కార్యక్రమములతో బడిపిల్లల ఆరోగ్య సేవలు మెరుగుపరచిరి.

## అంధత్వ నివారణ కార్యక్రమము

N.P.C.B. National Programme for Contride of Blindness ఈ కార్యక్రమము చాలాముఖ్యమైనది "సర్వేంద్రియాణాం నయనం ప్రధానం" కనుచూపు లేనిదే యేమి చూడరాదు. కొందరు మహానుభావులు బ్రతికి ఉండగానే నేత్రదానము చేయుదురు. దీనితో కండ్లులేని వారికి దాతలు చనిపోయిన తర్వాత వారి కనుగుడ్లు అమర్చి కంటి చూపులేని వారికి చూపు ప్రసాదించడమగుచున్నది. అందత్వ నివారణకై అనేక చర్యలు తీసుకోబడినవి. ప్రభుత్వ పరముగా మరియు కొన్ని స్వచ్ఛంద సంస్థలపరముగా "ఐక్యాంప్స్" ఉచితముగా నిర్వహింపబడుచున్నవి. ఈ కార్యక్రమముల "లైయన్స్ క్లబ్" ఎక్కువ శ్రద్ధ చూపించుచున్నది.

## మాస్ మీడియా ప్రచార విభాగము

ఈ విభాగములో ప్రతి కార్యక్రమము మాస్ మీడియా ప్రచారము ద్వారా, ఫిలిం షో చూపించుట ద్వార, ప్రచారము చేయడం జరుగుచున్నది.

## జిల్లా శిక్షణ విభాగము

ఈ విభాగములో జిల్లాలోని సిబ్బందికి వైద్యాధికారులకు అప్పుడప్పుడు శిక్షణా తరగతులు లేటస్టు విజ్ఞానమును పెంపొందుంచుట In Service Training ఈ శిక్షణ విభాగము మన జిల్లాలో గల కొండాపూర్‌లో గలదు.

## జాతరలు (Fairs & Festivals)

మన జిల్లాలో గల ముఖ్యమైన జాతరలలో అంటువ్యాధులు ప్రబల కుండా చర్యలు గైకొనుట ఆరోగ్య వైద్యసేవలు అందించుట మున్నగునవి.

## ఆరోగ్యదినోత్సవాలు

★ ప్రపంచ ఆరోగ్య దినోత్సవం ప్రతి సంవత్సరపు ఏప్రిల్ 7.

★ ప్రపంచ జనాభా దినోత్సవము ప్రతి సంవత్సరపు 11జూలై.

★ ఎయిడ్స్ దినోత్సవము ప్రతి సంవత్సరపు 1 డిసెంబర్.

★ కుష్టురోగ నివారణ **Anti Leprosy Day** దినోత్సవము ప్రతి 30 జనవరి

### కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు, లక్ష్యాలు

| కార్యక్రమాలు | 1998-99 లో లక్ష్యాలు | నెరవేర్చినవి | 1999-2000 లక్ష్యాలు |
|---|---|---|---|
| శస్త్ర చికిత్సలు | 30,000 | 21,033 | 24,000 |
| నిరోధ్‌లు | 30,886 | 15,552 | 30,907 |
| లూపులు | 12,033 | 8,282 | 12,019 |
| నోటిమాత్రలు | 10,293 | 4,955 | 10,302 |

### జిల్లాలో జనాభా వివరాలు (లక్షలలో)

| సంవత్సరం | పురుషులు | మహిళలు | మొత్తం |
|---|---|---|---|
| 1951 | 5.55 | 5.59 | 11.14 |
| 1961 | 6.30 | 6.02 | 12.32 |
| 1971 | 7.39 | 7.29 | 14.68 |
| 1981 | 9.12 | 8.95 | 18.07 |
| 1991 | 11.52 | 11.17 | 22.69 |
| 1999 | 13.16 | 13.21 | 26.37 |

ఈ జిల్లాలో మెడికల్ హెల్త్ ఆఫీసర్ల సంగారెడ్డి కార్యాలయం 1969 నుండి ప్రారంభమైనది.

| క్ర.సం | డాక్టర్ పేరు | D.M & H.O |
|---|---|---|
| 1. | డా. రామారావు | D.M & H.O |
| 2. | డా. ఏ.ఏ అలీమ్ | D.M & H.O |
| 3. | డా. సి.టి. తిలక్ | D.M & H.O |
| 4. | డా. పి. అంజయ్య | D.M & H.O |
| 5. | డా. అబ్దుల్ రషీద్ ఖాన్ | D.M & H.O |
| 6. | డా. యమ్. యస్. హుస్సేన్ | D.M & H.O |
| 7. | డా. బి.యల్. సాంగీ | D.M & H.O |
| 8. | డా. సీత | D.M & H.O |
| 9. | డా. సయ్యద్ ఖాజీనా హుస్సేన్ | D.M & H.O |
| 10. | డా. సయ్యద్ అఫ్జల్ | D.M & H.O |
| 11. | డా. కృష్ణ స్వామి | D.M & H.O |
| 12. | డా. అబ్దుల్ ఖ ఫ్ | D.M & H.O |
| 13. | డా. బసవ రాజ్ | D.M & H.O |
| 14. | డా. యస్. అంజనేయులు | D.M & H.O |
| 15. | డా. యమ్. ఏ. రషీద్ | D.M & H.O |
| 16. | డా. లోమేశ్ రామ్‌చంద్ర | D.M & H.O |
| 17. | డా. యమ్. ఏ రషీద్ | D.M & H.O |
| 18. | డా. బి. శ్రీధరా చారీ | D.M & H.O |
| 19. | డా. యమ్. చలపతి రావు | D.M & H.O |
| 20. | డా. ఏ.డి. లైనింగ్ స్టోన్ | D.M & H.O |
| 21. | డా. విష్ణుమూర్తి | D.M & H.O |
| 22. | డా. ఏ.డి. లైనింగ్ స్టోన్ | D.M & H.O |
| 23. | డా. దాశరధి | D.M & H.O |
| 24. | డా. యమ్. శంకర్ రావు | D.M & H.O |
| 25. | డా. జి. వెంకటేశ్ | D.M & H.O |
| 26. | డా. కే. శ్రీధర్ | D.M & H.O |
| 27. | డా. పుల్లప్ప | D.M & H.O |
| 28. | డా. వెంకటేశ్వరులు | D.M & H.O |
| 29. | డా. మాగ్ మీనాక్షీ | D.M & H.O |
| 30. | డా. కే. శ్రీనివాసులు | D.M & H.O |
| | డా. రాజయ్య (ప్రస్తుతము కొనసాగుచున్నారు) | |

# నీటిపారుదల - సాగునీటివనరులు

మెదకు జిల్లాలో వ్యవసాయాభివృద్ధికై నీటి పారుదల వసతులను కల్పించడం కాకతీయుల కాలం నుండే ఆరంభమైనదని చెప్పవచ్చును. వ్యవసాయ కుటుంబం నుండి రాచరికానికి వచ్చిన కాకతీయులు సహజంగా వ్యవసాయానికి పెద్దపీట వేశారనటంలో ఆశ్చర్యం లేదు. వారు నిర్మించిన పాకాల చెరువు అత్యద్భుత మైనకట్టడమని చెప్ప వచ్చును.

మెదకు జిల్లాలోని ఖాజిపల్లి, అంబాజిపేట మొదలగు చెరువులను గమనించినపుడు పాకాల చెరువు నిర్మాణమే స్ఫురణకు వచ్చును.

తెలంగాణ ప్రాంతాన్ని గోలకొండ సుల్తానులు పరిపాలించిరి కుతుబుషాహిలు - ఆసఫ్‌జాలు ఈ ప్రాంతాన్ని పాలించిన రాజవంశాలు.

కుతుబుషాల రాజైన అబుల్ హసన్ తానీషా ప్రజారంజకుడైన రాజుగా కీర్తి బడసెను. ఈయనకు అక్కన్న మాదన్నలు మహామంత్రులుగా సలహాదారులుగా నుండి రాజ్యంలో శాంతి భద్రతలు. ప్రజాసౌకర్యాలు కల్గునట్లుగా పాలన గావించిరి. వీరికాలంలో వ్యవసాయాభివృద్ధికై అనేక చెరువులు త్రవ్వించబడెను. మెదకు జిల్లాలో కూడా చెరువుల నిర్మాణము జరిగినది.

వర్గల్ మండలమునందలి ఖాన్ చెరువు మొదలగునవి ఉదాహరణగా చెప్పవచ్చు.

ఆతర్వాత రాజులైన ఆసఫ్‌జాల పాలనలో నీటిపారుదలకై ప్రత్యేక శ్రద్ధగైకొన బడినది.

క్రీ.శ. 1926 లో మెదకులో నీటి పారుదల శాఖసర్కిల్ (సూపరింటెండెంటు) కార్యాలయము ఏర్పాటైనట్లు మెదకులోని ఆ కార్యాలయ భవనము పై శిలాఫలకము ద్వారా తెలియుచున్నది. నిజాంస్టేట్‌లో ఔరంగాబాద్. గుల్బర్గా, మెదకు, వరంగల్ లో నీటి పారుదలశాఖ సర్కిల్ కార్యాలయాలు ఉండేవి. నేటికి ఈ పట్టణాలలో ఈ కార్యాలయాలు ఒకే నమూనాలో కలవు.

మెదకు సర్కిల్ కార్యాలయము పరిధిలో మెదకు, మహబూబ్‌నగర్, నిజామాబాద్, హైద్రాబాద్ జిల్లాలు ఉండేవి.

నిజాంరాజులు సాగునీటి వనరులకై ప్రత్యేకశ్రద్ధ చూపించిరని చెప్పవచ్చును.

మెదకుజిల్లాలో ఘనపురం ఆనకట్ట, రాయన్‌పల్లి, పోచారం, నిజాంసాగర్ ప్రాజెక్టులు ఆ కాలం లోనే నిర్మించబడినవి.

కొల్చారం మండలంలో చిన్నఘనపురం గ్రామశివారులో మంజీరానది 7 పాయలుగా చీలినది, అచ్చట 1905 లో మంజీరానది పై మొట్టమొదట ఘనపునం ఆనకట్ట నిర్మించి 18000 ఎకరాలకు సాగునీటిని అందించ తలపెట్టిరి.

మెదకు జిల్లాలో నాటికి అన్నీ చిన్న నీటివనరులే యుండగా ఈ ఘనపురం ఆనకట్ట తొలి సారిగా నిర్మాణమై చరిత్రను సంతరించుకొనినది. నేడు ఈ ఆనకట్టక్రింద, మెదకు, పాపన్న పేట, కొల్చారం మండలాలలో సుమారు 30 వేల ఎకరాల ఆయకట్టు సాగుబడి చేయబడుచున్నది.

మెదకు మండలం పోచారం గ్రామశివారులో గుండారంవాగు పై పోచారంప్రాజెక్టు నిర్మించబడినది. ఈ ప్రాజెక్టు చక్కని ప్రకృతి వాతావరణంలో కలదు. ఈ ప్రాజెక్టుకు ఇరువైపులా ఇన్‌స్పెక్షన్ బంగ్లాలు అన్నివసతులతో నిర్మించబడినవి. ఈ ప్రాజెక్టు పక్కనే అభయారణ్యము ఏర్పాటు గావించబడినది. నాటి నిజాం నవాబులు తీరిక వేళలలో ఇచ్చటికి వచ్చి విశ్రాంతి తీసికొనుచుండిరి. ఇదొక సుందర ప్రదేశముగా తీర్చిదిద్ద బడినదని చెప్పవచ్చును.

1926 లో మెదకు మండలం రాయన్‌పల్లి గ్రామశివారులో పుష్పాల వాగుపై ప్రాజెక్టు నిర్మాణము జరిగినది. ఈ ప్రాజెక్టు క్రింద సుమారు రెండు వేల ఎకరాలు సాగు చేయబడుచున్నది.

1933 లో దేశంలో కెల్లా మొట్ట మొదటిదిగా చెప్పబడుచున్న నిజాంసాగర్ ప్రాజెక్టు నిర్మించబడినది. ఈ ప్రాజెక్టు మెదకు జిల్లాలో నిర్మించబడినది కాని ఈ ప్రాజెక్టు ఉపయోగము నిజామాబాదు జిల్లాకు పరిమితమైనది. కంటి చూపునకు నేత్రానందమునకు మాత్రమే ఈ ప్రాజెక్టు నీరు మెదకు జిల్లా వాసులను తృప్తిపర చుచున్నది.

మెదకు జిల్లాలో ఏకైక మంజీరానది కలదు. ఇది గోదావరికిగల ఉపనదులలో ఒకటి. ఈ నది నారాయణఖేడ్ , జహీరాబాద్, సంగారెడ్డి, ఆందోలు, నర్సాపూర్, మెదకు పూర్వపు తాలుకాల ద్వారా ప్రవహించుచున్నది. సిద్దిపేట, గజ్వేల్ పూర్వపు తాలూకాలలో కుడ్లేర్ బేసిక్ కలదు.

మెదకుజిల్లాలో సరాసరి వర్షపాతము 921.6 మి.మీ.కలదు.

మెదకుజిల్లాలో 23,52,200 ఎకరాల భూమిలో 17,07,070 ఎకరాలభూమి సేద్యయోగ్య మైయున్నది.

1-11-1956 నాటికి 536 నీటివనరులు 1,20,623 ఎకరాల ఆయకట్టు కలిగి పి - డబ్ల్యు- డి క్రింద ఉండేవి. మెదకు జిల్లాలో ప్రధాన మైన నీటి వనరులు ఘనపూర్ ఆనకట్ట క్రింది మహబూబ్‌నహర్, ఫతేనహర్ కాలువలు కలవు. రాయన్‌పల్లి ప్రాజెక్టు, గంగ కత్వప్రాజెక్టు, పెద్ద చెరువు మల్కాపూర్, కోమటూర్ మరియు అంబాజి పేట చెరువులు కలవు. చెరువులు 18,640 ఎకరాలకు నీరందించుచున్నవి.

1-11-56 తర్వాత నాలుగవ పంచవర్ష ప్రణాళికా కాలంలో 17,266 ఎకరాల ఆయ కట్టు కల్గిన 31 కొత్త పథకాలు 249-18 లక్షల రూపాయల వ్యయంతో 1973 -74 సం. నాటికి పూర్తి చేయబడినవి. రెండు లిఫ్ట్ ఇరిగేషన్ పథకాలు 1504 ఎకరాల ఆయకట్టు 6.37 లక్షల వ్యయముతో ఇదే కాలంలో పూర్తి చేయబడినవి.

21.7 లక్షల వ్యయముతో 14,050 ఎకరాల ఆయకట్టు గల 449 చెరువులు గండ్లు పూడ్చబడినవి. 63 లక్షల రూపాయల ఖర్చుతో 1,120 నీటి వనరులను పునర్వ్యవస్థీకరించి 65,276 ఎకరాలకు నీరందించనైనది.

మెదకుజిల్లాలో

1. నారాయణ ఖేడ్ ప్రాంతంలో నల్లవాగు ప్రాజెక్టు
2. జహీరాబాద్ ప్రాంతంలో పెద్దవాగు మరియు మొగుడం పల్లి ప్రాజెక్టు
3. నారింజ నదికి వేసిన బ్రిడ్జికం రెగ్యులేటరు.
4. సంగారెడ్డి ప్రాంతంలో మిలిగిరి ప్రాజెక్టు మరియు రెండు లిఫ్ట్ ఇరిగేషన్ పథకాలు చెప్పుకొనదగినవి.

ఆరుసూత్రాల ఆర్థిక పథకం క్రింద వెనుకబడిన ప్రాంతాలలో 1974 - 75 వరకు 55 నీటివనరులు. 1975 - 76 లో 37 వనరులు తీసికొనబడినవి. ఈ పనుల ద్వారా 4684 ఎకరాలకు ఎక్కువ నీటి సౌకర్యం కల్పించ బడినది. ఇందుకు 103.034 లక్షల రూపాయలు ఖర్చు చేయబడినవి.

ఆరు సూత్రాల ఆర్థిక పథకం క్రింద సిద్ధి పేట పాత తాలూకా పాలవాకుల గ్రామం వద్ద ఒక రిజర్వాయరు నిర్మాణం. 2) జహీరాబాదు పాత తాలూకాలో ఏడాకుల పల్లి గ్రామంవద్ద కొత్తూరువాగు ప్రాజెక్టు నిర్మాణము చేపట్ట బడినది.

ఈ రెండు వనరులు రూ. 24.31 లక్షల వ్యయంతో 1902 ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం కల్గించుచున్నవి. 1 -11-1956 తర్వాత నాలుగవ పంచవర్ష ప్రణాళికాంతము వరకు మెదకు జిల్లాలో 1,63,872 ఎకరాల ఆయకట్టు పెంచబడినది.

చిన్న, మధ్యమరియు లిఫ్ట్ ఇరిగేషన్ పథకాలు జిల్లాలో చేపట్టుట ద్వారా నీటి పారుదల శక్తిని పెంపొందించే అవకాశములు ఎన్నోకలవు.

## మెదకు జిల్లాలోని ప్రాజెక్టులు

*1.* *ఘనపురం*
*2.* *సింగూరు*
*3.* *నల్లవాగు*
*4.* *హల్దీవాగు*
*5.* *కారాముంగి ఎత్తిపోతల పథకం*

# ఘనపురం ఆనకట్ట

మెదకు జిల్లా కొల్చారం మండలం చిన్న ఘనపురం గ్రామశివార్లలో ఈ ఆనకట్ట నిర్మించబడినది.

ఈ స్థలానికి ఒక ప్రత్యేక చరిత్ర కలదు. జనమేజయుడు సర్పయాగం చేసిన స్థలమిది. గరుడగంగ (మంజీరానది) ఏడుపాయలుగా చీలినచోటిది.

ఇంతటి మహత్తర చరిత్ర కలిగి ప్రకృతి రమణీయతతో విలసిల్లే ఈ ప్రాంతంలో 1898 లో ఘనపురం ఆనకట్ట నిర్మాణానికి ప్రణాళికలు రూపొందించబడినవి.

ఆనాడు నీటిపారుదలశాఖ చీఫ్ ఇంజనీర్ రస్గో అలెన్ ఎస్క్వైర్ ప్రాజెక్టు ప్లానును రూపొందించిరి. ఈ ప్రాజెక్టును హాజీరహిమతుల్లా మరియు గే కంపనీలు కంట్రాక్టుతీసి·కొని నిర్మించినవి.

తే. 3-10-1899న ఈ ఆనకట్టకు పునాదిరాయి వేయబడినది. ఆరుసంవత్సరములలో ఈ ఆనకట్ట నిర్మాణము పూర్తి యైనది.

తే. 1-5-1905 న నిజాంప్రభుత్వ ప్రైమినిస్టర్ మహారాజ బహదూర్ యామిన్ అజ్ సుల్తాన్ సర్కిషన్ ప్రసాద్ ఆనకట్టకు ప్రారంభోత్సవము గా వించిరి.

ఈ ఆనకట్ట పొడువు 2337 అడుగులు ఈ ఆనకట్టకు కుడిప్రక్కన మహబూబ్ నహర్, ఎడమ ప్రక్కన ఫతేనహర్ కాలువలు త్రవ్వించబడి నవి. మహిబూబ్ నహర్ (కుడికాలువ) ద్వారా కొల్చారం, మెదకు మండలాల 18 గ్రామాలకు 9718 ఎకరాలకు మొదటి పంట 1581 ఎకరాలు రెండవ పంటకు నీరందించాలని నిర్ణయించిరి.

ఫతేనహర్ ద్వారా (ఎడమకాలువ) పాపన్నపేట మండల పరిధిలో 5771 ఎకరాలకు మొదటిపంటకు 835 ఎకరాలలో రెండవ పంటకు నీరందించాలని నిర్ణయించిరి.

ఆతర్వాత ఘనపురం ఆనకట్ట ఎత్తుపెంచబడినది. ప్రస్తుతం ఈ ఆనకట్ట నీటినిలువ సామర్థ్యం 8.03 ఫీట్లు.

మంజీరానది పై ఈ ఆనకట్టకు ఎగువభాగాన సింగూరు ప్రాజెక్టు నిర్మించబడినది 1985 నుండి ఘనపురం ఆనకట్టకు గడ్డు పరిస్థితు లేర్పడినవి.

సింగూరు జలాశయము జంట నగరాల మంచినీటి అవసరాల కోసం నిర్మించబడినది. దీని నిర్మాణ సమయంలోనే ఘనపురం ఆయకట్టు రైతాంగం భవిష్యత్తును ఊహించి ఆందోళన చేపట్టినది. కాని నాటి ప్రభుత్వము ఘనపురం ఆనకట్ట ప్రయోజనాలకు భంగము కలిగించమని హామీ ఇచ్చుటే గాక 1978 లో అప్పటి జిల్లా కలెక్టరు జిల్లా రైతాంగానికి లిఖిత పూర్వక ఒప్పంద పత్రం వ్రాసి ఇవ్వటము జరిగినది. ఆమేరకు సింగూరుజలాశయం నుండి 4 టి.యం.సి లనీరును ఘనపురం ఆనకట్టకు విడుదల చేయుటకు అంగీకరించిరి.

కాని ఈ హామీ హామీగానే మిగిలి పోయినది. ప్రతిసంవత్సరము-పంటలు ఎండిపోవు సమయమున రైతులు ఆందోళన చేయుట సింగూర్ ప్రాజెక్టు నుండి ఒకటి, రెండు టియంసీల నీరును విడుచుట ఆనవాయితీగా మారినది.

అట్లు కాక మొదట కుదిరిన ఒప్పందము ప్రకారము సింగూరు జలాశయము నుండి ఘనపురము ఆనకట్టకు సక్రమముగా నీరందించిన చో ఇక్కడి రైతాంగమునకు మేలు చేసిన వారగుదురు.

## సింగూరు ప్రాజెక్టు

మెదకు జిల్లాలో పుల్కల్ మండలంలో సింగూరు గ్రామానికి సమీపంలో నిజాంసాగర్ ప్రాజెక్టు ఎగువ భాగంలో $17^0$-45-00 అక్షాంశము $77^0$-56-00 రేఖంశములో సింగూరు ప్రాజెక్టు కలదు.

డా.కె. యల్. రావు కేంద్ర నీటి పారుదల మరియు విద్యుత్‌శాఖమాత్యులు నిజాంసాగర్ ప్రాజెక్టును పర్యవేక్షించిన సందర్భమున నిజాంసాగర్ ప్రాజెక్టు బురదతో నిండకుండ మరియు కర్ణాటక రాష్ట్రభూములు మునిగిపోకుండ నివారించుటకై మంజీరానది పై 10-15 టి. యం.సి. యఫ్. టి పరిమాణముగల రిజర్వాయరును మంజీరా బ్యారేజికి ఎగువ భాగమున నిర్మించుటకు సలహానిచ్చిరి. ఆసలహామేరకు మంజీరానదిపై నిజాంసాగర్ ప్రాజెక్టునకు అనుబంధముగా తగినంత నీరును నిల్వచేసే రిజర్వాయరును నిర్మాణము చేసి హైద్రాబాద్ సికింద్రాబాద్ జంటనగరాలకు నీటి సరఫరాచేయుటకు నిర్ణయంచ బడినది.

ప్రారంభములో రిజర్వాయరు నిర్మించుటకు తగినస్థలము నిర్దేశించుటకై దేవునూర్, కోడూరు, సింగూరు సమీపా నగల ప్రదేశములను పరిశీలించిరి. కోడూరు మరియు దేవు నూర్ల వద్ద 10 టి. యం.సి యఫ్.టి నీటిని నిల్వచేసినప్పటికి కర్ణాటక రాష్ట్రములోని భూములు మునిగి పోవును. సింగూరు వద్ద నిర్మించినచో కర్ణాటక భూములు మునగకుండగనే 17.33 టి.యం.సి.యఫ్.టి వరకు నీటిని నిల్వచేస్తు 1709 అడుగుల ఎత్తున రిజర్వాయరునిర్మించవచ్చును.

19-12-1975 న కేంద్ర వ్యవసాయ నీటి పారుదల శాఖామాత్యులు శ్రీజగజీవరాం గారి అధ్వర్యములో ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, మరియు ఒరిస్సా రాష్ట్ర ముఖ్య మంత్రులసమావేశంలో గోదావరీ నదీ జలాల వినియోగ విషయంలో చారిత్రాత్మకమైన ఒడంబడిక జరిగినది.

ఈ ప్రకారం సింగూరు వద్ద 30 టి.యం.సి.ఫ్.టి నీటి పరిమాణంగల 523.60 మీటర్ల ఎత్తుగల రిజర్వాయరు నిర్మించుటకు నిశ్చయంచబడినది.

తేది. 15-2-1976 రోజున కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీదేవరాజ్ అర్స్, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీజలగం వెంగళరావుల అధ్వర్యంలో సింగూరు ప్రాజెక్టునకు శంఖుస్థాపన జరిగినది.

ఈ ప్రాజెక్టు యొక్క కాలువలు తీయుచోటు కట్టడము 7225 మీటర్ల మట్టి అడ్డు కట్టతో పాటు ఇటుకతో నిర్మించి 375 మీటర్ల పొడవుగలిగి పొరలి పోనట్టి (Nom over flow gravity Dam ) ఆనకట్ట నిర్మించబడినది.

4,70,000 క్యూసెక్స్ నీటి ప్రవాహాన్ని విడుదల చేయుటకై 15.24 x 10 మీటర్లు. 50 x 32.80 వర్తులాకారము (Radial Everst Gate ) కలిగిన 71 ద్వారములు నిర్మించబడినవి. మట్టి ఆనకట్ట యొక్క గరిష్ఠపు ఎత్తు 23.135 మీటర్లు. ఈ ఆనకట్ట పై మోటారు వాహనములు నడుచుటకు యోగ్యమైన 5 మీటర్ల వెడల్పుగలిగిన రోడ్డు ఏర్పాటు చేయనైనది.

ఈ రిజార్వాయరు 523.60 నీటి మట్టంతో 30 టి.యం.సి.యఫ్.టి. నీరు నిలువ చేయుగలిగియుండి 164.43 చదరపుకిలోమీటర్ల వరకు ఆవరించి యుండును.

ఈ కట్టడాన్ని నిర్మించుటకు, పునరావాసాన్ని కల్గించు నష్టపరిహారాన్ని చెల్లించుటకు సుమారు 28.7 కోట్ల రూపాయిల ఖర్చుఅంచనా వేయబడినది.

ఈ ప్రాజెక్టు శంఖుస్థాపన నాటినుండే జిల్లా ప్రజలలో మెదకు జిల్లావ్యవసాయానికి నీరివ్వాలన్న డిమాండు ప్రారంభమైనది. జిల్లాలో సుదీర్ఘపోరాటం ప్రారంభమైనది. ఆందోళనలు, ధర్నాలు, నిరసనలు జరుపబడినవి. ఎట్టకేలకు మెదకు జిల్లాలో 40 వేల ఎకరాలకు సాగునీరందించేందుకు ప్రభుత్వం అంగీకరించింది. ఇందుకు సంబంధించి 31-10-1980 న ప్రభుత్వ ఉత్తర్వులు వెలువడినవి. ఆతర్వాత నీటి పారుదల శాఖ చీఫ్ ఇంజనీర్ 1983 మార్చి 18 న కాలువల అంచనాలను ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి సమర్పించిరి 48 కిలోమీటర్ల పొడవు న నిర్మించే ఎడమ కాలువ వల్ల 37500 ఎకరాలకు, 12 కి.మీ పొడవుండే కుడి కాలువవలన 2500 ఎకరాల సాగు నీరందించ వచ్చునని అంచనాలలో పేర్కొనినారు. ఈ కాలువల నిర్మాణం కోసం 1396.60 లక్షల రూ ఖర్చుకాగలదని వివరించి పనులప్రారంభానికి అనుమతి కోరనైనది. ఆతర్వాత జరిగిన నీటి పారుదల సమావేశంలో జిల్లాకు నీరివ్వాలా? అన్నవిషయాన్ని తేల్చుటకై 1990 జనవరి 25 న జి.వొ.యం.స్ 17 ద్వారా నిపుణులక మిటి ఏర్పాటైనది. 1991 జూన్ 3 తేదీన ఈ కమిటి నిజాం సాగర్, జంటనగరాలు, ఘనపురం ఆనకట్టల ప్రయోజనం దెబ్బతిన కుండా సింగూరు నుండి మెదకు జిల్లావ్యవసాయానికి నీరందించే ప్రతిపాదనలు ఆమోదించేవిషయాన్ని పరిశీలించాలని ఆకమిటి తన నివేదికలో పేర్కొనినది.

ఇంత జరిగి నప్పటికి నేటికి సింగూరు జలాలు మెదకు జిల్లాలవాసులకు తాగునీటి - సాగునీటి యోగం లేదని చెప్పవచ్చును. జంటనగరాలకు కృష్ణాజలాలు అందితే సింగూరు నీరు మెదకునకు దక్కునే మోయని ఆశ.

# నల్లవాగు ప్రాజెక్టు

మెదకు జిల్లా కల్హేర్ మండలంలో సుల్తానాబాద్ గ్రామశివారులో నల్ల వాగు ప్రాజెక్టునిర్మించబడినది. 1967 సం.లో ఈ ప్రాజెక్టు ప్రారంభించబడి 1969 సం.లో కేవలం 2 సంవత్సరాలలో పూర్తి గావించ బడినది. 1969-70 సంవత్సరంలో ప్రాజెక్టుక్రింది కాలువల నిర్మాణం కూడా పూర్తియైనది.

జిల్లాలో చిన్నతరహా ప్రాజెక్టులలో ఒకటైన నల్లవాగు ప్రాజెక్టు మొత్తంపొడవు 6350 అడుగులు. కట్టపై వెడల్పు 14 అడుగులు. ప్రాజెక్టు ఎత్తు 60 అడుగులు. మొత్తంప్రాజెక్టు సామర్థ్యం 746.133 యం.సి.యఫ్.టి లు కాగా డెడ్ కెపాసిటి 93.94.

నల్లవాగు ప్రాజెక్టు కుడికాలువ ప్రాజెక్టు నుంచి 19.50 కిలోమీటర్ల పొడవునా పదిగ్రామాల 4035.31 ఎకరాలకు నీరు అందించుచున్నది. ఎడమకాలువ 11.12 కిలో మీటర్ల పొడువున ప్రవహించుచు నాలుగు గ్రామాలకు 1292.27 ఎకరాలు ఆబికి. 218.25 ఎకరాలు రబీకి నీరందించుచున్నది.

కుడికాలువ క్రింద సుల్తానాబాద్, కోనాయిపల్లి, పోచాపూర్, బీబిపేట, పత్తిపూర్, క్రిష్ణాపూర్, ఖానాపూర్, కె.వహార్డి, కల్హేర్, బొక్కస్‌గావ్, అనే పదిగ్రామాల పొలాలకు ఎడమకాలువ క్రింద బొక్కస్‌గావ్, అంతర్‌గామ్ గ్రామాలకు కలిపి 334 ఎకరాలకు, నిజామాబాద్ జిల్లా పిట్లంమండల పరిధిలోని తిమ్మానగర్, మార్దండ్ గ్రామాలకు కలిపి 896.23 ఎకరాల పొలాలకు నల్లవాగు ప్రాజెక్టు నీరందించుచు ఆ ప్రాంతాన్ని సస్యశ్యామలము చేయుచు వ్యవసాయ అభివృద్ధికి తద్వారా దేశాభివృద్ధికి తోడ్పడుచున్నది.

# హల్దీ ప్రాజెక్టు

మెదకు జిల్లాలో పారే పెద్దనదులేమీ లేవు. ఉన్న ఒక్క మంజీరానది నీరు సింగూరు ద్వారా జంటనగరాల నాగరికుల తాగు నీటికే సరిపోయినది.

జిల్లాలో చెప్పుకోదగిన వాగులలో పసుపుటేరు (హల్దీవాగు) ఒకటి. ఈ వాగునకు ఆనకట్ట వేసి ఆప్రాంతానికి సాగునీరందించాలని సదుద్దేశ్యమొకటి కలిగినది.

తే. 23-10-1979న ఆనాటి ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రి గౌII మర్రి చెన్నారెడ్డి గారు వెల్దుర్తి మండల పరిధిలోని హకీంపేట గ్రామశివార్లలో హల్దీ జలాశయపథకానికి శంఖుస్థాపన చేసిరి.

ఈ ప్రాజెక్టు మొట్ట మొదట 1966 లో పరిశీలనకు వచ్చినది. 1968 సమగ్రపరిశీలన జరుపబడి అంచనాలు వేయాలని నాలుగవ ప్రణాళికలో నిర్ణయించిరి.

1969-70 లో రూ. 60.70 లక్షల మేరకు అంచనాలు తయారు కాబడెను. 1979 నాటికి అప్పటి ధరల ప్రకారం సంపూర్ణ నీటి మట్టం 1647 అడుగులకు

రూ 142.60 లక్షలు ఖర్చగును. ఈ ఖర్చు 1996 నాటికి 434 లక్షల రూ. చేరినది. 1979 లో మట్టికట్ట నిర్మాణానికి 50.095 లక్షల రూ అంచనాకు రూ 80.093 లక్షలు ఖర్చైనది. ఇప్పటివరకు ఇంత ఖర్చు ఇనప్పటికి పని మాత్రము పూర్తికాలేదు. ప్రైవేటు వ్యక్తుల భూములకు రూ. 5.54 లక్షలు పరిహారం చెల్లించాలని అంచనా వేయగా కోర్టు తీర్పుల వలన రూ. 50 లక్షల కుపైగా చెల్లింపులు జరిగినవి. ఇంకను 14 లక్షల రూ. చెల్లించ వలసియున్నది.

1997 జూన్ నాటికి ఈ ప్రాజెక్టు పూర్తి అగునని అధికారులు భావించిరి. 1996 లో నిధుల కొరతను ఎదుర్కొన్న హల్దీ ప్రాజెక్టుకు నాబార్డ్ నిధులు రూ. 60 లక్షలు అందినవి. ఐనను పని పూర్తియగుట లేదు. కోట్ల రూపాయలు వ్యయపరిచినను, కాలువలు, తూముల నిర్మాణాలు జరిగి ఏండ్లైనను నేటికి ఈ ప్రాజెక్టుద్వారా రైతులకు కలుగచున్న ఉపయోగ మేమియు లేదు. ఈ ప్రాజెక్టు పై మట్టి కట్ట 2600 అడుగుల పోడవు 67 అడుగుల ఎత్తు నిర్మించ బడినది.

ఇరవై సంవత్సరాలై నప్పటికి ఇప్పటికి ఈ ప్రాజెక్టు పనులు పూర్తి కాలేదంటే ఆశ్చర్యము కలుగక మానదు.

## కారావముంగి ఎత్తిపోతల పథకం

మెదకు జిల్లా మనూర్ మండలం కారముంగి గ్రామంవద్ద మంజీర నదిపై 1983 సం. లో 34.43 లక్షల రూపాయల ఖర్చుతో పదకొండు వందల ఎకరాల ఆరుతడి పంటలకు సాగునీరందించాలనే లక్ష్యంతో ఈ ఎత్తి పోతల పథకంనిర్మించబడినది.

ఈ ఎత్తిపోతల పథకం ద్వారా 1,100 ఎకరాలకు నీరందిచాలనుకున్నప్పటికి వ్యవసాయశాఖ వారు ఈ ప్రాంతం భూములను పరిశీలించి మొదట 550 ఎకరాల భూమికే నీరదించ వచ్చునని సూచించిరి.

ఈ పథకానికి 175 హెచ్ - పి ల విద్యుత్ మోటార్లు మూడు అమర్చవలసియుండగా ఈ పథకానికి చెందిన విద్యుత్ ట్రాన్స్‌పార్మరును ధ్వంసంచేసి గుర్తు తెలియని కొందరు దుండగులు కేబుల్ చోరి చేసిరి.

ఈ పథకం పనులు పూర్తి కాకుండుటచే ఆడిటర్ జనరల్ నివేదిక ఆధారంగా పబ్లిక్ అండర్ టేకింగ్ కమిటి అధ్వర్యంలో 1992 లో 15 మంది ఎం - యల్ - ఏ లబృందం పరిశీలించి 1993 మార్చి వరకు పూర్తి చేయాలని అధికారులను ఆదేశించిరి.

స్థానికుల వత్తిడి మేరకు ధ్వంసమై పోయిన ట్రాన్స్‌ఫార్మర్ స్థానంలో మరొక ట్రాన్స్‌పార్మర్‌ను ఏర్పాటుచేసిరి.

కోట్ల విజయభాస్కర్‌రెడ్డిగారు ఈ పథకానికి ప్రారంభోత్సవము చేసినప్పటికి కొన్ని రోజులు మంజీరానదిలో నీరు తగినంత లేకుండుట, నీరు పుష్కలముగా నున్నప్పుడు అధికారుల నిర్లక్ష్యం. రైతుల సమన్వయ లోప కారణంగా నేటికీ ఈ పథకం పనిచేయడం లేదు.

లక్షలరూపాయలు వెచ్చించి ఏర్పాటు చేసిన ఈ ఎత్తి పోతల పథకం నేటికీ నిరుపయోగంగా ఉండడం బాధ కరమే. ఇప్పటికైనను స్థానిక రైతులు, ప్రభుత్వ అధికారులు సమన్వయంతో కలిసి పని చేసిన చో ఈ ప్రాంతం సస్యశ్యామల మగుననుటలో ఆశ్చర్యము లేదు.

| మెదక్, సంగారెడ్డి స్కీం డి.పి.ఎ.పి.. | | బ్యాచ్ - 1(1995 - 96) | |
|---|---|---|---|
| సి.నెం. అసెంబ్లి కాంస్టిట్యూయెన్సి పేరు | మండల్ పేరు | ఊరు పేరు | వాటర్‌షెడ్ పేరు |
| 1. సంగారెడ్డి | 1. సంగారెడ్డి | 1. తోపుగొండ | తోపుగొండ |
| | | | చెర్లగూడెం |
| | | | హె. ఓ. కల్వెముల్ |
| | 2. పటాన్‌చెరు | 3. వెల్‌మెల | వెల్‌మాల |
| | 3. రాంచంద్రాపూర్ | 4. ఎదుల్నాగులపలి | ఎదుల్నాగులపల్లి |
| | 5. కొండాపూర్ | 5. గంగారాం | గంగారాం |
| | | 6. మాచెపల్లి | |
| | | 7. మమ్‌దాపూర్ | |
| | 6. సదాశివపేట | 8. రేజింతల్ | రేజింతల్ |
| | | 9. సిద్ధాపూర్ | సిద్ధాపూర్ |
| 2. ఆందోలు | 7. మునిపల్లి | 10. బుదెరా | బుదెరా |
| | 8. సదాశివ్‌పేట | 11. మాడికుంట | మాడికుంట |
| | | 12. తంగాడ్‌పల్లి | |
| | 9. రేగోడ్ | 13. దోసాపల్లి | దోసాపల్లి |
| | 10. అల్లాదుర్గం | 14. గడిపెద్దాపూర్ | గడిపెద్దాపూర్ |
| | 11. ఆందోలు | 15. అక్సానపల్లి | అక్సానపల్లి |
| | 12. పుల్కల్ | 16. ముదిమానిక్ | ముదిమనిక్ |
| | | 17. లక్ష్మీసాగర్ | |
| 3. జహీరాబాద్ | 13. ఝరాసంగం | 18. ఏదులపల్లి | ఏదులపల్లి |
| | | 19. సర్దారావ్‌పేట్ | సర్దారావ్‌పేట్ |
| 4. నారాయణ్‌ఖేడ్ | 14. న్యాల్‌కల్ | 20. గణేశ్‌పూర్ | గణేశ్‌పూర్ |
| | | 21. మామిడిగి | మామిడిగి |
| | 15. రాయ్‌కోడ్ | 22. నాగ్‌వర్ | నాగ్‌వర్ |
| | 16. నారాయణ్‌ఖేడ్ | 23. రాయల్‌మడుగు | ర్యాలమడుగు |
| | | 24. సంజీవన్‌రావ్‌పేట్ | సంజీవన్‌రావ్‌పేట్ |
| | 17. క్వాల్హేర్ | 25. కాల్హేర్ | కాల్హేర్ |
| | | 26. మన్‌సాన్‌పల్లి | మనసాన్‌పల్లి |
| | | 27. నాగాన్‌పల్లి | నాగ్‌దర్ |
| | 18. కంగ్టి | 28. గోర్‌దేగావ్ | గోర్‌దేగావ్ |
| | | 29. నాగాన్‌పల్లి | నాగన్‌పల్లి |
| | | 30. ఎన్కాపల్లి | ఎన్కాపల్లి |
| | | 31. ఉత్తపల్లి | ఉత్తపల్లి |

| మెదక్, సంగారెడ్డి స్కీం . డి.పి.ఎ.పి.. ఐ.డబ్ల్యు.డి.పి - I ప్రాజెక్టు | | | | |
|---|---|---|---|---|
| సీ.నెం. | అసెంబ్లి కాంస్టిట్యూయెన్సి పేరు | మండల్ పేరు | ఊరు పేరు | వాటర్‌షెడ్ పేరు |
| 5. | మెదక్ | 21. శంకరంపేట (ఎ) | 32. మూసాపేట్ | మూసాపేట్ |
| | | | 33. ఖాజిపూర్ | ఖాజిపూర్ |
| | | | 34. ఆకారం | ఆకారం |
| | | | 35. భీకోడ్ | |
| | | | 36. రామక్కపేట | |
| | | | 37. గంబీర్‌పూర్ | రామక్కపేట |
| | | | 38. పోతారం | గంబీర్‌పూర్ |
| 6. | సిద్దిపేట | దుబ్బాక | 39. తిమ్మాపూర్ | తిమ్మాపూర్ |
| | | | 40. మైలాయిపల్లి | మైలాయిపల్లి |
| | | | 41. చెల్లాపూర్ | |
| | | | 42. రాజక్కపేట | |
| | | | 43. ఎల్లాపూర్ | |
| | | | 44. అప్పాపల్లి | |
| | | | 45. హసనమిర్‌పూర్ | |
| | | | 46. హబ్శిపూర్ | హబ్శిపూర్ |

డిస్ట్రిక్ట్ : మెదక్, సంగారెడ్డి స్కీం . డి.పి.ఎ.పి.. బ్యాచ్- II (1995 - 96)

| సి.వెం. అసెంబ్లి కాంస్టిట్యూయెన్సి పేరు | మండల్ పేరు | ఊరు పేరు | వాటర్షెడ్ పేరు |
|---|---|---|---|
| 1. ఆందోలు | 1. మునిపల్లి | 1. ఇబ్రహింపూర్ | ఇబ్రహింపూర్ |
| | 2. రేగోడ్ | 2. దుద్యాల్ | దుద్యాల్ |
| | | 3. లింగంపల్లి | లింగంపల్లి |
| | 3. ఆందోల్ | 4. తాలెల్మ | తెలెల్మ |
| | | 5. నారద్గుంట | నారాద్గుంట |
| | | 6. ఎర్రమ్ | ఎర్రమ్ |
| | 4. పుల్కల్ | 7. ముదిమానిక్యం - | ముదిమానిక్యం - |
| | | 8. పోసన్పల్లి | పోసన్పల్లి |
| 2. నారాయణ్ఖేడ్ | 5. రాయ్కోడ్ | 9. మతూర్ | మంతూర్ |
| | 6. క్ల్హేర్ | 10. కృష్ణపూర్ | కృష్ణపూర్ |
| | | 11. కద్పల్ | కాడ్పల్ |
| | | 12. కాజాపూర్ | కజాపూర్ |
| | 7. నారాయణ్ఖేడ్ | 13. నర్సాపూర్ | నర్సాపూర్ |
| | | 14. నమిలిమేట్ | నమిలిపేట్ |
| 3. మెదక్ | 8. శంకరంపేట్ (ఎ) | 15. బురుగుపల్లి | బురుగుపల్లి |
| | | 16. లక్ష్మాపూర్ | లక్ష్మాపూర్ (ఎమ్) |
| | | 17. కొల్లపల్లి | కొల్లపల్లి |
| | 9. అల్లాదుర్గం | 18. చిల్వెర | చిల్వెర |
| | | 19. ముప్పరం | ముప్పరం |

డిస్ట్రిక్ట్ : మెదక్, సంగారెడ్డి స్కీం . డి.పి.ఎ.పి.. బ్యాచ్ - III (1996 - 97)

| సి.నెం. | అసెంబ్లి కాంస్టిట్యూయెన్సి పేరు | మండల్ పేరు | ఊరు పేరు | వాటర్‌షెడ్ పేరు |
|---|---|---|---|---|
| 1. | సంగారెడ్డి | 1. సంగారెడ్డి | 1. చిద్రుప్ప | 1. చిద్రుప్ప |
| | | 2. ఇస్మాయిల్‌ఖాన్‌పేట్ గొడిచెర్ల | 2. ఇస్మాయిల్‌ఖాన్‌పేట్ గొడిచెర్ల | |
| | | 3. కొండాపూర్ | 3. కొండాపూర్ | 3. కొండాపూర్ |
| | | 4. పార్ట్ ఆఫ్ మరెపల్లి | పార్ట్ ఆఫ్ మరెపల్లి | |
| | | 5. అనంతసాగర్ | 4. అనంతసాగర్ | |
| 2. | ఆందోల్ | 3. మునిపల్లి | 6. కామకోల్ | 5. కామకోల్ |
| | | 4. ఆందోల్ | 7. తాద్మనూర్ | 6. తాద్మనూర్ |
| | | 5. అల్లాదుర్గ | 8. మార్వెల్లి | 7. మార్వెల్లి |
| | | | 9. పల్వెట్ల | 8. పల్వెట్ల |
| | | | 10. గౌతాపూర్ | గౌతాపూర్ |
| | | | 11. గొరక్కల్ | 9. గొరక్కల్ |
| | | | 12. బైరన్‌డిబ్బ పార్ట్ ఆఫ్ పోతులబొొద్ద | 10. బైరన్‌డిబ్బ పార్ట్ ఆఫ్ పోతులబొొద్ద |
| | | | 13. నాగులపల్లి | |
| | | | 14. బిజిలిపూర్ | 11. బిజిలిపూర్ |
| 3. | నారాయణ్‌ఖేడ్ | 8. నారాయణ్‌ఖేడ్ | 15. అబెండ | 12. అబెండ |
| | | 9. క్వాల్టేర్ | కాడ్‌పల్ | 13. కాడ్‌పల్లి |
| | | | 16. కానాపూర్ | కానాపూర్ |
| | | | 17. ముబారక్‌పూర్ | 14. ముబారక్‌పూర్ |
| | | | 18. బొక్కస్‌గామ్ | బొక్కస్‌గామ్ |
| | | | 19. అంతర్‌గామ్ | అంతర్‌గామ్ |
| | | 10. కంగ్టి | 20. నాగుర్ (కె) | 15. నాగుర్ (కె) ఎమ్ |
| | | | 21. నాగుర్ (బి) | 16. నాగుర్ (బి) |
| | | | 22. బీమ్ర | 17. బీమ్ర |
| | | 11. మానూర్ | 23. శైలిగెరా | 18. శైలిగెరా |
| | | | 24. గూడూర్ | 19. గూడూర్ |
| 4. | మెదక్ | 7. శంకరంపేట్ (ఎ) | 25. కె. వెంకటాపూర్ | 20. వెంకటాపూర్ |

# సాగునీటి సంఘములు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నీటిపారుదల రంగములో 1997వ సంవత్సరములో ఒక కొత్త చట్టము ద్వారా సాగునీటి సంఘములు ఏర్పాటు చేయడము జరిగినది. అందుకు అనుగుణముగా మెదక్ జిల్లాలో 563 సాగునీటి సంఘాలు ఏర్పాటు చేయడము జరిగినది.

సాగునీటి సంఘముల ఏర్పాటును ప్రభుత్వము ప్రతిష్ఠాత్మకముగా తీసుకొని వాటికి ఎన్నికలు నిర్వహించుట జరిగినది. అందులో ఏకగ్రీవంగా ఎన్నికలు జరిగిన సాగునీటి సంఘాలకు ఆయకట్టు అభివృద్ధికి గాను ప్రతిసంఘానికి రూ.50,000/- చొప్పున ప్రోత్సాహక గ్రాంటు మరియు ఎన్నిక ద్వారా ఏర్పాటు చేయబడిన సాగునీటి సంఘాలకు రూ.30,000/- చొప్పున ప్రోత్సాహక గ్రాంటు ఇవ్వడము జరిగినది.

| | సంఖ్య | సొమ్ము (రూ. లక్షలలో) |
|---|---|---|
| ఏకగ్రీవంగా ఎన్నిక కాబడిన సాగునీటి సంఘాలు | 370 | 185-00 |
| ఎన్నిక ద్వారా ఏర్పాటు చేయబడిన సాగునీటి సంఘాలు | 193 | 57-90 |
| మొత్తము | **563** | **242-90** |

అమలు మరియు నిర్వహణ గ్రాంటు కింద రూ. 140-9 లక్షలు విడుదల కాబడినది.

**ఎ.పి.ఇ.ఆర్.పి. పనులు (ఆర్థిక పునర్నిర్మాణము)**

మధ్యతరహా నీటిపారుదల ప్రాజెక్టులైన ఘణపురం ఆనకట్ట క్రిందగల మహబూబ్‌నహర్ కాలువకు రూ. 29-43 లక్షలు, ఫతేనహార్ కాలువకు రూ. 20-19 లక్షలు మరియు నల్లవాగు ప్రాజెక్టునకు రూ. 11-05 లక్షలు 1999-2000 సంవత్సరములు 15 పనులు చేపట్టుటకు జి.ఓ.ఎమ్. నెం. 27 ద్వారా కేటాయించబడినవి. మరియు జి.ఓ.ఎమ్. నెం.102 ప్రకారం మొత్తం రూ. 428-50 లక్షలతో 145 పనులు చేపట్టుట జరిగనది. నియోజక వర్గాల వారి పనులు మరియు అంచనా విలువ ఈ దిగువన పొందపరుచుట జరిగినది.

# వాటర్ షెడ్ పథకాలు

వాతావరణ సమతుల్యం, భూసారపరిరక్షణ, వ్యవసాయాభివృద్ధితో పాటు వృక్షసంపదను, మానవ వనరులను సరియైన రీతిలో వినియోగించుటకు నిర్దేశించిన నీటి పరీవాహక పథకమే వాటర్‌షెడ్ పథకం.

తక్కువ వ్యయంతో వర్షపు నీటిని కావలిసినంత మేరకు నిల్వవుంచి ఆధునిక పద్ధతులలో వ్యవసాయం, తదితర అభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించుటకు, సమగ్ర గ్రామీణాభివృద్ధికి అధికోత్పత్తి సాధించుటకు, వాటర్ షెడ్‌పథకం ఎంతో ఉపయోగపడుచున్నది. భుసారాన్ని పరిరక్షించుచు మెట్టభూములలో భూమి కోతను నివారించడంతో పాటు రైతులకు అధిక ప్రయోజనాన్ని వాటషెడ్ పథకం కల్పించుచున్నది.

మెదకు జిల్లాలో గ్రామీణాభివృద్ధి సంస్థ (D.R.D.A )అధ్వర్యంలో ఈ పథకం పని చేయుచున్నది.

క్షౌర్ మండల్‌లో మాత్రం అజాద్ రూరల్ సోషియో ఎకనమిక్ డెవలప్‌మెంట్ సొసైటీ అనే స్వచ్ఛంద సంస్థ అధ్వర్యంలో వాటర్‌షెడ్ పథకం అమలగుచున్నది.

మెదకు జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ అధ్వర్యంలో జిల్లాలో 103 ప్రాంతాలలో వాటర్‌షెడ్ పథకం అమలగుచున్నది. నారాయణఖేడ్, జహీరాబాద్, అందోల్, పటన్‌చెరువు, సదాశివపేట ప్రాంతాల్లో ఈ పథకం అమలగుచున్నది.

ఒక్కొక్క ప్రాజెక్టు రూ.20 లక్షలతో జిల్లావ్యాప్తంగా వాటర్‌షెడ్ అమలుకు రూ.20 కోట్ల 60 లక్షల వ్యయంతో కొన సాగింపబడుచున్నది. ఐదు (5)బ్లాకులలో నడుస్తున్న ఈ పథకాన్ని 40 ఇ.ఎ.యస్‌లుగా 63 డి.పి.ఐ.పి.లుగా విభజించుట జరిగినది.

వివిధగ్రామాల్లో అమలగుచున్న ఈ పథకం ఆయాగ్రామాలలోని రైతులు దీన్నివిజయవంతం చేయుటకు కృషి చేయుచున్నారు. ఒక్కొక్క వాటర్‌షెడ్ పథకం క్రింద 500 హెక్టార్ల భూమి పంటలు పండించుటకే కాక గ్రౌండ్‌వాటర్ తయారీకి ఉపయుక్తమగుచున్నది.

వాటర్‌షెడ్ అమలుకు అధికారులు వాటర్‌షెడ్ కమిటీలు ఏర్పాటు చేయుచు ఆకమిటీల్లో ఉండేరైతులకు శిక్షణాతరగతుల నిర్వహించుచున్నారు.

103 వాటర్ షెడ్ పథకాలలో అవసరమైన చోట చెక్‌డ్యాంలు, సర్క్యులేషన్ ట్యాంకులు నిర్మించుచున్నారు దీనితో నీరు నిల్వయుండుటే కాక భూమి కోతను కూడా అరికట్టవచ్చును.

ఈ పథకం వలన భూసారం, వర్షపు నీటి సంరక్షణతో పాటు వివిధ పంటల ద్వారా పంటల దిగుబడిని పెంచుటకు దోహదపడుచున్నది.

# వాటర్‌షెడ్ అభివృద్ధి

1. వివిధ ప్రాంతాల నుండి పడ్డ వర్షపు నీరు, ఎత్తు నుండి పల్లము వైపు పలు పాయలుగా ప్రవహించి ఒక పెద్ద పాయగా, కాలువ లేదా వాగులో కలిసి ప్రవహించునో ఆ ప్రాంతమంతటిని కలిపి నీటి పరీవాహక ప్రాంతమంటారు.

2. వర్షపు నీటి ప్రవాహము వలన సారవంతమైన మట్టి కొట్టుకొని పోకుండా భూమి కోతకు గురి కాకుండా, పడ్డ వర్షపు నీరు గరిష్టంగా భూమిలో ఇంకే విధంగా చేపట్టే భూసార నీటి పరిరక్షణ చర్యలు ఈ వాటర్‌షెడ్ అభివృద్ధి పథకములో చేపట్టబడు తున్నాయి. వాతావరణ సమతుల్యం కొరకు చెట్లు నాటడం, పచ్చికబయళ్లు మరియు పశుగ్రాసం పెంచడం జరుగుతుంది.

3. భూసార నీటి పరిరక్షణ చర్యలలో భాగంగా, భూములలో వాలుకు అడ్డంగా మట్టి గట్లు (బండింగ్) వేయడము, కాంటూరు వెంబడి ట్రెంచీలు త్రవ్వడం, వాగులలో అడ్డంగా రాతి తెట్టెలు వేయడం జీవగట్లు, ఊటకుంటలు మరియు చెక్ డ్యాంలు నిర్మించడం జరుగుతుంది.

4. ఈ విధంగా ఈ పథకంలో వాటర్‌షెడ్‌లో సహజ వనరుల స్వయం సమృద్ధి దిశగా అభివృద్ధి గావించడం వల్ల భూమియొక్క ఉత్పాదక శక్తి పెంపొందించడం, అదనపు భూములను ఉత్పత్తిలోనికి తీసుకొని రావడం జరుగుతుంది.

5. భౌతిక వనరులే కాకుండా మానవ వనరులుకూడా అభివృద్ధి చెందే దిశగా రైతులను అభివృద్ధి దిశగా చైతన్య పరచడం జరుగుతుంది.

6. జిల్లాలో వాటర్‌షెడ్ అభివృద్ధి పథకం 1996 సంవత్సరంలో ప్రారంభ మైంది. ప్రతి వాటర్‌షెడ్‌కు రూ. 20 లక్షల వ్యయంతో 500 హె. లు నాలుగు సంవత్సరాలలో అభివృద్ధి చేయడం జరుగుతుంది. ప్రతి సంవత్సరం రూ. 5.00 లక్షలు వాటర్‌షెడ్‌కు నిధులు విడుదల చేయబడును. జిల్లాలో ఈ పథకంలో భౌతిక ఆర్థిక ప్రగతి పత్రము జతపరచనైనది.

## వాటర్‌షెడ్ పథకము

ఒ.పి.ఎ.పి. 20 మండలాలలో వాటర్‌షెడ్ పథకము క్రింద మెదక్ జిల్లాలో ఇప్పటి వరకు 5 బ్యాచ్‌లుగా 132 వాటర్‌షెడ్‌లు 1995-96 నుండి రూ. 2640 కోట్ల రూపాయలతో అమలు చేయబడుచున్నది. ప్రతి వాటర్‌షెడ్ కాలపరిమితి 4 సంవత్సరములు.

50% ఉపాధి హామి పథకము క్రింద 40 వాటర్‌షెడ్‌లు 1995-96 నుండి 98-99 వరకు రూపాయలతో అమలు చేయుబడుచున్నది.

25నాన్ డి.పి.ఎ.పి. మండలంలో సమగ్ర బంజరు భూముల అభివృద్ధి పథకము క్రింద రెండు ప్రాజెక్టులు 50 వాటర్‌షెడ్‌లు రూ. 10 కోట్లతో అమలు చేయబడుచున్నది.

అలాగే 40% ఉపాధి హామి పథకము క్రింద నాన్ డి.పి.ఎ.పి మండలాలలో 12 వాటర్‌షెడ్‌లు రూ. 112.40 కోట్ల రూపాయలతో 1998-99 నుండి అమలు చేయుచున్నది. 1995-96నుండి సెప్టెంబర్, 99 వరకు డి.పి.ఎ.పి. నందు రూ. 1173.60 లక్షలు, సఇ.ఎ.యస్ 50% రూ. 684.36 లక్షలు, ఇ.ఎ.యస్. 40% రూ. 6.00 లక్షలు మరియు ఐ.డబ్ల్యు.డి.పి. క్రింద రూ. 179.121 లక్షలు ఖర్చు అయినది. దానికిగాను I & II ప్రగతి ఈ దిగువ చూపనైనది.

| ప్రగతి వివరములు | ప్రగతి సాధించినది |
|---|---|
| 1. అడివి చెట్లు పెంపకము | 2244.50 హె. |
| 2. పండ్ల చెట్ల పెంపకము | 1277.20 హె. |
| 3. నర్సరి గురించి | 26,92,000 సీడ్లింగ్ |
| 4. భూసార పరిరక్షణ (Soil Moisture Conservation) | 32965 హె. |
| 5. నీటి నిలువ గురించి కట్టడాలు (వాటర్ హార్వెస్టింగ్ స్ట్రక్చర్‌లు) | 6857 నెం. |
| 6. సి.సి.టి | 858.28 హె. |

| డిస్ట్రిక్ట్ : మెదక్, సంగారెడ్డి స్కీం . డి.పి.ఎ.పి.. | | బ్యాచ్ - IV (1996 - 97) | | |
|---|---|---|---|---|
| సీ.నెం. | అసెంబ్లి కాంస్టిట్యూయెన్సి పేరు | మండల్ పేరు | ఊరు పేరు | వాటర్‌షెడ్ పేరు |
| 10. | జహీరాబాద్ | 1. జహీరాబాద్ | 1. హోతి (కె) I | హోతి (కె) I |
| | | | 2. హోతి (కె) II | హోతి (కె) II |
| | | | 3. హోతి (బి) I | హోతి (బి) I |
| | | | 4. హోతి (బి) II | హోతి (బి) II |
| | | | 5. హోతి (బి) - గోవిందపూర్ | హోతి (బి) - గోవిందపూర్ |
| | | 2. ఝురాసంగం | 6. బర్దిపూర్ | బర్దిపూర్ |
| | | | 7. కుప్పనగర్ | కుప్పనగర్ |
| | | | 8. బొప్పనపల్లి | బొప్పనపల్లి |
| | | | 9. ప్యారవరం | ప్యారవరం |
| | | | 10. మేడపల్లి | మేడపల్లి |
| | | 3. న్యాల్‌కల్ | 11. వడ్డి | వడ్డి |
| | | | 12. మల్గి | మల్గి |
| | | | 13. రత్నాపూర్ | రత్నాపూర్ |
| | | 4. మనూర్ | 14. గట్టులింగంపల్లి | గట్టులింగంపల్లి |
| | | | 15. దుద్‌గొండ | దుద్‌గొండ |
| 11. | నారాయణ్‌ఖేడ్ | 5. నారాయణ్‌ఖేడ్ | 16. అనంతసాగర్ - I | అనంతసాగర్ - I |
| | | | 17. అనంతసాగర్ - I | అంత్వర్‌పేడిపల్లి |
| | | | 18. అంత్వర్‌పేడిపల్లి | |
| | | | 18. జుల్కాల్ | జుల్కాల్ |
| | | | 19. రుద్రార్ | రుద్రార్ |
| | | | 20. సత్నాగావ్ చండాపూర్ | సత్నాగావ్ చండాపూర్ |
| | | 6. కంగ్టి | 21. మెరుకుంజల్ | |
| | | | 22. మెరుకుంజల్ | జమ్‌గి (బి) |
| | | | 23. జంగి (బి) | జమ్‌గి (కె) |
| | | | 24. జమ్‌గి (కె) | చప్తా (కె) |
| | | | 25. చప్తా (కె) | చప్తా (బి) |
| | | | 26. చప్తా (బి) | చప్తా (కె) |
| | | | 27. చప్తా (కె) | తడ్కాల్ |
| | | | 28. తడ్కాల్ | దామరగిడ్డ |
| | | | 29. దామరగిడ | ఘాన్‌పూర్ |
| | | | 30. ఘాన్‌పూర్ | |

| డిస్ట్రిక్ట్ : మెదక, సంగారెడ్డి స్కీం . డి.పి.ఎ.పి.. ఇ.ఎ.ఎస 50% | | | | |
|---|---|---|---|---|
| సీ.నెం. | అసెంబ్లి కాంస్టిట్యూయెన్సి పేరు | మండల్ పేరు | ఊరు పేరు | వాటర్ షెడ్ పేరు |
| 1. | సంగారెడ్డి | 1. సంగారెడ్డి | 1. బ్యాతోల్ | బ్యాతోల్ |
| | | | 2. ఎర్దనూర్ | |
| | | | 3. అర్తుల | అర్తుల |
| | | | 4. ఝుల్కల్ | ఝుల్కల్ |
| | | | 5. ఫలస్వాడి | ఫలస్వాడి |
| | | 2. పటాన్చెరు | 6. పటిగానపూర్ | పటిగానపూర్ (లక్దారం లోనిది) |
| | | 3. రామచంద్రాపూర్ | 7. కొల్లూర్ | కొల్లూర్ |
| | | | 8. ఉస్మాన్నగర్ | ఉస్మాన్నగర్ |
| | | 4. కోనాపూర్ | 9. కోనాపూర్ | కోనాపూర్ |
| | | | 10. హరిదాస్పూర్ తెర్పోల్ | హరిదాస్పూర్ తెర్పోల్ |
| | | 5. సదాశివపేట | 11. వెల్టూర్ | వెల్టూర్ |
| 2. | ఆందోల్ | 6. మునిపల్లి | 12. పెద్ద లోని | పెద్దలోని |
| | | | 13. చిన్న లోని | చిన్న లోని |
| | | | 14. తాటపల్లి | తాటపల్లి. |
| | | | 15. చీలపల్లి బెలూర్ | చీలపల్లి బెలూర్ |
| | | | 16. కల్లపల్లి | |
| | | 7. అల్లాదుర్గం | 17. ముసలాపూర్ | ముసలాపూర్ |
| | | | 18. పాతుల్బొగుడ | పాతుల్బొగుడ |
| | | 8. ఆందోల్ | 19. కోడెకల్ | కోడెకల్ |
| | | | 20. రామ్సన్పల్లి | రామ్సన్పల్లి |
| | | 9. పుల్కల్ | 21. చౌతకూర్ | చౌతకూర్ - |
| | | | 22. సుల్తాన్పూర్ | చౌతకూర్ - సుల్తాన్పూర్ |
| | | | 23. వెండకోల్ | వెండకోల్ |
| | | | 24. లింగంపల్లి | లింగంపల్లి |
| | | | 25. కోర్పల్లి | కోర్పల్లి |
| | | | 26. అత్మకూర్ | అత్మకూర్ |
| 3. | జహీరాబాద్ | 10. ఝరాసంగం | 27. గిన్యార్పల్లి | గిన్యార్పల్లి |
| | | | 28. పోటపల్లి | పోట్పల్లి |
| | | | 29. వనంపల్లి | వనంపల్లి |
| | | 11. జహీరాబాద్ | 30. మొగుడంపల్లి | మిరపల్లి (టి) |
| | | | 31. శేకపూర్ | ఎల్లమచెరు |
| | | | 32. | చిన్నచెరు |
| | | | 33. అనెగుంట | అనెగుంట |
| | | 12. రాయ్కోడ్ | 34. ఖాన్జమల్పూర్ | ఖాన్జమల్పూర్ |

| డిస్ట్రిక్ట్ : మెదక్, సంగారెడ్డి స్కీం . డి.పి.ఏ.పి.. ఇ.ఎ.ఎస 50% | | | |
|---|---|---|---|
| సీ:నెం. అసెంబ్లి కాంస్టిట్యూయెన్సి పేరు | మండల్ పేరు | ఊరు పేరు | వాటర్ షెడ్ పేరు |
| 1. నారాయణ్‌ఖేడ్ | 13. నారాయణ్‌ఖేడ్ | 35. చప్లా (కె) | చప్లా (కె) -I |
| | | | చప్లా (కె) - II |
| | 14. కంగ్టి | 36. పోట్‌పల్లి | పోట్‌పల్లి |
| | | 37. గోడెగావ్ | గోడెగావ్ |
| | 15. మనూర్ | 38. ఎర్కాపల్లి | ఎర్కాపల్లి - I |
| | | | ఎర్కాపల్లి - II |
| | | | ఎర్కాపల్లి - III |
| | 16. న్యాల్కల్ | 39. గన్‌జోటి | గన్‌జోటి - |
| | | 40. హుస్సెల్లి | హుస్సెల్లి |
| | | 41. వడ్డి | వడ్డి |
| | | 42. కల్బిముల్ | కల్బిముల్ |

## అబ్‌స్ట్రాక్ట్ వాటర్ షెడ్స్

| నెం. | అసెంబ్లి కాంస్టిట్యూయెన్సి | I | II | III | IV | EAS 50% | (EAS 40%. | IWDP-I, | I WDP - II | Total |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | సంగారెడ్డి | 7 | - | 4 | - | 10 | - | - | - | 21 |
| 2. | ఆందోలు | 8 | 7 | 7 | - | 13 | - | - | - | 35 |
| 3. | జహీరాబాద్ | 2 | - | - | 15 | 08 | - | - | - | 25 |
| 4. | మెదక్ | 1 | 4 | 1 | - | - | - | - | 1 | 07 |
| 5. | నారాయణ్‌ఖేడ్ | 10 | 4 | 8 | 15 | 09 | - | - | - | 46 |
| 6. | గజ్వేల్ | - | - | - | - | - | 8 | - | - | 08 |
| 7. | సిద్దిపేట్ | - | - | - | - | - | 2 | 10 | 3 | 15 |
| 8. | దొమ్మాట | | - | - | - | - | - | - | 15 | 13 |
| 9. | రామాయంపేట్ | - | - | - | - | - | 2 | - | 8 | 10 |
| | మొత్తము | 28 | 15 | 20 | 30 | 40 | 12 | 25 | 25 | 195 |

చెక్ డ్యాంలు

| | | | |
|---|---|---|---|
| డి.పి.ఏ.పి. | 217 | - | 82 |
| ఇ.ఎ.ఎస్ | 95 | - | 34 |
| ఐ.డబ్ల్యు.డి.పి | 12 | - | - |

| డిస్ట్రిక్ట్ : మెదక్, సంగారెడ్డి స్కీం . డి.పి.ఎ.పి.. ఇ.ఎ.ఎస్ 40% | | | | |
|---|---|---|---|---|
| సీ.నెం. | అసెంబ్లి కాంస్టిట్యూయెన్సి పేరు | మండల్ పేరు | ఊరు పేరు | వాటర్షెడ్ పేరు |
| 1. | సిద్ధిపేట | చిన్నకోడూరు | 1. చిన్నకోడూరు | చిన్నకోడూరు |
| 2. | సిద్ధిపేట | నంగనూరు | 2. రాజగోపాల్పేట్ | రాజగోపాల్పేట్ |
| | | | 3. ఒబులాపూర్ | |
| 3. | రామాయంపేట | కొల్చారం | 4. హంసన్పల్లి | హంసన్పల్లి |
| | | | 5. పోతిరెడ్డిపల్లి | |
| 4. | రామాయంపేట | ఎల్దుర్తి | 6. ఎదులపల్లి | ఎదులపల్లి |
| | | | 7. బండపోసనపల్లి | |
| 5. | గజ్వేల్ | గజ్వేల్ | 8. అహ్మదాపూర్ | అహ్మదాపూర్ |
| | | | 9. పెద్బాడ్ | |
| 6. | గజ్వేల్ | గజ్వేల్ | 10. కొడకండ్ల | కొడకండ్ల |
| 7. | గజ్వేల్ | జగదేవ్పూర్ | 11. దౌలాపూర్ | దౌలాపూర్ |
| | | | 12. జగదేవ్పూర్ | |
| 8. | గజ్వేల్ | జగదేవ్పూర్ | 13. ఇటిక్యాల్ | ఇటిక్యాల్ |
| | | | 14. పీర్లపల్లి | |
| 9. | గజ్వేల్ | ములుగు | 15. కర్కపట్ల | కర్కపట్ల |
| | | | 16. దమరకుంట | |
| 10. | గజ్వేల్ | వర్గల్ | 17. వర్గల్ | వర్గల్ |
| | | | 18. తున్కిమక్త | |
| | | | 19. శకరం | |
| 11. | గజ్వేల్ | తూప్రాన్ | 20. ఘాన్పూర్ | ఘాన్పూర్ |
| | | | 21. ఇమామ్పూర్ | |
| 12. | గజ్వేల్ | తూప్రాన్ | 22. తూప్రాన్ | తూప్రాన్ |
| | | | 23. రావెల్లి | |

| డిస్ట్రిక్ట్ : మెదక్, సంగారెడ్డి స్కీం . డి.పి.ఎ.పి.. ఐ.డబ్ల్యు.డి.పి - I ప్రాజెక్టు | | | | |
|---|---|---|---|---|
| సీ.నెం. | అసెంబ్లీ కాంస్టిట్యూయెన్సి పేరు | మండల్ పేరు | ఊరు పేరు | వాటర్‌షెడ్ పేరు |
| 1. | సిద్దిపేట | సిద్దిపేట | పొన్నాల | పొన్నాల |
| 2. | సిద్దిపేట | సిద్దిపేట | బుస్సాపూర్<br>వెంకాపూర్<br>ఘూనాపూర్ | బుస్సాపూర్<br>వెంకటాపూర్<br>ఘూనాపూర్ |
| 3. | సిద్దిపేట | సిద్దిపేట | చి.గుండవల్లి<br>బుర్గపల్లి | చి. గుండవల్లి<br>బూర్గపల్లి |
| 4. | సిద్దిపేట | సిద్దిపేట | తడ్కపల్లి<br>ఎన్సాన్‌పల్లి | తడ్కపల్లి<br>ఎన్సాన్‌పల్లి |
| 5. | సిద్దిపేట | సిద్దిపేట | నారాయణ్‌రావ్‌పేట్ | నారాయణ్‌రావ్‌పేట్ |
| 6. | సిద్దిపేట | సిద్దిపేట | మాచాపూర్<br>చింతమడ్క | మాచాపూర్<br>చింతమడ్క |
| 7. | సిద్దిపేట | సిద్దిపేట | తోర్నాల | తోర్నాల |
| 8. | సిద్దిపేట | సిద్దిపేట | రావ్‌రూకుల | రావ్‌రూకుల |
| 9. | సిద్దిపేట | సిద్దిపేట | ఇర్‌కోడ్ | ఇర్‌కోడ్ |
| 10. | సిద్దిపేట | చిన్నకోడూర్ | రుమినిపట్ల | రుమినిపట్ల |
| 11. | దొమ్మె | కొండపాక | మర్పడ్గ | మర్పడ్గ - |
| 12. | దొమ్మె | కొండపాక | కమాన్‌పల్లి | కమాన్‌పల్లి |
| 13. | దొమ్మె | కొండపాక | దుద్దెడ<br>బండారం<br>అంకిరెడ్డిపల్లి | దుద్దెడ |
| 14. | దొమ్మాట | కొండపాక | శ్రీసిరిసెనగడ్డ<br>గిరాయ్‌పల్లి | శ్రీసిరిసెనగడ్డ |
| 15. | దొమ్మాట | కొండపాక | కొండపాక | కొండపాక |
| 16. | దొమ్మాట | కొండపాక | లక్దారం<br>తిమ్మారెడ్డిపల్లి | లక్దారం<br>తిమ్మారెడ్డిపల్లి |
| 17. | దొమ్మాట | కొండపాక | వెల్కటూర్<br>విశ్వనాథపల్లి<br>తుక్కాపూర్ | వెల్కటూర్<br>తుక్కాపూర్ |
| 18. | దొమ్మాట | కొండపాక | ఎల్లారెడ్డిపేట | ఎల్లారెడ్డిపేట |
| 19. | దొమ్మాట | కొండపాక | మస్సన్‌పల్లి<br>బందరుపల్లి | మస్సన్‌పల్లి<br>బందరుపల్లి |
| 20. | దొమ్మాట | కొండపాక | తొగుట | తొగుట |
| 21. | దొమ్మాట | కొండపాక | ఏటిగడ్డ కిష్టాపూర్ | ఏటిగడ్డ కిష్టాపూర్ |
| 22. | దొమ్మాట | కొండపాక | వేముల్‌ఘాట్ | వేముల్‌ఘాట్ |
| 23. | దొమ్మాట | కొండపాక | పల్లెపెరు<br>ఎర్రవల్లి | పల్లెపెరు |
| 24. | దొమ్మాట | కొండపాక | మంగోల్<br>కొనాయిపల్లి<br>మలిన్‌పూర్<br>మత్‌పల్లి | మంగోల్<br>(ప్రగతి) |
| 25. | దొమ్మాట | సిద్దిపేట | బక్రిచప్యాల్<br>నాంచార్‌పల్లి | బక్రిచప్యాల్<br>నాంచార్‌పల్లి |

| డి(స్ట్రిక్ట్ : మెదక్, సంగారెడ్డి స్కీం . డి.పి.ఎ.పి.. ఐ.డబ్ల్యు.డి.పి - I ప్రాజెక్టు | | | | |
|---|---|---|---|---|
| సీ.నెం. | అసెంబ్లి కాంస్టిట్యూయెన్సి పేరు | మండల్ పేరు | ఊరు పేరు | వాటర్‌షెడ్ పేరు |
| 1. | రామాయంపేట | మెదక్ | 1. చిట్యాల్ | చిట్యాల్ |
| | | | 2. ర్యాలమడుగు | |
| | | | 3. రాజిపేట | రాజిపేట |
| | | | 4. పాతూర్ | పాతూర్ |
| | | రామాయంపేట | 5. రామాయంపేట | రామాయంపేట |
| | | | 6. కోమటపల్లి | |
| | | | 7. కోనాపూర్ | |
| | | | 8. దొంగల్ ధర్మారం | దొంగల్ ధర్మారం |
| | | | 9. నిజాంపేట | |
| | | | 10. బచ్చు రాజుపల్లి | |
| | | | 11. దామరచెరు | దమరాచెరు |
| | | | 12. రాయలాపూర్ | రాయలాపూర్ |
| | | | 13. కల్వకుంట | కల్వకుంట |
| | | | 14. వెంకటాపూర్ | |
| | | | 15. శివాయపల్లి | |
| 2. | మెదక్ | ఝూంసిలింగాపుర | 16. ఝూంసిలింగాపురం | ఝూంసిలింగ్‌లింగాపురం |
| | | | 17. అక్కనపేట | |
| 3. | దొమ్మాట | మిర్దొడ్డి | 18. మొతె | మొతె |
| | | | 19. అందే | అందే |
| | | | 20. లింగుపల్లి | |
| | | | 21. చెప్యాల్ | చెప్యాల్ |
| | | | 22. వెంకట్రావ్‌పేట్ | |
| | | | 23. రుద్రారం | రుద్రారం |
| | | | 24. భూంపల్లి | |
| | | | 25. జంగపల్లి | |
| | | | 26. ధర్మారం | ధర్మారం |
| | | | 27. మిర్దొడ్డి | |
| | | | 28. లింగాపూర్ | లింగాపూర్ |
| | | | 29. లింగారెడ్డిపల్లి | లింగారెడ్డిపల్లి |
| | | | 30. అల్వాల్ | |
| | | | 31. కసులబాద్ | కసులబాద్ |
| | | | 32. కొండాపూర్ | కొండాపూర్ |

# వ్యవసాయ శాఖ

మెదకు జిల్లా వ్యావసాయిక ప్రాంతము ఇక్కడి జనుల ముఖ్య వృత్తి వ్యవసాయము. 70% పైగా ఇక్కడి ప్రజలు వ్యవసాయంపై ఆధారపడి జీవించుచున్నారు.

మెదకు జిల్లా భౌగోళిక విస్తీర్ణం 9699 చ.కి.మీ. ఇందులో సాగుకు అనుకూలమైన భూమి 4,47,490 హెక్టార్లు, వ్యవసాయ పంటలు పండు విస్తీర్ణం 4,02,298 హెక్టార్లు, సాగుబడి చేయుచున్న విస్తీర్ణం 3,95,604 హెక్టార్లు, పంటలు పండించని విస్తీర్ణం 45,192 హెక్టార్లు, అటవీ ప్రాంతం 88,358 హెక్టార్లు, జిల్లాలో సాధారణ వర్షపాతం 950 మి.మీ.

| | |
|---|---|
| జిల్లాలో వ్యవసాయదారులు | 4,19,894 |
| వ్యవసాయకూలీలు | 3,06,929 |

మెదకు జిల్లాలో సజీవ నదులు లేవు. ఉన్న ఒక్క మంజీరానదికి వేసిన ఆనకట్ట నిజాంసాగర్ నిజామాబాద్ జిల్లా పంట పొలాలకే ప్రాణాధారము. నీరున్నది మెదకులో పారుతున్నది నిజామాబాదులో మరియొక ఆనకట్ట సింగూరు, పట్టణ ప్రజల దాహార్తికే ప్రాజెక్టు పరిమితము మహబూబ్‌నహర్ మాత్రం మంజీరా నీరుతో కొంతమేర మెదకును సస్యశ్యామలం చేస్తుంది.

ఈ జిల్లాలో 100 ఎకరాల ఆయకట్టు పై గల చెరువులు 603 కాగా 100 ఎకరాలలోపు ఆయకట్టు గల చెరువులు 5316.

కొన్ని ఎత్తి పోతల పథకాలు, వాటర్ షెడ్లు కొంత వరకు వ్యవసాయమునకుపయోగ పడుచున్నవి.

నీటి పారుదల వసతి తక్కువుండుటచే జిల్లాలో మెట్టభూమి ఎక్కువ. ఈ జిల్లాలో బావులు అధికము. ఈ మధ్యకాలమున బోరు బావులు అత్యధికముగా త్రవ్వుచున్నారు.

జిల్లాలో నీటి పారుదల నికర ప్రాంతము 1,10,282 హెక్టార్లు నీటి పారుదలకు అవకాశంగల మొత్తం ప్రాంతము 1,41,855 హెక్టార్లు, కాలువల ద్వారా సాగుబడి విస్తీర్ణం 5732 హెక్టార్లు, చెరువుల ద్వారా సాగుబడి విస్తీర్ణం 30952 హెక్టార్లు.

మెదకు జిల్లాలో నల్లరేగడి, ఎఱ్ఱరేగడి మెట్టభూములు అను మూడు రకముల భూములు కలవు.

మెదకు జిల్లాలో వరిపంట అనాది నుండియు అధికము. అందుకే ఇది మెతుకు. ఈ మెతుకు మెదకు గా మారినది.

వరితో పాటు మొక్కజొన్న, జొన్న, సజ్జ, తయిదలు (రాగులు) మొదలగు ఆహార పంటలును పండించుచున్నారు. మిరప, పసుపు, అల్లం, చెరుకు, ప్రత్తి, ఉల్లి, వెల్లుల్లి, కూరగాయలు మొదలగు వాణిజ్య పంటలు పండించుచున్నారు.

శనిగ, కంది, పెసర, మినుమ, అల్చంత, మొదలగు పప్పు ధాన్యములను, నువ్వులు, పల్లి (వేరుశనగ), (ప్రొద్దుతిరుగుడు, ఆముదము, మొదలగు నూనెగింజలను ఈ జిల్లాలో పండింతురు.

తరి భూములలోను, బావుల క్రింద జలాధారము కలిగిన భూములలోను ఎక్కువగా వరి, చెరుకు పండింతురు.

మెట్ట భూములలోను, అరుతడి మాత్రమందించు జలాధారముగల భూములలోను, మక్క, జొన్న, పల్లి, పొద్దుతిరుగుడు, కూరగాయలు మొదలగునవి పండించుచున్నారు.

నల్లరేగడి భూములలో వర్షాధారముగా అనేక రకములైన పంటలను పండింతురు.

## వరి :-

మెదకు జిల్లాలో ఆబి, తాబి, కత్తెర లేదా చింతపూకార్తి అను (3) మూడు కాలములందు వరిని పండించుచున్నారు. స్వంత నీటి వసతిగలిగిన రైతు సంవత్సరములో మూడు పర్యాయములు వరి పంటను పండించు చున్నారు. రోహిణి కార్తిలో తుకము పోసికొని జూన్ నవంబరు 45 రోజులకు నాటు వేసి దసరా, దీపావళీ వరకు కోత కోయిదురు. ఇది ఆబి పంట కృత్తికా కార్తిలో చిన్నవరి(4 నెలల వరి) తుకము పోసి 20 దినములకు నాటి 4 నెలలలో కోత కోసేపంట (ఏప్రిల్ నుండి జూలై) కత్తెర యందురు.

తాబి లేదా యాసంగి పంట అనగా ఆరు నెలలలో కోత కోసేపంట, ఇది నవంబర్ నుండి ఏప్రిల్ వరకు.

మెదకు జిల్లాలో వరిసాగు సుమారు 89 వేల హెక్టార్లలో సాగు చేయబడుచున్నది. ఇచ్చటి సగటు దిగుబడి 2057 కిలోలు మాత్రమే. ఇది చాలా తక్కువ. తాబి, కత్తెర కాలములలో దిగుబడులు ఆబి కాలపు పైరుకన్న అధికముగా నుండును.

మెదకు జిల్లాలో పంట పొలములందు అనాది నుండి పశువుల పెంట తోలుట, గొఱ్ఱమేకల మంద పెట్టుట, పచ్చ ఆకును తొక్కుట మొదలగునవి ఎరువుగా వాడేవారు. కోడి ఎరువు, పంది ఎరువు వాడుట కూడా ఈ ప్రాంతమున కలదు రాను రాను సేంద్రియ ఎరువుల వాడుకము కూడా మొదలైనది. ప్రస్తుతము సహజ ఎరువులకన్న సేంద్రియ ఎరువులు వాడుటే అధికమైనది.

వ్యవసాయశాఖ వారు సిఫారుసు చేసిన ఎరువుల మోతాదు.

హెక్టారుకు వాడవలసిన మోతాదు

| | ఖరీఫ్ | రబీ |
|---|---|---|
| నత్రజని | 80-100 | 100-120 |
| భాస్వరము | 50 | 50-60 |
| పొటాష్ | 30 | 40 |

వరి పైరును ఆశించు పురుగులు తెగుళ్లతో కలిగి పైరు దెబ్బతిని దిగుబడి తగ్గిపోవును. కావున సస్యరక్షణకై క్రిమి సంహారక మందులను కూడా వ్యవసాయ శాఖ వారి సలహా సంప్రదింపుల మేరకు ఇక్కడి రైతులు వాడుచున్నారు.

వరిపై చీడపురుగులు ముఖ్యంగా పూర్వ పుతాలుకాలు సిద్ధిపేట, గజ్వేలు, దుబ్బాక, రామాయంపేట, నర్సాపూర్‌ల సంబంధిత మండలాలలో కంపునల్లి, సుడిదోమ, కాండము తొలుచు పురుగు, మరియు మిగతా మండలాలలో అగ్గితెగులు వరిపైరును ఆశించి నష్టము కలుగ జేయుటచే దిగుబడి తగ్గి పోవుచున్నది. వీటిన్నిటి అధిగమించి పైరును బాగు పరుచుకొని దిగుబడిని పెంచుకొనుటకై పెస్టిసైడ్స్‌ను క్రిమి సంహారక మందులను రైతు ఆశ్రయించక తప్పుట లేదు.

| వరి పైరు నాశించు పురుగులు / తెగుళ్ళ ఆర్థిక సహన నష్టపరిమితులు | |
|---|---|
| కాండంతో తొలుచుపురుగు<br>5% మొవ్వుచనిపోయిన (నాటిన పొలములో) | చదరపు మీటరుకు ఒక రెక్కల పురుగు (నారుమడి) చ. మీ.<br>కర్రలు లేదా దంట్లు |
| ఉల్లికోడు | దుబ్బుకు లేదా ఒక ఉల్లికోడు పిలక ఉన్నచో |
| సుడిదోమ | దుబ్బు లేక దంటుకు 1-2 పెద్దనల్లులు పైన్లపై కన్పించినపుడు. |
| తాటాకు తెగులు | దుబ్బుకు రెండు పెంకు పురుగులు |
| అగ్గితెగులు | 5-10% తెగులు సోకిన ఆకులు. |

| వరి పైరులో వాడదగు సస్యరక్షణ మందులు, మోతాదులు : | |
|---|---|
| నారుమడి నుండినారు తీసేవారము రోజుల ముందు ఎకరాకు<br>1.5 కిలోల ఫ్యూరడాన్ 3% గుళికలు వేయుట. | |
| ఉల్లికోడు/కాండము తొలుచుపురుగు | మానోక్రోమోఫాస్ 36% .యిసి 1-6 మిల్లీ లీటర్లు ఒక లీటరు నీటి చొప్పున లేదా క్లోర్‌పైరిఫాస్ 20% యిసి. 2.0 మిల్లిలీటరు ఒక లీటరు నీరు చొప్పున లేదా ఫాస్ఫమీడన్ 85% యి. 1.0 మిల్లీలీటర్లు లేదా కార్బోఫ్యుకాన్ గుళికలు ఎకరాకు పదికిలోలు. |
| తాటాకు తెగులు | ఫనసలోన్ 30% యిసి. 2 మిల్లీలీటర్లు ఒక లీటరు నీటితో కలిపి లేదా కార్బారిల్ 50% పొడి 3 గ్రాములు ఒక లీటరు నీటి చొప్పున. |
| కంపునల్లి | మలాథియాన్ 50% 3 మిల్లీలీటర్లు ఒకలీటరు నీటి చొప్పున లేదా ఫనలోన్ 30% 2 మిల్లీలీటర్లు లీటరు నీటి చొప్పున లేదా |
| కార్బారిల్ | 50% నీటి మూడు గ్రాములు ఒకలీటరు నీటి చొప్పున. |

## వరి పంట

| రకము | పంటకాలము | కాలపరిమితి | ప్రత్యేకత |
|---|---|---|---|
| తెల్లహంస | ఖరీఫ్<br>రబీ<br>కత్తెర | 115 రోజులు<br>125 రోజులు<br>115-120 రోజులు | సూర్యరశ్మికి ప్రభావితము కాదు ఎక్కువగా పిలకలు వేయురకము ఆకుఎండు తెగులును, చలిని బాగా తట్టుకొంటుంది. |
| రాశి | ఖరీఫ్ | 115 రోజులు | సూర్యరశ్మికి ప్రభావితముకాగల రకము. ఆకు ఎండు తెగులు, అగ్గితెగులు, దీపము పురుగులను, నిరోధించుకొను రకము. నీటి ఎద్దడి, భాస్వరలోపమున్న నేలలకు అనుకూలము. దిగుబడి హెక్టారుకు (6) టన్నులు |
| ప్రసన్న | ఖరీఫ్ | 95-100 రోజులు | గింజ అతినాజూకు, అగ్గితెగులు నీటి ఎద్దడిని తట్టుకొనురకము. |
| | రబీ | 95-100 రోజులు | డిసెంబరు మాసములో నారుపోసి రబీ పంటగా సాగుచేయాలి. కత్తెర పంటగా సాగుచేయుటకు కూడా చాలా అనుకూలము. దిగుబడి హె. మూడుటన్నులు. |
| వికాస్ (ఐయిటి 3116) | రబీ | 125 రోజులు | గింజసన్నం, అగ్గితెగులు, కాండము తొలుచు పురుగును నిరోధించు కొనురకము. చౌడు భూములకు అనువైన రకము, చలిని మాత్రము తట్టుకొనదు. |
| పోతన (డబ్ల్యుజి ఎల్-22245) | ఖరీఫ్<br>రబీ<br>కత్తెర | 125 రోజులు<br>125 రోజులు<br>125 రోజులు | గింజపొడవు, సన్నము, కాండము తొలుచు పురుగు, ఉల్లికోడును నిరోధించుకుంటుంది. చలిని తట్టుకోదు. |
| సురేఖ (డబ్ల్యుజిఎల్ - 23400) | ఖరీఫ్ | 135 రోజులు | గింజపొడువు, సన్నము, ఉల్లికోడును తట్టుకొంటుంది. దిగుబడి హెక్టారుకి 6 టన్నులు. |
| రుద్రమ (ఆర్‌డిఆర్ - 7555) | ఖరీఫ్ | 100-115 | ఆరుతడి పరిస్థితులలో కూడ హెక్టారుకు 4.5 టన్నుల దిగుబడినిచ్చును. ఉల్లికోడు, ఎండు తెగులును నీటి ఎద్దడి, ఇనుము ధాతువు లోపమును నిరోధించుకొనురకము |
| ఎర్రమల్లెలు (డబ్ల్యు జి ఎల్ - 20741) | ఖరీఫ్ | 120-130 | గింజ ఎరువుగా పొడవుగా ఉంటుంది. ఉల్లికోడు, నీటి ఎద్దడిని నిరోధించు కొంటుంది. దిగుబడి హెక్టారుకు 6.5 టన్నులు ఆలస్యపు నాట్లకు అనువు. |
| కావ్య (డబ్ల్యు జి ఎల్ - 48684) | ఖరీఫ్ | 130-135 రోజులు | గింజతెలుపు, సన్నని మధ్యస్థ పొడవు రకము - ఉల్లికోడును పూర్తిగా నిరోధిస్తుంది. ఆలస్యపు నాట్లకు అనువు. దిగుబడి హెక్టారుకు 6 టన్నులు. |

| రకము | పంటకాలము | కాలపరిమితి | ప్రత్యేకత |
|---|---|---|---|
| ఓరుగల్లు (డబ్ల్యు జిఎల్ - 47976) | ఖరీఫ్ | 145 రోజులు | సన్నరకము. ఉల్లికోడును తట్టుకొనురకము. ఫాల్గుణ రకానికి ప్రత్యామ్నాయముగా సాగు చేయవచ్చును. సుడిదోమ, అగ్గితెగులను కూడా తట్టుకొనే రకము. |
| విక్రమార్య (ఐ.యి.టి - 7302) | ఖరీఫ్ రబీ | 130-140 రోజులు | గింజ పొడవు, లావుగా ఉంటుంది. ముతకరకము టుంగ్రోవైరస్, అగ్గితెగులు, దిగుబడి 6-6.5 టన్నులు/హె. |
| సోనామసూరి | ఖరీఫ్ | 140-145 రోజులు | మధ్యస్థ సన్నపుగింజ, అగ్గితెగులు, ఉల్లికోడును తట్టుకొను రకము. |
| సాంబామసూరి | ఖరీఫ్ | 150 రోజులు | సన్నరకము అగ్గితెగులను తట్టుకొంటుంది కాని సుడిదోమ, కాండముతొలుచు పురుగును తట్టుకొనలేదు. దిగుబడి హెక్టారుకు 5-5.5 టన్నులు. |
| సలీమా (ఆర్ ఎన్ ఆర్ - 29692) | ఖరీఫ్ | 135 రోజులు | గింజపొడువు, సన్నం అగ్గితెగులు, బ్యాక్టీరియా ఎండ తెగులను తట్టుకొంటుంది. దిగుబడి హెక్టారుకు 5-5.5 టన్నులు. |
| చందన (ఆర్ ఎన్ ఆర్ - 74802) | ఖరీఫ్ | 145 రోజులు | సన్నరకము. దోమపోటును తట్టుకొనును. దిగుబడి హెక్టారుకు 5.5 టన్నులు. |
| సాగర్ సాంబా | ఖరీఫ్ | 145 రోజులు | మధ్యస్థ సన్న రకము - బిపిటి 5204 తో పోల్చినపుడు కొద్దిగా గింజపొడవు. ఉల్లికోడును, అగ్గితెగులు, ఇతర మచ్చ తెగుళ్లను కొంత వరకు తట్టుకొను రకము. దిగుబడి హెక్టారుకు 6 టన్నులు. |
| రాజవడ్లు | ఖరీఫ్ | 130-145 రోజులు | కంపునల్లిని కొంతమేరకు నిరోధించు కొంటుంది. ఎత్తు ఎక్కువగా పెరుగుతుంది. దిగుబడి 6.5 టన్నులు హెక్టారుకు |
| సోనాసాలి | ఖరీఫ్ | 130-140 రోజులు | గింజసన్నము. సుడిదోమను నిరోధించు కుంటుంది. హెక్టారు దిగుబడి 6.5 టన్నులు. |
| ఎ.పి.హెచ్.ఆర్ - 1 | ఖరీఫ్ | 135 రోజులు | ముందునాట్లు, ఆలస్యపు నాట్లకు అనుకూలము, సుడిదోమ, బ్యాక్టీరియా ఎండు తెగులును కొంత మేరకు నిరోధించు కొనును. హెచ్చుపిల్లకలతో హెక్టారుకు 10 టన్నులు. దిగుబడి. వెన్నులు వేయు పిలకలసంఖ్య 20-25. (దుబ్బుకు). |
| ఎ.పి.హెచ్.ఆర్-2 (హైబ్రిడ్-2) | ఖరీఫ్ | 120 రోజులు | బ్యాక్టీరియా ఎండ్లు తెగులును పూర్తిగా నిరోధించుకుంటుంది. హెక్టారుదిగుబడి 10-10.5 టన్నులు. తేలిన నేలలతో దిగుబడి బాగా ఉంటుంది. వెన్నులువేయు పిలకల సంఖ్య 25-30 వరకు ఉండును. (దుబ్బుకు) |

# జొన్న పంట

| సంకర / మేలిరకము | కాలపరిమితి | ప్రత్యేకతలు |
|---|---|---|
| **ఖరీఫ్** | | |
| సి.ఎస్.హెచ్ - 5 | 110-115 రోజులు | ఎత్తు 150-200 సె.మీ. గింజలు తెల్లగా, లావుగా ఉంటాయి. హెక్టారు దిగుబడి 35-40 క్వింటాళ్లు చొప్పు 85-90 క్వింటాళ్లు. |
| సి.ఎస్.హెచ్-6 | 90-95 రోజులు | దిగబడి 25 -30 క్వింటాళ్లు వర్షములో తడిసినప్పటికి గింజనాణ్యత చెడిపోదు. చొప్ప 60-64 క్వింటాలు పైరు ఎత్తు 150-160సెం.మీ. |
| సి.ఎస్.హెచ్-9 | 105-110 రోజులు | ఎత్తు 170-200 సెం.మీ దిగుబడి 30-35 క్వింటాళ్లు చొప్ప 80-90 క్వింటాళ్లు. గింజపెద్దది, దేశవాళీ గింజ నాణ్యత ఉంటుంది. |
| సి.ఎస్.హెచ్-10 | 110-115 రోజులు | ఎత్తు 200 సెం.మీ. ఖరీఫ్, రబీ, మాఘీకి అనుకూలము. దిగుబడి 30-35 క్వింటాళ్లు. |
| సి.ఎస్.హెచ్ - 11 | 105-110 రోజులు | ఎత్తు 160-200 సెం.మీ వరకు పెరిగి దంటు మధ్యస్థంగా ఉంటుంది. ఆకులు కాండమును కప్పుతాయి. 30-35 క్వింటాళ్లు చొప్ప దిగుబడి 80-90 క్వింటాళ్లు. ఇది ఒక మేలిరకము. |
| **రబీ** | | |
| సి.ఎస్.హెచ్. 12 ఆర్ | 115 రోజులు | దిగుబడి హెక్టారుకు ధాన్యందిగుబడి 24-25 క్వింటాళ్లు చొప్పదిగుబడి 60 క్వింటాళ్లు ఎత్తు 200 సెం.మీ. |
| సి.ఎస్.హెచ్.-13 ఆర్ | 110-115 రోజులు | దిగుబడి 30 క్వింటాళ్లు చొప్పదిగుబడి 60-61 క్వింటాళ్లు ఎత్తు 175-180 సెం.మీ. |
| ఎన్.టి.జె-2 (ఎస్పివి-913) | 110 రోజులు | మేలిరకము దిగుబడి 25-30 క్వింటాళ్లు చొప్పదిగుబడి 50-52 క్వింటాళ్లు ఎత్తు 165-170 సెం.మీ. |
| ఎస్.పి.వి - 839 | 115-120 రోజులు | మేలిరకము దిగుబడి 20-22 క్వింటాళ్లు, చొప్ప 55-58 క్వింటాళ్లు ఎత్తు 165-175 సెం.మీ. |
| స్వాతి | 115-120 రోజులు | మేలిరకము దిగుబడి 20-22 క్వింటాళ్లు, చొప్ప 50-55 క్వింటాళ్లు ఎత్తు 170-180 సెం.మీ. |
| మాల్దండి | 115-120 రోజులు | దిగుబడి 20-25 క్వింటాళ్లు ఎత్తు 200-250సెం.మీ చొప్ప 80-90 క్వింటాళ్లు. |

**అనువైన రకములు :**

| రకము | పంటకాలము | ప్రత్యేకతలు |
|---|---|---|
| దక్కన హైబ్రిడ్మక్క | 110-120 రోజులు | గింజలు పసుపురంగులో ఉండి నొక్కు కల్గియుండును. ఖరీఫ్, రబీకి అనుకూలము. దుగుబడి హెక్టారుకు 40-50 క్వింటాళ్లు. |
| డి.హెచ్.ఎమ్ - 101 | 110-120 రోజులు | గింజలు పసుపువర్ణముతో కొద్ది నొక్కుతో ఉంటాయి. దిగుబడి 40-45 క్విం/హెక్టారుకు. |
| డి.హెచ్.ఎమ్-103 | 105-110 రోజులు | ఖరీఫ్, రబీసాగుకు అనువైన రకము, ఆకుమాడు, తెగువు, బూజు, కొండముకుళ్లు తెగులును నిరోధించుకుంటుంది. హెక్టారు దిగుబజి 55-60 క్విం. నారింజపసుపు రంగు గింజలతో కండె పూర్తిగా నిండుగా ఉంటాయి. |
| డి.ఎచ్.ఎమ్-105 | 105-110 రోజులు | రబీసాగుకు అనువైనది ఆకుమచ్చ, కొండముకుళ్లు, కాండము తొలుచు పురుగును నిరోధించుకొను రకము. దిగుబడి 65-66 క్వింటాళ్లు. |
| డి.ఎచ్.ఎమ్ -107 | 88-90 | వర్షాధారపు పంటగా సాగుకు అనుకూలము. |
| **మేలిరకము :** | | |
| అశ్విని | 100-115 రోజులు | వర్షాధారము మరియు నీటిపంటగా పండించ వచ్చును. గింజనారింజ పసుపు రంగులో ఉంది హెక్టారుకు 40-45 క్విం. దిగుబడినిస్తుంది. |
| రోహిణి | 90-100 రోజులు | ఖరీఫ్, రబీకి అనుకూలము. గింజలు లేతనారింజ పసుపురంగులో ఉండును. కండెలు కాల్చితినడానికి రుచిగా ఉండును దిగుబడి 35-40క్విం. |
| హర్ష | 95-100 రోజులు | వర్షాధార పంటకు అభువైనది. గింజలు నారింజ పసుపురంగుకల్గి ఉండి దిగుబడి 55 క్విం/హెక్టార్లు. |

## వ్యవసాయశాఖ వారిచే చేపట్టుచున్న కార్యక్రమాలు

మెదకు జిల్లాలో ప్రభుత్వ వ్యవసాయ శాఖ జిల్లాలో వ్యవసాయాభివృద్ధికై రైతులకు తగు సూచనలిచ్చును చీడ పీడలు నివారణకు తగు జాగ్రత్తల చెప్పుచు, అవసరమగు మోతాదులలో రసాయనపు ఎరువుల వాడకమును సూచించుచు పంట దిగుబడికి ఇతోధిక సహాయములు నందించుచున్నారు.

1. ప్రదర్శన క్షేత్రము లేర్పాటు చేయుట
2. సబ్సిడిపై విత్తనముల పంపిణీ చేయుట
3. సబ్సిడి పై సస్యరక్షణ మందులు పంపిణీ చేయుట
4. సబ్సిడిపై వ్యవసాయ పనిముట్లను పంపిణీ చేయుట
5. సబ్సిడిపై వ్యవసాయ పని ముట్లను పంపిణీ చేయుట
6. చవుడు భూములను బాగు చేయుట
7. పప్పుదినుసులు, నూనెగింజల ప్రత్యేక అభివృద్ధి పథకము ద్వారా ఆయా పంటల అధిక దిగుబడికి ప్రత్యేక కృషి సల్పుట
8. సామూహిక నారుమళ్లు
9. హరిజన రైతులకై ప్రత్యేక పథకములు ప్రవేశ పెట్టిన భూమి అభివృద్ధి విత్తనాల చిరు సంచుల పంపిణి, రసాయనిక ఎరువుల పంపిణీ చేయుట.

మెదకు జిల్లాలో వివిధ అభివృద్ధి పథకముల ద్వారా ఎంపిక చేసిన రైతులకు వ్యవసాయ సాంకేతిక పరిజ్ఞానమునకై శిక్షణ ఈయబడుచున్నది. ఇంతేగాక వివిధ రకముల సిఫారసులు చేసిన ఉత్పాదికములను రాయితీ పై ఈయబడుచున్నది.

| పథకము | ఖర్చు చేసిన సొమ్ము (లక్ష రూ.) | |
|---|---|---|
| | 1995-96 | 1998-99 |
| 1. వరి, పత్తి మొదలగు ముఖ్య ఆహార పదార్థములు ఉత్పత్తి పెంచుటకు గాను ముమ్మర ఆహార ధాన్యాలఅభివృద్ధి పథకము (ఇ.సి.డి.పి) | 21.342 | 38.944 |
| 2. పప్పు ధాన్యముల ఉత్పత్తి పెంచుటకు గాను జాతీయ పప్పు ధాన్యముల అభివృద్ధి పథకం | 11.131 | 15.219 |
| 3. నూనెగింజల ఉత్పత్తి పెంచుటకు గాను నూనెగింజల అభివృద్ధి పథకం (ఓ.పి.పి) | 26.950 | 55.943 |
| 4. చెరుకు పైరు ఉత్పత్తి పెంచుటకుగాను చెరుకు అభివృద్ధి పథకం (సుబాక్స్) | 10.70 | 10.189 |
| 5. మంచి రకముల వరి విత్తనముల అభివృద్ధి పరచుటకు వరి విత్తనముల పంపిణీ పథకం (రైస్‌మినీ కిట్స్) | 0.330 | 0.1217 |
| 6. మంచిరకములైన వరి చిరుసంచుల పంపిణీ పథకం (మిల్లెట్స్ మినికిట్స్) | 0.896 | 0.329 |
| 7. మొక్కజొన్న చిరుసంచులు సాముహిక సాగుచేయు పథకం | 0.141 | 0.018 |
| 8. మొక్కజొన్న అభివృద్ధి పథకం | - | 4.300 |
| **మొత్తము** | **71.090** | **116.159** |

## ఫల పరిశోధన కేంద్రము – సంగారెడ్డి

మెదకు జిల్లాలో సంగారెడ్డిలో ఫల పరిశోధన కేంద్రము కలదు. ఈ కేంద్రము ఒకప్పుడు సంగారెడ్డి కొట్టకొనలో నున్నప్పటికీ నేడది నట్టనడుమయ్యెనది. 65.3 (హెక్టార్లు 163 ఎకరముల) విస్తీర్ణం లో నున్న ఫల పరిశోధన కేంద్రము ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రజలకేకాక ఇతర రాష్ట్ర ప్రజలకు కూడా సేవలందించుచు ప్రగతి పథంలో పయనించుచున్నది.

ఈ ఫల పరిశోధనా కేంద్రమును 1918 సంవత్సరములో వ్యవసాయశాఖ తీసికొని వ్యవసాయ కేంద్రమును ప్రారంభించినది 1940 వరకు ఇది వ్యవసాయ కేంద్రముగానే కలదు. 1941లో మొట్ట మొదట సీతాఫలాలకు సంబంధించిన ఒక స్కీమును ఇచ్చట ప్రవేశ పెట్టబడి ఫల పరిశోధన కేంద్రముగా మార్చబడినది. దేశం నలుమూలల నుండి సీతాఫల రకాలను సేకరించి, వాటిని పరిశోధించి ఇచ్చట ఉత్పత్తి జరిగేది.

ఆ తర్వాత మామిడి పండ్లను కూడా సేకరించి వాటిపై పరిశోధన జరుపబడినది. ఈ పరిశోధన సత్ఫలితాలనిచ్చింది.

దాంతో 1958లో ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రిసర్చ్ (ఐ.సి.ఎ.ఆర్) కేంద్రాలలో ఒకటిగా సంగారెడ్డి ఫల పరిశోధనకేంద్రాన్ని ప్రభుత్వం గుర్తించింది.

1966 జులైలో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం ఏర్పడటంతో దీన్ని వ్యవసాయశాఖ పరిధి నుంచి తప్పించి వ్యవసాయ విశ్వవిద్యాలయానికి అనుసంధానము చేసిరి.

మొట్టమొదట ఫల పరిశోధన కేంద్రం ప్రారంభమైనపుడు సీతా ఫలంపైనే పరిశోధన సాగినను, క్రమేణా మామిడికి ప్రాధాన్యత పెరిగింది.

ఈ ఫల పరిశోధన సంస్థ 382 మామిడి పండ్ల రకాలను వివిధ ప్రాంతాల నుంచి సేకరించి పరిశోధన జరిపింది.

ఉత్తర భారతదేశం నుంచి సేకరించిన దశేరిరకం అత్యద్భుత ఫలితాలను ఇచ్చుటేకాక అక్కడి కంటే ఇక్కడ 45 రోజుల ముందే ఫల సాయాన్ని అందిస్తున్నది. ఈ రకం మామిడిని మన ప్రాంతానికి అనుగుణంగా మలచడంలో శాస్త్ర వేత్తలు విజయం సాధించినారు. ఈ దశేరి మామిడి చెట్లు పెరుగుదల బాగా యుండి పండులో పోషక విలువలు ఎక్కువగా ఉంటాయి. కాత కూడా అధికంగా కాస్తుంది.

ఈ ఫల పరిశోధన కేంద్రంలో 40 హెక్టార్ల లో మామిడి తోట కలదు. ప్రస్తుతం సుమారు మూడువేల (3000) మామిడి చెట్లు వివిధ రకాలవి కలవు. బంగినపల్లి, తోతాపురి, నీలం, రుమానీ, ఆలంపూర్, బేనిషాన్, సువర్ణ రేఖ, దశేరి పేర్లు గల రకాలను కోత మామిడి అంటారు. చిన్నరసం,

పెద్దరసం, నవనీతం, చెరుకురసం, కాజు, కొత్తపల్లి కొబ్బరి, పంచదార కలశ రకాలను రసాలు అంటారు. జలాల్, దేద్‌శరి, అమిని, రాజపురి, మొదలగునవి ఊరగాయ రకాలు. ఇవికాక మరెన్నోరకాలైన మామిడి పండ్లు యిక్కడ ఉత్పత్తి ఔతున్నాయి.

ఈ ఫలపరిశోధన కేంద్రంలో అంటుకట్టు పద్ధతి ద్వారా వివిధములైన ఫలములను కనుగొను చున్నారు. అంటుకట్టే పద్ధతిలో చేర్పంటు, వినీర్ అని రెండు విధవులు కలవు. సంచులలోకాని, కుండీలలోని కాని ఒక మొక్కను 30 నుంచి 40 సెంటిమీటర్ల ఎత్తు పెరుగ నిచ్చి ఆ తర్వాత ఆ తల్లి చెట్టు కొమ్మను తెచ్చి మొక్కకు అంటుకడుతారు దీన్ని వినీర్ లేదా కొమ్మంటు అంటారు. మొక్కను తల్లి చెట్టు వద్దకే తీసికెళ్ళి అంటుకట్టే పద్ధతిని చేర్పంటు అంటారు. ఈ పరిశోధనా కేంద్రంలో వినీర్ అంటుకట్టు వద్ధతిని అవలంభించుచున్నారు. ఈ వినీర్ పద్ధతి ద్వారా అంటుకట్టిన మొక్క త్వరగా పెరుగుతుంది.

ఈ ఫల పరిశోధన కేంద్రంలో మామిడితో పాటు జామ మొదలగు అనేక పండ్ల రకాలపై పరిశోధన కొనసాగుచున్నది. ఇచ్చుట 15 రకాల జామ పండ్లను సేకరించి పరిశోధన జరిపినారు. వీటిలో అలహాబాద్ సఫేదా, సర్దార్, కోహీర్, సఫేద్‌జామ్ రకాలు ఈ పరిశోధన కేంద్రంలో రూపొందించబడినవి.

మామిడి కంటే జామ మొక్కలకు అంటుకట్టడం సులువు. ఎక్కువగా నేల అంట్లు చేయడం ద్వారా మొక్కలను ఉత్పత్తి చేయుచున్నారు.

మూడు హెక్టార్ల విస్తీర్ణంలో సుమారు 600 వరకు జామ చెట్లు ప్రస్తుతం ఫలాలనందిస్తున్నాయి. ఈ ఫలపరిశోధనా కేంద్రము మొదట సీతాఫలాలపై పరిశోధన ప్రారంభించింది. అదినేటికీ కొనసాగుచున్నది. పదకొండు (11) రకాల సీతాఫలాలను సేకరించి అంటుకట్టు విధానంలో కొత్తవి ఉత్పత్తి చేసింది. అతిమోయా అనే రకాన్ని ఈ సంస్థ వృద్ధి చేసింది. చెరిమేయ అనే రకాన్ని సంకర పరచడం వలన ఈ రకం వచ్చింది. సీతాఫలంజాతి ప్రవర్ధనం సాధారణంగా విత్తనాల ద్వారా జరుగుతుంది.

ప్రస్తుతం ఈ ఫల పరిశోధనా కేంద్రంలో సుమారు 200 సీతాఫలం చెట్లున్నాయి.

ఇవేకాక 0.7 హెక్టార్లలో 141 సపోటా చెట్లు, 0.3 హెక్టార్లలో 55 సిట్రస్ పండ్ల చెట్లు, 0.2 హెక్టార్లలో ఫల్సాచెట్లున్నాయి. ఉసిరి, దానిమ్మ, చెర్రీస్ వంటి ఇతర పండ్ల రకాల చెట్లు 1.4 హెక్టార్లలో 145 వరకు కలవు. ఈ విధముగా ఉత్పత్తి చేసిన మొక్కలను కొద్దిమొత్తంలోనే విక్రయించుచున్నారు.

ఇచ్చుట ఐ.టి.డి.ఏ., డి.ఆర్.డి.ఏ. అటవీ మరియు ఉద్యానవన శాఖల ద్వారా పంపించే యువకులకు నర్సరీ శిక్షణ ఇచ్చుచున్నారు.

# ఇక్రిశాట్

మెదకు జిల్లాలో పాటాన్‌చెఱు ప్రాంతంలో మెట్టపంటల పరిశోధనా సంస్థ "ఇంటర్‌నేషనల్ క్రాప్స్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ ఫర్ ది సెమి-ఆరిడ్ ట్రాపిక్స్" (ఇక్రిసాట్)ను 1972 సంవత్సరంలో ఏర్పాటు చేయబడినది. ఇది బాంబే నేషనల్ హైవే పై భాగ్యనగరానికి కేవలం 30 కి.మీ. దూరంలో కలదు.

ఇక్రిశాట్ సంస్థను ఏర్పాటు చేయుటకు సుమారు 4500 ఎకరాల స్థలమును సేకరించుట జరిగినది. రామచంద్రాపురం మండలంలోని మందుమూల, కాశీరెడ్డి పల్లె, తెల్లాపూర్ గ్రామాలలోని పొలాలు, గృహాలు, పటాన్‌చెరు, రామచంద్రాపూర్ గ్రామ పంచాయతీ పరధిలో గల గృహాలు ఖాళీ చేయించి ఆ మొత్తము భూమి 4500 ఎకరాల పై చిలుకు ఇక్రిశాట్‌కు ఇచ్చుట జరిగినది. భూములు, గృహాలు కోల్పోయిన వారికి రిహాబిటేషన్ సౌకర్యము కల్పించుట జరిగినది.

ఈ ప్రాంతంలో ఎర్రరేగడి, నల్లరేగడి నేలలు ప్రక్క ప్రక్కనే యుండుటచే శాస్త్ర వేత్తల పరిశోధనలకు అనుగుణంగా కలదు.

వర్షపాతం తక్కువగా ఉండే మెట్ట ప్రాంతాలలో ప్రపంచ జనాభాలో ఆరవ వంతు జనాభా నివసించుచున్నారు. వర్షపాతం తక్కువగా వుండి సారవంతమైన నేలలు లేని ప్రదేశాలలో నివసించుచున్న ప్రజలకు కనీస స్థాయిలో ఆహారాన్ని అందించడమే లక్ష్యంగా ఇక్రిశాట్‌లో పరిశోధనలు జరుగుచున్నవి.

ఇక్రిశాట్‌లో ప్రధానంగా ఆరుతడి పంటలపై పరిశోధనలు జరుగును. జొన్న, శనగ, రాగులు, వేరుశనగ, కందులు, మొదలగు పంటలపై ఇక్కడ పరిశోధనలు జరుపబడుచున్నవి.

కన్సల్టేటివ్ గ్రూప్ ఆఫ్ అగ్రికల్చరల్ రిసెర్చి చేత స్థాపితమైన 16 సంస్థలలో ఇక్రిశాట్ ఒకటి. ప్రపంచ బ్యాంకుతోసహా దాదాపు 50 దేశాలు ఈ సంస్థకు దాతలుగా ఉన్నాయి.

ప్రపంచ వ్యాప్తంగా 48 దేశాలలో నివసిస్తున్న ప్రజలు మెట్ట ప్రాంతాలలో పండే పంటలపైననే ఆధారపడిన వారు కలరు.

ప్రపంచంలోని 130 దేశాల నుండి సేకరించిన 1.2 లక్షలగల వివిధ రకాల పంటల జన్యువులు ఇక్రిశాట్‌లోని జన్యు బ్యాంకులో నిల్వ చేసినట్లు ఆ సంస్థ డైరక్టరు జనరల్ ఎస్.ఎం. బర్న్గాటూ రజతోత్సవ సభలో వెల్లడించినారు. 25 సంవత్సరాల పరిశోధనల ఫలితంగా సుమారు 365 నూతన, అభివృద్ధి చెందిన పంటల రకాలను మార్కెట్లోకి విడుదల చేసిరి.

అంతే గాక ఇంటర్మీడియట్ దశలలో వున్న విత్తనాల రకాలను కూడా విడుదల చేసిరి. ప్రపంచంలోని 90 దేశాలకు చెందిన దాదాపు మూడు వేల మంది శాస్త్రవేత్తలకు ఇక్కడ శిక్షణ యిచ్చుట జరిగినది.

ఈ సంస్థ వ్యాధి నిరోధక శక్తిని కలిగిన తక్కువ కాలంలో దిగుమతి వచ్చే విత్తనాలను ఉత్పత్తి చేయడం ఎటువంటి వాతావరణ పరిస్థితులైన తట్టుకొనే శక్తిగలిగి వంగడాలను ఉత్పత్తి చేయడం ప్రధానాంశముగా పని చేయుచున్నది.

## ప్రో-ఆగ్రో

భారతదేశంలోనే ప్రో-ఆగ్రో సీడ్ కంపెనీ విత్తన పరిశోధన పరిశ్రమలో ప్రాచుర్యం పొందినది. యస్.కె. కపూర్ మేనేజింగ్ డైరక్టరుగా 1988లో ప్రో-ఆగ్రో అనే పేరుతో వ్యవసాయరంగంలో విత్తన పరిశోధ నా రంగం ప్రారంభించబడినది. ఈ కంపెనీ ఢిల్లీ ప్రధాన కేంద్ర కార్యాలయంగా మూడు అనుబంధ కంపెనీలను కలిగియున్నది. ప్రో-ఆగ్రో సీడ్ కంపెనీ లిమిటెడ్ హైద్రాబాద్ స్థావరంగా పొద్దుతిరుగుడు, సజ్జ, తెల్లజొన్న, మొక్కజొన్న, పత్తి, ఆవాలు, కూరగాయలు, వరి రకాలపై పరిశోధనలు సల్పి కొత్త వంగడాలనెన్నింటినో ఉత్పత్తి చేయుచున్నది.

ప్రో-ఆగ్రో కంపెనీ తూప్రాన్‌కు రెండు కిలోమీటర్ల దూరంలో నేషనల్ హైవే పై స్థాపించబడియున్నది.

ప్రో-ఆగ్రో రైస్ ఇంటర్‌నేషనల్ లిమిటెడ్ జపాను వారి సంయుక్త సంబంధాలతో ఏర్పడిన ఈ ప్రో-ఆగ్రో కంపెనీ వరివిత్తనాలపై సమగ్ర పరిశోధన జరుపుచు కొత్త కొత్త వంగడాలనెన్నింటినో ప్రవేశపెట్టుచున్నది. 6201 రకం వరి విత్తనం, 6207 రకం వరి విత్తనం ఈ ప్రో-ఆగ్రో జరిపిన పరిశోధనా ఫలితమే. ఈ విత్తనాలు హైబ్రిడ్ రకాలు.

వ్యవసాయరంగంలో అత్యద్భుతమైన అభివృద్ధిని సాధించడానికి ఇతోధికమైన ఫలసాయాన్ని పొందడానికి తద్వారా దేశ ఆహార సమస్యను తొలిగించడానికి ఈ సంస్థ ఉపకరించుచున్నది.

## మహికో

మెదక్ జిల్లాలో తూప్రాన్ మండలమునందు 7వ నెం. జాతీయ రహదారిపై కాళ్ళాకల్ గ్రామ పరిసరాలలో వ్యవసాయ విత్తన పరిశోధనా సంస్థగా రూపుదిద్దుకొన్నది మహికో సంస్థ.

ఈ మహికో విత్తన పరిశోధనా సంస్థ ఎక్కువగా జొన్న మరియు మొక్క పంటకు సంబంధించిన హైబ్రిడ్ విత్తనములు పరిశోధించుచు వ్యవసాభివృద్ధికి తోడ్పడుతున్నది.

# వ్యవసాయ మార్కెట్ కమిటీలు

## మార్కెట్ కమిటీల సంవిధానము:-

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయోత్పత్తులు మరియు పశుగణముల మార్కెట్ చట్టము 1966 ప్రకారము మెదకు జిల్లాలో తొమ్మిది మార్కెట్ కమిటీలు స్థాపించబడినవి మొత్తము తొమ్మిది మార్కెట్‌లు వరుసగా 1.మెదక్, 2. సిద్దిపేట, 3. రామాయంపేట, 4. జోగిపేట, 5. నర్సాపూర్, 6. గజ్వేల్, 7. సదాశివపేట, 8. జహీరాబాద్, 9. నారాయణ్‌ఖేడ్. ఈ మార్కెట్ కమిటీలలో రైతులు పండించిన పంటలకు గిట్టుబాటు ధరలు లభించే విధంగా క్రయవిక్రయాలలో క్రమబద్ధం జరుగుచున్నది.

### జిల్లాలో నిర్మించబడిన మార్కెట్ యార్డులు :

మార్కెటింగ్ శాఖ ఆధ్వర్యంలో మెదక్ జిల్లాలోని 6 మార్కెట్ కమిటీలలో అన్ని విధాల సౌకర్యములతో మార్కెట్ యార్డులు నిర్మించబడినవి. 1. సిద్దిపేట, 2. మెదక్, 3. సదాశివపేట 4. రామాయంపేట 5. జోగిపేట మరియు 6. జహీరాబాద్‌లలో కార్యాలయపు భవనము, రైతు విశ్రాంతి భవనము, క్యాంటీన్, వ్యవసాయ గిడ్డంగులు, శాప్ కమ్ గోదామ్స్, రోడ్లు వాటర్ ట్యాంక్, మరుగుదొడ్లు, ప్రహరిగోడ మరియు రైతులకు ఉపయోగకరమైన అన్ని వసతులచే యార్డులు నిర్మించబడినవి.

మార్కెటింగ్ కమీషనర్ హైద్రాబాద్ వారు 1998-99 సంవత్సరములో అభివృద్ధి నిర్మాణ పనుల మేరకు రూ. 78.87 లక్షలు మంజూరు చేసినారు. ఇందులో సిద్దిపేట, మెదక్, రామాయంపేట, జోగిపేట, సదాశివపేట మరియు జహీరాబాద్ మార్కెట్ కమిటీలలో ఇప్పటివరకు రూ. 11.91 లక్షలు ఆమోదించబడి అభివృద్ధి పనులకై కేటాయించబడినవి.

### లింకు రోడ్ల నిర్మాణము గురించి :-

కమీషనరు మార్కెటింగ్, హైద్రాబాద్ వారు మెదక్ జిల్లాలోని మార్కెట్ కమిటీల పరిధులలో 22 లింకు రోడ్లు నిర్మించుటకు రూపాయలు 99.14 లక్షలు 1996-97 సంవత్సరము నుండి మంజూరు చేసినారు. ఇందులో 62.89 లక్షలతో 15 లింకు రోడ్లు నిర్మించుట జరిగినది.

### రైతు సేవా కేంద్రము :-

ఆంధ్రప్రదేశ్ ఆగ్రో ఇండస్ట్రీస్ అభివృద్ధి సంస్థ ద్వారా ఈ జిల్లాలోని మార్కెట్ యార్డు సిద్దిపేటలో రైతు సేవా కేంద్రము ఏర్పాటు చేయబడినది. దీని ద్వారా రైతులకు కావలసిన విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు వ్యవసాయ పరికరాలు సరఫరా చేయుట జరుగుచున్నది.

### రైతు శిక్షణ శిబిరములు :-

రైతులకు తాము పండించు పంటలనందు ఆధునిక పద్ధతిలో పరిజ్ఞానము కల్గించుటకు ఈ సంవత్సరము ఖరీఫ్ సీజన్ ముందు ఒక శిక్షణ శిబిరము, రబి సీజన్ ముందు మూడు శిక్షణ తరగతులు జిల్లాలోని అన్ని మార్కెట్ కమిటీలయందు వ్యవసాయ శాఖ అధికారి సహాయంతో 1998 నుండి ఇప్పటివరకు నాలుగు సార్లు నిర్వహించటం జరిగినది. సుమారు 4,114 మంది రైతులు ఈ శిక్షణ తరగతులలో పాల్గొన్నారు.

### వాటర్‌షెడ్ ప్రదర్శన :-

గ్రామీణ అభివృద్ధి శాఖ సహకారముతో మెదక్ జిల్లాలోని సిద్ధిపేట్, జోగిపేట్, సదాశివపేట్ మరియు రామాయంపేట్ మార్కెట్ యార్డులలో వాటర్‌షెడ్ నమూనాలను నిర్మించుట జరిగినది.

### కంప్యూటరైజేషన్ :-

ఈ జిల్లాలోని సిద్ధిపేట మార్కెట్ యార్డులో 4 కంప్యూటర్లు ఏర్పాటు చేయడము జరిగినది.

### భూసార కేంద్రములు :-

రైతులు తమ భూమి యొక్క సారమును తెలుసుకొను సౌకర్యమును కల్పించుటకై వ్యవసాయ శాఖ సహకారముతో మార్కెట్ కమిటీ మెదక్ మరియు సిద్ధిపేట యందు భూసార పరీక్షా కేంద్రములను ఈ సంవత్సరము నుండి నిర్వహించబడినది.

### స్థల సేకరణ :-

మార్కెట్ కమిటీ సదాశివపేట ఆధీనములో ఉన్న మార్కెట్‌లో వ్యవసాయోత్పత్తులు కూరగాయలు, పశువుల మార్కెట్ యార్డు స్థాపన కొరకు కల్పకుంట గ్రామపు శిఖం సర్వే నెం. 350 లో 25.00 ఎకరముల స్థల సేకరణపై ప్రభుత్వ ఆమోద నిమిత్తము ప్రతిపాదనలు సమర్పించబడినవి. అట్టి ప్రతిపాదనలను జిల్లా కలెక్టరుగారు కమిషనరు ల్యాండ్ రెవెన్యూ హైద్రాబాద్ గారికి శిఖం భూమిని ఐజాన్‌గా మార్చటానికి పంపుట జరిగినది.

గజ్వేల్ మార్కెట్ యార్డును పార్శికుంట నందు స్థాపించుటకై ప్రతిపాదనలను జిల్లా కలెక్టరు గారికి పంపించడమైనది. కాని శిఖం భూమిని ఐజాన్‌గా మార్చుటకై హైకోర్టు నిలుపుదల ఆదేశములున్నందు వలన అట్టి ప్రాతిపాదనములు కలెక్టరు కార్యాలయము నందు పెండింగ్‌లో కలవు.

నర్సాపూర్ మార్కెట్ యార్డు స్థాపించుటకై కలెక్టరుగారు 5.00 ఎకరములు స్థలమును మార్కెట్ కమిటీ నర్సాపూర్‌కు అలెనేషన్ ద్వారా ఇవ్వడం జరిగింది. అట్టి స్థలమును కొందరు ఆక్రమించుకొన్నందు వలన ఏర్పడిన వివాదము హైకోర్టు నందు పెండింగ్‌లో ఉన్నది.

నారాయణ్ ఖేడ్ నందు మార్కెట్ యార్డు స్థాపించుటకై సర్వే నెంబరు పట్టాదారి యొక్క విక్రయించు పత్రము జతపరిచి ప్రతిపాదనలు భూమి యొక్క విలువను నిర్ణయించుటకు జాయింట్ కలెక్టరుగారికి పంపబడినది.

## రైతు బంధు పథకము :-

రైతులు తాము పండించిన సరుకులను మార్కెట్ యార్డునకు అమ్మకమునకు తెచ్చిన సందర్భమున గిట్టుబాటు ధర రానిచో అట్టి సరకులను మార్కెట్ కమిటీ యొక్క గిడ్డంగుల నందు నిలువ పెట్టి వాటివిలువపై 70 శాతం మరియు 50,000/- మించకుండా ఋణము పొందుటకు ఈ పథకము ద్వారా వీలు కల్పించబడినది. అట్టిరైతులు మార్కెట్ కమిటీ నుండి వారి యొక్క భూమి వివరములను మార్కెట్ కమిటీకి సమర్పించి రైతు బంధు కార్డును పొందవలసి యుండును. అట్టి కార్డు మూడు సంవత్సరముల వరకు అమలునందు ఉండును. అట్టి ఋణమును పొందిన రైతులు మూడు మాసములలోపు వడ్డీతో సహా ఋణమును చెల్లించవలసి ఉండును. అట్టి ఋణముపై నామ మాత్రపు వడ్డీ విధించబడును.

ఈ పథకము ద్వారా మార్కెట్ కమిటీ రామాయంపేట, సిద్దిపేటలలో ఇంతవరకు రూపాయలు 1.31 లక్షలు ఋణము రైతులకు ఇవ్వడము జరిగినది.

## విత్తనములు మరియు పురుగు మందుల విక్రయ కేంద్రము :-

రైతులకు నాణ్యమైన విత్తనములు మరియు పురుగు మందులను సరఫరా చేయు సదుద్దేశ్యముతో మార్కెట్ కమిటీ సిద్దిపేట, రామాయంపేట, మెదక్ మరియు సదాశివపేటలయందు ఇట్టి విక్రయ కేంద్రములను గత సంవత్సరములో ప్రారంభించ బడినవి. స్థానిక మార్కెట్ ధరల కంటే తక్కువ ధరలకే రైతులకు విత్తనములు మరియు పురుగు మందులు సరఫరా చేయబడును.

ఇట్టి విక్రయ కేంద్రముల ద్వారా రూ. 14,49,889/- విలువ గల విత్తనములు మరియు పురుగు మందులను విక్రయించుట జరిగింది.

## మార్కెట్ ఫీజు వివరములు :-

గత నాలుగు సంవత్సరములలో జిల్లాలోని అన్ని మార్కెట్ కమిటీలు పొందిన ఆదాయము వివరములు ఈ దిగువ చూపబడినది.

| సంవత్సరము | ఆదాయము లక్షలలో |
|---|---|
| 1995-96 | 211.72 |
| 1996-97 | 225.81 |
| 1997-98 | 203.20 |
| 1998-99 | 219.59 |
| మే, 99 వరకు | 28.40 |

# రైతు బజార్లు

వ్యవసాయదారుల సంక్షేమాన్ని వారి ఆర్థిక పరిస్థితిని బాగు పరచుటకై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము రైతుబజార్లను రాష్ట్ర వ్యాప్తముగా ప్రారంభించినది.

ముఖ్యముగా కూరగాయలు పండించు రైతులు మధ్య దళారీల బారినపడి ఆర్థికంగా కృంగి పోవు చున్న తరుణంలో "రైతుబజార్లు" వ్యవసాయ దారులకు కల్పతరువు వలె ఆవిర్భవించినవని చెప్పవచ్చును.

రైతులు తాము, పండించిన పంటను తామే స్వయముగా రైతుబజార్లలో తమకు నచ్చిన ధరలకు అమ్ముకొని ఆర్థికంగా ఎదుగడానికి ఇవి ఎంతో ఉపయోగ పడుచున్నవి.

ఈ రైతు బజార్ల సృష్టి తెలుగుదేశం ప్రభుత్వాధి నేత శ్రీ నారా చంద్రబాబు నాయుడి గారి మేధా సంపత్తి నుండి ఉద్భవించిన కర్షక ఆశా కిరణమని చెప్పవచ్చును.

మెదకు జిల్లా యందు మూడు రైతు బజార్లు 1. సంగారెడ్డి, 2. రాంచంద్రాపురం, 3. మెదకు నందు మార్కెట్ కమిటీల ఆర్థిక సహాయముతో స్థాపించబడినవి.

సంగారెడ్డి రైతు బజారునకు అనుబంధముగా మూడు మండలములలో 1. సదాశివపేట, 2. సంగారెడ్డి, 3. కొండాపూర్ మండలములలో 970 మంది రైతులను గుర్తించి వారికి గుర్తింపు కార్డులు ఇవ్వబడినది.

రాంచంద్రాపురం రైతు బజారునకు అనుబంధముగా రెండు మండలములలో 1. రాంచంద్రాపురం, 2. పటాన్‌చెరు మండలములలో 200 మంది రైతులను గుర్తించి వారికి కార్డులు ఇవ్వబడినవి.

మెదకు రైతు బజారు అనుబంధముగా మూడు మండలములలో 1. కొల్చారం 2. పాపన్నపేట 3. మెదకు మండలంలో 200 మంది రైతులను గుర్తించి వారికి కార్డులు ఇవ్వబడినవి.

డ్వాక్రా గ్రూపుల ద్వారా రైతులు పండించినటువంటి వివిధ రకముల కూరగాయలు, అపరాలు నేరుగా వినియోగదారులు కొనుగోలు చేయుటకు రైతు బజారునందు సౌకర్యము కల్పించ బడుచున్నది. రైతులు తమ కూరగాయలను రైతు బజార్లకు తీసుకొని రావడానికి సంగారెడ్డి రైతు బజారునకు 22 బస్సులను, రామచంద్రాపురంకు 26 బస్సులను మరియు మెదక్‌రైతు బజారునకు 21 బస్సు సర్వీసులను రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ ద్వారా ఏర్పాటు చేయటము జరిగింది.

ఈ మూడు రైతు బజార్లు సక్రమముగా పనిచేయుటకు రిటైర్డ్ మండల రెవెన్యూ అధికారులను నియమించుట జరిగినది. ఈ రైతు బజారులు జిల్లా జాయింట్ కలెక్టరు గారి యొక్క పర్యవేక్షలో నడుపబడుచున్నవి.

ఈ మూడు రైతు బజారులకు రిటైర్డ్ మండల రెవెన్యూ అధికారులను ఎస్టేట్ ఆఫీసర్లుగా నియమించడం వలన వీరు ప్రతి దినము ఉదయము 7.00 గంటలకు సందర్శించి రైతుల ఆగమనాన్ని అమ్మకాలను మరియు ధరలను పర్యవేక్షిస్తున్నారు. వేసవిలో కూరగాయలు పండించుటకై ఉద్యానవన శాఖవారు రూ. 79,980/-ల విలువైన వివిధ రకములైన కూరగాయలు విత్తనములు 50% సబ్సిడీపై కూరగాయలు పండించు రైతులకు విక్రయించుచున్నారు.

# ఉద్యాన శాఖ

వ్యవసాయశాఖలో అంతర్భాగంగానున్న ఈ శాఖను ప్రత్యేక శాఖగా ప్రభుత్వము ఏర్పాట చేసినది.

మెదకు జిల్లాలో ఉద్యానశాఖ 1992లో ప్రారంభింపబడినది. సంగారెడ్డిలో సహాయ ఉద్యాన సంచాలకుల వారి కార్యాలయము ఏర్పడినది.

ఉద్యానశాఖవారు మెదకు జిల్లాలో ప్రత్యేకముగా పండ్లతోటలు, పూలతోటలు పెంపకంలో రైతులకు శాస్త్రీయమైన అవగాహనను కల్పిస్తూ డ్రిప్ ఇరిగేషన్ వంటి కొత్త పద్ధతుల ద్వారా వ్యవసాయదారుల ఆర్థిక స్తోమత పెంపుదలకు తోడ్పడుతున్నారు.

ఈ శాఖ వారు ఏఏ భూములలో ఏఏ రకములైన పండ్లతోటలు పెరుగునో, ఏ వాతావరణంలో ఎటువంటి సస్యసంరక్షణ చర్యలు చేపట్టవలెనో మొదలగు తోటల పెంపకము విషయాలలో రైతులకు తగు సలహాలు, సూచనలు ఇస్తారు.

మెదకు జిల్లాలోని వివిధ రకములైన పండ్లు, కూరగాయలు, పూల ఉత్పత్తులు ఈ క్రింద వివరింపబడినవి.

**మెదకు జిల్లాలో కూరగాయల పెంపకము**

మెదకు జిల్లాలో వ్యవసాయము అధిక జనులకు ఆధారభూతమైయున్నది. జిల్లాలో వరి మొదలగు ఆహార ధాన్యములతో పాటు కూరగాయల సేద్యము కూడా ఎక్కువగా జరుగుచున్నది. ముఖ్యముగా హైద్రాబాదునకు ఈ జిల్లా ప్రాంతము దగ్గిరి దైనందున ఎగుమతికి సులువైనందున కూర గాయల పంటను ఇక్కడి రైతులు అధికనుగా సాగుచేయుచున్నారు.

నీటి వసతి తక్కువున్నను కూరగాయల పంట పండింపవచ్చును. వర్షాకాలమునందు గట్లపై కూడా పండింతురు. వర్షాకాలానంతరము టమాట మొదలగు కాయగూరలు మామూలు దుబ్బ(చెలక) భూములలో కూడా పండును.

కూరగాయల పంట రైతు ఎప్పటికప్పుడు కొద్ది సమయములో డబ్బును పొందగలడు. తద్వారా ఇతర పంటలకు పెట్టుబడికి ఈ డబ్బు ఉపయోగపడ గలదు.

కూరగాయలలో కూడా కొత్తరకమైన నంగడము లెన్నియో వచ్చినవి. చీడపీడలకు ఎన్నో రకముల క్రిమి సంహారక మందులు కనుగొనబడినవి. సాంప్రదాయక ఎరువులతో పాటు రసాయనిక ఎరువులను కూడా రైతులు ఉపయోగించి ఎక్కువ దిగుబడిని సాధించుచున్నారు. కూర గాయల విత్తనాలను 50% సబ్సిడీ పై ప్రభుత్వము సరఫరా చేయుచున్నది.

జిల్లాలో కూరగాయల రైతుల ప్రయోజనము కొరకై రైతుబజార్లను ప్రభుత్వము ఏర్పాటు చేసినది

వీటిచే మధ్య దళారుల చేతిలో రైతులు మోసపోకుండా ఎంతో ఉపయోగపడుచున్నవి. ఈ రైతు బజార్ల ఏర్పాటు కూరగాయల రైతుల వర ప్రదాయనిగా చెప్పవచ్చును.

రైతులు పండించిన కూరగాయలు నిల్వ ఉంచేందుకు అవసరమైన 'శీతలీకరణ గిడ్డంగు' ల సదుపాయాన్ని కల్పించడానికి ప్రభుత్వము సబ్సిడితో కూడిన రుణ సదుపాయమును కల్పించుచున్నది. వరికి ప్రత్యామ్నాయంముగా కూరగాయల తోటలు సాగుచేస్తున్నా రైతులు చాలా సందర్భాలలో గిట్టుబాటు ధర్ రాక తీవ్రంగా నష్ట పోవుచున్నారు.

శీతలీ కరణ గిడ్డంగులు (కోల్డ్ స్టోరేజ్ యూనిట్)లను రైతులే నిర్మించు కొనేందుకు ముందుకు వచ్చినచో 50 లక్షల రూపాయలకు పైగా రుణము మంజూరు చేసేందుకు ప్రభుత్వము సిద్ధముగానున్నది ఇందులో 25% సబ్సిడి కూడా ప్రభుత్వము ఇచ్చుచున్నది. ఈ గిడ్డంగులను నిర్మించుకొనుటకు ఆయా వ్యవసాయ మార్కెటు కమిటీలు సైతం స్థలము ఇచ్చుటకు ధర లేని సమయములో నిల్వ చేసి తర్వాత అమ్ముకొనుట ద్వారా రైతు తగిన లాభాన్ని పొంద గల్గును.

ఈ విధముగా మెదకు జిల్లాలో చాలా ప్రాంతములందు కూరగాయల పంట పండింపబడుచున్నది.

## మెదకు జిల్లాలో పండ్లతోటలు పెంపకము

మెదకు జిల్లాలో ఆహార ధాన్యాల ఉత్పత్తితో పాటు ఇక్కడి రైతులు పండ్ల తోటల పెంపకం వైపు కూడా దృష్టిని సారించినారు. వరి మొదలగు పైర్ల ఉత్పత్తులలో వ్యవసాయ కూలీలు సమయానికి దొరక కుండుట, దొరికినను అధికమొత్తము ఖర్చగుటకు చీడ పీడలు, మొదలగు వాటిచే ఆహార ధాన్యాల ఉత్పత్తి రైతుకు లాభాసాటి కాకున్నది. అందుకే ప్రత్యామ్నాయముగా కూరగాయలు, పండ్లతోటలు మొదలగు వాణిజ్య పంటల వైపు ఇచ్చుట రైతు దృష్టి సారించుచున్నాడు.

మెదకు జిల్లాలో 7777 ఎకరాలలో పండ్ల తోటలు 17,300 ఎకరాలలో కూరగాయలు 680 ఎకరాలలో పూలతోటలు 41828 ఎకరాలలో మిర్చిమొదలగు వాణిజ్య పంటలు పండించుచున్నారు.

పండ్లతోటలలో భాగంగా 1096 ఎకరాలలో అరటి, 4400 ఎకరాలలో మామిడి 948 ఎకరాలలో బొప్పాయి పంటను సాగుచేయుచున్నారు. జామ, దానిమ్మ, సంత్రాబత్తాయి, నిమ్మ, మామిడి పండ్ల తోటలు కూడా ఎక్కువ మొత్తాలలోనే పండింపబడుచున్నవి.

పండ్ల తోటల పెంపకంలో ఆధునిక పద్ధతులు అవలంబించుటకు రైతు ఉత్సాహము కనబరచు చున్నాడు, టిష్యూకల్చర్, డ్రిప్ ఇరిగేషన్ వంటి నూతన విధానాలు రైతుకు ఎంతో ఉపయోగ పడుచున్నవి.

చీడపీడలు మొదలగు వాటితో నష్టము కలుగుచున్న సందర్భంలలో వ్యవసాయశాఖ వారి సహాయముతో సరియగు క్రిమి సంహారక మందులను ఉపయోగించుచు అధిక దిగుబడిని సాధించుచున్నారు.

ప్రభుత్వము కూడా పండ్లతోటల పెంపకమునకై సబ్సిడీ రేట్లలో మొక్కలను సరఫరా చేయుచున్నది. చిన్న సన్నకారు రైతులతో పాటు యస్.సి, యస్.టి, రైతులకు మహిళలకు 90% ఇతరులకు 70% సబ్సిడీతో డ్రిప్ ఇరిగేషన్ సౌకర్యాన్ని ప్రభుత్వము కల్పించుచున్నది.

యస్.సి, యస్.టి వారిచే జిల్లాలో ములుగు, నర్సాపూర్ మొదలగు మండలాలలో సామూహికముగా పండ్ల తోటల పెంపకమును ప్రభుత్వమే చేపట్టి వారికి సమస్త సదుపాయములను కల్పించుచున్నది. సంగారెడ్డిలో ఫలపరిశోధనా కేంద్రము గలదు.

## పూలతోటల పెంపకము

మెదకు జిల్లాలో వ్యవసాయ రంగంలో పూల తోటల పెంపకము కూడా పాలుపంచుకొనుచున్నది.

ముఖ్యంగా కొండాపూర్ మండలంలో పూల తోటల పెంపకంపై రైతులు ఆసక్తి కనబరచు చున్నారు. మండలంలోని ముని దేవునిపల్లి, మన్‌సాన్ పల్లి, చీమల్‌దరి, కోనాపూర్, బొంతపల్లి తదితర గ్రామాలలో పూలతోటలు సాగు చేయబడుచున్నవి.

కనకాంబరాలు, చేమంతులు, బంతి, మల్లె మొదలగు పూల తోటలు పెంచబడుచున్నవి. గుమ్మడిదల మొదలగు గ్రామాలలో ఉత్సాహవంతులైన యువ రైతులు గులాబి మొదలగు పూదోటలను కూడా సాగు చేయుచున్నారు.

హార్టీ కల్చర్ డిపార్టుమెంటు వారు పూలతోటల పెంపకము చేయుచున్న రైతులకు తగు సలహాలనిచ్చుటే కాక అవసరమైన రుణ సదుపాయాన్ని కూడా బ్యాంకుల నుండి కల్పించుచున్నారు.

యస్.సి. కార్పొరేషన్ వారు పూలతోటల పెంపకమునకై సబ్సిడీ, మార్జిన్ మనీల రూపంలో ఆర్థిక సహాయమును చేయుచున్నారు. మొత్తము మీద మెదకు జిల్లాలో వ్యవసాయ అభివృద్ధి లో పూలతోటల పెంపకము కూడా జరుగుచు ఇచ్చట కర్షకులు తగు ఆర్థిక లాభాలను గడించుచున్నారు.

## తమలపాకుల తోటల పెంపకము

మెదకు జిల్లాలో పండ్లతోటల, పూలతోటల పెంపకంతో పాటు తమలపాకుల తోటల పెంపకం కూడా యిక్కడి రైతులు చక్కగా చేపట్టి ఫలసాయాన్ని పొందుచున్నారు.

కొండాపురం మండలంలో అనంతసాగర్ సైదాపూర్, మారెడుపల్లి తదితర గ్రామాలలో 200 ఎకరాలకు పైగా, నారాయణ్‌ఖేడ్ మండలంలోని లింగాపూర్‌లోను, శివంపేట మండలంలో సవాపేటలో, తూప్రాన్ మండలంలో ఘనాపూర్‌లోను తమలపాకుల తోటల పెంపకము చక్కగా సాగుచున్నది.

తమలపాకుల తోటల పెంపకంలో ప్రధానమైనది నడమానుల చెట్లపెంపకము నడబెట్లు పెరిగిన తర్వాత తమలపాకుల తీగలను నడలపైకి ఎక్కింతురు. క్రొత్తగా ఆకు తోటల పెంపకం చేసేవారు మే-జూన్ మసాలలో నడల పెంపకాన్ని ప్రారంభిస్తారు. ఇవి మూడు నెలల కాలంలో ఏపుగా పెరుగును. సెప్టెంబరు అక్టోబరు నెలలలో వీటిపైకి తీగలు పాకే విధంగా ఆకు మొక్కలను నాటుదురు. ఒకసారి నాటిన తమలపాకు తోట నుంచి మూడు నాలుగు సంవత్సరాల వరకు ఫలసాయము లభించును.

అనంతసాగర్ నుండి తమలపాకులు కర్ణాటక, మహారాష్ట్రాలకు ఎగుమతి చేయుదరు. లింగాపూర్ నుండి నారాయణ్‌ఖేడ్, మెదకు, జోగిపేట, సంగారెడ్డి, హైద్రాబాద్‌కే కాకుండా ముంబాయి వంటి నగరాలకు ఎగుమతి జరుగును.

ఒక ఎకరా భూమిలో స్వల్ప పెట్టుబడిలో లక్ష రూపాయల వరకు సంపాదింతురు.

**జిల్లాలోని వివిధ కూరగాయలు పంట మరియు ఉత్పాదన పట్టిక**

| క్ర.సం | పంట | వైశాల్యం (హెక్టార్లలో) ఖరీఫ్ | రబీ | సాగు (హె) వేసవి | మొత్తము | | మొత్తము ఉత్పాదన (ఎం.టి.ఎస్) |
|---|---|---|---|---|---|---|---|
| | **కూరగాయలు** | | | | | | |
| 1. | ఆలుగడ్డలు | - | 1000 | - | 1000 | 20 | 20000 |
| 2. | స్వీట్ పొటాటో | 50 | 120 | - | 170 | 20 | 3400 |
| 3. | కోలకాసియా | - | 25 | - | 25 | 20 | 500 |
| 4. | ఉల్లిపాయలు | 880 | 3000 | - | 3880 | 20 | 77600 |
| | | **930** | **4145** | - | **5075** | | **1,01,500** |
| | మసాలా | | | | | | |
| 1. | ఎండు మిరపకాయలు | 2000 | 6000 | - | 8000 | 4 | 32000.00 |
| 2. | అల్లం | - | - | 800 | 800 | 20 | 16000.00 |
| 3. | కొత్తమీర | - | 400 | - | 400 | 3 | 1200.00 |
| 4. | క్యాప్సికం | 10 | 15 | - | 25 | 20 | 500.00 |
| 5. | ఆజ్వా | - | 1500 | - | 1500 | 0.3 | 450.00 |
| 6. | టర్మరిక్ | 600 | - | - | 600 | 75 | 45000.00 |
| 7. | వెల్లుల్లి | - | .0 | - | 30 | 10 | 300.00 |
| 8. | కర్రీ లీఫ్ | 30 | 30 | - | 60 | 30 | 1800.00 |
| 9. | బిటల్‌వైన్ | - | 30 | - | 30 | 0.19 | 5.99 |
| | | **2640** | **8005** | **800** | **11445** | - | **97255.99** |

## జిల్లాలోని వివిధ కూరగాయల పంట మరియు ఉత్పాదన పట్టిక

| క్ర.సం | పంట | వైశాల్యం (హెక్టార్లలో) | | సాగు (హె) | | మొత్తము ఉత్పాదన (ఎం.టి.ఎస్) | |
|---|---|---|---|---|---|---|---|
| | | ఖరీఫ్ | రబీ | వేసవి | మొత్తము | | |
| | **కూరగాయలు** | | | | | | |
| 1. | టమాలో | 865 | 1620 | 515 | 3000 | 10 | 30,000 |
| 2. | వంకాయ | 125 | 140 | 40 | 305 | 10 | 3,050 |
| 3. | భేండి | 900 | 800 | 150 | 1850 | 10 | 18,500 |
| 4. | ఫ్రెంచ్ బీన్స్ | - | 675 | - | 675 | 12 | 8,100 |
| 5. | క్లస్టర్ బీన్స్ | 60 | 80 | 10 | 150 | 12 | 1,800 |
| 6. | బౌకోస్ బీన్స్ | 25 | - | - | 25 | 20 | 250 |
| 7. | బుష్ బీన్స్ | 20 | 70 | 10 | 100 | 8 | 800 |
| 8. | కాలీఫ్లవర్ | - | 8 | 2 | 10 | 10 | 100 |
| 9. | క్యాబెజ్ | - | 16 | 4 | 20 | 10 | 200 |
| 10. | ఆనపకాయ | 6 | 8 | 6 | 20 | 12 | 240 |
| 11. | బీరకాయ | 40 | 60 | 20 | 120 | 12 | 1440 |
| 12. | కాకరకాయ | 50 | 80 | 20 | 150 | 5 | 750 |
| 13. | నక్కదోసకాయ | 40 | 80 | - | 120 | 20 | 2,400 |
| 14. | దోసకాయ | - | 20 | - | 20 | 20 | 400 |
| 15. | క్యారెట్ | - | 20 | - | 20 | 12 | 240 |
| 16. | బీట్‌రూట్ | - | 10 | - | 10 | 12 | 120 |
| 17. | మునగకాయ | - | 10 | - | 10 | 10 | 100 |
| 18. | కోసినియా | - | 40 | - | 40 | 15 | 600 |
| 19. | పచ్చిమిరపకాయలు | 500 | 800 | 200 | 1500 | 10 | 15000 |
| 20. | ఆకు కూరలు | 400 | 600 | 200 | 1200 | 5 | 600 |
| | | **3031** | **5137** | **1177** | **9345** | - | **90090** |

జిల్లాలోని వివిధ పండ్ల పంటలు మరియు ఉత్పాదన పట్టిక.

| క్ర.సం | పంట | వైశాల్యం (హెక్టార్లలో) | సాగు (హె) | మొత్తము ఉత్పాదన (ఎం.టి.) |
|---|---|---|---|---|
| | పండ్ల పంట | | | |
| 1. | మామిడి | 1600 | 10 | 16,000 |
| 2. | జామ | 560 | 50 | 28,000 |
| 3. | అరటిపండు | 500 | 40 | 20,000 |
| 4. | నారింజ | 150 | 10 | 1,500 |
| 5. | బొప్పాయి | 125 | 100 | 12,500 |
| 6. | ద్రాక్ష | 54 | 50 | 2,700 |
| 7. | నిమ్మపండు | 55 | 10 | 550 |
| 8. | సపోట | 9 | 20 | 180 |
| 9. | చింతపండు | 25 | 30 | 750 |
| 10. | అత్తిపండు | 4 | 10 | 40 |
| 11. | దానిమ్మపండు | 5 | 20 | 100 |
| 12. | అమోలా | 2 | 15 | 30 |
| 13. | ఖాజు | 14 | 0.57 (పచ్చి ఖాజు) | 8 |
| 14. | సీతాఫలం | 15 | 20 | 300 |
| 15. | కొబ్బరికాయ | 10 | 15 | 150 |
| 16. | పనసపండు | 2 | 0.75 | 1.5 |
| 17. | ఇతర పండ్లు | 1 | - | 4 |
| | | **3131** | -- | **82813.5** |

## జిల్లాలోని వివిధ పువ్వుల పంట మరియు ఉత్పాదన పట్టిక

| క్ర.సం | పంట | వైశాల్యం (హెక్టార్లలో) ఖరీఫ్ | రబీ | వేసవి | సాగు (హె) మొత్తము | ఉత్పాదన | మొత్తము ఉత్పాదన (ఎం.టి.ఎస్) |
|---|---|---|---|---|---|---|---|
| | పువ్వులు | | | | | | |
| 1. | గులాబి | 30 | - | - | 30 | 0.00375 (2 1/2 లక్షల పువ్వులు) | 0.1125 (75 లక్షల పువ్వులు) |
| 2. | మల్లెపువ్వలు | 50 | - | - | 50 | 10 | 500 |
| 3. | క్రాసాంద్రా | 60 | - | - | 60 | 2.5 | 150 |
| 4. | చామంతి | 25 | - | - | 25 | 5 | 125 |
| 5. | బంతిపూాలు | 10 | 15 | - | 25 | 10 | 250 |
| 6. | ఏస్టర్స్ | - | 5 | - | 5 | 18 | 90 |
| 7. | గ్లాడియోలస్ | - | 5 | - | 5 | 0.0375 | 0.1875 |
| 8. | ట్యూబ్ రోస్ | 10 | - | - | 10 | 5 | 50 |
| | | **185** | **25** | - | **210** | - | **1165.3** |

# మత్స్య పరిశ్రమ శాఖ

మెదక్ జిల్లాలో దొరికే చేపలను ఆరగించడానికి రాష్ట్ర ప్రజలు అత్యంత మక్కువ చూపిస్తారు. నైజాం ప్రభుత్వ కాలంలోనే హైదరాబాద్ కేంద్రంగా "సంఖ్యాత్" అనే పేరుతో జిల్లాలో మత్స్య పరిశ్రమ వెలసింది. ఇక్కడ మిర్రల్ (కొర్రమీన్), మార్పులు (మార్ఫ్), పాపెర (బామ్) లాంటి చేపలు అధికంగా లభిస్తాయి. చేపల పెంపకంపై ఎక్కువగా గంగపుత్రులు (బెస్తలు), ముదిరాజులు ఆధారపడి జీవిస్తున్నారు. జిల్లాలో దాదాపు 50 వేల మంది ఈ వృత్తిపైనే ఆధారపడి జీవిస్తున్నారు. ఆధునిక పద్ధతులలో చేపలను ఉత్పత్తి చేస్తున్న ఏకైక కేంద్రం మెదక్ ఫిష్‌ఫారమని చెప్పవచ్చు. యునిసెఫ్, ఎ.ఎస్.పి. సంస్థల ఆర్థిక సహాయంతో కూడా చేపల పెంపకాన్ని చేపడుతున్నారు. జిల్లాలో సంగారెడ్డి, సిద్దిపేట, మెదక్ డివిజన్లలోని 620 భారీ నీటి వనరులలో చేపలను పెంచుతున్నారు. మెదక్ మండలం పర్దన గ్రామ కేంద్రంగా మంజీరానదిలో సంకర జాతి చేపగుడ్ల సేకరణతో ప్రారంభమైన విత్తనోత్పత్తి నేడు 17 ఎకరాల విస్తీర్ణంలో జరుగుచున్నది. ఈ గుడ్లని హైదరాబాదు, రంగారెడ్డి, మహబూబ్‌నగర్, నల్లగొండ జిల్లాలకు సరఫరా చేస్తూ, జిల్లా వ్యాప్తంగా పంపిణీ చేస్తున్నారు. జిల్లాలో చేపలను మెదక్, సంగారెడ్డి ఉత్పత్తి కేంద్రాల్లో పెంచుతున్నారు. చేపల ఉత్పత్తి మాత్రం గణనీయంగా పెరుగుతున్నది. 2000-2001 సంవత్సరానికి ఐదు కోట్ల చేపల ఉత్పత్తి లక్ష్యం కాగా ఐదు కోట్ల 31 లక్షల మేరకు ఉత్పత్తి సాధించారు. గత ఏడాది జూన్‌లో ఆస్తమా రోగులకు 16 వేల మర్రల్ చేపలను పంపిణీ చేయాల్సి వుండగా, లక్ష్యానికి మించి 23 వేల చేపలను సరఫరా చేశారు. అదేవిధంగా ఈ ఏడాదికి 11 వేల మెట్రిక్ టన్నుల ఉత్పత్తి లక్ష్యంకాగా, ఇప్పటివరకు సగానికి పైగా ఉత్పత్తి సాధించారు.

**సహకార సంఘాల ఏర్పాటు :** చేపల వృత్తిపై ఆధారపడి జీవిస్తున్న గంగపుత్రులు 362 సంఘాలను ఏర్పాటు చేసుకున్నారు. ఇందులో మత్స్యకారుల సంఘాలు 349, మహిళా సంఘాలు 12, జిల్లా సంఘం (అపెక్స్ సొసైటీ) ఒకటి వున్నాయి. వీరి నుండి నామమాత్రం రుసుం వసూలు చేస్తూ వారి ఆర్థికాభివృద్ధికి తోడ్పడుతున్నాయి.

**శిక్షణ కేంద్రాలు**

చేపలను ఆధునిక పద్ధతులలో పెంచడానికి ఎఫ్.ఎం.డి.ఎ., డి.ఆర్.డి.ఎ. (ట్రైసం పథకం), ఎస్.జి.ఎస్.వై. సంస్థల ద్వారా 2,950 మత్స్యకారులకు శిక్షణ నిచ్చారు. సింగూరు జలాశయం, మంజీరా నది (ఘన్‌పూర్ ఆనకట్ట), పోచారం రిజర్వాయర్‌లోని పరిసర ప్రాంతాల నుండి రెండు వేల మంది ఈ వృత్తిపై ఆధారపడి జీవిస్తున్నారు.

## మత్స్యకారుల ప్రమాద భీమా

చేపలు పట్టే సమయంలో ప్రమాదవశాత్తు మరణించిన మత్స్యకారులకు, జాతీయ మత్స్యకారుల సమాఖ్య ద్వారా ఎలాంటి ప్రీమియం లేకుండా 35 వేల రూపాయలు నష్టపరిహారం ఇస్తున్నారు. ఈ పథకం క్రింద జిల్లాలో ఇంతవరకు 11 మందికి ఆర్థిక సహాయం అందించారు. గృహ వసతిలేని వారికి కూడా గృహాలు నిర్మించారు. రొయ్యల పెంపకానికి కూడా ప్రభుత్వం ఆర్థిక సహాయం అందిస్తుంది.

## జలాశయాల్లో ఉచితంగా చేప విత్తనం స్టాకింగ్

గత మూడు సంవత్సరాలుగా జిల్లాలో సింగూరు, పోచారం, పరిసర ప్రాంతాలలో మత్స్యకారులు సంక్షేమం దృష్ట్యా సుమారు 20 లక్షల చేప విత్తనం పెంచటం జరిగింది. ఇట్టి పథకం జిల్లాలో జలాశయ పరిసర ప్రాంతాల మత్స్యకారులు రోజువారి కూలీలుగా మారకుండా సహకరిస్తోంది.

## ప్రయోగాత్మక కార్యక్రమాలు

జిల్లాలో మత్స్యకారుల చేపల పెంపకంతో పాటు మంచినీటి రొయ్యల పెంపకం వైపు కూడా దృష్టిసారిస్తున్నారు. ఇందులో భాగంగా 1999-2000లో నర్సాపూర్ మండలంలోని "కాగజ్ మద్దూర్" గ్రామంలోని పెద్ద చెరువులో 10 వేలకు మించి రొయ్యలు పెంపకం చేపట్టగా 100 కిలోలు రొయ్యలు ఉత్పత్తి రాగా ఇట్టి ఫలితం మిగతా సంఘాల వారిని కూడా ఆకర్షించి రొయ్యల పెంపకం చేపట్టుటకు ముందుకు వస్తున్నారు. ఇందుకై శాఖా పరంగా ప్రతిపాదనలు తయారు చేయడం జరుగుతోంది.

అయితే ఈ జిల్లాలో మత్స్య పరిశ్రమపై ఏ మాత్రం అవగాహన లేనటువంటి ప్రాంతం జహీరాబాద్ ప్రాంతంలో డి.పి.ఎ.పి. సహకారంతో ఝరాసంఘం మండలం కుప్పానగర్, జహీరాబాద్ మండలం "హోతి బి" లో చెరువును ఎంపిక చేసి స్వయం సహాయక బృందాల ద్వారా చేపల పెంపకం కార్యక్రమాన్ని ప్రారంభించడం జరిగింది.

# మెదకు జిల్లాలో పశుసందప

మెదకు జిల్లా వ్యావసాయిక ప్రాంతము వ్యవసాయమునకు మూలాధారము పశుసంపద. అందుకే పాడిపంట అని పంటకన్న పాడికి అధిక ప్రాధాన్యమిచ్చినారు.

పూర్వము గోసంపదను ధన మారకముగా గణించిన చారిత్రికాధారము కలదు.

వ్యవసాయదారుడు తనయింటి లోని పిల్లలను చేనులోని మొలకలను, యింటి ముంగిట దూడలను ఓకే రకముగా ప్రేమించును.

మెదకు జిల్లా పశుగణాభివృద్ధిలో సముచిత స్థానమాక్రమించి యున్నది. పశుగణన ప్రకారము జాతి పశువులు 569752, గేదెజాతి పశువులు 314148, ఇందులో పునరుత్పత్తి శక్తి గల పశువులలో ఆవులు 148181 గేదెలు 174153లు కలవు. గొఱ్ఱెలు 616940, మేకలు 355798 కోళ్ళు, 2699077 పందులు 30353 ఇతరములు 7156 కలవు.

పూర్వము వ్యవసాయక మతములు తక్కువగా నుండి బంజరు భూములు, అటవీ భూములు ఎక్కువగా నుండెను. పశువులకు తిరుగాడుటకు, మేతకు పుష్కలమైన స్థలముండెడిది. అంతేగాక ఆ రోజులలో పెద్దరైతులు తమ కున్న భూమిలో కొంత భాగమున పశువులమేతకై కంచెలను ప్రత్యేకముగా విడిచి పెట్టేవారు. అంతేగాక పశువుల కంచెలను ప్రత్యేకముగా విడిచిపెట్టేవారు. అంతేగాక పశువుల మేతకై లభించు పచ్చగడ్డి ఎక్కువగా పొలాల గట్లపై లభించుచుండెడిది. గట్లు కూడా విశాలముగా పెద్దగా నుండెడివి. వాటిపై మొలచు పచ్చి గడ్డి రైతుకు గల పశువులకు సంపూర్ణముగా సరిపోయెడిది.

అంతేగాక ప్రాచీన కాలమున పండించువరి, మక్కమొదలగు ధాన్యములు హైబ్రిడువి కాకుండుటచే మొలకలు పొడవుగా పెరిగి ధాన్యముకన్న, గడ్డి ఎక్కువగా లభించెడిది. హైబ్రిడు వంగడములు వచ్చిన తర్వాత వరి, మక్క మొదలగునవి పొట్టి రకపు మొక్కలు. వీటిచే ధాన్యమధికమై పశు గ్రాసము తక్కువైనది.

పూర్వమున వ్యవసాయమునకే గాక ప్రత్యేకముగా పశు పోషణమునకు పశువుల కాపర్లను నియమించేవారు. రానురాను వ్యవసాయమునకే పాలేర్లు లభించుట దుష్కరమైనది. అందుచే చాలా మంది రైతులు తమకవసరమైనంత మేరకే పశువుల సాదుచున్నారు. ఒక నాడు రైతు కొట్టములో ఆవు, గేదెలు అధికముగా నుండెడివి. ఎరువుకొరకై పశువులను ఎక్కువగా పెంచెడివారు.

నేడు దున్నుటకు మొదలు నీరుతోడుట, ఊర్చుట మొదలగు వ్యవసాయ పనులన్నియు యంత్రములు చేయుచున్నవి ట్రాక్టర్లు, మోటర్లు నేడు వ్యవసాయమున ప్రాధాన్యము వహించినవి.

ఒకవైపు స్థలాభావము, మరోవైపు కూలీల కొరత, ఇంకొకవైపు పశుగ్రాసము కొరత ఇవన్నీ కలసి నేడు పశుసంపద తగ్గినదని చెప్పక తప్పదు.

మేకలు-గొఱ్ఱెల పెంపకము కూడా ఒకనాటికన్నా నేడు చాలా వరకు తగ్గినది. వీటి మేతకు తగినంత అటవీ ప్రాంతము లేకుండుట వీటి పోషణకు ప్రధాన అవరోధముగుచున్నది. వీటి పోషణ మరియు పెంపకము ప్రత్యేకముగా ఒకజాతివారే నిర్వహింతురు. గొఱ్ఱెమేకలను గుర్తించుట తగు జాగ్రత్తలు తీసికొనుటలో యాదవులకున్న పరిజ్ఞానము ఇతరులకు లేదని చెప్పుటలో ఆశ్చర్యపడ వలసిన అవసరము లేదు.

## పశుసంవర్ధక శాఖ

మెదకు జిల్లాలో పశువుల యొక్క ఆరోగ్య పరిరక్షణకు ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధగైకొనుచున్నది.

జిల్లాకేంద్రమైన సంగారెడ్డిలో ఈ శాఖ ప్రధాన కార్యాలయము మరియు బహుళార్థ పశు వైద్యశాల కలదు. మెదకు జిల్లాలో 10 సహాయ సంచాలకుల ఆధ్వర్యంలో తాలూకా పశు వైద్యశాలలు పని చేయుచున్నవి. ఈ జిల్లాలో 73 పశు వైద్యశాలలు పశువుల డాక్టర్లతో నడపబడుచున్నవి. 134 గ్రామీణ పశు వైద్య కేంద్రములు పశువుల ఆరోగ్య పరిరక్షణకు దోహద పడుచున్నవి. పశువులకు వచ్చు వ్యాధులను నిర్ధారించుటకై ఒక పశు ఆరోగ్య సంస్థ ప్రత్యేకముగా పని చేయుచున్నది. మేలురకపు అధిక పాల దిగుబడి పశువులను ఉత్పత్తి చేయుటకై ఒక పశు వీర్య కేంద్రము కలదు. జిల్లాలో 134 కేంద్రములలో కృత్రిమ గర్భోత్పత్తి సౌకర్యము కలదు. ఈ జిల్లాలో అధిక పాలదిగుబడికి మేలు జాతి దూడలు 9187 గత రెండు సంవత్సరముల నుండి ఉత్పత్తియైనవి. ఈ సంవత్సరము అదనముగా 28 కేంద్రములలో కృత్రిమ గర్భోత్పత్తి సదుపాయములు గలుగ జేయబడుచున్నవి.

జిల్లాలోని వివిధ మండలములలో పశువులకు గొంతువాపు జబ్బవాపు, గాలికుంటు, చిటుకరోగం, మశూచి, దొమ్మ మొదలగు అంటు వ్యాధులు వ్యాపించుచున్నవి. ఈ వ్యాధుల నివారణకై పశు సంవర్ధక శాఖ వారు తగు జాగ్రత్తలు తీసికొనుచున్నారు. సకాలంలో **వ్యాధి సోకక** ముందే రోగనిరోధక టీకాలు వేయుచున్నారు.

# అధిక పాల దిగుబడికి పశు గ్రాసం

ఆయా కాలాలకు అనుగుణంగా భూవసతిని బట్టి సంవత్సరం పొడుగునా పాడిపశువులకు పచ్చిమేత అందించి పాడి పరిశ్రమను లాభ సాటిగా చేయుటకై పశు సంవర్ధక శాఖ వారు సబ్సిడీలో రైతులకు పశుగ్రాస విత్తనాలను సరఫరా చేయుచున్నారు.

నెపియర్, పారా, గినిగడ్డి, మొక్కజొన్న, మేత జొన్న, విత్తనాలు రైతులకు సరఫరా చేయబడుచున్నవి.

మొక్కజొన్న రకాలలో ఆఫ్రికన్ టూల్, గంగ, హెచ్.జి.టి$_3$, మోతి, కాంపోజిట్ ముఖ్యరకాలు, మేతజొన్న రకాలలో పి.సి$_6$, పి.సి$_{23}$, యమ్.పి. చారీ, H.C.$_{137}$, H.C.$_{260}$, రకాలను రైతులకు సరఫరా చేయుచున్నారు.

హెక్టారు మొక్కజొన్న 50 కిలోలు, మేత జొన్న రకాలు హెక్టారుకు 40 కిలోల విత్తనం అవసరం అవుతుంది.

మొక్కజొన్న 60-70 రోజులకు కోసుకోవచ్చు జొన్నరకాలయితే 35-45 రోజుల కొకసారి 3 కోతలు కోసుకొనవచ్చును. వీనివలన హెక్టారుకు 40-50 టన్నుల పచ్చి మేత దిగుబడి పొందవచ్చు.

ఇదే విధంగా జనవరి మాసంలో సాగుచేసే లూసర్న్ పుష్టికరమైన కాయజాతి పచ్చిమేత విత్తనాలను కూడా రైతులకు సరఫరా చేయబడుచున్నవి.

ఈ లూసర్న్ పచ్చి మేత నీటి పారుదల భూములలో 70 రోజులలో మొదటి కోతకు వస్తుంది. శీతాకాలంలో 25 రోజుల కొకసారి కోతకు వచ్చును. 10-11 కోతలలో 10 టన్నుల పచ్చి మేత లభించును. 10 సెంట్ల భూమిలో వేసిన లూసర్న్ సంవత్సరానికి ఒక పశువుకు సరిపోతుంది.

ఇదిగాక పాడుపశువులకై పాల ఉత్పత్తి అధికము చేయుటకై మిల్క్‌చరీ మొదలగు మందులను, ప్రత్యేక దాణాలను సబ్సిడి రేట్లపై రైతులకు అందజేయ బడుచున్నవి.

గ్రామీణాభి వృద్ధి పథకం క్రింద పేదరైతులకు సంకరజాతి దూడల పోషణకు కావలసిన దూడల దాణా సబ్సిడి ధరపై సరఫరా చేయుదురు.

దూడలకు నట్టలబెడద సర్వసాధారణము గేదె దూడలలో నట్టల బెడద మరీ ఎక్కువ. అక్టోబర్, నవంబర్ మాసాలలో పుట్టిన దూడలకు జనవరిలో నట్టల నివారణ మందులు త్రాగించడం అవసరం. ఈ అవసరాన్ని గుర్తించి పశువైద్యశాలలు తమ పరిధిలోని దూడలకు తగు నివారణోపాయలకై మందుల నిచ్చుచు దూడలను రక్షింతురు.

పశువుల సంతలలో మరియు వ్యాపార మార్కెట్ కమిటీలయందు దూరము నుండి వచ్చు పశువులకు ప్రథమ చికిత్స కొరకు ప్రతి సంతకు ఒక పశువుల మందుల పెట్టెను ఏర్పాటు చేసి ఆ ప్రదేశమునకు సమీపములోనున్న పశువైద్యులకు ఈ పనిని అప్పగించగా వారు సంతరోజున హాజరై అవసరము మేరకు చికిత్స చేయుదురు.

## గొర్రెల పెంపకము

మెదకు జిల్లాలో ఒకప్పుడు గొర్రె-మేకల పెంపకం అధికంగా ఉండేది. రానురాను అనేక కారణాల వలన వీటి పెంపకం తగ్గు ముఖము పట్టినది. వీటి మేతకై సరియైన అటవీ ప్రాంతము, మైదాన ప్రాంతము కొరవడుటచే వీటి సంరక్షణ చాలా కష్టతర మగుచున్నది.

ఈ మధ్య కాలమున మెదకు జిల్లాలో 248 గొర్రెల పెంపకం దార్ల సహకార సంఘాలు ఏర్పాటైనవి. ఈ సహకార సంఘాల ద్వారా బ్యాంకుల నుండి పెంపకందార్లు ఋణములను పొందుచున్నారు. వీటి పెంపకమునకై వివిధ పథకాల ద్వారా వీరికి సబ్సిడి, మార్జిన్‌మనీ మొదలగు ఆర్థికలాభాలను ప్రభుత్వము కల్పించుచున్నది.

ఈ విధముగా పెంచబడుచున్న గొర్రెమేకల ఆరోగ్య సంరక్షణలో కూడా పశుసంవర్థక శాఖ తగు జాగ్రత్తలను తీసు కొనుచున్నది.

ఈ జీవాలు సాధారణంగా కొన్ని వ్యాధులకు గురి అవుతాయి. వీటిలో ముఖ్యముగా పి.పి.ఆర్. వ్యాధి, పారుడు వ్యాధి, మూతి పుళ్లరోగము, జిలగ రోగము మొదలగునవి. ఈ వ్యాధులు రాకుండా తగు సమయాలలో రోగ నిరోధక టీకాలనిచ్చుచు ఈ జీవాలను కాపాడుటలో పశు సంరక్షణ శాఖ ఇతోధిక సేవ చేయుచున్నది.

నర్సాపూర్‌లో గొర్రెల సంరక్షణ కేంద్రము నెలకొల్పబడియుండెను.

మెదకు జిల్లాలో 7.50 లక్షలు గొర్రెలుండగా వాటి అభివృద్ధికి గాను 131 గొర్రెల పెంపకందార్ల సొసైటీలు కలవు. ఈ సంవత్సరం 1999-2000లో ప్రాజెక్టు ఇంటిగ్రేటెడ్-షిప్-డెవలప్‌మెంటు ప్రోగ్రాం పథకానికి రాష్ట్ర ప్రభుత్వం 3 సంవత్సరాలకుగాను రు. 40 కోట్లు కేటాయించగా జిల్లాకు 61 లక్షలరూపాయలు మంజూరిఐనవి. ఈ పథకం క్రింద 5 రకాల కార్యక్రమాలుచే పట్టుచున్నారు. గొర్రె పొట్టేళ్ల పెంపకం, విత్తన పొట్టెళ్ల పెంపకం పచ్చిక బయళ్ల పెంపకంలో గొర్రెల పెంపకందార్ల అవగాహన కోసం శిక్షణా కార్యక్రమం చేపట్టడం జరుగుచున్నవి.

గొర్రెల పెంపకం దార్ల అభివృద్ధికై మెదకు జిల్లాలోని జోగిపేటలో ఉన్ని సహకార సంఘము పని చేయుచున్నది.

# కోళ్ల పెంపకము

మెదకు జిల్లాలో కోళ్ల పెంపకము ఒక పరిశ్రమగా దినదినాభివృద్ధి నందుచున్నది.

నవీన పద్ధతులలో కోళ్లపెంపకము చేపట్టబడుచున్నది, పౌల్ట్రీ, హేచరీలు అనేకముగా ప్రారంభింపబడినది.

లక్షల రూపాయల పెట్టుబడులతో పౌల్ట్రీ వ్యాపార మార్గమున సాగుచున్నది. కోడిగుడ్లు, మాంసము సమీప నగరములకే కాక సుదూర ప్రాంతములకు ఎగుమతి చేయుబడుచున్నవి.

కోళ్లకు తరచుగు వచ్చు వ్యాధులకు నివారణ టీకాలు ఈయబడుచున్నవి. గ్రామములందు రైతులు పెంచుకొను కోళ్లకు కొక్కెర తెగులు వ్యాధి నివారణకు పశు సంవర్ధక శాఖవారిచే టీకాలు ఉచితముగా ఈయబడుచున్నవి.

# జన్మభూమిలో పశుపోషణ

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడుగారి మెదడు నుండి మెరపులా పుట్టిన మహోజ్వల ఆలోచనా తరంగమే జన్మభూమి కార్యక్రమము.

ప్రజలను జాగృతం చేసి అభివృద్ధి పథంవైపు నడిపిస్తూ ఉన్నత విలువలతో నూతన శక్తితో ఆదర్శ సమాజాన్ని నిర్మించడానికి ఆవిర్భవించిన మహోన్నత ఉద్యమము జన్మభూమి కార్యక్రమము.

స్వయంకృషితో విప్లవాత్మకమైన మార్పులు ఈ సమాజంలో తేగలమని పేదబడుగు వర్గాల భుజము తట్టి ముందుకు నడిపిస్తున్న నూతన ప్రక్రియ జన్మభూమి ఈ మహోన్నత జన్మభూమి కార్యక్రమంలో 1997 అక్టోబర్ ఒకటినుండి ప్రారంభింమైన జన్మభూమి పశుసంపదకు ప్రాణం పోసింది.

గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో పశువుల పెంపకం అత్యంత ప్రాధాన్యమైనది. గ్రామాలలో ప్రజలకు వ్యవసాయం, రవాణా మొదలైన కార్యక్రమాలకు తోడు నీడగా పశువులు సహకరిస్తున్నాయి. పశువుల పెంపకం వలన అదనపు ఆదాయం లభించుచున్నది జిల్లాలోని విస్తారమైన పశుసంపదను కాపాడు కోవలసిన అవసరం ఎంతైనా ఉంది. గ్రామీణ ప్రాంతాలలో వెనుకబడిన నిరుపేద గొర్రెల పెంపకందార్లకు చేయుతనందించ వలసిన అవసరం ఉంది.

గ్రామీణ అభివృద్ధి సంస్థ ద్వారా వివిధ పథకముల ద్వారా చిన్న, సన్నకారు రైతులకు మేలుజాతి పశువుల పంపిణీ జరుగుచున్నది వాటి ఉత్పాదక శక్తిని పెంచుటకు మేలుజాతి పశుగ్రాసము అభివృద్ధి పరచుటకు పశుగ్రాసవిత్తనాలు సరఫరా చేయబడుచున్నవి.

పశుసంపద పెంపుదలకై ప్రభుత్వంచే పట్టిన జన్మభూమి కార్యక్రమము మార్గదర్శిగా నిలిచింది. గతంలో మందుల చీటీలు వ్రాసి యివ్వడానికే పరిమితమైన ఆసుపత్రులు నేడు సమృద్ధమైన సేవలందించ గలుగు చున్నాయి. జన్మభూమి నాలుగవ విడత నుంచి పశు వైద్యానికి ప్రాముఖ్యం ఇవ్వడంతో జిల్లాలో రెండేళ్లలో 75 లక్షల రూపాయల వ్యయము జరిగినది. జన్మభూమి సందర్భంగా ప్రభుత్వము వ్యాక్సిన్‌ల కొనుగోలుకు పుష్కలంగా నిధులు విడుదల చేయడంతో జిల్లాలో పశువులు భయంకర వ్యాధుల బారిన పడకుండా కాపాడ గలిగేందుకు వీలు కలిగింది.

4వ విడతి జన్మభూమి నుండి 10వ విడత జన్మభూమి వరకు పశుసంవర్ధక శాఖ వారు 15310 క్యాంపులు నిర్వహించి 4378578 పశువులకు చికిత్సలు చేసినారు.

ఇందుకోసం వివిధ రకాల మందులు, వ్యాక్సిన్‌లు వాడుట జరిగినది. ఇందుకు 7484711 రూపాయలు వ్యయమైనవి. జిల్లా పరిధిలోని 1059 గ్రామ పంచాయతీలు వాటి హేబిటేషన్ గ్రామాలలో సైతం పశువైద్య శిబిరములు నడపబడినవి. పశు సంవర్తక శాఖ చేతిలో నిధులు అందుబాటులో ఉండుటచే వ్యాక్సిన్‌లు, మందుల కొనుగోలు జరిగినది. 1998-99 లో లక్ష్యానికి మించి దాదాపు 20 లక్షల పశువులకు వ్యాక్సిన్ చేశారు.

పశు సంవర్ధక శాఖ 1998-99లో చేపట్టిన అభివృద్ధి కార్యక్రమములు

1. 6 గొర్రెల పెంపకందారుల సహకార సంఘాలు ఏర్పాటు చేయుట జరిగినది.

2. 141 మహిళలకు డ్వాక్రా పథకం క్రింద కోళ్లకు టీకాలు వేయుటలో శిక్షణయిచ్చుట జరిగినది.

3. ముగ్గురు నిరుద్యోగ యువకులకు ట్రైజం పథకం క్రింద వాలంటరీ వెటర్నరీ ట్రైనింగ్ ఇచ్చుట జరిగినది.

4. సంగారెడ్డిలో బహుళార్ధ పశువైద్యశాల, పశువైద్య సహాయకుల శిక్షణాకేంద్రములకు భవనములేర్పాటు చేయబడినవి.

5. 475000 రూపాయల వ్యయంతో కామన్ ఫెసిలిటీ సెంటర్, వర్క్‌షెడ్ ఉన్ని పరిశ్రమాభివృద్ధి కేంద్రమును జోగిపేటలో నిర్మించుట జరిగినది.

6. 31.50 మెట్రిక్ టన్నుల పశువులదాణా 50% సబ్సిడీ పై సర్‌ఫరా చేయబడినది.

7. 4.184 మెట్రిక్ టన్నుల మినరల్ మిక్చర్ 50% సబ్సిడి పై సరపరా చేయబడినది.

8. 72.50 మెట్రిక్ టన్నుల గడ్డి విత్తనము (మేలురకం) 75% సబ్సిడిపై సరపరా చేయబడినది.

# పశు సంవర్ధక శాఖ ప్రగతి వివరములు

| క్ర.సం | వివరములు | 1998-99 సంవత్సరమున నిరర్దేశించిన లక్ష్యము | సాధించిన ప్రగతి |
|---|---|---|---|
| 1. | కృత్రిమ గర్భోత్పత్తి జరుపబడినది | 33375 | 20347 |
| 2. | దూడలు పుట్టినవి | 6000 | 5679 |
| 3. | చికిత్సలు చేపట్టినవి | 1688000 | 2233028 |
| 4. | నట్టల మందులు త్రాగించినవి | - | 1733445 |
| 5. | విత్తులునొక్కినవి | 32000 | 57335 |
| 6. | టీకాలు చేసినవి | 1911000 | 2001077 |
| 7. | గడవిత్తనము 75% సబ్సిడి | - | 72.500 మె.ట |
| 8. | పశువుల మేతమేసిన | | |
| 9. | పశుగ్రాస విస్తీర్ణము (ఎకరములలో) | 14000 | 13927 |
| 10. | పశువులు దాణా పంపిణీ 50% సబ్సిడీపై | - | 31.1 మె.ట |

# మెదకు జిల్లా పశుసంవర్ధక శాఖ ఉద్యోగ వివరములు

| క్ర.సం | ఉద్యోగ తరగతి | సాంక్షన్ అయిన ఉద్యోగాలు |
|---|---|---|
| 1. | జాయింట్ డైరెక్టర్ | 1 |
| 2. | డిప్యుటి డైరెక్టర్ | 1 |
| 3. | అసిస్టెంట్ డైరెక్టర్ | 20 |
| 4. | వెటి. అసిస్టెంట్ సర్జిన్ | 82 |
| 5. | జూనియర్ వెటి ఆఫీసర్ | 70 |
| 6. | లైవ్‌స్టాక్ అసిస్టెంట్ | 50 |
| 7. | వెటరినరి అసిస్టెంట్ | 96 |
| | వి.వి.లు | 2 |
| | | **98** |
| 8. | ఎన్యుమరేటర్ | 2 |
| 9. | ప్లాంట్ ఆపరేటర్స్ | 3 |
| 10. | రేడియోగ్రాపర్ | 1 |
| 11. | టైపిస్టు-కమ్-క్లర్క్ | 1 |
| 12. | ఫీల్డ్ సూపర్‌వైజర్స్ | 1 |
| 13. | ఫీల్డమెన్ | 1 |
| 14. | మేస్త్రరీస్ | 2 |
| 15. | ట్రాక్టర్ డ్రైవర్ | 1 |
| 16. | క్యాజువల్ లేబర్స్ (రెగ్యులర్) | 10 |
| 17. | ఫీల్డ్ అసిస్టెంట్స్ | 1 |
| 18. | లాబ్ అటెండర్స్ | 3 |
| 19. | డైరీ ఎక్స్‌టెంషన్ అసిస్టెంట్ | 2 |
| 20. | జీప్ డ్రైవర్స్ | 5 |
| 21. | ఆఫీస్ మానేజర్ | 1 |
| 22. | ఆఫీస్ సూపరింటెండెంట్స్ | 4 |
| 23. | సీనియర్ అసిస్టెంట్స్ | 13 |
| 24. | జూనియర్ అసిస్టెంట్స్ | 5 |
| 25. | టైపిస్ట్స్ | 8 |
| 26. | విలేజ్ డెవెలప్‌మెంట్ ఆఫీసర్ (ఫాడర్) | 4 |
| 27. | స్టెనో-టైపిస్ట్ | 1 |
| 28. | రికార్డ్ అసిస్టెంట్ | 1 |
| 29. | అటెండర్స్ | 260 |
| | మొత్తము | 652 |

# పారిశ్రామిక రంగము

భారతదేశము అనాది నుండి వ్యవసాయిక దేశము. అందున ఆంధ్రదేశము, అన్నపూర్ణగా ఖ్యాతినందిన రాష్ట్రము. అట్టి ఆంధ్రప్రదేశ్‌లో మెతుకు పేరుతో విలసిల్లిన మెదకు జిల్లా సంపూర్ణ వ్యవసాయ ప్రాంతమని చెప్పబడుతుండేది.

మెదకు జిల్లాలో వ్యవసాయంతో పాటు ఇతర వృత్తులు కూడా ఆదరణ పొందినట్లుగా తెలియుచున్నది. రామాయంపేట, దుబ్బాక, సిద్ధిపేటలలో కంచరిపని, నేతపని విరివిగా సాగినవి. ఈ గ్రామాలలో తయారైన ఇత్తడి పాత్రలు, వివిధ ప్రాంతాలకు సరఫరా అగుచుండేవి. అట్లే ఈ ప్రాంతాల్లో నేసేబట్ట అతి నాణ్యమైయుండేది. పట్టుబట్టల నేత పని వారికి కడు గౌరవం ఉండేది.

బి.హెచ్.ఈ.ఎల్. రాక మెదకు జిల్లా పారిశ్రామిక రంగానికే కొత్త మలుపుగా చెప్పవచ్చు.

ముఖ్యంగా ఇందిరాగాంధి మెదకు లోకసభ స్థానం నుండి గెలుపొందిన తర్వాత మెదకు జిల్లాలో పరిశ్రమలు అధికమైనవి.

పారిశ్రామిక రంగానికి పెద్దపీట వేయడం, సబ్సిడీలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సమకూర్చడం, విద్యుత్తు వంటి అత్యవసరాలను సబ్సిడి రేట్లలో ప్రభుత్వం అందించడం, చౌకగా భూమి పెద్దమొత్తంలో లభించడం, కార్మికులు అందుబాటులో దొరకడం ఇవన్నీ పరిశ్రమలు అభివృద్ధి కావడానికి దోహదం చేస్తాయి.

మెదకు జిల్లాకు కేంద్రం అధికంగా సబ్సిడీ మంజూరిచేయడంతో ఎక్కడెక్కడి పారిశ్రామికులు ఇక్కడ పరిశ్రమలను ఏర్పాటు చేసినారు. అందులో కొన్ని పరిశ్రమలు సబ్సిడీలతోనే మూతపడినట్లు ప్రచారంలో ఉన్నాయి.

**పరిశ్రమలను 3 రకములుగా విభజింపవచ్చును.**

*1.* భారీ పరిశ్రమలు
*2.* చిన్న పరిశ్రమలు
*3.* కుటీర పరిశ్రమలు

మెదకు జిల్లాలో ఈ 3 రకములైన పరిశ్రమలు స్థాపించబడినవి.

ముఖ్యంగా 9వ నంబరు జాతీయ రహదారిపై రామచంద్రాపురం నుండి పాటన్‌చెరువు, ఇస్నాపూర్, ముత్తంగి, రుద్రారం పరిసర ప్రాంతంలో ప్రభుత్వ రంగ సంస్థలు కూడా స్థాపించబడినవి.

ప్రభుత్వరంగ సంస్థలలో

1. బి.హెచ్.ఇ.ఎల్.
2. ఆల్విన్ వాచ్
3. ఏ.పి. స్కూటర్స్
4. ఆర్డినెన్స్ ఫ్యాక్టరి
5. బి.డి.ఎల్.

ముఖ్యమైనవి. ఈ ఫ్యాక్టరీలలో (1) బి.హెచ్.ఈ. ఎల్., (2) బి.డి.ఎల్.లు కేంద్ర ప్రభుత్వ యాజమాన్యమున నడపబడుచున్నవి. (1) ఆల్విన్ వాచ్, (2) ఏ.పి. స్కూటర్స్ ఫ్యాక్టరీలు రాష్ట్ర ప్రభుత్వ యాజమాన్యములోనివి. ఇందులో స్కూటర్ ఫ్యాక్టరీ సంపూర్ణముగా మూతపడినవి. ఆల్విన్ వాచ్ ఫ్యాక్టరీ మూతపడుటకు సిద్ధముగానున్నది.

ప్రైవేటు యాజమాన్యమున నడపబడుచున్న భారీ పరిశ్రమలలో కెమికల్, ఇంజనీరింగ్, డ్రగ్స్, ఫ్యాక్టరీలు చెప్పుకో దగినవి. వీటిలో రెడ్డి ల్యాబ్స్, అరవిందో ఫార్మా, హెట్రో డ్రగ్స్, సుదర్శన్ డ్రగ్స్ మొదలైనవి అంతర్జాతీయ ప్రమాణాలతో నడపబడుచున్నవి అంతేగాక వీటిలో తయారైన మందులు కూడా అంతర్జాతీయ మార్కెట్లో అమ్మబడుచున్నవి. ఏసియన్ పేంట్స్, ర్యాల్కో, సీరీస్ మొదలైన కెమికల్ ఫ్యాక్టరీలు, శ్యాంపిస్టన్స్, రాణే బ్రేక్ లైనర్స్, మహేంద్రా అండ్ మహేంద్రా, యం.ఆర్.ఎఫ్. మొదలైన ఇంజనీరింగ్ ఫ్యాక్టరీలు భారీ పరిశ్రమలుగా మెదకు జిల్లాకు వన్నె తెచ్చుచున్నవి.

బి.హెచ్.ఈ.ఎల్. ఫ్యాక్టరీకి అనుబంధ పరిశ్రమలుగా రామచంద్రాపురం ప్రాంతంలో ఎన్నో వెలసినవి.

మెదకు జిల్లాలో పారిశ్రామికవాడలు మూడు కలవు.

**1. బొంతపల్లి. 2. బొల్లారం 3. పొటంచెరు**

జిన్నారం మండలంలోని బొంతపల్లి, దోమడుగు, చెట్లపోతారం, అన్నారం, గుమ్మడిదల, కానుకుంట, మంబాపూర్ గ్రామపంచాయతీల పరిధులలో చిన్న పరిశ్రమలెన్నో వెలసినవి. అట్లే బొల్లారం గ్రామ పంచాయతి, భాజిపల్లి గ్రామ పంచాయతి పరిధులలో అనేక రసాయనిక పరిశ్రమలు వెలసినవి. అనగా తక్కినవి లేవని కాదు కాని వాటి సంఖ్య అల్పము. పొటంచెరు, రామచంద్రాపూర్ మండలలాలో వెలసిన చిన్న పరిశ్రమలు అత్యధికము.

ఈ ప్రాంతములందేకాక సదాశివపేట, జహీరాబాద్, గజ్వేల్ (రాజీవ్ రహదారిపై), నర్సాపూర్, శివంపేట, తూప్రాన్, హత్నూర మండలాలలో కూడా పరిశ్రమలు నడపబడుచున్నవి.

నర్సాపూర్ పూర్వపు తాలూకా ప్రాంతంలో గ్రానైట్ పరిశ్రమలు, స్పిన్నింగ్ మిల్స్ నడపబడుచున్నవి. ఆహారోత్తత్తులైన చాక్లెట్, బిస్కెట్, కాఫి మొదలగునవి తయారగు ఫ్యాక్టరీలు మెదకు జిల్లాలో కలవు.

జోగిపేటలో చేనేత ఉన్ని పరిశ్రామిక సహకార కేంద్రము పని చేయచున్నది.

మెదకు జిల్లాలో నిజాం చక్కెర కర్మాగారములు జహీరాబాద్, మంబోజిపల్లి (మెదకు) ప్రాంతాలలో స్థాపింపబడి జిల్లా వ్యవసాయభివృద్ధికి, కర్షకుల ఆర్థికాభివృద్ధికి దోహదము చేయుచున్నవి. 'గణపతి షుగర్స్' అనుపేర సంగారెడ్డి మండలంలో ప్రైవేటు యాజమాన్యమున స్థాపించబడిన చక్కెర కర్మాగారము అతి పెద్దనైనది.

అంతేగాక ఖండసారి చక్కెర ఫ్యాక్టరీలు కూడా జిల్లాలో అధికముగానే యున్నవి.

మెదకు జిల్లాలో కుటీర పరిశ్రమలలో చెప్పుకోదగినది బీడీ పరిశ్రమ. ఈ పరిశ్రమ ఎక్కువగా సిద్దిపేట, దుబ్బాక, రామాయంపేట ప్రాంతాలలో నడుపబడుచున్నది.

డ్వాక్రా ప్రారంభమై మహిళలలో చైతన్యమును పెంపొందించినది. డ్వాక్రా మహిళలు అనేక రకములైన వస్తువులను ఉత్పత్తి చేయుచున్నారు. అప్పడాలు మొదలగు వస్తువులను ఉత్పత్తి చేసి అమ్మకం సల్పుచున్నారు.

చేనేత పరిశ్రమ కుటీర పరిశ్రమగా ఇప్పటికి కొన్ని గ్రామాలలో నెరపబడుచున్నది. ఇందు బట్టల నేత, గొంగళ్ల నేత ముఖ్యముగా చెప్పవచ్చును.

**ఉద్యోగవకాశములు :**

ఈ విధముగా మెదకు జిల్లా పారిశ్రామికముగా ముందంజలో పయనించు చున్నది. కాని ఇక్కడ నెలకొల్పిన పరిశ్రమలు మెదకు జిల్లా యువతలో నిరుద్యోగాన్ని భర్తీ చేయలేకున్నవి. స్థానికులకు ఉద్యగావకాశాలలో కొంతమేర రిజర్వేషన్లు కల్పించినప్పటికి ఇక్కడి పరిశ్రమలలో తగు ఉద్యోగ ప్రాతినిధ్యము లేదని చెప్పవచ్చును.

ఒక ప్రాంతము పారిశ్రామికంగా అభివృద్ధి చెందినచో అక్కడి ప్రజల జీవన విధానము మారిపోవును. వ్యవసాయము చక్కగా నడపబడ కుండును. యువకులలో పరిశ్రమలలో కార్మికులుగా చేరవలయునన్న కోరిక పెరుగును. మెదకు జిల్లా పారిశ్రామికంగా ఎదిగినది. కాని ఇక్కడి ప్రజల ఆర్థిక జీవనము మాత్రము ఎదుగలేదు.

**వాతవరణ కాలుష్యము :**

మెదకు జిల్లాలో స్థాపించబడిన అనేకానేక పరిశ్రమలతో ఇక్కడ ఏర్పడుతున్న వాతావరణ కాలుష్యం చెప్పలేనిది.

ముఖ్యముగా రసాయనిక మరియు మందుల (Chemical & Drugs ) ఫ్యాక్టరీల నుండి వెలువడు వాయువుచే ఈ ప్రాంతములోని గాలి మొత్తము కలుషితమై ఇక్కడివారి ఊపిరితిత్తులు చెడిపోయి రోగములుబారి పడుచున్నారు.

ఈ ఫ్యాక్టరీల నుండి వెలువడు వ్యర్థపదార్థములు ఇష్టము వచ్చిన రీతిలో వదలుటచే ఈ ప్రాంతమున ప్రవహించు కాలువలు, ఏరులలోని నీరు మొత్తము కాలుష్యమై ఆదుర్వాసనచే పరిసర ప్రాంత ప్రజల ఆరోగ్యములు నాశనమగుచున్నవి.

పాటన్ చెరువు ప్రాంతం నుండి పారుతూ ఇస్మాయిల్ ఖాన్‌పేట్ గుండా మంజీరానదిలో కలిసే నక్కవాగులోని నీరు కలుషితమై ఆ ప్రాంతమంత వ్యవసాయమునకు పనికిరాని భూములైనవి. నక్కవాగులోని నీరు శరీరానికి సోకితే చాలు బొబ్బలెక్కును.

ఈ కలుషిత పదార్థములు వదలుటచే ఇక్కడి భూగర్భజల మంతయు కలుషితమై వ్యవసాయమునకు పనికిరానిదై, త్రాగుటకు గుక్కెడు నీరైనా లభించనివగుచున్నవి.

బొంతపల్లి, బొల్లారం పారిశ్రామికవాడల ప్రాంతంలో నివసించడం అనారోగ్యాన్ని కొని తెచ్చుకోవడమే.

ఈ విధంగా మెదకు జిల్లా పారిశ్రామిక ప్రగతి మెదకు జిల్లా వారికి భస్మాసురహస్తమైనదని చెప్పవచ్చును. నిజమునకు పరిశ్రమను ప్రారంభించిన నాటి నుండే కాలుష్య పదార్థములను నేరుగా వదలక శుద్ధి చేయు మిషన్‌లను ఏర్పాటు చేయుట పరిశ్రమ యాజమాన్యము వారి కనీసకర్తవ్యము. ప్రభుత్వము ఈ విషయమున తగు జాగురూకతతో ఎప్పటికప్పుడు పరీక్షించుటకై కాలుష్య నియంత్రణకై ప్రత్యేక కార్యాలయమును సిబ్బందిని ఏర్పాటు చేసినది. జరిగే తనఖీలు జరుగుచున్నవి ఐనను కాలుష్యము దారి కాలుష్యముదే అగుచున్నది. ప్రతి ఫ్యాక్టరీలో కాలుష్య నియంత్రణా యంత్రములు అమర్చుట, ఎక్కువగా చెట్లను నాటి పచ్చదనమును కలిగించుట యాజమాన్యముల కనీస బాధ్యత కాగలదు.

శాస్త్రీయ అభివృద్ధి మానవ వికాసమునకు తోడ్పడవలెను కాని మానవ వినాశనమునకు దారితీయరాదు.

## జిల్లాయందు పారిశ్రామిక ప్రగతి

మెదక్ జిల్లాలో సుమారు 372 భారీ, మధ్యతరహా పరిశ్రమలు కలవు. రూ. 3961.72 కోట్ల పెట్టుబడితో సుమారుగా 61520 మందికి ఉపాధి కల్పించడమైనది. వీటిలో 7 పరిశ్రమలు పబ్లిక్ రంగంలోను మరియు 365 పరిశ్రమలు ప్రైవేటు రంగంలోను కలవు.

మెదక్ జిల్లాలో 8442 చిన్న తరహా పరిశ్రమలు కలవు. ఇవి సుమారుగా రూ.306.38 కోట్ల పెట్టుబడితో 67,536 మందికి ఉపాధి కల్పించడమైనది.

| వరుస సంఖ్య | కేటగిరి | 1995-96 | | 1996-97 | | 1997-98 | | 1998-99 | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | సంఖ్య | పెట్టుబడి | సంఖ్య | పెట్టుబడి | సంఖ్య | పెట్టుబడి | సంఖ్య | పెట్టుబడి |
| 1. | భారీ మరియు మధ్య తరహా పరిశ్రమలు | 20 | 13.82 | 24 | 23.82 | 21 | 41.24 | 14 | 91.91 |
| 2. | చిన్న తరహా పరిశ్రమలు | 814 | 15.29 | 912 | 17.13 | 1399 | 26.28 | 1249 | 23.43 |
| | మొత్తము | **834** | **29.11** | **926** | **40.95** | **1420** | **67.52** | **1263** | **115.34** |

### జిల్లాలో 1995-96 నుండి 1998-99 వరకు సాధించిన ప్రగతి

మొత్తము : **4453**

మొత్తము పెట్టుబడి : **252.92 (రూ.కోట్లలో)**

# భెల్ (BHEL)

## జిల్లాకు మణిదీపం "భెల్"

భారత దేశంలో అత్యున్నత స్థానంలో ఉన్న విద్యుత్ పరికరాలు ఉత్పత్తి చేసే సంస్థ ప్రపంచంలో అగ్రగామిగా ఉన్న ఈ తరహా 12 పరిశ్రమలలో భారత్ భారీ విద్యుత్ పరికరాల సంస్థ "భెల్" ఒకటి. 13 ఉత్పత్తి విభాగాలతో లెక్కకు మించిన సర్వీస్ గ్రూప్‌లతో ఈసంస్థ విద్యుత్, పారిశ్రామిక, రవాణా, ఆయిల్, గ్యాస్, ప్రత్యామ్నాయ ఇంధన వనరులకు సంబంధించి అనేక భారీ పరికరాలను రూపొందించుటకై వివిధ ప్రదేశాలలో స్థాపించి సక్రమంగా పనిచేసేలా చూసి ఆయా సంస్థల ఉత్పత్తి ప్రారంభమయ్యే వరకు బాధ్యతను స్వీకరించి ఎంతో ప్రఖ్యాతిని పొందింది ఈ సంస్థ. విదేశీ వస్తు నాణ్యతను మించి అత్యంత ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో భారీ పరికరాలను ఉత్పత్తి చేసే సంస్థగా పేరుగాంచింది.

దేశ రాజధాని ఢిల్లీ ముఖ్య కేంద్రంగా సంస్థ విభాగాలు మనదేశంలోని ఎనిమిది ముఖ్యమైన పట్టణాలలో ఉన్నాయి. భెల్ సంస్థ జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో అత్యున్నత ప్రమాణాలను సాధిస్తూ ఎప్పటికప్పుడు వినియోగదారులకు కావలసిన సాంకేతిక పరమైన మార్పులను గమనిస్తూ భారీ పరికరాల కొనుగోలుదారులను సంతృప్తి పరిచే విధంగా పనిచేస్తున్నది. మన దేశానికి అవసరమయ్యే భారీ విద్యుత్ పరికరాలు దాదాపు 90 శాతం వరకు ఈ సంస్థే తయారుచేసి సరఫరా చేస్తుంది. అమెరికా, యూ.కె., టాంజానియా తదితర ప్రముఖ దేశాలతో పాటు దాదాపు 45 దేశాలకు ఈ సంస్థ పరికరాలను సరఫరా చేస్తుంది.

ఈ సంస్థ హైదరాబాద్-పూనే జాతీయ రహదారిలో రామచంద్రాపురం వద్ద 1965లో 2500 ఎకరాల విస్తీర్ణంలో ఈ యూనిట్‌ను ప్రారంభించారు. ఈ సంస్థ ఇక్కడ ప్రధానంగా తయారుచేసే ఉత్పత్తులను ఉక్కు, చెక్కర, పేపర్, సిమెంట్, కెమికల్, అల్యుమినియం, పెట్రోల్ పరిశ్రమల్లో ఉపయోగిస్తారు. ఈ యూనిట్‌ను 1987-88లో తన టెక్నాలజీని అభివృద్ధి పరచి తద్వారా కొత్త ఉత్పత్తులను చేపట్టింది. ఈ యూనిట్‌లో వర్క్ ఓవర్ రిగ్, రిజర్వ్ రిగ్, ఎర్‌కూల్, హీట్ ఎక్స్‌ఛేంజర్స్. SF6 బ్రేకర్ విత్ స్ప్రింగ్ మెకానిజంను ఉత్పత్తి చేసింది. 1989లో మొదటిసారిగా గాస్‌టర్బైన్‌ను ఉత్పత్తి చేసింది.

**పరిశోధనారంగం :** భారతదేశంలో భెల్‌కార్పోరేట్ పరిశోధనా అభివృద్ధి విభాగం ఇక్కడ ఉంది.

"భెల్" సంస్థ ఉత్పత్తి చేసే భారీ పరికరాలలో ఎక్కువ భాగం థర్మల్ సిస్టంకు సంబంధించినవే. ఈ సంస్థ 500 మెగావాట్ల వరకు శక్తిగల స్టీమ్ జనరేటర్‌లు టర్బైన్‌సెట్లను ఉత్పత్తి చేస్తుంది. ఈ విభాగంలో స్టీమ్ టర్బయిన్లు, గ్యాస్ టర్బయిన్లు, టర్బోజనరేటర్లు, బాయిలర్ ఫీడ్ పంపులు, హీట్ ఎక్స్‌ఛేంజ్‌లు, కండెన్సర్ల వంటి దాదాపు 30 పరికరాలను ఉత్పత్తి చేస్తుంది.

"భెల్" సంస్థ విద్యుత్‌ను ఒక ప్రాంతం నుంచి వురో ప్రాంతానికి సరఫరా చేయడానికి నిలువ ఉంచడానికి అవసరమయ్యే వాహకాలను తయారు చేయడంలో ప్రత్యేకతను సంతరించుకొంది. సబ్‌స్టేషన్లు, స్విచ్‌యార్డులలో అవసరమయ్యే అనేక పరికరాలను ఈ సంస్థ ఉత్పత్తి చేస్తుంది. 400 కిలోవాట్‌ల శక్తిగల స్విచ్ గేర్‌లు, ట్రాన్స్‌ఫార్మర్లను ఈ సంస్థ ఉత్పత్తి చేస్తున్నది.

విద్యుత్ ఉత్పత్తిలోనేగాక పరిశ్రమల అభివృద్ధికి అవసరమయ్యే విద్యుత్ పరికరాల ఉత్పత్తిలో ఈ సంస్థ ఘన విజయం సాధించింది. అత్యున్నత ప్రమాణాలు గల సెంట్రీఫ్యూగల్ కంప్రెసర్లు, డ్రైవ్ టర్బయిన్లు, టర్బోసెట్లు, గ్యాస్ టర్బయిన్లు మొదలయిన వాటిని ఉత్పత్తి చేస్తున్నది. ఇవి ఫర్టిలైజర్ రసాయనాలు, పెట్రోల్ రసాయనాలు, రిఫైనర్లు, మొదలగు వాటికి పనికి వస్తాయి.

ఈ ఉత్పత్తి విభాగంలో సిమెంట్ గనులు, పేపర్, స్టీల్ మెటలర్జికల్ విభాగంకు కావలసిన పరికరాలను ఉత్పత్తి చేసి కాంట్రాక్ట్‌లకు నిర్ణీత సమయాలకు విడుదల చేస్తున్నది. కాగితం పరిశ్రమకు అవసరమయ్యే రికవరీ బాయిలర్‌లు ప్రాసెస్ బాయిలర్ల హీట్ ఎక్స్‌ఛేంజర్‌లు ఎలక్ట్రోస్టాటిక్ రెసిస్టేటర్‌లు. సూట్ బ్రోవర్‌లు, ఎయిర్‌ప్రీ హీటర్‌లు, పర్వలైజర్‌లు, బాయిలర్ హీట్ పంప్‌లు ఇండస్ట్రియల్ వాల్వ్‌లు, సేఫ్టీ రిలీఫ్ వాల్వ్‌లు, ఫ్యాన్‌లు, ఎలక్ట్రిక్ మోటార్‌లు వంటి అనేక పరికరాలను భెల్ యూనిట్ ఉత్పత్తి చేస్తుంది.

## అవార్డులు :

అత్యున్నత ప్రమాణాలుగల పరికరాలను ఉత్పత్తి చేస్తున్నందుకుగాను నేషనల్ ప్రొడక్టివిటీ అవార్డ్, బ్రిటిష్ సేఫ్టీ కౌన్సిల్ వారి భద్రతా అవార్డ్. 1975 నుంచి కార్మికుల భద్రతకు గాను భారత ప్రభుత్వ అవార్డ్ గ్రామీణాభివృద్ధికి కృషి చేసినందుకు ఆంధ్రప్రదేశ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ బహుమానం, 1986లో బ్రిటిష్ కౌన్సిల్ వారి గోల్డ్ సైటేషన్ అవార్డ్. 1981, 82, 84, 85, శ్రమవీర్ జాతీయ అవార్డు ఈ సంస్థ కార్మికులు పొందినారు.

ఈ సంస్థకు రామచంద్రాపూర్ టౌన్‌షిప్‌లో 4800 క్వార్టర్‌లతో పాటు L.I.G., M.I.G., H.I.G. క్వార్టర్‌లు ఉన్నాయి. ఆధునిక వైద్య సదుపాయాలు కలిగిన 100 పడకల ఆసుపత్రి కలిగి ఉంది. 7 పాఠశాలలు ఒక జూనియర్ కళాశాల కూడా ఉన్నాయి. భెల్ చుట్టు ఉన్న గ్రామాలు గోసన్‌పల్లి, తెల్లాపూర్‌లకు మంచినీటి, వీధిదీపాల సౌకర్యాన్ని సమకూర్చింది.

# నిజాం షుగర్ ఫ్యాక్టరీ

## మధునగర్ - జహీరాబాద్

మెదకు జిల్లా వ్యవసాయముపై ఆధారపడిన ప్రాంతము. ఇచ్చట వరితో పాటు చెరుకు ఉత్పత్తి కూడా అధికము.

చెరుకు ఉత్పత్తిదారుల అభివృద్ధి కోసం జహీరాబాద్‌కు తొమ్మిది కిలోమీటర్ల దూరంలో బీదర్ రహదారిపై నిజాం షుగర్స్ లిమిటెడ్ యూనిట్‌ను 1973లో ప్రారంభించిరి. 115 ఎకరాల విస్తీర్ణంలో ఫ్యాక్టరీ యార్డు, కాలనీ గోడౌన్లు మొదలగునవి ఏర్పాటు చేయబడినవి.

ఈ ఫ్యాక్టరీ జహీరాబాద్, కోహీర్, ఝరాసంగం, న్యాలకల్, రాయకోడ్ మండలాలలోని 172 గ్రామాల చెరకురైతులకు ఉపయోగపడుటకు ఏర్పాటైనది.

ఈ ప్రాంతపు నేల చెరుకు ఉత్పత్తికి అనుకూలమైనది ఇచ్చట, ఎర్రనేలలు, నల్లరేగడి నేలలు నీటిముంపునకు గురికాని గుణాన్ని కలిగి ఉన్నందున చెరుకు సాగుకు ఎంతో అనువైనవి. ఈ ఐదు మండలాలలో 20 వేల ఎకరాలలో చెరుకు పంట పండింపబడుచున్నది. ఫ్యాక్టరీ ఏర్పడక ముందు ఇచ్చట చెరుకు రైతులు బెల్లము తయారు చేసెడివారు. కొంతకాలానికి ఖండసారి చక్కెర పరిశ్రమలకు చెరుకు పంపిణీ చేయబడేది. తగిన గిట్టుబాటు ధర లభించక రైతులు కష్టనష్టాలకు గురి అయ్యేవారు.

ఈ ప్రాంతపు చెరుకు రైతుల ప్రయోజనాల కనుగుణముగా ఇచ్చట మొదట 1250 టి.సి.డి సామర్థ్యం గల చక్కెర ఫ్యాక్టరీ నెలకొల్పడానికి ప్రభుత్వం అంగీకరించి ప్రారంభించినది. ఫ్యాక్టరీ ప్రారంభించిన 4 సంవత్సరాలలో ఈ ప్రాంతంలో చెరుకు పంట విస్తీర్ణము, ఉత్పత్తి గణనీయంగా పెరగడంతో 1977-78 సీజనులో ఈ ఫ్యాక్టరీ సామర్థ్యాన్ని 1500 టి.సి.డి.గా మార్పు గావించబడినది.

ఆ తర్వాత సాలీనా పంటదిగుబడి నాలుగు లక్షల వరకు పెరిగి ఫ్యాక్టరీ సామర్థ్యం పెరుగక మే నెల వరకు కూడా క్రషింగ్ సీజన్‌ను పొడిగించ వలసి వచ్చినది. దీనివలన అటురైతులు ఇటు ఫ్యాక్టరీ యాజమాన్యము కష్టనష్టాలకు గురి కావలసి వచ్చినది.

ఈ విషయాలను దృష్టిలో నుంచుకొని ఫ్యాక్టరీ సామర్థ్యాన్ని 2500 టి.సి.డి. లకు పెంచుట జరిగినది.

ఈ విధముగా అంచెలంచెలుగా ఎదిగిన మధునగర్ నిజాం చక్కెర కర్మాగారము ఈనాడు సుమారు 400 మంది పర్మినెంటు 350 మంది సీజనల్ కార్మికులతో పనిచేయుచున్నది.

చెరుకు పంటలో అనేక కొత్త వంగడములు వచ్చినవి. కొత్త వంగడముల వలన చక్కెర రికవరీ శాతము గణనీయముగా పెరిగినది.

అప్పుడప్పుడు వర్షాభావ పరిస్థితులు

చెరుకుపంట దిగుబడిని గణనీయంగా తగ్గించుచున్నవి. ఫ్యాక్టరీ జోను దాటి పరిసర ప్రాంతాలైన నారాయణ్‌ఖేడ్, మనూర్, రేగోడు, మర్పల్లి మండలాలలోని చెరుకును తెప్పించుకొనుట జరుగుచున్నది.

ఈ ఫ్యాక్టరీ జోనులోని ఏడు వేల మంది చెరుకు రైతుల శ్రేయస్సు కొరకు వారి సంక్షేమం కొరకు ఫ్యాక్టరీ యాజమాన్యము ఎన్నోరకాల అభివృద్ధి పథకాలను ఎన్నోరకాల ప్రోత్సాహకాలను కల్పించినది.

## నిజాం షుగర్ ఫ్యాక్టరీ - మంబోజి పల్లి

మెదకు జిల్లాలో నిజాం షుగర్ ఫ్యాక్టరీలు రెండు. మెదటిది జహీరాబాదులో కాగా రెండవది మెదకున గలదు.

ఈ చెక్కెర కర్మాగారము మెదకు పట్టణానికి నాలుగు కిలోమీటర్ల దూరమున మెదకు నర్సాపూర్ రహదారిపై కలదు.

నిజాం షుగర్ ఫ్యాక్టరీ మంబోజిపల్లిలో ఏర్పాటగుటకు మాన్యులు శ్రీ కరణం రామచంద్రరావు గారు.ఎనలేని కృషి చేసిరి.

ఈ కర్మాగారము 1986లో పదకొండు కోట్ల రూపాయల వ్యయముతో నెలకొల్పబడినది. 155 ఎకరముల సువిశాలమైన ప్రదేశమున ఫ్యాక్టరీ గోదాములు, నిర్మించబడినవి. ఫ్యాక్టరీలో పని చేయు అధికారులకు చక్కని గృహవసతి కల్పించబడినది. ఈ ఫ్యాక్టరీ ఆవరణలో జిల్లా సహకార భ్యాంకు శాఖ ఏర్పాటు చేయబడినది.

నిజాం చక్కెర ఫ్యాక్టరీ మంబోజి పల్లిలో రెగ్యులర్ కార్మికులు 310 మంది సీజనల్ కార్మికులు 230 మంది పని చేయుచున్నారు.

ఈ కర్మాగారపు జోన్ పరిధిలో పదకొండు మండలములున్నవి. మెదకు-కొల్చారం, పాపన్నపేట, టెక్మాల్, చిన్నశంకరంపేట, వెల్దుర్తి-చేగుంట రామాయంపేట, కౌడిపల్లి, అల్లాదుర్గం, నాగిరెడ్డిపేట ఈ మండలాల చెరుకు ఉత్పత్తిదారుల ఆర్థికాభివృద్ధికి ఈ ఫ్యాక్టరీ దోహద కారిగానున్నది. సుమారు 25 వేల ఎకరాల విస్తీర్ణంలో పండించే చెరుకు ఈ ఫ్యాక్టరీకి తరలింపబడుచున్నది.

ఈ కర్మాగారము వలన చెరుకు పండించే రైతుల కడగండ్లు తీరినవని చెప్పవచ్చును. ఈ ఫ్యాక్టరీ రాకముందు ఈ ప్రాంతమున అనేక ఖండసారి చెక్కెర మిల్లులు ప్రైవేటు యాజమాన్యమున నడిచేవి. వారు తమకు తోచిన ధరను చెల్లించి చెరుకు కొనుగోలు చేసేవారు. డబ్బు చెల్లించుటలో కూడా అనేక జాప్యము జరిగేది.

కొన్ని పర్యాయములు ఒక సాలు చెరుకు డబ్బు మరొక సాలుకు ఇచ్చిన పర్యాయములు మొత్తము ఎగవేసిన సందర్భములు కలవు. కొందరు రైతులు బెల్లము తయారీ చేసేవారు. వీరిని మధ్యదళారీలు మోసగించేవారు. ఈ ఫ్యాక్టరీ వలన చెరుకు రైతులు సక్రమముగా సకాలములో తమ ఉత్పత్తులకు తగిన ఆర్థిక లాభాన్ని పొందగలుగు చున్నారు.

ఈ మెదకు నిజాం చెక్కర కర్మాగారమునకు అనుబంధముగా 1992లో డిస్టిలరీ యూనిట్‌ను ఏర్పాటు చేసిరి.

ఈ కర్మాగారములో ప్రధానమైన చెక్కర యూనిట్ నుండి వెలువడే వ్యర్థరసాయనాలు, చెరుకు క్రషింగ్ అనంతరం వెలువడే ఉప ఉత్పత్తుల ద్వారా "బయోఎర్త్ "(సజీవ ఎరువు)ను ఉత్పత్తి చేయుచున్నారు. చెరుకు పిప్పికి ఫిలిఫైన్స్ నుంచి తెప్పించిన మైక్రో 115 అనే బ్యాక్టీరియాను మరికొన్ని రసాయనాలను కలిపి ఎరోట్రిల్లర్ అనే ప్రత్యేకయంత్రం ద్వారా "బయోఎర్త్" (సజీవ ఎరువు)ను ఉత్పత్తి చేయుచున్నారు. ఫ్యాక్టరీలో వెనుకభాగాన బహిరంగ ప్రదేశంలో బయోఎర్త్ తయారగుచున్నది. ఇక్కడే కుప్పలుగా పోసి రైతులకు విక్రయించుచున్నారు.

డిస్టిలరీ యూనిట్, బయోఎర్త్‌లచే మెదకుపట్టణమునకు జలకాలుష్యము దాపురించు చున్నది. వానలు కురిసినపుడు ఇచ్చట నీరు పసుపుటేరులోనికి ప్రవహించి మెదకు పట్టణానికి తాగు నీరు సరఫరా చేసే ఫిల్టరేషన్ బావులలోని నీరు కలుషితమగుచున్నది.

ఫ్యాక్టరీ యాజమాన్యము తగు శ్రద్ధగైకొని యూనిట్ లాభాలతో పాటు ఆ ప్రాంత వాతావరణ కాలుష్యాన్ని కాపాడుటకు తగు శ్రద్ధగై కొన వలసిన అవసరము ఎంతైనా కలదు.

## ఉన్ని పారిశ్రామిక సహకార సంఘము – జోగిపేట

ఈ సంస్థ 22-2-1955న (శ్రీ) కడల బాలప్ప జోగిపేట 2.గొల్లబాలయ్య పట్వారి పోసానిపేట 3. కడల అంజయ్య జోగిపేట 4. చిందం లక్ష్మయ్య 5.బురగోని లక్ష్మణ ప్రసాద్ జోగిపేట గారలచే స్థాపించబడి రిజిష్ట్రీ చేయబడినది. రిజిష్ట్రేషన్ సంఖ్య 21174. ఈ సంఘము అందోలుతాలూకా పరిధి గాగలిగి 52 గ్రామాలలో 675 మంది సభ్యులచేనడప బడుచున్నది.

చేనేత ఉన్నిపరిశ్రమ ద్వారా చేతివృత్తుల పనివారికి అధునాతన పద్ధతులతోమగ్గములపై వృత్తి, పరమైన శిక్షణ తో కంబళ్లు - ఉన్ని బ్లాంకెట్లు మెరినో డిజన్ బ్లాంకెట్లు శాడి డిజన్ బ్లాంకెట్లు నీల బ్లాంకెట్లు మఫ్లర్లు - వివిధ రకములగు వస్తువుల తయారు చేయుదురు. వాటి అమ్మకాలు కూడా సంఘపక్షాననే జరుగును.

దక్షిణ భరతదేశంలోనే ఏకైక ఊల్ ఫినిషింగ్ ప్లాంట్‌గా పెరెన్ని కగన్నది. ఈ సంస్థలో 50 మంది కార్మికులు పని చేయుచున్నారు. రాజాస్థాన్ జోద్‌పూర్ పూల్‌బోర్డువారు మంజూరి చేసిన 18 లక్షల పథకంలో భాగంగా 4.75 లక్షల రూపాయలతో ఒక భవన నిర్మాణము జరిగినది.

సమగ్ర గ్రామీణాభివృద్ధి (D.R.D.A ) ద్వారా 14 స్త్రీలకు ఉన్నిదారం వడుకుటకు ట్రైజం ప్రోగ్రాంలో 6 నెలల శిక్షణ ఈయబడినది. వీరికి నెలకు రూ.350 స్టైఫండు చొప్పున ఈయబడినవి. 20 మందికి బ్లాంకెట్లు నెలకు 6 నెలల శిక్షణలో నెలకు రూ.350 స్టైఫండు చొప్పున ఈయబడినది. శిక్షితులకు చరఖాలు ఇప్పించుటలో ప్రయత్నం జరుగుచున్నది.

20 షటిల్ మగ్గముల ద్వారా నిర్విరామ కృషి జరుగుచున్నది త్రిప్పులోనున్న కార్మికులకు వర్క్‌షెడ్లు 1994-95 సంవత్సరంలో 25 గురికి 6000-00 (ఆరువేల రూ. విలువగలిగి) 1995-96 సంవత్సరంలో 17 గురికి ఉచితంగా నిర్మించి ఈయబడినవి 1996-97 లో 68 మందికి వర్క్‌షెడ్లు ఉచితంగా నిర్మించుటకు పథకము సిద్ధము చేయనైనది.

సంఘ నిర్మాణాలకు అభివృద్ధి కార్యక్రమాలకు స్థలం సరిపోకుండుటచే దూరదృష్టితో) సంఘమునకు ప్రక్కనున్న స్థలం రూ. 1,25,000-00 (ఒక లక్ష ఇరవై ఐదు వేలు) కొనుగోలు చేయనైనది.

చేనేత అభివృద్ధి కేంద్రం (హెచ్.డి.సి) మంజూరి అగుటచే 10 లక్షల రూపాయల సబ్సిడి 17.5 లక్షల రూపాయలు రుణం సంఘానికి వచ్చును.

"క్వాలిటీ డైయింగ్ సెంటర్" ఏర్పాటు కు ప్రయత్నములు చేయబడుచున్నవి. దీనిచే 7.5 లక్షల సబ్సిడీగా సంఘమునకు రాగలవు. తద్వారా అధునాతన పద్ధతిలో రంగుల అద్దకం ప్రారంభించబడును.

ఆలిండియా వూల్ బోర్డు జోధ్‌పూర్ (రాజస్థాన్) వారి నుండి ప్రాదేశిక ఉన్ని అభివృద్ధి ప్రాజెక్టు పథకం క్రింద 20 లక్షల రూపాయల ప్రణాళిక మంజూరి కాబడినది. 14,40,000-00 (పద నాలుగు లక్షల నలభై వేల రూ.) వూలు బోర్డు నుండి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము నుండి 3,50,000-00 (మూడు లక్షల ఏబది వేలు) గ్రాంటుగా మంజూరు ఐనవి. సంఘ పక్షాన 2,50,000-00 (రెండు లక్షలు) రూపాయలతో పథకము ప్రారంభించ బడుచుననది. ఈ పథకము అమలగుటకు ప్రభుత్వ అధికారులతో ఒక కమిటీ వేయబడినది. కమిటీకి చేర్‌మన్ (అధ్యక్షులుగా) D.R.D.A ప్రాజెక్టు డైరక్టరు, కన్వీనర్‌గా సంఘ అధ్యక్షులు నియమింపబడినారు.

పేద వారికి నివాసం మరియు వర్క్‌షెడ్ల రూపంలో రూ. 22,500-00 విలువగల గృహనిర్మాణం 50 మంది సభ్యులకై పథకము సిద్ధము చేయనైనది.

# రహదారులు భవనముల శాఖ

మెదకు జిల్లాలో పూర్వకాలమున ప్రధాన పట్టణములకు సరుకులు చేరవేయుటకు, ప్రజలు ప్రయాణించుటకు సైన్యము సంచరించుటకును రహదారులుండి యుండును.

కొండాపురమునందలి త్రవ్వకాలలో లభించిన నాగరికతా విశేషముల గమనించినచో నాటి రాజులు-ప్రజలు రహదారుల విషయమున కూడా శ్రద్ధాళురై యుండిరని యూహింప వచ్చును. నాటి వాహనములు బండ్లు, ఆ బండ్ల రాకపోకలకై రహదారులు ఏర్పాటై యుండెను. నాటి రాచవీధులను, పట్టణములను గమనించి, ఆ నగరములకు గల నాల్గువైపుల ద్వారములు చూచినచో రహదారులు తప్పక యుండేవని చెప్పవచ్చును.

క్రీ.శ. 1868 లో నిజాం ప్రభుత్వమున ప్రజా నిర్మాణముల శాఖను నెలకొల్పెను అంతకు ముందు బ్రిటిష్ వారు తమసైన్యము రాక పోకలకై కొన్ని రోడ్ల నిర్మాణమును చేపట్టిరి. హైదరాబాదు - నాగపూర్ రోడ్డు మొదలగు రోడ్డును బ్రిటిష్ వారు ప్రారంభించి నిజాం ప్రభుత్వమున కప్పగించిరి.

క్రీ.శ. 1875 నాటికి నిజాం ప్రభుత్వము రోడ్ల ఆవశ్యకతను గ్రహించి ప్రజాపనుల శాఖ (Public Works Department ) చక్కగా నిర్వహింపబడుటకై పాలనా- నిర్వాహణ విభాగములేర్పాటు గావింపబడి ప్రాంతీయ - జిల్లా ఇంజనీర్ల నియామకము జరిగినది.

క్రీ.శ. 1887లో ప్రజా పన్నుల శాఖను విడదీసి రహదారులు - భవనములు, నీటిపారుదల (Roads & Buildings, Irrigation ) శాఖలుగా ఏర్పాటు చేయబడినవి.

క్రీ. శ. 1894 లో ప్రజాపనుల శాఖ కార్యదర్శి కార్యాలయము ప్రత్యేకముగా ఏర్పాటు గావించబడినది, రాష్ట్రమున చీఫ్ ఇంజనీర్ ఇద్దరు సూపరిండెంట్ ఇంజనీర్లు ఈ శాఖను పర్యవేక్షించుచు ముఖ్యముగా జిల్లాలను ప్రధాన పట్టణములను కలుపు రహదారుల నిర్మాణమునకు ఎక్కువగా శ్రద్ధ వహించిరి. ఈ సమయమున హైదరాబాదునకే మార్గ నిర్మాణములు రోడ్లు ప్రారంభించిరి.

మెదకు జిల్లా హైదరాబాదు నగరమునకు అతి సమీపమున గలదు. నిజాం రాజ్యము కర్ణాటక లోని బీదర్, మొదలగు ప్రాంతములు, మహారాష్ట్రలోని నాందేడ్, ఔరంగాబాద్ మొదలగు ప్రాంతములు విస్తరించి యుండెను. ఈ ప్రాంతములను చేరుటకు మెదకు జిల్లాలో నుండే ప్రయాణించవలసి యుండును. నాటి అవసరములకను గుణముగా హైదరాబాదు, బీదర్, హైదరాబాద్ - నాగ్‌పూర్ , హైదరాబాద్ - నాందేడ్ మొదలగు రోడ్లు 20వ శతాబ్దమున ప్రారంభింపబడి మెలమెల్లగా అభివృద్ధి గావింపబడినది.

మొదట మట్టిరోడ్లు నిర్మాణమే జరిగినది, తర్వాత కొంత కాలమునకు రోడ్లపై కంకర పరచుట ప్రారంభించబడినది.

నిజాం ప్రభుత్వము రైలు మార్గములను తన ఆధీనములోనికి తెచ్చుకొని రోడ్డు రవాణాను రైల్వే శాఖాధి పత్యమునకు అప్పగించెను.

క్రీ.శ. 1941 లో రహదారుల బోర్డు ఏర్పడినది. ఇందులో రైల్వే శాఖా ప్రతినిధికి స్థానము కల్పించబడినది. రహదారుల బోర్డు రహదారుల శాఖ రైల్వే శాఖల మధ్య సమన్వయమును సాధించి రోడ్ల అభివృద్ధికి పెక్కు సూచనలు గావించి పాత రోడ్ల అభివృద్ధి కొత్త రోడ్ల నిర్మాణమును చేపట్టినది.

క్రీ.శ. 1939 లో నిజాం ప్రభుత్వం రాష్ట్ర రహదారులను రెండుగా విభజించి ట్రంకు రోడ్లు, ఉపరహదారులుగా వర్గీ కరించినది. క్రీ.శ. 1941 లో సంవత్సరమున P.W.D. చీఫ్ ఇంజనీరు రహదారుల అభివృద్ధి పథకము రూపొందించి ట్రంకు రోడ్లకు అనబంధముగా జిల్లాలోని వర్తకకేంద్రములను కలపు రహదారుల నిర్మాణమును చేపట్టుట జరిగినది.

క్రీ.శ. 1943 లో నాగ్‌పూర్‌లో జరిగిన అఖిల భారత చీఫ్ ఇంజనీర్ల సమావేశమున కంకర రోడ్లను ఐదు మైళ్ల దూరమున్న ప్రతి గ్రామమునకు రోడ్డు వేయవలెనని తీర్మానించినది. క్రీ.శ. 1947 నాటికి మెదకు జిల్లాలో 1. హైదరాబాదు - నాగ్‌పూర్, 2. హైదరాబాదు - సిద్ధిపేట కరీంనగర్, 3. హైదరాబాదు - బీదర్, 4. హైదరాబాదు - నాందేడ్, 5. హైదరాబాదు - మెదక్ - నిజాం సాగర్ - బోధన్‌ప్రధాన రహదార్లుగా నుండెను.

ఆ తర్వాత మెదకు జిల్లా ముఖ్య పట్టణమగు సంగారెడ్డికి ఇతర తాలుకా కేంద్రముల నుండి రోడ్లు వేయబడినవి, సంగారెడ్డి నుండి మెదకు సిద్ధిపేట లకు రోడ్డు వేయబడినవి. 1960 లో సంగారెడ్డి నుండి గజ్వేల్ - ప్రజ్ఞాపూర్‌లకు రోడ్డు నిర్మాణము ప్రారంభింపబడినది.

క్రీ.శ. 1959లో గ్రామ పంచాయతీలు సమితులు - జిల్లా పరిషత్తులు నెలకొల్పబడినవి.

పంచాయతి రాజ్ వ్యవస్థ రోడ్ల నిర్మాణములో గణనీయమైన మార్పులు తెచ్చినది.

ప్రతిపల్లెకు ప్రధాన రహదారితో రోడ్డు వేయబడి కలుపబడినది. ఎక్కువ రోడ్లు మట్టి- కంకర రోడ్లు వేయబడినవి.

మెదకు జిల్లాలో రెండు జాతీయ రహదారులు కలవు. హైదరాబాదు - నాగ్‌పూర్ N.H. రోడ్డు మెదకు జిల్లాలో కాళ్లకల్ గ్రామము వద్ద ప్రారంభింపబడి రామాయంపేట లో కావలి వరకు విస్తరించి వున్నది. హైద్రాబాద్ - ముంబాయి N.H. రోడ్డు రామచంద్రాపూర్ పటాన్‌చెరు నుండి మెదకు జిల్లా ప్రారంభమై జహీరాబాద్ ఆవలి వరకు సుమారు 80 కి.మీ. కలదు.

మెదకు జిల్లాలో ఆర్ & బి శాఖలో(R & B) రాష్ట్ర రహదారులు 506.050 కి.మీ. జిల్లా రహదారులు 1060.219 జిల్లా పరిషత్తు నుండి తీసికొనబడిన రహదారులు 4.400 కి.మీ.

ఈ విధముగా మెదకు జిల్లా రోడ్డు భవనాల శాఖ పరిధిలో 1540.669 కి.మీ. రోడ్లు కలవు.

బి.టి. డబుల్ లేన్ 369.9643 కి.మీ.

బి.టి. సింగల్ లేన్ 968.684 కి.మీ

మెటల్ రోడ్లు 202.021 కి.మీ

**మొత్తము 1540.669 కి.మీ**

నాబార్డ్ ప్రపంచ బ్యాంకు నిధులతో మెదకు జిల్లాలో అనేక రోడ్లు అభివృద్ధి గావించబడినవి. రాజీవ్ రహదారి మెదకు జిల్లాలో గౌరారం లో ప్రారంభింపబడి సిద్ధిపేట కావల అనంత సాగర్ వరకు సుమారు 90 కి.మీ. ప్రపంచ బ్యాంకు నిధులతో అభివృద్ధి గావించబడినది.

## రహదారులు మరియు భవనములు

మెదకు జిల్లాలో సుమారు 1541 కి.మీ రోడ్ల రహదారులు మరియు భవనముల శాఖ ఆధ్వర్యములో కలవు. 5.06 కి.మీ రాష్ట్ర రహదారులు, 1035 కి.మీ. మేజర్ జిల్లా రోడ్లు కలవు.

ఖర్చు చేసిన సొమ్ము (రూ. లక్షలలో)

| వరుస సంఖ్య | పథకము పేరు | 1995-96 | | 1996-97 | | 1997-98 | | 1998-99 | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | చేపట్టిన కి.మీ | అంచనా విలువ | చేపట్టిన కి.మీ | అంచనా విలువ | చేపట్టిన కి.మీ | అంచనా విలువ | చేపట్టిన కి.మీ | అంచనా విలువ |
| 1. | రోడ్లు (నాన్ ప్లాన్ వర్క్స్) | 151.28 | 514.35 | 208.00 | 638.23 | 296.05 | 814.60 | 186.67 | 1011.70 |
| 2. | భవనములు (నాన్ ప్లాన్ వర్క్స్) | - | 29.25 | - | 29.34 | - | 27.76 | - | 28.67 |
| 3. | రోడ్లు (ప్లాన్ వర్క్స్) | 16.665 | 122.50 | - | - | - | 2.03 | - | 24.39 |
| 4. | భవనములు (ప్లాన్ వర్క్స్) | 44 | | | | | | | |
| | 2 బ్రిడ్జిలు | 9.23 | - | 28.40 | - | 127.56 | - | 52.74 | - |
| 5. | నాబార్డు ఆర్.ఐ.డి.ఎఫ్-2 | - | - | - | - | 29.55 | 284.52 | - | - |
| | 2 బ్రిడ్జిలు | | | | | | | | |
| 6. | నాబార్డు ఆర్.ఐ.డి.ఎఫ్.-3 | - | - | - | - | - | - | 41.81 | 283.50 |
| 7. | నాబార్డు ఆర్.ఐ.డి.ఎఫ్.-4 | - | - | - | - | - | - | 9.00 | 125.00 |
| 8. | ఇ.ఆర్.పి. | - | - | - | - | - | - | 7.85 | 496.50 |
| 9. | స్టేట్ హైవే ప్రాజెక్టు | - | - | - | - | - | - | 34.20 | 350.40 |
| | (కోర్ నెట్ వర్క్స్) | - | - | - | - | - | - | 82.50 | 1805.31 |
| 10. | ఎ.పి.ఆర్.డి.వర్క్స్ | | | | | | | | |
| 11. | ఆర్.ఒ.బి. | - | - | - | - | - | - | 1.00 | 345.00 |
| | **మొత్తము** | **604** | **288.32** | **582** | **948.64** | **689** | **991.58** | **451** | **935.46** |

## శాఖ పరిధిలో గల రహదారుల వివరములు ఈ పత్రిక మార్పిడినవి

| రహదారుల వివరములు | | |
|---|---|---|
| 1. రాష్ట్ర రహదారులు | : | 506.50 కి.మీ |
| 2. జిల్లా రహదారులు | : | 1060.219 కి.మీ |
| 3. జిల్లా పరిషత్తు నుండి తీసుకోబడిన రహదారులు | : | 4.400 కి.మీ |
| | | **1540.669 కి.మీ** |
| 1. బి.టి. డబుల్ లేన్ | : | 369.964 కి.మీ |
| 2. బి.టి సింగల్ లేన్ | : | 96.684 కి.మీ |
| 3. మెటల్ రోడ్లు | : | 202.021 కి.మీ |
| 4. మట్టి రోడ్లు | : | |
| | | **1540.669 కి.మీ** |

(1) రాష్ట్ర ప్రణాళికల్లో చేపట్ట బడిన రహదారుల పనుల వివరములు :
ప్రణాళిక చేపట్టినప్పటి రహదారుల యొక్క వివరములు ఈ క్రింద పొందు పరచబడినది.

| క్రమ. సంఖ్య | పని పేరు | అంచనా విలువ రూ. లక్షలలోనే | మంజూరు | వివరములు |
|---|---|---|---|---|
| 1. | కంగ్టి - కొడపగల్ రోడ్డు కి.మీ 8/4 | 10-00 | 58, తేది:14-3-96 | పని పూర్తి |
| 2. | సిద్దిపేట - కిష్టాపూర్ (వయా) వాల్లీపూర్ కి.మీ 18/0 నుండి 20/0 | 10-00 | 58, తేది:14-3-96 | పాత ఏజన్సి ఏర్పడినది |
| 3. | గౌరారం - దండుపల్లి రోడ్డు కి.మీ 16/0 నుండి 19/0 | 10-00 | 58, తేది:14-3-96 | పని పూర్తి |
| 4. | బొంతపల్లి కమాన్ నుండి గాగిలాపూర్ రోడ్డు కి.మీ 16/2 నుండి 19/2 | 10-00 | 58, తేది:14-3-96 | పని పూర్తి |
| 5. | పటాన్‌చెరు - మల్కాపూర్ రోడ్డు కి.మీ 0/0 నుండి 2/0 | 10-00 | 58, తేది:14-3-96 | దాదాపు పని పూర్తి |
| 6. | మెదక్ - బడ్‌మట్‌పల్లీ రోడ్డు కి.మీ 9/0 నుండి 4/365 | 10-00 | 58, తేది:14-3-96 | డబ్ల్యు బి యం పని పూర్తి బిట్లు పని జరుగవలసి ఉన్నది |
| 7. | కొత్తపల్లి చింతకుంట రోడ్డు కి.మీ 9/0 నుండి 12/0 | 10-00 | 58, తేది:14-3-96 | పని పూర్తి |
| 8. | ధర్మారం - వెంకట్రావుపేట రోడ్డు కి.మీ 8/0-2 వరకు కాజువే నిర్మాణము. | 10-00 | 58, తేది:14-3-96 | పని పూర్తి |
| | | **80-00** | | |

## (2) నాబార్డు – ఆర్థిక సహాయముతో తొలివిడత పనులు

| క్రమ. సంఖ్య | పని పేరు | అంచనా విలువ రూ. లక్షలలోనే | వివరములు |
|---|---|---|---|
| 1. | జోగిపేట - వట్టిపల్లి రోడ్డు కి.మీ 5/5 - 15/5 | 99.30 | పని పూర్తి అయినది |
| 2. | పెట్లా దౌల్తాబాద్ రోడ్డు కిమీ 19/0 22/456 | 46.96 | పని పూర్తి అయినది |
| 3. | నర్సాపూర్ - కుకునూర్ రోడ్డు కి.మీ 9/0 - 2/0 | 17.54 | పని పూర్తి అయినది |
| 4. | పోతం శెట్టి పల్లి - వెల్దుర్తి - తూప్రాన్ రోడ్డు కి.మీ 27/0 నుండి 3/90 | 40.46 | పని పూర్తి అయినది |
| 5. | జాతీయ రహదారి నుండి గోసాబాదు పై కి.మీ 40/2 కాజువే నిర్మాణం | 16.00 | పని పూర్తి అయినది |
| 6. | పెద్దవాగుపై అంకెనపల్లి వద్ద పి.డబ్ల్యు డి రోడ్డు నుండి వరంగల్ జిల్లా పరిషత్ వరకు (వయా) నుంగునూరు కాజువే నిర్మాణము కి.మీ 9/6 - 10/0 | 64.25 | పని పూర్తి అయినది |
| | | 284.60 | |

## (3) నాబార్డు – 11 పీక్ క్రింద పనులు ఆమోదించబడినది

| | | | |
|---|---|---|---|
| 1. | సి డబ్ల్యు డి రోడ్డు నుండి వరంగల్ జిల్లా పరిధి వరకు వయా నంగునూరు అభివృద్ధి పరచుటకు కి.మీ 7/0 - 20/8 | 93.50 | పని పూర్తి అయినది |
| 2. | గజ్వేల్ చేగుంట రోడ్డు అభివృద్ధి పనులకు | 95.00 | బి.టి. 4.00 కి.మీ పూర్తి అయినది. మిగిలిన పని జరుగుచున్నది. |
| 3. | కొత్తపల్లి - చింతకుంట రోడ్డు అభివృద్ధి పరచుటకు కి.మీ 11/0 -22/0 | 95.00 | పి.టి. పని 11/2 నుండి పూర్తి అయినది. మిగిలిన పని జరుగుచున్నది. |
| | | 283.50 | |
| | | 284.60 | |
| | | **568.10** | |

## (4) పట్టణ పరిధిలో వెడల్పు చేయుటకు చేపట్టబడిన పనులు వివరములు (మొత్తము 8.50 కి.మీ పని పూర్తి అయినది)

| | | | |
|---|---|---|---|
| 1. | సంగారెడ్డి పట్టణములో సంగారెడ్డి - నాందేడ్ అకోలారోడ్డు కి.మీ 2/0 - 5/0 వరకు రోడ్డు వెడల్పు చేయుటకు మంజూరు అయిన మొత్తము | 86.30 | పని పూర్తి అయినది |
| 2. | నర్సాపూర్ పట్టణములో హైద్రాబాద్ - మెదక్ బోధన్ రోడ్డు కి.మీ 38/4 - 39/8 వరకు రోడ్డును 4 లైన్లకు వెడల్పు చేయుట | 44.60 | పని పూర్తి అయినది |
| 3. | నర్సాపూర్ పట్టణములో నర్సాపూర్ - తూప్రాన్ రోడ్డు కి.మీ 24/0-25/0 వరకు వెడల్పు చేయుట (డబుల్ రోడ్డుగా) | 9.80 | పని పూర్తి అయినది |
| 4. | సిద్దిపేట పట్టణములో మెదక్ సిద్దిపేట రోడ్డుకు కి.మీ 65/9 - 67/4 వరకు రోడ్డు 4 లైన్లకు వెడల్పు చేయుట | 30.00 | పని పూర్తి అయినది |
| 5. | హైద్రాబాద్ -కరీంనగర్ - చందానగర్ రోడ్డు కి.మీ 63/2 - 104/2 వరకు రోడ్డును 4 లైన్లకు వెడల్పు చేయబడినది | 20.00 | పని పూర్తి అయినది |
| | | 190.70 | |

# మెదకు జిల్లాలో రవాణా సౌకర్యము- ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థ

మెదకు జిల్లాలో అనాది కాలము నుండి అనేక రహదారులు ఉండెడివి.

పూర్వము ప్రయాణ సాధనములుగా మెదకు జిల్లాలో గుఱ్ఱము-ఎడ్లబండి - కచ్చరము ఎక్కువగా ఉపయోగించెడి వారు. ధనవంతులు పల్లకి - మేనా వంటి సాధనములు వాడు చుండిరి. నారాయణ ఖేడ్ ప్రాంతమున ఒంటెల పై ప్రయాణించుట కూడా నుండెడిది.

20వ శతాబ్ది ప్రారంభమున ఆంగ్లేయులు భారత దేశమున రైలుబండి (పొగబండి)ని ప్రారంభించిరి.

తేది 1-4-1943ల నాటి నుండి నిజాం ప్రభుత్వము రైలు మార్గములను స్వాధీన పరచుకొని నిజాం స్టేట్ రైల్వే బోర్డు నేర్పరిచి రైలు మార్గమున నిర్వాహణ బాధ్యతలను అప్పగించినది.

1951-52 లో నిజాం స్టేట్‌రైల్వే బోర్డు గ్రేట్ ఇండియన్ పెనిన్సులార్ రైల్వే లో విలీనమైనది.

మెదకు జిల్లాలో కేవలము రెండు రైలు మార్గములు కలవు. సికింద్రాబాద్ నుండి మన్మాడ్ మార్గము మెదకు జిల్లాలో నుండి వెడలుచున్నది. మనోహరాబాద్‌రైల్వే స్టేషన్ నుండి అక్కన్న పేట రైల్వే స్టేషన్ వరకు సుమారు 40 కి.మీ మాత్రము ఈ రైలు మార్గము మెదకు జిల్లా మధ్య నుండి పోవుచున్నది. పొటంచెరు నుండి సంగారెడ్డి -మెదకు - రామాయంపేట సిద్దిపేట ద్వారా రైలు మార్గమును నిర్మించుటకు సుమారు 10 సంవత్సరముల నుండి ప్రణాళికలు సిద్ధమగుచున్నవి. ఎన్నికల వాగ్దానముగా ఈ రైలు మార్గము పనికి వచ్చుచున్నది. కాని కార్యాచరణకు మాత్రము నేటికి పూనుకొన బడకున్నది.

నిజాం సాగార్ ఆనకట్ట నిర్మాణ సమయమున మన్మాడ్ రైలు మార్గము ద్వారా సరుకులను అక్కన్నపేట రైల్వే స్టేషన్‌లో దింపుకొని అక్కడి నుండి లారీల ద్వారా సరకు రవాణా గావించెడివారు. రెండవది కోహీర్, జహీరాబాదుల నుండి పర్లివైద్యనాధ్ వెళ్లుమార్గము.

మొత్తము మీద రైల్వే మార్గము మెదకునకు ఉపయోగకారి కాకున్నదని చెప్పవచ్చును.

మెదకు జిల్లాలో స్వాతంత్ర్యము రాక ముందు నిజాం పరిపాలనలో ప్రభుత్వ రవాణా సౌకర్యము గలదు. మొదట 18 మంది మాత్రము కూర్చొను వసతి గలిగిన డీజిల్ ఆయిల్‌తో నడపబడు బస్సులుండెడివి. నిజాం నవాబు భారత దేశమునకు స్వతంత్రము వచ్చిన తదుపరి కూడా తన సంస్థానమును విలీనము చేయక స్వతంత్ర రాజ్యముగానుండ

తలపట్టెను. ఆ సమయమున స్వతంత్ర భారత దేశము నుండి డీజిల్ మొదలగు నిత్యావర వస్తువులు నిజాం రాజ్యమునకు నిషేధింపబడెను. అందుచే బొగ్గు- నీరు తో నడుచు స్టీమ్ ఇంజనుబస్సులు నడపబడినవి.

జిల్లాలోని ముఖ్యపట్టణాలైన మెదకు, సంగారెడ్డి సిద్దిపేటలకు నేరుగా హైద్రాబాదు నుండి బస్సు సౌకర్యములు కల్పింపబడినవి. వేళ్లపై లెక్కించదగిన బస్సులు జిల్లాలో నడపబడుచుండెను.

జిల్లాలో మెదకులో మొట్టమొదట రోడ్డు రవాణా సంస్థ వారి బస్సు డిపో ప్రారంభమైనది. నేడు మెదకు జిల్లాలో 1. మెదకు, 2. సంగారెడ్డి, 3. సిద్దిపేట, 4. గజ్వేల్ - ప్రజ్ఞాపూర్ 5. జహీరాబాదు 6. నారాయణ్‌ఖేడ్, 7. దుబ్బాకలలో బస్సుడిపోలు నెలకొల్పబడినవి. ఇంకను నర్సాపూర్ మరియు రామాయంపేటలో బస్సు డిపోలునెల కొల్పుటకు శంఖుస్థాపనలు చేయబడినవి.

మెదకు జిల్లాలో మారుమూల గ్రామములకు కూడా బస్సుసౌకర్యము కల్పించబడినది జిల్లాలోనున్న 1265 గ్రామములలో 54 గ్రామములకు మాత్రము సరియగు రోడ్డు లేకుండుటచే రవాణా సౌకర్యము కల్పింపబడుట లేదు. తక్కిన గ్రామములన్నింటికి బస్సు సౌకర్యము కల్పింపబడినది.

మెదకు రీజన్ 10-11-1994లో సంగారెడ్డిలో కేంద్రముగా ఏర్పాటై పని చేయుచున్నది. మెదకు రీజను పరిధిలో మెదకు జిల్లాలోని మొత్తము డిపోలు వచ్చుచున్నవి.

మెదకు రీజను పరధిలో మొదకు జిల్లాలోని మొత్తము డిపోలు వచ్చుచున్నవి. మెదకు రీజను రోడ్డు రవాణా సంస్థ బస్సులు 1.78 లక్షల కిలో మీటర్ల పరిధిలో 272 మార్గములలో ప్రయాణించుచు 2.5 లక్షల ప్రయాణికులకు సేవల నందించుచున్నవి.

మెదకు జిల్లాలోని బస్సులు పల్లెలు, పట్టణాల ప్రజలందరకు తమసేవలందించుచు సుదూర ప్రాంతములకు ప్రయాణమగు ప్రజలకు కూడా ఉపయుక్తమగుచున్నవి. రాష్ట్రములనే కాక యితర రాష్ట్రములకు కూడా ఇచ్చట నుండి బస్సులు నడపబడుచున్నవి.

## బస్‌పాస్‌ల సౌకర్యాల కల్పన:

1. స్వాతంత్ర్య సమరయోధులకు ఉచిత బస్‌పాస్ సౌకర్యం
2. ప్రాంతీయ పత్రికా విలేఖరులకు ఉచిత బస్‌పాస్ సౌకర్యం - 210 మందికి
3. జిల్లా పత్రికా విలేఖరులకు ఉచిత బస్‌పాస్ సౌకర్యం - 67 మందికి
4. పత్రికా విలేఖరులకు కన్సెషనల్ బస్ పాసులు - 67 మందికి
5. వికలాంగులకు కన్సెషనల్ బస్‌పాసులు, సహాయతా కార్యక్రమము మరియు జన్మభూమి కార్యక్రమములో - 2543 మందికి
6. 12 సంవత్సరముల లోపు విద్యార్థినీ,

22. నంగునూర్

23. దుబ్బాక

24. పటాన్‌చెరు

మరియు మిర్‌దొడ్డి మండల కేంద్రంలో బస్ స్టేషన్ నిర్మాణ కార్యాక్రమాలు వేగవంతంగా కొనసాగుచున్నవి. నూతన ప్రయాణ ప్రాంగణం నిర్మాణానికి జోగిపేట మరియు రేగోడులలో స్థల సేకరణ జరిగినది. పైన పేర్కొనబడిన బస్ స్టేషన్లేకాక జిల్లాలో ప్రయాణీకుల సౌలభ్యం కొరకు అదనంగా 17 బస్ స్టేషన్లు మండల కేంద్రంలో నిర్మించడానికి చర్యలు చేపట్టనైనది. వివిధ మండల కేంద్రాల్లో నిర్మించనున్న 17 నూతన ప్రయాణ ప్రాంగణముల వివరములు :

| | |
|---|---|
| 1. చిన్నకోడూరు | 2. దౌల్తాబాద్ |
| 3. కొండపాక | 4. జగదేవ్‌పూర్ |
| 5. వర్గల్ | 6. రామచంద్రాపురం |
| 7. కొండాపూర్ | 8. కౌడిపల్లి |
| 9. శివ్వంపేట | 10. న్యాల్‌కల్ |
| 11. మనూర్ | 12. అల్లాదుర్గం |
| 13. పాపన్న పేట | 14. చిన్న శంకరంపేట |
| 15. కొల్చారం | 16. రేగోడ్ |
| 17. పుల్కల్ | |

అంతేకాక సుమారు 168 బస్ షెల్టర్ల నిర్మించనైనది మరియు పెక్కు బస్ షెల్టర్ల నిర్మాణంలో నున్నవి.

## వాహన సామర్థ్యం

ప్రస్తుతం మెదక్ రీజియన్ పరిధిలో నున్న డిపోలలో తేది 30.09.1999 నాటికి వివిధ రకాల వాహనాలు ఈ క్రింద పొందుపరచనైనది.

| క్ర.సంఖ్య | డిపో పేరు | షెడ్యూళ్లు | బస్సులు |
|---|---|---|---|
| 1. | మెదక్ | 74 | 83 |
| 2. | నారాయణ్‌ఖేడ్ | 55 | 59 |
| 3. | సంగారెడ్డి | 87 | 94 |
| 4. | సిద్దిపేట | 78 | 87 |
| 5. | జహీరాబాద్ | 73 | 83 |
| 6. | గజ్వేల్ - ప్రజ్ఞాపూర్ | 44 | 47 |
| 7. | దుబ్బాక | 33 | 37 |
| | **మొత్తము** | **442** | **491** |

## అంతర్ రాష్ట్ర బస్ సర్వీసులు

ప్రయాణీకులకు సౌకర్యార్థమై మెదక్ రీజియన్ ఈ క్రింద సూచించిన అంతరాష్ట్ర బస్ సర్వీసులను నడుపుచున్నది.

| | | | |
|---|---|---|---|
| 1. | సిద్దిపేట | - | గోండియా |
| 2. | సిద్దిపేట | - | ముంబాయి |
| 3. | సిద్దిపేట | - | షోలాపూర్ |
| 4. | మెదక్ | - | బీదర్ (వయా - డప్పూర్) |
| 5. | సంగారెడ్డి | - | దెగ్‌లూర్ (వయా - నిజాం సాగర్) |
| 6. | నారాయణ్‌ఖేడ్ | - | బీదర్ (వయా - డప్పూర్) |
| 7. | జహీరాబాద్ | - | బీదర్, - బీదర్ - హైదరాబాద్ |
| 8. | జహీరాబాద్ | - | చించోళి |
| 9. | జహీరాబాద్ | - | నిర్న |
| 10. | జహీరాబాద్ | - | మన్నెల్లి |
| 11. | జహీరాబాద్ | - | మన్నెక్కలి |
| 12. | జహీరాబాద్ | - | గుల్బర్గా - బీజాపూర్ |
| 13. | నారాయణ్‌ఖేడ్ | - | నాందేడ్ |

# ప్రాంతీయ రవాణా కార్యాలయము

## (రీజనల్ ట్రాన్స్‌పోర్టు ఆఫీసు)

మెదకు జిల్లాలో రీజనల్ ట్రాన్స్‌పోర్ట్ ఆఫీసర్ గారి కార్యాలయము జిల్లా ముఖ్యపట్టణమగు సంగారెడ్డిలో కలదు. ఈ కార్యాలయము అద్దె భవనమునందు కలదు.

మెదకు జిల్లా ప్రాంతీయ రవాణా అధికారి కార్యాలయమునందు ఒక ఆర్.టి.ఏ, ఇద్దరు సూపరింటెండంట్లు, ఐదుగురు సీనియర్ అసిస్టెంట్లు.

4. జూనియర్ అసిస్టెంట్లు

2. టైపిస్టులు

1 రికార్డు అసిస్టంటు

1 వాచ్‌మెన్ పని చేయుచున్నారు.

అట్లే ఎక్స్‌క్యూటివ్ స్టాఫ్‌లో ఆరుగురు మోటర్ వెహికల్ ఇన్స్‌పెక్టర్లు 10 మంది అసిస్టెంటు మోటర్ వెహికల్ ఇన్స్‌పెక్టర్లు, 6గురు ట్రాన్స్‌పోర్టు కానిస్టేబుళ్లు పని చేయుచున్నారు.

ఇందులో జహీరాబాద్ చెక్‌పోస్టు డ్యూటీలో ఒక మోటర్ వైహికల్ ఇన్స్‌పెక్టర్ 9 మంది అసిస్టెంట్లు పని చేయుదురు.

మెదకు లో స్థానికముగా ఒక మోటర్ వెహికల్ ఇన్స్‌పెక్టర్ పని చేయుచున్నారు.

సిద్ధిపేటలో ఒక ఆర్.టి.ఏ. యూనిట్ ఆఫీసు కలదు. ఈ యూనిట్ ఆఫీసునందు.

1. ఆర్.టి.ఏ.

1. మోటరు వెహికలల్ ఇన్స్‌పెక్టర్,

1. అసిస్టెంటు మోటర్ వైహికల్ ఇన్స్‌పెక్టర్,

1. సీనియర్ అసిస్టెంటు పని చేయుచున్నారు.

రోడ్డు ట్రాన్స్‌పోర్టు అధికారులు రోడ్డు పై సంచరించు వాహనములను పరీక్షించి లైసెన్సులనిత్తురు.

వాహన చోదకులకు కూడా తగు పరీక్షలతో డ్రైవింగ్ లైసెన్సులను మంజూరి చేయుదురు. లైసెన్స్‌లేని వాహనములను, వాహన చోదుకులను గుర్తించి పెనాల్టీ రుసుములను వసూలు చేయుదురు.

రోడ్డు ప్రమాదములు జరిగిన సందర్భములలో వైహికల్ ఇన్స్‌పెక్టరు ఆ ప్రమాదములు జరిగిన కారణములను పరీక్షింతురు.

మెదకు జిల్లాలో 31-12-98 నాటికి వాహనములు.

| | |
|---|---|
| 1. స్టేజి క్యారేజీలు (A.P.S.R.T.C. ) | 493 |
| 2. స్టేజి ప్రైవేటు | 14 |
| 3. ట్రాక్టర్స్ - ట్రైలర్స్ | 3622 |

4. గూడ్స్ వైహికల్స్ 1559

5. కాంట్రాక్ట్ క్యారేజీ 14

6. టాక్సీ కార్లు 228

7. ఆటోరిక్షాలు 958

8. ప్రైవేట్ సర్వీస్ వైహీకల్స్ 52

9. స్కూల్ బస్సులు 22

10. రిగ్గులు 12

11. ఓమ్నీ బస్సులు 418

12. కార్లు 1082

13. జీపులు 631

14. 60 సిసి ల టూవీలర్‌లు 6857

15. 60 సిసి ల పై శక్తి గల టూవీలర్ 26748

| మెదకు జిల్లాలో రోడ్డు ట్రాన్స్‌పోర్టు కార్యాలయము ద్వారా ప్రభుత్వ ఆదాయము కోట్ల రూపాయలు | సంవత్సరము | ప్రభుత్వ | లభ్యము | శాతము |
|---|---|---|---|---|
| 1. | 1991-92 | 3.89 | 3.93 | 102.26% |
| 2. | 1992-93 | 4-43 | 3.90 | 89.97% |
| 3. | 1993-94 | 6.16 | 5.75 | 94.17% |
| 4. | 1994-95 | 7.24 | 5.99 | 86.44% |
| 5. | 1995-96 | 7-93 | 3.36 | 43.44% |
| 6. | 1996-97 | 4-33 | 4.85 | 112.13% |
| 7. | 1997-98 | 5-34 | 5.14 | 96.32% |
| 8. | 1998-99 | 6-23 | 6.29 | 101.05% |

| జహీరాబాద్ చెక్‌పోస్టు ద్వారా లభించు ఆదాయము రుసుము. | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | **1992-93** | 9,54,855 | 3181759 | 153000 | 4289614 |
| 2. | **1993-94** | 24,67,155 | 4278579 | 199500 | 6945234 |
| 3. | **1994-95** | 22,41,462 | 6096160 | 241550 | 8579172 |
| 4. | **1995-96** | 20,34,400 | 630339 | 135500 | 2802289 |
| 5. | **1996-97** | 42,09,115 | 8257351 | 323900 | 12890366 |
| 6. | **1997-98** | 33,96,404 | 9463104 | 950400 | 13119908 |
| 7. | **1998-99** | 56,52,105 | 14888341 | 642850 | 20506604 |

# అటవీ శాఖ

మెదకు జిల్లాలో మొత్తం భూభాగం 9575-30 చ.కి.మీ. 1945 సంవత్సరం కన్న ముందు మెగకు జిల్లాలో చాలా అడవులున్నాయి. ఇప్పటికీ అక్కడక్కడ ముస్లింరాజులు వేటకైవచ్చినప్పుడు విశ్రాంతికై నిర్మించుకొన్న బంగళాలు జీర్ణావస్థలో కనుపించు చున్నవి. అంతేకాక వయోవృద్ధుల మాటల్లో కూడా తమతమ ప్రాంతాల్లో అడవులు విస్తారంగా ఉన్నట్లు చెప్పబడుచున్నవి. కుక్నూరు మొదలగు నేటి ఆవాసిత ప్రాంతాలు ఒకనాడు కీకారణ్యాలుగా ఉండేవని, నిజాంనవాబులు అక్కడికి వేటకై వచ్చేవాళ్లని ఆనవాళ్లు చెపుతున్నవి. ఎన్నోనేటి జనారణ్యాలు ఒకనాడు వన్యమృగ నివాస కీకారణ్యాలు.

మానవుని నిత్యజీవన అవసరాలకు, వ్యవసాయంపెంపుదలకు, కొంత స్వార్థానికి అడవులు బలియైనవని చెప్పక తప్పదు.

ఈ రోజు మెదకు జిల్లాలో అడవుల విస్తీర్ణం 924-79 చ.కి. సెంట్రల్‌బోర్డు ఫారెస్టు వారి నిర్ణయం ప్రకారం 33% అడవులక్రింద ఉండవలసియుండగా 9.6% మాత్రమే అడవులున్నాయి.

అడవి ప్రాంతమంతా గుట్టలతో మిట్ట పల్లాలతో నిండియుంది. జిల్లాలో గుమ్మడిదల ప్రాంతమునుండి మెదకు - నర్సాపూర్ రోడ్డు కిరువైపుల దట్టమైన అడవి ఉన్నది. ఈ అడవి గుండా నర్సపూర్ తూప్రాన్ రోడ్డు కూడా వెళ్లు చున్నది. ఈ అడవి కౌడిపల్లి మండలంలో కూడా వ్యాపించి కౌడిపల్లి - కొల్చారం మధ్యప్రదేశంలో రోడ్డు కిరువైపుల వ్యాపించియున్నది. బొంతపల్లి - జిన్నారం గ్రామాల మధ్యకూడా అడవి బాగానే ఉన్నది. సిద్దిపేట నుండి కరీంనగర్ రోడ్డు మార్గంలో రోడ్డుకిరువైపుల దట్టమైన అడవీ ప్రాంతం ఉంది. జిల్లా సరిహద్దు గ్రామమైన అనంతసాగర్ సరస్వతీ దేవాలయ ప్రాంతంలో ఎత్తైన గుట్టలతో అడవీ ప్రాంతం అధికంగానే ఉంది. మెదకు నుండి అక్కన్నపేట రోడ్డుకిరువైపుల సర్ధన ప్రాంతంలో కూడదట్టమైన అడవులున్నాయి. ఏడుపాయల దుర్గభవాని ప్రాంతమంతా అడవీ ప్రదేశమే. ఏమైనా జిల్లాలో పశ్చిమభాగాన అటవీ ప్రాంతమసలే లేదని చెప్పవచ్చు.

ఈ అడవులలో నానాజాతికి చెందిన, సహజవాతావరణానికి చెందిన ప్రకృతిసిద్ధమైన చెట్లు గలవు. ఈ అడవులు ఆకురాలు అడవిజాతికి చెందినవి. ఈ అడవులలో అందుగు - అడ్డసరము ఇప్ప- అడ్డాకు - పొన్న - ఏపి - చింత - చిన్నంగి - సిరిమెన - తుమ్మ - టేకు - నల్లమద్ది - తెల్లమద్ది - నేరెడు - బూరుగు - బులుసు - మోదుగ - రేగి - వేప - సరుగుడు - ఉసిరి - కానుగు - సీసము - మజ్జి - మామిడి - రాగి - మేడి - మొదలైన ఎన్నోరకాల చెట్లు ఉన్నాయి.

వీటిలో కొన్ని ఫలవృక్షాలు కూడా గలవు. ఇవిగాక

తంగేడు - జాజి- వావిలి మొదలగు పొదలు కూడాయుండును. చెట్లపై ఎన్నో రకరకాల తీగలు పారుచుండును.

నిజాం రాష్ట్రమునందున్న అడవులు 1867 వరకు రెవెన్యూశాఖ అధిపత్యమందుండెను. అటవీశాఖ ఏర్పాటుగావించినను తగిన సాంకేతిక సిబ్బంది లేకుండెను. అందుచే ఈ శాఖ నామమాత్రముగా నుండెడిది.

1894 లో రిజర్వు అడవులనేర్పాటు చేసినారు క్రీ.శ. 1914 లో అటవీ ప్రాంత సర్వే ప్రారంభమైనది. భారత సర్వేశాఖ డెహ్రాడూన్‌లో అడవీ పర్యవేక్షణ - శిక్షణ విభాగము ప్రారంభమైనది. రిజర్వు కాని అటవీ ప్రాంతము రెవెన్యూవారి ఆధీనమందుండెడిది. క్రీ.శ. 1958 సం॥ లో రిజర్వుకాని అడవీ ప్రాంతమును గూడా అటవీశాఖకు అప్పగించబడెను.

ప్రభుత్వము పెరుగుతున్న జనాభాకనుగుణముగా అడవీ భూములను వ్యవసాయమునకై రైతులకు ఈయబడినవి. నేటికి మెదకు జిల్లాలో ఎన్నో. హెక్టారుల అటవీభూమి వ్యవసాయ భూమిగా మార్చబడినది. కొందరు రైతులు, భూమి లేని వారు అడవులను కొట్టి ఆప్రాంతమును వ్యవసాయ యోగ్యమగు భూమిగా మార్చినారు.

ఐనప్పటికి ప్రభత్వము అడవీ అభివృద్ధికై శ్రమచేయుచునేయ్యునది. II వ పంచ వర్ష ప్రణాళికలో (1956-61) అనేక రకాల చెట్లు మరియు సున్నితమైన కఱ్ఱగల (Soft wood) జాతుల చెట్లు 2,052 హెక్టార్ల భూమిలో వృద్ధి చేయబడ్డాయి దీనికి రూ. 1,34,553-00 ఉవెచ్చించ బడ్డాయి. III వ పంచవర్ష ప్రణాళికలో (1961-66) టేకు, నీలగిరి మరియు ఇతర జాతుల మొక్కలు 226 హెక్టార్ల భూమి లో నాటబడినవి. ఇందుకు రూ. 42,901-00 ఖర్చుచేయబడినవి. IV వ.పం చవర్షప్రణాళికా కాలంలో (1966-71) 1,257 హెక్టర్ల భూమిలో 79,719-00 రూ. లతో అడవుల పెంపకం చేపట్టబడింది. V వ పంచవర్షప్రణాళకా కాలంలో (1971-76) 314 హెక్టార్లు రూ. 55,977-00 వ్యయంతో అడవుల అభివృద్ధిగావించబడినది.

క్రీ.శ. 1976 నుండి సంశ్లిష్టపు మొక్కలునాటే కార్యక్రమం ఆరంభమయ్యింది. 1966-67 నుండి 1975-76 వరకు 129 బ్లాకులు ఆంధ్ర ప్రదేశ్ అటవీ చట్టము (sec)15 క్రింద గుర్తించబడినావి. వీటి విస్తీర్ణం 577-811 చ.కి.మీ. 79 బ్లాకులు 859 -014 చ.కి.మీ.అటవీ చట్టం(sec)4 కింద గుర్తించ బడ్డాయి. 10 బ్లాకులు 6వ చట్టం కింద 44-246 చ.కి.మీ. విస్తీర్ణంతో గుర్తంచడం జరిగింది.

అడవులపై ఆధార పడియున్న పరిశ్రమలకు ప్రాముఖ్యతనిస్తు కాగితపు పరిశ్రమ, బీడీ పరిశ్రమలకు కావలసిన ముడి సరుకులు ఉత్పత్తి చేయుటకు అభివృద్ధి కార్యక్రమాలు చురుకుగా సాగుచున్నాయి ములుగు తదితర ప్రాంతాలలో 500 ఎకరాలలో నీలగిరి చెట్లు నాటబడినాయి.

బీడీ పరిశ్రమ కుటీర పరిశ్రమగా రూపొంది స్త్రీలకు, బడుగు వర్గాల వారికి ఆర్థికంగా ఎంతో చేయూతనిస్తున్నది.

ఇంతవరకు బీడీ ఆకు (తునికి ఆకు) ప్రోగు చేయు పనిని ప్రైవేటు సంస్థలకు ప్రభుత్వం అప్పజెప్పేది. 1971 నుండి ఈ కార్యక్రమాన్ని ప్రభుత్వమే స్వయంగా చేపట్టింది. తద్వారా ప్రభుత్వాదాయం పెరుగుటంతో పాటు కొంతమందికి ఉద్యోగావకాశాలు పెరిగినవి. ప్రభుత్వం ఈ కార్యక్రమం చేపట్టడంతో వేసవికాలంలో 50 రోజుల పాటు సుమారు 6000ల మందికి ఉపాధిలభిస్తున్నది. గ్రామాల్లో ఉండే కూలీలు అటవీ సంబంధ ఉత్పత్తులపై జీవనోపాధి గడుపుతారు. జిగురు - సారసలుకులు - వెలగపండ్లు - జీడి పండ్లు - రేగుపండ్లు - సీతాఫలములు - ఉసిరికాయలు మొదలగునవి అడవుల నుండి సేకరించి అమ్ముకొని జీవించే కుటుంబాలు గ్రామాల్లో ఎన్నో ఉంటాయి.

మెదకు జిల్లా రాష్ట్రరాజధానికి సమీపంగా నుండడం వల్ల మేలురకపు గడ్డి జాతిని నర్సాపూర్ ప్రాంతంలో 60 ఎకరాలు, నర్సపూర్ రేంజిలోని నారాయణపూర్ లో 60 ఎకరాలు, ఎల్లాపూర్‌లో 50 ఎకరాలు ఇంకా ఇతర ప్రదేశాలలో సుమారు 100 ఎకరాలు పెంచబడి హైద్రబాదుకు దాని సమీపంలో గల పట్టణ పాడి పశువుల కేంద్రాలకు సరఫరా యగుచున్నది.

అటవీ బ్లాకు లింగంపల్లిలో 28,500 ఎకరాల విస్తీర్ణంతో పోచారంలో వన్యమృగ సంరక్షణ కేంద్రముగలదు. ఇది పాక్షికంగా 2,600 ఎకరాలు నిజామాబాదు జిల్లాలోని భూతపూర్ అటవీ బ్లాకులో గలదు. ఈ ప్రదేశం వన్యమృగ పోషణ మరియు అభివృద్ధికై ఏర్పడింది వన్యమృగాలను వేటాడడం చట్టరీత్యా నిషేధింపబడింది. ఈ అభయారణ్యంలో నానా జాతి పక్షులు నెమళ్లు, జింకలు - సాంబారు మృగాలు - అటవీకోళ్లు - చిరుతపులులు - కనబడతాయి. ఈ వన్యమృగసంరక్షణ కేంద్రంలో అన్ని విధాల జంతువులకు ప్రత్యేకరక్షణ ఈయబడుతున్నది. ఈ అడవి పూర్వస్థితికి రాగలదని ఆశించబడుతున్నది.

మెదకు జిల్లాలోని అడవులలో కోళ్లు - కవుజులు - పాలపిట్టలు - పిచ్చుకలు - నెమళ్లు - చిలుకలు - పావురములు - మైనా - తీయవు పిట్టలు - గ్రద్దలు - కాకులు విశేషంగా నున్నవి.

ప్రాచీనకాలంలో మెదకు జిల్లాలో పెద్ద అడవులే ఉండేవి. అప్పట్లో క్రూరమృగాలైన చిరుతపులు - జిట్టపులులు - పెద్దపులులు తోడేళ్లు బాగానే ఉండేవి. కాలక్రమంలో అటవీసంపద తరగడం - వేటగాండ్రు వేటాడడం మొదలైన కారణాలచే ఈ నాడున్న అడవుల్లో క్రూరమృగాల సంఖ్య చాలాతగ్గింది. ఇప్పడు అక్కడక్కడా చిరుతపులులు - తోడేళ్లు - అడవిపందులు - గుంటనక్కలు నివసిస్తున్నాయి.

## ఉమ్మడి అటవీ యాజమాన్య పథకం

మెదక్ జిల్లాలో అటవీ శాఖ 1993-94 ఆర్థిక సంవత్సరం నుండి ఉమ్మడి అటవీ యాజమాన్య పథకాన్ని ప్రారంభించింది. ఈ పథకంలో భాగంగా వన సంరక్షణ సమితులను ప్రారంభించి అందులో ప్రజలను కూడా భాగస్వాములుగా చేర్చారు. ఈ సమితులను 2000-2001 సంవత్సరముల వరకు దశలవారిగా విస్తరిస్తూ అడవులను అభివృద్ధి పరుస్తున్నారు. జహీరాబాద్ రేంజ్ పరిధిలో 13 వనసంరక్షణ సమితులు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ ఒక్కొక్క సమితిలో సగటున 150 నుండి 200 వరకూ సభ్యులు ఉంటారు.

ఈ జిల్లాలో విస్తరించి ఉన్న అటవీ ప్రాంతం కొంత జహీరాబాద్, కోహీర్, ఝరాసంగం, న్యాల్‌కల్, హత్నూర మండలాలలో ఉంది. పై మండలాలలోని గ్రామ ప్రాంతాలయిన గొటిరాట్‌పల్లిలో 1062 హెక్టార్ల భూమి, దిడిగిలో 426, పర్శపల్లిలో 350, తహాంకుంటలో 271, బడంపేటలో 129, బాడెకన్నెలో 801, గణేశ్‌పూర్‌లో 57, ఏడియాల్ తండాలో 688 హెక్టార్ల భూములు ఉన్నాయి.

ఈ అటవీ ప్రాంతాల్లోని ప్రతి అడవిలో 50 హెక్టార్ల చొప్పున ఉపాధి హామీ పథకం క్రింద మరియు ఇతర సంస్థల ఆర్థిక సహాయంతో వనసంరక్షణ సమితులు అభివృద్ధి పరిచేందుకు కృషి చేస్తున్నాయి.

## వనసంరక్షణ సమితులు

మెదక్ జిల్లాలో 961.10 చ.కి.మీ. విస్తీర్ణంలో అడవులు ఉన్నాయి. ఈ అటవీ అభివృద్ధి పనులకై ఉమ్మడి అటవీ యాజమాన్య పథకంలో భాగంగా 1995న సంవత్సరంలో వన సంరక్షణ సమితులు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ పథకం ద్వారా అటవీ ప్రాంతాలను ఐదు సంవత్సరాల పాటు దశల వారీగా అభివృద్ధి పరచాలని నిర్ణయించారు.

ఈ జిల్లాలో మొట్టమొదట 48 వన సంరక్షణ సమితులు ఏర్పడ్డాయి. వీటి సంఖ్య నేటికి 226గా విస్తరింపబడ్డాయి. ఈ పథకం కర్తవ్య నిర్వహణలో భాగంగా వర్గల్ మండల పరిధిలోని సింగాయిపల్లి, జగదేవ్‌పూర్ మండల పరిధిలోని దవళాపూర్ గ్రామాల్లో వనసంరక్షణ సమితులు ఏర్పాటయి ఆయా ప్రాంతాల్లో అడవుల పెంపకం పనులు చేపట్టాయి. సింగాయిపల్లి అటవీ ప్రాంతం అభివృద్ధికై "సరస్వతీ వనసంరక్షణ సమితి" ఏర్పాటైనది. 1998 కల్లా 187.5 ఎకరాల విస్తీర్ణంలో అటవీ క్షేత్రాన్ని చేయాలనేది ఈ సమితి లక్ష్యం.

ఈ సంస్థలు అటవీ క్షేత్ర అభివృద్ధికై మరిన్ని చెట్లు పెంచడం, చెట్లు ఏపుగా పెరిగేందుకు మొక్క మొదటి భాగంలో కొమ్మల్ని నరికివేయడం, భూసారాన్ని పెంచుటకయి ట్రెంచ్ కటింగ్, గల్లీ ప్లగింగ్, బౌండరీ చుట్టూ గెటార్ కాలువ నిర్మాణం మొదలయిన ఎన్నో రకాల పనులను నిర్వహిస్తున్నాయి.

2000 సంవత్సరం నాటికి 300 హెక్టార్లలో అడవిని అభివృద్ధి పరచాలని ఈ సంస్థల లక్ష్యం.

## ములుగు ఫారెస్ట్ రీసెర్చ్ సెంటర్

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పరిశోధన సెంటర్లలోనే ప్రత్యేకమయినదిగా ఖ్యాతి గడించిన ములుగు ఫారెస్ట్ రీసెర్చ్ సెంటర్ మెదక్ జిల్లాలో ఉంది.

హైదరాబాద్ నగరానికి 40 కిలోమీటర్ల దూరంలో రాజీవ్ రహదారిపై ములుగు వద్ద ఉన్న ఈ పరిశోధనా కేంద్రం శాఖీయ ప్రత్యుత్పత్తి ద్వారా తల్లి చెట్టులోని ఉత్తమ లక్షణాలన్ని మొక్కకు సంక్రమించేలా శాస్త్రీయ పరిశోధనతో రైతులకు నర్సరీలకు సేవలందిస్తోంది.

ఈ సంస్థ వివిధ రాష్ట్రాలలోని మేలుజాతి చెట్లపై పరిశోధన జరిపి శాస్త్రీయ పద్ధతుల ద్వారా వేలాది మొక్కలను సృష్టించి ఇతర రాష్ట్రాల నర్సరీలకు, రైతులకు ఉచితంగా సరఫరా చేస్తోంది. ఈ కేంద్రంలో పండ్లతోటలు, అడవి చెట్ల జాతులు అనేకరకాలు అందుబాటులో ఉన్నాయి.

ఈ కేంద్రంలో గ్రాఫ్టింగ్, లీఫ్ కటింగ్ మొదలగు పద్ధతులుండగా గ్రాఫ్టింగ్ పద్ధతిలో సాఫ్ట్ వుడ్ గ్రాఫ్టింగ్ అప్రోచ్ గ్రాఫ్టింగ్ పద్ధతుల ద్వారా మొక్కలను ఉత్పత్తి చేస్తున్నారు. సాఫ్ట్‌వుడ్ గ్రాఫ్టింగ్ ద్వారా ఉసిరి, నేరేడు, సీతాఫలం రకాలనుత్పత్తి చేయగా లీఫ్ కటింగ్స్ పద్ధతి ద్వారా యూకలిప్టస్ మొదలగు రకాలను, బడ్ గ్రాఫ్టింగ్ పద్ధతి ద్వారా టేకు రోజ్‌వుడ్ రకాలను ఉత్పత్తి చేస్తున్నారు.

మొక్కలను నాటి 18 నెలల తర్వాత భూమి నుండి 12 సెం.మీ.పైకి నరికి వేస్తారు. ఈ విధంగా నరికివేసిన చెట్టు మొదలు నుండి 45 రోజుల్లో రెమ్మలు వస్తాయి. వీటిని మొక్కనుంచి వేరు చేసి రెండు ఆకులు ఉండేట్లు లీఫ్ కటింగ్ చేసి రూట్ హార్మోన్‌ను ఉపయోగించి రూట్ ట్రైనర్‌లో పెట్టి మిస్ట్ ఛాంబర్‌లో 45 రోజుల పాటు ఉంచుతారు. ఈ సమయంలో ఉష్ణోగ్రత 38 నుంచి 40 డిగ్రీలకు మించకుండా కూలర్స్ ద్వారా జాగ్రత్త పడతారు. అలాగే ఛాంబర్లో తేమకై నీటి తుంపర్లు కురిసే ఏర్పాటు ఉంటుంది. 45 రోజుల తర్వాత రెమ్మలకు వేర్లు రాగానే తీసి ఎండను నిరోధిస్తూ పది రోజుల పాటు ఆగ్రోనెట్ నీడలో ఉంచుతారు. మొక్క పూర్తిగా శక్తి సంతరించుకున్న తర్వాత బయట భద్రపరిచి అవసరమున్న చోట నాటడం కానీ సరఫరా చేయడం గానీ చేస్తారు.

# జిల్లాలోని అడవుల డివిజన్ జాబితా

| | | |
|---|---|---|
| 1. | జియోగ్రాఫికల్ ఏరియా | 9,69,900 హెక్టార్లు |
| 2. | అడవులు | 96,279.91 హె. |
| 3. | వన్య ప్రాణుల డివిజన్ | 5,600.95 హె. |
| 4. | మెదక్ టెరిటోరియల్ అడవులు డివిజన్ | 90,678.96 హె. |
| 5. | జె.ఎఫ్.ఎమ్. కొరకు అడవులు | 65,000.00 హె. |
| 6. | జె.ఎఫ్.ఎమ్.లో చేరినవి 20-1-999 | 59,376.00 హె. |
| 7. | వి.ఎస్.ఎస్.ల సంఖ్య, | 226 |

8. మొత్తము వి.ఎస్.ఎస్. (వన సంరక్షణ సమితి) మెంబర్లు

| | | | |
|---|---|---|---|
| ఎ) | పురుషుల | | 29,095 |
| బి) | స్త్రీలు | | 26,045 |
| | మొత్తం | | 55,140 |
| బి) | ఎస్.సి.లు | 14,228 | |
| | ఎస్.టి.లు | 9,060 | |
| | ఇతరులు | 31,852 | |
| | **మొత్తం** | **55,140** | |

9. జాయింట్ ఫారెస్ట్ మానేజ్‌మెంట్ (జె.ఎఫ్.ఎమ్.) పై చేసిన ఖర్చు :

| సంవత్సరము | ఎ.పి.ఎఫ్.పి. | ఇ.ఎ.ఎస్. | మొత్తం |
|---|---|---|---|
| 1993-94 | 2.270 | - | 2,270 లక్షలు |
| 1994-95 | 9.309 | - | 9.309 ,, |
| 1995-96 | 30.682 | 5.000 | 35.682 ,, |
| 1996-97 | 117.370 | 11.002 | 128.372 ,, |
| 1997-98 | 49.813 | 12.002 | 62.787 ,, |
| 1998-99 (2/99) | 73.909 | 28.956 | 102.865 ,, |

# విద్యుత్ రంగం

తెలంగాణా ప్రాంతంలోని మెదకు జిల్లా యితర జిల్లాలకంటే కొన్ని కొన్ని విషయాలలో వెనుకబడివున్నప్పటికీ, వ్యవసాయరంగంలోనూ, పారిశ్రామిక రంగంలోనూ ముందంజలోనే వుందని చెప్పవచ్చు. ఈ జిల్లాలో వ్యవసాయమే జీవనాధారం అయినా, పారిశ్రామిక రంగంలో మాత్రం రాష్ట్రంలోను పారిశ్రామికాభివృద్ధి గల జిల్లాలలో ఒకటిగా మెదకుజిల్లా గణనీయమైన అభివృద్ధి సాధించింది. మెదక్ జిల్లాలో ప్రకృతి సహజ సిద్ధమైన పెద్ద పెద్ద నీటి వనరులు, పెద్ద ప్రాజెక్టులు లేక పోవుటచే వ్యవసాయబావులు విద్యుదీకరణ ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకుంది.

1956వ సంవత్సరంలో మెదకు జిల్లాలోని సంగారెడ్డి, మెదక్, సిద్దిపేట పట్టణాలకు డీజిల్ ఆయిల్‌తో నడిచే విద్యుదుత్పాదక యంత్రాల ద్వారా విద్యుత్ సరఫరా చేయడం జరిగింది. 1958వ సంవత్సరం నుండి నిజాంసాగర్ జలవిద్యుత్ కేంద్రం నుండి దాని సమీపంలోని నిజాంపేట, నారాయణఖేడ్, పెద్దశంకరంపేట, గడిపెద్దాపూర్ గ్రామాలకు విద్యుత్ సరఫరా జరిగింది. క్రమేణా 1960వ సంవత్సరం నుండి జిల్లాలోని అన్ని తాలూకా (పాత) కేంద్రాలకు విద్యుత్ సరఫరా మొదలైంది.

1962వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుత్ సంస్థ (ఎ.పి.ఎస్.ఇ.బి) ప్రారంభమై మెదక్ జిల్లాలో 33/11 కె.వి. విద్యుత్ ఉపకేంద్రములను (సబ్-స్టేషన్) సంగారెడ్డిలోనూ (28-3-64) రామాయంపేటలోనూ (30-3-66), గౌరారంలోనూ (30-3-70) నెలకొల్పింది.

1969వ సంవత్సరంలో "తెలంగాణా ప్రాంతీయ కమిటీ" (Telengana Regional Committee) నెలకొల్పబడి, కమిటీ నిధులతో (TRC Funds) జిల్లాలోని గ్రామాల విద్యుదీకరణ ప్రారంభమైంది.

ఆ తరువాత 1970-71వ సంవత్సరంలో కేంద్రప్రభుత్వ సంస్థఅయిన "గ్రామీణ విద్యుదీకరణ సంస్థ" (Rural Electrification Corporation) నెలకొల్పబడి, భారతదేశంలోని అన్ని రాష్ట్రవిద్యుత్ సంస్థలకు, గ్రామాల విద్యుదీకరణకై నిధులను ఋణ ప్రాతిపదికపై మంజూరు చేయడం ప్రారంభం అయింది. ఆ సంస్థ విడుదల చేసే నిధులతో నూటికి నూరుశాతం గ్రామీణ విద్యుదీకరణ పూర్తయి, వ్యవసాయ పంపుసెట్ల విద్యుదీకరణ నిర్విరామంగా జరుగుతూనే వుంది. 1973వ సంవత్సరంలో నుండి ప్రతిసంవత్సరం ఒక్కొక్క జిల్లాకు 7,8 కోట్ల రూపాయల నిధులు సమకూర్చుతూనే వుంది.

మెదకు జిల్లాలో 1965 నాటికి 12 శాతం పూర్తయిన గ్రామాల విద్యుదీకరణ 1980 నాటికి నూరుశాతం విద్యుదీకరణ పూర్తయింది. 1985 నాటికి అన్ని కుగ్రామాల (Hamlets) విద్యుదీకరణ కూడా పూర్తయింది. ప్రతి సంవత్సరం రాష్ట్రప్రభుత్వంచే విడుదల చేయబడే ప్రణాళికా నిధులతో (Plan funds), జిల్లాలోని దళిత వాడలను, బలహీన వర్గ గృహసముదాయాలను, దళితులకు వ్యవసాయ పంపుసెట్ల సర్వీసులు, ఇతరములైన సర్వీసులు విద్యుదీకరింపబడుచున్నాయి.

గడచిన సుమారు పదిసంవత్సరాల కాల వ్యవధిలో జిల్లాలోని విద్యుత్‌రంగ ప్రగతిని ఈ క్రింద నుదహరించిన పట్టికల ద్వారా తెలుసుకోవచ్చు.

| వివరములు | 1990మార్చి నాటికి | 99 మార్చి నాటికి |
|---|---|---|
| 1. గృహ సర్వీసులు | 126115 | 197477 |
| 2. వాణిజ్య సర్వీసులు | 11273 | 16203 |
| 3. చిన్న తరహా పరిశ్రామిక సర్వీసులు | 4303 | 6489 |
| 4. కుటీర పరిశ్రమల సర్వీసులు | 167 | 335 |
| 5. వ్యవసాయ పంపుసెట్ల సర్వీసులు | 77159 | 123420 |
| 6. వీధి దీపముల సర్వీసులు | 1549 | 1677 |
| 7. జనరల్ సర్వీసులు దేవాలయాలు, మసీదులు వగైరాలు) | 1189 | 1362 |
| 8. భారీ పరిశ్రమలు | 361 | 605 |
| **మొత్తం** | **22116** | **347570** |

| వివరములు | 1990మార్చి నాటికి | 99 మార్చి నాటికి |
|---|---|---|
| 1. 220 కె.వి.సబ్‌స్టేషన్లు | 1 | 2 |
| 2. 132 కె.వి.సబ్‌స్టేషన్లు | 7 | 16 |
| 3. 33 కె.వి.సబ్‌స్టేషన్లు | 35 | 108 |

మొత్తం 126 సబ్‌స్టేషనుల నుండి జిల్లాలోని అన్ని ప్రాంతాలకు విద్యుత్ సరఫరా జరుగుతోంది.

ప్రకృతి సహజ సిద్ధమైన నీటి వనరుల కొరతచేత వ్యవసాయదారులకు గొట్టపుబావుల (Bore wells) ఆవశ్యకత మెండై అంతకంతకు అభివృద్ధి చెందటం మొదలైంది ఆసంఖ్యాకంగా మొదలైన గొట్టపుబావుల విద్యుదీకరణకై వివిధ రకాలైన అవరోధాలు - పాలనాపరంగా గాని, నిధులలేమి వల్లగాని సంకేతికంగా గాని ఏర్పడటంవలన గొట్టపుబావుల విద్యుదీకరణకై అనధికారంగా విద్యుత్ సరఫరా పొందటం, విద్యుత్ చౌర్యం మొదలైంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుత్ సంస్థ అనధికార సర్వీసులను రూపుమాపటానికి విద్యుత్ చౌర్యాన్ని అరికట్టడానికి తగిన చర్యలు తీసుకొని జిల్లాల్లో సుమారు 10 వేల అనధికార వ్యవసాయ పంపుసెట్లను క్రమబద్ధీకరణ కార్యక్రమం క్రింద సుమారు రెండు కోట్ల ఎనభై లక్షల రూపాయలు అపరాధ రుసుం క్రింద వసూలు చేసింది.

1999 వ సంవత్సరం ఫిబ్రవరిలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుత్ సంస్థలో విద్యుత్ సంస్కరణలు ప్రవేశ పెట్టబడి రాష్ట్ర విద్యుత్ సంస్థను (1) ట్రాన్స్‌మిషన్ **కార్పొరేషన్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ లిమిటెడ్**గా **(2) జనరేషన్ కార్పొరేషన్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ లిమిటెడ్**గా విభజించబడి, వివిధ సంస్కరణలను ప్రవేశపరిచి ప్రపంచ బ్యాంకు నిధులతో, విద్యుత్ పంపిణీ వ్యవస్థను విద్యుదుత్పత్తిని పటిష్టపరచటానికి సకల ప్రయత్నాలు చేస్తోంది.

విద్యుచ్ఛక్తి ఉత్పాదనలోనూ, పంపిణీలోనూ రాష్ట్రంలో స్వయం సమృద్ధి సాధించే లక్ష్యం దిశగా పయనించేందుకు ప్రభుత్వం అనేక చర్యలు చేపడుతుంది.

1985వ సంవత్సరం నాటికి మెదక్ జిల్లాలోగల అన్ని గ్రామాల మదిర (కు గ్రామము) ల విద్యుదీకరణ నూటికి నూరు శాతం పూర్తి కాబడింది.

**1995-96**

ఈ ఆర్థిక సంవత్సరంలో 4 దళితవాడలకు 12 బలహీన వర్గ గృహ సముదాయాలకు (వీకర్ సెక్షన్ కాలనీలు) విద్యుత్తు సరఫరా గావించబడి, (11) 33/11 కె.వి సబ్‌స్టేషనులను నిర్మించడం జరిగింది.

2600 వ్యవసాయ బావులకు 8024 ఇతర సర్వీసులకు విద్యుత్తు సరఫరా జరిగింది.

34.70 కి.మీ 33 కె.వి లైను 510.75 కి.మీ 11 కె.వి లైను నిర్మాణం జరిగింది. ట్రాన్స్‌ఫార్మర్లు నెలకొల్పబడ్డాయి.

**1996-97**

ఈ ఆర్థిక సంవత్సరంలో కొండపాక మండలంలోని తుక్కాపూర్‌లో 132/33 కె.వి సబ్‌స్టేషనులను నిర్మించడం జరిగింది.

11,496 వ్యవసాయ బావులకు 6860 ఇతర సర్వీసులకు విద్యుత్తు సరఫరా గావించబడింది.

87.31 కి.మీ కె.వి లైను 49455 కి.మీ 11 కె.వి లైను నిర్మించబడింది. 294 ట్రాన్స్‌ఫార్మర్లు నెలకొల్పబడినవి. 1,085 ట్రాన్స్‌ఫార్మర్లు ఒ.వై.టి పథకం క్రింద నెలకొల్పబడినవి.

## 1997-98

ఈ సంవత్సరంలో సిద్ధిపేటలో 220/132 కె.వి.సబ్‌స్టేషన్, చేగుంట మండలంలోని చేగుంటలోనూ, పటాన్‌చెరు మండలంలోని పాచవ్పైలారంలోను రెండు 132/33 కె.వి సబ్‌స్టేషనులు, జిల్లాలోని వివిధ ప్రదేశాలలో 1033/11 కె.వి. సబ్‌స్టేషనులు నిర్మించబడ్డాయి. 5 దళితవాడలకు 5 వీకర్ సెక్షన్ కాలనీలకు విద్యుత్తు సరఫరా గావించబడింది.

జిల్లాలో 12,861 అంతర సర్వీసులకు విద్యుత్తు సరఫరా జరిగింది.

71,83 కి.మీ. 33. కె.వి లైను, 358.05 కి.మీ. 11 కె.వి. లైను నిర్మించబడింది. 375 ట్రాన్స్‌ఫార్మర్లు నెలకొల్పబడ్డాయి.

## 1998-99

ఈ ఆర్థిక సంవత్సరంలో 11 దళితవాడలకు, 20 వీకర్ సెక్షన్ కాలనీలకు సరఫరా జరిగింది.

3029 వ్యవసాయ బావులకు, 7412 ఇతర సర్వీసులకు విద్యుత్తు సరఫరా చేయటం జరిగింది.

57.25 కి.మీ 33 కె.వి. లైను 412.94 కి.మీ 11 కె.వి లైను నిర్మించబడింది. ట్రాన్స్‌ఫార్మర్‌లపై అధికభారం తగ్గించే ప్రయత్నంలో 689 ట్రాన్స్‌ఫార్మర్లు నెలకొల్పబడ్డాయి.

1999-2000 సంవత్సరంలో విద్యుత్తు డిమాండును దృష్టియందుంచుకొని విద్యుత్తు అవసరాలను తీర్చుటకొరకు జిల్లాలో వివిధ మండలాలలో 1033/11 కె.వి. సబ్‌స్టేషనులు నిర్మించుటకై ప్రతిపాదనలు మంజూరు గావించబడ్డాయి.

## విద్యుత్తు ప్రాజెక్టులు

మెదక్ జిల్లాలోని సింగూరులో 2 x 20 మె.వా. సామర్థ్యం గల జల విద్యుత్తు కేంద్రము యొక్క పనులు త్వరితగతిలో జరుగుతున్నవి. ఈ సంవత్సరంలో జల విద్యుత్ కేంద్రము ప్రారంభించుటకై నిర్ణయింపబడింది.

వినియోగదారునికి సరైనపంథలో విద్యుత్ సరఫరా చేసి, వినియోగదారుని సంక్షేమానికి పాటు పడే ప్రయత్నాల్లో సర్వవిధాలా కృషిచేస్తోంది విద్యుత్ రంగం.

# సంజయ్ గ్రామీణ విద్యుదీకరణ సహకార సంస్థ జోగిపేట (స్కార్)

సహకారరంగంతో గ్రామీణ ప్రాంతాలలో విద్యుత్తు సరఫరా చేయాలనే సంకల్పంతో కేంద్ర ప్రభుత్వ విద్యుదీకరణ సంస్థ ద్వారా సంజయ్ గ్రామీణ విద్యుదీకరణ సహకార సంస్థ ప్రారంభమైనది.

సహకార రంగంలో మెరుగైన సేవలు సౌకర్యాలు అందుతాయనే ఉద్దేశ్యంతో సంస్థను 1981 ఆగస్టులో ఏర్పాటు చేసిరి. సంజయ్ గాంధీ పేరుతో ఈ సంస్థకు సంజయ గ్రామీణ విద్యుదీకరణ సహకార సంస్థయని నామకరణము చేయబడినది.

1982 మే 10వ తేదిన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వముచే భారత ప్రభుత్వం విద్యుత్ బోర్డు చట్ట ప్రకారం అనుమతి పొంది ఒకటి జులై నుండి సంస్థ కార్యకలాపములు ఆరంభించబడినవి.

ఈ సంస్థ పరిధిలోనికి పూర్వపు అందోల్ తాలుకాలోని, జోగిపేట, పుల్కల్, అల్లాదుర్గం, టెక్మాల్, పాపన్నపేట, రేగోడ్, పెద్దశంకరంపేట మండలాలు చేర్చబడినవి.

స్కార్ సంస్థ న్యూఢిల్లీలోని రూరల్ఎలక్ట్రిక్ కార్పోరేషన్ (ఆర్.ఇ.సి) (గ్రామీణ విద్యుత్ సంస్థ) నుంచి నిధులు పొంది ఈ ఏడు మండలాలలోని విద్యుత్తు వినియోగదారుల అవసరాలను తీర్చును. స్కార్ సంస్థ రిజిస్ట్రేషన్‌నాడు 15 మంది సభ్యులతో ప్రారంభింపబడి ప్రస్తుతం **41734** మంది సభ్యులతో నడచుచున్నది.

172 గ్రామాలు 52 మదిర గ్రామాలు (హామ్లెట్స్) ఈ సంస్థ ద్వారా లబ్ధిపొందుచున్నవి.

ప్రభుత్వ రేటు ప్రకారం యూనిట్‌కు 8 పైసలు చొప్పున విద్యుత్ బోర్డుకు సంస్థ చెల్లించును. సంస్థకు కావలసిన ధనాన్ని ఆర్.ఇ.సి రాష్ట్ర ప్రభుత్వవాటా మూలధనంను, సర్వీసు కనెక్షన్ డిపాజిట్ల ద్వార సమకూర్చబడును.

ఈ సంస్థ పాలక వర్గంలో మండలముకు ఒక్కరి చొప్పున ఏడుమండలాలకు ఏడుగురు డైరక్టర్లు, జోగిపేట పట్టణానికి ఒక డైరక్టరు మొత్తము 8 మంది డైరక్టర్లు ఒక చైర్‌మన్ ఎన్నిక ద్వారా ఎన్నుకొనబడతారు. వీరుగాక ఎ.పి.యస్.ఇ.బి. డిప్యూటి ఇంజనీర్, జిల్లా సహకార శాఖాధికారి మేనేజింగ్‌డైరెక్టరుగా, ఆర్.ఇ.సి. తరపున ఒక అధికారి ఉందురు. అధ్యక్షునితో కలుపుకొని పాలకవర్గం 12 మందితో ఏర్పడును.

ఈ సంస్థలో చేరిన ప్రతిసభ్యుడు జనరల్‌బాడి సభ్యుడే స్కార్ పరిధిలోని సుమారు 42 వేల మంది నుండి 210 మందిని వివిధ గ్రామాల నుంచి ఎన్ను కొందురు. ఈ ఎన్నుకొనబడిన సభ్యులు సంవత్సరమున కొకమారు జరుగు ప్రాతినిధ్య మహాసభలో పాల్గొని సంస్థ పురోభివృద్ధికి తగు సూచనలొసంగుదురు. ఈ ప్రాతినిధ్యమహాసభలో ఆ సంవత్సరమున జరిపిన నెలవారి సమావేశాలు, తీర్మానాల ద్వారా అమలు పరచిన పనులు, వివరించి ఆమోదము పొందబడును.

## సంజయ గాంధీ గ్రామీణ విద్యుదీకరణ సహకార సంస్థ - జోగిపేట

### సంస్థ ఆస్తులు 31-3-98 నాటికి

| వ.స. | రాష్ట్ర విద్యుత్ బోర్డు ద్వారా 1-7-82 నాడు | 31-3-98 |
|---|---|---|
| 1. విలేజెస్ ఎలక్ట్రిఫైడ్ (నెం) | 168 | 172 |
| 2. హామ్‌లెట్స్ ఎలక్ట్రిఫైడ్ (నెం) | 12 | 52 |
| 3. డబ్ల్యు.ఎస్.కాలనీస్ ఎలక్ట్రిఫైడ్ (నెం) | - | 57 |
| 4. లైన్స్ లేయడ్ (కి.మీ) | | |
| 1) 11 కె.వి. లైన్‌లు | 451.38 | 741.52 |
| 2) ఎల్.టి లైన్‌లు | 640.25 | 1542.10 |
| 5. డిస్ట్రిబ్యూషన్ ట్రాన్స్‌ఫార్మర్స్ ఎరక్టెడ్ (నెం) | 224 | 699 |
| 6. సర్వీసెస్ రిలీస్డ్ (నెం) | | |
| 1) అగ్రికల్చర్ | 1626 | 8695 |
| 2) ఇండస్ట్రియల్ (ఎల్.టి) | 326 | 749 |
| 3) డొమెస్టిక్ | 4670 | 25,314 |
| 4) కమర్షియల్, జనరల్ | 794 | 1,456 |
| 5) స్ట్రీట్ లైట్స్ | 177 | 275 |
| టోటల్ | 7,593 | 36,489 |
| 7. మెంబర్స్ ఎన్‌రోల్డ్ (నెం) | - | 42,867 |

# మెదకు జిల్లాలో గృహ నిర్మాణ సంస్థ

మనిషి జీవించుటకు ప్రధానమైనవి కూడు-గూడు-గుడ్డ. సంక్షేమ ప్రభుత్వాలు నిరుపేదల బ్రతుకులకు పొట్ట-బట్ట చౌకధరలదుకాణాలు ద్వారా పౌరసరఫరా శాఖచే అందించుచున్నవి. ఇక మిగిలిన తలదాచుకొనుట కొరకు గూడు. గూడులేని నిరుపేదలకు ఆశ్రయం కల్పించాలనే ఉద్దేశ్యంతో గృహ నిర్మాణ సంస్థ ఆవిర్భవించింది. ఈ సంస్థ 1979 లో ప్రారంభమై నేటికి కర్తవ్య నిర్వాహణలో అగ్రగామిగా నిలిచింది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గృహనిర్మాణ సంస్థ మెదకు జిల్లాలో ప్రారంభమైన నాటి నుండి 91915 గృహాలు మంజూరికాగా 82873 గృహాల నిర్మాణం పూర్తిచేసింది.

జిల్లా గృహనిర్మాణ సంస్థలో 78 మంది పక్కా-ఇన్స్పెక్టర్లు 14 మంది ఇ.యస్.లు 3 డి.ఇ.లు పనిచేయుచున్నారు.

ఈ సంస్థకు అనుబంధముగా నిర్మితి కేంద్రాలు ఏర్పాటు చేయబడినవి. పర్యావరణ సంరక్షణ, వాతావరణ సమతుల్యానికి అనుకూలంగా కలపకు బదులుగా సిమెంటుతో చేసే ద్వారబంధాలు (చౌకొట్లు) కిటికీలు, మొదలగు వాటిని మరియు ఇటుకకుబదులుగా సిమెంటు ఇటుకలు, పైకప్పుకు సంబంధించిన గృహసామాగ్రిని ఈ నిర్మితి కేంద్రాలలో తయారు చేయిస్తారు.

మెదకు జిల్లాలో ప్రస్తుతం సంగారెడ్డి, మెదకు, సిద్దిపేటల్లో నిర్మిత కేంద్రములు పని చేయుచున్నవి.

ఆంధ్రప్రదేశ్ గృహనిర్మాణ సంస్థ గత 18 సంవత్సరాల నుండి వివిధ పథకాలలో 1996-97 జూన్ వరకు 82873 కేంద్ర రాష్ట్ర సబ్సిడీలు పోగ 38.484 కోట్ల రూపాయలు రుణముగా ఇచ్చినది. ఇంత వరకు సంబంధిత లబ్ధిదారులు రూ 0.293 కోట్లు వడ్డీతో సహా చెల్లించినారు, రూ. 38.324 కోట్లు అసలుయింకను చెల్లించ వలసియున్నారు. వీరు చెల్లించవలసిన రుణము అధికముగానున్నది.

| | మొత్తం గృహములు | అంచనావిలువ (రూ. లక్షలలో) |
|---|---|---|
| రూరల్ హౌసింగ్ | 52189 | 7872.875 |
| అర్బన్ హౌసింగ్ | 2794 | 484.38 |
| మొత్తం | 549 | 8307.255 |

## వివిధ పథకాల ద్వారా మెదకు జిల్లాలో మంజూరి కాబడిన గృహాలు విలువ లక్షల రూపాయలలో

| వరుస సంఖ్య | పథకము పేరు | 1995-96 | | 1996-97 | | 1997-98 | | 1998-99 | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | మంజూరు కాబడిన గృహాలు | అంచనా విలువ | మంజూరు కాబడిన గృహాలు | అంచనా విలువ | మంజూరు కాబడిన గృహాలు | అంచనా విలువ | మంజూరు కాబడిన గృహాలు | అంచనా విలువ |
| 1. | ఆర్.పి. హెచ్ | 9131 | 1095.72 | 14766 | 1771.92 | - | - | 13265 | 2321.37 |
| 2. | ఎస్.పి.ఆర్.హెచ్. | - | - | - | - | - | - | - | - |
| 3. | ఐ.ఎ.వై | 3504 | 490.56 | 2762 | 455.73 | 2140 | 353.10 | 2013 | 402.600 |
| 4. | నేత పనివారలకు | 54 | 7.02 | - | - | - | - | - | - |
| 5. | జాలర్లకు | 40 | 5.20 | - | - | - | - | - | - |
| 6. | ఎ.సి.డి.పి | 1695 | 203.40 | - | - | - | - | - | - |
| 7. | స్పెషల్ హౌసింగ్ (జాలర్లకు) | - | - | - | - | - | - | 350 | 70.00 |
| 8. | స్పెషల్ హౌసింగ్ (నేత పనివారలకు) | - | - | - | - | - | - | 954 | 1094.08 |
| 9. | బీడి కార్మికులకు | 1515 | 227.26 | - | - | - | - | - | - |
| | మొత్తము | 15939 | 2029.15 | 17528 | 2227.65 | 2140 | 353.10 | 16582 | 3212.975 |

**ఆంధ్రప్రదేశ్ గృహనిర్మాణ సంస్థ జిల్లాలో 1995-96 నుండి 1998-99 వరకు 44726 గృహములను వేరు వేరు వేరు పథకములపై నిర్మించుట జరిగినది.**

| | | 1995-96 | | 1996-97 | | 1997-98 | | 1998-99 | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| వరుస సంఖ్య | పథకము పేరు | మంజూరు కాబడిన గృహాలు | అంచనా విలువ | మంజూరు కాబడిన గృహాలు | అంచనా విలువ | మంజూరు కాబడిన గృహాలు | అంచనా విలువ | మంజూరు కాబడిన గృహాలు | అంచనా విలువ |
| 1. | పట్టణ శాశ్వత గృహ నిర్మాణ పథకం | 862 | 129.30 | 288 | 43.20 | - | - | 1172 | 293.00 |
| 2. | ఎల్.ఐ.జి. | - | - | - | - | - | - | - | - |
| 3. | ఎల్.ఐ.జి. మోడల్ బస్తీ | - | - | - | - | - | - | - | - |
| 4. | ఎల్.యు.ఎస్. (షెల్టర్ అఫ్‌గ్రేడేషన్) | 472 | 18.88 | - | - | - | - | - | - |
| | మొత్తము | 1334 | 148.18 | 288 | 43.20 | - | - | 1172 | 293.00 |

# ఎక్సైజ్ అండ్ ప్రొహిబిషన్ శాఖ

మెదక్ జిల్లాలో ఈ శాఖ 3 రెవెన్యూ డివిజన్లు, 45 రెవెన్యూ మండలాలుగా ఉంది. 3 రెవెన్యూ డివిజన్‌లు 1. మెదక్, 2. సంగారెడ్డి 3. సిద్దిపేట. ఈ శాఖను పునర్వవస్థీకరించిన మొదటి సంవత్సరం 1994-95లో ఈ జిల్లాలో రెవెన్యూ వసూళ్ళు 1,1863,600 రూపాయలు వసూలు చేసి ప్రభుత్వ ఖజానాకు జమచేసినది.

మెదక్ జిల్లాలో ఈ శాఖ 10 ఎక్సైజ్‌స్టేషన్స్‌ను కలిగి ఒక్కొక్క స్టేషన్‌లో ఒక ఇన్‌స్పెక్టర్, ముగ్గురు సబ్-ఇన్‌స్పెక్టర్‌లు మరియు సిబ్బందితో ఏర్పాటు చేయబడి 24 గంటలు వారి వారి పరిధులలో విధులు నిర్వహిస్తున్నారు. మరియు జిల్లా సరిహద్దు రాష్ట్రాలు కర్ణాటక, మహారాష్ట్ర సరిహద్దుల్లో మూడు తనిఖీ కేంద్రాలు ఏర్పాటు చేయనైనది. అవి జహీరాబాద్, మెటల్‌కుంట, కంగ్టి.

నేర పరిశోధన నిమిత్తం మొబైల్ పార్టీలను కూడా ఏర్పాటు చేయడం జరిగింది. అందులో ఒక అసిస్టెంట్ ఎక్సైజ్ సూపరిండెంట్ ఇద్దరు ఇన్‌స్పెక్టర్‌లు మరియు సిబ్బంది విధులు నిర్వహిస్తున్నారు. మరియు 24 గంటలు ఫిర్యాదుల కొరకై ప్రత్యేక విభాగాన్ని జిల్లా కేంద్ర కార్యాలయంలో ఏర్పాటు చేసారు.

ఈ నూతన ఎక్సైజ్ విధానంలో జిల్లా స్థాయిలో మద్యపాన నిషేధ సలహా సంఘం 15 మందితో జిల్లాస్థాయి, మండలస్థాయి, గ్రామస్థాయిలలో ఏర్పాటుచేసి ఈ శాఖ యొక్క కార్యాచరణను, సలహాసంఘం యొక్క సలహాలను ఎప్పటికప్పుడు స్వీకరించడం జరుగుతుంది. మద్యపాన నిషేధ సమయంలో జిల్లాలో 1990 కేసులను 1236 మందిని, 120 వాహనాలను పట్టుకొని నేర నిరోధక శాఖ అదుపులో తీసుకుని విచారించడం జరిగింది.

1997లో ప్రభుత్వ నిర్ణయం వల్ల నిషేధం ఎత్తివేయడంతో జిల్లాలో మొత్త 99 I.M.L. లైసెన్స్‌లు ఇవ్వడం వల్ల రెవెన్యూ ఆదాయం 2,27,64,856 రూపాయలు ప్రభుత్వ ఖజానాకు జమచేయబడినది.

ఈ శాఖ జన్మభూమి, క్లీన్ అండ్ గ్రీన్, రెవెన్యూ స్పోర్ట్స్ మొదలగు వాటికి పూర్తి సహకారాన్ని అందిస్తుంది. మరియు క్లీన్ అండ్ గ్రీన్‌ల భాగంగా 500 మొక్కలను జిల్లా కార్యాలయంలో నాటినారు.

**1997-98, 1998-99 లో రెవెన్యూ పెంచడానికి మరియు నేరాలను తగ్గించడానికి కొన్ని అంశాలను ప్రవేశపెట్టారు.**

| | 1997 -98 | 1998-99 |
|---|---|---|
| 1. మొత్తం ఐ.ఎమ్.ఎల్. లైసెన్సులు ఇచ్చినవి | 99 | 208 |
| 2. మొత్తం లైసెన్సు ఫీజు విధించినవి | 5,20,55,248-73 | 5,50,77,558-00 |
| 3. మొత్తం ఐ.ఎమ్.ఎల్. సేల్ వాల్యు (ఐ.ఎమ్.ఎల్. మరియు బీర్) | 26,73,47,235 -00 | 47,37,81,165-00 |
| 4. టాడ్డీపై టి.సి.ఎస్. మరియు టి.ఎఫ్.టి అద్దె | 1,71,35,077-00 | 1,78,64,331-00 |
| 5. మొత్తము చెట్ల పన్ను వసూలు | 65,03,533-00 | 48,16,464-00 |
| 6. మొత్తము జిల్లా రెవెన్యూ కలెక్షన్ | 34,30,11,092-73 | 55,15,39,518-00 |
| 7. మొత్తము కేసు నమోదు | 2632 | 2528 |
| 8. అరెస్టైనవారు | 646 | 795 |
| 9. వాహనాలు సీజ్డ్ | 59 | 37 |
| 10. వాహనాలు మరియు కాంట్రాబాండ్ విలువ | 6,67,23,928-00 | 7,34,50,191-00 |

| టాడ్డీ మరియు ఐ.ఎమ్.ఎల్ లిస్టు | | 1999-2000 |
|---|---|---|
| 1. మొత్తం ఐ.ఎమ్.ఎల్. లైసెన్సులు ఇచ్చినవి (1-4-99 -- 31-3-2000) | : | 161 |
| 2. మొత్తం లైసెన్సు ఫీజు విధించినవి(1-4-99 -- 31-3-2000) | : | 4,71,00,000/- |
| 3. మొత్తం ఐ.ఎమ్.ఎల్. సేల్ వాల్యు (ఐ.ఎమ్.ఎల్. మరియు బీర్) (1-4-99 -- 31-3-2000) | : | 59,21,86,568/- |
| 4. టాడ్డీపై టి.సి.ఎస్. మరియు టి.ఎఫ్.టి. అద్దె (1-10-99 - 31-3-2000) | : | 90,95,375/- |
| 5. మొత్తము చెట్ల పన్ను వసూలు (1-10-99 -- 31-3-2000) | : | 31,06,884/- |
| 6. మొత్తము జిల్లా రెవెన్యూ కలెక్షన్ ( 2 నుండి 5 వరకు) | : | 65,14,88,827/- |
| 7. మొత్తము కేసు నమోదు (1-4-99 -- 31-3-2000) | : | 2,834 |
| 8. అరెస్టైనవారు (1-4-99 -- 31-3-2000) | : | 1,555 |
| 9. వాహనాలు సీజ్డ్ | : | 73 |
| 10. వాహనాలు మరియు కాంట్రాబాండ్ విలువ | : | 2,79,56,211/- |

## ఈ ఆర్థిక సంవత్సరము 2000-2001 న ఆర్థిక పురోభివృద్ధి కై చేపడుతున్న మెదక్‌జిల్లాలో రెవెన్యూ ప్రొజెక్షన్ ఆన్ ఎఫెక్టివ్ అడ్మినిస్ట్రేషన్.

| | | |
|---|---|---|
| 1. మొత్తము ఐ.ఎల్. మరియు ఎఫ్.ఎల్. షాపులు రినీవల్ (2000-2001) | : | 174 |
| 2. మొత్తము లైసెన్సు ఫీజు 174 షాపులకు ఫిక్స్ చేసినవి | : | రూ. 6,11,01,667 |
| 3. మొత్తము ఐ.ఎమ్.ఎల్ సేల్ వ్యాల్యు 2000-2001 నుండి 30-11-2000 | : | రూ. 43,80,87,920 |
| 4. మొత్తము రెవెన్యూ ఐ.ఎమ్.ఎల్ పై విధించినవి | : | రూ. 49,91,89,587 |
| 5. టాడ్డీపై టి.సి.ఎస్. మరియు టి.ఎఫ్.టి అద్దె 496+559 = 1055 | : | రూ. 1,21,41,749 |
| 6. మొత్తము చెట్ల కేటాయించినవి | : | 489585/24371 ఎస్.టి. |
| 7. మొత్తము చెట్ల వినియోగం (10/2000 నాటికి) | : | 242293 /7986 ఎస్.టి. |
| 8. చెట్ల పన్ను 2000-2001 సంవత్సరానికి (31-10-2000) | : | రూ. 37,78,179 |
| 9. టాడ్డీపై మొత్తం రెవెన్యూ కలెకక్షన్ | : | రూ. 1,59,19,928 |
| 10. ఐ.ఎమ్.ఎల్, టాడ్డీ పై (4+9) మొత్తము జిల్లా రెవెన్యూ కలెక్షన్ (30-11-00) | : | రూ. 51,61,09,515 |
| 11. అక్రమ టాడ్డీ దుకాణాల నమోదు | : | 137 |
| 12. అడల్టరేటెడ్ కేసుల నమోదు | : | 31 |
| 13. లైసెన్సు సస్పెండ్ చేయబడినవి | : | 31 |
| 14. లైసెన్సు క్యాన్సల్ చేసినవి | : | 07 |
| 15. కోర్టు కేసులో ఉన్నవి | : | -- |
| 16. వాహనాలు మరియు కాంట్రాబాండ్ విలువ | : | రూ. 3,17,61,727 |

# భూగర్భ గనుల శాఖ

మెదకు జిల్లాలో ఖనిజ సంపద విస్తారముగా కలదు జిల్లాలోని ఖనిజ సంపదను రెండు భాగములుగా విభజింప వచ్చును. పెద్దతరహా ఖనిజ సంపద, చిన్నతరహా ఖనిజ సంపదలుగా వాటిని పేర్కొనవచ్చును.

జిల్లాలోని ఖనిజ సంపదలో పలుగు రాయి, ల్యాటరైటు, అమెధిస్టు (క్వార్జ్) కలువు.

మెదకు జిల్లా పలుగు రాళ్ల పరిశ్రమకు ప్రసిద్ధి చెందినది. జిల్లాలోని ఖనిజ సంపదలో పలుగురాయి ప్రధానమైనది. పెద్ద తరహా ఖనిజ సంపదలో మొత్తం 31 గునులను ఈ శాఖ గుర్తించినది. అందులో 28 పలుగు రాళ్లగనులు, రెండు ల్యాటరైటు, ఒకటి (1) అమెధిస్టు (క్వార్జ్) గా గుర్తించిరి. ఇందులో 17 వర్కింగ్‌లో ఉండగా 14 మూతపడినవి.

ఈ జిల్లాలో ప్రత్యేకమైన పలుగు రాయిని గాజు తయారిలో, సిలికాన్ కార్బైడ్‌లో ఉపయోగింతురు.

ల్యాటరైట్‌ను సిమెంటు పరిశ్రమలోను, అమెధిస్టును సెమిప్రెషస్ స్టోన్‌గా, కట్టింగ్ పాలిషింగ్ స్టోన్‌గా, గ్రానైట్ స్టోన్‌గా ఉపయోగింతురు.

మెదకు జిల్లాలో పలుగురాయి ఖనిజ సంపద నర్సాపూర్ మండలంలోని నర్సాపూర్, మాదాపూర్‌లలోను, వెల్దుర్తి మండలం రామంతాపూర్‌లోను, రాయ్‌కోడ్ మండలం ఉసేనాబాద్‌లోను, పెద్ద శంకరంపేట మండలం గొట్టి ముక్కుల, తిమ్మాపూర్‌లలోను, చేగుంట మండలం రాంపూర్‌లోను, సంగారెడ్డి మండలం మల్లేపల్లి, తేర్‌పోల్, కల్పగూర్‌లలోను కలదు.

మెదకు మండలం రాయినపల్లిలోను, రామాయంపేట మండలం కోమటిపల్లిలోను, విస్తారముగా కలదు. ఈ ప్రదేశములందు పరిశ్రమలు నెలకొల్పి పలుగురాయిని పొడిగా చేసి అవసరమైన పరిశ్రమలకు ఎగుమతి చేయుచున్నారు.

జహీరాబాద్ మండలంలో బూచినెల్లిలో రాయికోడ్ మండలం బీడెకన్నలో లాటరైట్ ఖనిజ సంపద కలదు.

మెదకు జిల్లాలో భూ గర్భగనుల శాఖ సహాయ సంచాలకుల కార్యాలయము 1992 ఏప్రిల్‌లో మెదకులో ప్రారంభమైనది. ఇచ్చట ఈ ప్రభుత్వ శాఖా కార్యాలయము ఏర్పడకముందు నామమాత్రపు ఆదాయము మాత్రము ఉండెడిది. శాఖా కార్యాలయమేర్పడిన సంవత్సరములోనే గణనీయమైన ఆర్థిక లాభాము కల్గినది.

మెదకు పట్టణంలో భూగర్భ గనుల శాఖా కార్యాలయము నందు ఒక సహాయ సంచాలకులు, ఒక సూపరిండెంటు, ఒక రాయల్టీ ఇన్స్‌పెక్టరు, ఒక టెక్నికల్ అసిస్టెంటు, ఒక యూ.డి.సి. మాత్రమేపని చేయుచున్నారు.

# నీటిసరఫరా పథకము

సిద్దిపేట పట్టణము చాలా కాలము నుండి త్రాగునీటి కటకటను చవిచూచుచున్నది. ఈ దుస్థితిని పోగొట్టుటకై మానేరు నీటిని సిద్దిపేటకు తరలించి పట్టణ ప్రజల దాహార్తిని తీర్చడమైనది. ప్రభుత్వ సంస్థల ద్వారానేకాక సత్యసాయి ధార్మిక సంస్థ ద్వారా పుల్కల్, జోగిపేట, హత్నూర, జిన్నారం, తూప్రాన్, వర్గల్ గ్రామాల్లో సంగారెడ్డి, నర్సాపూర్ మండలాల్లోని కొన్ని గ్రామాల్లో మంజీరా నీటి సరఫరా జరుగుచున్నది.

ముఖ్యంగా వాతావరణ కాలుష్యానికి గురియై భూగర్భ జలాలు కాలుష్యమై త్రాగుటకు పనికిరాని స్థితిలోనున్న గ్రామాలకు ఈ సంస్థ ద్వారా నీటిసఫరా జరుపబడుచున్నది.

### మంచినీటి సరఫరా పథకం నిర్వహణ

జిల్లాలోగల 1405 మంచినీటి సరఫరా పథకముల నిర్వహణ పని పంచాయితీ రాజ్ డిపార్టుమెంటు వారి ద్వారా చేపట్టబడుచున్నది. మరియు కరెంటులోని హెచ్చు తగ్గుల వలన భూమిలో నీటి మట్టం తగ్గడం మరియు పైపులైను మరమ్మత్తులు వలన నిలిచిపోయిన పథకములన్నీ వివిధ నిధుల నుండి తక్షణ చర్యలు తీసుకొని అన్ని ఉపయోగములోనికి తేబడినవి.

### గొట్టపు బావుల నిర్వహణ

జిల్లాలోని 11,128 బోరుబావులకు తరుచుగా వచ్చే రిపేర్లు చేసి, పనిచేసే స్థితిలో ఉంచడానికి మొత్తం 58 మంది (రెగ్యులర్ మరియు కాంట్రాక్టు పద్ధతి) పంపు మెకానిక్‌లు పనిచేయుచున్నారు. త్రాగునీటి సమస్య ఉత్పన్నం కాకుంచడా ఉండడానికి బోరుబావుల ద్వారా త్రాగునీటి సరఫరా జరిగేలా చూడడంలో తగిన శ్రద్ధ తీసుకొనబడుచున్నది.

### నెదర్‌లాండ్స్ అసిస్టెంటు పథకం

త్రాగు నీటి సమస్యకు 110 గ్రామాలకు నెదర్లాండు అసిస్టెంటు పథకం క్రింద 10.88 కోట్ల రూపాయలతో పథకం పూర్తిచేసి నీటి సప్లై చేయుచున్నారు.

### జిల్లాలోని మంచినీటి సరఫరా పథకములు అభివృద్ధి పథకములు అభివృద్ధి వాటి వివరాలు

సిద్దిపేట పరధిలో ఫ్లోరైడ్ సమస్యగల 145 గ్రామాలకు గాను 50.00 కోట్ల రూపాయలతో మంచినీటి పథకం మంజూరీ అయి వివిధ దశలలో ఉన్నది.

మెదక్ పరిధిలో ఫ్లోరైడ్ సమస్యగల 84 గ్రామాలకు గాను 12.00 కోట్ల రూపాయలతో మంచినీటి పథకం మంజూరీ అయి ఈ పథకం ఆగస్టు 1999లో పూర్తి చేయుటకు అన్ని ప్రయత్నములు జరుగినవి.

ప్రభుత్వ పరంగా పై పథకములు కాకుండా శ్రీమాన్ సత్యసాయి ట్రస్టు వారిచే రూ.30.00 కోట్లతో సమస్యాత్మక గ్రామాలకు మంచినీటి సరఫరా నిమిత్తం మంజూరు చేసినారు. ఇట్టి పనులు ప్రథమ దశలో ఉన్నవి.

# గ్రామీణ నీటి సరఫరా

గ్రామీణ ప్రాంతాలలో ప్రజలకు రక్షిత నీటి సరఫరా సౌకర్యం కల్పించి ప్రజారోగ్యాన్ని పరిరక్షించేందుకు ప్రభుత్వం విశేషమైన కృషి సాగిస్తుంది. ప్రభుత్వం ఆర్థిక వనరులను కేటాయిస్తూనే ఇతర వనరుల నుండి కూడా ఇందుకోసం నిధులు సంపాదించి గ్రామీణ పజల కనీస సౌకర్యములు తీర్చే దిశలలో చిత్తశుద్ధితో అనేక పథకాలు చేపట్టబడుచున్నవి.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1995-96 | | | 1996-97 | | |
|---|---|---|---|---|---|---|---|
| | | చేపట్టిన పనులు | అంచనా విలువ | ఖర్చు | చేపట్టిన పనులు | అంచనా విలువ | ఖర్చు |
| 1. | యం.యన్.పి | 279 | 264.16 | 175.49 | 404 | 633.24 | 315.83 |
| 2. | ఎ. ఆర్.డబ్ల్యు.యస్ | 345 | 451.88 | 250.23 | 913 | 145.11 | 283.02 |
| 3. | 10వ ఫైనాన్స్ కమీషన్ | - | - | - | - | - | - |
| 4. | యస్.ఎఫ్.సి. | - | - | - | - | - | - |
| | | **624** | **716.04** | **425.72** | **1317** | **2085.35** | **698.85** |

| వరుస సంఖ్య | పథకం పేరు | 1997-98 | | | 1998-99 | | |
|---|---|---|---|---|---|---|---|
| | | చేపట్టిన పనులు | అంచనా విలువ | ఖర్చు | చేపట్టిన పనులు | అంచనా విలువ | ఖర్చు |
| 1. | యం.యన్.పి | 1882 | 2029.34 | 664.16 | 741 | 2379.58 | 453.00 |
| 2. | ఎ. ఆర్.డబ్ల్యు.యస్ | 841 | 1753.56 | 653.29 | 676 | 1399.24 | 354.97 |
| 3. | 10వ ఫైనాన్స్ కమీషన్ | 68 | 126.30 | 103.30 | 43 | 76.90 | 41.50 |
| 4. | యస్.ఎఫ్.సి. | - | - | - | 136 | 206.20 | 117.75 |
| | | **2791** | **3909.50** | **1420.95** | **1596** | **4061.92** | **967.22** |

**మొత్తము పనులు** : **6328**

**అంచనా విలువ** : **10,772.81**

**మొత్తము ఖర్చు** : **3,512.74**

# ఆంధ్రప్రదేశ్ సంప్రదాయేతర ఇంధన వనరుల అభివృద్ధి సంస్థ (నెడ్‌క్యాప్)

ఈ సంస్థ మెదక్ జిల్లాలో ముఖ్యముగా జాతీయ బయోగ్యాస్ అభివృద్ధి పథకము మరియు పొగరాని పొయ్యిల కార్యక్రమాన్ని అమలుపరుచుట.

## 1. బయోగ్యాస్ పథకము ప్రధాన లక్ష్యాలు

1. వంట చెఱకు కోసం చెట్లను అడవులను నరికే అలవాటును అరికట్టడం.
2. గోబర్ గ్యాస్‌ను ఇంధన శక్తిగా ఉపయోగించడం.
3. ఎల్.పి.గ్యాస్, కిరోసిన్, బొగ్గు వంటి వాటి మీద భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని వత్తిడి తగ్గించడం.
4. పేడ మొదలైన వాటిలో ఎక్కువ సారముగల సహజ ఎరవు పొందడం.
5. వాతావరణ కాలుష్యాన్ని నిరోధించడం, తగ్గించడం.

ప్రభుత్వ సబ్సిడీ గుర్తించుటకు లబ్దిదారునికి కావలసిన పశువుల సంఖ్య మరియు కుటుంబ సభ్యుల వివరములు.

| క్ర.సం. | సైజు | పశువుల సంఖ్య | కుటుంబ సభ్యులు | నిర్మాణ వ్యయం | ప్రభుత్వ సబ్సిడీ సన్న / చిన్నకారు భూమిలేని కూలి/ షె.కు. / షె.తె. వారికి | సబ్సిడీ ఇతరులకు |
|---|---|---|---|---|---|---|
| 1. | ఘ.మీ. | 2-3 | 3-4 | 4,500/- | 2500/- | 2000/- |
| 2. | ఘ.మీ. | 4-6 | 5-8 | 6,300/- | 2500/- | 2000/- |
| 3. | ఘ.మీ. | 7-9 | 6-12 | 7,200/- | 2500/- | 2000/- |

## 2. పొగలేని పొయ్యి ప్రత్యేక విశేషాలు

1. ఊదవలసిన, విసర వలసిన అవసరం లేదు.
2. కట్టెల వృధా తగ్గడం వలన ఖర్చు తగ్గుతుంది.
3. వంట త్వరగా అవుతుంది.
4. పొగరాదు కనుక కంటి జబ్బులు. ఇతర ఇబ్బందులకు గురి అయ్యే ప్రమాదం ఉండదు.

## 3. పొగలేని పొయ్యిలకు ప్రభుత్వం ఇస్తున్న సబ్సిడీ వివరములు

| పొయ్యి రకం | ఖరీదు రూ. | ప్రభుత్వ సబ్సిడీ షె.కు. / షె.తె. | ప్రభుత్వ సబ్సిడీ ఇతరులు | లబ్దిదారుని వాటా షె.కు. / షె.తె. | లబ్దిదారుని వాటా ఇతరులు |
|---|---|---|---|---|---|
| స్థిర నమూనా | 56/- | 20/- | 20/- | 36/- | 36/- |
| అస్థిర నమూనా (రవాణాతో కలిపి) | 172/- | 50/- | 40/- | 122/- | 132/- |

# చేనేత మరియు జౌళి శాఖ

చేనేత కార్మికుల సౌకర్యార్థం. దిగువ సంక్షేమ పథకాలు అమలు జరుపబడుచున్నవి.

**1. ఉదరకోశ వ్యాధుల చికిత్స కొరకు :**

సహకార సంఘములలో సభ్యులైన చేనేత కార్మికులకు వారు హెచ్చించే మొత్తములో రూ. 1500/- లకు మించకుండా ఆర్థిక సహాయము లభిస్తుంది. చికిత్సకు సంబంధించిన పరీక్షలు, ఖర్చులు వైద్యాధికారిచే ధృవీకరింపబడి ఉండవలెను.

**2. కంటి అద్దాల కొనుగోలు ఖర్చులు :**

చేనేత కార్మికులకు కంటి పరీక్షల కొరకు రూ. 40/- మరియు కంటి అద్దాల కొనుగోలుకు రూ.150/- గుర్తింపు పొందిన కంటివైద్య నిపుణులు ధృవీకరించిన పిదప సహాయం అందజేయడం జరుగుతుంది.

**3. మంచి నీటి సౌకర్యం :**

ప్రతి (50) చేనేత కుటుంబాల కాలనీలకు గరిష్టముగా రూ.35,000/-ల ఖర్చుతో మంచినీటి సౌకర్యార్థము బోర్‌వెల్ మంజూరు చేయడం జరుగుతుంది. బోర్‌వెల్ ఏర్పాటు అవకాశం లేనట్లయితే, త్రవ్వకపు బావులు ఏర్పాటు చేయవచ్చును.

**4. గర్భిణీ స్త్రీలకు ఆర్థిక సహాయం :**

సహకార సంఘంలోని స్త్రీ చేనేత కార్మికులు, చేనేత కార్మిక కుటుంబాలలోని స్త్రీలకు రూ.500/- ఒకే మొత్తంగా ఆమె జీవిత కాలములో రెండు సార్లకు మించకుండా అందించడం జరుగుతుంది.

**5. కుటుంబ నియంత్రణ ప్రోత్సాహకము :**

ఇతర సంస్థల అందజేసే ప్రోత్సాహకాలకు అదనముగా, కుటుంబ నియంత్రణ పాటించి ఆపరేషన్ చేయించుకొనిన చేనేత కార్మిక కుటుంబాలకు రూ.100/- కు మించకుండా అతని/ఆమె జీవిత కాలములో ఒకేసారి అందించబడును.

చేనేత కార్మికులు అధికముగా కేంద్రీకృతమయిన ప్రాంతములో ప్రభుత్వం వారిచే ఆరోగ్య కేంద్రం ఏర్పాటు లేని పక్షములో రూ.1.00 (ఒక లక్ష) వ్యయంతో ఉప ఆరోగ్య కేంద్రం ఏర్పాటు చేయడం జరుగుతుంది.

**6. నిరుపేద చేనేత కార్మికులకు మార్జిన్ మనీ:**

దారిద్ర్య రేఖకు దిగువన వున్న చేనేత కార్మికుల కోసం, సహకార సంఘాల ద్వారా సంఘానికి రూ. లక్షపరిమితి చొప్పున అందులోని (50) మంది సభ్యులకు పని కల్పించుటకు ప్రతి సభ్యుని కొరకు

రూ.20,000/- సహాయం చేస్తున్నారు. ఈ మార్జిన్ మని సహాయం ఉత్పత్తికి సంబంధించిన కార్యక్రమముల కొరకు సంఘం బ్యాంకు ఋణం పొందవలసి ఉంటుంది.

**7. పొదుపు మరియు భద్రత పథకము :**

ప్రావిడెంటు ఫండ్ రూపములో ప్రాథమిక చేనేత సహకార సంఘములలో పని చేయుచున్న నేత పనివారు తమ వేతనములో 8 శాతం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు 4 మరియు 3 శాతం ఈ నిధికి జమ చేయవలసి ఉంటుంది. 5 సంవత్సరాల తర్వాత ఈ నిధి నుండి ఋణ సౌకర్యం పొందటానికి, వీలుండును. పొదుపు భద్రతా పథకంలో ఉన్న చేనేత కార్మికులకు రూ.15,000/- వరకు గ్రూప్ ఇన్సురెన్సు పథకం వర్తిస్తుంది. ఈ పథకము 18 పైన 60 సంవత్సరములలోపు వయస్సు ఉన్న చేనేత కార్మికులకు వర్తిస్తుంది.

సహకార సంఘములలో సభ్యులుగా చేనేత కార్మికులకు, ప్రతి నేత కార్మికుడికి రూ.10 వేల చొప్పున భీమా కల్పించేందుకు వార్షిక ప్రీమియం రూ.120/- కాగా అందులో 1/3 వంతు నేత కార్మికుడు, మిగతా 2/3 వంతు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సమానంగా చెల్లించాలి. ఈ విధంగా నేత కార్మికుడికి కేవలం రూ.40/- ఏడాదికి చెల్లించినంత మాత్రాన రూ.10,000/- వరకు భీమా సౌకర్యం లభిస్తుంది.

# ఆర్థిక రంగం

## బ్యాంకింగ్ వ్యవస్థ

శాతవాహనుల కాలంలో వృత్తి సంఘములు 'నికామము' లను పేరుతో పని చేయుచు కొంత మూలధనమును ఏర్పర్చుకొని వడ్డీలకు ఇచ్చుచు వచ్చిన ఆదాయమును సంక్షేమ కార్యక్రమములకు ఉపయోగించెడివని తెలుయుచున్నది. నేటి విస్తృత బ్యాంకింగ్ వ్యవస్థకు శాతవాహనుల కాలంనాడే బీజావాపన జరిగినదని దీని వలన తెలియుచున్నది.

### పెట్టుబడిదారులు

కాలక్రమేణ సమాజములోని ధనిక వర్గము, దేశీయ బ్యాంకింగ్ ప్రతినిధులుగా వ్యవహరించుచూ, గ్రామీణ ప్రాంతముల పరపతి స్వరూపము పై అధిపత్యము వహించియుండిరి.

మెదకు జిల్లాలో భూస్వాములు, ధనవంతులు, వ్యాపారస్థులు తమ స్వంత ధనముతోగాని, ఇతరత్రా వస్తురూపమున గాని అవసరము గలవారికి ఋణ సౌకర్యము లేర్పర్చుచుండిరి. ముఖ్యముగా షావుకార్లు రైతులకు, రైతు కూలీలలకు, తదితరులకు ఋణ సౌకర్యములు కల్పించు చుండిరి.

**వడ్డీ వ్యాపారము :-** వైశ్యులు, భూస్వాములు, వ్యవసాయదారులకు, రైతుకూలీలకు, కుటీర పరిశ్రమలందున్న వారికి పెట్టుబడులు ఇచ్చుచు తమ కనుకూలమైన నిబంధనలు రూపొందించి అధిక లాభములను గడించుచుండిరి. రైతులు ధాన్యమును నిర్ణీత ధరలకే, తమకే విక్రయింపవలెనన్న నిబంధన వాటిలో ఒకటి.

గ్రామీణ ప్రాంతములందు ధనికులైన భూస్వాములు షావుకార్లు పెట్టుబడిదారులుగా, ఋణదాతలుగా వ్యవహరించుచుండగా, పట్టణ ప్రాంతములందు మార్వాడీలు, చిన్న వ్యాపారులు, అవసరమున్న వారికి ఋణములనిచ్చు అధిక వడ్డీలు పొందుచుండిరి.

నష్టదాయకమైన నిబంధనలు, అధిక వడ్డీల బారిన పడిన ప్రజలు తీవ్ర కష్టనష్టములను ఎదుర్కొన వలసి వచ్చు చుండెను. మెదకు జిల్లాలో వెట్టిచాకిరీ మొదలైన అనేక దుష్పరిమాణములకు ఈ రకమైన ఋణమే మూలమైనది.

వడ్డీరేట్లు పరపతి యోగ్యతపై ఆధారపడి యుండెడివి. స్థితిమంతులు, నిర్ణీత సమయములందు ఋణములను చెల్లించు వారు. సంవత్సరమునకు 6 నుండి 18 శాతము వడ్డీ చెల్లింపవలసి వచ్చెడిది. ఎక్కువ అప్పులలో మునిగియున్న వారు సంవత్సరమునకు 25 నుండి 50 శాతము వరకు కూడా వడ్డీకి అప్పు చేయుచుండెడి వారు.

ఒక్కొక్కమారు వడ్డీ రేటు సంవత్సరమునకు 75% వరకు పెరిగెడిది. కాని సాధారణముగా వడ్డీరేటు 12% నుండి 18% వరకు వసూలు చేయబడుచుండెను.

ప్రకృతి వైపరీత్యములు, పంటల నష్టము, వివాహవులు, గృహ నిర్మాణముల వంటి కారణములచేత రైతులు, గృహస్థులు తప్పని సరిగా ఋణము పొంద వలసి వచ్చుచుండెడిది. ఋణదాతలు దోపిడీ విధానము వలన సామాన్య ప్రజలు, రైతులు దిన దినము ఆర్థికంగా బలహీనులై దిక్కు తోచని స్థితిని పొందిచుండిరి.

## సహకారోద్యమము

క్రీ.శ. 1904వ భారతదేశమున తొలిసారిగా సహకార పరపతి సంఘముల చట్టము అమలు చేయబడినది. దేశమంతటా ఈ చట్టము అమలులోనున్నప్పటికీ - నిజాం ప్రభుత్వం రైతుల తీవ్ర నిరసనను ఎదుర్కొన్నపిమ్మట మాత్రమే క్రీ.శ. 1914 లో హైద్రాబాదు కో-ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీ చట్టమును అమలు చేసినది.

గ్రామీణులకు పరపతి సౌకర్యమేర్పరుచుటకు గ్రామీణులచే పొదుపు చర్యలు అవలింభింప చేయుటకు సహకార సంఘముల స్థాపనమును ఈ చట్టము నిర్దేశించినది. క్రీ.శ. 1915లో హైద్రబాద్ సెంట్రల్ కో-ఆపరేటివ్ బ్యాంక్ రూ. 94607-8-0తో ప్రారంభమైనది. క్రీ.శ. 1920లో మెదక్ జిల్లాలో జిల్లా సహకార పరపతి సంఘములు నెలకొల్పబడి, ప్రాథమిక సహకార సంఘములను పెంపొందించుటకై కృషి కొనసాగినది.

ఆర్థికమాంద్యము వలన, వ్యవసాయోత్పత్తుల ధరలు తగ్గుట వలన సహకార సంఘములు ఆశించిన ఫలితములను అందుకో లేక పోయినవి. అనేక సంఘములు కేంద్ర సహకార బ్యాంకు ఋణములను తిరిగి చెల్లింప లేక పోయినవి.

ప్రాథమిక సహకార సంఘములను పటిష్టపర్చుటకై క్రీ.శ. 1934లో 'ది హైద్రాబాద్ కో-ఆపరేటివ్ ఫైనాన్స్ ఎంక్వైరీ కమిటీ' సూచనలను సరించి, ఉదారమైన నిబంధనల ద్వారా కేంద్ర సహకార బ్యాంకుకు ఆర్థిక సహాయమును ప్రభుత్వము అందించినది. దీనివలన సహకార రంగమునకు పునర్జీవము ఏర్పడినది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరము నిత్యావసర సరుకులకు కొరత ఏర్పడినది. అపుడు సహకార ఉద్యమము తన రెండవ దశయందుండినది. ఆహార ధాన్యములు, చక్కెర, కిరసనాయిలు, వస్త్రములు మొదలగు నిత్యావసర వస్తువులను సరఫరా చేయు బాధ్యతను ఈ సంఘములు నిర్వహించినవి. ఈ సమయముననే తాలుకా అభివృద్ధి యూనియన్లు మరియు ప్రజాసంక్షేమార్థము ధాన్యపు బ్యాంకులు ఏర్పాటు చేయబడినవి.

ఈ ధాన్యపు బ్యాంకులు రైతులకవసరమైనప్పుడు సహాయపడు బాధ్యతను వహించెను. అప్పటికి దేశములో ఎచటనూ ఈ విధానము లేకుండెను.

సహకార సంఘముల మూడవ దశలో వ్యవసాయేతర సహకార సంఘములు ప్రధాన పాత్ర వహించినవి. చేనేత సహకార సంఘములు, శ్రామిక సహకార సంఘములు, గీత పారిశ్రామిక సహకార సంఘములు ఏర్పడినవి.

## సహకార వ్యవస్థ

ఈ సహకార వ్యవస్థలో రెండు విధములైన సొసైటీలు కలవు. జిల్లా కేంద్ర సహకార బ్యాంకు (డి.సి.సి.బి) ఆధీనములో ఉండి, కేంద్ర బ్యాంకుచే ఋణములు మంజూరీ గావించుకొని ప్రాథమిక సభ్యుల కందజేయు ప్రాథమిక సహకార సంఘవ్యవస్థ ఒకటి. సంఘ సభ్యులే స్వయముగా పెట్టుబడులను పెట్టుకొని నడుపుకొను సంఘము మరియొకటి. ఈ సంస్థ "జిల్లా సహకార మార్కెటింగ్ సొసైటీ" (డి.సి.యమ్.యస్) ఆధీనంలో ఉండును. ఈ సంస్థ అధ్యక్షులుగా శ్రీ ఎ.కె.గంగాధరరావుగారు ఎన్నికై ఐదు సంవత్సరముల నుండి ప్రజోపయోగ కార్యక్రమములను నిర్వహించుచున్నారు.

జిల్లా కేంద్ర సహకార బ్యాంకునకు ప్రాథమిక సహకార సంఘములచే ఎన్నుకోబడిన 21 మంది డైరక్టర్లు ఉందురు. ఆ 21 మంది తమ బ్యాంకునకు అధ్యక్ష, ఉపాధ్యక్షులను ఎన్నుకొందురు. ప్రస్తుతము మెదక్ జిల్లా కేంద్ర సహకార బ్యాంకునకు శ్రీ ఎలక్షన్ రెడ్డిగారు అధ్యక్షులుగా ఉన్నారు. వీరు ఎన్నుకోబడిన నాటి నుండి వీరి పదవి కాలమున - ప్రాథమిక సహకార సంఘ సభ్యులకు ఇతోధిక సేవ చేయుచున్నారు. ఈ సంస్థ ద్వారా జిల్లాలోని రైతులకు తక్కువ వడ్డీతో పంట ఋణాలను పరిమిత కాలమున అందజేయుటేగాక వ్యవసాయమునకు అవసరమగు బావుల త్రవ్వకమునను బోర్లు వేయించుకొనుటకు విద్యుత్ మోటర్లకు ఆయిల్ ఇంజన్లకు, ట్రాక్టర్లు మొదలగు వాటికి దీర్ఘకాలిక ఋణములు అందజేయబడుచున్నవి. మరియు పాడి పరిశ్రమ, కోళ్ల పరిశ్రమ, ఉద్యాన వనముల పెంపకము, పళ్ల తోటలు పెంపకమునకు కూడా ఋణాలీయ బడుచున్నవి.

జిల్లాలోని రైతులకు ఈ బ్యాంకులు మేలి రకపు విత్తనములను, రసాయనిక ఎరువులను ప్రభుత్వ ధరలలో సరఫరా చేయుచున్నవి. గ్రామీణ ప్రాంతములలో గిడ్డంగుల నిర్మాణమునకు కూడా తోడ్పడుచున్నవి.

మెదకు జిల్లా కేంద్ర సహకార బ్యాంకు లిమిటెడ్ సంగారెడ్డిని కేంద్రముగా చేసుకొని 21 బ్యాంకు శాఖలలో 220 ప్రాథమిక వ్యావసాయ సహకార సంఘములకు తన ఆర్థిక సహాయ సేవలను అందించుచు అభివృద్ధి పథంలో నడచుచున్నది.

## జిల్లా సహకార బ్యాంకు స్టేట్‌మెంట్

| క్ర.సం | వివరములు | ప్రభుత్వము | | వ్యక్తిగత సభ్యులు | | వ్యవసాయేతర సంఘములు | | మొత్తము | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | సంఖ్య | రూ. | సంఖ్య | రూ. | సంఖ్య | రూ. | సంఖ్య | రూ. |
| 1. | సంవత్సర ఆరంభములో నిల్వ | 1 | 42.92 | 53065 | 113.10 | 693 | 458.51 | 53759 | 614.53 |
| 2. | కొత్తగా చేరిన సభ్యుల సంఖ్య | - | - | - | 15.29 | - | 129.27 | - | 144.56 |
| 3. | ప్రస్తావన సంవత్సరములో తొలగింపబడిన సభ్యుల సంఖ్య | - | 0.5 | - | 2.20 | - | 7.81 | - | 10.51 |
| 4. | సంవత్సరాంతమున నిల్వ ఉన్న సభ్యుల సంఖ్య | 1 | 42.42 | 53065 | 126.19 | 693 | 579397 | 53759 | 748.58 |

### జిల్లా సహకా కేంద్ర బ్యాంకు లి. మెదక్, సంగారెడ్డి

ఎన్నిక కాబడిన ప్రజా ప్రతినిధులు / అధ్యక్షులు

| | |
|---|---|
| 1. సర్వశ్రీ బి. నర్సింహ్మా రెడ్డి | 1957 - 1964 |
| 2. సర్వశ్రీ యం. రంగారెడ్డి | 1981 - 1985 |
| 3. సర్వశ్రీ జి. నవాజ్‌రెడ్డి | 1987 - 1990 |
| 4. సర్వశ్రీ యం. వాసుదేవ రావు | 1990 - 1994 |
| 5. సర్వశ్రీ జి. ఎలక్షన్‌రెడ్డి | 1995 నుండి |

అంతే కాకుండా సమయానుకూలంగా బ్యాంకు పరిపాలనా బాధ్యతలు నిర్వహించడానికి జిల్లా కలెక్టర్లు / ప్రభుత్వ అధికారులతో పాటు, ప్రజాప్రతినిధులు కూడా నామినేట్ చేయటం జరిగింది.

# జిల్లా సహకార కేంద్ర బ్యాంకు లి.,
# మెదకు ప్రధాన కార్యాలయము : సంగారెడ్డి

## పాలక వర్గము 1995నుండి

| | | | |
|---|---|---|---|
| 1. | సర్వశ్రీ | జి. ఎలక్షన్ రెడ్డి | అధ్యక్షులు |
| 2. | ,, | పి. జయపాల్‌రెడ్డి | ఉపాధ్యక్షులు |
| 3. | ,, | టి. అంజిరెడ్డి | డైరెక్టరు |
| 4. | ,, | ఎ. శేషాచారి | ,, |
| 5. | ,, | ఎం. భూమిరెడ్డి | ,, |
| 6. | ,, | ఎస్. రవీంధర్ రెడ్డి | ,, |
| 7. | ,, | పి. బుచ్చిరెడ్డి | ,, |
| 8. | ,, | ఎం. భూపాల్ రెడ్డి | ,, |
| 9. | ,, | సి.హెచ్. ముత్యంరెడ్డి | ,, |
| 10. | ,, | యస్.రాంచంద్రా రెడ్డి | ,, |
| 11. | ,, | పి.కృష్ణ | ,, |
| 12. | ,, | ఎన్.చంద్రయ్య | ,, |
| 13. | ,, | బి. పాపయ్య | ,, |
| 14. | ,, | ఎల్. హరిచందర్ | ,, |
| 15. | ,, | ఖాజా మొయినుద్దీన్ | ,, |
| 16. | ,, | ఎ.పెంటయ్య | ,, |
| 17. | ,, | ఆర్.యం.ప్రభుగౌడ్ | ,, |
| 18. | ,, | జి. జనార్ధన్ | ,, |
| 19. | ,, | జిల్లా సహకార అధికారి | ప్రభుత్వ ప్రతినిధి |
| 20. | ,, | ప్రాజెక్ట్ డైరక్టర్ (డి.ఆర్.డి.ఎ) | ,, |
| 21. | జిల్లా అభివృద్ధి అధికారి నాబార్డు | | ప్రత్యేక ఆహ్వానితులు |

## సింగల్ విండోలు - అధ్యక్షులు

| క్ర.సం. | సంఘము / బ్రాంచ్ | అధ్యక్షుని పేరు |
|---|---|---|
| **1.** | **సంగారెడ్డి శాఖ** | |
| 1. | ఫసల్ వాడి | యస్. హరికిషన్ |
| 2. | ఇస్మాయిల్ ఖాన్ | పి. కాంత రెడ్డి |
| 3. | కంది | యన్. రాములు |
| 4. | కల్వేముల | వై. పెంటా రెడ్డి |
| 5. | తోగరపల్లి | డి.హెచ్.రాంచెంద్రా రెడ్డి |
| 6. | మారెపల్లి | పి.ఐ.సి. |
| 7. | గోల్లపల్లి | పి. బుచ్చిరెడ్డి |
| 8. | పెద్దాపూర్ | ఆర్. ప్రతాప్ రెడ్డి |
| 9. | కలబ్‌గూర్ | జి. రాజమల్లయ్య |
| **19.** | **పటన్‌చేరు శాఖ** | |
| 1. | పటన్‌చెరు | యన్. సత్తయ్య |
| 2. | పోలకపల్లి | బి. మాణిక్ రెడ్డి |
| **20.** | **సదాశివపేట శాఖ** | |
| 1. | ఆత్మకూర్ | సత్యనారాయణ రెడ్డి |
| 2. | వెల్టూర్ | పురుశోత్తం రావు |
| 3. | సదాశివ్ పేట | జి. సుధాకర్ రెడ్డి |
| 4. | కొల్‌కూర్ | జి. మాణిక్ రెడ్డి |
| 5. | మలికార్జున్‌పల్లి | జి. నవాజు రెడ్డి |
| 6. | చెల్మడ కలాన్ | టి. రాం రెడ్డి |
| 7. | అంతారము | హాజిపాశా |
| 8. | ఖమ్మంపల్లి | కే. నర్సింలు |

| క్ర.సం. | సంఘము / బ్రాంచ్ | అధ్యక్షుని పేరు |
|---|---|---|
| **4.** | **జహీరాబాద్ శాఖ** | |
| 1. | ఇప్పెపల్లి | అంజయ్య |
| 2. | పస్తాపూర్ | మహిపాల్ రెడ్డి |
| 3. | మల్చెల్మ | బి. సంగమేశ్వర్ |
| 4. | సత్వార్ | బి. శ్రీనివాస్ రెడ్డి |
| 5. | పీచిరాగడ్ | రాంకృష్ణా రెడ్డి |
| 6. | హద్నూర్ | ఆర్. విదలె రెడ్డి |
| 7. | ఆర్ బి నాయకల్ | వై. సుభాష్ |
| **5.** | **ఝురాసంగమ్ శాఖ** | |
| 1. | ఝురాసంగమ్ | డి. నీరాశెట్టి |
| 2. | యేడాకులపల్లి | పి. మల్లన్న |
| 3. | నల్లంపల్లి | కె. కిషన్ |
| 4. | ఇందూర్ | శంకర్ |
| **6.** | **జోగిపేట శాఖ** | |
| 1. | చింతకుంట | |
| 2. | నేరెఢి గుంట | మన్నె సురేందర్ |
| 3. | అక్సానిపల్లి | పి.ఐ.సి. |
| 4. | కొడెకల్ | జి. నర్సింహారెడ్డి |
| 5. | పుల్కల్ | ఏ. వేంకటేశ్వర్ రెడ్డి |
| 6. | పోచారము | ఆర్. కృష్ణా రెడ్డి |
| 7. | మిన్పూర్ | టి. శ్రీపతాప్ రెడ్డి |
| 8. | కొర్పోల్ | - |
| 9. | గడిపెద్దాపూర్ | ఇ. సెంటా గౌడ్ |
| 10. | ముస్లాపూర్ | కే. శ్రీనివాస్ రెడ్డి |
| 11. | అందోల్ | - |
| 12. | శివంపేట | పి. పభాకర్ రెడ్డి |
| 13. | ముదిమానిక్ | ఎమ్. దుర్గారెడ్డి |
| 14. | డాకూర్ | పి. జయపాల్ రెడ్డి |
| 15. | ఖాదిరాబాద్ | బి. నరేందర్ రెడ్డి |
| **7.** | **పాపన్నపేట్ శాఖ** | |
| 1. | పల్వంచ | జూప్పనేజర / పి.ఐ.సి |
| 2. | టేక్మాల్ | శ్రీరాం మల్లేషము |
| 3. | చీకోడ్ | సుధీర్ చంద్ర దేశ్పాండే |
| 4. | పాపన్నపేట్ | పి. లక్ష్మీనారాయణ |
| 5. | చిల్వార్ | డి. శుభాష్ రావు |
| 6. | అల్లాదుర్గం | పి.ఐ.సి. |

| క్ర.సం. | సంఘము / బ్రాంచ్ | అధ్యక్షుని పేరు |
|---|---|---|
| **8.** | **శంకరంపేట శాఖ** | |
| 1. | మల్కాపూర్ | మన్నె నాగభూషణము |
| 2. | శంకరంపేట | ఎ. శేషాచారి |
| 3. | రేగోడ్ | కె. రాధాకిషన్ |
| 4. | దేవ్నూర్ | బి. పాపయ్య |
| **9.** | **మెదక్ శాఖ** | |
| 1. | మెదక్ | చిట్యాలనర్సింలు |
| 2. | కుచన్పల్లి | యస్. నారాయణరెడ్డి |
| 3. | తోగుట | పి. వెంకట రెడ్డి |
| 4. | సర్దన | సి. లక్ష్మినర్సింగరావు |
| 5. | ముత్తాయిపల్లి | పి.నర్సింగ్ రావు |
| 6. | బూర్గుపల్లి | పి. రవిందర్ రెడ్డి |
| 7. | వెంకటపూర్ | బి. శివయ్య |
| 8. | రాజుపల్లి | డి. మల్లెషం |
| **10.** | **రామాయంం పేట శాఖ** | |
| 1. | అక్కన్న పేట | టి. శ్రీశైలం |
| 2. | కాట్రాయాల్ | రామేశ్వర్ రావు |
| 3. | నస్కల్ | పి. హన్మంత్ రెడ్డి |
| 4. | నందిగామ | హెచ్. ముత్యం రెడ్డి |
| 5. | డి. ధర్మారం | పర్సన్ ఇన్చార్జి |
| 6. | రాయలాపూర్ | వి. దేవేందర్ రెడ్డి |
| 7. | రామాయంపేట | - |
| 8. | వెంకటాపూర | యస్. మల్లారెడ్డి |
| **11.** | **చేగుంట శాఖ** | |
| 1. | నార్సింగి | పి. కిష్టా రెడ్డి |
| 2. | మాసాయిపేట | వి. నారాయణ రెడ్డి |
| 3. | ఇబ్రాహింపూర్ | ఇ. లచ్చాలు |
| 4. | రెడ్డి పల్లి | శ్రీనివాసు రెడ్డి |
| 5. | మక్కారాజ్పేట | జి. భుక్తిరాజి |
| 6. | చందం పేట | పి. రెంటయ్య |
| 7. | చందాయిపేట | జి. ప్రతాపు రెడ్డి |
| 8. | మడూర్ | పర్సన్ ఇన్చార్జి |
| 9. | జాంగరాయి | ఎ.కె. గంగాధర్ రావు |
| 10. | సూరారము | తిరుపతి రెడ్డి |
| **12.** | **వెల్దుర్తి శాఖ** | |
| 1. | వెల్దుర్తి | కె. సంజీవ్ గౌడు |
| 2. | ఉప్పులింగాపూర్ | వి. సంజీవ రెడ్డి |
| 3. | కుక్నూర్ | కె. సిద్ధిరామ్రెడ్డి |
| 4. | మంగలపర్తి | కె. పోతి రెడ్డి |

| క్ర.సం. | సంఘము / బ్రాంచ్ | అధ్యక్షుని పేరు |
|---|---|---|
| 5. | దామరంచ | మని దుర్గా రెడ్డి |
| 6. | రామాయిపల్లి | డి. నారాయణ రెడ్డి |
| **13. నారాయన్ ఖేడ్ శాఖ** | | |
| 1. | నిజామ్‌పేట | యమ్.ఎ.హకీమ్ |
| 2. | కంగ్టి | పండరినాథ్ రావు |
| 3. | నాసర్ | నర్సింగ్‌రావు |
| 4. | నారాయణ్ ఖేడ్ | కె. సంగమేశ్వర్ |
| 5. | నునూర్ | బి. నర్సింహరెడ్డి |
| 6. | అబ్బెంద | ప్రతాపురావు |
| 7. | కరస్‌గుత్తి | హన్మంతు |
| 8. | రాయపర్తి | పి. రాములు |
| 9. | బాచెపల్లి | డి. శ్రీనివాసు గౌడ్ |
| **14. దుబ్బాక శాఖ** | | |
| 1. | ఇర్కోడ్ | సి.హెచ్. సత్యనారాయణ |
| 2. | రాఘవపూర్ | బి. సత్యనారాయణ గౌడ్ |
| 3. | నారాయరావుపేట | కె. బాలయ్య |
| 4. | దుబ్బాక | యమ్. నర్సింహ రెడ్డి |
| 5. | తిమ్మపూర్ | యమ్ ఎల్లయ్య |
| 6. | చిట్టాపూర | కె. రాములు |
| 7. | ఆకారం | కె. స్వామి గౌడు |
| 8. | కంగాల | బి. నీరా రెడ్డి |
| 9. | భూంపల్లి | యమ్. నగేష్‌రెడ్డి |
| 10. | వెంకటరావు పేట | పి. వేంకటేశ్వర్ రెడ్డి |
| 11. | చెప్యాల | యమ్. రాజేశ్వర్ రెడ్డి |
| 12. | ధర్మాజిపేట | వి. రాజిరెడ్డి |
| 13. | మిర్దొడ్డి | యమ్. చంద్రయ్య |
| **15. తూప్రాన్ శాఖ** | | |
| 1. | వర్గల్ | వి. భాల్ రెడ్డి |
| 2. | తూప్రాన్ | ఆర్. ప్రతాప్ గౌడ్ |
| 3. | మనోహరబాద్ | జి. ఎలక్షన్ రెడ్డి |
| 4. | దౌలతాబాద్ | డి. రాంచెంద్రరెడ్డి |
| 5. | రామారము | ఎ. వెంకట రెడ్డి |
| 6. | మీనాజిపేట | యం. మల్లెషము |
| 7. | వల్లూర్ | పి.పోచా రెడ్డి |
| 8. | మజీదపల్లి | వెంకటయ్య |
| 9. | యావ పూర్ | జి. రాజిరెడ్డి |

| | | |
|---|---|---|
| 10. | ఇస్లాంపూర్ | యన్. భాలక్రిష్ణా రెడ్డి |
| 11. | కాళ్లకల్ | జె. ప్రతాప్ రెడ్డి |
| 12. | వడ్డెపల్లి | జి. రాజ్‌వీర |
| 13. | తుంకి బొల్లారము | బి. క్రిష్ణ |

**16. సిద్దిపేట శాఖ**

| | | |
|---|---|---|
| 1. | పొన్నాల్ | ఏ చొక్కా రెడ్డి |
| 2. | మిట్టపల్లి | యస్. శ్రీనివాసు |
| 3. | నంగనూర్ | కె. రాంచెంద్రరెడ్డి |
| 4. | సిద్దిపేట | జి. శివకుమార్ |
| 5. | వక్లుంపూర్ | శ్రీకాంత్ రెడ్డి |
| 6. | చిన్నగుండెవల్లి | యమ్. ప్రభాకర్ వర్మ |
| 7. | బద్దిపడగ | పర్సన్ ఇన్‌చార్జి |
| 8. | పి. మాసనపల్లి | బి. ముత్తా గౌడ్ |
| 9. | దుద్దెడ | యన్. దుర్గా రెడ్డి |
| 10. | పాలమకుల | వి. పోచయ్య |
| 11. | కొండపాక | జి. నర్సింహ రెడ్డి |
| 12. | మర్పడ్గ | యమ్. భూం రెడ్డి |
| 13. | కుకున్నూర్‌పల్లి | ఖాజ మొయినుద్దిన్ |
| 14. | చెర్లాంకిరెడ్డిపల్లి | యస్. రవీందర్ రెడ్డి |
| 15. | గంగపూర్ | కె. ఎల్లయ్య |
| 16. | గురాలగొంది | డి. సంజీవ రెడ్డి |
| 17. | ఎటిగడ్డ కిష్టాపూర్ | బి. నర్సింహ రెడ్డి |

**17. గజ్వేల్ శాఖ**

| | | |
|---|---|---|
| 1. | గజ్వేల్ | మెనెజర్ / ఐ.పి.సి |
| 2. | దాచారము | వి. హెచ్. వేంకటరాంరెడ్డి |
| 3. | ప్రజ్ఞాపూర్ | ఎ. బాల్ కుమార్ |
| 4. | బి. వెంకటపూర్ | వి. నర్సింహ రెడ్డి |
| 5. | మైలారమ | కె. మల్లారెడ్డి |
| 6. | చెబర్తి | ఇ. రాంచంద్రయ్య |
| 7. | చిన్న కిష్టాపూర్ | యస్. రాంచంద్రా రెడ్డి |
| 8. | నరసంపల్లి | జి. శ్రీనివాస్ |
| 9. | పిడ్‌చెడ్ | డి. రాంరెడ్డి |
| 10. | దిలాల్‌పూర్ | సహాయక్ మెనెజర్ / పి.ఐ.ఇ |
| 11. | ఆహ్మిపూర్ | కె. పుష్పా రెడ్డి |
| 12. | జగదేవుపూర్ | వి. రవి |
| 13. | తీగుల్ | డి. దయానంద రెడ్డి |
| 14. | గొల్లపల్లి | యన్. జితేందర్ రెడ్డి |
| 15. | జాలిగామ | బి. ప్రభాకర్ రావు |
| 16. | కొడకండ్ల | యమ్. రంగారెడ్డి |
| 17. | పాములపర్తి | యన్. హన్మంతురావు |
| 18. | బస్వాపూర్ | వి. సంజీవ రెడ్డి |
| 19. | ములుగు | ఎ. పెంటయ్య |
| 20. | రాయప్రోల్ | ఎ. మల్లెషం |

| క్ర.సం. | సంఘము / బ్రాంచ్ | అధ్యక్షుని పేరు |
|---|---|---|
| **18.** | **దౌలతాబాద్ శాఖ** | |
| 1. | నాగులపల్లి | వై. వేంకటరాంరెడ్డి |
| 2. | చిట్కూల్ | రామ్‌గౌడ్ |
| 3. | సోమక్కపేట | వశ్వంబర్ స్వామి |
| 4. | చిల్పచెడ్ | దుర్గా రెడ్డి |
| 5. | హత్నూర | వి. నర్సింలు |
| 6. | సిర్‌పూర్ | పి. రాజయ్య |
| 7. | మంగాపూర్ | రాంచెంద్రా రెడ్డి |
| 8. | కాసాల | పి.ఐ.సి |
| 9. | తార్కాన్‌పేట | యమ్. వాసుదేవరావు |
| 10. | బోరపట్ల | ఆర్. సంగారెడ్డి |
| **19.** | **నర్సాపూర్ శాఖ** | |
| 1. | నర్సాపూర్ | ఏ. సత్యనారాయణ |
| 2. | చిన్న చింతకుంట | యస్. సత్యగౌడ్ |
| 3. | మోహమ్మద్ నగర్ | వి. అంజిరెడ్డి |
| 4. | వాయిలాల | మధుసుధన్ రెడ్డి |
| 5. | రాయిలా పూర్ | టి. అంజిరెడ్డి |
| 6. | ముద్రాజపల్లి | వి. నర్సింగ్ రావు |
| 7. | శివంపేట | జి. శ్రీనివాసు గౌడ్ |
| 8. | గోమారము | పి. బుచ్చిరెడ్డి |
| 9. | గుమ్మడిదల | శంకర్ |
| **20.** | **వంబోజిపల్లి శాఖ** | |
| 1. | పెరూర్ | యమ్. రాజు |
| 2. | ఎనిగండ్ల | చి. లక్ష్మీనారాయణ రెడ్డి |
| 3. | రంగంపేట | యమ్. నాగరాజు |
| 4. | రాయలమడుగు | పి. నర్సింహా రెడ్డి |

# వాణిజ్య బ్యాంకులు

సమాజాభివృద్ధిలో, సాంఘిక పునర్ని ర్మాణములో వాణిజ్య బ్యాంకుల పాత్ర ఎంతో కీలకమైనది.

సమాజములోని వ్యక్తుల నుండి పొదుపు మొత్తములను సేకరించి, ఉత్పాదక కార్యక్రమములకు ఆ ధనమును వినియోగించి పొదుపు చేసిన వ్యక్తులకు వడ్డీతో సహా తగు సమయమున అందించుచు వాణిజ్య బ్యాంకులు గొప్ప కృషి చేయుచున్నవి.

మెదక్ జిల్లాలో మొట్టమొదటగా జహిరాబాద్‌లో 1969లో స్టేట్ బ్యాంక్ ఆఫ హైద్రాబాద్ బ్యాంకు ప్రారంభమైనది.

నేడు 179 బ్యాంకు శాఖలు జిల్లా అంతట విస్తరించి ఉన్నవి. వాటిల్లో 93 వాణిజ్య బ్యాంకులు కలవు. గ్రామీణ ప్రాంతాలలో 68 శాఖలు ఉపనగరాలలో 25 శాఖలు ప్రజలకు తమ సేవలు అందించుచున్నవి.

సగటున ప్రతి 12,700 మంది జనాభాకు ఒక బ్యాంకు చొప్పున నెలకొల్పబడి కరెంట్ సేవింగ్స్ రికరింగ్, ఫిక్స్‌డ్ డిపాడిట్లు స్వీకరించుచూ, ఉత్పాదక పెట్టుబడులకు ఋణములను మంజూరు చేయుచూ మెదక్ జిల్లా అభివృద్ధికి తోడ్పడుచున్నవి.

### జిల్లాలోని బ్యాంకులు – శాఖలు

| | జాతీయ బ్యాంకులు | గ్రామీణ శాఖలు | పట్టణ శాఖలు | మొత్తము |
|---|---|---|---|---|
| 1. | స్టేట్ బ్యాంక్ ఆఫ ఇండియా | 23 | 6 | 29 |
| 2. | స్టేట్ బ్యాంక్ ఆఫ హైద్రాబాద్ | 13 | 9 | 22 |
| 3. | ఆంధ్రబ్యాంక్ | 11 | 4 | 15 |
| 4. | సిండికేట్ బ్యాంక్ | 8 | 1 | 9 |
| 5. | సెంట్రల్ బ్యాంక్ ఆఫ ఇండియా | 5 | 2 | 7 |
| 6. | యునైటెడ్ కమర్షియల్ బ్యాంక్ ఆఫ ఇండియా | 3 | 1 | 4 |
| 7. | ఇండియన్ బ్యాంక్ | 1 | 1 | 2 |
| 8. | అలహాబాద్ బ్యాంక్ | 1 | - | 1 |
| 9. | కెనరా బ్యాంక్ | 1 | - | 1 |
| 10. | కార్పొరేషన్ బ్యాంక్ | 1 | - | 1 |
| 11. | యూనియన్ బ్యాంక్ ఆఫ ఇండియా | 1 | - | 1 |
| 12. | పంజాబ్ నేషనల్ బ్యాంక్ | - | 1 | 1 |
| | **మొత్తము** | **68** | **25** | **93** |

# మంజీరా గ్రామీణ బ్యాంక్
# (యమ్.జి.బి)

ప్రాంతీయ గ్రామీణ బ్యాంకుల స్థాపనలో భాగంగా స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (యస్.బి.ఐ) చే ప్రతిపాదింపబడి "మంజీర గ్రామీణ బ్యాంక్" 1982 మార్చి 31న మెదక్ జిల్లాలో స్థాపించబడినది.

ఈ బ్యాంకు కేంద్ర ప్రభుత్వ వాటా 50% స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా 35% ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము 15% వాటాధనంతో ప్రారంభించబడింది.

1982లో కోటి రూపాయలు డిపాజిట్లు, 29 లక్షల అడ్వాన్సులతో మొట్టమొదట ఆరు బ్రాంచ్‌లలో మంజీరా గ్రామీణ బ్యాంకు ప్రారంభమైనది.

సంగారెడ్డి, శివ్వంపేట, పుల్కల్, తేర్పోల్, చిట్కుల్‌లలో ప్రారంభమైన బ్రాంచ్ కార్యాలయాలు అంచెలంచెలుగా నేడు జిల్లాలో నలువయాలలా విస్తరించినాయి. నేడు 60 శాఖలలో 535 గ్రామాలను తన సేవా పరిధిలో కలిగియున్నది.

వాణిజ్య బ్యాంకులకన్న ఎక్కువ వడ్డీని చెల్లిస్తూ, గ్రామీణ ప్రాంతాలలో డిపాజిట్ల సేకరణలో వాణిజ్య బ్యాంకులతో పోటీపడ్తూ ఎప్పటికప్పుడు లక్ష్యాలను అధిగమిస్తూ పురోగమిస్తున్నది.

నేడు మంజీర గ్రామీణ బ్యాంకులు 1.08 లక్షల మంది సభ్యులను కలిగి 146.97 కోట్ల డిపాజిట్లు సేకరించి, 88 వేల మందికి 125.64 కోట్ల రూపాయాలు అడ్వాన్సులు చెల్లించుచున్నది. 1999 - 2000 సంవత్సరంలో ఈ బ్యాంకు రు.551 లక్షలు లాభం గడించి ఇతర గ్రామీణ బ్యాంకుల కన్నా అగ్రస్థానంలో నిల్చినది.

జిల్లాలోని 45 మండలాలలో నాలుగు మండలాలు మినహా మిగతా అన్ని మండలల్లో ఈ బ్యాంకు శాఖలు విస్తరించినవి. ఈ బ్యాంకు ఋణాలలో 90% బలహీన వర్గాలకు మరియు 65% వ్యవసాయ రంగానికి కేటాయించి బలహీన వర్గాల అభివృద్ధికి ఎంతగానో కృషి చేయుచున్నది.

మంజీరా గ్రామీణ బ్యాంకు వ్యవసాయ రంగమునకేగాక వ్యవసాయేతర రంగాల వైపుకు కూడా తన దృష్టిని సారించి గృహ నిర్మాణమునకు, ఉన్నత విద్యాభ్యాసమునకు, చిన్న తరహా పరిశ్రమలకు కూడా ఋణములు అందించుచూ జిల్లా సర్వతో ముఖాభివృద్ధికి తన వంతు కృషి చేయుచున్నది.

గ్రామీణ ఋణ పరపతి విధానంలో ఋణాల రికవరీ, తక్కువ నిర్వాహణ వ్యయం, అధికంగానూ కలుగు నష్టాలను నివారించుకోవడానికి కొన్ని వినూత్నమైన విధానములను ఈ బ్యాంకు చేపట్టినది. స్వయం సహాయక బృందాల(ఎస్.హెచ్.జి), రైతు క్లబ్బులను ఏర్పాటు చేయడం స్వయం సహాయక బృందాలను స్వచ్ఛంద సంస్థలతో అనుసంధానం చేయుట ద్వారా పొదుపు అలవాటును చేయడం ఈ

విధానాలలో ముఖ్యమైనది. ఇప్పటి వరకు మంజీరా గ్రామీణ బ్యాంకు నాబార్డు సౌజన్యంతో 3836 మహిళా స్వయం సహాయక బృందాల ఏర్పాటు చేసి రూ. 695 లక్షలు ఆర్థిక సహాయము అందజేసినది. ఇప్పటి వరకు ఏర్పాటు చేసిన అన్ని గ్రూపులలోనూ రికవరీ 99% ఉండటం విశేషము. వికాస్ వాలంటీర్ క్లబ్బులను కూడా ఏర్పాటు చేయడం జరిగినది.

శ్రీలంక, యుగాండా మొదలైన దేశాల ప్రతినిధులు మంజీరా గ్రామీణ బ్యాంకు ప్రవేశపెట్టిన సెల్ఫ్ హెల్ప్ గ్రూప్ పథకాన్ని పరిశీలించి ప్రశంసించినారు.

మంజీరా గ్రామీణ బ్యాంకు రక్తదాన శిబిరాలను, ఐక్యాంపులను, మొక్కల సంరక్షణా భాధ్యతలను కూడా చేపట్టి తన సామాజిక భాధ్యతలను నెరవేరుస్తున్నది.

## గ్రామీణ బ్యాంకులు

గ్రామీణ పరపతి విధానములో నెలకొని ఉన్న అంతరాలను తొలగించి చిన్న, సన్నకారు రైతులు, వ్యవసాయ కూలీలు, గ్రామీణ చేతి వృత్తుల వారికి వారి అవసరములకు అనుగుణంగా ఋణ సదుపాయములను అందించుటకై 1975 లో "ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు" (ఆర్.ఆర్.బి) ఏర్పాటు చేయబడినవి.

వ్యవసాయదారులకు పంటల కాలములందు ఎరువులు, విత్తనములు, సరఫరా చేయుటలోను, నగలు, బంగారు ఆభరణములు వ్యవసాయ ఫలసాయముల హామీపై స్వల్ప, ధీర్ఘకాలిక ఋణముల నందజేయుచూ బలహీన వర్గాలకు ప్రభుత్వ పథకాలను అమలు చేయుటలో ఈ గ్రామీణ బ్యాంకులు ప్రశంసనీయమైన పాత్రను పోషిస్తున్నాయి.

### ప్రాంత్రీయ గ్రామీణ బ్యాంకులు

| జాతీయ బ్యాంకులు | గ్రామీణ | పట్టణ శాఖలు | మొత్తము శాఖలు |
|---|---|---|---|
| ప్రాంత్రీయ గ్రామీణ బ్యాంకులు | | | |
| 1 మంజీరా గ్రామీణ బ్యాంక్ | 50 | 10 | 60 |
| ప్రైవేట్ బ్యాంకులు | | | |
| 1. వైశ్యా బ్యాంక్ | 3 | - | 3 |
| కో- ఆపరేటివ్ బ్యాంక్ | | | |
| 1. మెదక్ జిల్లా సహకార కేంద్ర బ్యాంక్ | 13 | 8 | 21 |
| ఫైనాన్షియల్ సంస్థలు | | | |
| ఎ.పి.ఎస్.ఎఫ్.సి | - | 2 | 2 |
| మొత్తము | 134 | 45 | 179 |

# బ్యాంకులు - బ్రాంచెలు

## స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా

1. ఏయిర్ ఫోర్స్ అకాడమి-
   టౌన్‌షిప్
2. అల్లాదుర్గం
3. చేగుంట
4. దేవునూర్
5. దిగ్‌వాల్
6. గజ్వేల్
7. గుమ్మడిదల
8. జగ్‌దేవ్‌పూర్
9. జోగిపేట
10. కల్‌హేర్
11. కంది
12. కౌడిపల్లి
13. ములుగు
14. మునిపల్లి
15. ముత్తంగి
16. నారాయణ్‌ఖేడ్
17. నర్సాపూర్ (ఎడిబి)
18. నార్సింగి
19. నిజాంపేట్
20. నిజాంపూర్
21. న్యాల్‌కల్
22. సదాశివపేట్
23. సంగారెడ్డి
24. శంకరంపేట్
25. సిద్దిపేట్
26. సిద్దిపేట్ (ఎడిబి)
27. తూప్రాన్ (ఎడిబి)
28. వర్గల్
29. జహీరాబాద్

## ఆంధ్రా బ్యాంక్

1. భానూర్
2. దొమ్మాట
3. దొంతి
4. కొండపాక
5. మద్దూరు
6. మిర్‌దొడ్డి
7. మొగడంపల్లి
8. నారాయణ్‌రావ్ పేట్
9. నంగనూర్
10. రామచంద్రపూరమ్
11. సంగారెడ్డి
12. సిద్దిపేట్
13. టెక్‌మాల్
14. తిమ్మాపూర్
15. జహీరాబాద్

## స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్

1. దుబ్బాక
2. గజ్వేల్
3. హత్నూర్
4. ఇస్మాయిల్‌ఖాన్ పేట్
5. జోగిపేట
6. కొడకాండ్ల
7. కోహీర్
8. మెదక్
9. మెదక్ (ఎడిబి)
10. నారాయణ్‌ఖేడ్
11. నర్సాపూర్
12. పటాన్‌చెరు
13. రామాయంపేట్
14. రంగంపేట్
15. ఆర్.సి. పురమ్
16. సదాశివ్‌పేట్
17. సంగారెడ్డి
18. శంకరంపేట్
19. సిద్దిపేట్
20. సిర్‌గాపూర్
21. ఎదుమైలారం
22. జహీరాబాద్

## సిండికేట్ బ్యాంక్

1. భర్దిపుర్
2. హద్‌నూర్
3. జరాసంగమ్
4. కవేలి
5. కొత్తూరు
6. కొల్చారం
7. మలచలమా
8. పాలమాకుల
9. జహీరాబాద్

## సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా

1. గడిపెద్దాపూర్

2. కల్వకుంట

3. పటాన్‌చెరు

4. రాయిపోల్

5. రామాయంపేట్

6. వెల్దుర్తి

7. జహీరాబాద్.

యునైటెడ్ కమర్షియల్ బ్యాంక్

1. అత్మకూర్

2. పాటిఫానాన్‌పూర్

3. పాడిచన్‌పల్లి

4. సంగారెడ్డి

ఇండియన్ బ్యాంక్

1. మెదక్

2. శివంపేట్

అల్హాబాద్ బ్యాంక్

1. దౌల్తాబాద్

కెనరా బ్యాంక్

1. మసాయిపేట్

కార్పొరేషన్ బ్యాంక్

1. తూప్రాన్

యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా

1. చిన్నకోడూర్

పంజాబ్ నేషనల్ బ్యాంక్

1. పటాన్‌చెరు

ప్రైవేట్ బ్యాంకులు : వైశ్య బ్యాంక్

1. పటాన్‌చెరు

2. సదాశివపేట్

3. సిద్ధిపేట్

క్రో-ఆపరేటివ్

(మెదక్ జిల్లా కొ-ఆపరేటివ్ సెం( బ్యాంక్ లిమిటెడ్) (D.C.B.B.)

1. చేగుంట

2. దౌల్తాబాద్

3. దుబ్బాక

4. గజ్వేల్

5. ఝరాసంగం

6. జోగిపేట్

7. మెదక్

8. ముంబోజి పల్లి

9. నారాయణ్‌ఖేడ్

10. నర్సాపూర్

11. పాపన్నపేట

12. పటాన్‌చెరు

13. రామాయంపేట్

14. సదాశివ్‌పేట్

15. సంగారెడ్డి

16. సంగారెడ్డి టౌన్

17. శంకరంపేట్

18. సిద్ధిపేట్

19. తూప్రాన్

20. వెల్దుర్తి

21. జహీరాబాద్

# వివిధ బ్యాంకుల డిపాజిట్లు - అప్పులు

## మార్చి 1998

| వ.సం. | బ్యాంక్ | బ్రాంచిలు | డిపాజిట్‌లు | అడ్వాన్స్ | సిడి రేష్యో | డిపాజిట్ | అడ్వాన్స్ | సిడి రేష్యో | డిపాజిట్ | అడ్వాన్స్ | సిడిరేష్యో |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఎస్.బి.ఐ | 29 | 74.74 | 96.35 | 129 | 78.60 | 103.60 | 132 | 88.19 | 110.33 | 125 |
| 2. | ఎస్.బి.హెచ్ | 22 | 157.48 | 69.65 | 44 | 188.24 | 73.68 | 39 | 184.03 | 81.04 | 44 |
| 3. | ఆంధ్ర బ్యాంక్ | 15 | 30.92 | 9.09 | 29 | 37.00 | 10.68 | 29 | 39.75 | 14.51 | 37 |
| 4. | అల్లాబాద్ బ్యాంక్ | 1 | 1.80 | 1.38 | 77 | 1.96 | 1.49 | 76 | 1.85 | 1.52 | 82 |
| 5. | సి.బి.ఐ | 1 | 9.13 | 17.64 | 193 | 10.09 | 21.00 | 208 | 10.54 | 10.25 | 154 |
| 6. | కెనరా బ్యాంక్ | 7 | 2.53 | 3.14 | 124 | 3.25 | 4.63 | 142 | 2.93 | 5.02 | 171 |
| 7. | కార్పొరేషన్ బ్యాంక్ | 1 | 2.33 | 0.65 | 28 | 2.15 | 2.08 | 96 | 2.32 | 2.14 | 92 |
| 8. | ఇండియన్ బ్యాంక్ | 2 | 4.65 | 5.01 | 108 | 5.55 | 5.01 | 90 | 5.20 | 2.60 | 50 |
| 9. | పి.ఎన్.బి | 1 | 2.00 | 0.86 | 43 | 2.05 | 0.93 | 45 | 2.06 | 1.16 | 56 |
| 10. | సిండికేట్ బ్యాంక్ | 9 | 11.45 | 11.88 | 104 | 11.72 | 12.94 | 110 | 9.12 | 10.80 | 118 |
| 11. | యు.బి.ఐ | 1 | 1.47 | 0.66 | 45 | 1.60 | 0.63 | 40 | 1.76 | 0.73 | 41 |
| 12. | యూకో బ్యాంక్ | 4 | 6.60 | 4.55 | 69 | 6.76 | 5.10 | 75 | 7.75 | 5.85 | 75 |
| 13. | వైశ్యా బ్యాంక్ | 3 | 23.19 | 8.65 | 37 | 34.73 | 5.63 | 16 | 38.69 | 7.11 | 18 |
| 14. | ఎం.జి.బి | 60 | | 72.46 | | 80.61 | 111 | 87.08 | 86.33 | 99 | |
| 15. | ఎం.డి.సి.సి బ్యాంక్ | 21 | 14.03 | 67.60 | 482 | 17.40 | 82.04 | 472 | 27.16 | 85.05 | 313 |
| 16. | ఎ.పి.ఎస్.ఎఫ్.సి | 2 | - | - | - | - - | - | - | - - | - | - |
| | మొత్తము | 181 | 395.32 | 361.61 | 92 | 473.56 | 410.05 | 87 | 508.43 | 403.44 | 85 |

## చిన్న తరహ పరిశ్రమ వాణిజ్యములకు ఇచ్చిన రుణముల పట్టిక (లక్షలలో) మార్చి 1998

| వ.సం. | బ్యాంక్ | యూనిట్లు | మార్జిన్ మనీ | సబ్సిడి | బ్యాంక్ లోన్ | టోటల్ క్వాలిటీ |
|---|---|---|---|---|---|---|
| 1. | ఆంధ్ర బ్యాంక్ | 75 | 368400 | 808500 | 665100 | 184200 |
| 2. | సి.బి.ఐ | 40 | 128000 | 240000 | 272000 | 640000 |
| 3. | కెనరా బ్యాంక్ | 45 | 180800 | 372000 | 351200 | 914000 |
| 4. | కార్పొరేషన్ బ్యాంక్ | 40 | 128000 | 240000 | 272000 | 640000 |
| 5. | ఇండియన్ బ్యాంక్ | 15 | 44000 | 90000 | 86000 | 220000 |
| 6. | ఎస్.బి.హెచ్ | 120 | 475600 | 736500 | 1165900 | 2378000 |
| 7. | ఎస్.బి.ఐ | 90 | 631200 | 1120500 | 1404300 | 3156000 |
| 8. | సిండికేట్ బ్యాంక్ | 65 | 236800 | 492000 | 455200 | 1184000 |
| 9. | యూ.బి.ఐ | 10 | 24000 | 60000 | 36000 | 120000 |
| 10. | యూకో బ్యాంక్ | 35 | 166800 | 364500 | 302700 | 834000 |
| 11. | మంజీరా గ్రామీణ బ్యాంక్ | 225 | 1162400 | 2398500 | 2251100 | 5812000 |
| | మొత్తము : | 790 | 3546000 | 6922500 | 7261500 | 17730000 |

# దర్శనీయ స్థలాలు

## కోటలు - బురుజులు

అలనాటి ప్రాచీన రాజకీయ రక్షణలకు సాక్షిగా నిలిచిన పురాతన కట్టడాలే ఈ కోటగోడలు - బురుజులు

పూర్వం రాజుల కాలంలో గ్రామాలను, పట్టణాలను రక్షించుకొనుటకు ఆ గ్రామం లేదా పట్టణం చుట్టు ప్రహరీ గోడ నిర్మించేవారు. ఆ ప్రహరీ గోడకానుకొని పెద్దకందకం నీళ్లతో నింపబడి యుండేది. ఈ కోట గోడకు నగరానికి నాలుగు వైపుల పెద్ద గైనిలు (ద్వారాలు) ఉండేవి. ఇవి రాళ్లతో నిర్మింపబడి యుండేవి. లావుపాటి చెక్క తలుపులు బిగించి యుండేవి.

శత్రుసైన్యాల దాడులను పసిగట్టి దండయాత్ర సాగించేందుకు సైన్యాలను సిద్ధము చేయుటకై గ్రామంలో, నగరంలో ఎత్తైన రాతికట్టడాలు బురుజుల పేరుతో నిర్మింపబడెడివి.

నిజాం పాలనా కాలంలో రెవెన్యూ కార్యకలాపములు నిర్వహించుటకు ఈ బురుజులు కచేరీలుగా ఉపయోగింపబడేవి. ఈ రాతి బురుజుల ద్వారా సైనికులు సమాచారం ఇతర ప్రాంతాలకు అందజేసేవారు.

ఈ బురుజులు సైనిక స్థావరాలుగా గ్రామ రక్షణకు ఉపయోగ పడుచుండెను.

గ్రామీణులకు ఏవైనా చాటింపు వేయవలసి వచ్చినపుడు ఈ బురుజులపై నుండి చాటింపు వేసేవారు. స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత వీటి అవసరం లేకుండా పోయినది. దానితో వీటి ఆలనాపాలనా చూచేవారు లేరు.

మెదకు జిల్లాలో సుమారు ప్రతి గ్రామంలో ఈ బురుజులు నేటికీ శిథిల రూపంలో దర్శనమిస్తాయి. గ్రామాలు పెద్దవై ప్రహరీ గోడలు-కందకాలు మటుమాయమైనవి.

బురుజుల - ప్రహరీగోడల రాళ్లు స్వార్థపరుల స్వంత ప్రయోజనాలకు ఆలవాలమయినాయి.

చారిత్రిక స్మృతులను మననం చేసుకొనుటకు సాక్షీభూతాలైన ఈ ప్రాచీన కట్టడాలు పూర్తిగా అదృశ్యమవక ముందే వాటి స్థితిగతులను ప్రభుత్వం, పురావస్తు శాఖ, పట్టించుకొని మెరగుపరిచినచో భవిష్యత్తరాలకు అందమైన ఈ కళాఖండాలను అందించిన వారమగుదుము.

నేటికి ఇంకా చెక్కు చెదరకుండా ఉన్నకోటల్లో కొన్ని మెదకు, వెంకట్రావుపేట, ఇస్మాయిల్ ఖాన్ పేట, దొంతి, పాపన్నపేట, శంకరంపేట మొదలైనవి.



మెధక్ కోట గజద్వారము



మెదక్ కోట సింహద్వారము



చారిత్రక లాల్‌కమాన్, సిద్దిపేట



సోఫియా మజీదు, సిద్దిపేట



నిజాం కాలంనాటి బురుజు



దొంతి దొరలు నిర్మించిన బురుజు



శ్రీ అవధూత దత్తగిరి మహరాజ్‌గారు దత్తాపీఠము, బర్దిపూర్, ఝురాసంగం మండలం



పాండురంగాశ్రమంలో వెలిసిన రుక్మిణి, పాండురంగమూర్తులు



చండ్లాపురం గ్రామంలోని ఎత్తైన కొండపై వెలసిన శ్రీరంగనాయక స్వామి ఆలయం



గ్రామ చరిత్రను గుర్తుచేస్తున్న బురుజు

# ప్రాచీన కట్టడాలు - సలింద్రి

కుతుబుషాలు గోలకొండ నవాబులుగా పాలించుచున్న సమయంలో పన్ను వసూళ్లకు, షికార్లకు వెళ్లే మార్గాలలో అవసరమైన చోట్ల నివాసముండుటకై బంగ్లాలను, మసీదులను నిర్మించిరి. అదే దారిలో ఆసఫ్జా నవాబులు కూడా కొన్ని నిర్మాణాలను గావించిరి.

అక్కన్న, మాదన్నలు కుతుబుషా నవాబైన అబుల హసన్ తానీషా వద్ద మంత్రిగా, సేనానిగా పని చేయు చుండిరి. వీరు పన్నుల వసూళ్ళకై ఎలిగందలకు (కరీంనగర్) పోవు చుండిరి. మార్గ మధ్యమున విశ్రాంతి కొరకై ఆగవలసి వచ్చెడిది.

సిద్దిపేట నుండి చిన్నకొడూరు ద్వారా ఆనాటి మార్గము ఎలిగందలకు (కరీంనగర్) ఉండెడిది. మార్గాయాసము తీర్చుకొనుటకై చిన్న కోడూరున కావల కొద్ది దూరములో చలివేంద్రము ఏర్పాటు చేయుబడెను. ఆ చలివేంద్రమే నేడు సలింద్రిగా పిలవబడుచున్నది.

చిన్నకోడూరుకు 2 కిలో మీటర్ల దూరంలో సలింద్రి అను చిన్న గ్రామము అగుపించును. ఆ ప్రాంతంలోనే గోల్కొండ నవాబుల కాలంలో నిర్మితమైన 2 దేవాలయాలు కొంచెందూరంలో మసీదు, ఒకకోనేరు శిథిలావస్థలో చూపరులకు కన్పట్టుచున్నవి. ఈ దేవాలయాలకు కొంచెం దూరంగా విడిది గృహాలున్నట్లుగా అక్కడి శిథిలాలు దర్శనమిచ్చుచున్నవి.

ఇక్కడున్న కోనేరు చక్కని పనితనముతో మూడువైపులమెట్లు కోనేరులో బాటసారుల విశ్రాంతి కోసం విడిది గృహాలు, కోనేరులో ఒక వైపు రెండు దేవాలయాలు నేటికి అగుపడుచున్నవి. ఈ రెండు దేవాలయాలు శివ, కేశవులున్నట్లు వాటిపై చిత్రించిన బొమ్మలు తెలుపుచున్నవి. ఈ దేవాలయాలలోను, పైన నిర్మించిన దేవాలయాలలోను విగ్రహములు అగు పడుటలేదు.

ఇక్కడి మసీదు నుండి చిన్న కోడూరు గడిలోనికి సొరంగ మార్గమున్నదని చెప్పుదురు. ఈ కోనేరులోని నీరు సేవించినచో దీర్ఘకాలిక వ్యాధులు నయమగునని ఇక్కడి వారి నమ్మకము.

ప్రతి సంవత్సరము ఇక్కడి వారు తమ పనిముట్లతో వచ్చి పూజాదికాలు నిర్వహించుకొని వనభోజనములు చేయుదురు.

ఈ కోనేరులో ఎల్లవేళలా పుష్కలముగా నీరుండును.

# మెదకు దుర్గము

మెదక్ జిల్లా చరిత్రలో ఒక ప్రత్యేక స్థానం అలంకరించిన మెదక్ కోట ఒక సుందర చారిత్రక స్వప్నం. ప్రకృతి సిద్ధముగా ఏర్పడిన ఎత్తైన కొండపై ఈ కోట నిర్మించబడింది. కాకతీయుల కన్నా ముందే ఈ కోట నిర్మించబడి ఉండవచ్చు. కాకతీయుల కాలంలో ఈకోట పునర్నిర్మితమయినట్లు చారిత్రక ఆధారాలున్నాయి. ఈ కోట కాకతీయులకు బహుమనీ సల్తానులకు, కుతుబ్షాలకు, ఆసఫ్జాలకు, అందోల్ రాజులకు రాజకీయ ఆశ్రయాన్ని కల్పించింది.

మెదక్ కోటగోడ నిర్మాణం చక్కని రాతితో జరిగింది. కోట ప్రధాన ద్వారం పైభాగాన ఒక మందిరం నిర్మించబడింది. ఈ ప్రధాన ద్వారం మొత్తం శిలానిర్మితమయినది. ద్వారంపై ఇరువైపులా రెండు సింహాలు కళాత్మకంగా చెక్కబడిఉన్నాయి. దీనిని "సింహద్వారం" అంటారు. ఈ ద్వార నిర్మాణం ఆనాడు శిల్పుల పనితనానికి ప్రతీక. ఆ కొండపై ఉన్న మరో ద్వారం "గజద్వారం" అంటారు. ఈ ద్వారం కూడా శిలా నిర్మితమయినదే. ఈ ద్వారపు ఉత్తరాశిపై చెక్కిన ఏనుగు బొమ్మలు శిల్పకళా శోభితమైనవి. కోట మొదటిద్వారం పైన గుజ్జపు బొమ్మలు సున్నంతో నిర్మించబడి ఇరువైపుల ఉండేవి. కానీ ఆ విగ్రహాలు నేడు శిథిలమయి దృశ్యాదృశ్యముగా ఒకటి మాత్రం అగుపడుచున్నది. ద్వారములోపలి భాగాన అరుగులపై నిర్మించిన సున్నపు నగిషీ ఆనాటి కళాకారుల నైపుణ్యాన్ని చాటుతున్నది. కోటలో ఎన్నోమందిరాలు శిథిలమయి పడియున్నవి.

ఈ కోటలో పాలబావి అను పేరుగల ఒక బావి కలదు. ఈ బావి భూమికి 300 అడుగుల ఎత్తుపై ఉన్నప్పటికి పుష్కలమైన స్వచ్ఛమైన తీయనైన నీటితో ఉంటుంది. ఈ బావిని రాతి కట్టడంతో నిర్మించారు. బావిని రెండుగా విభజించినారు, ఒకవైపు బావిని రాజు బావి మరొకటిని రాణి బావిగా పిలుస్తారు. ఒకానొకప్పుడు కరువు కాలంలో మెదక్ పట్టణానికి కూడా ఈ బావి దాహార్తిని తీర్చినది.

కోట పైభాగాన సుల్తానులు నిర్మించిన మసీదు కలదు. ఆ మసీదుకు ఉన్న నాలుగు మినార్‌లు బంగారంతో పొదుగబడి ఉండేవని ప్రతీతి. నేడు మాత్రం రెండు మినార్‌లే అగుపడుచున్నవి. ఈ కోటలో పైనుండి గోల్కొండకు ఒక సొరంగ మార్గమున్నట్లు మరియు మెదక్ పెద్దబజార్‌లోనికి ఒక సొరంగ మార్గమున్నట్లు జనశృతి కలదు.

ఈ కోటను చక్కని విహార కేంద్రముగా మలుచటకు అవకాశము ఉన్నది. విశాలమైన ప్రదేశము కలదు, నీటి వసతిని సంపూర్ణముగా కలిగించి, చిన్న చిన్న తోటలను పెంచి, యాత్రికులకు సౌకర్యములు కల్పించినచో ఈ దుర్గమును చూచుటకు అనేకులు వత్తురు.

ఈ విధముగా మెదక్ జిల్లాలో మెదక్ దుర్గం ఒక చక్కని విహార కేంద్రము కాగలదు.

# అల్లాదుర్గం

మెదకు జిల్లాలో ఘనమైన ప్రాచీన చారిత్రికాధారాలతో విలసిల్లే క్షేత్రము అల్లాదుర్గము అదినేడొక మండల కేంద్రము. శాతవాహనుల నాటి జైనము, చాళుక్యుల, కాకతీయులనాటి శైవం. ఈ ప్రాంతంలో వెల్లివిరిసినట్లు ఇక్కడి శిల్పఖండాలు చరిత్రను చాటుచున్నవి.

ఈ గ్రామంలో ఏ ఇంటికి పునాది తీసినా, వ్యవసాయ క్షేత్రానికి బావిత్రవ్వినా అలనాటి అపురూప శిల్పాలు వేమువున్నావని బయటపడుతాయి. అల్లాదుర్గము ఎంతో పూర్వకాలము నుండి ప్రఖ్యాతిగాంచినట్లు తెలియుచున్నది.

అల్లమ ప్రభువు ఈ గ్రామాన్ని నిర్మించి అల్లమదుర్గముగా దీనిని వ్యవహరించెను. అల్లమ దుర్గమే రానురాను అల్లాదుర్గమై యుండవచ్చును.

అల్లాదుర్గమునందు విపరీతమైన శిల్ప సంపదకలదు. చాళుక్యుల కాలంలో దీనికి 'వర్ధమాన కోట' అని పేరున్నట్లు ఇక్కడి శాసనము వలన తెలియుచున్నది.

అల్లాదుర్గం గ్రామంలో ప్రతివీధిలో శిల్పకళలతో విరాజిల్లు దేవాలయములు కలవు.

గతంలోకన్నా నేడు అల్లాదుర్గం గ్రామ పరిధి పెరుగుటతో నూతన గృహములు నిర్మింపబడు చున్నవి. వీటికి పునాదులు త్రవ్వగా భూస్థాపితమైన విగ్రహాలు ఎన్నోబయల్పడినవి. ఈ విషయము పురావస్తు శాఖ వారికి తెలుపగా 1960 సంవత్సరంలో ఈ గ్రామమునకు వచ్చి సమాధి, వినాయక విగ్రహాలు, ప్రాణవట్టము, బసవన్నలను వెలికితీసిరి. ఇవి వేయి సంవత్సరాల నాటివని శాస్త్రవేత్తలు భావించిరి. సమాధి గోడలకు వేసిన రంగులు చెక్కుచెదరక యుండుట ఆశ్చర్యకరము. వినాయక విగ్రహాలు, బసవన్నలు ఎంతో శిల్పకళా శోభితమైయున్నవి. ఈ మధ్యకాలమున ఒక వ్యవసాయ బావిసమీపమున ఇంటిని నిర్మించుటకై పునాదులు త్రవ్వగా ఆ పునాదులలో స్నానఘట్టము (కొలను) బయల్పడినవి. ఒకవ్యవసాయభూమిలో బుద్ధవిగ్రహాలు బయల్పడినవి.

ఈ ప్రాంతములో 20 అడుగుల ఏకశిలా స్తంభములెన్నియో కలవు. ఈ ప్రాంతమునందు ఎన్నోజైన విగ్రహములు కూడా బయల్పడినవి.

అల్లాదుర్గము గ్రామమునకు దక్షిణమున ఒక శిథిల దేవాలయములో రాతి స్తంభములను నిల్పికట్టబడిన మంటపములో కల్యాణి చాళుక్య ప్రభువగు త్రిభువన మల్ల దేవుని కాలము నాటి శాసన మొకటి కలదు. ఈ శాసనము క్రీ.శ. 1084 వ సంవత్సరమున ఒక శిలపై వ్రాయబడినది. ఈ శాసనము ప్రకారము కల్యాణి చాళుక్యరాజుల సామంతుడైన మహామండలేశ్వర ఆహవమల్ల పెర్మాడు అనునతడు వర్ధమాన కోటలోని కీర్తి విలాస శాంతి జైనాలయములో నివసించు జైన భిక్షువుల సహాయార్థము కొంత భూమిని దత్తము చేసినట్లుగా చెప్పబడినది.

ఈ గ్రామమున లభించిన శాసనముల ప్రకారము 11 వ శతాబ్దమున ఈ గ్రామములో 5 (ఐదు) ప్రఖ్యాత దేవాలయములున్నట్లుగా తెలియుచున్నది.

1. బౌద్ధ - జైనాలయములు
2. కీర్తి విలాస శాంతినాథ జైనాలయము
3. చిల్లేశ్వర స్వామి దేవాలయము
4. విష్ణు దేవాలయము
5. సాలేశ్వర దేవాలయము

చిల్లమయ్య అనుదండనాథుడు చిల్లేశ్వర స్వామి దేవాలయమును నిర్మించెను. సాలవృక్ష ప్రాంతమునందున్న దేవాలయము సాలేశ్వర దేవాలయములు కావచ్చును.

పై విషయములను బట్టి ఈ గ్రామమునందు జైనులు, వైష్ణవులు, శైవులు సహ జీవనము సాగించినట్లుగా తెలియుచున్నది. ఈ ప్రాంతము మహమ్మదీయ రాజుల హస్తగతమైన పిదప దేవాలయములన్నియు విధ్వంసము గావింపబడినవి. కొన్ని దేవాలయములు మసీదులుగా రూపాంతరము చెందినవి.

ఈ గ్రామమున అనేక విగ్రహములు ఛిన్నాభిన్నములై, తునాతునకులై, తలలుగా, మొండములుగా దర్శనమిచ్చుచున్నవి.

రాష్ట్ర పురాతత్వ శాఖ వారు ఊరికి తూర్పున కనుపించే దిబ్బమీద త్రవ్వకము జరిపిరి. ఈ దిబ్బకు నాలుగుదిక్కుల నాలుగు మకరతోరణములున్నట్లుగా కనుపించినవి. ప్రస్తుతము తోరణములేని స్తంభములు మాత్రము దర్శనమిచ్చుచున్నవి.

ఈ దిబ్బను త్రవ్వినపుడు భూగర్భంలో కట్టబడిన ఒక దేవాలయము బయల్పడినది. ఈ దేవాలయములోనికి దిగుటకు ఒకవైపు ఇరుకైన సోపానములేర్పాటు చేయబడినవి. పైకప్పును రాతి పరికములు పరచి పైన మట్టితో గిలాబా చేయబడినది. ఒకటిన్నర చదరపు గజముల వైశాల్యము గల్గిన ఈ గదిగోడలు యిటుకలతో నిర్మింపబడినవి. ఈగోడల యొక్క లోపలి భాగము మెత్తటి సున్నముతో గిలాబా చేయబడినది.

ఈ నిర్మాణమునందలి గోడలపై చిత్రకళ అబ్బురముగానున్నది. ఈ గదిలోని మూడు వైపులగోడలపై చిత్తర్వులు చిత్రించబడినవి. అందులో ఒకదానిపై పద్మాసనారూఢుడైన ఒక సాధువు కుడి చేయి ధ్యానముద్రలో నుండినట్లుగా ఎడమచేతిలో ఒక దండము ధరించినట్లుగా చూపబడినది. ఈ సాధువు ముంగాళ్ల వరకు వచ్చే ఒక పొడుగాటి అంగరఖాను ధరించినట్లున్నది. అతని తలపైనున్న బంగార పుటంచుల తలపాగ ముద్దు గొల్పుచున్నది. ఆ సాధువు చిత్రం ఎర్రసింధూరపు రంగుతోవేయబడిన పీఠము నానుకొనినట్లున్నది. కూర్చున్న వేదికకు ఇరువైపుల రెండు అరటి చెట్లున్నవి. వేదికకు ఒక ప్రక్కగా ముంగాళ్లపై కూర్చున్న పెద్దపులి, ఎడమ వైపుగా నొక దుప్పి, దుప్పికి వెనుక భాగమున పడగ విప్పిన పాము చూపబడినవి.

చిత్రకారుడు ఒక అడవి దృశ్యమును చూపుటకు ఈ జంతు జాలమును చిత్రించెను కాబోలు. ఈ సాధువుకు కుడి ప్రక్కగా కొంత మంది భక్తులు నిలబడినట్లుగా, అందునొక్కడు పాత్రతో ధూపము వేయునట్లుగా చిత్రించబడినది.

మరియొక గోడపై శివ పార్వతులు ప్రదోషమూర్తిగా చూపబడినారు. శివునిజటలు యిపుడు కన్పించుట లేదు. శివుని ముందటికుడి చేయి అభయ హస్తముగను, ఎడమచేయి దేనినో పరిష్వంగము చేయుచున్నట్లును చూపబడినది. వెనుక చేతులలో బాణము, విల్లు, అమ్ములపొది చూపబడినవి. ధనుర్బాణములు ధరించిన శివ చిత్రములు అరుదు.

శివుడు నల్లని అంచులుగలిగిన ఒక పొట్టి చొక్కాను, చుక్కలున్న పులిచర్మమును ధరించినట్లుగా చూపబడినది. దేవి శిరోభాగమున వేయబడిన రంగులు మాసి పోవుటచే ముఖకవళికలంతగా కన్పించుటలేదు. ఐనను పాలిండ్లు, సన్నని నడుము, ధరించిన ఆభరణములు సున్నితముగా చిత్రీకరింపబడినవి.

శివునకు కుడివైపు క్రింద భాగమున ఒక మూపురముగల నంది తలఎత్తి శివుని వైపు ముంగాళ్లమీద లేచుచున్నట్లుగా చూపబడినది. గంటలు, పట్టీలు, కాలి అందియలతో అలంకరింప బడిన నంది కనుల విందొనరించుచున్నది.

మరియొకగోడపై ఒక దేవి, ఆమెకు ప్రక్కగా ఒక పళ్లెములో ఫలముల నర్పించుచున్న యొక భక్తుడు చిత్రింపబడినాడు.

పైన చెప్పిన చిత్రములోని సాధువు ధరించిన దుస్తులను బట్టి అతడు మహమ్మదీయ సాధువై యుండవచ్చునని కొందరూహింతురు, కాదు హైందవ సాధువని మరికొందరి వాదన. ఒకవేళ ముస్లిం సాధువే ఐనయెడల మత సామరస్యమునకిది ముఖ్య నిదర్శనము.

చిత్రమేదైనప్పటికి ఆ చిత్రకళా ప్రావీణ్యమునకు రంగుల కలయికకు నీరాజనమీయవచ్చును.

ఈ చిత్తరువులను వేయుటకు ఎర్రసిందూరము, నీలము, ఆకుపచ్చ, బూడిదరంగులు వాడబడినవి. గోడలు ఉపరితలములు సున్నముతో నున్నగా కళాయి పెట్టబడినవి. ఎండిన తర్వాతనే రంగులు వేయబడినవి.

ఇచ్చట అవలంభించిన చిత్ర కళాపద్ధతిని టెంపోరా అందురు. ఈ పద్ధతిలో రంగులను నూనెకు బదులుగా కోడి గ్రుడ్డులోని తెల్ల సోనతో కలిపి బొమ్మలు వేయుదురు.

ఈ చిత్తరువులన్నియు ఒక నిర్దిష్ట పద్ధతిలో వేయబడినవే కాని చిత్రకారుని ఊహాజనితములు కావు. కాని చిత్రకారుడు తన భావములను చక్కగా ప్రతిబింబింప చేసెనని చెప్పవచ్చును.

(విషయము, చిత్రాలు పురావస్తు శాఖ, ఆం.ప్ర. వారి సౌజన్యంతో)

# పోచారం - అభయారణ్యం

ఆంధ్రప్రదేశ్‌లోని పోచారం అభయారణ్యం మెదక్, నిజామాబాద్ రెండు జిల్లాల్లోనూ పదమూడు వేల హెక్టార్ల విస్తీర్ణంలో విస్తరించి ఉంది.

ఈ అభయారణ్యంలో కొన్ని చిరుతపులులు, ఎలుగుబంట్లు, కొన్ని వేల సంఖ్యల్లో కొండగొర్రెలు, దుప్పులు, నెమళ్ళు నివసిస్తున్నాయి. వీటి అభివృద్ధి కొరకై వాటికి సంవత్సరాంతం నీరు లభించేలా చర్యలు చేపట్టి లోతుకుంట, గొల్లకుంట, బాలప్పకుంట, గట్టు మీదికుంట, తెట్రొలకుంట, కొలగట్టు మొదలయిన చెక్‌డ్యాంలను నిర్మించారు. వన్యప్రాణులకు ఇంతక్రితం వేసవిలో దాణా అందజేసేవారు. ప్రస్తుతం వీటికోసం ప్లాట్లు ఏర్పాట్లు చేసి నాణ్యమయిన జాతిగడ్డిని హమాట, రూప్, స్టైల్ మొదలయిన వాటిని పెంచి ఆహారంగా అందజేస్తున్నారు. సంవత్సరం పొడవునా ఈ ప్లాట్లకు నీటి సౌకర్యం ఏర్పాటు చేశారు. ఈ నాణ్యమైన గడ్డి వాతావరణంలోని నైట్రోజన్‌ను గ్రహించి భూమిని సారవంతం చేస్తుంది.

ఈ అభయారణ్యంలో వన్యప్రాణి సంపదను వృద్ధి పరచుటకై 1983లో జింకల ప్రత్యుత్పత్తి కేంద్రాన్ని ప్రారంభించారు. మొదట ఈ కేంద్రాన్ని 65 ఎకరాల భూమితో ప్రారంభించి జింకల సంఖ్య గణనీయంగా పెరుగుతున్నందున దీనిని 175 ఎకరాలకు విస్తరించారు. ఈ స్థలంలో కంచె, ఎత్తయిన గోడను నిర్మించారు. ఈ గోడవల్ల వేసవిలో సైతం నీరు నిలువ వుండి పచ్చగడ్డి లభిస్తుంది.

ఈ అభయారణ్యం వన్య ప్రాణుల సంరక్షణకు అభివృద్ధికి దోహదం చేస్తోందనడం నిర్వివాదాశం.

# మంజీరా వన్యప్రాణి అభయారణ్యం

మెదకు జిల్లాలో జిల్లాకేంద్రమయిన సంగారెడ్డి నుంచి ఐదు కిలోమీటర్ల దురంలో, హైదరాబాదుకు 60 కి. మీ. దూరంలో మంజీరా సింగూర్ బ్యారేజ్‌ల మధ్య రెండువేల హెక్టార్లలో మంజీరా వన్యప్రాణి అభయారణ్యం విస్తరించి ఉంది. ఈ అభయారణ్యం 36 కి. మీ. పొడవు. 500 నుంచి 800 మీటర్ల వరకు వెడల్పు కలిగి ఉంది. ఇందులో 9 ద్వీపాలున్నాయి. వీటిలో పుట్టిగడ్డ, బాపనిగడ్డ, కరణం గడ్డ, సంగం గడ్డ అనే ద్వీపాలు ప్రత్యేకమయినవి. పక్షుల ప్రత్యుత్పత్తికి, ఆవాసానికి అన్ని రకాల సౌకర్యాలు ఉండడం వల్ల ప్రతి సంవత్సరం ఇక్కడికి ఇతర రాష్ట్రాల నుండి, ఇతర దేశాల నుండి వేల సంఖ్యలో అనేక రకాల పక్షులు వలస వస్తాయి. ఈ ద్వీపాల్లో పక్షులు మేతకు అవసరమయిన తుమ్మ, సూబాబూల్, ఐసోమియా తీగ చెట్లు ఉన్నాయి. అలాగే ద్వీపాల చుట్టూ ఉన్న నీటిలో ఫిస్టియా హైడ్రిల్లా గుఱ్ఱపుడెక్క వల్లిస్‌నేరియా మొదలగు నీటి మొక్కలు ఉన్నాయి.

ఈ అభయారణ్యానికి సైబీరియా ( రష్యా), హిమాలయాలనుంచి ప్రతి సంవత్సరం జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలలలో పేయింటెడ్ స్టార్క్స్, ఓపెన్ బిల్ స్టార్క్స్, స్పూన్‌బిల్స్, కోంబుడక్స్, కాటన్ టీల్స్, రెడ్ క్రీసెడ్, పోచార్డ్స్, కామన్ పోచార్డ్స్, బ్రాహ్మిణి డక్స్, గ్రేపెలికాన్, బ్రౌన్ హెడెడ్ గుల్స్, బర్వెడెడ్‌గీన్ అస్ప్రే, మార్ష్‌హరియర్, స్వాలోస్ అనే రకాల పక్షులు వలసవస్తాయి. ఇంకా ఇవేకాక ఇతర రాష్ట్రాల నుండి అనేక జాతుల పక్షులు వలసవస్తాయి.

ఈ వలస పక్షులు గూడు కట్టుకునేందుకు కావలసిన పుల్లల కోసం ద్వీపాలలో 96లో 19 హెక్టార్లలో 97లో 5 వేల హెక్టార్లలో బాబుల్‌ప్లాంటేషన్ చేశారు. వలస పక్షులే కాక గ్రేహారన్స్, నైట్ హారన్స్, పాండ్ హారన్ మొదలగు ఎన్నో రకాల పక్షులు ఈ అభయారణ్యంలో నివసిస్తున్నాయి. పక్షులే కాకుండా ఇక్కడ బ్యారేజీల మధ్య నీటిలో కొన్ని వందల 'మగ్గర్ ' జాతి మొసళ్ళు కూడా ఉన్నాయి. ఈ మొసళ్ళ ప్రత్యుత్పత్తి కేంద్రాన్ని కూడా ప్రారంభించారు.

ఈ అభయారణ్యంలో సందర్శకుల సౌకర్యార్థం మంజీరా బ్యారేజీవద్ద ఒక పర్యావరణ విద్యాకేంద్రాన్ని నిర్మించారు. ఇందులో ఒక ప్రదర్శన శాల, దృశ్యశ్రవణ పుస్తకాలు కలిగిన లైబ్రరీ ఉన్నాయి. ఈ కేంద్రంచుట్టూ ఆహ్లాదకరమైన గార్డెన్ ఏర్పాటు చేశారు.

ఈ ప్రాంతాలలోని ప్రజలకు పశుగ్రాసం, వంట చెఱుకు ప్రధాన సమస్యలు. ఈ సమస్యల నివారణలో భాగంగా ప్రభుత్వం అనేక బయోగ్యాస్ ప్లాంట్లు ఏర్పాటు చేశారు.

# బద్దిపడగ రాజరాజేశ్వర స్వామి

కాకతీయ ఆధ్యాత్మిక సంపదలో వెలసిన దేవాలయం బద్దిపడగలోని రాజరాజేశ్వర స్వామి ఆలయం. 13వ శతాబ్దంలో అంటే సుమారు 700ల సంవత్సరాల క్రిందట నిర్మింపబడినది.

ఈ ఆలయం కాకతీయ శిల్పకళకు తార్కాణం. నవాబుల కాలంలో వచ్చిన రాజకీయ మార్పుల వల్ల ఈ ఆలయం నిరాదరణకు గురికాబడింది. శివలింగం కింద గుప్త నిధులున్నాయనే ప్రచారంతో శివలింగాన్ని కూడా పెకిలించడం జరిగింది.

తిరిగి ఈ దేవాలయం పాతిక సంవత్సరాల క్రిందట గ్రామస్థుల శ్రద్ధాసక్తులతో జీర్ణోద్ధరణ గావించబడి శివలింగం పునః ప్రతిష్ఠ గావించబడినది.

ఈ ఆలయమందు శివరాత్రి సందర్భముగా రుద్రాభిషేకం, కుంకుమార్చనలు, శివ కల్యాణం, మొదలగునవి నిర్వహించబడుతాయి.



ఎల్లారెడ్డిపేట త్రికూటేశ్వరాలయం



ఎల్లారెడ్డిపేట త్రికూటేశ్వరాలయం ప్రదక్షిణపథం



ఎల్లారెడ్డిపేట త్రికూటేశ్వరాలయం



ఎల్లారెడ్డిపేట త్రికూటేశ్వరాలయంలోని లింగం



ఎల్లారెడ్డిపేట త్రిలింగేశ్వరాలయం



ఎల్లారెడ్డిపేట త్రికూటేశ్వరాలయం పద్మపంక్తి



ఏడుపాయల దుర్గాభవాని



ఏడుపాయల దుర్గాభవాని



బడంపేట గ్రామ శివారులో వెలిసిన శ్రీశ్రీశ్రీ రాచన్నస్వామి దేవాలయం



కేతనీ సంగమేశ్వరస్వామి ఆలయం, ఝురాసంగం



శ్రీ కేతకి సంగమేశ్వర స్వామివారి దేవస్థానం, ఝురాసంఘం



చిట్కుల్ చాముండేశ్వరిమాత



దుద్దెడ అమ్మవారు



దుద్దెడ దేవాలయం ప్రధాన ద్వారం



రామలింగేశ్వర స్వామి, గోమారం



శ్రీ విద్యాసరస్వతి శనైశ్వరాలయములు, వర్గల్



శ్రీ విద్యాసరస్వతి దేవాలయం - వర్గల్


జిల్లాలోని పెద్ద గణపతి విగ్రహం, ఇది రెండు దశాబ్దాలనాటిది



కూచనపల్లి వెంకటేశ్వరస్వామి



కూచనపల్లి దేవస్థానం



భోగేశ్వరాలయం వద్ద ఉన్న అరుదైన బ్రహ్మ విగ్రహం, సిద్దిపేట



భోగేశ్వరాలయంలో సప్తమాతృకలు, సిద్దిపేట



ఎల్లమ్మ దేవాలయం, సిద్దిపేట



భోగేశ్వరాలయ ముఖద్వారము, సిద్దిపేట



చల్మెడ



ముత్తయకోట శివాలయం



శరభేశ్వరాలయం, సిద్దిపేట



ఉమామహేశ్వర్లు, సిద్దిపేట



శ్రీ ఉమాపార్థిన కోటిలింగేశ్వరాలయం, సిద్దిపేట




సిద్దిపేట కోటి లింగాల లింగం



వేల్పుగొండ అష్టదళపద్మమునకు ఆధారముగానుంచే శిల్పము



తుంబురేశ్వరాలయం, వేల్పుగొండ



వేల్పుగొండ



తుంబురేశ్వరాలయములోని శిల్పము, వేల్పుగొండ



వెల్మగొండ తుంబురేశ్వరాలయం



వెల్మగొండ తుంబురేశ్వరాలయం ద్వారబంధము శిల్పకళ

# జిల్లాలోని దేవాలయములు

మెదకు సీమ ప్రాంతము అనాది నుండి హైందవ మతమును ఆచరించుచున్నదని చెప్పవచ్చును. బౌద్ధ- జైనమతములు హిందూమత అంతర్గతములుగానే ఇక్కడి వారు నమ్మిరి. కాకతీయుల నాటికి బౌద్ధజైనములు మాసిపోయి శైవ వైష్ణవ మతములు ప్రజలలో వ్యాప్తి నందినవి. రాష్ట్రకూటుల పరిపాలనా కాలమున ఈ ప్రాంతము ఎక్కువ భాగము హైందవ మతానుయాయులే. ఒకరిద్దరు రాజులు మాత్రముజైన మతమును అవలంబించిరి. రాష్ట్రకూట రాజుల శిల్పకళాపోషణము హైందవ మత ప్రాశస్త్యమును తెలుపుచున్నది.

కళ్యాణీ చాళుక్యుల కాలమున జైన, శైవ మతములు ప్రజలచే ఆరాధింపబడుచుండెను. అయినప్పటికీ మత కలహములు లేక ప్రజలు సఖ్యతతో మెలుగుచుండిరి. కాకతీయ పరిపాలనా కాలమున తొలి కాకతీయరాజులు జైనమతావలంబులై యుండినప్పటికి రెండవ ప్రోలరాజు కాలము నుండి ఈ వంశీయులందరూ శైవమతమునవలంభించిరి. కాకతీయ ప్రభువుల కాలమునవైష్ణవ మతము కూడా ప్రజాదరణను, రాజాదరణమును పొందినది. అనేక శివాలయములు, విష్ణువాలయములు నిర్మింపబడినవి. వీరి కాలముననే త్రికూటాలయములు నిర్మింపబడినవి.

మెదకుజిల్లాలో ఎల్లారెడ్డిపేట, కొండపాక, కల్పగూరు, సిద్దిపేట మొదలగు దేవాలయములు త్రికూటాలయములు. త్రికూటాలయము అనగా ఒకే దేవాలయ మండపము నందు మూడు గుడులను నిర్మించి వాటిలో వివిధ దేవతలను ప్రతిష్ఠించుట జరుగును. ఈ మూడు దేవాలయములలో ప్రధాన దేవాలయము శైవమై మరొకటి వైష్ణవమై యుండుట కద్దు. మెదకు జిల్లాలో ముఖ్యముగా రామలింగేశ్వర స్వామి సంగమేశ్వర స్వామి పేర్లతో అనేక దేవాలయములు ఉన్నవి. ఈ రామలింగేశ్వర దేవాలయములన్నీ ఎక్కువగా గుట్టలపై యుండుట, ఒకే రకమైన వాస్తును కలిగి యుండుట మనము గమనింప వచ్చును. ఉదాహరణకు : గోమారం, మాసాయిపేట, కూడవెల్లి మొదలగు గ్రామాల్లో రామప్పగుట్టలపై యున్న రామలింగేశ్వరాలయాలని చెప్పుకొనవచ్చును.

ఔరంగజేబు దండయాత్రలు. బహుమనీ కుతుబ్‌షాహీ, ఆసఫ్‌జాహీ రాజుల పరిపాలనలో సంభవించిన మత దౌర్జన్యాలు ఎన్నో దేవాలయాలను పొట్టన పెట్టుకున్నవి. మత ధూర్తుల చేతుల్లో ఎన్నో అందమైన శిల్ప కళావైభవాలు నామరూపాలను కోల్పోయినవి. రమణీయమైనవి కాల కాల గర్భంలో కొన్ని కలిసిపోగా నేటికి కొన్ని బయల్పడి నేత్రానందాన్ని కల్గిస్తున్నాయి.

మధ్యకాలంలో హిందువులు తమ దేవాలయాలను కాపాడుకోవడం కోసం దేవాలయాలపై మట్టిపోసి మట్టి దిబ్బలుగా మార్చివేసినారు.

అలాంటి దేవాలయాలెన్నో మెదకు జిల్లాలో బయల్పడ్డాయి. చందాయిపేట, చిన్న శంకరంపేట మొదలగు గ్రామాల్లో ఇలాంటి మట్టి దిబ్బల నుండి దేవాలయాలు బయల్పడడం ఈ మధ్యకాలంలో జరిగిన వృత్తాంతాలు. ఏదేమైనప్పటికి భక్తులు అనాది నుండి భగవంతుని పూజకై ఆలయాలు నిర్మించుకొన్నారు. ఆ ఆలయాలలో లలిత కళా సంపదను పెంచి పోషించారు. ప్రకృతి రామణీ యకతను పొందుపరిచినారు. ఆ ప్రకృతిలో లీనమై ఏకాంతంలో భగవంతున్ని దర్శించుకొన్నారు. అల ఏర్పాటు చేసుకొన్న దేవాలయాలు ఎన్నో నేడు మనక జిల్లాలో గోచరిస్తున్నాయి. వాటిలో నుండి ఎక్కు భాగాన్ని ఇప్పుడు స్పృశించడ మౌతున్నది.

అనేక దేవాలయాలు దర్శించి దేవాలయా చరిత్రలను సేకరించి దేవాలయ చిత్ర పటాలన (ఫోటోలను) తీసి ఈ గ్రంధంలో ముద్రించ మగుచున్నది.

# త్రిలింగేశ్వరాలయము - ఎల్లారెడ్డిపేట

మెదకు జిల్లాలో కాకతీయుల నాటి శిల్ప కళా వైభవము అచ్చుటచ్చుట నేటికిని కనుపించుచున్నది.

చక్కటి శిల్పకళా సౌందర్యంతో చూపరుల ఆకర్షించు శిల్పకళా ఖండాలు కొండపాక మండలంలో ఎక్కువగా అగుపించుచున్నవి.

ఎల్లారెడ్డి**పేటలో**ని త్రిలింగేశ్వరాలయము ఆనాటి శిల్పకళాకారుల ప్రజ్ఞాధురీణత్వమును చాటుచున్నది. కనువిందొనరించే మనోజ్ఞ రూపలావణ్య విలసనము ఆ శిల్పములందగు పడుచున్నది.

త్రిలింగేశ్వరాలయము కొండపాక మండలము నందలి ఎల్లారెడ్డి పేట గ్రామమునకు చివర తటాకము దరిలో ప్రశాంత వాతావరణాన నెలకొనియున్నది.

ఈ ఆలయ నిర్మాణంలో శిల్పులు ప్రదర్శించిన శిల్పకళ అనిర్వచనీయమైనది.

ఆలయంలో అభిషేకాది పూజాదికములు నిర్వహించినపుడు అభిషేకజలము బయటికి వెళ్ళుటకు గర్భగుడిలో పాణవట్టము నుండి అంతర్భాగం గుండా నీరు పోయే మార్గాన్ని ఏర్పాటు చేసిరి.

త్రిలింగేశ్వరాలయములోని మంటపము గర్భగుడులు భూమిపై 4 ఫీట్లు ఎత్తు అరుగుపై నిర్మించినారు. దూరము నుండి చూచేవారికి ఈ ఆలయము మొత్తము ఒక శివలింగము వలే కనుపించును. మండపము, గర్భగుడి లింగాకారంగాను, ప్రదక్షిణ చేయుటకు వీలుగా ఏర్పాటు చేసిన అరుగు, పైకి వెళ్లుటకు వేసిన మెట్లు ప్రాణ వట్టముగాను మొత్తము దేవాలయము ఒక శివలింగముగా గోచరించును.

ఈ దేవాలయము హనుమకొండలోని వేయిస్తంభాల దేవాలయము వలెనున్నది. కాని ఈ దేవాలయ నిర్మాణము ఎప్పుడు జరిగెనో తెల్పుటకు శాసనములవంటి ఆధారము లేమియు లేవు. కాని దేవాలయ శిల్ప కళారీతులను బట్టి కాకతీయుల నాటిదని భావించవచ్చును.

కాని ఇంత చక్కని శిల్పకళాశోభియైన ఆలయము సరియైన పోషణ లేక శిథిలావస్థకు చేరినది. ఒకనాడు త్రికాలములందు వైభవముగా నిత్య పూజా నైవేద్యముల నందిన ఆలయము నేడు దీపము పెట్టు వారు కరువై ఆలనపాలనలేని అనాథయైనది. ఈ దేవాలము మొత్తము భూమిలోనికి కృంగిపోవుచున్నది.

# ఏడుపాయల దుర్గామాత

మెదకు జిల్లా పాపన్నపేట మండలం నాగసాని పల్లె గ్రామానికి సమీపంలో ఈ ఆలయం ఉంది. ఇచట భారతావనిలో ఎక్కడాలేని విధంగా మంజీరానది ఒకే చోట ఏడుపాయలుగా చీలి రెండు మూడు కిలోమీటర్లు ప్రవహించి మళ్ళీ ఒకేచోట కలుస్తుంది. కీకారణ్యంలోని చెట్లు చేమలు. రాళ్లుగుట్టలు. పిచ్చుకల అరుపులు, కోతుల ఆటలతో ఎంతో రమణీయంగా కనిపించే నిర్జన ప్రదేశంలోని ఒక మంజీరానది పాయ ఒడ్డున ఈ దుర్గామాత వెలసింది. నల్లరాతితో మంచి శిల్పకళానైపుణ్యంతో కూడిన ఈ అమ్మవారి విగ్రహం ఒకేవ్యక్తి మాత్రమే వెళ్లగలిగే చిన్నరాతి గుహలో ఉంది భక్తులను విశేషంగా ఆకర్షిస్తుంది.

అరుదయిన ప్రాంతంలో వెలసిన ఈ ఆలయానికి మాత్రమే కాక మంజీరానది పాయలుగా చీలడానకి పురాణాల ఆధారంగా ఓ ప్రత్యేక చరిత్ర ఉంది.

ద్వాపరయుగాంతంలో పాండవ వంశపు రాజయిన పరీక్షిత్తు మహారాజు పాముకాటువల్ల మరణిస్తాడు. దీనితో పరీక్షిత్తు మహారాజు కుమారుడయిన జనమేజయుడు సర్పజాతిని సమూలంగా నాశనం చేయాలని తలచి సప్త ఋషులతో సర్పయాగాన్ని ప్రారంభిస్తాడు. దీనితో సర్పజాతి మొత్తము యాగాగ్నిలో పడిపోతుండడంతో వారి తల్లి 'కద్రువ' పుత్రశోకంతో కుమిలి తన సవతి 'వినత సహాయంతో గరుత్మంతుని పిలిచి యాగాగ్నిలో మరణించిన నాగులకు పుణ్యగతులను కలుగజేయమని కోరుతుంది. తరువాత వినతా కుమారుడయిన గరుత్మంతుడు తన తమ్ముళ్లకు మోక్షమును ప్రసాదించమని గంగాదేవిని వేడుకుంటాడు. అప్పుడు గంగాదేవి తన కాలి అందెను గరుత్మంతునికి ఇచ్చి దీని వల్ల నీ కోరిక నెరవేరుతుందని తెలుపగా అతను కాలి అందెను తీసుకు వస్తుండగా అది జారి నేలమీద పడి నదిగా మారి ప్రవహిస్తుంది. గరుత్మంతుడు సర్పయాగస్థలానికి చేరగానే అతని వెంట వచ్చిన నది ఏడుపాయలుగా చీలి ప్రవహించి నాగుల పాపాలను పోగొట్టి వారికి పుణ్యలోకాలను ప్రాప్తింపజేసింది గంగానది కాలి అందె.(మంజీరము) వల్ల ఏర్పడిన నది కావున దీనికి మంజీరానది అని పేరు వచ్చిందని పురాణ కథనం.

ఈనాటకీ ఈ ప్రాంత సమీపంలోని ఎల్లాపూర్ గ్రామ పరిసర ప్రాంతాలలో మంజీరానది ఇసుకమేటలు త్రవ్వినట్లయితే 'బూడిద' లభిస్తుంది. ఇది విభూతి మాదిరిగా ఉంది. ఇది భక్తులు చెప్పుకునే పై పురాణకథకు ఇప్పటికీ సాక్ష్యంగా నిలుస్తోంది.

జనమేజయుడి సర్పయాగ ప్రభావంలో అఖండ సర్పసంతతితో పాటు శివుడి మెడలోని సర్పం సైతం శివుని కూడా లాక్కొని యాగాగ్నిలో ఆహుతి కావడానికి రాగా దేవతలందరు భయకంపితులై ముందుగానే యాగాన్ని నిలిపివేయమని గంగాదేవిని గరుత్మంతుడిని పంపిస్తారు. గరుడుడు ఆకాశంలో సంచరిస్తూ దారి చూపగా గంగా దేవి నేలపై ప్రవహిస్తూ వస్తుంది. ఈ విషయాన్ని గమనించి యాగాన్ని నిర్వహిస్తున్న ఋషులు గంగానదిని నిలిపివేయడానికి ప్రయత్నిస్తారు ఆ ప్రయత్నంలో గంగ ఏడు భాగాలుగా చీలి తిరిగి ఏకమై యాగాన్ని జిల్లార్చిందనే మరోకథ ప్రచారంలో ఉంది.

దీనివల్లనే ఇచ్చట మంజీరానదికి ''గరుడగంగ'' అనేపేరు వచ్చింది.

జనమేజయుడు జరుపుతున్న సర్పయాగాన్ని ఆపడానికి కద్రువ మనుమడయిన ఆస్తీకుడు తన తల్లి ఆజ్ఞతో యాగ ప్రాంతానికి వెళ్ళి తన ఇష్ట దైవమయిన దుర్గామాతను తలచుకొని జనమేజయుడిని ఒప్పించి సర్పయాగమును ఆపి మిగిలిన సర్ప జాతిని రక్షించాడు.

తన ఈ విజయానికి దుర్గామాత ఆశీస్సులే కారణమని తలచిన ఆస్తీకుడు దుర్గామాతను స్తుతించి ఆ ప్రాంతమున వెలిసి భక్తులకు దర్శనభాగ్యం కలిగించమని కోరగా అతని కోరిక మేరకు అచట వెలసినదని ప్రతీతి. అలాగే ముసునూరి వంశజుడయిన కాపయ నాయకుడు మెదకు దుర్గమునుండి యవనులను పారద్రోలుటకు దుర్గామాత ఆశీస్సులు పొంది విజయం సాధించినాడని చరిత్ర ద్వారా తెలుస్తోంది.

1780వ సంవత్సరంలో ప్రసిద్ధ హిందూ మతాచార్యులు శ్రీ కాశీనాథ యోగీంద్రుల వారు ఈ ప్రదేశములో తపస్సు చేయడం వలన ఈ ప్రాంతానికి బాగా ప్రచారం లభించింది.

ఈ ఏడుపాయల ప్రాంతంలో దుర్గామాత ఆలయమేకాక మరికొన్ని పవిత్ర స్థలాలున్నాయి. మంజీరానదిలో పెద్దపాయ ఉత్తర భాగాన పాపాలమడుగు అను ఒక తీర్థం కలదు. దీనికి కొంత దూరంలో పులిగుండ్ల పాయ అనునది ప్రవహించుచుండును. ఈ పాపాల మడుగులో స్నానం చేసిన వారికి సర్వపాపాలు పోతాయని ఇచ్చట యాత్రికుల నమ్మకం. ఇచట దుర్గామాతనే కాకుండ గంగాభవాని, శివుడు, ముత్యాలమ్మలను కూడా భక్తులు పూజిస్తుంటారు.

ఇక్కడ శివరాత్రి పర్వదినమున ప్రారంభమయి తొమ్మిది రోజులపాటు పెద్ద జాతర జరుగుతుంది. ఈ జాతరలోని బండ్లుతిరగడమనే కార్యక్రమం చాలా ప్రధానమయినది. ఇది భక్తులను విశేషంగా ఆకర్షిస్తుంది. తెలంగాణాలోని ప్రత్యేకమయిన ఈ జాతరకు చుట్టు ప్రక్కల రాష్ట్రాల నుండి దాదాపు పది లక్షల వరకు యాత్రికులు హాజరవుతుంటారు.

# కేతకీ సంగమేశ్వరాలయం – ఝరాసంగం

ఝరాసంగం మండల కేంద్రంలోని శ్రీ కేతకీ సంగమేశ్వర స్వామి దేవాలయం రాష్ట్రంలోనే ప్రముఖ శైవక్షేత్రంగా పేరొందినది. ఈ ఆలయం 9వ నంబరు జాతీయ రహదారిపై నున్న జహీరాబాద్ పట్టణానికి 16 కి.మీ. దూరంలో ఉంది. ఈ దేవాలయం గురించిన ఎన్నో చారిత్రక మరియు పురాణ ఇతిహాసాలున్నాయి. పూర్వం ఈ ఆలయం ఉన్న ప్రాంతం కేతకీ వనమని, అచట శౌనకాది మహామునులు యజ్ఞం చేసినట్లు పురాణాలు చెబుతున్నాయి.

కృతయుగంలో సూర్యవంశపు రాజయిన కృపేంద్రభూపాలుడు భయంకరమయిన చర్మవ్యాధితో బాధపడుతూ దాని నివారణకై ఎన్నో పుణ్యక్షేత్రాలను దర్శించినప్పటికీ ఫలితం లేకపోయింది. ఒకనాడు వేటకు వెళ్ళిన రాజు లేడిని తరుముతూ కేతకీ వనానికి వచ్చాడు. వేటలో లేడి దొరకక అలసిపోయిన రాజుకు దాహం వేసి మంచినీటికయి వెతుకగా, ఆ ప్రాంతంలో ఒకగుండం కనిపించింది. ఆ నీరుత్రాగి అలసట తీర్చు కునేలోగానే అతని చర్మవ్యాధి మటుమాయమయింది. కాకతాళీయంగా తను త్రాగిన ఆనీటికి ఎంతో [illegible]శ్యం ఉందని, ఔషధ గుణాలున్నాయని [illegible]న రాజు ఆనందంతో తాను దాహం తీర్చుకున్న ప్రాంతంలో గుండం నిర్మించి అలాగే బాణలింగ రూపుడయిన శివునకు గుడికట్టించాడు.

ఈ గుండానికే అమృతగుండమని పేరొచ్చింది. ఈ గుండంలో నారాయణ, ధర్మ, ఋషి వరుణ, సోమ, రుద్ర, ఇంద్ర, దత్త అను జలధారలు అష్టతీర్థాలుగా ప్రసిద్ధినొందినవి. ఇంతేకాక కాశీ నుండి ఝర ఒకటి ఈ గుండంలో కలుస్తుందని భక్తుల నమ్మకం. అందుకే ఈ ప్రాంతానికి "ఝరాసంగం" అనే పేరు వచ్చినది. ఈ కారణంగానే ఈ క్షేత్రం 'దక్షిణకాశీ' గా కూడా ప్రనుతికెక్కింది.

పూర్వం కృతయుగంలో కేతకీ అనే అప్సర అబద్ధపు సాక్ష్యం చెప్పిన కారణంగా పరమ శివుని ఆగ్రహానికి లోనయి శపించబడి, ఈ ఆలయ సమీపాన వలరూపంలో జన్మించింది. ఆ కేతకి శివున్ని ప్రార్థించగా, తాను భూలోకంలో అవతరిస్తానని అప్పుడు కేతకీ పుష్పాలతో పూజలు చేసి మోక్షాన్ని పొందగలవని అనుగ్రహించినట్లు మరో కథనం కూడా ప్రచారంలో ఉంది.

దేశంలో ఎక్కడా లేనివిధంగా పరమశివుడిని నిత్యం కేతకీ పుష్పాలతో పూజిస్తారు కాబట్టి ఈ ఆలయానికి "శ్రీ కేతకీ సంగమేశ్వరాలయం" అని పేరొచ్చింది.

ఈ క్షేత్రంలోని అమృతగుండంలో పుణ్యస్నానమాచరిస్తే శారీరక, మానసిక రుగ్మతలు పోతాయని భక్తుల నమ్మకం. ఈ గుండంలో పూజలు నిర్వహించి.

గుండంలో ఉన్న ఒక రంధ్రంలో నైవేద్యం పెడితే తిరిగి రాకుండా మాయమవుతుంది. అలాగే ఈ గుండంలో నీటిని ఖాళీ చేయిస్తే రెప్పపాటు కాలంలో తిరిగి గుండం నీటితో నిండడం ఇక్కడి అద్భుతమయిన విశేషం.

భక్తుల కోరికలు తీర్చే దైవంగా ప్రసిద్ధి చెందిన ఈ ఆలయానికి పొరుగు రాష్ట్రాల నుంచి వేలాది మంది భక్తులు వస్తుంటారు. మహాశివరాత్రి సందర్భంగా ఇచట ప్రతి సంవత్సరం అత్యంత వైభవంగా ఉత్సవాలు జరుగుతాయి. ఈ ఉత్సవాలలో దాదాపు రెండు నుంచి మూడు లక్షల వరకు భక్తులు హాజరవుతుంటారు. ఈ సందర్భంగా కుంకుమపూజ, పల్లకి సేవ, అగ్నిగుండం, రథోత్సవం, కళ్యాణం మొదలగునవి జరుగుతాయి. అంతేకాకుండా హరికథలు, భజనలు మొదలగు వివిధ సాంస్కృతిక కార్యక్రమాలను కూడా ఆలయ కమిటీ ఏర్పాటు చేస్తుంది ఉత్సవాల సమయంలో ఆలయానికి ఆర్టీసీ అధికారులు ప్రత్యేక బస్సులను వేస్తారు. దూర ప్రాంతాలనుండి వచ్చే భక్తుల సౌకర్యార్థం అన్ని వసతులతో కూడిన ధర్మసత్రాలను మరియు టూరిజం కాంప్లెక్స్ భవనాన్ని నిర్మించడం జరిగింది.

# చాముండేశ్వరి – చిట్కూల్

చిట్కూల్ గ్రామం దగ్గర (కౌడిపల్లి మండలం) జోగిపేట మండలంలానికి 8 కి.మీ. సమీపాన మంజీరానది ఒడ్డున శ్రీ చాముండేశ్వరీ దేవాలయం నిర్మించబడింది. గర్భగుడి నిర్మాణానికి 1977లో శంకుస్థాపన చేశారు. కాగా 1983లో దేవి ఉపాసనలు, బ్రహ్మీమూర్తి పూజ్యులు (శాక్తేయ ఉపాసకులు) వెంకటరమణయ్యగారి మనోసంకల్పంచే శ్రీ చాముండేశ్వరి విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. ఈ విగ్రహం ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా "18" భుజాలతో "11" అడుగుల ఎత్తును కలిగి ఉన్నది. ఈ చాముండేశ్వరి మైసూరు రాజుల ఆరాధ్య దైవమని చరిత్ర తెలుపుచున్నది. మహిషాసురుడనే రాక్షసుడిని సంహరించేందుకు దేవతలందరూ కలిసి అవతరించిన రూపమే చాముండేశ్వరి అని ప్రతీతి.

ఈ ఆలయ గర్భగుడికి ఎదురుగా బ్రహ్మ, కాళీ, వైష్ణవి విగ్రహాలను ప్రతిష్ఠించారు. ఈ దేవీ ఆలయంలో ప్రతి సంవత్సరం మాఘబహుళ సప్తమి వరకు మూడు రోజులు 'బ్రహ్మోత్సవాలు' జరుగుతాయి. అలాగే ఆశ్వయుజ పాడ్యమి మొదలు దసరా వరకు నవరాత్రి ఉత్సవాలు, పుణ్యదినాలలో మహాపూజలు జరుగుతాయి. ఉత్సవాల సందర్భంగా భక్తుల సౌకర్యార్థం విస్తృతమైన ఏర్పాట్లు చేస్తారు.

గ్రహ బాధలు. బాణామతి తదితర పీడలతో బాధపడే ప్రజలు ఈ దేవిని దర్శిస్తూ ఉంటారని ప్రతీతి. ఈ ఆలయం శక్తి ఆలయమైనా ఇచట జంతుబలులను నిశేధించడం ఒక విశిష్ఠత. భక్తుల కోరికలు తీర్చే ఈ చాముండేశ్వరిని దర్శించడానికి ఎంతో దూర ప్రాంతాల నుండి కూడా భక్తులు వస్తుంటారు.

# లక్ష్మీనరసింహ స్వామి - నాచారం

(హైదరాబాదు నగరానికి 55 కి.మీ దూరంలో) 7వ నంబరు జాతీయ రహదారి నుంచి గజ్వేల్ పోయే మార్గమధ్యలో, పవిత్ర హరిద్రానది (హల్దివాగు) ఒడ్డున వర్గల్ మండల పరిధిలోని నాచారంలో శ్రీ లక్ష్మీ నరసింహ స్వామి దేవాలయం వెలసినది. ఈ ఆలయం అందమయిన ప్రకృతి ఒడిలో వెలసి భక్త జనులను విశేషంగా ఆకర్షిస్తున్న సుప్రసిద్ధ దేవాలయాల్లో ఎన్నదగినది.

కృతయుగంలో దుష్టశిక్షణకై తద్వారా లోక కళ్యాణ నిమిత్తం సాక్ష్యాత్తు శ్రీమన్నారాయణుడు నరసింహావతారమెత్తాడని. ఆ నరసింహుని గర్జన కొండలలోను, గుహాలలోను, ఎత్తయిన పర్వత శ్రేణులలోనూ ప్రతిధ్వనించిందని అటువంటి ప్రాంతాలలో ఈ నాచ గిరి నరసింహస్వామి క్షేత్రం ఒకట ని చెప్పుకుంటారు.

ఈ స్థలం తపమాచరించుటకు సరైన ప్రదేశంగా ఎంచుకొని ఎంతో మంది ఋషీశ్వరులు తపమునాచరించినట్లు పురాతన ఆధారాల వల్ల తెలియుచున్నది.

ప్రతినిత్యం దైవ సానిధ్యంలో గడుపు నాచర్ అను భక్తుడి కోరిక మేరకు శ్రీమన్నారయణుడే నృహింహావతారం ధరించి ఇచట వెలసినాడని ఆ కారణంగానే ఈ ప్రాంతాన్ని నాచగిరిగా పిలుస్తున్నట్లు చెప్పుకుంటారు. శ్రీ నరసింహ స్వామి అనుగ్రహంతో స్వామి వారి పాదాలు కడుగుచూ ఉత్తర దిశగా ప్రవహించు హల్దీవాగు ఎనకంటూ విశిష్ట స్థానం సంపాదించుకొని నేడు నాచగిరి భక్తుల పుణ్యస్నాన వాటికగా మారింది.

పూర్వం ఆలయంలో స్వామివారి విగ్రహం ఒక్కటే ఉండెను. స్వామివారు ఆగ్రహం చెందడం మూలానపంటలు పొడై, భూములు బీటలు వారినని. సర్వజగత్తులో కోలాహలం బయలు దేరినది స్థానికులు దీనికి కారణం గ్రహించి శ్రీ స్వామి వారికి వామ భాగంలో శ్రీలక్ష్మీ అమ్మ వారిని ప్రతిష్ఠింపగా స్వామివారు శాంతించినారని వర్షాలు కురిసి ప్రకృతి సహకరించి లోకం సుభిక్షమయినట్లు ఆయలయ విశిష్ఠత ద్వారా తెలియుచున్నది.

ఇది వైష్ణవాలయమయినప్పటికీ ద్వైతులకు, అద్వైతులకూ, విషిష్టాద్వైతులకు ఇతర మతాల వారికి కల్పతరువయి ఉన్నది.

వేదపారాయణం సామూహికకళ్యాణోత్సవం, నిరంతర పూజాపునస్కారాలు జరిగే ఈ ఆలయాన్ని ప్రతినిత్యం అధిక సంఖ్యలో భక్తులు దర్శిస్తుంటారు.

# వీరభద్రస్వామి ఆలయము – బొంతపల్లి

మంజీరా ముచుకుందానదుల మధ్య ప్రదేశము, మైసాక్షి, బిల్వవృక్షముల వన ప్రదేశము బొంతవలె దట్టముగానున్న అరణ్య ప్రదేశము ఐన బొంతపల్లి మెదకునకు దక్షిణాన 60 కి.మీలలోను హైద్రాబాదునకు ఉత్తరాన 40 కి.మీ లలోను కలదు.

హైద్రాబాద్ మెదకు రోడ్డు పై వీరభద్ర స్వామి భద్రకాళి సమేతుడై ముఖద్వారముపై (కమాన్) బాటసారుల ఆశీర్వదించుచుండును. ఆ రోడ్డు నుండి పడమటకు 2 కి. మీ లో వీర భద్రస్వామి దేవాలయము కన్నులపండువగా అగుపడును.

బొంతపల్లి వీరభద్రస్వామి ఆలయము ప్రశాంత వాతావరణమున, ప్రకృతి సుందరనందన వనమున, భక్తులకు ఆహ్లాదమును, ఆనందమును కల్గించుచున్నది.

దేవాలయమునకు చుట్టు ప్రహరీగోడ తూర్పున ప్రధాన ద్వారాము కలదు. ప్రధాన ద్వారము పై భద్రకాళీ సమేతుడైన వీరభద్రుడు భక్తులకు అడుగకనే దర్శనమిచ్చును. ఆలయ ప్రాంగణము సువిశాలమైయున్నది. ఆలయము తూర్పుముఖమై 24 స్తంభములుగల ముఖ మండపముతో విరాజిల్లుచున్నది. గర్భాలయమున వీరభద్రస్వామి మూల విగ్రహము కలదు. గర్భాలయమున కీవల ఒల్లు బండ కలదు భక్తులు స్వామిని దర్శించి ఒల్లుబండ కడకూర్చుని బండపై నున్నరంధ్రములలో రెండు బొటన వ్రేళ్లుంచి భక్తితో మనస్సులో కోర్కెల కోరు కొందురు. కోరిక నెరవేరుననిన బండతిరుగునని బక్తులు నమ్మెదురు. మంటపమునకు ముందు మూడు దీప స్తంభములు కలవు.

దేవాలయము ప్రధాన ద్వారమునకు ఆగ్నేయమున 'అగ్ని గుండము' ఏర్పాటైయున్నది. ఈ క్షేత్రమున భక్తులు 'అగ్నిగుండము' మొక్కుబడుల చెల్లించు కొందురు. దేవాలయ ప్రాకారమునకు ముందు నాలుగు స్తంభముల కల్యాణ మంటపము, దానికి ముందు రథశాల కానవచ్చును. వీనికి నేరుగా ఫర్లాంగు దూరమున హనుమదాలయము కలదు. ఈ ఆలయమున కెదురుగా స్వామి కైంకర్యమునకై పూలతోట ఏర్పాటు చేసియున్నది.

ప్రస్తుతమున్న ఆలయము నుండి ఒకకిలో మీటరు దూరములో తూర్పువైపు పాతగుడి దర్శింపవచ్చును. ఈ దేవాలయమునకు దక్షిణోత్తరములలో దేవాలయ అర్చకులగు జంగముల, తమ్మళ్ల ఇతర కర్మచారుల నివాసములు కలవు. సమీపముననే వీరన్న చెరువు, వీరన్నగూడెము అనుగ్రామము కలదు. ఈ దేవాలయము ప్రాచీన శిల్పము చూడగా కల్యాణి చాళుక్యుల కాలమునాటిదై యుండవచ్చునని ఊహింపనగుచున్నది. వీరశైవ విజృంభణ కాలమున ఈదేవాలయము వెలసియుండ వచ్చును.

మెదకు జిల్లాలో వీరభద్రస్వామి ఆలయములు రాయకోడు, అల్లాదుర్గం, బొంతపల్లి నందు కలవు. ఈ మూడింటిలో కూడా బొంతపల్లి క్షేత్రము కడు ప్రసిద్ధమై భక్తుల నిరంతర కోలాహలముతో నుండును.

## పుల్లూరు లక్ష్మీ నరసింహస్వామి

8 వందల సంవత్సరముల పురాతన చరిత్ర కల్గిన శ్రీ లక్ష్మీనరసింహస్వామి ఆలయం ప్రకృతి రమణీయమైన దృశ్యాల మధ్య సుమారు 94 ఎకరాల విస్తీర్ణంగల అతి పెద్ద బండరాయిపై సిద్దిపేట మండలం పుల్లూరు గ్రామములో కలదు.

చారిత్రకుల కాలంలో వ్యాఘ్రపురిగా పిలిచేవారని క్రమంగా పులి ఊరిగా ఆ తర్వాత పుల్లూరుగా పిలవబడింది. గ్రామనామంగా విస్తరింపబడిన పుల్లూరు సిద్దిపేటకు 12 కి.మీ దూరంలో ఒక దట్టమైన అడవిలో ఉంది. పులుల సంచారం ఎక్కువగా ఉండేదని చరిత్ర తెల్పుతున్నది.

దేవాలయాల్లో చెక్కబడిన శాసనాలపై కాకతీయుల పరిపాలన కాలంలో 94 ఎకరాల బండపై అప్పటి రాజులు దేవాలయాన్ని నిర్మించినట్లు తెలుస్తున్నది. దీనుల బాధలను తీర్చడానికే బండరాయిపై శ్రీ లక్ష్మీనరసింహుడు వెలిసినాడని భక్తుల ప్రగాఢ విశ్వాసం. బండపై శివాలయం, లక్ష్మీనరసింహస్వామి, వెంకటేశ్వర స్వామి, దేవాలయంతోపాటు, ఉడయవల్లెకోవెల, బోగందాని గుళ్లు గాపిలువబడే త్రికుటేశ్వరాలయం ఉన్నాయి. బండపై మూడు కొలనులున్నాయి. జీడిగుండం, నీళ్లగుండం, పాలగుండంగా పిలువబడే ఈ కోనేర్లు ప్రతి సంవత్సర జాతరకు మాఘమాసంలో వచ్చే భక్తులు పవిత్రస్నానాలు చేయడానికి తోడ్పడతాయి.

బండను రామస్వామి జాతర బండగా కూడా పిలుస్తారు. ఎందుకనగా రామాయణ కాలంలో రావణాసురుడు సీతను అపహరించుకొని వెళ్ళిన అనంతరం రామలక్ష్మణులు సీతను వెదుకుతూ మార్గమధ్యలో కొంతకాలం ఇక్కడ విశ్రమించినారని ఒక కథగా ప్రచారంలో వుంది. శిల్పకళానైపుణ్యంతో విగ్రహం ఉండగా, నల్లరాతిపై అందంగా చెక్కబడిన అండాళ్ అమ్మవారి విగ్రహం ఉంది. ఈ దేవాలయం నల్లరాతిపై చెక్కబడిన అళ్వారుల విగ్రహాలు, విశిష్టాద్వైత మత ప్రచారకుల శిల్పాలు దర్శనమిస్తాయి.

దేవాలయాన్ని నిర్మించే సమయంలో ఇక్కడ వేంకటేశ్వరస్వామి విగ్రహాన్ని ప్రతిష్ఠించినట్లు అర్చకుల అభిప్రాయం ఆలయం చుట్టూ ప్రకారం అందమైన శిలలతో నిర్మించినారు. ఆలయానికి ఆగ్నేయ భాగంలో పెద్ద శిలల మధ్య జీడిగుండం మరియు ఉడియ వల్లె కోవెల కనబడుతుంది. ఇందులో

ఋషులు తపస్సు చేసేవారని ప్రచారం. ఇందులో విగ్రహాలు సరైన రక్షణ లేక దొంగలెత్తు కెళ్లారని అభిప్రాయం.

నేడు దేవాలయం రక్షణ ఆదరణ లేక శిథిలావస్థలో చేరుకుంది. ప్రధాన దేవలయానికి తూర్పువైపున తమ్మలివాణిగుళ్లు, భోగం దాని గుళ్లు పిలువబడే త్రికూటేశ్వరాలయం వుంది.

ఈ దేవాలయాల్లో కాకతీయుల కాలం నాటి లిపితో కూడిన శిలాశాసనాలు కన్పిస్తాయి. వీటి ఆధారంగా దేవాలయాన్ని 8 వందల సంవత్సరాల క్రితం నిర్మింపబడినట్టు తెలుస్తుంది. ఎక్కడ కనిపించని వినూత్న రీతిలో ఉన్న ఉమామహేశ్వరుల విగ్రహాలున్నాయి. ఈ ఆలాయానికి తూర్పు, పశ్చిమ దిశలో 3 ద్వారములున్నాయి.

ఈ జాతర మాఘ అమావాస్య నుండి 3 రోజులపాటు ఘనంగా సాగుతుంది. జాతరపై ప్రత్యేక జానపద పాటలు ప్రాచుర్యంలో ఉన్నాయి.

తెలంగాణా జిల్లాలైన వరంగల్, నిజామాబాద్, కరీంనగర్, హైదరాబాద్, పొరుగు రాష్ట్రాలైన మహారాష్ట్ర, కర్ణాటక ప్రజలు పలు ప్రాంతాల నుండి వేలాది భక్తులు లక్ష్మీనరసింహ స్వామిని దర్శించడానికి వస్తారు. జాతరలకు గ్రామీణ ప్రజలు తండోప తండాలుగా వచ్చి, వారి మొక్కులను తీర్చుకొంటారు.

కాని 8 వందల సంవత్సరాల చరిత్ర గల్గిన ఈ దేవాలయం శిథిలావస్థలో వుంది. ఒకప్పుడు జనసందోహంలో ఎల్లప్పుడు కళకళలాడేది నేడు పూర్తి భిన్నంగా వుంది. ఈ దేవాలయాన్ని అభివృద్ధి పరిచి సదుపాయాలు కల్పించి, పర్యాటకకేంద్రంగా అభివృద్ధి పరిస్తే దేవాలయ అభివృద్ధితో పాటు, పర్యాటకరంగం ఆదాయం పెరుగుతుంది.

# చల్లగిరి శ్రీ లక్ష్మీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానం - కడ్వల్

మెదకు జిల్లా కల్వేర్ మండలం కడ్వల్ గ్రామ సమీపమున పూర్వం దట్టమైన అరణ్యం గుట్టలతో నిండుకొని ఉండేది. కడ్వల్ గ్రామానికి రెండు మూడు కిలోమీటర్ల దూరంలో పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థమునందు మహాపురుషులు చతురాశ్రమ సంపన్నులు, యోగులు, గురు పుంగవులు, సమయోద్దండకోలాహల బిరుదాంకితులు, భారద్వాజస గోత్రులు, అద్దంకి తిరుమల వంశోద్ధారకులు కూచాచార్యగారు తిరుమల నుండి విశేష ప్రదేశములు శిష్య సమేతంగా సంచరించుచు కడ్వల్ గ్రామ సమీపమున బావి దగ్గర బసచేసిరి. ఆ గ్రామ పెద్దలు, పిన్నలు మొదలుకొని బాసిరెడ్డిగారి లచ్చిరెడ్డి, లింగారెడ్డి, తోట నర్సయ్య ముస్తాజర్ కులణిగారలు వచ్చి గురుమా రాజుని దర్శించుకొని వారి శిష్యులైరి. ప్రతినిత్యము గురువులవారు నల్ల ఆవుపాలు త్రాగుచూ యథాశక్తి యజ్ఞయాగాదులు జరుపుచుండిరి. ఒకరోజు ఆవు మిట్టమధ్యాహ్నం పాలు ఇచ్చుటకై గురువు దగ్గరకు ఆగుట్టపై జువ్విచెట్టు దగ్గర నుండి వచ్చెను. ఆవు ప్రతినిత్యం ఆ జువ్విచెట్టు దగ్గరకు వెళ్తుమేత మేస్తు అచ్చటనే ఉంటుండడం మొదలు పెట్టింది. ఏమి వింతనో కాని ఊళ్ళో మాత్రం ఆవు ఉండటం లేదు. కాబట్టి ఆవు ఎచ్చట ఉంటే నేనచ్చటే నేలపై ఉంటానని గురు మహారాజు కూడా ఆ అడవిలో గుడిసె వేసికొని ఉండటం జరిగింది. ఆవు ప్రతినిత్యం అంబా! అంబా! అని అంటూ పాలు తీసికొను వరకు గురువు దగ్గర ఉండేది. రోజు అర్చన వేళకు వచ్చే ఆవు ఒక రోజు రాలేదు ఎటు చూచిన భయంకరమగు అరణ్యములో వెదుకుచుండగా ఆవుమేతమేస్తూ ఉన్నస్థలంలో ఆ ఏడు కొండలవాని కృపయే అని అంటూ ప్రభూనీళాదేవి సహిత వేంకటేశ్వరస్వామి వారి శిలా విగ్రహము లభించింది. వారు తులసి తొట్టిలో ఉంచి పూజించడము మొదలు పెట్టిరి. వారం రోజులుకాక ముందే అర్ధరాత్రి శ్రీ స్వామివారు స్వప్నములో వచ్చి చల్లగిరి గుట్టపైన గురు మహారాజు చేత అచ్చటనే ప్రతిష్ఠ చేయించుట నీ కర్తవ్యమని తెల్పగనే రాత్రోరాత్రి లేచి చాటింపు చేయించి గ్రామస్తులందరితో బాజా బజంత్రీలతో వెళ్ళి శ్రీ స్వామి వారిని గురువుచేత ప్రతిష్ఠ చేయించి నిత్యార్చనలు జరుగు చుండెను. ఆ ప్రదేశం చల్లని పిల్లవాయువులలో, ఎటు చూచినా ఓషధులతో, అంతేకాక శిలాజిత్ అను మెరుపు రాళ్ళచేత తళతళమని చంద్ర కాంతులచే ప్రకాశించుట చేత ఆ ప్రదేశమునకు చల్లగిరి - చల్లగిద్ద (తెలుగు గుట్టకు కన్నడలో గిద్ద) అని ఆ కొండకు సార్థక నామం ఇడిరి.

గురువుగారు సన్యాసం పుచ్చుకొనక పూర్వం ఓషధులచేత దివ్యౌషధములను తయారు చేయుచు శారీరక వ్యాధులను చికిత్స చేస్తూ సర్వరోగములను నివారించే వారు.

అటురోగులకు నయముచేస్తూ ఇటు విశిష్టాద్వైత మత ప్రచారము ఈ ప్రాంతమునందు అశేష జనమునకు ప్రసాదించి ముక్తి మార్గమును చూపించుచు నిర్యాణం పొందిరి. ప్రతి సంవత్సరము మాఘశుద్ధ పంచమి మొదలు రథసప్తమి వరకు స్వామివారి ఉత్సవాలు వైభవంగా అర్చనలు గ్రామస్థుల చేత నిర్వహింపబడును నిత్యార్చనలు జరుగుచున్నవి.

## నల్లపోచమ్మ – బోరంచ

రెండు మూడు వందల సంవత్సరాల చరిత్ర గల పోచమ్మ అమ్మవారి ఉత్సవాలు ప్రతి సంవత్సరములో ఏడు బుధ, గురువారములు జరుగును. అమ్మవారి దగ్గర శాక్తేయ పూజలు పురస్కారములు నిర్వహించబడును. బోరంచగుట్టకు దగ్గరలో చెట్టుక్రింద శ్రీ వేంకటేశ్వర స్వామి వారు వెలసి ఉన్నట్లుగా ఉదంతము కలదు. అట్లే ఏబది సంవత్సరాల క్రితం ఆకుల లింగాపురంలోను వన్నీతరావుపేట గుండ్ల సందున శ్రీ వేంకటేశ్వరాలయములు వెలిసినట్లుగా అచటి ప్రజలు తెల్పుచుందురు. ఉత్సవాలు ప్రతి ఏటా జరుపుకొందురు. లింగాపురంలో మాత్రము చక్కని చిన్ని కోనెలలో శిలా విగ్రహము ప్రతిష్ఠించబడి ఉంది. ఆ ఊరి కోమట్లు, పద్మశాలీలు ప్రత్యేక శ్రద్ధతో గుడిని అభివృద్ధిచేసి మడులు మాన్యాలు అర్చకులకు ఇచ్చి నిత్యార్చనలు జరిపించుచున్నారు.

## అనంతశయన స్వామి – సంజీవనరావు పేట

సంజీవన్ రావు దేశ్‌ముఖ్‌గారు సంజీవన్‌రావు పేటలో అనంత శయనస్వామి వారి ఆలయమును నిర్మాణ మొనరింపజేసి శ్రీ రంగనాయకులను ప్రతిష్ఠింపించి, మడులు, మాన్యాలు, ధారా దత్తము గావించిరి. మొదట స్వయంగా తానే అర్చనలు సలుపుచూ, కొన్నాళ్ళకు అర్చకుని నియమించిరి. ప్రతి సంవత్సరము కార్తీక చతుర్దశి, పౌర్ణిమ, పాడ్యమి రోజులలో వైభవంగా భజనలు, కీర్తనలు వాహనసేవలు, రథోత్సవములు - ఉత్సవాలు జరుపుదురు.

# స్వయంభూ దేవాలయము - దుద్దెడ

కాకతీయ శిల్ప కళా ప్రభావము వెలరించిన ఆలయములలో దుద్దెడ శంభుదేవుని ఆలయమొకటి.

ఈ ఆలయము కాకతీయుల కాలమున నిర్మింపబడినట్లు ఆలయ ప్రాంగణమున గల శిలాశాసనము ద్వారా తెలియుచున్నది.

సుమారు క్రీ.శ. 1300 ప్రాంతమున కాకతీయ చక్రవర్తియగు ప్రతాపరుద్రుని సామంతరాజగు నాచిరెడ్డి కుమారుడు మాధవరెడ్డి ఈ శాసనమును వేయించెను. దీనిని బట్టి నాచిరెడ్డి పానుగల్లు నుంచి దుద్దెడ వరకు పరిపాలన గావించినట్లు తెలియుచున్నది. ఈ శాసనము నందు అంగళ్ల ద్వారా ప్రభుత్వానికి వచ్చే సుంకాన్ని దేవాలయానికి దానం చేస్తున్నట్లుగా కలదు.

ఈ శంభుదేవుని ఆలయము వీరిచే నిర్మించ బడినదైయుండ వచ్చును.

ఈ ఆలయ నిర్మాణము పూర్తిగా [illegible] శిలతో నిర్మించబడియున్నది. 78 అడుగుల చతురస్రంగల విశాలమైన ప్రదేశంలో ఈ ఆలయము కలదు ఆలయ నిర్మాణమునందు రాతి సందులలో [illegible] ఎప్పటుగాని మట్టిని వాడలేదు. ఒకరాతికి మరొక రాతిని అతికినట్లుగా పేర్చి నిర్మించుట శిల్పుల పనితనమునకు ప్రతీక. ఆలయగర్భ గుడిలో దర్శనమిచ్చే స్వయంభూ దేవుడు లింగాకారమున కలడు. ఈ శివలింగంపుట్టు లింగమని ప్రతీతి గర్భ గుడిపైన 36 అడుగుల గాలి గోపురము గుడిముందు విశాలమైన కాల్యాణ మండపము 16 ఏకశిలాస్తంభాలతో నిర్మించబడినది.

ఆలయమునకు 4 ద్వారములు కలవు. ద్వారములకు ప్రక్కన ఏకశిలచే చెక్కబడిన ద్వార పాలక విగ్రహములు కడురమ్యముగానున్నవి.

ప్రవేశ ద్వారముపై రెండవ అంతస్తు శిలలచే నిర్మించబడినది కుడివైపున జైనుల ఆరాధ్యదైవమైన పార్శ్వనాథుని విగ్రహము నల్లరాతిపై చెక్కబడియున్నది ఈ విగ్రహమును నేడు కాల భైరవునిగా కొలుచుచున్నారు.

ఆలయము కుడివైపు వేణుగోపాలస్వామి, శివలింగము కలవు. ఎడమవైపు వీరభద్రుని విగ్రహము, స్త్రీమూర్తి విగ్రహము శిథిలములుగా ఖండితాలుగానున్నవి.

ఇచ్చట ఒక లింగము జలలింగమని పిలుతురు. ఈ లింగంలో ఎపుడూ నీరు ఊరుతూ ఉండడం విశేషము.

గర్భగుడికి ఇరువైపుల రెండు చిన్న దేవాలయములు కలవు. ఎడమ ప్రక్కన గల ఆలయంలో మహాశక్తి స్వరూపిణియైన పార్వతీదేవి విగ్రహము గలదు. ఈ అమ్మ దక్షిణాభిముఖమై యుండుట యిచ్చటి ప్రత్యేకత. దక్షిణాభిముఖమైన శక్తి దేవాలయములుండడు తక్కువ.

ఆలయము ముందు భాగములో విశాలమైన కోనేరు కలదు. కోనేరులో ఉత్తర, దక్షిణ, పడమరల దిక్కులలో సొరంగ మార్గాలున్నాయి. పశ్చిమ

మార్గము గర్భ గుడిలోని లింగము వరకు ఉండడంతో లింగం చుట్టూ నీరుండేదని ఇక్కడి కథనము. ఉత్తర దిక్కు సారంగం కాశీ ద్వారమని పెద్దలు చెప్పుదురు.

ఈ ఆలయమున నేటికిని నిత్యపూజా నైవేద్యాదులుసక్రమముగా జరుగుచున్నవి.

ప్రతి ఏట పుష్యబహుళ దశమినుండి మూడు రోజులపాటు మహా వైభవముగా ఉత్సవములు జరుగును.

ఈ ఉత్సవములలో రథోత్సవము కడు ప్రధానమైనది ఐదంతస్తుల రథముపై ఉత్సవ విగ్రహములుంచి ప్రత్యేక పూజలు జరిపి గ్రామములోని ప్రధాన వీధుల గుండా రథయాత్ర సాగును ఈ ఉత్సవాలకు జిల్లా పలు ప్రాంతాల నుండి వచ్చి భక్తులు ఉత్సాహముతో పాల్గొందురు.

# రామలింగేశ్వరాలయము – గోమారము

మెదకు జిల్లా శివంపేట మండలములోని గోమారం గ్రామ పరిసరాలలో రామప్పగుట్ట కలదు. విశాలమయిన పరుపుబండవలె ఉన్న ఈ ఎత్తైనగుట్టపై ఒక చిన్న దేవాలయము కలదు. ఆ ఆలయమే రామలింగేశ్వరాలయము . ఆలయ నిర్మాణ విధానమునుబట్టి చూడగా రాష్ట్రకూటులనాటి నిర్మాణమని తోచుచున్నది. రాష్ట్రకూటుల ఏలుబడిలో అనేక రామలింగేశ్వరా లయములు ప్రతిష్ఠింపబడినవి. మెదకు జిల్లాలో రామలింగేశ్వర, రామేశ్వర ఆలయములు చాలా కలవు.

మాసాయిపేట శివారులలో ఉన్న రామప్ప గుట్టపై రామలింగేశ్వరాలయము కలదు. ఇట్లే కూడెల్లి మొదలగు చోట్ల కూడా రామలింగేశ్వరాలయములు కలవు. ఈ రామలింగేశ్వర ఆలయముల నిర్మాణములు ఒకే రకంగానున్నవి.

చిన్న పాటిగుడి, గుడిలో గర్భగుడి, గర్భగుడిలో శివలింగము లింగమునకు కుడిఎడమలలో గణపతి, పార్వతి విగ్రహాలు ప్రతిష్ఠింపబడియున్నవి. గుడికెదురుగా ధ్వజస్తంభము, ధ్వజస్తంభమునకు చుట్టూరా అరుగు కలదు. గర్భగుడికీవల చక్కని శిల్పముతోనున్న నంది విగ్రహము కలదు. గుడిపై శిఖరము కలదు.

ఆలయ సమీపాన ఒక చిన్న గుండము సహజ ప్రకృతిసిద్ధముగా ఏర్పాటయి యున్నది. ఇంతఎత్తైన కొండపై సహజ సిద్ధముగా నిర్మితమైన కోనేరులో నీరు పరిశుభ్రముగా నిండియుండును. ఎంతటి కరువు కాటకములు వచ్చినప్పటికిని ఈ గుండమునందు నీరు తరిగిపోకుండా ఉండుట ఆశ్చర్యకరము. ఈ గుండమున స్నానముచేసినచో సకల రోగ నివారణ కలుగునని ఇందలి నీరు ఔషధ ప్రాయమని ఇక్కడి వారు తలంతురు.

వర్షాకాలమునందు వర్షాలు కురియకున్న సమయములలో గోమారం గ్రామస్థులు పోయి ఈ గుండమునందలి నీటితో శివలింగము మునుగునట్లుగా గర్భగుడిలో నీళ్ళుపోయుదురు. ఈ విధముగా ఆ శివలింగమును నింపినచో మూడురోజులలో తప్పక వర్షములు కురియును.

ఎత్తైన కొండపై మూడువైపుల పచ్చని చేలలో, ఒకవైపు గోమారము గ్రామం పెద్దచెరువుతో ఈ స్థలము ఒక విహారకేంద్రముగా భాసిల్లుచున్నది. ఈ ఆలయమును ప్రభుత్వము పట్టించుకొని అభివృద్ధి పరిచినచో ఒక గొప్ప పర్యాటక కేంద్రము కాగలదు.

# శరభేశ్వరాలయం - సిద్దిపేట

సిద్దిపేట పట్టణానికి తూర్పు పొలిమేరలో శ్రీ శరభేశ్వరాలయం ఉంది. గతయాభై, అరవై సంవత్సరాలుగా మత, ధార్మిక, ఆధ్యాత్మిక, సాంస్కృతికచైతన్యానికి సాక్షిగా నిలచిన ఆలయం ఇది. ఇక్కడ జరిగే కళ్యాణోత్సవాలు, కవి పండితులకు, కళాకారులకు, భక్తులకు, ప్రజలకు, హితవైె, సన్నిహితమై, రక్తికి, ముక్తికి కూడా బాటలు వేశాయి.

ఆంధ్ర దేశానికి మాత్రమే పరిమితమైంది శ్రౌతశైవ సంప్రదాయం. దీనినే ఆరాధ్యశైవం అని కూడా అంటారు. ఆరాధ్య బ్రాహ్మణులు శైవమత ప్రచారం చేస్తూ శిష్యవర్గానికి మంత్రోపదేశము లిస్తుంటారు. సిద్దిపేటలో ఈ సంప్రదాయానికి చెందిన ఆరాధ్యకుటుంబాలు దాదాపు 25 ఉన్నాయి. వీనిలో ఘట్టేపల్లి వారు ప్రముఖులు. నేటికి సుమారుగా 150 సంవత్సరాలకు పూర్వం శర భారాధ్యులనే తపస్వి జన్మించాడు. శాలివాహన శకం 1798, ఈశ్వర జ్యేష్ట శుక్ల పంచమినాడు శరభారాధ్యులవారు శివాలయాన్ని నిర్మించాలని సంకల్పించి దాదశవర్ష నిరాహారదీక్షను, మౌనదీక్షను ప్రారంభించారు. ఆ దీక్షతోనే కాశీ వెళ్ళి నర్మద బాణాన్ని తమ తలపై మోస్తూ తెచ్చి శాలివాహన శకం 1811 విరోధి జ్యేష్ట కృష్ణపంచమినాడు కాశీ అన్నపూర్ణా విశాలాక్షీసమేత విశ్వేశ్వరస్వామి వారిని ప్రతిష్టించారు. కాని ప్రజలు మాత్రం ఆ తపస్వి పేర "శభేశ్వరుడని - శరభేశ్వరాలయమని" వ్యవహరి స్తున్నారు. ఆ తర్వాత ఘట్టేపల్లి నాగమల్లయారాధ్యులు "శ్రీ విశ్వేశ్వరబాల భక్త సమాజం" ఏర్పరచి ఆలయ అభివృద్ధికి కృషి చేశారు.

ఇప్పుడు మనం చూస్తున్న ఆలయ సముదాయం ఈ మహానుభావుని కృషి ఫలితమే. ఈయన తన జీవిత కాలంలో సిద్దిపేటలో మత, ధార్మిక రంగాలలో ఎంతో కృషి చేశారు. శరభేశ్వరాలయానికి సంబంధించిన చరిత్రను శాసన పరంగా ధ్వజ స్తంభం మీద రాయించారు.

శరభేశ్వర ఆలయం పక్కనే కన్యాకాపరమేశ్వరీ ఆలయం ఉంది. ఇది ధార్మిక, ఆధ్యాత్మిక, సామాజిక కార్యక్రమాల కూడలిగా విలసిల్లుతోంది.

# శ్రీ శ్రీ శ్రీ రాచన్న స్వామి దేవాలయం - బడంపేట

మెదక్ జిల్లా కోహీర్ మండలంలో బడంపేట గ్రామానికి సమీపంలో, ఎత్తైన చెట్లు చేమలతో కూడిన ప్రశాంత వాతావరణంలో భక్తుల పాలిటి కల్పతరువైన రాచన్నస్వామి నెలకొని ఉన్నారు.

ఈ దైవ క్షేత్రాన్ని గూర్చి ఒక స్థలపురాణము మరో కథనమూ ప్రచారంలో ఉన్నది. స్థలపురాణం ప్రకారం బడంపేట వద్ద వెలసిన శ్రీ రాచన్న ప్రభుస్వామి, కర్ణాటకలోని హుమ్నాబాద్ మాణిక్ ప్రభు, కర్కనెల్లి బక్క ప్రభు సమకాలీనులుగా తెలియుచున్నది. బడంపేటలోని రాచన్న స్వామి ఆలయానికి దగ్గరలోని అడవిలో ఒక ప్రాంతంలో ప్రభుస్వామి అనేక సంవత్సరాలు ఆహారపానీయాలు తీసుకోకుండా తపస్సు చేసి శివైక్యం చెందెను. ఆ ప్రదేశందర్శనీయస్థలంగా నిలిచింది.

మరో కథనం ప్రకారం బడంపేట గ్రామ నివాసి అయిన రాచన్న పటేల్ తన ఇలవేల్పయిన రాయిచూర్ శ్రీరాచన్న ప్రభుస్వామి వద్దకు ప్రతి సంవత్సరం (ఆధునిక వాహన సౌకర్యం లేని కాలంలో) ఎడ్లబండిపై శివరాత్రి తరువాత ఫాల్గుణ శుద్ధ పంచమికి దర్శనార్థం వెళ్ళివచ్చేవారు. ఒక సంవత్సరం రాచన్న పటేల్ తన కుమారుని కేశ ఖండనం సందర్భంగా బంధుమిత్రులు, గ్రామస్థులు మొదలయిన స్వపరివారంతో ప్రయాణమయ్యాడు. వీరితోబాటు వెళ్ళిన అదే గ్రామనివాసి చెన్న వీరయ్య స్వామి అనే బాలుడు కనిపించలేదు. ఎంత వెతికినా అతని ఆచూకీ తెలియలేదు. ఏమిచేయలేక గ్రామస్థులంతా బాధతో తిరిగి బడంపేట చేరుకున్నారు. 15 రోజుల తరువాత ఓ రోజు ఆ గ్రామంలోని ఒక మావటికి అడవిలోని "ఈదుల కుంట" ప్రాంతంలో ఒక పొన్నచెట్టుపై ఆ తప్పిపోయిన బాలుడు కనిపించాడు. అప్పుడా మావటి గ్రామస్థులంతా నీ గురించి దిగులుతో ఉన్నారు. నీవు గ్రామానికి రావలెనని కోరగా ఆ బాలుడు గ్రామస్థులందరు మంగళవాయిద్యాలతో తనని గ్రామంలోని తీసుకవెళ్ళాలని కోరాడు. ఈ విషయం విన్న గ్రామస్థులు ఇదంతా "రాయచూర్ రాచన్న" గారి మహిమగా భావించి అలాగే చేశారు. ఆ తరువాత ఆ బాలుడు గ్రామ పెద్ద అయిన రాచన్న పటేల్‌ను ఒడి చాచమనగా ఆయన అదేవిధంగా చేశాడు. ఆ సమయంలో అందరూ చూస్తుండగానే ఒడిలో ఒక "లింగం" ప్రత్యక్షమయ్యింది. అత్యంత ఆశ్చర్య, సంతోషాలతో ఆ లింగాన్ని కన్నులకద్దుకొని మంగళవాయిద్యాలతో వస్తూండగా గ్రామసమీపంలో ఒకచోట ఆ లింగాన్ని బాలుడయిన చెన్నవీరయ్య కోరికమేరకు ప్రతిష్ఠించారు.

రాయిచూర్ రాచన్న ప్రభుస్వామి వారి కటాక్షం వల్లనే ఇదంతా జరిగిందని భావించి ఆలయ నిర్మాణానికి పూనుకున్నారు. భూస్వామి అయిన బొందిలి కుందన్ ప్రసాద్ ఈ ఆలయాన్ని నిర్మించారు.

ఈ ఆలయంలో స్వామివారి ఆశీస్సులు పొందటానికి మన రాష్ట్రనలుమూలల నుండే కాకుండా కర్ణాటక, మహారాష్ట్రుల నుంచి కూడా వేలమంది భక్తులు వస్తుంటారు. ప్రతీ సంవత్సరం శివరాత్రి తరువాత ఐదవరోజు ఫాల్గుణశుద్ధ పంచమి నుంచి సప్తమి వరకు మూడు రోజుల పాటు స్వామివారి జాతర ఉత్సవాలు వైభవంగా జరుగుతాయి. ఈ మూడు రోజులు ఎన్నో కార్యక్రమాలలో ఆలయ ప్రాంతమంతా ఎంతో సందడిగా ఉంటుంది. ఈ జాతర రోజులలో ఆర్టీసీవారు కూడా ప్రత్యేక బస్సులు నడుపుతారు. ఆలయం వెనుక ఒక కోనేరు కూడా కలదు. ఫాల్గుణ శుద్ధ షష్టి రోజున మాత్రం జాతర సందర్భంగా అగ్నిగుండం ఏర్పాటు చేస్తారు. ఆ రోజు వేలాది మంది భక్తులు కోనేటిలో స్నాన మాచరించి అగ్నిగుండ ప్రవేశం చేసి స్వామి వారిని దర్శనం చేసుకుంటారు. ఆలయంలో భక్తుల సహాయంతో పూజ, అన్నదానం మొదలయినవి ఏర్పాటు చేయబడతాయి.

## జోగినాథుని ఆలయం - జోగిపేట

మెదకు జిల్లాయందలి చారిత్రకుల దృష్టినాకర్షించిన ఎన్నో ఆలయాల్లో ఈ జోగినాథుని దేవాలయం కూడా ఒకటి. అందోలు మండలంలోని ఈ ఆలయం గూర్చి ఎన్నో ఐతిహ్యాలు ప్రచారంలో ఉన్నాయి.

క్రీ.శ.1515-1560 మధ్యకాలంలో అలమరెడ్డి చౌదరి రామజోగి అనుగ్రహంతో సంతాన ప్రాప్తినొంది ఒక శివలింగమును ప్రతిష్టించి ఆ లింగానికి "జోగినాథుడని" నామకరణం చేసినట్లు ప్రతీతి. ఆ తరువాతే ఆ ఆలయ ప్రదేశంలో 15 గుడిసెలతో జోగిపేట గ్రామం వెలసినట్లు, రామజోగి వలన జోగిపేట పేర గ్రామం నిర్మితమయినట్టు చరిత్ర చెబుతుంది.

కానీ సురవరం ప్రతాపరెడ్డిగారు తన సాంఘిక చరిత్రలో జైనజోగులు నివసించుటచే ఆ గ్రామానికి జోగిపేట అని పేరువచ్చినట్లు తెలిపారు. అంతేగాక అహింసావాదులయిన జైన జోగులను తరిమి వీరశైవులు శివలింగాన్ని ప్రతిష్టించినట్లుగా కూడా అయన సాంఘిక చరిత్రలో తెలిపారు. కాగా ఈ ప్రాంతంలో 200 లకు పైగా జైన జోగులు ఇక్కడ నివసించేవారని వారే జైనమందిరాన్ని ఏర్పాటు చేసి అందులో 24 మంది జైన దేవతలను కూడా ప్రతిష్ఠించినట్లు చారిత్రక ఆధారాల వల్ల స్పష్టంగా తెలియుచున్నది.

ఈ జోగినాథుని దేవాలయంలో ఇంతకు పూర్వం ప్రతి చైత్రశుద్ధ దశమి తిథియందు వైభవంగా రథోత్సవం జరిగేది. కానీ అనేక కారణాల మధ్య ఆనాటి రథోత్సవ వైభవం నేడు కను మరుగైనది.

## సరస్వతీ దేవాలయం – వర్గల్

ఎత్తయిన కొండపై, రమణీయమైన ప్రకృతి ఒడిలో, ప్రశాంత వాతావరణంలో వర్గల్ మండలం కేంద్రంలో వెలసిన శ్రీవిద్యాసరస్వతి, శనైశ్చరాలయాలు అనతి కాలంలోనే అత్యంత ప్రజాదారణ పొందాయి. జనసంచారం అంతగా కనిపించని శంభుదేవునిగుట్టపై శ్రీవిద్యాసరస్వతి శనైశ్చరాలయాలు వెలసినప్పటినుంచీ భక్తుల రాకపోకలు పెరిగి, ఎంతో కళ వచ్చింది. అధిక సంఖ్యలో భక్తులు రావడం వలన కొండ ప్రాంతానికి రోడ్డు, విద్యుత్ సౌకర్యం ఏర్పడింది. రాజధాని నగరానికి 50 కి.మీ. దూరంలో గల ఆలయానికి జంటనగరాలతో పాటు నల్గొండ, రంగారెడ్డి, మెదక్ తదితర జిల్లాల నుండి ప్రతిరోజు భక్తులు వస్తుంటారు.

సికింద్రాబాద్‌కు చెందిన "సత్యపథసేవా సమితి" ఆధ్వర్యంతో 1990లో సుమారు పదిలక్షల రూపాయల వ్యయంతో వర్గల్‌లో శ్రీ విద్యా సరస్వతి, శనైశ్చరాలయాల నిర్మాణానికి అంకురార్పణ జరిగింది. ప్రారంభించిన రెండు సంవత్సరాలలో ఆలయ నిర్మాణం పూర్తయింది. 1992 ఫిబ్రవరి 16న పుష్పగిరి పీఠాధిపతుల కరకమలములచే విగ్రహప్రతిష్ట అత్యంత ఘనంగా జరిగింది. భక్తుల నుండి ఆదరణ పెరగడంవల్ల సేవాసమితి సభ్యులు ఆలయ అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టారు. బోరుబావులు త్రవించి నీటి సౌకర్యం కల్పించారు. కొండల మధ్య ఎకరం స్థలంలో "పుష్పవనం" ఏర్పాటు చేసారు. లక్షల వ్యయంతో కళ్యాణమండపం నిర్మించారు. ప్రత్యేక పూజలు, శరన్నవరాత్రి ఉత్సవాల సమయంలో అవధానాలు, హరికథలు మొదలగు సాంస్కృతిక, ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహించడం ఇక్కడి విశేషం.

## శనైశ్చరాలయం - వర్గల్

శ్రీ విద్యా సరస్వతి వెలసిన కొండలపై క్రింద భాగంలోనే శనైశ్చరాలయం నిర్మించడం ప్రత్యేకతను సంతరించుకుంది. ఒక పుణ్యక్షేత్రంలోనే విద్యా సరస్వతితో పాటు. శని ఆలయం ఉండాలనే భావనతో సేవాసమితి ఆలయం నిర్మించింది. ప్రతి శనిత్రయోదశి రోజున ఈ ఆలయంలో ప్రత్యేక శనిపూజలు, తైలాభిషేకాలు జరుగుతాయి.

సరస్వతీదేవి, శనైశ్చర దేవాలయాలకు వచ్చే భక్తుల వలన మధ్య ప్రాచీన కాలంలో పుట్టులింగంతో వెలసి, శిథిలావస్థకు చేరిన శంభుని దేవాలయం, గ్రామనడిబొడ్డున ఉన్న పంచలోహ విగ్రహాలతో వెలసిన వేణుగోపాలస్వామి ఆలయం నూతన కళలను సంతరించుకున్నాయి. మండలకేంద్రం నుండి ఆలయం వరకు నూతనంగా రోడ్డు నిర్మించారు. వర్గల్ శ్రీ సరస్వతీ, శనైశ్చరాలయాల నిర్మాణంలో, పురోభివృద్ధిలో అహర్నిశలు కృషిచేస్తున్న ప్రముఖ సిద్ధాంతి దేవీ ఉపాసకులు, సత్యపథం సేవాసమితి అధ్యక్షుడు శ్రీ చంద్రశేఖర్ శర్మ సిద్ధాంతి అభినందనీయులు.

# శ్రీ రంగనాయక స్వామి - చంద్లాపురం

పురాతన సంస్కృతి, చరిత్ర అహ్లాదకరమైన వాతావరణం, ఎత్తైన కొండపై వెలసి ప్రజల ఇష్టదైవంగా విశ్వాసాన్ని చూరగొన్న రంగనాయక స్వామి దేవాలయం చిన్నకోడూరు మండలం చంద్లాపురం గ్రామంలో ఉంది. గ్రామానికి నైఋతి దిశలో ఎత్తైయిన కొండపై ఉన్న శ్రీ రంగనాయక స్వామి ఆలయానికి విశిష్ఠమైన చరిత్ర ఉంది. 40 ఎకరాల, విస్తీరణంగల ఈ రంగనాయక స్వామి కొండపైన పూర్వం నవనాథ సిద్దులలో కొందరు ఈ ప్రాంతానికి వచ్చి గుట్టపై తపస్సు చేసి సిద్ధినొంది భిక్కనూరులో సిద్ధిరామేశ్వర స్వామిని ప్రతిష్టచేసి ఆ తర్వాత ప్రస్తుత సిద్ధిపేట పట్టణానికి ఆ పేరు నామకరణం చేసారని పూర్వులు చెబుతుంటారు. ఈ రంగ నాయకుల గుట్టపై అనేక గుట్టలు ఉన్నాయి. అందులో అనేక మంది మునులు తపస్సు చేసేవారని ప్రతీతి.

ఈ కొండకు ఇంతటి విశిష్ఠతతో పాటు మరో ప్రత్యేకత కూడా ఉంది. కొండపై అత్యంత విలువైన వనమూలికలు ఇప్పుడు కూడా లభ్యమవుతున్నాయి. వీటికోసం దూరప్రాంతాల నుంచి పలువురు వచ్చి తీసుకవెళుతుంటారు. 30 సంవత్సరాల క్రితం వరకు ఈ కొండపై పులుల సంచారం ఉండేది. దీనివమూలంగా కొండపైకి వెళ్ళడానికి ఎవ్వరూ సాహసించేవారు కాదు. ప్రస్తుతం రంగనాయకుల స్వామిని చంద్లాపురం గ్రామంలో ప్రజలు తమ ఇలవేలుపుగా కొలుస్తున్నారు. గ్రామంలో 50 శాతం మంది పేర్లు ఈ స్వామిపేరుతోనే ఉన్నాయి. కొండపై ఆలయంతో పాటు ఆంజనేయస్వామి ఆలయం కూడా ఉంది. కొండపై పాలగంగ, కమ్మరోనిదోనె అనే రెండు కోనేరులున్నాయి. వీటిలో అన్నివేళలా నీరు ఇంకిపోకుండా ఉంటుంది. ఈ నీరు సేవిస్తే ధీర్ఘకాలికరోగాలు నయమవుతాయుని అక్కడి ప్రజల నమ్మకం. సుమారు వెయ్యిమందిని దాచగల పెద్దపెద్ద సొరంగాలున్నాయి. ప్రతి శ్రావణ, కార్తీక మాసాలలో ప్రజలు కొండపైకి సామూహిక వన భోజనాలకు వెళ్తుంటారు. చుట్టుప్రక్కల గ్రామాలకు పుణ్యక్షేత్రంగా ఈ ఆలయం భాసిల్లుతున్నది.

ప్రతి సంవత్సరం చైత్రశుద్ధ నవమి రోజున శ్రీ స్వామివారి కల్యాణ ఉత్సవాలు అత్యంతవైభవంగా జరుగుతాయి. వైశాఖ శుద్ధ పూర్ణిమ రోజునస్వామివారి రథోత్సవం కన్నుల పండువగా రెండురోజుల జరుపుతారు. ఉత్సవాలలో గ్రామప్రజలతోపాటు చుట్టు ప్రక్కల గ్రామాలు ప్రజలు కూడా పాల్గొంటారు.

ప్రాచీన చరిత్ర కలిగిన ఈ ఆలయానికి తగిన సౌకర్యాలు, ప్రచారం కల్పించి అన్ని హంగులు సమకూరిస్తే ప్రముఖ ఆధ్యాత్మిక ప్రదేశంగా, పర్యాటక కేంద్రంగా వర్థిల్లే అవకాశాలున్నాయి.

## మల్లికార్జున స్వామి దేవాలయము - బీరంగుడ

మెదక్ జిల్లా పటాన్‌చెరు మండలంలోని అమీన్‌పూర్ గ్రామపంచాయితీ పరిధిలోని బీరంగూడలో ఈ మల్లికార్జునస్వామి దేవాలయం ఉంది. రెండో శ్రీశైలంగా పేరుగాంచిన ఈ ఆలయం 13వ శతాబ్దంలో వెలసిందని చెబుతుంటారు.

ఆ కాలంలో భోగమహర్షి, భృగుమహర్షి ఇక్కడ తపస్సు చేశారని వారి శక్తి ఫలితంగా ఇక్కడ ఉన్న కొండపై ఒక కొలను వెలసిందనీ భక్తులు నమ్ముతారు. ఈ ఆలయ సమీపంలో ఒక సొరంగ మార్గం ఉంది. దానిగుండా వెళితే ఒక శివలింగం కనిపిస్తుంది. ఈ శివలింగాన్ని దాటి ముందుకు వెళితే వెడల్పయిన సొరంగ మార్గం ద్వారా ప్రయాణిస్తే శ్రీశైలం చేరుతారని అంటారు.

ఒకప్పుడు ఈ ఆలయ సమీపంలో నాలుగుడుగుల వీర భద్రుని విగ్రహం ఉండేడిది. దాని ఆధారంగా ఈ దేవాలయాన్ని పేరప్ప లేక బీరప్ప ఆలయం అని స్థానికులు పిలిచేవారని చెబుతారు. కాలక్రమేణ అది "బీరంగూడ" గా ప్రసిద్ధినొందింది. కాకతీయుల కాలంలో ప్రసిద్ధినొందిన ఈ ఆలయం తరువాత 1980 ప్రాంతంలో భక్తులచే గుర్తింపబడి అభివృద్ధినొందింది. ఇక్కడ శివరాత్రి సందర్భముగా 5 రోజులపాటు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి.

## త్రికూటాలయము - కల్పగూర్

ఆంధ్రదేశాన్ని కాకతీయ రాజులు క్రీ.శ. 11 - 13వ శతాబ్దాల మధ్యకాలములో పరిపాలించి. ప్రత్యేకమయిన ఆలయాలను నిర్మించి వారి కళాతృష్ణను భావితరాలకు తెలిజేశారు. కాకతీయ రాజులచే వారి సామంతులచే నిర్మింపబడిన ఆలయాలు అటవీ ప్రాంతములో ఉండడం వల్ల, మారుమూల ప్రాంతములందు నెలకొని ఉండడం చేతను. వాటిని గురించి సరియైన అవగాహన యీ నాటికి కళాభిమానులకు వీలుపడుట లేదు.

కాకతీయులు శైవమతాన్ని ఎక్కువ ఆదరించినప్పటికీ: హైందవమత ప్రచార లక్ష్యంతో సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండేలా గ్రామాలందు ఆలయాలను నిర్మించి వారిలో ఆధ్యాత్మిక చింతన పెంపొందుటకు దోహదం చేశారు. కాకతీయ కళాస్పృష్టికే అద్దం పట్టినది. ఈ స్వయంభూ దేవాలయము. రామప్పగుడి, హనుమకొండలో వేయిస్తంభాల గుడి. ఘన్‌పూర్ ఆలయ సముదాయము. పిల్లల మర్రి దేవాలయము, మొదలగునవి చరిత్రకారుల దృష్టిని ఆకర్షించి వాటిశిల్పకళా వైభవమును లోకానికి అందించారు.

కాని, ఇంకను మరుగున పడియున్న కాకతీయ శిల్పసంపద, వాస్తునైపుణ్యతను ఇనుమడింప జేసుకొన్న ఆలయాలు మనకు తెలంగాణా గ్రామాలలో కానవస్తూనే ఉన్నాయి. అటువంటి కోవకు చెందిన త్రికూటాలయము - సంగారెడ్డి తాలూకా కేంద్రానికి 4.కి.మీ. దురములో కల్పగూరులో కాకతీయ వాస్తు శిల్పముతో నిర్మింపబడినది.

త్రికూట పద్ధతిలో నిర్మింపబడిన యీ ఆలయసముదాయమునందు కాశీవిశ్వేశ్వర, వేణుగోపాల, అనంత పద్మనాభస్వామి, ఆలయములు కలవు. ప్రతిష్ఠానముపై ఎనిమిది స్తంభములతో నందిమండపము గలదు. నంది మండపమునందు నందీశ్వరుని విగ్రహము చూడముచ్చటగా మువ్వలపట్టికతో మలచబడినది.

చిత్రఖండ పద్ధతిలో స్తంభములు మలచబడి, కాకతీయ వాస్తు రీతులను సూచించుచున్నవి. నందిమండపమునకు యిరువైపుల భక్తులు విశ్రమించుటకు కక్షాసనములుఏర్పర్చబడినవి.

**రంగమండపము** :ముఖమండపు మధ్యన నాల్గు స్తంభములు గలిగిన రంగమండపము ప్రత్యేకతను సంతరించుకొన్నది. ముఖమండమునందు గల ఈ రంగమండపము చూపరుల దృష్టిని ఆకట్టుకొనే విధముగా స్తంభములు మలచబడినవి. స్తంభ మూలమున నాల్గువైపుల రతి భంగిమ ముద్రలో నృత్యము చేయుచున్న స్త్రీ. త్రిభంగముద్రలో అద్దమును చేపట్టి అలంకరించుకొనుచున్న సౌందర్యమూర్తి, ఏనుగు, ఆంజనేయ విగ్రహములు, మొదలగునవి అతి సుందరముగా, లావణ్యమునొలికించుచున్నట్లు మలచబడినవి. మరియొక స్తంభముపై మృదంగము వాయించుచున్నట్లు, స్త్రీమూర్తి జడను అల్లుకొనుచున్నట్లు చెక్కబడినది.

ముఖ మండపము యొక్క పై కప్పు నిలువు అడ్డుకమ్మీలతో చతురస్రాకారముగా విభజింపబడి. నట్టునడుమగల రంగ మండపము పై కప్పు లతాంకృతముగా నాల్గు ఫలకముల మందముతో చతురశ్రముగా అమర్చబడినది. పైకప్పుమధ్య భాగమున వృత్తాకారపు నగిషీల మధ్య రేకులు విచ్చిన కలువపువ్వు మలచబడినది. రంగ మండపము కొద్దిగా ఎత్తు కలిగియున్నది. ప్రేక్షకులు గాని, భక్తులుగాని నృత్యవిన్యాసములను తిలకించుటకు వీలుగా ముఖమండప కక్షాసనములు వీలు కల్పించుచున్నవి.

## వేణుగోపాల స్వామి ఆలయము :

త్రికూటాలయములలో ఒకటయిన వేణుగోపాలస్వామి ఆలయము ఉత్తర దిశగా నిర్మితమైనది. గర్భాలయము అంతరాళము కలిగియున్నది. అంతరాళ ద్వార బంధము చతుశ్శాఖలు కలిగి మణిబంధ, లతాపత్ర, కుడ్యస్తంభ మరియు జాలవాతాయన పట్టికలతో మలచబడినది. జాలవాతాయన పట్టికల యందు మృగవ్యాళములు మలచబడినవి. కుడ్యస్తంభ భాగమంటపము

చిత్రఖండన పద్ధతిలో చిరుస్తంభములు మలచబడినవి. ద్వార బంధమున కిరువైపుల వైష్ణవ ద్వారపాలకులు. వింజామరలు వీచుచున్న సేవకుల విగ్రహములు మలచబడినవి. ద్వార బంధము యొక్క క్రింది భాగమున గల అడ్డుపట్టి చిరుకోష్టములతో వాటి యందు నర్తకి ప్రతిమలతో అందముగా మలచబడినది. లలాట బింబమునందు ఏ విగ్రహములేక నునుపుగా వదిలివేయబడియున్నది. అంతరాళము పై కప్పు వికసించిన పుష్పముతో అలంకరింపబడియున్నది. అంతరాళము నుండి గర్భాలయమునకు ప్రవేశించు స్థలమున అర్ధచంద్రాకారపు శిలకు ఇరువైపుల శంఖ, చక్రములు కలవు. లలాట భాగమున లక్ష్మీదేవి ప్రతిమ మలచబడియున్నది. చతురస్రా కారముగానున్న ఈ గర్భాలయమందు పీఠముపై వేణుగోపాల స్వామి విగ్రహము ప్రతిష్ఠించబడియున్నది. చతుర్భుజమూర్తి అయిన వేణుగోపాలుని ముందు రెండుచేతులు వేణువును మ్రోగించునట్లుగా పై రెండు చేతులయందు శంఖ చక్రములు ధరించినట్లుగా మలచబడినవి. మడతబడిన కాళ్ళతో నిలుచుని యున్న వేణుగోపాలుని విగ్రహము సుమారు 4 అడుగుల ఎత్తు కలిగి యున్నది. సర్వాలంకార భూషితుడై ఒప్పారుచున్న ఈ మూర్తి కిరువైపుల ఇరువురు స్త్రీమూర్తులు కలరు. ఆ స్త్రీమూర్తుల పాదముల క్రిందగల గూడులలో ఆవుదూడలు వేణుగానమును వింటూ ఆనందించుచున్నట్లు మలచడినది.

వేణుగోపాల స్వామి ఆలయం వెలుపల గోడకు గల కోష్టము ఖాళీగానున్నది. కోష్టమునకు ఇరువైపుల కుడ్యస్తంభములు కలిగి, శిఖరము, శాల, కూటభాగములు కలిగియున్నది.

## అనంత పద్మనాభ స్వామి ఆలయము

పశ్చిమ దిశాగానున్న గర్భాలయమునందు శేషశయనుడయిన విష్ణువు యోగ నిద్రలో నుండగా లక్ష్మీదేవి పాదసేవ చేయుచున్నట్లు నాభినుండి వెలువడిన కమలమందు బ్రహ్మయుండినట్లు విగ్రహము మలచబడినది. దశావతారములు అష్టదిక్పాలకులు విగ్రహ అగ్ర భాగమందు చూపబడినారు.

అంతరాళ ద్వారబంధము మణిబంధ, కుడ్యస్తంభ మరియు జాలవాతాయన భాగమందు కలిగియున్నవి. జాలవాతాయన భాగమందు మృగ, వ్యాల, ప్రతిమలు చూపబడలేదు. ద్వారబంధ లలాటభాగమునందు వరుసగా మొగ్గల తోరణము మలచబడియున్నది. లలాట భాగముపైన ఐదు శిఖరముల నమూనాలు మలచబడినవి. వింజామరలు వీచుచున్న స్త్రీమూర్తుల విగ్రహములు మలచబడినవి. అంతరాళ ద్వారబంధమున కిరువైపుల ఖాళీ దేవకోష్టములు కలవు.

## కాశీ విశ్వేశ్వరాలయము

దక్షిణ దిశగా ఉన్న ఈ కాశీవిశ్వేశ్వరాలయము గర్భాలయము. అంతరాళము కలిగియున్నది.

గర్భాలయమందు ఎత్తైన లింగపీఠముపై శివలింగము ప్రతిష్ఠింపబడినది. అంతరాళ ద్వారబంధము ముందు సర్వాలంకార భూషితుడయిన నందీశ్వరుడు ప్రతిష్ఠింపబడినాడు. అంతరాళ ద్వారబంధము, మణిబంధ, కుడ్యస్తంభ, వాతాయన భాగములు కలిగియున్నవి. ద్వారబంధమున కిరువైపుల ద్వారపాలకుల విగ్రహములు కలవు.

త్రికూటాలయము వెలుపలి గోడలు నునువుగా మధ్యమధ్యన ఉబ్బెత్తుగానున్నవి. మూడు ఆలయముల నుండి వెలుపలకు ప్రణాలములు కలవు. ముఖ మండప దిశవైపు కూడా వాయువ్య దిశవైపు కూడా ప్రణాలము నీరు పోవుటకు ఏర్పరచబడినది. ఆలయప్రస్తార భాగము ఉత్తర, వాజన మరియు వల్లభిగా విభజించబడినది. వాజన భాగమందు రేఖ నగిషీలు మలచ బడినవి. కపోత భాగమందు చైత్య-కుడి నమూనాలు చెక్కబడియున్నవి. త్రికూటాలయ శిఖరములు అతి నిర్మలముగా సోపాన పద్ధతిలో యిటుకసున్నముతో నిర్మించబడినది.

త్రికూటాలయ ప్రవేశమందు తూర్పు వైపున చిన్న దిగుడు బావి నిర్మింపబడి యున్నది.

ఈ త్రికూటాలయము కాల నిర్ణయము చేయుటకు ఉపయుక్తమయిన శాసనాధారములు గాని, మరియే చారిత్రకాంశము మనకు లభ్యపడుట లేదు. కేవలము వాస్తు శిల్పమును బట్టి శిల్పములను బట్టి కాలనిర్ణయము చేయవలయును. ఈ ఆలయము కాకతీయవాస్తు శిల్ప నైపుణ్యమును చాటుచున్నది, వీటివలన సుమారు క్రీ.శ. 11-12వ శతాబ్దముల మధ్యకాలమందు ఈ త్రికూటాలయము కాశీవిశ్వేరాలయముగా నిర్మింపబడి, వ్యవహరింపబడి యుండవచ్చును.

(దేవాలయవాస్తు - నాగాభట్ల మార్కండేయ శర్మ వ్యాసం ఆధారంగా).

# శ్రీ సీతారామ చంద్ర ఆలయం - మిర్దొడ్డి

మెదక్‌జిల్లా మిరుదొడ్డి మండలం కేంద్రంలో శ్రీ సీతారామచంద్రస్వామి దేవాలయం సుందర శిల్పాలతో నిర్మితమైంది. క్రీ.శ. 1100 నుండి 1200 మధ్య నిర్మించబడిన పురాతన జీర్ణదేవాలయాన్ని పునర్నిర్మించారు. దేవాలయ నిర్మాణ విషయంలో కొన్ని కథలు ప్రచారంలో ఉన్నాయి. అందులో ఒకటి మిరుదొడ్డి మండలానికి చెందిన వడ్డేరాజులు ఇనుమును బంగారంగా మార్చే పర్సవేదిని సంపాదించడానికిగాను. బ్రాహ్మణ హత్యగావించి, దోషపీడితులై బాధపడుతుంటే, తపస్సంపన్నులైన మునులు దోషనివారణార్థం, ప్రజోపయోగ కార్యక్రమాలు చేయాలని తెలుపగా వారి ఆజ్ఞానుసారం పరిసర గ్రామాలచుట్టూ దేవాలయాలు, చెఱువులు కొత్త గ్రామాలు నిర్మించి వాటికి తమ పేర్లు పెట్టారని ప్రతీతి. అతి పెద్దచెరువు బేసముద్రము, బామ్మరాజు చెరువు, సంతరాజు చెరువు, అమ్మ చెరువు, మొదలగునవి. దానిలో భాగంగానే కుడ్లేరు నదీతీరం వెంబడి నిర్మించిన దేవాలయాలలో శ్రీ సీతారామ చంద్రుని దేవాలయం ఒకటి.

ఆ తరువాత చాలా సంవత్సరాలకు పూర్తిగా శిథిలమైన ఈ దేవాలయాన్ని ఆలయ అర్చకుడు వేదపండితుడు అయిన శ్రీమాన్ అప్పన్ కందాడై శ్రీనివాసాచార్య సిద్ధాంతిగారు 1987 వ సంవత్సరం నుండి ఆరు సంవత్సరాలు కఠోరంగా శ్రమించి, అందమైన రాజ గోపురాలతో పునర్నిర్మించారు.

ఈ దేవాలయంలో సీతారామచంద్రస్వామి, గోదాకృష్ణ, లక్ష్మీనారాయణ, నవగ్రహ, అంజనేయ స్వామి మొదలగు దేవతా విగ్రహాలు ప్రతిష్ఠింపబడి ఉన్నాయి. దేవాలయంనందు నిత్యం త్రికాల పూజలే కాకుండా, ప్రతి సంక్రాంతికి అధ్యాయన తెప్పోత్సవాలు, గోదాకళ్యాణం మాఘంటే వార్షికోత్సవం, శ్రావణ మాసంలో కృష్ణాష్టమి, గోదాజయంతి, శ్రీ రామనవమికి సీతారామచంద్రస్వామి కళ్యాణోత్సవం అత్యంత వైభవంగా జరుగుతాయి.

ఇక్కడ సీతారామచంద్ర స్వామి, కోరికలు తీర్చే చక్రవర్తి "తిరుమగనార్"గా కొనియాడబడుతూ, నిత్యం, భక్తజన సందోహంతో పూజింపబడు తున్నాడు.

# భోగేశ్వరాలయం - సిద్దిపేట

సిద్దిపేట రామాలయానికి సుమారు 1.కి.మీ. దూరంలో పట్టణానికి పూర్తి అవతల ఉన్న భోగేశ్వరాలయం సుమారు వెయి సంవత్సరాలనాటి దంటే కొందరు ఆశ్చర్యపోతారు. కొందరు విశ్వసింపలేక పోతారు. కానీ ఇది పూర్తి యదార్థం. ఈ ఆలయ నిర్మాణ పద్ధతిని, అందలి శిల్పాలను గమనిస్తే అది ఇంచుమించుగా 10వ శతాబ్దానికి అంటే తొలి కాకతీయులు. వారి ప్రభువులయిన కళ్యాణి చాళుక్యుల కాలానికి చెందినట్లు తోస్తుంది. ఇది దేవాలయం కాదు: దేవాలయాల సముదాయంలాగా తోస్తుంది.

ఇది ఒక దేవాలయం కాదు. దేవాలయాల సముదాయం మూడంచెలుగా నిర్మించబడింది. భోగేశ్వరాలయం రెండవది భోగేశ్వరాలయం నాట్య పండపానికి దక్షిణంగా ఉత్తరాభిముఖంగానున్న శివాలయం. మూడవది వీటికి కొంత కాలం తర్వాత కట్టబడ్డ త్రికూటాలయం. ఈ గుడి ఆవరణలోకి ప్రవేశించగానే కుడివైపున కనిపిస్తుంది. ఈ దేవాలయ ఆవరణలో ఇన్ని ఆలయాలు వేరువేరు కాలాల్లో కట్టబడ్డ ఈ దేవాలయాలను ఎవరెవరు ఎప్పుడెప్పుడు కట్టించారో తెలిపే శాసనంఒక్కటి కూడా దొరకక పోవడం నిజంగా దురదృష్టకరం. సాధారణంగా ఆంధ్రదేశంలో కన్పించే దేవాలయాల వలె ఈ దేవాలయాలను నిర్మించిన శిల్పులు లేక ప్రధాన శిల్పి మరియు దేవాలయాలు నిర్మించిన శివలింగాలను ప్రతిష్ఠించిన వ్యక్తులు తమ కీర్తి ప్రతిష్ఠలకు పాటుపడక నిష్కామ కర్మ సిద్ధికై ప్రయత్నించినట్లు కనిపిస్తుంది.

సిద్దిపేట ప్రాంతంలో అంటే మిట్టపల్లి, దుద్దెడ, కొండపాక శనిగరం మొదలైన చోట్ల కాకతీయుల నాటి శాసనాలు కన్పిస్తున్నాయి.

క్రీ.శ.10వ శతాబ్దిలో పుల్లనూరు అని ఆనాడు పిలువబడ్డ నేటి పుల్లూరు కింద 70 గ్రామాలుండేవి. కరీంనగర్ జిల్లా శనిగరం వరకున్న గ్రామాలన్నీ పుల్లూరు కింద ఉండేవి. ఈ పుల్లూరు ప్రాంతం సబ్బిసాయిర మండల అంతర్భాగం. సబ్బి పట్టణం ప్రధానంగా ఉన్న వేయి గ్రామాలు సబ్బిసాయిర మండలం. దీనిని సబ్బినాడు అని కూడా పిలిచేవారు. ఈ సబ్బిమండలంతో నేటి కరీంనగర్ జిల్లా వరంగల్లు మెదకుజిల్లాలోని కొన్ని గ్రామాలుండేవి. ఈ విషయాలు మిట్టపల్లి, శనిగరం శాసనాలవల్ల తెలుస్తున్నది. క్రీ.శ. 1224 నాటి కొండపాక శాసనంవల్ల ఈ ప్రాంతం కొలనుపాక క్రింద ఉన్నట్లు స్పష్టమౌతున్నది. అట్లే క్రీ.శ. 1296 నాటి దుద్దెడ శాసనం వల్ల ఈ ప్రాంతం పానుగల్లు కింద ఉన్నట్లు విశదమౌతున్నది.

ఈ విధంగా ఈ ప్రాంతం కాకతీయుల ఏలుబడిలో ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క సామంతుడు లేక అధిపతి ఏలుబడిలో ఉన్నట్లు కనిపిస్తున్నది.

ఇక సిద్ధిపేటలోని భోగేశ్వరాలయం ఇంచుమించు పదవ శతాబ్దికి చెందింది. నవనాథ సిద్ధులలో ఒకరైన భోగనాధుని పేర ఏర్పడిన ఈశ్వరాలయం భోగేశ్వరాలయమని స్థానికులు చెప్తారు. నాథ సాంప్రదాయానిక చెందిన సిద్ధులు ఆంధ్రదేశంలో ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలో తిరిగి ఈశ్వరాలయాలు స్థాపించినారు. భిక్నూరు సిద్ధరామేశ్వరాలయం, ఆర్మూరు ఈ సిద్ధుల వల్లనే వెలసినవని చెపుతారు. నవనాథ సిద్ధులు 8-10 శతాబ్దాలకు చెందినవారు.

ఇక ఈ ఆలయం చుట్టు దేవాలయ ఉపపీఠం పైన పద్మాల పంక్తి కనిపిస్తుంది. ఈ విధమయిన పద్మ పంక్తితో దేవాలయ ఉపపీఠాలను కళ్యాణీ చాళుక్యులు ఆ తర్వాత వచ్చిన కాకతీయులు అలంకరించినారు. తొలి కాకతీయుల నాటి శనిగర దేవాలయాల్లో ఇటువంటి పద్మాలున్నట్లు అక్కడి శిథిలాల వల్ల విశదమౌతున్నది.

ఇంకొక ముఖ్యమైన విషయం పూర్వకాలంలో అంటే పశ్చిమ చాళుక్యులు రాష్ట్రకూటులు కాకతీయుల కాలంలో వెలసిన దేవాలయాలన్నీ గర్భాలయం దానికి ముందు అంతరాళం దానికి ముందు రంగమండపం లేక నాట్యమండపంతో కన్పిస్తాయి. ఈ గర్భాలయానికి అంతరాళానికి ఉండే ద్వారబంధానికి రెండు వైపులా ద్వారపాలకులను చెక్కడం క్రీ.శ. 6వ శతాబ్ది నుండి వస్తున్నదే కానీ భోగేశ్వరాలయం అంతరాళం మరియు గర్భాలయం ద్వార బంధాలకు మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ చిహ్నమయిన పూర్ణకలశాలు కనిపిస్తాయి. ఈ కలశాలు మామిడి ఆకులు, కొబ్బరి కాయలతో నిండుగా ఉన్నట్లు అగుపిస్తాయి.

ద్వారబంధాలతో పూర్ణకలశాలు చెక్కడం జైన మత సాంప్రదాయమని సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు తమ గ్రంథంలో పేర్కొన్నారు. ఈ ప్రాంతంలో జైన దేవాలయాలు ఉండినట్లు ఈ గ్రామాలలో కనిపిస్తున్న విగ్రహాలే సాక్ష్యం. వేములవాడను రాజధానిగా చేసికొని పరిపాలించిన వేములవాడ చాళుక్యులు, జైనమత పోషకులు. అందువల్ల ఆనాటి శిల్పులలో జైనులు కూడా ఉండి ఉంటారు. ఆజైన శిల్పులు తమ అలవాటు ప్రకారం ద్వారబంధాలలో వైదిక సంప్రదాయనికి విరుద్ధం కాని పూర్ణకలశాలను చెక్కినారు.

**సప్తమాతృకలు :-** ఒకప్పుడు దేవాలయ శిల్పంలో సప్తమాతృకలను చూపేవారు. బ్రహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి చాముండి ఈ ఏడు శక్తి మూర్తులను సప్తమాతృకలంటారు. అంధకాసురుడనే వాడు బ్రహ్మను ఆరాధించి అనేక దివ్యవరాలు పొంది అహంకారంతో దేవతలనందరినీ

బాధిస్తూ ఉంటాడు. భూమిపై చిందిన అతని ప్రతి రక్తబిందువు మరియొక అంధకుని సృష్టిస్తుంది. అందువల్ల దేవతలందరూ వివశులైపోతారు. ప్రధాన దేవతలయిన బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, కుమారస్వామి, ఇంద్రుడు మొదలయిన వారు తమ తమ శక్తులను పరమశివునికి సహాయంగా పంపినారని సప్త సంఖ్యతో ఉన్న ఈ శక్తులు సప్తమాతృకలుగా పేరొందినట్లు చెబుతారు.

వీరు ఆయా దేవతల ఆయుధాలు వాహనాలు కలిగి ఉంటారు. ఉదాహరణకు వైష్ణవి శంఖ చక్రాలు కలిగి ఉంటుంది. గరుత్మంతుడే ఆమె వాహనం ఈసప్తమాతృకల ఆకారం, ఆయుధాలు వాహనాలు మొదలయిన వాటిని గురించి కాశ్యప శిల్పశాస్త్రం మొదలగు శిల్పశాస్త్రాలు కొన్ని ఆగమ శాస్త్రాలు కూడా తెలుపుతున్నాయి. సప్తమాతృకల పక్క గణపతి ఉంటాడు. గణపతిని సప్తమాతృకలతో కలిపి దేవాలయ శిల్పంలో చూపించడం చాలా ప్రాచీనమయిన ఆచారం. విష్ణుకుండినులు, బాదామీ కళ్యాణీ చాళుక్యుల కాలంలో ఇది ఎక్కువగా కనిపిస్తుంది. చాళుక్య శిల్పరీతినే మాతృకగా తీసికొన్న కాకతీయ శిల్పంలో ప్రధానంగా తొలి కాకతీయ శిల్పంలో ఇది కనిపిస్తుంది.

భోగేశ్వరాలయంలో సప్తమాతృకలు ఉన్న శిలాఫలకం కనిపిస్తుంది. ప్రతి విగ్రహం చేతులలో ఆయుధాలు, కాళ్ళదగ్గర వాహనాలు స్పష్టంగా చెక్కబడ్డాయి. కాకపోతే వాటికి కూడా భస్మం పూస్తున్నందున కాబోలు జాగ్రత్తగా పరిశీలింపవలసి వస్తున్నది. ఇది దేవాలయం పైకప్పులోనో గోడలోనో ఉండి ఉంటుంది. శిథిలమైన ఈ భాగాన్ని తరువాతి కాలంలో దేవాలయ రంగమండపం యొక్క అధిష్ఠాన పీఠంపై సిమెంటువేసి అతి కించరు అందువల్ల ఇది సురక్షితంగా ఉంది.

ఈ ఆలయానికి ఆనుకొని ఉన్న అమ్మవారి ఆలయం దీనంత ప్రాచీనమైనదిగా కనిపించదు. చాలా కాలం తరువాత ఎవరో భక్తులు కట్టించి ప్రతిష్ఠించారు, ఈ దేవాలయ శిఖరం మెట్లు మెట్లగా పైకి సాగిపోయి 'నాగర' శైలిలో ఉన్నట్లు కన్పిస్తుంది. పైన కుంభం కనిపిస్తుంది. ఈ భాగమంతా చాలా పురాతనమైనది. ఐనా అప్పుడప్పుడు పునరుద్ధరణకు నోచుకొన్నందువల్ల ప్రజల ఆదరణ అంతగా లేకపోయినా పూజా పునస్కారాలందు కొంటున్నది.

**శివాలయం**

దీని తర్వాత ఈ ఆలయ రంగ మండపానికి దక్షిణ భాగంలో ఉన్న శైవాలయం పేర్కొన తగింది. ఇచ్చట కూడా భోగేశ్వరాలయానికి ఉన్నట్లే గర్భగృహద్వారానికి ఇరువైపుల పూర్ణకలశాలే గోచరిస్తాయి. ద్వారంఉత్తరాంగంపై గజలక్ష్మి కూడా చెక్కబడింది. కానీ ఈ ఆలయం యొక్క అంతరాళ ద్వారానికి ఇరువైపుల శివ చిహ్నాలతో ఆయుధాలతో నున్న ద్వారపాలకులు వ్యత్యస్తపాదాలతో కన్పిస్తారు. అట్లే రంగమండపం లోపలికి ప్రవేశించే ద్వారానికి

ఇరువైపుల నిలువెత్తు ద్వారపాలకులు శివ చిహ్నాలతో కనిపిస్తారు. అంతరాళ ద్వారపైభాగంలో అందంగా చెక్కబడ్డ ముకుళాలు కన్పిస్తాయి. రంగమండపానికి చుట్టూ అధిష్ఠాన ఫీఠం మాత్రమే ఉంది. దేవాలయం ఎత్తు తక్కువ ఉన్నందువల్ల తక్కిన కాకతీయ దేవాలయాలవలె పిట్టగోడలు కన్పించవు. ఐనా ఇది అర్థమండపమే. ఈ గర్భాలయం, అంతరాళం, రంగమండపం అన్నీ కలిపి దీర్ఘచతురస్రాకారంలో నిర్మించబడ్డాయి.

భోగేశ్వరాలయానికి ఈ ఆలయాన్ని కలిపి కట్టినట్లు అతుకు స్పష్టంగా కనిపిస్తుంది. ప్రస్తుతం ఈ దేవాలయ గర్భగృహం గోడ ఒకటి పూర్తిగా శిథిలమై పోయింది.

**ధ్వజస్తంభం :-** ఇక ఈ దేవాలయం ఆవరణలోనున్న రాతిస్తంభం చాలా విశేషమైంది. ఇది సుమారు 30-35 అడుగుల ఎత్తులో ఉంది. సాధారణంగా దేవాలయాల్లో ధ్వజస్తంభము స్థాపించడము సంప్రదాయం. అది అఖండమయిన రాతితో కానీ, కఱ్ఱతో కాని చేయబడి ఉంటుంది. ఇది గర్భాలయానికి ఎదురుగా స్థాపించబడ లేదు. స్తంభం చివర గుండ్రని పలకపై నాలుగు చిన్న చిన్న స్తంభాలపై యున్న చతురస్రాకారపు రాతి పలక కనిపిస్తుంది. ఈ రకమయిన స్తంభాలు పుల్లూరు గుట్టపై కొలను పాలకలోని సోమేశ్వరాలయము ముందు ధర్మపురిలోని ఒక ప్రాచీనాలయము ప్రక్క కనిపిస్తాయి. ఈ దేవాలయాలన్నీ కాకతీయుల నాటివే బహుశ ఇవి దీప స్తంభాలు కావచ్చు. దేవాలయాలలో దీపవృక్షము నిలుపుతున్నట్లు క్రీ.శ. 995 నాటి జమ్మికుంట శాసనము తెలుపుతున్నది.

## త్రికూటాలయము

ఇక శివాలయము తర్వాత కొంత కాలానికి నిర్మించబడ్డ ఆలయం త్రికూటాలయం. త్రికూటాలయాలు బాదామీ చాళుక్యుల కాలం నుండి కనిపిస్తాయి. ఇవి నక్షత్రాకారపుతల విన్యాసం పై మూడు వైపుల మూడు దేవాలయాలుంటాయి. ఈ ఆలయాల్లో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనే త్రిమూర్తులుంటారు. త్రిమూర్తులున్న త్రికూటాలయాలు తెలుగుదేశంలో చాలా స్వల్పంగా ఉన్నాయి. గుంటూరు జిల్లా వలివేరులో త్రైపురుషాలయమున్నట్లు డా. మైనేని కృష్ణకుమారి గారు తెల్పినారు. హనుమకొండలో క్రీ.శ. 1170 ప్రాంతంలో కాకతిరుద్రదేవ చక్రవర్తి సామంతుడు గంగాధర మంత్రి త్రైపురుష ప్రతిష్ఠ చేసినట్లు కరీంనగర్ శాసనం తెల్పుతున్నది కాని త్రికూటాలయాల్లో చాలా వరకు సూర్య, శివ, కేశవుల ప్రతిష్ట చేసేవారు. గణపతిదేవ చక్రవర్తి కాలం వరకు ఈ త్రికూటాలయాల్లో హరి, హర, భాస్కరుల ప్రతిష్ట జరిగేది. ప్రసిద్ధమైన హనుమకొండ వేయిస్తంభాల దేవాలయంలో సూర్యదేవర, కేశవ దేవర, రుద్రేశ్వరుల ప్రతిష్ఠ చేసినట్లు అక్కడి శాసనం తెల్పుతున్నది. వరంగల్లు జిల్లాలోని నిడుగొండ కరీంనగర్ జిల్లాలోని వేండారం,

కటుకూరు మొదలయిన స్థలాల్లో హరి, హర భాస్కర ప్రతిష్ఠ చేసినారు. కాని సుమారుగా క్రీ.శ. 1250 తర్వాత ఈ త్రికూటాలయాల్లో మూడు లింగాల్నే ప్రతిష్ఠించినారు. సిద్దిపేట భోగేశ్వరా లయంలో ఉన్న త్రికూటాలయం దాదాపు అంతా శిధిలమైంది. ఒక శివాలయం తప్ప తక్కిన రెండు దేవాలయాలు పూర్తిగా శిథిలమై పోయినాయి. పడిపోయిన, పడిపోతున్న గోడలు మాత్రమే ప్రస్తుతం కనిపిస్తాయి. అందువల్ల ఈ ఆలయాల్లో ఏ దేవతలను ప్రతిష్ఠించినారో చెప్పడం కష్టం. ఐన భోగేశ్వరాలయంలో ఉన్న సూర్యవిగ్రహం, భోగేశ్వరాలయం ఎదురుగా నున్న కోనేరు ( ప్రస్తుతం బావి) పక్కన ఉన్న సగం విరిగిపోయిన కేశవ విగ్రహంపై దేవాలయాలకు సంబంధించిన విగా కన్పిస్తాయి. రెండూ ఒకే ఎత్తులో ఉన్నాయి. రెండింటి ఒకే విధమయిన కిరీటమకుటాలు కన్పిస్తాయి. సూర్య విగ్రహాన్ని చాలా కాలంముందే దేవాలయంలో భద్రం చేయడంవల్ల సలక్షణంగా కనిపిస్తుంది. రెండు చేతుల్లో ఉన్న కమలముకళాలతో రెండు ప్రక్కల వున్న పరిచారికలతో ఇక్కడి సూర్యుడు కనిపిస్తాడు.

కాని కేశవ విగ్రహం నడుము వరకు భిన్నమైంది. ముందున్న రెండు చేతులు కూడా విరిగిపోయినందువల్ల వాటిలో ఏయే ఆయుధాలు ఉన్నాయో చెప్పడం కష్టం. కాని వెనుకనున్న కుడిచేతిలో శంఖం ఎడమ చేతిలో చక్రముంది. కేశవుని వెనకనుండే ఎడమ చేతిలో చక్రం. కుడిచేతిలో శంఖం మరియు ముందుండే ఎడమ చేతిలో గద, కుడి చేతిలో పద్మముంటుందని రూపమండనము అనే శిల్ప శాస్త్ర గ్రంథం వివరిస్తున్నది.

సిద్దిపేటకు దగ్గర్లోనున్న కొండపాకలో కూడా సూర్యుడు, కేశవుడు శంకరుడు ప్రతిష్ఠింపబడినట్లు అక్కడి శాసనం తెల్పుతున్నది. అందువల్ల ఈ త్రికూటాలయంలో కూడా సూర్యుడు కేశవుడు శివుడు ఉండి ఉంటారు.

విచిత్రమేమంటే కొండపాకలో కూడా అరాచీనమైన త్రికూటాలయ మంతా శిథిలమైపోయింది. దాని కంటే 30 సంవత్సరాలవుముందు నిర్మించబడ్డ రుద్రేశ్వరాలయం నేటికీ సురక్షితంగా ఉంది. వేయి స్తంభాల దేవాలయంలో సైతం సూర్య, కేశవాలయాల్లో విగ్రహాలు కన్పించవు.

ఇంకో విచిత్రమేమిటంటే సాధారణంగా శివాలయాల్లో శివలింగానికి ఎదురుగా నంది ఉండడం సహజం. కాని ఈ మూడు దేవాలయాల్లో నందులు ఉన్నట్లు కన్పించవు. ప్రస్తుతం భోగేశ్వరాలయంలో కనిపిస్తున్న జంటనందులు బైట ఎక్కడో ఉండి ఉంటే వాటిని ఈ మధ్య దేవాలయంలో పెట్టినట్లున్నారు.

**బ్రహ్మ విగ్రహం :** భోగేశ్వరాలయం సమీపంలోని పొలాల్లో నడుము వరకు విరిగిపోయిన బ్రహ్మదేవుని విగ్రహం ఉంది. మూడు వైపులా కన్పిస్తున్న మూడు తలలు కిరీటాలు వెనుకనున్న ఎడమ చేతిలో పాశం కుడిచేతిలో పద్మం ముందుండే కుడి చేతిలో అక్షమాల కన్పిస్తాయి. ఎడమ చేతి ముందు భాగం

విరిగిపోయింది. ఈ విగ్రహం సగానికి విరిగి పోయినా పూర్ణ శిల్పభాగమే. సాధారణంగా బ్రహ్మదేవుడు స్తంభ శిల్పంలోనో, కుడ్యశిల్పంలోనో అర్ధ శిల్పంగా కనిపిస్తాడు. కానీ ఇది పూర్ణశిల్పం కావున ఏ దేవాలయానికైనా చెంది ఉంటుంది. త్రికూటాల యానికే సంబంధించిన విగ్రహమే ఐతే సిద్ధిపేటలో కూడ త్రైపురుషాలయం ఉండి ఉండాలి. కాకపోయినా బ్రహ్మదేవునికిక్కడ ప్రత్యేకాలయం ఉండి ఉండాలి. ప్రస్తుతం ఈ విగ్రహాన్ని ఎవరో మాయం చేశారు.

**ఇతర శిల్పాలు :** భోగేశ్వరాలయం ముందు వీరభద్రుని శిల్పం కనిపిస్తుంది. ఇది కూడా ప్రాచీన విగ్రహమే. అట్లేదాని దగ్గరలోనే ఒక భైరవ విగ్రహం ఒక తెల్లరాతిబండపై చెక్కినారు. ఇది వీరభద్రుని విగ్రహమంత ప్రాచీనమైంది కాదు.

దేవాలయం ఆవరణలో ఉన్న నాగ శిల్పాలు కూడా దేవాలయ ప్రాచీనతను తెల్పుతున్నాయి. ఆంధ్రదేశంలో నాగపూజ చాలా ప్రాచీన కాలం నుండే ఉండింది. క్రీ.పూ. తెలుగుదేశంలో నాగులనే జాతి ఉన్నట్లు తెలుస్తున్నది. పాముల పుట్టలో పాలు పోసి పూజించడం కర్నాటకుల సంప్రదాయం. క్రీ.శ. 12వ శతాబ్ది వరకు ఈ ప్రాంతంలో కన్నడమే అధికార భాషగా ప్రజల భాషగా కూడా ఉండేది. తొలి కన్నడ సాహిత్య గ్రంథం విక్రమార్జున విజయం. ఈ ప్రాంతంలో (వేములవాడలో) వెలువడింది. అందువల్ల ఈ నాగ ప్రతిమలు కూడా క్రీ.శ. 12వ శతాబ్దికి ముందుండినవి కావచ్చు.

ఇక దేవాలయ ప్రాకారం త్రికూటాలయాలతో పాటు నిర్మించబడి ఉంటుంది. ప్రవేశ ద్వారం ముఖమండపం పై కన్పిస్తుంది. ప్రవేశద్వారానికి రెండు వైపుల ఉన్న గోడలపై రెండు నెలువెత్తు ఏనుగులు చెక్కబడ్డాయి. ఈ ముఖ మండపం పైన ముఖ మండపం కూడా కన్పిస్తుంది.

ఇటువంటి ప్రవేశ ద్వారాలు దుద్దెడ స్వయంభూ దేవాలయానికి నరంగల్లు జిల్లాలోని ఖిలాషాపూర్‌లోని శివాలయానికి కనిపిస్తాయి.

ఈ రెండు దేవాలయాలు క్రీ.శ. 12,13 శతాబ్దుల వరకే నిర్మించబడ్డట్లు తెలుస్తుంది. ఈ గ్రామ మధ్య భాగం (బొడ్డురాయి) ప్రస్తుత రామాలయానికి సమీపంలో ఉండేదని స్థానికులు చెప్తారు. అంటే రామాలయ ప్రాంతం ఊరి మధ్యభాగం బ్రాహ్మణులంతా దేవాలయానికి సమీపంలో ఉన్నందువల్ల పారుపల్లి (పారుడు = బ్రాహ్మణుడు) గా ప్రసిద్ధమైంది.

భోగేశ్వరాలయం ఇంకా కొన్ని చిన్న చిన్న ఇతర ఆలయాలతో ఇంచుమించు ఒక కిలోమీటరు వైశాల్యంతో ఉండేదని చెప్తారు. దానికి తగ్గట్టు ఈ దేవాలయానిక 6,7 వందల గజాల దూరంలో ఒక రాతి స్తంభం కనిపిస్తుంది. అది కూడా ధ్వజస్తంభమే కావచ్చు. దాని దగ్గరలో ఉన్న దేవాలయాలు అన్నీ కాల ప్రవాహంలో కొట్టుకుపోయినాయి. కాల ప్రవాహంలో చిక్కుకొని సిద్ధిపేట ప్రజల ఆలనాపాలనకు నోచుకోని భోగేశ్వరుడే ఒకనాడు సిద్ధిపేటకు సమస్త భోగభాగ్యాల సిద్ధింపజేసినాడనుట నిర్వివాదాంశము.

# కొడకంచి క్షేత్రము

కంచికి వెళ్ళకున్నా కొడకంచిని చూస్తే చాలుననే భక్తి భావం భక్తులలో ఉండటం వల్లే జిన్నారం మండలంలోని కొడకంచి క్షేత్రము ప్రకృతి రమణీయతతో ఆహ్లాద వాతావరణంలో విరాజిల్లుతుంది. ఈ దేవాలయంలో ఆదినారాయణ స్వామి వెలిసినాడు.

క్షేత్ర చరిత్రను పరిశీలిస్తే 500 సంవత్సరాల క్రితం అప్పటి జాగిర్‌దార్ రామోజీరావు స్వంత ఖర్చుతో ఈ అపురూప దేవాలయాన్ని నిర్మించినట్టు తెలుస్తోంది. ఈ జాగీర్‌దార్‌కు స్వప్నంలో స్వామివారు సాక్షాత్కరించి తాను మంబాపురంలో ఉన్నానని చెప్పినట్టుగా దానితో రామోజీరావు ఈ విషయాన్ని తల్లికి తెలియ పరచగా వారిద్దరు స్వామి వారిని ప్రార్థించారు. మళ్ళీ స్వామి స్వప్నంలో కనిపించి మీ ఇంటి ముందు గరుడ పక్షి ఉంటుందని అది వెళ్ళి న దారిలో వెళ్ళాలని ఆజ్ఞాపించారు. ఆ ఆజ్ఞ ప్రకారం వెళ్ళగా అది కొడకంచిలో ఒక పుట్టపై కూర్చున్నది ఆ పుట్టను తవ్వించగా అందులో ఆదినారాయణ స్వామి విగ్రహం కనిపించిందని ప్రతీతి.

కొడకంచి గ్రామంలో వెలసిన ఈ క్షేత్రానికి భక్తులు అధిక సంఖ్యలో వస్తుంటారు. ఈ క్షేత్రంలోని బంగారు బల్లి, వెండిబల్లి చూపరులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. ఇంట్లో బల్లినిముడితే అపశకునంగా భావించే ప్రజలు ఈ బల్లులను ముడితే దోషనివారణ జరుగునని విశ్వసిస్తారు. క్షేత్రంలో పుష్కరిణి కలదు. గ్రామీణవాతావరణం, ఆలయ ప్రాచీన కట్టడాలు పర్యాటకులకు ఎంతో మనోల్లాసాన్ని కలిగిస్తున్నాయి. ఇక్కడ ప్రతి ఏటా జనవరి మాసంలో ఉత్సవాలు జరుగుతాయి.

1970లో ఈ ఆలయం దేవాదాయ ధర్మదాయ శాఖలోకి వెళ్ళినది. ఈ ఆలయానికి ఎలాంటి మరమ్మత్తులు లేక నేడు జీర్ణదేవాలయ జాబితాలోనికి చేరిపోయింది. ఇక్కడి ప్రజలు ఆ ఆలయం గూర్చి చెబుతూ, నేటి ఈస్థితికి ఎంతో కలత చెందుతున్నారు.

# తిరుమలనాథస్వామి ఆలయం - చల్మెడ

మెదక్ జిల్లాలోని ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రములలో తిరుమల నాథస్వామి దేవాలయం ఒకటి. రామాయంపేట సిద్ధిపేట రహదారికి ఎడమ వైపున చల్మెడ బస్టాండ్‌నకు కేవలం ఒక కి.మీ. దూరమున ఈ దేవాలయం కలదు. ఇక్కడి ప్రజలు ఈ ఆలయాన్ని తిరుమలాయబండగుడి అని కూడా అంటారు. ఈ దేవాలయ పశ్చిమ ప్రాకారపు గోడకు ఒక శిలాశాసనం కలదు.

దేవాలయమునకు ముందున్న కళ్యాణ మండపం చూడముచ్చటగా ఉన్నది. దేవాలయమునకు ప్రధాన ద్వారం ఉత్తరమున కలదు. గర్భగుడి ద్వారము దేవతావిగ్రహము పశ్చిమాభిముఖమై ఉన్నవి. సదహారు స్తంభాలతో మండపము ఉంది. మండపం చుట్టూ ఎత్తైన అరుగు నిర్మించబడి ఉంది.

గర్భగుడియందలి తిరుమల నాథ స్వామి విగ్రహం సుందరంగా ఉన్నది. ఇది ఒక ప్రాచీన దేవాలయము. ఈ దేవాలయము కాకతీయ రాజుల తొలి ఏలుబడిలో నిర్మించబడి ఉండవచ్చు. ఈ ఆలయమునకు పశ్చిమాన పుష్కరిణి కలదు. ప్రధాన ద్వారము నుండి ప్రవేశించగా ఎడమ వైపున ఆంజనేయ, గరుత్మంత, గణపతి విగ్రహాలు ఉన్నవి. కుడివైపున క్షేత్ర పాలకుడైన భైరవుడి విగ్రహం ఉంది. ఈ ఆలయము నందు ప్రతి సంవత్సరం మాఘ శుద్ధ షష్ఠి నుండి మాఘశుద్ధ ఏకాదశి వరకు స్వామి వారి బ్రహ్మోత్సవములు జరుగును. ఈ సందర్భమున ప్రత్యేక అర్చన అభిషేక పూజా కార్యక్రమాలు జరిపించబడును. ఈ సమయమున ఇక్కడ జాతర సాగును.

ఈ మధ్య కాలమున ఈ ఆలయానికి కొద్ది దూరంలో తిరుమల గాయత్రీ జ్ఞాన యోగాశ్రయము ఏర్పడినది. ఈ ఆశ్రయమునందు గాయత్రీ దేవాలయము ద్వాదశ జ్యోతిర్లింగాలయము నిర్మించబడినది.

# వరదరాజస్వామి దేవాలయము - వరదరాజపురము

ప్రజ్ఞాపూర్ నుండి భువనగిరికి వెళ్ళేదారిలో కుడివైపున 3 కి.మీ. దూరంలో వరదరాజస్వామి దేవాలయము కలదు. ఈ ఆలయము సంపూర్ణ దాక్షిణాత్య శిల్పమును పోలియున్నది. ఈ దేవాలయము కంచి దేవాలయమునకు నమూనా రూపము వలె గోచరించును. సువిశాలమైన ప్రదేశమున ఈ దేవాలయము నిర్మించబడియున్నది.

ఇక్కడి స్థానికుల కథనం ప్రకారం ఒక భక్తుడు భువనగిరి సమీపంలో వరదరాజస్వామి విగ్రహమును చేయించి బండిపై తరలిస్తుండగా మార్గమధ్యంలో ఈ ప్రాంతాన బండి ఇరుసు విరిగినదట. మరోబండిపై తరలించ ప్రయత్నించగా బండి ముందుకు సాగలేదట. ఆ రాత్రి భక్తులకు వరదరాజస్వామి ప్రత్యక్షమై తాను ఇచ్చటనే వెలయ నిశ్చయించితినని ఇచ్చటనే గుడి నిర్మించమని ఆజ్ఞాపించెనట. అందుకు సంతోషించిన ఆభక్తుడు ఈ ప్రాంతమున కొంత స్థలము కొని సుందరమైన దేవాలయమును నిర్మించెను.

ఈ దేవాలయమునకు సేవలు జేయు పరివారమునకై ఒక పల్లెను నిర్మించెను. ఆ పల్లెయే వరదరాజపురముగా పిలువబడుచున్నది. ఈ దేవాలయమునకు నిర్మింపబడిన రాజగోపురము కడు శోభాయమానంగా నున్నది.

ఈ దేవాలయ మంటపము విశాలమైనది. ఈ మంటపమునందు పురాణ హరికథాది కాలక్షేపములకై అనేక మంది భక్తులు కూర్చొని వినుటకు వీలుగా నున్నది. వరదరాజస్వామి విగ్రహము నల్లరాతిలో శోభాయమానంగాయున్నది దేవాలయ ప్రాంగణమున అర్చకుల నివాసములు నిర్మించబడియున్నవి.

మొత్తము మీద ఈ దేవాలయము మెదక్ జిల్లాలోనే ఒక ప్రత్యేక దేవాలయమని చెప్పవచ్చును.

# తుంబురేశ్వరాలయం - వేల్పుగొండ

మెదక్ జిల్లాలో వెలసిన ఒక అపూర్వ శిల్పకళాఖండము, ప్రాచీన శిల్పకళా చాతురీ విభావ విలాసము. రాలను వరాలుగా మలిచి రత్నాల రాశిగా తీర్చిదిద్దిన అపురూప శిల్ప కళా తేజో విలాస మందిరము మంచుకొండ దేవరయ్యకు నిత్య నివాసంగా ఏర్చికూర్చి తీర్చబడ్డ కళా సామ్రాజ్యము వేల్పుగొండ తుంబురేశ్వరాలయము. కాల గర్భాన కలిసి పోయిన కళాఖండాలు నగషీలను చెక్కిన శిలా స్తంభాలు, లతలతో, పద్మాలతో తీర్చిదిద్దిన ద్వారబంధాలు. పద్మాలతో ఒప్పారే పాద పీఠాలు. అపురూప లావణ్య తేజోవిలాస భాస్వంతమయిన స్త్రీ మూర్తుల విగ్రహాలు, ఒకటేమిటి చూసే ప్రతి రాతిలో ఒక శిల్ప విన్నాణం, కాంచే ప్రతి శిల్పంలో ఒక నయగారం. ఈ తుంబరీశ్వరాలయం. ఇది అర్వాచీన కాకతీయ శిల్పకళా తోరణం.

మెదక్ జిల్లా టేక్మాల్ మండలంలో వేల్పుగొండ ఒకపల్లె. మెదక్, నార్సింగి, పెద్ద శంకరంపేట రోడ్డు మార్గంలో నార్సింగి నుండి 8 కి.మీ.ల దూరంలో వేల్పుగొండ గ్రామం రోడ్డుకు 1 కి.మీ. దూరంలో ఉంది. గ్రామానికి పశ్చిమాన ఒక పెద్ద కొండ. కొండ ఎక్కి దిగితే గుడి ప్రక్కగా ఒక చెఱువు. ప్రకృతి రమణీయకతకు పరాకాష్ట ఈ ప్రాంతము. చెరువు మధ్య ఒక చిన్న గుట్ట. ఆ గుట్టను దేవతల కుచ్చ అంటారు. చెఱువు గట్టుపై తుంబురేశ్వరాలయం. ఈ ఆలయాన్ని గమనిస్తే అర్థమవుతుంది ఈ గుడి మొదటి నుండీ ఇలా ఉన్నది కాదని. అక్కడక్కడ విసిరివేయబడ్డ స్తంభాలను, కళాఖండాలను ఏర్చి ఒక చోట చేర్చి గుడిగా తీర్చిద్దినారని చూపరులకు స్ఫురిస్తుంది.

ఒక శిల్పకళాశోభితమైన గొప్ప దేవాలయం కాలగర్భంలో కలిసిపోయి కళాఖండాలు కకావికలై, చెల్లాచెదరైపోగా వాటినొక చోట చేర్చి ఆలయంగా నిర్మించారు.

పదహారు స్తంభాల మండపము, మండపమును ఆనుకొని గర్భగుడి ఉన్నాయి. గుడిలో లింగము, పార్వతీ పరమేశ్వర, వినాయక విగ్రహములు ఉన్నాయి. మంటపములో ప్రతిష్టించిన నంది విగ్రహం శిల్పకళా శోభితమై ఉన్నది. నందీశ్వరునకు చెక్కిన ఆభరణములు, చిఱుగంటలు, కాలిమువ్వలు శిల్ప కళా వైభవానికి జేగంటలు. ఆలయ బహిరావణమున కట్టిన గూళ్ళలో ఒకవైపు లక్ష్మి ఒకవైపు కాళి, ఒకవైపు సరస్వతి విగ్రహాలు చూడ సొంపుగా ఉన్నవి. ఇవేకాక అద్దమును చూస్తూ అలంకరించు కుంటున్న స్త్రీ మూర్తుల విగ్రహాలు, పిల్లకు పాలిచ్చే తల్లి విగ్రహము వీణను మీటుచున్న స్త్రీ విగ్రహం చూపరులను ఆకట్టుకుంటాయి. ఈ ప్రాంతాన్ని పర్యాటక కేంద్రం వారు ఒక చక్కని దర్శనీయ స్థలంగా ఏర్పాటు చేయుటకు అనుకూలమైన స్థలంగా ఈ వేల్పుగొండను పేర్కొనవచ్చు. ఇక్కడ శివరాత్రి సందర్భమున మూడు దినములు ప్రత్యేక పూజలు జరుగును శివరాత్రి తెల్లవారి గుడి చుట్టూ బండ్లు తిరుగుట చూడ చక్కనైన దృశ్యం.

# సరస్వతీ ఆలయం - అనంతసాగర్

తాను నేర్చిన అవధానాది విద్యలతో చదువుల తల్లికో గుడికట్టాలనే తలంపు కలిగిందీ అష్టకాల నరసింహరామ శర్మగారికి. ఆమె ఎన్నుకున్న స్థలం కలలో కనిపించగా ఆరాటపడిన మనస్సు అనంత సాగరం చేరింది. కొండ అడుగున గోపురం వెలిస్తే దృగ్గోచరంగా ఉంటుందని వాణీ నిలయానికి వాస్తుపూజ చేశాడు అష్టకాల. ఈ గుడి కొండ బడిఅనున్నట్లు తోస్తోంది. ప్రకృతి రామణీయకతలో భాషామతల్లి ఆలయం అత్యద్భుత సుందర దృశ్యం. ప్రాచీన ఆలయాలవలె నుండాలని ఈ గుడి కేవలం శిలా స్తంభాలతో నిర్మితమైంది.

ఈ ఆలయం 1980లో నిర్మించబడినప్పటికీ అధునాతనమైన సిమెంటు, స్టీలు, కంకరలను వాడకపోవుట ఈ గుడి విశిష్టత. ఈ ఆలయంలో నిలుచున్న వీణాపాణి విగ్రహాన్ని ప్రతిష్టించినారు, ఇదీ ఒక విశేషమే.

ఈ ప్రదేశంలో ప్రకృతి నిర్మితమైన మూడు చెలిమెలున్నాయి. వాటిని రాగి దొనె, పాలదొనె, చీకటిదొనె అని పిలుస్తారు. ఈ దొనెలలో నీరు ఎల్లప్పుడు పుష్కలంగా ఉంటుంది. రాగిదొనె నీరు క్రిమిసంహారకమని ఇక్కడి కర్షకులు భావించి, ఆనీటిని తమ చేలలో చీడపీడలు రాకుండా చల్లుకుంటారు. ఈ ఆలయానికి దక్షిణంలో విశాలమయిన కళ్యాణ మంటపము నిర్మించబడినది. యాత్రికుల నివాసమునకై ధర్మ సత్రములు నిర్మించబడినవి. ప్రతి సంవత్సరము బసంత పంచమీ సందర్భమున మాఘమాసమున ఉత్సవములు విశేష పూజలు గావించబడును.

## కళ్యాణరామచంద్ర స్వామి దేవాలయం – గుమ్మడిదల

మెదక్ - నర్సాపూర్-హైదరాబాద్ రోడ్ మార్గమున నర్సాపురమునకు 12 కి.మీ. దూరంలో గుమ్మడిదల అను గ్రామం కలదు. ఆ గ్రామానికి ఉత్తరాన ఒక చిన్న కొండ, కొండపై ఒక చిన్న గుడి అగుపడుతుంది. అదే కళ్యాణ రామచంద్రస్వామి దేవాలయం.

దేవాలయం మొత్తం ఒక గదివలె చుట్టూ గోడలతో నిర్మించబడి ఉంది. ఇందులో 16 స్తంభాలు ఉన్నాయి. నిజానికి ఇది ఒక మండపమయి ఉండవచ్చు. మండపానికి చుట్టూ గోడలు తర్వాతి కాలంలో నిర్మించబడి ఉండవచ్చు. గర్భగుడి మండపాన్ని ఆనుకుని ఉంది. గర్భగుడి మధ్యన మూడు అడుగుల ఎత్తయిన రాతి అరుగు నిర్మించబడింది. ఆ అరుగుపై రామ, లక్ష్మణ, భరత, శత్రఘ్నుల విగ్రహాలు వారి సతులైన సీత, ఉర్మిళ, మాండవి, శృతకీర్తి విగ్రహాలు సుందరంగా ప్రతిష్టించబడినవి. ఏ రామాలయం చూసినను సీతా రాములు మరియు లక్ష్మణుల విగ్రహాలు మాత్రమే అగుపడును. కానీ ఈ దేవాలయమున భరత శతృఘ్నుల విగ్రహాలు మరియు వారి భార్యల విగ్రహాలు ఉండుట ఒక ప్రత్యేకత. ఈ దేవుడిని నమ్మిన వారికి నిత్య కల్యాణ పచ్చుతోరణంగా జీవనం సాగునని భక్తుల నమ్మకము. ఈ ఆలయమున శ్రీరామనవమి రోజు శ్రీరామనవమి కల్యాణోత్సవం, ఆతరువాత రథోత్సవం తొమ్మిది రోజులు వివిధ వాహన సేవలతో ప్రత్యేక పూజలు జరుగును.

## గోపాలస్వామి ఆలయం – దొంతి

సుమారు 400 సంవత్సరాల చరిత్ర కలిగి దక్షిణ తెలంగాణాలోనే పురాతన దేవాలయల్లో ప్రసిద్ధిగాంచి నేటికి నిత్య పూజలు అందుకుంటూ భక్తుల కోర్కెలను నెరవేరుస్తున్న - శివ్వంపేట మండలంలో దొంతి గ్రామంలోనిది గోపాలస్వామి ఆలయం. ఈ ఆలయాన్ని నాటి దేశ్‌ముఖ్‌ల వంశానికి చెందిన గురువమ్మ నిర్మించింది. దొంతి గ్రామం ప్రక్కనేగల గోపాల పల్లి నుంచి దేవాలయ విగ్రహాలను తీసుకువచ్చి ఇక్కడ ప్రతిష్టించారు. ఇక్కడ ప్రతి ఏట వైశాఖ మాసంలో స్వామి ఉత్సవాలు ఘనంగా వైభవోపేతంగా 11 రోజులు జరుగుతాయి. ఈ ఉత్సవాలలో కళ్యాణం, గరుడోత్సవం, రథోత్సవాలు ప్రజలను ఎంతో ఆకట్టుకుంటాయి. ఈ ఉత్సవాలలో స్వామి వారిని ఒక్కొక్క రోజు ఒక్క వాహనంపై అంటే హంసవాహనం, హనుమత్వాహనం, గజవాహనం, అశ్వవాహనం, సర్పవాహనం తదితర వాహనాలపై స్వామి వారిని గ్రామంలోని ప్రధాన వీధుల గుండా ఊరేగిస్తారు

రథాన్ని లాగటానికి భక్తులు ఉత్సాహం చూపుతారు. ఈ ఆలయ ప్రాంగణంలో అండాళ్ళ విగ్రహాలు, అళ్వారుల విగ్రహం ప్రతిష్ఠితమయి ఉన్నవి. ఇక్కడ ఉన్న కోనేరు కూడా ఎంతో ప్రత్యేకత సంతరించుకుంది. ఆలయ ప్రాంగణంలో నవగ్రహదేవతలు, శివాలయం ఉంది. ఆలయ సమీపంలో ఆంజనేయస్వామి, రాజేశ్వరస్వామి దేవాలయాలు ఉన్నాయి.

## ఆంజనేయస్వామి – చాకరిమెట్ల

శివ్వంపేట మండల కేంద్రానికి 7 కి.మీ. దూరంలో నర్సాపూర్ - తూప్రాన్ రహదారిలో దట్టమైన అరణ్యంలో 40 సంవత్సరాల క్రితం నూతనంగా రోడ్డు వేస్తున్న సమయంలో ఆంజనేయ స్వామి విగ్రహం బయటపడినట్లు గమనించి అక్కడి పూజారులు రోడ్డు ప్రక్కన విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. నాటి నుండి నేటి వరకూ చాకిరిమెట్ల ఆంజనేయ స్వామిగా పిలవబడుతూ భక్తుల ఆపదలు తీర్చే స్వామిగా కొలవబడుచున్నాడు. ఇక్కడ ప్రతి శనివారం ప్రత్యేకంగా చందనపూజా చేస్తారు. గతంలో ఇక్కడ ఆలయం నిర్మించాలని ప్రయత్నించినా విగ్రహం దట్టమైన అడవిలో ఉండడంతో అటవీశాఖ అనుమతి లభించలేదు. అందువలన వర్షం పడకుండా విగ్రహంపై రేకులు వేశారు. ప్రధాన రహదారికి 50 గజాల దూరంలో ఉండడం వల్ల భక్తుల సందడి ఎక్కువగా ఉంటుంది.

## పార్శ్వనాథ జైన మందిరం - కొల్చారం

మెదక్ - నర్సాపూర్ రహదారిలోని కొల్చారం మండల కేంద్రంలో 1984 త్రవ్వకాల్లో బయల్పడిన పార్శ్వనాథుడి విగ్రహంఅక్కడే ఆలయంగా రూపుదిద్దుకుంది. అప్పటినుండి కొల్చారం పర్యాటక కేంద్రంగా అభివృద్ధి చెందింది. కొల్చారం బి.సి. కాలనీలో ఓ వీరభద్రాలయం ప్రక్కన 1984 అక్టోబర్ 14వ తేదీన ఇళ్ళ నిర్మాణం కోసం పునాదులు త్రవ్వుతుండగా ఈ విగ్రహం బయటపడింది. పురావస్తు శాఖాధికారులు ఈ విగ్రహం 10వ శతాబ్దిలోని కళ్యాణి చాళుక్యుల కాలముదని గుర్తించారు. నల్లరాతిలో చెక్కిన ఈ ఏకశిలా విగ్రహం 9 అడుగుల పొవు, 2 టన్నుల బరువు కలిగి ఉంది. తలపై ఏడు సర్పాలు పడగగా కప్పిఉన్న ఈ విగ్రహం అత్యంత ఆకర్షణీయంగా ఉంది. ఇలాంటి విగ్రహాలు దేశంలోనే అరుదుగా ఉన్నాయి. విగ్రహం పాదల వద్ద కన్నడ భాషలో 23వ తీర్థంకరుడు పార్శ్వనాథుడిగా చెక్కి ఉంది. కళ్యాణి చాళుక్యుల తర్వాత ఈ ప్రాంతాన్ని పాలించిన కాకతీయుల కాలంలో జైనమతం కనుమరుగయ్యింది. ప్రస్తుతం కొల్చారంలో లభ్యమయిన జైనమత ప్రవక్త పార్శ్వనాధుని విగ్రహం ఒకప్పుడు అతి విలువయిన విగ్రహంగా పేరొందింది.

## వెల్దుర్తిలోని దేవాలయాలు

మండల కేంద్రమైన వెల్దుర్తిలో క్రీ.శ.13వ శతాబ్దంలో కాకతీయ రుద్రమదేవుడు హన్మకొండలో వేయిస్తంభాల దేవాలయం నిర్మించినపుడు ఈ దేవాలయాన్ని నిర్మించినట్టుగా చెపుతారు. సుమారు 700 సంవత్సరాల క్రితం కాకతీయులు నిర్మించిన శివాలయం శిల్పకళాశోభితమైనది. ఆ తర్వాతి కాలంలో నిర్మించిన వైష్ణవాలయం కడుసుందరంగా ఉంది. ఈ కట్టడాలలో ఒకటైన కాకతీయ సింహద్వారాం పై కన్నడ భాషలో ఉన్న శాసనం ప్రకారం 700 సంవత్సరాల క్రితం నిర్మించినట్టు తెలుస్తుంది. వరంగల్ పట్టణంలో ఉన్న కాకతీయ ద్వారాన్ని పోలి ఉన్న ఈ ద్వారబంధం సుమారు 18 అడుగుల ఎత్తుతో ఉంది. దీనికి పైభాగాన ఆరు రంధ్రాలు ఉన్నాయి. ఈ మందిరం పూర్వం శివాలయం అనడానికి పరిసరాలలో నంది, గణపతి, భైరవ స్వామి, కాళికాదేవి విగ్రహాలు ఛిన్నాభిన్నమై ఇప్పటికీ పడి ఉన్నాయి. కాకతీయ ద్వారం ఎడమప్రక్కన 25 అడుగుల ఎత్తుగల రాతి స్తంభం ఉంది. దీనిపై పూర్వం శివలింగం ఉండేదని కాని తర్వాతి కాలంలో గరుత్మంతుని విగ్రహం నిలిపారని ప్రజలు అంటున్నారు. కాకతీయుల కాలంలో నిర్మించిన దీప స్తంభాలు శిధిలమై పోయాయి. ఇక్కడ నిర్మించిన విఠలేశ్వరాలయం ఆదరణ లేక పురాతన దేవాలయ జాబితాలోకి వెళ్ళిపోయింది. ప్రజలు మాత్రం భక్తితో ఇప్పటికీ పూజిస్తున్నారు.

# లక్ష్మీనరసింహస్వామి ఆలయం – సికింద్లాపూర్

శివ్వంపేటమండలంలోని గోవారం గ్రామానికి 3 కి.మీ. దూరంలో దట్టమయిన అడవిలో గుట్టపైగల పెద్ద బండరాతిపై స్వామి వెలసి ఉన్నాడు. శతాబ్దం క్రితం సికింద్రాపూర్ గ్రామానికి చెందిన రెడ్డి కలలో స్వామి కనిపించి తాను ఇక్కడ ఉన్నానని గుడి నిర్మించి జాతర చేయాలని చెప్పడంతో గుట్టక్రింద ఈ ఆలయాన్ని నిర్మించారు. ఈ ఆలయం గుట్టపై పెద్ద గుండు, ఆ గుండుపై మరోగుండు ఉండి అర అడుగు సందులో స్వామి శయనించినట్లుగా చెక్కి ఉంది. ఈ గుట్టపైకి వెళ్ళడానికి దాదాపు వందమెట్లు ఉన్నాయి. గుట్ట క్రింద స్వామి వారి విగ్రహం ప్రతిష్టించి దేవాలయం నిర్మించారు. ఈ దట్టమైన అడవిలో ప్రతి ఏటా డిసెంబర్ మాసం నుండి మార్చి మాసం వరకు ప్రతి ఆదివారం జాతర జరుగుతుంది. ఈ జాతరకు జిల్లా వాసులేకాక జంటనగరాలకు చెందినవారు మరియు మహారాష్ట్ర, కర్ణాకటల నుండి కూడా అశేషమైన భక్తులు ఈ కీకారణ్యంలోని దేవాలయానికి, దేవుని దర్శనానికి వనభోజనానికి, అహ్లాద వాతావరణం కొరకు వస్తూ ఉంటారు. ఇక్కడ హనుమాన్ దేవాలయం, పోచమ్మ మందిరం కలదు.

# వీరభద్రేశ్వరాలయము – డాకూరు

తెలంగాణా ప్రాంతమును పశ్చిమ చాళుక్యులు కాకతీయులు పరిపాలించారు. వారి పాలనలో తటాకములను త్రవ్వించడం వాటిని ఆనుకొని అతిమనోజ్ఞమైన ఆలయ నిర్మాణాలు చేపట్టడం, వారు ప్రజాశ్రేయస్సును ఎంతగా దృష్టియందు ఉంచుకొన్నారో మనకు అవగతం అవుతుంది.

హనుమకొండ యందుగల వేయి స్తంభాల గుడి, రామప్ప దేవాలయము, ఘనాపూర్ ఆలయసముదాయం, పాలంపేట, పిల్లలమర్రి నందికంది. ఆలంపూర్ దేవాలయాలు ఆనాటి శిల్పకళావైభవానికి అద్దం పట్టేవిగా ఈనాటికీ నిలిచి ఉన్నాయి. ఆ రాజుల కాలములో నిర్మించిన చిన్న ఆలయాలు ప్రస్తుతం మారుమూల ప్రాంతాలలో ఆలన పాలన లేకుండా చరిత్రకారుల దృష్టికి కూడా కానరాక మౌనంగా నిలిచి వున్నాయి. అటువంటి కోవకు చెందినదే శ్రీ వీరభద్రేశ్వరాలయము.

మెదకు జిల్లా ఆందోలు తాలూకా జోగిపేట గ్రామమునకు 6 కి.మీ. దూరములోగల డాకూర్ గ్రామ చెరువు గట్టున ఆనుకొని శ్రీవీరభద్రేశ్వరాలయము నిర్మింపబడినది. ఆలయ శిల్పకళా రీతులు, శిల్పములు, శాసనములు, పరిశీలించిన ఈ ఆలయము పశ్చిమ చాళుక్య, కాకతీయ రాజుల సంధికాలమున నిర్మింపబడినదిగా తోచుచున్నది. కాని ప్రస్తుతము మనము చూచే ఆలయము పునరుద్ధరింపబడినది. ఆలయము సుమారు క్రీ.శ. 11-12వ శతాబ్దముల మధ్య నిర్మింపబడినది. శ్రీవీరభద్రేశ్వరాలయము ముందుగల శిలాశాసనము ద్వారా విషయములు తెలియ వచ్చుచున్నవి.

**శాసనము :** శాసన స్తంభముపై సూర్య చంద్రులు, మధ్య శివలింగము చెక్కబడినది. శాసనభాష తెలుగు, కన్నడము. క్రీ.శ. 12వ శతాబ్దమునకు చెందిన తెలుగు లిపిలో శాసనము వ్రాయబడినది. పశ్చిమ చాళుక్య రాజైన త్రైలోక్యమల్లని మూడవ విజయరాజ్య సంవత్సరమందు ఈ శాసనము వేయబడినది. శాసనము శక సంవత్సరములు 1075 (క్రీ.శ.1153), ఆంగీరసనామ సంవత్సర, భాద్రపద శుద్ధ తదియ, సోమవారము నాడు ఒసగబబడినది. డాకూర్ ప్రాంతమును పరిపాలించుచున్న మహా మండలేశ్వర సోమ పెర్మాడి, అతని సామంతుడైన అణ్ణరస, మార్తాండరస, డాకూర పురజనులు కలిసి ఉత్తరాయణ పుణ్యకాలమందు బిజ్జేశ్వర దేవరకు ధూప, దీపనైవేద్యముల కొరకు అప్పకబ్బెయను చెరువు క్రింద రోడనహాలు గ్రామమందు కొంత భూమిని, పూల తోటలను దానము చేసిరి. మరికొంత భూమిని మయిలేస్వర దేవరకు దానము ఇచ్చిరి. ఈ శాసనము ద్వారా క్రీ.శ.1153నకే మయిలలేస్వర దేవరకు అతి వైభవముగా పూజాది కార్యక్రమములు జరుగుతున్నట్లు విదితమగుచున్నది.

పశ్చిమ చాళుక్య ప్రభువైన మొదటి సోమేశ్వరుడు (క్రీ.శ.1120-1146) పరిపాలించినట్లు తెలియవచ్చు చున్నది. అతని సామంతుడైన మహామండలేశ్వరుడైన సోమ పెర్మాడి కాలమందు శాసనము ద్వారా దాన మొసగుబడెను. తదుపరి కాలమందు శ్రీ మయిలలేశ్వర దేవాలయము జీర్ణావస్థకు గురియైనను, తొలి కాకతీయుల కాలమందు పునః నిర్మాణమునకు నోచుకొని యుండవచ్చును. ఆలయ ద్వారబంధములు, స్తంభములు, శిల్పములు, ఈ విషయమును ధృవపరుచు చున్నవి.

**ఆలయములు :**

శ్రీ విరభద్రేశ్వేరాలయము 42 అడుగుల పొడవు 22 అడుగులు వెడల్పు. 10 అడుగుల ఎత్తు కలిగిన దీర్ఘ చతురస్రాకార నిర్మాణము. ఆలయగోడలు నున్నపైన రాతితో నిర్మించబడి శిఖరములు తదుపరి కాలములో ఇటుక సున్నముతో సోపాన పద్ధతిలో నిర్మింపబడినవి. ఒక్కొక్కటి 7 అడుగులు చతురస్రాకారము కలిగిన మూడుగర్భాలయములు, అంతరాళములు కలిగి ఒకే ముఖ మండపములోనికి దారితీయుచున్నవి. ఎడమ వైపు గర్భాలయమందు శ్రీవీరభద్రేశ్వరుడు, కుడివైపు పార్వతీదేవి, నడుమ శివలింగము ప్రతిష్ఠింపబడనవి 3 గర్భాలయములను కలుపుతూ పదహారు స్తంభమల ముఖ మండపము గలదు. ముఖ మండపము మధ్య కొద్దిగా ఎత్తు గలిగిన మండపము గలదు. ఆలయము యొక్క పైకప్పు యుండుట చీకటి అలముకొన్నది.

ఎడమ వైపునున్న గర్భాలయమందు కాక, అంతరాళమున శ్రీ వీరభద్రేశ్వర విగ్రహము అష్టభుజములు గల్గి, హస్తములందు ఖడ్గము, డమరుకము, అంకుశము, చక్రము, త్రిశూలము, విల్లంబులు గొడ్డలి, డాలు ధరించి, ద్విభంగిమలో ప్రతిష్టింప బడినది. శిరస్సు వెనుక పడగ విప్పిన ఐదు తలల నాగు శిరస్సుకు ఛత్రముగానున్నది. స్వామి సర్వాలంకార భూషితుడై యున్నాడు.

శ్రీ వీరభద్రేశ్వరాలయమునకు మధ్యగానున్న శివాలయమందు ఎత్తైన ప్రణాలముపై శివలింగము నల్లసేనాపురాతితో మలచబడియున్నది. ప్రణాలము వివిధమైన పట్టికలతో చతురస్రాకార పీఠికతో గలదు. అంతరాళమునందు మువ్వలపట్టికతో నందీశ్వర విగ్రహము గలదు. నందికి ప్రక్కగా చతుర్భుజ గణేశ విగ్రహము పశ్చిమ చాళుక్య శిల్పలక్షణములతో ఒప్పారుచున్నది. గణేశుని హస్తములందు ఘంటము పరశు, త్రిశూలము, మోదకములు కలవు. ఉదర బంధము నాగబంధనుతో, కిరీట మకుటము, హారములతో సర్వాలంకార భూషితుడై యున్నాడు.

కుడివైపుగల పార్వతీదేవి ఆలయమందు చిన్న శివలింగమ ప్రాణవట్టము పై గలదు. పార్వతీ దేవి లలితాసనములో ఆసీనురాలైయున్నది. చతుర్భుజ మూర్తియైన ఈమెపై హస్తములందు త్రిశూలము ఢమరు ధరించి క్రింది హస్తములందు ఏదో వస్తువును (ఫలము కావచ్చును) పట్టుకొనినట్లు సూచింపబడినది. కిరీట ధారియై సర్వాలంకార భూషితయై యున్నది.

ముఖమండపమునందు శ్రీలక్ష్మీ నారాయణుని విగ్రహము సుమారు మూడు అడుగులెత్తు కలిగియున్నది. నల్లసేనాపురాతిలో మలచబడ్డ శ్రీమన్నారాయణుడు లలితాసనమున ఆసీనుడై, కుడికాలు పీఠమునుండి జారవిడిచి ఎడమకాలు మలచుకొని యున్నాడు స్వామి ఊరువుపై లక్ష్మీదేవి ఆసీనురాలై యున్నది. స్వామిపై హస్తములందు శంఖ చక్రములు కలిగి. దక్షిణహస్తము అభయ ముద్రను సూచించగా వామ హస్తము లక్ష్మీదేవిని ఆలింగనము చేయుచున్నది. పీఠమునకు నడుమ గరుడుడు అంజలి ఘటించుచున్నట్లు మలచబడ్డాడు.

శ్రీ వీర భద్రేశ్వరాలయము వెలుపల గోడలో సప్తమాతృకల శిలాఫలకము అమర్చబడియున్నది ఆలయ ఆవరణలో నాల్గునాగిని ప్రతిమలు, మహిషాసుర మర్దిని, చెన్నకేశవుని విగ్రహము మొదలగునవి కలవు.

డాకూర్ గ్రామమందు పెద్ద గణేశుని విగ్రహము పశ్చిమ చాళుక్య శిల్ప లక్షణములతో మలచబడినది గలదు.

జైన తీర్థంకరుని శిరస్సు భాగము కూడా లభించుచున్నది.

డాకూర్ గ్రామమందు లభించిన వేరవేరు శిల్పములను బట్టి ఇచట కేవలము శైవమతమునకే కాక జైన వైష్ణవ మతాలకు కూడా ఆదరణ లభించినట్లు భావింపనగును.

క్రీ.శ. 12వ శతాబ్దములో బిజ్జేశ్వర మయిలలేశ్వరుల దేవరులకు ఒసగిన శాసనమును బట్టి, కాలక్రమమున ఈ ఆలయము శ్రీ వీరభద్రేశ్వరాలయముగా వ్యవహరింపబడుచున్నదని తెలియ వచ్చు చున్నది. శ్రీ వీరభద్రేశ్వర ఆలయ శిల్పసంపదను పరిరక్షింపవలసిన బాధ్యత కానవచ్చుచున్నది.

శిల్పములందు జీవకళను బంధించుచు పశ్చిమచాళుక్య, కాకతీయ శిల్పుల కళాకౌశలమును చాటుచున్న శ్రీ వీరభద్రేశ్వరాలయము చరిత్రకారులకే కాక భక్తులకు కూడా ఆధ్యాత్మిక చింతనను మనఃశాంతిని కలుగజేసేదిగా నున్నది.

*(దేవాలయ వాస్తు - నాగాభట్ల మార్కండేయ శర్మ వ్యాసం ఆధారంగా).*

# జీవన్ముక్త ఆలయం - అంతారం

మునిపల్లి మండలంలోని అంతారం గ్రామంలో వెలసిన జీవన్ముక్త మహారాజుగారి దేవాలయం ఉంది. ఈ దేవాలయంలో వెలసిన జీవన్ముక్త మహరాజ్ సమాధులు ప్రతిష్ఠించబడిన రుక్మిణీ పాండురంగ విగ్రహాల గురించి అనేక రకాల కథలు ప్రచారంలో ఉన్నాయి. ఈ జీవన్ముక్త మహరాజ్ అసలుపేరు జీవన్, అంతారంలో నివసిస్తూ తమ యోగశక్తి ద్వారా మాఘ బహుళ పాడ్యమి రోజున భక్తులందరినీ రప్పించి సమాధిని ఏర్పాటు చేసుకున్నారు. తనయోగశక్తి ద్వారా 91 సంవత్సరాల వయస్సులో జీవసమాధి అయ్యారు. ఇక్కడ ప్రతి ఏటా కార్తీక బహుళ చతుర్దశి వరకు ఉత్సవాలు జరుగును.

# వీరభద్రాలయం - రాయికోడ్

రాయికోడ్ మండలంలో వెలసిన శ్రీ వీరభద్రాయులయం చరిత్రను చాటిచెప్పే దేవాలయాల్లో ఒకటి. పూర్వం ఇక్కడ శంభుని ఆలయం ఉండేదని అది కొంత కాలం తర్వాత శిథిలమవడంతో ఆ రాతినే అప్పటి ప్రాంతీయ పాలకులు ఈ దేవాలయాన్ని నిర్మించారని ప్రతీతి. దాదాపు 500 సంవత్సరాల చరిత్ర కలిగిన ఈ దేవాలయాన్ని దర్శించడానికి భక్తులు మన రాష్ట్రం నుండే కాక కర్నాటక, మహారాష్ట్రల నుండి కూడా వస్తుంటారు. ఈ దేవాలయ ప్రత్యేకత ఏమిటంటటే ఈ విగ్రహం ప్రతిరోజు మూడు రూపాలతో దర్శనమిస్తుందని అక్కడ ప్రజల నమ్మకం. ప్రతిరోజు ఇక్కడ నిత్యపూజ, అభిషేకం, కుంకుమార్చన కార్యక్రమాలు నిర్వహిస్తారు. అంతేకాకుండా భక్తులచే వివాహాలు, కేశఖండనం అదితర కార్యక్రమాలు జరపబడతాయి. ఈ పురాతన దేవాలయం ప్రభుత్వ నిర్లక్ష్యంతో అభివృద్ధికి నోచుకోలేక పోయింది.

# రామలింగేశ్వర స్వామి దేవాలయం - కూడెల్లి

ఓ కాలంలో కూడెల్లి రామలింగేశ్వర స్వామి దేవాలయ ప్రాంతం ఒక మహాశైవక్షేత్రమని తోచుచున్నది. దుబ్బాక మండలంలో కూడెల్లి ఒక కుగ్రామం. రామాయంపేట, సిద్దిపేట రోడ్డు మార్గంలో రోడ్డుకు ఎడమవైపున 2 కి. మీ. దూరంలో ఈ క్షేత్రము కలదు. ఈనాడు కూడవెల్లిగా పిలువబడుచున్నది. ఈ క్షేత్రానికి ఉత్తరాన మాండవ్య నదిగా పిలవబడే ఏరు పారుతుంది. ఈ ఏటిలో రెండు ఏరులు వచ్చి కలుస్తాయి. తూర్పు నుండి పడమటకు ఒక ఏరు, దక్షిణము నుండి పడమటకి ఒక ఏరు ప్రవహిస్తూ ఈ క్షేత్ర ప్రాంతంలో కూడుతున్నాయి. అందుకే ఈ క్షేత్రము "కూడలి" అయ్యుండవచ్చు. కూడలికాస్తా, కూడెల్లి, కూడవెల్లిగా రూపాంతర మొందినది.

ఈ క్షేత్రంలో నాలుగు దేవాలయాలు ఉన్నాయి. రామలింగేశ్వర, వేణుగోపాల, సంగమేశ్వర, కాశీ విశ్వనాథ దేవాలయాలు ఉన్నాయి. ఒక శిథిల దేవాలయం వేంకటేశ్వరాలయంగా పిలువబడుతుంది.

## రామలింగేశ్వరాలయం

ఏటిగట్టుపై ఏర్పాటైన దేవళం, ఎత్తైనప్రధాన ద్వారం, ప్రధాన ద్వారం దాటగానే విశాలమైన ఆవరణ, ఆవరణలో ధ్వజస్తంభం, ఆవరణలో దక్షిణాన పూజారుల నివాస గృహం, పదహారు స్తంభాల సువిశాలమైనమండపము. చక్కగా చెక్కిన ఎత్తైన శిలా స్తంభాలు శిల్పకళా వైభవాలు. ఈ మంటపంలో ప్రతిష్టించిన నంది చూడముచ్చటగానున్నది. ఈ మంటపాన్ని ఆనుకొని గుడి నిర్మించబడింది, గుడిద్వారం ఎత్తు నాలుగు అడుగులు. గర్భగుడికి మరో ద్వారం ఐదున్నర అడుగులతో నిర్మించబడింది. గుడిలోని లింగము పుట్టులింగం అని అంటారు.

## వేణుగోపాలస్వామి ఆలయం

రామలింగేశ్వరస్వామి ఆలయానికి ఉత్తరాన వేణుగోపాలస్వామి ఆలయం నిర్మించబడినది. ఈ దేవాలయము నందు 16 స్తంభాల మండపం ఒక్కొక్క స్తంభం ఆరడుగుల ఎత్తుతో స్తంభ పీఠములపై నిల్పబడి ఉన్నాయి. మండపమును ఆనుకొని ఆలయము, ఆలయమునందు గర్భగుడి ఉన్నాయి. ఆలయ ప్రధాన ద్వారం నాలుగు అడుగుల ఎత్తు, ప్రధాన ద్వారానికి ఇరువైపులా గరుడ, అంజనేయ విగ్రహాలు చెక్కబడ్డాయి. ద్వారపు ఉత్తరాశికి రెండు ఏనుగులు, మధ్యన లక్ష్మీవిగ్రహం చెక్కబడి ఉంది. గర్భగుడిలో ఒక శిలావేదికపై వేణుగోపాల స్వామికి ఇరువైపులా రాధారుక్మిణుల విగ్రహాలు ప్రతిష్ఠించబడినాయి. మండపమునకు ఉత్తర భాగాన ఎత్తైన అంజనేయ విగ్రహం ప్రతిష్ఠించబడి ఉంది.

## సంగమేశ్వరస్వామి ఆలయం

వేణుగోపాలస్వామి ఆలయానికి ఎదురుగా సంగమేశ్వరాలయం కలదు.

ఈ ఆలయం శిల్పకళా వైభవానికి తార్కాణము, పదహారు స్తంభాల మండపంలో మూడు నంది విగ్రహాలు, రెండు నందుల మధ్య ఉన్న పెద్ద నంది విగ్రహం లేపాక్షి బసవయ్యను తలపింప జేస్తుంది. మండపమును ఆనుకొని నిర్మించిన ఆలయంలో అతి సుందరమయిన ఎత్తైన ప్రాణవట్టము నునుపైన లింగము ప్రతిష్ఠించబడి ఉంది. ఈ ఆలయమునకొక ప్రత్యేకత ఉన్నట్లు తోచుచున్నది. ఈ ఆలయ ప్రాంగణమున నాలుగు వైపులా చిన్న దేవాలయములు నిర్మించబడినవి. సంగమేశ్వర దేవాలయం తూర్పు ముఖమై ఉన్నది. మండపానికి ఆగ్నేయ భాగమున నిర్మించిన చిన్న దేవాలయంలో ఎత్తైన గణపతి విగ్రహం నైఋతి దిక్కున ఉన్న ఆలయం, వీరభద్రుడు, వాయువ్య భాగాన ఉన్న ఆలయంలో పార్వతి, ఈశాన్య భాగాన ఉన్న ఆలయంలో కుమార స్వామి విగ్రహాలు ప్రతిష్ఠించబడి ఉన్నాయి. ఈ విగ్రహాలన్నీ కూడా ఒకే శిల్పిచే చెక్కబడి ఉండవచ్చునని పించుచున్నది. ఈ విగ్రహములన్నియు శిల్పి శిల్పకళా చాతుర్యానికి ఎత్తిన జయకేతనాలు.

## కాశీ విశ్వనాధాలయం

ఇదియు ఒక ప్రత్యేక దేవాలయమే. దీనికి పదహారు స్తంభాల మండపం ఉంది. ఇందులో నంది ప్రతిష్ఠింపబడింది. ఇక్కడ ఉన్న అన్ని నందుల్లో ఇది అపురూపమయినదని చెప్పవచ్చు. సుమారు 4 అడుగుల ఎత్తుతో ఇది చెక్కబడి ఉంది. మండపానికి ఆనుకొని ఉన్న గర్భగుడిలో శివలింగం మాత్రం ప్రతిష్ఠించబడి ఉంది. ఈ ఆలయం శిథిలమగుటకు సిద్ధంగా ఉంది.

## వెంకటేశ్వరాలయం

పూర్తిగా శిథిలమయిన దేవాలయం ఇది. స్తంభాలు మాత్రం నిలిచి ఉన్నాయి. పైకప్పు నేలకొరిగింది. గర్భగుడి జీర్ణమయ్యింది. గుడిలో విగ్రహం మాత్రం లేదు. ఈ గుడిని చూస్తే ఒక రాతి కుచ్చులా అగుపిస్తుంది.

ఈ ఆలయాలన్నింటిలో రామలింగేశ్వరా దేవాలయాన్ని మాత్రం దేవాదాయ శాఖ కైవసం చేసుకుంది. తక్కిన దేవాలయాలను విడిచిపెట్టింది.

దేవాదాయ శాఖ మొత్తం ఈ క్షేత్రాన్ని దత్తత తీసుకొని అభివృద్ధి పరిస్తే ఇది ఒక మహాక్షేత్రమై విరాజిల్లుతుందని అందుకు ఇక్కడ అన్ని అవకాశాలు ఉన్నాయని చెప్పవచ్చు.



వేల్పుగొండ ముందున్న ముఖద్వార శిలాఫలకము



వేల్పుగొండ తుంబురేశ్వరాలయం చుట్టూ గోడలలో చెక్కిన సూక్ష్మమూర్తి



వేల్పుగొండ దేవాలయం గోడల్లో అద్దంలో చూసుకుంటూ అలంకరణ చేసుకుంటున్న యువతి



వేల్పుగొండ దేవాలయపు బహిరావణ గూడులో మహిషాసురమర్దని



శివ్వంపేట మండలం దొంతి గ్రామంలోని శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయం



అనంతసాగర్ సరస్వతీ ఆలయం



కళ్యాణ రామచంద్రస్వామి ఆలయం. సీతారాములు, ఊర్మిళా లక్ష్మణులు, మాండవిభరతులు, శృతకీర్తి శత్రుఘ్నుడు



అనంతసాగర్ సరస్వతి అమ్మవారు



రామాలయం



కూడవెల్లి క్షేత్రం



కూడవెల్లి క్షేత్రము



కూడవెల్లి రామలింగేశ్వరస్వామి



కూడవెల్లి నందులు



కూడవెల్లి శివాలయంలో వీరభద్రుడు



కూడవెల్లి షణ్ముఖస్వామి



కూడవెల్లి దేవాలయంలో స్థంభము



కూడవెల్లి



కూడవెల్లి వెంకటేశ్వరస్వామి



కల్వగూరు



కొండపాక జీర్ణ దేవాలయము



కొండపాక జీర్ణ దేవాలయంలోని సప్తమాతృకలో



కానుకుంట గ్రామంలో బయటపడ్డ వినాయకుడు



ఆంజనేయస్వామి దేవస్థానం, మెదక్



కళ్ళాకల్‌లోని నరసింహస్వామి దేవాలయం



శ్రీకృష్ణ దేవరాయ కాలంలో నిర్మించిన విఠలేశ్వర ఆలయం



ఎల్లమ్మగుడిపై పంచపాండవుల విగ్రహాలు



వేల్పుగొండ శాసనము



అందోలు రోడ్డు ప్రక్క వేయబడిన శిలా విగ్రహాలు



మద్దె దేవాలయంలోని శాసనము



అందోలు రోడ్డు ప్రక్కన అనాధగా పడి ఉన్న కేశవ విగ్రహాలు



నందికంది దేవాలయము ముందు భాగము



నందికంది దేవాలయము వెనుక భాగము - పద్మాకృతి



అందోల్ కోట ప్రధాన ద్వారం



శ్రీ విద్యా సరస్వతి శనైశ్వరాలయము - వర్గల్



హిందూ - ముస్లిం మతసామరస్యంతో ప్రవర్తిల్లే వట్‌పల్లి దర్గా



వట్‌పల్లి దర్గా

# ఆశ్రమాలు

## పాండురంగాశ్రమం – మర్యాకు

మెదకు జిల్లాలో ఆధ్యాత్మిక అనుభూతిని అందజేసే ఆలయంగా పాండురంగాశ్రమాన్ని ప్రథమంగా పరిగణించవచ్చును.

నిరంతర భగవన్నామ సంకీర్తనతో నిరతాన్నదాన సాఫల్యంతో ఈ పాండురంగాశ్రమం సనాతన సాంప్రదాయ సాకేతం.

నిజాం నిరంకుశ పరిపాలనలో మహమ్మదీయ మతాధికారంలో, గుళ్లోజే గంటలు మ్రోగడానికి భయపడుతున్న వేళల్లో, సామాన్య ప్రజానీకానికి అసామాన్య ఆధ్యాత్మిక సంపదనందించి హైందవ మత సంరక్షణలో అగ్రభాగాన నిలిచిన పాండురంగాశ్రమం పారమార్థిక పరమ పవిత్ర స్థానం.

మనిషిలోని అహంభావాన్ని, అహంకారాన్ని, ఆశను, అంతం చేసికొనడానికి ఏర్పరచిన ఆశ్రమం తురీయాశ్రమం. అలాంటి ఆశ్రమ స్థానం పాండురంగాశ్రమం.

ములుగు మండలం మర్యాకుగ్రామంలో బ్రాహ్మణ కుటుంబంలో జన్మించి చిన్ననాటి నుండి భగద్భక్తి సత్యవాక్కుపై విశ్వాసముంచి తానేగాక తనతో పాటున్నవారిని కూడా సన్మార్గంలో నడపడానికి ప్రయత్నించేవారు. వీరు పూర్వాశ్రమంలో అప్పాల సీతరామశర్మ నామధేయులై యుండిరి.

వారిలోని ఆధ్యాత్మిక శక్తికి ఎందరో శిష్యులైనారు. మరెందరో వారి అడుగుజాడలలో నడవడానికి ప్రయత్నించారు.

పండరీపురం నడచివెళ్లి అక్కడి నుంచి రుక్మిణీ పాండురంగ విగ్రహాలను తీసికొనివచ్చి గ్రామానికి కడు దూరంలో ప్రతిష్ఠింపచేసినారు. పాండురంగని సేవకై పల్లెను విడిచి సతీమణి యశోద మాతను పసిపిల్లలను తీసి కొని కారడవిలో కాపురం పెట్టినారు. ఆ విధంగా శ్రీవారు వానప్రస్థాశ్రమాన్ని చక్కగా నిర్వహించి కొంత కాలానికి తురీయాశ్రమాన్ని స్వీకరించినారు, ఆశ్రమ స్వీకారంతర్వాత వారు యతివరభావానంద స్వాములైనారు.

శ్రీవారు తన ప్రవచనాలతో, గాత్రమా ధుర్యంతో ప్రజలకు భక్తి, జ్ఞాన, వైరాగ్యములు బోధించేవారు. ఈ ఆశ్రమం భాగ్యనగరానికి 60 కి.మీ. దూరంలో రాజీవ్ రహదారికి 10 కి.మీ. దూరంలో కలదు. ఆశ్రమానికి వచ్చే భక్తులకు ఉచిత అన్నదానం చేయడం ఆశ్రమ ప్రత్యేకత.

ప్రతి సంవత్సరం ఆషాఢ శు. ఏకాదశికి ఆషాఢి అనే పేరుతో ఈ ఆశ్రమంలో గొప్ప ఉత్సవం జరుపుతుంది. అనేకవేల మంది ఈ ఉత్సవానికి హాజరై పాండురంగని సేవలో పునీతులై భావానందస్వామిని భక్తితో కొలిచి తన్మయులౌతారు.

# శ్రీ శ్రీ శ్రీ మదనానంద సరస్వతీ స్వామి ఆశ్రమము – సిద్ధిపేట

శ్రీ శ్రీ శ్రీ మదనానంద సరస్వతీ స్వామి వారు సదానంద మఠాధి పతులు బసవ కళ్యాణి (కర్ణాటక)లో ఈ మఠం ఉంది.

మెదకు జిల్లాలోని టేక్మాల గ్రామంలో కలి.5003 శ్రీ శోభకృత్‌నామ సంవత్సర శ్రావణ శు.10 తేది 27-8-1903 గురువారం అనూరాధ నక్షత్రమున శ్రీ రావికోటి నరహరి శ్రౌతి లక్ష్మీనర్సమ్మ దంపతులకు ద్వితీయ పుత్రునిగా జన్మించి లక్ష్మీనరాయణ శర్మగా పేరొంది విద్యాభ్యాసముతోనే అధ్యాత్మికాభ్యాసము కూడా చేసినారు. సాంసారిక సుఖమును ఆశింపక బ్రహ్మచారిగా ఉండి 25 సంవత్సరముల వయస్సునందే ఆహారముమాని ఉపాహారము మాత్రమే తీసుకొనుచు అఖండ తపస్సు చేస్తూ ధర్మపథంతో నడిచినారు. 1967లో తన 64వ సంవత్సరాల వయస్సున కొప్పోలు సంగమేశ్వరస్వామి సన్నిధానములో తపస్సు చేస్తూ దేవాలయాభివృద్ధి చేసినారు. 1972లో కర్ణాటక రాష్ట్రమునందలి బసవ కళ్యాణి మఠమునకు పరివ్రాజకులైనారు.

సిద్ధిపేట పట్టణమందు ఒక కోటి పార్థివలింగములు చేయించి 1979లో ఉమాపార్థివ కోటి లింగేశ్వర దేవాలయము నిర్మించినారు మరియు ఎన్నియో జీర్ణ దేవాలయములను ఉద్ధరింపచేస్తూ, తొగుట మొదలగు గ్రామాలలో క్రొత్త దేవాలయములు నిర్మింప చేస్తూ 1990లో బసవ కళ్యాణి సదానంద మఠాధిపతి అయినారు. వేదములను, సనాతన ధర్మములను బోధిస్తూ 2000 క్రీ.శ. విక్రమనామ సంవత్సర కార్తీక ఏకాదశి మంగళవారము తేది 21-11-2000 రోజు దేహయాత్ర చాలించి మోక్ష యాత్రను ప్రారంభించినారు.

# దత్తగిరి ఆశ్రమం – బర్దిపూర్

ఆధ్యాత్మిక సంపద నలుమూలలా పంచి సనాతన భారతీయ జీవన విధానాన్ని నలుగురికి తెలియజెప్పే సంస్థలే ఆధ్యాత్మిక కేంద్రాలు.

జహీరాబాదుకు 12 కి.మీ. దూరంలో ఒక మారుమూల పల్లె బర్దీపూర్. ఈ గ్రామానికి సమీపంలో ఆహ్లాదకరమైన వాతావరణంలో ప్రశాంత నిలయంగా భాసించే ఆశ్రమం శ్రీ దత్తగిరి మహరాజ్ ఆశ్రమం.

పూర్వాశ్రమంలో నాగేంద్రయ్య స్వామిగా పిలువబడే శ్రీ దత్తగిరి మహరాజ్ సుమారు 40 సంవత్సరాల క్రితం ఈ ఆశ్రమాన్ని స్థాపించారు.

నాగేంద్రయ్య స్వామి చిన్ననాటి నుండి బైరాగిగ తిరిగేవాడు. తల్లిదండ్రులు చదువుకోమని బలవంత పెట్టినను ఈ చదువు నాకక్కరలేదని నిజమైన చదువు చదువుకొంటానని పలుకేవాడు.

పెండ్లి చేస్తే మారుతాడేమోనని ఈతనికి బలవంతముగా తల్లిదండ్రులు వివాహము చేసిరి. కాని వీరు భార్యను తల్లిదండ్రులను అందరిని వదిలి దిగంబరుడై సంచరించేవారు.

ఒక రోజు మహంత మహరాజ్ అనే మహాత్ముడు స్వామిజికి ఆత్మవిద్యాసర్వస్వాన్ని బోధించి సన్యాస దీక్షను ప్రసాదించినారు. నాటినుంచి నాగేంద్రయ్య స్వామి స్వామిదత్తగిరి మహరాజ్ గా పేరొంది 12 సంవత్సరములు కఠోర తపస్సు గావించిరి. బర్దిపూర్ గ్రామ పరిసరలాలో ఆశ్రమాన్ని నిర్మాణంగావించినారు. ఆశ్రమంతో స్వామి స్వయంగా రాగి, మేడి, వేప, నిమ్మ, మద్రి చెట్లను ఏక ముహూర్తంలో నాటిరి. స్వామి ఆశ్రమంలో ఒక అగ్నిగుండమును ప్రారంభించిరి. ఆగుండంలో నేటికి కూడా అగ్ని ఆరకుండా ముండింపబడుతుంది. 1979వ సంవత్సరము మార్చి 15వ తేదిన స్వామి శివైక్యము చెందగా వారి శిష్యుడు బర్దీపూర్ గ్రామ వాసియైన గాళయ్యస్వామి అవధూత గిరి మహరాజ్ అను పేరుతో ఆశ్రమ నిర్వాహణ గావించుచున్నారు. వీరు కేవలము పాలు-పండ్లు మాత్రమే ఆహారముగా స్వీకరించుచు భారతీయ సనాతన సంప్రదాయాన్ని భాగవత్తత్వాన్ని వేదాంత భావాన్ని ప్రచారం చేస్తుంటారు.

వీరి నిర్వహణలో ఆశ్రమము అభివృద్ధి మార్గమున పయనించుచున్నది. కోటి రూపాయలతో ధ్యానమండప నిర్మాణము జరుగుచున్నది.

ప్రతి సంవత్సరం దత్త జయంతి ఉత్సవాలు ఈ ఆశ్రమంలో ఘనంగా జరుగుతాయి. దత్తాత్రేయ ఉత్సవాలు నిర్వహింపబడతాయి. ఈ ఉత్సవాలలో సుదూర ప్రాంతాల నుండి అనేక మంది భక్తులు పాల్గొంటారు. భక్తుల సౌకర్యార్థం అన్నదానము, నీటి వసతి కల్పించబడుతాయి.

ఈ విధముగా మెదకు జిల్లాలో వెలసిన ఆధ్యాత్మికకేంద్రం జిల్లాలోనేకాక పరిసర ప్రాంతాలలో కూడా దైవభక్తిని కల్గిస్తూ మానవునిలోని స్వార్థాన్ని, అహాన్ని పోగొట్టుటకు ప్రయత్నించుచున్నది.

# శ్రీ గురు మదనానంద శారదా క్షేత్రము

కొండపాక మండలమున తొగుట గ్రామ సరిహద్దులలో రాంపురం గ్రామ పరిసరాలలో వెలసిన ఆధ్యాత్మిక కేంద్రము శ్రీగురు మదనానంద శారదా క్షేత్రము.

ఈ ఆశ్రమమును శ్రీశ్రీశ్రీ కృష్ణానంద సరస్వతీ స్వామి వారు స్థాపించిరి. శ్రీశ్రీశ్రీ మదనానంద సరస్వతీ స్వామి వారి సంపూర్ణ ఆశీస్సులతో శ్రీవారి ప్రియశిష్యాగ్రేసరులై సన్యసించిరి.

కృష్ణానంద సరస్వతీ స్వామి వారు పూర్వాశ్రమంలో పార్నంది జానకిరామశర్మగారు. వీరు తొగుట గ్రామ నివాసులు. చిన్ననాట వైదికవిద్యను సంస్కృతమును అభ్యసించినారు. వీరి యుక్త వయస్సులో శ్రీరామచంద్రయ్య గారిచే స్థాపించబడిన తొగుట సంస్కృత పాఠశాలకు ఇతోధిక సేవ గావించినారు. కొంతకాలం జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా అధ్యాపకకర్తవ్యం నెరపినారు.

మొదటి నుండీ ఆధ్యాత్మిక, ధార్మిక భావాలు కలిగిన వీరు సన్యసించి శ్రీ గురుమదనానంద శారదా క్షేత్రమును స్థాపించినారు. ఈ ఆశ్రమంలో ఆరు ఆలయాలలో 88 మంది దేవతామూర్తులు ప్రతిష్ఠించినారు.

ఈ సంస్థ ఆధ్యాత్మిక ధార్మిక సేవాసంస్థ. దేవాలయ, విద్యాలయ, వైద్యాలయ స్థాపనకు, నిర్వహణకు, ధార్మిక కార్యక్రమములు జరుపుటకు, ప్రజలలో సత్యచింతన సలోపకార శీలతను పెంపొందించుటకు, నిరంతర అన్నదానం చేయుటకు అహరహం కృషి చేయుచున్నది.

# సీతారామాశ్రమము – మాసాయిపేట

శ్రీశ్రీ మహాత్మ కాసుల రామ చంద్రయ్య గారిచే స్థాపించబడిన శ్రీ సీతారామాశ్రమ క్షేత్రము మాసాయిపేటగ్రామ పొలిమేరలలో మాసాయిపేట రైల్వే స్టేషను నుండి 2 కి.మీ. దూరాన, హరిద్రి నదీ తీరాన వెలసి యున్నది.

ఈ ఆశ్రమము శ్రీశ్రీశ్రీ యతివర అఖండానంద సరస్వతీ స్వామి (పూర్వాశ్రమము శ్రీశ్రీ మహాత్మాకాసుల రామచంద్రయ్యగారు) వారిచే ఏప్రిల్ 1946లో నిర్మింపబడినది.

వీరు గ్రామమునకు దూరాన వానప్రస్థాశ్రమమునగు వీలుగా ఈ ఆశ్రమమునకు నెలకొల్పిరి. ఆశ్రమ సుందర పరిసరములలో వీరి ఆరాధ్య దైవమగు శ్రీ సీతా, లక్ష్మణ, హనుమత్ సమేత రామచంద్రుల, మరియు శివ పంచాయతనమునకు దేవాలయములు నిర్మింపజేసిరి.

ఈ సీతారామక్షేత్రమున ప్రతి సంవత్సరము దేవీనవరాత్రోత్సవములు మరియు రామ కల్యాణోత్సవము అతివైభవంగా జరుగును. దేవీ నవరాత్రోత్సవములు, శ్రీ కృష్ణ జన్మాష్టమి, మహాశివరాత్రి మున్నగు ఉత్సవములతోబాటు ప్రతిరోజు ఏకాదశ రుద్రాభిషేకముతో త్రికాలము లందు పూజలు జరుగును. గత నాలుగు సంవత్సరాల నుండి ఆయా దాతలు గోత్రనామ ములతో శాశ్వత నిత్యపూజలు నిరతాన్నదానము నిర్విఘ్నంగా సాగుచున్నవి. ప్రతి మాసశివరాత్రి రోజు లఘు రుద్రాభిషేకము బహుకాలముగా జరుగుచున్నది. ప్రస్తుతము ప్రతి మాసము రెండవ శనివారము నాడు స్వామికి అష్టోత్తర శత పురుష సూక్త విధాన అభిషేక పూజ జరుగుచున్నది.

ఇట్టి సీతారామాశ్రమ భవనము ప్రస్తుతము జీర్ణమై కొంత భాగము పడిపోయి మిగిలిన భాగము కూడా శిథిలావస్థలోనున్నది. కావున ప్రస్తుతము నూతన భవన నిర్మాణమో! శిథిల భవన ఉద్ధరణయో అత్యావశ్యకమై ఉన్నది.

ఈ ఆశ్రమ క్షేత్రమునందలి అన్ని కార్యక్రమములు శ్రీ కాసుల దత్తాత్రేయ శర్మ గారిచే నిర్వహించబడుచున్నవి.

# మెదక్ చర్చి

ప్రపంచంలో అద్భుతమైన కట్టడాలలో మెదకు చర్చి ప్రసిద్ధమైనది. ఇంగ్లాండ్‌కు చెందిన చార్లెస్ పాస్‌నెట్ చేతితో రూపుదిద్దుకున్న అద్భుత సృష్టి ఇది. కేథడ్రల్ చర్చి 1914 సంవత్సరంలో ఈ చర్చి నిర్మాణాన్ని ప్రారంభించి 10 సంవత్సరాలలో పూర్తి చేయించారు. వీరికి తోడు ప్రఖ్యాత శిల్పి జె. పాలీస్‌బరి చిత్రరూప కల్పనలో మెదక్ చర్చి ప్రాధాన్యత సంతరించుకుంది. ఈ నిర్మాణంతో రాయి, కలపల స్థానంలో ఉక్కు, సిమెంట్, కాంక్రీట్‌ల వినియోగాన్ని చేపట్టి నవయుగాన్ని ఆవిష్కరించాడు బహుముఖ ప్రజ్ఞాశిల్పి.

ఈ చర్చి మెదక్ పట్టణంలో ఉంది. ఎత్తులో, విస్తీర్ణంలో ఇది ఆసియా ఖండంలో రెండవ స్థానంలో ఉంది. ఈ చర్చ్‌కు గత 75 సంవత్సరాలుగా విభిన్న దేశాలనుంచి, విభిన్న ప్రాంతాలనుంచి ప్రతిరోజు సందర్శకులు వస్తుంటారు. క్రిస్మస్ వంటి రోజులలో లక్షల మంది యాత్రికులు ఈ చర్చిని సందర్శిస్తుంటారు. ముఖ్యంగా రాతి కట్టడాల మధ్య అమర్చిన ఏసుక్రీస్తు జీవన వృత్తాంతాలు సందర్శకులను అలరిస్తాయి. 55 మీటర్ల ఎత్తు ఉన్న స్థూపంపై రాత్రి వేళలలో ఫ్లోరోసెంట్ దీపాలు చర్చి టవర్ ఆకారాన్ని ప్రదర్శిస్తాయి. దాదాపు 365 ఎకరాల విస్తీర్ణంలో గల ఈ చర్చిలో ఆరు రకాల బండరాళ్ళు ఉన్నాయి. నిజాం ప్రభుత్వ ఆంక్షల వల్ల చర్చ్ టవర్ చార్మినార్ ఎత్తును మించకుండా అడ్డుకున్నారు. చర్చి గోపురం వెడల్పు 100 అడుగులు పొడవు 200 అడుగులు. ఈ చర్చిలో ఒకేసారి 5000 మంది ప్రార్థనలు చేసుకొనే అవకాశం ఉంది.

చర్చికి మూడుదిక్కులా పలు రంగుల అద్దాల ముక్కలతో గవాక్షాలు అమర్చారు. తూర్పున ఏసుక్రీస్తు జననం, పడమరన శిశువుదృశ్యం, ఉత్తరాన క్రీస్తు సజీవుడై లేచి ఆదివారం రోజున పరలోకానికి పయనమైన దృశ్యాలు ఉన్నాయి. ఈ చర్చిని ఇతర దేశాల ప్రముఖులతో పాటు మన దేశ ప్రముఖులు సందర్శించారు.

# ఇన్‌స్పెక్షన్ బంగ్లాలు

నిజాం నవాబుల కాలంలో రాజుల, జాగీర్దార్ల వసతి కొరకు మార్గమధ్యంలోఅక్కడక్కడా కొన్ని భవనాలను నిర్మించినారు. ఇట్టి భవనాలు మెదకు జిల్లాలో 17 ఉండేవి.

ఆనాడు రాజ ప్రసాదాలుగా విలసిల్లిన ఇన్‌స్పెక్షన్ బంగ్లాలు ఎన్నో ప్రస్తుతం శిథిలావస్థలోనున్నవి. కొన్ని రూపురేఖలు లేకుండా కూలి పోయినవి.

నిజాం నవాబులు కాలమున నీటి పారుదల, రోడ్లు భవనాల శాఖలు మిళితమై ఒకే శాఖ గానున్న రోజులలో ఈ బంగ్లాలు నిర్మించబడినవి. అడవుల లోను, ముఖ్యపట్టణాలలోను నిర్మించిన ఈ భవనాలు నాటి నిర్మాణపు పనితీరు వాస్తు శిల్పము ప్రస్ఫుటముగా కనుపించును. ఏనుగులతో తొక్కించిన డంగు సున్నముతో ఈ భవనాలు నిర్మించినారు. ఇనుప రాడ్లు డంగు సున్నముతో పైకప్పులు నేటికి చెక్కుచెదరక వానకు కురువక చక్కగా కలవు. ఒక్కొక్కబంగళాలో రెండు లేదా మూడు సూట్లు, స్నానపుగదులు, వరండాలు నిర్మించడంతోపాటు విశాలమైన ఆవరణతో ప్రహరీ గోడలు కూడా నిర్మించినారు. తలుపులు, కిటికీలు నాటి అటవీ సంపదకు ఆనాటి వడ్రంగుల వృత్తినైపుణ్యానికి నిదర్శనాలు. సోఫాలు, కుర్చీలు, మంచాలు, డైనింగ్ టేబుళ్లు, తదితరమైన ఫర్నీచర్ కూడా కళాత్మకముగా శిల్పకళానైపుణ్యమును చాటుచున్నవి. వంటగదులు, వాహనాలు నిలిపే గదులు కూడా నిర్మించబడినవి. పట్టణాలలో సైతం బాగా ప్రచారానికిరాని విద్యుత్తు అడవుల్లోని ఈ బంగ్లాలకు ప్రసారం జరిగింది. సమస్త సదుపాయాలు ఈ బంగ్లాలలో సమకూర్చబడినవని వేరుగా చెప్పవలసినది లేదు.

ఈ బంగ్లాలకు కాపలాదారులు, తోటమాలులు, వంటవారు ప్రత్యేకంగా నియమింపబడేవారు.

నిజాం నవాబులు, జాగిర్దారులు, జమీందారులు మున్సబులు ఉన్నత ప్రభుత్వోద్యోగులు నిరంతరంగా ఈ బంగ్లాలను సందర్శించి గడపేవారు. సకుటుంబ సమేతంగా వచ్చి బంగ్లాలో విడిది చేసి అడవిలో షికార్లు చేసి (జంతువుల వేట) ప్రకృతి రమణీయకతలో పరమానందంగా గడుపుచుండిరి.

మెదకు మండలంలోని పోచంరాల్, రాయిన్‌పల్లి, ప్రాజెక్టుల వద్ద అభయారణ్యంలో గల ఇన్‌స్పెక్షన్ బంగ్లాలు ఆనాడు అత్యంత ప్రాధాన్యతను సంపాదించుకొనినవి. ఆరోజులలో వీటి నిర్వాహణకు ఏలాంటి లోటు రానీయకుండా జాగ్రత్తపడుచుండిరి. ఈ బంగ్లాలు రాజప్రసాదాలుగా భాసిల్లినవి.

స్వాతంత్ర్యానంతరము రోడ్లుభవనాలు, నీటిపారుదల శాఖలు విభజింపబడినవి.

ఈ బంగ్లాలు నీటి పారుదల శాఖ వారి ఆధీనములోనికి వచ్చినవి. కొన్ని రోజులు రోడ్లు భవనాల శాఖ ఆధీనములోన వచ్చినవి. ఏ శాఖలో నున్నప్పటికి ఈ బంగ్లాల నిర్వాహణలో అలసత్వము తగ్గలేదు. నామమాత్ర నిర్వాహణ వల్ల విడిది గృహాల రూపురేఖలు తారుమారైనవి. కొన్ని బంగళాలు ఆలనపాలనా కరువై కుప్పకూలిపోవుటకు సిద్ధముగా నున్నవి. నిరాదరణకు గురైన కొన్ని బంగ్లాలు బూత్ బంగ్లాలుగా పిలువబడుచు గబ్బిలాలకు ఆవాసమైనవి.

రాయినపల్లి ఇన్‌స్పెక్షన్ బంగ్లాలో విడిది చేసిన విదేశీ వేటగాడిపై నక్సలైట్లు దాడి జరిపి అతని వద్ద నుండి అధునాతన ఆయుధాలు, బైనాక్యులర్స్‌ను తీసికొని వెళ్లిరి. ఆనాడు వేటగాడికి నక్సలైట్లుకు మధ్యన జరిగిన హోరాహోరి కాల్పులలో తలపులకు గోడలకు పడిన బుల్లెట్లు రంధ్రాలు నేటికి అగుపడును.

ఈ సంఘటన తర్వాత అధికారులు, అనధికారులు అటవీ ప్రాంతాలలోని బంగ్లాలలో విశ్రాంతి పొందే పర్యటనకు స్వస్తి పలికిరి.

సంబంధిత అధికారుల నిర్లక్ష్యము, నిర్వహణా లోపములతో అనేక ఇ.బీలలో వాచ్‌మెన్ ఉన్నప్పటికీ అందులోని ఫర్నీచర్ ధ్వంసమైనది, కొంత దొంగల పాలైనది. భవనాలకు మరమ్మత్తులకు నోచుకొనక కూలుటకు సిద్ధముగా నున్నవి. హత్నూర మండలములోని చందాపూర్ లోగల ఇన్‌స్పెక్షన్ బంగ్లా మొత్తము కూలిపోయినది.

ప్రస్తుతం జిల్లాలోని రాయిన్‌పల్లి, పోచంరాల్, టేక్మాల్, చిట్కుల్, గుడికందుల, హమీద్‌పూర్, వెంకటాపూర్ అక్కన్నపేట, నాగ్సాన్‌పల్లి, చిన్నఘనపూర్, సర్దశంకరంపేట, మిర్జాపూర్, బంగ్లాలు రిజర్వేషన్లు లేక శాఖాపరమైన నిర్వహణ కొరవై శిథిలమగుచున్నవి. చిన్న శంకరంపేట, గజ్వేల్ బంగ్లాలు మండల కార్యాలయ ములైనవి.

పట్టణములలోనున్న ఇన్‌స్పెక్షన్ బంగ్లాలైన మెదకు, సంగారెడ్డి, సిద్ధిపేట, నర్సాపూర్, సదాశివపేట, అందోలు, రామాయంపేట, కుక్నూరు పల్లి, తూప్రాన్, నారాయణ్‌ఖేడ్, ములుగు, మొదలగునవి నేటికిని ఆనాటి గృహనిర్మాణ కళారీతులను చాటుటు ఆ విధులకు సమస్త సౌకర్యముల కల్గించుచున్నవి.



పురాతన బురుజు, ఎల్లుపల్లి - సిద్దిపేట.



చరిత్రకు సాక్ష్యంగా నిలిచిన బురుజు - మాడ్నూర్ మండలం, ఝరాసంగం

# పురావస్తు ప్రదర్శనశాల - కొండాపూర్

## స్థలనిర్దేశము

హైదరాబాద్ నుండి బొంబాయికిపోవు జాతీయ రహదారిపై 60 కిలోమీటర్లు ప్రయాణించిన తరువాత పెద్దాపూర్ గ్రామమునుండి దక్షిణదిశగాయున్న దారిపై సరాసరి పయనించినచో మెదక్ జిల్లా యందు నెలకొనియున్న చారిత్రక ప్రసిద్ధిగాంచిన కొండాపూర్ గ్రామము చేరవచ్చును.

## త్రవ్వకములు జరుపబడిన స్థలము :

మెదక్ జిల్లాలో $17^{0}.33$ ఉత్తర అక్షాంశములు $78^{0}.1$ తూర్పు రేఖాంశముల యందు నెలకొనియున్న కొండాపురము నందరి ప్రాచీన నివేశన స్థలములపై విస్తరించియున్న మట్టి దిబ్బను తొలిసారిగా విదేశీ పురాతత్వ విదుడగు హెన్రీ కౌజెన్సు సుమారు 1900 సంవత్సర ప్రాంతమున అన్వేషించి కనుగొనెను. ఈ మట్టి దిబ్బను ఆనుకుని ప్రవహించు చిన్నవాగుకు సమీపమున మధ్యమశిలా యుగపు పనిముట్లు, పనిముట్ల తయారీ పరిశ్రమ స్థలము, సూక్ష్మ శిలా యుగపు పనిముట్ల తయారీ పరిశ్రమ స్థలము, సూక్ష్మ శిలా యుగపు కోణాకృతులు గల ఛేదకములు పురావస్తు శాస్త్రవేత్తల అన్వేషణముల యందు బయలు పడుటచే మధ్యమ-సూక్ష్మ శిలాయుగముల సంస్కృతుల ఉనికికి ఈ ప్రదేశము నెలవుగా యుండెడిదని నిరూపితమగు చున్నది. ఇంకను, 1970-71 సంవత్సరములలో పురావస్తు సంగ్రహాలయమునకు దక్షిణ దిశగా ఒక కిలోమీటరు చేరువలో కొండవాలుల యందును మరియు వ్యావసాయక క్షేత్రముల యందును నవ శిలాయుగమునకు చెందిన రాతి గొడ్డళ్ళు నునుపు చేయబడిన గచ్చకావిరంగు, నునుపు చేయని ఎరుపురంగు మట్టి పాత్రల సముదాయము పురాతత్వ విదులచే వెలుగులోనికి కొనిరాబడినవి. దీనిని అనుసరించి పూర్వేతి హాసకాలపు సంస్కృతి ఈ ప్రాంతమందు వెలసిల్లినదని విశ్వసనీయముగా విశదపరచదగును.

కొండాపూర్ - తేరెపోల్ గ్రామముల మధ్యన అస్తవ్యస్తముగా నెలకొనియున్న పెక్కు ప్రాచీన క్షేత్రములలో ఒక మట్టి దిబ్బను పూర్వపు హైదరాబాద్ రాష్ట్రమందలి పురాతత్వశాఖ త్రవ్వకముల నిమిత్తము 1940-42 సంవత్సరముల యందు స్వీకరించి త్రవ్వకములను గావించినది.

ఈ త్రవ్వకముల యందు కాల్చిన ఇటుక, సున్నములతో నిర్మింపబడి శిథిలములయిన మత-లౌకికములగు కట్టడములు బయలుపడినవి. బౌద్ధ స్థూప, విహార, చైత్యమండపములు మరియు నేల మాళిగల శిథిలావశేషములు వెలుగు చూసినవి.

ఇంతేగాక క్రీస్తు శకారంభ శతాబ్దములకు చెందిన శిల్పఖండములు, నాణెములు, పూసలు, మట్టి బొమ్మలు, వివిధాకృతులు మట్టిపాత్రలు ఇతర ప్రాచీన వస్తు సంపద వెలికి తీసుకురాబడినవి.

సిముఖ సాతవాహనునిచే ప్రతిష్ఠానము నందు (నేటిపైఠాన్) స్థాపింపబడి త్రిసముద్రల మధ్య భాములగు దక్కను పీఠ భూమి, ద్రవిడ దేశము, మరియు ఆర్యావర్తము నందలి కొంత భాగముల వరకు విస్తరించిన విశాల సామ్రాజ్య పరిపాలనము జేసిన సాతవాహన చక్రవర్తులచే నిర్మింపబడి చుట్టూ కోటచే ఆవరింపబడిన మహా నగరమే నేటి కొండాపూర్ నందలి ప్రాచీన నివేశన స్థల సముదాయము. శాతవాహన చక్రవర్తులలో సిరిసాతకర్ణి. పులుమావి మరియు గౌతమిపుత్ర సాతకర్ణులు ఖ్యాతి నార్జించిన గొప్ప పరిపాలకులుగా పేర్కొనదగును.

ప్రస్తుతము పురావస్తు సంగ్రహాలయము నెలకొనియున్న కొండ ఉత్తరపు వాలునకు చేరువలో మరియొక స్థూపము దిబ్బను 1973-74 సంవత్సరమునందు కనుగొనిరి. దీని యందు లభ్యమయిన కాల్చిన ఇటుకలు (53 x 53 x 10 సెం.మీ) మరియు మట్టి పాత్రలు మౌర్యకాలీనతను సూచించుచున్నవి.

## పురావస్తు ప్రదర్శనశాల:

కొండాపూర్ గ్రామమునకు దక్షిణ దిశగాయున్న ఒక కొండగుట్టపై పురావస్తు పురావస్తు ప్రదర్శనశాల నెలకొల్పబడినది. 1940-42 సంవత్సరములలో జరుపబడిన త్రవ్వకములలో వెలువడిన చిన్న చిన్న ప్రాచీన వస్తు సముదాయమంతయు ఇందు ప్రదర్శింపబడినది.

ఈ పురావస్తు ప్రదర్శనశాల యందు ఒక పెద్దహాలు మరియు రెండువరండా గదులు గలవు. తొలి ఇతిహాసకాలము నాటి రంగు పాత్రలు, లేఖనములు గలిగిన మరియు కరిగించిన ఇనుపటంకముతో అతికింపబడిన పెద్ద పెద్ద మట్టి పాత్రలు, మట్టి బొమ్మలు, పూసలు, నాణెములు, ముద్రలు మొదలగునవి విశాలమైన పెద్దహాలు నందును, శిలాయుగపు పనిముట్లు శిలాజములు, ఇనుపపనిముట్లు మరియు శిల్పఖండములు వరండాగదులు యందును అందముగా ప్రదర్శింపడినవి.

## మట్టిపాత్రలు :

కొండాపూర్ త్రవ్వకములలో గృహోపకరణములగు విభిన్నములయిన మట్టి పాత్రలు లభ్యమయినవి. వీనియందు రంగు పాత్రలు, దీపము సెమ్మలు, పళ్ళెములు మూకుడులు మొదలగునవి వీనిని తయారు చేసిన కుమ్మరి హస్తకళా కౌశలమునకు అద్దము పట్టుచున్నవి. చిన్న మట్టిపాత్రల నిర్మాణము 45 సెం.మీ. నుండి 50 సెం.మీల వృత్త 17 సెం.మీల ఎత్తుతోను కావింపబడగా 74 సెం.మీ వృత్తము 92 సెం.మీ ఎత్తులతో పెద్ద పాత్రలు తయారీ

చేయబడినవి. బౌద్ధులకు పవిత్రములయిన త్రిరత్నము, తామర పుష్పము ధర్మ చక్రముల చిహ్నములు మరియు ఇతరములు ఈ పాత్రల మీద ముద్రితములయినవి. కోణాకారపు గీతలు, పూల తీగెలతో సామాన్యముగ అన్ని పాత్రలు అలంకరింపబడినవి. కొన్ని గీతలు పాత్రల కంఠభాగము నుండి పీఠ భాగము వరకు సాగి ఒక వృత్తముతో కలియుటను కొన్ని పాత్రల మీద చూడనగును. వీనియందు కొనిన అతిపలుచగను మృదువుగను యుండి మిలమిల మెరిసే ఎరుపురంగుతో 'సామియన్' పాత్రల సారూప్యమును బోలియున్నవి. మట్టి పాత్రలు పెక్కింటిపై ఎరుపురంగు పూత పూయబడినది. కాని పూత మందమందు తేడాగలదు.

**చుక్కల పళ్ళెములు:**

సుమారు 35 సెం.మీ.తో లోపలికి వంగియున్న ముక్కువంటి అంచు కలగి చక్కగా కొలిమి నందు కాల్చబడిలోపలి భాగమున రెండు లేక మూడు వరుసల చుక్కల గుర్తుల భాగా నునుపైన పలుచని చుక్కల పళ్ళెములు ఇచటి ప్రదర్శన యందు ఉన్నవి. ఈ పళ్ళెములు తయారీ పద్ధతి స్వదేశీయము కాదని మెడిటరేనియన్ ప్రాంతము నుండి గ్రహింపబడినదని పురాతత్వజ్ఞులు భావించుచున్నారు. వీటితో బాటు క్రీ.శ. 1-3 శతాబ్దులకు చెందిన ఎరుపు పూతగల మట్టి పాత్రలు కూడా ఇచట ప్రదర్శించబడినవి. ఉపరితలమున 'కెయోలిన్' అనబడు తెల్లమట్టి లేక సున్నముతో చిత్రీకరింపబడిన సమాంతర లేక కొద్దిగా వంకీల వంటి రేఖలు గలిగి యుండుచటయే ఎరుపు పూత వేయబడిన ఈ పాత్రల విశిష్ట లక్షణము. నిలువు అడ్డము గీతలు వరుస గీతలు బిందువుల వరుసలతో అలంకరింపబడియున్న ఇట్టి తరహా పాత్రలు కొండాపూర్ నందేగాక అరికమేడు, అమరావతి చంద్రవల్లి, బ్రహ్మగిరి, మస్కి మొదలగు ప్రదేశములందు గూడా విరివిగా లభించినవి. ధ్యానమును భద్రపరచుకొనుటకు అనువుగా తయారు చేయబడిన పెద్ద పెద్ద గోళెములు కొండాపూర్ త్రవ్వకముల యందు లభ్యము కాగా అవి ప్రదర్శనశాలలో ప్రజల సందర్శ నార్థము చక్కని పేటికలలో అమర్చబడినవి. క్రీ.శ. 2వ శతాబ్దికి చెందిన బ్రాహ్మీ అక్షరములు వీనిపై లిఖింపబడియుండుట విశేషము. పగుళ్ళు నివారించుటకు గోళెముల కిరువైపుల కరగించిన ఇనుపటంకములతో అతికియుండుటను బట్టి వీటిని అపురూపమైనవిగా నాటి ప్రజలు పరిగణించియుందురని తలంపవచ్చును.

**మట్టి బొమ్మలు**

'కెయోలిన్' అను తెల్లని మట్టితో తయారు గావింపబడిన బొమ్మలు నాటి మట్టి వస్తువుల తయారీ పరిశ్రమ అభివృద్ధిని ప్రతిబింబించుచున్నవి. శాతవాహనుల కాలమున 'బార్గాజా' (నేటి బ్రోచ్) రేవు పట్టణము నుండి సింగాణీ వస్తువులు ఎగుమతి

అగుచుండెనని క్రీ.శ. ప్రథమ శతాబ్ది యందు వ్రాయబడిన 'పెరిప్లస్' అను గ్రంథమున ఉటంకించిన అభిప్రాయమును ఈ మట్టి బొమ్మలు బలపరచుచున్నవి. గుఱ్ఱము ఎద్దు మొదలగుమచ్చిక చేసుకొన్న జంతువుల బొమ్మలు ఇందు ప్రదర్శింపబడినవి.

సాంప్రదాయమైన వంకీల జుట్టు, చప్పిడి ముక్కు, పెద్ద పెదవులు , గుండ్రని ముఖములతో నిర్మింపబడిన మానవుల బొమ్మలు ఒక ప్రత్యేక స్వదేశీ జాతి లక్షణములను వ్యక్తీకరించు చున్నవి. ఇతర బొమ్మలలో పాపిటి బిళ్ళ, కంఠ హారములను ధరించి యుడుటను గమనింపగలము. ఈమట్టి బొమ్మలలో కొన్నింటికి బోధిసత్వుల ప్రతిమలతో సామరూప్యత గలిగినను అవిబహుశ యక్షప్రతిమల దగును. అమరావతి నాగార్జున కొండ శిల్పముల యందలి స్త్రీ పురుష స్వరూపములకు అచిచటి మట్టి బొమ్మలకు ప్రత్యేక సంబంధము గలదు. ఉత్పాదకత్వ లక్షణములను ప్రతిబింబించుచున్న మాతృదేవతా ప్రతిమ ఇచ్చటి మట్టి బొమ్మలలో తెస్స ఆ,త్ప్రితకమినజి. మెత్తని మట్టితో తయారీ గావింపబడి కాల్చకమునుపే ఎరుపురంగు పూత పూయబడినగట్టిబొమ్మలు ఇచట ప్రదర్శించబడినవి.

**ఆభరణములు**

కొండాపుర్ నందు జరుపబడిన త్రవ్వకములలో నాటి ప్రజలు ధరించిన ఆభరణములు కూడా పెక్కు లభించినవి. వీని యందు కంకణముల ముక్కలు, చేతిగోరుతో గీయబడిన చిత్రములు గల తామెత్తులు గలవు. గవ్వ రాగి గాజు పదార్థములతో తయారీ చేయబడిన కంకణములు కూడా కలవు. కంఠము లందు వేలాడుచు ధరించుటకు అనువుగారూపొందించిన రోమను నాణెములకు అనుకరణములగు కాల్చిన మట్టి పతకములు కూడా ఇందు చూడవచ్చును. అచ్చులపై తయారు గావించిన ఈ పతకములపై రోమను దేశపు చక్రవర్తి 'టైబేరియస్' (క్రీ.శ. 14 నుండి 37 వరకు) రూపము గలదు. ఇవి రోమను దేశమునకు భారతదేశముతో గల సంబంధమును తెలియబరచుచున్నవి. కాల్చిన మట్టితో చేసిన పూసలు ఇచట విశేష సంఖ్యలో లభ్యమయినవి. భిన్న ఆకృతులు పరిమాణములు గలిగి కెంపు, స్ఫటికశిల పద్మరాగము మరకతము, వైఢూర్యము, గవ్వ, ఎముక, గాజు మొదలగు పదార్థములతో తయారయిన పూసలు కంఠహారము రూపమున ఈ ప్రదర్శనశాల యందలి పేటికలో అత్యంత సుందరముగా ప్రదర్శించబడినవి. బంగారు పూత మలాము చేయబడిన గాజు పూస ఒకటి సింగాణీ వంటి పదార్థముతో చేసిన పూస మరియొకటి కూడా ఇందు చేరియున్నవి. గాజుపై బంగారు పూత పూయు విధానము రోమను దేశమునందు పరిపూర్ణత్వము నందినది. కావున ఇట్టి పూసలు విదేశీయము లనదగును.

**నాణెములు :**

కొండాపూర్ నందు జరిగిన త్రవ్వకములలో ప్రాచీనకాలపు నాణెములు విరివిగా లభించినవి. చిహ్నముద్రిత నాణెములు కొన్ని శాతవాహన కాలమునాటి రాగి పోటీన్ మరియుసీసపు నాణెములు సందర్శకులకాఅకు ఆకర్షణీయముగా అమర్చబడినవి. సీసపు నాణెములు చాలవరకు అరగిపోయి యుండుట వీటిపై విభింపబడిన లేఖనములు కానవచ్చుట లేదు. సాధారణముగ నాణెములన్నింటిపై ఎదుటి భాగమున ఏనుగు బొమ్మ, వెనుక భాగమున ఉజ్జయిని చిహ్నములు వుంఇటను గమనింపవచ్చును.

**శిల్పములు**

1973-74 సంవత్సరముల ప్రాంతమున ప్రాంతీయులు కొందరు వ్యావసాయక పనుల నిమిత్తము త్రవ్వకములు జరుపగా ప్రాచీనకాలము నాటి శిల్ప ఖండములు లభ్యముకాగా అవి ప్రదర్శినశాలలో భద్ర పరుచబడినవి. ఇంకనుప్రాకారము నందలి వృక్షము చిత్రీకరింపబడిన పలకము, ఉష్ణీషఫలము, చైత్య ఫలకము, ఛత్రావళి, శిల్పఫలక ఖండములు ప్రముఖములు.

**ఇతరములు**

ఆసక్తికరమయిన ఇతర వస్తువులలో ఎముకతో చేయబడిన పాచికలు, పెద్దపరిమాణమముగల కాల్చిన ఇటుకలు, రంధ్రములు గల పెంకులు కల్వములు, కల్వపురాళ్ళు పదును పెట్టు రాళ్ళు మూసలు మొదలగునవి పేర్కొనదగినవి.

# మెదకు జిల్లా సాహితీ సంపద

మెదకు జిల్లా భూభాగం అనేకానేక రూపాంతరాలు చెందింది. పరిపాలనా విషయంలో ఎందరెందరో పాలకులు మారినారు. రాజకీయాలు సంస్కృతిపై కూడా కొంత ప్రభావం చూపినవి

భాష జనుల నానుడిలో ఉండేది ఒకటి, రాచరిక అధికారిక భాష ఒకటి, గ్రాంధిక భాష మరొకటిగా ఎన్నో కాలాల్లో గోచరిస్తుంది.

అందిన చరిత్ర ఆధారంగా మెదకు జిల్లా చరిత్ర శాతవాహన రాజుల కాలం నుండి గ్రహించడమైనది ఆ కాలంలో మెదకు జిల్లా ప్రాంతం సాంతం వారి ఏలుబడిలోనే ఉండేది. ఆనాడిది మంజీరికా దేశం.

శాతవాహన రాజులు ప్రాకృత భాషను ఆదరించి పోషించినారు. ఆనాడు జనబాహుళ్యంలో వాడుక భాషగా కూడా ప్రాకృతమే ఉంది. ప్రాకృత భాషతో పాటు అభీరి, శకారి, చాండాలి, శాబరి, పైశాచి భాషలు జనవ్యవహారంలో యుండేవి. సంస్కృత భాష కేవలం పండిత భాషగా గ్రాంధిక భాషగా మాత్రం యుండేది. కాని తర్వాత వచ్చిన మార్పులు సంస్కృత భాషను రాజభాషగా చేసినవి.

చాళుక్యుల కాలం నాటికి మెదకు జిల్లా ప్రాంతమంతా కన్నడ భాషా ప్రాంతంగా మారింది. ప్రజా భాష, రాజ భాష కన్నడం అయింది. శాసనాలు, గ్రంధాలు కన్నడ భాషలో వ్రాయబడినవి. బౌద్ధ మతము పాళీభాషను ఆధారంగా చేసికొని మత ప్రచారంగావించింది.

జైనమతము కన్నడ భాషా సాహిత్యాన్ని పరిపుష్టం జేసింది. మత ధర్మాలను, మత సందేశాలను ప్రజలకందించడానికి కన్నడ భాషా సాహితీ ప్రభ వినియోగింపబడింది. క్రీ.శ. 10వ శతాబ్దిలో జైనమత ప్రచారమునకనువగు ప్రాకృత, సంస్కృత, కన్నడ సాహిత్యాలు బాగా ప్రచారమునకు వచ్చినవి.

శైవ మత ఆవిర్భావము జరిగినది. శైవమతము కూడా మత ప్రచారమునకై కన్నడ భాషను పరిపుష్ఠము గావించినది. ఆ మత ప్రచారమునకై ఎన్నో గ్రంధములు ఆ భాషలో వెలిసినవి.

మెదకు జిల్లాలో ఆనాడు కన్నడ భాష అధిక వ్యాప్తిలోనున్నది. డాకూరు, ముదిమాణిక్యం, అల్లాదుర్గము, కొహీరు శాసనాలు కన్నడ భాషలోనేనున్నవి.

**శాసనములు – భాష :**

మెదకు జిల్లాలోని జోగిపేట మండలము నందలి డాకూరు శాసనము కల్యాణి చాళుక్యరాజైన త్రైలోక్యమల్లుడు వేయించినది. అల్లాదుర్గమునందలి శిలాశాసనము త్రిభువన మల్లదేవర వేయించినది.

ఈ రెండు శాసనములు కన్నడ భాషలోనే నున్నవి కాని సంస్కృత పద బహుళములైయున్నవి.

'ముదిమాణిక్యం' గ్రామములోని శాసనము కేవలము సంస్కృత పదశ్లోక బద్ధమైయున్నది.

'టేకుమాలు' లో వేయించబడిన శాసనము తెలుగు భాషలో వ్రాయబడినది. తెలుగు భాషలో లభించిన శాసనమలలో టేకుమాలు శాసనమే మొట్ట మొదటిదని చెప్పవచ్చును.

## గుణాఢ్య పండితుడు

గుణాఢ్యపండితుడు శాతవాహనుల కాలమున జీవించెను. హాలశాతవాహనుని ఆస్థానవున గుణాఢ్యుడు, శర్వవర్మ మొదలగు కవి పండితులనేకులు ఉండెడివారు. హాలశాతవాహనుడు. ప్రాకృత భాషలో పండితుడు. ప్రాకృతమునధికముగా గౌరవించి పోషించెను.

హాలశాతవాహనుడు స్వయము గాధాసప్తశతిని రచించెను. శర్వవర్మ సంస్కృత భాషను ఉద్ధరించుటకై ప్రయత్నములు సల్పుచుండెను. శాతవాహనుని భార్యలలో నొకరు సంస్కృత భాషలో పాండిత్యము కలగి యుండెను. ఆమె విష్ణుశక్తికూతురు.

ఒకనాడు రాజు భార్యలతో జలక్రీడలాడుచు భార్యలపై నీళ్లు చిమ్ముచుండెను విష్ణుశక్తి కుమార్తె నీళ్లు చిమ్ముటను సహింపక

'రాజన్! మోద్కై స్తాడయ'

అని వేడుకొనెను సంస్కృత భాష తెలియని హాలుడు మోదకములు తెప్పించెను. రాణి నవ్వుచు

"మ + ఉద్కైః తాడయ "

అనగా 'నీళ్లతో కొట్టకుము ' అంటిని కాని మోదకములు జలక్రీడలోనెందులకని సంస్కృత భాష రాకపోయినను సందర్భమునైనను తెలియని రాజువని పరిహసించెను.

అందుకు రాజు సిగ్గుపడి అవమానముతో వెళ్లి ఎట్లైనను సంస్కృత భాషను నేర్చుకొనవలెనని యనుకొనెను.

ఆస్థాన పండితులైన శర్వవర్మ గుణాఢ్యుని పిలిపించుకొని తనకు సంస్కృత భాషను నేర్పుమని కోరెను. గుణాఢ్యుడు సంస్కృతమును నేర్పుటకు సమయము చాలా పట్టుననియనెను. శర్వవర్మ రాజునకు ఆరునెలలో సంస్కృత భాషను నేర్పింతునని ప్రతిజ్ఞ చేసెను. గుణాఢ్యుడిది విని ఆరు నెలలలో రాజును సంస్కృత పండితుని గావించినచో సంస్కృతము, ప్రాకృతము, దేశీయములైన మూడు భాషలను పరిత్యజింతునని పలికెను.

శర్వవర్మ కాతంత్ర్య వ్యాకరణమును రచించి తన ఉపాసనా బలముచే రాజునకు ఆరు మాసములలో సంస్కృత భాషను నేర్పించెను.

గుణాఢ్యుడు తన శపధము ప్రకారము మూడు భాషలను పరిత్యజించి అరణ్యములకు వెళ్లిపోయెను.

కొండాపూర్, ప్రాంతమున నివసించుచు పైశాచిక భాషలో 'బృహత్కథ'ను రచించి తన ఇద్దరు శిష్యులతో రాజునకు పంపించెను. రాజు ఆగ్రంధమును తిరస్కరించెను.

గుణాఢ్యుడు తాను రచించిన గ్రంధమును కాల్చివేసెను. కాలగా మిగిలిని భాగము ! 'నరవాహన దత్త చరిత్ర ' రాజునకు విషయమంతయు తెలిసినది. పశ్చాత్తాపముతో గుణాఢ్యుని చేరెను.

గుణాఢ్యుడు రాజునకు కాలిపోగా మిగిలిన 'నరవాహన దత్త చరిత్ర ' కథను ఇచ్చి పంపించెను. గుణాఢ్యుని శిష్యులైన గణదేవ, నందిదేవులను రాజు తన ఆస్థానమున సత్కరించెను.

సోమదేవుడు ఈ కథను 'కథా సరిత్సాగరము' పేరుతో సంస్కృతీకరించెను.

ఈ విధముగా మెదకు సీమలో కొండాపుర్ ప్రాంతామున ఒక 'బృహత్కథ' వెలసినది, లభించిన మేరకు ఈ సీమకిదియే తొలి గ్రంధమని చెప్పవచ్చును.

మెదకు జిల్లా సాహితీ చరిత్రలో లభించిన ఆధారాలను బట్టి సంస్కృత భాషా సాహిత్యమే ఆద్యమని చెప్పవచ్చును. సంస్కృత భాషలో రచించిన గ్రంధాలు నేటికిని ఉపలభ్యమగుచున్నవి.

ఉపలబ్దమైన సాహిత్యాధారంగా మెదకు జిల్లా సాహిత్యానికి ఆద్యుడు మల్లినాధుడని చెప్పవచ్చును.

మెదకు జిల్లాలో లభించిన శాసనాలు ఎక్కువగా కన్నడ భాషలోనున్నవి. అనగా ఆనాటి ప్రభుత్వ భాష కన్నడ భాషయే కావచ్చును.

పండిత కుటుంబాలలో సంస్కృత భాషకే ఆదరణ ఎక్కువ. రఘువంశాది పంచకావ్యాలు, శాకుంతలాది నాటకాలు, ఆలంకారిక శాస్త్ర గ్రంధాలు, వ్యాకరణం, న్యాయ మీమాంసాది శాస్త్రాలు ఆనాటి పాఠ్యాంశాలుగా నుండెను. ధర్మశాస్త్ర గ్రంధ పఠనము విశేషముగా జరుగుచుండెను. శాస్త్ర చర్చలు అధికముగా సాగుచుండెను.

శాస్త్ర పఠనము, శాస్త్రీయ చర్చలందున్న ఆసక్తి కవిత్వమునందున్నట్లు మృగ్యము. అక్కడక్కడ పండిత సభలలో, రాజదర్బారులలో, శాసనములలో, కవితా రచన జరిగియుండవచ్చును. కాని గ్రంధరచనములు సాగినట్లు కానరాదు.

అందుకే లభించిన ఆధారముల మేరకు కోలాచల పండితులనుండే సాహిత్య వ్యాసము ఆరంభింపబడినది.

## మల్లినాథుడు

వేదవేదాంగములనెరిగిన, సకల శాస్త్ర పారంగతులైన మహా వ్యాఖ్యాతలైన పండితులకు మూలపురుషుడు మల్లినాథుడు.

మల్లినాథుడు కొలిచలిమ (కొల్చారం) గ్రామములో జన్మించెను. వేదవేదాంగవేత్త, సమస్త శాస్త్రముల నెరిగినవాడు. శతావధాని, వీరరుద్రపూజితుడుగా పేర్కొనబడినాడు. ఈతడు 13వ శతాబ్దమున జీవించెను.

## కపర్ది

కపర్ది మల్లినాథుని కుమారుడు క్రీ.శ.1300 ప్రాంతమున కొలిచలిమలో నివసించెను. ఈతడు ఆపస్తంబ సూత్రుడు, కామ కాయనసగోత్రజుడు, మహా పండితుడు, పేరొందిన భాష్యకారుడు.

ఈతడు 'ఆపస్తంబ శ్రౌత సూత్రభాష్యము', 'భారద్వాజ గృహ్య సూత్ర భాష్యము,' ఆపస్తంబ గృహ్య పరిశిష్ట భాష్యము, 'శ్రౌత కల్పకావృత్తి' గ్రంధములను రచించెను. ఈతనికి మల్లినాథసూరి, పెద్దిభట్టు అను ఇద్దరు కుమారులు.

## మల్లినాథ సూరి

మెదకు జిల్లాలోని కొలిచలిమ (కొల్చారం) గ్రామములో పండిత వంశమున జన్మించిన మల్లినాథ సూరి ఈ ప్రాంతమునకేకాక యావద్భారత జాతికే కీర్తి తెచ్చిన మహా విద్వచ్ఛిరోమణియని చెప్పవచ్చును. ఈతని తండ్రి కపర్ది గొప్ప సంస్కృత పండితుడు.

మల్లినాథుడు గొప్ప వ్యాఖ్యానకర్త. మహాకవి కాళిదాసుని వాక్తత్వమును సర్వప్రపంచమునకు అందించుటకై రఘువంశాది కావ్యములకు సంజీవన్యాది చక్కని వ్యాఖ్యానములను రచించెను. తన వ్యాఖ్యల గురించి

"కాణాద తర్కోపకరణమై, పూర్వోత్తరమీ మాంసా న్యాయ రత్నోజ్వల, పాతంజలాది వ్యాకరణ సంస్కృతమై, అక్షపాద (గౌతమ) న్యాయ గాంభీర్యమైన సంజీవన్యాది వ్యాఖ్యామృత యోగమున దుర్వ్యాఖ్య విషమూర్ఛ నుండి తేరుకొని కవి హృదయము రసికభావుకలోకమునకు సువ్యక్తము కాగలదని" చాటెను.

కిరాతార్జునీయ వ్యాఖ్యారంభమున

1. "నానానిబంధ విషమైక పదైర్నితాంతం
సాశంక చక్రమణభిన్యధి యామశంకం
కర్తుం ప్రవేశమిహ భారవి కావ్యబంధే
ఘంటాపథం కమపి నూనమాతనిష్యే"

2. నారికేళ ఫల సమ్మిత వచః
భారవేస్సవదితద్విభజ్యతే
స్వాదయంతు రసగర్భ నిర్భరం
సారమస్యరసికాయధేప్సితం

శ్లోకములలో భారవి కవి అర్థగౌరవమును చెప్పుచు దానినందించుటకై తన వ్యాఖ్యానమని చెప్పినాడు.

ఈ విధముగా

రఘువంశము
కిరాతార్జునీయము
శిశుపాల వధ

నైషధములకు మల్లినాధసూరి వ్యాఖ్యలు శాశ్వత ప్రతిష్ఠను సంపాదించినవి.

'మాఘేమేఘగతం వయః'

అను వచనమును లఘుత్రయముతో మేఘ సందేశమును, బృహత్రయములో మాఘమును వ్యాఖ్యానించుట కేవలము సాహిత్యపు పోకడల అద్భుతస్థితి నవగాహన చేసికొనుటయని చెప్పవచ్చును.

మల్లినాధుడు తన వ్యాఖ్యానముల యందు విశిష్ఠ శబ్దార్థ మర్యాదలను, ఉజ్వల శబ్దార్థ గుణాలంకార చమత్కార విశేషములను, ధ్వని ప్రభేదములను, శృంగారాది రస విశేషములను, ఆయాచోట్ల ప్రతిపాదించుట ద్వారా సర్వంకషా సరస్వతిని సరసుల కందించినాడని చెప్పవచ్చును.

ఈతని గూర్చి అభినవ విద్యారణ ఆచార్య శిరోమణి శాస్త్రుల విశ్వనాధ శర్మగారు చెప్పిన ఒక పద్యము నిత్య సత్యమని చెప్పక తప్పదు.

మల్లినాధుని వ్యాఖ్యమనకు లేకున్న చో
కాళిదాసుడు మహా కవియెకాడు
మల్లినాధుని వ్యాఖ్య మనకు లేకున్న భా
రవి కవి కర్థ గౌరవమె లేదు
మల్లి నాధుని వ్యాఖ్యమనకు లేకున్న మా
ఘ కవికి త్రైగుణ్యాత ఘనత లేదు
మల్లినాధుని వ్యాఖ్యమనకు లేకున్న నై
షధమెన్న విద్వదౌషధము కాదు

ఇంతటి సంస్కృత పండిత మండనుడు మన మెదకు జిల్లాలో జన్మించగా ఈసీమ ఎంతో పవిత్రతనందినది.

## పెద్దిభట్టు

కపర్ది పండితుని రెండవ కుమారుడు పెద్దిభట్టు ఈతడు మల్లినాథసూరికి సోదరుడు. ఈతడు సంస్కృత భాషలో ఆరితేరిన పండితుడు.

"ఇత్యర్థః ఇతి భావః

అని పెద్దిభట్టు వ్యాఖ్యలు రచించువాడు.

చక్కని కవితాధార కలిగిన ధీశాలి. హాస్యప్రియుడు. ఒకనాడు ఈతని భార్య నవ్వుచూ మీరెన్నో వ్యాఖ్యలు చేయిదురు, వర్ణనలు చేయుదురు, స్త్రీ వర్ణనలనొనరింతురు. ఒక్క మారైనను నన్ను వర్ణింపరేమియని యడిగెను. పెద్దిభట్టు భార్యనుజూచి నవ్వుచు ఇట్లు వర్ణించెను.

*శ్లో॥ తింత్రిణీదళ విశాలలోచనా.*
*మేరుమందర సమానమధ్యమా*
*అర్క-శుష్క-ఫల కోమలస్తనీ*
*పెద్దిభట్టు గృహిణీ విరాజితే*

పెద్దిభట్టుకు అన్నగారైన మల్లినాధసూరిపై భక్తి విశ్వాసములు మెండు. ఈ అన్నదమ్ములిద్దరు సర్వజ్ఞ సింగభూపాలునిచే సత్కరింప బడినారు. సర్వజ్ఞ సింగభూపాలుడు 1384 నుండి 1399 వరకు రాజ్యమేలెను. కావున మల్లినాధ సూరి పెద్దిభట్టులు 14వ శతాబ్దము పరార్ధము వారని చెప్ప వచ్చును.

## కుమారస్వామి సోమపీథి

పెద్దిభట్టు కుమారుడు కుమారస్వామి సోమపీథి. ఈతడు వేదవేదాంగ పండితుడు. సమస్త శాస్త్రప్రవీణుడు.

ఈతడు ప్రతాపరుద్రీయము అను అలంకార శాస్త్రమునకు వ్యాఖ్యానమును వ్రాసెను. ఈతనికి మహాదేవాదులు నలుగురు కుమారులుండిరి.

## మహాదేవుడు

మహాదేవడు కుమారస్వామి పండితుని తనయుడు. సమస్తశాస్త్ర ప్రవీణుడు. సరళమైన కవితాధార కలవాడు.

## శంభువు

శంభువు మహాదేవుని పుత్రుడు. ఈతడు సర్వాంగీణ ప్రతిభ కలవాడు. వేదవేదాంగ పారంగతుడు. యజ్ఞయాగాదుల నొనరించుటలో దిట్ట. విశ్వ జిగద్యాగమునొనరించినవాడు.

## భాస్కరుడు

శంభువు కుమారుడు భాస్కరుడు. సమస్త శాస్త్రవములనాకళింపు చేసికొనిన ధీశాలి. ప్రజ్ఞాపాటవములు గలవాడు.

## నాగేశ్వరయజ్వ

నాగేశ్వరయజ్వ భాస్కరపండితుని పుత్రుడు. వేద వేదాంగముల నెరింగిన పండితుడు. ఈతడు సర్వతో ముఖయాజి.

## కొండిభట్టు

ఈతడు భాస్కర పండితుని రెండవ కుమారుడు ఈతడు 'వేదవేత్త' గా 'కవి' గా ప్రఖ్యాతినందెను.

## నారాయణుడు

నాగేశ్వర యజ్వకుమారుడు నారాయణుడు. ఈతని తల్లి నర్సక్క. నారాయణుడు చంపూ రామాయణమునకు పదయోజన యనుపేర వ్యాఖ్యవ్రాసెను. నారాయణుడు తన వ్యాఖ్యాన గ్రంధమున తన వంశావళిని వర్ణించెను. ఈతని వంశ వర్ణనముచే కొలిచలమ పండితుల వివరములు లోకమునకు తెలియుచున్నవి.

ఆనాడు కొలిచలమ పండిత ప్రకాండుల నిలయమని నిర్ద్వంద్వముగా చెప్పవచ్చును. ఈ మహా పండితుల కడ విద్యాభ్యాసమొనర్చిన పండితాగ్రేసరులెందరో మెదకు జిల్లాలో యుండియుండ వచ్చును. ఆనాటి పండితులు కవులై, వ్యాఖ్యాతలై, పౌరాణికులై పేరందిరి. వివిధ రాజ సభాసదనముల తమ వాగ్ధారచే పునీతముగావించిరి. అనేకుల చరిత్రలు, వారి రచనలు కాలగర్భమున కలిసిపోయినవి.

మెదకు జిల్లాలో కోలాచల సంస్కృత పండితులే కాక ఎందరో మహాపండితులు ఉండి ఉండవచ్చును.

సంస్కృత భాషలోనే కాక కన్నడ భాషలో కవిత్వము చెప్పిన కవులెందరో యుండిరి. కన్నడ భాషలో వెలసిన గ్రంధాలు ఉపలబ్ధము కాకుండుటచే ఆ కవులందరు మరుగున పడిపోయినారు.

తెలుగు భాషలో కవిత్వము ఆదికవి నన్నయ్యతో ప్రారంభమైనది. అనగా 11వ శతాబ్దమున తెలుగు కవిత్వము ఆరంభమైనది. అప్పటి నుండి ఆంధ్ర దేశమున ఎందరో కవులు తమ కావ్యముల వెలువరించినారు.

మెదకు జిల్లా ప్రాంతమున కూడా తెలుగు కవిత్వము వచ్చి ఉండవచ్చును. కాని కాలగర్భమున కలిసిపోయిన సాహిత్యమెంతున్నదో తెలియరాదు.

16వ శతాబ్దమున పొనగంటి తెలగనార్యుడు పుట్టి మెదకు సీమకొక అమూల్య రత్నమయినాడు. మల్లినాధునికన్న ముందు సంస్కృత పండితులు కాని సంస్కృతసాహిత్య సృష్టికాని మెదకు సీమ ప్రాంతమున జరిగినట్లు ఆధారము ఏమియు లభించలేదు. అందుకే ఈ సాహిత్య వ్యాసమున ఉపలబ్ధమైన మేరకు గ్రహింపబడినది. ఊహలకు తావియ్యలేదు.

## పొనగంటి తెలగనార్యుడు

తెలగనార్యుడు మెతుకు తెలుగు తల్లికి కలికితురాయివంటివాడు. ఈతని తండ్రి భావనామాత్యుడు గోలకొండ నివాసి.

పొటన్‌చెరువున కధిపతియగు అమీన్‌ఖాను తెలుగు భాషపై అత్యంత ప్రేమగలవాడు. తనకు తెలుగుపైగల ఆదరముచే పొనగంటి తెలగనార్య కవిని ఆస్థాన కవిగా నియమించి సమస్తవసతులు గల్పించెను. తెలగనార్యుడు యయాతి చరిత్ర అను అచ్చతెనుగు ప్రబంధమును రచించెను. భాషలో నిదియే మొట్ట మొదటి అచ్చ తెనుగుకావ్యము.

ఈ కావ్యమును రచించుటకు ముందు ఈ విధముగా ఆలోచించెను.

"అచ్చతెనుంగు పద్దెమొకటైనను గబ్బములోననుండినన్
హెచ్చనియాడుచుండురది యెన్నుచు నేర్పుగబొత్తమెల్లని
ట్లచ్చతె నుంగునన్ నొడువ నందుల చందమె రంగు వారు, నన్
మెచ్చరె అబ్బురంబనరొ మేలనరో కొనియాడరో ననున్."

పొనగంటి తెలగన్న యయాతి చరిత్ర మునంతయు అచ్చ తెలుగులోనే రచించి అచ్చ తెనుగు కబ్బమునకు ఆదికవిగా చరిత్ర ప్రసిద్ధిగాంచెను. ఈ ఘనత మెదకు జిల్లాకే దక్కుట ఒక గర్వకారణమన వచ్చును.

దేశ భాషాజన్యమైన అచ్చ తెనుగు ఛందో బద్ధమై, లక్షణోపేతమై సిసలైన సారస్వతమని యయాతి చరిత్రతో ప్రసిద్ధిగాంచినది.

ఈ కావ్యము తర్వాత ఎందరో కవులు తమ కావ్యములందు అచ్చతెనుగు పద్యముల నల్లిరి.

తెలగన్న కవితము కడు రసవంతమైనది. మనోహరమైనది. పద్యములు చదువుచున్నప్పుడు ధారాళముగా నుండును. ఇందు కవి సామెతలను, జాతీయములను సందర్భాను సారముగా వాడెను. మచ్చునకు.

"ఏచిననిచి పూచి కాచి పండిన యమీన్
పురము మేలి తోట లరసికాంచు
ముసలి వారికైన పసిబిడ్డలకునైన
పండ్లు వచ్చునలరు ప్రాయమొదవి"

తెలగన్నకు అమీను ఖాను ఆశ్రయమిచ్చెను. అమీన్‌ఖాను మల్కిభరాముని వద్ద ఉద్యోగి. మల్కిభరాము గొలకొండ నవాబులలో మూడవ వాడు. మల్కిభరాము క్రీ.శ.1550 నుండి 1581 వరకు పరిపాలనగావించెను. ఈ కావ్యమునందు అమీనుఖాను కుమారుడు ఫాజిల్‌షా శ్రీరంగ రాయుల కడకేగినట్లు తెలుపబడినది. తిరుమల దేవరాయల కుమారుడైన శ్రీరంగరాయలు క్రీ.శ.1574 నుండి 1585 వరకు పాలించెను. కావున యయాతి చరిత్ర ఈ మధ్యకాలముననే రచించి యుండవచ్చును.

యయాతి చరిత్ర వలన తెలగనార్యుని కాలమందలి సాంఘికాచారములనెన్నింటినో గ్రహించవచ్చును.

## పట్టమట్ట సోమనాథ కవి

ఈ కవి బిక్కనవోలు నివాసి. బిక్కనవోలు సంస్థానము మెదకు దుర్గపాలనలో నున్నట్లు మల్లారెడ్డి కవిరచించిన పద్మపురాణము తెల్పుచున్నది.

"ఘనడాకాచ నృపాల శేఖరుడు మున్గర్నాట రాజ్యంబునం
దున దుర్గాధి పతిత్వ వైభవము దోడ్తోగాంచి సుల్తాను పి
ల్చిన కృష్ణానది దాటి యామెదకు బల్ దుర్గంబు క్రిందన్ జిరం
తనమౌ బిక్కనవోలు నుండెనది యా త్రా స్థాన రాజ్యంబుగన్"

ఈతడు "సూత సంహిత," "బ్రహ్మోత్తర ఖండము" అను గ్రంధములు రచించెను.

సూత సంహితను బిక్కనవోలు ప్రభువగు కామారెడ్డికి, బ్రహ్మోత్తర ఖండమును ఆతని సోదరుడగు యల్లారెడ్డికి అంకిత మొసంగెను.

ఈ కవి సంస్కృతాంధ్ర భాషా విశారదుడు. మహామేధావి. సాహితీరంగమున నసమాన ప్రజ్ఞాధురీణుడు, భక్తిజ్ఞాన సంపన్నుడని కీర్తినందెను - ఈతడు క్రీ.శ. 1500 నుండి 1550 మధ్య కాలము వాడు.

## యల్లారెడ్డి కవి

ఈ కవి రాజవంశమునకు చెందిన వాడు. బిక్కనవోలు పాలకుడగు కాచెభూపతి పుత్రుడు. కామారెడ్డి సోదరుడు ఈతడు తర్క వ్యాకరణ వేదాంతముల నెరిగినవాడు. ఉభయ భాషలయందు అనర్గళ కవితాధార గలిగినవాడు.

యెల్లారెడ్డికవి వాసిష్ఠము లింగపురాణము అను రెండు గ్రంధముల రచించి బిక్కనవోలు సిద్ధ రామేశ్వరస్వామికి అంకిత మొసంగిరి.

ఈతని పేర యెల్లారెడ్డి పేట గ్రామము నిర్మాణమైనది. అదినేడు నిజామాబాదు జిల్లాలో తాలూకా కేంద్రముగా మండలకేంద్రముగా నున్నది. ఈ కవి క్రీ.శ. 1550-1580 మధ్య ప్రాంతమున జీవించెను.

## మల్లారెడ్డి కవి

ఈ కవి బిక్కనవోలు సంస్థానాధీశుడైన కాచరాజు కుమారుడు. కామారెడ్డి సోదరుడు క్రీ.శ. 1550 నుండి 1580మధ్యకాలమువాడు.

ఈతడు తర్క వ్యాకరణలందు పాండిత్యము గలవాడు. సంస్కృతాంధ్ర భాషలలో అసమాన ప్రజ్ఞాపాటవములు గలవాడు.

ఈ కవి 'షట్చక్రవర్తి చరిత్ర' 'శివధర్మోత్తరము' 'పద్మపురాణము' లను రచించెను.

వీరు రచించిన షట్చ క్రవర్తి చరిత్రలో నిరోష్ఠ్య ఏకాక్షర, ద్వ్యక్షర, అచల జిహ్వా, అర్ధయమక, చతుర్విధ, తలకలకట్లు ఏత్వ, గుళ్ల కందములు అర్ధయమక గీతములు కలవు. బంధ కవిత్వమున వీరు అసమాన ప్రజ్ఞగనపరచినారు.

ఆశ్వాసారంభమున సిద్ధరామమహేశా! యని తన ఇష్టదైవతమును సంబోధించి ఆశ్వాసాంతమున ఇది శ్రీమత్ "బిక్కనవోలు పట్టణ ప్రసిద్ధ సిద్ధ సరస్తటా వలంబ సాంబ సిద్ధ రామేశ్వర వరప్రసాద సమాసాదితాంధ్ర భాషా కవితా రసపోషణ విశేషతా చమత్కార గురుభక్తి విహార, రాచూళ్ల గోత్ర పవిత్ర కాచ భూపాలపుత్ర బుధజనవిధేయ మల్లారెడ్డి నామధేయ ప్రణీతంబైన" యని చెప్పుకొనెను.

మల్లారెడ్డి కవిత్వము శబ్దాలంకారములతో రామరాజ భూషణ కవిననుకరించి యుండును. వర్ణనలుకడు మనోహరములుగా నుండును.

వేటను వర్ణించు సందర్భమున వేట కుక్కను వర్ణించుచు 'చందమామలోని మృగమునైనను జంగున నెగసిపట్టు' అనుటకడు అబ్బురము గలిగించును.

ఆకాలమునందలి సాంఘిక విషయము లెన్నియో షట్చక్రవర్తి చరిత్రలో వివరించబడినవి. అచ్చతెనుగున గఃాడ మెచ్చనగు కవిత ముచ్చట గొల్పుచుండును.

ఈ విధముగా మల్లారెడ్డి కవిత్వము చమత్కార భాసురమై, నానా విధ విరాజమానమై విలసిల్లినది.

## మారేపల్లి వేంకటనర్సయ్య

మారేపల్లి వెంకటనర్సయ్య కవి మల్లన్నయోగి శిష్యుడు. ఈతని తండ్రి వేంకటభట్టు. తల్లి నర్సమ్మ. ఈతని స్వగ్రామము మారెపల్లి. ఈ గ్రామము కొండాపుర మండలమునకు సమీప గ్రామము. ఈతడు 1550-1560 మధ్య కాలమున నుండెనని తెలియుచున్నది.

ఈ కాలమున తత్త్వాలు, కందార్థములు, శైవ, వైష్ణవ, దేవతలను నుతించు పద్యములుగల శతకములు, భక్తి వైరాగ్య ప్రపూరితములైన వెన్నో వెలువడినవి. ఈ కవి కూడ తత్త్వజ్ఞాన పరిపూర్ణుడు. "తత్త్వదీపికా ప్రబోధము" అనుద్విపదరచనగావించెను.

మెదకు జిల్లాలో ఇట్టి అజ్ఞాత కవుల సంఖ్య ఎక్కువగా నున్నట్లు గోచరమగుచున్నది.

## లక్ష్మీశకవి

లక్ష్మీశకవి అల్లాదుర్గమునకు సమీపమున నుండు దేవునూరు గ్రామమున నివసించుచుండెను. ఈతడు దాదాపు తెలగనార్యుని కాలమువాడు. అనగా 16వ శతాబ్దివాడు. అల్లాదుర్గ ప్రాంతమునందలి శాసనములన్నియూ కన్నడ భాషలోనే గలవు. త్రిభువనమల్లదేవ నాలగవ విక్రమాదిత్యుని కాలమున అల్లాదుర్గమును ఆహవమల్ల పరమనంది యనురాజు పాలించినట్లు శాసనముల వలన తెలియచున్నది.

లక్ష్మీశకవి భారద్వాజ గోత్రుండు. అణ్ణమాంకుని పుత్రుండు. సంస్కృత జైమినీ భారతము 68 అధ్యాయములుగల మహా గ్రంథము. దీనిని సందర్భోచితముగా పెంచి కన్నడమున నొక మహా కావ్యమును రచించెను.

ఈతనికి 'చూతవన చైత్ర' అను బిరుదము కలదు.

## గోపతిలింగకవి

పదుహారవ శతాబ్దాంతముననో, పదునేడవ శతాబ్దారంభముననో వెలసిన వీరమాహేశ్వరాచార సంపన్నుడు గోపతిలింగ కవి ఈతడు అంగడి మఠం వీరశైవాచార్యులకు శిష్యుడు. ఇంటిపేరు తుమ్మావారు తాత శివరామలింగం. లింగమాంబా పాపయ లింగములు ఈతని తల్లిదండ్రులు ఈతడు సంగారెడ్డి పేట నివాసి. కాసాల పరబణ్ణకు అంకితంగా చెన్నబసవపురాణము అనే ఐదాశ్వాసాల పద్య ప్రబంధమును వ్రాసెను. తన కంటే ముందే సోమనాథుడనే కవి ద్విపదలో చెన్న బసవపురాణం రచించినట్లు కూడా చెప్పినాడు.

గోపతి లింగకవి రెండవ కృతి అఖండ జ్ఞాన మునః ప్రబోధ వచన కావ్య బంధము దీనిని తోటమఠాధిపతికి అంకిత మిచ్చినాడు. అందులో గురువర్ణనం.

తోటమఠమున నమిత సంతోషమునను
సంతతానందమయ పచ్చకాంత భంగి
మనగురుస్వామి భువి భక్త గణమునేలు
కొనుచు ద్వేశముల పూజగొనుచు నుండె

ఈ రెండు తాళ పత్ర గ్రంథాలు ఉస్మానియా విశ్వవిద్యాలయంలోనున్నవి.

సురు చిర గ్రంథము నారును
వరసుస్తవ మొకటి బెక్కు వచనంబులు సు
స్థిర శతకములైదును శ్రీ
కరకేదారేశునోము కథయును మరియున్

మంగళాష్టకంబులును, విఘ్నేశ్వర, వీరేశ్వర, మల్లేశ్వర రామేశ్వరాష్టకంబులును, శారదపదంబులును, జాజరపదంబులును నివి మొదలుగాగల కృతులును భక్తి మహేశ్వరానందకరంబుగా చెప్పినాడట. ఇవన్నియు అలభ్యములే.

## ముదిగొండ బ్రహ్మయ్యలింగము

వీరు మెదకు జిల్లాలోని టేకుమాలు వాస్తవ్యులు. సుమారు క్రీ.శ. 1700 ప్రాంతమున జీవించిరి.

బ్రహ్మయ్యలింగముగారు 'శివరహస్యఖండము' అను వచన కావ్యమును రచించిరి. ఇది అముద్రితము ఈ కావ్యము ప్రేఢశైలికల వచన కావ్యము.

ఈ కవిని గూర్చి గొలకండకవుల సంచికలో ప్రస్తావించబడినది.

## కోమిశెట్టిపల్లి తమ్మయ్య

కొమిశెట్టిపల్లి తమ్మయ్య 18వ శతాబ్దము ఉత్తరార్ధమున జీవించియుండెను.

ఈతడు కాశ్యపగోత్రుడు, ఋగ్వేదుడు. కుద్మాజి పౌత్రుడు. అప్పయామాత్యుని పుత్రుడు. కొమిశెట్టిపల్లి గ్రామ వాస్తవ్యుడు. శ్రీ శేషాద్రి వెంకటేశుని చరణాబ్జముల పూజ సల్పి ఆదేవుని వరలబ్ధినంది వర ప్రబంధముల చెప్పెను. వేదవేదాంత శాస్త్రములను, సంగీత సాహిత్య శృంగార నాటకాలంకారములను, అమిత పురాణేతి హాసముల చెప్పు నేర్పును గల్గి పురారిభక్తుడునై కవితా ప్రబంధముల చేయువాడు.

ఈతని కవితా గురుడు కోవూరి వాసుడైన భీమయ కోవూరు కొమిశెట్టి పల్లి గ్రామములు ఝరా సంగమునకు సమీప గ్రామములు

తమ్మయ్య "నాగరాజు చరిత్రము" 'కేతకీ సంగమేశ్వర మహాత్మ్యము' అను పద్యకావ్యముల మత్స్యావతారకథ, భారతము, సావిత్రి అను యక్షగానములను రచించెను.

ఇన్ని గ్రంథములలో కేతకీ సంగమేశ్వర మహాత్మ్యము మాత్రము శ్రీమఠం సిద్ధి వీరయ్యగారి సంపాద కత్వమున ప్రచురింపబడినది.

మిగిలిన వన్నియు అలభ్యములు. ఈ కవి శ్రీశేషాద్రి వెంకటేశ్వరు భక్తుడైనను శివపారమ్యమైన కథను రచించి శ్రీ సంగమేశ్వరునకే అంకితమిచ్చి హరిహరాద్వైతమును పాటించెను.

కేతకీ సంగమేశ్వర మహాత్మ్యమను కథ బ్రహ్మాండ పురాణము నుండి గ్రహింపబడినది. ఈ కవి పురాణ కథను మక్కీకి మక్కీగా కాక స్వతంత్ర కథవలె రచించెను.

ఈ కావ్యము షష్ఠ్యంత్యములు, అష్టాదశ వర్ణనములు మొదలగు ప్రబంధ కవి తాలక్షణాలతో మృదు మధురముగా సాగినది.

ఈ కావ్యమును గూర్చి విమర్శ కాగ్రేసురుడైన శివశ్రీబండారు తమ్మయ్యగారు ఇట్లు వ్రాసిరి *"ఇతడంత విశుద్ధమైన పాండిత్యము గలవాడు కాడు. కేవలము అప్రౌఢుడునుకాడు. కవి లలితమైన కవితా ధారకలవాడుగనే గన్పట్టును".*

బ్ర.శ్రీ పెరవలి లింగయ్య శాస్త్రిగారు ఈ ప్రబంధమును గురించి ఇట్లు నుడివిరి.

"కవిత సరళ సుందరము, నవరసభరితము. అటనట ఛందోవ్యాకరణ స్ఖాలిత్యములు కన్పట్టుచున్నవి. కవి భక్తి పారవశ్యముననో, వ్రాయసకాండ్ర అనవధానత వలననో అవి దొరలి యుండవచ్చును. ఐనను కథాగమనమునకు, రసాస్వాదనమునకు అవియడ్డుపడవు."

వచ్చునకు ఒకటి, రెండు పద్యములు

"భూసురుల సంగమంబున
వాసిగ గాయత్రి మూడు వాసరములు సం
తోసము తోడ జపించిన
భాసురముగ నిష్టసిద్ధి ఫలియించున్నహా"

తమ్ముల గప్పుక ఝుమ్మను తుమ్మెద
రవములు వీణాది రవము గాగ
కలకలమనుచు గ్రొక్కారంబులను జేయు
ఖగ శబ్దములు తాళగతులుగాగ

పై పద్యమును గమనించ కవి ప్రకృతి వర్ణనను కడు అందముగా వర్ణించగల దిట్టయనియు. శబ్దముపై సాధికారము గలవాడని యుతో చుచున్నది.

## వేంకట పౌండరీకయజ్వ

వీరు కుక్కునూరుపల్లి గ్రామమున జన్మించిరి 25 సంవత్సరముల వయస్సునకు ఘనాంతము నభ్యసించిరి పౌండరీకాంతశ్రౌత ప్రయోగ త్రయమును నేర్చిరి. సంగీత, జ్యోతిష విద్యలందును చక్కని ప్రవేశము గలిగి యుండిరి.

అసామాన్య సాహితీ విద్యన భ్యసించి సంస్కృతాం ధ్రాములందు కవిత్వమును గట్టిగా చెప్పగలిగినదిట్ట. వీరు వరక వులని, ఉపాసనాబలము కలవారని ప్రసిద్ధి నందిరి వీరు అవధానశ్లేష, యమక, గర్భబంధ, రచన ధారాశుద్ధిగా చేయగల సమర్థులు.

వీరు శ్రౌత సూత్ర వివరణమును రచించిరి భాగ్యనగర మారియను వీరి శ్లోకములు గోలకొండ కవుల సంచికలో ముద్రింపబడినవి.

శ్లో॥ వీధ్యాం వీధ్యాం మందిరే మందిరేన
గోష్ఠే గోష్ఠే చత్వరే చత్వరేచ
వణ్యే వణ్యే యత్రను త్రాపిజంతు
ర్వారం నారం మార్గితో వాన దృష్ట॥

శ్లో॥ ఏనం మహా మారిక యాజినానా
మ భూతయః పూర్వకృతాఘ దోషాత్
సోప్యాది దేవీ చరణార వింద
స్మృత్యాపునర్నైవ భవత్ కదాపి. ॥

యమక శ్లేష చక్రవర్తి యామవరం రామ శాస్త్రిగారు వీరి శిష్యులని తెలియచున్నది.

వీరు దొంతి సంస్థానమున ఆస్థాన విద్వాంసులుగా నుండిరి.

## కొంపల్లి దుర్గాగ్నిహోత్రి

దుర్గాగ్ని హోత్రి సంస్కృతాంధ్ర భాషలలో పండితులు.

వీరు చందంపేట సమీపమునందలి సంగమేశ్వర దేవాలయమున నివసించుచుండిరి. 1893వ సం. వీరు జన్మించిరి. సంగమేశ్వర దేవాలయ జీర్ణోద్ధరణకై అనేక శ్రమ మొనర్చిరి. వీరు ఆధ్యాత్మిక జ్ఞాన సంపన్నులు. నిత్య శివపూజాదురంధరులు.

వీరి రచనలు 'కృష్ణగారడి హరికథ', 'ఋష్యశృంగ న్యాయశతఘ్ని', 'విజయ భాస్కర కర్ణకవచప్రదానము', వాల్మీకి హృదయము, బీష్మభాషణము, సంగ మేశ్వర శతకము, సంస్కృతమున మార్కండేయ పురాణమును రచించిరి.

వీరిగ్రంథములు కొన్ని ముద్రింపబడినవి. మరికొన్ని అముద్రిత ములు గనేయున్నవి.

## రాణి సర్దేశాయి వెంకట లక్ష్మాయమ్మ

వీరు అందోలు సంస్థానాధీశులు. వీరి భర్త రాజావెంకట దుర్గారెడ్డిగారు

రాణిగారు స్వయముగా కవియై తన సంస్థానమున యితర కవులను పోషించెను.

ఈమె అష్టైశ్వర్యములతో తులతూగినప్పటికి సంసారము సారములేనిదని, అశాశ్వతమైన సుఖములకు అర్రులు చాచరాదని వేదాంత మార్గమున నున్నట్లు ఈమె కవితల వలన తెలియుచున్నది.

ఈ కవయిత్రి మానసబోధ యను పద్యగ్రందమును వ్రాసెను. ఇందు మకుటము గలిగిన పద్యములుండి శతకము వలెయగు పడుచున్నవి.

*1.* *అంగమా! యదికడు క్షణభంగురంబు*
*సంపదది యెన్న మిగుల చంచలముగాంచ*
*కాలుడు సమీప వర్తియై కాంచుచుండు*
*హరిని ధ్యానించు మానంద మబ్బుమనసా*

*2.* *సారమునులేని సంసారసాగరమున*
*మునిగి పుట్టుచు గిట్టుచు మోహమొంది*
*దరిని గానవు నీబాట నెరగలేవు*
*హరిని భజియించుమానంద మబ్బుమనసా*

వీరిని గూర్చి గోలకొండ కవుల సంచికలో ప్రస్తావించబడినది.

## శ్రీహరిపురం రామయ్య

శ్రీహరిపురం రామయ్యగారు కొండపాక మండలము నందలి వేములఘట్టు గ్రామమున నివసించిరి.

18వ శతాబ్దాంతమున హరిదాస వర్తనులై జీవించిరి వీరి తండ్రి లక్ష్మయ్యగారు.

ఈ కవి రచించిన కొండపాక రామాయణము అలభ్యము. కాని అలువాల వేంకటేశ్వర శతకము హరిపురం వేంకటరామయ్యగారిచే సేకరింపబడి 'పల్లెటూరు' పత్రిక ద్వారా వెలువరింపబడినది.

ఈ శతకమునందు కవితనను గూర్చియిట్లు చెప్పు కొనినాడు

వసుధలో హరిపుర వంశ సంభవుడను
 లక్ష్మణాగ్రతనూజ లక్షణుండ
ఘనతర ద్రవిడ శాఖ ప్రవర్తనుడను
 వర్ణింప హరిదాస వర్తనుండ
పరతంత్రయ జ్ఞాన పరతంత్ర హృదయుండ
 నై కొండపాక రామాయణాది
కృతులొనరించి సంస్తుతిజెంది భవదీయ
 నామాంకితముగ న్నిర్ణయముజేసి
సీసశతకంబు రచియించి జేరినాడ
రామకవి నన్ను రక్షింపు రమ్యచరిత
భువన హరిపాల యలువాలపురవిలోల
విగత భవ పాశ లక్ష్మీశ వేంకటేశ

ఘనముకుందాభి దాన సంకలితునిన్ను
దరసిలోకైక సౌఖ్యముల్ దడవ వలెనె
భువన పరిపాలయలు వాల పురవిలోల
విగత భవపాశ లక్ష్మీశ వేంకటేశ

## కృష్ణమాచారి

కృష్ణమాచారిగారి స్వగ్రామము దొంతి. వీరి తండ్రి బాలకృష్ణమాచారి విశ్వ బ్రాహ్మణకులజులు.

ఈ కవి తెలుగుబాషలో ఆశువుగా పద్యములల్లు నేర్పుగలవాడు మచ్చునకు.

మూతులుగట్టి యెద్దులవి ముంగట నిల్వగ ధాన్యరాసులన్
ఖ్యాతిగ సంచిబోసి తినుమందరు గుల్లమునోటి కేర్పడన్
చేతలు యెడ్లు చేయునవి చెల్లవు మేతకు; గుల్లమేతగున్
వాతలు వేతురయ్య బలవంతులు సాధవులైన యెడ్లపై
నీతికి నిల్చువాని గతి నిక్కము యీ విధమేనుయిద్దరన్

## బచ్చురామన్న గుప్త

సదాశివపేట వాస్తవ్యులైన బచ్చురామన్నగుప్త గారు వైశ్యకులస్థులు. వీరు ఎల్లయ్యగారి మునిమనుమడనని, శివలింగయ్యగారి పౌత్రుడనని, కృష్ణయ్యగారి పుత్రుడనని చెప్పుకొనినారు.

రామన్న గుప్త సంపన్న కుటుంబమున జన్మించిరి. సంస్కృతాంధ్రములందే గాక అనేక భాషలనెరిగినవారు, దృఢవ్రత సంకల్పులు. విఠల రాములు వీరి గురువర్యులు.

బచ్చురామన్నగుప్తగారు 'నవనాథచరిత్ర' రచించిరి. ఇందు కలియుగ శతాబ్దంబులు ఇరువది ఏడునూర్లు మొదలుకొని మూడువేల సంవత్సరముల వరకు జన్మమందిన మహామహుల చరిత్రములు వర్ణింపబడినవి.

ఈ చరిత్రమును పూర్వము గోరక్షనాథుడు కీమ్యాగర భాషలో రచించెను. పిమ్మట దండి రాజకుమారుడగు మాతాపండితుడు మహారాష్ట్రభాషలో ఓవీ బద్ధముగ రచించెను.

మహారాష్ట్ర భాషలో పండితుడైన రామన్న గుప్తగారు ఈ చరిత్రను ఆంధ్రీకరించెను.

ఈ నవనాధ చరిత్రమునందు మత్స్యేంద్రనాథ గోరక్షనాథ, గహినీనాథ, జీలాందరనాధ, కానీపనాథ, భర్తరీనాథ, నటసిద్ధనాథ, రేవణ సిద్ధనాథ, జర్పటనాథులైన నవనాథు చరిత్రలు వర్ణింపబడినవి.

నవనాధ చరిత్ర గ్రంధమును రచించుచు కవిగారిట్లు వ్రాసిరి.

నిరవధిక సుఖమగు య్
పరమాద్భుతనాథ చరిత బ్రాశస్త్యము మున్
వర కేమ్యాగర భాషన్
స్థిరమతి గోరక్షనాథ సిద్ధుడు వ్రాసెన్

పై పద్యము వలన వీరు వచన రచన యందేగాక హృద్యములైన పద్యములల్లుట యందును ప్రజ్ఞగల వారని తెలియుచున్నది.

వీరు క్రి.శ. 1884న జన్మించి 1954న పరమపదించినారు.

## భాగవతం సీతారామ శర్మ

భాగవతం సీతారామ శర్మగారు మెదకు వాస్తవ్యులు. కౌండిన్యస గోత్రులు. వీరి తండ్రి రామన్నగారు సంస్కృతాంధ్రములందు చక్కని ప్రవేశము కలవారై తనకున్న సాహిత్యమును ధర్మ ప్రచారమునకు వినియోగించిరి. మెదకులో ప్రభుత్వ పాఠశాలలో పండితులుగా పనిచేసిరి.

వీరు ఉపాధ్యాయవృత్తితో పాటు వైద్యవృత్తిని కూడా ఆచరించుచు ఆయుర్వేద కుటీరమును స్థాపించి రోగాతురులకు చికిత్స చేయుట ద్వారా మానవసేవను గావించిరి.

తత్వబోధినీ గ్రంథమాలను స్థాపించి కొన్ని గ్రంథములను ప్రకటించిరి.

**వీరు గావించిన రచనలు :-**

1. భక్తి శిరోమణీ ఉద్ధవుడు
2. స్మరణ భక్తి శబరి
3. దేవర్షి నారదుడు
4. గీతా శ్రీకృష్ణుడు
5. గీతాసాకారోపాసన
6. ప్రతిమార్చనము

7. "అనుసూయ" రజకాగ్ని

8. శ్రీమహాశివరాత్రి (పద్యకావ్యం)

9. సంగమేశ్వర తారావళి పద్యములు

10. పశ్చాత్తాపము (నవల)

11. వినాయకచతుర్థి (పద్యములు)

12. శ్రీమదాంధ్ర మహాభారత దర్పణము

13. వైద్యనిఘంటువు(అసంపూర్ణము)

14. దేవకీనందన శతకము

15. మేలుకొలుపు (అసంపూర్ణం)

వీరు ప్రతిభావంతులయిన కవులు పద్యమును గద్యమును సమానముగా రచించునంతటి పండితకవులు.

వీరి రచనా విధానమునకు ఉదాహరణముగా నొకపద్యము.

పతిభావంబు నెరింగి సంతతము లోపంబింత లేకుండ సన్మతినే
సేవ సమాచరించు సతికిన్ మాన్యంబు చేకూరుసం
తతియున్ కీర్తియు శోభనంబు గలుగున్ ధర్మంభు వర్ధిల్లు నీ
గతి వర్తించెడు కాంత ధన్యయగు దుర్గా రాజరాజేశ్వరీ

## వెల్దుర్తి మాణిక్యరావు

జన్మస్థలమే ఇంటి పేరుగా గలిగిన మాణిక్యరావుగారు మెదకు జిల్లాలోని వెల్దుర్తి (మండల కేంద్రము) లో జన్మించిరి.

రావుగారు విద్యాభ్యాసమునకై హైద్రాబాదు జేరియచ్చటనే స్థిర నివాసమేర్పరచుకొనిరి.

తెలుగు, ఉర్దూ, మరాఠీ, హిందీ, ఆంగ్ల భాషలలో మాణిక్యరావు గారికి చక్కని ప్రవేశము గలదు.

భారత స్వాతంత్ర్య సంగ్రామమున, ముఖ్యముగా నిజాం నిరంకుశ పాలనకు వ్యరేకముగా వీరు ఎన్నో ఉద్యమములలో పాల్గొనిరి.

తెలంగాణమున అవిద్యయే అజ్ఞానమునకు మూలమని భావించి విద్యావ్యాప్తికై గ్రంధాలయోద్యమములోని భాగముగా అణా గ్రంధమాలను స్థాపించి ఆంధ్రలోకానికే జాగృతిని కల్గించిరి.

మాణిక్యరావుగారు చక్కని రచయిత. ప్రభోధకరమగు రచనలు, సాంఘిక దురాచారముల విమర్శించు రచనలు వీరి కలము నుండి జాలువారినవి.

వీరిని గురించి గోలకొండ పత్రిక కొండంత చెప్పుకొనినది. రావుగారు సీతాపెండ్లి, బంగారు లేడి, దయ్యాల కథ, మున్నగు ఎన్నో రచనలు గావించిరి వీరి రచనకొక ఉదాహరణ.

మరుపులోనే జగము మనుచుండు నిజము
ఆలుమోమును జూచి ఆపదను మరచు
పిల్లలాటలు జూచి పస్తులే మరచు.

## సిరిశనగండ్ల శ్రీనివాసాచార్యులు

మెదకు పట్టణం నివాసస్థానంగా గల శ్రీనివాసాచార్యులు రామాచార్యుల కుమారుడు. రామాచార్యుల వారు మంత్ర , తంత్ర, ఆగమ, జ్యోతిష, వైద్యశాస్త్రములందు పండితుడు. శ్రీనివాసాచార్యుల వారు చాలా కాలము మెదకులో ఉపాధ్యాయ వృత్తి నిర్వహించిరి.

వీరు రచించిన ' మెతుకుసీమ ' పద్య కావ్యం పలువురు పండితుల ప్రశంసలు నందినది. వీరి శైలి అలతి అలతి పదములతో ద్రాక్షా పాకమున మృదుమధురముగా నుండును.

ఈ పద్యకావ్యమును తిరుమల వేంకటేశ్వరునకు అంకితముగా నొసంగిరి.

ఆ కావ్యమునందలి ఒకటి రెండు పద్యములు.

మెతకు సీమలో మెతుకుకై వెతుకు జీవి
ఎక్కడైనను లేకుండ నిక్కమైన
మెతుకు సీమ ఇదేయన మెలగినావు
దయకు నిధివమ్మ మంజీర ధన్యవమ్మ

ఏడుపాయల దుర్గమ్మ నేదిగోరి
వేడుకొందురొ వారల వేడ్కమీర
కామితమ్ముల నీడేర్చి కరుణతోడ
నేమి కొరతయు లేకుండ నేలుచుండు

## అభినవ విద్యారణ్య, శిరోమణి శాస్త్రుల విశ్వనాథ శర్మ

మెదకు జిల్లాలో 20వ శతాబ్దంలో సాహితీ వినీలాకాశంలో మొలచిన ఒక మహోజ్వల తార శాస్త్రుల విశ్వనాథశర్మ. మండల కేంద్రమయిన శివంపేటలో సనాతన వైదిక కుటుంబంలో శాస్త్రుల వంశంలో అన్నపూర్ణా గుండయ్య శాస్త్రుల ద్వితీయ సంతానంగా జన్మించిన విశ్వనాథుడు శాస్త్రుల వంశంలోనే కాక సమస్త శాస్త్రీయ పండిత లోకానికే అద్వితీయుడయినారు. చిన్ననాట కొంతకాలం సీతారాంబాగ్ వేదాంత వర్థినీ సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసం చేసి మద్రాసు నగరమునకేగి అచట సంస్కృత, సాహిత్య, తర్క, మీమాంసాలను ఆపోశన పట్టాడు. వీరు నిరంతర జిజ్ఞాసువులు వేదాంత శాస్త్రాన్ని ప్రత్యేకంగా అభ్యసించారు. సాహిత్య శిరోమణి పట్టాను పుచ్చుకున్నారు.

కొంతకాలం కరపాత్ర స్వామీజీ స్థాపించిన రాంరాజ్ పరిషత్‌లో స్వచ్ఛందంగా పనిచేసినాడు. శృంగేరీ శంకరాచార్యులకు ఆప్తులుగా మెదిలినారు. కాశీ విశ్వవిద్యాలయంలో గౌరవాదరాలను పొందినారు. హైదరాబాద్ నగరంలో వీరిని ఏనుగు అంబారీపై ఎక్కించి ఊరేగింపు జరిపినారు. అనేక శాస్త్రీయ చర్చల్లో పాల్గొని తన ప్రతిభాపాటవాలను ప్రదర్శించినారు. అనేక యజ్ఞయాగాదులకు ఆద్యులుగా నిర్వాహకులుగా ఉన్నారు.

వీరు ఆయుర్వేద వైద్య శాస్త్రమును అభ్యసించి రోగ నిర్ధారణలో అందె వేసిన చేయిగా చికిత్సా భాగమున చిరకీర్తి నందినారు. కొంతకాలం మున్నాలాల్ సంస్కృత పాఠశాలలో పనిచేసినారు. మరికొంత కాలం భారతీయ వైద్య పరిశోధనా విభాగం హైదరాబాదులో పనిచేసినారు.

ఇంతటి మహాపండితుడు వివిధ ప్రభుత్వ ఉన్నత పాఠశాలల్లో 8,9,10 తరగతుల విద్యార్థుల స్థాయికి దిగి విద్యార్థులలో భాషపట్ల మమకారాన్ని, భాషపై అధికారాన్ని కలిగేలా విద్యాబోధనగావించారు. నేటికీ ఎందరో విద్యావంతులు శాస్త్రిగారి వద్ద చదువుకున్నామని సగర్వంగా చెప్పుకుంటారు.

సనాతన సంప్రదాయంపై వైదిక విద్యపై సంస్కృత భాషపై ఉన్న మమకారంతో శాస్త్రిగారు వేద పాఠశాలను ప్రారంభించారు. 10 సంవత్సరాలలోపు విద్యార్థులను పాఠశాలలో చేర్చుకొని పది సంవత్సరాల పాటు నిరంతర వేదాధ్యయనం చేయించి చక్కని వేద పండితులుగా తీర్చిదిద్దేవారు. ఈ పాఠశాల కొరకై తన జీవిత సర్వస్వాన్నీ ధార పోసినారు. ఉద్యోగ రీత్యా మెదకునకు బదలీ అయినప్పుడు పాఠశాలను తనవెంటే కొంపోయినారు.

విశ్వనాథ శాస్త్రిగారు సంస్కృతాంధ్ర భాషలలో సరసమైన కవిత్వము చెప్పగల నేర్పరి. ఏకకాలమున సంస్కృతములోనూ తెలుగులోనూ అష్టావధానములు చేసిన సాహితీమూర్తి. ఏడుపాయల దేవస్థానము వారి కోరిక మేరకు దేవాలయ చరిత్ర, సుప్రభాతం రచించినారు. "సంస్కృత శతాబ్దీ" గ్రంథాన్ని రచించి ప్రధానమంత్రి లాల్ బహద్దూర్ శాస్త్రిగారి చేతుల మీదుగా బహుమతి నందుకున్నారు.

వీరికి శిరోమణి, అభినవ విద్యారణ్య బిరుదములు లభించినవి. వీరు 1985లో పరమపదించారు.

## దోర్బల విశ్వనాధ శర్మ

20వ శతాబ్దంలో మెదకు జిల్లా వరకేగాక ఆంధ్రరాష్ట్ర స్థాయిలో చెప్పుకొన దగిన పేరెన్నికగన్న కవి పండితులలో ప్రముఖులుగా ఉండి సాహిత్య అద్వైత, తాత్విక సేవ గావించిన మహా.మనీషి దోర్బల విశ్వనాథ శర్మగారు.

విశ్వనాథ శర్మగారు అనంత లక్ష్మమ్మ రత్నయ్యల జ్యేష్ఠ కుమారులు. రామాయంపేట వాస్తవ్యులు. తేది. 7-6-1933న రామాయంపేటలో జన్మించిరి.

చిన్ననాటి నుండి సంస్కృత భాషను గురుకులములో అభ్యసించిరి. సంస్కృతము ఆంధ్రము ఆంగ్లము హిందీ భాషలలో పరిపూర్ణమైన పాండిత్యమును సంపాదించిరి.

### వీరి రచనలు

***మూకపంచశతి***

*(అయిదు శతకములు ఆంధ్ర వ్యాఖ్యానంతో)*

***హరిమీడే , శివ మీడే***

*(స్తోత్రములు ఆంధ్ర వ్యాఖ్యానంతో)*

***శ్రీలాలిత్యము***

*(సంస్కృతాంధ్ర పద్యసహస్రములు)*

***మహిమ్న స్తోత్ర పంచకానువాదము***

***హలాయుధ శివస్తోత్రము***

*(ఆంధ్ర వ్యాఖ్యానము)*

***చండీ శతకము*** *ఆంధ్ర వ్యాఖ్యానము*

***శివకర్ణామృత స్తోత్రము*** *(3 భాగములు ఆంధ్ర వ్యాఖ్యానముతో)*

***శివసప్తతి ఆంధ్ర పద్యానువాదము***

ఆదిత్య హృదయము ఆంధ్ర పద్యానువాదము

ఇవేయేకాక సంస్కృతాంధ్ర భాషలలో ఇప్పటి వరకు పదివేల పద్యాలు రచించారు.

కొంత కాలము ఉపాధ్యాయులుగా ఉపన్యాసకులుగా ప్రాచార్యులుగా పదవులు నిర్వహించి అనేక మంది విద్యార్థులకు విద్యాదానమొసంగిరి. ప్రస్తుతము పదవీ విరమణ గావించి రామాయంపేట స్వగృహమున నివసించుచు దైవచింతనా సక్తులై తత్త్వ ప్రచారముతోపాటు సాహిత్యసేవ యొనరించు చున్నారు.

### మూలం పల్లి రాజశేఖర శాస్త్రి

శ్రీ మూలంపలి రాజశేఖర శాస్త్రిగారు దుబ్బాక మండలము నందలి లచ్చపేట గ్రామమున క్రీ.శ. 1920లో పరమమహేశ్వరులైన చండికాంబా శివలింగారాధ్యులకు జన్మించిరి.

శాస్త్రిగారి ప్రాథమిక విద్య స్వగ్రామంలోనే అయ్యవారు నాగమల్లయ్య పంతులుగారి వద్ద జరిగినది.

శాస్త్రిగారి తండ్రి గొప్ప సంస్కృతాంధ్ర పండితులు. కావున రాజశేఖర శాస్త్రిగారు కొంతకాలం తండ్రిగారి వద్ద సంస్కృతాంధ్రముల నధ్యయనము చేసిరి. ఆ తర్వాత బ్ర. శ్రీ అనుముల మహాదేవశాస్త్రి గారి వద్ద సంస్కృత పంచ కావ్యాలను, మల్లాది ఫాలాక్ష శాస్త్రి గారి వద్ద వ్యాకరణ శాస్త్రాన్ని, బ్ర. శ్రీ వంకా విశ్వనాథ శాస్త్రి గారి వద్ద తర్క శాస్త్రాన్ని, శంకర

గీతాభాష్యాలను, మహా మహోపాధ్యాయ శివయోగి మునిగొండ నాగలింగ శాస్త్రి గారి వద్ద నీలకంఠభాష్యాన్ని, మోడ్తాడ్ ప్రవీణ కృష్ణమాచార్యుల వద్ద శ్రీకర భాష్యాన్ని, జ్యోతిషశాస్త్రాన్ని అభ్యసించారు. ఝాన్సీ నుండి ఆర్.యం.పి. ఆయుర్వేద పరీక్షలో ఉత్తీర్ణులైనారు.

శాస్త్రిగారికి సంస్కృతాంధ్రములతో పాటు మహారాష్ట్ర, హిందీ, ఆంగ్లేయ భాషలతో కూడా చక్కని ప్రవేశము గలదు.

రాజశేఖర్ శాస్త్రి గారు

1. హిందూవర్ణప్రబోధం, జ్ఞానేశ్వరి వ్యాఖ్యానంపై విమర్శనాత్మక వ్యాసం.
2. శివగీత పద్యానువాదం
3. విగ్రహారాధనమండనం
4. నీలకంఠ భాష్య ఆంధ్రానువాదం
5. శ్రీనాథ విజయం అను పద్యకావ్యాన్ని రచించినారు.

శాస్త్రి గారి పద్యరచన సరళగంభీరమై చదువరులకు ఆసక్తిని గల్గించునదిగా నుండును.

వీరి రచనాపటిమ కొక ఉదాహరణ

పుట్టరు పుట్టబోరు తన పొట్టను నైషధమాంధ్ర భాషలో
దిట్టతనాన వ్రాయగల ధీవరులంచు కృశించి మంచమున్
బట్టిన ఆంధ్రభారతికి బాపురె ! ఆరయ విద్వదౌషధ,
మ్మిట్టిది వాడనీ గలిగితేసుకవీ ! తలలూపరే కవుల్.

(శ్రీనాథ విజయ కావ్యము నుండి).

రాజశేఖర శాస్త్రిగారికి 'సనాతన ధర్మప్రచారకేసరి' 'నీలకంఠ భాష్య ప్రవచన' అను బిరుదములు కలవు.

రాజశేఖర శాస్త్రిగారు సరస కవిపుంగవులేగాక, సాహితీ సేవాదురంధరులని చెప్పుటకువారు లచ్చపేటలో మెదకు మండల సాహిత్య పరిషత్ కార్యక్రమాల నేర్పాటు చేసి దిగ్విజయమొనర్చిన తీరు నిదర్శనము.

## రిమ్మనగోడు రఘురామ శాస్త్రి

రఘురామ శాస్త్రిగారు గజ్వేల్లి మండలము లోని రిమ్మనగోడు గ్రామ వాస్తవ్యులు.

శాస్త్రిగారు సంస్కృతాంధ్రములలో గొప్ప పండితుడు. ధార్మిక సేవకు తమ జీవితమునంకితము చేసినారు. చక్కని పౌరాణికులుగా కీర్తి ప్రతిష్ఠలనందు కున్నారు.

శాస్త్రిగారు "రాజరాజేశ్వర శతకమును" ఏకప్రాసతో రచించిరి. వీరు రచించిన "గోమాత పద్యములు" చక్కని భావస్ఫోరకములు. భావానంద యతీంద్రుని జీవితాన్ని ఆధారంగా చేసుకొని "భావానంద చరిత్ర" ను రచించిరి. "వ్యాస తాత్పర్య నిర్ణయం" అను గ్రంధమును కూడా వీరు రచించి ప్రచురించిరి.

## ఘంటంభట్ల వేంకట భుజంగ కవి

వేంకట భుజంగకవి ఆశ్వలాయన సూత్రుడు గార్గేయ గోత్రజుడు. నాగార్య లచ్చమాంబల పుత్రుడు, రాఘవాచార్య శిష్యుడనని తనను గూర్చి చెప్పుకొనిరి.

వీరు అభినవశాకుంతలము అను నాటకమును వ్రాసిరి ఇది ముద్రించబడినది. ఇందు నాలుగు అంకములు గలవు. వీరి అధ్యయనోత్సవ వర్ణనము, దమయంతీ పరిణయము ముద్రితం కాలేదు.

వీరు రచించిన కృష్ణ వినుతి యను పద్యములు గోలకొండ కవుల సంచికలో గలవు.

ఘన వినీలచ్ఛాయనెనయు నీనెమ్మేని
కాంతి చూపరులకు వింత గొలుప
గ్రేగంటి చూడ్కుల లాగు నీసద్భక్త
జనమన స్తాపంబు చక్క జేయ
భవదుజ్జ్వల ప్రతాప స్ఫూర్తి శాత్ర
వ నికరమ్మునకు భీతి నివ్వటిల్ల
దావకోన్నత దయా దాక్షిణ్య సంపద
తీరేడు జగముల కిమ్ముదనర

వెలయు నీ విద్య తేజంబు వినుతి సేయ
దరమె నా బోటి జడునకు దలచి చూడ
సరసగుణ ధామ యదుకుల సార్వభౌమ
నన్ను గాపాడ రావె యో చిన్నకృష్ణ

## వితాల చంద్రమౌళి శాస్త్రి

మౌళి త్రయంలో అగ్రజులైన చంద్రమౌళి శాస్త్రిగారు ప్రతిభా పాండిత్యములో అగ్రగణ్యులై భాసించిన విద్వద్వరేణ్యులు.

వీరు ఆకేళ్ల సూర్యనారాయణ శాస్త్రిగారి అంతేవాసిగా శ్రీ శ్రీ శ్రీ యతివర భావానంద స్వామి మరుకూరు (పాండురంగాశ్రమం) వారి ఆధ్యాత్మిక సహచారులుగా నుండిరి.

శాస్త్రిగారు ఎంతటి మహాపండితులో అంతటి ఆధ్యాత్మిక భావనాబలం కలవారు. ఎన్నో సప్త ప్రహరములు గావించిన వారు.

వీరి చిన్నతనమున ఒక శతావదానమును చూచుటకు వెళ్ళి ఆ అవధాని చెప్పిన పద్యములన్నియు ఒకే మారువిని ధారణతో ఆ పద్యములన్నియు ఒప్పచెప్పిరి. ఆ సమయమున వీరిని అచ్చటి పండితులు 'శతావధాని' అని బిరుదమొసంగిరి చంద్రమౌళి శాస్త్రిగారు సంస్కృతాంధ్ర భాషలలో ఉద్దండ పండితులు అనర్గళమైన ఆశు కవిత్వమును అలవోకగా చెప్పగల కవివరులు. నిత్య దేవీ ఉపాసకులు.

వీరు పౌరాణికులుగా, హరికథకులుగా, మహాకవిగా, పండితులుగా, అవధానులుగా లబ్ధ ప్రతిష్ఠులైనారు. శాస్త్రిగారు

1. భక్తి విజ్ఞప్తి 2. మాతృప్రేమ
3. శ్రీదేవీగీత, 4. రాజరాజేశ్వరీ స్తవము,
5. లలితాలాపము మున్నగునవి రచించిరి.

వీరి రచనలు పరిమాణమున అల్పమైనప్పటికి భావార్థానుభూతి పరంగా అనల్పమైనవి. వీరిని గూర్చి గోలకొండ కవుల సంచికలో ప్రస్తుతించబడినది.

**మచ్చునకు వీరిదొక రచన**

ఒకటైయుండమెనీవు నేను దొలిమాయ ద్యోగముంబూనిన
న్నకటాయన్యుని జేసి త్రోసితివి కర్మాంబోధిలోనే ననీ
ప్రకటైశ్వర్యము సత్య దృష్టిగమ నింపస్ఫూనుచో మిధ్యయై
సకలమ్మేకముగాక మానదురకృష్ణాదేవకీనందనా

చంద్రమౌళి శాస్త్రిగారు యమకశ్లేష చక్రవర్తి బిరుదాంకితులైన యాయవరం రామశాస్త్రిగారికి గురువన్నచో శాస్త్రిగారి ప్రతిభా పాండిత్యములు, వారి ఆధ్యాత్మిక సంపద ఎంతటి మహోన్నతమైనదో యూహింపవచ్చును.

## విఠాల రాజమౌళిశాస్త్రి

రాజమౌళిశాస్త్రి, చంద్రమౌళిశాస్త్రిగారి సోదరులు. వీరు సంగారెడ్డిలో నివసించిరి. సంస్కృతాంధ్రములలో చక్కని పాండిత్యము కలవారు. సనాతన ధర్మతత్పరులు. వైదిక ధర్మనిరతులు శాస్త్రిగారు క్రీ.శ.1906లో జన్మించిరి.

వీరు భావానంద రామాయణము 23 భాగములు, తందనాన భారతము, శ్రీ పాండురంగ సేవ, పాండురంగ స్వామిమేలుకొలుపులు, అనేకచాటు పద్యములు రచించిరి.

శాస్త్రిగారు ప్రతిదినము పాండురంగ స్వామి ఆలయములో పురాణ పఠనము గావించెడివారు. మరణించునాటి వరకు వారి పురాణ పఠనము ఆగలేదు.

శాస్త్రిగారు ఆధ్యాత్మిక ప్రచారమునకై హరికథను సాధనముగా చేసికొని భావానంద రామాయణమును స్వయముగా రచించి రాష్ట్రము లోనేగాక బీదర్-ఉస్మానాబాద్ మొదలగు ఇతర ప్రాంతములలో కూడా తిరిగుచు ప్రచారము గావించెడివారు.

వీరు అష్టావధానములు కూడా చేసి తన సాహితీ ప్రతిభను చాటినారు. వీరు రచనలలో మచ్చునకొకటి.

ఎటులీ ఘోర భవాబ్ధి దాటెదము దిక్కెవ్వారు మాకిట్టి సం
కటమెవ్వారలు దీర్తురంచు కడుశోకంబందు భక్తాళికై
కటి విన్యస్తకరుండవై నిలిచి దుఃఖంబేలనన్ జేర రం
డిటు గంభీరమదింతయేయను దయాబ్ధీ పాండురంగప్రభూ.

## విధుమౌళిశాస్త్రి

విధుమౌళిశాస్త్రిగారు మౌళిత్రయుమున చివరివారు. క్రీ.శ.1909లో జన్మించిరి. అన్నలకడ విద్యాభ్యాసమును గావించి శ్రీ శ్రీ శ్రీ భావానంద స్వామిని గురువుగా గ్రహించి భక్తి ప్రచారమును ఒక ఉద్యమముగా నడిపిన విధుమౌళిశాస్త్రిగారు అప్పటికి బహుళ వ్యాప్తిలోనున్న హరికథా పద్ధతిని కొంత మార్పుచేసి, యక్షగాన పద్ధతిని బోలిన రీతిలో తందనాన రామాయణమును రచించిరి.

ఆరోజులలో వీరి తందనాన రామాయణము పుస్తకములేని ఇల్లు లేదు, పాడని ఊరు లేదనిన ఆశ్చర్యము కలుగును.

శాస్త్రిగారు సంగీత సాహిత్యములందు పేరుగాంచిన పండితులు. సంస్కృతాంధ్రములలో కోవిదులు. అనర్గళమైన ఆశుధారా కవిత్వ విశారుదలని కీర్తినందిరి.

క్రీ.శ.1947లో రాష్ట్రమున జరుగుచున్న రాజకీయ ఆందోళన విప్లవమున జరుగుచున్న రజాకార్ల రాక్షస చర్యలను నిరసించెను.

## రాళ్ళబండి రాఘవ శాస్త్రి

రాళ్ళబండి రాఘవశాస్త్రిగారిది మెదక్ జిల్లా క్షీర సాగరము జన్మస్థానము. వీరి రచనలు భావానందము మొదలగు రచనలు గలవు. వీరు బహుభాషా కోవిదులు, విద్వత్పుంగవులు.

వీరి భావానంద రచనలోని పద్యము నొకటి చవిచూతము.

పండితులై ప్రపంచమున భాసిలగావలెనన్న యోగ్యతా
మండితులై స్వరాజ్యమున మాన్యులుగావనన్న సంపదు
ద్దండత సత్క్రియోపకృతి ధన్యులుగా వలెనన్న లెందుమా
కొండల రాజు బిడ్డ కొడుకున్ గొలువుండు ప్రయత్నసిద్ధికై
సహజ సిద్ధమైన ధారాదోరణి గలగిన వదాన్యులు.

## యామవరం రామశాస్త్రి

మెదకు జిల్లాలోని పండిత కవులలో ప్రసిద్ధిగాంచిన వారు యామవరం రామశాస్త్రిగారు. వీరు శాలివాహన శకం 1818 హేవళంబినామ సంవత్సర జ్యేష్ఠ శుక్ల ప్రతిపదనాడు కుక్నూరు గ్రామమున జన్మించిరి.

వీరి తల్లిదండ్రులు నరసాంబ, సీతారామయ్యగార్లు. వీరి పెద్దతండ్రి కృష్ణశాస్త్రిగారు గొప్ప పండితులు. రామశాస్త్రిగారికి వీరి పెద్దతండ్రి కవితా గురువుగా చెప్పవచ్చును. విద్యాగురువులు వెంకటపౌండరీక యాజులుగారు. వీరికి విఠాల చంద్రమౌళి శాస్త్రిగారు ఆధ్యాత్మిక గురువర్యులు.

రామశాస్త్రిగారు సంస్కృతాంధ్ర భాషలలో గొప్ప పండితులు. ప్రాచీన కవితా సంప్రదాయమున బాల్యము నుండియే అనర్గళమైన ఆశు కవిత్వము నల్లెడువారు.

వీరు కవిత్వమును పరమేశ్వరోద్దిష్టమైన ఇహపర సాధనమని నమ్మిరి. వీరు 22 ఏటా అనగా సిద్ధార్థి సంవత్సరమున శ్లేషచిత్ర ప్రబంధమగు గురుస్తుతి రచించిరి. వీరి రచనలలో కెల్ల ఇది ప్రౌఢమైనది. మొత్తము 250 శ్లోకములతో కావ్యము రచింపబడినది. వీరు రచించిన గ్రంథములు.

1. గురుస్తుతి
2. దాత్తాత్రేయ చతుష్ష్ష్యుపచారపూజ
3. గురుస్తవరాజము
4. భవానీ శంకరయుక్త స్తవరాజః
5. గణపతి చతుశ్శష్ట్యుపచారపూజ
6. రాజరాజేశ్వర తారావళి 7. బాలాపూజ
8. కుమార సల్లాపము (తెలుగు)
9. సమయవక దేవీతారావళి
10. చుంచనకోట దేవి అఖండమాల (ఏకప్రాసము తెలుగు)
11. దేవీయయక తారావళి
12. శ్రీరామ చతుశ్ష్ష్యుపచారపూజ
13. కుమార శతకము 14. విత్తచిత్త వివాదము
15. మాణిక దండకము 16. వృత్తి పరామర్శ
17. శుద్ధాంధ్ర ఉషా నిరుద్ధము
18. భాగవత ఏకాదశ స్కంధము
19. కపోత కథ

ఇవిగాక అనేకమైన లఘుకృతులను, చాటువుల వంటి శ్లోక పద్యములను, మంగళ హారతులను రచించెను.

వీరు రచించిన గ్రంథములలో పెక్కు గ్రంథములు ముద్రితమైనవి మరికొన్ని కావలసి యున్నవి. గోలకొండ కవుల సంచికలో వీరి ప్రస్తావన గలదు.

వీరు రచించిన కపోతము నుండి కొన్ని పద్యములు ఆ సంచికలో గ్రాహింపబడినవి.

నమ్యేమౌని మనోయనేనయ యమేన్యేమనూనామినే
నా నా మ్నాయ మయేమనో నియమయ న్నోం నామ మాన్యేమనౌ
మామానిన్యయ నామనా నుయ మీనోయామినీనానవో
మాంమాయామయనున్నయేన్న యమనామోమేన మాన్యాయనం

**కపోతము**

మిక్కిలి సంగమమ్ము చెలిమిన్ రచియింపగరాదె వారితో
నెక్కడనేని చేయనట నించుక భంగము గల్గ జింతచే
బొక్కను తాప మొందును గపోతము పోలిక దీన బుద్ధిచే
నక్కట ప్రాణముల్ వదులు నాకధదెల్పెద నాలకింపుమా

ఒక కపోతము కానలో నొక్క మ్రాను
పయిని గూడొన గూరిచి భార్యతోడ
గాల మొక్కింత నిరువురు గడుపుచుండ
బేర్మి దినదిన మింతింత పెరుగుచుండె

వీరు ఎంతటి కఠిన గంభీర శబ్దములతో పద్యములల్లుదురో అంతటి అలతి అలతి లలిత పదాలతో పద్యములల్లగలరని పై పద్యము ద్వారా తెలియుచున్నది.

వీరు రచించిన గురుస్తుతి యమోఘ శ్లేష, యయకాలం కారములతో నొప్పుచున్నది. ఇందు ఓంకారమునకు మాయాబీజమునకు, ఛందస్సుకు, స్త్రీకి, పంచభూతములకు, సూర్యబృహస్పతులకు వ్యాకరణాంశములకు ధాతువులకు, బ్రహ్మ, రుద్ర హనువంతాది దేవతలకు అష్టదిక్పాలకులకు, దీపమునకు మఖమునకు, అన్నమునకు ఋతువులకు, వారములకు, తన తండ్రికి, తన కుటుంబమునకు గురువుతో అభేద శ్లేష చూపించినాడు.

ఒక్కొక్కచోట వీటన్నిటికన్న గురువున అధిక్యత కల్పించినాడు. 18 వత్సరముల చిన్నతనాన ఇంతటి వచోగాంభీర్యశ్లేషని గూఢార్థ రచన గావించుట ఈతని పూర్వజన్మ కృత పుణ్య విశేషమని చెప్పవచ్చును.

వీరు చిత్ర కవిత్వమునందు అసాధారణ ప్రజ్ఞ గలవారు సువర్ణ రహితత్వ సహితత్వములతో ఉత్తమాధమజన ప్రకారము నిట్లు తెల్పెను.

శ్లో. సామావాంశ్చ పరాజిత స్సునమితౌ కాపాలి కానన్మితా
విష్టః కోపమలా శయశ్చ పశుభోలబ్ధాది పద్మజ్ఞనిం
కృత్వాతాప పరాయణాన్ శ్రితజనాన్ పర్వోపకారీ మహా
పాపాత్మాపదితో సిరే పరహితత్వం త్వంభ వాప్యాలయః

1. అధమా సంబంధము
2. ఉత్తమ సంబంధము

ఇంకను అవిదిత కవితాలక్షణమును పచిత స్వాదుపదం అచతురమతిం.

అనధీత వ్యాకరణం సాతమాం కృతి కృతః యువాం హిశివే ... అని చెప్పినాడు.

ఈ కవి అద్వితీయాక్షరములు, అరేఫములు, షష్ఠాక్షరాహిత్యములు, దకారస్థలముల పరాకము లుంచుట, ప్రశ్నోత్తరాలంకారములు, ఏకాక్షరాను ప్రాసములు, ఒకటేమిటి చిత్రాతి చిత్రము లైన రచనలెనన్నో గావించినాడు.

**ఒక యమకము**

శ్లో. తనుమతాంతరు సాధన నిస్పృహాం
తను మతాంతం సాధన నిస్పృహాం
మనుజ పంకల యాయత ముభ్రితం
మను జపంకల యాయత ముభ్రితం

**ఒక ఏకాక్షరి**

శ్లో. నూనంనానే నాననే నేనా నన్నాని నానునా
నైనో నేనే నునున్నెను నానూనేనాని నేనమః

**ఒక ద్వ్యక్షరి**

శ్లో. తాంతానాంతు నితాంతంనో
నూత్న నానా తనూతతే
నతాన నానాం తను తాత్తతా
నీతిం మతో న్నుతిః

ఈ విధముగా రామ శాస్త్రిగారు అనితర సాధ్యప్రతిభావంతుడై, మహా కావ్య రచనా దోధూయమానుడైనాడు.

ఒకమారు క్షీరసాగరమను గ్రామమున మహా పండితులు పరివేష్టించిన సభలో చివుకుల వేంకట శాస్త్రి అవధాని చివుకుల అప్పయ్యశాస్త్రి, జానపాటి పట్టాభిరామ శర్మ, వడ్డేపల్లి నర్సింహా చార్యులు మొదలగు అష్టావధానులన్న సభలో రామశాస్త్రిగారు అష్టావధానమును దిగ్విజయముగా నొనరించగా ఆ సభలో వీరికి 'అష్టావధాని' 'అభినవతిక్కన' అను బిరుదములు నొసంగబడినవి.

మరొకమారు శ్రీ యాదగిరి లక్ష్మీనర్సింహా స్వామి క్షేత్రమున జరుపబడిన విద్వత్సభలో సహస్రావధాని జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు అధ్యక్షులుగా నుండి శ్రీ రామశాస్త్రిగారికి "శ్లేషయమక చక్రవర్తి" అను బిరుదు ప్రదానముగా వించబడినది.

వీరి రచన కేవలము భక్తి పూర్వకమై, శ్లేషయమకాదులతో సామాన్యులకందనిదై కేవల పండిత భాజనమై యుండుటచే వీరికి రావలసినంత కీర్తి రాలేదని చెప్ప వచ్చును.

ఏమైనను ఇంతటి మహాకవి తెలంగాణమునే ఒక మహా మనీషియని చెప్పక తప్పదు.

## వేలూరు నర్సింహాచార్యులు

వేలూరు నర్సింహాచార్యులు గొప్ప హరికథ కులుగా (హరిదాసులుగా) కీర్తినందిరి. నాచారం గ్రామ వాస్తవ్యులు. లక్ష్మీనర్సమాంబ కృష్ణమాచార్యుల

పుత్రులు, వీరు గొబ్బూరివారు. వీరి పూర్వగ్రామము వేలూరు (నాచారం సమీప మండలి) కావచ్చును. నాచారం నివాస మేర్పరచుకొన్న తర్వాత వీరు వేలూరి వారిగా పిలువబడిరి.

నర్సింహాచార్యులుగారు సంగీత సాహిత్య విశారదులు. వీరుతన తండ్రి గారి కడబాల్యముననే సంస్కృతాంధ్ర భాషలందును, సంగీత సాహిత్యములందును ప్రవేశము సంపాదించి చక్కని పాండిత్యమలవరచు కొనుటేగాక రసమయ భావో పేతమగు కవిత్వమల్లుటలో వాసికెక్కిరి. వీరి రచన ధారా శుద్ధితో నలరారుచు రసజ్ఞులవుంది దోచుచుండును.

వాక్చాతురి, శ్రావ్యమగు పద్య కీర్తనల గానము వీరి హరికథా శ్రవణమున శ్రోతల మనములు పులకాంకితము గావించుచుండెడిది.

వీరి రచనలు గోలకొండ పత్రికలో విరివిగా ప్రచురింపబడుచుండెను.

వీరికి "శ్రీ హరికథా కేసరి" "శ్రీ హరికథా చతురానన" "ఆంధ్ర కీర్తన కళానిధి" అను బిరుదములు గలవు. వీరు మలహరి చరిత్ర పాండురంగ భజన మాల, శ్రీనాచగిరి లక్ష్మీ నర్సింహ భజన మాల మొదలగు రచనల గావించిరి.

నిను సేవించుచు నీ మహా మహిమలన్ విఖ్యాతినిన్ దెచ్చి స
జ్జనులానంచు నుతింపనీదు కథలన్ శ్రావ్యంబుగా బాడుచున్
మనగా నెంచితి నన్నిరీతుల ననున్ మన్నింపగా వేడి కొ
ల్చిన నన్నీగతి కష్టపెట్టుదువె లక్ష్మీ నరసింహా ప్రభూ.

## చిదిరె లక్ష్మణ శాస్త్రి

చిదిరె గృహనామంగా, కాస్య పసగోత్రాన అందోలు గ్రామమున పుణ్యదంపతులైన రాధమ్మ చంద్రయ్యల ముద్దుల పట్టిగా క్రీ.శ. 1899లో జన్మించిన లక్ష్మణ శాస్త్రి, సంస్కృతాంధ్ర ఉర్దూ భాషలలో చక్కని పాండిత్యము గలవారు.

వీరు సలక్షణ ధారా శుద్ధిగల రసమయ కవితా రసజ్ఞులు. సరస సాహితీ మండనులు. చారిత్రక పరిశోధకులు.

వీరి 'మెదకు రాజుల చరిత్ర ' మెదకును గూర్చిన చారిత్రక పరిశోధకులకు కరదీపిక వంటిది.

లక్ష్మణశాస్త్రిగారు వ్రత పరీక్ష శ్రీనివాస చరితము - స్వయంవర నాటకము మొదలగునవి రచించిరి.

వీరు రచించిన వ్రత పరీక్ష ఐదాశ్వాసముల కావ్యము. "బల వానింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి " అను వాక్యమాధారముగా వ్రాసిన కల్పిత

కథయిది. ఈ కావ్యము ధారశుద్ధి శోభితమై, రమ్య వర్ణ నాపూర్తియై, సహజ భావ సుందరమునె యున్నదని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు అభిప్రాయ పడినారు. వీరి కవిత్వమునందు లోకోక్తులు, సామెతలు సహజముగా కలిసిపోయి కడు రమణీయముగా తోచును.

మచ్చునకు ఒకటి రెండు పద్యములు

వ్రతని వాస్వార్థమైన యాశ్రమమునందు
పొలతి మెలగుట మిగుల నబ్బురము గొలిపె
హారవైడూర్య నీలాది హారమందు
పొందు పరచిన గురిగింద పూసభంగి

ముక్కువేలూని నగరె మొగ సరివారల్
పున్నమయమవాస కూడిన పొసగగలదె
అతివ వంగనాభి యాశ్రమమున జేరి
ఆడవికాచిన వెన్నెల యౌనుగాదె

## సముద్రాల కృష్ణమాచార్యులు

కృష్ణమాచార్యులు గారు శివంపేట ( మండల కేంద్రము) వాస్తవ్యులు ఇంటి పేరు సముద్రాల వారు. వీరి తల్లిదండ్రులు రంగనాయకమ్మ, రాఘవాచార్యులు. వాధూలస గోత్రులు శ్రీ వైష్ణవులు.

వీరు **1891**వ సంవత్సరంలో జన్మించి **1946**వ సంవత్సరం పరమపదించిరి. కృష్ణమాచార్యులుగారు సంస్కృతము, ఆంధ్రము, ఆంగ్లమ, ఉర్దూ, హిందీ భాషలలో నిష్ణాతులు. విశేషించి ఆంధ్ర భాషలో చక్కని కవిత్వము చెప్పగల నేర్పరులు. ఆశు కవిత్వమున అందెవేసిన చేయి. చిత్ర విచిత్ర పద్య వృత్త గర్భ పద్య రచనా దురంధరులు. అట్లే అలతి అలతి పదములలో లలిత భావగర్భిత రచనలో అసాధారణ ప్రజ్ఞులు.

## మూలంపల్లి నాగమల్లయ శర్మగారు

దుబ్బాక మండలము నందలి లచ్చపేటలో ఆరాధ్య కుటుంబమున విశాలక్షీ శివలింగ యారాధ్యుల సంతానములో మధ్యవారు మూలంపల్లి నాగమల్లయ శర్మగారు

మద్రాసు విశ్వవిద్యాలయము నుండి విద్వాన్ పట్టమును పొంది, సంస్కృతాంధ్ర భాషలయందు చక్కని పాండిత్యమును గలవారు. వీరి అన్నగారయిన రాజమల్లయగారు, తమ్ముడు చంద్రశేఖర శర్మగారు కూడా చక్కని పండితులు నాగమల్లయ శర్మగారు సంస్కృత భాషలో అనేక శ్లోకములు వ్రాసిరి మచ్చునకొకటి. గాంధీ మహాత్ముని పై శ్లోకము

పంచత్వేన సమానీతాన్
పంచవాన్ మానవాన్ జనాన్
హరిసంజ్ఞా పరాంకృత్వా
హరి భక్తిం న్యభోధయత్

## మల్యాల దేవీ ప్రసాద్

ఆంధ్ర ప్రాంతాన పుట్టి తెలంగాణమున మెదకు జిల్లా తనదిగా జీవించిన ఒక గొప్ప మనీషి మల్యాల దేవీ ప్రసాద్. ప్రజల కష్ట నిష్ఠురాలు తనవిగా ప్రజాసేవే పరమార్థంగా సంగారెడ్డిలో నివసించారు.

ఎంతో శ్రమకోర్చి మెదకు జిల్లా కవుల చరిత్రను మెదకు జిల్లా రచయితల సంఘ పక్షాన వెలువరించారు. మెదకు జిల్లా రచయితల సంఘానికి ఉపాధ్యక్షులుగానుండి సంస్థ పురోభివృద్ధికి ఎనలేని కృషిగావించిరి.

## కే.వి. అప్పలాచార్యులు

కే.వి. అప్పలాచార్యులు గారు గుమ్మడిదల వాస్తవ్యులు. వీరు 1930లో జన్మించిరి. భాషాప్రవీణ. బి. ఓ. యల్, ఎం.ఎ. విద్యార్హతలనందిరి. సంస్కృతము, ఆంధ్రము, హిందీ, తమిళము, ఉర్దూ భాషలలో చక్కని ప్రవేశము కలవారు. సంస్కృతాంధ్రములలో అశేష రచనాశక్తి కలవారు.

వీరు ఉపాధ్యాయులుగా ఉపన్యాసకులుగా ప్రభుత్వోద్యోగములు చేసి ఈ మధ్యకాలమున పరమపదించిరి. వీరు శ్రీవైష్ణవులయి నప్పటికి అద్వైత భావమునవలంబించి వీరభద్ర సుప్రభాతము రచించిరి.

'వీర భద్రవిజయము' శ్రీ గురుశతకము, "మాఘకావ్యము" "మాతృదేవోభవ" అనునవి వీరు రచించిన కృతులు. వీరి "మాతృదేవోభవ" నుండి ఒక పద్యము.

ఆతని ధర్మాసక్తికి
ఆతని చవి చూడభక్తి కాతని దివ్య
జ్యోతికి మేధోశక్తికి
యాతని సన్మంత్ర యుక్తి కాతడె సముడే.

## డాక్టర్ కే.వి. సుందరాచార్య

గుమ్మడిదలలోని పండిత కుటుంబమున జన్మించిన సుందరాచార్యులు సంస్కృతాంధ్రము లందు చక్కని పాండిత్యము కలవారు.

వెంకటమ్మ, కృష్ణమాచార్యుల కుమారులు. కే.వి. అప్పలాచార్యుల సోదరులు.

వీరు ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాచ్యకళాశాలలో ఉపన్యాసకులుగా పనిచేసి పదవీ విరమణనొందిరి. అచ్చుతెలుగు కృతులపై సిద్ధాంత వ్యాసమును రచించి ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి డాక్టరేటును పొందిరి.

వీరభద్ర సుప్రభాత, వీరభద్ర విజయములు వీరి అన్నగారితో పాటు రచించిరి.

## బి. అనంతరాజ శర్మ

పెద్ద శంకరంపేటలో జన్మించిన శ్రీ అనంతరాజ శర్మగారు చిన్నతనాన అనేక కష్ట నిష్ఠురముల కోర్చి సంస్కృతాంధ్రములను నేర్చుకొనిరి. మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులై ఉపాధ్యాయ వృత్తిని చేపట్టిరి ఆ తరువాత బి. ఓ. యల్. యం. ఏ. పరీక్షలలో ఉత్తీర్ణులయిరి. వీరి తండ్రి పేరు కృష్ణదీక్షితులుగారు.

సంగమేశ్వర సుప్రభాతము, సంగమేశ్వర స్తోత్రము, సంగమేశ్వర మంగళాశాసనములను రచించిరి. వీరు మాణిక్య విజయను ప్రారంభించిరి.

అరవిందాల మరంద బిందు నిచయంబాపోవగా గ్రోలిస
త్వర నిందీవర బృందముల్ జలజగర్భంబున్ విసర్జించి సు
స్వర ఝుంకార రవప్రగీతికల నింపారన్ దమింబాడుచున్
బరగెన్నీకది సుప్రభాతమగుచున్ సర్గామ వర్గప్రదా

## కస్తూరి ఆనందాచార్య

ఆనందాచారిగారి జన్మస్థలం చౌటకూరు. వీరి తల్లిదండ్రులు సీతమ్మ, రామాచార్యులు. ఇంటిపేరు కస్తూరి వారు. వీరి పూర్వీకులు పాపన్నపేట సంస్థానపు రాజుల ఆస్థానమున నుండెడివారు.

కస్తూరి ఆనందాచార్యులు సంగారెడ్డిలో పాఠశాల విద్యను ముగించుకొని ఉస్మానియా విశ్వవిద్యా లయమునందు పట్ట భద్రులైరి. తాను చదివిన పాఠశాలలోనే ఉపా ధ్యాయులుగా నియమింపబడి, మరణాంతము వరకు ఉద్యోగము నిర్వహించిరి. వీరు చాలా చిన్న వయస్సున మ ణించినారు.

ఆచార్యులవారు మంచి వక్త, మంచి కవి, రచయిత సాహితీ వేత్త.

**వీరి రచనలు:-** చర్విత చర్వణం (నవల) అగ్ని కీలలు (గేయసంపుటి).

## డాక్టర్ శివునూరి విశ్వనాథ శర్మ

మెదకు జిల్లా చేగుంటలో శివనూరి రామకృష్ణ శాస్త్రిగారు శుద్ధ వైదికులు. వీరి అర్ధాంగి శ్రీమతి శారదాంబగారు. వీరి ద్వితీయ సంతానం విశ్వనాథశర్మ 25-11-1940 న జన్మించారు.

చిన్నప్పుడే తండ్రి వద్ద వేదాభ్యాసం, స్వగ్రామంలో ప్రైమరీ విద్య.

వేములవాడ రాజరాజేశ్వ సంస్కృత పాఠశాలలో సంస్కృత ఎంట్రెన్స్, మున్నాలాల్ సంస్కృత పాఠశాల, వేదాంతవర్ధినీ సంస్కృత కళాశాలల్లో డి.ఓ.ఎల్. మరియు బి.ఓ.ఎల్. పరీక్షల ఉత్తీర్ణులైరి.

హైద్రాబాద్ జిల్లా పరిషత్ మేడ్చల్ ఉన్నత పాఠశాలలో కొంతకాలం తెలుగు పండితులుగా ఉద్యోగం చేసి ఆ తర్వాత ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. లో చేరి సర్వ ప్రథముడుగా ఉత్తీర్ణులైరి.

"కావ్యకంఠవాశిష్ఠ గణపతిమునిజీవితము - రచనలు". అను అంశంపై నిశిత విమర్శన గావించి వేయిపుటల సిద్ధాంత వ్యాసమును సుప్రసిద్ధ సంస్కృతాంధ్రాంగ్ల విద్వాంసులు ఆచార్య పుల్లెల రామచంద్రుడుగారి పర్యవేక్షణలో సంస్కృత భాషలో రచించి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి పి.హెచ్.డి. పట్టాను పొందుటేకాక శ్రీపాద దామోదర సాత్వోలేకర్ స్వర్ణ పతకాన్ని పొందినారు.

1966లో ఆంధ్ర ప్రాచ్యకళాశాల ప్రిన్స్‌పాల్‌గా అతి చిన్న వయస్సులోనే నియమింపబడుట వీరి కార్యదర్శిత్వమునకు సాక్షి.

విశ్వనాధశర్మగారు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వముచే ఉత్తమ అధ్యాపక అవార్డు, రాష్ట్రపతిచే సన్మానము పొందినారు.

వీరు విద్యార్థిదశలోనే శ్రీ గణేశ సుప్రభాతమ్, స్తోత్రప్రపత్తి, మంగళాశాసనములు రచించినారు.

తన తండ్రిగారి స్మృత్యర్థంగా నీరాజనసంపుటి, మాతృస్తుతి, గ్రంధములు వెలువరించారు.

వీరు రచించిన వ్యాసముల అనేకములు అందులో కొన్ని

1. మహనీయుల మహితోక్తులు - కాళిదాస సూక్తులు

2. హర్ష చరితలో బాణుని స్వీయ చరిత్ర

3. సంస్కృత శాసనములు - కవితా సౌందర్యము

4. సంస్కృత కథా సాహిత్యము - పంచతంత్రము

5. నృత్తరత్నావళి - రచనా విశేషములు

6. ఆంధ్రుల సాంస్కృతిక సాహిత్య సేవ

7. సంస్కృతం రాష్ట్రభాషా భవితుర్మవర్హతి (వ్యాసము కావ్యకంఠభారతి - అనకాపల్లి వారు నిర్వహించిన వ్యాసరచనా పోటీలలో బహుమతి నందినది).

## బి. విశ్వనాధ శాస్త్రి

విశ్వనాధశాస్త్రిగారు సిద్దిపేట వాస్తవ్యులు. వీరు క్రీ.శ. 1899లో జన్మించిరి. వీరి పద్యములు గోలకొండ కవుల సంచికలో ముద్రింపబడినవి.

*సిరులకు పాడిపంటలకు జేరిన వారి దరిద్రదోషసం*
*హరణము సేయుదాతలగు నార్యులకున్*
*ద్రవిడాంధ్రసంస్కృతా*
*ది, రుచిర సర్వభాషలకు ధీరులకున్ రణ వీర పాళికిన్*
*పరమదయాళులైన కవిపండిత మండలి కాశ్రయంబులై*
*గురుతర యజ్ఞకార్యములకున్ జనన స్థలిపై విశేష శి*
*ల్పరచన చాతురీకలకు వాసమువైనట గాయకాళికిన్*
*శరణమవై సమస్తజన సంస్తుతి పాత్రమవై సమున్నత*
*స్థిరతర వైభవంబున ప్రసిద్ధమవైన నిజామురాష్ట్రమా!*

## ఆనందరావు దేశపాండ్య

ఆనందరావు దేశపాండ్యగారు తేది 14-5-1914లో జన్మించిరి వీరి తల్లిదండ్రులు రాధాబాయి రఘోత్తమరావులు. వీరి చిన్నతనమున తండ్రి దేగులూరు (మహారాష్ట్ర ప్రాంతము)లో ఉద్యోగము చేయుచుండెను కావున ఆనందరావుగారి ప్రాథమిక విద్యాభ్యాసము అక్కడనే జరిగినది. దీనితో వీరికి మహా రాష్ట్ర భాష అబ్బినది. ఆ తర్వాత సిటీ కాలేజ్ ( హైద్రాబాద్)లో మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులైరి. వీరి నివాసము నార్సింగి గ్రామము. వీరు వేణుగోపాల భజనమాల, పరమేశ్వర శతకము, రాజీవ చరిత్ర (యక్షగానము), అనేకచాటువులు, గేయములు రచించిరి.

రజాకార్ల రాక్షసత్వమును నిరసించుచు నిజాం నవాబును సంబోధిస్తూ ఎన్నోహిత బోధాత్మకమైన పద్యములు వ్రాసి పత్రికలకు పంపించేవారు. 1937 నుండి రాజకీయ కార్యక్రమములందు సాహిత్య కార్యక్రమములందు విరివిగా పాల్గొనెడివారు. మొట్టమొదటి ఎన్నికలలో వీరు వ్రాసిన కొన్ని గేయములు 'పల్లెటూరు' పత్రికలో ప్రచురింపబడినవి. వీరు తెలుగులోనేగాక సంస్కృత, హిందీ భాషలలో గూడా కవిత్వము చెప్పగలరు.

ఆనందరావుగారు చిత్రకళలో ఆరితేరినవారు వీరి సాహిత్యము రాజకీయమునసేగాక ఆధ్యాత్మికముగా కూడా సొంపుగా సాగినది. 'తమ్ముడా' అను మకుటంతో కొన్ని పద్యములు వ్రాసిరి. ఉదాహరణకు.

ఎందులకోయి బ్రాంతి పడుటెందుకు నందరు నీకు నాప్తులై
యుందురటంచు నమ్మెదవు యోడదరిచ్చుట నుండు చోటనే
మందమతిన్ యదార్థమున మానుకుమోయి వృధాతలంపు లిం
కెందుకు భారమీశ్వరునకే వదలేయగదవో తమ్ముడా

## ఆచార్య గోపాల కృష్ణారావు

మెదకు జిల్లాలో పుట్టి ప్రాథమిక విద్యాభ్యాసం ఇక్కడేచేసి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రముఖ స్థానమైన తెలుగుశాఖకు అధ్యక్షులుగా ఎనలేని భాషా సేవ చేసిన ఆచార్య గోపాలకృష్ణరావుగారు జిల్లా సాహితీరంగంలో మణిపూసవంటి వారు.

గోపాలకృష్ణరావు గారు మెదకు జిల్లా సంగారెడ్డికి సమీపమందలి తాళ్లపల్లి గ్రామమున జన్మించిరి ప్రాథమిక విద్య సంగారెడ్డిలో పూర్తి చేసి ఉన్నత విద్యలు హైద్రాబాదులో అభ్యసించిరి. 1949లో వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఏ. ఉత్తీర్ణతనందిరి ఆనాటి విద్యావ్యవస్థలో తప్పని సరిగా నేర్చుకొనవలసిన ఉర్దూ, ఫారసీ భాషలలో చక్కని పాండిత్యమును సంపాదించి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకులుగా చేరిరి.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో "ఆంధ్రశతక సాహిత్య వికాసం" మీద అపూర్వ పరిశోధనా గ్రంధాన్ని అందించి తెలుగు సాహిత్య మణిహారంలో ఒక అమూల్య వజ్రాన్ని పొందిరి.

ఉర్దూ, ఫారసీ భాషలలో పాండిత్యము కల్గియుండటచే తెలుగులో కనుపించే 'అన్యదేశ్యాల' పై సాధికారమైన వ్యాసాలనెన్నింటినో ప్రచురించిరి. తెలుగుపై అరబ్బీ, ఫారసీల ప్రభావం తెలుగు పై ఉర్దూ భాషాప్రభావం అనే అంశాలపై పరమ ప్రామాణికమైన గ్రంధములను వెలయించిరి. ఈ గ్రంధానికి సాహిత్య అకాడమీ బహుమతి లభించినది. తెలుగు, ఉర్దూ నిఘంటువును వీరు సిద్ధము చేయుగా దానిని అంజుమన్ తరఖివారు ప్రచురించిరి. విశ్వవిద్యాలయ తెలుగు శాఖ అధ్యక్షులుగా పదీవీ విరమణ చేసేముందు అన్యదేశ్యకోశంను పూరించి.

సాహిత్యంలో వినూత్న అంశాలను అందించినవీరు ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖకు అధ్యక్షులుగా రెండేళ్లు పని చేసిరి. ఆ తర్వాత బోర్డ్ ఆఫ్ స్టడీస్ చేర్మన్ పదవిని నిర్వహించిరి. 1986 వ సంవత్సరంలో పదవీ విరమణ చేసిన తర్వాత కూడా ప్రొఫెసర్‌గా కొంత కాలము పని చేసిరి.

ఈ విధముగా బహుప్రామాణిక గ్రంథ రచయితగా ఉపన్యాసకులుగా, తెలుగు శాఖ అధ్యక్షులుగా, భాషా సేవయొనరించినారు.

## వేముగంటి నర్సింహాచార్యులు

మెదకు జిల్లాలో కవుల పేరు చెప్పాలంటే మొట్టమొదటి చెప్పే పేరు వేముగంటి. మెదకు జిల్లా కవితా ప్రపంచంలో ఏ కవియైనా వేముగంటిని మేము గంటిమనే అంటారు. అంతటి పేరున్న వేముగంటి సిద్ధిపేట వాస్తవ్యులు. చిన్న నాటి నుండే కలం పట్టి కవిత్వం వ్రాయడం ఆయనకబ్బిన విద్య.

సిద్ధిపేట ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా పని చేసి పదవీ విరమణ నందినారు. పాత బడిపోయిన పద్యరచనకు క్రొత్తదనం తెచ్చిన కొద్ది మందిలో వేముగంటివారొకరు అంటారు దాశరథి పద్యం, గేయం, వచన పద్యం, అన్ని ప్రక్రియల్లోను చేయి తిరిగినవారు వేముగంటి వారు.

వేముగంటి నర్సింహాచార్యులు రచించిన గ్రంథాలు

1. ప్రబోధము
2. అమరజీవి బాపూజి
3. కవితాంజలి
4. నవమాలిక
5. తిక్కన
6. వీరపూజ
7. మణికింకిణి8. జీవన స్వరాలు
9. వెంకటేశ్వర వినుతి
10. గోపాల కృష్ణ సుప్రభాతం.
11. తెలుగూ బాలనీతి
12. వేంకటేశ్వరోదాహరణము
13. ఆంధ్ర విష్ణువు
14. స్తుతి రత్నావళి
15. మంజీరనాదాలు
16. కవితా కాహిళి
17. బాలగేయాలు
18. కవితా సింధూరం

ఈ కవి గ్రంథాలేకాక కవిసమ్మేళనాలలో, రేడియోలో వార్తా పత్రికలలో వ్రాసిన రచనలింకా అనేకం ఉన్నాయి. నిత్య కవితా స్రవంతి మా వేముగంటి ఆంధ్ర సారస్వత పరిషత్తులో సభ్యత్వం. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో సభ్యత్వం పొందినగౌరవం జిల్లా నుండి వీరికి దక్కింది.

వీరి పద్య రచన మచ్చునకు కవితా సింధూరంలో నుండి 'కరుణా లహరి'ని గూర్చి

పాలమున్నీటి కెరటాల చాలునందు
తురగలించెడు మీగడ తరకవగుచు
స్వచ్ఛశారద పూర్ణిమా చంద్ర కిరణ
వార విగళి తామృత రసధారవగుచు
అవతరించిన కరుణాలహరి ! నమోస్తు.

వేములగంటి వారికి 1979లో సిద్ధిపేటలో పౌరసన్మానం జరిపి "విద్వత్కవి" కవికోకిల అనే బిరుదులు ప్రదానం చేయబడినవి.

వీరికి ఎన్నో పురస్కారములు లభించినవి. 1986లో కోరుట్ల పట్టణంలో వానమామలై వరదాచార్యుల స్మారక పురస్కారం. 1987లో వనపర్తిలో ఉమ్మెత్తల అవార్డు, మచిలీపట్నంలో త్రిపుర సుందరీ ప్రతిష్ఠాపురస్కారం, 1988లో కడపలో గడియారం వెంకట శేషశాస్త్రిగారి స్మారక పురస్కారం, 1990లో తెలుగు విశ్వవిద్యాలయం వారి విద్వత్కవి సత్కారం జరిగినవి.

వేముగంటి కవితా రచన 1947లో ప్రారంభమై హిందీ, గుజరాతీ మొదలైన ఇతర భారతీయ భాషలలోనికి అనువదించబడినవి.

వీరి రచనలను ఉస్మానియ , శ్రీ వెంకటేశ్వర, కాకతీయ,గుల్బర్గా విశ్వవిద్యాలయాలు పాఠ్యాంశాలుగా స్వీకరించినవి.

వేముగంటి నర్సింహా చార్యుల 'జీవితం - సాహిత్యం' అనే విషయంపై ఉస్మానియా విశ్వవిద్యాలయములో పి.హెచ్.డి. పరిశోధన వేముగంటి సాహిత్యం పై కాకతీయ విశ్వవిద్యాలయంలో యం-ఫిల్ పట్టాకై పరిశోధన సాగినవి.

ఆచార్యులవారు 1960లో సాహితీ వికాస మండలిని స్థాపించి ఎందరో యువకవులకు స్ఫూర్తి నిచ్చినారు. మెదకు జిల్లా రచయితల సంఘానికి అధ్యక్షులుగా చాలా కాలం సాహిత్య కార్యక్రమాలను నిర్వహించారు.

వేముగంటివారు ప్రస్తుతం ఉద్యోగ విశ్రాంతిని పొంది నిరాడంబరమైన జీవనాన్ని నడుపుచున్నారు.

## నల్లీగ లక్ష్మి నర్సింహాచార్యులు

గజవెల్లి సమీపాననున్న వరదరాజపురంలో ఒక శుద్ధశ్రోత్రియ కుటుంబం. చూడమ్మ భాష్య కారాచార్యుల ప్రథమ సంతానం నల్లీగల లక్ష్మీనర్సింహా చార్యులు.

చిన్ననాట యాదగిరిగుట్ట సంస్కృత పాఠశాల హైద్రాబాదు వేదాంత వర్థినీ కళాశాలల్లో సంస్కృత విద్యాభ్యాసం గావించిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సంస్కృతాంధ్రల్లో ఎం.ఏ. ఉత్తీర్ణులైరి. 'కాకతీయ శాసనాలు - ఆంధ్ర భాష' అను అంశంపై పరిశోధన చేసి పి.హెచ్.డి. పట్టా పొందిరి. తెలుగు ఉపన్యాసకులుగా ప్రభుత్వ కళాశాలలో గజ్వెల్ విద్యాబోధన చేయుచున్నారు.

వీరి రచనలు

*1. బెజ్జంకి దేవాలయ శిల్ప విశేషాలు*

*2. బ్రహ్మవైవర్త పురాణం 3 ఖండాల ఆంధ్రీకరణం*

*3. మనుస్మృతి తెలుగసేత*

*భాషాచారిత్రిక, సాంస్కృతిక వ్యాసాలు*

భారతి - మొదలైన ప్రముఖ పత్రికల్లో ప్రచురితమైనవి.

## శ్రీ ముళ్ళపూడి సచ్చిదానందమూర్తి

వీరు కృష్ణా జిల్లాలో 29-9-1929న శ్రీమతి అన్నపూర్ణమ్మ, లక్ష్మీ నరసింహం గార్లకు జన్మించి విజయవాడలో, హైదరాబాదులో విద్యను పూర్తిగావించుకొన్ని ప్రభుత్వ కళాశాల సంగారెడ్డిలో చాలా కాలము ఆంధ్రోపన్యాసకులుగా పనిచేసి ఉద్యోగ విరమణ పొందినారు. సంగారెడ్డిలో స్థిర నివాసమేర్పరచుకొన్నారు. విశ్రాంతి ఆంధ్రో పన్యాసకులు. కృష్ణాజిల్లాలో శ్రీ శ్రీ శ్రీ సీతారామయ తీంద్రులు వీరికి - సాహిత్యంలో అక్షరాభ్యాసం గావించారు. కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి మార్గ దర్శనంలో సాహిత్య కృషి గావిస్తూ తనదైన స్వీయ శైలిలో జాతీయభావాలతో భక్తచింతనలతో సాహిత్య వ్యాసంగం గావిస్తున్నారు. వీరి రచనలు (1) తెలుగుబిడ్డ (2) వెండికొండపావురాలు (3) వీరభద్రమహాత్మ్యం (4) యాదగిరి పారిజాతం (5) మహాభియానం, కవితా సంపుటి (6) పనిమనిషి (కథల సంపుటి).

మహబూబాబాద్ సారస్వత మేఖల వారి ప్రచురణ 'కొత్తకెరటాలకు' సంపాదకులుగా పనిచేసారు. ఆకాశవాణిలో కవితాగానం గావించడమేకాక అనేక చోట్ల ప్రాచీన - ఆధునిక సాహిత్యంపై ఉపన్యాసాలు గావించారు. వివిధ పత్రికల్లో గేయాలు, కవితలు ప్రచురింపబడ్డాయి.

వీరి తెలుగుబిడ్డ గూర్చి కళాప్రపూరణ డా। గిడుగు సీతాపతి ప్రశంసించారు. వెండికొండ పావురాలను గూర్చి దాశరథిగారు సాధారణ కవి కులానికి లొంగని మధ్యాక్కరలను లొంగదీసు కున్నారని ప్రశంసించారు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'ఇట్టిది గూడ నిజమైన కవిత్వమే - ఇట్టిది కూడా ననుట కాదు, ఇట్టిదే నిజమైన కవిత్వము. ఇది అచ్చమైన కవిత్వమని' పొగడినారంటే వీరి కవితలో ఎంత బలమున్నదో తెలుసుకొనవచ్చును.

## ఉమాపతి నాగయ్యశాస్త్రి

ఉమాపతి నాగయ్యశాస్త్రిగారు సిద్ధిపేట నివాసులు. చక్కని కవితాధార గలిగిన కవి. బ్రాహ్మణులు శివభక్తి పరాయణులు.

వీరు రచించిన ఉమా మహేశ్వర స్తుతి పద్యములు గోలకొండ కవుల సంచికలో ప్రచురింపబడినవి.

గిరిచరులన్ గిరీశ్వరుల గీష్పతివాక్య విశేషవాక్యులన్
బరమ దయా సముద్రులను బాపవిమోచన శీల వంతులన్
ధరగల వస్తు రూపులను ధర్మచయ ప్రభులన్ ధనాఢ్యులన్
కరముల మోడ్చి మ్రొక్కెదను గన్నుల గాంచగ వత్తురంచునన్
శివులను శంకరాకృతుల సేవక సేవిత పాద పద్మలన్
భవులను భాగ్యవంతులను భానుకరాంతర దీప్తి దాతలన్
బవి సమగాత్రులన్ భువన పాలన దీక్ష సుబద్ధ సూత్రులన్
జవగలవారి నందరిని జాలగ మ్రొక్కచువేడు చుండెదన్

ఈ కవి క్రీ.శ. 1866 నుండి 1934 మధ్యకాలమున జీవించి యుండెను.

## ముదిగొండ ఆంగీరస శర్మ

కొంతకాలం మెదకు జిల్లా సాహిత్య ప్రభంజనాన్ని సృష్టించిన మనీషిముదిగొండ ఆంగీరస శర్మ.

తెలుగులో యం-ఓ-యల్ పట్టా చేపట్టిన శర్మగారు మెదకు జిల్లా పరిషత్తు ఉన్న పాఠశాలలో తెలుగు పండితులుగా పనిచేసి ఉద్యోగ విరమణ కన్నముందే మరణించారు, ఏ వేదికనెక్కినా వెరుపెరుగని శర్మగారు తన చతురోక్తులతో, మాటల తూటలతో సభా ప్రాంగణాన్ని అలరించే వారు.

ప్రభుత్వ పరంగా వీలైనంత మేరకు తెలుగుభాషా వికాసానికి శ్రమ చేశారు.

మెదకు మండల సాహిత్య పరిషత్తునకు ప్రధాన కార్యదర్శిగా జిల్లాలో సాహితీ వికాసాన్ని కలిగించారు. ఊరూరా, పల్లెపల్లెలో సాహితీ సదస్సుల నిర్వహించారు. ఎక్కడ ఏ చిన్నపాటి సాహితీ వేదికయైనా శర్మగారు లేనిది లేదన్న ఆశ్చర్యముకాదు.

మెదకు, గజవెల్లి, నర్సాపురం, జోగిపేటలలో జరిగిన మెదకు మండల సాహిత్య పరిషత్తు వార్షికోత్సవాలు జిల్లా సాహిత్య చరిత్రలో మరుపురాని ఘట్టాలు. ఆ ఉత్సవాల నిర్వహణా సామర్థ్యం శర్మగారి కార్యదర్శకత్వానికి సంకేతాలు.

ఆంగీరస శర్మగారు భారద్వాజస గోత్రమున ఉద్భటారాధ్య వంశమున ముదిగొండ వారింట జన్మించిరి. వీరి తాతగారు భారత ధర్మోపన్యాస విశారదులు, భారతాంబోధికుంభ సంభవులని బిరుదములు గాంచిన ముదిగొండ బుచ్చయ్య శాస్త్రిగారు. శర్మగారి తండ్రిగారు మల్లికార్జునారాధ్యుల వారు వీరి చిన్నతనముననే మరణించిరి.

ఆంగీరస శర్మగారు సరస సంభాషణా చతురులు అలవోకగా ఆశువుగా పద్యముల్లగలిగిన కవివర్యులు. వీరి అనేక వ్యాసములు వివిధ పత్రికలలో ప్రచురింపబడినవి.

శర్మగారు రచించిన 'చార్మినార్' కావ్యము వీరి ప్రతిభా పాటవములకు మచ్చుతునక కాని యది యముద్రితము.

వీరు రచించిన వ్యాసభారతి వీరిలోని కవితా భావాన్ని, మానవతావాదాన్ని చవి చూపుతుంది. వ్యాస భారతిలో నుండి ఒక పద్యము.

నాకు గావలె తల్లి ! నాదేశ వైభవ
సత్క్రాంతి భాజ్యమౌ శాంతి పథము
నాకు గావలె తల్లి ! నరజాతి సద్భావ
వసుధైక పోషణ వాఙ్మయమ్ము
నాకు గావలె తల్లి ! మైత్రేయ మధురోహ
సంవలిత వ్యాప్తి సాధుకర్మ
నాకు గావలె తల్లి! నాక ప్రతి స్పర్థ
ప్రగతి ప్రతిష్ఠమౌ రమ్య సీమ

జీవకారుణ్య కల్యాణ చేతనాన
పుడమి పుకలరించవలయును ముదమునంది
సర్వ విద్యాభివర్ధని శారదాంబ
వ్యాసభారతి నీకిదే వందనమ్ము

## యం. రంగ కృష్ణమాచార్యులు

రంగ కృష్ణమాచార్యులు అందోలులో జన్మించిరి వీరికి తల్లిదండ్రులు గోదా నాయకమ్మ, రంగాచార్యులుగారులు వీరు శ్రీవత్సస గోత్రులు. ఆపస్తంబ సూత్రులు.

ఆచార్యులుగారు బి- ఓ- యల్ పట్టాపొందిరి. వీరి సంస్కృతము, తెలుగు, హింది, ఉర్దూ, ఆంగ్ల భాషలలో ప్రవేశము కలదు.

వీరు స్వయముగా కవియై మెదకు జిల్లా కవులకొకవేదికను కల్పించిరి. మెదకు జిల్లా రచయితల సంఘమును స్థాపించి సుమారు 20 సంవత్సరములు సాహిత్య సేవ యొనరించిరి. ఉపాధ్యాయ వృత్తి చేయుచు సారస్వత సేవ కొనసాగించిరి. ప్రస్తుతము ఆధ్యాత్మిక ప్రచారమున తన జీవితమును కొనసాగించుచున్నారు.

ఆచార్యులు రచించిన గ్రంథములనేకము గలవు. గురు భక్తి, జోగినాథ పద్యకృతి, రంగనాథ స్తవము (దండకము), దేశం కోసం సందేశం (నాటకము), నవజీవనం (నాటిక) లాల్ బహదు రీయం (గేయ కావ్యము), నాకవనం (కవితా సంపుటి), వీర భద్రీయం (పద్య కావ్యము) వేంకటాచలము (గేయ కావ్యము), గేయగీత సంకలనం శ్రీ రామసుప్రభాతము మొదలగు గ్రంథములు రచించి ముద్రించినారు.

## శాస్త్రుల చంద్రమౌళి శర్మ

చంద్రమౌళి శర్మ గారు మండల కేంద్రమయిన దౌల్తాబాదు గ్రామములో గోమతీ వేంకటేశ్వర శర్మలకు, ధాతనామ సంవత్సరమున జన్మించిరి. చిన్ననాట స్వగ్రామమున ప్రాథమిక విద్యను పూర్తి చేసుకుని శ్రీ యాదగిరి లక్ష్మీనరసింహస్వామి సంస్కృత పాఠశాల వేదాంత వర్థినీ సంస్కృత కళాశాలలో వేద, సంస్కృతములనభ్యసించిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి యం. ఓ. యల్ పట్టాను పొందిరి. ఉపాధ్యాయ వృత్తిలో కొనసాగుచూ వైదిక ధార్మిక కార్యక్రమములలో పాల్గొందురు.

వీరు జాతక, ముహూర్త, వాస్తు శాస్త్రములలో ప్రావీణ్యమును సంపాదించి ఆయా విద్యలతో ప్రజోపయోగమైన కార్యక్రమములను చేపట్టుచున్నారు.

సంస్కృతాంధ్రము లందు సరళమైన శబ్దాలతో కవిత్వమును రాయగల నేర్పరి. ఆయా సందర్భములలో వీరు రచించిన పద్యములనేకములు కలవు. వీరి రచనలు.

1. చంద్రశేఖర శతకము

2. కాళహస్తీశ్వర గేయమాలిక

3. రాధికామనోహరీయము

ఇవికాక అనేకగేయములు పాటలు కలవు. వీరి రచనలో మచ్చునకొకటి. (రసతరంగాలు అను సంచిక నుండి)

నందకుమారుడమ్మ శుభనామము కృష్ణుడోయమ్మ నమ్ముమా
యందము దోచెనమ్మ హృదయాంతరగేహము వీడడమ్మకా
లందియ లెల్లఘల్లుమన నా మురళీరవప్రేమ గీతిచే
మందులమైతిమ్మ మెట్టుమాయము నొందెనొ దెల్పుమమ్మరో

## గుమ్మన్నగారి లక్ష్మీ నరసింహ శర్మ

అష్టావధానమంటే ఇట్లా ఉంటుంది అని మెదకు జిల్లా వాసులకు తెలియ జెప్పిన ఘనత గుమ్మన్న గారి లక్ష్మీ నరసింహ శర్మగారిదని చెప్పవచ్చు.

కొంతకాలం జిల్లాలో ఏచోట అష్టావధాన మన్నా అది గుమ్మనదనేంత ప్రచారం జరిగింది.

దుబ్బాక మండలంలోని పోతారెడ్డి పేట గ్రామంలో శ్రోత్రియ కుటుంబంలో లక్ష్మీ నరసింహ శర్మగారు జన్మించిరి.

శర్మగారు రామాయంపేటలో (H.S.C) వరకు చదువుకొని ఉపాధ్యాయ వృత్తిని ప్రారంభించి ఉస్మానియా యూనివర్సిటీ నుండి (బి.ఓ.యల్.) పట్టానందుకొని ప్రథమ శ్రేణి భాషా పండితులుగా చాలా కాలము పని చేసి పదవీ విరమణ గావించిరి.

పద్యాన్ని హృద్యంగా చెప్పడం, శ్రోత్ర పేయంగా వినిపించడం ఈయనకు వెన్నతో పెట్టిన విద్య.

చిన్న నాటి నుండే పద్యాలల్లడం ప్రారంభించి, అష్టావధాని గౌరీభట్ల రామకృష్ణ శర్మ గారి శిష్యరికంలో అష్టావధానాన్ని నేర్చుకొన్నారు. ఎన్నో అవధానాలు సుమారు 300 పైగా దిగ్విజయంగా పూరించారు. వీరు రచించిన గ్రంధాలు.

"అద్యమాతృక", కవితాకల్యాణి,

వీరి రచనా వైదిగ్ధ్యానికి ఒక ఉదాహరణ.

ఒకటే రూపిక, బొమ్మతో బొరుసుతో నొప్పారినట్లొక్క మా
టకు రెండర్థములట్టు తాపుడమి నిండన్ ద్వంద్వ మాభాస రూ
పకమే తాత్విక నిత్య సత్యము శివాద్వైతంబగున్ సమ్మని
ప్రకరాంతర్మకురాకృతీ! ప్రణవముద్రా! విశ్వనాథేశ్వరా
(ఆద్యమాతృక నుండి).

## అష్టకాల నర్సింహరామశర్మ

ఏ చదువులతల్లి దయతో తానింత వాడయ్యాడో ఆ అమ్మకో గుడికట్టడం కోసం తన జీవితాన్ని ధారపోసిన మహనీయుడు అష్టకాల నర్సింహ రామశర్మ.

సిద్దిపేటకు సమీపంలో రాజగోపాల్‌పేట గ్రామంలో మనోహరాంబ, లక్ష్మయ్యలకు జన్మించిన అష్టకాల చిన్నతనంలో తల్లి మరణంతో అనేక కష్టాలను అనుభవించినాడు. ఆ అనుభవసారమే భావి జీవితంలో ఆయనకు పట్టుదలను కలిగించింది.

వరంగల్లు ప్రాచ్యకళాశాలలో బి-ఓ-యల్ చదువుకొని ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించిరి. తర్వాత ఎం-ఏ పరీక్ష ఉత్తీర్ణులైరి. చిన్నతనం నుండే తెలుగు సాహిత్యాన్ని ఆపోశన పట్టి తెలుగున కవితల్లడం ప్రారంభించారు.

**అష్టకాల తెలుగు కృతులు.**

1. పురుషోత్తముడు
2. రామప్రభుశతకం
3. శిథిల విపంచి
4. తుకారామ స్వామి చరిత్రము
5. చిత్రలేఖ
6. శ్రీరామచంద్రిక
7. వాసరేశ్వరీ శతకం
8. ఆత్మవేదం
9. అష్టకాలసత్యాలు
10. బ్రహ్మర్షి దైవరాతుడు
11. షష్టిపూర్తిదాని అవసరము
12. శ్రీ సరస్వతీ దీక్షా నియమావళి
13. ఛందోదర్పనం సంస్కృత రచనలు
14. అఖండానంద సరస్వతీ స్వామి పూజ
15. శ్రీ సరస్వతీ దేవి షోడశోపచారపూజ,
శ్రీ సర్వసతీ దేవి సుప్రభాతమ్,
శ్రీ సర్వస్వత్యష్టకమ్ - శరణాగతి
16. నికారదేవీ సహస్రానామ స్తోత్రమ్
17. శ్రీదేవీ పూజాకల్పము
18. సారస్వతీం భావయే
19. సరస్వతీ స్తోత్రమ్
20. శ్రీ సరస్వతీ స్తుతి కల్పమ్
21. శ్రీ రామ సుప్రభాతమ్

పద్యం, గేయం వచన కవిత అనే మూడు రకాల ప్రక్రియలలో చేయి తిరిగిన దిట్ట శ్రీ అష్టకాల. అష్టకాల నర్సింహరామశర్మ కవి, అవధాని. ఇప్పటికి 200 పైగా అష్టావధానాలను జయప్రదంగా పూర్తిచేసిరి. తెలంగాణాలోనేకాక యావదాంధ్ర దేశమున వీరు అష్టావధానములు చేసి శభాషనిపించు కొనిరి.

ఇవన్నిటికి తోడు తన అష్టావధానాలతో అనంత సాగర్ కొండలలో ఆయమ్మ సరస్వతమ్మకు ఒక చక్కని దేవాలయమును నిర్మించిరి.

సరస్వతీ యజ్ఞముల పేర నెలకొక్కచోట యజ్ఞమును జరిపించుచు ఐహికాముష్మికములతో భక్తుల తరింప జేయుచున్న అష్టకాల నర్సింహ రామశర్మ మెదకు జిల్లాకే గర్వకారణమని చెప్పవచ్చును ఆయన రచనకొక ఉదాహరణ.

అతడుద్వాసితశాత్రవప్రకర జీవానంతనిస్త్రింశుడ
ప్రతిమానోద్భట హస్తి వాజిసహితాభ్యమర్ద వీరారి ఘో
రతమః ఖండన మండలుండు నృపవారాభ్యర్చ్య యుండా తత
ఘం శ్రితపోడనఘుండు సర్వజన సంసేవునాడు దారుండిలన్

వీరికి కవితా సుధాకర, అవధాని శిరోమణి, అవధాన కళాప్రపూర్ణ, బ్రహ్మి విభూషణ, సారస్వత శిరోమణి, కవికేసరి, కవికోవిద, అని బిరుదములు కలవు.

## ములుగు నర్సింహాచార్యులు

నర్సింహాచార్యులుగారు ములుగు (మండల కేంద్రము) గ్రామ వాస్తవ్యులు. క్రీ.శ. 1899లో వీరు జనన మందిరి. వీరు సంస్కృతాంధ్రములందు చక్కని ప్రవేశవుగలవారు. గొప్ప పౌరాణికులుగా పేరుగాంచినవారు.

వీరు రచించిన 'రాష్ట్రప్రేమ' సంస్కృతశ్లోకములతో గలదు.

సర్వేశస్వాదఖిల చిద చిత్సాదు వృత్తి ప్రవృత్తః
సర్వాత్మనః స్వపర సదృశజ్ఞాన సంపాదకాస్యః
సర్వంభోగ్యం ప్రకృతి జమిదం సత్వదం సాత్సకాలే
నైజాం రాష్ట్రే భవతి సతతం సత్కవీనాం సమృద్ధిః

వీరి రచన గోలకొండ కవుల సంచికలో ముద్రించబడినది.

## ముత్యంపేట సాంబయారాధ్యులు

ముత్యంపేట సాంబయ్యగారు క్రీ.శ. 1889లో పుణ్యదంపతులగు శంకరాంబమల్లయ్యగారులకు జన్మించిరి.

సిద్దిపేటలో నివసించిరి. వీరు త్రిలోక గురు చెన్న మల్లికార్జున పండితారాధ్య వంశీయులు.

సంస్కృతాంధ్ర భాషల్లో చక్కని పండితులు, పండితకవి, వీరభద్ర దండకము, శివస్తవసుధ, శంకరీ స్తవామృతము, రామామణి నాటకము, శ్రీశైల మల్లికార్జున సుప్రభాతము, దాశరధీలింగ స్తోత్రసుధ, శివలీలా మృతము ముద్రిత గ్రంధాలు. మరో పది అముద్రిత రచనలున్నాయి.

వీరు జయంతిలక్ష్మి అను గ్రంధమును రచించిరి. ఈ గ్రంధమునందు భగవద్గీత జయంతి నీలకంఠాచార్య జయంతి, శ్రీ శంకరాచార్య జయంతి, శ్రీ శీతలాస్తవ పద్యములు కలవు.

ఈ గ్రంధమునకు శ్రీ శైవ మహాపీఠాధిపతులు ముదిగొండ వీరేశలింగారాధ్య శాస్త్రిగారు, ముదిగొండ నాగభూషణ శాస్త్రిగారు, ఉభయ భాషాప్రవీణ, సాహిత్య వ్యాకరణ శిరోమణి మల్లికార్జున

శాస్త్రిగారు చక్కని అభిప్రాయములనొసగిరి. ప్రచారం దక్కక పోవడం వల్ల వీరి పాండితీ గరిమ పండిత లోకంలోనే ఉండిపోయింది.

భక్తిమత సాంప్రదాయమున వీరి రచనలు శివారాధ్యుల మెప్పును బడిసినవి. ఆరాధ్య కవిత యాధ్యాత్మిక మార్గమున పండితారాధ్యుని కాలము నుండియే శివ కవులందరకు మార్గదర్శకమైనది.

## గజవాడ హనుమత్కవి

హనుమంత్కవి గారి ఇంటి పేరు గజవాడ నివాసము అల్లాదుర్గము. తల్లిదండ్రులు తులసమ్మ, రంగాచార్యులు. వీరిది ఆశ్వలాయన సూత్రము గౌతమస గోత్రము వీరు మధ్వ బ్రాహ్మణులు, వీరు క్రీ.శ.1898లో జన్మించిరి. 1948లో పరమపదించిరి. హనుమత్కవిగారు రచించిన 'మనోహర పద్మావతి' నాటకము క్రీ.శ. 1930వ సంవత్సరమున ముద్రింపబడినది. సంస్కృతాంధ్రము లందు విశేష పాండిత్యము గల వీరు శత నాటక కర్తలుగా పేరు గాంచిరి.

వీరి పద్మావతి నాటకము భవిష్యోత్తర పురాణాంతర్గత శ్రీనివాస కళ్యాణ కథనం గ్రహించి నాటక రూపముగా వ్రాయబడినది. ఈ నాటకము వేంకట లక్ష్మారెడ్డి దేశ్‌ముఖ్ గారి ధర్మపత్నియగు శ్రీమతి వేంకట బుచ్చాయమ్మగారికి అంకితం ఈయబడినది.

హనుమత్కవి పద్యములు గోలకొండ కవుల సంచికలో ముద్రించబడినది.

ఈకవినెవ్వరైన సుఖ మిత్తురు సన్ముఖులైన నిత్తురా
లోకమునంగనంబడు విరుద్ధముగానెటులన్న జూడు మా
వ్యాకులతన్యదా విముఖులైన భవిత్క్రియ రూపమేలకో
సైకలునెక్కు నాగరిక సంఘము సాక్షముగా ప్రభంజనా

## వేలేటి మృత్యుంజయశర్మ

మిరిదొడ్డి మండలం చెప్యాల గ్రామంలో 1942లో జన్మించిన వేలేటి మృత్యుంజయ శర్మగారు చిన్నతనంలో వేదాంతవర్ధినీ సంస్కృత కళాశాల హైదరాబాదులో విద్యాభ్యాసం చేసి బి.ఓ.ఎల్. డిగ్రీ పుచ్చుకున్నారు. ఉస్మానియా విశ్వవిదాయలయం నుండి ఎం.ఎ., తెలుగు పట్టాను పొందినారు. కొంతకాలం జిల్లా పరిషత్తులో తెలుగు పండితులుగా మరికొంత కాలం జూనియర్ కళాశాలలో ఉపన్యాసకులుగా పనిచేసి పదవీవిరణమణ పొందినారు. సంస్కృతాంధ్రభాషాసాహిత్యాల్లో చక్కని పాండిత్యం కలిగిన వీరు సంస్కృతంలోను తెలుగులోనూ ఎన్నో పద్యాలనల్లారు. పుస్తక ప్రచురణే కవికొలమానానికి గీటురాయికాదు.

వీరు అక్కడక్కడా యిచ్చిన ఉపన్యాసాల్లో ఆశువుగా చెప్పిన పద్యాలు ఎన్నో వున్నాయి. సరసుడు, నిరాడంబరుడు, నిగర్వి, స్నేహశీలి అయిన మృత్యుంజయ శర్మగారు ఎప్పుడూ సాహితీమిత్ర మండలితో ఉంటారు.

## శాస్త్రుల పాండురంగ శర్మ

పాండురంగ శర్మగారు పెంటమ్మ, పులయార్యుల రెండవ కుమారులు. చిన్ననాటనే సంస్కృత విద్యాభ్యాసమును యాదగిరి నృసింహ స్వామి క్షేత్రమునందలి సంస్కృత పాఠశాలలోను. వేదాంతవర్ధినీ కళాశాలలోనూ చదివి సంస్కృ తాంధ్రము లందు బి.ఓ.యల్ పట్టాలను పొంది, ఆ తరువాత యం.ఏ పూర్తిచేసి ఉపాధ్యాయులుగా ఉపన్యాసకులుగా విద్యా సేవ చేసిరి. ప్రతి సమావేశములోనూ అధికారులను మొదలు ఆబాలగోపాలమును తమ ఉపన్యాసముచే ఆనందింపచేయగల సమర్థులు. ఎన్నోగేయ రచనలేకాక "పాండురంగ సూక్తి" అను శతకమును గూడా వ్రాసిరి. వీరికి ఉపన్యాస కిశోర, కవిశార్దూల, కళావాచస్పతి మొదలగు బిరుదములెన్నో కలవు. రాష్ట్రప్రభుత్వ నయోజన విద్యాయాపథకమునందు సభ్యులుగా ప్రభుత్వముచే నియమింపబడి నేటికినీ సేవలందించుచున్నారు.

## శాస్త్రుల రామనాథ శర్మ

చంద్రమౌళి శర్మగారి సోదరులయిన వీరు సంస్కృతాంధ్రములందు చక్కని పాండితీ ప్రతిభ కలవారు. అన్నగారితో పాటు వేద, సంస్కృతము లనభ్యసించి సంస్కృత, తెలుగు బి.ఒ.యల్‌పట్టాలను పొందిరి. ఉపాధ్యాయవృత్తిలో కొనసాగుచ్చూ దేవీ ఉపాసకులుగా కీర్తిగడించిరి. జోతిష్య శాస్త్రమును కూలంకషముగా గ్రహించిన వీరు "దైవజ్ఞశిరోమణి" అను బిరుదును పొందిరి. ధార్మిక కార్యక్రమములలో చురుకుగా పాల్గొనుచూ, దేవతా ప్రతిష్ఠల యజ్ఞకార్య నిర్వహణములందు ఆచార్యత్వమును వహింతురు.

అప్పుడప్పుడు అలవోకగా సంస్కృతాంధ్రము లందు కవిత్వమును చెప్పి ప్రజల నలరింతురు.

## యస్. కృష్ణమూర్తి శర్మ

కృష్ణ మూర్తి శర్మగారు చంద్రమౌళి శర్మగారి కనిష్టసోదరులు అన్నలతో పాటు వీరు కూడా వేదసంస్కృతములను అభ్యసించిరి. కృష్ణమూర్తిగారు బి.ఓ.యల్ పట్టాను పొంది ఉపాధ్యాయ వృత్తిని చేపట్టి స్వయముగా ఆంగ్లహిందీ భాషలలో సునిశితమైన పాండిత్యమును సంపాదించిరి. శ్రావ్యమైన కంఠము మనోహరమైన పదలాలిత్యముతో సభికులను రంజింపజేయుదురు. వీరు చక్కని తాత్త్విక పరిజ్ఞానం కలవారు.

వీరు రచించిన కావ్యములు

1. మూక పంచశతీ ఆంధ్రానువాదము
2. ఆర్యాశతకము
3. దేవీ మహిమ

ఇవికాక వీరు రచించిన ఎన్నో వ్యాసములు వివిధ పత్రికలలో ప్రచురించబడినవి. గేయములు, పాటలు, మంగళహారతులు అసంఖ్యాకములు కలవు.

## భాగవతం రామారావు

ప్రముఖకవి భాగవతం సీతారామశర్మ కుమారులయిన రామారావుగారు సంస్కృతాంధ్రము లందు బి.ఓ.యల్ పట్టాను. సంస్కృత ఎం.ఏ., డిగ్రీలను పొందిరి. ఆయుర్వేద విశారద ఉత్తీర్ణులైన వీరు ఆయుర్వేద పరిశోధనా అధికారిగా హైదరాబాద్, మద్రాసులలో ఉద్యోగము నిర్వహించిరి. వీరు కొంతకాలము డిప్యూటీ తహసిల్దారుగా ఉద్యోగమొనర్చిరి.

వీరు సంస్కృతాంధ్రములందేగాక ఇంగ్లీషు హిందీ సాహిత్యములందు కూడా కృషిచేసిరి. వీరి వ్యాసములు 'భారతి' వంటి సాహిత్య పత్రికలతో బాటు ఆంధ్ర భూమి ధన్వంతరి మొదలగు పత్రికలందును వెలువడినవి. ముఖ్యముగా మాండలిక పదములను గురించి రాసిన వ్యాసము వీరి పరిశోధనా పటిమకొక మచ్చుతునక.

## అబ్బరాజు గోవిందరావు

గోవిందరావు గారు కౌడిపల్లి మండల చిట్కూల గ్రామ వాస్తవ్యులు. వీరు 1934 సెప్టెంబరులో జన్మించిరి. వీరి తల్లి దండ్రులు సుబ్బలక్ష్మమ్మ వెంకటాచలమయ్యలు.

గోవిందరావుగారు తెలుగు సంస్కృతము హిందీ భాషల్లో మంచి ప్రవేశము గలవారు. కొంతకాలం ఉపాధ్యాయ వృత్తిలో నుండిరి.

వీరికి జ్యోతిష్యము ఆయుర్వేద వైద్యములలో ప్రవేశము కలదు. "కవితా సుమములు" "ఆత్మ ప్రణాళిక" అనునవి ముద్రిత రచనలు.

## డా॥ కిడాంబి నరసింహాచార్యులు

శివంపేట మండలము నందలి దొంతి గ్రామమున కమలమ్మ, శ్రీనివాసాచార్యులకు జన్మించిన నరసింహాచార్యులు యం.ఎ పట్టాను పొంది ఉపన్యాసకులుగా సంగారెడ్డిలో పనిచేయుచున్నారు. వీరు వైష్ణవ భక్తి తత్వములపై పరిశోధనా వ్యాసము వ్రాసి ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి డాక్టరేట్ పట్టా పొందినారు.

వీరు అనేక సంస్కృత రచనలను తెలుగులోనికి అనువదించినారు.

## ఉప్పల రాములు గుప్త

1944లో కాచాపురం గ్రామంలో జన్మించిన ఉప్పల రాములు గుప్త నారసింగి నివాసము నేర్పరుచుకొనిరి. సాహిత్య గ్రంథావలోకనము కవిత్వము జ్యోతిషమునందు పరిచయమున్న వీరు వ్యాపారము వృత్తిగాగలవారు.

గుప్తగారు "శ్రీ విశ్వేశ్వర శతకము", "భగవద్గీత బుర్రకథ" రచించిరి.

## అద్దంకి తిరుమల వేంకట కృష్ణమాచార్య

వేంకట కృష్ణమాచార్యులు నారాయణఖేడ్ మండలమునందలి కడ్పల్ చల్లగిరి దేవస్థానమున స్వభాను సంవత్సరమున జన్మించెను. వీరితండ్రిగారు నారాయణాచార్యుల వారు చల్లగిరి దేవస్థానమున వంశపారంపర్య అర్చకులుగా నుండిరి.

వేంకట కృష్ణమాచార్యులు బి.ఓ.యల్ మరియు ఎం.ఏ పట్టాలను ఉస్మానియా విద్యాలయము నుండి పొంది మెదకు జిల్లా పరిషదున్నత పాఠశాలలో ప్రథమాంధ్ర పండితులుగా పని చేయుచున్నారు.

వీరు మరాఠీ, కన్నడ, భాషా సంస్కృతులు గలిగిన తెలుగు, ఉర్దూ భాషలు మాట్లేడే నారాయణ ఖేడ్‌లో తెలుగు భాషా సాహితీ సంప్రదాయాలను కాపాడుటకై అనవరతము శ్రమ మొనర్చినారు. ఆంధ్రసారస్వత పరిషత్తు వారి పరీక్షా కేంద్రమును నారాయణ ఖేడ్‌లో నడుపుచు తెలుగు భాషాభివృద్ధికి చేయూత నొసంగుచున్నారు.

నారాయణఖేడ్ సాహిత్య సమితిని స్థాపించి సాహిత్య సభలు నిర్వహించుచు సాహిత్యోపన్యాములు, గ్రంధావిష్కరణములు, అష్టావధానములు మున్నగు కార్యక్రమములు యధోచిత రీతిగా కొనసాగించు చున్నారు.

వీరి రచనలు

1. చల్లగిరి లక్ష్మీ వేంకటేశ్వర సుప్రభాతము
2. శ్రీ రామ చంద్ర సుప్రభాతము
3. నృసింహ స్తవము - నృసింహదండకము
4. చంద్రకళాంధ్ర వ్యాకరణము
5. శ్రీకృష్ణగీత
6. అద్దంకి సుద్దులు
7. తిరుమల తెరువులు మున్నగునవి రచించిరి.

హైద్రాబాదు ఆకాశవాణి ద్వారా వీరి కవితలు అనేకము ప్రసారము జరిగినవి.

## భువనగిరి నారాయణ రెడ్డి

కోహీరు సమీపమునందలి మాచిరెడ్డి పల్లె వాస్తవ్యులయిన లక్ష్మారెడ్డి కుమారులు నారాయణ రెడ్డిగారు. 1935 జనవరిలో వీరు జన్మించిరి. బి.ఏ పట్టభద్రులు తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ, హిందీ భాషలలో ప్రవేశము కలవారు. స్వయముగా కవియై కవి పండితులకు ప్రోత్సాహము సహకారము నందించినవారు. వీరొకఖండకావ్యమును కొన్ని వ్యాసములను కొన్ని కథలను వ్రాసిరి.

## పణ్యాల నారాయణరెడ్డి

సిద్దిపేట సమీపంలోని బద్దిపడగ గ్రామంలో రుక్కమ్మ, వీరారెడ్డిగార్లకు 1935లో నారాయణ రెడ్డిగారు జన్మించిరి.

హిందీ, తెలుగు, ఇంగ్లీషు భాషల్లో ప్రవేశము కలిగి హిందీ ఉపాధ్యాయ వృత్తిని నిర్వహించిరి. వీరి గేయపద్యచాటువుల సంపుటిలో కర్షకుని గురించి రాసిన పద్యములు.

మల్లు కట్టియలో నుండు ముత్తియములు
హలములో నుండు నందాల ఆంధ్రజ్యోతి
నీదు మనసున గలదు నిర్నిద్ర భక్తి
అందుకే పంటనిచ్చు నీకవని తల్లి

రైతులను గొట్టి రత్నహారముల దాపి
రచ్చకెక్కిరి రాకాసి రాజులంత
కన్నుగుట్టియు వారిపై కత్తిగట్టి
పంచుకున్నారు పరదేశ ప్రభువులంత

## జి. విజయకుమార్ రెడ్డి

కోహీరు వాస్తవ్యులయిన విజయకుమార్ రెడ్డి 1940లో జన్మించిరి. బి.ఏ., బి.ఇడి., యోగ్యతలు గలిగి ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నారు. తెలుగు భాషపై అనురక్తి, భారతీయ సంస్కృతి పట్ల ఆసక్తి కలవారు. వీరి కలం పేరు విజయశ్రీ వీరి కలం గీచిన గీతలలో శ్రీ శాస్త్రి, 'కలమాకదలవేలా', 'జీవన స్రవంతి', 'ఓంకారేశ్వర చరిత్ర' మొదలగునవి రచించిరి. కలమాకదలవేల నుండి ఒక చరణం.

మంజులముగ చరణములు కదల్ప
మంజీరము లేల మ్రోగునో
భావాలు తరంగాలై పరుగెత్తువేళ
కలమేల అడుగిడ తడబడునో.

## జె. మాణిక్య రెడ్డి

తేరుపోలు గ్రామంలో జన్మించిన మాణిక్యరెడ్డి గారి తల్లిదండ్రులు సత్యమ్మ రామారెడ్డి గార్లు.

మాణిక్యరెడ్డిగారు 'పంచాయితీ' అను నాటకమును వ్రాసిరి. ఈ నాటకమును మొదట సంగారెడ్డి కళానికేతనము వారు ప్రదర్శించిరి.

## చిదిరె రాజేశ్వర రావు

రాజేశ్వరరావుగారి జన్మస్థానము అందోలు వీరి తండ్రి చంద్రయ్యగారు వీరు సంస్కృతాంధ్రములలో, ఉర్దూ, ఇంగ్లీషులో బి.ఏ పట్టాపొందినవారు.

వీరు వ్రాసిన ఖండ కావ్యములు అనేకములు దేశబంధు తెలుగు పత్రికకు విలేఖరులుగా నుండిరి.

వీరి పద్యములు కొన్నిగోల కొండకవుల సంచికలో ప్రచురింపబడినవి.

వాసనలజల్లునుద్యానవనములందు
నవనవ పరీమళములొల్కు పూవులేవా
ఒకడు జూచిన పువ్వు నింకొకడు వెదికి
కోయదలచుని దేమియన్యాయ మొక్కొ

ఇదియే సృష్టి రహస్యమో వెదికి యొక్క
విరిని గానమి యాశకు విలువ లేదొ
యొకడు ప్రేమించునది తనకొదువదేని
యప్పుడే మూల్యమింతని చెప్పగలడు

## బచ్చువేంకటేశ్వర గుప్త

వేంకటేశ్వరగుప్తగారు నివాసము సదాశివపేట సంపన్న వైశ్య కుటుంబమున జన్మించిరి. వీరి తండ్రి బచ్చురామన్న గుప్త సంస్కృతాంధ్ర ఉర్దూ భాషలలో పాండిత్యముగలవారు తండ్రివలె వేంకటేశ్వర గుప్తగారు కూడా ఆంధ్ర, ఆంగ్ల, ఉర్దూ, హిందీ భాషలలో చక్కని ప్రవేశము గలవారు. న్యాయవాద వృత్తిలో నుండియు అటు వ్యాపారము, ఇటు సాహిత్య వ్యాపారమును గావించువారు. నైజాం సర్కారు నెదిరించుటచే వీరిని మెదకు, గుల్బర్గ, హైద్రాబాదు చెరసాలలో ఒక సంవత్సరము పాటు బంధించిరి రజాకార్లు కాశీంరజ్వీనాయకత్వమున సదాశివ పేటలో జరిపిన దహనకాండలో వీరి సంపద కొల్లగొట్టబడినది.

గుప్తగారు ఆధ్యాత్మిక తత్వజ్ఞులు. వీరు సరళమైన శైలిలో జీర్ణోద్ధారము, అమృతబిందువులు అను గ్రంథములు రచించిరి.

జీర్ణోద్ధారమునందు నిజాం ప్రభుత్వమున హిందువులకు ప్రాధమిక హక్కులందు గలభంగపాట్లు, తన తండ్రియగు బచ్చురామన్న గుప్తగారు రామాలయ జీర్ణోద్ధారమున తురకలను, తురక ప్రభుత్వమును ఎదిరించిన విధము చక్కగా వర్ణింపబడినది.

ఆనాటి తురకల దుర్మార్గమును వర్ణించు కవిత

తురకల యుత్సవములక
క్కరలేదట యాజ్ఞమించుకయు హిందువులం
దరు ప్రతిమాటకు హుకుమును
పరిపరి కొనవలయు నయ్య బహురూపధరా

దొరనైజాం తురకగుటన్
తరమా చెప్పగ తురకల దమన పునీతుల్
వారల పండగలుండిన
జరుపగ రాదంద్రు హిందు జనమహమమరా

వీరు రచించిన 'అమృత బిందువులు ' లో

1. సాహిత్యవీచికలు 2. రాజకీయరంగము
3. ఆర్థిక వ్యవస్థలు 4. సాంఘిక సమస్యలు
5. నైతిక రీతులు అను శీర్షికలు గలవు.

ఈ గ్రంథమునకు దివాకర్ల వేంకటావధానిగారు, బూర్గుల రామకృష్ణరావు గారు సదభిప్రాయముల నొసగిరి.

ఇందులో నుండి ఒక పద్యము

కలుపు మొక్కలు పంటలో మొలచునట్లు
మూఢ విశ్వాసములు కొన్ని గాఢమగను
మమతలో జేరి దానిని మలినీపరచు
వాని దొలగింపజేయుడీ వరుసతోడ

వీరిరచనలో సాపడె, సర్కారి యాజ్ఞ దరఖాస్తు, రిటైరు, మొదలైన అన్యభాషాపద ప్రయోగములు గలవు.

## హరిపురం వెంకటరామయ్య

ఈ కవిగారి యింటి పేరు హరిపురంవారు. నివాసము సిద్ధిపేట తల్లిదండ్రులు అండాళమ్మ, రంగయ్య గారులు. వీరు 25 మార్చి 1909లో జన్మించిరి ఉపాధ్యయ వృత్తిలో జీవనము గడిపిరి.

వెంకట రామయ్యగారు తెలుగు - ఉర్దూ భాషలలో ప్రావీణ్యము గలవారు. సంస్కృతము నందును కొంత ప్రవేశము గలదు.

వెంకటరామయ్యగారు 'సంచారి' అను గ్రంథమును రచించి ముద్రింపించిరి 'సంచారి'లో సాక్షి ఉపన్యాసముల ధోరణి కనిపించుచున్నది. కోడళ్ల మహాసభ, అత్తల మహాసభ మొదలగు శీర్షిక సాక్షి ఉపన్యాసముల స్మరణకు దెచ్చుచున్నది. ఈ గ్రంథమున మొత్తము 11 (పదకొండు) శీర్షికలున్నవి. ఒక్కొక్క శీర్షికలో ఒక్కొక రకమైన చెడును విమర్శించుట జరిగినది.

నేటికాలములో చెలరేగుచున్న ఎన్నో వికారాలను తూర్పారబట్టి సమాజమును చక్కబరచుటకు ప్రయత్నము చేసిరి.

### నేతలు

నేతలు నీతులు బలికి సేతులు కడుపారదాగి
కోతల పదివేలుకోసి చేతలు ఒకటైన లేక
జాతరలను కూర్చుమనగ మాతర
మాయిపుడెట్టు లే దితరము తప్పనిసరి వాతలు
మూడే సిచూపి గోతులలో పడదోయదు జాతి
నీతులులేకను
వాతావరణము చూడక
మతి మాలిన ఆలోచనలో
గతిగా నరుయోచింపరు
సతతము పదవుల ధ్యానమే

ఈ రచన మొత్తము గేయములు వచన కవిత వలె అను ప్రాసాలంకరమున నొప్పారు చున్నది.

ఈ గ్రంధమునకు దివాకర్ల వెంకటావధానిగారు సాభిప్రాయము నొసంగిరి.

## డాక్టరు కృష్ణమూర్తి

కృష్ణమూర్తిగారు సిద్ధిపేట వాస్తవ్యులు వైద్యవృత్తిలో జీవించినవారు మంచి రసికులు హాస్య రసమునందు వీరికి ప్రీతి మెండు. వీరి పద్యములుశ్లేషతో నుండి చమత్కారమున నవ్వు పుట్టించును.

వీరి పద్యములు గోలకొండ కవుల సంచికలో కొన్ని ప్రచురింపబడినవి.

## మరింగంటి సీతారామాచార్యులు

వీరు దుబ్బాక మండలమునందలి ధర్మాజిపేట నివాసులు, నర్సింహా చార్యుల పుత్రులు ఆచార్యులు బి.ఓ.యల్ పట్టము పొందిరి. సంస్కృతాంధ్రము లందు పాండిత్యములగలవారు ఉపాధ్యాయ వృత్తినెరపిరి వారు. వీరు

1. లేఁబ్రాయము 2. ఆత్మార్పణము
3. పెళ్ళి 4. ఆధునిక విజ్ఞానము
5. అభిరుచులు 6. హాస్యరసపోషణము
7. వ్యాసరచనమున్నగు పుస్తకముల రచించిరి

ఇందుకొన్ని ముద్రింపబడినవి వీరి రచన మృదుమధుర ధారాశోభితమై యుండును.

వీరు రచించిన లేఁబ్రాయము నుండి మచ్చునకు

భావి పరుడగు టకిది పట్టుగొమ్మ
నవసమాజ ప్రగతికిది పట్టుగొమ్మ
ఆనందాల నందించే నాకలోక పారిజాతము
అందచందాలు చిందించే లేఁబ్రాయము

## పెండ్యాల హనుమచ్ఛర్మ

పెండ్యాల వెంకటరామయ్య గారి కుమారులైన హనుమచ్ఛర్మగారు అందోలు నివాసులు తెలుగున చక్కని కవిత్వము చెప్పలగల నేర్పరులు. వీరి రచనలు దేశబంధు, నీలిగిరి పత్రికలలో ప్రచురింపబడినవి.

గోలకొండ కవుల సంచికలో వీరు రచించిన 'హృదయ నిర్వేదము' నందలి గీత మాలిక గైకొనబడినది.

దుర్భర వియోగ వారధి ద్రోసిపోయి
వత్సరములెన్నొ గడచెను వన్నెకాడ
తిరిగి మీ జన్మమున నీదుదరిసెనంబు
గలిగెనే నియు గాంతును గౌతుకంబు
ఆడవిగాచిన వెన్నెలయయ్యె బ్రతుకు
క్షణము బాయక విహరించు చక్రవాక
దంపతుల సానురాగ విధంబులరసి
మాటి మాటికి వచ్చి సంభ్రమ మెసంగ
అశిధిల ప్రేమ పాశమునట్టే త్రెంపి
వైచితివి సఫల యామె నీ వాంఛితంబు
నాదు మానస నిర్వేదనంబు కాన్క
గాగ నర్పించు చుంటిని గడకు నీకు

## మఠం సిద్ధివీరయ్య

క్రీ.శ. 1902 జులై 28 వ తేదీన అందోలు మండలమునందలి ఢాకూరు గ్రామంలో జన్మించిన మఠం సిద్ధ వీరయ్యగారు తెలుగు, సంస్కృతము, ఉర్దూ భాషలలో ప్రవేశము గల్గియుండిరి.

కొంతకాలము ప్రభుత్వ ఉపాధ్యాయునిగా పనిచేసిరి. 1923వ సంవత్సరమున ఆంధ్ర పితామహుడు మాడపాటి హనుమంతరావు గారి ఆదేశమున జోగిపేటలోని జోగినాధ గ్రంధాలయము నకు కార్యదర్శిగా నుండి అల్లాదుర్గం వేంకట రాఘవ గ్రంథాలయ స్థాపనలో తనవంతు కృషి గావించిరి.

ఉర్దూ నుండి తెలుగునకు కొన్ని కథలనను వదించిరి ఇవి గోలకొండ వారపత్రికలో వెలువడినవి.

మహారాష్ట్ర భాషనుండి వ్యాఘ్రబలి, పుష్పసేన విజయములను అనువదించిరి. కన్నడ భాష నుండి వీర శైవ మహాత్ములచరితల విభూతి పత్రిక ద్వారా వెలువరించిరి.

నిరపరాధి అను నవలను వ్రాసిరి. కొమిశెట్టిపల్లి తిమ్మయ్యగారు వ్రాసిన కేతకీ సంగమేశ్వర గ్రంధ ప్రచురణకు సంపాద కత్వము వహించిరి.

## హన్మంతరావు పట్వారి

సిద్దిపేట మండలమునందలి పుల్లూరు హనుమంతరావుగారి నివాస స్థానం.

వీరి రాఘువశతకము, దామోదరశతకములు ముద్రింప బడినవి. గరుడ వృషభ, తురంగ శతకములు వీరిచే వ్రాయబడినవి కానియవి యముద్రితములు.

సంస్కృతాంధ్ర భాషాపరిచయముగలిగిన శతక కవులగు వీరు రసవత్తర కవితాధారను బడసియున్నారు.

రాఘువశతకము నుండి

ధనము.న కాసజెంది వనితా సుత బాంధవులందు ప్రేమబం
ధనమున కట్టబడ్డను,గ దాసతతంబు సుఖంబు గోరిస
జ్జనసహవాస దూరమున జ్ఞాన విహీనుడనైతి నయ్యయో
వనజదళాక్ష భక్త జన వాంఛ ఫల ప్రదరామరాఘువా

దామోదర శతకము నుండి

ఫణిరాట్ శామినివైనతేయ గమనున్ భక్తి ప్రపోషున్ నిరం
జనునిర్విక్రపరాక్రమున్ మణివిరాజిద్దేవ దివ్యాంగనున్
వనమాలిన్ శిఖిపించమౌళిని సుధాపయోబ్ధి సన్మందిరున్
ఘనయోగీంద్ర మనోజ్ఞశాలుని నిమున్ బ్రార్థింతు దామోద రా

## దోర్భల వెంకట రాజశర్మ

వెంకటరాజశర్మగారు రామాయంపేటలో సరస్వతమ్మ సాంబశివ శర్మలకు 1929లో జన్మించిరి. వీరు సాహిత్య విద్యాప్రవీణ - బి.ఓ.యల్ యోగ్యతల (డిగ్రీల) సంపాదించిరి వీరు చక్కని భాషా పండితులు, సాహిత్య ప్రియులు.

వీరి పద్య రచన మృదుమధురముగా సుబోధకముగా నుండును.

వీరి రచనలు, త్రిలింగ, ఆంధ్రప్రదేశ్ పంచాయితిరాజ్ పత్రికలలో ప్రచురింపబడినవి. మహాకవి బాణభట్టు అదృష్టము, భక్తకవి, జయదేవుడు, ప్రభోద గేయములు మొదలగునవి వీరి రచనలు. విజయ విలాసము అను నాటకమును వీరు రచించిరి.

## సేడిది విశ్వనాధము

క్రీ.శ. 1942వ సంవత్సరమున సదాశివపేట గ్రామమున నాగమ్మ వీరన్నల ముద్దులపట్టిగా జన్మించిన సేడిది.విశ్వనాధము తెలుగు, హిందీ భాషలు నేర్చినకవి రచయిత.

ఎన్నోహిందీ రచనలను తెలుగున కనువదించిరి వీరి అనువాదము మూలమునకు తగినట్లుగా మృదు మధుర శైలితో చదువరులకు ఆనందము కల్గించు నట్లుండును. వీరి హిందీ అనువాద కథలు ప్రజామత పత్రికలో అచ్చుగుచుండెను.

వీరు తెలుగున పద్య రచన కూడా చేయ గలిగిన నేర్పరులై యుండిరి. అకస్మాత్తుగా క్రీ.శ.1967లో మరణించిరి.

## పడిగ శివయ్యగారి నారాయణ

నారాయణగారు సదాశివపేటలో నివాసస్థులు క్రీ.శ.1919లో బాలమ్మ శివ్వయ్య దంపతులకు జన్మించిరి. వీరు శ్రీరామ నక్షత్రమాల, శ్రీసాయి బాబా పంచవింశతి, తత్వ భజనలను వ్రాసి ముద్రింపించిరి. ఇంకను లక్ష్మీ సరస్వతీ సంవాదము, రుక్మాబాయి డ్రామాలు వీరు వ్రాసిరి. కాని అవి ముద్రణకు నోచకొనలేదు. ఒక పద్యము వీరి రచనకు ఉదాహరణ.

స్వార్థ పరులయ్యు మానవుల్ చాల వరకు
ప్రజకు మేల్జేతుమని చాల బలుకు చంద్రు
మాటల మృతంబు మాట లోపల విషంబు
లలితరఘు రామయిది మాయ కలియుగంబు

వీరు కుమారస్వామి విజయము, రుక్మిణీ కళ్యాణము, సభా పర్వము నుండి పాండవుల విజయము వరకు 8 రాత్రుల యక్షగానము పాండవ అశ్వమేధయాగము, శ్రీ కృష్ణలీలలు, భద్రావతి వివాహము శ్రీ కృష్ణార్జున యుద్ధము మున్నగు యక్షగానములు రచించెను.

## సముద్రాల వేంకటాచార్యులు

నేటి మండల కేంద్రమయిన శివంపేటలో శుద్ధ శ్రోత్రియ శ్రీ వైష్ణవులు సముద్రాల వారు, సముద్రాల కృష్ణమాచారిగారు వేదశాస్త్రా భ్యసనాలతో పాటు వైద్య శాస్త్రమును కూడా చదివి వైద్య వృత్తి కొనసాగించిన వారు. వీరి అర్ధాంగి తిరుమలమ్మ వీరి గారాల పట్టి సముద్రాల వేంకటాచార్యులు. తండ్రి విద్యలన్నియు తనయుని సొంతమైనాయి.

ఉపాధ్యాయవృత్తి చేస్తూ వేంకటాచార్యులు డి.ఓ.ఎల్., బి.ఓ.ఎల్., ఎం.ఎ., పరీక్షలయందు ఉత్తీర్ణులయినారు. పాండిత్యం, కవిత్వం, వైద్యం, సంగీతం, జ్యోతిష్యం మొదలయిన విషయాల్లో ఆరితేరిన ప్రజ్ఞాశాలిగా ప్రజాదరణ పొందినారు. వీరికి ఆగమశాస్త్ర పండిత ప్రవర అను బిరుదు కలదు.

మెదకు మండల సాహిత్య పరిషత్ శాఖా అధ్యక్షులుగా సాహితీ సేవనందించారు. వీరు రాసిన పద్యాలూ గేయాలు పాటలూ అనేకాలు. ఈ మధ్యనే వీరు రచించిన "ధనుర్దాసు" చరిత్ర అచ్చునకు నోచుకుంది.

## మెదకు లక్ష్మణాచారి

లక్ష్మణాచారి యింటి పేరు మెదకు వారు. వీరు సంగారెడ్డి వాస్తవ్యులు. దేవమ్మ, మల్లయా చార్యులు వీరి తల్లిదండ్రులు.

విశ్వకర్మకుల సంజాతులు సాంఖ్యాయన శ్రోత్రజులు. వీరు వేదాధ్యాయన పరులై, కావ్యమీమాంస జ్యోతిష వాస్తు శాస్త్ర ములందేగాక సంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యము గలవారు. ఆంగ్లతురుష్క భాషల నెరిగినవారు. వీరు పద్య రూపమున జ్యోతి శాస్త్రమును రచించిరి. అవిపూర్తిగా లభ్యమగుటలేదు.

వీరు కవిత్వమునందేగాక శిల్ప చిత్రలేఖనము లందును విజ్ఞత గలవారని తెలియుచున్నది. తనకడ ఎందరో శిష్యుల నుంచుకొని విద్యాభ్యాసము గావింపజేసిన పరమ గురువులనియు, శంకలతో వచ్చువారలకు తగు సమాధానమిచ్చి సంతోషపరచెడు వారనియు తెలియుచున్నది. వీరి జ్యోతిష శాస్త్ర పద్యము.

జనులకు బాలుడు జన్మించులగ్నాన
అష్టమందున నవగ్రహములున్న
అర్కుడుండి నయది నగ్ని భయమును జెందు
నెరి చంద్రుడుండెనా నీళ్ల భయము
సరివిగా కుజుడున్న శస్త్ర భయంబొందు
రూఢి రాహుడుండ రోగభయము
హెచ్చుగా గురుడున్న హింసాకరంబొందు
దారిద్రుడగు శని దగిలియున్న
వికట బుధుడుండెనే నితంద్రికి భయంబు
దానవాచార్యుడుండ మాతకు భయంబు
కేతు వుండిన విషయ సంకేతమగును
అరయవలయును తలిదండ్రులాత్మనెరిగి

ఇతనిని గూర్చి ఒక అజ్ఞాత కవి ఇట్లు వర్ణించెను.

చిన్న తనంబు నుండి ఘన శిల్పపు చిత్తరు వ్రాతలందు సం
పన్నత యారితేరి కడుభాసిత నాంగ్లతురుష్క భాషలన్
మిన్నగ కర్మకాండలను ప్రాజ్ఞత వాస్తు విశారదుండుగా
ఎన్నిగ కీర్తిశాలియని పించెను లక్ష్మణచార్యుడిమ్మహాన్

## చక్రవర్తి కూరత్తాళ్వారాచార్యులు

చక్రవర్తి కూరత్తాళ్వారాచార్యుల తండ్రి శ్రీపరాశరాచార్యులు. వీరు సంగారెడ్డి మండలము నందలి చేర్యాల గ్రామమున నివసించిరి. వీరు క్రీ.శ. 1890లో జన్మించి క్రీ.శ. 1962 వరకు జీవించియుండిరి.

వీరికి భక్తిరసముపై ఎక్కువ మక్కువ. వీరు భగవద్భక్తి పూర్వములైన రచనలే అధికముగా గావించిరి. ప్రాచీన సంప్రదాయమును పూర్తిగా విడువజాలక నవీన భావములలో ప్రాచీనత్వమును సాధించిరి. ఆచార్యుల వారు అనేక కీర్తనలు రచించిరి. ఒకరకముగా వాగ్గేయ కారులనవచ్చును.

వీరిరచనలు శ్రీ కృష్ణలీలలు (నాటకము), ద్రౌపదీ స్వయం వరము (యక్షగానము), కీచకవధ, ఉత్తర వివాహము (నాటికలు).

వీరు అనేక భక్తి గేయములు, మంగళహారతులు, మాణిక్య ప్రభు కీర్తనలు రచించిరి.

వీరి రచనలన్నియు ముద్రింపబడినవి. గోలకొండ కవుల సంచికలో వీరి పద్యములు ప్రచురింపబడినవి.

వీరు విశిష్టాద్వైతులైనప్పటికి హరిహరా భేదమును పాటించిరి.

శ్రీరమణీ విహార చిర చిద్వయ నిర్మిత నిర్వికాంభూ
భార సమర్థ దుర్విషయ బాధ విదూర పరాత్పరా
యని వేంకటేశ్వరుని స్తుతించుచు

శ్రీ పరమేశ పార్వతి పతే హరశంకర శ్రీ సదాశివాయని ఈశ్వరుని స్తుతించినారు. ఈయనకు దైవభక్తితో పాటు దేశ భక్తి కూడా ఎక్కువగా చెప్పవచ్చును. పోలీసు చర్యపై వీరు సీసమాలికను వ్రాసిరి మచ్చునకు

ఎటుదోచకను కాలమిటువచ్చెనటంచు
జవహరులాలుకడ జేరి మొదలు
దెల్పంగ యది విని తీవ్రమై దుర్జన
శిక్ష జేయదలచి శీఘ్రముగను
దండ యాత్రనుమెచ్చ గుండెలన్నియుగూల్చి
భారతమాత భారంబుదీర్చి
చెరలు విడిపించి కాశీం రజ్వి బంధించి
పుడమి రజాకార్ల పొట్టుదులిపె
శాలివాహన శతవత్సరములు పదియు
నెనిమిదియు నూట డెబ్బది సర్వధారి
వత్సరము భాద్రపద శుద్ధపౌర్ణమిని జేరి
వారి బలమెల్ల హరియించె ప్రణతులొసగ
ధ్వజపతాకంబునెత్తెను దైవమపుడు
బోచుగావుత సర్దారు పుణ్యునెపుడు

## ఉమాపతి పద్మనాభ శర్మ

ఉమాపతి పద్మనాభ శర్మగారు 1936లో సిద్దిపేటలో జన్మించినారు. తల్లిదండ్రులు రాధమాంబ - నారాయణ శాస్త్రులు. నిరంతర కావ్య శాస్త్ర పఠనం, అప్పుడప్పుడు కావ్య సృష్టి చేయడం వీరి నిత్య కృత్యం, ఉమాపతి స్వరమధురిమ సిద్దిపేట రసజ్ఞులకు చిరపరిచితం. నటసమ్రాట్ అక్కినేని నాగేశ్వరరావునే ఆకట్టుకున్న గానం ఆయునది. ఉమాపతి చక్కని వక్త కూడా. కవి, రచయిత, విమర్శకులైన ఉమాపతి అక్షర ప్రస్థానానికి ఒక క్రమం ఉన్నట్టు కన్పిస్తోంది. తొలుత ఆయన సారస్వత విమర్శపై రుచి చూపారు. అరడజను వ్యాసాలతో అందరినీ ఆకట్టుకున్నారు. పాతిక సంవత్సరాలలోపు వయసులోనే ఆయన లేఖిని నుండి వెలువడిన ఒక వ్యాసం నాటి విఖ్యాత విమర్శకులు నిడుదవోలు వెంకట రావుగారిని ఆకట్టుకుంది. పలు పత్రికల్లో ఉమాపతి కథలు వెలుగు చూసాయి. అయితే వాటిని ఇంకా సకలించలేదు. ఉమాపతి రచించిన "బ్రతక నేర్చిన మృత్యువు" అనే కథ "నవ కథా విపంచి" సంకలనంలో చోటు చేసుకుంది. (ఈ సంకలనంలో బుచ్చిబాబు, చలం వంటి రచయితల కథలున్నాయి.)

ఉమాపతి కలానికి కొంటె తనం తెలుసు. దాదాపు నలభై ఏళ్ళ క్రితం సాధన పత్రికలో ధారా వాహికంగా ప్రచురితమైన "నాస్తవ స్తవం" దీనికి తార్కాణం. మధురకవి ఉమాపతి కథల్లో సామాజిక స్పృహను అధిగమించిన తాత్విక స్పర్శ ఉంది. తొలుత మరో ముగ్గురు కవులతో కలిసి "ఋత చేతన" అన్న సంపుటిని వెలువరించినా, శంకరాచార్యుల వారి "దేవీ మానసపూజ" తెలుగు అనువాదంతోనే వారికి బాగా పేరు వచ్చింది. "తేజోవల్లరి" పేరిట వెలువరించిన మరో కవితా సంకలనం విమర్శకుల మెప్పును పొందింది. ఉమాపతి సీసం శ్రీనాధుడి పోకడల్ని గుర్తుకు తెస్తోందని పండితులు కితాబులిచ్చారు. 1996లో ప్రచురితమైన హంసనాదం (సంప్రదాయ వ్యాసావళి ఉమాపతి సునిశిత పరిశీలనా శక్తికీ, తాత్విక శక్తికీ పరాకాష్ఠ "శ్రీమద్రామాయణం - అద్వైతం", మహాభారతంలో పురోహితులు, "అభీరసత్త - అద్వైత భూమిక" వంటి వ్యాసాలు ఉమాపతి సత్తాను పట్టి చూపుతాయి. బహుముఖ ప్రజ్ఞాశాలి ఉమాపతిశా కవితా తేజోవల్లరికి ఉదాహరణ ఈ పద్య భాగం :

"ఒక మహోజ్వల కాంతి శకలమ్మువీడి తమశ్శధమైన బుకీనకలమ్మునేను.
ఒక మహో ఝుంఝూ శిలోర్థి వీచీ ఘటా స్ఫురిత సమీర కిశోరమేను
ఒక మహర్విది భి భృమోత్పేప వధృత రూపరేణువును నేను"

వీరు "నవచైతన్య భారతి", జాతీయ సాహిత్య పరిషత్తు, మెదక్ జిల్లా రచయితల సంఘం, మెదక్ మండల సాహిత్య పరిషత్తు వంటి సంస్థలతో సన్నిహితంగా ఉన్నారు.

## ఉమాపతి బాలాంజనేయ శర్మ

ప్రస్తుతం హైదరాబాదు ఆకాశవాణిలో పని చేస్తున్న బాలాంజనేయశర్మ 1941లో జన్మించారు. స్వస్థలం సిద్దిపేట. రత్నమ్మ లక్ష్మీరాజశర్మ తల్లిదండ్రులు. డిగ్రీ పూర్తి చేసిన తర్వాత ఆకాశవాణి ఉద్యోగంలో స్థిరపడ్డారు. గతంలో ఆయన కవితలెన్నో భారతిలో ప్రచురణను పొందాయి. "భువన విజయం", "బుద్ధం శరణం గచ్ఛామి" లాంటి నాటికలు విమర్శకుల మన్ననల్ని పొందాయి. "మాతృసేవ", "దేవీమానస పూజ" కావ్యాలు ప్రచురణను పొందాయి. తాత్వికంగాను లోతైన అధ్యయనం చేసిన పండితుడు ఉమాపతి బాలాంజనేయ శర్మ.

## దోర్బల ప్రభాకరశర్మ

పండిత వంశంలో జన్మించిన దోర్బల ప్రభాకర శర్మ స్వగ్రామం రామాయంపేట - వీరి పెద్దన్న దోర్బల విశ్వనాథ శర్మ మెదకు జిల్లా పండితులకు పెద్దన్నే.

ప్రభాకర శర్మ చిన్నతనం నుండి సంస్కృత విద్యను అభ్యసించారు. సంస్కృతంలో బి.ఓ.ఎల్. మరియు ఎం.ఏ. పరీక్షలలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైనారు.

గోదావరి జిల్లాలోని కొవ్వూరులో ప్రాచ్యకశాశాల ప్రిన్స్‌పాల్‌గా పనిచేస్తున్నారు.

వీరికి సంస్కృత భాషపై అభిమానం మెండు. సంస్కృత భాషా ప్రచారం వీరి నిత్యకృత్యం.

సంస్కృత భాషా ప్రచారం కోసం వీరు రచించిన వ్యాసలు, గేయాలు అనేకం.

## గంగాధరభట్ల రామకృష్ణ శాస్త్రి

చేగుంట మండలమునందలి చందాయిపేట గ్రామంలో శ్రోత్రియ కుటుంబంలో జన్మించిన గంగాధరభట్ల రామకృష్ణ శాస్త్రి చిన్నతనాన సంస్కృతము చదువుకున్నారు.

బి.ఓ.ఎల్. పరీక్ష వ్రాసి ఉత్తీర్ణులై తెలుగు పండితులుగా పని చేసినారు.

"పోతన" అనే పద్యకావ్యాన్ని వెలువరించారు.

## శాస్త్రుల భార్గవరామ శర్మ

శివంపేటలో అనతరామశర్మ సుశీలమ్మల జ్యేష్ఠ కుమారుడైన భార్గవరామశర్మ 1945లో జన్మించారు.

చిన్ననాటి నుండి చిన్నాయనగారైన శిరోమణి విశ్వనాథ శర్మగారి సాన్నిధ్యంలో సంస్కృత విద్యాభ్యాసం సాగించారు.

వేదాంత వర్ధిని సంస్కృత కళాశాలలో బి.ఓ.ఎల్. ఉత్తీర్ణులైనారు.

కొన్నాళ్ళు జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల నర్సాపూర్‌లో తెలుగు పండితులుగా పనిచేసినారు. వేదాంత శాస్త్రాన్ని ప్రత్యేకంగా పఠించారు.

### వీరి రచనలు

మండుక్యోపనిషత్తు వైతథ్య ప్రకరణం శాస్త్రుల విశ్వనాథ శర్మగారితో కలిసి అనువదించారు అముద్రితం.

శ్రీరామ నవరాత్రోత్సవకల్పము

యజ్ఞోపవీత సంస్కార సంకలనం

సత్యగణపతి వ్రతము

శ్రీవిద్యారణ్య ప్రోక్త శ్రీ సూక్త విద్యారణ్య సంపాదకత్వం.

ఇవియేకాక వివిధ పత్రికలకు వ్యాసాలు కూడా వ్రాశారు.

సంస్కృతాంధ్రాలలో చక్కని అభినివేశం కలిగిన భార్గవరామశర్మ కవిత్వం లలితంగా సుమనోహరంగా ఉంటుంది.

దుర్గేశ్వరీ మహిళా ప్రాచ్యకళాశాల వరంగల్‌లో ఉపన్యాసకులుగా పని చేస్తూ ప్రస్తుతం తెలుగు సాహిత్యంలో శ్రీ విద్యా సంప్రదాయం అనే అంశంపై పి.హెచ్‌డి. చేస్తున్నారు.

## కాండూరి రామాచార్యులు

తూప్రాన్ మండలం జీడిపల్లి రామాచారిగారు పుట్టిపెరిగిన పల్లె.

చిన్ననాడే వేదాంత వర్ధిని కళాశాలలో చేరి సంస్కృత బి.ఓ.ఎల్. వరకు విద్యాభ్యాసం గావించారు.

తెలుగు బి.ఓ.ఎల్. ఉత్తీర్ణులైనారు. మెదకు జిల్లా పరిషత్తులో తెలుగు పండితులుగా విధినిర్వాహణ గావించారు. ఈ మధ్యనే పదవీ విరమణ గావించారు.

మిత్రమండలిలో వయ్యాకరిణిగా పేరొందిన రామాచారి సాహిత్యంలో చక్కని ప్రవేశమున్నవారు.

1. సంగమేశ్వర సుప్రభాతం ! సంస్కృతం
2. లక్షణ చంద్రిక, తెలుగు వ్యాకరణము
3. రామరామవిజయం, గేయం
4. కల్యాణ చంద్రిక, గద్యము
5. కాదంబరి, వచనం
6. 'తత్సమాంధ్ర వ్యాకరణం' అనే గ్రంధాలు వ్రాశారు.

వీరికి చారిత్రిక పరిశీలనపై అభిలాషమెండు.

## వితాబాయి

మెదకు జిల్లాలో కవయిత్రులకు కొదవలేదు. శ్రీమతి వితాబాయిగారు కేవలము కవయిత్రియేకాక జోగిపేటలో జరిగిన ప్రథమాంధ్ర మహాసభకు అనుబంధముగా జరిగిన మహిళాసభకు అధ్యక్షత వహించి దేశ స్వాతంత్ర్య సమరమునకు తన వంతు సహకారమందించిన ధీరనారి.

శ్రీమతి వితాబాయిగారు జోగిపేట వాస్తవ్యులు. శ్రీ గోపాల వేంకటరావు అడ్వకేటుగారి ధర్మపత్ని. ఈమె 1889లో జననమందినది.

ఈమె తెలుగు, కన్నడ, మహారాష్ట్ర భాషలలో పాండిత్యమును సంపాదించినది.

ఈమె ఆధ్యాత్మిక ప్రబోధములైన అనేక రచనలు గావించినది. బాలా త్రిపుర సుందరీ స్తుతి పద్యములు వందకు పైగా వ్రాసినది.

రామాయణ పరముగా ఆధ్యాత్మిక భావమున కందార్థములు వ్రాసినది. బాలాత్రిపురసుందరీ భజన కీర్తనలు, మంగళ హారతులు, జోలపాటలు, లాలిపాటలు మున్నగునవి ఎన్నో రచించినది.

ఈమె రచనలందు లక్షణముకన్న, భక్తి రసమునకు, భావమునకే ప్రాధాన్యము. ఉదాహరణకు

బాలమ్మ నీయందు భ్రాంతినే నుంచితె
బంధముల్ దెచ్చుట భావ్యమగునె
చాలా రోజుల నుంచి శేలుగా నీ యొక్క
సేవజేసిన సుమ్మిమేలు జేయు
బాలభావము నుండ భక్తి నీయందుంచి
బంధువర్గాదుల భయమొందలేదె
ఎందరేమన్ననీ బృందమున్ విడువనని
ముందుగనె తెలిపితి అందముగను
సుందరంబగు రూపు ఆనందమున నీవు
యిందువేం చేయు ముందుజూపు
ఇందువదనరో హృదయ మందిరములో
పొందినిలుచున్న దోషముల్
పోవుగదనె అందుకొరకయ్యొ వేంచేయు
సుందరాంగి శీఘ్రముగ రమ్మొ శ్రీ బాలసద్యశీల

## డా. పరాశర భట్టాచార్య

అందోలు మండలమునందలి బ్రాహ్మణపల్లి గ్రామంలో శ్రీమతి జానకమ్మ పరాశర వెంకట నరసింహ భట్టాచార్యులకు జన్మించిన డా. పరాశర భట్టాచార్యగారు వృత్తిరిత్యా వైద్యులు.

శారీరక వైద్యంతో పాటు మానసికోల్లాసాన్ని కలిగించే కవిత్వాన్ని వీరు ఆశ్రయిస్తారు.

జి.సి.ఐ.ఎం. మరియు ఎం.బి.బి.ఎస్. డిగ్రీలు కలిగి వైద్యాధికారిగా ప్రజాసేవ చేస్తూ హృద్గత భావాలను గేయాల్లో, పదాల్లో పలువురితో పంచుకుంటారు.

వీరు పరాశర పద కవితలు వ్రాసి తిరుపతి వెంకటేశ్వరునికి అంకితము ఇచ్చినారు.

## డాక్టర్ డి. నర్సయ్య

సిద్దిపేట పరిసరాల్లోని మిట్టపల్లి గ్రామంలో జన్మించిన డి. నర్సయ్యగారు ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఏ., ఉత్తీర్ణులైనారు. ఉపన్యాసకులుగా పనిచేయుచున్నారు.

గిడుగు రామమూర్తి భాషా సేవ అను అంశంపై పరిశోధనా వ్యాసము వ్రాసి పి.హెచ్‌డి. పట్టా పొందినారు.

చక్కని ఉపన్యాసకులుగా కీర్తినార్జించినారు.

## వేలేటి రాజమౌళి శర్మ

రాజమౌళి రామాయంపేట మండలమందలి నిజాంపేట గ్రామవాస్తవ్యులు. చిన్ననాటి సంస్కృతమును నేర్చుకొని తెలుగు బి.వో.యల్ పరీక్షలో ఉత్తీర్ణుడై తెలుగు పండితులుగా ఉద్యోగముచేయుచు అకస్మాత్తుగా మరణించిరి.

వీరు సరసమైన కవితాధార కలిగినవారు. వీరు అనేక కవి సమ్మేళనాలలో కవితలు వ్రాసి చదివి వినిపించేవారు.

## మురహరి శర్మ

కమ్మని కంఠంతో చక్కని కవిత్వాన్ని చెప్పగలిగిన మురహరి శర్మగారు మనసావాచా సహృదయులు. మెదకు మండల సాహిత్య పరిషత్ ఆవిర్భావంలో ఒకరు. పరిషత్ కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనేవారు.

సంగారెడ్డి ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా పని చేసి పదవి విరమణ పొందినారు.

చక్కని భావాలతో, సరళ పదజాలంతో సుందరంగా, మనోహరంగా పద్యాలల్లడం వీరి ప్రత్యేకత.

బీరంగూడ సంగమేశ్వర స్వామి పేర సంగమేశ్వర శతకమును రచించి ప్రచురించిరి.

## డాక్టర్ అమ్మంగి వేణుగోపాల్

సంగారెడ్డి పట్టణములో నివసిస్తున్న అమ్మంగి వేణుగోపాల్ గారు చక్కని సంభాషణాచతురులు. ఎం.ఏ ఉత్తీర్ణతనంది ఉపన్యాసకులుగా పనిచేస్తూ **నవలా రచయిత గోపీచంద్** అను అంశంపై సిద్ధాంత వ్యాసమును వ్రాసి ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి డాక్టరేట్ పట్టా గ్రహించినారు.

## యస్.రఘునాథ శర్మ

చేగుంటలో శుద్ధవైదిక కుటుంబమున జన్మించిన రఘునాథ శర్మగారు సంస్కృతాంధ్రము లలో చక్కని ప్రవేశముకలవారు. తెలుగు పండితులుగా పనిచేసిరి. వీరి రచనలోని ఒక పద్యము.

*నినుగన్నారగ జూచు భాగ్యమెపుడో నీ సేవ జేయంగనో*
*వనమాలీ! మనమందు వాంఛ గలిగెన్ వైకుంఠనిన్ గొల్చి తా*
*గని నారంట భవాబ్దిదాట నరుదౌ కైవల్యమున్ గాన పా*
*వన మైనట్టి భవద్గుణానుకథలన్ వర్ణించెదన్ శ్రీహరీ*

(రస తరంగాల నుండి)

## డాక్టర్ తిరునగరి శ్రీనివాస్

మెదక్‌పట్టణ వాస్తవ్యులైన తిరునగరి శ్రీనివాస ఉపన్యాసకులుగా పని చేయుచున్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి **"ఆచార్య సూక్తి ముక్తావళి"** అను అంశంపై సిద్ధాంత వ్యాసము వ్రాసిరి. పి.హెచ్‌డి. పట్టా సంపాదించినారు.

## ఎస్. ప్రభాకర్

జహీరాబాద్ స్వస్థానంగా గుండమ్మ గుండప్పల కుమారుడుగా ప్రభాకర్‌గారు 1930లో జన్మించిరి. తెలుగు, ఉర్దూ, హిందీ, కన్నడ భాషలలో వీరికి ప్రవేశమున్నది.

"ఏది నిజం" అను వీరి వచన రచన ముద్రించ బడినది.

## ఐతా చంద్రయ్య

ఆంధ్ర దేశంలో అగ్రేసర కథా రచయితల్లో ఒకరైన ఐతా చంద్రయ్య స్వగ్రామం చింతమడక. 1948లో జన్మించారు. లక్ష్మి, లింగయ్య తల్లి దండ్రులు. తెలుగు బి.ఏ. చదివి హిందీ విద్వాన్ కూడా పూర్తి చేశారు. ప్రస్తుతం తంతి తపాలా శాఖలో ఉద్యోగం నిర్వహిస్తున్నారు. ఇప్పటి వరకు 8 నాటికలను, 8 కథాసంకలనాలను, 9 పద్య వచన గేయ కవితా సంపుటాలను రచించారు. జాగృతి, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్ర భూమి, ఇండియాటుడే, భారతి, స్రవంతి వంటి పలు పత్రికల్లో చంద్రయ్య రచనలు ప్రచురణ పొందాయి. జాగృతి వారపత్రికా కవితల కథల పోటీల్లో మూడుసార్లు బహుమతి గెల్చుకున్నారు. జాతీయ విప్లవ జ్యోతి కావ్యానికి వేముగంటి పురస్కారం లభించినది. ఆయన రచించిన 'ఆడపిల్ల' నవలకు విశాఖ పట్టణంలోని సాహితీ సేవా సమితి ట్రస్టు అవార్డు లభించింది.

మనోరంజని సాహితీ పురస్కారం, అమెరికా తెలుగు సంఘం వారు నిర్వహించిన కథల పోటీల బహుమతి, 1998 సాహితీ సమితి కథల పోటీలో రాష్ట్రస్థాయి బహుమతి చంద్రయ్య ప్రతిభకు కొలమానాలు గానిలుస్తాయి. ప్రస్తుతం జాతీయ సాహిత్య పరిషత్తు ప్రాంత ఉపాధ్యక్షులుగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

## ఆగమయ్య

ఆగమయ్య సంగారెడ్డి నివాసస్థులు వీరు కొంతకాలము సంగారెడ్డి పురపాలక సంఘమునకు అధ్యక్షులుగా ఎన్నికై ప్రజాసేవ యొనరించిరి. సంగారెడ్డిలో హిందీ పరీక్ష కేంద్రమును స్థాపించి పరీక్షలు నిర్వహించిరి. కొంతకాలము హిందీ పండితులుగా పని చేసిరి.

ఆగమయ్యగారు హిందీలో అనేకగేయములు వ్రాసిన కవి.

## డాక్టర్ జోగయ్య

సిద్దిపేట పట్టణములో జన్మించి అక్కడే విద్యాభ్యాసం గావించి ప్రస్తుతం సిద్దిపేట డిగ్రీ కళాశాలలో ఉపన్యాసకులుగా పని చేయుచున్న జోగయ్యగారు **మెదక్ జిల్లా రాజకీయాలు** అను అంశంపై పరిశోధనాత్మకమైన వ్యాసము వ్రాసి పి.హెచ్‌డి. పట్టా పొందారు.

## డా॥ దాశరథుల బాలయ్య

దాశరథుల బాలయ్య సిద్దిపేట మండలం మిట్టపల్లి గ్రామంలో జన్మించిరి. వీరి తల్లిదండ్రులు భూదేవి-నర్సయ్యగారలు. వీరు తేది.4-7-1956లో జన్మించిరి.

ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఎ., విద్యాభ్యాసం గావించారు. ప్రస్తుతం తెలుగు లెక్చరర్‌గా పని చేస్తున్నారు. భక్తరామదాసు జీవితము - రచనలు-అంశముపై ఎమ్.ఫిల్. రామకథా యక్షగానాలు- అను అంశముపై పి.హెచ్.డి -పరిశోధన చేశారు. ఇంతకు ముందు ప్రచురింపబడ్డ అపూర్వ రామదాసు కీర్తనలను పరిశోధించి పూర్తి పాఠాలతో ప్రచురించారు. ఈ గ్రంథమునకు యావదాంధ్రములో మంచి గుర్తింపు వచ్చినది. వీరికలం నండి శ్రీ సంగమేశ్వర వినుతి, రామ చంద్రోదాహరణము, శ్రీ లక్ష్మీ నృసింహోదార హరణము, బాసర జ్ఞాన సరస్వతీ మధ్యాక్కరలు, నృసింహమధ్యాక్కరలు, శివసాక్షాత్కారము, ప్రణయోత్సవం - తెలుగు రుబాయీ కావ్యాలు వెలువడ్డాయి. సంస్కృతమున 'ఆర్యాశతి' ని కూడా రచించారు. వీరు రచించిన కొన్ని కవితలు ఉర్దూ సియాసత్, గూంజ్ పత్రికల్లో అనువదించబడ్డాయి. తెలంగాణా వాగ్గేయకారులపై ప్రత్యేక పరిశోధన చేసి, మరుగుపడిన వగ్గేయకారులనెందరినో, సాహిత్య లోకమునకు పరిచయం చేశారు.

ప్రొఫెసర్ వి.వి.బి. రామారావు-న్యూఢిల్లీ గారు "Voices of the Wing " లో వీరి కవితల్ని ఆంగ్లంలో అనువదించి ప్రచురించారు. మెదక్ జిల్లా రచయితల సంఘమునకు అధ్యక్షులుగాను, జాతీయసాహిత్య పరిషత్తు- సిద్దిపేటకు ప్రధాన కార్యదర్శిగానూ సాహిత్య సేవలు చేశారు. ప్రస్తుతం సరస్వతీ సహస్ర కావ్యం రచన చేస్తున్నారు. వీరి కవితలు అన్ని పత్రికల్లో ప్రచురింపబడ్డాయి.

మచ్చునకు వీరిదొక పద్యము.

"తిరుమణి పట్టెనామములు-దిద్దినవానికి, శంఖచక్రముల్
కరముల దాల్చువానికిని-కాంచన చేలము గట్టువానికిన్
ఉరమున శ్రీరమామణి సముజ్జ్వలతన్ విలసిల్లువానికిన్
తిరముగ యాద్రశైలమున తేజిలువానికి వందనంబులౌ"

- (శ్రీ లక్ష్మీ నృసింహోదాహరణం లోనిది)

## మఠము అడివయ్య

మఠము అడివయ్యగారు సంగారెడ్డి వాస్తవ్యులు చిదిరె మఠము వంశము వారు. వీరి తండ్రి శివ్వయ్య గారు. వీరశైవమతాధిపతులలో స్థిరమూర్తులు, చరమూర్తులు, అనురెండు తెగలవారు కలరు. వీరు స్థిరమూర్తుల కోవకు చెందిన వారు.

అడివయ్యగారు సంస్కృతాంధ్రములందు చక్కని పాండిత్యము కలవారు. ఆయుర్వేద వైద్యము నందును అనుభవమున్నవారు.

పద్యరూపమైన వీరిరచనలు 1921లో పెరిదేపి ఆయుర్వేద చంద్రిక పత్రికలో ప్రచురింపబడినవి. వీరు అనేక పింగళ హారతులు రచించిరి. ఈ కవి 1886 నుండి 1966 వరకు జీవించిరి.

## విజయరాజ కువర్

తెనాలిలో జన్మించి సంగారెడ్డి స్థిర నివాసంగా జీవించిన విజయరాజ కువర్ గారు మేధా సంపన్నులు. వీరు చక్కని రచయితలు వీరి రాజకీయ రచనలు ప్రసిద్ధములు.

విప్లవాధ్యక్షుడు - దేశం దివాళా తీస్తున్నది - మంచి ప్రభుత్వం మాధ్యేయం - స్వతంత్ర పార్టీ - విప్లవరైతాంగములు మొదలగునవి వీరు రచించినవి.

వీరిని గురించి బెజవాడ రామచంద్రా రెడ్డిగారు, గౌతులచ్చన్నగారు ప్రశంసించిరి.

## వీరమల్లాగౌడ్

వీరమల్లాగౌడ్‌గారు సంగారెడ్డి వాస్తవ్యులు వీరి తల్లిదండ్రులు రామాంబ, లక్ష్మగౌడ్.

గౌడుగారు ఆంధ్రము, ఆంగ్లము, హిందీ, ఉర్దూ భాషలు నేర్చిన వారు. ఉపాధ్యాయ వృత్తి చేయుచు సాంఘిక, సాంస్కృతిక రంగములలో కృషి చేసిరి.

వీరు గౌడ గేయాలు, ఏడుపాయలు నీతి కథావళి, ఆత్మజ్యోతి మున్నగునవి రచించిరి.

## యస్. రామ చందర్ రావు

సూరినేని రామచందర్ రావు రామాయంపేట మండలంలోని కోనాపురంలో శ్రీమతి లక్ష్మీబాయి శ్రీతిరుమలరావులకు జన్మించిరి. చదివిన చదువు ఎం.ఏ. రాజనీతిశాస్త్రం చేసే ఉద్యోగం ఇంజనీరింగ్ శాకలో సర్వే అసిస్టెంటు వృత్తి - ప్రవృత్తులు వేరువేరు.

తెలుగు భాషన్నా, తెలుగు సాహిత్యమన్నా అభిమానం మెండు.

వీరి రచన 'దర్పణం' కవితా సంకలనం జాతీయ సాహిత్య పరిషత్తు ద్వారా ముద్రించబడినది.

## కే. రాజయ్య

కె. రాజయ్యాగారు మెదకు జిల్లాకే కాక సమస్త భారతదేశమున గొప్ప చిత్రకారులుగా సుప్రసిద్ధులు రాజయ్యాగారు చిత్రకళ, శిల్పకళలలో ఆరితేరినవారు. వీరు గొప్ప భావుకులు.

వీరి భావనాతరంగములో వెలువడిన కొన్ని గేయాలు ముద్రింపబడినవి.

## పెద్ద మఠము రాచవీర దేవర

జోగిపేటలో జన్మించిన రాజవీర దేవర వీరి శైవమతస్థులు. నాగమ్మ వీరయ్యలు వీరి తల్లిదండ్రులు. 1927 జులై 16న జన్మించిరి. వీరు భాషాప్రవీణ, బి.ఓ.యల్. పరీక్షలలో ఉత్తీర్ణులైరి, కన్నడమున జాన, హిందీలో భూషణ యోగ్యత సంపాదించిరి. ఉర్దూ భాషలో కొంత పరిచయము కలదు. వీరు వీర శైవ సంప్రదాయమును దెలుపు రచనలు జేసిరి.

వీరశైవ తరుణ గేయములు బసవేశ్వరుని తత్వములు - వీరశైవ ధర్మాన్వేషణము ఇష్టలింగ విజ్ఞానము - శతకత్రయము - మున్నగునవి రచించిరి.

## యస్. సుదర్శన్ రెడ్డి

జహీరాబాద్ నివాసస్థానంగా గలిగిన రెడ్డిగారు ఉపాధ్యాయ వృత్తిలో జీవించిరి. వీరు మొదట నారాయణ్ ఖేడ్ మండలం సంజీవన్ రావు పేట గ్రామంలో ఉండగా ప్లేగు వ్యాధి వ్యాపించినది ఆ గ్రామమున అనంతశయన స్వామి దేవాలయము కలదు. ఆర్తి నుండి భక్తి జనించినది.

రెడ్డిగారు పన్నగశయన శతకము అనంత శయన భజన కీర్తనలు, ఎన్నో జాతీయ గీతములు రచించిరి.

## సంగమేశ్వర సంగము

సంగముగారి నివాసము జోగిపేట. వీరి తల్లితండ్రులు లక్ష్మమ్మ సిద్ధిరాముప్పలు. వీరు శైవులైనను ఆర్యసమాజ వైదిక మతావలంబులు.

వీరు తెలుగు, ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు భాషలలో ప్రవేశము కలవారు.

గేయపద్య కవిత్వములందు సరళమైన రచన వీరికి ఉగ్గుతో పెట్టిన విద్య. వీరి కవిత్వము సాంఘిక దురాచారములను, ప్రజల కష్టనష్టములను చాటుచున్నది.

వీరు ఆర్యగేయాలు - యుగ ధర్మగేయాలు యుగ ధర్మ నాయకుడు మొదలగు రచనలు చేసిరి.

## రుక్మాభట్ల కృష్ణమూర్తి

మెదకు జిల్లాలో మౌళిత్రయంగా పేరొందిన సోదరత్రయంలో చిన్నవాడైన విధుమౌళిశాస్త్రిగారి కుమారులు రుక్మాభట్ల కృష్ణమూర్తి. పిత్రార్జితంగా వచ్చిన సాహిత్యం వీరిసొత్తు. ఉస్మానియా యూనివర్సిటీలో చదివింది చదువుచెప్పేది విజ్ఞాన శాస్త్రం. ఉత్తీర్ణులైన వీరు ఉపన్యాసకులుగా పని చేసి ప్రస్తుతం బి.హెచ్.ఇ.ఎల్. జూనియల్‌కాలేజీ ప్రిన్స్‌పల్‌గా పని చేయుచున్నారు.

వీరు చక్కని భావుకులు. పద్యాన్ని, గద్యాన్ని ఒక్క రీతిగా నడపగల శక్తి సంపన్నులు. ఉమాపతి జాలపల్లితో కలిసి వీరు ఋత చేతన సంకలనాన్ని వెలువరించారు.

## ప్యారక శేషాచార్యులు

సాహితీ ప్రక్రియల అన్నింటినీ చవిచూసిన కవి ప్యారక శేషాచారి. చిన్న తనాన ఎనిమిదవ తరగతి చదువుతున్న కాలాన పద్యాన్ని చెప్పనేర్చిన ప్యారక సాహిత్య పఠనంతో అనుభవంతో పద్యానికో ప్రత్యేకతను సార్థకం చేసుకొన్నాడు.

శివంపేటలో ప్యారక రామాచార్యులు తాయారమ్మల ముద్దుబిడ్డగా పుట్టిన ప్యారక శేషాచార్యులు శివంపేట, నర్సాపూర్, గోమారం గ్రామాల్లో పాఠశాల విద్యను పూర్తిచేసుకొని ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాచ్యకళాశాలలో బి.ఓ.ఎల్., చదువుకొన్నాడు. జిల్లా పరిషత్ యాజమాన్యంలో తెలుగు పండితులుగా పని చేస్తూ ఎంతోమంది విద్యార్థుల్లో సాహితీ చైతన్యాన్ని కలిగిస్తున్నారు.

మెదకు మండల సాహిత్య పరిషత్ నర్సాపూర్ శాఖ కార్యదర్శిగా, కళావాహిని హితవరిగా సాహితీసేవ సాగించారు. మిత్రుల ప్రోత్సాహంతో అష్టావధానాన్ని ప్రారంభించి 18 మార్లు అష్టావధానాల్ని నిర్విఘ్నంగా కొనసాగించినారు.

వీరు 'మాతృశ్రీ' ఖండ కావ్య సంపుటి, 'ఏకలవ్య' నాటకం, 'సవరాజం' ఏకాంకిత, 'గురూపదేశం', 'కాకతాళీయం', 'ప్రపత్తినిర్వేదం' అనే కావ్యాలు రచించినారు. శిఖిముఖాలు అనే వచన కవితాసంకలనాన్ని బాల్య మిత్రుడు శాస్త్రుల రఘురామశర్మతో కలిసి వ్రాశారు. ఈయన కవిత్వానికో మచ్చుతునక

అది ఉదయమ్ము - వెచ్చనగు నంశుకముల్ మెయిసోక పొంగున
మ్మదిసమయమ్ము- అచ్చెరువు మచ్చరికించిన వాయులీనమౌ
మృదుతరుణమ్ము - నా హృదయమాధురులూదిన పాదవిన్యసత్
గ్రథితరుణమ్ము పూవులయి రాశిగొనెన్ మఱివాసికెక్కనో?

## శాస్త్రుల రఘురామశర్మ

రఘురామ శర్మ పుట్టింది శాస్త్రుల వారి ఇంట్లో, పెరిగింది చదువుసందెలు నేర్చింది స్వాతంత్ర్య సమరయోధుని ఇంట్లో.

శివంపేట మండలంలోని గోమారం వీరి స్వస్థానం. సెకండరీ విద్య స్వగ్రామంలో పూర్తి చేసుకొని ఆంధ్రసారస్వత పరిషత్ ప్రాచ్య కళాశాలలో తెలుగు బి. ఓ.ఎల్, ఉస్మానియా యూనివర్సిటి నుండి ఎం.ఎ. డిగ్రీలను పొందినారు.

అధ్యాపక వృత్తిలోనున్న వీరు పంచాయత్ రాజ్ ఉపాధ్యాయ సంఘానికి తాలూకా జిల్లా అధ్యక్షులుగా ఉపాధ్యాయులకు విశేష సేవలందించారు. వీరు కొంతకాలం మెదకు మండల సాహిత్య పరిషత్ నర్సాపూర్ శాఖ కార్యదర్శిగా పని చేసి కేంద్ర ప్రధాన కార్యదర్శిగా ఎన్నికైనారు.

### వీరి రచనలు

కాదంబరి పూర్వ భాగం తెలుగు సేత 2

తిక్కన్న-కంకంటి పాపరాజుల ఉత్తర రామాయణాల తులనాత్మక పరిశీలనము.

శిఖి ముఖాలు - సంకలనం (మిత్రుడు ప్యారకతో కలిసి)

శ్రీగిరి మల్లికార్జున శతకము

శ్రీ వరగంటి భారతీ స్తవము.

చాణక్య పద్యకావ్యం (అసంపూర్తి)

వీరు మూడు మార్లు అష్టావధానములు దిగ్విజయముగా నిర్వహించినారు.

శ్రీ వరగంటి భారతీస్తవములోని ఒక పద్యము

తెలతెలవార వచ్చె రవిదేవడదో కనకాంబరాల మా
లల కిరణాల చేతుల కలాత్మకమై ధరియించి తూరుపన్
మలశిఖరాగ్ర భాగమున మాన్యత తానిలుచుండె అమ్మరో
మెల మెలకండ్లు విప్పి గనుమీభువి శ్రీ వరగంటి భారతీ ...

## తిగుళ్ళ రాధాకృష్ణ శర్మ

శ్రీమతి శ్యామలమ్మ, రఘురామశర్మల ముద్దు బిడ్డడుగా చేబర్తి గ్రామంలో జన్మించిన రాధాకృష్ణ శర్మగారు ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి బి. ఓ.ఎల్. పట్టభద్రులు.

వెస్లీ ఉన్నత పాఠశాల మెదకులో తెలుగు పండితులుగా నియుక్తులై బదిలీపై కామారెడ్డిలో విధినిర్వాహణ గావించుచున్నారు.

సంస్కృతాంధ్రాలలో చక్కని ప్రవేశమున్న శర్మగారు ఉభయ భాషల్లోనూ కవిత్వం చెప్పగల్గిన నేర్పరి.

### వీరి రచనలు

1. అద్వైతం
2. శ్రీనృపంచానన రామలింగేశ్వర తారావళి
3. శ్రీ గణపతి స్తవం
4. మాతృ స్తవం

5. వజ్ర వైరోచన శతకం

ఈయన రచనకొక ఉధాహరణ

హైహయవంశ ఘోర వన మర్ధిర యాయమ నీదుకోపసం
దోహ మహోగ్ని కీలలకు దోశడు బూడిద పూర్వమందు వ్యా
మోహ మదాంధ కారమున మున్గిన రాజుల పాలి శాపమా
రోహనమయ్యె గొడ్డలికి యాఢిగ పాడిగ రేణుకాంబికా

## గౌరీభట్ల మెట్రామశర్మ

మిర్‌దొడ్డి మండలమందలి వెంకట్రావు పేటలో జన్మించిన మెట్రామశర్మ కవిశార్దూలకిశోర బిరిదాంకితులైన రామకృష్ణ శాస్త్రిగారి కుమారులు. వీరి మాతృమూర్తి శ్రీమతి రాధా బాయిగారు.

ఈ కవి ఉస్మానియా విశ్వ విద్యాలయము నుండి సంస్కృతమునందు ఎం.ఎ. పట్టము నంది బి.జె.ఆర్. డిగ్రీ కళాశాల హైద్రాబాదులో సంస్కృత ఉపన్యాసకులుగా పనిచేయుచున్నారు. ప్రతాప రీద్రీయ వ్యాఖ్యానము రత్నాపణ పరిశీలనము అను సిద్ధాంత వ్యాసముచే ఎమ్.ఫిల్ పట్టమును పొందిరి.

శర్మగారు తండ్రి నుండి సంక్రమించిన కవితాధారకు పదును పెట్టి అనేక అష్టావధానముల నిర్వహించిరి.

వీరి రచనలు వాగధీశ్వరీ శతకము - రత్నాపణపరిశీలనము.

లలిత కళా విలాసము వెలార్చెడు పల్కుల తేనెలొల్కగా
చిలుకకు నేర్పినట్లు నిను జేరిన వారికి నేర్పునేర్పునీ.
కలవడె నంచు ధాత్రి దెలియంగనొ ? చిల్కను చేతదాల్చితో
పలుకుల రాణి నీ మహిమ వల్కగ శక్యమె ? వాగధీశ్వరీ!

## గౌరిభట్ల రఘురామశర్మ

రఘురామశర్మ గౌరీభట్ల రామకృష్ణ శాస్త్రిగారి ద్వితీయ కుమారులు. తాతతండ్రుల నుండి ఆను వంశికముగా వీరికి కవిత్వమబ్బినది. తాత మహా పండితుడు, తండ్రిగొప్పకవీశ్వరుడు.

ఉస్మానియావిశ్వ విద్యాలయంలో ఎం.ఏ. ఉత్తీర్ణులై హైద్రాబాదులో ఉపన్యాసకులుగాపని చేయుచున్నారు.

చక్కని ధారాశుద్ధి గల్గిన కవిత్వము వీరిసొత్తు, ఇప్పటికి 20 అష్టావధానాలును పూర్తిచేశారు.

## బోర్పట్ల హన్మంతాచారి

సంగారెడ్డిలో నివసిస్తున్న బోర్పట్ల హన్మంతాచారి ఇస్మాయిల్ ఖాన్‌పేటలో ప్రముఖ జ్యోతిష పండితులైనబోర్పట్ల శేషాచారి, కావేరీ బాయిలకు 21-7-1943న జన్మించారు.

చిన్న నాట స్వగ్రమామంలో విద్యాభ్యాసం తండ్రి కడ సంస్కృత సాహిత్యం కొంతగావించారు. ఉస్మానియా యూనివర్సిటి నుండి ఎం.ఎ. ఉత్తీర్ణులైనారు.

కొంతకాలం జిల్లా పరిషత్తు యాజమాన్యంలో ఉపాధ్యాయులుగా ప్రస్తుతం సంగారెడ్డి జూనియర్ కళాశాలలో తెలుగు ఉపన్యాసకులుగా పని చేస్తున్నారు.

<u>వీరి రచనలు</u>

1. 'వీధినబడ్డ భావి పౌరులు' నాటకం

2. 'శిథిలజీవనం', నవల

3. 'తంగపేటిక', కవితాసంపుటి

మెదకు మండల సాహిత్యపరిషత్తు సంగారెడ్డి తాలూకా కార్యదర్శిగా సాహితీ సేవనొనరించారు.

## వితాల శ్రీకాంత శర్మ

కవి, గాయకులు, ఉత్తమ ఉపాధ్యయులు, వితాల శ్రీకాంత శర్మగారు 1950లో జన్మించారు. సుప్రసిద్ధ అవధాని, వేదాంతిఐన చంద్రవౌళి శాస్త్రిగారు ఆయన తండ్రి గారు, సరస్వతమ్మ తల్లి. విద్యార్థిదశలో సిద్దిపేట కాలేజి విద్యార్థి సంఘానికి సాహితీ విభాగ కార్యదర్శిగా పనిచేశారు. బికాం, ఎం.ఏ (తెలుగు) పూర్తిచేసి అద్యాపక వృత్తిలో స్థిర పడ్డారు. పరాశరం గోపాలకృష్ణమూర్తి, ముదిగొండ వీరభద్రయ్య ఆయన గురువులు. తొలుత మరో ముగ్గురితో కలిసి "ఋుత చేతన" వచన కవితా సంపుటిని వెలువరించారు. "చైతన్య విహంగం" మరో వచన కవితా సంకలనం. "నవ చైతన్య భారతి" స్థాపనలో శ్రీకాంత శర్మ భూమిక కీలకం. జాతీయ సాహిత్య పరిషత్ సిద్దిపేట శాఖకు పునాదులు వేశారు శ్రీకాంత శర్మ. దీనికి సంస్థాపక అధ్యక్షులుగా కూడా ఉన్నారు. మెదక్ మండల సాహిత్య పరిషతుత సిద్దిపేట శాఖ కార్యదర్శిగా ఉన్నారు.

## డా. పి. మాణిక్య ప్రభు

బాల్యంలో కొంత తండ్రి నుండి సంపాదించిన సంస్కృతం పెద్దయ్యాక పేరుతెచ్చింది.

పెద్ద శంకరంపేటలో పైడిమఱ్ఱి లక్ష్మీనారాయణ శాస్త్రి గారి ప్రథమ సంతానం మాణిక్యప్రభు. తండ్రి ఉపాధ్యాయుడగుటచే గోమారం ఉన్నత పాఠశాలలో హెచ్.ఎస్.సి. వరకు చదివి ఆంధ్రసారస్వత పరిషత్ ప్రాచ్యకళాశాల నుండి బి.ఓ.ఎల్. డిగ్రీ నందుకొని కొంతకాలం హైదరాబాదులో తెలుగు పండితులుగా ఉద్యోగం చేసి ఉస్మానియా యూనివర్సిటీలో ఎం.ఎ. పరీక్షలో ఉత్తీర్ణులైనారు. మెదక్ జిల్లా గ్రామనామాలపై పి.హెచ్.డి. చేసి డాక్టరేట్ పట్టాపుచ్చుకున్నారు. ప్రభుత్వ డిగ్రీకళాశాలలలో ఉపన్యాయాసకులుగా పని చేయుచున్నారు. వివిధ పత్రికలలో ఇతని వ్యాసాలెన్నో అచ్చయినాయి. మంచి కవిగా వక్తగా ఇతనికి పేరుంది.

## యస్.దశరథ రామ శర్మ

మున్నాలాల్ సంస్కృత పాఠశాలలో, వేందాత వర్థిని సంస్కృత కళాశాలలో సంస్కృత విద్యాభ్యాసం చేసిన దశరథ్ రామ శర్మ తెలుగు పండితులుగా పని చేయుచున్నారు. తెలుగు బి.ఓ.ఎల్. ఉత్తీర్ణులైనారు. శ్రీమతి అంజమ్మ, ఆంజనేయ శర్మల ద్వితీయ సంతానంగా జన్మించారు.

వీరి స్వగ్రామం శివంపేట మండలంలోని రత్నాపురం.

సరళమైన సరసమైన కవిత్వము చెప్పడం ఈయనకు వెన్నతో పెట్టిన విద్య. ఈయన రచించిన రచనలోనుండి ఒక కవిత మెదకు మండల సాహిత్య పరిషత్ ప్రచురించిన రసతరంగాలలో ప్రచురింపబడినది.

## శాస్త్రుల వెంకటేశ్వర శర్మ

అభినవ విద్యారణ్య బిరుదాంకితులైన శాస్త్రుల విశ్వనాథ శర్మగారి ప్రథమ సంతానంగా జన్మించిన వెంకటేశ్వర శర్మ చిన్నతనంలో తండ్రి వద్ద సంస్కృతము నభ్యసించెను. తండ్రి స్థాపించిన వైదిక పాఠశాలలో యజుర్వేదమును సాంగముగా నేర్చుకొనెను. శృంగేరీ శంకరాచార్య పీఠమున వేదాంత శాస్త్రమును అభ్యసించెను.

ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి బి.ఓ.ఎల్.; ఎం.ఏ., పరీక్షలలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యెను. కొన్నాళ్లపాటు మెదకు ప్రభుత్వ పాఠశాలలో ఉపాధ్యాయునిగా పని చేసెను.

ప్రస్తుతము ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ డైరెక్టరేట్‌లో అసిస్టెంట్ డైరెక్టర్‌గా విధినిర్వాహణ గావించుచున్నారు.

ఉన్నత అధికార బాధ్యతలు నిర్వహిస్తూ కూడా సంస్కృతాంధ్రలో ఎన్నో వ్యాసములు వెలువరించుచున్నారు. చక్కని వక్తగా వీరు పేరుప్రఖ్యాతుల నందినారు.

## జాలిపల్లి చంద్రారెడ్డి

ఆయన స్వస్థలం చిన్నకోడూరు. 1945లో జన్మించారు. రంగారెడ్డి - ఎల్లమ్మ తల్లిదండ్రులు. బ్రహ్మశ్రీ మూలం పల్లి రాజమల్లయ్యాశర్మ ఆయన సాహితీ గురువు. 1967లో ఉస్మానియా విశ్వ విద్యాలయం నిర్వహించిన అంతర కళాశాలల గేయ రచన పోటీల్లో ఉత్తమ గేయరచయితగా ప్రథమ బహుమతి పొందారు. మరో ముగ్గురు కవులతో కలిసి "ఋత చేతన" కావ్యాన్ని ప్రచురించారు. ఎన్నోపద్య, వచన, కవితలు రచించారు. తోరణాల గ్రామంలో ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యయుడిగా పని చేస్తున్నారు.

## కనపర్తి రామచంద్రాచారి

రామచంద్రాచారి సిద్ధిపేటలో జన్మించిరి. చిన్ననాటి నుండి అంటే విద్యార్థి దశలోనే కవిత్వం చెప్పడం అలవాటు చేసి కొన్నారు కనపర్తి.

ఈనాడు వచన కవిత్వానికి విలాసంగా మెదకు జిల్లాలో తన కంటూ ఒక ప్రత్యేకతను సంతరించు కొన్నారు. జాతీయ భావాలతో ఏది చెప్పినా కనపర్తి కవిత్వంలో ఒక విశిష్టత కనబడుతుంది.

కనపర్తి తల్లిదండ్రులు భూలక్ష్మి, రంగన్నలు, కొడుకేదో ఉద్యగంలో సంపాదిస్తాడని అనుకుంటే కనపర్తి సాహిత్యోద్యోగంలో గణకీర్తిని సంపాదిస్తున్నారు.

ఆతని మాటల్లో చెప్పాలంటే

*'వచన కవితనా ఉద్యోగం*

*వచన కవితనా ఉద్యమం'* అంటాడు.

రామచంద్రాచారి ఇప్పటికి 25 పుస్తకాల వరకు వ్రాసి ముద్రించారు. పుస్తకరచనలో రజతోత్సవాన్ని జరుపుకొన్నారు. వీరు వ్రాసిన అక్షర శిల్పాలు అనే వచన కావ్యానికి 'వేముగంటి పురస్కారం' లభించింది.

"వెలుతురు పూలు" అనే కావ్యానికి జాతీయ సాహిత్య పరిషత్తు అవార్డు ప్రదానం చేసింది.

వీరి కవితలు, ఎన్నో రేడియోలో ప్రసారం కావింపబడ్డాయి. కనపర్తి కావ్యాలపై ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పరిశోధన (పి.హెచ్.డి) జరుప బడుతున్నదంటే ఈయున కవిత్వంలో ఎంతటి ప్రత్యేకత ఉందో అర్థమవుతుంది.

కనపర్తి రామచంద్రాచారి తాను సాహితీ వేత్తయేగాక సాహితీ సేవకుడు కూడా.

జాతీయం సాహిత్య పరిషత్తు సిద్దిపేట శా క్రియాశీల సభ్యునిగా బాధ్యతలు నిర్వర్తిస్తున్న పరిషత్తు కార్యక్రమాలకు చేదోడువాదోడుగా : తోటి కవిమిత్రుల ఆదరాభిమానాలను చూరగొ ఆయనకు సరదా.

కనపర్తి రామచంద్రాచారికి వ "కవితాప్రవీణ" అనే బిరుదం ప్రదానం చేయబడి "ఈ మట్టినే నేను ప్రేమిస్తాను" అనే కావ్యము శీర్షికతో ఈ రచన

మట్టికీ మనిషికీ
బంధం అంటారు కానీ
మట్టికున్నచల్లని మనసు
మనిషికెక్కడిది.

నాల్గు రాళ్ళు దొరికితే
ఎక్కడో ఆకాశంలో ఉంటాడు మనిషి
అదే మట్టినిచూడు
ఎక్కడో ఆకాశంలోంచి
నాల్గు చినుకులు రాలి పడితే
పులకరించి
తెల్లారేసరికి పది మొలకల్ని ప్రసాదిస్తుంది.

---

గాలి ఒక వార్తా పత్రిక
నీరు భూమి పుత్రిక
నేల తల్లి అంటావా
అన్నిటికీ అదే మాతృక

పాంచభౌతిక మైనప్పటికీ

ఈ మనిషికి

ఎదుటి వాళ్ల మనసు కాల్చడం తప్ప

పంచ భూతాల సమైక్యతా గుణమెక్కడిది ?

ఒట్టిగా మట్టి మనిషంటేనే నొప్పుకోను

నవనీత చోరునికి

నాల్గైదు మాసాల గర్భిణికి తప్ప

మట్టి రుచి మరెవ్వరికి తెలుసు

## కోలాచల వేంకట కృష్ణశర్మ

మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాధ సూరి వంశస్థులైన వేంకట కృష్ణశర్మగారు శ్యామలమ్మ నర్సింహాశర్మలకు జన్మించిరి. కొల్చరం స్వగ్రామంగానున్న శర్మ సంగారెడ్డిలో స్థిర నివాసమేర్పరుచుకున్నారు. బి. ఓ.ఎల్., పట్టభద్రులైన వీరు తెలుగులో చక్కని పద్యంహృద్యంగా వ్రాయగలరు - తెలుగు పండిత ఉద్యోగాన్ని జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలో నిర్వహిస్తూ అనేక విద్యార్థుల భవితవ్యాన్ని తీర్చి దిద్దినారు.

## మరువమాముల దత్తాత్రేయశర్మ

దత్తాత్రేయ శర్మగారి స్వగ్రామము కొండపాక, వీరితల్లిదండ్రులు అన్నపూర్ణ, రాజమౌళిశర్మలు. వీరు 15.6.62న జన్మించిరి.

దత్తాత్రేయశర్మ తండ్రిగారు ప్రధానోపాధ్యాయులుగా పనిచేయుచున్నారు. సహృదయులైన ఆతల్లిదండ్రుల కుమారులుగా దత్తాత్రేయ శర్మ సరస సంభాషణా చతురులు.

స్నాతక స్థాయి పరీక్ష వరకు సిద్దిపేట డిగ్రీ కళాశాలలో చదివి ఆతర్వాత ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి ఎం.ఎ పట్టమునందు కొనిరి. 1984లో గురుజాడ అప్పారావు స్మారక బంగారు పతకం, యూ.జి.సి. వారిచే జె.ఆర్.ఎఫ్. పురస్కారం, ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయాలపై 1989లో ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు యం.ఫిల్. పట్టానుపొందిరి.

ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు 'తెలుగు వ్యాఖ్యాన వాఙ్మయము' అను శీర్షికపై పరిశోధన గావించిరి.

వీరు ప్రస్తుతము ఆంధ్ర ప్రదేశ్ గురుకుల విద్యాలయ సంస్థలో తెలుగు పోస్టుగ్రాడ్యుయేట్ టీచర్‌గా పనిచేయుచున్నారు.

వీరు చక్కని పద్య కవిత్వమును మరియు వచన కవిత్వమును చెప్పుదురు.

## డాక్టర్ నందిని సిద్ధా రెడ్డి

ఇప్పటికి నాలుగు కవితా సంపుటాల్ని ప్రచురించిన నందిని సిధారెడ్డి సిద్దిపేటకు దగ్గరలో ఉన్న బందారంలో 1954 సంవత్సరంలో జన్మించారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం.ఎ. పట్టాను పొందినారు. సిద్దిపేట ప్రభుత్వ డిగ్రీ కాలేజిలో లెక్చరర్‌గా పనిచేస్తున్నారు. సిధారెడ్డి రచించిన దివిటి, భూమిస్వప్నం, సంభాషణ, ప్రాణహిత కవితా సంపుటాలు విమర్శకుల ప్రశంసల్ని అందుకున్నాయి. సిద్ధారెడ్డి కవితలో సైద్ధాంతికి నిబద్ధత స్పష్టంగా కన్పిస్తుంది. ఆయనకు 1987 ఫ్రీవర్స ఫ్రంట్ 1988 దాశరథి అవార్డులు వచ్చాయి. 1986లో మంజీరా రచయితల సంఘం స్థాపన వెనుక సిద్ధారెడ్డి పాత్రకీలకం, "మంజీర " పేరతో వెలువడ్డ బులిటెన్‌కు రెండు సంవత్సరాలపాటు సంపాదకుడిగా ఉన్నారు. 1987 భోపాల్ జాతీయ కవిసమ్మేళనం అనంత భారతిలో పాల్గొన్నారు. 1999లో తిరూరు (కారు) లో జరిగిన సౌత్ ఇండియన్ పొయిట్రీ మీట్‌లో పాలు పంచుకున్నారు. తెలంగాణా నేలపై తన ఆవ్యాజాను రాగాన్ని ప్రదర్శించే సిదారెడ్డి 1999లో తెలుగు యూనివర్సిటీ ప్రతిభా పురస్కారాన్ని తిరస్కరించారు (ఆయన రచించిన ప్రాహత కావ్యానికి పురస్కారాన్ని ప్రకటించారు.) వచన కవిత్వం రాస్తున్న ప్రతిభావంతులైన కవుల్లో మేటి సిద్ధారెడ్డి. ఆయన జానపద గీత రచనలోనూ ప్రవీణుడు. ఆయున రచించిన పోయింగ్ "ఆర్మ్‌డ్ డ్రీమ్స్" అన్న వ్యాసం ఆంధ్ర ప్రదేశ్ టైమ్స్ పత్రికలో ప్రచురణ పొందింది. త్వరలోనే ఒక రచన కవితా సంకలనాన్ని గేయ కవితా సంపుటిని ప్రచురించే పనిలో ఉన్నారు సిద్ధారెడ్డి.

## కందుకూరి శ్రీరాములు

కవితా రచనలో నూతన ప్రయోగాలు చేయడంలోఎక్కువగా ఉత్సాహం చూపించిన కవి కందుకూరి శ్రీరాములు. వీరు అధ్యాపక వృత్తిలో ఉంటూ శతాధికంగా కవితల్ని రాసినారు. వీరి రచనలు సూటిదనాన్ని, స్పష్టతని కలిగి పాఠకులను చైతన్యపరిచేవిలా ఉంటాయి.

ఉదాహరణగా ఒక కవిత.

"నీ చూపు ఆకాశంలోకి పెట్టిన
టార్చిలైట్ కాకూడదు
భూమ్మీదికి ఎక్కుపెట్టిన
సూర్యుడు కావాలి."

## డాక్టర్ ఏనుగు నరసింహారెడ్డి

అభద్రత, ఆకలి, నిరుద్యోగం, సమాజపు తీరు పట్ల విసిగి వేసారిన యువతరానికి ప్రతినిధిగా భావావిష్కరణ చేసిన యువ రచయిత ఏనుగు నర్సింహారెడ్డి.

వీరు మెదకు జిల్లా ఎన్నారం గ్రామంలో 6-4-68న జన్మించారు. వీరి తల్లిదండ్రులు ఏనుగు లక్ష్మమ్మ కృష్ణారెడ్డి గార్లు. వీరి విద్యాభ్యాసం చిట్యాల, రామన్నపేట, నల్గొండ, ఉస్మానియా యూనివర్సిటీల్లో కొనసాగింది. తెలుగు విశ్వవిద్యాలయంలో Ph.D. పూర్తి చేసినారు.

చదివింది సాహిత్యం, పనిచేసేది పరిపాలనా విభాగం. ఎం.ఆర్.ఓ. గా ఉంటూ ప్రజల జీవన విధానాన్ని చక్కగా ఆకళింపు చేసుకుంటారు. వృత్తి ఏదయినా ప్రవృత్తి మాత్రం కవిత్వం.

నరసింహారెడ్డి కవిత్వంలో ఆర్ద్రత సమాజంలోని అసమాంతరాల పట్ల వ్యంగ్యం కోపం కనిపిస్తాయి. చెప్పే విషయాన్ని స్వచ్ఛంగా, స్పష్టంగా, సూటిగా చెప్పడం ఈయన నైజం.

ఈయన కవిత్వంతో "ఆలయాలు ఓట్లు పూస్తాయి," 'హృదయం చిరునామా గురించి మాట్లాడు తున్నానంటూ ప్రతిరోజూ కలుసు కుంటున్న అపరిచితులం' అంటాడు. స్త్రీని అతి తక్కువ రంగులతో అందమయిన సంసార చిత్రాన్ని గీయ ప్రయత్నిస్తున్న సాంకేతిక చిత్రకారిణి అని కొత్త తరహాలో వర్ణిస్తాడు.

ఈయన రచన "సమాంతర స్వప్నం" అనే వచన కవితా సంపుటి బహుధాశ్లాఘనీయం.

## ఏలేశ్వర నాగభూషణాచార్య

వీరు ఉపాధ్యాయ వృత్తితోపాటు సాహిత్య ప్రవృత్తినలవర్చుకొన్న అభ్యుదయ వాదులు. ప్రథమంలో పద్యకవిత్వం వ్రాస్తూ సి.నారె, దాశరథి, శ్రీ శ్రీ నగ్నముని, తిలక్‌ల ప్రభావంతో ఆధునిక సాహిత్యానికి అందెవేశారు. వీరి కవితలు అనేక పత్రికలలో ప్రచురితమైనాయి. వీరి కవితలలో ఆర్ద్రత, ఆర్తి, పోరాటం కనిపిస్తుందని శ్రీ ఎన్. గోపీ గారన్నారు. ప్రాంతీయ వ్యవహారికి బాషలలోని గఢతవారి కవితలోనున్నట్లు నగ్నముని గారు పేర్కొనడం ఘననాఘననం వీరు ప్రతిభ ఉన్న కవి అని, పాఠకుల్ని పరవశింపజేయుగలవని డా॥ సి.నారాయణయ రెడ్డిగారు వీరి నెలతడవనివాన వచన కవి తధోరణికి దర్పణం అన్నారు.

## నెమ్మాని మోహన మూర్తి

నెమ్మాని మోహన మూర్తి గారు వృత్తిరీత్యా జిల్లా సహకార బ్యాంకు సంగారెడ్డిలో ఉద్యోగము చేయుచున్నారు.

వీరు చక్కని నటులు. శృతికళానికేతన సంస్థ ద్వారా అనేక నాటకములను ప్రదర్శించిరి.

మోహన మూర్తిగారు పాంచజన్యం - అంతర్మథనం అనురెండు గేయ కవితా సంపుటాలను రచించి ప్రచురించిరి సామాజిక స్పృహ కల్గిన వీరి కవిత్వం సరళమై భావగాంభీర్యమై సందేశాత్మకమై ఒప్పారుతుంది - వీరి రచనావైశిష్ట్యానికొక

ఉదా :- అద్దం అబద్ధం చెప్పదు - నిజనిర్ధారణలో నిజముండదు

పాలపుంతలో పాలుండవు - నేతిబీరులో నేయుండదు.

## మోతుకూరి అశోక్ కుమార్

మెదకు జిల్లాలో పుట్టిన యువకవి మోతుకూరి అశోక్ కుమార్.

విషయాన్ని సూటిగా, స్పష్టంగా చెప్పడం ఈయన కవితలోని ప్రత్యేకత. మంజీరా రచయిత సంఘం పక్షాన ప్రచురించిన కవితాసంకలనం 'సంతకం'.

*'చిగురించే జ్ఞాపకం' కవితలో ....*
*అమూల్యమైన.నాజ్ఞాపకం ఓ వెన్నెల తరగ*
*ఓ జలపాతం - ప్రతి ఉదయాన తడిగా తగిలే*
*సిందూరపువ్వు నా జ్ఞాపకం ..... అంటారు.*

## నీలకంఠం పాండురంగం

మెదకు జిల్లా పెద్దశంకరంపేట గ్రామంలో తేది. 8-7-1939న గుండమాంబ వెంకన్నలకు పాండురంగం జన్మించారు. ప్రాథమిక విద్య స్వగ్రామంలో పూర్తిచేసుకొని ఉపాధ్యాయ వృత్తిలో చేరి ఉస్మానియా యూనివర్సిటీ నుండి B.O.L., M.A., పట్టాలను పొందినారు. జూనియర్ కళాశాలలో ఉపన్యాసకులుగా పదవీ విరమణ గావించారు.

**రచనలు**

1. బాలగేయ కథమాల
2. వినయరంగ శతకం
3. జగద్గీత

సుధాధారయనే వ్యాకరణ గ్రంథాన్ని కూడా రాశాను.

## నమశ్శివాయ గారి వెంకట నరసింహులు

ఎన్.వి. నర్సింహులుగా పిలువబడే ఈ కవి 1-7-1931న రాధమ్మ గంగారాంలకు జన్మించారు. స్వగ్రామం పెద్దశంకరంపేట. ఉపాధ్యాయవృత్తి చేస్తూ బి.ఓ.ఎల్., ఎం.ఎ., పరీక్షలలో ఉత్తీర్ణులయినారు. ఆంధ్రోపన్యాసకులుగా పదవీవిరమణగావించారు. వీరి రచనలు.

1. వీణాపాణి శతకం 2. అహల్యా సంక్రందనంలో కథాచమత్కృతి 3. కన్యల విలాపాలతో కవుల సరాగాలు పై రెండూ పరిశీలనా వ్యాసాలు.

## నక్క అమ్మయ్య

గుంటూరులో పుట్టి సంగారెడ్డిలో జీవనం సాగిస్తున్న కవి నక్క అమ్మయ్య.

అంజయ్య దయమ్మల సంతానంగా 16-5-1952లో జన్మించిన అమ్మయ్య బాల్యం విద్యాభ్యాసం గుంటూరులో జరిగింది. హైద్రాబాద్ చేరి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఎ.,(తెలుగు) పట్టాను పొందినారు.

సంగారెడ్డిలో విద్యుత్ శాఖలో ఉద్యోగం లభించింది. చేసే వృత్తి విద్యుత్‌శాఖలోనైనా మనః ప్రవృత్తి మెరుపులాంటి కవిత్వం పైనే.

రెక్కల చెట్టు, 'తిరుపతమ్మశతకం', 'హృదయసీమ', 'కొక్కొరొకో', లు ఈయన కలం

నుండి జాలువారిన పద్య, గేయ, వచన కావ్యాలు ఈయన కవిత్వానికో ఉదాహరణ.

సూర్యునింటికెళ్ళి చుట్టగాల్చగవచ్చు
పాలపుంత మీద పండవచ్చు
అహములేని నరుని మహినసాధ్యము జూడ
తియ్యమావి కొమ్మతిరుపతమ్మ

అక్షరప్రభ, జన్మభూమి వంటి ప్రభుత్వ కార్యక్రమాలలో స్వయంగా గీతాలు వ్రాసి పాల్గొన్నారు. సాహితీ సమావేశాలు నిర్వహించడం ఇతని హాబీ.

## పప్పుల రాజిరెడ్డి

1958 మిరుదొడ్డి మండలం వెూతె గ్రామంలో జన్మించిన రాజిరెడ్డి కాకతీయ విశ్వవిద్యాలయం ఎం. ఏ. బాంగారు పతక గ్రహీత. 1983-84వ సంవత్సరంలో ఆయనకు కాకతీయ విశ్వ విద్యాలయం (ఆధునిక కవత్వం) గోల్డ్ మెడల్ లభించింది. "పండి తారాధ్య చరిత్ర - సామాజిక సాంస్కృతిక జీవనం" అనే అంశంపై ఎం.ఫిల్ పూర్తి చేసిన రాజిరెడ్డి ప్రస్తుతం దుబ్బాక మండలంలోని పోతారెడ్డి పేట ప్రాధమిక పాఠశాలలో ఉపాధ్యాయు నిగా పని చేస్తున్నారు. ఆధునిక వచన కవిత్వంపై ఆయనకు చక్కని అవగాహన ఉంది. గ్రామీణ జీవితం అందులో ఏర్పడుతున్న సంక్షోభాలు - అంతకంతకు పతనమవుతున్న మానవ సంబంధాలపై తనదైన కవితా వీక్షణాన్ని ప్రసరించే రాజిరెడ్డి కవితా సంకలనంతో చక్కని పేరు తెచ్చుకున్నారు. మంజీరా రచయితల సంఘం సిద్దిపేట శాఖ సంకలనాన్ని ప్రచురించింది. రాజిరెడ్డి కవి- విమర్శకుడు కూడా. ఆయన రచించిన యాభైకి పైగా కవితలు ఆంధ్రభూమి, ఆంధ్ర ప్రభ, అరుణతార ప్రజాసాహితి, సాహిత్య నేత్రం, ఉత్తరాంధ్ర, ఎక్సరే ప్రగతి, నేటినిజం, ఉపాధ్యాయ, అమృత కిరణి, అధ్యాపక జ్వాల పత్రికల్లో ప్రచురణ పొందాయి.

పదికిపైగా విమర్శ వ్యాసాలు ప్రజా సాహితి - సాహిత్య నేత్రం - యువత- ఎక్స్‌రే తదితర పత్రికల్లో వెలుగు చూసాయి. ఈ విమర్శా వ్యాసాలన్ని ఆధునిక కవిత్వం చుట్టు అల్లుకున్నవే.

## సి.హెచ్. నారాయణ

సంగారెడ్డి స్థానికంగా నివసిస్తూ జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలో తెలుగు పండితునిగా పని చేసి పదవీ విరమణ నందిన కవి సి.హెచ్. నారాయణగారు.

వీరు కవిత్వమునందేగాక నటనలో కూడా చక్కని నిపుణులు. స్వయంగా నాటకాలు వ్రాసి ప్రదర్శించిన అనుభవం వీరికుంది.

## బి. బ్రహ్మయ్య

ఎం.ఎ., బి.ఎడ్., ఎల్.ఎల్.ఎమ్. డిగ్రీలు కలిగిన బి. బ్రహ్మయ్య సంగారెడ్డిలో స్థిర నివాసమేర్పచుకున్నారు.

మెదకు జిల్లా పరిషత్ యాజమాన్యము నందలి పాఠశాలలో తెలుగు పండితులుగా పని చేయుచున్నారు.

మెదకు జిల్లా అక్షరాస్యతా కార్యక్రమంలో చురుకుగా పాల్గొని ఎన్నో పాటలు రచించి పాడారు.

'శ్రీవాణి', కలంపేరుతో ఈయన రచనలు వెలుగు చూస్తాయి.

## యం. తుకారాం

మెదకు జిల్లాలో జూనియర్ లెక్చరర్గా పని చేస్తున్న తూకారం సంగారెడ్డిలోని సాహిత్యరంజని సంస్థకు ప్రధాన కార్యదర్శిగా సాహితీ సేవనొనరిస్తున్నారు.

రాష్ట్ర ఉత్తమ ఉపన్యాసక అవార్డును ప్రభుత్వంచే పొందినారు.

వీరు రచించిన వ్యాపార గణశాస్త్రములు (Elements of Income Tax ) ప్రభుత్వామోదాన్ని పొందాయి.

## పైడి మఱ్ఱి మనోహర్

పెద్దశంకరంపేట పైడిమఱ్ఱి లక్ష్మీనారాయణ శాస్త్రి కుమారుడయిన మనోహర్ తండ్రిగారి ఉద్యోగంతో గోవారంలో ప్రాథమిక విద్యను పూర్తిచేసుకొని తెలుగు బి.ఓ.ఎల్. ఉత్తీర్ణతనంది మెదకు జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో తెలగు పండితులుగా పని చేయుచున్నారు.

సాహితీ సేవపైనున్న మమకారంతో వివిధ సంస్థల్లో సభ్యులుగా చేరి సాహితీ రంజని సంస్థకు ప్రధాన కార్యదర్శిగా తన సేవలందించుచున్నారు. హృదయకుసుమం అనే నవల "తెరమరుగున తెలుగు కవులు" అనే సాహిత్య వ్యాసం తోపాటు వివిధ పత్రికల్లో ఈయన కవితలు ప్రచురింపబడ్డాయి.

## డా॥ కస్తూరి లతారాణి

లతారాణిగారు సంగారెడ్డిలో జన్మించిరి. స్వాతంత్ర్య సమరయోధులు, గతశాసన సభ్యులు, సరస సహృదయులునైన కస్తూరి కృష్ణమాచార్యులు గారి కుమార్తె. చదివింది వైద్య శాస్త్రం, తెలుగు సాహిత్యంపై మమకారం. వీరు భావజ్వాల కవితా సంకలనము రచించి ముద్రించిరి.

## శాస్త్రుల లక్ష్మి

చక్కని కంఠమాధుర్యం కలిగిన లక్ష్మి శాస్త్రుల వారి ఇంటి కోడలు, భార్గవ రామ రామ శర్మ ఇల్లాలు. భావ పుష్టి కలిగిన పదాలల్లడంతో, పాటలు రాయడంలో, మంగళహారతుల రచనల్లో ఈమె పదలాలిత గోచరిస్తుంది. శ్రోతల వీనుల విందొనరుస్తుంది. రసతరంగాలు అనే సంకలనంలో ఈమె రాసిన పాటలు ముద్రింపబడ్డాయి. ఈమె పుట్టింది వరంగల్లు, మెట్టింది మెదకు జిల్లా శివంపేటలో.

## శాస్త్రుల శ్రీదుర్గ

కామారెడ్డిలో పుట్టి, గోమారంలో మెట్టిన శ్రీదుర్గ చిన్నతనం నుండీ పండిత సమూహంలో పెరిగింది. తండ్రి తెలుగు పండితుడు. సహజంగా తెలుగు భాషపై మమకారం ఈమెలో చేరి సెకండరీ విద్యాభ్యాసం తర్వాత కామారెడ్డి ప్రాచ్య కళాశాలలో చేరింది. పి.డి.సి., బి.ఎ.(ఎల్), పరీక్షల్లో ఉత్తీర్ణత నందినది. ఉస్మానియా యూనివర్సిటీలో చేరి ఎం.ఎ. చదివి ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలయింది. చదువుకుంటున్న రోజుల్లోనే అనేక గేయాలు వ్రాసి గురువులను సహచరులనూ మెప్పించింది. వివిధ పత్రికలకు వ్యాసాలు వ్రాసింది.

## ప్యారక సీతాదేవి

పుట్టింది, పెరిగింది, మెట్టింది నేటి మండల కేంద్రమయిన శివంపేటలోనే. కవిపండిత వంశంలో సముద్రాల వేంకటాచార్యుని ప్రథమ పుత్రికగా పుట్టి ప్యారక శేషాచార్యున్ని చేపట్టింది. చిన్నప్పటి నుండీ భావజాలంలో తేలియాడిన సీతాదేవి తెలుగు సాహిత్యాన్ని ఆకళింపు చేసుకొంది. ఒకవంక తండ్రీ మరొక వంక భర్తా ఈమె భావాలకు నారూనీరు పోస్తే తానెన్నో కవితల్ని రాసింది. పదాలూ పాటలూ మంగళహారతులూ రాసింది. స్త్రీ సహజమైన లాలిత్యం, సౌందర్యం ఈమె పాటల్లో ధ్వనిస్తాయి. ఈమె కవయిత్రిగానే కాక చక్కని గాయని.

## గౌరీభట్ల శ్రీనాధశర్మ

1950లో రిమ్మనగోడులో జన్మించారు. సావిత్రి - రఘురామశాస్త్రి తల్లిదండ్రులు. తెలుగు సంస్కృతాల్లో బి.ఒ.ఎల్. పట్టా పొందారు. దత్తాత్రేయ అష్టకము, గేయాలు, మంగళహారతులు మొదలగు రచనలు చేశారు. వృత్తిరీత్యా మొదటి గ్రేడు తెలుగు పండితులు. ప్రస్తుతం జాతీయ సాహిత్య పరిషత్తు సిద్ధిపేటశాఖ అధ్యక్షులుగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

## డాక్టర్ చెప్పెల హరినాధ శర్మ

1962లో సిద్దిపేట తాలుకా మర్పడగలో జన్మించిన చెప్పెల హరినాధ శర్మ తల్లిదండ్రులు సునీలమ్మ, శ్రీధరశర్మగారలు. కవి, రచయిత, వక్త, సాహిత్య సంస్థల సంఘటనా కార్యకర్త అయిన హరినాధ శర్మ గత 16 సంవత్సరాల నుండి సారస్వత రంగంలో కొనసాగుతున్నారు. "అష్టకాల నరసింహ్మరామ శర్మ జీవితం - సాహిత్యం" అనే అంశంపై పరిశోధన చేసి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్ పొందారు. 14 సంవత్సరాల వయసులో అంటే తొమ్మిదవ తరగతి చదువుతున్న రోజుల్లోనే కవితా రచనకు శ్రీకారం చుట్టారు హరినాధ శర్మ. అప్పట్లో (1977) ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ నిర్వహించిన నాటకాల పోటిల్లో బహుమతి తెచ్చుకున్నారు. జాతీయ సాహిత్య పరిషత్తు సిద్దిపేట శాఖను బలోపేతం చేసిన ముఖ్య కార్యకర్తల్లో ప్రముఖులు శర్మగారు, విశ్వహిందూ పరిషత్ జిల్లా కార్యదర్శిగా, సరస్వతీ విద్యాపీఠం మెదక్ జిల్లా విద్యాసమితి అధ్యక్షులుగాను, బాధ్యతలు నిర్వర్తించారు. ప్రస్తుతం జాతీయ సాహిత్య పరిషత్ సంఘటనా కార్యదర్శిగా కొనసాగుతున్నారు. వచన రచనలోనూ, కవితా వస్తువులోనూ తనదైన నిబద్ధతను ప్రకటిస్తారాయన. "వినుర రామ భక్త వీరహనుమ" శతకం, మల్లికార్జున వైభవం, కర్షక స్వరాలు, సరస్వతీ శతకం తదితర రచనలు చేశారు. ఇందులో కర్షక స్వరాలు కావ్యం విజయనగరం విజయ భావన విశాఖ మనోజ్ఞ పబ్లికేషన్స్ వారి అవార్డుల్ని తెచ్చుకుంది. ముత్యాల స్వరాలతో కూర్చిన కర్షక స్వరాలు హరినాధ శర్మకు గొప్ప పేరును తెచ్చి పెట్టింది. పాత్రికేయ జగతిలోనూ సుప్రసిద్ధులు శర్మ, ఆంధ్రభూమి దిన పత్రికలో యువతరంగాలు అనే శీర్షిక నిర్వహిస్తూ జిల్లాకు చెందిన ఎందరో వర్ధమాన కవుల్ని రచయితుల్ని పరిచయం చేశారు. ఆకాశవాణిలో ప్రసంగించారు. పలువురు కవులకు పుస్తక ప్రచురణలో చేయూతనందించారు. పంచాయితీ రాజ్ ఉపాధ్యాయ రజతోత్సవ సంచిక సంపాదక మండలిలో కీలక భూమిక పోషించారు. మహతి, ప్రభంజనం, శ్రీవారి వంటి కలం పేర్లతో వివిధ పత్రికల్లో కవితల్ని, వ్యాసాల్ని రచించారు. సుప్రభాతం వారపత్రికలో కావ్య సమీక్ష చేశారు. ప్రస్తుతం ఉపాధ్యాయవృత్తిలో కొనసాగుతున్నారు. చైతన్య విహంగం కవితా సంకలనంలో భాగం పంచుకున్న నలుగురు కవుల్లో హరినాధ శర్మ ఒకరు.

## దేశపతి గోపాల కృష్ణ

ఉర్దూ, తెలుగు భాషలో చక్కని పాండిత్యం ఉన్న దేశపతి గోపాలకృష్ణ ప్రస్తుతం విశ్రాంత ఉపాధ్యాయులు. తెలుగు సాహిత్యానికే వన్నె చిన్నెలు తెచ్చిన అవధాన ప్రక్రియ పై ఉర్దూలో ఆయన చేసిన ఆకాశవాణి ప్రసంగం పలువురి ప్రసంశలు పొందింది. భారతి, ఆంధ్రప్రభ వంటి పత్రికల్లో గోపాలకృష్ణ కవితలు ప్రచురణ పొందాయి.

అందమైనపద్యరచన, సుందరమైనస్వరమధురిమలతో శ్రోతల్ని అలరించగల ప్రజ్ఞాశాలి దేశపతి "మధుశ్రీ" వాసర బాల సరస్వతీ సుప్రభాతం". ముద్రణ పొందాయి. చైతన్య కుసుమాలు ముద్రణకు సిద్ధమవుతోంది.

## కె.వై.గిరి

సిద్ధిపేట మండలంలోని తోర్ణాలలో 1945లో జన్మించిన కె.వై. గిరి సామాజిక, సాహిత్య రంగాల్లో చిర ప్రసిద్ధులు. సమాజిక, సాహితీకృషి చిత్రలేఖనం, ఫోటోగ్రఫి గిరి అభిమాన విషయాలు. 1965లో ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించారు. మరుసటి సంవత్సరమే ఆయన మొదటి రచన "ఆరనిజ్యోతి కథానిక " (ప్రజారుత) ప్రచురణ పొందింది. అక్షరాస్యతా ఉద్యమంలో అందె వేసిన చేయి. 1997 మే నుండి దుబ్బాక మండల లిటరసీ ఆర్గనైజరుగా పని చేస్తున్నారు. జన్మభూమి కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొన్నారు. బంగారు పతకాన్ని అందుకున్నారు. 1996లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే ఉత్తమ ఉపాధ్యాయునిగా అవార్డు పొందారు.

## పేర్వాల శ్యామసుందర శర్మ

1964లో జన్మించారు. సుగుణమ్మ - మెట్టురామశర్మ తల్లిదండ్రులు. పలు కవితలు, గేయాలు రచించారు. శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యుల కావ్యాలపై పరిశోధన చేసి ఎం.ఫిల్. పట్టా పొందారు. ప్రస్తుతం సాహిత్య వికాస మండలి కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. స్వస్థలం సిద్దిపేట.

## కె.అంజయ్య

1955లో సిద్ధిపేటలో జన్మించిన అంజయ్యను అం. కె. అని మిత్రులు పిల్చుకుంటారు. తల్లిదండ్రులుజగదాంబ, శేఖరయ్య. డిగ్రీ దాకా చదివారు. 1975 నుండి కవిత్వం రాస్తున్నారు. స్రవంతి, భారతి వంటి అగ్రగణ్య సాహిత్య పత్రికల్లో అంజయ్యరచనలు ప్రచురణ పొందాయి. టీవికవితా సంకలనం గీతాయుధం 1981లో వెలువడింది. 1980లో చైతన్య సాహితీ సంస్థను స్థాపించారు. అటు తర్వాత మంజీరా రచయితల సంఘం స్థాపనలో ప్రధాన పాత్ర వహించారు. మంజీరా రచయితల సంఘానికి కార్యదర్శిగానూ, అధ్యక్షుడిగానూ ఉన్నారు. అంజయ్య కవితకు కుందుర్తి రాష్ట్రస్థాయి వచనకవితల పోటీలో ద్వితీయ స్థానం వచ్చింది. నిరాడంబరుడు, మితభాషి. 1983 నుండి ఈనాడు పత్రికకు (సిద్దిపేట) విలేకరిగా ఉన్నారు.

రెడ్‌క్రాస్ సిద్దిపేట పట్టణానికి బాధ్యులుగా కూడా సేవల్ని అందిస్తున్నారు.

## రామగిరి శివకుమారశర్మ

ఆధునిక వచన కవిత్వానికి కొత్త వన్నెలు తెచ్చిన "సింగిడి" వచన కవితా సంకలన శిల్పి రామగిరి శివకుమారశర్మ. 1960లో జన్మించారు. స్వస్థలం సిద్దిపేట. హైమవతి, గణేశ్వర శర్మ తల్లిదండ్రులు. 1991 నాటి సముద్ర దాహం ఇప్పటి సింగిడి రామగిరిలోని అంతులేని కవితా తాహతుకు తూనిక రాళ్ళు. ప్రచారార్భాటాలకు అమడల దూరంలో ఉండే శివ కుమారశర్మ అచ్చమైన కవి. భారతి లాంటి పత్రికల్లో ఆయన కవితలు వెలుగు చూసాయి. అగ్నిపూలు కవితకు కుందుర్తి వచన కవితా పోటీలో కన్సోలేషన్ బహుమతి వచ్చింది. బాలగీతాంజలి - బాలగేయ తరంగిణి అనే క్యాసెట్టు కోసం కవితలు రచించారు. పల్లవీ ఆర్ట్స్ సాహితీ సాంస్కృతిక సంస్థకు కార్యదర్శి, సిద్దిపేటలో మొదటి గ్రేడు తెలుగు పండితుడిగా పనిచేస్తున్నారు.

## దేశపతి శ్రీనివాస్

స్వస్థలం సిద్దిపేట. 1970లో జన్మించారు. తల్లిదండ్రులు బాలసరస్వతి- గోపాల కృష్ణ. ప్రస్తుతం చిన్న కోడూరులో సెకండ్ గ్రేడ్ తెలుగు పండితునిగా పని చేస్తున్నారు. వచనకవితా, నటనా రంగాల్లో తనదైన సృజనాత్మక ముద్రను సాధించుకున్న యువ కళాకారుడు శ్రీనివాస్. ఆయన రచించిన పాటలు గుగీవా థియోంగా, భూపేన్‌హజారికా వంటి విఖ్యాతుల మన్ననల్ని పొందాయి. మంజీరా రచయితల సంఘం కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొన్నారు. బందీకాని గొంతుక, రూపాయి, పారుతున్న దేహం, వంటివి దేశపతి శ్రీనివాస్ లేఖ నుండి వెలువడిన ఉత్తమ కవితలు. బందీకాని గొంతుకు ఇంగ్లీషులోకి అనువదించబడింది. శ్రీనివాస్ త్వరలోనే వచన కవితా సంకలనాన్ని వెలువరించ నున్నారు.

## ఐతేని గిరి

దుబ్బాక మండలంలోని ధర్మాజిపేట స్వస్థలం. తల్లిదండ్రులు సత్తవ్వ, వెంకాగౌడ్. 1996లో ఈయన రచించిన నెమలికన్ను కవితా సంకలనాన్ని మంజీరా రచయితల సంఘం ప్రచురించింది. "వృద్ధాప్య బాల్యం" అన్న కవిత బాగా ప్రఖ్యాతిని పొందింది. 1997లో అకాశవాణి జాతీయకవిసమ్మేళనంలో తెలుగు కవిగా ఆ కవితను వినిపించారాయన. ప్రస్తుతం స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్, సిద్దిపేట శాఖ లో కంప్యూటర్ ఆపరేటర్‌గా పనిచేస్తున్నారు.

## బి.హెచ్. విరాట్ స్వరూప్

పండిత వంశంలో జన్మించిన విరాట్‌స్వరూప్ ఇప్పుడిప్పుడే ఎదుగుతున్న యువ కవిగా చెప్పవచ్చు. తాతబోర్పట్ల శేషాచారి ప్రముఖ సంస్కృత పండితులు, తండ్రి హన్మం తాచారి తెలుగు పండితులు. తల్లి సుధాభాయి.

ఈతడు 19-2-1971లో జన్మించినాడు. కీసరగుట్ట గురుకుల పాఠశాలలో ప్రాథమిక విద్యాభ్యాసం తర్వాత ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఎ. పట్టా పొందారు. ప్రస్తుతం జిల్లా పరిషత్తు యాజమాన్యంలో తెలుగు పండితులు. ఎన్నో కవితలు వ్రాసినారు. త్వరలో ఈతని కవితా సంకలనం ఆవిష్కరింపబడుతుంది.

## వేముగంటి మురళీకృష్ణ

1972లో జన్మించిన మురళీ కృష్ణ తల్లిదండ్రులు రంగనాయకమ్మ, నరసింహ చార్యులు. స్వస్థలం సిద్ధిపేట, లాతూర్ భూకింపాన్ని గురించి రాసిన తొలికవితతోనే విమర్శకుల ప్రశంసలు పొందిన మురళీకృష్ణ ప్రతిభావంతుడైన కవి. ఆయన కవిత "ఎండిపోతున్న కలలు" ఆంధ్రజ్యోతి, సాహిత్యరంజని సంస్థ సంయుక్తంగా నిర్వహించిన రాష్ట్రవ్యాప్త కవితా పోటీల్లో ప్రథమ బహుమతిని పొందింది.

## గజ్జెల కనకరాజు

చిన్న కోడురు మండలంలో గోనెపల్లి స్వస్థలం. తల్లిదండ్రులు నర్సమ్మ, ఎల్లయ్య. ఏకాంకిక నాటికలు, కథల సంపుటి, గేయ సంకలనం ప్రచురించారు. వీరి కవితలు అకాశవాణిలో ప్రసారమయ్యాయి. ప్రస్తుతం చిన్నకోడూరు మండలం వార్త విలేకరిగా పని చేస్తున్నారు. కొంతకాలంపాటు సిద్దిపేటలోని ఆదిత్య విద్యాలయం తెలుగు పండితునిగా పనిచేసారు.

## గుమ్మన్నగారి వేణుమాధవ శర్మ

1969లో జన్మించారు. స్వగ్రామం దుబ్బాక మండలంలోని పోతారెడ్డి పేట. పద్మావతి, లక్ష్మీనరసింహ శర్మ తల్లిదండ్రులు. ప్రస్తుతం నల్లగొండ జిల్లా భువనగిరిలో ఉపాధ్యాయవృత్తిలో ఉన్న వేణుమాధవశర్మ జ్ఞానపీఠ అవార్డు గ్రహీత వి.కె. గోకక్ కవితల్ని "భారతగీతి" పేరుతో అనువదించారు. ఈ రచన ప్రముఖుల మన్ననల్ని పొందింది. రవీంద్రనాథ్ రాగూర్ స్ట్రేబర్డ్స్ ను అనువదించారు. అది అముద్రితం శర్మ పలు విద్యావిషయ పుస్తకాల్ని రచించారు. సంపాదకులుగా వ్యవహరించారు. ప్రముఖ ఫ్రీలాన్స్ పాత్రికేయుడు డ్యాక్టర్ గుమ్మగారి బాలశ్రీనివాసమూర్తి తమ్ముడు వేణు మాధవ శర్మ.

## అనాజ్‌పూర్ కిషన్

1958లో జన్మించారు. తల్లిదండ్రులు చిన్నరాఘస, మిరాబాయి, స్వస్థలం సిద్ధిపేట, అవాజ్‌కలం పేరుతో ప్రసిద్ధిలైన కిషన్ మంచి నటులు కూడా. నవ్యకళా నికేతన్ అనే సంస్థను స్థాపించారు. గ్రామ పిశాచాలు వంటి నాటికాల్ని రచించి ప్రదర్శింపచేశారు. 'వడీసెల' రచన కవితా సంపుటి ద్వారా పేరు తెచ్చుకున్న కిషన్ మాతృభాష పట్వారీ. వడిసెలు సంకలనంలోని గోస, చీమ - బతుకు కవితలు అలాజ్‌పూర్ కిషన్ కవితా దృక్పథానికీ, ఆర్ధ్రతకు సంకేతాలుగా నిలుస్తాయి. మంజీరా రచయితల సంఘం జిల్లా అధ్యక్షుడిగా కొనసాగుతున్నారు.

## రాజమౌళి

1953లో జన్మించారు. స్వగ్రామం తడకపల్లి. తల్లిదండ్రులు సిద్ధయ్య, సరోజన. ప్రస్తుతం పెద్ద కోడూరు గ్రామంలో ఉపాధ్యాయునిగా పని చేస్తున్నారు. ఉత్తమ మానవతావాది మీనవెల్లు రాజమౌళి 1999-2000 రెడ్ అండ్ వైట్ సంస్థ బ్రేవరీ అవార్డును అందుకున్నారు. ఆయన రచనలు ఆంధ్ర ప్రభ, అమృత కిరణ, విశ్వహిందు పత్రికల్లో ప్రచురణను పొందాయి. ఆకాశవాణిలో ఆయన కవితలు ప్రసారమయ్యాయి. స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంగా ఏర్పాటైన నినాదాల పోటీలో రాష్ట్ర స్థాయి తృతీయ బహుమతిని అందుకున్నారు. జిల్లా స్థాయిలో ప్రథమ బహుమతిని గెల్చుకున్నారు.

## మహమదీ పాషా

1954 జన్మించారు. సిద్ధిపేట స్వస్థలం. తల్లిదండ్రులు శరీఫాభీ, మహ్మదీ హుసెన్, మాతృభాష ఉర్దూ, తెలుగు సాహిత్యంతో బి.ఏ. పూర్తి చేశారు. మంజీరా రచయితల సంఘంలో చురుకైన పాత్ర పోషించారు. మరసం తరపున 'ఉనికి' కవితా సంపుటిని ప్రచురించారు. సమాజంలో నిరుపేదల కంటి మంటల్ని తన కవితల ద్వార విన్పించే మహమూదీ పాషా మంటల్ని ఆర్పే అగ్నిమాపక దళంలో ఫైర్‌మెన్‌గా పనిచేస్తున్నారు.

## నాయకం వెంకట శర్మ

1942లో జన్మించారు. గౌరవ్వ, భూమయ్య తల్లిదండ్రులు, వీరి పద్యకృతి శ్రీవెంకటేశ్వర శతక పద్యమాలిక. ఉపాధ్యాయులుగా పని చేసి రిటైరయ్యారు. అక్షర ప్రభ కార్యక్రమాల్లో పాల్గొని పలుగేయాల్ని రచించారు.

## ముదిగొండ ఈశ్వరచరణ్

1937లో జన్మించారు. స్వస్థలం సిద్ధిపేట. 1992లో లింగైక్యం చెందారు. చక్కని వ్యాసరచయిత, కవి విమర్శకుడు, వక్తగా పేరుతెచ్చుకున్నారు. వ్యాకరణంలోనూ దిట్ట, వివిధ పత్రికల్లో వ్యాసరచలు ప్రచురణ పొందాయి. "నవమి" వ్యాస లంకలనం వీరి విమర్శాపాటవానికి నిదర్శనం.

'శ్రీగిరిశతకం' ఆయన రచించిన కావ్యం. అదిలాబాద్‌లో కొంతకాలం పాటు లెక్చరర్‌గా పనిచేసిన ఈశ్వర చరణ్ అక్కడి మాండలికాలు, జానపద సాహిత్యంపై చక్కని అవగాహనను పెంచుకొని పలువ్యాసాలు రాసారు. సాహితీ వికాస మండలి కార్యదర్శిగా అనేక సాహిత్య కార్యక్రమాల్ని నిర్వహించారు. అదిలాబాద్‌లో ఉన్నపుడు శైవం కవితా సంకలనాన్ని వెలుగులోకి తీసుకురావడానికి కృషి చేశారు. వీరి అముద్రిత రచనలు ఎన్నో ఉన్నాయి. ముఖ్యంగా వచన రచనలో తనదైన శైలిని పొందిన అగ్రశ్రేణి రచయిత ముదిగొండ ఈశ్వర చరణ్. మెదక్ మండల సాహిత్య పరిషత్తుకు ఊపిరిలూదిన స్వర్గీయ ముదిగొండ అంగీరస శర్మగారు ఈశ్వర్ చరణ్ అన్నదమ్ముల కుమారులు.

## ముదిగొండ – ముత్యంపేట

### జంట కవులు

మెతుకుసీమలో తిరిగినా భాగ్యనగరిలో మెదిలినా ఎప్పుడూ ఒకరికిఒకరు వెన్నంటి జంటగా తిరిగే కవిద్వయం ముదిగొండ అమరనాథశర్మ, ముత్యంపేట గౌరీ శంకరశర్మ, అమరనాథ శర్మ స్వస్థలం లచ్చపేట. 1968లో జన్మించారు. తల్లిదండ్రులు సిద్ధమణి, ముదిగొండ రామనాథశాస్త్రి. నాగలింగ శాస్త్రి, రాజ్యలక్ష్మి ముత్యంపేట గౌరీశంకరశర్మ తల్లిదండ్రులు. ఆయన కూడా లచ్చపేటలోనే జన్మించారు. వీరి తల్లిదండ్రులు నాగలింగ శాస్త్రి, రాజ్యలక్ష్మి. ఇద్దరు వేములవాడ శ్రీరాజరాజేశ్వర సంస్కృత కళాశాలలో సంస్కృతాంధ్రల్ని చదివారు. వేదాధ్యయనం చేశారు. ఇద్దరిదీ ఎం.ఫిల్. పూర్తి అయింది. ప్రస్తుతం పి.హెచ్.డి. చేస్తున్నారు. జంటగా శ్రీమహాకాళీ సుప్రభాతం, శ్రీసీతారామ సుప్రభాతం, చాముండేశ్వరీ అష్టకం ముద్రణ పొందాయి. యజ్ఞయాగాది కార్యక్రమాల నిర్వహణలో ఇద్దరూ చక్కని పేరు ప్రఖ్యాతలు పొందారు. కవితా సాధన చేశారు. ఆకాశవాణి అమరవాణిలోనూ, దూరదర్శన్ కార్యక్రమాల్లో కూడా పాల్గొన్నారు. శైవ మత ప్రబోధిని అనే అధ్యాత్మిక మాసపత్రికకు సంపాదకులుగా ఉన్నారు. అమరనాథశర్మ సికింద్రాబాద్ సర్దార్ పటేల్ కళాశాలలో సంస్కృతం లెక్చరర్‌గా పనిచేస్తున్నారు. గౌరీశంకరశర్మ హైదరాబాద్‌లోని ఒక ప్రైవేటు కళాశాలలో ఆంధ్రోపన్యాసకునిగా పని చేస్తున్నారు.

## గౌరీభట్ల బాలముకుంద శర్మ

1970 లో జన్మించారు. అన్నపూర్ణ, శ్రీనాథశర్మ తల్లిదండ్రులు. తెలుగు సంస్కృతాల్లో ఎం.ఏ. పూర్తి చేశారు. ఏకప్రాంసతో జ్ఞాన సరస్వతీ గీతకాన్ని రచించారు. ఇది త్వరలో ముద్రణ కాబోతుంది. ఆయన రాసిన "వందనం - ప్రియవందనం" అనే సంస్కృతగేయం "మీమాట - నాపాట" కార్యక్రమానికి ఎంపికైంది.

ఈ గేయాన్ని ప్రసిద్ధ గాయకులు ఎస్.పి. బాల సుబ్రహ్మణ్యం పాడారు. ప్రస్తుతం ఈయన రెండవ గ్రేడు తెలుగు పండితులుగా పని చేస్తున్నారు.

## కాపు రాజయ్య

సిద్దిపేట పట్టణానికి మహోన్నత ఖ్యాతిని తీసుకొని వచ్చిన కళాకారుడు కాపు రాజయ్య. 1925లో రాఘవులు - భూలక్ష్మీ దంపతులకు జన్మించిన రాజయ్య చిత్ర కారుడు మాత్రమే కాదు "కుంచె పదాలు" కర్త కూడా. 1992లో ఆయన వచన కవితా సంకలనం "కుంచె పదాలు" వెలువడింది. కుంచె గీసిన పదాలివి ! ఇందులో ఆయన "చిత్ర" కవిత్వం, ఆయన సాహితీ సృజనాత్మకు సామర్థ్యం కన్పిస్తాయి.

## కటుకోజ్వల ఆనందం

చిన్న కోడూరు మండలం చౌడారంలో జన్మించారు. తెలుగు సాహిత్యంలో బి.ఏ. పూర్తి చేశారు. శ్రీ కోటి లింగేశ్వర స్తుతి, శ్రీ వేంకటేశ్వర వర్ణమాల అనే రచనలు ముద్రణ పొందాయి. ఇంకా మూడు కావ్యాలు ముద్రణ పొందాల్సి ఉంది.

## చొప్పదండి సుధాకర్

1963లో అల్లాపురం గ్రామంలో జన్మించారు. ఉపాధ్యాయ వృత్తిలో కొనసాగుతున్నారు. సుధాకర్ రాసిన పది కథలు ప్రచురణ పొందాయి. నిజామాబాద్‌లో నిర్వహించిన రాష్ట్రస్థాయి కవితల పోటీలో ప్రథమ బహుమతి పొందారు. ఆయన రాసిన కవితలు "శబ్ద ఋతువు" పేరుతో త్వరలోనే వెలుగు చూడనున్నాయి.

## రచ్చమల్లేషం బాబు

1943లో జన్మించారు. సిద్దిపేట స్వస్థలం. శాంతమ్మ - శ్రీరామయ్య తల్లిదండ్రులు. హిందీ సాహిత్య రత్న పూర్తి చేసి, డక్టర్ కాపు రాజ్యయగారి శిష్యరికంలో చిత్రకళా మెళుకువల్ని నేర్చుకున్నారు. 1991లో మల్లేష్ బాబు కవితా సంకలనం "చైతన్య దీపిక" వెలువడింది. మల్లేష్‌బాబు కవిత, చిత్ర రచనా సామర్థ్యం చైతన్య దీపికలో కన్పిస్తుంది. మల్లేష్ బాబు నటుడు కూడా. ఒక సినిమాలో నటించారు. ప్రస్తుతం హిందీ పండితులుగా పని చేస్తున్నారు.

## బాద్దుల పుండరీకం

1953లో జన్మించారు. సిద్దిపేట స్వస్థలం, ఎల్లవ్వ- నరసింహులు తల్లిదండ్రులు. వేముగంటి నర్సింహాచార్యులవారి మార్గదర్శకత్వంలో సాహిత్యాది దర్శనాన్ని పొందారు. గేయ, ఖండ పద్యాల్ని రచించారు. 1997లో పుండరీక శతకాన్ని వెలువరించారు. ప్రస్తుతం దుద్దెడలో తెలుగు పండితునిగా పని చేస్తున్నారు. మార్కెండేయ దేవస్థానం, చైతన్య ఫ్రెండ్స్‌క్లబ్‌ల సన్మానాన్ని పొందారు.

## ఎం.డి. రుస్తుం

సిద్దిపేటలో 1960లో జన్మించారు. బిజాన్ భోటోతీ, ఇబ్రహీం తల్లిదండ్రులు, హిందీ విద్వాన్, చిత్రకళలో హైయ్యర్ డ్రాయింగ్‌లో ఉత్తీర్ణులయ్యారు. డ్క్కర్ కాపు రాజయ్య వద్ద శిక్షణ పొందారు. పలువురు కవుల కవితా సంకలనాల ముఖ చిత్రాల్ని అందంగా రూపొందించారు. కవితా చిత్రాల్ని రచించారు. హైకుల్ని అందించారు. సుమారు వంద హైకూల్లో రుస్తుం ప్రతిభ ప్రసిద్ధమైంది. చిత్రకళలో ఎన్నో అవార్డులు పొందారు. ప్రస్తుతం తడక పల్లి ఉన్నత పాఠశాలలో డ్రాయింగ్ టీచర్‌గా పని చేస్తున్నారు.

## పెందోలు రాజమౌళి

పుట్టిన జిల్లా కరీంనగర్ జిల్లా, చాలాకాలం క్రితమే సిద్దిపేటలో స్థిర నికాసమేర్పర్చుకున్నారు. వచన, గేయ, జానపద గీతాల్ని రచించారు. ఇవి త్వరలోనే ఒక సంకలనంగా వస్తున్నాయి. ప్రస్తుతం మిర్‌దొడ్డి మండలంలోని లింగంపేట పాఠశాలలో ఉపాధ్యాయునిగా పని చేస్తున్నారు.

## ముత్యంపేట కేదార నాథశర్మ

ముత్యంపేట కేదారనాథ శర్మగారు 13-3-1957లో జన్మించిరి. వీరి తల్లిదండ్రులు జయ లక్ష్మీదేవి, పాపయ్యశాస్త్రిగారలు. వీరి నివాస స్థానము సిద్దిపేట.

కేదారనాథ శర్మగారు సంస్కృత పట్టమును పొందిరి. వీరికి సంగీత అభిరుచి మెండు. శాస్త్రిగారికి వైదిక ధర్మప్రచారం అంటే ఎక్కువ మక్కు పౌరాణికులుగా పేరొంది అర్షధర్మ అనవరతం కొనసాగిస్తుంటారు.

వీరి రచనలు :

1. భక్తి సుధ (గీతాకాసంపు
2. శైవమ్
3. నిత్యధర్మ దీపిక
4. జీవన సాఫల్యం
5. ప్రణుతి
6. ధ్యానామృత్ (హిందీ)
7. అభంగాను వాదగంగా
8. అక్షరాలలో పరమార్థం
9. పంచమీ
10. నీరాజనం

## డాక్టర్ గుమ్మన్నగారి బాలశ్రీనివాస మూర్తి

మెదక్ జిల్లాలోని పోతారెడ్డిపేటలో జన్మించిన బాలశ్రీనివాస మూర్తి తండ్రిగారు ప్రముఖ అష్టావధాని గుమ్మన్నగారి లక్ష్మి నరసింహశర్మగారు తండ్రి నుండి సంక్రమించిన సాహిత్యం కవిత్వం శ్రీనివాస మూర్తిని సాహితీవేత్తగా తీర్చిదిద్దినది.

ఎం.ఏ ఉత్తీర్ణులైన వీరు ప్రస్తుతము భాగ్యనగరంలోని సర్దారు పటేల్ కాలేజిలో ఉపన్యాసకునిగా పనిచేయుచున్నారు.

కాలాన్ని ఎప్పుడు వృధా చేయక పలు విషయాలపై అనేక పత్రికలకు వ్యాసములు వ్రాస్తుంటారు.

సాహితీ మంజీర పేర మెదక్ జిల్లా సాహిత్యాన్ని పరిచయం చేసినారు. చలం కథలు అనే అంశంపై సిద్ధాంత వ్యాసం వ్రాసి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి పి.హెచ్‌డి. పట్టానందినారు.

## సుప్రసన్నాచార్య

వీరు 26-11-1974నాడు చల్లగిరి దేవస్థానంలో జన్మించిరి. వీరి తల్లి వసంత, తండ్రి వెంకటకృష్ణమాచార్యు, వీరు బి.ఎస్సీ, (ఎం.పి.సి.), ఎం.సి.ఎ., విద్యాభ్యాసం చేసి సాఫ్ట్‌వేర్ ఇంజనీయర్‌గా హైదరాబాదులో పని చేసినారు. వీరు మన ఆంధ్రప్రదేశ్‌లో గల ప్రముఖ చిత్రకారుల ముఖచిత్రాల గురించి ఆంధ్రప్రదేశ్, ఇండియాటుడేలలో ఎన్నో వ్యాసాలను వ్రాసినారు. వీరు ఎన్నో అభ్యుదయ సమీక్ష వ్యాసాలు రచిస్తుంటారు. ప్రస్తుతము వీరు విదేశాలలో ఉన్నారు.

## కొడకండ్ల వెంకటేశ్వర శర్మ

వెంకటేశ్వర శర్మగారి స్వస్థానము దొమ్మాట. బి.ఓ.ఎల్. ఉత్తీర్ణులైన వీరు మెదకు జిల్లా పరిషత్తులో తెలుగు పండితులుగా పని చేయుచున్నారు.

శర్మగారు అనేక కష్టనష్టాలకునోర్చి శ్రీ సరస్వతీ వైభవము ను వెలువరించిరి. ఈ గ్రంథము నందు సరస్వతీస్తవములన్నియుగ్రై కొనబడినవి.

## గొల్లపల్లి పట్టాభిరామ శర్మ

సిద్దిపేట సమీపానగల దుద్దెడ గ్రామంలో జన్మించిన పట్టాభిరామశర్మ ఆంధ్రసారస్వతపరిషత్ హైదరాబాదులో తెలుగు పండితులుగా పని చేయుచున్నారు.

మచ్చునకొక పద్యము

పసిడి మెఱుంగు దాజగతిపై సవరించితి తూలికాధ్యమౌ
పసిడి హొరంగు పూలపయి పైపచరించెడివే వెలుగుంల
న్పసదుగు కెంపురంగుల ప్రియమ్ముఘటింపగ దేవి! పాదముల్
వెసనిడి స్వర్ణపీఠి నుపవేశమొనర్పవె సింహపీఠివై

## కావూరి శ్రీనివాస్

కవి, వర్ధమాన సినీ రచయిత, సదాశివపేటలోని ఎం.ఆర్.ఎఫ్. టైర్స్‌లో ఉద్యోగం చేస్తున్నారు. స్వగ్రామం తెనాలి, ఈయన రచనలు ఉదయం, ప్రభ, భూమి, జాగృతి, ఈనాడు విశ్వరచన, మున్నగు ప్రసిద్ధ ప్రామాణిక వారపత్రికలలో ప్రచురింపబడ్డాయి. ఆకాశవాణి రేడియో కేంద్రాలలో కూడా ఇతని కవితలు, కథలు ప్రసారమైనాయి. జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా. సి. నారాయణ రెడ్డిగారి ఏకలవ్య శిష్యుడైన కావూరి శ్రీనివాస్ హృదయునినాదాలు అనే వచన కవితా సంపుటిని కవితా ప్రియులకు అందించారు.

ఇటీవలే ఈయన రాసిన కవీశ్వరుడి కథనం కథా సంపుటి త్వరలో వెలుగు చూడబోతుంది. అంతేకాక వ్యాసవులు, కవితలు, నాటికలు, గేయాలు, అముద్రితాలుగా ఉన్న ఈయన గ్రంధాలు.

తెలుగు సాహిత్యానికి సంబంధించిన తాళపత్ర గ్రంధాలను సేకరించి జాగృతి ద్వారా వ్యాసరూపాలుగా రాసి వెలుగులోకి తెచ్చినందుకుగాను స్నేహశీలి సాహితీ సంస్థవారు, కళారాధన సంస్థవారు అవార్డులనిచ్చి సత్కరించారు. సాహిత్య రంగంలో కూడా చక్కని ప్రవేశమున్న కావూరి శ్రీనివాస్ నా ఇల్లు-నా వాళ్ళు ధాత్రిలో దౌర్జన్యం చలన చిత్రాలకు పాటలను రాసి సినిమా రంగంలో ప్రవేశించారు. భాగ్యనగరంలోని పలు సాహితీ సాంస్కృతిక సంస్థలలో సభ్యత్వం కలిగి ఉన్నారు.

ఇప్పటికి పేర్కొన్న కవులేగాక మెదకు జిల్లాలో ఇంకను కవులు - రచయితలు ఉన్నారు. సర్వశ్రీ దుగ్గివీరప్ప, కొండా నర్సింహాచారి, సత్తిరెడ్డి, కాపర్తి పెంటయ్య, బి.నర్సింహాచార్యులు, కానుకుంట నర్సింహాచార్యులు, బాల్‌శెట్టి రాంచందర్, వి. బ్రహ్మయ్య, పురుషోత్తమశర్మ, శ్రీపరాంకుశం శినయ్య, యం.డి.లతీఫోద్దీన్, శ్రీశైలం, చేపూరి నారాయణ, నాయని మధుసూదన్‌రెడ్డి, నాయిని వెంకట నర్సింహారెడ్డి, శా. చంద్రశేఖర శర్మ, పాండురంగారెడ్డి, వి. వెంకటేశం, బి. బాలరాజు, కే. మత్స్యేంద్రరెడ్డి, కాల్వరామేశ్వరము, యస్. జయరామశర్మ, ఇటిక్యాల మాణయ్య, లక్ష్మీకాంత శర్మ, మొదలైన వారందరూ మెదకు సాహితీమతల్లికి సేవలందించినవారే.

వీరేగాక నా ఎరుకలో లేని వారు, లేదా నాచే పొరపాటున మరచినవారును యుండియుండవచ్చును.

మొత్తము మీద మెదకు జిల్లాలో సాహితీ సంపద కేయికొదువలేదని, వివిధ విన్నాణముల వింగడింపగల వివేకవంతులీ సీమలో నున్నారని తెల్పుతూ ఈ వ్యాసము ముగింపబడుచున్నది.

# మెదకు జిల్లాలో అవధాన వికాసము

సమస్త ప్రాణికోటిలో మానవుని మహోన్నతంగా తీర్చిదిద్దింది భాష. మనిషిని మనీషిగా మార్చింది సాహిత్యం. సాహిత్యంలో ఎన్నెన్నో ప్రక్రియలున్నాయి. పద్యం, గద్యం, వచనం, గేయం ఇత్యాదులు సాహితీ ప్రక్రియల్లో కొన్ని.

అక్షరాలతో ఆటలాడుకున్న అశేష ప్రజ్ఞా ధురీణులైన మహాకవులెందరో అన్ని భాషలలోనూ ఉన్నారు.

"దేశభాషలందు తెలుగులెస్స" గా కన్నడ రాజుతో కీర్తికెక్కిన తెలుగు భాషాయోష ఎన్నో వన్నెలూ చిన్నెలూ పోయింది. ఎన్నో అలంకారలను సంతరించుకొంది. కాల్గజ్జెల రవళుల్లో కొత్త కొత్త ఆటలు చూపించింది. అక్షరాలు పావులుగా పదవిన్యాసము గావించి చూపరులను గారడీ చేసి కొత్త కొత్త పోకడలను చూపించినది.

ఏ భాషలో లేని ఒకానొక పద్య విన్యాసముతో మేధాసంపత్తిని మేధావులకు పంచియిచ్చే ప్రక్రియగా అవధానం అవతరించింది.

అవధానం అంటే ఏకాగ్రత పలు విషయాలను పదుగురికి పంచి ఇవ్వడము అవధానంలో ప్రత్యేకత. ఇది ఓ పదాల ఆట, పద్యాల మూట, తెలుగుబాసకొక పూదోట.

అవధాన ప్రక్రియలో అష్టావధానం, శతావధానం, సహస్రావధానం ఉన్నాయి.

అష్టావధానం కష్టతరమని ఆర్యులఉవాచ, ఎందుకంటే అష్టావధానంలో ఎనిమిది విషయాలుంటాయి.

నిషిద్ధాక్షరి, సమస్య, దత్తపది, సద్యోవర్ణన, వ్యస్తాక్షరి, న్యస్తాక్షరి, అప్రస్తుత ప్రసంగం, పురాణ పఠనం ముఖ్యమైనవి. ఇవికాక ఘంటానాధం, తేదివారం, చదరంగం మొదలగు విషయాలు కూడా ఉంటాయి.

**1. నిషిద్ధాక్షరి :**

ఈ విషయమునకు భాషపై అధికారమున్న పండితులే పృచ్ఛకులుగా ఉంటారు. పృచ్ఛకుడు తనకు తోచిన విషయాన్ని తోచిన పద్యములో చెప్పమని అవధానిని అడుగుతాడు.

అవధాని చెప్పే పదాలనూహించి నాటి నుండి అక్షరాలను నిషేధిస్తూ అవధానిని తికమక పెడతాడు.

**2. సమస్య :**

అవ్యస్థితమైన అర్థంతో ఒక పద్యపాదానిచ్చి అర్థవతంగా పూరించమనడం సమస్య.

**3. దత్తపది :**

4 పదాలనిచ్చి ప్రతి పాదంలో ఒక పదముండు నట్లుగా తానిచ్చినభావంతో పద్యం చెప్పమనడం దత్తపది.

**4. సద్యోవర్ణన** : ఏదేని ఒక విషయాన్ని కోరిన పద్యంలో చెప్పమనడం సద్యోవర్ణన

**5. వ్యస్తాక్షరి:**

ఒక పద్యపాదంలోని అక్షరాలకు సంఖ్యలువేసి అప్పుడప్పుడు ఒక అక్షరాన్ని అందిస్తూ అవధానం చివర పద్య పాదం చెప్పమనడం వ్యస్తాక్షరి.

**6. న్యస్తాక్షరి:**

పద్యపాదంలో వివిధ స్థానాల్లో తాను కోరిన అక్షరాలనిస్తూ తాను కోరిన అంశాన్ని వర్ణించమనడం.

**7. అప్రస్తుత ప్రసంగం :**

అవధానిని అప్పుడప్పుడూ అనవసర విషయాలడుగుతూ అవధాని ఏకాగ్రతకు భంగం కలిగించడం సభాసదులకు తన ప్రశ్నల ద్వారా హాస్యాన్ని అందించి ఆనందం కలిగించడం.

ఈ విధంగా పూర్తి చేసి చెప్పిన పద్యాలను ధారణ చేసి చెప్పడంతో అష్టావధానం పూర్తవుతుంది. అవధానంలో పృచ్ఛకులకు చెప్పే పద్యాలు ఒక్కొక్క పాదంగానే చెప్పాలి. ఒక్కొక్క పృచ్ఛకునకు ఒక్కొక్క పాదం చొప్పు చెబుతూ అంతంలో అన్నీ ఒకమారు చెప్పడం ధారణ. ఇది అష్టావధానం.

మెదకు జిల్లాలోని సాహితీ సంపదలో అవధానాన్ని ఆణిముత్యంగా చెప్పుకోవచ్చు. 20వ శతాబ్దంలో మెదకు జిల్లాలో వెలసిన అవధాన వికాసం మెదకు మేధాసంపత్తికి తార్కాణం.

## 1. విఠాల చంద్రమౌళి శాస్త్రి :

మెదకు జిల్లా గజవెల్లిలో జన్మించిన విఠాల చంద్రమౌళి శాస్త్రిగారు సంస్కృతాంధ్రాలలో చక్కని కవిత్వం చెప్పగలిగిన దిట్ట. ఆశువుగా అలవోకగా ఎన్నో పద్యాలల్లగిన నేర్పరి. ఒక శతావధాన సభలో శ్రోతగా వెళ్లి అవధానాంతమున అవధాని చెప్పిన వంద పద్యాలూ ధారణ చేసి చెప్పిన గ్రాహకుడు. చుంచన కోట భువనేశ్వరీ దేవిపై పద్యాల మాలలల్లి పదార్చన చేసిన పాండితీ మండనుడు. వీరు శతావధానులుగా ప్రసిద్ధులయిరి. వీరి రచనలో ఒక రత్నం.

ముహురేతజ్జగదుద్భవా వ్యయము త్వన్ముక్త్యర్థమై మాయ మ
న్మి హమాఖ్యంగనపర్చు నిందుకు తపింపన్ గర్జమేమందునా
స్వహితత్వాధృతి దంప్రిఁముద్దిడిన మీసల్ గ్రుచ్చుకొన్నపుడుత
న్నహహా ఏడ్వని పుత్రుండుగలడె కృష్ణాదేవకీ నందన.

## 2. గౌరీభట్ల రామకృష్ణ శాస్త్రి

మెదకు జిల్లా అవధాన ప్రక్రియకు ఆద్యుడు, అష్టావధానులకు ఆదిగురువుగా అనదగినవాడు, శ్లేష యమకాల్లో అశేష ప్రతిభా సంపన్నుడు అనేక అవధానాలను అజేయంగా గావించిన మహా పండితుడు గౌరీభట్ల రామకృష్ణ శాస్త్రి.

వీరు మెదకు జిల్లా వెంకట్రావుపేటలో జన్మించినారు. వీరి రచనలలో గొప్పగా చెప్పుకో దగినది. "ఏకవీర కుమారీయమ్" అనే ద్వర్థి కావ్యమ్.

వీరు యాదగిరి లక్ష్మీనరసింహస్వామి దేవస్థాన ఉత్సవాలలో జరిగిన సాహిత్య కార్యక్రమాలలో అష్టావధానమొనరించిన సందర్భమున సుప్రసిద్ధ కవి జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మొదలగు మహా పండిత మండలి వీరికి కవి "శార్దూల కిశోర " అని బిరుదు ప్రదానము చేసిరి. వీరి అవధానాల్లోని ఒక సమస్యా పూర్ణం.

పంకజసూతి చే వరము బాపురె పొందుచు రావణుండుకే
ణాంక కిరీటుగొల్చి వరమంది ప్రసూమతి కైకటాసురుల్ /
జంకగ శంకరుండనచు జంకను బెట్టుచు జంకనట్టి నా
శంకరుడెత్తె వెండిమల శైల తనూభవ తాపమందగన్

## 3. శాస్త్రుల విశ్వనాథ శర్మ

అభినవ విద్యారణ్య బిరుదాంకితులయిన విశ్వనాథ శర్మగారు శాస్త్రుల వారు. శివంపేటలో పుట్టినవారు. సంస్కృత సాహిత్య సాగరాన్ని మథించినవారు. ఆంధ్రంలోనూ అంతటి పాండిత్య ప్రభకలవారు. పండిత మిత్రుల కోరికపై సంస్కృతాంధ్రాలలో ఏక కాలంలో అష్టావధానమును అవలీలగా నిర్వహించిన ప్రజ్ఞా ధురీణులు.

## 4. గుమ్మన్నగారి లక్ష్మీనరసింహ శర్మ

సరసులు గుమ్మనే అవధానం గుమ్మన్నకే సాధ్యమని పేరొందిన గుమ్మన్నగారి లక్ష్మీనరసింహ శర్మగారి జన్మస్థలం పోతారెడ్డిపేట. సులలిత, భావనాజాలంతో, సుశబ్ద ప్రయోగంతో సాగే వీరి పద్యం హృద్యంగా ఉంటుంది. పద్యంలోని తియ్యదనాన్ని కంఠంలో కుమ్మరించి శ్రోతలకు రసానందాన్ని కలిగించడం వీరి అవధానంలోని ప్రత్యేకత.

అష్టావధానం చేస్తూ కళ్యాణి, ఇందోళ రాగాల్లో పలికే పద్యాలు సంగీత విభావరి పాటల్లా ఉంటాయి. వీరు గౌరీభట్ల రామకృష్ణశాస్త్రి కడ అవధా విద్యను అభ్యసించారు. మెదుకు మండల సాహిత్య ఉపరిషత్తు వీరిని "అవధాన శశాంక" అను బిరుదముతో సత్కరించింది. అవధానాన్ని అలవోకగా చేయగల సరసవాగ్ధారా చాతురీ ధురీణులు. ఇప్పటికీ సుమారు మూడు వందల అవధానములను ఆంధ్ర దేశమందంతటా నిర్వహించినారు.

వీరి అవధానములోని దత్తపదికి ఒక ఉదాహరణ.

*జరదా - సరదా - దురదా - వరదా*

జరదార్ధ్య స్థితిదుల్యునేని నగు నిచ్చల్ లోన గల్గించువాక్
సరదానందము గంద జేయుదురహంకారంపు టాసక్తి నీ
దురదం బర్జకన క్రియన్ నిలుపు నెందున్ దానినమ్మంజుమీ
వరదా! నీవనధాన మిచ్చి యొడి నింపన్ రమ్ముతత్పాధలన్.

## 5. అష్టకాల నరసింహరావు శర్మ

అష్టావధానాలతో అమ్మకో ఆలయాన్ని నిర్మించే ఆలోచనతో ఆరంభించిన అవధానం ఇన్నూరై వంది ముస్నూరై ఆంధ్ర దేశమంతటా ఆదర గౌరవాలనందిన అష్టకాల నరసింహ రామశర్మ సిద్దిపేట సమీపంలోని రాజగోపాలపేటలో జన్మించినారు.

అవధాని అనుపస్థితిలో అష్టావధానాన్ని ఆరంభించాల్సి వచ్చింది నారాయణ్ ఖేడ్‌లో. అదిమొదలు అమ్మ అనుగ్రహంతో ఆలయ నిర్మాణపుటాలోచనతో అవధానపరంపర కొనసాగింది.

అతివేగంగా ఆశువుగా పద్యం చెప్పడం అవధానికి అతి బాల్యంనుండే అబ్బిన అమ్మవరం. వెలకట్టలేని ఆశీస్సులకు కోవెల కట్టి ఋణం తీర్చుకోడానికి చేపట్టిన అవధానంబహుముఖ మయ్యింది.

**ఒక సమస్య :-**

అక్షరాలైన రానట్టి అయ్యలకును
అధిపయోగమ్ము వట్టె స్వేచ్ఛాబ్ధివల్ల
సింహమేటికి రాజయి చెలగెనునుచు
గ్రామ సింహబునకు రాజ్య కాంక్షగలిగె

## 6. గౌరీభట్ల మెట్రామ శర్మ

పుట్టింది వెంకట్రావుపేటలో వృత్తిని చేసట్టింది భాగ్యనగరంలో. తండ్రి నుండి వారసత్వంగా వచ్చిన కవిత్వం అష్టావధానాల స్థాయికి ఎదిగింది. సులలిత పదంతో మృదుమధురగానంతో అలా అలా సాగిపోయే వీరి అవధానం శ్రోతలందరినీ తన్మయుల చేస్తుంది.

ఇప్పటికి అవధాన శతం చేసి శతావధాన ధురీణు డయినాడు. అవధానంలోని ఒక సమస్యాపూరణం.

ఓ లలనా లలామ! అధరోజ్వల సుందర మందహాసపున్
బూలను పంచరావె వలపుల్ వలరాయని తూపులయ్యె న
న్నేలనొ? జాలనాసకల మీవని నా మదిమోహవార్ధిలో
తేలును ముద్దులాడుకొని తేనియలూరగ పల్కవేచెలి.

## 7. తిగుళ్ళ రాధా కృష్ణ శర్మ

రాధాకృష్ణ శర్మ తండ్రి తాతలు వేదవేదాంగ విదులు.

సంస్కృతాంధ్రాలలో చక్కని పండితులు. పండిత వంశంలో పుట్టిన రాధాకృష్ణశర్మకు సహజంగానే పాండిత్యం, కవిత్వం అబ్బినాయి. గజవెల్లి సమీపానున్న చేబర్తి వీరి స్వగ్రామం.

ఇప్పటికి ముప్పయికి పైగా అవధానాలను నిర్విఘ్నంగా పూరించారు. అవధాన సన్మానంగా వచ్చిన ద్రవ్యాన్ని సదానంద వైదిక పాఠశాల సిద్దిపేటకు బహూకరిస్తున్నారు.

**ఒక సమస్యాపూరణము :**

ఆతత భక్తిమై జనులు సంకీతమిత్తురు నామధేయముల్
సీతట అక్కగాక మరి శ్రీ రఘురాముడు తమ్ముడయ్యె ఆ
సీతను లక్ష్మణాభిదుడు చేకొను దారగలోక రీతిలో
సీతకు లక్ష్మణుండు పతి శ్రీ రఘురాముడు తమ్ముడయ్యెడిన్

## 8. గౌరీభట్ల రఘురామ శర్మ

మెదకు జిల్లా అవధానాలకు ఆది గురువయిన రాధాకృష్ణ శాస్త్రి గారి రెండవ కుమారుడైన రఘురామ శర్మ సంస్కృతాంధ్ర సాహిత్యాలలో ఆరితేరిన వారై ఉపన్యాసకులుగా పని చేయుచున్నారు. తాతతండ్రుల నుండి సంక్రమించిన కవిత్వం ఈతనికి పుట్టుకతో వచ్చిన వరం. సరళమైన సులలితమైన పద్యాలతో కవిత్వంచెప్పడం ఈతని లక్షణం. ఈతడొక అవధానంలో మెదకు సీమ సాహిత్యాన్ని వర్ణించిన పద్యం.

ఇది పాండితీ కళలకిల వేల్పుగానున్న
మల్లినాధుని మహామందిరమ్ము
ఇది శతావధాన్యుదయా చలంబైన
చంద్రమౌళి శాస్త్రి సదనమున్ను
ఇది యామ వర రామ పదును బెట్టిన శైలి
యమకచక్కుర వర్తి సుమవనమ్ము
ఇది భరతోర్వితిన్ నుదిట తిలంకంపు
చెదరకుండని మన మెదకు సీమ

ద్వర్థి కార్యంబులలరారు వైభవంబు
ఆశుక వితావధానుల కాలయంబు
శ్లేష గర్భిత చిత్రవై చిత్రి నొప్ప
భరత దేశాన మెదకు విద్వల్లతాంగి.

అవధానులధిక సంఖ్యగ
అవనిన మన మెదకునందు నగుపింత్రుగనన్
నవరసరుచిలోకన
ధ్రువతారగ మెదకు భరత దీప్తిన్ పంచన్

దత్తపది : "భారత కథలో శల్యకర్ణ సంభాషణ"
ఎన్నికలు, గుడివాడ, నందమూరి, రామారావు.

కార్యంబెన్ని కళల్ ఫలిం పగను సంకల్ప స్వరూపానధీ
వర్యుండా గుడివాడక్రీడి హరిసవ్యంబైన సారథ్య చా
తుర్యంబందున నందమూరినది నీతుల్ జెప్పుశల్యుండషన్
మర్యా దౌనకొ! సూర్యసూనకని రామా రావు ఆచోడికిన్

## 9. ప్యారక శేషాచార్యులు

చిన్నతనం నుండి భాషతో కసరత్తు చేసిన ప్యారక శేషా చార్యుడు సంస్కృతాంధ్ర భాషల్లో ప్రజ్ఞ కలవాడు. భావం కోసమో పదాల కోసమో పాకులాడక అవలీలగా పద్యాన్ని హృద్యంగా చెప్పడం ప్యారక నైజం. మిత్రుల ప్రోద్బలంతో మెదకులో అవధానం కోసం గద్దెనెక్కిన ఆచార్యులు అలా అలా సాగిపోతూ 20కి పైగా అష్టావధానాలను పూర్తి చేశారు.

దత్తపది

టెండర్ - ఛాలెంజ్ - ఇన్‌ఫర్మ్ - బ్లయండ్ పదాలతో రామాయణ ఘట్టం.

గురిమై రాముని చాపబాణతతితో గుట్టెండరక్తాన నీ
ర్గిరి ఈ రాక్షసులద్ధి చూచితిని చాలెంజన్మమీ కోర్కె దీ
ర్ఘరమా నాథ చితాగ్ని దూకెద వయింఫర్మంచు పూవర్షముల్
వరలన్ పేరు వహింపుమోయి భువి దెబ్బన్ బ్లెయెండింపుచున్.

## శాస్త్రుల రఘురామశర్మ

శిష్యుల ప్రోద్బలం, మిత్రుల ప్రోత్సాహం రఘురామ శర్మ అవధానానికి మూల కారణాలు. చిన్నప్పటి నుండి ఆశువుగా పద్యాలల్లడం అలవాటున్న శర్మను మిత్రులు అవధానం చేయమన్నప్పుడు వెనుకంజ వేయక తొలి అష్టావధానాన్ని మహాశివరాత్రి నాటిరాత్రి గుమ్మడిదలలో పూర్తి చేసినారు. తొలి అవధానం డా॥ సుందరాచారి అధ్యక్షులుగా అష్టావధానులైన రాధాకృష్ణశర్మ, శేషాచార్యులు, సంస్కృతాంధ్ర పండితులు మృత్యుంజయ శర్మ, రామాచార్యులు, హనుమంతాచార్యులు పృచ్ఛకులుగా నుండిరి. అవధాన ప్రారంభాన్ని సంస్కృత శ్లోకంతో ఆరంభించడం ఈయనకలవాటు. ఒక్కొక్కప్పుడు అతి దీర్ఘ సమాసాలతో మరొక్కప్పుడు అలతి అలతి పదాలతో పద్యాలనల్లి శ్రోతల కానందాన్ని కలిగిస్తారు.

# పంచాంగకర్తలు - సిద్ధాంతులు

## మిరుదొడ్డి శ్రీనివాసాచార్య

మిరుదొడ్డి మండల కేంద్రంలో అర్చక కుంటుంబంలో శ్రీమాన్ రాఘవాచార్య అమ్మాణ్ణి దంపతులకు 1910లో శ్రీమాన్ శ్రీనివాసాచార్య గారు జన్మించిరి.

వీరు చిన్నతనంలో శ్రీమాన్ జిల్లెళ్ల గూడెంరంగాచార్యుల వద్ద శిష్యరికం చేసిరి. తిరుమల కళాశాలలో ఆయుర్వేద డిప్లమా అభ్యసించిరి. ఋషికేశం శివానందస్వామి వద్ద కొంతకాలం విద్యాభ్యాసము గావించిరి.

ఆచార్యులవారు ఉభయ వేదాంత పండితులు. జ్యోతిష, సిద్ధాంత, వాస్తు, ఆగమశాస్త్రులలో పరిపూర్ణమైన పాండిత్యము కలవారు.

హైందవ సంస్కృతి, ధార్మిక విధానంలో నిరాడంబరంగా నిష్కల్మష హృదయులై జీవించిరి. 1945 నుండి ఆమరణాంతము పంచాంగ రచన కొనసాగించిరి.

మెదకు జిల్లాలోనేకాక, నిజామాబాద్, హైద్రాబాద్, వరంగల్లు, జిల్లాలలో పర్యటించి అనేక దేవాలయాల ప్రతిష్ఠా కార్యక్రమములకు ఆచార్యత్వం వహించిరి. స్వయముగా స్వగ్రామమైన మిరుదొడ్డిలో సీతారామచంద్ర స్వామి దేవాలయాన్ని నిర్మించి ప్రతిష్ఠించిరి.

## యూయువరం కృష్ణ శర్మ సిద్ధాంతి

మెదకు జిల్లా దౌలతాబాదు మండలము నందలి బేగంపేట గ్రామంలో బ్ర. శ్రీ. రామచంద్రశర్మ రుక్మిణమ్మలకు కృష్ణశర్మగారు జన్మించిరి.

చిన్ననాటి నుండి వైదిక విద్యలనభ్యసించి, జ్యోతిష్య, సిద్ధాంత శాస్త్రములపైనున్న మక్కువతో బ్ర. శ్రీ మక్కపాటి సోమసుందర సిద్ధాంతి వద్ద శిష్యరిక మొనరించి ఆశాస్త్రములలో చక్కని పాండిత్యమును సంపాదించిరి. కొంతకాలము గురువుగారితో కలిసి పంచాంగ రచన గావించి ఆ తర్వాత స్వయముగా పంచాంగముల ప్రకటించిరి.

మిరుదొడ్డి శ్రీనివాసాచార్యులవారు వీరితో కలిసి పంచాంగ గణనమున పాల్గొనెడివారు. కృష్ణశర్మ సిద్ధాంతిగారు స్వగ్రామమును వదలి సికింద్రాబాదు కొత్త ఎల్లయ్యగారి దేవాలయమున నివసించుచు క్రోధన ఫాల్గుణ బ॥ చతుర్థి రోజున పరమపదించిరి.

## యాయవరం చంద్రశేఖర శర్మ

మెదకు జిల్లా దౌలతాబాదు మండలంలోని బేగంపేట గ్రామంలో శ్రీయాయవరం చంద్రశేఖర శర్మగారు బ్ర.శ్రీ. యాయవరం కృష్ణశర్మ సిద్ధాంతి శ్రీమతి శారదలకు 19-4-1961 తేదిన జన్మించిరి.

వంశపరంపరగా తండ్రికి వారసునిగా సిద్ధాంతంలోనూ, జ్యోతిష్యంలోను చక్కని అనుభవాన్ని సంపాదించి కీర్తి ప్రతిష్టల నార్జించినారు. శర్మగారి తండ్రిగారైన కృష్ణశర్మ సిద్ధాంతిగారు గొప్ప జ్యోతిష్య పండితులు.

చంద్రశేఖరశర్మగారు ప్రాథమిక విద్యను స్వగ్రామంలో పూర్తిచేసికొని, ఉన్నత విద్య హైద్రాబాదులో అభ్యసించి సెంట్రల్ రైల్వే ప్రభుత్వోద్యోగము చేయుచున్నారు.

వీరు బ్ర.శ్రీ. చివుకుల సుబ్రహ్మణ్య సిద్ధాంతి మరియు బ్ర.శ్రీ గురిజాల వేంకటయ్యగారి వద్ద మంత్రోపదేశము నందిరి తండ్రి నుండి అనూచానముగా వచ్చిన సిద్ధాంతమును శ్రీమాన్ అప్పన్ కందాడై శ్రీనివాసాచార్యుల వద్ద శిష్యరికము చేసి శాస్త్రములోని రహస్యముల నెరింగి జ్యోతిష్య సిద్ధాంతములందు చక్కని పాండిత్యమును సంపాదించిరి.

1985 నుండి గురువుగారితో పాటు స్వయముగా పంచాంగ రచన నారంభించి కొనసాగించు చున్నారు. చదువులిచ్చే చదువుల తల్లి సరస్వతిని ప్రతిష్ఠించుటకై ఆమెకొక వైభవోపేతమైన దేవాలయమును నిర్మించుటకై సత్యపథం సేవా సమితిని స్థాపించి ఆసంస్థకు వ్యవస్థాపక అధ్యక్షులుగా కొనసాగుచున్నారు.

మెదకు జిల్లా వర్గల్ మండల కేంద్రంలో శంభుదేవుని గుట్టపై శ్రీ విద్యా సరస్వతి, శనైశ్చర దేవాలయముల ప్రతిష్ఠించి ఆ దేవాలయ అభివృద్ధికై నిరంతర కృషి గావించుచున్నారు.

చంద్రశేఖరశర్మగారు జ్యోతిష్య సిద్ధాంతము లందేగాక వాస్తు శాస్త్రంలోను దిట్టమై ఎందరకో మార్గ దర్శకులుగానున్నారు.

## గౌరీభట్ల విఠల శర్మ సిద్ధాంతి

మెదకు జిల్లాకు కొట్టకొసలో కరకపట్ల ములుగు మండలములోని ఒక పల్లెటూరు. ఆ పల్లెలో రాజేశ్వరీ కృష్ణమూర్తిగారలు వారికి 1962లో పుట్టిన బాలుడు విఠల శర్మ. చిన్నతనం విద్యాభ్యాసం వాసాలమర్రిలో, ఇంటర్మీడియట్ విద్య భువనగిరిలో చదివిన గౌరీభట్ల విఠల శర్మ జిల్లా పరిషత్ యాజమాన్యంలో ఉపాధ్యాయుడుగా వర్గల్‌లో నియమింపబడి ప్రస్తుతం రాయప్రోలులో వృత్తి నిర్వహణ గావించుచున్నారు.

యాదగిరిగుట్ట నృసింహస్వామి దేవాలయ ఆస్థాన సిద్ధాంతి గౌరీభట్ల సీతారామశర్మగారి వద్ద శిష్యరికం చేసి యువనామ సంవత్సరం నుండి పంచాంగ గణనం ప్రారంభించారు.

మహర్షి వేదవిజ్ఞాన విశ్వవిద్యాపీఠం ఢిల్లీలో జరిగిన జ్యోతిష సదస్సులో రెండు నెలలపాటు పాల్గొన్నారు.

# మెదక్ జిల్లాలో సాంస్కృతిక రంగము

# లలిత కళలు - శిల్పము - చిత్రము

'ఆనందో(బ్రహ్మ' అన్నారు వేదాంతులు ఆనందం అనేకరకాలు. భౌతికజీవనంలో మానవునకు కలుగు అనేకానేక సమస్యలను పార(ద్రోలి హృదయానికి వి(శాంతినిచ్చి ఆనందాన్ని కల్గించేది సౌందర్యం. సౌందర్యమే కళ. మానవుడు (ప్రకృతిలోని సహజ సౌందర్యాన్ని ఆరాధించి దాన్ని తానుశాశ్వతం చేసుకొనుటకై గీసిన గీతలు చెక్కిన చెక్కడాలు, కూనిరాగాలు, కాలి కదలికలు, పాడే పదాలు, ఇవన్ని లలితకళలుగా భావింపబడ్డాయి.

అనాది నుండి మానవ మేధస్సు కొం(గొత్తకై ఆరాటపడడం, దాన్ని సాధించడం ఆనావాయితీగా వస్తున్నది. సౌందర్యారాధనలో ఆనందాన్ని అనుభవించు టకై, పొందిన ఆనందాన్ని శాశ్వతంగా దాచుకొనుటకై చేసిన (ప్రయత్నమే కళ.

మెదక్ జిల్లాలో (ప్రాచీనకాలంలో వెల్లి విరిసిన కళావైభవం అమోఘమైనది. కొండాపురం (త్రవ్వకాలలో శాతవాహనుల కాలంనాటి మృణ్మయ పాత్రలు, వాటిపై చి(తించిన చి(తాలు ఆనాటి శిల్ప, చి(తకళావైభవానికి తార్కాణాలు. అల్లాదుర్గం (త్రవ్వకాలు మన పూర్వీకుల కళాసా(మ్రాజ్యానికి మణిదీపాలు, ఇక్రిశాట్ (త్రవ్వకాలలో బౌద్ధుల, జైనుల సాం(ప్రదాయంతో మలచిన శిల్పాలు మనోహరదృశ్యాలు. కల్పగూరు, వేల్పుగొండ, ఎల్లారెడ్డిగూడెం మొదలైన (గ్రామాల్లో నిర్మించిన ఆలయాలు నాటి శిల్పకళా చాతుర్యానికి ఎత్తిన జయపతాకలు.

ఎన్నోగుళ్లల్లో, గోపురాల్లో గీసిన చి(తాలు నేటికి శతాబ్దాలు గడిచినా రంగారకుండా వివిధరంగుల్లో వెల్లి విరిసిన చిత్ర కళా సం(ప్రదాయాలు.

ఎన్నో ఏండ్లనాడు వాడిన రంగులు వెలిసి పోకుండా నేటికి సజీవంగా ఉన్నాయంటే ఆనాటి చి(తకారుల కళానైపుణ్యంతో పాటు రంగుల కలయికలోని రసాయనాల మేళవింపు పైనున్న శా(స్త్ర పరిజ్ఞానం అమోఘమని చెప్పవచ్చు.

చెక్కిన శిల్పాల్లోని నృత్యభంగిమలు నాటి నర్తకీమణుల నృత్యకళా వైభవాలు. మెదక్ జిల్లాలో శిల్ప, చి(త, నృత్య కళలతోపాటు సంగీతం కూడా చక్కగా అభివృద్ధినందిందని చెప్పవచ్చు.

మెదక్ జిల్లాలో సాహిత్యానికి కొదువలేదు చరి(తకందని కాలంలో సకల కథా(ప్రపంచానికి మూలమైన గుణాఢ్యుడు, కాళిదాసకావ్య సౌరభాలను తన వ్యాఖ్యానాల ద్వారా (ప్రసరింపజేసిన కోలాచల మల్లినాధుడు, అచ్చతెనుగు కావ్యాన్ని తెలుగుల కందించిన

తెలగనార్యుడు, మెదక్ జిల్లాలో పుట్టి పెరిగినవారే.

ఇవన్ని గతాలు అద్యతన కాలంలో మెదక్ జిల్లాలో వెల్లి విరుస్తున్న కళాసంపద తక్కువేమీ కాదు.

గతమెంతో ఘనమైనదే గతకాల వైభవాన్ని గుర్తుకు తెచ్చుకోవలసిందే వాటిని గ్రంథస్థంచేసి హృదయాలలో ముద్రించు కోవలసినదే. గతం వర్తమానానికి పునాది , భావికాలనికి నాంది.

అందుకే మెదక్ జిల్లాలోని కళలను వేరువేరుగా ప్రస్తుతించడం జరుగుచున్నది. నాటి కళాసంపదతో పాటు నేటి కళాకారుల జీవన గమనాన్ని, కళారాధనను పేరుపేరునా చూపించడం జరుగుచున్నది.

## మెదక్ జిల్లాలో శిల్ప చిత్ర కళలు

మానవునిలోని సృజనాత్మకశక్తికి, ఆనందానుభూతికి దర్పణం పట్టేవి కళలు. కఠిన శిలలను వెన్న ముద్దలుగా బండరాళ్లను గుండెలు చెదిరించే రూపాలుగా, నిర్జీవమైన రాతిలో సజీవ సుందరీమణుల విలాసాలుగా మలచేప్రక్రియ ఒక్క శిల్పికి మాత్రమే ఉంది.

ఒక్క ప్రాణం పోయలేడు కాని బ్రహ్మ సృష్టిని మించిన అందాలను తన ఉలిలో సృష్టించే శక్తి శిల్పికి ఉందనడంలో ఆశ్చర్యం లేదు.

అలాంటి అందచందాల శిల్పాలు మెదకు జిల్లాలో కోకొల్లలు. ఈ ప్రాంతాన్ని పాలించిన రాజవంశాలలో చాళుక్యుల కాకతీయుల నాడు తెలుగునాట వెలసిన కళావైభవం వర్ణనాతీతం "రాజులపైన రాళ్ల పాలు"న్నారు. కాని కాకతీయ శిల్పకళా చాతుర్యాన్ని చూస్తే రాళ్ల పాలబడ్డపైన రతనాల పాల బడిందని అనుకోక తప్పదు.

మెదకులోని ఎన్నోగుళ్లల్లో, గోపురాలలో నాటి కళాకారుల శిల్ప, చిత్రనైపుణ్యాన్ని నేటికి చూడవచ్చు.

అద్యతనకాలంలో మెదకు జిల్లాలో పేరొందిన చిత్రకారులు, శిల్పులు అనేకులున్నారు. రాష్ట్రంలో పేరొందిన వారు కొందరు, దేశంలో కీర్తినందిన వారు కొందరైతే అంతర్జాతీయంగా వివిధ దేశాలలో తమ కళా వైభవాన్ని చాటి ప్రపంచ మానవ సమాజం చే నీరాజనాలందుకొన్న మహనీయయులు మెదకు జిల్లాలోనున్నారు. వారి జీవన గమనాన్ని కళారాధనను ప్రత్యేకంగా పేర్కొనుట జరుగుచున్నది దబ్బాకలో 'చిత్రకళా నిలయం' అనే సంస్థ 1989లో స్థాపించబడినది. 1994లో రాష్ట్ర స్థాయి చిత్ర కళల పోటీలు నిర్వహింపబడినవి. ఈ సంస్థకు ప్రస్తుతం కే. రాములుగారు అధ్యక్షులుగా వ్యవహరించుచున్నారు.

# వెల్దుర్తి

మెదకు జిల్లాలో జీవం ఉట్టిపడే శిల్ప సౌందర్యం భక్తులను, కళాభిమానులను మైమరిపిస్తోంది. మండల కేంద్రమయిన వెల్దుర్తిలో సుమారు 700ల సంవత్సరాల క్రితం కాకతీయుల కాలంలో నిర్మించిన అపురూపమయిన శిల్పసంపద. శివాలయాలు వైష్ణవాలయాలు ఉన్నాయి. ఇక్కడున్న రాతి స్తంభాలు మందిరాలు ఆ కాలం నాటి శిల్పుల నైపుణ్యానికి ప్రతీకలుగా కనబడతాయి. వీటిలో విఠలేశ్వరాలయం వద్ద ఉన్న కాకతీయ సింహద్వారం ప్రత్యేకమయినది. ఇది 18 అడుగుల ఎత్తుతో ఉంది. ఈ ద్వారానికి ఒక పక్కన దేవతలు మరోపక్క రాక్షసులు వాసుకి అనే పామునుపయోగించి మంధర పర్వతంతో సముద్రాన్ని చిలుకుతున్న సముద్ర మధన చిత్రం చెక్కి ఉంది. మరో ప్రక్కన నాట్యం చేస్తూ విషాన్ని తాగుతున్న శివుడి చిత్రం చెక్కి ఉంది. అంతేగాక ఈ సింహద్వారానికి పైభాగాన ఆరు రంధ్రాలున్నాయి. ఈ రంధ్రాల గుండా ఏడాదికి గల ఆరు ఋతువులలో ఒక్కో ఋతువులో ఒక్కో రంధ్రం నుండి సూర్యుడి కిరణాలు వెళ్లి గర్భగుడిలో ఉన్న రంగనాయకుల విగ్రహం నాభిపయిన పడతాయి. ఈ ద్వారానికి ఎడమ ప్రక్కన సుమారు 25 అడుగుల ఎత్తుగల రాతిస్తంభం దీనిపై గరుత్మంతుడి విగ్రహం ఉన్నాయి. శిలలను చెక్కడమేకాదు విజ్ఞాన శాస్త్రాన్ని వివరించడం ఈ శిల్పంలోని గొప్పతనం.

# అల్లాదుర్గం

ఈ జిల్లాలో విపరీతమయిన శిల్ప సంపద గల ప్రాంతం అల్లాదుర్గం. ఈ గ్రామంలో ప్రతివీధిలో శిల్పకళలతో కూడిన దేవాలయాలున్నాయి. ఇచట ఏ ఇంటికోసం పునాదులు తవ్వినా ఏవో శిల్పాలు బయట పడుతుంటాయి. ఇక్కడ 20 అడుగుల ఎత్తులో ఉన్న ఏకశిలా స్తంభాలున్నాయి. ఇచటి వినాయక విగ్రహాలు, బసవన్నల శిల్పకళ ఎంతో అద్భుతమయినది. ఈ గ్రామ విశిష్టత తెలిసిన పురావస్తుశాఖ వారు 1960 సంవత్సరంలో తవ్వకాలు జరిపించారు. వారితవ్వకాలలో ఒక సమాధి, వినాయక విగ్రహాలు, ప్రాణవట్టం, బసవన్నలు బయటపడ్డాయి. ఇవి నిర్మితమయి సుమారు 1000 సంవత్సరాలు అయివుండవచ్చునని పురావస్తుశాఖవారు అంచనా వేశారు. అయితే సమాధి గోడలకు వాడిన రంగులు చెక్కుచెదరకుండా ఉండడం అందరినీ ఆశ్చర్య పరిచింది. పురావస్తు శాఖవారు కొన్ని విగ్రహాలను పరిశీలనల నిమిత్తం తీసుకొని వెళ్ళారు. అంతేకాక తవ్వకాలలో బుద్ధుని విగ్రహాలు కూడా బయటపడ్డాయి.

## ఎల్లారెడ్డిపేట

కొండపాక మండలంలో ఎల్లారెడ్డి పేట గ్రామంలోని త్రిలింగేశ్వరాలయం శిల్పకళా నైపుణ్యంతో చూపరులను విశేషంగా ఆకట్టుకుంటుంది. ఈ ఆలయ గర్భగుడిలో ప్రాణవట్టం నుంచి అంతర్భాగం గుండా ఒక మార్గాన్ని నిర్మించారు. ఈ మార్గం ఎటువంటి సాంకేతిక సహాయం లేకుండా వాస్తు శిల్పుల ద్వారా ఏర్పాటు చేయబడింది. ఆలయంలో అభిషేకాలు నిర్వహించినపుడు అభిషేకజలం ఆలయం వెలుపలికి వెళ్ళేలా ఈ మార్గం నిర్మించబడింది. అంతేకాక ఆలయంలోని మంటపము, గర్భగుడి దాదాపు 5 ఫీట్లు ఎత్తుపై నిర్మించారు. ఇవి లింగాకారం గాను వీటితో పాటు ప్రదక్షిణ చేయటానికై ఏర్పాటు చేసిన అరుగు పైకి వెళ్ళడానికి కట్టిన మెట్లతో కలిపి దూరం నుండి చూస్తే ఈ ఆలయమే ఓ శివలింగంలా కనబడుతుంది. ఇది ఈ ఆలయం మరో ప్రత్యేకత. ఈ ఆలయం ఏనాటిదో తెలిపే ఎలాంటి ఆధారాలు దొరకలేదు కానీ శిల్పకళా రీతులను బట్టి ఆలయం కాకతీయుల కాలం నాటిదని భావిస్తున్నారు.

## దుద్దెడ

చక్కని శిల్పకళా సౌందర్యంతో 'దుద్దెడ' గ్రామంలో శంభు దేవాలయం ఉంది. ఈ ఆలయం కాకతీయుల కాలంలో నిర్మించబడినట్లు ఆలయ ప్రాంగణంలో గల శాసనం ద్వారా తెలుస్తుంది. ఈ ఆలయం పూర్తిగా భారీ శిలలతో నిర్మించబడి ఉంది. 78 అడుగుల చతురస్రంగల విశాలమయిన ప్రదేశంలో ఆలయం ఉంది. శివలింగంతో కూడిన గర్భగుడిపైన 36 అడుగుల గాలిగోపురం, దానిముందు 16 ఏకశిలా స్తంభాలతో నిర్మించబడిన కళ్యాణ మంటపం ఉన్నాయి. ఇచట ద్వారపాలకులుగ చెక్కబడిన ఏకశిలావిగ్రహాలు నాట్యభంగిమలో కడురమ్యంగా ఉన్నాయి. ఆలయ ప్రవేశద్వారంపై రెండంతస్థుల శాలా నిర్మాణం ఉంది. దాని ప్రక్కనే నల్లరాతితో చెక్కబడిన పార్శ్వనాధుడి విగ్రహం ఎంతో అందంగా ఉంటుంది. ఈ ఆలయంలో అన్నింటా ప్రత్యేకమయినది ఒక శివలింగం. 'జలలింగంగా' ప్రసిద్ధినొందడం ఈ శివలింగంలో ఎప్పుడూ నీరు ఊరుతూ ఉంటుంది. దీనిని భక్తులు మహిమగానూ కళాభిమానులు శిల్పుల ప్రజ్ఞాపాటవాలుగాను భావిస్తారు.

అలాగే 'మర్పడగ' గ్రామపు శివారులో గల మల్లికార్జున దేవాలయం ముందుగల 'నంది' విగ్రహం చక్కటి శిల్పకళతో ఉంది.

## ఇక్రిశాట్ త్రవ్వకాలలో శిల్పసంపద

పటాన్‌చెరులోని అంతర్జాతీయ మెట్టపంటల పరిశోధనా కేంద్రం ఇక్రిశాట్ ప్రాంతం ఒకప్పుడు ప్రసిద్ధిగాంచిన చారిత్రాత్మక ప్రదేశం. హిందూ, బౌద్ధ, జైన సంస్కృతులకు ఆలవాలమయిన ఈ ప్రదేశానికి రాజరిక వ్యవస్థ తోడుగా ఉండడంతో 17వ శతాబ్దపు ఉత్తరార్ధంలో మొఘలులు ఈ ప్రాంతం పై దండయాత్రలు చేయడంవలన అన్ని సంస్కృతులను

తెలియజేసే అద్భుతమయిన కళాసంపద నశించినట్లుగా చారిత్రక సత్యాలు తెలియజేస్తున్నాయి.

ఇక్రిశాట్ స్థాపనలో భాగంగా 1973లో జరిగిన త్రవ్వకాలలో అనేకమయిన పురాతన కట్టడశిథిలాలు, శిల్పాలు, కళాఖండాలు క్రమంగా బయటపడి క్రీ.పూ. చరిత్ర వైభవాన్ని ప్రపంచానికి తెలియపరిచాయి. పురావస్తు శాఖ సేకరించుకుపోగా మిగిలిన అనేక కళాఖండాలు ఇప్పటికీ ఇక్రిశాట్‌లో ప్రదర్శింపబడుతున్నాయి.

రామచంద్రాపురం గ్రామ పంచాయితీకి చెందిన కాచిరెడ్డిపల్లి, మందుమూల అనే గ్రామాల ప్రాంతలోని ఈ ప్రాచీన కట్టడాలు, కళాఖండాలు బయల్పడినాయి. ఆయితే ఇక్రిశాట్ విస్తరణ వలన ఈ గ్రామాలు కనుమరుగయినాయి.

ఇచట వైష్ణవ, వీరశైవాలకు ఆరాధ్య దైవాలయిన మూలవిరాట్టుల దేవాలయాలు అనేకం వెలుగు చూశాయి. అంతేగాక క్రీ.పూ. విగ్రహాలతో బాటు తాళపత్రసాక్ష్యాలు కూడా లభించాయి. ఇక్రిశాట్ పునాదుల త్రవ్వకాలలో వేయి ఏళ్ళ క్రితం నాటి గణేశుని విగ్రహం లభించింది. ఏనుగు శిరస్సు కలిగి ఉండి, తొండము కుడి వైపునకు తిరిగినదిగా ఉండడం ఈ విగ్రహం ప్రత్యేకత. ఇది కళ్యాణీ చాళుక్యుల రాజ్యకాలానికి ముందునాటిదయిన అద్భుతమైన విగ్రహం. ఇక్కడే 16 స్తంభాల సహాయంతో నిర్మించబడిన దీర్ఘచతురస్ర కారపు విష్ణుదేవాలయం నేటికీ కనిపిస్తుంది. ఈ ఆలయం ముఖద్వారం పై జయ, విజయుల విగ్రహాలు చెక్కబడి ఉన్నాయి. ఈ ప్రాంతంలోనే బయటబడిన విష్ణువు విగ్రహంతో పాటు సేవికల విగ్రహాలు శిల్ప కళాచాతుర్యానికి ప్రతీకలుగా నిలుస్తున్నాయి. విష్ణువు విగ్రహానికి చక్రం కుడిచేతిలోనూ, శంఖం యెడమచేతిలోనూ కనిపిస్తాయి సేవిక విగ్రహంలో కుడిచేతిలో వింజామర, ఎడమ చేతిలో చిప్ప కనిపిస్తాయి.

ఈ ప్రాంతంలోనే రెండుమూడు అడుగుల లోతులోనే సూర్య దేవాలయం బయటపడింది. ఈ ఆలయం పొడువైన రాళ్ళతో నిర్మించబడింది. ఆరు అడుగుల లోపలికి వెళితే గుడి అంతర్భాగ నిర్మాణం ఎక్కువగా కనిపించకపోయినా ముక్కలుగా అయిపోయిన సూర్య భగవానుని విగ్రహం కనిపిస్తుంది. ఒక చేతిలో పద్మంతో ఏడుగుర్రాల రథసారథిగా సూర్యభగవానుడు ఈ విగ్రహంలో ఉన్నాడు. ఈ విగ్రహం తలపై భాగం కొంత భిన్నమయింది.

ఈ ప్రాంతానికి చివరన దక్షిణం వైపు శివాలయం ఉంది దాని చుట్టు ప్రక్కలా వేల సంవత్సరాల క్రితం నాటి గ్రామాల ఆచూకీతో బాటు పురాతన శిథిలాలు త్రవ్వకాలలో బయల్పడ్డాయి. వీటిల్లో ప్రధానమైంది వీరభద్రుడి అవతారంలో గల శివుడి విగ్రహం, ఈ విగ్రహానికి కుడిచేతిలో కత్తి, కవచాలు, ఎడమ చేతిలో డమరుకం త్రిశూలమ్ములున్నాయి. దేవుడి కాళ్ళవద్ద మేకతలతో ఉన్న దక్షుడి విగ్రహం నిలబడి ఉంటుంది.

శివాలయంలో లింగానికి తగ్గట్టుగా ఎదురుగా నల్లరాతితో చెక్కబడిన నంది విగ్రహం ఉంది. ఈ శిల్పాలలో సజీవకళ ఉట్టి పడుతోంది. ఇక్కడే శివుడి కంఠాభరణమయిన సర్పము అనేక విగ్రహాల రూపంలో కనబడుతుంది. కొన్ని సర్పాలు ఆయుధాలతోను, మరికొన్ని ఆడ, మగసర్ప విగ్రహాలు గోధుమరంగులోను కనిపిస్తాయి.

ఇవేకాక సంపదలనిచ్చే కుబేర విగ్రహం. పొట్టిదయిన యక్షనివిగ్రహము, శౌర్యానికి ప్రతీకగా కనిపించే అయిదడుగుల నాయకుడి విగ్రహము, అరవీరభయంకరమయిన ఒక వీరుడి విగ్రహం, మొదలైనవి ఎన్నో ప్రేక్షకుల్లను ఆకట్టుకుంటున్నాయి.

పై విగ్రహాలే కాక 16 శతాబ్దపు పూర్వార్థంలో కుతుబ్షా వంశంవారు నిర్మించిన కోటలను పోలివున్న భవనం అప్పటి పరిస్థితులను తెలియజేస్తోంది. దీని చుట్టు ప్రక్కల ఆనాటి కుంచెళ్ళ పెంకులు, పాలరాతిపై చెక్కబడిన శాసనములు చరిత్రకు సాక్ష్యాన్నిస్తున్నాయి. అయితే ఇక్రిశాట్ యాజమాన్యం ఈ శిల్పసంపదను భద్రపరచడమే కాక ప్రదర్శన కళాఖండాలుగా ఉపయోగించడం ఎంతో ఆనందించదగిన విషయం.

# డాక్టర్ కాపురాజయ్య

చిత్రకళాకారుడు డాక్టర్ కాపురాజయ్యగారు 1925 ఏప్రిల్ 7వ తేదిన సిద్ధిపేటలోని ఒక పేదకుటుంబంలో జన్మించారు. 1943లో చిత్రలేఖనం శిల్పకళ కేంద్ర పాఠశాలలో హైదరాబాద్‌లో విద్యనభ్యసించారు. మద్రాసు ప్రభుత్వం నుండి చిత్రలేఖనంలో 1945 లో లోయర్ గ్రూప్ సర్టిఫికేట్, 1947లో డ్రాయింగ్ నందు డిప్లొమాను పొందారు. తదుపరి 1952 లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుండి చిత్రలేఖనంలో డిప్లొమా, లలిత కళలు శిల్పశాస్త్రంలో హయ్యర్ సర్టిఫికేట్ పొందారు. 1946లో డ్రాయింగ్ టీచరుగా ప్రభుత్వోద్యోగంలో చేరారు.

గ్రామీణ ప్రాంతాల ప్రజల సహజసిద్ధ, స్వచ్ఛమైన జీవన శైలిని తనకుంచెతో ప్రపంచ కళారాధకుల కళ్ళ ముందు అవిష్కరించి వివిధ దేశాల కళాభిమానుల ప్రశంసలందుకున్నారు. ఈ కృషితో 1943లో ప్రారంభమయిన ఇతని కళాతపస్సు నేటివరకూ నిరంతరాయంగా కొనసాగుతోంది. మనదేశంలోని బెంగళూరు, మద్రాసు, కోణార్క్ మొదలగు ఎన్నో ప్రముఖ పట్టణాలల్లో ఈయన ప్రదర్శనలు నిర్వహించారు. మనదేశమందే కాక 1956 నుండి జకోస్లొవాకియా, హంగేరి, బల్గేరియా, రుమేనియా, పెర్త్ మొదలగు ఇతర దేశాలలో కూడా కాపురాజయ్య గారు ప్రదర్శనలు నిర్వహించి అక్కడి కళాప్రియుల ప్రశంసల నందుకొన్నారు. గుల్బర్గాలో (కర్ణాటక) లలితకళా అకాడమీ ఆధ్వర్యంలో 1979లో కళాశిబిరం ఏర్పాటుచేశారు. 1984లో మద్రాసు లో భారత చిత్రకళాశిబిరం నిర్వహించారు. 1972లో తన పాతిక సంవత్సరాల చిత్రకళా ప్రదర్శన ఢిల్లీలో ఏర్పాటు చేశారు.

ఇటువంటి ప్రదర్శనలే కాకుండ అనేక సంస్థలు రాజయ్య చిత్రాలను ముద్రించాయి. అంతేకాక అనేక క్యాలండర్లలో కాపురాజయ్య కుంచె నుండి జాలువారిన రంగులు కాంతులీనుతున్నాయి.

ఇంతటి కళాతపస్వికి ఆయన ప్రతిభకు తగిన విధంగా ఎన్నో అవార్డులు బిరుదులు ఆయన స్వంతమయ్యాయి. రాజయ్యగారు వేసిన 'రిస్క్ లైఫ్' చిత్రానికి 1990 జాతీయ అవార్డు లభించింది. హైదరాబాద్‌లోని జె.ఎన్.టి.యు 'గౌరవ డాక్టరేట్' ను అందజేసింది.

ఇవేకాక 'చిత్రకళా ప్రపూర్ణ' 'కళాప్రవీణ', 'కళావిభూషణ', మొదలయిన బిరుదలెన్నో పొందారు. లలితకళా అకాడమీ కూడా ఇతనికి 1980లో విశిష్ట సభ్యత్వం కల్పించింది. ఆంధ్రప్రదేశ్ కళావేదిక 1984లో 'కళాసరస్వతి' బిరుదుతో సత్కరించింది.

డాక్టర్ కాపురాజయ్యగారు 15 సంవత్సరాల పాటు కేంద్ర లలితకళా అకాడమిలో సభ్యులుగా ఉన్నారు. సిద్దిపేటలో 'లలితకళా సమితి' ని స్థాపించారు. ఉస్మానియా యూనివర్సిటీకి రెండుసార్లు అకాడమిక్ కౌన్సిల్ సభ్యునిగాను, అఖిల భారత ఫైన్ ఆర్ట్స్ సొసైటీకి సభ్యునిగాను ఉన్నారు. కొంతకాలం హైదరాబాద్ ఆర్ట్స్ సొసైటీ అధ్యక్షుడిగా కూడా వ్యవహరించారు.

ప్రస్తుతం వీరు సిద్దిపేటలో స్థాపించిన "లలితకళా సమితికి" దాతల ప్రభుత్వ సహకారాలతో అపురూపమయిన కళాభవనాన్ని నిర్మించారు. 12 సంవత్సరాల క్రితం నిర్మించిన ఈ కళాభవనంలో పూర్తిస్థాయి కళాబోధన నిర్వహించేందుకు అనుగుణంగా విద్యాలయాన్ని నెలకొల్పేందుకు విశేషంగా కృషి చేస్తున్నారు.

ఓ నిరుపేద కుటుంబంలో జన్మించి ఒక కళాకారుడిగా ఎదిగి ఆ తరువాత ఓ అద్భుత కళా వ్యవస్థగా రూపొందిన మనీషి కాపురాజయ్యగారు. ఇలటి కళాసంపదనందించి దేశానికి ఖ్యాతి తెచ్చిన ఈయనకు జన్మనిచ్చిన మెదకు జిల్లా ధన్యమయింది.

# లక్ష్మాగౌడ్

చిత్రకళలో ఉన్నత స్థానానికి చేరుకున్న లక్ష్మాగౌడ్‌గారు మెదక్‌జిల్లాలోని సదాశివపేటకు ఏడు కిలోమీటర్ల దూరంలోని 'నిజాంపూర్' గ్రామంలో 1940వ సంవత్సరంలో జన్మించారు. ఇతని విద్యాభ్యాసం సంగారెడ్డిలో కొనసాగింది. తరువాత 1958 ప్రాంతంలో కింగ్‌కోఠీ ప్రాంతంలో గల కళాశాలలో చిత్రలేఖనానికి సంబంధించిన శాస్త్రీయ విద్యాభ్యాసం ప్రారంభించారు. కళాశాల విద్యాభ్యాస సమయంలోనే అతని ప్రతిభతో స్కాలర్‌షిప్పులను పొంది 'బరోడా విశ్వవిద్యాలయం' లో "మురల్ "అనే చిత్రకళారీతిలో ప్రత్యేక శిక్షణ పొందారు.

గ్రామీణ జీవితం ప్రకృతి సౌందర్యాల పట్ల మక్కువ కలిగిన లక్ష్మాగౌడ్‌ను అతని గ్రామంలో పద్యాలు వల్లెవేయించి అక్షరాలు నేర్పిన అయ్యవారు మొదలుకొని అక్షయపాత్రతో గానంచేసే దాసరి, వేసవులలో మూడురాత్రులు హనుమజ్జయంతిని వినిపించిన కళాకారుల వరకు మొదలగు అంశాలు అతన్ని బాల్యంలోనే ప్రభావితం చేశాయి.

తోటికళాకారులతో మందుముల రామచంద్రరావు అనే న్యాయవాదికి చెందిన ఆటో గ్యారేజ్ లో ఈతని కళాసృష్టి ప్రారంభమయింది. 1961 నుండి ప్రారంభమయి దేశంలోని అన్ని కళాప్రదర్శనలో పాల్గొని ప్రతి ప్రదర్శనలోను ప్రత్యేక ప్రశంసలనందుకున్నారు. రాష్ట్ర లలితకళా అకాడమీ బంగారు పతకము మొదలుకొని ప్రపంచములోని పలుదేశాల్లో అసంఖ్యాకములయిన పురస్కారాలందు కున్నారు. 1974 ప్రాంతంల్లో దూరదర్శన్ కళారూపాల సృష్టికర్తగా 15 సంవత్సరాలు బాధ్యతలు నిర్వహించారు. 1989 నుండి హైదరాబాద్‌లోని కేంద్ర విశ్వవిద్యాలయంలో పెయింటింగ్ అధ్యాపకునిగా కళాఖండాలకు, కళాకారులకు జీవం పోస్తున్నారు. అంతేగాక 'గ్రాఫిక్ డిజైన్‌లలో' నూతన పద్ధతులనన్వేషిస్తూ జర్మనీలోని హంబర్గ్‌లోని 'డిజైన్ ఇన్‌స్టిట్యూట్ 'లో తామ్రం కళారూపాలను రూపొందించారు.

మ్యూనిచ్ అకాడమీ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ వారితోనూ పీటర్ క్లియన్‌లతోనూ వర్క్‌షాప్‌లను నిర్వహించి కళారూపాల సృష్టిలో కొత్తదనాల కోసం ప్రయత్నాలు చేశారు.

ప్రసిద్ధ కళాకారుడిగానే కాక సమాజం పట్ల బాధ్యతగల వ్యక్తిగా ఈయన వ్యవహరిస్తూ అనేక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ఇందులో భాగంగానే ఎన్నో సంఘాలకు, సామాజిక స్పృహ కలిగించే ఎన్నోభావచిత్రాలను కళారూపాలను అందించారు. సమాజంలో స్త్రీలపట్ల, బాలికల పట్ల జరుగుతున్న హింస అకృత్యాలపై "గివ్ మి మైడే" అన్న చిన్న పుస్తకాన్ని వెలువరించారు. మెదక్ జిల్లాలో గ్రామీణ మహిళల అభివృద్ధికై పాటుబడుతున్న

"దక్కన్ డెవలప్‌మెంట్ సొసైటీ"కి కూడా తన సహకారాన్ని అందిస్తున్నారు.

గాజువుక్కలు, పెంకులు మొదలగు వస్తువలతో చిత్రకళలతో కొత్తదనాన్ని కల్పించవచ్చునే భావన కలిగిన లక్ష్మాగౌడ్ గారు ప్రస్తుతం ప్రజ్ఞాపురం గ్రామంలో కృషివిద్యాకేంద్రం స్థాపించే ప్రయత్నాలలో తనవంతు సహాయాన్నందిస్తున్నారు.

## బాలయ్య

బాతిక్ చిత్రకళతో బాతిక్ బాలయ్యగా గుర్తింపునొందిన యాసాల బాలయ్య గారు 1940లో మెదకు జిల్లా సిద్ధపేట మండలంలోని ఇబ్రహీంపూర్‌లో జన్మించినారు. వీరు విద్యార్థి దశలో కళాకారుడైన కాపు రాజయ్య వద్ద శిష్యరికం చేసి తరువాత చిత్రకళలో హయ్యర్ పాసయినారు. వీరు ఆంధ్రప్రదేశ్ లలితకళాసమితి ఆర్థిక సహాయంతో 'న్యూఢిల్లీలోని కేంద్ర విశ్వవిద్యాలయంలో ఆర్ట్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న లక్ష్మాగౌడ్' వద్ద శిక్షణ పొందారు.

వీరి మొట్టమొదటి చిత్రకళా ప్రదర్శన సిద్దిపేటలోని ఆర్యవైశ్య భవనంలో 1963లో జరిగింది. తరువాత వీరి ప్రదర్శనలు దిన దిన ప్రవర్ధమానంగా పెరుగుతూ నేడు అంతర్జాతీయ స్థాయిలో జరుగుతున్నాయి. ఇంతేకాక కోణార్క్, బెంగుళూరు, మణిపూర్ మొదలగు పట్టణాల్లో జరిగిన జాతీయ స్థాయి క్యాంపుల్లో కూడా పాల్గొన్నారు.

బాలయ్య గీసిన మొదటి చిత్రం "బింబప్రతిబింబాలు" తొలిసారిగా ఆంధ్రప్రభలో 1957లో ప్రచురితమైంది. ఆనాటి నుండి నేటివరకు దిన, వార, పక్ష, మాస మొదలయిన అన్నిరకాల పత్రికలలో వీరి చిత్రాలు ప్రచురితాలయినాయి.

వీరి చిత్రాలను ఆంధ్రరాష్ట్ర పత్రికలేకాకుండా కన్నడ దిన పత్రిక "ఉదయవాణి", మళయాల దిన పత్రిక "మళయాళ మనోరమ" మొదలయిన పత్రికలెన్నో ప్రచురించాయి. ఇలా పత్రికలలోనే కాక మనం నిత్యం ఉపయోగించే పరదాలు, దుప్పట్లు మొదలైన దుస్తులపై వీరి బాతిక్ చిత్రాలు ముద్రించబడి కళాహృదయులను రంజింప జేస్తున్నాయి.

ఉత్తమ చిత్రకళాకారుడుగా గుర్తింపు పొందిన బాలయ్య తొలిసారిగా 1975లో లయన్స్‌క్లబ్ వారిచే సన్మానం పొందారు. తరువాత ఆయన పొందిన బిరుదులు, సత్కారాలు, సన్మానాలు లెక్కలేనన్ని. ఇటువంటివేకాకుండా 'సమాజంలో రక్షణలేని స్త్రీ' అనే చిత్రం ద్వారా ప్రఖ్యాత చిత్రకారుడు ఎం.ఎఫ్.హుస్సేన్‌చే ప్రశంసల జల్లు కురిపించు కున్నారు.

ఎందరో ప్రముఖుల ప్రశంసల నందిన వీరు తన చిత్రాలను సాలార్‌జంగ్ మ్యూజియం, లలితాకళా అకాడమీ హైదరాబాద్, నేషనల్ అకాడమీ ఆఫ్ రీజనల్ సెంటర్ మద్రాస్, మొదలైన అన్ని సంస్థలలో ప్రదర్శించినారు.

బాలయ్యగారి చిత్రాలు ఎక్కువగా గ్రామీణ జీవితాలకు అద్దంపట్టేవిగా ఉంటాయి. చిత్రకళలో ఇంత ఘనత సాధించిన బాలయ్యగారు అధ్యాపక వృత్తిలో కూడా జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డును అప్పటి రాష్ట్రపతి శంకరదయాళ్ శర్మగారి చేతుల మీదుగా స్వీకరించారు.

బాలయ్యగారు "బాతిక్ చిత్రకళ " అనే పేరుతొ ఒక పుస్తకాన్ని కూడా రచించారు.

## రమణారెడ్డి

కళలలో ఆధునికతకు నిర్వచనం చెబుతూ, చిత్ర, శిల్ప కళారంగాలలో నూతన ఒరవడి సృష్టిస్తున్న ప్రపంచ ప్రఖ్యాత కళాకారుడు రమణారెడ్డిగారు. ఈయన మెదకు జిల్లాలోని సిద్దిపేట పట్టణ సమీపంలోని "లకుడారం" గ్రామంలో జన్మించారు.

రమణారెడ్డి హైస్కూల్ విద్యాభ్యాసం సిద్దిపేటలో జరిగింది. ఇంటర్ చదువుతున్న రోజులలో ఇతను డాక్టరో, ఇంజనీరో కావాలని తల్లిదండ్రులు ప్రోద్బలం చేయగా తన స్వప్నలోకమయిన కళాప్రపంచం లోకి అడుగిడడానకి ఇంట్లో చెప్పకుండా హైదరాబాద్ వచ్చాడు. మొదట జె.ఎన్.టి.యు. లో డిప్లొమా కోర్సులో చేరాడు కానీ ఆర్థిక సహాయాన్నందించేవారు గానీ స్కాలర్‌షిప్పులు గానీ ఏవీ లేక భోజనం కూడ చేయలేని స్థితిలో ఆ చదువు మధ్యేలో ఆగిపోయింది. ఇరానీ హోటళ్ళలో మొదలుకొని ఎన్నో పనులు చేస్తూ డబ్బులు కూడాబెట్టసాగాడు. ఆ తర్వాత సైన బోర్డులు రాయడం హోర్డింగ్‌లు రాయడం ప్రారంభించి బి.ఎఫ్.ఎ. లో చేరి శిల్పకళలో స్పెషలైజేషన్ చేశారు. తదుపరి జె.ఎన్.టి.యు.లో బంగారు పతాకాన్ని సాధించి, బరోడాలో ఎం.ఎఫ్.ఎ లో చేరాడు. కొంత కాలానికే భారతీయ సాంస్కృతిక సంబంధాల మండలి అందించిన ప్రోత్సాహంతో రనితర్‌కునేర్త్ ఆహ్వానం పై సాంస్కృతి మార్పిడులు కార్యక్రమం క్రింద జర్మనీ వెళ్ళారు.

కళాకారుడిగా జర్మనీలో స్థిరపడ్డ రమణారెడ్డి మెమింగెన్, షెల్, క్లింగేన్, ఉల్మ్ లలో ప్రదర్శనలు నిర్వహించారు. అమెరికాలో కూడా ప్రదర్శన నిర్వహించారు. జపాన్‌లో అంతర్జాతీయ సింపోయిజంలో కూడా పాల్గొన్నారు.

చిన్నప్పుడు లకుడారం గ్రామంలోని చెరువు మట్టితో బొమ్మలు చేసిన ఈ విశ్వకళాకారుని చేతుల్లోకి బండరాళ్ళు, కలప, ఉక్కు, మట్టి, సిమెంట్ పేపర్‌బోర్డ్ మొదలయిన వేవి వెళ్ళినా కళాఖండాలుగా రూపుదాలుస్తున్నాయి.

రమణారెడ్డి రాళ్ళ, రంగుల సర్వస్వాన్ని ఎరిగినాడు. ప్రజలు కళ దగ్గరికి రాకపోతే కళే ప్రజల వద్దకు వేళ్ళాలి అనే ఈయన భావనని తను ఉల్మ్ మొదలగు ప్రాంతాల్లో రైల్వేస్టేషన్లు, బస్‌స్టేషన్‌లు, పోస్టాఫీసులు, ప్రభుత్వ కార్యాలయాలు మొదలగు చోట్ల ఈయన ప్రదర్శించిన కళాఖండాలు ఋజువు చేస్తున్నాయి. ఏ కళకయినా మానవుడే కేంద్రబిందువు అనే ఖచ్చితాభిప్రాయం ఇతనిది. మానవాభ్యుదయాన్ని తన కళ ద్వారా వ్యక్తం చేస్తూంటారు. ఈయన మానవునిలోని మేధస్సుకి అధిక ప్రాధాన్యం ఇస్తారు కాబట్టి ఈయన శిల్పాల్లోను చిత్రాల్లోను శరీర మస్తిష్క భాగానిక అధిక ప్రాధాన్యం ఉంటుంది.

ఇంకా చెప్పాలంటే సాంప్రదాయమైన స్థితికి భిన్నంగా తన కళలుండాలనేది ఆయనలో స్పష్టంగా కన్పించే ధోరణి పికాసో, డాలీ, వాంగో వంటి కళాకారుల ఒరవడిని గౌరవిస్తూనే తనదైన స్వంత బాణీని ఏర్పరుచుకున్నారు.

1999లో జర్మనిలోని బ్లాబాయరాన్ నగరంలో ఒక వంతెన కింద నీటిలో 20 x 2.5 కేన్వాస్‌పై ఆయిల్ పెయింట్ చేశారు. అలల కదలికతో చిత్రంలో మానవునిలో 'కదలిక' కనిపిస్తుంది ఈ అద్భుత నూతన కళాభివేషానికి జర్మన్ ప్రజలు ఎంతో స్పందించారు. ఈయన గీసిన మల్టిపుల్ హెడ్స్ అనే చిత్రం కూడా భిన్నత్వం కలది.

రమణారెడ్డిగారు ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సహకారంతో చార్మినార్ అంత ఎత్తుగల (సుమారు 70 అడుగుల ఎత్తుగల) ఒక చతుర్ముఖ శిరస్సును హైదరాబాద్‌లో నిర్మించాలనుకుంటున్నారు. ప్రజలు దానిలోపలి నుండి పైకి వెళ్ళి నగరాన్ని కూడా వీక్షించవచ్చు.

ఇటువంటి కళాకారునికి కాపురాజయ్యగారు విద్యార్థి దశలోనే కొత్త ఉత్సాహం కలిగించి కళా ప్రపంచాన్ని ఆవిష్కరింపజేయుగా లక్ష్మాగౌడ్‌గారు నేటికీ స్ఫూర్తినిస్తున్నారు. రమణారెడ్డి ద్వారా కళారంగంలో మెదక్‌జిల్లా విశ్వవిఖ్యాతమయింది.

# బాలరత్నం

శిల్పకళాకారుడయిన కొంపర్తి బాలరత్నం గారు మెదకు జిల్లాలో సిద్దిపేట రెవిన్యూ డివిజన్ పరిధిలోని పెద్ద కోడూరు గ్రామంలో శిల్పుల కుటుంబంలో జన్మించారు. ప్రముఖ చిత్రకారుడయిన కాపురాజయ్య వద్ద శిష్యరికం చేసి, హైదరాబాద్‌లోని ఫైన్ ఆర్ట్స్ కళాశాల నుండి శిల్ప నిర్మాణంలో డిప్లమా పట్టా పొందారు.

బాలరత్నంగారు మట్టి, మైనం, చెక్క, ఇత్తడి, వెండి, గాజు, సిమెంట్ మొదలగు పదార్థాలతో అద్భుతముగా కళాఖండాలను రూపుదిద్దుతారు. ఈయన ఇప్పటికి 100కు పైగా దారు శిల్పాలను మరికొన్ని ఇత్తడి శిల్పాలను మలిచారు. 1964, 66, 69,71 సంవత్సరాలలో లలిత కళాసమితి నిర్వహించిన రాష్ట్రస్థాయి పోటీల్లో ఇతని శిల్పాలకు ప్రథమ బహుమతులు వచ్చాయి.

వీరి శిల్పాలు హైదరాబాద్, మద్రాసు, బెంగుళూరు, న్యూఢిల్లీ మొదలగు పట్టణాల్లో జరిగిన రాష్ట్రస్థాయి, జాతీయ స్థాయి ప్రదర్శనల్లో ప్రదర్శింపబడ్డాయి. కొన్ని శిల్పాలు ఆంధ్రప్రదేశ్ లలితకళాసమితి, సాలార్‌జంగ్ మ్యూజియం మద్రాసు లలితకళా అకాడమీ మొదలగు ప్రముఖ సంస్థలలో ప్రదర్శింపబడుతున్నాయి. వీరి ప్రతిభకు నిదర్శనంగా ఎన్నో అవార్డులనందుకున్నారు. "అశోకవనంలో సీత" అనే దారు శిల్పానికి అఖిల భారత అవార్డు లభించింది.

వీరు శిల్పాలే కాక వెండితో వివిధ ఆభరణములను కూడా తయారు చేస్తారు. వీరి దారు శిల్పాలలో గణేశుడు, కాళీయమర్దనం, సర్కస్, ఏనుగు, కుటుంబం, తల్లీబిడ్డలు మొదలగునవి ప్రఖ్యాతినొందినవి. శిల్ప నిర్మాణ ప్రక్రియలో ఇంత ఘనత సాధించిన ఈయన ఉపాధ్యాయ వృత్తిలో ఉండడం ఎంతో హర్షణీయం.

## శ్రీమతి అంజనీ రెడ్డి

మెదకు జిల్లా చిత్రకళా ఉద్యానవనంలో పూసిన మరో విరజాజి అంజనీ రెడ్డి.

ఈ తరంలో వెలసిన మహిళా చిత్రకారిణి వెన్నవంటి అమ్మమనస్సుగల ఈమె బొమ్మలు అమ్మలను తలపిస్తాయి.

సాహిత్యానికి, చిత్రానికి అనుభవం అవసరమంటారు. స్వయంగా అనుభవించి చెప్పిన గీతం, స్వయంగా అనుభవించి గీసిన గీత అజరామరమైనది, ఆపాత మధురమైనది.

మెదకు జిల్లా సదాశివపేట మండలంలో నందికందిలో పుట్టిన అంజనీరెడ్డి జవహర్‌లాల్‌నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయానికి చెందిన లలితకళా కళాశాలలో పెయింటింగ్ గ్రాడ్యుయేషన్ పూర్తిచేసి అదే కళాశాలలో ఉపన్యాసకులుగా పని చేయుచున్నారు.

వృత్తిరీత్యా ఆమె మానవ మూర్తులను గీయడంలో సంప్రదాయ చిత్రికళను విద్యార్థులకు బోధిస్తుంటారు. అట్లే ప్రపంచ చిత్ర కళారంగంలో వస్తున్న మార్పులను, రీతులను సునిశితంగా పరిశీలించి సమకాలీన చిత్రకళారంగానికి విశేషమైన చిత్రాలను రూపకల్పన చేయడంలో కృషిచేస్తుంటారు.

రకరకాల గృహాలను, నివాసాలను కాన్వాస్‌పై కెక్కించి చూపరులకానందం కలిగించారు. అట్లే మనుష్యుల మనోభావాలను అందునా స్త్రీమూర్తుల హావభావాలను తనకుంచెలో కెక్కించి కాన్వాస్‌పై అక్రాలిక్ తైల వర్ణ చిత్రాలుగా, అపురూపమైన టెక్చర్‌తో గీయడం ఈమె చిత్రకళానైపుణ్యానికి గీటు రాళ్లని చెప్పవచ్చు.

1974 నుండి అనేక దేశ విదేశాలలో జరిగిన అనేక చిత్రకళా ప్రదర్శనలలో పాల్గొంటూ 1991 నుండి పలుమార్లు స్వయంగా చిత్రకళా ప్రదర్శనలను ఏర్పాటుచేసింది.

శ్రీమతి అంజనీరెడ్డి వేసిన చిత్రాలకు 1995లో హైద్రాబాద్ ఆర్ట్‌సొసైటీ అవార్డు, 1997లో ఎఫ్.ఎఫ్.సి.ఎస్. అర్ధశతాబ్ది ఉత్సవ అవార్డు, 1988 స్త్రీమేళా అవార్డు లభించాయి.

ఈమె చిత్రాలను దేశంలోని పలు ప్రముఖ మ్యూజియంలు, విదేశాలలో ఎందరో కళాహృదయులు సేకరించారు.

ఈ విధముగా శ్రీమతి అంజనీ రెడ్డిగారు వేయికిపైగా వివిధ రీతుల చిత్రాలనుగీసి నిరంతర చిత్రకళాసాధనలో కృషి సల్పుతున్నారు.

## జి. రాజేశం

విలక్షణమైన కళాకారుడు జి. రాజేశంగారు 1942లో మెదక్‌జిల్లా, సిద్దిపేట పట్టణంలో జన్మించారు.

కళాదృష్టికల వారి కనులకు అనవసరమైన వస్తువేది ప్రపంచంలో కనపడదని భావించి, పనికిరావని పారేసిన వస్తువుల నుండి అద్భుత కళాఖండాలను సృష్టించే జి. రాజేశంగారు ఆంధ్రప్రదేశ్ లలితాకళా సమితి అందించిన ఆర్థిక సహాయంతో చిత్రలేఖనం, శిల్పనిర్మాణం నేర్చుకున్నారు. కాపురాజయ్య, ఉస్మాన్ సిద్దిఖి వంటి ప్రముఖ కళాకారులు వీరి గురువులు.

రైసుమిల్లులో పారేసిన జల్లీలు, దీపపు చెమ్మెలతో ఒక గుడ్లగూబను సృష్టించారు. ఇది రాష్ట్ర స్థాయిలో బహుమతి పొంది జాతీయప్రదర్శనకు ఎంపికై జాతీయ ప్రదర్శనలో ప్రదర్శింపబడుతున్నది. వంటగదిలో ఉపయోగించే చెంచాలు, హారతులు, గిన్నెలు, ప్లేట్లు వంటి స్టీలు సామాగ్రినుపయోగించి జాతీయ పక్షి నెమలిని తయారు చేశారు. ఇది లలితకళా సమితి వారిచే బహుమతి నందుకొంది.

ఇవేకాక దారివెంట వెడుతూ ప్రక్కన కనపడిన చెట్ల వేర్లతో ఎటువంటి అతుకులు లేకుండా అద్భుత నైపుణ్యంతో శివతాండవం, ఉడుము, రష్యాలోని బాలే నృత్యం, విఘ్నేశ, వరాహ, విహంగములు మొదలగు శిల్పములను మలిచారు. వేర్లతోనే కాక మామూలు కర్రతో కూడా వీరు శిల్పాలను మలిచారు. అందులో "తల్లిబిడ్డ", "మల్లయోధుడు" ప్రసిద్ధాలు. ప్రస్తుతం వీరు లలితకళాసమితి కార్యవర్గ సభ్యులుగా ఉన్నారు.

## గౌరీశంకర్

మెదక్ జిల్లాలోని సిద్దిపేట పట్టణంలో 1942లో గౌరీశంకర్ జన్మించారు. అంతర్జాతీయ చిత్రకారుడయిన కాపురాజయ్య వద్ద శిష్యరికం చేసి చిత్రకళలో ప్రావీణ్యం సంపాదించి ప్రభుత్వం నిర్వహించే డ్రాయింగ్ లోయర్ గ్రేడ్ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. అంతేగాక ఎస్.సి.ఈ.ఆర్.టి. మరియు ఎన్.సి.ఈ.ఆర్.టి. లు సంయుక్తంగా నిర్వహించిన "బుక్ ఇల్యుస్ట్రేషన్" శిక్షణ పొందారు.

సిద్దిపేట లలితకళా సమితి నిర్వహించిన చిత్రలేఖన పోటీల్లో వీరు 1966, 67, 70 సంవత్సరాలలో మొదటి బహుమతిగెలుచుకున్నారు. మరెన్నో ద్వితీయ బహుమతులు, ప్రోత్సాహక బహుమతులు, నగదు అవార్డులు గెలుచుకున్నారు. 1970లో అఖిలభారత కళా ప్రదర్శనలో ఉత్తమ కళాకారుడిగా అవార్డు పొందారు.

వీరి పెయింటింగ్స్ ఆంధ్రప్రదేశ్ లలితకళా సమితి హైదరాబాద్ ఆర్ట్స్ సొసైటీ, గుంటూరు, గూడూరు, రాజమండ్రి, విజయవాడ వంటి ప్రాంతాల్లో కలకత్త, బెంగుళూరు, వంటి ప్రధాన నగరాలలో ప్రదర్శింపబడ్డాయి. న్యూఢిల్లీ, మద్రాసు నగరాల్లో జరిగిన రెండు 'కళామేళాలలో' వీరి చిత్రాల ప్రదర్శన జరిగింది. వీరి పెయింటింగ్స్‌లో కొన్నింటిని సాలార్జంగ్ మ్యూజియం ఆంధ్రప్రదేశ్ లలిత కళాసమితి మొదలయినవి సందర్శకుల కోసం ప్రదర్శిస్తున్నారు.

క్రియేషన్, స్వాధీనపతిక, మహిళ, సర్వమతసారం ఒక్కటే, విరక్తి, మధువు-మగువ మొదలైన చిత్రాలు వీరి చిత్రాలలో ప్రసిద్ధాలు.

వీరు ఉపాధ్యాయ వృత్తిలో ఉండి జిల్లా స్థాయి ఉత్తమ ఉపాధ్యాయునిగా అవార్డు పొందారు.

## ఎం.డి. రుస్తుం

మెదక్ జిల్లాలోని అల్వాల గ్రామంలో ఒక మధ్యతరగతి కుటుంబంలో ఎం.డి.రుస్తుంగారు జన్మించారు. ఈయన డ్రాయింగ్‌లో లోయర్ పూర్తిచేసి హయ్యర్ డిస్టింక్షన్‌లో పాసై జిల్లాలోనే ప్రథముడిగా నిలిచారు. డాక్టర్ కాపురాజయ్య శిష్యుడయిన ఐరేని నారాయణ ప్రోత్సాహంతో చిత్రకళాజీవితంలో ఎదిగారు.

కాన్వాసుపై వీరు గీసిన **40** చిత్రాలు ఉత్తమ కళాఖండాలుగా ఎంపికయి రాష్ట్ర, జాతీయ స్థాయిలలో జరిగిన వివిధ ప్రదర్శనలలో ప్రదర్శింపబడినాయి. **1977**లో న్యూఢిల్లీలో జరిగిన జాతీయస్థాయి ప్రదర్శనలో వీరు చిత్రించిన "మదర్ అండ్ చైల్డ్" అనే తైల వర్ణ చిత్రం ప్రదర్శింపబడింది. వీరి "పల్లెపడుచు" అనే తైలవర్ణచిత్రం **1996** లో హైదరాబాద్‌లో జరిగిన అఖిలభారత చిత్ర కళా ప్రదర్శనకు ఎంపికయింది.

జాతీయ సమైక్యత మానవతావిలువలు వీరి చిత్రాలలోని ప్రధాన అంశాలు తల్లితో ప్రకృతిని పోలుస్తూ ప్రకృతే మన జీవనాధారం అని నిర్దేశించే ఈయన గీసిన ఒక చిత్రానికి 'హైలీ కమాండెడ్' బహుమతి లభించింది. ఈయన కాన్వాసు పై గీసే తైల వర్ణచిత్రాలే కాకుండా ఎన్నో నవలలకు కవితా సంకలనాలకు పత్రికలకు ముఖచిత్రాలనందించారు. తన చిత్రాలతో సామాజిక చైతన్యం కలుగచేస్తూ కళాహృదయములను ఆకట్టుకుంటున్న రుస్తుం ప్రస్తుతం హైదరాబాద్ ఆర్ట్ సొసైటీలో జీవిత సభ్యులుగా ఉంటూ, తడ్కపల్లి ఉన్నత పాఠశాలలలో డ్రాయింగ్ అధ్యాపకులుగా పనిచేస్తున్నారు.

## బాబూరావు

కళాకారుడు బాబూరావు మెదకు జిల్లా గజ్వేల్ పట్టణంలో 1968 డిసెంబరు 2వ తేదీన జన్మించారు. ఇతని విద్యార్థిదశలోనీ పాఠ్యాంశాలలోని బొమ్మలు మరియు స్వాతంత్ర్య సమరయోధులు మొదలగు చిత్ర పటాలను వేస్తూ ఉపాధ్యాయుల తోటి విద్యార్థుల మెప్పును పొందేవాడు. బాబూరావు 1981లో హైదరాబాద్ మాసబ్‌ట్యాంక్‌లోని ఇంజనీరింగ్ కళాశాలలో చేరి 'చిత్రకళ' లో డిప్లొమా సాధించారు.

1989లో నాగ్‌పూర్ నిర్వహించిన ఆలిండియా ఆర్ట్స్ ఎగ్జిబీషన్ వారి జాతీయ స్థాయి చిత్రకళా పోటీలో ఏడువేల మంది పాల్గొనగా అందులో ఈయన గీసిన 'నెహ్రూ దృక్పథంలో ఆధునిక భారతదేశం' అనే చిత్రానికి ద్వితీయ బహుమతి లభించింది. 1991 జూలై నెలలో 'ఆలిండియా ఆర్టిస్టు డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్' వారిచే ఢిల్లీలో నిర్వహింపబడిన జాతీయస్థాయి చిత్రకళా పోటీల్లో ఇతని 'మాతృ ప్రేమ' అనే చిత్రానికి ద్వితీయ బహుమతి లభించింది. అదే విధంగా విజయవాడలో కళావాహిని సంస్థ నిర్వహించిన రాష్ట్రస్థాయి చిత్రకళా పోటీలో 'మనిషి మేధస్సు - ఏకాగ్రత' అనే అంశంపై బాబూరావు వేసిన చిత్రపటానికి ప్రథమ బహుమతి లభించింది.

కళ, కళ కోసం కాకుండ సామాజిక సమస్యలకు దర్పణమని ఈతని చిత్రాలు చెప్పకనే చెబుతాయి.

# మల్లేష్ బాబు

మెదకు జిల్లా కళాక్షేత్రంలో చిగురించిన బహుముఖ ప్రజ్ఞాశాలి మల్లేష్‌బాబు . ఈతడు లలిత కళలన్నింట చేయి తిరిగిన కళాకారుడు.

మల్లేష్‌బాబు సిద్దిపేటలో ఒక నిరుపేద కుటుంబంలో జన్మించినాడు. తల్లి శ్రీమతి శాంతమ్మ తండ్రి రచ్చరామయ్య చిన్నతనంలోనే చిత్రలేఖనం పట్ల అభిరుచి కల్గిన మల్లేష్ బాబుకు కనీసం కలర్ పెన్సిళ్లైనా కొని ఈయలేని ఆర్థిక దుస్థితి వారి కుటుంబానిది.

ఒకవైపు ప్రాథమిక విద్యచదువుతూ ఇండ్ల నక్షాలు వేయడం నేర్చుకొని అందులో ప్రావీణ్యం సంపాదించాడు.

ఉన్నత విద్యనభ్యసిస్తున్న కాలంలో ప్రఖ్యాత చిత్రకారులు శ్రీ కాపురాజయ్య, బాలిక్ బాలయ్యల వద్ద కొంతకాలం శిష్యరికం చేసి చిత్రకళలోని మెళుకువలు నేర్చుకొన్నాడు. ఎన్నో చిత్రాలుగీసి లలితకళ అకాడమీ ద్వారా బహుమతులందు కొనినారు.

1972లో ఢిల్లీ అకాడమీ వారు ఎంపిక చేసిన 12 మంది కళాకారుల బృందంలో ఒకడుగా రామప్పవెళ్ళి అక్కడి దృశ్యాలపై ఎన్నో చిత్రాలు గీసినాడు. నాటిలో చాలావరకు ఆంధ్రప్రభలో ప్రచురింపబడినవి.

రంగులు మేళవించడంలో సరికొత్త విధానాల నవలంబించి ఆకుపచ్చరంగు ఫ్యాబ్రిక్స్‌ను సృష్టించినాడు. మల్లేష్ బాబు చిత్రకళలోనేగాక కవిత్వంలో నటనలో మంచి పేరు సంపాదించినాడు.

ఉన్నత విద్యనభ్యసించే సమయంలో రావణబ్రహ్మ, అల్లూరి సీతారామరాజు మొదలగు ఏక పాత్రాభినయాలలో బహుమతులందుకొనిన రంగస్థల కళాకారుడితడు.

1964 సంవత్సరంలో ఉపాధ్యాయ వృత్తిలో చేరి తన విద్యార్థులకు విద్యనందించడంతో పాటు వారిలో కళాత్మక శక్తిని పెంపొందించుటకు వారిచేత నాటకాలు, బుర్రకథలు మొదలగునవి వేయిస్తూ చిత్రలేఖనం, పెయింటింగ్ లలో కూడా వారికి ప్రత్యేక శిక్షణనిచ్చి జిల్లాస్థాయి పోటీలలో పాల్గొనేటట్లు చేయుచున్నారు.

ఈ విధముగా శ్రీ మల్లేష్‌బాబుతాను కళాకారుడై, ఉపాధ్యాయుడై, కవియై, రంగస్థల నటుడై బహుముఖ కళా కోవిదుడుగా పేరు తెచ్చుకొనినాడు.

## భూమయ్య

గజ్వేల్ మండలం దాచారం గ్రామంలోని ఒక నిరుపేద కుటుంబానికి చెందిన భూమయ్య తన ఎనిమిదవ యేట నుండే ప్రారంభించి నేటి వరకు వందలాది చిత్రాలకు రూపకల్పన చేశారు. ఈయన ప్రకృతిలోని సౌందర్యాన్నే కాక మానవ విలువలనూ, సామాజికస్పృహను, అంటరానితనం, వరకట్నం, మద్యపాన నిషేధం, నిరక్షరాస్యత మొదలగు అంశాలపై అవగాహనను, చైతన్యాన్ని కలిగించే ఎన్నో బొమ్మలను చిత్రించారు.

వీరు ఎవరివద్ద శిక్షణ పొందకుండా కేవలం స్వయంకృషితోనే చిత్రకళలో ఇంతటి అభివృద్ధిని సాధించటం అభినందనీయం. 1996 ఫిబ్రవరిలో గజ్వేల్‌లో జరిగిన తాలూకాస్థాయి చిత్రలేఖన పోటీల్లో భూమయ్య ప్రదర్శించిన పుచ్చల్లపల్లి సుందరయ్య చిత్రానికి ప్రథమ బహుమతి లభించింది. అదే సమయంలో జిల్లా స్థాయిలో కూడా ద్వితీయ స్థానం పొందారు. అలాగే 1997 మార్చిలో లలిత కళాసేవాసమితి గజ్వేల్‌లో ఏర్పాటు చేసిన రాష్ట్రస్థాయి పోటీల్లో ప్రథమ స్థానం పొందారు. జన్మభూమి కార్యక్రమ సందర్భంగా నిర్వహించిన పోటిల్లో భూమయ్య తన చిత్రాల్ని ప్రదర్శించి ప్రశంసలనందుకున్నాడు. ఇతను గీసిన అక్షరాయుధం ప్రశంసలనందుకొంది.

భూమయ్య 1997లో డ్రాయింగ్ టి.టి.సి. లోయర్ గ్రేడ్‌లో ఉత్తీర్ణుడయ్యాడు. మే నెలలో ఆర్ట్స్ అకాడమీ నిర్వహించిన టి.టి.సి హయ్యర్ గ్రేడ్ పరీక్షల్లో ఉత్తీర్ణత సాధించారు.

## నరసింహాచార్యులు

అద్దంకి తిరుమలవంశోద్ధారకుడు వేంకటకృష్ణమాచార్య వసంత పుణ్యదంపతులకు నరసింహచార్యులు 28-05-1972 న జన్మించారు. వీరు బి.ఎస్సీ(ఎం.పి.సి), ఎం.టెక్., విద్యార్హతలు కలిగి ఉన్నారు. చక్కని చిత్రకారులు, సర్వేపల్లి చిత్రమునకు అవార్డు అందుకున్నారు. వీరు దాశరథిరంగాచార్య ఋగ్వేదంకవరు పుటపై వేదాల చిత్రపటం అత్యంత సుందరంగా చిత్రించినారు. వీరు ప్రస్తుతం సింగపూర్‌లో సాఫ్ట్‌వేర్ ఇంజనీయర్‌గా పనిచేస్తున్నారు. వివిధ దృక్కోణాలతో ఎన్నో ముఖ చిత్రములను వేసినారు. న్యూయార్కులో వీరికి ప్రత్యేక బహుమతి లభించింది. ప్రస్తుతము అమెరికాలో నివసిస్తున్నారు.

# సంగీత కళ

తమ దివ్యమైన గానంద్వారాను, అమోఘమైన హరికథా ప్రవచనం ద్వారానూ శ్రీ ఉమాపతి నారాయణ శాస్త్రిగారు శ్రోతల్ని మంత్రముగ్ధుల్ని చేసేవారు. ఆయన పాడుతూ వుంటే సర్పాలు నాట్యం చేసేవి అనీ, శ్రోతలు మైమరచిపోయేవారనీ, ఇప్పటికి అప్పటి తరం వాళ్ళు ఆయనని ప్రశంసిస్తూ ఉంటారు. శ్రీ దేశపతి సీతారామశర్మగారు హిందుస్తానీ గాత్ర సంగీతంలోనూ హరికథా గానంలోను సిద్ధహస్తులు.

ఒకతరం వెనుక సంగీత ప్రియులంతా చేరి శ్రీ శారదా సంగీత నాట్య కళాసమితి ని స్థాపించి వారం వారం ఒక సంగీత సభ నిర్వహించేవారు. శ్రీయుతలు హరిపురం వేంకటరామయ్యపంతులు, కొమురవెల్లి చంద్రమౌళి, చలంగారి సదాశివరావు ఈ సమితి నిర్వాహకులలో ప్రముఖులు. శ్రీ ఉమాపతి పద్మనాభ శర్మగారు ఈ సభలలో తరచుగా పాడుతూ ఉండేవారు. శ్రీ బెజుగం వెంకన్న మంచి హార్మోనిస్టుగా పేరు పొందాడు. శ్రీ సదాశివరావు తమ సహజ మధుర గాత్రంతో శ్రోతల్ని ఆకట్టుకునేవారు. శ్రీ గణేశ్వరశర్మ మరియు శ్రీ పద్మనాభశర్మ వేణువు వాయించేవారు.

శ్రీ బుడంపాటి రామకృష్ణశాస్త్రిగారు వాయులీన్ విద్వాంసులు. కర్ణాటక శైలిలో వారి వాయులీన్ వాదన ఇప్పటికి శ్రోతల్ని రంజింపజేస్తూ ఉంది.

ప్రస్తుతం ఔత్సాహిక యువకళాకారులు 'పల్లవి ఆర్ట్స్' అనే సంస్థను స్థాపించి వివిధ సంగీత సాహిత్య సమావేశాలు నిర్వహిస్తున్నారు. శ్రీయుతులు అష్టకాల రామమోహనశర్మ, శ్రీకాంత శర్మ మొదలైనవారు దీని నిర్వాహకులు. ఈ సంస్థ పక్షాన స్వీయ సంగీత దర్శకత్వంలో శ్రీ దేశపతి శ్రీనివాసశర్మ, శ్రీ రామగిరి శివకుమార శర్మ, రెండు చక్కని క్యాసెట్లు వెలువరించారు. సిద్దిపేటలో సంగీతానికి మొట్టమొదటిసారిగా ఒక రూప మంటూ యిచ్చింది వీరే అని చెప్పాలి. వీరుగాక జహీరాబాదులో శ్రీ రాంభట్ జ్యోషిగారు హిందుస్తాని రీతిలోను సంగారెడ్డిలో రామస్వామిగారు కర్ణాటక, లలిత సంగీత రీతులలోను అనన్య సాధనగావించినారు.

శివ్వంపేట మండలంలో పెద్దగొట్టిముక్ల గ్రామంలో జన్మించిన రామాచారి యువగాయకుడు. తన గాత్రంతో టి.వీ.లో అనేక పర్యాయాలు ప్రదర్శనలిచ్చి శ్రోతలనుమైమరిపింపచేస్తారు. తూప్రాన్ నివాసులైన శ్రీమతి కాసుల అనసూయా కృష్ణమూర్తిగారు, వీరిద్దరి కుమారులు. కర్ణాటక, లలిత సంగీతాలలో గొప్ప ప్రతిభకలవారు.

## దేశపతి శ్రీనివాస శర్మ

సిద్ధిపేటలో జన్మించి గుర్రాలగొంది జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో ద్వితీయ శ్రేణి తెలుగు పండితుడుగా పనిచేస్తున్న శ్రీనివాస శర్మకు సంగీత సాధన ఊపిరిలాంటిది. ఆయన సంగీత సాధన 1980లో ఆరంభమైంది. హార్మోనియం, డోల్కీలతో సంగీత సాధనకు శ్రీకారం చుట్టిన శ్రీనివాసశర్మ ఇప్పటికి 50 ఆడియోకాసెట్లకు ఆడియో సహకారాన్ని అందించారు. బాల గీతాంజలి, సాధన, స్వర సంగమం ఆడియో కాసెట్లు శ్రీనివాస శర్మ ఆశయం. 1998,1999,2000 సంవత్సరాల్లో, జరిగిన త్యాగరాజ సంగీతోత్సవాల నిర్వాహణలో మరుకుగా పాల్గొన్నారు. దూరదర్శన్ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. 1992లో మంజీర అక్షర ప్రభ కార్యక్రమాల్లో పాలుపంచుకున్నారు. శ్రీనివాసశర్మకు అరుణోదయ ఉగాది పురస్కారం (2000 మే) లభించింది.

## రుక్మాభట్ల నర్సింహస్వామి

పండితపామర రంజకంగా పదాలనల్లి పాడి పేరొందిన విధువరౌళి శాస్త్రిగారి తనయులు నర్సింహస్వామిగారు.

వీరు చిన్నతనాన కర్ణాటక సంగీతాన్ని గురువుముఖతః అభ్యసించినారు. అనేకమైన భక్తిగేయాలు, మంగళహారతులు రచించినారు.

తండ్రి తందనాన రామాయణం వ్రాసి ప్రజలకంకితం చేస్తే తనయుడు గేయ రామాయణాన్ని వ్రాసి తనకమ్మని కంఠంతో పాడి ప్రజలనలరింప జేయుచున్నారు.

సీరి గేయరామాయణం క్యాసెట్‌లో రికార్డు చేయబడింది.

# నాటకీయం

## నాటక కళ

చరిత్ర కందినంతవరకు ఈశతాబ్ద ప్రారంభంలో అప్పటి యువకులు శ్రీయుతలు సుబ్బేపల్లి నాగమల్లయారాధ్యులు, గౌరీభట్ల మెట్టురామ జోషి ఉమాపతి నారాయణ శాస్త్రి, అష్టకాల నరసింహయ్యలు బెజుగం లింగయ్య మొదలైనవారు మంగమ్మ ధర్మశాల విశాలమైన ఆవరణలో ఒక్క తాత్కాలిక నాటకశాలను నిర్మించారు. వీరందరూ ఔత్సాహికులే అయిన వృత్తికళాకారులకు సాటిగా జనరంజకంగా నాటక ప్రదర్శన నిర్వహించేవారని అప్పటి తరంవాళ్ళు కొందరు ఆ రోజుల్ని ఒక మధురస్మృతిగా జ్ఞాపకం చేసుకుంటూ వుంటారు.

ఆ తరువాత తరంవాళ్లైన శ్రీయుతులు డా.ఎం. కృష్ణారావు. వేంకటస్వామి, టైపిస్టు నాగభూషణం మొదలగువారు బొబ్బిలియుద్ధం వంటి నాటకాలు ప్రదర్శించి ప్రేక్షకులను మెప్పించారు. శ్రీయుతలు రామగిరి గణేశ్వర శర్మ, కె.వి. రమణ, ఉమాపతి పద్మనాభశర్మ, సితాల శ్రీకాంత శర్మ, గౌరీభట్ల మెట్టురామశర్మ తదితరులు ఒక దశాబ్దం క్రింద రెండు మూడు తడవలు ప్రదర్శింపబడిన భువన విజయం ప్రదర్శన రసికుల నలరించింది. శ్రీ ఉమాపతి బాలాంజనేయ శర్మ (ఆకాశ వాణి కళాకారులు) పెక్కు నాటకములు రచించి నటించి రేడియోలోనూ, దూరదర్శన్‌లోను ప్రసారం చేశారు. 1960లో పాఠశాల నాటకపోటీలు జిల్లా స్థాయిలో మహావైభవంగా జరుగుతూ వుండేవి.

నాటక కళకు ఎందరో తమ ప్రజ్ఞాపాటవ ప్రాణం పోసి మెదక్ జిల్లాకు రాష్ట్ర స్థాయిలో ప్రత్యేక స్థానాన్ని అందించారు. రాష్ట్ర స్థాయిలో అనేక పరిషత్తులలో మన జిల్లా నుండి ప్రాతినిధ్యంతో ఎన్నో ఉత్తమ బహుమతులను సంపాదించి పెట్టారు. ఎందరో కళాకారులున్నా, లభించిన సమాచారం ప్రకారం ఈ క్రింది వారు "నాటకం" కొరకు ఎంతయో కృషి చేసినారు.

1. సర్వశ్రీ కలబ్‌గూర్ జనార్ధన్ (కలబ్‌గూర్)
2. ,, ధర్మవరపు రాంగోపాల్ (సంగారెడ్డి)
3. ,, చేపూరి నారాయణ (సంగారెడ్డి)
4. ,, ఆర్ శంకర్ (సంగారెడ్డి)
5. ,, బి. కనక రాజు (సంగారెడ్డి)
6. ,, కే. లక్ష్మీ నారాయణ (జోగిపేట)
7. ,, నెమ్మాని మోహన మూర్తి (సంగారెడ్డి)

## జనార్ధన్

వీరికి చారిత్రాత్మక నాటకాలకు పెట్టింది పేరు. అప్పాజీ - బ్రహ్మనాయుడు - ప్రతాపుడు మొదలగు పాత్రలకు ప్రాణ ప్రతిష్ఠ చేసిన లబ్ధ ప్రతిష్ఠుడు.

## ధర్మవరపు రాంగోపాల్

నాటక కులపతి - నాటక బ్రహ్మ - జీవనాటక కర్త కీ. శే. శ్రీ ఎ. ఆర్. కృష్ణ, దర్శక శ్రేష్ట శ్రీ దేశిరాజు హనుమంత రావుగారి శిష్యరికంలో ఆంధ్ర రాష్ట్రంలో గర్వించే రీతిలో పేరెన్నిక గని, 1982 నుండి ఎన్నో నాటకాలకు దర్శకత్వం వహించి, నటించి ప్రేక్షకుల మన్ననలు పొందడమే కాకుండా "మాభూమి" చిత్రం లో నటిచిన సహజ నటుడు.

## చేపూరి నారాయణ

ప్రతి నాయకుడి ప్రజల హృదయాల్లో సుస్థిర స్థానాన్ని సంపాదించుకుని నటునిగానే కాకుండా నాటక రచయితగా, చీకటి చీల్చిన కిరణం - 20 రంగుల ఇంద్రధనుస్సు లాంటి నాటక రచనలు చేసిన వీరగంభీర నటుడు - దర్శకుడు.

## ఆర్. శంకర్

కథానాయకునిగా సుందర విగ్రహంతో చక్కని వాచికంతో రంగస్థలాన్ని రంజింప జేయటమే కాకుండా - రంగాలంకరణ అవసరమైన సెట్టింగులను స్వతహాగా తయారు చేయగల సమర్థుడు.

## బి. కనకరాజు

నౌకరు - ముసలి పాత్రలు ఈతని గురించే సృష్టింప బడ్డాయా ? అన్నట్లు మనుసును కుదిపేసే పాత్రలకు తన సహజ నటనాపాటవంతో వన్నెతెచ్చే నటుడు.

## కె. లక్ష్మీనారాయణ

ఈయనకు మారు పేరు పూలరంగడు. అంత గుర్తింపు పూలరంగడు నాటకంలోని అతని నటనకు మెచ్చి యిచ్చినది. ఎన్నో నాటకాలు ప్రదర్శించి "నాటకాల మనిషి" అయ్యాడు.

## నెవర్మాని మోహన మూర్తి

ఏకబిగిన గంటల తరబడి డైలాగ్స్ చెప్పినా యిసుమంత జీరబోని కంచుకంఠం ఆతనికి దైవ ప్రసాదితం అయితే నాటకమంతా కంఠస్థం చేయగల కృషీవలుడు. వీటికితోడు, కార్యక్రమ సంధాన కర్తగా, కవిగా, దర్శకునిగా తన విశ్వరూపం ప్రదర్శించిన మోహన మూర్తి మెదక్ జిల్లాలో తన వంతు కృషి జరిపిన నటుడు.

## సినిమాటోగ్రఫి
## బి. నర్సింగ్‌రావు

మెదకు జిల్లాలో చిత్రరంగాన అంతర్జాతీయ స్థాయి గుర్తింపునంది తనదంటూ ఓ ప్రత్యేక శైలిని ప్రదర్శించిన మనీషి బి. నర్సింగ్‌రావు. ఆయన గజ్వేల్ మండలంలోని ప్రజ్ఞాపూర్ గ్రామంలో ధనిక భూస్వామ్య కుటుంబంలో తేది. 26-12-1946న జన్మించెను. వీరి తండ్రి భూపతిరావు గారు.

బి. నర్సింగ్‌రావు స్వగ్రామమైన ప్రజ్ఞాపూర్ లో నాల్గవ తరగతి వరకు చదివి 3 కి.మీ దూరము నగల గజ్వేల్ లో 7వ తరగతి వరకు ప్రభుత్వ పాఠశాలలో చదువుకొన్నారు. ఆయన 12 వ ఏట హైద్రాబాద్ పాలివేరలోని అల్వాల్‌కు చిన్నాయన గ.రైన రామచంద్రరావుకు దత్తపుత్రునిగా వెళ్లారు.

నర్సింగ్‌రావు భూస్వామ్య కుటుంబంలో జన్మించినా, ఆవ్యవస్థకు భిన్నమైన రీతిలో ఆలోచనా తరంగాలు వీరి మదిలో మెలిచేవి. ఫ్యూడల్ మనస్తత్వంపై "నీ గోరికడతంకొడుకో నైజాము సర్కరోడా" అనే అలనాటి గర్జన వీరి చెవిలో గింగురుమనేది.

ప్రకృతి నర్సింగ్‌రావు ఊపిరి. చిత్రాల విచిత్రాన్ని తన కుంచె ద్వారా ప్రదర్శించిన ఈ కలాకారుడికి చిత్రరంగం పై దృష్టిపడి వినూత్న ప్రయోగాలకు మార్గదర్శకమైంది.

ఆరుద్రకార్తిలోని ఆరుద్రపురుగులను ఆశ్చర్యంగా చూస్తూ బాల్యం అంతా ప్రకృతి ఒడిలో గడిపారు. అందుకే నర్సింగ్ రావు గారి హృదయం నవనీత కోమలం.

పుట్టింది దొరల లోగిల్లోనైనా 'దొరానీ కాల్మొక్తా' అనే పదాలు ఆయనకు నచ్చవు.

సమాజం గురించి, సమాజానికి మేధావి వర్గం చేయవల్సిన చేయూత గురించి ఆయనలో అనేక తపన. మేధావి వర్గాలు సమాజానికి తమ మేధాశక్తిని ధారపోయాలని ఆయన ఆకాంక్ష.

తన భావాలను సమాజాని కందించాలనే ఉద్దేశంతో అందరికీ అందుబాటులో ఉండే చలనచిత్రరంగాన్ని ఎంచుకొన్నారు.

'మాభూమి' చిత్రం ద్వారా పల్లెపట్ల అందాలనే కాదు పల్లీయుల మనస్తత్వాన్ని లోకానికి అందజేశారు.

**'రంగులకల'** చిత్రానికి నిర్మాత, దర్శకుడు, కథకుడు, నటుడు, సర్వస్వంతానై తనలోని రంగుల కళను ప్రపంచానికి పంచాడు.

**'మట్టిమనుషులు'** చిత్రంలో సామాన్య మనష్యుల అంతరంగాన్ని, 'దిసిటీ' డాక్యుమెంటరీ, 'మా ఊరు' డాక్యుమెంటరీ చిత్రాలు విభిన్న వాతావరణాలను భిన్న భిన్న మనస్తత్వాల సమాహారాన్ని అందిస్తాయి.

నర్సింగరావు చిత్ర నిర్మాతనే కాదు గొప్ప చిత్రకారుడు కవి. వీరి రంగుల కల పుస్తకం వీరిలోని చిత్రకళా నైపుణ్యాన్ని, దాగిన కవితా మాధుర్యాన్ని అందిస్తుంతుంది.

నర్సింగరావు గారు రష్యా, జర్మనీ, జెకోస్లేవేకియా, ఇటలీ, అమెరికా, కెనడా వంటి ఇతర దేశాల పర్యటనగావించి భారతీయ చిత్ర కళావైభవాన్ని ప్రపంచానికి చాటిచెప్పినారు.

జవహరలాల్ నెహ్రూ యూనివర్సిటీ న్యూఢిల్లీ, ఫిల్మ్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇండియా, పూనా; రైస్ యూనివర్సిటీ అమెరికా, ఇండోసోవియట్ ఫ్రెండ్ షిప్ సెంటర్ మాస్కో, ఆంధ్రప్రదేశ్ లోని అన్ని యూనివర్సిటీలలో భారతీయ చిత్రకళా వైభవాన్ని గురించి ప్రసంగించారు. ఎన్నో కమిటీలలో సభ్యుడై తన భావాలను ప్రజలకందించారు.

ఈయనకొచ్చిన అవార్డులు లెక్కలేనన్ని. వీరి 'రంగులకల' కు ప్రాంతీయ చిత్రాలకిచ్చే జాతీయ అవార్డుతో పాటు ఇండియన్ పనోరమా ఇంటర్ నేషన్ల్ ఫిలిం ఫెస్టివల్ 1984 లో పాల్గొనుట జరిగింది. 'ది సిటీ' డాక్యుమెంటరీకి రజితనంది బహుమతిని, 'దాసి' సినిమాకు ఐదు ఉత్తమ బహుమతులు లభించాయి. తీసినప్రతి సినిమాకు గీసిన ప్రతి చిత్రానికి ప్రజలచే నీరాజనాలందుకొన్న శ్రీ నర్సింగ్‌రావు మెదకు జిల్లావాడు కావడం మెదకు జిల్లాకే గర్వకారణం.



**Ln. Dr. P.V. CHARY**

**Dist. Governor 1999-2000**



బి. నర్సింగ్‌రావు



శ్రీ సి.హెచ్. ముత్యంరెడ్డి, శాసనసభ్యులు-దొమ్మాట



గౌ॥ శ్రీ కె. చంద్రశేఖర్‌రావు, శాసనసభ్యులు-సిద్దిపేట



కళాకారులు : జి. రమేష్‌లాల్ - పేరిణి శివతాండవం    జన్మస్థలం : సిద్ధిపేట



అలంకరణలో భాగంగా జడ ముగింపు

# అల్లాణి శ్రీధర్

అందరు చేసేపనికన్నా కొందరు చేసే పని మిన్న అనుకొన్న అల్లాణి శ్రీధర్ మెదకు జిల్లా జిన్నారం మండలంలో జన్మించారు.

హైద్రాబాదులో విద్యాభ్యాసాన్ని గావించినారు. చదువుకునే సమయంలోనే నాటకాలపై, సినిమాలపై ఆసక్తి చూపించేడివారు. రేడియో అన్నయ్య న్యాయపతి రాఘవరావు గారి 'ఆంధ్ర బాల సంఘంలో సభ్యులుగా చేరి నాటకాల గురించిన అవగాహన అలవర్చుకొన్నారు.

'నాన్నగారొస్తున్నారు' అనే నాటకాన్ని వ్రాసి బాలానంద సంఘం పోటీలో ఉత్తమ బహుమతి నందినారు. 'యువమిత్ర' అనే సంస్థను మిత్రులతో స్థాపించి 'మరో ప్రపంచం పిలిచింది' అనే నాటికను వ్రాసి దర్శకత్వం వహించి ఇండియన్ నేషనల్ థియేటర్స్ వారి జాతీయ స్థాయిపోటీలో బెస్ట్‌స్క్రిప్ట్, బెస్ట్ డైరక్టర్ అవార్డు లనందుకొనినారు.

'ఉదయండైలీ' కోసం విద్యార్థి రాజకీయాలపై పరిశోధించి వ్రాసిన "క్యాంపస్ - క్యాంపస్" డైలీ సీరియల్ ఆతర్వాత 'యంగ్ ఇండియా' ఎందరో పాఠకుల ఆదరాభిమానాలను పొందినది.

ఉదయం వీక్లీ ఎడిటర్‌గా కొంత కాలం అల్లాణి శ్రీధర్ పనిచేసి ఆ పత్రికకు చక్కని కీర్తి ప్రతిష్ఠలను తెచ్చుటేగాక ఉగాది ప్రత్యేక సంచికల వంటి సాహితీ విలువలుగల పత్రికగా సర్క్యులేషన్ పెంచినారు. పాత్రికేయుడిగా ఇంటర్నేషనల్ ఫిలిం ఫెస్టివల్‌కు హాజరై ఎన్నో సినిమాలు రివ్యూ చేసినారు. ఈ సమయంలోనే సినిమాలలోని కళాత్మకత, ఆధునిక సాంకేతిక నైపుణ్యం ప్రాచుర్యము గలిగిన అనేక సినిమాలు చూసి చలనచిత్రరంగాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసిరి.

నిజాందమన నీతిని ప్రతిఘటించి, ఆదిలాబాద్ అడవుల్లో గిరిజనుల గుండెల్లో చిరస్థాయిగా నిలచిన గిరిజన వీరుడు 'కొమరంభీము' జీవిత కథను చలనచిత్రంగా మలచి ఉత్తమ దర్శకుడిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వముచే బహుమతి నందుకొనిన శ్రీదర్ బహుధాశ్లాఘనీయుడు.

'సాయిశరణం' సీరియల్ టీ.వీ. రంగంలో సూపర్ హిట్ డైరక్టరుగా స్థానాన్ని స్థిరపరచుకొని 'కవిపరంపర' 'శభాష్ బేబి' ఆదిపరాశక్తి వంటి టీ.వి. సీరియల్స్‌కు దర్శకత్వం వహించి చిన్నతెరపై కూడా ఎన్నెన్నో వన్నె చిన్నెల్ని చూపించి తనకంటూ ప్రత్యేకమైన స్థానాన్ని సంపాదించు కొన్న శ్రీధర్ ఒక గొప్ప కళాతపస్వి.

అల్లాణి శ్రీధర్ ఇండియన్ నేషనల్ థియేటర్స్ వారి ఉత్తమ బహుమతి పొందిన దర్శకుడు, రచయిత, సికింద్రాబాద్ ఫిలిం సొసైటీ కార్యదర్శి, ఉదయం వీక్లీ ఇంచార్జి, ఎడిటర్ దూరదర్శన్ ప్యానల్ డైరెక్టర్, ఫ్రీలాన్స్ కార్టూనిస్ట్ ఇంకా ఎన్నో, మరెన్నో కార్యక్రమాలలో భాగస్వామి.

ఇంత చిన్న వయస్సులో ఇన్నింటిని సాధించిన అల్లాణి శ్రీధర్ తనకు దాసరి నారాయణరావు, బి. నర్సింగ్‌రావులు గురుతుల్యులని చెప్పుకొంటారు.

నిగర్వి, నిష్కపటుడు, నిరాడంబరుడైయిన అల్లాణి శ్రీదర్ మున్ముందు ఇతోధిక కీర్తి ప్రతిష్ఠలనందుకొని జననీ - జన్మభూములకు చిరకీర్తినందించాలని ఆకాంక్ష -

# మెదకు జిల్లాలో జానపద కళలు

## జానపద సాహిత్యం

ఏ కళ ఐనా ఆత్మానందాన్ని కలిగించాలి. అది కళ ధర్మం. పల్లెల్లో నివసించే పల్లీయుల ఆనంద తాండవాలు వారి కళలలో గోచరిస్తాయి.

జనపదం అనగా పల్లె. జనపదాల్లో నివసించేవారు జానపదులు - జానపదులు ప్రదర్శించే కళలే జానపద కళలు. ఈ జానపద కళ ఏనాటి నుండి ఆవిర్భవింపబడింది అని చెప్పడం కష్టం. ఎవరు ఈ కళకు సృష్టికర్త అని చెప్పడం కూడా కష్టమే. ఏమైనప్పటికి, ఎన్నడు పుట్టినప్పటికి నేటికి సజీవంగా జనుల నోళ్లల్లో నిలిచిపోయిన సహజ కళగా జానపద కళను చెప్పవచ్చు.

మెదకు జిల్లాలో జానపదకళాకారులు నాటి నుండి నేటికి ఉన్నారు. ఈ కళలో నిష్ణాతులై ఆంధ్రదేశంలోనేకాక వివిధ రాష్ట్రాలలో కూడా తమ ప్రతిభను చాటిన కళాకారులు మెదకు జిల్లాలో ఉన్నారు. అంతేకాదు రాష్ట్రపతి చేతులమీదుగా బహుమానాలనందుకున్న చరిత్ర మెదకు జిల్లాకు ఉంది.

మెదకు జిల్లాలో నేటికి ప్రజలలో బహుళ ప్రచారంలోనున్న జానపద కళలు.

1. బాగోతం (యక్షగానాలు)
2. చిందుబాగోతం
3. దేవీ బాగోతం
4. చిరుతల రామాయణం

ఇవన్నీ నాటకాలవంటివి. రాత్రులలో గ్రామం మధ్యలో చాందినీ కట్టి కళాకారులు వేషాలు వేసుకొని పాటపాడుతూ, నృత్యం చేస్తూ, వచన రూపంలో సంభాషణను కొనసాగిస్తూ కథాగానం చేస్తారు. ఈ బాగోతులను చూడడానికి గ్రామంలోని పిల్లలూ పెద్దలు అందరూ చేరుతారు. ఇది ఒక వినోదం.

చిరుతల రామాయణం ఆడేవారు వేషాలు వేసుకొంటారు. చిరుతలు చేతిలో ధరిస్తారు. మధ్యన ఒక కట్టెపాతి దానిచుట్టూ తిరుగుతూ చిరుతలు వాయిస్తూ పాటలు పాడుతూ నృత్యం చేస్తూ కథాగానం చేస్తారు.

ఈ పై కళలు ప్రదర్శించడానికి కళాకారులు చాలా మంది అవసరం. వారు ప్రదర్శించే కథా ఘట్టంలోని పాత్రలెన్నో అంతమంది అవసరమౌతారు. వీరుగాక ఒక మృదంగ వాద్యకారుడు (మద్దెల వాయించేవాడు), ముగ్గురోనల్గురో చిటితాళాలు వాయిస్తూ నటుడు పాడిన చరణాన్ని తిరిగి పాడుతుంటారు. ఒకడు సృతిపెట్టె వాయిస్తుంటాడు.

వీరు ఎవరి వేషాలను వారే ధరిస్తారు. మేకప్ తదితరాలు ఎవరికివివారే చేసుకొంటారు.

పల్లెల్లో టి. వీ. లు చేరినప్పటికిని అక్కడక్కడ సజీవంగా ఈ కళలు ప్రదర్శించ బడుతూనే ఉన్నాయి.

ఇవికాక ఇంకా పల్లెలో ప్రదర్శింపబడే కళలు.

*గొల్లసుద్దులు*

*బుర్రకథ*

*ఒగ్గుకథ*

ఈ కళలు ప్రదర్శించుటకు ఎక్కువ మంది కళాకారుల అవసరం ఉండదు. ముగ్గురు కళాకారులు చాలు. ఇద్దరు వాద్యకాళ్లు, ఒకడు కథాగాయకుడు. కథచెప్పే నాయకుడు పాడిన పాటకు తందాన తాన అనో, మరో విధంగానో శృతి కల్పుతూ వాద్యం వాయించడం తోటి కళాకారుల పని.

### కోలాటం

ఈ కళ ఒక చక్కని వినోదాత్మకమైన కళ. కళాకారులు కోలలు (ఒకటి లేదా రెండు కర్రలు) వాయిస్తూ తాళానికి అనుకూలంగా చిందులు వేస్తూ గానం చేస్తూ చుట్టూరా తిరుగడం కోలాటం అంటారు.

### జడకొప్పు

కోలాటంలో జడకొప్పు వేయడమనేది ఒక ప్రత్యేకమైన కళ. ఆరితేరిన నేర్పరులైన కోలాటకాళ్లు మాత్రమే ఈ కళను ప్రదర్శించగల్గుతారు. కళాకారులంతా ఆడుతూ జడకొప్పు ఆకారంలోనికి వచ్చి మెల్లమెల్లగా విడిపోవడం ఈ కళలో ప్రత్యేకత.

ఇవన్నీ ప్రదర్శించే కళలైతే పాడే పాటలు అనేకం. బండి కొట్టేటప్పుడు, మోటకొట్టేటప్పుడు, కలుపు తీసేటప్పుడు, వరి కోసేటప్పుడు, ముఖ్యంగా తూర్పార బట్టేటప్పుడు పాడేపాటలు ఎన్నో ఉన్నాయి.

మెదకు జిల్లాలో జానపద సాహిత్యంలో లబ్ధ ప్రతిష్ఠులైన వారెందరో ఉన్నారు. ఇందులో ముఖ్యమైన యక్షగాన కవులు పేర్కొనబడుచున్నారు.

### కందాళ సుందరాచార్యులు

కందాళ సుందరాచార్యులు క్రీ.శ. 1864లో జిన్నారం మండలం నల్లవల్లి గ్రామమున జన్మించెను. వీరి తల్లిదండ్రులు అలివేలమ్మ శేషాచార్యులు. ఆచార్యులు కొంతకాలం నల్లవల్లిలోను ఆతర్వాత గుమ్మడిదల గ్రామంలోను తన జీవనమును గడిపెను. ఈయన వైద్యవృత్తిలో జీవనం సాగించుచుండెను.

ఆచార్యుల వారు సంస్కృతాంధ్రములందు ప్రవేశము కలవారై చక్కని కవితా ధోరణి కలవారు.

1. ధర్మజరాజసూయము
2. సంపూర్ణరామాయణము
3. పుష్పవేణీ విలాసము
4. తిరుమంగ యాళ్వారు చరిత్ర
5. హాస్యవైద్య శతకము
6. అనేకమైన మంగళ హారతులను వీరు రచించిరి.

ఆ రోజులలో కొందరు నాటక సంఘముల వారు తమకై కవులచే కొత్త కొత్త నాటకములు, యక్షగానములు వ్రాయించుచుండిరి. ఇది ఒకరకముగా కవిపోషణయన వచ్చును.

ధర్మజ రాజసూయము శివంపేట నాటక సంఘమువారు వ్రాయించి ప్రదర్శించిరి.

'పుష్పవేణీ విలాసము' ఇది ఒక నాటకము. ఇది ఒక ప్రబంధకథ వలె స్వకపోల కల్పితము. ఈ గ్రంధము చక్రవర్తుల వెంకట నర్సింహాచార్యులకు అంకితమీయబడినది. ప్రతిఫలముగా కవికి పల్లకిలో ఊరేగింపు నూటపదుహారు రూప్యముల సన్మానము గావింపబడినది.

### సంపూర్ణ రామాయణము

ఈ యక్షగానమున కొత్తకొత్త విషయాల నెన్నింటినో కవి ప్రస్తుతించినాడు. జనులనానుడిలో నున్న విషయాలను గ్రంధస్థము గావించినాడు. ఉదాహరణమునకు సీతా స్వయంవరమునకు కార్త వీర్యార్జునుడు, రావణుడు వచ్చినట్లు వ్రాసినాడు.

ఇది ఒక చక్కని యక్షగానము. కాని సంపూర్ణముగా అలభ్యము.

### హాస్యవైద్యశతకము

ఈ శతకము హాస్యభరితమైనది, వైద్య సంబంధమైనది. కొన్ని పద్యములు 5 పాదములతో గలవు. వైద్యవృత్తిలో జీవించు చుండిన కవి రోగములకు ఔషధములు హాస్య ధోరణిలో చెప్పెను.

ఉదాహరణకు

కం॥ అంతక సన్ని జనించిన
చింతాకురసంబు జముడు జిల్లెడు పాలున్
వింతగను నూనె తుద్దము
కొంతమొసంగినను జనును కోరిన మెడకున్

గీ॥ పడిశంబట్టినవాని పాతర్లబడవేసి
మీద బండెడంత చెత్తవేసి
అందులో రవ్వంత అగ్నిహోత్రము వేయ
పడిశమొదవి వాడు పిడుచగట్టు -

### వానమామల నరసింహదాసు

వానమామల నర్సింహదాసు శివంపేట మండలమునందలి పెద్దగొట్టిముక్కుల గ్రామంలో జన్మించెను. ఈ కవి చాత్తాద వైష్ణవుడు. ఈతని తల్లిదండ్రులు వెంగమాంబా కిష్ఠయ్యలు.

నర్సింహదాసు 'బలిచక్రవర్తి చరిత్రము' అను యక్షగానమును రచించెను. ఈ పుస్తకమును చందానారాయణ శ్రేష్ఠి 1955న ముద్రణ గావించెను.

ఈ యక్షగానము సరళ సుబోధకమై చక్కని పదలాలిత్యముతో నొప్పారుచున్నది. ఇందులో తెరలోపలి దర్వు, తెరవెడలు దర్వు, సంవాదములు, కందార్థద్విపదలు, సీస, కంద, గీత పద్యములు కలవు.

వచ్చునకొక పద్యము.

గే. మంచి మాటలు చెప్పిన మాన్యులకును
కోపమెందైనవచ్చును కొదవలేక
చెడ్డతనమును బోధింప దొడ్డలనుచు
చేరబిలిచియు విందులు జేతురయ్యా

## గడ్డం రామదాసు

మండలకేంద్రమయిన మిర్‌దొడ్డి గ్రామమున పద్మశాలి కులమున జన్మించెను. వీరి తండ్రిపేరు కూచన్న. వీరికి రామమ్మ రాజమ్మ అను భార్యలు కలరు. రామదాసు పెద్ద భార్యయగు రామమ్మకు జన్మించెను. ఇతని బాల్యముననే మాతృనియోగము సంభవించెను. సవతి తల్లి మరియు దండ్రి భద్రాచలము పోవుచు బాలుడయిన రామదాసును ఇంటనే ఉంచిపోయిరి. రామదాసు ఆ ఊరిలోనున్న సీతారామాలయమున రెండు దినములు ఉపవాస దీక్షను ఆచరించెను. కలలో శ్రీరామచంద్రస్వామి రామదాసు నాలుకపై ఏవేవో వ్రాసెను. దానితో తెల్లవారుఝామున ఇల్లు చేరిన రామదాసు పద్యరచన ఆశువుగా ప్రారంభించిరి. ఇది వారు చెప్పుకొనిన వృత్తాంతము.

వీరు అశేష కవితా సామర్థ్యము కలవారై యుండియు పామర జనరంజకమగు లక్ష్యంతో యక్షగానములను రచించినారు. వీరి రచనలు సరళములై సుబోధకములై యుండును.

1. కుచేలోపాఖ్యానము
2. విప్రనారాయణ చరితము
3. సత్యవర్మ
4. కాళింగ మర్దనము
5. ప్రభావతీ విలాసము
6. ఋతుధ్వజనాటకము
7. ఇంద్రసభ
8. బ్రహ్మ గర్వాపహరణము
9. మాంధాత చరిత్రము
10. రుక్మిణీ కళ్యాణము
11. అంబోపాఖ్యనము
12. మార్కండేయ చరితము
13. బాలక్రీడలు
14. రాధామాధవము
15. లక్షణ పరిణయము
16. బిల్హణీయము
17. శారదా పద్యములు
18. దుర్యోధన గర్వాపహరణం
19. సావిత్రీ వ్రతధర్మములు
20. పునర్జన్మ నవరత్న కందార్థములు

అను గ్రంథములు రచించిరి. ఇందు కొన్ని ముద్రింపబడినవి మరికొన్ని అముద్రితములు.

ఈతని శైలికొక ఉదాహరణ

చూర్ణిక: శ్రీమద్వసుదేవ దేవకీదేవి పారవారరాకాశశాంకం నిష్కలంకం.

సమస్తనిస్తంద్ర, మౌనిబృందబృందారక సందోహమస్త కన్యస్త రత్నాలంకృత కిరీట స్థాపిత చరణారవిందం ముకుందం!

నిఖిల వేదవేదాంత శాస్త్రపురాణేతిహాసాద్యమిత విద్యావినోదం సుప్రసాదం రజస్సత్వతమోగుణోపేత బ్రహ్మవిష్ణుమహేశ్వరాత్మక స్వరూపం సత్ప్రతాపం రుక్మిణీ సత్యభామాదిగోపీనికర మనఃప్రఫుల్లాబ్జ మకరందపాన మత్తభృంగం శత్రుభంగం వసుంధరా సుందరీ వదన లలామతులిత తుంగ గవాలయపురనివాస చిలుకరామదాస శరణ్యం నమస్తే నమస్తే నమః

ఈ కవికి సంస్కృత భాషా పరిచయము కడు చక్కగా కలదు. తన పుస్తకములలో ఎన్నో సంస్కృత శ్లోకములు కూడా రచించినారు.

గడ్డము రామదాస కవిని గూర్చి గోలకొండ కవుల సంచికలో కలదు. వీరి 19 గ్రంథములు రచించినట్లు అందు పేర్కొనబడినది. వీరి అచ్చతెనుగు సామాన్యముగా పండితులకే అర్థము కాదన్నట్లు సంచికా సంపాదకులు వ్రాసినారు.

ఈతని అచ్చతెనుగున కొక ఉదాహరణ

గీ. మొలకనవ్వుల తేటలొలుకు నీదు మొగంబు
బెంజాయలొసగు నీ చిగురుమోవి
మొలపు చూపుల కల్కిదెలుపునీకందోయి
గోటారు నీ చిప్పకూకటంబు
నునువన్నె చిన్నియల్ పొనుపునీ చెక్కియల్
మచ్చగత్తులయునీ మంపు బొమ్మ
నెగుభుజంబుల జాపులగు నీదుకాల్జోడు
నెరవురేకల గ్రాలు నీ యడుగులు

గే. కాంచివేడుకలందు నిన్గన్నవారు
నోములెన్నెన్నిమునుపడనోచిరొక్కొ-
మేలురతనాలపెట్టినెమ్మేటి జెట్టి
బంతిలేర్దొరపట్టి హొంబట్టుదట్టి

## కిష్టాగౌడ్

కిష్టాగౌడుగారు నర్సాపూర్ మండలము నందలి బ్రాహ్మణపల్లి గ్రామవాస్తవ్యులు.

ఈ కవి అల్లిరాణి చరిత్రము అను యక్షగానమును రచించెను. ఈ రచన నామాల ఎల్లయ్యగారి ప్రోత్సాహమున 1963లో ముద్రించబడినది.

అల్లిరాణి కథ చాలావిచిత్రమైనది. భారత కథలోని అర్జునుని నాయకునిగా పాండ్య దేశపురాజ కుమార్తె అల్లిరాణిని నాయికగా చేసి అల్లిన కల్పితకథ అల్లిరాణి చరిత్రము.

పాండ్యరాజ్య రాణి సుశీల సంతానమునకై పార్వతీదేవిని ఉపాసించగా ఆ తల్లి ఒక ఫలము నొసంగినది. రాణి ఆఫలమునొక నీటికుండలో నుంచినది. ఆ ఫలమునకొకనాళము, ఆనాళము నుండి ఒక శిశువు జనించినది. అల్లి నుండి పుట్టినదిగాన అల్లరాణియని పేరు పెట్టబడినది. ఇది ఒక గమ్మత్తైన ఊహ.

ఈ కథలో కృష్ణుని పాత్ర ఎరుకలసాని వేషమున ప్రవేశపెట్టబడినది.

అల్లిరాణి అర్జునుల వివాహము, అల్లిరాణికి కుమారుడు కల్గుట, జోలపాటతో ఈ యక్షగానము సమాప్తమగును.

ఈ యక్షగానము సాహిత్య పరముగా సరళమై, సుబోధకమైయున్నది. ఇందు దరువులు, కందార్థములు, సంవాదము, కందగీత వృత్తములు, సీసములు గలవు.

ఈతని కవితా శైలికొక ఉదాహరణ.

అర్జునుండను శౌరి ప్రియుండను, దుర్జనులనునేను
దునుమాడేటి ధనుర్ధరుడను,
వర్జితరిపులను బట్టియు నిర్జించిన నిశ్చలుడను.

## చక్రవర్తుల కృష్ణమాచార్యులు

చక్రవర్తుల కృష్ణమాచార్యులు జోగిపేట మండలమునందలి కిచ్చన్న పల్లె గ్రామ వాస్తవ్యులు. వీరి తండ్రి వేంకటాచార్యులు గారు.

ఈ కవి 'తిరుమంగయాళ్వారు చరిత్ర' అను 'పరకాలవైభవము' నాటకమును వ్రాసి కిచ్చన్నపల్లి వెంకటేశ్వర స్వామికి అంకితమొసంగిరి. ఇది విష్ణుపారమ్యబోధకమైనకథ. భగవతారాధనకన్న భాగవతారాధన మిన్న అను దాసదాసోహమనే న్యాయంలో వ్రాయబడినది.

భాష సులలితమైనప్పటికి అక్కడక్కడ సంస్కృత పదసమాస భూయిష్టమై, యలంకారములతో నొప్పుచున్నది.

**ఉదాహరణ :-**

శక్తిపుటాంతర్గతంబైన మౌక్తికంబుచందంబున,
వస్త్రాచ్ఛాదిత వైడూర్యమణి గణంబులపగిది,
శిలాంతర్గతంబైన వజ్రంబురీతిం, హిమాంతర్గతుండైన
సూర్యుని పగిది, ....

## యజ్ఞకృష్ణదాసకవి

కృష్ణదాసకవి సంగారెడ్డి సమీపమునందలి మారేపల్లి వాస్తవ్యులు. వీరు 1898లో జన్మించిరి.

ఈ కవి సంస్కృతాంధ్ర భాషా పరిచయము గలవారు. వైద్య, జ్యోతిష శాస్త్రములందు ఆరితేరినవారు. ధారా శుద్ధిగల కవిత్వము వ్రాయగలవారు.

వీరు యక్షగానములను రచించి ప్రదర్శనా దర్శకత్వము వహించు నేర్పుగలవారైయుండిరి.

నిజాం విమోచనోద్యమంలో పాల్గొని కొంతకాలము జైలు జీవితమును గడిపిరి.

## బలరామదాస కవి

సంగారెడ్డి మండలమునందలి ఇస్మాయిల్‌ఖాన్‌పేట గ్రామ వాస్తవ్యులైన బలరామదాసకవి వైద్య వృత్తిలో జీవించు చుండిరి.

వీరుదేవునికంది భజనమాల, శ్రీరామ భజనమాల, రుద్రవరం భజనమాల, బాలాంజనేయ (బతుకమ్మపాట), కృష్ణలీలలు మొదలగునవి రచించెను.

వీరి రచనలన్నియు ముద్రింపబడినవి.

## యెల్లదాస కవి :

యెల్లదాస కవి పుల్కల్ మండలమునందలి గొంగులూరు గ్రామమున 1800 సం. ప్రాంతమున జన్మించెను. ఈతడు గజ్జెరి వంశపద్మశాలి కులస్థుడు. ఈతని వంశస్థులు ఇప్పటికిని కలరు.

గొంగులూరు కొకమైలు దూరమున కూచకొండ అను ఒక గుట్టకలదు. గ్రామమునకు సమీపముననున్న మంజీరానది పొరలి ప్రవహించి వచ్చినపుడు ఆ గ్రామవాసులు భయపడి కూచకొండపై నివాసము ఏర్పరచుకొనిరి. రామభక్తి తత్పరుడగు యెల్లదాసు కూడా ఆ గుట్టపై చేరి తన యిష్టదైవమగు రాముని ప్రార్థించెడివాడు. సరస్వతీ కటాక్షముచే అతనికి సహజ పాండిత్యమబ్బెను. ఆశువుగా 'కూచకొండ రామాయణము' అను యక్షగానమును రసవత్తరముగా రచించెను. కూచకొండ రామాయణము తెలంగాణమునందే కాక సమస్త ఆంధ్రరాష్ట్రమున అతి ప్రచారములోకి వచ్చినది.

**రచనారంభమున**

"ధారుణి యందునన్ను తల్లిదండ్రులు సాళ్ళకు దోలనందుకై
కారణబల్మి రామకృపగాను రాసితి పద్య గద్యముల్
ఆరయ వేద గ్రంథముల నాదిగ శాస్త్రములేవి చూడకన్---
---- భ్రమగొని కావ్యధారకున్ బాగుగ ఛందములాది కావ్యస
ద్విమల మనోజ్ఞ భావమున వీటిని నేర్వగ లేదు.

అని సవినయముగా చెప్పుకొన్నాడు. కావున ఇతడు సహజ పండితుడని తేటతెల్లమగుచున్నది.

యెల్లదాస కవి తన యక్షగానములో ఎన్నో దేశీయములయిన వాడుక పదములను వాడినాడు. సాళ్ళకు పంప, బుగులొందిచచ్చు, బింకమడిచి, కొంకులు విరిచి, లావు సొక్కించి మొదలగు పదములు.

ఈయన తన రచనయందు కందార్థములు, గీత, సీస పద్యములు ఎక్కువగా చెప్పారు. కొన్ని వృత్తములు గూడా చెప్పబడినవి. పాటల చివర ఈ మకుటమును వ్రాసెను.

'వరకూచగిరి నివాసా, యెల్లదాసు నేలే జగదీశా' ఈ యక్షగానమునందు ఆటతాళము, జంపె, ఆది, ఏక తాళములకనుకూలముగా పాటలు వ్రాసెను.

నేటికి ప్రజలలో కూచకొండ రామాయణం ప్రచారములోనున్నది.

## చెర్విరాల బాగయ్యకవి

చెర్విరాల బాగయ్యగారు వైశ్యకులస్థులు. కొడిపల్లి మండలమునందలి ముత్రాజుపల్లి వాస్తవ్యులు.

'వీరు కిరాతార్జునీయము' అను యక్షగానమును రచించిరి. ఈ కృతి విట్టా సీతారామయ్యగారి నారాయణ ప్రోత్సాహమున రచించినట్లు కవి చెప్పినారు.

కిరాతార్జునీయ యక్షగాన సమాప్తిలో కవితను గురించి ఇట్లు చెప్పుకొనినాడు.

"వైశ్యకుల పారావార సుధాకర పునిశిల గోత్రోద్భవ చెర్విరాల వంశదీపిక వీరన్న రాజమాబాతనూభవ కవితావైభవ సుగ్రీవ విజయేత్యాధి శతాధిక గ్రంధ రచన భాగదేయ బాగయ్య నామధేయ ప్రణీతంబైన కిరాతార్జునీయ చరిత్రము."

దీనితో ఈ కవి కిరాతార్జునీయమేకాక సుగ్రీవ విజయంవుు మొుదలుగాగల అనేక కృతులను రచించినట్లు తెలియు చున్నది.

బాగయ్య కవి గారి కవిత్వము చక్కగా సాగుసెలయేరు వలె భావగాంభీర్యమై పదలాలిత్యమై మొుప్పారు చున్నది.

## వీరప్పకవి

సంగారెడ్డి పరిసరవునందలి పొట్టిపల్లి గ్రామమున జన్మించిన వీరప్పగారు తెలుగుకు విశేషకృషి సల్పిరి.

**1934**న వీరమ్మ బక్కప్పలకు జన్మించిన వీరప్పగారు వ్యవసాయ వృత్తిగా గలిగిన సాహితీపరులు.

వీరు 'మన్మధ సంహారము' రైతు విజయము అను రెండు యక్షగానములను రచించిరి.

ఈ యక్షగానములు పద్యగద్య కీర్తనలతో కందార్థములతో చక్కని భాషాశైలిలో గలవు.

## పడిగ శివయ్యగారినారాయణ

నారాయణగారు సదాశివ గ్రామ వాస్తవ్యులు. వీరి తల్లిదండ్రులు బాలమ్మ శివయ్యలు. పద్మశాలీ కలుస్థులు. వీరు **1919**లో జన్మించిరి.

వీరు శ్రీరామ నక్షత్రమాల, శ్రీసాయిబాబా పంచ వింశతి, తత్వభజన, రుక్మాబాయి డ్రామా.

నారాయణగారు చక్కని యక్షగాన రచయిత వీరు రచించిన యక్షగానములు.

1. కుమారస్వామి విజయము
2. రుక్మిణీ కల్యాణము
3. సభాపర్మము నుండి పాండవుల విజయము వరకు గల కథ భారతము - 8 రాత్రుల యక్షగానము.
4. పాండవ అశ్వమేధయాగము
5. శ్రీకృష్ణలీలలు
6. భద్రావతీ వివాహము
7. శ్రీ కృష్ణార్జున యుద్ధము

ఇవన్నియు ముద్రింపబడి పెక్కువార్లు ప్రదర్శింపబడినది.

## బాలకిషన్

చదువుకొనే చిన్నతనాన బడివిడిచినాక పొలాల్లో తిరుగుతూ తల్లిపాడే కలుపు పాటల విని వాటిననుకరించి తనలోని కళాకారుణి మేల్కొల్పిన బాలకిషన్ సిద్ధిపేట మండలంలోని రావురూకుల గ్రామంలో ఒక వ్యవసాయ కుటుంబంలో జన్మించారు.

ఉపాధ్యయ వృత్తిని చేపట్టి కళాకారుడుగా ఎదిగిన బాలకిషన్ వివిధ రాష్ట్రాలలో ఢిల్లీలోను మూడు వేలకు పైగా ప్రదర్శనలిచ్చినారు.

తోటి కళాకారులను ప్రోత్సహించాలని 'రసమయి' జానపదకళా సమితిని సిద్ధిపేటలో స్థాపించి అనతికాలంలోనే రాష్ట్ర స్థాయి గుర్తింపు పొందినారు.

హైదరాబాదులో రవీంద్ర భారతి, హరిహరకళాభవన్ వంటి అత్యున్నత వేదికలపై రసమయి సంస్థ పక్షాన ఎన్నో ప్రదర్శనలిచ్చిరి.

భోపాల్, ముంబై, చెన్నై, గోవా, పంజాబ్, హిమాచల్ ప్రదేశ్ మొదలైన రాష్ట్రాలలో జానపద నృత్యాలను ప్రదర్శించి ఆయాప్రభుత్వాల, ప్రజల మన్ననలు పొందినారు.

చెన్నైలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలలో జానపద గీతాలనాలపించి వివిధ దేశాల నుండి వచ్చిన తెలుగు ప్రతినిధుల పశంసలను పొందినారు.

సామాజిక ప్రయోజనంలోనున్న వివిధ కళారూపాలను ప్రదర్శించినారు. మద్యపాన నిషేధం, నిరక్షరాస్యత నిర్మూలను జాగృతం చేస్తూ గ్రామీణ ప్రాంతాలలో పల్లె సుద్దులను ప్రదర్శించారు.

1994లో భోపాల్‌లో జరిగి 'యువ ఉత్సవ్'లో పాల్గొని రాష్ట్రపతి శంకర్‌దయాళ్ శర్మగారిచే ప్రథమ బహుమతినందుకొనినారు.

## రాంచందర్

మెదక్ జిల్లా పంచాయత్ రాజ్ వ్యవస్థలో ఉపాధ్యాయునిగా పనిచేయుచున్న రాంచందర్ గాయకునిగా గుర్తింపునందినారు.

సమాజంలోని దురాచారాలను, మూఢ నమ్మకాలను, అంశాలుగా తీసికొని స్వయంగా పాటలు రచించి గానం చేయడంలో రాంచందర్ దిట్ట. పాడినపాటలను జనగర్జన పేరుతో క్యాసెట్టు విడుదలగావించినారు.

చిన్ననాటి ఆర్థిక ఇబ్బందులు, సమాజానిన అర్థం చేసికొన్నాయి. పశువుల కాపరిగా ప్రకృతి పాటలు, పాఠాలు నేర్పింది. ఆనాటి కూనిరాగాలు, జానపదగేయాలు నేటిపాటలకు దరువులయ్యాయి. తెలుగుతోపాటు కన్నడం, హింది భాషలు నేర్చుకొన్నాడు. ఆ భాషలలో కూడా పాటలనల్లి పాడడం ప్రారంభించాడు.

ఆంధ్ర ప్రదేశ్‌లోని వివిధ జిల్లాలోనేకాక కర్ణాటక రాష్ట్రంలో బెంగళూరు, బీదర్, గుల్బర్గా మొదలైన పట్టణాల్లో మహారాష్ట్రలోని బొంబాయి, నాగ్‌పూర్‌లలో, ఉత్తర ప్రదేశ్‌లోని లక్నో తదితర ప్రాంతాలలో తన కళా బృందంతో ప్రదర్శనలిచ్చినారు.

ఈతని "గర్జన కళాబృందం"లో సంగమేశ్వర్, నర్సింలు, రాజు, మెాహన్, సంగ్రామ్‌లు పాల్గొంటున్నారు.

## బెల్లోజురమణాచారి

సహజపండితుడైన బెల్లోజు రమణాచారి దుబ్బాక మండలం కూడ వెల్లి సమీపంలోని రామేశ్వరం పల్లిలో జన్మించెను.

రమణాచారిగారు పెద్దగా చదువుకొనలేరు. విద్యావంతుడుకాదు. ఐనను సహజ ప్రతిభతో అనేకయక్షగానాలను రచించిన కవి.

ఈతనికి 36వ ఏట అంధత్వము వచ్చినది. కంటి చూపు పోయినప్పటికి ఈతడు శతాధిక యక్ష గానములను రచించెను.

రమణాచారి చిరుతలు వాయించుచు హరికథా కాలక్షేపము చేయుచు నోములు, వ్రతాలు, వివాహాలు మున్నగు పౌరోహిత్య కార్యక్రమములు చేయుచు జీవనోపాధి గడుపుకొనెడివాడు.

ఈతని మేనమామ కామారెడ్డి మండలం రాజంపేటకు చెందిన కిష్టయ్యాచారి.

ఈతని రచన కార్యక్రమమున వ్రాయసకాడుగా ఆప్తమిత్రుడైన వెంకటేశం పూర్తి సహకారాన్నీ అందించేవాడు.

1991 ఆగస్టు 28న రమణాచారి పరమ పదించెను.

# జిల్లాలోని మాండలికాలు

భాష సజీవమైనది. సజీవమైన ప్రతిది నిత్యనూతనమైయుండును. మార్పు జీవన సంకేతం.

ఒకే భాష వివిధ ప్రాంతాలలో వివిధ రీతులలో పలుక బడుతుండడం గమనార్హము.

కొన్ని పదాలు కొన్ని చోట్ల మాత్రమే ఉచ్చరింపబడుతూ ఇతర చోట్లలో ఆపదాలేవో అన్యభాషా పదాలవలె చూడడం కూడా జరుగుతుంది.

"పదుగురాడు మాట పాటియై ధర చెల్లు" అన్నట్లు కొన్ని పదాలు కొత్త కొత్త అర్థాలతో కొన్ని కొన్ని చోట్ల వినబడుతుంటాయి. ఈ విధంగా కొన్ని ప్రత్యేక ప్రాంతాలలో వాడే పదాలను మాండలికాలు అంటారు.

ప్రస్తుతము మెదకు జిల్లా భాషను గూర్చి తెలుసుకొన వలసియున్నది.

మెదకు జిల్లాకు సరిహద్దులుగా కర్ణాటక, మహారాష్ట్ర ప్రాంతాలున్నాయి.

జహీరాబాదు, నారాయణ ఖేడ్ ప్రాంతాలు కర్ణాటకకు సరిహద్దులు, నారాయణ ఖేడ్‌కు మహారాష్ట్రం కూడా కొంత ఆనుకొని ఉంది. కాబట్టి ఈ ప్రాంతాలలో కర్నాటక సంస్కృతితో పాటు కన్నడ భాషా ప్రభావం కూడా ఈ ప్రాంతీయుల భాషపై ఉంటుంది. అట్లే మహారాష్ట్రుల సంస్కృతీ సాంప్రదాయాలు, భాషా పదాలు కూడా కొంత మేరకు ప్రచారంలో ఉంటాయి. ఇక తక్కిన మొత్తం జిల్లా ప్రాంతమంతా స్వచ్ఛమైన తెలుగు సంస్కృతీ సాంప్రదాయాలతో పాటు తెలుగు భాషయే వాడుకలో ఉంది.

ఈ ప్రాంతమంతా తురకల ఏలుబడిలో ఉన్నందున కొన్ని ఉర్దూ పదాలు భాషలో కలిసిపోయినాయి. మచ్చునకు ఈ పదాలు సంజాయిషీ, అమలు, ఆఖరు, కులాసా రోజు, రాజినామా, జమాఖర్చు, పల్లెటూర్లలోని వాడుకపదాలను పరిశీలిస్తే వాటిలో కొన్ని అపభ్రంశములుగా కనబడినను అవి స్వచ్ఛమైన తెలుగు పదాలే. మామూలు, మున్నగునవి. ఈ విధమైన పదములెన్నో నేడు అచ్చుతెలుగు పదములుగా పరిగణింపబడుచున్నవి.

మెదకు జిల్లాలోని కొన్ని మాండలిక పదాలు ఈ క్రింద పొందు పరచబడుచున్నవి.

| | పదము | అర్థము | ప్రయోగము |
|---|---|---|---|
| 1. | అంట | విస్తరి | |
| 2. | అంబాడు | చిన్నపిల్లల పాకుడు | అర్నెల్లుగాలె పుట్టి అప్పుడే అంబాడుతున్నాడు |
| 3. | అంగీ | చొక్క | |
| 4. | అగడు | అత్యాశ | అగడు పట్టినట్లు తింటుండు |
| 5. | అగ్గువ | వెలతక్కువ | బెల్లము ధర అగ్గువైనది |
| 6. | అడకొత్తు | పోకలు కత్తిరించుకత్తెర | |
| 7. | అద్వాన్నము | తక్కువ | |
| 8. | అప్పుడేనిగుజ్జాలు | ఒక విధమైన కీటకములు | |
| 9. | అరసుకొనుట<br>అర్సుకొనుట | అరయుట (పలకరించుట) | ముసలాయన చచ్చిపోతే అరసుకొచ్చినావా? |
| 10. | అఱ్ఱ | గది | |
| 11. | అమడాల | కవలలు | అమడాల పిల్లలు పట్టిన్రు. |
| 12. | ఆర్శీలు | కళ్లజోడు | |
| 13. | ఇగురము | పొందికతనము | బాగ ఇగురమున్నది |
| 14. | ఇలపీట | కత్తిపీట | |
| 15. | ఉడుకు | వేడి | |
| 16. | ఉప్పలము | ఆకారంలో పుట్టేవృక్ష<br>సంపద తిట్టుకు వాడే పదము | ఉప్పలము పుట్టినట్టు పుట్టినావుర |
| 17. | ఊబ్బరము | వేడి | |
| 18. | ఊసులాడు | గుసగుసలాడు | |
| 19. | ఊసులు | కండ్ల నుండి వచ్చు మలము | |
| 20. | ఎటమటము | అస్తవ్యస్తము | |
| 21. | ఎఱ్ఱ | వానపాము | |
| 22. | ఒడప్పలు | బియ్యంపిండితో చేసే పిండి వంట | |
| 23. | కడమ | చివరి, తర్వాత | |
| 24. | కాసండి | చిన్నపాత్ర | |
| 25. | కీస | చొక్కా జేబు | |
| 26. | కూడుకుమ్మ | భోజనము | ఇంతపొద్దైన కూడు కుమ్మ లేదురాబై |
| 27. | కైకిలి | కూలి | |
| 28. | కొప్పెర | నీరుకాచుకొను / పాత్ర | |
| 29. | చిలుక్కొయ్య | | |
| 30. | కొలువు | సేవ | |
| 31. | గడిమంచ | పక్కబట్టలుంచే బల్ల | |

| | | | |
|---|---|---|---|
| 32. | గవాళము | ప్రయాణములలో సాలగ్రామ మొదలగునవి భద్రపరచు సంచి | గవాళము వెంట పెట్టుక పోయుండి |
| 33. | గ్గోడు | చంకలో, గజ్జలోవచ్చెడు వాపు | |
| 34. | గిల్లుమనుట | శబ్దము | చెవులు గిల్లుమన్నవి |
| 35. | గుల గుల | దురద | గులగుల చేయకుము |
| 36. | గులుగుట | లోలోపల మాట్లాడుకొనుట | గులుగుతున్నావేమిటి |
| 37. | గువ్వము | గుజ్జు | |
| 38. | చకిలము ముకులము | పద్మాసనము | చకిలము ముకిలము కూసోరా |
| 39. | చేదుట | నీళ్లుతోడుట | నీళ్లు చేదినావా? |
| 40. | చేపోయి | చేబదలు | |
| 41. | జాంబు | చిన్నరాగి పాత్ర | |
| 42. | జాలారు | వంట యింట్లో గంజివార్చుగుంట | |
| 43. | దిష్టి | దృష్టిదోషము | |
| 44. | జీబిలి | కర్ణమలము | |
| 45. | జోకు | తూచుట | |
| 46. | తల్పుగూడు | గోడలకమర్చిన తలుపులున్న గూడు | |
| 47. | తలియ, తలిగ | భోజన పాత్ర | |
| 48. | తాంబాళము | పెద్దపళ్లెము | |
| 49. | తావు | స్థలము | |
| 50. | తిప్పలు | బాధలు | |
| 51. | తొట్లె | ఊయల | |
| 52. | తోలుకొనిపోవుట | వెంటపెట్టుకొని పోవుట | |
| 53. | దామంతము | విచారము | |
| 54. | నజ్జి నజ్జి | నలిగిపోవు | |
| 55. | నసుకు | చెప్పుటకై వెనుకాముందాడుట | విషయం చెప్పడానకి నసుకుతున్నావేమి |
| 56. | నెరి | పూర్తిగా | |
| 57. | పలుగట్టి | దంతధావనమునకై వాడు కట్టె | |
| 58. | పాతాళగరిగె | బావిలో బొక్కెన పడిన సమయమున దానిని తీయు సాధనము | |
| 59. | పాశము | పాయసము | పాశము వండింద్రు |
| 60. | పిచ్చుకుంట్ల | అప్రధానము | ఏమికోపము పిచ్చుకుంట్ల కోపము |
| 61. | పిరియము | వెల ఎక్కువ | బియ్యము పిరియమైనవి. |
| 62. | పులకరము | జ్వరము | పిలగానికి పులకరమొచ్చింది. |
| 63. | పొక్క | రంధ్రము | |
| 64. | పొక్కిలి | గుంట | పొక్కిలి జెయ్యకు |
| 65. | బంకు | ప్రధాన ద్వారము వద్ద నుండు | బంకులకూసున్నడు |

| | | | |
|---|---|---|---|
| | | ఎత్తు అరుగు | |
| 66. | బరిగె | బెత్తెము ... | పంతులు బరిగెతో కొట్టిండు |
| 67. | బరిబత్తల | నగ్నము | బరిబత్తలున్నవేంరా? |
| 68. | బాంచెను | బానిసను | నీ బాంచను కాల్మొక్త |
| 69. | బాండ్లీ | పిండి పదార్థములుచేయు పాత్ర | బాండ్లీల నూనె పొయ్యి |
| 70. | బీరిపోవు | ఆశ్చర్యపోవు | |
| 71. | బుక్క బుక్క | తినే ఆహారపు ముద్ద | అటుకులు రెండు బుక్కలు బుక్కిపోరా. |
| 72. | బుగులు | భయము | పిలగాడు బుగులు పడిండు |
| 73. | బేడెము | పూర్వము ద్వారములకు అడ్డముగా వేయు బలమైన కట్టె | బేడెమేసినవా? |
| 74. | బొండిగ | కంఠము | బొండిగపిసికి చంపిండు |
| 75. | బొక్క | ఎముక | |
| 76. | మస్తు | అధికము, చాలును | మస్తుగ తిన్న, తిన్నది ఇక మస్తు |
| 77. | మాగికాలము | పగలు తక్కువ గానుండు కాలము | |
| 78. | మెత్త | దిండు | |
| 79. | మెయి, పెయి, పెయ్యి | శరీరం | మెయిమీద ఈగ వాలనీడు, పెయి సబ్బు |
| 80. | లట్టనిగ | రొట్టెలు, పూరీలు, వత్తెడు కట్టె | |
| 81. | లెంకు | వెతుకు | గొడ్లను లెంకవొయిండు |
| 82. | లొంత | గుంట | |
| 83. | లొల్లి | అల్లరి | పిల్లల లొల్లెక్కువైనది. |
| 84. | వయ్యి, వొయ్యి | పుస్తకము | |
| 85. | వరకట్ట | అడవి పంది వెంట్రుకలతో చేయబడు బ్రష్. | |
| 86. | సరాతము | అట్లకాడ | |
| 87. | సాలె | బడి | పొల్లగాడు సాలెకువొయ్యిండు |
| 88. | సైసు | ఆగు | జరసైసరాదె (కొంచెము ఓపిక పట్టుము) |
| 89. | సోయి | స్పృహ | మెయిమీద సోయిలేకుండ నిద్రవోయిండు |

(భాగవతము రామారావుగారి వ్యాసము - జనవరి 1968 భారతి పత్రిక ఆధారంగా)

# పత్రికారంగం

మెదకు జిల్లాకు సాహితీ సాంస్కృతిక రంగంలో ప్రశంసనీయమైన పాత్ర కలదు.

సామాజిక, సాంస్కృతిక, సాహిత్య భావాలను ప్రజలకు పంచడానికి పత్రిక బహుముఖ ప్రయోజనకారి. ఈ రంగంలో మెదకు జిల్లా తనవంతు కృషిని సల్పినదని చెప్పవచ్చును.

మెదకు జిల్లాలో భారత దేశానికి, నైజాం రాష్ట్రానికి, స్వాతంత్ర్యంరాక ముందే, ఆంగ్లేయుల, నైజాముల పరిపాలనా కాలంలోనే క్రీ.శ. 1926 సంవత్సరంలో జిల్లాలో మొట్ట మొదటి సారిగా "దేశ బంధు" అనే మాసపత్రిక వెలువడినది. పూర్వపు గజవెల్లి తాలుకాలో నేటి వర్గల్ మండలంలోనున్న వడ్డేపల్లి అనే ఒక చిన్న పల్లెటూరి నుండి ఈ పత్రిక ప్రచురింపబడేది. ఈ పత్రిక వడ్డేపల్లి నర్సింహాచారి ప్రధాన సంపాదకుడుగా, బెల్లంకొండ రామానుజా చార్యులు ప్రచురణకర్తగా వెలువడుచుండెను. ఈ దేశబంధు పత్రిక సాహితీ, సాంస్కృతిక విషయాలతో పాటు నాటి ప్రజా జీవనమును ప్రతిబింబింపజేసేది.

సంగారెడ్డి కేంద్రంగా 'పల్లెటూరు' అనే పత్రిక మల్యాల దేవీ ప్రసాదుగారి సారథ్యంలో వెలువడి పత్రికా రంగంలో కొత్త ఒరవడిని సృష్టించింది. ఈ పత్రిక ఆనాడు మెదకు జిల్లాలో జరుగుచున్న ప్రజా ఉద్యమాలను, ప్రజా జీవన పోరాటాలతో పాటు సాహిత్య వ్యాసాలను ప్రచురించి ప్రజలమన్ననలను పొందినది.

రామాయంపేట కేంద్రంగా స్వాతంత్ర్యసమర యోధుడు, ప్రజానాయకుడు భూమాజీ అధ్వర్యంలో 'చైతన్య' అనే పత్రిక కొన్నాళ్ళు వెలువడి పత్రికా పాఠకలోకానికి చైతన్యం కలిగించింది.

సాహితీ మిత్రుడు, స్వాతంత్ర్యసమర యోధుడు వీరమల్లాగౌడ్ సంగారెడ్డి నుండి "ఏడుపాయలు" అనే లిఖిత మాసపత్రికను వెలువరించిరి.

జిల్లాలో సాహితీరంగాన గొప్ప సేవ చేసిన సంస్థ మెదకు మండలసాహిత్య పరిషత్తు. ఈ సంస్థాన పక్షాన మనోహరశర్మ సంపాదకుడుగా "సాహితీ మంజీరా" అనే సాహిత్య పత్రిక వెలువడి సాహితీ మిత్రుల ఆకాంక్షలకు అద్దం పట్టింది.

సిద్ధిపేట నుండి ముదిగొండ ఈశ్వర చరణ్‌గారి ఆధ్వర్యంలో "సాహిత్యప్రభ" అనే పత్రిక వెలువడింది. ఈ పత్రికలో తెలుగు సాహిత్య సంబంధిత వ్యాసాలు, కవితలు ప్రచురింపబడి కొత్త కవులకు ప్రోత్సాహాన్ని కలిగించింది.

సిద్ధిపేట నుండే "స్వతంత్రాంధ్ర" అనే లిఖిత పత్రిక కొంత కాలం వెలువడింది.

"జలధి" అనే పత్రిక నేటికి సిద్దిపేట నుండి వెలువడుచున్నది.

జోగిపేట నుండి పత్రికారచయిత బండారు గాలయ్య "కిరీటి" అనే పత్రిక వెలువరించిరి. ఆయన తర్వాత కొంత కాలం పోకల కృష్ణమూర్తి ఆధ్వర్యంలో ఈ పత్రిక ప్రచురింపబడినది.

మెదకు స్టడీ సర్కిల్ పక్షాన "మంజీరా" అనే సాహితీ పత్రిక కొన్నాళ్లు ప్రచురింపబడింది.

ఊరు వాడ అనే పత్రిక పెద్దశంకరంపేట మండలం మక్తలక్ష్మపూర్‌కు చెందిన బి. జయదేవులు 1982 లో ప్రచురణ ప్రారంభించి కొన్నాళ్లు విజయవంతంగా నడిపించినారు.

సందెవేళ అనే దిన పత్రిక సంగారెడ్డి కేంద్రంగా ప్రస్తుతము వెలువడుచున్నది.

మెతుకుసీమ అనే పత్రిక ఈ మధ్యకాలంలో ప్రారంభింపబడి సంగారెడ్డి నుండి వెలువడుతున్నది.

# జిల్లాలో సాహితీ సంస్థలు

మెదకు జిల్లా అలనాటి నుండి సాహితీ ఉద్యమంలో అగ్రగామిగానే ఉంది.

రాజుల ధిక్కరించి, స్వీయకవితా వైభవాన్ని చాటినగుణాఢ్యుడు ఇక్కడి వాడే. కళ రాజాశ్రయాన్ని పొందితేనే కళకళలాడిన రోజులు కొన్ని

ప్రభువుల పక్షపాతాన పద్యం హృద్యంగా ఎదిగింది కొన్నాళ్లు. పాట ఆటగా యక్షగాన్ని పంచింది మరి కొన్నాళ్లు.

సాహిత్యం ప్రభువుల, పండితుల, పంచల్లో ప్రబంధాలైతే ప్రజల్లో చొచ్చుకొని పోయి ఆటపాటైనది యక్షగానాల్లో. మెదకులోని సాహిత్యం అటు రాజ మందిరాల్లో, ఇటు ప్రజాహృదయాల్లో సజీవంగా నిలిచింది.

రాజ్యాలు పోయి ప్రజారాజ్యాలు అవతరించిన కాలంలో సాహిత్యాన్ని, కళలను పోషించి, అభిమానించి, ప్రజలకందించాల్సిన బాధ్యత ప్రజలది, సంఘాలది, సంస్థలది అయ్యింది.

ఈ కోవలో దేశంలో అనేక సాహితీ సంస్థలు వెలువడ్డాయి. సాహిత్యాన్ని ప్రజల్లో ప్రచారం చేయడానికి నడుంకట్టాయి.

మెదకు జిల్లాలో కూడా ఇలాంటి ఉద్యమం బాగానే ఎదిగిందని చెప్పవచ్చు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో జోగిపేటలో జరిగిన ప్రథమాంధ్రమహాసభ, మెదకు జిల్లా వాసుల్లో మాతృభాషపై మమకారాన్ని పెంచాయి. సంఘటితశక్తిని సాకారం చేశాయి.

ఆ తర్వాత జిల్లాలో అక్కడక్కడా చిన్న చిన్న సంస్థలు మొలిచాయి. ప్రాంతీయంగా ప్రజల్లో భాషా సాహిత్యాలను ప్రచారం చేశాయి.

జిల్లా పేరుతో జిల్లా మొత్తాన్ని ఏకీకృతం చేసిన సంస్థలు రెండే. ఒకటి మెదకు జిల్లా రచయితల సంఘం. మరొకటి మెదకు మండల సాహిత్య పరిషత్తు.

**మెదకు జిల్లా రచయిత సంఘం:–**

ఈ సంఘం మెదకు జిల్లా వ్యాప్తమైన సంఘంగా పేరొందింది. 70వ దశకంలో జిల్లా ఏకైక సాహితీ సంస్థగా పని చేసింది. ఈ సంస్థ అధ్యక్షులుగా ప్రముఖ కవి వేముగంటి నర్సింహాచార్యులు ప్రధాన కార్యదర్శిగా రంగకృష్ణమాచార్యులు సంస్థ పురోభివృద్ధికి కృషి చేశారు. ఈ సంస్థపక్షాన కొన్ని పుస్తకాలు ప్రచురింపబడ్డాయి. కొన్ని వార్షికోత్సవాలు జరుపుకొనబడ్డాయి.

## మెదకు మండల సాహిత్య పరిషత్తు :-

పదిమంది మనుషుల మదులలో మెదలి సాకారాన్ని రూపుదిద్దుకొన్న సంస్థ మెదకు మండల సాహిత్య పరిషత్తు.

ఈ పరిషత్ భవనానికి ప్రారంభాన నలుగురు మూల స్తంభాలై నిలిచినారు.

స్వాతంత్ర్య సమరయోధులు కస్తూరి కృష్ణమాచార్యులు గౌరవాధ్యక్షులుగా ప్రముఖ న్యాయవాదులు కెరవెల్లి - రాంరెడ్డిగారు గౌరవ ఉపాధ్యక్షులుగా, అభినవ విద్యారణ్య బిరుదాంకితులు శిరోమణి శాస్త్రుల విశ్వనాథశర్మగారు అధ్యక్షులుగా, ప్రముఖ పండితులు క్రియాశీలురుఐన ముదిగొండ ఆంగీరస శర్మగారు ప్రధాన కార్యదర్శిగా ఈ సంస్థ 1979న సంగారెడ్డిలో ప్రారంభించబడినది.

మెదకు జిల్లా సాహితీ సాగరంలో పుట్టిన ఉవ్వెత్తు తరంగంలా జిల్లా అంతటా వ్యాపించి తాలూకాస్థాయి శాఖలేర్పడ్డాయి. ప్రతి తాలూకాలో కార్యవర్గాలు ఎన్నుకోబడ్డాయి.

పట్టణాల్లోనే కాదు పల్లెల్లో కూడా తెలుగు భాష ప్రాభవాలనందించాలని పల్లెపట్టుల్లో సాహిత్య కార్యక్రమాలు ప్రారంభింపబడ్డాయి.

అష్టావధానాలు, కవిసమ్మేళనాలు, సాహితీ గోష్ఠులు చర్చలు ఒకటేమిటి సమస్త సాహితీ ప్రక్రియలు ఊరూరా వాడవాడా వార్తల్లోకొచ్చాయి. పెద్దగొట్టిముక్కల కానుకుంట, కొడిపల్లిలాంటి పల్లెల్లో కూడా అష్టావధానాలు, కవి సమ్మేళనాలు జరిగాయి.

మెదకు, గజవెల్లి, నర్సాపూర్, జోగిపేటల్లో జరిగిన వార్షికోత్సవాలు మెదకు జిల్లా వాసుల్లోనేకాక పరిసర జిల్లాల్లో కూడా ప్రచారాన్నందాయి. కొత్త ఉత్సాహాన్ని కలిగించాయి.

ఈ సంస్థ నీడలో ఎందరో కొత్త కొత్త కవులు పట్టుకొచ్చారు. వెలుగులో కొచ్చారు పుస్తకాలు ముద్రించుకొన్నారు.

మెదకు మండల సాహిత్య పరిషత్తు మెదకు జిల్లా కవులతో వెలువరించిన సంకలన గ్రంథాలు, రసతరంగాలు, ప్రగతి పదాలు మొదలైనవి ఇక్కడి యువకవులలో రచనా శక్తిని ఇనుమడింప చేశాయి.

ఈ సంస్థ కేవలం సాహిత్యాన్నేకాక, సంగీత, నృత్య, నాటక కళలను కూడా పోషించింది. భువన విజయం వంటి నాటకాలు, పేరిణీ శివతాండవాలు, కర్ణాటక, లలిత సంగీత విభావరులు ఈ సంస్థ వేదికనలంకరించాయి. ఎందరో కళాకారులను ఈ సంస్థ ఆదరించింది గౌరవించింది.

నర్సాపూర్‌లో జరిగిన మెదకు జిల్లా తెలుగు సభల్లో నూతన కార్యవర్గం ఎన్నుకోబడింది. ముదిగొండ ఆంగీరస శర్మ అధ్యక్షులుగా, శాస్త్రుల రఘురామశర్మ ప్రధానకార్యదర్శిగా నూతన కార్యవర్గం ప్రారంభమైంది.

ఆ తర్వాత ఎన్నో కార్యక్రమాలు, జోగిపేటలో ఉత్సవాలు జరుపబడ్డాయి.

సంస్థకు మూలస్తంభాలైన ముగ్గురు మహనీయులు కీర్తిశేషులైనారు. కస్తూరి వాసన మిగిల్చారు. విశ్వనాధులు వినీల విశ్వంలో కలిసిపోయారు.

దీంతో కొంతకాలం సంస్థ తన కార్యక్రమాలను కట్టిపెట్టింది, ఒకరకంగా నిర్జీవమైపోయింది.

కాని మహనీయుల, మనీషుల, త్యాగధనుల ఆశలు ఆశీర్వాదాలు ఊరికే చెదిరిపోవు వారి కలలు కల్లలు కావు.

నిద్రాణమైన సంస్థ తిరిగి నూతనోత్తేజంతో ముందుకు సాగాలని మిత్రమండలి ఆకాంక్షించింది.

ఎన్నడో ఎనభైయవ దశకంలో మెదకు జిల్లాకు **విజ్ఞాన సర్వస్వం** వ్రాయాలనే ఊహనేటికి ఫలించింది.

## భారతీయ రచయితల సమితి :

సిద్దిపేట ప్రాంతంలో సాహితీ చైతన్యాన్ని కలిగించిన పండిత పరాశరం గోపాల కృష్ణమూర్తిగారు సిద్దిపేట డిగ్రీ కళాశాలలో ఉపన్యాసకులుగా పనిచేస్తూ 1960లో భారతీయ రచయితల సమితి అనే సంస్థను స్థాపించారు. ఈ సంస్థ సిద్దిపేట ప్రాంతంలో అనేక మంది కవులకు వేదిక అయింది. ఈ సంస్థ ద్వారా ఎందరో సాహితీ మూర్తులుగా లోకానికి ప్రచారమయ్యారు.

## నవ చైతన్య భారతి :

సిద్దిపేటలో వెలసిన మరో సాహితీ సంస్థ నవ చైతన్య భారతి. 1970లో ఈ సంస్థ ప్రారంభించబడింది. ఉమాపతి పద్మనాభశర్మ, గుమ్మనగారి లక్ష్మీనరసింహశర్మలు ఈ సంస్థకు సారథ్యం వహించారు. ఈ సంస్థ పక్షాన కొన్ని పుస్తకాలు ప్రచురింపబడ్డాయి. అరవిందుని దర్శనంపై సమీక్ష వ్యాసం ఈ సంస్థ ద్వారా ప్రచురింపబడింది.

## సాహితీ వికాస మండలి :

ప్రముఖ కవి వేముగంటి నరసింహాచార్యుల అడుగుజాడల్లో నడుస్తున్న సాహితీ సంస్థ సాహితీ వికాసమండలి. సిద్దిపేటలో ఈ సంస్థ కొన్ని కార్యక్రమాలు నిర్వహించింది. ఈ సంస్థ ద్వారా కొన్ని పుస్తకాలు ప్రచురించబడ్డాయి.

### రమ్య భారతి :

రామాయంపేటలో కొంత మంది యువ సాహితీ మిత్రుల ప్రోత్సాహంతో ప్రారంభింపబడిన సంస్థ రమ్యభారతి. ఇది 1984లో ప్రారంభమైంది. స్థానికంగా కొన్ని కవి సమ్మేళనాలు సాహితీ కార్యక్రమాలు ఈ సంస్థ పక్షాన నిర్వహింపబడ్డాయి.

### సాహితీ మంజీర :

కస్తూరి ఆనందాచారి మార్గదర్శకులుగా ఎందరో స్థానిక యవకుల ప్రోత్సాహంతో ఏర్పడిన సాహితీ సాంస్కృతిక సంస్థ సాహితీ మంజీర. ఈ సంస్థ పక్షాన భావజ్వాల లాంటి ఎన్నో కావ్యాలు ప్రచురింపబడ్డాయి.

### జాతీయ సాహిత్య పరిషత్తు

జాతీయ భావాలతో అలరారే కవులకూడలి జాతీయ సాహిత్య పరిషత్. ఇది రాష్ట్రవ్యాప్తమైన సంస్థ. ఈ సంస్థకున్న ఎన్నో శాఖల్లో సిద్దిపేటశాఖ ఉత్సాహవంతమైనది. ఉత్తేజపూరితమైనది. 1986 నుండి జా.సా.ప. సిద్దిపేట శాఖ ఉద్యమ స్ఫూర్తితో పని చేస్తూ అనేక సాహితీ కార్యక్రమాల్ని నిర్వహిస్తున్నది. 'దివ్వెలు' అనే కవితా సంకలనాన్ని స్థానిక యువకులతో కలిసి వెలువరించింది. ఈ శాఖ అభివృద్ధికై సిద్దిపేట యువకవులెందరో కృషిసలుపుతున్నారు. ఇప్పటికీ ముప్పైకిపైగా పుస్తకాలు ఈ సంస్థ పక్షాన ప్రచురింపబడ్డాయి.

### మంజీరా రచయితల సంఘం :

1986లో ప్రారంభింపబడిన సాహితీ సంస్థ మంజీరా రచయితల సంఘం. ఈ సంస్థ ముఖ్యంగా మెదక్, సిద్దిపేట ప్రాంతాల్లో బాగా కృషి చేస్తోంది. వామపక్ష భావాలతో కవితాజాలాన్ని సృష్టిస్తున్న అనేకమంది కవిమిత్రులు ఈ సంస్థలో సభ్యులుగానున్నారు. ఈ సంస్థ ద్వారా అనేక కార్యక్రమాలు నిర్వహింపబడుతున్నాయి. అనేక పుస్తకాలు ప్రచురింపబడుతున్నాయి.

ఇవికాక మెదకు జిల్లాలో అక్కడక్కడా కొన్నికొన్ని సాహితీ సంస్థలు ప్రాంతీయంగా వెలువడి ఆ ప్రాంత కవులకు వేదికలవుతున్నాయి. లలితకళా సమితి, పల్లవి ఆర్ట్స్ మొదలైన కళాసంస్థలు కూడా సాహిత్యసేవ చేస్తున్నాయి.

### సాహిత్య రంజని :

జిల్లా కేంద్రమయిన సంగారెడ్డి 1997 మార్చి 30న స్థాపించబడిన సంస్థ సాహిత్య రంజని ఈ సంస్థ వ్యవస్థాపక అధ్యక్షుడుగా శ్రీముళ్ళపూడి సచ్చిదానంద మూర్తిగారు ప్రధాన కార్యదర్శిగా పైడిమర్రి మనోహర్ ఈ సంవత్సర కార్యవర్గంగా

కార్యక్రమాలు నడిపిస్తున్నారు. సంవత్సరానికో కొత్త కార్యవర్గం ఈ సంస్థకు ఏర్పాటవుతుంది. సంగారెడ్డి పట్టణంలో సాహిత్య సమావేశాలు నిర్వహిస్తూ కవిసమ్మేళనాలు కవితల పోటీలు సాహితీ వేత్తల ఉపన్యాసాలు నిర్వహింపబడుతున్నాయి.

## గోలకొండ కవుల సంచికలోకెక్కిన మెదకు కవులు

1. విఠాల చంద్రమౌళి శాస్త్రి శతవాధాని
2. బచ్చురామన్న గుప్త
3. భాగవతము సీతరామశర్మ
4 ముదిగొండ వీరేశలింగశాస్త్రి
5. ఘంటంభట్ల వేంకటభుజంగ కవి
6. వరకవి గడ్డం రామదాస కవి
7. శాస్త్రుల వారి అనంతరామశర్మ
8. ఉమాపతి నాగయ్య శాస్త్రి
9. మల్యాల దేవీ ప్రసాద్
10. చిదిరె మఠం వీరయ్యగారు
11. చిదిరె లక్ష్మణ శాస్త్రి
12. రాణి వెంకట లక్ష్మాయమ్మ సర్దేశాయి
13. వేంకట పౌండరీక యాజులు
14. యామవరం వేంకటరాజ శర్మ
15. యామవరం రామశాస్త్రి
16. రాళ్లబండి రాఘవయ్య

# మెదకు జిల్లాలో ప్రముఖులు

## పి.వి. రాజేశ్వర రావు

పి.వి. రాజేశ్వర రావుగారు సిద్దిపేట వాస్తవ్యులు వీరి సేవతో సిద్దిపేట పట్టణ చరిత్ర ముడిపడి ఉంది. సిద్దిపేట ఈ నాటిస్థితికి రాజేశ్వర రావుగారి కృషి అనన్య సామాన్యమైనదని చెప్పవచ్చు.

రాజేశ్వరరావుగారు స్వాతంత్ర్య సమర యోధులు. కాంగ్రేసు పార్టీలో వీరు అనేక బాధ్యతాయుతమైన పదవులు నిర్వహించిరి. సిద్దిపేట నియోజక వర్గము నుండి శాసన సభ్యులుగా ఎన్నికై సిద్దిపేట అభివృద్ధికి ఎనలేని కృషి సల్పిరి.

మెదకు జిల్లాలోనే మొట్టమొదటికళాశాలగా పేరున్న సిద్దిపేట డిగ్రీ కళాశాల స్థాపనము, భవన నిర్మాణము వీరి కృషికి తార్కాణము. ఇప్పటి ప్రభుత్వ బాలికల జూనియర్ కళాశాల భవన నిర్మాణం కూడా వీరి కృషి ఫలితమే

సిద్దిపేటకు విద్యుచ్ఛక్తి సదుపాయం కల్గడం కూడా రాజేశ్వర రావుగారి వల్లనే సంభవించింది.

ఈ విధంగా రాజేశ్వర రావుగారు సిద్దిపేట పట్టణానికి రాజకీయ, విద్యా, సాంస్కృతిక, విద్యుత్, వ్యాపార, వ్యవసాయరంగాలలో ఘనమైన విశిష్టతను సముపార్జించి భవిష్యత్తుకు బంగారు బాటలు వేసినారని నిర్ద్వంద్యముగా చెప్పవచ్చును.

## 'నృత్య కళావతంస ' గజ్వంకార్ రమేష్

రమేష్‌గారు సిద్దిపేటలో జన్మించిరి.

ప్రాధమిక ఉన్నత విద్యాభ్యాసాన్ని సిద్దిపేటలో పూర్తి చేసికొనిరి.

జాతీయ, అంతర్జాతీయ యశో విరాజితులైన సుప్రసిద్ధ నాట్యాచార్యులైన శ్రీ నటరాజు రామకృష్ణగారి శిష్యరికంలో రమేష్‌గారు గొప్ప పేరిణీ శివతాండవ నృత్యకళా వతంసుడుగా రూపుదిద్దు కొన్నాడు.

హైదరాబాదు త్యాగరాయగాన సభా మండపంలో 1987 జనవరిలో సుమారు 310 మంది కవులు రచించిన పాటలకు అనుగుణమైన అభినయంతో నిరాఘాటంగా 48 గంటలు పేరిణీ నృత్యాన్ని ప్రదర్శించి రికార్డు సృష్టించారు.

శ్రీరమేష్‌గారు మారిషస్, జర్మనీ, ఇంగ్లాండు, మరియు కొన్ని ఆఫ్రికా దేశాలలో పర్యటించి విస్తృతంగా ప్రదర్శనలిచ్చి భారతీయ నాట్య కళారంగానికి ఎనలేని కీర్తి నార్జించి పెట్టినారు.

శ్రీ రమేష్‌గారికి 'నృత్యకళావతంస' అనే బిరుదము ప్రదానము చేయబడినది.

మెదకు మండల సాహిత్య పరిషత్తు వార్షికోత్సవాలు గజవెల్లిలో జరిగిన సందర్భంలో శ్రీ రమేష్‌గారు తన పేరిణీ శివతాండవాన్ని ప్రదర్శించి ఆ సభలకే వన్నె తెచ్చినారు.

శ్రీ రమేష్‌గారు ప్రస్తుతము హైద్రాబాద్‌లో 'పేరిణి ఆర్ట్ అకాడమి' ని స్థాపించి నాట్య కళామతల్లి సేవలో జీవితాన్ని చరితార్థం చేసుకొంటున్నారు.

## రాఘవాచారి

మెదకు జిల్లాలో మారుమూలనున్నది మనూర్ మండలం. అక్కడపుట్టి పెరిగి అక్కడే ఉపాధ్యాయ వృత్తి నెరపుచున్న రాఘవాచారి రాష్ట్రపతి చేతుల మీదుగా అవార్డు పొంది మెదకు జిల్లాకే గర్వకారణమైనాడు.

రాఘవాచారి 1965 లో ఉపాధ్యాయ వృత్తిలో చేరి 1975 లోనే ఉత్తమ ఉపాధ్యాయునిగా గుర్తింపబడిరి. 1984 రాష్ట్రస్థాయిలో ఉత్తమ ఉపాధ్యాయునిగా ఎన్నికైరి.

1985 లో ఎన్.సి.ఆర్.టి న్యూఢిల్లీ వారిచే సామూహిక గేయములను పాడడంలో, తోలుబొమ్మలాటలను ప్రదర్శించడంలో శిక్షణపొందిరి.

1990లో భారత ఉపరాష్ట్రపతిచే ఉత్తమ ఉపాధ్యాయ అవార్డును; 1992 లో జాతీయ స్థాయిలో ఉత్తమ ఉపాధ్యాయ అవార్డును భారత రాష్ట్రపతి శంకర్‌దయాళ్ శర్మగారి కరకమలముల ద్వారా నందుకొనిరి.

## కుమారి పావని

మెదకు జిల్లాలో వయసుపండిన మేధావులతో పాటు చిన్నారి పావని కూడా పరిగణించదగిన స్థానంలో ఉంది.

ప్రతిభకు వయస్సుతో పనిలేదని నిరూపించిన కుమారి పావని ఒక పాటుగాని, శ్లోకంగాని, గేయంగాని ఒకటి రెండు సార్లు వింటేచాలు టేప్ రికార్డువలె తిరిగి తాను వినిపిస్తుంది. భావ, రాగ, తాళాలను ఏమాత్రం తప్పకుండా పాడించి పాడినట్లుగా విన్పించి శ్రోతల్ని మంత్ర ముగ్ధులను చేస్తుంది.

మెదకు జిల్లా పాపన్న పేట గ్రామంలో బ్రాహ్మణ కుటుంబంలో న్యాయవాద వృత్తిలోనున్న జి.ఆర్. రామారావు గారి ఏకైక కుమార్తె కుమారి పావని.

నాలుగు సంవత్సరాల వయస్సులోనే తన తాతగారు పుస్తకం చూస్తూ విష్ణుసహస్రనామ పారాయణాన్ని రాగయుక్తంగా చదువుతుంటే తాతయ్య పాడుతున్న దాంట్లోని తప్పును ఎత్తిచూపి సరి చేసింది. నీకెలా తెలుసని తండ్రి అడిగినపుడు ప్రతి వారం

రేడియోలో వచ్చే సుబ్బలక్ష్మి విష్ణుసహస్రనామం వింటానని బదులిచ్చింది ఆశ్చర్యపోయిన తండ్రి వినిపించమని కోరగా మొత్తం విష్ణుసహస్రనామాలను జంకకుండా ఎం.ఎస్. సుబ్బలక్ష్మి వలనే భావ, రాగ, తాళ యుక్తంగా పాడి విన్పించింది. అంతేగాక తాను అప్పటి వరకు విన్న పాటలను పాడి విన్పించింది. తెలుగులోనివే కాక హింది మొదలగు ఇతర భాషల పాటలను కూడా ఒక మారు వించే చాలు అట్లే పాడి విన్పింస్తుంది.

పావని ఐదవి ఏట మెదకులోని సరస్వతీ శిశుమందిర్ వార్షికోత్సవ సందర్భంగా విష్ణుసహస్ర నామాలు, దేశభక్తి గేయాలతో పాటు యం. యస్. రామారావు స్వరపరచి గానం చేసిన సుందర కాండలోని కొంత భాగాన్నీ విన్పించి సభాసదులందరిని ఆనంద డోలికలలో ముంచి బహుమతినందు కొనినది.

పద్మ మోహిన్ ఆర్ట్స్ క్రియేషన్ పక్షాన మెదకు సంగం థియేటరులో జరిగిన కార్యక్రమంలో పావని పాటలు పాడి సినీనటుడు డా. ప్రభాకర్‌రెడ్డిచే అభినందనలను పొందినది.

రాష్ట్రస్థాయిలో తన ప్రత్యేక స్థానాన్నీ సంపాదించి బాలమేధావి అవార్డును ప్రభుత్వము ద్వారా సాధించింది.

ఈ విధముగా పావని తన జ్ఞాపకశక్తితో మేధావులను సైతం ఆశ్చర్యపరుస్తూ జిల్లాకో ఘన కీర్తిని సంపాదించింది.

## వేనోళ్ళ కీర్తినందుకున్న విశ్వనాథ శాస్త్రి

జాతీయ స్థాయిలో శివ్వంపేటకు ఒకగుర్తింపు తెచ్చిన వ్యక్తి శాస్త్రుల విశ్వనాధ శాస్త్రి. ఆయుర్వేదం, వేదాంతం, తర్కం, మీమాంస తదితర శాస్త్రాలలో అనేక తంత్రాలలో ప్రావీణ్యత సంపాదించి జాతీయ నాయకులతో విశ్వనాధ శాస్త్రి సన్మానం పొందారు. 1925 సంవత్సరం ఫిబ్రవరి 14 శివ్వంపేటలో జన్మించిన శాస్త్రి ప్రాధమిక విద్యను ఇక్కడే పూర్తి చేశారు. వేద సంస్కృతంపై గల అభిమానంతో మద్రాసుకు వెళ్ళి మద్రాస్ సాంస్క్రిట్ కళాశాలలో చేరి శిరోమణి వరకు చదవి 1945లో తిరిగి ఆంధ్రప్రదేశ్‌కు వ్చచారు. శాస్త్రికి దేశం గర్వించే శ్రీ హరిహరానంద స్వామితో (కరపత్ర స్వామి)తో పరిచయమేర్పడిన అనంతరం అనేక ధర్మ శాస్త్రులను అవలోకించారు. శాస్త్రి బాల్యం మంచి వైదిక ధర్మంలో అభినివేశం ఎక్కువ. 16వ సంవత్సరాలకే 'శారద ఆక్టు ఖండన' ప్రచారంలో పాల్గొని అనేక గ్రామాల్లో పర్యటించారు. పాకిస్తాన్ విభజన సమయంలో అఖండ భారతదేశానికై ప్రచారం చేసి విభజనకు వ్యతిరేకంగా ప్రదర్శనలు నిర్వహించారు. పార్లమెంటులో హిందూకోడ్ ప్రవేశ పెట్టినపుడు దానికి వ్యతిరేకంగా ప్రచారం చేస్తూ హిందూకోడ్ బిల్లును వ్యతిరే కించారు. శ్రీ హరిహరానంద స్వాముల వారు స్థాపించిన ధర్మ సంఘానికి ఆంధ్ర ప్రదేశ్ శాఖ అధ్యక్షుడై గోహత్య నిషేధంపై ప్రచారం చేశారు. విశ్వనాథ శాస్త్రి అనేక భాగవత సప్తాహాలను నిర్వహించి శృంగేరి జగద్గురు సమక్షంలో మహా రుద్రయాగం నిర్వహించారు. విశ్వనాధ శాస్త్రి ప్రతిభకు ముగ్ధులై శృంగేరి స్వామివారు హైదరాబాద్‌లో విశ్వనాధ శాస్త్రిని గజరోహణ చేసి ఊరేగింపుతో గౌరవించారు. శ్రీశైల శిఖర ప్రతిష్ఠ, కాళేశ్వరంలో ముక్తేశ్వరుని ప్రతిష్ఠ ఆయన ఆధ్వర్యంలోనే జరిగాయి. హైదరాబాద్ ఎగ్జిబిషన్ గ్రౌండ్‌లో సహస్ర చండీయాగం సోమయాగంలకు విశ్వనాధ శాస్త్రి ఆచార్యత్వం వహించారు.

శృంగేరి స్వామివారు శాస్త్రిని తమ ఆస్థాన పండితునిగా నియమించి తగు రీతిలో గౌరవించారు. కంచి పీఠాధిపతి పరమాచార్య స్వామి వారు శాస్త్రి గారి వాద ప్రతివాదనలు విని రత్నాంగుళీకంతో సన్మానించారు. అప్పటి భారత ప్రధాని లాల్ బహదూర్ శాస్త్రి షష్టిపూర్తి ఉత్సవ కమిటీకి విశ్వనాథ శాస్త్రి అధ్యక్షునిగా నియమితులయ్యారు. ఆయాన రచించిన **విశ్వ శతాబ్ది** గ్రంథం చూసి ఆయన ప్రతిభకు ముగ్ధులై లాల్ బహదూర్ శాస్త్రి '**అభినవ విద్యారణ్య**' అనే బిరుదుతో సత్కరించారు.

తర్వాత శ్రీమతి ఇందిరాగాంధీ, పి.వి. నరసింహరావులచే సత్కారం పొందారు. ఆచార్య రంగా శాస్త్రి ప్రతిభకు అబ్బురపడి "జాతీయ కవి" అను బిరుదుతో, మెదక్ మండల సాహిత్య పరిషత్ వారు అభినవ పోతన బిరుదుతో సత్కరించారు. ఆంధ్రప్రదేశ్ 'పురోహిత బ్రాహ్మణ వేద విద్యా పీఠం' అను సంస్థను స్థాపించి ఎందరో విద్యార్థుల జీవితాలకు మార్గదర్శకులుగా నిలిచారు. శాస్త్రిగారు రఘువంశం, శతాబ్ది గ్రంథం, వ్యాసమీమాంస, జ్యోతి ర్మీమాంస, శాతశ్లోకీ, ఏడుపాయల స్థల మహాత్మ్యం తదితర రచనలు చేశారు. శాస్త్రి పలు అష్టావధాన కార్యక్రమాలను నిర్వహించరు. 1952లో ప్రభుత్వ ఉపాధ్యాయునిగా ఉద్యోగం నిర్వహించి తర్వాత సికింద్రాబాద్‌లోని మున్నాలాల్ సంస్కృత పాఠశాలలో ప్రిన్సిపాల్‌గా, హైదరాబాద్‌లోని ఆయుర్వేదిక ఆసుపత్రిలో అసిస్టెంట్ డైరెక్టర్‌గా పదవీ బాధ్యతలు నిర్వహించారు. కాగా తాను స్థాపించిన వేద విద్యా పీఠ నిర్వహణకై స్వచ్ఛందంగా పదవీ విరమణ చేశారు. కేంద్ర ప్రభుత్వం ఇచ్చే ఆర్థిక సహాయంతో విద్యా పీఠాన్ని నడిపించే ఎందరో పేద విద్యార్థులను వేద వేదాంత విద్యల్లో ప్రావీణ్యత పొందే విధంగా చేశారు. గొప్ప పండితుడు, సనాతన మతాభినివేశం గల విశ్వనాథ శాస్త్రి 1986 మే 23న పరమపదించారు. శాస్త్రిగారికి భార్య, ఒక దత్తపుత్రుడు, ఇద్దరు కుమారులు వున్నారు. ప్రతి సంవత్సరం విశ్వనాథ శాస్త్రి వర్ధంతి సందర్భంగా అతని శిష్యులు రాష్ట్రంలో పేరొందిన పండితులను సన్మానిస్తారు.

## కేవల్‌కిషన్

మెదకు జిల్లాలో చిన్న శంకరంపేట మండలంలో తుర్కాల మాందాపూర్ గ్రామంలో కేవల్ నారాయణ మున్నమ్మ ముద్దుల బిడ్డడుగా కేవల్ కిషన్ క్రీ.శ. 1920లో జన్మించిరి.

హైద్రాబాదు ఉస్మానియా యూనివర్సిటీలో ఎం.ఏ. వరకు విద్యాభ్యాసమొనర్చిరి. ఆ కాలములో అంతటి విద్యావంతులుండుట చాలా అరుదు.

చదువుతున్న రోజుల్లోనే జోగిపేటలో ప్రథమాంధ్ర మహాసభలు ఆయనను రాజకీయ జీవితం వైపు మరల్చినవి. క్రీ.శ. 1936లో ఎం.యన్.రామ్ నలినీ బుకేష్ గుప్త, యస్. ఎ. డాంగే ఆధ్వర్యంలో దేశవ్యాప్తంగా కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భవించింది.

కేవల్ కిషన్ విద్యార్థి దశలోనే కమ్యూనిస్టు పోరాట కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొనేవాడు.

మెదకు డివిజన్‌లో కాట్ర్యాల్, పాతూర్, అక్కన్నపేట, జక్కన్నపేట, మాసాయిపేట తదితర గ్రామాలలో అనేక భూపోరాటాలు చేసి నిరుపేద రైతాంగానికి వేలాది ఎకరముల భూములనిప్పించి వాటిపై ప్రభుత్వ పరంగా శాశ్వత హక్కుల నిప్పించినాడు. ఈ కార్యక్రమంలో భాగంగా కేవల్‌కిషన్ తిరుగని గ్రామంలేదనుట అతిశయోక్తి కాదు. పేదల్లో తానూ పేదవాడై వాళ్లు పోసిన గంజి తాగినాడు. లంబాడోళ్లయిండ్లలో జొన్న గటిక తిని కడుపు నింపుకున్నాడు. ఇళ్లు లేని వారికి ఇళ్ల స్థలాలు ఇప్పించినాడు. అప్పట్లో తహసీల్దార్ ఉద్యోగమిస్తామని ప్రభుత్వం సందేశం పంపితే వద్దు పొమ్మన్నాడు. బీద సాదల కోసం పోరాటం సాగించినాడు.

మెదకు పట్టణంలోని దుబ్బితోటలో 120 ఎకరాల తాతలనాటి స్వంత భూమిని పేదలకు పంచినాడు. వారందరికి ఇండ్లు కట్టించినాడు. అది నేటికి 'కేవల్‌కిషన్ బస్తీ' గా పిలువబడుతున్నది.

మెదకు ప్రాంతంలోని ఓ చెరువు నిర్మాణంతో అనేక మంది పేదవారి జీవితాలకు భంగం వాటిల్లుటను గమనించి ఆ చెరువు నిర్మాణాన్ని ఆపించే ప్రయత్నం చేసినాడు. నిజాం నవాబు మిలటరీ దళాల కాపలాతో చెరువు కట్ట నిర్మాణం పూరించినాడు. చెరువు నీటిలో పేదలయిండ్లు మునిగి పోయే పరిస్థితి సంభవించింది.

కేవల్ కిషన్ ఉగ్ర నరసింహుడైనాడు. పేదల యిండ్లు నీటి ఆలుగా కుండా కాపాడినాడు. ఎక్కడ అన్యాయం జరిగితే అక్కడ కేవల్‌కిషన్ ప్రత్యక్షమై బీదల పక్షాన పోరాడేవాడు. దోపిడీ దారుల, పెత్తం దారుల గుండెల్లో బల్లెంగా నిలిచేవాడు.

నిజాం రాజ్య విమోజనోద్యమంలో చురుకుగా పాల్గొన్నాడు.

స్వతంత్ర్యం వచ్చిన తొలి సార్వత్రిక ఎన్నికలలో పీపుల్స్ డెమొక్రటిక్ ఫ్రంట్ తర పున మెదకు శాసనసభా నియోజక వర్గానికి పోటీచేసి కేవలం 900 ఓట్ల తేడాతో ఓటమి చెందినాడు. ఆరుట్ల రామచంద్రారెడ్డి ఆధ్వర్యంలో కేవల్ కిషన్ రాష్ట్ర కమ్యూనిస్టుగా నాయకునిగా గుర్తింపు పొందినాడు. ఆయన స్ఫూర్తితో చిలుముల విఠల్ రెడ్డి, నల్లమలగిరి ప్రసాద్, చంద్ర రాజేశ్వరరావు వంటి వారు కామ్రేడ్లుగా ఎదిగినారు.

తేది 26 డిసంబర్ 1960 న నిరుపేదల ఉద్ధరణలో భాగంగా నేటి వెల్దుర్తి మండలం మాసాయి పేట గ్రామానికి వెల్లి పని ముగించుకొని తిరిగి వచ్చే సమయం లో రాత్రి 11 గంటలకు పోలంపల్లి చౌరస్తా వద్ద కేవల్‌కిషన్ మోటర్ సైకిలును లారీ ఢీ కొన్నది. కేవల్ కిషన్, అతని అనుచరుడు యిరువురూ ఆ ప్రమాదంలో మరణించినారు. మరణించిన చోట కేవల్ కిషన్ ప్రతిమను నిర్మించినారు. ఇప్పటికి ఆ సమాధి వద్ద ప్రతి సంవత్సరం జాతర సాగుతుంది. ఈ ప్రమాదాన్ని పెత్తందారీ కుట్రగా ప్రజలు నమ్ముతారు.

ఈ విధముగా మెదకు జిల్లాలో ధనవంతుల యింట పుట్టి గొప్ప విద్యావంతుడై పేదవారికోసం తన ధన, ప్రాణాలను సర్వస్వం అర్పించిన కేవల్ కిషన్ నేటికి చిరస్మరణీయుడు.

## ఆచార్య గోపాల కృష్ణారావు

మెదకు జిల్లాలో పుట్టి ప్రాథమిక విద్యాభ్యాసం ఇక్కడేచేసి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రముఖ స్థానమైన తెలుగుశాఖకు అధ్యక్షులుగా ఎనలేని భాషా సేవ చేసిన ఆచార్య గోపాలకృష్ణరావుగారు జిల్లా సాహితీరంగంలో మణిపూసవంటి వారు.

గోపాలకృష్ణరావు గారు మెదకు జిల్లా సంగారెడ్డికి సమీపమందలి తాళ్లపల్లి గ్రామమున జన్మించిరి ప్రాథమిక విద్య సంగారెడ్డిలో పూర్తి చేసి ఉన్నత విద్యలు హైద్రాబాదులో అభ్యసించిరి. 1949లో వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఏ. ఉత్తీర్ణతనందిరి ఆనాటి విద్యావ్యవస్థలో తప్పని సరిగా నేర్చుకొనవలసిన ఉర్దూ, ఫారసీ భాషలలో చక్కని పాండిత్యమును సంపాదించి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకులుగా చేరిరి.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో "ఆంధ్ర శతక సాహిత్య వికాసం" మీద అపూర్వ పరిశోధనా గ్రంథాన్ని అందించి తెలుగు సాహిత్య మణిహారంలో ఒక అమూల్య వజ్రాన్ని పొదిగిరి.

ఉర్దూ, ఫారసీ భాషలలో పాండిత్యాను కల్గియుండటచే తెలుగులో కనుపించే 'అన్యదేశ్యాల' పై సాధికారమైన వ్యాసాలనెన్నింటినో ప్రచురించిరి.

తెలుగుపై అరబ్బీ, ఫారసీల ప్రభావం తెలుగు పై ఉర్దూ భాషాప్రభావం అనే అంశాలపై పరమ ప్రామాణికమైన గ్రంధములను వెలయించిరి.

ఈ గ్రంథానికి సాహిత్య అకాడమీ బహుమతి లభించినది. తెలుగు, ఉర్దూ నిఘంటువును వీరు సిద్ధము చేయగా దానిని అంజుమన్ తరఖివారు ప్రచురించిరి. విశ్వవిద్యాలయ తెలుగు శాఖ అధ్యక్షులుగా పదవీ విరమణ చేసేసమయంలో అన్యదేశ్యకోశంను పూరించిరి సాహిత్యంలో వినూత్న అంశాలను అందించిన వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగుశాఖకు అధ్యక్షులుగా రెండేళ్లు పని చేసిరి. ఆ తర్వాత బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఛైర్మన్ పదవిని నిర్వహించిరి. 1986 వ సంవత్సరంలో పదవీ విరమణ చేసిన తర్వాత కూడా ప్రొఫెసర్‌గా కొంత కాలము పని చేసిరి.

ఈ విధముగా బహుప్రామాణిక గ్రంధ రచయితగా ఉపన్యాసకులుగా, తెలుగు శాఖ అధ్యక్షులుగా, భాషా సేవయొనరించినారు.

## గద్దర్

మెదకు జిల్లా గజ్వేల్ తాలూకా తూప్రాన్ మండలంకు చెందిన పేద దళిత కుటుంబంలో గుమ్మడి శేషయ్య, లక్ష్మమ్మలకు 1948లో ఐదవ సంతానంగా జన్మించినాడు. ఇతని పేరు గుమ్మడి విఠల్. తూప్రాన్ ఉన్నత పాఠశాలలో చదువుకొనే రోజుల్లోనే ప్రతిసారి సాంస్కృతిక కార్యక్రమంలో ఎంతో ఉత్సాహంగా పాల్గొనేవాడు. ఒకవైపు విద్యనభ్యసిస్తూనే సమయం దొరికనప్పుడు కుటుంబానికి చేదోడు వాదోడుగా ఉంటూ వచ్చాడు. ఇంజనీరింగ్ చదువు తున్న రోజుల్లో తెలంగాణా ఉద్యమం రావడం, గద్దర్ తెలంగాణాపై పాడిన పాటలు ప్రజాదరణ పొందినవి. అప్పట్లో ఆయన రాసిన సుమారు 50 పైగా పాటలు పెత్తందారీ వ్యవస్థనుగజ గజలాడించాయి.

ఆ సమయంలో గద్దర్ 'జననాట్యమండలి' అనే సంస్థను విప్లవ రతయితల సంఘం ప్రోద్భలముతో స్థాపించారు. నాటి వ్యవస్థలో బ్రతుకు భారంగా జీవనం సాగిస్తున్న ప్రజల కష్టాలను పాటల రూపంలోమలచి దళిత వర్గాలు, కమ్మరి, కుమ్మరి, మంగళి, కంచరి కులాలు ఏ విధంగా బ్రతుకెల్లదీస్తున్నరో పాటల రూపంలో వివరించేవాడు. తమ హక్కులేమిటో తెలుసుకో లేని దుర్భర జీవితం గడుపుతున్న, బడాస్వామ్య వర్గాల చేతుల్లో నలిగిపోతున్న తెలంగాణా ప్రజల అశక్తిపై పెత్తందారి వ్యవస్థపై తనదైన బాణీలో భావాలను పాటల రూపంలో పాడుతుంటే పల్లెప్రజలు వారిపై దాడి చేసే విధంగా ప్రజలను చైతన్యం చేయ గలిగాడు. కాళ్లకు గజ్జెగట్టుకొని, ఒక చేత్తో ఎర్రశెల్ల, ఇంకో చేత్తో డప్పు వాయిస్తూ గోచి ధరించి, భుజాన గొంగళి వేసుకొని తనదైన బాణిలో పాడేవాడు.

ఆ బాణీతో ప్రభుత్వానికి, రాజకీయ నాయకుల గుండెల్లో గుబులు పుట్టించాడు.

చిన్నతనంలో తన తల్లి పడుతున్న కష్టాన్ని చూచి, ఇంటి ప్రక్కన చెట్టు క్రిందకు వచ్చి ఆలోచిస్తున్న సమయంలో తన తల్లి కష్టానికి "సిరిమల్లె చెట్టు క్రిందిలచ్చిమమ్మో లచ్చిమమ్మో, చిన్నబోయి కూర్చున్నావెందుకమ్మో" అంటూ తన తల్లి కష్టాలను అప్పటికప్పుడు పాట రూపంగా మార్చాడు.

పీపుల్స్‌వార్ పోరాటాలకు, ఉద్యమాలకు, అమర వీరులకు జోహార్లు అర్పించుటకు తను రాసిన పాటలు ఉద్యమస్ఫూర్తికి, ప్రజల కంటతడికి కారణ భూతులయినాయి. 1986 లో కెనరా బ్యాంక్ ఉద్యోగం చేస్తున్న గద్దర్ ప్రభుత్వ నిర్బంధత కారణంగా అజ్ఞాతంలోకి వెళ్లారు. 1990లో జనజీవన స్రవంతిలో అడుగిడిన గద్దర్ జననాట్య మండలి ఆధ్వర్యంలో రచించిన పాటలను సినిమాలకు అమ్ముతున్నారని అభియోగంపై పార్టీ నుండి బహిష్కరింపబడ్డారు.

రాష్ట్రంలో ఎన్‌కౌంటర్‌లపై తీవ్రంగా వ్యతిరేకిస్తూ శవాన్ని వెలికితీసి పర్యవేక్షించేందుకు శవాల వెలికితీత కమిటీని ఏర్పాటుచేసారు. దేవీప్రియా గద్దర్ పై "యుద్ధనౌక గద్దర్" అనే డాక్యుమెంటరీ నిర్మించింది.

## భాస్కరాయుని రామచంద్ర శర్మ
## గోమారం

క్రీ.శ. 1910 వ సంవత్సరం పప్రభవ నామ సంవత్సర ఆశ్వీయుజ శుభపూర్ణిమ రోజున భాస్కరాయుని రామయ్య, రాధమ్మ దంపతుల తృతీయ సంతానముగా జన్మించిన బాలుడే రామచంద్రశర్మ.

చిన్ననాట వేదాధ్యయనము, పౌరోహిత్య సంబంధమైన చదువులు చదువుకొనెను.

ఈతని పదవయేట దౌలతాబాదు గ్రామములో మాణిక్యప్రభు దేవాలయమున అర్చకునిగా చేరెను. ఆ దేవాలయమున అర్చకత్వమును జేయుచు మెల్లమెల్లగా ఉర్దూనేర్చుకోనారంభించెను.

రాత్రి పూజ ముగించుకొని దౌలతాబాదు నుండి తుర్కల ఖానాపూర్ గ్రామమునకు వెళ్లి ఆ గ్రామ ప్రభుత్వ పాఠశాలలో పనిచేయు ఉస్తాద్ (ఉపాధ్యాయుని) వద్ద ప్రైమరీ పరీక్ష (నాల్గవ తరగతి) పాఠములు చెప్పించుకొని తెల్లవారు సరికి తిరిగి దౌలతాబాదుకు చేరువాడు. ఈ విధముగా రెండు సంవత్సరములు శ్రమ చేసి ప్రైమరీ పరీక్ష ఉత్తీర్ణుడయ్యెను. ఆ తర్వాత ఆవుస్తాదు వద్దనే చదువుకొని మిడిల్ పరీక్ష (ఏడవ తరగతి) ఉత్తీర్ణుడయ్యెను.



చుక్కల పళ్ళెము




మట్టి పాత్రల మీద చిహ్నములు మరియు గీతలు



కపిలవర్ణపు మట్టి పాత్ర



మాతృదేవత - మట్టి బొమ్మ



మట్టి పతకము



మాజీ ముఖ్యమంత్రి కీ.శే. టి. అంజయ్యగారు




1961లో హైదరాబాద్‌లో విశ్వనాథశాస్త్రిని ఏనుగుపై ఊరేగిస్తున్న దృశ్యం



స్వాతంత్ర్య సమరయోధుడు - **సదాశివశర్మ**

ఆ సమయమున మిడిల్ పరీక్ష పాసైనచో ఎంతో విలువయుండెడిది. ఆనాటి తహసీల్ దారుకు ఈతని విషయము తెలిసినది. తన వద్ద నాయబ్ సాబ్గా నుండుటకు ఏర్పాట్లు చేస్తానని చెప్పినను శర్మగారు అందుకు అంగీకరించలేదు. దౌలతాబాదులోనే సర్కారు బడి ప్రారంభించి శర్మగారిని సదర్ముదరిస్ (ప్రధానోపాధ్యాయునిగా) నియమించెను. కాని శర్మ గారి వ్యక్తిత్వము ఉద్యోగ బంధనాలలో యిముడునది కాదు. స్వతంత్ర భావములు గలిగిన స్వతంత్ర జీవనము ఆయన విధానము అందుకే ఎక్కువ రోజులు ప్రభుత్వోద్యోగమును చేయలేక దానిని వదలిపెట్టెను.

స్వగ్రామమైన గోమారం చేరి వ్యవసాయమును ప్రారంభించెను. అప్పటి తహసీల్దార్ కోరిక మేరకు గోమారం కరణీకం చేయుటకు అంగీకరించెను.

ఒకనాడు గ్రామమునకు గిర్దావర్ శర్మ గారిని రమ్మని కబురంపెను. శర్మగారు పూజా కార్యక్రమమున నుండిరి. వెంటవెంట మచ్కూరీలు ఇంటికి వచ్చి పిలుచుచుండిరి. పూజ ముగించుకొని కచేరికి పోయిన శర్మగారిని గిర్దావరీ ఆలస్యమునకు కారణమడిగెను.

అప్పటికే ఆ ఉద్యోగమును వదులుకొన దలచి శర్మగారు తాను పట్వారీగా చేయలేనని రాజీనామా యొసగి ఇల్లు చేరిరి.

ఒకరి ఆధీనమున పని చేయుట వీరికి గిట్టని పని స్వశక్తితో స్వతంత్రముగా జీవించుట వీరి అభిమతము.

మెదకు జిల్లాలో ఆంధ్రమహాసభతో భారతదేశ స్వాతంత్ర్య పోరాటము ప్రారంభమైనది కాంగ్రెసు పార్టీ స్వాతంత్ర్య సంగ్రామమునకు పిలుపునిచ్చినది. నిజాం సర్కార్ కాంగ్రెసు పార్టీని బహిష్కరించినాడు. దిన పత్రికలు చదువుట కూడా ఆనాడు నేరముగా భావింప బడుచుండెను. మరొక వైపు రజాకార్ ఉద్యమము ఆరంభమైనది. గ్రామములలో అశాంతి నెలకొనినది. కమ్యూనిస్టులు పల్లెలలో రాత్రులందు ప్రవేశించి ప్రజలలో విప్లవభావములు ప్రబోధించుచుండిరి. దినమున సర్కారు పోలీసులు రాత్రులందు కమ్యూనిస్టులు, ఈ ఇద్దరితో పాటు రజాకార్లు పల్లెల పై బడి ప్రజలను నానా హింసలకు గురి చేయుచుండిరి.

ఇటువంటి సమయమున రామచంద్ర శర్మ గారు గోమారం గ్రామములో శాంతిసేనను ప్రారంభించి 30 మంది యువకులను సిద్ధము చేసిరి. వారందరికి తెల్లని నిక్కరు, తెల్లని చొక్కా, తెల్లటోపిలు కుట్టించబడెను. వంతుల వారిగా గ్రామ కాపలాను ఈ శాంతిసైన్యము చేయుచుండెను. గ్రామములోనికి సర్కారు పోలీసుగాని, రజాకారులుగాని,

కమ్యూనిస్టులుగాని ప్రవేశించుటకు వీలు కల్పించక గ్రామమున శాంతి భద్రతలు కాపాడుటలో వీరి నాయకత్వము వీరి ధైర్య సాహసములు అనితర సాధ్యములు అని చెప్పవచ్చును.

భజన మండలిని ఏర్పాటుచేసి రాత్రులందు గ్రామమున డిబొడ్డున భజన కార్యక్రమమును నడిపించెడివాడు ఈ కార్యక్రమము ద్వారా రాత్రులందు గ్రామమునకు ఇతరులు ప్రవేశించకుండా చేయుటేగాక గ్రామస్థులలో భక్తి, ఆరాధనా భావములు కల్గించుచుండెను.

వీరి నాయకత్వమున శాంతిసేనలో హిందువులేకాక మహమ్మదీయులు కూడా పనిచేయు చుండిరి.

రామచంద్రశర్మగారు మానవత్వమును అధికముగా గౌరవించెడివారు. మతసహనము ఆయనకు వెన్నతో పెట్టిన విద్య, మచ్చునకు వారి మానవతా విలువను గురించి ఒక్క సంఘటన గోమారం గ్రామము నుండి మహమ్మదీయులలో ఉస్మాన్ అనేవాడు మాత్రము రజాకార్లలో చేరెను.

నిజాం స్టేట్‌పై పోలీసు చర్య జరిగిన అనంతరము హిందువులు మహమ్మదీయులపై ప్రతీకార చర్యలు తీసుకొనుచుండిరి. ఆ సమయమున గోమారం గ్రామస్థులు ఉస్మాన్‌ను పట్టుకొని చంపుటకై బురుజు క్రిందికి తెచ్చిరి. పూజకై పోవుచున్న శర్మగారు ఆ దృశ్యమును చూచి తాను పూజ ముగించుకొని వచ్చువరకు ఆపుమని చెప్పి సాయంత్రము వరకు దేవాలయములో పూజలో నేయుండెను. శర్మగారి ఆజ్ఞలేక ఉస్మాన్‌ను చంపుటకు గ్రామస్థులు ధైర్యము చేయరైరి. పూజ ముగించుకొని వచ్చి ఉస్మాన్‌కు క్షమాభిక్ష పెట్టి అతనిని వదిలి వేయమని గ్రామస్థులకు చెప్పగా శర్మగారి ఆజ్ఞ ప్రకారము ఉస్మాన్‌ను చంపక వదిలివేసిరి.

స్వాతంత్ర్యము వచ్చునాటికి గోమారం గ్రామము చాలా చిన్న పల్లెటూరు. ఏ విధమైన సౌకర్యములు లేని కుగ్రామము. రామచంద్రశర్మ గారి దృష్టి గ్రామాభివృద్ధివైపు మళ్లినది.

మొట్టమొదట విద్యావకాశము కల్పించుటకై ఒక పాఠశాలను స్థాపించి ఇద్దరు ఉపాధ్యాయులను నియమించెను. ఆ పాఠశాలకు ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలగా గుర్తింపు లభింపజేసెను.

1956 నాటికి ముగ్గురు ఉపాధ్యాయులతో 4వ తరగతి వరకు ప్రభుత్వ పాఠశాల నడుపబడుచుండెను 5వ తరగతి ప్రారంభించు సంకల్పము కలిగి దాని మంజూరికై 6 అనవరతము శ్రమయొనర్చెను.

ఆరోజులలో 5వ తరగతిని ప్రారంభించుటకు డి.పి.ఇ (మొహత్మన్) నుండి ఉత్తర్వులు వెలువడవలసి యుండెను.

అందుకు ప్రజలు ఒక వేయిరూపాయలు డిపాజిటు చేసి ఐదు సంవత్సరములు ఉచితముగా పాఠశాలా భవనమునిచ్చుట అవసరము.

రామచంద్ర శర్మగారు వాటినన్నింటిని పూర్తి చేసి 5వ తరగతి మంజూరిని పొందిరి. విద్యార్థులను చుట్టు ప్రక్కల 20 కిలోమీటర్లలోనున్న గ్రామముల నుండి తీసుకొని వచ్చి పాఠశాలలో చేర్పించి వారికి ఉచిత భోజన వసతులు గల్పించెను.

1959 లో ఉన్నత పాఠశాల అనుమతికై తీవ్ర కృషి యొనర్చి సాధించెను. వరికోతల వద్దకు వెళ్లి ధాన్యమునుసేకరించి పాఠశాలకు అనుబంధముగా విద్యార్థుల ఉచిత భోజన వసతి గృహమును (హాస్టల్) ఆనాటి కలెక్టర్ శ్రీ టి.యన్.కపూర్ గారి చేతుల మీదుగా ప్రారంభింపజేసెను.

1961 మార్చిలో మొట్టమొదటి హెచ్.యస్.సి. విద్యార్థులు ఈ పాఠశాల నుండి పరీక్షకు హాజరైరి.

రామచంద్ర శర్మగారు విద్యార్థులను తన స్వంత పిల్లలవలే చూచెడివారు. వేకువజామున 4 గంటలకు హాస్టలుకు వెళ్లి విద్యార్థులను మేల్కొల్పి చదివించెడివారు. ప్రతి రోజు పాఠశాలకు వెళ్లి విద్యార్థుల ఉపస్థితిని గమనించెడి వారు. గ్రామములో ఆనాటికి విద్యావంతులై యువకులైయున్న శ్రీ డి. పద్మారెడ్డి, శ్రీ వి. రామచంద్రారెడ్డిగారులను ప్రోత్సహించి రాత్రులందు ప్రత్యేక తరగతులు తీసికొనునట్లు గావించి విద్యార్థుల విద్యాభివృద్ధికి దోహదమొనర్చు చుండెను.

గోమారం గ్రామమున పోస్టాఫీసు, అంజుమన్ (లార్జ్‌సైజ్డ్ కోఆపరేటివ్ సొసైటీ) పాఠశాల స్వంత భవనములు, తదితర వసతులన్నియు వీరి చేతులమీదుగానే ప్రారంభించబడినవి.

1950కి ముందు గోమారం గ్రామము కనీసము తాలూకా మ్యాప్‌లో కూడా అగుపిం కుండెను. అట్టి 1962 నాటికి జిల్లాలోనే ఒక ముఖ్యమైన పేరెన్నికగన్న గ్రామముగా కీర్తింపబడుటలో శ్రీరామచంద్ర శర్మగారి కృషి అనన్య సామాన్యము. తన స్వంత భూమిని ప్రజావసరములకై పరిత్యజించిన దాన శీలుడీతడు. జిల్లాలో ఉత్తమ గ్రామముగా, ఉత్తమ నాయకునిగా కలెక్టరుచే సన్మానమందిన మహనీయుడు శ్రీ రామచంద్ర శర్మగారు.

నిరాడంబర జీవనము, నిష్కళంకమైన మానసము, ప్రజాసేవా పారీణత, నిండైన దైవభక్తి, ముఖమున చిద్విలాసము, ఆయన సంపాదించిన సంపదలు.

బ్రతికినన్నాళ్ళు ప్రజా సేవయే పరమావధిగా జీవించి తన 72 ఏట 1985 లో పరమ పదించెను.

## కామ్రేడ్ శివకాశం

కౌడిపల్లి మండలంలోని వెల్మకన్నె గ్రామంలో ఒకనిరు పేద కుటుంబంలో శివకాశం జన్మించినారు.

జోగిపేటలో జరిగిన ఆంధ్ర మహాసభలో పాల్గొని ప్రభావితుడై రాజకీయ జీవితం ప్రారంభించాడు.

తెలంగాణా రైతాంగ పోరాట ప్రభావం శివకాశం పై చక్కగా ప్రసరించింది దాంతో 1946లో కమ్యూనిస్టు పార్టీలో చేరి పూర్తి కాల కార్యకర్తగా పనిచేసెను.

భూస్వాములకు వ్యతిరేకంగా ఉద్యమాలను నడిపి వారి నుండి పేదలకు భూములను పంచడమేకాక పాలేర్లపై భూస్వాముల దౌర్జన్యాలను ధైర్యంగా ఎదుర్కొన్నాడు.

మెదక్ జిల్లా రైతు కూలీ అధ్యక్షునిగా కృషిసల్పిన కామ్రేడ్ శివకాశం 22 నవంబర్ 1996లో మరణించెను.

## కరాటే వీరుడు రాథోడ్

మెదక్ జిల్లాలోని మండల కేంద్రమయిన కౌడిపల్లికి చెందిన రాథోడ్ ప్రతాప్‌సింగ్ జిల్లాలో అరుదయిన కరాటే వీరునిగా గుర్తింపునొందు తున్నారు.

1985 నుండి కరాటే విద్యను అభ్యసిస్తున్న ఇతను 1989 లో ప్రపంచ గ్రాండ్‌మాస్టర్ చి.చూ.సూట్ (మలేషియా) ద్వారా "రెడ్‌బెల్ట్" అందుకున్నారు.

కరాటేలో రెడ్‌బెల్ట్ సాధించిన ఈయన రాష్ట్రస్థాయిలో 1991 లో సిల్వర్‌మెడల్‌ను, 1994లో గోల్డ్ మెడల్‌ను సాధించారు. 1995 లో సీనియర్ ఎగ్జామినర్‌గా పదోన్నతిని కూడా పొందారు. హోంశాఖా మంత్రి మాధవరెడ్డి, కార్మికశాఖా మంత్రి తలసాని యాదవ్, కలెక్టర్ రాజీవ్ రంజన్ మిశ్రా మొదలగు ఎందరో ప్రముఖుల ద్వారా ఇతను ఎన్నో ప్రశంసా పత్రాలను, అవార్డులను అందుకున్నారు.

రాథోడ్‌గారు ప్రస్తుతం కౌడిపల్లి, మాచవరం, మెదక్ నిజామాబాద్ జిల్లా నిజాంసాగర్ నవోదయ స్కూల్ మొదలగు ప్రాంతాలలో మొత్తం 300ల మందికి పైగా కరాటే లో శిక్షణనిస్తున్నారు.

## తపుట వెంకటరామయ్య

తవుట వెంకటరామయ్య పుట్టింది మెదకు జిల్లా వర్గల్ మండలం అబార్‌పేట గ్రామంలో, పెరిగింది సికింద్రాబాదులో. తవుట వెంకటమ్మ, రామయ్యలు కన్న తల్లిదండ్రులు. తవుట మహాలక్ష్మమ్మ శంకరయ్యలు పెంచిన తల్లిదండ్రులు. చిన్ననాటి చదువు చెప్పిన దోనేపూడి విశ్వనాథం గారిని నేటికి తన గురువుగా భావించే సహృదయం గురువునకు పాదపూజ చేసే భక్తిభావం వెంకట రామయ్యగారి సద్గుణాలు.

తన 60వ యేట పుట్టినూరు చూసేతలంపు కల్గడం విశేషం. జన్మభూమికి ఏదైన సేవ చేద్దామనే భావనరావడం ఆయనలోని మంచితనానికి నిదర్శనం.

ఆ చిన్న పల్లెలోపిల్లలు చంకన సంచులేసుకొని వర్గల్‌కు చదువుకు పోవడం చూశాడు, కూలిన పాఠశాల భవనం చూశాడు.

ఆక్షణంలో ఆయనలో రూపుదిద్దుకొన్న ఊహలు కార్యరూపం దాల్చాయి సుమారు 2 లక్షల రూపాయలతో పాఠశాలభవనం పరిపుష్ఠమయ్యింది. భవనాన్ని తన స్వంత యిల్లు కట్టుకొంటే ఎట్లా దగ్గరుండి కడతారో అట్లే ప్రతిరోజు సికింద్రాబాదు నుండి అంబారిపేటకు వచ్చి నిర్మాణ కార్యక్రమాన్ని తన అజమాయిషీలో పూర్తి గావించారు. అంతటితో ఆయనకు తృప్తి కలుగలేదు. పాఠశాలకు కావలసిన బెంచీలు, కుర్చీలు, బల్లలు మొదలగు సామాగ్రి కొని తెప్పించాడు. పాఠశాలకై వేసిన బోరు గ్రామస్థులకు కూడా దాహార్తిని తీరుస్తుంది. పాఠశాల నిర్మాణంతో ఊరుకోక ఉపాధ్యాయులను నియమింపచేయడంతో ప్రభుత్వాధికారులను నిరంతరంగా కలిసి ఒక ఉపాధ్యాయుడున్న బడిని నేటికి ఐదుగురు ఉపాధ్యాయుల స్థాయికి పెంచినారు.

ఐదో తరగతి కూడా లేని బడిలో ఏడవ తరగతికై పాటు పడుతున్నాడు.

జిల్లాలోనే కాదు రాష్ట్రంలో ఎక్కడా లేనిరీతిలో అంబార్‌పేట పాఠశాల "ఉపాధ్యాయుల నివాస గృహాల" నిర్మాణాన్నిచేపట్టి పూర్తి గావించు చున్నాడు.

ధనం ఉండటంతో సరిపోదు. ధనాన్ని సద్వినియోగం చేసే మంచి మనస్సు కావాలి.

వీరి అర్ధాంగి శ్రీమతి సరోజిని కూడా వీరి దాతృత్వమునకు ముచ్చట పడుదురే కాని మొగము త్రిప్పుకొనరు.

మెదకు జిల్లాలో విద్యాభివృద్ధికై అనేకులు కృషి చేసినారు. ఎక్కడో పెరిగిన, పట్టణవాతావరణంలో మసలిన, వెంకటరామయ్య కేవలము జన్మభూమి పైనున్న మమకారంతో సత్కార్యములు చేయడం వారి సహృదయతకు సాక్ష్యం అని చెప్పవచ్చు.

## బహుముఖ ప్రజాసేవకుడు రామదాసు

అతి ప్రాచీన చరిత్రకు రంగస్థలమైన తెలంగాణ ప్రాంతం తెలుగు భాషకు, తెలుగు చరిత్రకు అనేక విధాల తోడ్పడుతు వచ్చింది. కానీ కాలక్రమాన జరిగిన కొన్ని రాజకీయ పరిణామాల వలన నిజాం పాలన ప్రాప్తించి ఈ ప్రాంతపు సాంస్కృతిక వికాసం తీవ్ర నిర్బంధాలకు గురియై వెనుకబడి పోయింది. పండితారాధ్యుడు, పాలకుర్తి సోమన్న, భీమన్న, పోతన్న, అద్దంకి, తెలగన్న, అన్నమాచార్యుడు, వీరభద్రుడు, మల్లినాథుడు మొదలైన మహాకవులనుకన్న తెలంగాణ తల్లి అక్కన్న, మాదన్నల తరువాత గొడ్రాలైంది. తెలంగాణ గడ్డపైనే తెలుగు భాషకు ఆదరాభిమానాలు నశించాయి. తెలుగు జాతి నూటికి ముగ్గురకు మించని అక్షరాస్యులతో పౌరసత్వ హక్కులు శూన్యమై, తరతరాలుగా బానిసలుగా మ్రగ్గినరైతు కూలీలు, "నీ బాంచను" దొరా అంటూ బతికారు. ఇటువంటి పరిస్థితిలో, తెలంగాణ ప్రజానాయకులు ప్రథమ ఆంధ్ర మహాసభ అనే సంస్థను స్థాపించారు. ఈ సంస్థయే క్రమంగా అభివృద్ధిచెంది, మహాసంస్థయై తెలంగాణా ప్రజలు అనుభవిస్తున్న రాచరిక నిర్బంధ విధానము నుండి విముక్తి అయ్యే బాధ్యత స్వీకరించింది, దీని కారణంగానే చైతన్యవంతులైన ప్రజలు, మెదక్ జిల్లా, సిద్దిపేటకు (12) మైళ్ల దూరంలో అల్లీపూర్‌లో, స్వాతంత్ర జెండా ఎగుర వేయుటకు ఆ ప్రాంతంలోని ప్రజలు కూడపలుక్కొని, ఈ సమాచారం పోలీసులు జెండా ఎగురవేస్తున్న ప్రజలపై కాల్పులు జరిపారు. ఈ కాల్పుల్లో లక్ష్మయ్య మరణించగా అనేక మంది గాయపడ్డారు. పోలీసులు ఇండ్లలో జొరబడి వున్నవస్తువులు అన్ని దోచుకపోయారు. జెండా ఎగుర వేయుటలో అనాజ్‌పూర్ గ్రామానికి చెందిన వారు కూడా పాల్గొన్నారు, పాల్గొన్న వారిలో బాలుడైన రామదాసు లేత మనస్సుపై ఈ కిరాతకచర్య చెరగని ముద్ర వేసింది. నాటి నుండి రామదాసుకు తెలంగాణ ఉద్యమ నాయకులతో పరిచయమేర్పడి, ఉద్యమ కార్యకర్తగా అభివృద్ధి చెందాడు.

రామదాసు తండ్రి ప్రముఖ ఆయుర్వేద వైద్యుడు. రామదాసుకు కూడా వైద్య విద్యలో కొంతప్రవేశం ఉంది. మెదక్ పట్టణంలో తెలంగాణా విముక్తికి పని చేస్తున్న కామ్రేడ్ కేవల్ కిషన్‌తో పరిచయం ఏర్పడిన రామదాసు 1950లో మెదక్‌కు వచ్చాడు. నాటి నుండి రామదాసు పటేల్ కుంటలలో ఆశ్రమము నిర్మించుకొని, మురికి కూపంగా ఉన్న పటేల్‌కుంటను తనసొంత డబ్బులు ఖర్చుచేసి, మట్టిని, చెత్తను నింపి ప్రజలకు మార్గాన్ని ఏర్పరచాడు. అందుకే ఈ రోడ్డును నేటికీ రామదాసు రోడ్డుగా పిలుస్తారు.

అన్ని వ్యాధులకు మురికియే కారణం అనే ఉద్దేశంతో మెదక్ పట్టణం అంతా తిరిగి మురికి కాల్వలు బాగుచేసేవాడు. అంతేగాక ఆయుర్వేద వైద్యం ద్వారా కొందరికి వైద్య సేవలందించాడు. రామదాసు సేవలను గుర్తించిన కొందరు పురజనులు ఆప్యాయంగా అన్నం, కూరలు పెట్టేవారు. ఈ అన్నంను తన ఆశ్రమములో చదువుకోసం వచ్చిన పేద విద్యార్థులకు పెట్టేవాడు. వైద్యం ద్వారా వచ్చిన డబ్బును, పేద విద్యార్థులకు పుస్తకాలు పెన్సిళ్లు కొనిచ్చి సహాయపడేవాడు.

రామదాసు 1956 సంవత్సరంలో మెదక్ జిల్లా పాలనా కేంద్రం, జిల్లా నడిబొడ్డున వున్న మెదక్‌లో పెట్టకుండా సంగారెడ్డిలో వుండుట వలన అనేక తాలుకాలలోని ప్రజలు ఇబ్బందికి గురి అవుతున్నారనే ఉద్దేశంతో జిల్లా కేంద్రము మెదక్ పట్టణంలోనే ఏర్పరచాలని 1956లో 13 రోజులు నిరాహార దీక్ష చేసినాడు. ఇది ప్రజల ఆందోళనకు దారితీసింది. ఆనాటి రెవెన్యూ మంత్రి కళావెంకట్రావు మెదక్‌కు వచ్చి, విచారించి, జిల్లా కేంద్రం మెదక్‌లో ఏర్పరుచుటకు చర్య తీసుకుంటున్నట్లు ప్రకటించి, రామదాసుకు తన చేతుల మీదుగా నిమ్మరసం యిచ్చి దీక్ష విరమింపచేశారు. కాని కొందరు నాయకుల ద్రోహం వలన ఈకోర్కె నెరవేర లేదు. గృహస్తు జీవితం దేశసేవ చేయుటకు అంతరాయముగా భావించిన రామదాసు తన తల్లి దండ్రులు పెళ్ళి చేసుకోవలసినదిగా చేసిన ప్రతిపాదనను వ్యతిరేకించి, అంకిత స్వభావంతో ప్రజాసేవ చేశాడు.

మనకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత తెలంగాణకు చెందిన అనేక మంది దేశ భక్తులు "గోవా" స్వతంత్రోద్యమంలో పాల్గొన్నారు. రామదాసు కూడా కొందరు ఉద్యమకారులతో గోవా వెళ్లి అక్కడ జరుగుతున్న సత్యాగ్రహ పోరాటంలో పాల్గొని అక్కడి జైల్లో నెల రోజులు ఉండి విడుదల అయ్యాడు.

మెదక్ పట్టణంలో ప్రముఖ ప్రజాసేవకుడుగా పేరు తెచ్చుకున్న రామదాసు 1972, మే 22 వ తేదీన గుండెపోటుతో మరణించాడు. ఆయన తన ఆశ్రమములో నిర్మించుకున్న సమాధిలోనే ఆయన కోర్కె ప్రకారం సమాధి చేశారు.

## "శ్రమ భూషణ్" – కే. ప్రేమ్ కుమార్

ప్రేమ్‌కుమార్‌గారు సిద్దిపేటలో 14-8-1958లో జన్మించిరి.

1973లో ప్రభుత్వోన్నత పాఠశాల సిద్దిపేటలో చిత్ర లేఖనం, సైన్సు, పోటీలలో బహుమతిని గెల్చుకొనిరి.

1977లో ఐ.టి.ఐ. మంచిర్యాల్ నుండి 'వెల్డర్' ట్రేడులో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైరి.

1978-80లో బి.హెచ్.ఇ.ఎల్. లో నేషనల్ అప్రెంటీస్ పూర్తి చేసిరి.

1983 లో రామగుండం సూపర్ థర్మల్‌పవర్ స్టేషన్ (ఎన్.టి.పి.సి) లో టెక్నీషియన్ గ్రేడ్ - IV గా ఉద్యోగంలో చేరిరి.

1989లో ఉత్పత్తికి సంబంధించిన కృషికి ప్రాజెక్టు అవార్డు నందుకొనిరి అదే సంవత్సరం (ఎల్.ఎమ్.ఈ.) పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైరి.

ఎన్.టి.పి.సి రామగుండంలో రెండు వందలు, ఐదు వందలు మెగావాట్ల శక్తిగల బొగ్గును పొడి చేసే 'మిల్' యంత్రాల గేర్ బాక్స్‌లు బొగ్గులోని ఇతర కాలుష్యాల కారణంగా అప్పుడప్పుడు చెడిపోతుంటాయి. ఇట్లా చెడిపోయిన గేర్ బాక్స్ రిపేరుకు కొన్ని నెలల కాలం మరియు లక్ష పదివేల వరకు ఖర్చు అవుతుంది. వీటి రిపేరుకు అవసరమైన వర్టికల్ బోరింగ్ మిషన్ ఖరీదు అరవై లక్షల రూపాయలు (రూ.60,00,000/-) వరకు ఉంటుంది. ఈ మిషన్ అవసరం లేకుండా, తమదగ్గరుండే హారిజంటల్ బోరింగ్ మిషన్ పై ఫిక్సర్‌లతో బిగించి చెడిపోయిన గేర్ బాక్సును వారం రోజులలోనే ఇరవై వేల రూపాయల అల్ప వ్యయంతో నల్గురు సాంకేతిక నిపుణులు రిపేర్ చేశారు. ఈ విధంగా 1989లో ఆరు (6) గేర్ బాక్సుల రిపేర్ల వల్ల కంపెనీకి సుమారు 5,40,000 ఆదాఐనది. అంతేగాక సుమారు 6,62,00,000 యూనిట్ల విద్యుదుత్పాదన జరిగినది.

అందువల్ల ఆ నలుగురు సాంకేతిక నిపుణులకు 26-1-90 న ప్రాజెక్టు అవార్డు ఇచ్చినారు.

అట్లా తాను పని చేసే ప్రాజెక్టుకు మేలు చేయడం, ధనవ్యయాన్ని, కాలాన్ని తక్కువ చేయడం, తద్వారా ఉత్పత్తిని అధికం చేయడం వారి శ్రమ శక్తికి తార్కాణాలు.

ఈ శ్రమ శక్తిని గుర్తించిన భారత ప్రభుత్వం 'వీరికి శ్రమభూషణ్' అవార్డు ప్రకటించింది.

ఈ విధంగా శ్రమ భూషణ్ అవార్డును అందుకొన్న ఘన చరిత్ర మన మెదకు జిల్లా కుండడం గొప్ప. ఈ అవార్డును శ్రీ ప్రేమ్ కుమార్‌గారు అందుకొనుట మెదకు జిల్లాకే గర్వకారణము.



వికలాంగులకు వివిధ ఉపకరణాలు (చేయూత)



వైద్య మరియు ఆరోగ్యశాఖ









క్లీన్ అండ్ గ్రీన్



స్త్రీ. శిశు సంక్షేమము



పశుసంవర్ధక శాఖ



వ్యవసాయ మార్కెట్ కమిటీ



సామాజిక పనులు (జన్మభూమి)



షెడ్యూల్డు తెగల సంక్షేమం



వికలాంగులకు వివిధ ఉపకరణాలు (చేయూత)



ప్రజలవద్దకు పాలన

# జన్మభూమి

" జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి"

జనని, జన్మభూమి స్వర్గంకన్నా మిన్న అని అన్నారు పెద్దలు. జనని, జన్మభూమి శబ్దాలు మహోన్నత మాననీయుతా సంకేతాలు. ప్రేమ, అనురాగం, దయ, అనుభూతి ఇత్యాది గుణాలకు ఆలవాలమీపదాలు. మనిషిలోని మమకారాన్ని, మానవునిలోని ఐక్యతారాగాన్ని, కుటుంబతత్వ పరిజ్ఞానాన్ని, ఏర్చికూర్చి ఒకచోట అందించే అమృతమే అమ్మ.

అమ్మ శబ్దం కన్మదనానికి కలకాలం నిలిచి ఉంటే అమ్మలాంటి సహనం, తల్లిలాంటి దయ, జనని లాంటి జాలి కలిగి బ్రతికి ఉన్నంతకాలం బ్రతుకుతెరువుకు ఆలంబనంగా తరువాత తనలో దాచుకునే ఆశ్రయంగా జనన మరణాలకు, జాతి జీవన ప్రవాహాలకు, పరమార్థంగా నిలిచేదే ఈ జన్మభూమి. అందుకే జననీ జన్మభూములను సమాన మానవతా గౌరవ అభిమానాలను జాతి పేర్కొన్నది.

మనిషికుండే ఋణాలలో మాతృఋణం ఎంతో, మాతృదేశ ఋణం కూడా అంతేయని చెప్పవచ్చు.

జననీసేవ మానవునకెంత ముఖ్యమో, జన్మభూమి సేవ అంతే ముఖ్యమని వేరుగా చెప్పవలసిన అవసరం లేదు.

ఆంధ్రదేశాన్ని స్వర్ణాంధ్రదేశంగా మలచుటకై సభ్యప్రపంచంలో సగౌరవ స్థానాన్ని అందించుటకై తెలుగుజాతి జిలుగు వెలుగుల నలువమూలలా ప్రసరించుటకై ఆంధ్రావని అన్నపూర్ణగా సుజలగా, సుఫలగా, సస్యశ్యామలగా, అవతరించుటకై ఆంధ్రులు అందరూ అక్షరాస్యులై సాంకేతిక విజ్ఞాన పరంపరప్రభలు వెలిగించుటకై, ఇంటికి దీపం ఇల్లాలని, ఇల్లాలి చదువు ఇంటికి వెలుగని, ఎన్నో ఆశయాలతో, ఇంకెన్నో మహదాలోచనలతో తెలుగుదేశాధి నేత, ఆంధ్రదేశ అధినేత, శ్రీ నారాచంద్రబాబు నాయుడిగారి సారసపూరమేధా సంపత్తి నుండి ఉద్భవించిన మహోజ్వల సంపదయే జన్మభూమి.

కష్టించి పని చేయడం, అన్యోన్య సహకారం, జవాబుదారీతనము, పారదర్శకత, విలువలను సమాజములో నెలకొల్పి, పల్లెలను, పట్టణాలను ఆదర్శంగా పునర్నిర్మించే ప్రజా ఉద్యమమే జన్మభూమి. ఈ కార్యక్రమము దేశంలో కెల్లా మొట్టమొదట ఆంధ్రప్రదేశ్‌లోనే ప్రారంభించబడినది.

ఇంతటి మహోన్నత జన్మభూమి కార్యక్రమమునకు సృష్టికర్తయైన గౌరవనీయులు ముఖ్యమంత్రి శ్రీ నారాచంద్రబాబు నాయుడి గారి కర కమలములతో ప్రప్రథమంగా మెదకు జిల్లాలోనే కొక్కొండ గ్రామంలో ప్రారంభించబడినది.

ఈ కార్యక్రమం క్రింద ప్రజలు, ప్రభుత్వాధికారులు, పాల్గొనుట జరుగుచున్నది. ఇప్పటి వరకు ఈ కార్యక్రమాన్ని నిరాటంకముగా 13 పర్యాయములు నిర్వహించుట జరిగినది.

రాష్ట్రంలోనే జన్మభూమి, పనులలో అగ్రగామిగా మెదకు జిల్లా నిలిచి కీర్తి ప్రతిష్ఠల నందుకొనినది.

యువ ముఖ్యమంత్రి గౌరవ శ్రీ నారా చంద్రబాబు నాయుడి గారి ఆలోచనా తరంగాలలో మొలకెత్తిన అభివృద్ధి పథకాలు ఎన్నో ఉన్నాయి.

ఇప్పటికి అంటే తొమ్మిదవ శాసన సభా కాలంలోనే ఆయన ప్రవేశ పెట్టిన పథకాలు వరుసగా.

1. ప్రజల వద్దకు పాలన
2. శ్రమదానం
3. జన్మభూమి
4. పచ్చదనం పరిశుభ్రత
5. రోడ్ల విస్తరణ
6. విజన్ 2020
7. వన సంరక్షణ
8. సాగునీటి సంఘాలు
9. ముఖ్యమంత్రి యువ శక్తి పథకం
10. విద్యాకమిటీలు
11. డ్వాక్రా పథకము
12. రైతు బజార్లు
13. వాటర్‌షెడ్లు
14. ఆదరణ
15. ముందడుగు
16. చేయూత
17. రోష్ని
18. చైతన్యం
19. ఆపద్బంధు
20. తల్లుల కమిటీలు
21. శిశు సంరక్షణ పథకం
22. సుఖీభవ
23. దీపం

## ప్రజల వద్దకు పాలన

ప్రభుత్వము, పాలకులు ప్రజలుకు దూరంగా ఎక్కడో ఉండి పాలన సాగించడం కాకుండా ప్రజల కోసం ప్రజలలో మమేకమై పరిపాలన సాగించడమే ప్రజల వద్దకు పాలన కార్యక్రమం.

ప్రజల చేత ఎన్నుకోబడిన ప్రజా ప్రతినిధులు అనునిత్యం ప్రజా సేవకులుగా ప్రజలతో కలసిమెలసి యుండి వారి సాథక బాధ కాలను పట్టించుకోవడం ఈ పథకం ఉద్దేశ్యం.

ముఖ్య మంత్రి శ్రీ నారాచంద్ర బాబు నాయుడి గారి మదిలో మెదిలిన వినూత్న పథకమే ప్రజల వద్దకు పాలన.

ప్రజల వద్దకు పాలన కార్యక్రమము రాష్ట్రావతరణ దినమైన 1 నవంబర్ 1996న ప్రారంభమైనది.

డిసెంబర్ 96 లో రెండవ విడత గ్రామ సభలు నిర్వహించబడినవి.

నోడల్ అధికారిగా నియమింపబడిన జిల్లా స్థాయి అధికారి నాయకత్వంలో వివిధ శాఖల అధికారులందరూ గ్రామాలలోకి వెళ్ళి, ప్రజలు చెప్పే సమస్యలను విని అక్కడికక్కడే పరిష్కారాలను కనుగొనడం ఈ కార్యక్రమములో ముఖ్యమైనది. మెదకు జిల్లాలో ప్రజల వద్దకు పాలనా కార్యక్రమంలో ముఖ్యమంత్రి గౌరవనీయులు శ్రీ నారా చంద్రబాబు నాయుడుగారు "రిమ్మనగోడు"లో పాల్గొని ప్రజా సమస్యలు విని అక్కడి కక్కడే చర్యలు తీసికొన్నారు.

జిల్లా కలెక్టరుగారు ఎన్నో గ్రామాలలో జరిగిన ప్రజాసభలలో పాల్గొని ప్రజల కోరికలను తీర్చినాడు.

అధికారులు, ప్రజాప్రతినిధులు అన్ని గ్రామాలకు మూడు నెలల కొకమారు తరలి వెళ్ళి ప్రజా సమస్యలను తెలుసుకొని లక్షలాది సమస్యలు పరిష్కరించడమైనది.

మూడు విడతలుగా చేపట్టిన ప్రజల వద్దకు పాలనా కార్యక్రమంలో రూ. 68.38 లక్షలతో 385 పనులు మంజూరి చేయబడి పూర్తి చేయబడినవి. అదే విధముగా 3,00,028 వ్యక్తిగత కుటుంబ అవసరాలతో 11,709 అవసరాలు పరిష్కారమైనవి. అట్లే 2,584 ఆర్థికేతర సామాజిక అవసరాలలో 1,119 పరిష్కారమైనవి.

# శ్రమదానం

ప్రజల సంక్షేమానికి ప్రభుత్వం అనునిత్యం ఆలోచిస్తూ ఉండాలి. క్రొత్త క్రొత్త పథకాలతో ప్రజలలో చైతన్యాన్ని నింపాలి. అభివృద్ధిని సాధించడానికి కార్యక్రమాలను ఒక ఉద్యమంగా, ఒక విప్లవంగా చేపట్టబడాలి. మార్పు అనేది ప్రజల భాగస్వామ్యంలో మొదట పథకాలను గురించిన అవగాహన కల్గించాలి.

సమర్థవంతమైన పరిపాలన ద్వారా గ్రామ సీమల్లో అభివృద్ధిని సాధించాలనే ఆశయంతో మహాత్మాగాంధి ఆశయాల స్ఫూర్తితో ప్రవేశపెట్టబడిన పథకమే శ్రమదానము.

శ్రమదానము అన్న పదము భారతీయులకు కొత్తేమీకాదు. స్వాతంత్ర్యం వచ్చిన తొలినాళ్లలో పల్లె సీమల్లో శ్రమదానం చేసి కొంత అభివృద్ధిని సాధించారు. ఆ తర్వాత శ్రమదానం అనే పేరే మరుగున పడింది.

ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రి గౌరవనీయులు శ్రీ నారా చంద్రబాబు నాయుడుగారు శ్రమదాన కార్యక్రమాన్ని ప్రజలలో ప్రచారం చేశారు. రాష్ట్రమంతటా 1996 జనవరి ఒకటవ తేదీన శ్రమదాన కార్యాక్రమం ప్రారంభమైనది.

మెదకు జిల్లాలో కూడా అంతటా ప్రతిపల్లెలో, ప్రతి పట్టణంలో శ్రమదానం ప్రారంభించబడింది.

శాసన సభ్యులు, జడ్.పి.టీ.సీలు, యంపి.టీ.సీలు, సర్పంచులు మొదలైన అనధికారులతో పాటు కలెక్టరు నుండి బంట్రోతు వరకు అందరూ కార్యక్రమంలో స్వచ్ఛందంగా ఆనందంగా పాల్గొనినారు.

జనవరి ఒకటవ తేదీ నుండి ఏడవ తేదీ వరకు జరిగిన శ్రమదాన సప్తాహంలో మెదకు జిల్లాలో 676 నివాస ప్రాంతాలలో 727 పనులు జరిగినవి.

మెదకు జిల్లాలో శ్రమదానంతో సుమారు 2 కోట్ల రూపాయల విలువైన పనులు జరిగినవని అంచనా. మెదకు జిల్లాలో ఇప్పటి వరకు చేపట్టిన శ్రమదాన కార్యక్రమంలో రూ. 418.49 లక్షలతో మొత్తము 596 పనులు మంజూరి కాగా 378 పనులు ప్రారంభించబడి 374 పనులు పూర్తియైనవి. రూ.128.49 లక్షలు శ్రమదానము నిధులు ఖర్చు చేయుట జరిగినది.

## పచ్చదనం – పరిశుభ్రత

ఈ కార్యక్రమాన్ని చేపట్టి ప్రజలలో ఒక నూతన ఉత్తేజాన్ని తెచ్చినారని చెప్పవచ్చు. ఎన్నోఏళ్ల నుండి సున్నాలకు నోచుకొని సర్కారీ గోడలు తెల్లగా తళతళ మెరుస్తున్నాయి. సంవత్సరానికి కనీసం రెండు మార్లైన సున్నాలు వేసి బంగళాలను పరిశుభ్రంగా ఉంచి పని చేసే అధికారుల్లో ఉత్సాహాన్ని కల్గిస్తున్నదీ పథకం.

ఈ యాంత్రిక యుగంలో వాతావరణ కాలుష్యాన్ని పారద్రోలి సమాజానికి సరియైన ఆనందానుభుతులనందించాలంటే, ఆరోగ్య ప్రదంగా జీవించాలంటే వాతావరణ సమతుల్యం అవసరమని భావించి విరివిగా చెట్లునాటే కార్యక్రమాన్ని ఈ పథకం ద్వారా చేపట్టడం జరిగింది.

గ్రామాల్లో, పట్టణాల్లో వీధుల్లో పేరుకుపోయిన చెత్త చెదారాన్ని ఊడ్చి పరిశుభ్ర వాతావరణాన్ని కల్గించటం ఈ పథకం ఉద్దేశ్యం.

కార్యాలయాలలో పేరుకు పోయిన చెత్తను అస్తవ్యస్తంగా విసిరివేసినట్లుగా నున్న ఫైళ్లనన్నింటిని చక్కగా పేర్చి కార్యాలయ ఆవరణలను పిచ్చి మొక్కలు లేకుండా, చెత్తా చెదారంలేకుండా పరిశుభ్రంగా ఉండేట్లు ఈ పథకం ద్వారా చేపట్టడం జరుగు చున్నది. నెలలో ఒక మారు ఒక రోజు (మూడవ శనివారం) ఈ కార్యక్రమానికి కేటాయించడం జరిగింది.

పాఠశాలలు, కళాశాలలు, కార్యాలయాలు, పురవీధులు అన్నీ ఈ రోజు (పచ్చదనం, పరిశుభ్రత) కొత్త సింగారాలను రంగరించుకుంటున్నాయి. ఈ కార్యక్రమంలో మెదకు జిల్లా విద్యార్థులు, ఉపాధ్యాయులు, అధికారులు, అనధికారులు, యువకులు స్వచ్ఛందంగా పాల్గొని దిగ్విజయంగా పూరించుచున్నారు.

మెదకు జిల్లాలో ఈ కార్యక్రమంలో భాగంగా ఇప్పటి వరకు మొత్తము 32.43 లక్షల మొక్కలు నాటబడినవి.

## రోడ్ల విస్తరణ :

జన్మభూమిలో భాగంగా రోడ్ల విస్తరణ కార్యక్రమాన్ని ప్రభుత్వం చేపట్టింది.

ఎన్నో గ్రామాలు రహదారులకు (రోడ్లకు) నోచుకోక కనీసం సైకిలు కూడా చక్కగా పోలేని త్రోవలు ఈ కార్యక్రమం ద్వారా కార్లు పయనిస్తున్నాయి. పట్టణాలలోని ప్రధాన వీధులు ఎన్నో విశాలమైనవి ఇరుకు సందులుగా నున్న రోడ్లు ఎంతో అభివృద్ధి నందినవి.

మెదకు జిల్లాలో జన్మభూమి కార్యక్రమం క్రింద చేపట్టిన రోడ్ల విస్తరణ కార్యక్రమం అమలులో ఉన్నది.

## వన సంరక్షణ :

పర్యావరణ సమతుల్యత కాపాడేటందుకు, వర్షాలు బాగా కురిసి, వ్యవసాయం బాగా జరిగి, పంటలు బాగా పండి ఆంధ్ర దేశం అన్నపూర్ణగా అనవరతం ఉండడానికి అడవులను కాపాడుకొనడం అత్యావశ్యకం.

ఈ విషయాన్ని ప్రభుత్వం బాగా గుర్తించి ఉన్న వనాలను కాపాడుటకై, కొత్త చెట్లను నాటి సంరక్షించుటకై పూనుకొన్నది. ఇందులో భాగంగానే ప్రభుత్వ వన సంరక్షణ సమితి ని ఏర్పాటు చేసి అడవులను కాపాడడం ప్రజలకు అప్పగించడమైనది.

జన్మభూమి కార్యక్రమంలో మెదకు జిల్లాలో 32.43 లక్షల మొక్కలు నాటడం జరిగింది.

## సాగునీటి సంఘాలు :

ఊరూరా ఉన్న ఊట చెరువులను పంట కాల్వలను కాపాడు కొనడం, బాగు చేసికొనడం ఆయా ఆయకట్టుదారుల బాధ్యతగా సాగు నీటి సంఘాలను ప్రభుత్వం ఏర్పాటుచేసింది.

మెదకు జిల్లాలో సాగునీటి సంఘాలు 563 ఏర్పాటైనాయి. ఎన్నికలు లేకుండా ఏకగ్రీవంగా ఎన్నికైన సంఘాలకు ప్రభుత్వం ప్రోత్సాహకంగా 50 వేల రూపాయలను మంజూరి చేసింది.

ఈ నీటి సంఘాలు త్రవ్వు చెరువులను, కాల్వలను బాగు చేయుటలో ప్రభుత్వ సాయంతో చేపట్టవలసిన బాధ్యతను కల్గియున్నాయి.

మెదకు జిల్లాలో 551 చిన్నసాగు నీటి సంఘాలు ఏర్పడినవి. వీటి క్రింద 1,21,000 ఎకరాలు సాగు అగుచున్నది. 2778 ప్రాదేశిక యోజన వర్గములు కూడా ఏర్పడినవి.

## ముఖ్యమంత్రి యువ శక్తి పథకం :

నిరుద్యోగులైన యువతలోని నిరుత్సాహాన్ని పోగొట్టే ఉత్సాహవంతులైన పారిశ్రామికులుగా సంసిద్ధుల నొనుర్చుటకు చేపట్టే పథకమే సీ.యం.ఈ.వై.

మెదకు జిల్లాలో 1996-98 సంవత్సరాలలో 287 లక్షల రూపాయలు ఈ పథకము ద్వారా లబ్ధిపొందినారు.

1998 సంవత్సరములో 2193 గ్రూపులలో 664 గ్రూపులకు గాను 431 లక్షల రూపాయలు వివిధ ప్రాజెక్టులకు మంజూరి చేయనైనవి.

## విద్యాకమిటీలు :

అక్షరాస్యతను పెంచడంలో కేవలం ప్రభుత్వ బాధ్యతనే కాక ప్రజలకు కూడా సమాన బాధ్యతనప్పగించి విద్యాలయాలను తీర్చి దిద్దుటకు, పాఠశాలల కనీసావసరాలను తీర్చుటకు ఏర్పాటైన సంఘాలే విద్యా కమిటీలు.

## డ్వాక్రా పథకము :

గ్రామీణ ప్రాంతాలలోని మహిళలకు పొదుపును గూర్చిన అవగాహన కల్పించడం. ఐక్యతగా సంఘంగా ఏర్పడడం స్వయంగా వారి బాగోగుల గురించి చర్చించుకోవడం, అందరూ కలిసి ఏదైనా ఒక పరిశ్రమనో, వ్యాపారాన్నో స్థాపించుకోవడం, అందుకు ప్రభుత్వాన్ని, బ్యాంకులను ఆసరగా తీసుకొనడం ఇత్యాది స్వయం పోషక వ్యవహారాలను నడిపించుకొనుటకై ఏర్పడిన పథకం డ్వాక్రా.

ప్రభుత్వ పథకాలు మహిళలకై ఎన్నో తెచ్చినప్పటికీ, డ్వాక్రా పథకమంత సఫలవంతమైన పథకమేదీ ఇప్పటి వరకు కాలేదని ఘంటా పథముగా చెప్పవచ్చును.

డ్వాక్రా పథకము ఈనాడు ఆంధ్ర దేశంలో ఒక మహోద్యమ విప్లవము వలె నారీలోకంలో వచ్చినదని చెప్పవచ్చును.

## రైతుబజార్లు :

రేయింబవళ్ళు కష్టించి పండించిన పంట మధ్యదళారీల వశం కాకుండా తామపండించిన కూరగాయలు, పండ్లుతామే మార్కెట్లో విక్రయించుకొనుటకు ఏర్పరచిన విక్రయ కేంద్రాలు రైతు బజార్లు. మెదకు జిల్లాలో ముఖ్యమైన నగరాలలో 4 రైతు బజార్లు ఏర్పడినవి. రామచంద్రాపూర్, మెదకు, సిద్ధిపేట, సంగారెడ్డి.

సంగారెడ్డి, రామచంద్రాపూర్‌లలో 88 లక్షలతో పక్కా భవనాల నిర్మాణం పూర్తి యైనవి.

## వాటర్ షెడ్ :

మేఘాల నుండి పడిన ప్రతి నీటి చుక్క సార్థకం అయ్యేట్లు, భూగర్భజల సంపద పెంపొందేందుకు, భూమి కోత నాపేందుకు ఇత్యాది లాభాలకై వాటర్‌షెడ్ పథకాన్ని ప్రభుత్వం ప్రవేశ పెట్టింది.

ఈ పథకం మెదకు జిల్లాకొక వరంగా చెప్పవచ్చు. నీటి పారుదల వసతులు లేక, ఉన్నవి సరిపోక, అవి బాగులేక, వ్యవసాయదారుడు తన స్వశక్తి పై ఆధారపడి బావులను, బోర్లను త్రవ్వుకుంటూ వ్యవసాయాన్ని నడిపించుచున్నాడు. బావులలోని, బోర్లలోని నీరు ఎండిపోకుండా, భూగర్భజలం ఇంకిపోకుండా ఉండేందుకు వాటర్ షెడ్‌లు ఎంతో ఉపయోగకారిగా ఉంటున్నాయి.

## ఆదరణ :

కులవృత్తుల వారికి వృత్తి సామర్థ్యాన్ని పెంపొందించుకొని, ఆర్థికంగా ఎదుగుటకై, ఆయా వృత్తుల వారికి అవసరమైన పనిముట్లను ఆదరణ పథకం ద్వారా అందించబడినవి.

మెదకు జిల్లాలో ఇప్పటికి ఈ పథకం ద్వారా చాలా పరికరాలు అందించబడినవి.

## చేయూత :

సమాజంలో తామెందుకూ పనికిరామనుకొని నిరాశా నిస్పృహలతో కొట్టుమిట్టాడుతు బ్రతుకును భారంగా వెళ్ల దీస్తున్న వికలాంగులకు చేయూత పథకం ద్వారా చేయూతనందించి వారిలో సృజనాత్మక శక్తిని, బ్రతుకుపై ఆశను కల్పించి సమాజంలో వికలాంగులకు కూడా సమానస్థాయి కల్పించుటకై ప్రభుత్వం వీరికి అనేక రకాల అవకాశాలనందించుచు వారికి అవసరమైన పరికరాలను, మూడు చక్రాల బండ్లను పంపిణీ చేయుచున్నది.

మెదకు జిల్లాలో ఇప్పటి వరకు 1218 మూడు చక్రాల బండ్లు, 625 చంక కర్రలు, 45 రెండు చక్రాలతోపుడు బండ్లు, 125 అంధులకు చేతికర్రలు, 105 శ్రవణ యంత్రములు, 10 కృత్రిమ అవయవాలు, 7. అంధ విద్యార్థులకు టేపురికార్డులు, 207 వికలాంగులకు నిరుద్యోగాభివృద్ధి, 675 మందికి వికలాంగులకు ఉపకారవేతనములు, 9084 వైద్య ధృవీకరణ పత్రములు, 3566 వికలాంగులకు బస్సుపాసులు, 807 ఆదాయధృవీకరణ పత్రములు 868 కులధృవీకరణ పత్రములు, 250 వివాహ ప్రోత్సాహక బహుమతులు, 122 ఇండ్ల స్థలాలు, 1600 వికలాంగుల పింఛనులు సమకూర్చబడినవి.

## మదర్స్ కమిటి (తల్లుల కమిటి) :

సమాజంలో స్త్రీలు ముందడుగు వేయాలని, స్త్రీలలో నాయకత్వ లక్షణాలు పెంపొందాలనీ స్వయం పోషక శక్తి అలవాడలనే మహదాశయంతో తల్లుల కమిటీ (మదర్స్ కమిటి) లు ఏర్పాటు చేయబడినవి.

మెదకు జిల్లాలో ఇప్పటికి 1636 మదర్స్ కమిటీలు ఏర్పాటు గావింపబడినవి.

## దీపం :

పొగలో మ్రగ్గుతూ, వంటయింటికి పరిమిత మౌతున్న సమయాన్ని, అభివృద్ధి కార్యక్రమాలకు వినియోగించి తద్వారా సాంఘికంగా, ఆర్థికంగా ఎదుగుదలకు ఉపయోగపడే పథకము దీపం.

దీపం పథకం ద్వారా నారీలోకానికెంతో మేలు కలుగుచున్నది. డ్వాక్రా గ్రూపులలో మహిళలకు గ్యాస్ స్టౌలను, సిలిండర్‌లను సబ్సిడీ పై యిప్పించడం ఈ పథకంలో ప్రధాన కార్యక్రమం.

ఇవికాక ముందడుగు, రోష్ని, చైతన్యం, ఆపద్బంధు, శిశుసంరక్షణ పథకం, సుఖీభవ పథకాలు జిల్లాలో చేపట్టబడినవి.

# స్వచ్ఛంద సంస్థలు

## కాంతికిరణం

మెదకు జిల్లాలో హత్నూరమండలం చింతల్ చెరువు గ్రామంలో 1981 జులై 15 వ తేదీన కాంతికిరణం కేంద్రం స్థాపించబడినది.

గ్రామీణప్రాంతంలోని స్త్రీలను చైతన్యపరచి వారు సామాజిక, ఆర్థిక, విద్యారంగాలలో వ్యక్తి గతముగా అభివృద్ధిచెందుటకు కాంతి కిరణం కృషి చేయుచున్నది.

ఈ సంస్థ ముంబాయిలోని కార్పొలైట్ మిషనరీ వారి సౌజన్యంతో నడప బడుచున్నది.

కాంతి కిరణం సంస్థ గత 18 సంవత్సరాలు గా మండలంలోని మహిళలకు చేతివృత్తులు, కుటీర పరిశ్రమల ఏర్పాటు, అనియత విద్య, కుటుంబ సంరక్షణ, కుట్టుశిక్షణ వంటి కార్యక్రమములలో శిక్షణ ఇచ్చుచున్నది.

సమాజంలో స్త్రీలహక్కుల పట్ల వారిని జాగృతం చేయడంలో ఈ సంస్థ విశేషముగా కృషిచేయుచున్నది. కూరగాయలచెట్లు, పూలమొక్కల పెంపకం వంటి విషయాలలో మెళకువలు తెలుసుకొనుటకు ప్రత్యేక తరగతులను నిర్వహించుచున్నది.

హత్నూరమండలంలో చింతల్ చెరువు గ్రామానికి చుట్టుప్రక్కల గల గిరిజనతండాల నుండి అధిక సంఖ్యలో మహిళలు కాంతికిరణం కేంద్రంలో శిక్షణ పొందుచున్నారు. గ్రామీణ ప్రాంత మహిళల అభివృద్ధికి కృషి చేయుచున్న కాంతికిరణం కృషిని గుర్తించిన జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ వారు ఈ సంస్థకు కుట్టు మిషన్లను సరఫరా చేసిరి. అంతేకాక జిల్లా సాంఘిక సంక్షేమ శాఖ కాంతి కిరణంలో శిక్షణపొందుచున్న మహిళలకు మూడు వందల రూపాయిల ఉపకార వేతనమును అంద జేయుచున్నారు.

ఈ కాంతి కిరణం సంస్థద్వారా సంవత్సరమునకు వంద మంది మహిళలు శిక్షణపూర్తి చేసి కొని ఉపాధి పొందుచున్నారు.

# నవజ్యోతి

సమాజంలో స్త్రీలకు సముచిత స్థానం కల్పించుటకై వారిలో చైతన్యాన్ని సృజ నాత్మక శక్తిని పెంపొందించుటకై ఆర్థికంగా స్త్రీలు తమకాళ్ల పైతాము నిలబడుటకై మెదకు జిల్లాలో నవజ్యోతి సంస్థ కృషి చేయుచున్నది.

నవజ్యోతి సంస్థ స్వచ్ఛంద సేవాసంస్థ. మెదకు జిల్లాలో 53 గ్రామాలలో మహిళా సంఘాలను ఏర్పరిచి ఆసంఘాలద్వారా మహిళలతో పొదుపు కార్యక్రమాన్ని చేబట్టి 20 లక్షల రూపాయలు పొదుపు చేయించగా మంజీర గ్రామీణ బ్యాంకు వారు 40 లక్షల రూపాయల ఆర్థిక సహాయాన్ని అందించిరి.

గ్రామీణ మహిళలకు కూరగాయల పెంపకానికి, పాడిపశువులు, మేకలు మున్నగునవి కొనుక్కోవడానికి, చిన్న చిన్నవ్యాపారములు చేసి కొనుటకు, నవజ్యోతి సంస్థ తోడ్పడుచున్నది.

బాలకార్మికులు చదువుకొనుటకు మూడు మండలాలలో 12 పాఠశాలలు ఈ నవజ్యోతి చే నడపబడుచున్నవి ఒక్కొక్క పాఠశాలయందు 50 మంది బాలకార్మిక విద్యార్థులు విద్య నభ్యసించుచున్నారు.

నవజ్యోతి సంస్థ అనాధలైన వయోవృద్ధుల యోగక్షేమముల జూచుచు బట్టలు, ఆహారధాన్యాలు, మందులు మున్నగునవి ఉచితముగా పంపిణి చేయుచున్నది.

జన్మభూమి కార్యక్రమములో నవజ్యోతిసంస్థ రామక్కపేట, చిన్ననిజాంపేట, గూడికురుల మొదలగు గ్రామములలో రోడ్లు వేయించినది.

నవజ్యోతి సంస్థలో ఐదు వేలమంది మహిళలు 53 మహిళా సంఘములుగా పని చేయుచున్నారు. వీరు ప్రతినెల సమావేశమై ఆదాయం పెంచుకొనే అంశాల గురించి చర్చించి మంజీరాగ్రామీణ బ్యాంకు నుండి పొందే రుణసహాయంతో అభివృద్ధి పథంలో పయనించుచున్నారు. ఈ నవజ్యోతి సంస్థకు ఎక్జిక్యూటివ్ డైరెక్టరుగా శ్రీ బి. మనోహరరావుగారు పనిచేయు చున్నారు.

ఈ నవజ్యోతి స్వచ్ఛంద సంస్థ బీడీ కార్మికుల పిల్లలకు ఉచిత విద్యాబోధన కావించుచున్నది. రామాయంపేట మండలంలోస్థానికంగా 2 పాఠశాలలు, దామరచెర్వులో ఒకటి, నిజాంపేట లో ఒకటినెలకొల్పబడినవి. మెదకు పట్టణంలో రెండు పాఠశాలలు, మిర్దొడ్డి మండలంలో ఆరు పాఠశాలలు నెల కొల్పబడినవి. ఈ పాఠశాలలో ఒక్కొక్కదానిలో 25 నుండి 50 మంది వరకు విద్యార్థులు కలరు. మొత్తము 600 మంది బాలురు ఈ విద్యార్థులకు ఉచిత విద్యాబోధనతో పాటు మధ్యాహ్న సమయంలో అల్పాహారములు ఇచ్చుచున్నారు. అంతేకాక ప్రతివిద్యార్థికి నెలకు వందరూపాయల ఉపకారవేతనము నొసంగుచున్నారు.

నేషనల్ చైల్డ్ లేబర్ ప్రాజెక్టు క్రింద ఈ సంస్థ అధ్వర్యంలో నడుస్తున్న ఈ పాఠశాలలలో బాలికలే అధికశాతముగా నుందురు 7 నుండి 14 సం. వత్సరముల బాలబాలికలు ఈ పాఠశాలలో చదువు నేర్చుకొందురు.

కార్మికుల పిల్లలను సామాజికంగా అభివృద్ధి పరచుచువారిలో చైతన్యమును, సృజనాత్మక శక్తిని విద్యాసక్తిని కలిగించుటకై పిల్లలతల్లిదండ్రులతో ప్రతినెల సమావేశములేర్పాటు చేసి వారికి వివిధ విషయాల పై అవగాహన కలిగించుటకు ఈ సంస్థ ఎంతేని కృషి సల్పుచున్నది.

# సాధన

మెదకు జిల్లాలో బాలకార్మికులలో నిరాశా, నిస్పృహలను పోగొట్టి, వారిలో ఆత్మస్థైర్యం పెంపొందించి వారిని విద్యావంతులగావించుటకై సాధన సంస్థకృషి సల్పుచున్నది.

బెంగళూరులోని చైల్డ్ రిలీఫ్ అండ్ యు ( క్రై) అనేసంస్థ అందిస్తున్న ఆర్థిక సహాయంతో సాధన సంస్థ పనిచేయుచున్నది.

మెదకు జిల్లాలో అక్షరాస్యతాశాతం అతితక్కువగా యున్న విషయమును గుర్తించిన సాధన మొదటగా హత్నూర మండలాన్ని దత్తత తీసికొనినది. 20 గ్రామములలో రాత్రి పాఠశాలలు స్థాపించి బాల్యంలో నే పరిస్థితుల ప్రభావంతో చదువుకు దూరంగా వుంటు బాలకార్మికులుగా మారుచున్న బాలబాలికలను గుర్తించి వారికి ఆపాఠశాలలలో నిర్భంధ ఉచిత ప్రాథమిక విద్యను అందించుచున్నది.

సాధన విద్యాభివృద్ధి సంస్థ హత్నూర మండలంలో బాలకార్మిక నిర్మూలనను ఒక యజ్ఞముగా గ్రహించినది. ఈ మండలంలోని నిరుద్యోగ విద్యావంతులు స్వచ్ఛందముగా బాలకార్మికులకు విద్యాబోధన నందిచుచున్నారు. అంతేగాక సాంస్కృతిక ప్రదర్శనల ద్వారా విద్యా ప్రాముఖ్యాన్ని ఊరూరా చాటిచెబుతూ, స్వయంగా బాలకార్మికుల తల్లిదండ్రులను కలుసుకుంటూ వారి పిల్లలు చదువుకొనవలసిన ఆవశ్యకతను వివరించుచు ప్రేరణ కలిగించుచున్నారు.

హత్నూర మండలంలో సిరిపురం, లింగపూర్, గోవిందరాజుపల్లి, కొన్యాల, పన్యాల, బడంపేట, చిక్కుదవ్వారు బ్రాహ్మణగూడ, సికింద్లాపూర్, నవాబుపేట, హత్నూర, నాగుల్, దేవుపల్లి, ఎల్లమ్మగూడ, దేవులపల్లి, మాదారం గ్రామాలలోను, అనేక గిరిజన తండాలలోను రాత్రి పాఠశాలలు నడపబడుచున్నవి.

ఇంతే కాక వివిధ సాంఘిక, ఆర్థిక కారణాల వలన బడి మాని వేసిన డ్రాపౌట్, బాలబాలికలను సమీకరించి వారు తిరిగి బడికి వెళ్లనట్లు కృషి చేయుచున్నారు.

మండలంలోని ప్రభుత్వ పాఠశాలల్లో ఉపాధ్యాయుల కొరత తీర్చుటకై సాధన సంస్థ ఉపాధ్యాయులను నియమించి విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నది.

అంతేకాక బాలికలకు ప్రత్యేకముగా కుట్టు పనినేర్పుటకై హత్నూరగోవిందరాజుపల్లి గ్రామాలలో కుట్టు శిక్షణ కేంద్రాలను నెలకొల్పినది.

ఈ విధముగా సాధన సంస్థ మెదకు జిల్లాలో విద్యాభివృద్ధికై, దోహదమొనర్చుచున్నది.

## ప్రగతి

మెదకు జిల్లాలో మహిళాలోకాన్ని చైతన్యవంతం చేసి సమాజంలో వారికి సముచిత స్థానాన్ని కల్పించుటకు కృషి సల్పుచున్న సంస్థ ప్రగతి

చేగుంట మండలంలోని నార్సింగి గ్రామంలో ఈ "ప్రగతి" సేవ సంస్థ పని చేయుచున్నది.

ఈ సంస్థపరిధిలో 22 గ్రామములలో మహిళా మండలులు పని చేయుచున్నవి. ప్రతి మహిళా మండలిలో 40 మంది మహిళలు సభ్యులుగానున్నారు. ప్రతి మహిళా మండలిలో ఒక్కొక్కరు నెలకు 20 రూపాయల చొప్పన స్థానిక స్టేట్ బ్యాంక్‌లో జమ చేయుదురు. ఈ విధముగా మహిళలలో పొదుపు చేసే అలవాటును కల్గించుచున్నారు పొదుపు చేసినమొత్తానికి అదనంగా ప్రతిమహిళా మండలికి 25 వేలు రూపాయలు జత చేసి ఈ ప్రగతి సంస్థ మహిళా మండలి స్వంత భవనాలను నిర్మించును.

పొదుపు చేయుచున్న మహిళా మండళ్లకు కూరగాయల పెంపకం, మేకల, గొర్రెల పెంపకం, పాడిపరిశ్రమ, మొదలగు వాటికి రుణసదుపాయాన్ని కల్పించుచున్నది. ఈ కార్యక్రమములో ఆయా మహిళలకు శిక్షణనీయడము కాక ఉచిత వైద్య శిబిరాలను ఏర్పాటు గావించుచున్నది.

స్త్రీ విద్యను అభివృద్ధి పరచుటకై నాలుగు వందల వేతనంతో మహిళా మండళ్లలో ఉపాధ్యాయులను నియమించుచున్నది.

పర్యావరణమును పరిరక్షించుటకై మహిళా మండలి సభ్యులు చెట్లను నాటి పెంచే కార్యక్రమాన్ని చేపట్టుచున్నారు.

ప్రగతి స్వచ్ఛంద సంస్థ మహిళాభివృద్ధి లక్ష్యంతో రాష్ట్రీయ మహిళా కోచ్ (ఆర్.యం.కె) ద్వారా అతితక్కువ వడ్డీ పై 4 లక్షల రూపాయాలను 12 గ్రామాలలోని మహిళలకు రుణంగా ఇప్పించింది.

ఈ సంస్థలోని మహిళల ప్రభుత్వ కార్యక్రమాలలో పాల్గొనుచు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయిడు ప్రవేశ పెట్టిన శ్రమదాన పథకం ద్వారా వల్లూరు నుండి భీరాపుపల్లి వరకు సుమారు 3 కిలో మీటర్ల రోడ్డును శ్రమ దానంతో గావించినారు.

ఈ సంస్థ ప్రతి ఉపాధ్యాయ దినోత్సవ మున ఉత్తమ ఉపాధ్యాయుని ఎంపిక చేసి సన్మానించును.

ఈ విధముగా ప్రగతి స్వచ్ఛంద సంస్థ మెదకు జిల్లాలో మహిళాభివృద్ధికి పాటుపడుచు వారిని చైతన్యవంతులుగా తీర్చిదిద్దుటకు కృషి సల్పుచున్నది.

## రీడ్స్ (స్వచ్ఛంద సంస్థ)

మెదకు జిల్లాలో రీడ్స్ ఒక స్వచ్ఛంద సంస్థ. తూప్రాన్ మండలకేంద్రాన్ని కేంద్రంగా చేసికొని గ్రామీణవిద్య, వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలను వివరిస్తూ ప్రజలలో ముఖ్యముగా మహిళలలో చైతన్యంకల్గించుటకై ఈ సంస్థ ప్రయత్నించుచున్నది.

రీడ్స్ సంస్థ 1986 లో నమోదై 1990 నుంచి ఇక్కడ కార్యక్రమాలను విస్తరించుచున్నది.

తూప్రాన్‌చేగుంట మండలాలలో 20 మహిళా సంఘాలు 20 గ్రామాల్లో ఈ సంస్థద్వారా పని చేయుచున్నవి.

ఈ సంస్థ మొదట గ్రామాల్లో అక్షరాస్యతను పెంపొందించుటకై ఒక ఉపాధ్యాయురాలిని [illegible] సల్పుచున్నది. ఆ [illegible]

మహిళామండలి సభ్యులు పొదుపు పద్ధతిని అలవాటు చేసి కొని కొంతమొత్తము పొదుపు చేయగనే రీడ్స్ సంస్థ వారి పొదుపు మొత్తాలకు సమానముగా గ్రాంటు అందజేస్తుంది.

మహిళా సంఘాలేకాకుండా వికలాంగులకు ఆర్థిక సహాయంగా రీడ్స్ సంస్థ మార్జిన్ మనీని అందజేయుచున్నది.

ఇప్పటికి ఈ సంస్థ సుమా[illegible] నాలు[illegible] లక్షల రూపాయల వరకు ఆర్థిక సహాయాన్ని అంద[illegible]సింది.

రీడ్స్ సంస్థ ద్వారా సహాయాన్నిపొందిన వారు విస్తరాకుల పరిశ్రమ, కుట్టుపరిశ్రమ, కూరగాయలు, కిరాణా, లాండ్రీ, హోటళ్లు మొదలగు వ్యాపారములు చేయుచు ఆర్థికంగా నిలదొక్కు కొనగలుగుచున్నారు.

రీడ్స్ సంస్థ ఆర్గనైజర్లకు విద్య, ఆరోగ్యం [illegible]యంపై శిక్షణ ఇవ్వడం జరుగుచున్న[illegible]

రీడ్స్ అధ్వర్యంలో సెడ్‌క్యాప్ ద్వారా మూడు వందలమందికి పొగరాని పొయ్యిలనిర్మాణం చేసిరి. వరి ధాన్యం నిలువ చేసేగాదెల నిర్మాణాన్ని చేపట్టి ఏర్పాటు చేయుచున్నారు.

చేగుంట మండలంలో రెండు బాలకార్మిక పాఠశాలలు నడుచుచున్నవి. రీడ్స్ సంస్థ స్వల్ప వ్యయ మరుగుదొడ్ల నిర్మాణాన్ని చేపట్టి ఒక్కొక్కరికి 1840 రూ. ఉచితంగా ఆర్థిక సహాయంచేయుచున్నారు.

జన్మభూమి కార్యక్రమాలలో రీడ్స్ సంస్థ సంఘాల అధ్వర్యంలో శ్రమదానం చేసి రోడ్ల నిర్మాణం రోడ్ల మరమ్మతు పనులు చేపట్టినారు.

ఈ విధముగా రీడ్స్ సంస్థ స్వచ్ఛందంగా మెదకు జిల్లాలో గ్రామీణ ప్రాంత జనులకు యధోచిత సేవలనందించుచున్నది.

## శ్రద్ధ (స్వచ్ఛంద సంస్థ)

మెదకు జిల్లాలో వృద్ధులకు చేయూత, పిల్లలకు పౌష్టికాహారం, మహిళల ఆర్థికాభివృద్ధి ధ్యేయంగా శ్రద్ధ స్వచ్ఛంద సంస్థ పని చేయుచున్నది.

ఈ శ్రద్ధ సంస్థ 1992 లో ప్రారంభింపబడి ప్రస్తుతం మెదక్, రంగారెడ్డి, కరీంనగర్ జిల్లాలలో స్వచ్ఛంద సేవా కార్యక్రమములను కొనసాగించుచున్నవి. ఈ సంస్థ ముఖ్య కార్యాలయం రంగారెడ్డి జిల్లాలోని లాల్‌గడి మలక్‌పేటలో కలదు.

మెదకు జిల్లలో పాపన్న పేట మండలంలో ఈ సంస్థ అధ్వర్యంలో రెండు ఉచిత కుట్టు శిక్షణా కేంద్రాలు ఏర్పాటు గావింపబడినవి.

ఈ ఆర్గనైజేషన్‌లో 600 మంది సభ్యులు స్వచ్ఛందంగా పని చేయుచున్నారు.

## లయన్స్ క్లబ్

మెదకు జిల్లాలో మానవ సేవయే మాధవ సేవగా భావించి నిరుపేదల బ్రతుకుల్లో తమకు తోచిన రీతిని తోడ్పాటందించి పలురకాలుగా ప్రజలకు చేరువగుచున్న సంస్థ లయన్స్ క్లబ్.

లయన్స్‌క్లబ్ శాఖలు మెదకు జిల్లాలో మొదట రామాయంపేటలో సిద్దిపేటలో ప్రారంభమై చేగుంట, మెదకు, జోగిపేట, గజ్వేల్, ప్రజ్ఞాపూర్‌లలో వ్యాపించినవి.

తమకున్నదానిలో నుండి కొంత వితరణ చేయాలనే సదుద్దేశ్యంతో ఈ సంస్థ సభ్యులు మనసా వాచా కర్మణా కోరు కొందురు.

బస్సుల కోసం నిరీక్షించే ప్రయాణీకుల సౌకర్యార్థం నార్సింగి, చిన్నశంకరంపేట- గవ్వలపల్లి, మడూరు, ఖాజిపల్లి మాసాయిపేట మొదలగు గ్రామాలలో బస్‌షెల్టర్ల నిర్మాణం చేపట్టి ప్రజలలో మంచి గుర్తింపు సంపాదించినది లయన్స్ సంస్థ.

ప్రముఖుల వర్ధంతులు - జన్మదినాలు పురస్కరించుకొని రక్తదాన శిబిరాలు నిర్వహించుచున్నది.

ముఖ్యముగా అంధత్వనివారణ కార్యక్రమంలో భాగంగా ఉచిత నేత్ర పరీక్షలు నిర్వహించుట అవసరమగు వారికి కంటి అద్దములు ఉచితముగా ఇచ్చుట లయన్స్ క్లబ్ వారి ప్రజా సేవలో ప్రధమకర్తవ్యముగా చెప్పవచ్చును. అంతేగాక ఉచిత నేత్ర శస్త్రచికిత్సలు కూడా బీదవారికి చేయింతురు. అంధత్వ నివారణకై లయన్స్ క్లబ్ వారు ఇప్పటికి 17 జతల నేత్రములను సేకరించి 34 మందికి కంటి చూపు భాగ్యాన్ని కల్గించినారు.

పాఠశాల విద్యార్థుల తాగు నీటి కోసం, నార్సింగి, మడూరు, చేగుంట మున్నగు పాఠశాలల్లో వాటర్ ట్యాంకుల నిర్మాణాన్ని చేపట్టి విద్యార్థులకు త్రాగు నీటి వసతిని కల్పించినారు.

గురువును పరదైవం గా గుర్తించిన నాడే విద్యా వ్యాప్తి సక్రమంగా జరుగునని లయన్స్ క్లబ్ వారు గురు పూజా దినోత్సవమును ఘనముగా జరుపుచు ఉత్తమ ఉపాధ్యాయులకు సన్మానాన్నిగావింతురు.

# చేయూత (స్వచ్ఛంద సంస్థ)

మెదకు జిల్లా చేగుంట మండలంలోని నార్సింగి గ్రామంలో స్థానిక డాక్టర్ టి.వి.పి.చారి చేయూత పేరుతో మానసిక వికలాంగుల శిక్షణా కేంద్రాన్ని 1994 జులై 6 న ఏర్పాటుగావించిరి.

ఈ సంస్థ ప్రారంభోత్సవమునకు జాతీయ మానసికవికలాంగుల సంస్థ డిప్యూటి డైరక్టర్ యల్. గోవిందరావు. అసిస్టెంటి ప్రొఫెసర్ శ్రీమతి జయంతి నారాయణ్, నేషనల్ ఇన్స్టిట్యూట్ ఫర్ హియరింగ్ వికలాంగుల శాఖ అసిస్టెంటు డైరెక్టర్. రామాచారిగారులు విచ్చేసిరి.

మానసిక వికలాంగులు కూడా అందరివలె కొద్ది పాటి శిక్షణతో మామూలు పౌరజీవనం గడపగలరని వారిని ఆవిధముగా సిద్ధము చేయవలెనను మహా దాశయంతో డా. టి. వి. పి. చారి గారు చేయూత ను స్థాపించిరి.

ఈ శిక్షణా కేంద్రంలో మానసిక వికలాంగులకు, డబ్బులు లెక్కించుటలోను, అంకెలను గుర్తించుట. వ్రాత, పజిల్స్ గుర్తించుట, ఆటలాడుట, తోటపని మొదలగు శిక్షణ ఇచ్చుచున్నారు 18 సంవత్సరాల పై బడిన వయస్సుగల వారికి వృత్తి విద్యలో శిక్షణ యిత్తురు. ఈ కేంద్రంలో చేరిన పిల్లలకు బస్ పాస్‌లు, ట్రైన్ పాసులు యిప్పించుచున్నారు.

చేయూత సంస్థ మానసిక వికలాంగుల కొరకు ఎనిమిది శిబిరాలను నిర్వహించినది. శిక్షణా కేంద్రంలో మూడు రకాల శిక్షణను ఇత్తురు - 1) ఒకరోజు వచ్చి శిక్షణ పొందడం 2) వారం లో ఆరురోజుల శిక్షణ పొంది ఒక రోజు ఇంటికి వెళ్లడం 3) వారానికి ఒక రోజు ట్రైనింగ్ టీచర్ వికలాంగుల యింటికి వెళ్లి శిక్షణ నివ్వటం

ఈ చేయూత శిక్షణా కేంద్రంలో 250 మంది మానసిక వికలాంగులుకలరు. ఇందులో 160 మంది మానసిక వికలాంగులు, తక్కిన వారు చెవిటి, మూగ, శారీరక అవయవలోపాలు కలిగిన వారున్నారు.

శిక్షణ కేంద్రంలో ఇప్పటి వరకు 30 స్కూల్ యూనిఫారాలు 25 స్కూల్ బ్యాగులు, 2 జతల చెప్పులు, 35 మందికి టిఫిన్ బాక్సులు అందజేయుట జరిగినది. స్కాలర్ షిప్‌లు కూడా వీరికి యిచ్చుచున్నారు. వినికిడియంత్రము, ట్రైసైకిల్లు కూడా ఉచితముగా యిత్తురు.

చేయూతలో శిక్షణ యిచ్చుటకై నేషనల్ ఇన్స్టిట్యూట్ ఫర్ మెంటల్ హ్యాండిక్యాప్‌లో డిప్లమా చేసిన శ్రీమతి రమాదేవి మరియు వేణుగోపాలా చారిగారులు ఎడ్యుకేటర్‌లుగా పని చేయుచున్నారు.

చేయూత సంస్థ నిర్మాణము, నిర్వహణ సంపూర్ణముగా శ్రీ డా. టి.వి.పి. చారిగారే భరించుచున్నారు.. ప్రభుత్వము నుండి గాని, ప్రజావిరాళాల నుండి గాని డబ్బును తీసి కొనక స్వంత ఖర్చుతో, అన్నిస్వయంముగా తానే చూసుకొనుచు సంస్థను పురోభి వృద్ధిలో పయనింప జేయుచున్నారు. ఇంకను జిల్లాలో టి.డి.ఎ.ఎస్.ఎస్. శాంతి రూరల్ డెవలప్‌మెంట్ సొసైటీ, ఎస్.డబ్ల్యు.ఎ.ఆర్.డి., ఆర్.ఓ.ఎ.డి., జీవనజ్యోతి, కార్పెర్ మెదక్ డిస్ట్రిక్ట్ యూత్ ఫెడరేషన్ మొదలైన సంస్థలు పని చేయుచున్నవి.

# సాంఘిక సంక్షేమశాఖ వసతి గృహములు మొత్తము 88.

## ఎస్. సి. హాస్టల్

| వ.సం. | ఎ.ఎస్.డబ్ల్యు.ఓ జూరిస్‌డిక్షన్ |
|---|---|
| 1. | **ఎ.ఎస్.డబ్ల్యు.ఓ సంగారెడ్డి** |
| 1. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్. (ఎ) సంగారెడ్డి. |
| 2. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్. (బి) సంగారెడ్డి. |
| 3. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్. (సి) సంగారెడ్డి. |
| 4. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్. (డి) సంగారెడ్డి. |
| 5. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్. (ఎ) సంగారెడ్డి. |
| 6. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్. (బి) సంగారెడ్డి. |
| 7. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్. కొండాపూర్. |
| 8. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్. ఆర్ఫనేజ్, సంగారెడ్డి. |
| 9. | చైల్డ్ బెగ్గర్ హోమ్ సంగారెడ్డి |
| | **2. ఎ.ఎస్.డబ్ల్యు.ఓ. సంగారెడ్డి** |
| 1. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్. పటాన్‌చెరు |
| | **II. ఎ.ఎస్.డబ్ల్యు.ఓ. సదాశివపేట** |
| 1. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., సదాశివ్‌పేట |
| 2. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., సదాశివ్‌పేట |
| 3. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., నిజాంపూర్ |
| 4. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., మునిపల్లి |
| 5. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., కామకోల్ |
| | **III. ఎ.ఎస్.డబ్ల్యు.ఓ. జహీరాబాద్** |
| 1. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., (ఎ) జహీరాబాద్ |
| 2. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., (బి) జహీరాబాద్ |
| 3. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., జహీరాబాద్ |
| 4. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., ఆజాద్‌గంజ్ |
| 5. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., కోహిర్ |
| 6. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., గురుజ్‌వాడా |
| 7. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., ఝురాసంగం |
| 8. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., హద్‌నూర్ |
| 9. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., కోహిర్ |

| వ.సం. | ఎ.ఎస్.డబ్ల్యు.ఓ జూరిస్‌డిక్షన్ |
|---|---|
| | **IV. ఎ.ఎస్.డబ్ల్యు.ఓ. నారాయణ్‌ఖేడ్** |
| 1. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., (బి) నారాయణ్‌ఖేడ్ |
| 2. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., (సి) నారాయణ్‌ఖేడ్ |
| 3. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., (సి) నారాయణ్‌ఖేడ్ |
| 4. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., కాల్హేర్ |
| 5. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., నిజాంపేట్ |
| 6. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., సిరాగ్‌పూర్ |
| 7. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., మనూర్ |
| 8. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., కంగ్టి |
| 9. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., తొడ్మల్ |
| | **V. ఎ.ఎస్.డబ్ల్యు.ఓ. జోగిపేట** |
| 1. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., (ఎ), జోగిపేట |
| 2. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., (బి), జోగిపేట |
| 3. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., సిరాడ్డిగుంట |
| 4. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., పుల్కల్ |
| 5. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., జోగిపేట |
| | **VI. ఎ.ఎస్.డబ్ల్యు.ఓ. శంకరంపేట** |
| 1. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., (ఎ) [illegible] |
| 2. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., (బి) [illegible] |
| 3. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., గడిపెద్దాపూర్ |
| 4. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., శంకరంపేట్ |
| 5. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., (ఎ) అల్లాదుర్గ్ |
| 6. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., అల్లాదుర్గ్ |
| 7. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., అల్లాదుర్గ్ |

| వ.సం. | ఎ.ఎస్.డబ్ల్యు.ఓ జూరిస్‌డిక్షన్ |
|---|---|
| | VII. మెదక్ |
| 1. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., మెదక్ |
| 2. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., మెదక్ |
| 3. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., ఎల్దుర్తి |
| 4. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., రంగంపేట |
| | ఎ.ఎస్.డబ్ల్యు.ఓ. మెదక్ |
| 1. | ఎ.ఎస్.డబ్ల్యు.ఓ. పాపన్నపేట |
| 2. | ఎ.ఎస్.డబ్ల్యు.ఓ. టెక్మల్ |
| | VII. రామాయంపేట్ |
| 1. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., రామాయంపేట్ |
| 2. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., రామాయంపేట్ |
| 3. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., నిజాంపేట్ |
| 4. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., శంకరంపేట్ (ఆర్) |
| 5. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., చందాయిపేట |
| 6. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., వాడియారాం |
| 7. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., చేగుంట |
| | VIII. ఎ.ఎస్.డబ్ల్యు.ఓ. నర్సాపూర్ |
| 1. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., నర్సాపూర్ |
| 2. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., జిన్నారం |
| 3. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., గుమ్మాడిడాలా |
| 4. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., దౌల్తాబాద్ |
| 5. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., ఎల్మకన్న |
| 6. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., తుర్కలకాన్‌పూర్ |
| 7. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., దౌంతి |
| 8. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., నర్సాపూర్ |
| 9. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., కౌడిపల్లి |

| వ.సం. | ఎ.ఎస్.డబ్ల్యు.ఓ జూరిస్‌డిక్షన్ |
|---|---|
| | IX. ఎ.ఎస్.డబ్ల్యు.ఓ. దుబ్బాక |
| 1. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్.,(ఎ) దుబ్బాక |
| 2. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., (బి) దుబ్బాక |
| 3. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., మిర్‌దొడ్డి |
| 4. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., దుబ్బాక |
| | X. ఎ.ఎస్.డబ్ల్యు.ఓ. సిద్దిపేట |
| 1. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్.,(ఎ) సిద్దిపేట |
| 2. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., (బి) సిద్దిపేట |
| 3. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., సిద్దిపేట |
| 4. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., కొండపాక |
| 5. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., (బి) తోగుట్ట |
| 6. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., చిన్నకోడుర్ |
| 7. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., ప్లామకుల |
| 8. | జి.ఎస్.డబ్ల్యు.జి. ఓర్‌ఫాంజ్, సిద్దిపేట |
| | XI. ఎ.ఎస్.డబ్ల్యు.ఓ. గజ్వేల్ |
| 1. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., గజ్వేల్ |
| 2. | జి.ఎస్.డబ్ల్యు.జి.హెచ్., గజ్వేల్ |
| 3. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., జగదేవ్‌పూర్ |
| 4. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., తీగుల్ |
| 5. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., వర్గల్ |
| 6. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., దౌల్తాబాద్ |
| 7. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., ఇటిక్యాల్ |
| 8. | జి.ఎస్.డబ్ల్యు.బి.హెచ్., తూప్రాన్ |

# జన్మభూమి

## ( విశ్లేషణ)

| క్ర.నం | పేరు | సాంక్షన్ అయిన పనులు | | | | పూర్తి అయినవి | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | నెం. | కే.ప్ర./రా.ప్ర | పి.సి. | మొత్తం | నెం. | కే.ప్ర./రా.ప్ర | పి.సి. | మొత్తం | | | | |
| 1. | పేరు | 37 | 12/160 | 52.20 | 173.70 | 19 | 48.15 | 20.90 | 69.05 | ఖర్చులు | | | |
| 2. | భవనములు | 10 | 15.40 | 6.40 | 22.00 | 4 | 2.77 | 1.18 | 3.95 | గ్రాంట్ | మిగిలినవి | ఖర్చులు | మిగిలినవి |
| 3. | కాంపౌండ్ వాల్స్ | 14 | 11.76 | 5.04 | 16.80 | 10 | 6.50 | 7.28 | 9.58 | జె.బి. | 83.37 | 83.04 | 0.33 |
| 4. | కాలువలు | 13 | 18.00 | 7.70 | 25.70 | 6 | 7.46 | 3.20 | 10.66 | ఇ.ఎ.ఎస్. | 83.37 | 5.25 | 0.25 |
| 5. | ప్రాజెక్టులు (P.A) | 10 | 3.50 | 3.50 | 7.00 | 6 | 1.565 | 1.565 | 3.130 | బి.ఎ.ఎం | 25.33 | 25.33 | - |
| 6. | ఇతరములు | 4 | 3.19 | 1.36 | 4.55 | 2 | 1.60 | 0.76 | 2.30 | టి.ఎఫ్.ఎ | 6.62 | 3.62 | 3.50 |
| 7. | గ్రామీణ నీటి పారుదల | | 40 | 15.05 | 6.45 | 1.50 | 34 | 12.60 | 5.40 | 18.00 | గ్రాండ్ | | |
| 8. | ఎం.ఐ. (ఐ.బి) | 3 | 6.00 | 6.00 | 12.00 | 3 | 6.00 | 6.00 | 12.00 | మొత్తం | **120.82** | **117.24** | **4.08** |
| | మొత్తం | **131** | **194.50** | **88.75** | **283.25** | **84** | **86.295** | **42.285** | **128.74** | | | | |

## మెదక్ జిల్లాలోని స్పెషల్ హాస్టల్ల పతిక

| వ.సం | హాస్టల్ పేరు | సాంక్షన్డ్ స్ట్రెంత్ | రినీవల్ | ఫ్రెష్ | మొత్తము |
|---|---|---|---|---|---|
| 1. బాలలు | సంగారెడ్డి | 100 | 73 | 27 | 100 |
| 2. బాలలు | తోగర్‌పల్లి | 75 | 40 | 35 | 75 |
| 3. బాలలు | దిగ్‌వెల్ | 100 | 63 | 37 | 100 |
| 4. బాలలు | జోగిపేట | 120 | 86 | 32 | 120 |
| 5. బాలలు | హత్నూర | 120 | 100 | 20 | 120 |
| 6. బాలలు | చిన్నకోడూరు | 110 | 87 | 23 | 110 |
| 7. బాలలు | గజ్వేల్ (ఎ) | 100 | 68 | 32 | 100 |
| 8. బాలలు | రామాయంపేట | 120 | 59 | 61 | 120 |
| 9. బాలలు | కుల్చారం | 100 | 90 | 10 | 100 |
| 10. బాలలు | సర్దానా | 100 | 90 | 10 | 100 |
| 11. బాలికలు | జోగిపేట | 60 | 30 | 30 | 60 |
| | మొత్తము | 1105 | 773 | 332 | 1105 |

| క్ర.సం | | సంఖ్యా | మంజూరిఐన బోర్డర్ల సంఖ్య | ప్రస్తుతమున్న బోర్డర్ల సంఖ్య |
|---|---|---|---|---|
| 1. | సాంఘిక సంక్షేమ బాలుర వసతి గృహాలు | 69 | 8100 | 7480 |
| 2. | సాంఘిక సంక్షేమ బాలికల వసతి గృహాలు. | 15 | 2300 | 90 |
| 3. | ఆనందనిలయము బాలికల వసతి గృహాలు | 2 | 200 | 90 |
| 4. | ఆనందనిలయము బాలుర వసతి గృహాలు | 1 | 100 | 68 |
| 5. | బిక్షుకుల వసతి గృహాలు | 1 | 50 | 16 |
| | మొత్తము | 88 | 10750 | 9925 |

| వ.సం | స్కీమ్ | 1999-2000 | | లబ్ధిదారులు | రిమార్క్స్ |
|---|---|---|---|---|---|
| 1. | ప్రభుత్వ హాస్టల్ | 3,12,84,600 | 1,11,42,930 | 5665 బోర్డర్స్<br>64 హాస్టళ్లు | 64 ప్రభుత్వ హాస్టళ్ళు, 53 బాలలు, 11 బాలికలకు ఈ హాస్టల్స్, 4955 బాలలు బాలికలు మరియు 710 మొత్తము(5665) విద్యార్థులు |
| 2. | ఆశ్రమ స్కూల్స్ హాస్టల్స్ | 6,41,930 | 2,92,285 | 100 బోర్డర్లు<br>2 హాస్టళ్లుం | |
| 3. | పోస్ట్-మెట్రిక్ ఎస్/షిప్ | 1,51,00,000 | 41,49,662 | 5314 బి.సి విద్యార్థులు | కవరింగ్ (12) కాలేజిలు |
| 4. | రి-ఇంబర్స్‌మెంట్ ఆఫ్ స్పెషల్ ఫీస్, ట్యూషన్ ఫీస్ | 6,00,000 | - | - | ప్రపోసల్స్ ఆర్ అవేటడ్ ఫ్రంమ్ ఎడ్యుకేషనల్ ఇన్స్టిట్యూషన్స్. |
| 5. | ఐ.టి.ఐ విద్యార్థులకు స్టైఫెండ్ | 2,20,000 | 1,32,728 | 221 విద్యార్థులు | - |
| 6. | నోటు పుస్తకముల పంపిణి | - | - | - | అన్ని హాస్టళ్లకు ఎడ్యుకేషన్ డిపార్టుమెంటు ద్వారా ఉచితముగా నోటు పుస్తకాల పంపిణి. |
| 7. | స్పెషల్ హాస్టల్ | 1,57,000 | - | - | పనిచేయుచున్న స్పెషల్ హాస్టళ్లలో (10) బాలలవి, (1) బాలికలవి |
| 8. | నోటుపుస్తకాల పంపిణి | - | - | - | అన్ని ప్రభుత్వ బి.సి హాస్టళ్లకు నోటు పుస్తకముల పంపిణి |

# డంగోరియా చారిటబుల్ ట్రస్టు - నర్సాపూర్

గ్రామీణ పేద ప్రజలకు ఆరోగ్య సేవలు అందించాలనే ముఖ్యమైన ఉద్దేశ్యములతో డంగోరియా చారిటబుల్ ట్రస్టు 1981 సంవత్సరంలో డా. దేవయాని డంగోరియా స్థాపించినారు. ట్రస్టు స్థాపించిన హాస్పిటల్ (For Women and children ) ప్రారంభించినారు. ఈ హాస్పిటల్ యందు ఆధునిక పరికరములు మరియు అల్ట్రాసౌండ్ లెబొరెటరి సౌకర్యములు సమకూర్చబడమైనది. రోగుల నిమిత్తము ప్రత్యేకమైన మహిళా డ్యాక్టరును హాస్పిటల్ ఆవరణలో వుండునట్లు ఏర్పాటు చేసినారు. హాస్పిటల్ సిబ్బంది కొరకు మరియు రోగులువారి బంధువులు వుండునట్లు ప్రత్యేకమైన సౌకర్యములు సమకూర్చినారు. ప్రతి మంగళవారము శుక్రవారము 3 లేదా 4గురు లేడి డ్యాక్టర్లు హైదరాబాదు నుండి నర్సాపూర్ డంగోరియా హాస్పిటల్‌కు వచ్చి గర్భిణీ స్త్రీలను తల్లులను మరియు చిన్న పిల్లలను తనికీ చేయుదురు.

శిక్షణ పొందిన సాంకేతిక నిపుణులచే రోగ లక్షణములకు సంబందించిన పరీక్షలు చేయుచుందురు. హాస్పిటల్‌కు హాజరగు వారికి అనగా గర్భిణీ స్త్రీలకు, తల్లులకు మరియు ఇతరులకు టీ.వీ స్లైడ్ షోలు వంటి ప్రదర్శనల ద్వారా ఆరోగ్యము - పోషక ఆహార విద్య అందించబడును.

**వృద్దులకు శాశ్వత గృహ నిర్మాణము:**

డంగోరియా హాస్పిటల్ ఆవరణలో వయోవృద్దులకు గృహమును 1995 నవంబర్‌లో ప్రారంబించబడినది. 1997 జనవరిలో డంగోరియా చారిటబుల్ ట్రస్టువారు వృద్దులకు 60-90 సంవత్సరపు మధ్య ఆడ, మగ వారు. వీరిలో కొంత మంది ప్రభుత్వ ఉద్యోగులు పదవి విరమణ చేసిన వారు. కొందరు వికలాంగులు, ఇందులో వుంటున్నవారే వారి పనులు వారే చేసుకొందురు. ఉదా: - అశ్రమము తాలుకు డబ్బు లెక్కలు చూచుట, మార్కెట్టుకు వెళ్ళి వారికి కావలసిన సరుకులు కూరగాయలు వారే తెచ్చు కొనుటకు , కూరగాయలు పండించుట స్టోర్ చూచుకొనుట మొదలకు పనులు వారే చేసుకొందురు. మరియు పౌల్ట్రీ ఫార్మ్ నడుపుట, ఈ విధముగా తమ పనులు తామే చూసుకొందురు. డంగోరియా చారిటబుల్ ట్రస్టువారు ఈ ఆశ్రమములో మరి కొంత మందికి ఆశ్రయము కల్పించాలనే వుద్దేశ్యముతో నవంబర్ 1998లో (Help Age India ) వారి ఆర్థిక సహాయముతో (dormitourist ) టైపు గృహము నిర్మించినది. ఇందులో అన్ని సదుపాయములు ఏర్పాటు చేసినారు. అందరికి కలిపి ఒకే భోజనశాల ఏర్పాటు చేసిరి, వంట చేయు సమయములో వంటవారికి ఈ వృద్దులు సహాయకారులుగా వుందురు.

డంగోరియా చారిటబుల్ ట్రస్టు వారు గ్రామీణ ప్రజలకు హాస్పిటల్ సేవలు అందించుటయే కాకుండా నర్సాపూర్ మండలములో దత్తతచేసుకున్న 22 గ్రామాలలో అనేకమైన అభివృద్ధి కార్యక్రమాలను చేపడుచున్నది.

ఈ కార్యక్రమాలు డాక్టర్ ఎమ్.ఎస్. బాబ్జి, రిటైర్డ్ డైరెక్టర్ గ్రేడ్ సైంటిస్టు, నేషనల్ ఇంస్టిట్యూట్ ఆఫ్ న్యూట్రీషన్ (NIN, Hyd. ) వారి ఆద్వరంలో జరుగుచున్నవి.

**కార్యక్రమాలు:** - జూన్ 1994 నుండి కార్యక్రమాలు జరుగుచున్నవి

1. పెరటి తోటల పెంపకము ద్వారా పోషకాహార లోపములను తొలగించుట. ఈ ప్రాజెక్టునకు Department of Science and Technology Govt. of India ఆర్థిక సహాయము అందించినది (ఈ ప్రాజెక్టు జూన్ 1994 - ఆగష్టు 97) గ్రామాలలో పోషకాహార విద్యను స్లైడ్ షోస్, వీడియో షోస్ మరియు వంట ప్రదర్శనల ద్వారా అందించుట జరుగుచున్నది.

2. **తక్కువ ఖర్చుతో మరుగుదొడ్లను నిర్మించుట:** - ప్రస్తుతము గ్రామాలలోని పారిశుధ్ధ్యమును దృష్టిలో వుంచుకొని దత్తత తీసుకున్న కొన్ని గ్రామాలలో డంగోరియా చారిటబుల్ ట్రస్టు ఆధ్వర్యంలో కాపార్ట్ (CAPART ) వారి ఆర్థిక సహాయముతో 5 గ్రామాలలో 100 మరుగుదొడ్లను నిర్మించుట జరిగినది. మరియు ఈ కార్యక్రమము మిగిలిన గ్రామాలలో కొనసాగుచున్నది.

**అనియత విద్య** : - బడిమాని వేసిన బాల కార్మికులకు రాత్రిపూట స్కూలు నిర్వహించుట మరియు చదువుకొనని కొత్తవారికి చదువుచెప్పుట అనే కార్యక్రమము ట్రస్టు నిర్వహించుచున్నది. ప్రస్తుతము 4 గ్రామాలలో నడపబడుచున్నావి.

**పోషణ:** - డంగోరియా చారిటబుల్ ట్రస్టు వారు అతి తక్కువ ఖరీదులో అనుబంద పోషకాహారమును గ్రామీణ పేదవారికి అందించుచున్నారు. ఉదా: - మార్కెట్టులో వున్న సిరిలాక్, ఫారెక్స్ మొదలగు వాటికి ప్రత్యమ్నాయముగా **పోషణ** అను పేరుతో పిల్లలకు (మరియు గర్భిణీ స్త్రీలకు) అనుబంధ పోషకాహారమును తయారు చేసి గ్రామీణ పిల్లలలో పోషకాహారమును తయారు చేసి గ్రామీణ పిల్లలలో పోషకాహార స్థాయిని పెంచుతున్నారు. దీనికి ప్రత్యేకముగా ట్రస్టు మెదక్ జిల్లా పరిధి వరకు లైసెన్స్ పొంది వున్నది. గత 2 సంవత్సరాల నుండి పోషణ ట్రస్టు వారు తయారు చేయుచున్నది.

3. **గ్రామీణ ఆరోగ్య పోషకాహార కార్యకర్తలను తయారు చేయుట** : - Department of Science and Technology Govt. of India వారి ఆర్థిక సహాయముతో ఈ ప్రాజెక్టును అనగా గ్రామీణ ఆరోగ్య పోషకాహార కార్యకర్తలను తయారు చేయుట. ఎంచుకున్న 5 గ్రామాల నుండి 5 మహిళలకు ఆరోగ్యము పోషకాహారము గురించి శిక్షణ ఇచ్చుట జరుగుచున్నది.

ఈ కార్యకర్తలు తమ గ్రామాలలో ఎవరికైనను ఆరోగ్యం సరిగాలేనిచో వారిని హాస్పిటల్‌కు తరలించుట, చిన్న చిన్న రోగవములకు దగ్గు, జ్వరము, జలుబు, విరోచనాలు, నోటి పగుళ్ళు, ఒళ్ళు నొప్పులు ప్రథమ చికిత్స మొదలగు మందులు ఇచ్చుట, గ్రామములో ఎవరైన పుట్టిననూ లేదా మరణించిననూ తెలియ పరుచుటు మొదలగు ఆరోగ్య ఆవశ్యకత సేవలు గ్రామములో చేయుదురు. వీరి ద్వారా గ్రామ ప్రజలు అనేక రకములైన సేవలు పొందుతుంటారు. పుట్టిన బిడ్డను అదేరోజు బరువు తీయూట గర్భిణీ స్త్రీకి సలహాలు, తీసుకొన వలసిన జాగ్రత్తలు ఇచ్చుట, గర్భిణీ స్త్రీలకు తల్లులకు మరియు ఇతరులకు (B.P) చూచుట. పోషకాహార విద్యను అందించుట మొదలకు సేవలు చేయుదురు.

**4. మహిళా మండలి ఏర్పాటు:-** ఐక్యమత్యమే బలము అనే భావనను దృష్టిలో వుంచుకొని గ్రామీణ మహిళలలో ఐక్యమత్యము పెంపొందించుటకు వారిని వారి గ్రామములలో ఒక సంఘముగా ఏర్పరిచి సంఘము రిజిస్ట్రేషన్ చేయుట జరిగినది. ఈ మహిళా సంఘములు గ్రామాభివృద్ధి కొరకు ప్రభుత్వ కార్యక్రమాలు అయిన శ్రమదానము, జన్మభూమి పనులలో పాల్గొనుచున్నవి.

అంతేకాకుండా వీరికి ఆరోగ్యము పోషకాహార విద్యను ట్రస్టువారు అందించుచున్నారు. ప్రస్తుతము నర్సాపూర్ మండలములో 5 గ్రామాలలో సంఘములు రిజిస్ట్రేషన్ చేయుట జరిగినది. భవిష్యత్తులో ఈ మహిళా సంఘ సభ్యులకు ఆదాయము సంపాదించుకొను పనులపై శిక్షణా తరగతులను నిర్వహించాలని ట్రస్టు వారు తలంచుచున్నారు. సంఘము సభ్యులు పొదుపు చేయుచున్నారు.

## 4. భవిష్యత్తు ప్రణాళిక :

"Combating micro-nutrient deficiences in Rural Community through enhanced production and Social Marketing of micro nutrient - rich foods."

అందుబాటులో వుండే ఎక్కువ సూక్ష్మపోషక విలువలు కలిగిన పండ్లు కూరగాయలను మార్కెట్లు ద్వారా ప్రజలకు అంద జేయు ఒక కార్యక్రమమును ప్రారంభించనున్నారు. ఈ మార్కెట్లులో పండ్లు కూరగాయలు లభ్యమవ్వుటయే కాక సూక్ష్మపోషక పదార్థాముల లోపముల వచ్చు వ్యాధులను తెలుపుచూ వాటి నివారణకు తీసుకోవలసిన జాగ్రత్తలు పోస్టర్ల ద్వారా పోషకాహార విద్యను అందిస్తారు.

# అల్లాదుర్గం మండలం

అలనాటి శిల్పాలను అపురూపంగా అట్టడుగున దాచుకున్న అత్యంత ప్రాచీన వైభవ చారిత్రమున్న ఆ ప్రదేశమే అల్లాదుర్గం మెదకు జిల్లాలో ప్రాచీన శిల్పారామానికి, చిత్రకళావైభవానికి, శిలాశాసనాలకు, అత్యున్నత ప్రాచీన నాగరికతా విలాసానికి, ప్రాచీన సంస్కృతికి పట్టుగొమ్మగా బయటపడ్డ ఎన్నో శిల్పాలు ఆ ప్రాంత చరిత్రను చాటుచున్నవి. ఇక్కడ ఎక్కడ త్రవ్వినా ఏదో ఒక కళాఖండం బయటపడుచున్నది. ఏ ఇంటికీ పునాది తీసినా ఏదో శిల్పం బయట పడుతోంది.

1960 సంవత్సరంలో పురావస్తు శాఖాధికారులు వచ్చి త్రవ్వకాలు జరిపించిరి. వారి త్రవ్వకాలలో బయటపడిన వాటిలో ముఖ్యమయినవి వినాయక విగ్రహాలు, ప్రాణమట్టం, బసవన్నలు, జైన విగ్రహాలు అన్నింటికన్నా ఆశ్చర్యకరమైన విషయం త్రవ్వకాలలో వెళ్ళిన ఇంకా ఆశ్చర్యకరమైన విషయం ఆ సమాధి గోడలకు వాడిన రంగులు చెక్కు చెదరకుండా ఉండడం.

ఈ మధ్యకాలంలో గ్రామానికి కొంచెం దూరంలో ఒక ఇంటిని నిర్మించేందుకు పునాదులు త్రవ్వగా ఆ పునాదులలో నీటికొలను బయటపడింది. ఈ ప్రాంతంలో ఇప్పటికి 20 అడుగులు ఏకశిలా స్తంభాలు కనిపిస్తున్నాయి. ఒక బావిలో నుంచి బుద్ధ విగ్రహాలు బయల్పడ్డాయి. ఇది అల్లాదుర్గపు ప్రాచీన శిల్పకళా వైభవం.

అల్లాదుర్గమును శిలాంకోట అని పూర్వీకులు పిలిచినట్లుగా తెలియచున్నది.

అల్లవం ప్రభువు పేర ఈ గ్రామం నిర్మించబడినది. అల్లాదుర్గము గ్రామమున రెండు శాసనములు కలవు . ఎల్లమ్మగుడి వద్ద ఒకటి మరియు భేతాళస్వామి గుడి స్తంభాలకు ఒకటి కలదు. ఈ రెండు శాసనములు కూడా కళ్యాణి చాళుక్యుల కాలమున వేయించబడినవి.

పరిపాలనా సౌలభ్యం కోసం జనవరి 1987 లో ఆనాటి ప్రభుత్వం మండల వ్యవస్థను ఏర్పాటు చేసింది. మాండలిక వ్యవస్థీకరణలో భాగంగా అందోలు తాలుకాలో అల్లాదుర్గమొక మండల కేంద్రముగా ఏర్పడినది. ఈ మండలంలో రెవెన్యూ, పంచాయతీరాజ్, పోలీస్, విద్యుత్ శాఖల కార్యాలయములు ఏర్పాటు చేయనైనవి. మండల ప్రజాపరిషత్తు ఏర్పడిన తర్వాత మార్చి 1987 లో ఎన్నికలు నిర్వహింపబడినవి. మొట్ట మొదటి మండల ప్రజాపరిషత్తు అధ్యక్షుడుగా ఈర్ల అనిల్ కుమార్ ఎన్నికైనారు. మండల పురోభివృద్ధికి తన వంతు సేవలను అందించి ప్రగతి పథంలో పయనింపజేసిరి.

**శ్రీ టి. జగదీశ్వర్,** ఏ.ఇ., జోగిపేట వారి సౌజన్యంతో

1995 లో మండల పరిషత్తునకు జరిగిన ఎన్నికలలో పరోక్ష పద్ధతిని కె. కిష్టాగౌడ్ అధ్యక్షులుగా ఎన్నికై మండలాభివృద్ధికి తన చేయూత నందించుచున్నారు.

అల్లాదుర్గము మండలము 36,847 ఎకరముల విస్తీర్ణములో కలదు. ఈ మండలమున 5,148 ఎకరములో అటవీభూమి 34,047 ఎకరములు సాగు భూమి కలదు. ఈ సాగుభూమిలో 31,108 ఎకరములు మెట్ట 2,939 ఎకరములు తరీరిభూములు కలవు.

అల్లాదుర్గము మండలమున 21 గ్రామములున్నవి. ప్రతి గ్రామము ప్రత్యేక గ్రామ పంచాయతీ గానున్నది. ఈ మండలమునకు ఇరువురు శాసనసభ్యులు ప్రాతినిధ్యము వహింతురు. మెదకు శాసనసభ నియోజక వర్గము క్రింద 9 గ్రామములు అందోలు శాసనసభ నియోజక వర్గము లో 12 గ్రామములున్నవి మెదకు శాసనసభ్యునిగా ప్రస్తుతము శ్రీ కరణం రామచంద్ర రావు గారు, అందోలు శాసనసభ్యునిగా ప్రస్తుతము బాబుమోహన్ గారు ప్రాతినిధ్యము వహించుచు ఈ మండలము యొక్క అభివృద్ధికి ఇతోధిక కృషి సల్పుచున్నారు.

అల్లాదుర్గము మండలమునందు 1991 జనాభాగణనము ప్రకారము 38975 ప్రజలు నివసించుచున్నారు. ఇందు 19719 మంది పురుషులు 19256 స్త్రీలు కలరు. ఈ జనాభాలో 8676, S.C లు ,1663 S.T లు, 20462 B.C లు 8174 మంది ఇతరులున్నారు. 28389 మంది (వయోజనులు) ఓటుహక్కు వినియోగించుకొను వారున్నారు. మండలము నందు 7259 నివాస గృహములున్నవి.

అల్లాదుర్గం మండలము విద్యాభివృద్ధికై 27 ప్రాథమిక పాఠశాలలు ఒక ప్రాథమికోన్నత పాఠశాల కలదు. అల్లాదుర్గం ముస్లాపూర్, గడిపెద్దాపూర్‌లలో ఉన్నత పాఠశాలలు కలవు బాలికలకై ప్రత్యేకముగా మండలకేంద్రమైన అల్లాదుర్గంలో ఒక పాఠశాల కలదు. అన్ని పాఠశాలలకు సరిపడు ప్రభుత్వ భవనములు కలవు.

ఈ మండలమున విద్యార్థిని విద్యార్థులకై వసతి గృహములు కూడా ప్రభుత్వముచే ఏర్పాటు చేయబడినవి. S.C బాలుర వసతి గృహములు 3, S.C బాలికల వసతి గృహము 1, B.C బాలికల వసతి గృహము 1, మొత్తము 5 వసతి గృహములు విద్యార్థినీ విద్యార్థులకు సౌకర్యములు కల్గించుచున్నవి. ఈ వసతి గృహములలో సుమారు 350 మంది విద్యార్థినీ విద్యార్థులు భోజన, వసతి సౌకర్యములు పొందుచున్నారు. ఈ విద్యార్థి వసతి గృహములకు ప్రభుత్వ భవనములు నిర్మింపబడినవి.

ఈ మండలమున S.S.C. ఉత్తీర్ణులైన విద్యార్థులు ఇంటర్‌మీడియట్ చదువుటకు జూనియర్ కళాశాల లేకుండుటచే దూర ప్రాంతములకేగ వలసి వచ్చుచున్నది. 3 ఉన్నత పాఠశాలల నుండి కనీసము 200 మంది విద్యార్థులు ఉత్తీర్ణులై ఇతర ప్రాంతములకు చదువుకొన పోలేక ఇతర వృత్తులు చేపట్టుచు పైచదువుల చదువలేక పోవుచున్నారు.

శ్రీ ఆర్. సోమయ్య, డి.ఇ.ఇ., సంగారెడ్డి వారి సౌజన్యంతో

అల్లాదుర్గం మండలమున రెండు ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు కలవు. మండల కేంద్రమైన అల్లాదుర్గంలో మరియు గడి పెద్దాపూర్‌లో ఈ కేంద్రములు పని చేయుచున్నవి. ప్రతి ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు పనిచేయుచున్నవి ప్రాథమిక ఆరోగ్యకేంద్రమునకు అనుబంధముగా మూడు (3) ఉపకేంద్రములు పని చేయుచున్నవి. ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు ఇరువురు డాక్టర్లు సరిపడు సిబ్బందితో ఏర్పాటు చేయబడినప్పటికి కొన్ని పోస్టులు ఖాళీగానున్నవి.

ఈ మండలమున అల్లాదుర్గం మరియు ముస్లాపూర్‌లలో (2) పశు వైద్యశాలలు పని చేయుచున్నవి. ప్రతి పశువైద్యశాలలో ఒక డాక్టరు, ఒక అటెండరు నియమింపబడి యున్నారు. ఈ పశు వైద్యశాలకనుబంధముగా ఉపకేంద్రములు కూడా పని చేయుచున్నవి.

అల్లాదుర్గం మండలమునందు పెద్ద చెరువులు 8, కుంటలు 67, బావులు 118, బోర్‌బావులు 156 సామూహిక వ్యవసాయ బావులు 12 కలవు.

ఈ మండలము వ్యవసాయమునకు ఉపయోగించు క్షేత్రము మొత్తము ఎ.34047.27 గుం. కాగా అందు మాగాణి (తరి) క్షేత్రము ఎ. 2939.03 గుం. ఎకరములు మాత్రము కలదు. ఎ. 31108.24 గుం. మెట్ట భూమి కలదు. ఎ.5148.23 గుం. అటవీ క్షేత్రము కూడా ఈ మండలమునందున్నది మాగాణి (తరి) భూమి పై చూపబడిన జలాధారములతో వరి, పంటను పండింతురు, ఇక్కడి మెట్టభూమిలో జొన్న, మక్క, శనిగ, కంది, పెసర, మొదలగు పంటలు పండించుచున్నారు. ఇప్పుడిప్పుడే అక్కడక్కడ ప్రతి పంట కూడా పండింపబడుచున్నది. ఈ మండలమున సగటు సంవత్సర వర్షపాతము 985 మి.మీ.

అల్లాదుర్గం మండలమునకు సంజయ్ గ్రామీణ విద్యుదీకరణ సంస్థ ద్వారా విద్యుత్తు ప్రసారమగుచున్నది. ఇక్కడ ఒక సబ్ స్టేషన్ కలదు. ఒక జూనియర్ ఇంజనీరు మరియు సిబ్బందితో విద్యుత్తు కార్యాలయము మండల కేంద్రమున పని చేయుచున్నది లోఓల్టేజి సమస్య ఇక్కడ హెచ్చుగా నుండెడిది. 1998 న ప్రభుత్వము ఎక్కువ మొత్తములో ట్రాన్స్‌ఫార్మర్లను మంజూరి చేసి బిగించుటచే విద్యుత్తు లోఓల్టేజి సమస్య కొంత వరకు తీరినది.

ఈ మండలము నందు 4 బ్యాంకులు పనిచేయుచున్నవి. మండల కేంద్రమగు అల్లాదుర్గమున స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా, గడిపెద్దాపూర్‌నందు సెంట్రల్ బ్యాంక్ శాఖలు కలవు, ఈ బ్యాంకులు వ్యవసాయ, వ్యవసాయేతర ఋణములను తక్కువ వడ్డీకి ప్రజలకు అందజేయుచున్నవి.

ఈ మండలమునందు అల్లాదుర్గంలో సబ్‌పోస్టాఫీసు కలిగి 5 బ్రాంచి పోస్టాఫీలు ప్రజలకు తపాలా సౌకర్యమును కలిగించుచున్నవి.

**శ్రీ జె.సుదర్శన్ రావ్,** డి.ఇ.ఇ., సంగారెడ్డి వారి సౌజన్యంతో

D.R.D.A పథకము క్రింద చిన్నకారు, సన్నకారు, రైతులకు, వెట్టిచాకిరి వారికి ఎడ్లు, బండ్లు కరెంటు మోటార్లు మొదలగు నవి ఈయబడినవి.

హరిజన సహకార సంఘం నుండి సామూహిక వ్యవసాయపు బావులు 12 త్రవ్వింపబడి విద్యుత్తుమోటార్లు బిగింపబడినవి.

అల్లాదుర్గం మండలమున 30 మందికి విధవా పింఛన్లు, 350 మందికి కరువు పింఛన్లు మంజూరు చేయబడినది.

అల్లాదుర్గం మండలమున ఉపాధి హామీ పథకం ద్వారా 1995-96 నుండి 98-99 వరకు భూసార సంరక్షణ 14, మైనర్ ఇరిగేషన్ 40, రహదార్లు 12, భవనాలు 17, మొత్తం 83 పనులు, 78.61 లక్షలతో గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయ, వ్యవసాయ అనుబంధ కార్యకలాపాలలో పని లభించని సమయాలలో నైపుణ్యత లేని కూలీలకు కనీసం 100 పని దినములు కలిపించడానికి ఉద్దేశించిన ఉపాధి హామీ పథకము సిద్ధం చేయబడినది.

ఈ మండలమున డ్వాక్రా పథకము ద్వారా మహిళలు లాభోక్తులగు చున్నారు.

అల్లాదుర్గం మండలమున 27 చౌకధర దుకాణములు కలవు. గులాబీ కార్డులు 2275, తెల్లకార్డులు 6358 కలిగి ప్రతినెల బియ్యము 1112.40 క్వింటాళ్ళు, చక్కెర 114.85 క్వింటాళ్ళు, కిరోసిన్ 22720 లీటర్లు. పౌర సరఫరాల విభాగం నుండి సరఫరా యగుచున్నది.

ఈ మండలమున అధిక విద్యావంతులు కలరు. డా. నీలినారయణ గారు ఉస్మానియా యూనివర్సిటీ నుండి జియాలజిలో పి.హెచ్.డి పట్టాపొందిరి. ఈ మండలంలోని మాందాపూర్ గ్రామమున జన్మించిన డా. గోపాల్‌రెడ్డి గారు అమెరికాలో వైద్య వృత్తిలో వున్నారు.

ఈ మండలమున భారత స్వాతంత్ర సమరంలోనూ, నిజాం విమోచనోద్యమంలోను పాల్గొని చెరసాలలో జీవితమును గడిపిన సమరయోధులు కలరు. వారిలో బోనకుర్తి బాలయ్య, శ్రీ కాళ్ళ మానయ్య, శ్రీ మజ్జిగ ఈశ్వరయ్య, శ్రీ మజ్జిగ చంద్రయ్య, శ్రీ అరిగె సదానందం, శ్రీ వంశె గారి నారాయణ, శ్రీ పల్లె దుర్గయ్య, శ్రీ పల్లె లక్ష్మయ్య, మోటుకూరి లక్ష్మయ్య, పూజారి దుర్గయ్య మొదలైన వారు తమ జీవనములను దేశమునకు త్యాగము చేసిన త్యాగధనులై చిరకీర్తిని పొందిరి. వీరిలో కొందరు స్వాంతంత్ర్య సమర యోధుల పెన్షన్ ను అనుభవించుచున్నారు.

శ్రీ టి. పాండురంగా రెడ్డి, ఎ.ఇ., సంగారెడ్డి వారి సౌజన్యంతో

## సర్పంచ్‌లు, యం.పి.టి.సి.ల జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు | యం.పి.టి.సి. |
|---|---|---|---|
| 1. | అల్లాదుర్గం | సర్వశ్రీ అనిల్ కుమార్ రెడ్డి | సర్వశ్రీ శ్రీనివాస్ |
| 2. | వెంకటరావు పేట | జి. నర్సమ్మ | యస్. వెంకటరెడ్డి |
| 3. | చిల్వేరీ | జే. ఆగమయ్య | కె. కిష్టాగౌడ్ |
| 4. | మామ్డాపూర్ | ఎ. మైసమ్మ | కె. కిష్టాగౌడ్ |
| 5. | ముప్పారం | యల్. వసురాం | యల్. గోపాల్ |
| 6. | అప్పాజిపల్లి | జి. రామమ్మ | యల్. గోపాల్ |
| 7. | రెడ్డిపల్లి | కె. కిష్టయ్య | యస్. వెంకటరెడ్డి |
| 8. | కాయిదం పల్లి | యస్. దుర్గయ్య | యస్.వెంకటారెడ్డి |
| 9. | రాంపూర్ | ధర్మాగౌడ్ | జి. లక్ష్మయ్య |
| 10. | ముస్లాపూర్ | కె. జోగీనాథ్ గౌడ్ | డి. వనజ |
| 11. | గడిపెద్దాపూర్ | శ్రీమతి అక్బరున్నీసా బేగం | జి.నర్సమ్మ |
| 12. | బిజ్లీపూర్ | డి. పద్మయ్య | జి. వీరయ్య |
| 13. | కేరూర్ | శ్రీమతి వి. బశమ్మ | టి. దర్శన్ గౌడ్ |
| 14. | మర్వెల్లి | సి. చెన్ బసప్ప | జి. వీరయ్య |
| 15. | పల్వట్ల | శ్రీమతి శ్యామమ్మ | టి. దర్శన్ గౌడ్ |
| 16. | నాగులపల్లి | నారాయణ గౌడ్ | జి. వీరయ్య |
| 17. | గొర్రేకల్ | శ్రీమతి సి. నర్సమ్మ | పి. నియటలాక్షారావు |
| 18. | వటప్పల్లి | అబ్దుల్ సత్తార్ | పి. నిటలాక్షారావు |
| 19. | పోతులబొగుడ | బి. మాణిక్యయ్య | టి. భూమమ్మ |
| 20. | బైరాన్ దిబ్బ | యస్. పుష్పమ్మ | టి. భూమమ్మ |
| 21. | చేవెళ్ళి | డి. కాశీనాథ్ | టి. భూమమ్మ |

శ్రీ ఎం.డి.ఇఫ్తెకార్ అహ్మద్, ఎ.ఇ., ఎం.పి.పి., పటాన్‌చెరు వారి సౌజన్యంతో

# అందోలు మండలము

15-1-1987 నాటి ముఖ్య మంత్రి నందమూరి తారక రామారావు గారు పరిపాలనా వికేంద్రీకరణలో భాగంగా తాలూకాలను మండలములుగా ఏర్పాటు చేసినారు.

ఈ మండలము పూర్వపు తాలుకా కేంద్రము పేరునకు అందోలు మండలము. కార్యాలయము లన్నియు జోగిపేట పట్టణమునందేయున్నవి. ఇది నియోజక వర్గకేంద్రము కూడా, ఈ మండలమునకు తూర్పున హత్నూర మండలం, పశ్చిమమున రేగోడు మండలాలు, ఉత్తరాన టేక్మాల్ మండలము, దక్షిణాన పుల్కల్ మండలాలున్నాయి.

ఈ మండల విస్తీర్ణము 183 చదరపు కిలోమీటర్లు గలదు. అందోలు మండలంలో 27 గ్రామాలు 4 మదిరగ్రామాలు ఉన్నాయి. 23 గ్రామ పంచాయతీలు ఈ మండలమందు కలవు.

అందోలు మండల జనాభా 1991 గణన ఆధారంగా మొత్తము 53,332 అందు 26,342 స్త్రీలు 26,990 మంది పురుషులు గలరు. ఈమొత్తం జనాభాలో 10,524 మంది దళితులు 138 మంది గిరిజనులు 32,450 మంది వెనుకబడిన వర్గాల వారు తక్కిన 10,220 మంది అగ్ర వర్ణాలవారు ఉన్నారు.

మార్చి 1987న మండల ప్రజా పరిషత్తు అందోలుకు ఎన్నికలు జరిగినవి. ఆ ఎన్నికలలో శ్రీ నారాయణగారు అధ్యక్షులుగా ఎన్నికైనారు. 1995 లో జరిగిన రెండవ మండల పరిషత్తు ఎన్నికలలో అందోలు మండల పరిషత్తు అధ్యక్షులుగా శ్రీ జి. అర్జునయ్య ఉపాధ్యక్షులుగా శ్రీ ఎల్. లింగా గౌడ్ గారు ఎన్నికై నారు. ఈ మండలము నుండి (జెడ్.పి.టి.సి.) జిల్లా పరిషత్తు ప్రాదేశిక నియోజక వర్గ సభ్యునిగా శ్రీ నారాయణగారు ఎన్నికై మండలాభివృద్ధికి కృషి సల్పిరి.

అందోలు మండలమున వ్యవసాయ యోగ్యమైన భూమి అధికముగానున్నది. ఈ మండలంలో బీడుభూమి 2147.15 హె. మాత్రమే కలదు. ప్రభుత్వ భూమి 4,607.03 హె. ఉండగా దీని నుండి ఎసైన్ చేయబడి బడుగు వర్గాలకు వ్యవసాయానికై అలాటు చేయబడినది.

12 పెద్ద చెరువులు, 140 కుంటలు, 1312 బోర్లు, వ్యవసాయ జలాధారములై ఉన్నవి.

ఈ మండలంలో వ్యవసాయం ఎక్కువగా మెట్ట వ్యవసాయమే రేగడి భూములలో అనేక రకాల ధాన్యాన్ని పండిస్తారు. తెల్లజొన్న, జొన్న - మిరప - శనిగమొదలగు పప్పు ధాన్యాలు పల్లి మొదలగు నూనె ధాన్యాలు - ధనియాలు ఆవాలు, గోధుమలు మొదలగు పంటలు పండిస్తారు. బోర్లతోను చెరువు - కుంటల జలాధారంగా వరి పంట- చెరకు కూడా ఎక్కువగానే పండించుచున్నారు.

---

శ్రీ ఎ. భాస్కర్ రావు, డి.ఇ.ఇ., జహీరాబాద్ వారి సౌజన్యంతో

ఈ మధ్య కాలంలో అక్కడక్కడా ప్రత్తి పంట కూడా పండించ బడుచున్నది.

అందోలు మండలంలో వ్యవసాయ విస్తరణాధికారి ద్వారా సన్నకారు - చిన్నకారు రైతులకు సబ్సిడిపై వ్యవసాయ పరికరాలు అందించ బడుచున్నవి అంతేగాక శుద్ధి చేసిన విత్తనములు అమ్మబడుచున్నవి. ఈ శాఖ ద్వారా ముఖ్యమైన రసాయనిక ఎరువులు సబ్సిడిపై అమ్మబడును.

ఈ మండలంలో వ్యవసాయ గిడ్డంగులు కలవు. అంతేగాక వ్యవసాయ మార్కెటు ద్వారా రైతులకు చక్కని మార్కెటింగ్ సౌకర్యము కల్గుచున్నది.

## విద్య :

ఈ మండలంలో కేంద్రమైన జోగిపేటలో ఒక డిగ్రీ కళాశాల కలదు. కళాశాల ఎత్తైన గుట్టపై విశాలమైన ప్రదేశములో అందముగా నిర్మించబడినది. ఈ కళాశాలలో B.Sc మరియు B.A లు బోధింపబడును. 1997 లో డిగ్రీ కళాశాల నుండి ఇంటర్ మీడియట్‌ను వేరు చేసి ప్రత్యేక జూనియర్ కళాశాలను ఏర్పాటు చేయడమైనది.

ఈ మండలమునందు 4 ప్రాథమికోన్నత పాఠశాలలు 26 ప్రాథమిక పాఠశాలలు, 10 ఉన్నత పాఠశాలలు ఉన్నవి.

ప్రైవేటు యాజమాన్యంలో ఒక జూనియర్ కళాశాల కలదు.

జిల్లా పరిషత్తు - మండల పరిషత్తు పాఠశాల లన్నింటికి చక్కని భవనములు కలవు. ఈ మండలమునందు అంగన్‌వాడీ కేంద్రములు పని చేయు చున్నవి. అందోలు యూనిట్‌లో అందోలు- పుల్కల్ అల్లాదుర్గం - టేక్మాల్ - రేగోడు - శంకరంపేట మండలాలున్నాయి. ఈ యూనిట్‌లో 291 అంగన్ వాడీ కేంద్రాలున్నాయి.

## వైద్యం :

మండల కేంద్రమైన జోగిపేటలో ప్రభుత్వ వైద్యశాల కలదు. ఈ వైద్యశాలలో కలదు.

ఇవిగాక మండలంలోని గ్రామాల్లో ప్రభుత్వ వైద్యశాలకు అనుబంధముగా నర్సులు - సిస్టర్లు - హెల్త్ వర్కర్స్, వైద్య సేవలందించుచున్నారు.

## విద్యుత్ :

ఈ మండలంలో విద్యుత్తు "సంజయ్ రూరల్ ఎలక్ట్రిక్ కో-ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్" జోగిపేట, ద్వారా సరఫరా యగు చున్నది. దీనిని స్కోర్ (Score) అని వ్యవహరిస్తారు. స్కోరు వ్యవస్థ 1-7-1982 న ప్రారంభింపబడి నేటికి నిరాఘాటంగా పని చేయున్నది. పూర్వపు జోగిపేట (అందోలు) తాలుకా మొత్తము మరియు టేక్మాల్- పాపన్నపేట మండలాలు కలవు 3135 చ.కి.మీ. పరిధి కలిగిన స్కోర్ రాష్ట్రంలోనే ఒక పెద్ద విద్యుత్తు సహకార సంస్థగా పేరొందినది.

శ్రీ కె. శ్రీనివాస్ రెడ్డి, ఎ.ఇ.ఇ. (స్పెషల్), జహీరాబాద్ వారి సౌజన్యంతో

## వసతి గృహాలు :

ఈ మండలంలో 6 విద్యార్థి వసతి గృహములు కలవు. ఇందు S.C., B.C., విద్యార్థుల వసతి గృహములు కలవు. జోగిపేటలో కురమ విద్యార్థి వసతి గృహము ప్రత్యేకముగా కలదు. కుర్మ కులములో నిరక్షరాస్యతను నిర్మూలించుటకు 1973 సంవత్సరములో ఉన్న పారిశ్రామిక సంఘము జోగిపేట పాలక వర్గము సహాయముతో ఏర్పడినది. అందోలు తాలుకా పరిధిలో కుర్మ విద్యార్థులకు ఇందు ప్రవేశము కలదు. ఉచిత భోజన - వసతి ఏర్పాట్లతో పాటు విద్యార్థులకు నోటుబుక్కులు అందించ బడుచున్నవి. అంతేగాక అధిక మార్కులు తెచ్చుకొన్న విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు సంస్థ ద్వారా ఈయబడుచున్నవి. ఈ సంస్థకు ప్రభుత్వము ద్వారా ఏ సహాయము లభ్యమగుట లేదు.

ఈ మండలంలో ప్రభుత్వము 627 వృద్ధాప్య పింఛను. 130 గర్భిణీ పింఛనులు పంపిణీ చేయనైనవి.

## డ్వాక్రా గ్రూపులు :

ఈ మండలంలో 97 పని చేయుచున్నవి. ఈ డ్వాక్రాలో 1450 మంది సభ్యులు కలరు. వీరిచే 4,85,000/-పొదుపు చేయనైనవి.

## సహకారం :

అందోలు మండలంలో అందోలు - అక్సాన్ పల్లి డాకురు - నేరెడిగుంట చింతకుంట గ్రామాల్లో సహకార సంఘములున్నవి. వీటిని (P.A.C.S) ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘములు అని అందురు. ఈ సహకార సంఘము ద్వారా రైతులకు ఋణాలు అందజేయబడును.

ఈ మండలమునందు తంతి - తపాలా సౌకర్యము కలదు. ఒక టెలిఫోన్ ఎక్స్ఛేంజి కలదు.

ఈ మండల కేంద్రమగు జోగిపేట పెద్ద వ్యాపార కేంద్రము. ఇచ్చట మార్కెటింగ్ యార్డు గలదు. విశాలమైన ప్రాంతములో అడ్తి - బీట్లు ద్వారా క్రయ విక్రయములు జరుపబడును

ఈ మండలంలో 8 బియ్యము మరలు(రైసు మిల్లులు) 3 చక్కెర పరిశ్రమలు (ఫ్యాక్టరీలు) 2 నూనె మిల్లులు కలవు - ఒక బీడీ పరిశ్రమ కలదు.

ఈ మండలంలో చెప్పుకోదగిన ప్రాచీన దేవాలయం అందోలులోని శ్రీ రంగనాథ స్వామి దేవాలయము. అందోలు రెడ్డి రాజులచే నిర్మింపబడిన ఈ దేవాలయము నిర్మాణము సైనిక వ్యూహమునకు కూడా పనికి వచ్చునట్లుగా కన్పడును. ఒకనాడు ఎంతో వైభవముతో అలరారిన దేవాలయము ఈనాడు బోసిపోయి ఆలన కరువైనట్లున్నది. విశాలమైన ప్రాకారముతో చక్కని శిల్పముతో ఈ దేవాలయ నిర్మాణము జరిగినది.

ఈ మండలమున నెలవారి 3000/- (మూడువేల రూ.) కేంద్ర పెన్షన్ పొందు స్వాతంత్ర్య సమరయోధులలో 19 మంది స్త్రీలు, 13 మంది పురుషులు ఉన్నారు.

---

శ్రీ కె. శ్రీనివాస్ గౌడ్, డి.ఇ.ఇ., నారాయణ్‌ఖేడ్ వారి సౌజన్యంతో

నెలకు రూ. 1000/- (ఒక వేయి)రాష్ట్ర పెన్షన్ పొందు స్వాతంత్ర్య సమరయోధులు 7 స్త్రీలు 6 పురుషులు కలరు.

అందోలు చెరువుకట్ట నానుకొని కట్టబడిన ప్రాచీన విశ్రాంతి భవనము అందముగానున్నది.

ఈ మండలమున పౌరసరఫరా విభాగమున 32 రేషన్ దుకాణములు గలవు. 10,033 తెల్ల కార్డులు 3398 గులాబీ కార్డులు మొత్తము 13431 కార్డులున్నవి. ప్రతినెలలో ఈ దుకాణముల ద్వారా బియ్యము 1784 క్వింటాళ్లు, చక్కెర 199.97 క్వింటాళ్లు గోధుమ 180 క్వింటాళ్లు, కిరోసిన్ 46350 లీ. సరఫరా చేయబడుచున్నది.

ఈ సంస్థ 22-2-1955న శ్రీ కడల బాలప్ప జోగిపేట 2.గొల్లబాలయ్య పట్వారి పోసానిపేట 3. కడల అంజయ్య జోగిపేట 4. చిందం లక్ష్మయ్య 5.బురగోని లక్ష్మణ ప్రసాద్ జోగిపేట గారలచే స్థాపించబడి రిజిష్టర్ చేయబడినది. రిజిష్ట్రేషన్ సంఖ్య 21174. ఈ సంఘము అందోలుతాలూకా పరిధి గాగలిగి 52 గ్రామాలలో 675 మంది సభ్యులచేనడప బడుచున్నది.

చేనేత ఉన్నిపరిశ్రమ ద్వారా చేతివృత్తుల పనివారికి అధునాతన పద్ధతులతోమగ్గములపై వృత్తి, పరమైన శిక్షణ తో కంబళ్లు - ఉన్ని బ్లాంకెట్లు మెరినో డిజన్ బ్లాంకెట్లు శాడి డిజన్ బ్లాంకెట్లు నీల బ్లాంకెట్లు మఫ్లర్లు - వివిధ రకములగు వస్తువుల తయారు చేయుదురు. వాటి అమ్మకాలు కూడా సంఘపక్షననే జరుగుచుండును.

దక్షిణ భరతదేశంలోనే ఏకైక ఊల్ ఫినిషింగ్ ప్లాంట్‌గా పేరెన్ని కగన్నది. ఈ సంస్థలో 50 మంది కార్మికులు పని చేయుచున్నారు. రాజాస్థాన్ జోప్పూర్ పూల్ బోర్డువారు మంజూరి చేసిన 18 లక్షల పధకంలో భాగంగా 4.75 లక్షల రూపాయలతో ఒక భవన నిర్మాణము జరిగినది.

సమగ్ర గ్రామీణాభివృద్ధి (D.R.D.A ) ద్వారా 14 స్త్రీలకు ఉన్నిదారం వడుకుటకు ట్రైజం ప్రోగ్రాంలో 6 నెలల శిక్షణ ఈయబడినది. వీరికినెలకు రూ.350 స్టైఫండు చొప్పున ఈయబడినవి. 20 మందికి బ్లాంకెట్లు నెలకు 6 నెలల శిక్షణలో నెలకు రూ.350 స్టైఫండు చొప్పున ఈయబడినది. శిక్షితులకు చరఖాలు ఇప్పించుటలో ప్రయత్నం జరుగుచున్నది.

20 షటిల్ మగ్గముల ద్వారా నిర్విరామ కృషి జరుగుచున్నది (ఫిష్టులోనున్న కార్మికులకు వర్క్‌షెడ్లు 1994-95 సంవత్సరంలో 25 గురికి 6000-00 (ఆరువేల రూ. విలువగలిగి) 1995-96 సంవత్సరంలో 17 గురికి ఉచితంగా నిర్మించి ఈయబడినవి 1996-97 లో 68 మందికి వర్క్‌షెడ్లు ఉచితంగా నిర్మించుటకు పధకము సిద్ధము చేయనైనది.

సంఘ నిర్మాణాలకు అభివృద్ధి కార్యక్రమాలకు స్థలం సరిపోకుండుటచే దూరదృష్టితో) సంఘమునకు ప్రక్కనున్న స్థలం రూ. 1,25,000-00 (ఒక లక్ష ఇరవై ఐదు వేలు) కొనుగోలు చేయనైనది.

శ్రీ ఎస్. మధుసూదన్ రెడ్డి, స్పెషల్ ఎ.ఇ., నారాయణ్‌ఖేడ్ వారి సౌజన్యంతో

చేనేత అభివృద్ధి కేంద్రం (హెచ్.డి.సి) మంజూరి అగుటచే 10 లక్షల రూపాయల సబ్సిడి 17.5 లక్షల రూపాయలు రుణం సంఘానికి వచ్చును.

"క్వాలిటీ డైయింగ్ సెంటర్" ఏర్పాటు కు ప్రయత్నములు చేయబడుచున్నవి. దీనిచే 7.5 లక్షల సబ్సిడీగా సంఘమునకు రాగలవు. తద్వారా అధునాతన పద్ధతిలో రంగుల అద్దకం ప్రారంభించబడును.

ఆలిండియా వూల్ బోర్డు జోధ్‌పూర్ (రాజస్థాన్) వారి నుండి ప్రాదేశిక ఉన్ని అభివృద్ధి ప్రాజెక్టు పథకం క్రింద 20 లక్షల రూపాయల ప్రణాళిక మంజూరి కాబడినది. 14,40,000-00 (పద నాలుగు లక్షల నలభై వేల రూ.) వూలు బోర్డు నుండి మెదకు జిల్లా నుండి 3,50,000-00 (మూడు లక్షల ఏబది వేలు) గ్రాంటుగా మంజూరు ఐనవి. సంఘ పక్షాన 2,50,000-00 (రెండు లక్షలు) రూపాయలతో పథకము ప్రారంభించ బడుచున్నది. ఈ పథకము అమలగుటకు ప్రభుత్వ అధికారులతో ఒక కమిటీ వేయబడినది. కమిటీకి ఛైర్‌మన్ (అధ్యక్షులుగా) D.R.D.A ప్రాజెక్టు డైరక్టరు, కన్వీనర్‌గా సంఘ అధ్యక్షులు నియమింపబడినారు.

పేద వారికి నివాసం మరియు వర్క్‌షెడ్ల రూపంలో రూ. 22,500-00 విలువగల గృహనిర్మాణం 50 మంది సభ్యులకై పథకము సిద్ధము చేయనైనది.

# ఆందోలు మండలము

ఆందోలు మండలము యొక్క సర్పంచుల వివరములు

| క్ర.సం | గ్రామ పంచాయత్ | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | సాయిబన్‌పేట | శాంతమ్మ |
| 2. | మన్సాన్‌పల్లి | యమ్. మల్లప్ప |
| 3. | చింతకుంట | కోలా లక్ష్మి |
| 4. | రోల్లాపాడ్ | పి. లచ్చుమ్మ |
| 5. | కోడికల్ | జి. గీతా రాణి |
| 6. | నాద్లాపూర్ | పి. గాయత్రి |
| 7. | కిచ్చన్నపల్లి | వి. మణెమ్మ |
| 8. | ఆందోలు | ఆర్. శారద |
| 9. | అల్మాయిపేట | వెంకట్‌రెడ్డి |
| 10. | పోతిరెడ్డి పల్లి | కె. లక్ష్మాగౌడ్ |
| 11. | పోన్సాన్‌పేట | జి. నారాయణ |
| 12. | అన్నాసాగర్ | డి. దుర్గయ్య |
| 13. | మసాన్‌పల్లి | డి. సుధాకర్ |
| 14. | ఎర్రమ్ | పి. అనీల్‌రెడ్డి |
| 15. | రామ్‌సన్‌పల్లి | యస్. ఆనంద్ కుమార్ |
| 16. | నేరెడిగుంట | బి. శివరాజ్ |
| 17. | సంగుపేట్ | డి. దేవయ్య |
| 18. | కన్‌సాన్‌పల్లి | యస్. మానిక్ రెడ్డి |
| 19. | అకసాన్‌పల్లి | యస్. రామరెడ్డి |
| 20. | తాడ్‌మనూర్ | పి. హనుమంత్‌రెడ్డి |
| 21. | తల్లెల్మా | మాణిక్యం |
| 22. | డాకూర్ | పి. ప్రభాకర్ |
| 23. | జోగిపేట్ | బి. జోగయ్య (పర్సన్ ఇన్‌చార్జ్) |

శ్రీ ఎ.జి. శ్రీనివాస్ రావు వారి సౌజన్యంతో

# ఎం.పి.టి.సీ.ల జాబితా

| క్ర.సం | యం.పి.టి.సి స్థలం | యం.పి.టి.సి. పేరు |
|---|---|---|
| 1. | డాకూర్ | జి. అర్జునయ్య (ప్రెసిడెంట్) |
| 2. | తల్లెల్మ | యల్. లింగా గౌడ్ (వైస్ ప్రెసిడెంట్) |
| 3. | జోగిపేట | ఏ. రవి శంకర్ |
| 4. | జోగిపేట | ఆర్. వేణుగోపాల్ |
| 5. | జోగిపేట | షేక్ మౌలానా |
| 6. | జోగిపేట | కె. ఆర్. మల్లయ్య |
| 7. | ఆందోల్ | పి. రాంరెడ్డి |
| 8. | ఆందోల్ | టౌతోట్లా నిర్మల |
| 9. | నెరది గుంట | యమ్. రాజిరెడ్డి |
| 10. | పోసిసానిపేట్ | జి. ఎల్లయ్య |
| 11. | రాంసన్‌పల్లి | రైనీ కృష్ణయ్య |
| 12. | సంగుపేట్ | సంగెపు సుశీల |
| 13. | మాన్‌సెన్‌పల్లి | గొల్ల పోచ్చమ్మ |
| 14. | తదమనూర్ | వోయిగీ కమ్‌సమ్మ |
| 15. | సాయిబన్‌పేట్ | గొల్ల నర్సమ్మ |
| 16. | జోగిపేట | యమ్. డి. జలీల్ (కో- ఆపరేషన్ మెంబర్) |

శ్రీ. జి. అజయ్ కుమార్, ఎ.ఇ.ఇ. (పి.ఆర్.), దుబ్బాక వారి సౌజన్యంతో

# చేగుంట మండలము

చేగుంట మండలము మెదక్ జిల్లాలో అభివృద్ధి చెందిన మండలములలో ఒకటి.

చేగుంట మండల కేంద్రము 7వ నంబరు జాతీయ రహదారిపై హైదరాబాదుకి కేవలం 70 కి.మీ. దూరమున కలదు. ఈ మండల కేంద్రము రహదారుల కూడలిగా నున్నది. మెదక్ నుండి హైదరాబాదు పోవు మార్గము చేగుంటలో జాతీయ రహదారిలో కలియును చేగుంట నుండి గజ్వేల్లి సిద్దిపేటలకు కూడా రోడ్డుమార్గములున్నవి. అంతేకాక చేగుంట నానుకొని వడియారం రైల్వేస్టేషను కలదు. ఈ రైలు మార్గము సికింద్రాబాద్ నుండి మన్మాడ్‌కు కలదు. ఈ విధముగా రైలు, రోడ్డు వసతులు కలిగిన ఈ మండల కేంద్రము వ్యాపారాభివృద్ధిలో ముందంజ వేయుచున్నది. ఈ మండల కేంద్రమునకు ఆనుకొని వడియారం గ్రామం కలదు. చేగుంట వడియారం గ్రామములు జంట గ్రామములు.

చేగుంట మండలము 49250 ఎకరముల భౌగోళిక విస్తీర్ణము కలిగియున్నది. ఈ మండలమునకు తూర్పున దౌలతాబాద్, పడమట శంకరంపేట, ఉత్తరాన రామయంపేట, దక్షిణమున తూప్రాన్ మండలములు ఎల్లలుగా కలవు.

చేగుంట మండలము రామాయంపేట్ తాలూకా నుండి విభజింపబడింది. జనవరి 1987 లో ఆనాటి ప్రభుత్వము పరిపాలనా వికేంద్రీకరణ చేయుటకై ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమున తాలూకాలను మండలములుగా విభజించినది. ఆ కార్యక్రమములోని భాగముగానే రామాయంపేట తాలుకా నాలుగు మండలాలుగా విభజింపబడి అందు చేగుంట ఒక మండల కేంద్రముగా ఏర్పడినది.

చేగుంట మండలమునకు చుట్టుపక్కల 29 గ్రామములు, ఏడు మధిర గ్రామములు మొత్తము 36 గ్రామములు కలవు.

మార్చి 1987 మొట్ట మొదటి సారిగా జరిగిన మండల ప్రజాపరిషత్ ఎన్నికలలో అధ్యక్షుని మండల ప్రజలు నేరుగా ఎన్నుకొనెడివారు. మండలమునందలి గ్రామపంచాయతీ సర్పంచులు మండల సభ్యులుగా నుండెడివారు. నాటి ఎన్నికలలో చేగుంట మండలమునకు శ్రీ .సయ్యద్ మునీరుద్దీన్‌ఘోరి ఎన్నిక కాబడి 5 సంవత్సరములు మండలాభివృద్ధికి తనవంతు చేయుతనందించినారు. 1995 లో మండల ప్రజా పరిషత్తులు, మండలపరిషత్తులుగా మారినవి పంచాయతీ రాజ్ యాక్ట్‌లో మార్పులు సంభవించినవి తదనుగుణ్యముగా మండలాధ్యక్ష పదవులు పరోక్ష పద్ధతిన ఎన్నికలు జరుపబడినవి.

---

శ్రీ **జి.విజయ్ కుమార్,** ఎ.ఇ. (ఎం.పి.) వారి సౌజన్యంతో

మండలమునందు ప్రతి 3000ల జనాభాకు ఒకరు చొప్పున మండల ప్రాదేశిక నియోజకవర్గ సభ్యులు మొుదట ఎన్నుకొనబడుదురు. వారినుండే మండలాధ్యక్షుని ఎన్నిక జరుపబడును.

చేగుంట మండలమునకు జరిగిన మండల పరిషత్తు ఎన్నికలలో 14 మంది మండల ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులు ఎన్నికయిరి. ఈ మండలము యొక్క అధ్యక్ష పదవి స్త్రీలకు కేటాయించబడినది. ఈ ఎన్నికలలో శ్రీమతి బాల్‌శెట్టిలత అధ్యక్షురాలిగా ఎన్నికయినారు. ఉపాధ్యక్షులుగా జి. బాల్‌రాజ్ గౌడ్ ఎన్నికయినారు. ఈ మండలము నుండి జిల్లా పరిషత్ ప్రాదేశిక నియోజిక వర్గ సభ్యులుగా శ్రీ తీగల వెంకట గౌడ్ ఎన్నుకొనబడినారు. వీరు మండల సర్వతో ముఖాభివృద్ధికి తమ కృషి సల్పుచున్నారు.

చేగుంట మండలమున 27 గ్రామ పంచాయితీలు కలవు. ఈ మండలమున 1991 జనాభా గణన ప్రకారము 49333 మంది కలరు.

చేగుంట మండలములో వడియారం, చెందాయిపేట, మక్కరాజ్‌పేట, నార్సింగి, చేగుంట, రెడ్డిపల్లి గ్రామాలతో (6) జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలు కలవు. మండలమున 4 ప్రాథమికోన్నత పాఠశాలలు 32 ప్రాథమిక పాఠశాలలు గ్రామీణ బాలుర విద్యాబివృద్ధిని హితోధికముగా సమకూర్చుచున్నవి. స్త్రీ, శిశు సంక్షేమముల్కై 27 అంగన్‌వాడీ కేంద్రములు పనిచేయుచూ భావి విద్యార్థులను సిద్ధమొనర్చుచున్నవి. పాఠశాలకు పోలేని బాలబాలికలకు, యువతీ యువకులకు అక్షరాస్యతను సమకూర్చుకట్కై 4 నిరంతర విద్యా కేంద్రములు పని చేయుచున్నవి. ఈ మండలమందలి నిరుపేద విద్యార్థులకు అందున S.C, B.C లకై వారిచదువు కుంటుపడకుండా నుండుట్కై ఆరు విద్యార్థి వసతి గృహాములు ప్రభుత్వ పరముగా నడిపించబడుచున్నవి. ఈ విద్యార్థి వసతి గృహాలలో సుమారుగా 500ల మంది విద్యార్థులు భోజన వసతి సదుపాయములను పొందుచు విద్యను ఆర్జించుచున్నారు. ఈ విధముగా ఈ మండలము విద్యావిషయమున పురోభివృద్ధిలో నున్నప్పటికి ఇక్కడ ప్రభుత్వజూనియర్ కళాశాల, కళాశాల లేకుండుట కడు విచారకరము. ఈ రోజులలో ఇంటర్మీడియట్ కనీస విద్యార్హతగా గుర్తింపబడుచున్నది కానీ ఈ విషయమున ప్రభుత్వ సంస్థలేకున్నను ప్రయివేటు యాజమాన్యమున క్రైస్తవ మిషనరీ వారిచే వడియారంలో జూనియర్ కళాశాల నడుపింపబడుచున్నది.

చేగుంట మండలమున వ్యవసాయ యోగ్యమైన భూమి విస్తీర్ణము 30252 ఎకరములు. కాని ప్రస్తుతము మండలమునందలి వ్యవసాయ భూ విస్తీర్ణము మాగాణి 3007 ఎకరములు, మెట్ట 9789 ఎకరములు మొుత్తము 12796 ఎకరములలో వ్యవసాయము సాగుబడి చేయబడుచున్నది.

ఈ మండలమునందు 17 చెరువులు 227 కుంటలు కలవు. బావులు గొట్టపుబావులు కూడా మండలమున అధికముగానేయున్నవి.

---

**శ్రీ జి. స్వామి** ఎ.ఇ. (ఎం.పి.), దుబ్బాక వారి సౌజన్యంతో

వీటన్నించి ఆధారముగా మండలమున వరాగాణి పంటలుగా వరి, చెఱుకు, పండింపబడుచున్నవి. ఇవికాక మొక్క జొన్న, వేరుశనగ, పప్పు ధాన్యములు, కూరగాయలు, అధికముగా పండింపబడుచున్నవి. చేగుంట మండలము నందు విద్యుత్‌శాఖవారు మూడు సబ్ స్టేషన్‌లు వంద ట్రాన్స్‌ఫార్మర్లతో విద్యుత్తును సరఫరా చేయుచున్నారు. సుమారు 2323 వ్యవసాయ పంపుసెట్లకు విద్యుత్ సరఫరా జరుపబడుచున్నది.

చేగుంట మండలమున చేగుంట గ్రామము పూర్వకాలమునుండియు వ్యాపారాభివృద్ధి దిశలో పయనించుచున్నది. నిజాం ప్రభుత్వ హయాంలోనే ఇక్కడ ఒక పెద్ద బియ్యపుమిల్లు ఉండెడిది. ప్రస్తుతము ఈ మండలమున 16 రైసుమిల్లులు పనిచేయుచూ లాభాల బాటలో పయనించుచున్నవి. ఇక్కడ పండించిన వరిధాన్యము ఇక్కడి రైసు మిల్లులకు సరిపోక ఇతర ప్రాంతముల నుండి కూడా వడ్లను దిగుమతి చేసుకొని ఇక్కడి వ్యాపారులు పారిశ్రామికాభివృద్ధి సాధించుచు న్నారు. ఇక్కడ పండించిన చెఱుకు రైతులు దూరతీరములకు తీసుకొని పోనవసరము లేకుండా మండల కేంద్ర సమీపముననే ప్రయివేటు యాజ మాన్యమున ఖండసారి చెక్కర కర్మాగారము కలదు.

ఈ మండలమునందు పౌల్ట్రీ కలదు. చేగుంట, రెడ్డిపల్లి, గ్రామాలలో అనేక మంది యువతులు కుటీర పరిశ్రమగా బీడీలను తయారు చేయుదురు.

ఈ మండలమున నార్సింగి, చేగుంట, మక్కరాజిపేట గ్రామాలలో (3) సబ్ పోస్టాఫీసులు ఉండి ప్రతి గ్రామమునకు బ్రాంచి పోస్టాఫీసుల ద్వారా తపాలా సౌకర్యములు కలిగించుచున్నవి. చేగుంట నార్సింగి గ్రామాలలో టెలిఫోన్ ఎక్స్చేంజీలు పని చేయుచున్నవి.

చేగుంట మండలమునందు నార్సింగి చేగుంటలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు నెలకొల్పబడినవి. ప్రతి ప్రాథమిక ఆరోగ్య కేంద్రము నందు ఇద్దరు డాక్టర్లతో పాటు తక్కిన వైద్య సిబ్బంది వైద్య సేవలందించును. ఈ ఆరోగ్య కేంద్రముల కనుబంధముగా చందాయిపేట, బోనాల, మక్కరాజుపేట, ఇబ్రహీంపూర్, రెడ్డిపల్లి, వడియారం గ్రామాలలో ఉపకేంద్రములు నెలకొల్పబడి అందలి వైద్య సిబ్బంది ఆయా గ్రామాలలో టీకాలు మొదలగు వైద్య సహాయములు అందితురు. ఈ మండలమున పక్షవాతానికి, పచ్చకామెర్ల వ్యాధికి చెట్లమందులు పోయ నాటు వైద్యులు కలరు. అట్లే పశుపోషణ, పశుసంరక్షణకై ఈ మండలమున రెండు పశుసంవర్ధక కేంద్రములుండి అందలి డాక్టర్లు మండలములోని పశువులకు వైద్యమునందించుచు కృత్రిమ గర్భధారణాది కార్యక్రమములను నిర్వర్తించుచున్నారు.

ఈ మండలమున 107 డ్వాక్రా గ్రూపులు 1605 మంది సభ్యులచే సుమారు 2 లక్షల పొదుపుమొత్తాలచే నడుపబడుచున్నది.

---

శ్రీ వి. వెంకట్ రెడ్డి, బడ్డిపడగ వారి సౌజన్యంతో

ఈ మండలమునందు ప్రాచీన కట్టడాలయిన బురుజులు చెందాయిపేట, వడియారం, ఇబ్రహీంపూర్, రెడ్డిపల్లి గ్రామాలలో నేటికిని చెక్కుచెదరక అగుపించుచున్నవి.

ఈ మండలమునందు ఒక పోలీసుస్టేషను, ఒక నర్సిరీ 4 బ్యాంకులు, ఒక గ్రంధాలయము కలవు.

ఈ మండలమునందు రీడ్స్ అను స్వచ్ఛంద సంస్థ బాలకార్మికులకు అక్షరాస్యతను సమకూర్చుటకు హితోధికముగా సహాయము నందించున్నది.

ఈ మండలమునందలి ఇబ్రహీంపూర్ గ్రామమున ప్రాచీన కాలమున నిర్మించిన వెంకటేశ్వర దేవాలయము చక్కని శిల్పకళా సంపదతో ఒప్పారుచున్నది. అధునాతన కాలమున చేగుంటలో వెంకటేశ్వర దేవాలయము సుందరముగా నిర్మింపబడినది.

ఈ మండలమునందు చెప్పుకోదగిన పండితుడు శ్రీ శివమూరి విశ్వనాథ శర్మ గారు. వీరు సంస్కృతాంధ్రములందు చక్కని పాండిత్యము కలవారై, హైదరాబాదునందలి ఖండవల్లి లక్ష్మీరంజనం స్మారక ప్రాచ్యకళాశాల ప్రధానాచార్యులుగా బహుకాలము పని చేసి అనేక మంది విద్యార్థులకు విద్యాభిక్ష నొసంగినవారు. వడియారం గ్రామ నివాసియైన డా. వరద శ్రీశైలం ప్రవాసాంధ్రులుగా పాశ్చాత్య దేశమునందు నివసించుచున్నారు.

చేగుంట మండలమునందు 756 వృద్ధాప్య పింఛన్‌లు 519 వ్యవసాయకూలీల పెన్షనులు, 67 వితంతు పింఛనులు ప్రభుత్వము నుండి ప్రజలకందింపబడుచున్నది.

చేగుంట మండలమున 36 చౌకధరల దుకాణముల ద్వారా 7964 తెల్లకార్డుల వారికి, 282 గులాబీ కార్డుల వారికి ప్రతినెలలో 1358.2 క్వింటాళ్ళ బియ్యము, 144.69 క్వింటాళ్ళ పంచదార 50 క్వింటాళ్ళ గోధుమలు, 28350 లీటర్ల కిరోసిస్, నిత్యావసర సరుకులుగా పంపిణీ చేయబడుచున్నవి.

శ్రీ పి. వెంకట్ రెడ్డి, బడ్డిపడగ వారి సౌజన్యంతో

## చేగుంట మండలములోని సర్పంచులు

| క్రసం | గ్రామముపేరు | సర్పంచుపేరు |
|---|---|---|
| 1. | చందాయిపేట | అకులసిద్దిరాంలు |
| 2. | బోనాల | ఆడిపిజయకుమార్ |
| 3. | అల కసాన్‌పల్లి | అలంగౌరయ్య |
| 4. | గోవిందపూరు | ఉప్పులపల్లయ్య |
| 5. | కర్నాలపల్లి | ఏరవబాల్‌రెడ్డి |
| 6. | పెద్దశివనూరు | ఏర్రభారతమ్మ |
| 7. | ఉల్లతిమ్మాయిపల్లి | కంటారెడ్డిం శోభారాణి |
| 8. | వడియారం | కడారినర్రమ్మ |
| 9. | రెడ్డిపల్లి | కరింగులరామిరెడ్డి |
| 10. | పోసాన్‌పల్లి | కారింగులరామిరెడ్డి |
| 11. | రుక్మాపూరు | గజ్జలయెల్లయ్య |
| 12. | బి.కొండాపూరు | గూటంరామచంద్రం |
| 13. | పులిమామిడి | గోర్రిరత్నయ్య |
| 14. | ఇబ్రహింపూరు | తడబోయినబాలమల్లయ్య |
| 15. | గొల్లపల్లి | దేవసత్‌మిరియాలి |
| 16. | వల్లూరు | దొబ్బలఅంబరిష్ |
| 17. | మక్కరాజపేట | బాలసెట్టిపుషపేణి |
| 18. | రాంపూరు | బిల్‌కిన్‌బగం |
| 19. | అనంతసాగరు | భువనగిరిసాయమ్మ |
| 20. | చిన్నశివనూరు | బొల్లరాములు |
| 21. | నర్సంపల్లి | బొమ్మగరిఅయిలయ్య |
| 22. | ఉప్పరపల్లి | బోయిసిపల్లయ్య |
| 23. | పబ్బోజిపల్లి | మదింలక్ష్మినర్సయ్య |
| 24. | చేగుంట | మ్యాకలరాములు |
| 25. | వోలెంపల్లి | యాటనర్సయ్య |
| 26. | నార్సింగి | రాజాగౌడు |
| 27. | చెట్లతిమ్మాయిపల్లి | ----- |

శ్రీ ఎన్. రాజిరెడ్డి, ఒబ్లాపూర్ వారి సౌజన్యంతో

## చేగుంట మండలములోని ఎం.పి.టి.సి.లు

| క్రసం | గ్రామముపేరు | ఎం.పి.టి.సి. |
|---|---|---|
| 1. | చేగుంట | జి. బాల్‌రాజ్‌గౌడ్ (ఉపాధ్యక్షుడు) |
| 2. | ఉప్పరి పల్లి | ఆకారం బాపురాజు |
| 3. | ఉల్లి తిమ్మాయిపల్లి | ఊరడి సిద్ధవ్వ |
| 4. | చేగుంట | ఒంటరి గోవింద రెడ్డి |
| 5. | నార్సింగి 1. | టి. జయ శ్రీ |
| 6. | నార్సింగి 2. | ముచంగారి నర్సింహ్మా చారి |
| 7. | ఇబ్రహీంపూర్ | తుమ్మల లక్ష్మి |
| 8. | రెడ్డిపల్లి | తీగల సరస్వతి |
| 9. | కొండాపూర్ | పాలేటి పోచమ్మ |
| 10. | చిన్న శివనూర్ | ఎ. నర్సారెడ్డి |
| 11. | చందాయిపేట | ఎర్ర బాలమల్లయ్య |
| 12. | పోతనపల్లి | లంబాడి సామ్య |
| 13. | వడియారం | సాప నర్సమ్మ |
| 14. | కో-ఆప్టెడ్ మెంబర్ | ఎం.డి. బాబు |

# చిన్న శంకరం పేట (రా) మండలము

మెదకు జిల్లాలో చిన్న శంకరం పేట (రా) మండలము 1987 లో ఏర్పడినది. రామాయంపేట తాలుకాను విభజించి 4 మండలములుగా ఏర్పాటు చేసిరి.

శంకరం పేట (రా) మండల కేంద్రము మెదకునకు సుమారు 20 కి. మీ. దూరమున కలదు.

శంకరం పేట (రా) మండలమునకు తూర్పున రామాయంపేట మండలము, దక్షిణమున చేగుంట మండలము, పడమర వెల్దుర్తి మండలము ఉత్తరమున మెదకు ఎల్లలుగా కలవు. శంకరం పేట (రా) మండల భౌగోళిక విస్తీర్ణము 15305 హెక్టార్లు. ఇందులో 7519 ఎకరములు అటవీ భూమి కాగా వ్యవసాయోగ్యమైన భూమి 25011 కలదు. ఈ వ్యవసాయోగ్యమయిన భూమిలో 6582 ఎకరములు మాగాణి కాగా 18429 ఎకరముల మెట్ట భూమి కలదు.

ఈ మండలమునందు 30 గ్రామములు, 20 గ్రామపంచాయితీలు కలవు.

చిన్న శంకరంపేట (రా) మండలమునందు 1991 జనాభా గణన ప్రకారము 36779 మంది నివసించు చున్నారు. ఈ జనాభాలో లు S.C 6978, S.T లు 2889 మాత్రము కలరు. ఈ మండలము నందలి కుటుంబాల సంఖ్య 8996.

1987 లో శంకరంపేట మండల ప్రజా పరిషత్తునకు మొట్ట మొదటి సారిగా అధ్యక్ష పదవికై ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికలు పార్టీ ప్రాతిపదికను మండల ప్రజలందరిచే ప్రత్యక్షముగా జరిపింపబడినవి.

1995 లో మండల పరిషత్తులకు మలియెన్నికలు జరిగినవి. ఈ ఎన్నికలు మార్పుబడిన పంచాయతీరాజ్ యాక్ట్ ప్రకారముగా జరిగినవి. మండలమున 12 ప్రాదేశిక నియోజక వర్గములు ఏర్పరచబడినవి. ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులను ఆయా గ్రామములందలి ప్రజలు ఎన్నుకొనగా వారి నుండి అధ్యక్ష, ఉపాధ్యక్ష ఎన్నికలు జరిగినవి. శ్రీ టి. పండరీగౌడ్‌గారు అధ్యక్షులుగా, శ్రీ మూర్తి విఠల్‌గారు ఉపాధ్యక్షులుగా ఎన్నుకొనబడినారు. ఈ మండలము నుండి జిల్లా పరిషత్ ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులుగా (Z.P.T.C ) శ్రీమతి జి. సునందారెడ్డి గారు ఎన్నికయినారు. వీరు శంకరంపేట మండలమును అభివృద్ధి గావించుటకు తమ శాయశక్తులా కృషి చేయుచున్నారు.

శంకరంపేట మండలమునందు మండల మేర్పడిన తర్వాత స్థానికముగా ఒక ప్రభుత్వ జూనియర్ కళాశాల ఏర్పటు గావింపబడి జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల భవనమునందే నడుపబడుచున్నది. ఈ మండలమునందు 5 ఉన్నత పాఠశాలలు జిల్లా పరిషత్ యాజమాన్యము నడుపబడుచున్నవి.

---

శ్రీ సి.హెచ్. రామ్ రెడ్డి వారి సౌజన్యంతో

ఈ మండల పరిషత్ ఆధీనమున 4 ప్రాథమికోన్నత పాఠశాలలు, 26 ప్రాథమిక పాఠశాలలు నడుప బడుచున్నవి. పాఠశాలలకు వెళ్ళని బాలబాలికలకు యువతీ యువకులకు 7 నిరంతర విద్యా కేంద్రములు విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నవి.

ఈ మండలమునందు 17 అంగన్ వాడీ కేంద్రములు. మాతా శిశు సంక్షేమ సంస్థ ద్వారా నడుపబడుచు తల్లులకు ఆరోగ్య సేవా కార్యక్రమముల లోను పిల్లలకు ఆరోగ్యముతో పాటు అక్షరాభ్యాసము లలోను తగు సేవలందించుచున్నవి.

ఈ మండలమునందు రెండు విద్యార్థి వసతి గృహములుండి బీద విద్యార్థుల విద్యాభ్యాసమునకు తోడ్పడుచున్నవి.

చిన్న శంకరంపేట (రా) మండలమునందు ప్రజలకు ముఖ్యవృత్తి వ్యవసాయము. ఈ మండలమున వ్యవసాయయోగ్యమయున భూమి కూడా యెక్కువే కలదు. ఇక్కడి సగటు వర్షపాతం 964 మి.లీ. ఈ మండలం నందు 21 చెరువులు, 164 కుంటలు కలవు. ఇచ్చట భూగర్భజల సంపత్తి పుష్కళముగానున్నది కావున మెట్టభూములల్లో అనేకముగా బావులు గొట్టపుబావులు ఎక్కువగా త్రవ్వించి రైతులు పుష్కళమైన పంటలు పండించుచున్నారు. ఈ మండలమునందు వరి, చెరకు ప్రధాన పంటలు కాగా పప్పు దినుసులు, నూనెగింజలు, ఉల్లి మొదలగు పంటలను కూడా ఇక్కడ పుష్కళముగా పండించుచున్నారు. ఈ మండలమునందు వ్యవసాయమునకై భూమి లేని నిరుపేదలకు 6245 ఎకరముల ప్రభుత్వ భూమి పట్టాచేయబడి ఈయబడినవి. అట్లే 555 ఎకరముల సీలింగ్ భూములు కూడా సామాన్య జనములకు పంపిణీ చేయబడినవి. శంకరంపేట మండల కేంద్రమున ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రము సమస్త వసతులతో ప్రజారోగ్యమును కాపాడుచున్నది.

ఈ మండలమునందు ఒక పశువైద్యశాల కలిగి అనుబంధముగా కొరివిపల్లి, మడూరు గ్రామములలో ఉపకేంద్రములు కలిగి యున్నవి. ఇచ్చట పశుసంపద ఆరోగ్యమును కాపాడుటలో కృత్రిమ గర్భోత్పత్తి విధానము వాటి ద్వారా పశుసంపదలను పెంచుటలోను ఈ పశు కేంద్రములు తోడ్పడుచున్నవి. ఈ మండల కేంద్రమున ఒక పోలీస్ స్టేషన్, ఒక గ్రంథాలయము కలవు. ఈ మండలమునందు తంతి తపాల సౌకర్యము కలదు.

ఈ మండలమునందు స్థానికముగా స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా మడూరు గ్రామమున ఆంధ్రబ్యాంకు కలవు ఈ మండలమునందలి ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘములు, బ్యాంకులు ఈ మండలమునందలి వ్యవసాయ, వ్యాపారములకు తగు రుణసౌకర్యములు కల్పించుచు అధికోత్పత్తికిని వ్యాపారాభివృద్ధికిని తోడ్పడుచున్నవి.

---

శ్రీ నరసింహా రెడ్డి, నారాయణరావు పేట వారి సౌజన్యంతో

ఈ మండలమునందు శంకరంపేట స్థానికముగా ఒక చెక్కెర పరిశ్రమ కలదు ఇక్కడ పండించు చెఱుకురైతులకు ఈ పరిశ్రమ అనుకూలముగానున్నది. ఈ మండలమునందు 4 బియ్యపు మిల్లులు కలవు.

శంకరంపేట (రా) గ్రామమున ఒకరైతు భూమిని త్రవ్వుచుండగా ఒక దేవాలయం బయల్పడినది దానిని వెలికితీయుటకై ఆ ప్రాంతమునంతను త్రవ్వి దేవాలయమును బయల్పడునట్లు చేసిరి. ఈ దేవాలయమును సోమేశ్వరాలయమని పిలుచుచున్నారు. త్రవ్వకములలో బయల్పడిన ఈ దేవాలయము ఏ మాత్రము భిన్నముకాక చక్కగానున్నది. శంకరం పేట గ్రామ పరిసరములందు రోడ్డు ప్రక్కన ఒక గుట్టపై పద్మనాభస్వామి దేవాలయం కలదు. ఈ రెండు దేవాలయములు శంకరంపేట మండలమున ప్రఖ్యాతి గాంచియున్నవి. అంబోజీ పేటలో వేణుగోపాల స్వామి దేవాలయం ప్రశస్తమైనది.

శంకరంపేట(రా) మండలమున 24 గ్రామములకు రక్షిత మంచినీటి సరఫరా అమలు చేయబడుచున్నది. ఈ మండలమున 800 బలహీన వర్గాల గృహనిర్మాణం చేపట్టబడినది.

శంకరంపేట (రా) మండలమున ప్రభుత్వ పౌరసరఫరాల దుకాణములు 25 కలవు. ఈ మండలమునందు తెల్లకార్డులు 6157, గులాబీ కార్డులు 1883 కలవు. వీరికి నెల ఒక్కింటికి 951 క్వింటాళ్ళ బియ్యము, 101.79 క్వింటాళ్ళ చెక్కెర పంపిణీ చేయబడుచున్నది.

# చిన్న శంకరం పేట (రా) మండలము

## మండల ప్రజా పరిషత్ లిస్టు

| క్ర.సం | గ్రామ పంచాయతీ పేరు | సర్పంచ్ పేరు | మండల ప్రాదేశిక నియోజక వర్గ సభ్యుని పేరు (M.P.T.C) |
|---|---|---|---|
| 1. | జప్తి శివనూర్ | కే. నారాయణ | మోకొల్ల సత్తయ్య |
| 2. | శంకాపూర్ | బి. మహిపాల్ రెడ్డి | మోకొల్ల సత్తయ్య |
| 3. | గజగట్ల పల్లీ | యమ్. రాములు | M. బాలకిషన్ రావు |
| 4. | తురూాల మాందాపూర్ | శ్రీమతి అనసూయ | M. బాలకిషన్ రావు |
| 5. | మహేశ్ | యమ్. రామయ్య | G. కిష్టారెడ్డి |
| 6. | శాలిపేట్ | మ్మెలె సత్తమ్మ | మూర్తి విఠల్ |
| 7. | ఖాజాపూర్ | బి. నర్సింహులు | T. పండరీగౌడ్ |
| 8. | మిర్జాపల్లీ | రమణ | శ్రీమతి Ch. సక్కుబాయి |
| 9. | శేరిపల్లీ | నైరం లలిత | శ్రీమతి Ch. సక్కుబాయి |
| 10. | కొర్వపల్లీ | లంబాడి సక్రు | M. బాలకిషన్ రావు |
| 11. | అంబాజిపేట | సాలె బాలకిషన్ | M. బాలకిషన్ రావు |
| 12. | S. కొండాపూర్ | శ్రీమతి నాగారం లలిత | శ్రీమతి వడ్ల విజయమ్మ |
| 13. | గవ్వల పల్లీ | బాగాడం బాగయ్య | శ్రీమతి వడ్ల విజయమ్మ |
| 14. | చందాపూర్ | శ్రీమతి పడాలజ్యోతి | శ్రీమతి వడ్ల విజయమ్మ |
| 15. | శంకరంపేట (R) | శ్రీ L. రామకిష్టయ్య | లంబాడి మంగమ్మ |
| 16. | కామారం | శ్రీమతి లంబాడి తారి | లంబాడి మంగమ్మ |
| 17. | చందంపేట | M. రమేష్ | ఆకుల సిద్ధమ్మ |
| 18. | సూరారం | A. లక్ష్మన్ | సిద్ధి రాములు |
| 19. | జంగరాయి | D. రవీందర్ రెడ్డి | సిద్ధి రాములు |
| 20. | ధర్పల్లి | T. యెల్లయ్య | సిద్ధిరాంరెడ్డి |

శ్రీ డా. సుధాకర్, బొంతపల్లి వారి సౌజన్యంతో

# చిన్నకోడూర్ మండలము

మెదక్ జిల్లా సిద్దిపేట తాలూకాలో 1987లో జరిగిన పరిపాలనా వికేంద్రీకరణలో భాగంగా ఈ మండలం ఏర్పాటయింది.

ఈ మండల విస్తీర్ణం 26,687 హెక్టార్లు.

ఈ మండలములో 26 గ్రామ పంచాయతీలు 32 గ్రామాలు ఉన్నాయి.

ఈ మండల జనాభా 49,412 ఇందులో పురుషులు 29,946, స్త్రీలు 24,466 గలరు. ఎస్.సి.లు 8072, ఎస్.టి.లు 351 మాత్రము ఉన్నారు.

ఈ మండలము ఏర్పాటయిన తరువాత మొట్టమొదటి అధ్యక్షులుగా శ్రీ కూర జయపాల్‌రెడ్డి గారు ఎన్నికైనారు. ఈయన 5 సంవత్సరముల మండల అభివృద్ధికై అవిరళ కృషి చేశారు. వీరు జిల్లా ప్రజాపరిషత్తు ఉపాధ్యాయులుగా ఎన్నికైనారు. 1994లో తిరిగి అధ్యక్ష స్థానమునకు ఎన్నిక జరుగగా శ్రీమతి వేలేటి రోజా శర్మ అధ్యక్షురాలుగా ఎన్నికైనారు. ఈమె తమ 5 సంవత్సరాల పదవీకాలంలో మండల అభివృద్ధికి నిరంతర కృషి చేశారు. ఈ మండలమునకు ఉపాధ్యక్షులుగా సత్యనారాయణ, జడ్.పి.టి.సి.గా పరకాల మల్లేశంగారలు ఎన్నికయినారు.

ఈ మండలములో 19 ప్రాథమిక పాఠశాలలు 7 ప్రాథమికోన్నత పాఠశాలలు మండల పరిషత్ యాజమాన్యంలో పని చేయుచున్నవి. 12 ఉన్నత పాఠశాలలు జిల్లా పరిషత్ యాజమాన్యంలో పనిచేయుచున్నవి.

ఈ మండలములో 2 బి.సి విద్యార్థి వసతి గృహములు, ఎస్.సి.లకై ఒకటి కలదు.

ఈ మండలములో ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రము మరియు దీనికి ఉపకేంద్రములు పని చేయుచూ నిరంతరం ప్రజల ఆరోగ్యాన్ని పరిరక్షిస్తున్నాయి.

ఈ మండలములో 2 పశువైద్యశాలలు, 5 అనుబంధ వైద్యశాలలు పని చేయుచున్నవి.

ఈ మండలములో 1 రక్షకభట నిలయము, 21 గ్రామాలలో పోస్టాఫీసులు గలవు.

ఈ మండలములో చౌకధర దుకాణాల ద్వారా 11.971 కార్డుల వారికి రేషన్ పంపిణీ చేయబడుతున్నది. ఇందులో తెలుపు కార్డులు 3172, గులాబి కార్డులు 8797 కలవు. వీరికి ప్రతినెల బియ్యము 1470 క్వింటాళ్లు, చెక్కెర 158 క్వింటాళ్లు, కిరోసిన్ 35750 లీటర్లు సరఫరా చేయబడుచున్నది.

---

శ్రీ జగదీశ్వర్ హర్‌కర్, అడ్వకేట్, మెదక్ వారి సౌజన్యంతో

ఈ మండలములో డ్వాక్రా సంఘాలు, సి.ఎం.ఈ.వై. సంఘాలు, పి.ఎం.ఆర్.వై. లబ్దిదారులు గలరు.

ఈ మండలములో వృద్ధాప్య పింఛన్లు మరియు వితంతు పింఛన్లు పంపిణీ చేయబడుతున్నవి.

ఈ మండలములో చాలామంది ప్రజలు వ్యవసాయముపై ఆధారపడి జీవనం కొనసాగిస్తున్నారు. వరి, కూరగాయలు ప్రధాన పంటలుగా పండించబడుచున్నవి.

ఈ మండలములో చెరువు, కుంటలు, బోర్ల ద్వారా వ్యవసాయం జరుగుతుంది.

ఈ మండలములోని అనంతసాగర్‌లో సరస్వతి దేవి ఆలయము, చంద్లాపూర్‌లోని వేణుగోపాలస్వామి ఆలయం చిన్నకోడూర్‌లో శివాలయము ప్రముఖ దేవస్థానాలు.

ఈ మండలములో సలంద్రి అనే ప్రముఖ పర్యాటక స్థలం గలదు. ఇచ్చటి ఆలయాలను, కోనేరును, మజీదులను అక్కన్న మాదన్నల కాలంలో నిర్మించినారని చెపుతారు.

ఈ మండలములోని రాముని పట్ల గ్రామాన్ని ప్రస్తుత ఉపసభాపతి శ్రీ చంద్రశేఖరరావుగారు ఆదర్శగ్రామంగా తీర్చిదిద్దడానికి ఎంతో కృషి సల్పుతున్నారు.

## సర్పంచ్‌లు జాబితా

| క్ర.సం. | గ్రామం పేరు | సర్పంచ్‌లు |
|---|---|---|
| 1. | కాముని శ్రీనివాస్ | చిన్న కోడూర్ |
| 2. | కంకటి నారాయణ | పెద్ద కోడూర్ |
| 3. | జెరిపోతుల సత్తయ్య | మాదాపూర్ |
| 4. | సబ్బెన్ కన్నకయ్య | బేడారం |
| 5. | నముండ్ల కమల | మైలారం |
| 6. | నూనెమల్లేశం | చెల్కలపల్లి |
| 7. | కామబుజ్జమ్మ | అల్లీపూర్ |
| 8. | గొల్లపల్లి నాంపల్లి | కిష్టాపూర్ |
| 9. | దేపూరి మల్లేశ్వరి | మందపల్లి |
| 10. | బొల్లం కౌసల్య | రామునిపట్ల |
| 11. | ఎన్. శ్రీనివాస్ | ఇబ్రహీం నగర్ |
| 12. | కూరమాణిక్య రెడ్డి | గోనెపల్లి |

**శ్రీ జహార్, అడ్వకేట్,** నర్సాపూర్ వారి సౌజన్యంతో

| | | |
|---|---|---|
| 13. | మందాల రాఘవరెడ్డి | మేడిపల్లి |
| 14. | సలేంది లక్ష్మి | కస్తూరి పల్లి |
| 15. | ఎమ్. భాగ్యలక్ష్మి | చెర్ల అంకిరెడ్డి పల్లి |
| 16. | బి. జీవన్‌రెడ్డి | అనంత సాగర్ |
| 17. | హరిపురి సుమతి | రామంచ |
| 18. | బండారి రాజయ్య | మల్యాల |
| 19. | మట్టి నర్సయ్య | గుర్రాల గొంసి |
| 20. | రాగులరామస్వామి | జక్కాపూర్ |
| 21. | చిలాపురం తిరుపతి | గోప్లాపూర్ |
| 22. | పొన్నాల సత్తయ్య | మాటిండ్ల |
| 23. | ఎర్ర గొల్లపుదుర్గయ్య | విఠలాపూర్ |
| 24. | బుస్సరామకిష్టయ్య | గంగాపూర్ |
| 25. | బి. గౌరవ్వ | చంద్లాపూర్ |
| 26. | దయ్యాల లక్ష్మి | సికింద్లాపూర్ |

| క్ర.సం | గ్రామం | ఎం.పి.టి.సి. పేరు |
|---|---|---|
| 1. | చంద్లాపూర్ | శ్రీమతి వేలేటి రోజాశర్మ |
| 2. | చిన్నకోడూరు | కొలను పోచయ్య |
| 3. | పెద్దకోడూరు | చిట్టి వెంకటరెడ్డి |
| 4. | మైలారం | బడితం కనకయ్య |
| 5. | అల్లీపూర్ | శ్రీమతి చిట్యాల మల్లవ్వ |
| 6. | మందపల్లి | శ్రీమతి జిందం కోమల |
| 7. | గోనెపల్లి | శ్రీ బండిరాములు |
| 8. | అనంతసాగర్ | శ్రీ కొండం బాల్‌రెడ్డి |
| 9. | ఇబ్రహీంనగర్ | యం. సత్యనారాయణ రెడ్డి |
| 10. | రామంచ | శ్రీమతి ఎర్రవల్లి మణమ్మ |
| 11. | గుర్రాల గొంది | మిద్దెకిషన్ |
| 12. | జక్కాపూర్ | ఒగ్గుబాలమల్లు |
| 13. | విఠలాపూర్ | పి. సత్యనారాయణ రెడ్డి |
| 14. | కో-ఆప్షన్ మెంబర్ | ఎం.ఎ. ఖలీల్ |

**గీతా ఎడ్యుకేషనల్,** మంబాజిపల్లి, మెదక్ వారి సౌజన్యంతో

# దౌలతాబాద్ మండలము

మెదకు జిల్లాలో దౌలతాబాద్ మండలము మారు మూలలోనున్నట్టిది. మండల కేంద్రమేర్పడు నాటికి రవాణా సౌకర్యములు కూడా చక్కగా లేనట్టిది. అట్టి మండలము ఆంధ్రప్రదేశమున ఆదర్శ మండలముగా ఎన్నికైన దన్నచో ఎంతటి అభివృద్ధిని సాధించినదో యూహింప వచ్చును. ఈ మండలమింతటి అభివృద్ధి సాధించుటకు ఇచ్చట నాయకత్వము ఎంతగా కృషి చేసినదో యూహించలేము.

గజవెల్లి తాలుకాను 6 మండలములుగా విభజింపగా దౌలతాబాదు ఒక మండల కేంద్రముగా నేర్పడినది. పరిపాలనా వికేంద్రీకరణలో భాగముగా తాలూకాలు, మండలములుగా విభజింపబడినవి.

దౌలతాబాదు మండల భూ వైశాల్యము 57709 ఎకరములు ఈ మండలమునను 32 గ్రామములు 18 మదిరెలు, 28 గ్రామ పంచాయతీలు కలవు.

ఈ మండలమునకు తూర్పున గజ్వేల్ మండలము, దక్షిణమున వర్గల్ మండలము, పడమర చేగుంట మండలము, ఉత్తరాన రామాయంపేట మండలములు ఎల్లలుగానున్నవి.

దౌలతాబాద్ మండలమేర్పడిన తర్వాత 1987న మొట్టమొదటి మండల ప్రజా పరిషత్తునకు ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికలలో మండలాధ్యక్షులు పదవికి ప్రత్యక్ష ఎన్నిక జరిగి శ్రీ భగవాన్ రెడ్డి గారు ఎన్నికైనారు. వీరు తమ పదవీ కాలమున మండలాభివృద్ధికి ఎనలేని సేవ చేసిరి. 1995 లో మండల పరిషత్తునకు రెండవ పర్యాయములో ఎన్నికలు జరిగినవి ఈ ఎన్నికలు పరోక్ష పద్ధతిన జరిగినవి. ఇందులో ఈ మండలమునకు శ్రీమతి బందారం ఎల్లవ్వగారు మండల అధ్యక్షులుగాను శ్రీ.కే. గోవిందరెడ్డి మండల ఉపాధ్యక్షునిగా ఎన్నికైనారు. ఈ మండలము నుండి 13 మంది మండల ప్రాదేశిక నియోజకవర్గ సభ్యులు ఎన్నికైనారు. ఒక్క ఎం.పి.టి.సి కో-ఆప్షన్ మెంబర్‌గా ఎంపిక కాబడెను. ఈ మండలము నుండి జిల్లా ప్రాదేశిక నియోజక వర్గ సభ్యునిగా శ్రీ ఆర్. రత్నారెడ్డి గారు ఎన్నికైరి. వీరందరు దౌలతాబాదు మండలాభివృద్ధికి తమ అమూల్యమైన సేవలందించుచున్నారు.

దౌలతాబాదు మండలమున 1991 జనాభా గణన ప్రకారము 44326 మంది కలరు. వీరిలో S.C లు 8911 మంది, S.T లు 725, ఇతరులు 34690 మంది ఉన్నారు. ఈ మండలమున 9180 కుటుంబములున్నవి.

దౌలదాబాద్ మండల ప్రజలు వ్యవసాయము పై ఆధారపడి జీవింతురు.

---

శ్రీ ఉపాసనె రామకిష్టయ్య, టీచర్, తూప్రాన్ వారి సౌజన్యంతో

ఈ మండలమున వ్యవసాయ యోగ్యమైన భూమి 51038 ఎకరవుులు ఇందు వూగాణి 6200 ఎకరవుులు, మెట్ట 44838 ఎకరవుులు ఈ మండలమునందు పెద్దచెరువులు 18 కలవు. కుంటలు 211, బావులు గొట్టపు బావులు 3707 కలవు. ఇక్కడ ఎక్కువగా మెట్టపంటలు వర్షాధారముగా పండింతురు. ఇక్కడ నీటి వసతి తక్కువ చాలాలోతున గాని నీరు లభించదు. ఈ మధ్య కాలమున గొట్టపు బావులు సువూరు 200 ఫీట్లు లోతుకు వేసి నీటిని తోడుచున్నారు. ఈ మండలమున సన్నకారు రైతులు 8463 చిన్నకారు రైతులు 3636 కలరు. ఈ మండలమునందు వరి, మక్కజొన్న, రాగి, కంది, పల్లి, చెఱుకు, ఆముదము, ప్రత్తి, ప్రొద్దుతిరుగుడు, ఉల్లి పంటలు పండించుచున్నారు.

దౌలతాబాదు మండలమున ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ గురుకుల ఆవాస విద్యాలయము కలదు. విశాలమైన ప్రదేశములో చక్కని భవనాలు తగినంత మంది గురువులు, ఇతర సిబ్బంది కలిగి ఉన్నత పాఠశాల గా పదవ తరగతి వరకు విద్యార్థులకు ఉత్తమ విద్యాబోధన జరపబడుచున్నది. ఉపాధ్యాయులకు, విద్యార్థులకు ఇచ్చటనే వసతి సౌకర్యమేర్పాటు చేయునైనది. విద్యార్థులకు చక్కని భోజన సదుపాయము, చదువుకొన గ్రంధాలయము, గురువుల కనుసన్నలలో విద్యార్జన, ఆటపాటలు ఒకటేమిటి అన్నింట విద్యార్థులిచ్చట తీర్చి దిద్దబడుచున్నారు. ఈ మండలమున జిల్లా పరిషత్తు ఆధీనమున 5 ఉన్నత పాఠశాలలు గలవు. మండల పరిషత్తు అధీనమున 44 ప్రాథమిక పాఠశాలలు పని చేయుచున్నవి. అన్ని పాఠశాలలకు స్వంత భవనాలు నిర్మింపబడినవి. ఈ మండలమునందు స్త్రీశిశు సంక్షేమ సంస్థ ద్వారా నడుచు 17 అంగన్‌వాడి కేంద్రములుండి స్త్రీలకు, శిశువులకు తమ సేవలందించుచున్నవి. అంతేగాక 5 సంవత్సరవుులలోపు బాలబాలికలను విద్యా వ్యాసంగము వైపు మళ్ళించుటకు ప్రాథమిక బోధన చేయబడుచున్నవి.

**డా. జగదీశ్,** రామాయంపేట వారి సౌజన్యంతో

పాఠశాలలకు రాలేని బాలబాలికలకు, యువకులకు అక్షరాస్యత కల్పించుటకై 10 నిరంతర విద్యా కేంద్రములు పని చేయుచున్నవి.

ఈ మండలమునందు నాలుగు ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘవుులు గలవు. దౌలతాబాదులో వుంజీరా గ్రామీణ బ్యాంకు, రాయప్రోలులో సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, దొమ్మాటలో ఆంధ్ర బ్యాంక్‌లు నెలకొల్పబడినవి. ఈ బ్యాంకులు, సహకార సంఘములు, వ్యవసాయమునకు స్వల్పకాలిక, దీర్ఘకాలిక రుణములంద జేయుచు వ్యవసాయాభివృద్ధికి తనవంతు సహాయ మందిచుచున్నవి. వ్యవసాయమునకే గాక బ్యాంకులు వ్యవసాయేతర రుణములను, వ్యాపారాభివృద్ధికి ఇచ్చుచున్నవి.

ఈ వుండలవునందు దౌలతాబాదు - రాయప్రోలు గ్రావూలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు నెలకొల్పబడినవి.

వీటికి అనుబంధముగ ఉపకేంద్రములు కూడా పని చేయుచున్నవి. ఈ ఆరోగ్య కేంద్రములలో ప్రజల రోగ నివారణకై తగు మందులు, టీకాలు ఇవ్వబడుచున్నవి. కుటుంబ సంక్షేమ ఆపరేషన్లు చేయుచు జనాభా అదుపులోనుంచుటకు ఈ ఆరోగ్య కేంద్రములు తమ శక్తివంచన లేక పని చేయుచున్నవి.

దౌలతాబాదు మండలమున ఆరు పశువైద్యశాలలు కూడా కలవు. వీటిలో పశువులకు తగు మందులిచ్చుటే కాక, పశు సంరక్షణ, కృత్రిమ గర్భోత్పత్తి వంటి ఉపయోగ కరమగు కార్యక్రమములు జరుపబడుచున్నవి.

దౌలతాబాదు మండలమునందు 35 రక్షిత మంచినీటి పథకములు 240 గొట్టపు బావులు ప్రజలు దాహార్తిని బాపుచున్నవి.

దౌలతాబాదు మండలమున ప్రభుత్వ భూమిని పేద ప్రజలకు 7152.30 ఎకరములు పంచబడినది. సీలింగు, మిగులు భూమి 37 ఎకరములు కూడా ప్రజలకు పంపిణీ చేయనైనది.

ఈ మండలమునందు ప్రభుత్వపరముగా 922 వృద్ధాప్య పింఛన్లు 55 వితంతు పింఛన్లు 768 గర్భిణీ స్త్రీ పింఛన్లు పంపిణీచేయబడినవి.

ఈ మండలమున 11 పోస్టాఫీలులు కలవు ఒక టెలిఫోన్ ఎక్స్‌చేంజి కలదు.

దౌలతాబాదు మండలమున 33 చౌకధర దుకాణములు కలవు. ఈ మండలమునందు తెల్లకార్డులు 8177 గులాబీ రంగు కార్డులు 2011 కలవు. ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా ఈ మండలమున 1362.28 క్వింటళ్ల బియ్యము. 120.70 క్వింటాళ్ల చెక్కర ప్రతి మాసమున పంపిణీ చేయబడుచున్నది.

శ్రీ బోనాల భుజంగం, గోమారం వారి సౌజన్యంతో

## మండల సర్పంచ్‌ల జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | అనాజిపూర్ | డి. జాఫర్ పాష |
| 2. | బేగంపేట | పి. మల్లమ్మ |
| 3. | చిన్నమాచన్‌పల్లి | సి. పెంటమ్మ |
| 4. | ఆరేపల్లి | టి. పోచమ్మ |
| 5. | దొమ్మాట | ఎం. పెంటమ్మ |
| 6. | గాజులపల్లి | జె. వెంకట్‌రెడ్డి |
| 7. | దౌల్తాబాద్ | ఎం. బ్రహ్మయ్య |
| 8. | గొడుగుపల్లి | ఐ. రమేష్ |
| 9. | మొహమదాశాపూర్ | డి. మల్లేషమ్ |
| 10. | ఇందుప్రియాల్ | బి. బిక్షపతి |
| 11. | లింగారెడ్డిపల్లి | ఎం. చంద్రయ్య |
| 12. | ఆరేపల్లి | డి. మల్లాగౌడ్ |
| 13. | మాచన్‌పల్లి | ఎం. లింగమ్మ |
| 14. | ముబరాస్‌పూర్ | జె. నర్సింహులు |
| 15. | మంతూర్ | జులేఖా బేగం |
| 16. | ర్యామారం | సి. రాజయ్య |
| 17. | గొల్లపల్లి | ఐ. శంకరయ్య |
| 18. | రామసాగర్ | ఎన్. సులోచన |
| 19. | ఆనిరెడ్డిపల్లి | యు. తులిసమ్మ |
| 20. | తిమ్మకన్నపల్లి | ఐ. మల్లేష్ |
| 21. | ఎస్. బండారం | జోడులింగం |
| 22. | సుర్మాపల్లిసూరం | టి. అనసూయ |
| 23. | తిరుమలాపూర్ | బి. రాజయ్య |
| 24. | లింగరాజుపల్లి | టి. అంజయ్య |
| 25. | వడ్డెపల్లి | జి.సి. రామయ్య |
| 26. | యల్‌కాల్ | జల పెద్దయల్లం |
| 27. | కొత్తపల్లి | ఎం. శివరాజయ్య |

౦ంత ప్రభాకర్ వారి సౌజన్యంతో

## మండలంలోని యం.పి.టి.సి.ల జాబితా

| | గ్రామం పేరు | ఎం.పి.టి.సి |
|---|---|---|
| 1. | సూరంపల్లి | కె. గోవింద రెడ్డి (ఉపాధ్యక్షులు) |
| 2. | రాయపోల్ | వి. దత్తారెడ్డి |
| 3. | దౌల్తాబాద్ | ఎ. శ్రీనివాస్ |
| 4. | లింగారెడ్డి పల్లి | ఆర్. సుగుణమ్మ |
| 5. | రాంసాగర్ | వి. సునీత |
| 6. | కొత్తపల్లి | జి. నర్సయ్య |
| 7. | వడ్డేపల్లి | విజయలక్ష్మి |
| 8. | యల్‌కల్ | పోచవ్వ |
| 9. | ఇందుప్రియాల్ | కె. భూదయ్య |
| 10. | ముబ్బారస్పూర్ | బి. సత్యనారాయణ |
| 11. | దొమ్మాట | పి. మల్లేషం |
| 12. | తిరుమలాపూర్ | ఎన్. రాజమ్మ |
| 13. | కో ఆప్టెడ్ మెంబర్ | ఎం.డి. కాశిం |

శ్రీ డా. అంజిరెడ్డి, సదాశివపేట వారి సౌజన్యంతో

# దుబ్బాక మండలము

మెదకు జిల్లాలో దుబ్బాక మండలము ప్రత్యేకమైనది. ఈ మండలము మొదలు కేవలము పంచాయతి సమితిగా యుండెడిది . ఇచ్చట తహసీల్ కార్యాలయము లేకుండెడిది. ఇచ్చట తహసీల్ (రెవెన్యూ) కార్యక్రమములన్నియు సిద్దిపేట (తహసీల్) రెవెన్యూ కార్యాలయములో జరుగు చుండెడివి. జిల్లాలో కొత్త తాలుకాల ఏర్పాటులో జరిగినది. దుబ్బాక తాలుకా ఏర్పడినది.

1987 లో నాటి ప్రభుత్వపుటాలోచలన మేరకు తాలూకాలు, పంచాయతీ సమితిలు విభజింపబడినవి. ప్రజల సమీపమునకు పరిపాలన నందించ వలయునను ముదాశయముచే మండల వ్యవస్థ ఏర్పాటైనది. అందులో భాగముగా దుబ్బాక తాలూకా రెండుగా విభజింపబడి దుబ్బాక - మిర్‌దొడ్డి మండలలుగా ఏర్పాటైనది.

దుబ్బాక మొదట దుర్వాస అనుపేరుతో నున్నట్లు ఇతిహాసము కలదు. దుర్వాస మహాముని పేర ఈ గ్రామము వెలసినట్లు తెల్పుదురు.

దుబ్బాక మండలమునకు తూర్పున సిద్దిపేట మండలము దక్షిణమున మిర్‌దొడ్డి మండలము పశ్చిమమున రామాయంపేట మండలమున దక్షిణమున కరీంనగర్ జిల్లా ఎల్లలుగానున్నవి.

దుబ్బాక మండల వైశాల్యము 58,444 ఎకరములు 26 గ్రామములు 13 మదిరలు కలిగిన ఈ మండలమున 32 గ్రామ పంచాయతీలు కలవు. దుబ్బాక, లచ్చపేట, పోతారెడ్డి పేట గ్రామములు మేజర్ గ్రామపంచాయతీలు గాగుర్తించ బడినవి.

ఈ మండలమున 1991 జనాభా గణన ప్రకారము 64275 మంది ప్రజలు నివసించుచున్నారు. వీరిలో 32088 పురుషులు, 32187 స్త్రీలు కలరు. S.C. జనాభా పురుషులు 5901, స్త్రీలు 5909 మొత్తము 11,900 కలరు. S.T. లలో పురుషులు 462, స్త్రీలు 431 మొత్తము 893 మాత్రము కలరు. ఈ మండలమునందు 12431 కుటుంబములు కలవు.

1987 మండల ప్రజా పరిషత్తు ఏర్పడినది మొట్టమొదటి ఎన్నికలు 1987 మార్చి - ఏప్రిల్ లో జరిగినవి. ఈ ఎన్నికలలో శ్రీ బి. రామకృష్ణారెడ్డిగారు మండల ప్రజా పరిషత్తు అధ్యక్షులుగా ఎన్నికైనారు, ఎన్నికైరి. వీరు తమ పదవీ కాలమున చక్కని ప్రజా సేవ చేయుచు మండలమును పురోభివృద్ధి గావించుటకు తమ శక్తి మేరకు కృషి సల్పిరి.

1995లో పంచాయత్ రాజ్ చట్టము మారినది. మండలమున ప్రాదేశిక నియోజక వర్గము ఏర్పడినది మొదట ఆ ప్రాదేశిక నియోజక వర్గముల ఎన్నిక జరిగి (ఎమ్.పి.టి.సి.)లచే జరిగి వారిచే అధ్యక్ష ఎన్నిక జరిగినది.

---

శ్రీ వ్యదమ్ ప్రభాకర గుప్త వారి సౌజన్యంతో

ఈ మండలమునందు ఎమ్.పి.టి.సి.లు కలరు. ఈ ఎన్నికలలో మండల అధ్యక్షులుగా శ్రీ రాంప్రభాకర్ గారు ఎన్నికై ప్రజా సేవలకు తమ వంతు కర్తవ్యమును నిర్వహించుచున్నారు. ఈ మండలము నుండి జిల్లా పరిషత్తు ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులుగా శ్రీమతి విమల గారు ఎన్నికై మండలాభివృద్ధికి తమ చేయూత నందించు చున్నారు.

దుబ్బాక మండలము ప్రధానముగా వ్యవసాయ మండలమని చెప్పవచ్చును. ఇచ్చటి ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయము. ఈ మండలమునందు వ్యవసాయ యోగ్యమైన భూమి 27568 ఎకరములుకాగా, మాగాణి 13354, మెట్ట 14214 ఎకరములు కలదు. ఇచ్చట వర్షపాతము సరాసరి 768 మి.మీ. ఇక్కడ భూగర్భ జలము కూడా తక్కువ యని చెప్పవచ్చును. ఈ మండలమున 24 చెరువులు 235 కుంటలు 3825 బావులు, గొట్టపు బావులు ఇచ్చటి వ్యవసాయమునకు ఉపయుక్తమగు చున్నవి. ఈ బావులన్నిటికి విద్యుత్తు సరఫరా చేయబడుచున్నవి.

ఈ మండలమునందు ప్రతి గ్రామమునకు, మదిరలకు కూడా విద్యుత్తు సరఫరా చేయబడుచున్నది.

ఇక్కడ మాగాణి భూములలో వరి, చెరుకు పండింతురు. మెట్ట భూములలో మొక్కజొన్న ప్రధాన పంటయని చెప్పవచ్చును. ఇవిగాక జొన్న, పల్లి, ప్రొద్దుతిరుగుడు, కంది పంటలు పండింతురు. ఈ మధ్య కాలమున ప్రత్తి పంట కూడా పండించుచున్నారు.

దుబ్బాక మండలమునందు రామక్కపేట గ్రామమున ఆవాస గురుకుల విద్యాలయము (బాలికల) చక్కని భవన సముదాయము, పరిపూర్ణమైన వసతులతో నడపబడుచున్నది. దుబ్బాకలో ఒక ప్రభుత్వ జూనియర్ కళాశాల దానికనుబంధముగా ఉన్నత పాఠశాల కలదు. జిల్లా పరిషత్తు బాలికల ఉన్నత పాఠశాల కలదు. ఈ మండలమున (11) జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలు కలవు. ప్రతి పాఠశాల స్వంత భవనములు కలిగి కొంత ఆట స్థలము కలిగి ఉన్నది, ఈ మండలమున పదకొండు ప్రాథమికోన్నత పాఠశాలలు, 28 ప్రాథమిక పాఠశాలలు మండల పరిషత్తు యాజమాన్యమున నడపబడుచున్నవి. ఇవిగాక ప్రైవేటు యాజమాన్యమున కూడ పాఠశాలలు నడపబడుచున్నవి, ఇవన్నియు మండలమునందలి బాల బాలికల విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నవి.

ఈ మండల కేంద్రమైన దుబ్బాక ఎస్.సి. బాలబాలికలకు ప్రత్యేకముగా వేరువేరు విద్యార్థి వసతి గృహములు, అట్లే బి.సి. విద్యార్థినీ విద్యార్థులకు వేర్వేరు వసతి గృహములు ఇచ్చట నెలకొల్పబడి బీద విద్యార్థులకు విద్యార్జనలో ఎంతో తోడ్పడుచున్నవి.

దుబ్బాక మండలమునందు ప్రతి గ్రామమునకు రోడ్డు వసతి కల్పించబడినది. 'ఆర్ అండ్ బి' వారి 21 కి.మీ. రోడ్డు, జిల్లా పరిషత్తు వారి 40 కి.మీ. రోడ్డు, మండల పరిషత్తు వారి 90 కి.మీ. రోడ్డు ఇచ్చటి ప్రజలకు రహదారి వసతిని కల్పించుచున్నది.

ఈ మండలమునందు ఒక సబ్‌పోస్టాఫీసు ఒక టెలిగ్రాఫిక్ ఆఫీసు, మూడు టెలిఫోన్ ఎక్స్‌చేంజిలు, 12 బ్రాంచి పోస్టాఫీసులు పని చేయుచు ఇచ్చటి ప్రజలకు వార్త ప్రసారములో తంతి తపాల సౌకర్యము కలిగించుచున్నవి.

దుబ్బాక మండలమునందు స్థానికముగా స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్, కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్, మంజీరా గ్రామీణ బ్యాంక్‌లు కలవు. తిమ్మాపూర్ గ్రామమున స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్, అగ్రికల్చరల్ బ్యాంక్ మరియు చిట్టాపూర్ గ్రామమున మంజీరా గ్రామీణ బ్యాంకులు కలవు. ఈ మండలమున 6 ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘములు పని చేయుచున్నవి. ఈ బ్యాంకులన్నియు మండలమునందలి రైతులకు వ్యాపారులకు తక్కువ వడ్డీలకు రుణ సదుపాయమును గల్పించుచు వ్యవసాయాభివృద్ధికి, వ్యాపారాభివృద్ధికి తోడ్పడుచున్నవి.

దుబ్బాక మండలమునందు స్థానికముగా ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఇరువురు డాక్టర్లతో పది పడకలతో అవసరమైన సిబ్బందితో పని చేయుచున్నది. ఈ ఆరోగ్య కేంద్రమునకు అనుబంధముగా 12 ఉప కేంద్రములు పనిచేయుచున్నవి. ఇవన్నియు మండల ప్రజల ఆరోగ్యమును కాపాడుటలో తమవంతు కృషి కొనసాగించుచున్నవి.

ఈ మండల కేంద్రమైన దుబ్బాకలో 1 పశు వైద్యశాల కూడా ఏర్పాటైయున్నది. ఇందులో ఒక పశువులు డాక్టర్ పని చేయును. దీనికి అనుబంధముగా 10 ఉపకేంద్రములు పని చేయుచున్నవి. వీటి ద్వారా మండలమునందలి పశువుల ఆరోగ్యమును కాపాడుటయేగాక రోగ నిరోధక టీకాలు, కృత్రిమ గర్భోత్పత్తి విధానము మొదలగు క్రియా కలాపములు కొనసాగించుచున్నవి.

దుబ్బాక మండలమున ప్రభుత్వము ఇచ్చే విధవా పించన్లు 81. ఇవి క్రమముగా చెల్లింప బడుచున్నవి.

ఈ మండలమున ప్రభుత్వ భూమి ఎ.3795.24గుం. బీద ప్రజలకు వ్యవసాయమునకై పట్టాలు చేసి పంచబడినది అట్లే ఇండ్ల నిర్మాణమునకై 162 మందికి ఎ.7.24గుం. భూమి పంపిణీ చేయబడినది.

దుబ్బాక మండలమున 14420 కార్డులున్న వారు కలరు, అందులో తెల్లకార్డులున్నవారు 11443 కాగా గులాబీ కార్డుల వారు 2977 కలరు.

దుబ్బాక మండలమునందు నేషనల్ ఫ్యామిలీ బెనిఫిట్ స్కీమ్ ( జాతీయ కుటుంబ లాభ పథకము) క్రింద 134 మందికి ఒక్కొక్కరికి రూ: 5000 చొప్పున రూ. 6,70,000 లు పంపిణీ చేయబడినవి. అట్లే Girls Child Protection Scheme క్రింద 51 మంది శిశువులకు రూ. 2,39,714 లాభోక్తలకు ఈయబడినవి.

ఓ.ఏ.పి. క్రింద 982 మందికి ఫించన్లు ఈయబడినవి, డిసెంబర్ 1997 నుండి మే 1998 వరకు కలుపు ఫించన్లు 351 మందికి చెల్లించనైనవి.

---

**శ్రీ దొంతిరెడ్డి, నర్సింహారెడ్డి, రిటైర్డ్ హెచ్.ఎం., గోమారం వారి సౌజన్యంతో.**

## సర్పంచ్‌లు జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | దుబ్బాక | ఎస్. వెంకటేశ్వర్లు |
| 2. | రాజక్కపేట | సి. మణెమ్మ |
| 3. | గంభీర్‌పూర్ | కె. శ్రీను |
| 4. | పోతారం | కె. సువర్ణ |
| 5. | పెద్దగుండవల్లి | వై. అంజయ్య |
| 6. | హబ్షీపూర్ | ఎం. భూమయ్య |
| 7. | చెర్వాపూర్ | సి. బాలనారాయణ |
| 8. | ధర్మాజీపేట | కె. నర్సాగౌడ్ |
| 9. | లచ్చపేట | ఎ. సిద్దిరాములు |
| 10. | రామక్కపేట | బి. రామ లచ్చవ్వ |
| 11. | చీకోడు | పి. పాథమ్ |
| 12. | ఆరేపల్లి | ఎస్. వజ్రమ్మ |
| 13. | కమ్మరపల్లి | బి. ఎల్లవ్వ |
| 14. | ఆకారం | ఎ. నాగరాజు |
| 15. | గోసాన్‌పల్లి | ఎం. అంజయ్య |
| 16. | రఘోత్తంపల్లి | కె. ప్రమీలమ్మ |
| 17. | పోతరెడ్డిపేట | కె. సైదయ్య |
| 18. | రామేశ్వరంపల్లి | పి. సుదర్శనం |
| 19. | చిన్న నిజాంపేట | ఎం. అశోక్‌కుమార్ |
| 20. | ఎనగుర్తి | బి. అంత |
| 21. | సైలజీనగర్ | కె. నారాయణ |
| 22. | హసన్‌మీర్‌పూర్ | డి. కిష్టారెడ్డి |
| 23. | అప్పనపల్లి | పి. పోచ్చవ్వ |
| 24. | చిట్టాపూర్ | పి. కుంటయ్య |
| 25. | చెల్లాపూర్ | వి. తిరుపతయ్య |
| 26. | చౌదరపల్లి | కె. శంకరవ్వ |
| 27. | తిమ్మాపూర్ | వి. బాలమల్లగౌడ్ |
| 28. | దుంపలపల్లి | బి. లక్ష్మణ |
| 29. | పద్మనాభునిపల్లి | సి. రాజుబాయి |
| 30. | బలవంతాపూర్ | కె. రాజయ్య |
| 31. | బొప్పాపూర్ | ఆర్. నవగౌడ్ |
| 32. | మల్లాయిపల్లి | ఎ. రుక్కవ్వ |

శ్రీ ఎం. దేవేందర్ రెడ్డి, అడ్వకేట్, హైదరాబాద్ వారి సౌజన్యంతో

## యం.పి.టి.సి.ల జాబితా

| క్ర.సం | యం.పి.టి.సి పేరు | |
|---|---|---|
| 1. | శ్రీరామ్ ప్రభాకర్ | |
| 2. | ఎ. చిన్న మల్లయ్య | |
| 3. | జె. చంద్రయ్య | |
| 4. | సి.హెచ్. నారాగౌడ్ | |
| 5. | ఎం. రామస్వామి | |
| 6. | ఇసుక వజ్రవ్వ | |
| 7. | దుబ్బాగౌడ్ | |
| 8. | సాయిలు | |
| 9. | ఆర్. సత్యవతి | |
| 10. | కంటం సత్యమ్మ | |
| 11. | దూదేకుల అబీదా బేగం | |
| 12. | చిట్ల పద్మ | |
| 13. | మందల రుక్కవ్వ | |
| 14. | జి. అంజనేయులు | |
| 15. | వాసిఫ్ | కో-ఆప్టెడ్ |

# గజ్వేల్ మండలము

మెదకు జిల్లాలోని తాలూకాలలో గజ్వేల్‌తాలూకా ఒకటి.

1987 లో నాటిముఖ్యమంత్రి నందమూరి తారక రామారావుగారి మదిలో మెదిలిన ఆలోచనా తరంగములకు కార్యరూపమే మండలావిర్భావము.

గజ్వేల్ మెదకు జిల్లాలో పెద్దతాలూకా ఈ తాలూకాను గజ్వేల్ - దౌలతాబాదు - తూప్రాన్ - వర్గల్ - ములుగు - జగదేవ్‌పూర్ అను ఆరు (6) మండలాలుగా విభజించుట జరిగినది.

గజ్వేల్ తాలూకా కేంద్రముగా నుండుటచే ఈ మండల కేంద్రమునందు అన్నిరకముల ప్రభుత్వ కార్యాలయములకు స్వంత భవనములు కలవు. ఇచ్చట 1. మండలరెవెన్యూ 2. మండల పరిషత్తు 3. పోలీసు ఇన్స్‌పెక్టరు 4. న్యాయస్థానము 5. పంచాయత్‌రాజ్ ఇంజనీరింగ్ 6. సబ్‌రిజిస్ట్రార్ 7. ఎక్సైజ్ 8. అటవీ మొదలగు ప్రభుత్వశాఖల కార్యాలయములు కలవు.

గజ్వేల్ మండలము 52659 ఎకరముల వైశాల్యము కలిగియున్నది. 10638 గృహములు కలవు.

ఈ మండల జనాభా 1991 గణన ప్రకారము 55320 కలదు. అందు పురుషులు 27840, స్త్రీలు 27480 కలరు. ఈ జనాభాలో S.C. పురుషులు 5542, స్త్రీలు 5404 మొత్తము 10,946 కలరు. S.T పురుషులు 334 స్త్రీలు 330 మొత్తము 664 మాత్రము కలరు.

1987 లో మండల ప్రజాపరిషత్తులకు అధ్యక్ష ఎన్నికలు నిర్వహింపబడినవి. ఆ ఎన్నికలలో గజ్వేల్ మండల ప్రజాపరిషత్తునకు శ్రీ వెంకటరెడ్డి గారు ఎన్నికై ఐదు సంవత్సరములు మండలాభివృద్ధికి తమసంతు కృషిగావించిరి. 1995 వ సంవత్సరమున పంచాయత్‌రాజ్ చట్టము మార్పుబడి మండలమును కొన్ని ప్రాదేశిక నియోజక వర్గములుగావింపబడినవి. మండలము నుండి జిల్లా పరిషత్తునకు ఒక సభ్యుని ఎన్నిక అవసరమైనది. ఈ చట్టము ప్రకారము గజ్వేల్ మండల పరిషత్తునందు ( ) 17 ప్రాదేశిక నియోజక వర్గములేర్పడి ఎన్నికలు నిర్వహింపబడినవి. ఆ ఎన్నికలలో గెలుపొందిన ప్రాదేశిక నియోజక వర్గసభ్యుల నుండి ప్రభుత్వము సూచించిన రిజర్వ్‌కేటగిరి నుండి అధ్యక్ష ఎన్నిక కాబడినది.

గజ్వేల్ మండలపరిషత్తు స్త్రీలకు రిజర్వు చేయబడినది. శ్రీమతి అహల్యవెంకటరెడ్డి గారు మండలాధ్యక్షులుగా ఎన్నుకొనబడినారు. మండల ఉపాధ్యక్షులుగా శ్రీ సల్లంరాజు గారు ఎన్నుకొన బడిరి.

1998 లో ప్రవేశపెట్టబడిన అవిశ్వాస తీర్మాణమునందు శ్రీమతి అహల్యావెంకటరెడ్డి గారు పదవిని కోల్పోయిరి.

డా. దశరత రెడ్డి, సిద్దిపేట వారి సౌజన్యంతో

మండల ఉపాధ్యక్షులు శ్రీ పల్లంరాజు గారు తాత్కాలికముగా మండలాధ్యక్ష పదవిని నిర్వహించుచున్నారు. అధ్యక్ష, ఉపాధ్యక్షులు తమ పదవికాలంలో ప్రజాసేవ యొనర్చి తగు మన్ననలందినారు ఈ మండలము నుండి జిల్లా పరిషత్ ప్రాదేశిక నియోజకవర్గ సభ్యులుగా శ్రీ రఘుపతి రావు గారు ఎన్నికై మండలాభివృద్ధికి చేయూత నందించుచున్నారు.

ఈ మండలము పేర గజ్వేల్ శాసన సభా నియోజక వర్గము కలదు. 1995 లో జరిగిన శాసనసభ ఎన్నికలలో తెలుగు దేశం పార్టీతరపున శ్రీ డా. విజయరామారావు గారు విజయులై నియోజక వర్గ అభ్యున్నతి గావించుచు గజ్వేల్ మండలాభివృద్ధికిని కృషి గావించుచున్నారు.

గజ్వేల్ మండలము నందలి ప్రజలు ముఖ్యముగా వ్యవసాయముపై ఆధారపడి జీవింతురు. ఈ మండలమున సాధారణ వర్షపాతము కల్గియుండును. ఇచ్చట భూగర్భజల సంపద తక్కువనియే చెప్పవచ్చును. ఈ మండలమునందు 13 (పదమూడు) పెద్దచెరువులు కలవు. ఈ చెఱువుల క్రింద 2836 ఎకరములు పంటలు పండింపబడును 147 కుంటలు, 2852 ఎకరములకు జలాధారము లైయున్నవి. 1685 బావులు, 2346 గొట్టపు బావులు ఈ మండలము నందలి భూములకు నీరందించుచు పంటలు పండింపబడుచున్నవి.

ఈ మండలమునందు వ్యవసాయ యోగ్యమైన భూమి 49997 ఎకరములు కలదు. ఈ మండలము నందు ప్రధానముగా మొక్కజొన్న పంట ఎక్కువగా పండింపబడును. వరి, జొన్న, పత్తి, ఉల్లి, పల్లి, మొదలగు పంటలు పండింపబడుచున్నవి.

గజ్వేల్ మండలమునందు 24 ప్రాథమిక పాఠశాలలు 10 ప్రాథమికోన్నత పాఠశాలలు మండల పరిషత్తు ఆధీనమునందు పని చేయుచున్నవి. 5 (ఐదు) ఉన్నత పాఠశాలలు జిల్లాపరిషత్తు అధీనమున పని చేయుచున్నవి. ప్రభుత్వజూనియర్ కళాశాల, ప్రభుత్వ డిగ్రికళాశాలలు ఉన్నత విద్య నందించుచున్నవి. ఇచ్చటి డిగ్రీ కళాశాల 1997 - 98 లో ప్రారంభింపబడి తాత్కాలికముగా మండల పరిషత్తు కార్యాలయమున నిర్వహింపబడుచున్నది. ఈ మండలమున S.C బాలురులకై ప్రభుత్వ పాలిటెక్నిక్ కలదు, ఇచ్చట మైనార్టీ సంస్థ ద్వారా నడపబడుచున్న ఇంజనీరింగ్ కళాశాల కూడా కలదు. మండల పరిషత్ కార్యాలయము పట్టణమందలి పాత డాగ్ బంగ్లాలోనికి మార్చబడినది. గజ్వేల్‌లో స్థానికముగా ప్రైవేటు పాఠశాలలు అధికముగానున్నవి. ప్రాథమిక పాఠశాలలు ఉన్నతపాఠశాలలు ప్రైవేటు యాజమాన్యమున నడుపబడుచు ఇచ్చట విద్యా మారుముల తీర్చుచున్నవి. క్రైస్తవ మిషనరీ వారి బాలికల ఉన్నత పాఠశాల ఇచ్చట బాలికల విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నది. జూనియర్ కళాశాలలు రెండు ప్రైవేటు యాజమాన్యమున యిచ్చట నడపబడు చున్నవి.

డా. రాయారావు, వెంకటేశ్వర్ రావు, బోనాల కొండాపూర్ వారి సౌజన్యంతో

ఈ ప్రైవేటు పాఠశాలలన్నియు గజ్వేల్ స్థానికముగనే గలవు. ఈ మండలమునందలి అక్షరాస్యుల లో పురుషులు 10604, స్త్రీలు 5095 మొత్తము 15699 మాత్రము కలరు.

ఈ మండలమునందు విద్యార్థులకు 7 వసతి గృహములు కలవు. ఇవి బీద విద్యార్థిని విద్యార్థులకు భోజన వసతి సౌకర్యములు కల్పించుచు విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నవి. వీటన్నింటికి స్వంత భవనములు కలిగి సమస్త సదుపాయములతోనున్నవి.

| వసతి గృహములు | బాలురు | బాలికలు | మొ. |
|---|---|---|---|
| S.C | 1 | 1 | 2 |
| S.T | 1 | - | 1 |
| B.C | 3 | 1 | 4. |
| మొత్తము | 5 | 2 | 7 |

గజ్వేల్ మండలమున రక్షిత మంచినీటి సరఫరా అన్ని గ్రామములందు కలదని చెప్పవచ్చును. 11 రక్షిత మంచినీటి సరఫరా (P.W.S ) లుండగా 21 చిన్న రక్షిత మంచి నీటి సరఫరా పధకములు (M.P.W.S ) కలవు . 107 త్రాగునీటి బావులు, 296 గొట్టపు బావులు ఈ మండలము నందు ప్రభుత్వము ద్వారా కల్పింపబడి దాహార్తిని పోగొట్టుచున్నవి.

ఈ మండలము నందలి అహ్మదీపూర్ గ్రామమున ప్రాధమిక ఆరోగ్య కేంద్రము కలదు. ఇందు ఇరువురు డాక్టర్లు తగు వైద్యసిబ్బంది కలదు. ఈ కేంద్రమునకు అనుబంధముగా ఆరోగ్య ఉపకేంద్రములు పని చేయుచు మండలమునందలి గ్రామీణ ప్రజలకు వైద్య సదుపాయములందించు చున్నవి. మండల కేంద్రమైన గజ్వేల్ లో వైద్య ఆరోగ్య పరిషత్ ద్వారా నిర్వహింపబడుచున్న సివిల్ హాస్పిటల్ (30) పడకలతో సమస్త సదుపాయములతో కలదు. ఈ వైద్యాలయములో మండలమునందు వైద్య సేవలందించుచు రోగ నిరోధక టీకాలును వేయుచు కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సల చేయుచు ప్రజలకనేక విధములుగా తోడ్పడుచున్నవి. ప్రభుత్వ వైద్యశాలలతో పాటు గజ్వేల్ స్థానికముగా ప్రైవేటు నర్సింగ్ హోమ్‌లు కూడా ఇచ్చటి ప్రజలకు ఆరోగ్య వైద్యసేవలందించుచున్నవి.

ఈ మండలమునందు 4 పశు వైద్యశాలలు కలవు. ఈ వైద్యశాలలలో పశువులకు రోగనిరోధక టీకాలు కృత్రిమ గర్భోత్పత్తి మొదలగు పశుగణాభివృద్ధి కార్యక్రమములు జరుపబడుచున్నవి.

గజ్వేల్ మండలమున ప్రతి గ్రామమునకు తపాల సౌకర్యము కలదు. స్థానికముగా ఒక టెలిఫోన్ ఎక్స్‌చేంజి కలిగి పరిసర గ్రామములకు తంతి సౌకర్యమును కలిగించుచున్నది.

ఈ మండలమునందు గజ్వేల్ ప్రభుత్వ పాలశీతలీ కరణ కేంద్రము కలదు. కొడకండ్ల గ్రామమున "ఖండసారి" చెక్కెర కర్మాగారము, ప్రజ్ఞాపూర్‌లో "రానే ఆటోపార్ట్స్" కర్మాగారము "ఆక్మేఫోరో పాలిమర్స్" అను కర్మాగారములు కలవు.

శ్రీ కె. పోచయ్య, అడ్వకేట్, మెదక్(శోభా) వారి సౌజన్యంతో

ఇవి స్థానికముగా కొంత మందికి పని కల్పించుచు కొందరు నిరుద్యోగుల నాదుకొనుచున్నవి.

గజ్వేల్ మండలమున 4 సబ్ స్టేషన్లు (విద్యుత్తు) కలవు. గజ్వేల్ లో 132/33 కె.వి. సబ్ స్టేషన్ ఒకటి 33/11 కె.వి. సబ్‌స్టేషన్ ఒకటి కలవు. అహ్మదీపూర్ గ్రామమున 33/11 కె.వి సబ్ స్టేషన్, కొడకండ్ల లో 33/11 కె.వి. సబ్‌స్టేషన్ ఒకటి కలదు.

ఈ మండలమునగజ్వేల్‌మరియు ప్రజ్ఞాపూర్ గ్రామములలో గ్రంధాలయములు కలవు.

గజ్వేల్ మండలమున స్థానికముగా స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్, మంజీరా గ్రామీణ బ్యాంకు, కో ఆపరేటివ్ బ్యాంకులు కలవు. ప్రజ్ఞాపూర్‌లో మంజీరా గ్రామీణ బ్యాంకు కలదు మండలమునందు ప్రాధమిక వ్యవసాయ సహకార సంఘములు కలవు. ఇవన్నియు గజ్వేల్ మండలమునందు వ్యవసాయదారులకు, వ్యాపారులకు తక్కువ వడ్డీలకు రుణ సౌకర్యము కల్పించుచు తద్వారా వ్యాపార, వ్యవసాయాభివృద్ధికి తోడ్పడుచున్నవి.

గజ్వేల్ మండలమునందు 5243 ఎకరములు ప్రభుత్వ భూమి కలదు. ఇందులో 4814 ఎకరముల భూమి ప్రజలకు వ్యవసాయమునకై పంపిణీ చేయబడినది. భూపరిమితి చట్టమునననుసరించి 1052 ఎకరములు భూమి మిగులు భూమిగా ప్రకటింపబడగా అట్టి భూమిని బీదలకు పంపిణీ చేయబడినది. ఆర్.ఓ.ఆర్ ప్రకారము భూములన్నియు క్రమబద్ధము చేయబడినవి.

శ్రీ తిరుమల లక్ష్మారెడ్డి, అడ్వకేట్, జహీరాబాద్ వారి సౌజన్యంతో

## సర్పంచ్‌ల జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | అహ్మదిపూర్ | ఎ. బాలమ్మ |
| 2. | అక్కారం | షేక్ రాషా |
| 3. | దత్తర్‌పల్లి | సి. హెచ్. సుశీల |
| 4. | బంగ్లా వెంకటాపూర్ | పి. అంజిరెడ్డి |
| 5. | మక్తామాసన్‌పల్లి | పి. కిష్టయ్య |
| 6. | బెజ్‌గోస్ | పి. నర్సయ్య |
| 7. | బూరుగుపల్లి | ఆర్. సరోజ |
| 8. | బయ్యారం | సి. నర్సయ్య |
| 9. | దచ్చారం | జి. లక్ష్మీనర్సవ్వ |
| 10. | దిలాల్‌పూర్ | వి. దుబ్బయ్య |
| 11. | శేరిపల్లి | ఎన్. నర్సయ్య |
| 12. | ధర్మారెడ్డిపల్లి | సి. దయాకర్‌రెడ్డి |
| 13. | కోమటిబండ | ఎస్. జయమ్మ |
| 14. | గజ్వేల్ | పి. కిష్టయ్య |
| 15. | జాలిగామ | సి. హెచ్. బాలరాజ్ |
| 16. | గిరిపల్లి | పి. పెంటమ్మ |
| 17. | కోల్‌గూర్ | ఎ. మంల |
| 18. | కొడకండ్ల | ఎం. మహేందర్‌రెడ్డి |
| 19. | క్యాసారం | వై. యాదమ్మ |
| 20. | ముత్రాజ్‌పల్లి | డి. కిషన్ రెడ్డి |
| 21. | పిడ్‌చేడ్ | వై. పోచమ్మ |
| 22. | అనంతరావుపేట | ఎస్. సత్యలక్ష్మి |
| 23. | ప్రజ్ఞాపూర్ | పి. రామ్‌రాజేశం |
| 24. | రిమ్మనగూడ | బి. యల్లయ్య |
| 25. | సింగాటం | కె. సత్యాగౌడ్ |
| 26. | సిరిగిరిపల్లి | ఎం. బాలమల్లు |

ఎతి. అచ్యూత్ కుమారి, స్పెషల్ తహసిల్‌దార్, ఎస్.ఎస్.ఎస్., సంగారెడ్డి వారి సౌజన్యంతో

## యం.పి.టి.సి.ల జాబితా

| | గ్రామం పేరు | యం.పి.టి.సి |
|---|---|---|
| 1. | అక్కారం | కె. బిక్షపతి |
| 2. | ప్రజ్ఞాపూర్ | వి. లక్ష్మయ్య |
| 3. | కొడకండ్ల | రాజయ్య |
| 4. | బూర్గుపల్లి | ఆంజనేయులు |
| 5. | పిడిచెడ్ | మల్లమ్మ |
| 6. | అహ్మదీపూర్ | ఎల్లమ్మ |
| 7. | దిలాల్పూర్ | మల్లంరాజు |
| 8. | బెజ్గామ | మంజుల |
| 9. | జాలిగామ | అహల్యమ్మ |
| 10. | ధర్మారెడ్డి పల్లి | సత్యనారాయణ |
| 11. | ముటరాజ్పల్లి | స్వరూప |
| 12. | గజ్వేల్ 1 | బాలనర్సయ్య |
| 13. | గజ్వేల్ 2 | షర్ఫోద్దీన్ |
| 14. | 3 | లక్ష్మయ్య |
| 15. | 4 | కృష్ణమూర్తి |
| 16. | 5 | నాగమణి |
| 17. | కో ఆప్టెడ్ మెంబర్ | ఉస్మాన్ |

ంకట రమణ, సంగారెడ్డి వారి సౌజన్యంతో

# హత్నూర మండలము

హత్నూర మండలము పూర్వము నుండియు ప్రాశస్త్యం కలిగిన ప్రాంతము నిజాం నవాబు తనకు దగ్గరి బంధువులైన కొందరకు కొంత ప్రాంతాన్ని బహుమానంగా ఇచ్చెను. బహుమతిగా ఇవ్వబడిన ఈ ప్రాంతములను 'పాయగ ' అని పిలిచెడివారు, ఆ 'పాయగా' లలో హత్నూరా కూడా ఒక పాయగా ఉండెడిది. ఈ పాయగా విహారుల్ ఉమ్రా బహదూర్ అను నాతనికి నవాబుచే బహుమానముగా నివ్వబడెను. అతని కుమారుడు సుల్తాన్-ఉల్‌ముల్క్ బహదూర్ సుల్తాన్ కుమారుడైన హసన్‌మార్ జంగ్ బహదూర్ చివరి పాయగా అధికారి ఈ పాయగా కు జిల్లా- వికారాబాద్, తహశీల్- హత్నూరా, డివిజన్ - అలంద్ షరీఫ్ అధికార కేంద్రములుగా ఉండెడివి.

ఈ పాయగ కు సచివాలయము హైద్రాబాద్ లోని షా గంజ్ దేవిడీ లో ఉండెడిది. ఈ హత్నూరా పట్టీ లో సుమారు 20 గ్రామాలు ఉండెడివి. ఈ తహశీల్‌కు చిట్టచివరి తహశీల్దార్ శ్రీ నరసింహారావు గారని బోగట్టా ద్వారా తెలియుచున్నది.

'హత్నూరా' ను 'హతినగరము' అని పిలిచెడివారు ఇక్కడి ప్రజల ఐతిహ్యం ప్రకారం ఇక్కడ ఒక 'గుడిచెలువు' ప్రాంతము కలదు. ఇచ్చట ఒకనాడు 'వేయిస్తంభాల దేవాలయము' ఉన్నట్లు చెప్పుదురు. ఈ దేవాలయ ప్రాంతం 18 ఎకరములు ఉండెడిదట. నేటికినీ ఈ 18 ఎకరాల ప్రాంతము కుడి 'చెలువు' అను పేర సాగు చేయబడుచున్నవి. ఇక్కడి ఒక చెలువు కట్టవెంట అనేక శిథిల శిల్పములు అగుపడుచున్నవి. ఈ హత్నూరా గ్రామములో ఎన్నో చోట్ల పాతగోడలకు పీధి అరుగులకు అమర్చబడిన శిథిల శిల్పా స్తంభములు కళాత్మకమైనవి అగుపడును. ఈ గ్రామములో వేణుగోపాల స్వామి దేవాలయములోని స్తంభములు, ద్వార - బంధములు, మూల విగ్రహమునకు క్రింద అరుగుగా ఉంచబడిన శిలాస్తంభములు ఏ ప్రాచీన శిథిల దేవాలయపు శిలాఖండములో అనుటకు తావిచ్చుచున్నవి. ఈ శిలాఖండములు చూడగా వీటిపై కాకతీయ శిల్పము ద్యోతకమగుచున్నది.

ఈ 'హత్నూర' చుట్టూనూ కోటగోడలు ఆ వెనుక కందకములు ఉన్నట్లుగా నేటికినీ ఆధారములు కలవు.

ఒకనాటి తహశీలు కార్యాలయములో ఇప్పుడు ప్రాథమిక ఆరోగ్య కేంద్రము నడుపబడుచున్నది.

1959 లో ఏర్పాటైన పంచాయతీరాజ్ వ్యవస్థలో నర్సాపూర్ తాలుకాలో రెండవ బ్లాకు కేంద్రముగా, 'హత్నూరా' ఉండెను. బ్లాకులను తీసివేసి కేవలం పంచాయితి సమితులను ఉంచుటచే ఇక్కడి బ్లాకు కార్యాలయము తొలగింపబడినది. ఈ 'హత్నూరా' బ్లాకునకు ఈ నాటి శాసన సభ్యుడైన శ్రీ చిలుముల విఠలరెడ్డి గారు అధ్యక్షులుగా ఉండిరి.

శ్రీ వి.వి.ఎస్. ప్రసాద్, ప్రిన్సిపాల్, జె.సి. సిద్దిపేట, (బి) వారి సౌజన్యంతో

వారి రాజకీయ జీవితము హత్నూరా బ్లాకు ప్రెసిడెంటుగా ప్రారంభించబడినదని చెప్పవచ్చును.

మండల కేంద్రముగా హత్నూరను చేయుటకు శ్రీ సి. విఠల్ రెడ్డి గారు ఎక్కువ శ్రద్ధగైకొనిరి.

1987, జనవరిలో 'హత్నూరా' మండలము ఏర్పాటు గావించబడినది. మండలముగా నేర్పడినప్పటి నుండి మండల కేంద్రమైన హత్నూరా అభ్యుదయ మార్గమున, అభివృద్ధి పథమున పరుగులిడు చున్నదని చెప్పవచ్చును.

ప్రాథమికోన్నత పాఠశాల కలిగిన 'హత్నూర' లో నేడు విద్యావ్యవస్థ అనేక రీతులలో జిల్లాలో తన అధిక్యతను చాటుకొనుచున్నది. హత్నూర గ్రామమున కావల కెంచినచో విశాలమైన ప్రదేశంలో ప్రభుత్వ భవనాల పట్టణమా అన్నట్లుగా భాసిల్లుచున్నది.

రెసిడెన్షియల్ యస్.సి బాలుర ఉన్నత పాఠశాల, స్వంత భవనాలలో సమస్త వసతులతో కలదు. పాఠశాల ప్రక్కనే రెసిడెన్షియల్ జూనియర్ కళాశాల సమస్త వసతులతో నిర్మింపబడినది. ఆ ప్రక్కనే ఐ.టి.ఐ కూడా ఏర్పాటు చేయబడినది. ప్రతి ప్రభుత్వ కార్యలయమునకు స్వంత భవనములుండుట గమనింపదగిన విషయము.

మెదక్ జిల్లా మధ్యభాగాన ఉన్న హత్నూర మండలమునకు తూర్పున నర్సాపూర్ మండలం, పశ్చిమాన మంజీరానది, ఉత్తరమున కౌడిపల్లి, దక్షిణమున జిన్నారం, సంగారెడ్డి మండలాలు ఎల్లలుగానున్నవి.

ప్రస్తుతం ఈ మండలమునకు మండల అధ్యక్షులుగా శ్రీమతి బూదమ్మగారు, ఉపాధ్యాక్షులుగా శ్రీ సంతోష్ కువార్ గారు ఎన్నికొనబడి కార్యనిర్వాహక బాధ్యతలు చేపట్టినారు.

పరిపాలనా సంస్కరణలలో భాగంగా ఏర్పర్చబడిన జిల్లా ప్రాదేశిక నియోజక వర్గ సభ్యుడిగా శ్రీ పల్లె వెంకటేశం గారు ఎన్నుకొనబడినారు. ఈ మండలమున 12 మండల ప్రాదేశిక నియోజక వర్గములు కలిగి ఎన్నిక కాబడిరి.

మండల రెవిన్యూ అధికారిగా శ్రీ ఎస్. మాణిక్య రావు గారు తమ బాధ్యతలను నిర్వర్తించుచున్నారు.

హత్నూర మండల విస్తీర్ణము 21039 హెక్టార్లు. మండలము నందు రెవిన్యూ గ్రామాలు 33 కాగా నివాస ప్రాంతాలు 42 ఉన్నాయి. ప్రభుత్వ భూములు 14585-34 ఎకరాలు, 565415 ఎకరాలు అసైన్డ్ భూములు ఉన్నాయి. మండలంలో అడవులు 969 హెక్టార్లు, సాగుచేయబడుతున్న భూమిలో 8753 ఎకరాల మాగాణి, 32900 ఎకరాలు మెట్ట ప్రాంతం కలదు. $30^0C$ - $40^0C$ శీతోష్ణస్థితిని కలిగి ఉండే ఈ ప్రాంతాలలో వరి, చెఱుకు, జొన్న, పప్పుధాన్యములు పండింపబడుచున్నవి.

మండలమునందు 30 చెఱువులు I.B. కి చెందినవి, పంచాయతిరాజ్ నిర్వాహణలో 189 కుంటలు కలవు. 208 త్రాగునీటి బోర్లు కూడా కలవు. మండలంలోని 24 గ్రామాలకు రక్షిత మంచినీటి సరఫరా పథకము అమలు చేయబడుతున్నది.

కె. రాజారెడ్డి, ప్రిన్సిపాల్, జె.సి. సిద్ధిపేట్ - (జి) వారి సౌజన్యంతో

హత్నూర మండల పరిధిలో 16 కి.మీ పొడవైన పక్కా రోడ్లు 17 కి.మీ ల పొడవైన కచ్చా రోడ్లు కలవు. మండలంలోని 20 గ్రామ పంచాయతీలకు బస్సు సౌకర్యము కలదు.

విద్యాసౌకర్యాలకు సంబంధించి జిల్లాలోనే ఈ మండలమునకు ప్రత్యేక స్థానమున్నది. ఈ మండలంలో 40 ప్రాథమిక పాఠశాలలు 2 ప్రాథమికోన్నత పాఠశాలలు, 8 ఉన్నత పాఠశాలలు కలిగి యున్నది. ఒక బాలికల పాఠశాల 12 నిరంతర విద్యాకేంద్రాలు కూడి విద్యావ్యాప్తికై కృషిచేయుచున్నవి.

ఉన్నత విద్యకై హత్నూర యందు ఒక ప్రభుత్వ రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి కూడా నెలకొల్పబడినది. ఒకరెసిడెన్షియల్పాఠశాల తో పాటు రెండు యస్.సి. బాలుర వసతి గృహాలు వెనుకబడిన తరగతుల వారికి 4 చొప్పున మొత్తం 8 వసతి గృహాలు సంక్షేమ శాఖచే నిర్వహించబడుచున్నవి.

ప్రభుత్వ పాఠశాలలతో పాటు ఈ మండలమునందు స్వచ్ఛంధ సంస్థలు కూడా అక్షరాస్యతకై పాటు పడుచున్నవి. బెంగళూరులోని (CRY - Child Relief and You) అనే సంస్థ సహకారంతో సాధన అనే స్వచ్ఛంధ సంస్థ హత్నూర మండలమును దత్తత తీసుకొని 20 రాత్రి పాఠశాలలను నడుపుతున్నది. బాల కార్మికులకు ఉద్దేశించి ప్రత్యేక కార్యక్రమంతో ఈ సంస్థ ముందుకు పోవుచు, ప్రజలకు విద్యపట్ల అవగాహనను కల్గిస్తున్నది. మండల విద్యాధికారిగా కె. కిష్టారెడ్డిగారు పనిచేయుచున్నారు.

మండలంలోని ప్రజల ఆరోగ్య నిమిత్తమై హత్నూర, దౌల్తాబాదులలో రెండు ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు పని చేయుచున్నవి. నలుగురు డాక్టర్లు, ఇతర వైద్యసిబ్బంది ఈ ఆరోగ్య కేంద్రములలో పనిచేయుచున్నారు. ఈ రెండు ఆరోగ్య కేంద్రములకు కేంద్రంగా చేసుకొని చింతలచెర్వు, కొన్యాలలో రెండు ఉప ఆరోగ్య కేంద్రములు మండల ప్రజలకు సేవలందించుచున్నవి.

పాముకాటు మంత్రమునకై కడల చెన్నయ్య, ప్రసూతికై మన్నె శంకరమ్మ, సాలె మల్లన్న, పశువుల చికిత్సకై పందుగు నర్సింలు మొదలైన నాటు వైద్యులు కూడ తమ సేవలందించుచున్నారు.

మండలంలోని పశుసంపదలో భాగంగా- 1270 ఆవులు 1828 బఱ్ఱెలు, 6988 గొఱ్ఱెలు 14363 కోళ్లు కలవు. వీటి సంరక్షణ నిమిత్తము దౌల్తాబాద్, హత్నూరలలో పశువైద్యశాలలు నిర్వహించబడుచున్నవి.

హత్నూర మండలమునందు 10 తపాలాశాఖలు, రెండు టెలిఫోను ఎక్ఛేంజీలు కలవు. హత్నూర నందు ఒక గ్రంధాలయము కూడా ఉన్నది మండల కేంద్రంలోని పోలీస్‌స్టేషన్ మండల శాంతిభద్రతలను పర్యవేక్షించు చుండును.

తుర్కలఖానాపూర్ హత్నూర గ్రామాల యందు నెలకొల్పబడిన విద్యుత్ ఉపకేంద్రాలతో మండలంలోని గ్రామాలకు విద్యుత్ సౌకర్యము

**శ్రీ దాశరథులు బాలయ్య, లెక్చరర్, జి.జె.సి., (జి), సిద్దిపేట, నర్సయ్యల వారి సౌజన్యంతో**

కల్పింపబడినది. విద్యుత్ సహాయంతో 3516 పంపుసెట్లు పని చేయుచున్నవి.

హత్నూర మండలమందు పరిశ్రమలు అధికంగానే ఉన్నాయి. ఒక పౌల్ట్రీఫాం, పది రైసుమిల్లులతో పాటు రిచ్‌లైకు ఫార్మా, సిరక్స్ డ్రగ్స్, వంశీడ్రగ్స్, శ్రీ చక్రగోల్డ్ S.B, ఆర్గానిక్స్, కొఠారి గోల్డ్ మొదలైన 13 పరిశ్రమలు వివిధ వస్తువులను ఉత్పత్తి చేస్తూ మండలంలోని నిరుద్యోగులకు ఉపాధిని కల్గిస్తున్నాయి. గొంగళ్ళు తయారు చేసే కుటీర పరిశ్రమ కూడా ఇక్కడ నెలకొని ఉన్నది. మొక్కల పెంపక నర్సరీ కూడా ఇచట కలదు.

మండలమునందు రెండు మంజీర గ్రామీణ బ్యాంకులు, ఒక అలహాబాద్ బ్యాంక్, ఒక స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ శాఖలు పనిచేయుచు ఆర్థిక లావాదేవీలను, ఋణ సౌకర్యాలను కల్పించుచున్నవి

మండలములో ప్రస్తుతము 107 డ్వాక్రా గ్రూపులు, 1605 మంది సభ్యులతో 5,40,000 రూ. పొదుపు మొత్తాలను సాధింపగా 92 సెల్ఫ్ హెల్ప్ గ్రూపులు, 1380 మంది సభ్యులతో పనిచేయుచూ ఇప్పటివరకు 5,01,240 పొదుపు చేసి అభివృద్ధి కార్యక్రమాలలో పాలు పంచుకుంటున్నాయి.

హత్నూర మండల పరిషత్తునందు ప్రస్తుతం 662 వృద్ధాప్య పెన్షన్లు, 376 గర్భిణి పెన్షన్లు ఇవ్వబడుచున్నవి. బలహీన వర్గాల గృహ నిర్మాణానికై గృహ నిర్మాణ సంస్థ పాటు పడుతున్నది.

మండలంలోని 'సాదుల్లానగర' లో ఒక విశ్రాంతి భవనము కలదు. కాని నేడది శిథిలావస్థలో నుండి నిరుపయోగముగానున్నది.

మండలంలోని రేషన్ షాపుల సంఖ్య 29 తెల్ల కార్డులు 6791, గులాబీ కార్డులు 2229 ఉన్నని. 1135-40 బియ్యము, 117-48 ల చక్కెర, 23667లీ. కిరోసిన్ మండలమునకు ప్రతినెల కేటాయింపబడును.

మండలమునందు నవాబులపేట గ్రామంలోని 'శ్రీరామ ఆలయం' ప్రసిద్ధి గలది సిరిపురం నందలి మాణిక్యేశ్వరీ ఆశ్రమం కూడా ఆధ్యాత్మిక కేంద్రంగా పేరు పొందినది. మండలంలో విద్యా, వైద్య, విషయాలలో తోడ్పడిన వాడిగా దౌల్తాబాద్‌కు చెందిన గాజుల వీరయ్య పేరు పొందినాడు.

ఈ మండలమునందు సంచారజాతుల వారు కొందరు కలరు వీరిలో బుడ్గ జంగం, అను జాతివారు 26 గ్రామాలలో ఉన్నారు. వీరి జనాభా సుమారు 1500 పైగా ఉన్నది. వేషభాషలు సామాన్యములై భిక్షాటన వృత్తిలో వీరగాధలను కధలు కధలుగా చెప్పుచూ గ్రామములలోని భూస్వాములు మొదలగు వారిచ్చు ధాన్యములపై జీవింతురు. వీరిలో శారదకాండ్లు, గుడిసె గోసాయిలు, కాట పాపలు, బహురూపులు అను మొదలగు అనేకానేక తెగలు కలవు. వీరందరును సుమారుగా ప్రధాన తెగలోని బుడ్గజంగం వారే అయి ఉందురు. వీరిభాష ప్రత్యేకమై లిపి లేనట్టిది.

---

టి. చంద్రప్రకాశ్, జూ. లెక్చరర్, సిద్దిపేట వారి సౌజన్యంతో

ఇప్పుడిప్పుడే సాంఘికముగా వీరు ఎదుగుతూ, ప్రభుత్వ సదుపాయములను పొందుతూ ఇండ్లు కట్టుకొని, భూములు సంపాదించుకుంటు వ్యవసాయము, వ్యాపారం మొదలగు వృత్తుల కలవాటు పడుచున్నారు. వీరు రాజకీయమున కూడా కాలిడుచున్నారు. కప్పెర రాములు అను నాతడు దౌల్తాబాద్ కో-ఆపరేటివ్ బ్యాంక్ డైరెక్టర్‌గా పదవీబాధ్యతలు నిర్వహించుచున్నారు.

## మండల ప్రాదేశిక సభ్యులు - 12

1. మచ్చ ఊర్మిళ
2. పి. బూదమ్మ
3. బి. నర్సింలు
4. కౌవుడియా
5. బి. నర్సింహ రెడ్డి
6. జి. పురుషోత్తం
7. అంజయ్య
8. మాణిమ్మ
9. వీరాస్వామి
10. సుధారాణి
11. శ్రీశైలం
12. పి. సంతోష్ కుమార్

శ్రీమతి రఘాన్విలక్ష్మి శుక్ల, జి.జె.సి., (జె.ఎల్), సిద్దిపేట వారి సౌజన్యంతో

## మండలంలోని గ్రామపంచాయతి, సర్పంచ్‌ల పేర్లు

| క్ర. సంఖ్య | గ్రామపంచాయతి | సర్పంచ్ |
|---|---|---|
| 1. | సిరిపురం | శ్రీమతి సావిత్రి |
| 2. | లింగాపురము | టి. ఆగమ్మ |
| 3. | కొన్యాల | బి. శాయమ్మ |
| 4. | పన్యాల | మానమ్మ |
| 5. | హత్నూర | బాలయ్య |
| 6. | సికింద్లాపూర్ | యల్. నాట్కు |
| 7. | దౌల్తాబాద్ | పి. నర్సిములు |
| 8. | కాసాల | అల్వారయ్య |
| 9. | బోరపట్ల | సాయమ్మ |
| 10. | టి.కె. పూర్ | యమ్. పీరస్వామి |
| 11. | వడ్డే పల్లి/ఎల్లమ్మగూడ | పి. బాలయ్య |
| 12. | పాషాదుల్లానగర్ | పాండురంగయ్య |
| 13. | గుండ్లమాచునూర్ | ఎ. నర్సిములు |
| 14. | చిలతల్ చెర్వు | ల్యార్థమ్మ |
| 15. | నాగారము | యం. నారాయణ |
| 16. | చీకుమద్దూర్ | పి. శ్రీశైలము |
| 17. | గోవింద్‌రాజ్ పల్లి | హన్మంతరెడ్డి |
| 18. | నాగుల్ దేవుల పల్లి | హన్మంతరెడ్డి |
| 19. | నవాబు పేట | అన్వరుస్సెన్ |
| 20. | రెడ్డిఖాన్ పూర్ | రామునిక్కిన్నయ్య |
| 21. | నస్తిపూర్ | - |
| 22. | వందాపూర్ | ఎస్. పాండరి |
| 23. | పల్పనూర్ | శ్రీమతి సుసీల |

-సమాచార సేకరణ నర్సాపూర్ (ఎన్.ఎఫ్.ఇ ద్వారా)

# జగదేవ్‌పూర్ మండలము

మెదకు జిల్లాలో జగదేవ్ పూర్‌మండల మునకొక ప్రత్యేకతగలదు.

ఈ మండలము పూర్వము గజవెల్లి తాలూకాలో నున్నట్టిది. గజవెల్లి తాలూకాను 6 మండలాలుగా విభజింపగా అందు జగదేవ్ పూర్ మండల మొకటైనది.

జగదేవ్‌పూర్ మండలమునకు తూర్పున నల్లగొండ జిల్లా పడమట గజ్వేల్ మండలము, ఉత్తరమున కొండపాక, దక్షిణమున ములుగు, వర్గల్ మండలాలు ఎల్లలుగాగలవు.

ఈమండల వైశాల్యము 56786 ఎకరములు కలదు. ఇందు 2419 ఎకరములు అటవీ ప్రాతముండి వ్యవసాయ యోగ్యమైన భూమి 23, 288 ఎకరములు కలదు. సాగుభూమిలో 20045 ఎ.మెట్ట; 3243 ఎ.తరి. భూమి కలదు.

జగదేవ్‌పూర్ మండలమున 28 గ్రామములు 9 శివారు గ్రామములున్నవి. మొత్తంమండలములో 1991 జనాభాగణన ప్రకారము పురుషులు 20866స్త్రీలు 20553 మొత్తము 41419 కలరు. ఈ జనాభాలో షెడ్యూల్డు కులాలు పురుషులు 4018, స్త్రీలు 4002 మొత్తము 8020 ఉన్నారు. షెడ్యూల్డు తెగలు పు.127, స్త్రీలు 128. మొత్తము 255 కలరు. ఈ మండలమున అక్షరాస్యుల పు. 6298, స్త్రీ 2392 మొత్తము 8690 మంది మాత్రమే ఉన్నారు. మండలమున 1995 గణన ప్రకారము 7831 నివాస గృహములు కలవు.

1987 న ఆనాటి ప్రభుత్వము ప్రజలకు ప్రభుత్వపాలనను సమీపము చేయవలయునని పరిపాలనా వికేంద్రీకరణొనర్చవలెనని తాలుకాలను విభజించి మండల వ్యవస్థ నేర్పాటు చేయుట జరిగినది అందులో భాగంగా జగదేవ్‌పూర్ మండలం ఏర్పాటైనది. జగదేవ్‌పూర్ మండల ప్రజాపరిషత్తునకు ప్రత్యక్షముగా 1987 మార్చి ఎన్నికలు జరుపబడినవి.

ఆ ఎన్నికలలో శ్రీ లక్ష్మారెడ్డి గారు మండల ప్రజాపరిషత్తు అధ్యక్షులుగా ఎన్నికై ఐదు సంవత్సరములు మండలాభివృద్ధికి కృషిగానించినారు. అ తర్వాత 1996 లో నెలలో మండలమునకు ఎన్నికలు జరిగినవి. మొదట ఈ ఎన్నికలు పరోక్షవిధానమున జరుపబడినవి. మొదట గ్రామముల నుండి మండల ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులను ఎన్ను కొందురు. ఆయం-పి-టి-సీలు మండలాధ్యక్షుని ఎన్ను కొందురు. ఈ మండలము స్త్రీలకు రిజర్వుచేయబడినది. ఈ ఎన్నికలలో అధ్యక్షురాలిగా శ్రీమతి బీమరి రంగమ్మ ఉపాధ్యక్షులుగా శ్రీ కె. సుదర్శన రెడ్డి ఎన్నికై మండలాభివృద్ధికి తమ వంతు కృషిని అందించుచున్నారు.

**శ్రీ తడకమడ్ల దుబ్బయ్య, బొంతపల్లి, ధనలక్ష్మి వారి సౌజన్యంతో**

ఈ మండలమున 23 గ్రామ పంచాయతీలు 13 యం-పి-టీ-సీ లు కలవు. ఈ మండలము నుండి జిల్లా పరిషత్తు ప్రాదేశిక నియోజక వర్గ సభ్యునిగా శ్రీ సి.హెచ్. లక్ష్మారెడ్డి గారు ఎన్నికై జిల్లా పరిషత్తు ద్వారా మండలాభివృద్ధికి కృషి సల్పుచున్నారు.

జగదేవ్‌పూర్ మండలము లోని ప్రజల ముఖ్య వృత్తి వ్యవసాయము. ఈ మండలములోని సాగుభూమికూడా ప్రశస్తమైనది. ఈ మండలము నందలి వరదరాజపురం గ్రామ సమీపమున బోరబండ ప్రాజెక్టు నిర్మింపబడిది.

ఈ మండలము నందు 6 పెద్ద చెరువులు 141 కుంటలు 1750 బోర్లు-బావులు వ్యవసాయమునకు జల వనరులైయున్నవి. ఈ మండలమునందలి భూమి ఎక్కువ భాగము నల్లరేగడి కలిగి కొంత ఎఱ్ఱ నేల కలిగియున్నది ఈ మండలమున వ్యవసాయ యోగ్యమై సాగు చేయబడుచున్న భూమి 23288 ఎకరములు. 12740 మంది భూమి పట్టాదారుల్లో 3878 సన్నకారు రైతులు 5342 చిన్న కారు రైతులు 3520 పెద్ద పట్టేదారులు ఈ మండలమున వ్యవసాయము చేయుచున్నారు. ఇక్కడ వరి, చెరకు, మొక్కజొన్న, ప్రత్తి మొదలగునవి ప్రధాన పంటలుగా పండింప బడుచున్నవి. ఈ మండలమున సాలు సరివర్షపాతము 700 మి.మీ.

జగదేవ్‌పూర్ మండలమున విద్యావ్యవస్థ చక్కగా కలదు. ఈ మండలమున జగదేవ్‌పూర్‌లో ప్రభుత్వ జూనియర్ కళాశాల ఏర్పాటైనది. ఈ గ్రామము ఆనాడు మారు మూలకు గ్రామము. ఇచ్చట ఉన్నతపాఠశాల ఏర్పాటు చేయుటకు మరియు దానిని ప్రభుత్వ జూనియర్ కళాశాలగా అభివృద్ధి చేయుటకు ఈ గ్రామ సర్పంచ్‌గా పని చేసిన శ్రీ నర్సింహ రామయ్యగారు అనవరతమైన, అనితరమైన కృషి సల్పిరి.

ఈ మండలమునందు ఇటిక్యాల, తిగుల్, మునిగడప గ్రామాలలో జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలు కలవు. ఐదు ప్రాధమికోన్నత పాఠశాలలు, 32 ప్రాధమిక పాఠశాలలు పని చేయుచున్నవి. అన్ని పాఠశాలలకు స్వంత భవనములు కలవు. 19 అంగన్ వాడీ కేంద్రములలో స్త్రీ శిశుసంక్షేమ కార్యక్రమములు, ఐదు సంవత్సరములో పలి పిల్లలకు ఆరోగ్యరక్షణ, పాఠశాలలకు వచ్చుటకు కావలసిన ప్రాధమిక పరిజ్ఞానము అందజేయుబడుచున్నవి. నిరంతర విద్యాకేంద్రములు పని చేయుచు పాఠశాలకు రాలేని బాలురకు, యువకులకు విద్యాబోధన గావించుచున్నవి.

మండలాధీనముననున్న పాఠశాలలో 93 మంది ఉపాధ్యాయులు పని చేయుచున్నారు. బీద విద్యార్థులలో విద్యావ్యాప్తి కల్గించి వారిలో చైతన్యం తీసికురావాలనే సదుద్దేశ్యంతో స్థాపించిన B.C మరియు S.C. విద్యార్థి వసతి గృహములు ఈ మండలమునందు 5 కలవు మొత్తము మీద ఇప్పుడిప్పుడే ఈ

మండలములోని ప్రజలు విద్యావసరముల వైపు తమ దృష్టి సారించుచున్నారని పాఠశాలల విద్యార్థుల పెరుగుతున్న సంఖ్య తెలుపుచున్నది.

జగదేవ్‌పూర్ మండమునందు తీగుల్ మరియు జగ్‌దేవ్‌పూర్ గ్రామాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు పనిచేయుచు మండల ప్రజలకు వైద్య సౌకర్యము కల్పించుచున్నవి. ఈ వైద్యశాలలలో రోగుల కుచికిత్స నిచ్చుటతోపాటు, కుటుంబ సంక్షేమ ఆపరేషన్లు నిర్వహించుచున్నారు. ఈ ప్రాథమిక ఆరోగ్య కేంద్రములకు అనుబంధముగా ఉపకేంద్రములు పనిచేయుచు గ్రామీణులకు వైద్యభద్రతను కల్పించుచున్నవి.

ఈ మండలమున జగదేవ్‌పూర్, మునిగడప గ్రామాలలో పశు వైద్యశాలలు గలవు. మండలము నందలి పశువుల వ్యాధులు బాగు చేయుట వ్యాధి నిరోధిక టీకాలనిచ్చుట ముమ్మురముగా సాగుచున్నది.

జగదేవ్‌పూర్ మండలమున 6 సింగల్ విండో ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘములు కలవు. ఈ సంఘములచే రైతులకు వ్యవసాయమున కవసరమగు ఋణములు లభించును. జగదేవ్‌పూర్ లో స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, తిగుల్ గ్రామములో మంజీరా గ్రామీణ బ్యాంకులు కలవు. ఈ బ్యాంకులు వ్యవసాయావసరములకే కాక వ్యాపారాభివృద్ధికి కూడా రుణములనందిం చుచున్నవి.

ఈ మండలమున మునిగడప, జగదేవ్‌పూర్, గణేశ్‌పల్లి గ్రామాలలో 3 విద్యుత్తు సబ్‌స్టేషన్లు కలవు. 3 సబ్‌స్టేషన్లుండుటచే తగినన్ని ట్రాన్స్‌ఫార్మర్లు బిగించుటచే లోవోల్టేజి బాధ తక్కువగా నుండును.

ఈ మండలము నందు 7 రైసుమిల్లులు, 1 ఆయిల్ మిల్లు కలదు. 15 పౌల్ట్రీలు, 3 హేచరీలు ఈ మండలమున కలవు, ఇక్కడ పట్టు పురుగల పెంపకము చాలా చక్కగా జరుగుచున్నది. ఈ మండలమున కుటీర పరిశ్రమగా బీడీ తయారీ ఎక్కువగా నున్నది. చేనేత పరిశ్రమ కూడా కలదు.

జగదేవ్‌పూర్ మండల కేంద్రమున 1 సబ్ పోస్టాఫీసు టెలిగ్రాఫిక్ ఆఫీసు కలదు. మొత్తము మండలమునందు 17 బ్రాంచి పోస్టాఫీసులుండి తపాలా సౌకర్యమును అన్ని గ్రామములకు కల్పించుచున్నవి. అంతేకాక మండల కేంద్రము టెలిఫోన్ ఎక్స్‌చేంజి యుండి పది గ్రామాలలో 365 టెలిఫోన్లు కలిగియున్నది.

జగదేవ్‌పూర్ మండలమున ప్రభుత్వము ద్వారా 632 వృద్ధాప్య పింఛన్లు పంపిణీ చేయబడుచున్నవి. 960 మంది సభ్యులతో 64 డ్వాక్రా గ్రూపులు పనిచేయుచున్నవి.

ఈ మండలమునందు పీస్ సంస్థ కొనదగినంతగా ప్రజా సేవ స్వచ్ఛందముగా చేయుచున్నది. ఈ పీస్ సంస్థ ద్వారా 17 మహిళా మండలాలు పని చేయుచున్నవి. పాఠశాలలకు వెళ్లలేని బాలబాలికలకు, బాల కార్మికులకు స్వచ్ఛందముగా విద్యబోధన ఈ సంస్థ ద్వారా చేయబడుచున్నది.

మహిళాభ్యుదయమునకై కుట్టు కేంద్రములు కుట్టు మిశన్ల పంపిణీ వంటి కార్యక్రమములు ఈ సంస్థ చేపట్టి ఈ మండలాభివృద్ధిలో పాలుపంచు కొనుచున్నది.

జగదేవ్‌పూర్ మండల కేంద్రమున ఒక గ్రంథాలయము - ఒక సినిమాహాలు కలిగి ఇక్కడి ప్రజలకు విద్యా విజ్ఞాన వినోదములు కలిగించుచున్నవి.

ఈ మండల కేంద్రమున వివేకానంద యువజన సంఘమ, హనుమాన్ యువజన సంఘము, బ్రాహ్మణ యువజన సంఘములు యువకులలో సంఘ సేవాభావమును, ఐకమత్యమును కల్గించుచున్నవి.

ఈ మండలమునందు గొప్ప విద్యావంతులు కలరు డాక్టర్ వి. రాములు, డాక్టర్ వి. యజ్ఞరాములు తెలుగు- సంస్కృత సాహిత్యములలో నిష్ణాతులైనవారు. శ్రీ అదిరాసుపల్లి శ్రీనివాస శర్మ వేదాధ్యయనమును సంపూర్ణముగానొనరించి ప్రస్తుతము వాషింగ్‌టన్‌లో వేద పండితునిగానున్నారు.

జగదేవ్‌పూర్ పేరు చెప్పగానే నలుగురి నోట పలుకు పేరు శ్రీ నర్సింహ రామాయ్యగారిది. వీరు జగదేవ్‌పూర్ గ్రామాభివృద్ధికి తన జీవితము అంతయు ధారపోసిన మహనీయుడు.

ఈ మండలమున ప్రఖ్యాతమైన దేవాలయము వరద రాజపురము నందలి శ్రీ వరదరాజ స్వామి దేవాలయము- ఈ దేవాలయ నిర్మాణము కంచి వరదరాజ స్వామి దేవాలయ నిర్మాణమును పోలియున్నది. ఈ దేవాలయమును గాంచినచో దక్షిణాత్యశిల్పము గోచరమగుచున్నది. ఈ మండలమున కొండ పోచమ్మ దేవాలయము కూడా ప్రసిద్ధమైనది. ఇక్కడికి భక్తులు తండోపతండములుగా వచ్చి తమ మొక్కుబడులు చెల్లింతురు. ఇవేగాక జగదేవ్‌పూర్ గ్రామంలో రామాలయము రంగనాయకాలయము వెంకటేశ్వరాలయములు కలవు.

జగదేవ్‌పూర్ మండలమునందు 28 చౌకధర దుకాణముల ద్వారా 8315 తెల్లకార్డుల 1526 గులాబీ కార్డుల వారికి నెల 1.కి బియ్యము 1386.92 క్వింటళ్లు చక్కెర 115.75 క్వింటాళ్లు ప్రభుత్వ పౌర సరఫరా జరుగుచున్నది.

గ్రామ పంచాయతీ సర్పంచుల వివరముల పట్టిక, జగదేవ్‌పూర్ మండలము.

| క్ర.సంఖ్య | గ్రామ పంచాయతీ | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 1. | జగదేవ్‌పూర్ | టి. వెంకటయ్య |
| 2. | వర్ధరాజ్‌పూర్ | యల్. పెంటయ్య |
| 3. | తీగుల్ | బి. బిక్షపతి |
| 4. | ఇటికాల్ | ఎ. భిక్షపతి |
| 5. | పీర్లపల్లి | యస్. లక్ష్మయ్య |
| 6. | అంగడికి ష్టాపూర్ | కె.నారాయణ రెడ్డి |
| 7. | అతిరాజపేట | బి. దస్తగిరి |
| 8. | ఎర్రవల్లి | యం. మల్లమ్మ |
| 9. | ధర్మారం | యం. సాయిలు |
| 10. | దౌలాపూర్ | కె. భీమయ్య |
| 11. | మునిగడప | జి. బాలయ్య |
| 12. | శివార్‌వెంకటాపూర్ | కె. కుషమ్మ |
| 13. | వట్టిపల్లి | పి. భిక్షపతి |
| 14. | గొల్లపల్లి | పి. సరళ |
| 15. | రాయవరం | బి. ఎల్లయ్య |
| 16. | లింగారెడ్డి పల్లి | సి.హెచ్. బాలమణి |
| 17. | వెంకటాపూర్ పేట్ | యల్. వజ్రమ్మ |
| 18. | బస్వాపూర్ | బి. సుశీల |
| 19. | చేబర్తి | యస్. బాల్‌రాజయ్య |
| 20. | చాట్లపల్లి | జి. రాజిరెడ్డి |
| 21. | తీగుల్‌నర్సాపూర్ | జి. సత్తమ్మ |
| 22. | తిమ్మాపూర్ | కె. సాయిలు |
| 23. | చిన్నకిష్టాపూర్ | యస్. వస్తంభ |

ం(రిరాగు వెంకటరెడ్డి, తోపుగొండ వారి సౌజన్యంతో

జగదేవ్‌పూర్ మండల యం.పి.టి.సి సభ్యులు

12+1

| | | | |
|---|---|---|---|
| 1. | జగదేవ్ పూర్ | - | ఏ. నరసింహ రామయ్య |
| 2. | ఇటిక్యాల్ | - | శ్రీమతి. బి. రంగమ్మ (చేరమెన్) |
| 3. | పీర్లపల్లి | - | కే. సుదర్శన్ రెడ్డి (వైస్ చేర్‌మెన్) |
| 4. | వర్ద రాజ్ పూర్ | - | |
| 5. | చేబర్తి | - | కే. కిషన్ |
| 6. | త్రిగుల్ | - | యస్. మల్లయ్య |
| 7. | అలి రాజ్‌పేట | - | యమ్. సుజాత |
| 8. | గొల్లపల్లి | - | కే. జయమ్మ |
| 9. | మునిగపాపడ | - | యన్. జయపాల్ రెడ్డి |
| 10. | వట్టిపల్లి | - | టి. ప్రభాకర్ |
| 11. | తీగుల్ నర్సాపూర్ | - | జి. రాంచంద్రయ్య |
| 12. | చిన్న కిష్టాపూర్ | - | వై. లక్ష్మమ్మ |
| 13. | కో- ఆపరేషన్ | - | Md. నయీామ్ శరీష్ |

శ్రీ ఎం. మోహన్‌రెడ్డి, జ.సె., పి.ఆర్.టి.యు, మెదక్ జిల్లా వారి సౌజన్యంతో

# ఝరాసంగం మండలము

మెదకు జిల్లాలో జహీరాబాద్ తాలూకాను మండలాలుగా విభజించగా ఝరాసంగం ఒక మండలమైనది.

ఝరాసంగం మండలమున ఉత్తరాన రాయకోడ్ దక్షిణాన జహీరాబాద్, తూర్పున మునిపల్లి, పడమట న్యాల్‌కల్ మండలాలు గలవు. మండలము కాకముందు ఝరాసంగం రెవెన్యూ సర్కిల్‌గా యుండేది.

'ఝరాసంగం' గ్రామములో వెలసిన "కేతకీ సంగమేశ్వర స్వామి" దేవాలయము ఒక ప్రసిద్ధమైన శైవ క్షేత్రము.

ఈ మండలమున 35 గ్రామాలు 28 గ్రామ పంచాయతీలు కలవు.

ఈ మండల జనాభా మొత్తము 33,145 ఇందు స్త్రీలు 16,293, పురుషులు 16,852 ఉన్నారు. వీరిలో యస్.సీలు 8439, యస్.టి.లు 866 మంది ఉన్నారు. ఈ మండలము నందు 5874 కుటుంబములున్నవి.

1987లో మండల ప్రజాపరిషత్తునకు మొదటి సారిగా ఎన్నికలు నిర్వహింపబడినవి. ఈ ప్రత్యక్ష ఎన్నికలలో శ్రీ శంకరయ్య స్వామి అధ్యక్షులుగా ఎన్నికై ఐదు సంవత్సరములు మండలాభివృద్ధికై తన చేయూతనొసంగినారు.

ఆ తర్వాత 1994సంవత్సరంలో పంచాయత్ రాజ్ చట్టమునందు వచ్చిన మార్పులతో మండల ప్రాదేశిక నియోజకవర్గము లేర్పడినవి. వీరిని ఎం.పి.టి.సి.లు గా పేర్కొనుట జరిగినది. ఎం.పి.టి.సి.లుగా ఎన్నికైన సభ్యులు మండలాధ్యక్షుని ఎన్నుకొందురు. ఇది పరోక్షపద్ధతి.

ఈ ఎన్నికలలో మొదట కుప్పానగర్ ఎం.పి.టి.సి.గా ఎన్నికైన శ్రీమతి అంజమ్మ మండలాధ్యక్షులుగా ఎన్నికై మూడు సంవత్సరములు కొనసాగినది. ఆ తర్వాత అవిశ్వాస తీర్మాణము ద్వారా వీరు తొలగిపోయిరి. ఆ సమయమున ఝరాసంగం ఎం.పి.టి.సి శ్రీమతి నాగమణి మండలాధ్యక్షురాలిగా ఎన్నికైనది. వీరిద్దరు మండలాభివృద్ధికై తమ వంతు కృషిని కొనసాగించినారు. ఈ మండలమునుండి జిల్లా పరిషత్తు ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులుగా (జడ్.పి.టి.సి) శ్రీస్వామి దాస్‌గారు ఎన్నికైనారు.

ఝరాసంగం మండలమునందు ప్రాథమిక పాఠశాలలు 29, ప్రాథమికోన్నత పాఠశాలలు5, ఉన్నత పాఠశాలలు 2 మాత్రము కలవు.

ఈ మండలమునందు అక్షరాస్యత తక్కువ. అక్షరాస్యతా శాతము పెంచుటకై 350 అక్షర ప్రభ సెంటర్లు మండలమున నడుపబడుచున్నవి. ఈ మండలమున ప్రతి పాఠశాల స్వంత భవనము కలిగియున్నది.

---

**శ్రీ కొత్త సూర్యనారాయణ గుప్త**, సదాశివపేట వారి సౌజన్యంతో

ఒక ఎస్.సి. బాలుర వసతి గృహము, ఒక బి.సి. బాలుర వసతి గృహములు కలవు.

ఝరాసంగం మండలములో మెట్ట వ్యవసాయం ఎక్కువ. ఈ మండలమునందలి వ్యవసాయ విస్తీర్ణ భూమి మాగాణి 2094 హెక్టార్లు కాగా మెట్ట భూమి 14,668 హెక్టార్లు. ఈ మండలమునందు మేదపల్లి గంగాపూర్ ఏడాకుల పల్లి గ్రామాల్లో చిన్న తరహా ప్రాజెక్టులుండుటచే వాటి ద్వారా 1,625 ఎకరములు సాగు చేయబడుచున్నవి. ఈ మండలములో 4 గ్రామాల్లోనున్న చెరువులచే 873 ఎకరాలు, 2 గ్రామాలలోనున్న కుంటలచే 108 ఎకరాలు సాగుచేయబడుచున్నవి. 82 సామూహిక వ్యవసాయ బావులుండగా వాటి ద్వారా 248 ఎకరములు సాగుచున్నది. ఈ మండలమునందు ఎక్కువగా పప్పుధాన్యములు, జొన్నలు, చెఱుకు పండింపబడుచున్నవి.

ఝరాసంగం మండల కేంద్రమున ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రముండి అనుబంధముగా ఉపకేంద్రములు పని చేయుచూ, ఆరోగ్య వసతులు కల్పించుచున్నవి. 2 పశువైద్యశాలలు కలవు.

ఈ మండల కేంద్రమునందు 1 సిండికేటు బ్యాంకు, సహకార బ్యాంకు, మంజీర గ్రామీణ బ్యాంకు శాఖలుగలవు.

ఈ మండలము నందు మొత్తము గ్రామాలకు విద్యుత్ సౌకర్యం కల్పించబడింది. 9 గ్రామములలో మాత్రము తపాలా సౌకర్యమున్నకై బ్రాంచి ఆఫీసులు కలవు.

ఝరాసంగం మండలమున 3572 తెలుపు రంగు రేషన్ కార్డులు, 1444 గులాబి రేషన్ కార్డులు, కల్గియుండగా 800 క్వింటాళ్ళ బియ్యము, 94 క్వింటాళ్ళ పంచదార, 25 క్వింటాళ్ళ గోధుమలు ప్రతినెల సరఫరా చేయబడుచున్నవి.

ఝరాసంగం మండలమున ఇంతవరకు 700 ఎకరాల ప్రభుత్వ భూమి పంపిణీ చేయబడినది.

ఈ మండలమునందు డిసెంబర్ 2000 నాటికి ఆదరణ పథకం ద్వారా 220 మంది లబ్ధిదారులు, మైనారిటి కార్పోరేషన్ ద్వారా 8, సి.ఎం.ఈ.వై ద్వారా 15 మంది, డి.ఆర్.డి.ఎ. ద్వారా 423 మంది, ఎస్.సి. కార్పొరేషన్ ద్వారా 564 మంది, ఎస్.టి. కార్పొరేషన్ ద్వారా 106 మంది, బి.సి. కార్పొరేషన్ నుండి 484 మంది లాభోక్తులు ప్రభుత్వముచే లబ్ధిపొందినారు.

శ్రీ గుద్దేటి వెంకటేశం, సదాశివపేట (కీ.శే.వేణుగోపాల్) వారి సౌజన్యంతో

## ఝరాసంగం మండలము ఎం.పి.టి.సి.లు

| క్ర.సం. | గ్రామం పేరు | ఎం.పి.టి.సి |
|---|---|---|
| 1. | ఝరాసంగం | శ్రీమతి నాగమణి |
| 2. | కుప్పానగర్ | శ్రీమతి అంజమ్మ |
| 3. | బడికన్నె | శ్రీ రామయ్య |
| 4. | పోట్‌పల్లి | శ్రీమతి విజయలక్ష్మి |
| 5. | కొల్లూర్ | శ్రీ సుధామ |
| 6. | కంబాల్‌పల్లి | శ్రీమతి రత్నమ్మ |
| 7. | ఈదులపల్లి | శ్రీ సూర్ రెడ్డి |
| 8. | జీర్లపల్లి | శ్రీ నిర్వాణి స్వామి |
| 9. | ఎడాకులపల్లి | శ్రీ మల్లన్న |
| 10. | కో ఆప్టెడ్ మెంబర్ | లియాఖత్ |

శ్రీ అమరడి బసప్ప, సదాశివపేట వారి సౌజన్యంతో

## ఝరాసంగం మండలం సర్పంచులు

| క్ర.సం. | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | ఝరాసంగం | హన్మంత్ రావు |
| 2. | కుప్పానగర్ | పార్వతమ్మ |
| 3. | బర్దిపూర్ | మాణెమ్మ |
| 4. | మాచకూర్ | స్వామిదాస్ |
| 5. | క్రిష్టాపూర్ | ఫకీరన్న |
| 6. | బడకన్ని | మాణెమ్మ |
| 7. | పాపోట్‌పల్లి | సంగమేశ్వర్ |
| 8. | ఎలుగోలు | సయిజాత్ బేగం |
| 9. | చేలపల్లి | శివమ్మ |
| 10. | సిర్దాపూర్ | పండరి |
| 11. | వనం పల్లి | శివరాం |
| 12. | కొ-కాల్లూర్ | ఈశ్వరయ్య |
| 13. | తమలపల్లి | శివకుమార్ |
| 14. | కంబాల్ పల్లి | మీతాబాయి |
| 15. | నర్సాపూర్ | పి. సంగారెడ్డి |
| 16. | బారత్ మర్పల్లి | సిద్దమ్మ |
| 17. | బోపన్ పల్లి | సుశీలమ్మ |
| 18. | కికవాడ | నర్సింలు |
| 19. | మెదపల్లి | సంగమేశ్వర్ |
| 20. | ఈదులపల్లి | విజయకుమార్ |
| 21. | గినియార్ పల్లి | మల్లన్నగౌడ్ |
| 22. | చిలికెపల్లి | అంజయ్య |
| 23. | జీర్లపల్లి | మాణిక్యరెడ్డి |
| 24. | బోడగాం | దేవదానం |
| 25. | జానగాం | సిద్దమ్మ |
| 26. | ఏడాకులపల్లి | సంగమేశ్వర్ |
| 27. | దేవెరంపల్లి | సత్తమ్మ |
| 28. | బలేమామిడి | జీవరత్నం |

శ్రీ అమరడ్డి మల్లికార్జున్, సదాశివపేట వారి సౌజన్యంతో

# జిన్నారం మండలము

మెదకు జిల్లాలో జిన్నారం మండలమునకు ఒక ప్రత్యేక స్థానం కలదు. పరిపాలన వికేంద్రీకరణలో నర్సాపూర్ తాలూకాలో 5 మండలాలు ఏర్పడగా అందులో జిన్నారం ఒక మండలంగా ఏర్పడి మండలకేంద్రం అయినది. మండలం కేంద్రంకాక మునుపు జిన్నారం ఒక కుగ్రామం. కాలినడకన అతి కష్టంగా చేరుకొనే ఈ గ్రామం నేడు చక్కని రాజబాటతో అలరారుతూ ప్రతి రోజు 20 బస్సులకు పైగా మండలంలో సంచరిస్తూ ప్రయాణికులను గమ్య స్థానాలకు చేరుస్తున్నాయి.

జిన్నారం మండలము వైశాల్యం 203 చ.కి.మీ. ఈ మండలం నందు మొత్తం 29 గ్రామాలు, 4 మేజర్ గ్రామ పంచాయితీలు, 19 గ్రామ పంచాయితీలు గలవు.

ఈ మండలంన 1991 జనాభాగణన ప్రకారం పురుషులు 2514, స్త్రీలు 23042, మొత్తం 48190 గలరు. ఈ జనాభాలో ఎస్.సి.లు 7578, ఎస్.టి.లు 934 గలరు.

జిన్నారం మండల పరిషత్తు ఏర్పాటయిన తరువాత తొలి అధ్యక్షులుగా పడకంటి వెంకటేశం గుప్తగారు ఎన్నికయ్యారు. ఎన్నికై 5 సంవత్సరాలు మండలాభివృద్ధికై తనవంతు కృషిచేసినారు. 1994లో పంచాయతీ వట్టం మార్పుచెంది ఎం.పి.టి.సి. ల ద్వారా (మండల ప్రాదేశిక సభ్యుల ద్వారా) అధ్యక్ష స్థానంనకు పోటి జరుగగా గుమ్మడిదలకు చెందిన యూ. గోపాల్‌యాదవ్ 5 సంవత్సరాలు అధ్యక్షునిగా కొనసాగినారు.

జిన్నారం మండలమునందు 169 చిన్న పెద్ద చెరువులు గలవు. ఒకప్పుడు జిన్నారం మండలం సంపూర్ణ వ్యవసాయ మండలం ఐనప్పటికీ కాలక్రమేణా పారిశ్రామికంగా అభివృద్ధి చెందినది. ఐనప్పటికి మండలంనందలి ఎక్కువ భాగం వ్యవసాయమే కొనసాగుచున్నది. ఈమండలంనందలి కర్షకులు నవీన వ్యవసాయపద్ధతుల ద్వారా కృషిని కొనసాగిస్తూ ఎక్కువ పంట దిగుబడులను సాధించుచున్నారు. ఈ మండలంనందలి సోలక్‌పల్లి మొదలగు గ్రామాలందు ఉప్లగడ్డ, గుమ్మడిదల మొదలగు గ్రామాలలో వరి, ప్రత్తి కూరగాయలు మున్నగు పంటలు పండించుచున్నారు.

జిన్నారం మండలమునందు ప్రాథమిక పాఠశాలలు 34, ప్రాథమికోన్నత పాఠశాలలు కూడ మండల యాజమాన్యమున నడపబడుచున్నవి. జిల్లా పరిషత్తు యాజమాన్యమున 9 ఉన్నత పాఠశాలలు నడుపబడుచున్నవి. ఈ మండల యాజమాన్యంన ఉపాధ్యాయులు పని చేయుచున్నారు. ప్రతి పాఠశాలకు పక్కా భవనాలు నిర్మింపబడియున్నవి. శివానగర్ మరియు జిన్నారంలో ఉర్దూ పాఠశాలలు నడుపుడుచున్నవి.

---

శ్రీ గానాపురం సంగప్ప, ఎల్లారం వారి సౌజన్యంతో

జిన్నారం గ్రామాన శ్రీ వెంకటేశ్వర సహకార జూనియర్ కళాశాల గలదు. ఈ మండలమునందు జిన్నారం మరియు గుమ్మడిదలలో మరియూ కానుకుంటలో ఆరోగ్యకేంద్రములు పని చేయుచున్నవి. వీటికి అనుబంధంగా ప్రాధమిక ఆరోగ్య ఉపకేంద్రములు కూడా పనిచేయుచున్నవి.

ఈ మండలమునందు జిన్నారం మరియు గుమ్మడిదలలో పశువైద్యశాలలు కలవు. అనుబంధ ఉపకేంద్రాలు కూడా ఈ మండలమున పని చేయుచు పశువుల ఆరోగ్యాన్ని కాపాడుతున్నది.

ఈ మండలమున ఒక రక్షకభట నిలయం మరియు టెలిఫోన్ ఎక్స్ఛేంజ్ మరియు గ్రంధాలయము గలదు.

జిన్నారం మండల కేంద్రమున తిరుమల తిరుపతి దేవస్థానం వారి కళ్యాణ మంటపం సుందరంగా నిర్మితమైయున్నది.

ఈ మండలం నందు జిన్నారం స్పెషల్ హాస్టల్ గుమ్మడిదలలో ఎస్.సి.ల వసతి గృహము, కానుకుంట గ్రామంలో బి.సి. విద్యార్థి వసతి గృహములు గలవు.

జిన్నారం మండలమునందు గుమ్మడిదలలో స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా జిన్నారం మరియు బొల్లారం గ్రామాల్లో మంజీర గ్రామీణ బ్యాంక్ శాఖలు గలవు.

ఈ మండలంనందు 4072 ఎకరాల ప్రభుత్వ మాగాణి భూమిని 2343 లబ్ధిదారులకు పంపిణీ చేయనైనది అందు 573 మంది ఎస్.సి.లకు 62 ఎకరాలు, 33 మంది ఎస్.టి.లకు 50 ఎకరములు, 1440 మంది బి.సి.లకు 2683 ఎకరములు మరియు 293 మంది ఓ.సి.లకు 537 ఎకరములు పంపిణీ చేయనైనది. అట్లే మండలంనందలి సీలింగ్ భూమి 273 ఎకరములు 196 మంది లబ్ధిదారులకు పంపిణీ చేయనైనది.

ఈ మండలమునందు 173 చిన్న మధ్య భారీ పరిశ్రమలు కలవు. అందు అంతర్జాతీయ మార్కెట్టులో ప్రవేశించే రెడ్డీల్యాబ్స్, ప్రాక్టర్ ఆండ్ గ్యాంబెల్, హెట్రో డ్రగ్స్, సాంప్సిస్టన్స్, రోల్‌మార్‌చైన్స్, టెట్రాన్ పాలిలైన్సెస్, సిరీస్ ఇండియా మొదలగు కర్మాగారాలు మండలమునకు ఖ్యాతిగడించి పెట్టుచున్నవి.

ఈ మండలము పారిశ్రామికముగా గాక వ్యవసాయ మండలమైనందు వల్ల వరి పంట ఎక్కువగా పండించుట వల్ల 17 రైసుమిల్లులు పని చేయుచున్నవి.

ఈ మండలమునందు 17 చౌకధరల దుకాణాల ద్వారా 7161 తెల్లకార్డుల వారికి 3295 గులాబి రంగు కార్డుల వారికి, పౌరసర్ఫరాల శాఖ ద్వారా బియ్యము, చక్కెర, గోధుమలు, కిరోసిన్ పంపిణీ అగుచున్నవి.

జిన్నారం మండలమునందలి బొంతపల్లి వీరభద్రస్వామి దేవాలయము కడు ప్రశస్తమై నిరంతరం భక్తుల రాకపోకలతో యుండును.

శ్రీ జి. చంద్రమౌళి, ఛైర్‌మెన్స్ క్లబ్ మెంబర్, ఎల్.ఐ.సి., సంగారెడ్డి వారి సౌజన్యంతో

కొడకంచి గ్రామమందలి ఆదినారాయణ స్వామి దేవాలయము కంచి దేవాలయమును పోలియున్నది. కాని ఈ దేవాలయము జీర్ణమై పోషణ కరువైనది. గమ్మడిదల గ్రామములో కళ్యాణ రామచంద్రస్వామి దేవాలయమున రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు నలుగురు సతీసమేతులై కొలువు దీరియుండుట విశిష్టమైనది.

## జిన్నారం మండల ఎం.పి.టీ.సి. లిస్టు

| క్ర.సం. | గ్రామం పేరు | ఎం.పి.టీ.పి పేరు | |
|---|---|---|---|
| 1. | శ్రీ ఢి. రామకృష్ణ | జి. ప్ర. ప్రా. | నియోజక వర్గ సభ్యులు |
| 2. | శ్రీ కె. గోపాల్ యాదవ్ | అధ్యక్షులు | మం.ప. జిన్నారం |
| 3. | శ్రీ టి. బాల స్వామి రెడ్డి | ఉపాధ్యక్షులు | జిన్నారం |
| 4. | శ్రీ ఎ. వీరస్వామి | యం. పి.టి.సి. నల్లపల్లి | |
| 5. | వి. సత్యనారాయణ | యం.పి.టి.సి. సభ్యులు, కానుకుంట 1 | |
| 6. | శ్రీమతి బి. విజయలక్ష్మి | " | కానుకుంట 2 |
| 7. | శ్రీ యం. బాల్‌రెడ్డి | " | బొంతపల్లి |
| 8. | శ్రీమతి ఝాన్సిలక్ష్మి | " | అన్నారం |
| 9. | శ్రీనాగులూరి నర్సింలు | " | జిన్నారం |
| 10. | శ్రీమతి కత్తుల సాయమ్మ | " | ఊట్ల |
| 11. | శ్రీమతి ఎలిమెలమాణెమ్మ | " | సోలక్‌పల్లి |
| 12. | శ్రీ పుట్టి అంజయ్య | " | శివానగర్ |
| 13. | శ్రీమతి యన్. అనిత | " | మాదారం |
| 14. | శ్రీ కె. బాల్ రెడ్డి | " | ఖాంజిపల్లి 1 |
| 15. | శ్రీ వి. వీరప్ప | " | ఖాంజిపల్లి 2 |
| 16. | శ్రీ సర్వర్ | కో-ఆప్టెడ్ సభ్యులు, జిన్నారం మండలం | |

**కీ.శే. తోటికొండ బుచ్చయ్య గుప్త, సదాశివపేట వారి సౌజన్యంతో**

# జిన్నారం మండలం సర్పంచులు

| క్ర.సం. | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | కొత్తపల్లి | శ్రీ యం. అశోక్ కుమార్ |
| 2. | నల్లవల్లి | శ్రీ యం. సోమయ్య |
| 3. | మంచాపూర్ | శ్రీ కె. సత్యస్వామి |
| 4. | గుమ్మడిదల | శ్రీ పి. విష్ణువర్ధన్‌రెడ్డి |
| 5. | అంతారం | శ్రీ కె. శంకరయ్య |
| 6. | కానుకుంట | శ్రీ యస్. సత్యగౌడ్ |
| 7. | దాచారం | శ్రీమతి డి. పెంటమ్మ |
| 8. | బొంతపల్లి | శ్రీ యస్. నాగేందర్ గౌడ్ |
| 9. | దోమడుగు | శ్రీ కె. సత్తయ్య |
| 10. | అన్నారం | శ్రీ ఎం. సంజీవరెడ్డి |
| 11. | జిన్నారం | శ్రీ పి. జనార్ధన్ గౌడ్ |
| 12. | ఊట్ల | శ్రీమతి పి. మహాలక్ష్మమ్మ |
| 13. | మంగంపేట | శ్రీమతి యన్. సక్కుబాయి |
| 14. | సోలక్‌పల్లి | శ్రీ డి. పాండు |
| 15. | అందూర్ | శ్రీమతి ఆర్. శ్యామల |
| 16. | శివానగర్ | శ్రీ పి. మల్లేశం |
| 17. | కొడకంచి | శ్రీమతి సి. విజయలక్ష్మి |
| 18. | మాదారం | శ్రీమతి కె. చంద్రకళ |
| 19. | నల్తూర్ | శ్రీ యం. [illegible]య్య |
| 20. | వాయిలాల | శ్రీ డి. వీరస్వామి |
| 21. | గడ్డపోతారం | శ్రీమతి వి. లక్ష్మి |
| 22. | ఖాజీపల్లి | శ్రీ బి. రాములు |
| 23. | బొల్లారం | శ్రీ పి. ప్రతాప్‌రెడ్డి |

శ్రీ ఎం. యాదయ్య, హెచ్.ఎమ్, సి.పి.ఎస్., గోమారం వారి సౌజన్యంతో

# కల్హేర్ మండలము

నారాయణఖేడ్ తాలూకాలో మండల వికేంద్రీకరణలో కల్హేర్ మండలము ఏర్పాటైనది. మండలము విస్తీర్ణము 227 చ.కి.మీ., 25 గ్రామాలు, 25 గ్రామ పంచాయితీలు కలవు.

కల్హేర్ మండలమునకు వరం నల్లవాగు ప్రాజెక్టు. ఈ ప్రాజెక్టు మూలంగా మండల రైతులు అత్యధికంగా పంటలు పండిస్తున్నారు. మండలం సంగారెడ్డి డివిజన్‌లో వుంది. అత్యధికంగా వరి పంటను పండిస్తారు. ప్రాజెక్టు వల్ల ఖుష్కీలుగా వున్న వేల ఎకరాలు తరి పొలాలుగా మారాయి.

కల్హేర్ మండలము ఏర్పడిన 1987 సంవత్సరములో ప్రప్రథమ మండలాధ్యక్షులుగా శ్రీమతి శకుంతల ఎన్నికై మండలాభివృద్ధికి ఎంతో కృషి సల్పినారు. రెండవ మారు పంచాయితీరాజ్ వ్యవస్థకి మార్పువల్ల 1994లో ఎం.పి.టి.సిల ద్వారా శ్రీ పద్మబాపిరాజు ఎన్నికై మండలాభివృద్ధికి తనవంతు కృషి సల్పినారు. ఈ మండలము నుండి జిల్లా పరిషత్‌కు శ్రీ వి. రామాగౌడ్‌గారు జడ్.పి.టి.సి.గా ఎన్నికై తన యొక్క రాజకీయానుభవంతో జిల్లా పరిషత్ నిధుల ద్వారా ఈ మండలాభివృద్ధికి ఎనలేని కృషి సల్పినారు.

కల్హేర్ మండల జనాభా మొత్తం 39472 అందులో పురుషులు 20066, స్త్రీలు 19406. (1991 జనాభా లెక్కల ప్రకారం) అందు ఎస్.సి.లు 6243, ఎస్.టి.లు 4448 జనాభా కలరు.

కల్హేర్ మండలమున ప్రాథమికపాఠశాలలు 27, ప్రాథమికోన్నత పాఠశాలలు 6, ఉన్నత పాఠశాలలు 3 కలవు. సాంఘిక సంక్షేమ శాఖ వారి హాస్టళ్లు 2 కలవు.

ఈ మండలములో 1 పోలీస్ స్టేషన్, గ్రంథాలయము కలవు. మండల ప్రజల వైద్య సౌకర్యాలకై ప్రాథమిక ఆరోగ్య కేంద్రం, దానికి అనుబంధంగా ఉపకేంద్రములు నడుపబడుచున్నవి. పశువైద్యశాల మరియు పశువైద్య ఉపకేంద్రాలు పశువుల ఆరోగ్య రక్షణకై కలవు.

మండలములో 24 చౌకధరల దుకాణాల ద్వారా నిత్యావసర వస్తువులైన పంచదార, గోధుమలు, కిరోసిన్, పామాయిల్ ప్రభుత్వ ధరలకు సరఫరా అగుచున్నవి.

కల్హేర్ మండలము పూర్వము కర్ణాటక రాష్ట్రంలోని బీదర్ జిల్లాలో వుండేది. అప్పట్లో ఇది ఒక ప్రముఖ వ్యాపార కేంద్రము, భాషా ప్రాతిపదిక రాష్ట్రాల ఏర్పాటులో ఈ మండలము మెదకు జిల్లాలో విలీనం అయినది. ఇక్కడి ప్రజలు నేటికి కన్నడ భాషలో ఎక్కువగా మాట్లాడుతారు. సంప్రదాయాలు కూడా కన్నడిగులవే.

ఈ మండలము ఎక్కువగా గ్రామీణ వాతావరణం కలిగినది. మండల ప్రజలు ఎక్కువగా నిరక్షరాస్యులు, వ్యవసాయాధారిత ప్రాంతము.

---

**శ్రీమతి ఆండాలు,** W/o. యాదయ్య, గోమారం వారి సౌజన్యంతో

రైతులు వరితోపాటు చెరుకు, పల్లీ, పసుపు, పప్పుదినుసులు పండిస్తారు.

మండలము జన్మభూమి ద్వారా గ్రామీణ ప్రాంతాలలో నెలకొన్న అనేక సమస్యలను ప్రజల వద్దకు పాలన, శ్రమదానం కార్యక్రమాల ద్వారా ప్ర వంతులై తమ గ్రామాలాభివృద్ధికి ప్రతి సల్పి మండల రూపురేఖలను మార్పు చే

## సర్పంచ్‌లు జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు | |
|---|---|---|---|
| 1. | బీబీపేట్ | ఎం. బాలమణి | |
| 2. | బాచేపల్లి | పి. సువర్ణ | |
| 3. | కల్హేర్ | బి. పోచయ్య | |
| 4. | కిష్టాపూర్ | బి. హనుమయ్య | |
| 5. | కడ్‌పల్ | నిర్మల్ | |
| 6. | మర్ధి | ఈశ్వల | |
| 7. | మాసన్‌పల్లి | జి. కిస్తాషన్‌గౌడ్ | |
| 8. | నాదర్ | పి. కేశయ్య | |
| 9. | రామ్‌రెడ్డిపేట | ఎ. పంభాని | |
| 10. | సిర్గాపూర్ | ఎల్. ఓమల | |
| 11. | రాపర్తి | ఎ. మల్లేశం | |
| 12. | మునుగేపల్లి | పి. మల్లయ్య | |
| 13. | సుల్తానాబాద్ | సి. వీరప్ప | |
| 14. | పోచారం | సామ్యేల్ | |
| 15. | అంతర్‌గాంవ్ | పి. మాచేందర్ | |
| 16. | ముబారక్‌పూర్ | టి. శివయ్య | |

శ్రీ విశ్వనాథం వెంకటరామయులు, గోమారం వారి సౌజన్యంతో

## మండల పరిషత్ కల్హేర్ పరిధిలోని యం.పి.టి.సి, వివరములు

| క్ర. సంఖ్య | గ్రామం | ఎం.పి.టి.సి |
|---|---|---|
| 1. | కల్హేర్ | జి. రాంరెడ్డి, ఉపాధ్యక్షులు |
| 2. | మాసాన్‌పల్లి | యం. వెంకాగౌడ్ |
| 3. | బీబీపేట | యం. మల్గొండ |
| 4. | సుల్తానాబాద్ | రామయ్య |
| 5. | నాగ్‌ధర్ | శ్రీమతి శీలాభాయ్ దేశ్‌ముఖ్ |
| 6. | కడ్పల్ | శ్రీమతి కేశమ్మ |
| 7. | సిర్గాపూర్ | పుటప్ బాలు |
| 8. | క్రిష్ణాపూర్ | డి. పుష్పలత |

**శ్రీమతి మీనాక్షి,** W/o. వెంకటరాములు, గోమారం వారి సౌజన్యంతో

# కంగ్టి మండలము

జిల్లాలోని నారాయణ ఖేడ్ నియోజక వర్గంలో భాగంగా జిల్లాకేగాక రాష్ట్రానికే సరిహద్దుగా నెలవై ఉన్నది "కంగ్టి మండల పరిషత్తు." మారుమూల ప్రాంతంలో కనీస సౌకర్యాలకు దూరంగా ఉన్న మండలం ఇది.

కంగ్టి మండలము పశ్చిమమున కర్ణాటక రాష్ట్రమును ఉత్తరమున నిజామాబాద్ జిల్లాను సరిహద్దులుగా కలిగియున్నది. కర్ణాటక రాష్ట్రమునకు ఆనుకొని ఉండుట చేత కన్నడ భాషా ప్రభావము ఈ మండలమునందు అధికముగా కలదు. తెలుగుతో పాటు మరాఠీ, కన్నడ, హిందీ భాషలు కూడా ఇక్కడ వినియోగములో ఉన్నవి.

కంగ్టి మండల అధ్యక్షుడిగా శివాజీరావు పాటిల్, ఉపాధ్యాక్షుడిగా గురయ్యస్వామి ఎన్నుకోబడినారు. వీరు మండల పరిషత్తు అభివృద్ధి అధికారి వెంకటేషం గుప్త, మండల రెవెన్యూ అధికారి జే. నర్సింహులు, మరియు జిల్లా ప్రాదేశిక నియోజక వర్గ సభ్యురాలు శ్రీమతి మంధబాయి సహకారం తో మండల అభివృద్ధికి కృషిచేయుచున్నారు. 22 మంది గ్రామ పరిపాలనా అధికారులు, 46 మంది గ్రామసేవకులు పరిపాలనయందు తోడ్పడుచున్నారు.

మండలమునందు గల శ్రీ సంగమేశ్వర దేవాలయము భక్తి ప్రపత్తులతో స్థానికులు మరియు స్థానికేతరులతో సేవింపబడుచున్నది.

మండలములోని వాసర్ గ్రామంలో "అమ్మవారి దేవాలయం" కలదు స్థానికుల ఐతిహ్యం ప్రకారం ఆదిలాబాదు జిల్లాలోని వాసర సరస్వతి అమ్మవారు ఇచ్చట కూడా వెలసియుండెనని చెప్పుకుందురు.

సరియైన నీటిసదుపాయములుగాని, పరిశ్రమలు గానీ లేకపోవుటచే ఇక్కడి ప్రజలు ఆర్థికముగా, సామాజికముగా వెనుకబడినట్లుగా అగుపడుచున్నది. అధిక శాతం ప్రజలు నిరక్షరాస్యులు ఈ మధ్య కాలంలో ప్రభుత్వం కల్పిస్తూ ఉన్న అక్షరాస్యతా అభివృద్ధి కార్యక్రమాల్లో భాగంగా విద్యాభివృద్ధి మెల్లమెల్లగా కొనసాగుచున్నది.

ఈ కంగ్టి మండలమున బోడ గుట్టలు ఎక్కువగా కలవు. "చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవుళ్లు...." అని శ్రీనాథుడు వర్ణించిన పల్నాటిని ఈ ప్రాంతమును గుర్తుకు తెస్తుంది.

కంగ్టి మండల విస్తీర్ణము 261 చ.కి.మీ. ఇందలి రెవిన్యు గ్రామముల సంఖ్య 31. క్రీ.శ. 1991 జనాభా లెక్కల ప్రకారం ఈ మండల మొత్తం జనాభా 30,482 , పురుషులు 15725, స్త్రీలు - 15207, S.C-5223, S.T-2775 వ్యవసాయమునకు ఉపయోగపడు భూమి విస్తీర్ణము 24644 ఎకరములు.

శ్రీ జి. పోచయ్య, జడ్.పి.హెచ్.ఎస్., హెచ్.ఎం., పిల్లుట్ల వారి సౌజన్యంతో

ఇచట సగటు వర్షపాతము 623 మి. మీ ఇక్కడి నల్లరేగడి నేలల్లో జొన్నలు, మక్కలు, పప్పుధాన్యాలు ఎక్కువగా పండిస్తారు.

కల్హేర్ మండల పరిషత్తు పరిధిలో 41 ప్రాథమిక పాఠశాలలు, ఉన్నత పాఠశాలలు 2 కలవు. ఈ పాఠశాలల యందు 56 మంది ఉపాధ్యాయులు బోధించుచున్నారు. మరియు 33 అంగన్‌వాడి కేంద్రములు, 20 రాత్రి బడులు, 10 నిరంతర విద్యా కేంద్రాలు కూడా ఈ మండల పరిధిలో విద్యావ్యాప్తికికృషి చేయుచున్నవి. సాంఘిక సంక్షేమ శాఖ హరిజన విద్యార్థులకు ఒకటి, వెనుకబడిన తరగతులకు రెండు చొప్పున తడ్కల్ మరియు కల్హేర్‌లలో రెండు విద్యార్థి వసతి గృహములను నిర్వహించుచున్నది. మండల విద్యాధికారిగా శ్రీ బి. పంచాక్షరి తమ విధులను నిర్వహించుచున్నారు.

ప్రజారోగ్యం నిమిత్తమై ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఒక్క డాక్టరు చే ఈ మండల కేంద్రమందు నడిపింపబడుచున్నది.

ఒక పశు వైద్యశాల రెండు పశు సంవర్ధక కేంద్రాలు కూడా ఈ మండలమునందు కలవు. మండలంలో 2862 ఆవులు, 2401 గేదెలు, 8649 గొర్రెలు కలవు.

కల్హేర్ మండలమునందు 22 గ్రామపంచాయతీ కలవు. వాసర్, కల్హేర్‌లలో గల మంజీర గ్రామీణ బ్యాంకులు రెండు, కో-ఆపరేటివ్ సొసైటీలు రెండు మండల ప్రజలకు తమ సేవలు అందించుచున్నవి.

వాసర్ తడ్కల్‌లో నెలకొల్పబడిన రెండు సబ్ స్టేషన్‌లతోనూ, 30 ట్రాన్స్‌ఫార్మర్లతోను మండలంలోని గ్రామాలకు విద్యుత్ సౌకర్యం కల్పింపబడినది.

మండలంలోని ఏడు గ్రామాలలో తపాలా శాఖలు కలవు మరియు మండల కేంద్రమందు తంతి సౌకర్యము కూడా కలదు.

మండల పరిధిలో 18 చౌకధరల దుకాణాలు కలవు. వీటిలో 5241 తెల్లకార్డులు, 2298 గులాబి కార్డులు కలవు, 10 దుకాణములను మహిళలే నిర్వహించుచున్నారు.

మండల కేంద్రమందు గల పోలీస్ స్టేషన్. మండల మందు శాంతి భద్రతల బాధ్యత వహించుచున్నది.

మండలమునందు 6 కి.మీ. పొడువైన పక్కారోడ్లు, 25 కి.మీ. కచ్చారోడ్లు ఉండగా నాలుగు గ్రామాలకు బస్సు సౌకర్యము కల్పింపబడినది.

మండలము నందు ప్రభుత్వ భూమి 6160.38 ఎకరాలు ఉండగా అందు నుండి నేటి వరకు 4836.22 ఎకరాలు లావుణిపై పట్టా ఇవ్వ బడినది. ఇంకనూ 179.07 ఎకరాలు భూమి ఇవ్వ వలసి ఉంది.

వ్యవసాయభివృద్ధి నిమిత్తమై S.C కార్పోరేషన్ ద్వారా 3 సాముహిక బావులు, B.C కార్పోరేషన్ ద్వారా 2 సాముహిక బావులు, రైతులకు మంజూరు చేయబడినది.

శ్రీమతి పుష్పలత పోచయ్య, నర్సాపూర్ వారి సౌజన్యంతో

తొమ్మిది ఎరువుల పంపిణీ కేంద్రాలను, సబ్సిడీపైన సన్‌ఫ్లవర్ మొదలైన విత్తనాల పంపిణీ కేంద్రాలను, 4 వ్యవసాయ గిడ్డంగులను కూడా ప్రభుత్వం ఈ మండల మందు నిర్వహించుచున్నది. మండలంలోని తడ్కోల్ లోగల రైసుమిల్లు రైతుల అవసరాలను తీర్చుచున్నది.

మండలమునందు 373 వృద్ధాప్య పింఛనులు, 350 గర్భిణీ పింఛనులు, 35 వితంతు ఫింఛనులు, 282 కరువు పింఛనులు , 7 అనాధల కిచ్చే పింఛనులు ప్రభుత్వంచే ఇవ్వబడుచున్నది. ఇంకనూ 5 బయోగ్యాసు ప్లాంట్లు, 50 మరుగుదొడ్లు 310 మంది బలహీన వర్గాల వారికి గృహములు నిర్మించి ఇవ్వబడినవి.

స్థానిక నీటి వనరులను సద్వినియోగం చేయుటలో ప్రజలను భాగస్వాములను చేస్తూ ప్రస్తుత ప్రభుత్వము తీసుకున్న నిర్ణయాల ఆధారంగా మండలంలో ఏర్పడిన 5 నీటి సంఘాలకు ఛైర్మన్లు ఎన్నుకోబడినారు.

**సర్పంచ్‌లు జాబితా**

| క్ర.సం | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | భీమా | విఠప్ప |
| 2. | చాప్టాకుర్ద్ | నరసింహారెడ్డి |
| 3. | డేగుల్‌వాడి | మారుతి |
| 4. | దామర్‌గిడ్డ | నిర్మల భాయి |
| 5. | కంగ్టీ | ఎ. రాములు |
| 6. | నాగూర్ (బి) | భూమమ్మ |
| 7. | పోట్‌పల్లి | లచ్చన్న |
| 8. | రసోలి | యాదయ్య |
| 9. | తడ్‌కల్ | రుస్తుంరావు |
| 10. | తురకవాడగావ్ | బహరాంగౌండ |
| 11. | సిద్ధాంగేర్గ | శంకరమ్మ |
| 12. | వాసేప్ | మారుతీరావు |
| 13. | వం.దాల్ | భుద్దయ్‌భాయి |
| 14. | ఎంకెమూరి | జయాభాయి |
| 15. | బోర్‌గిగురద్ | చుందేర్ సింగ్ |
| 16. | చౌకన్‌పల్లి | శరణమ్మ |
| 17. | సంగం | మారుతి |
| 18. | గర్డిగావ్ | కె. కరోబారి |
| 19. | జాంగి (కె) | నారాయణ్‌రెడ్డి |
| 20. | టాగూర్ (కె) | ---- |
| 21. | గాజులపాడ్ | మాధవరావు |

శ్రీ పి.గోపయ్య, టీచర్, పి.ఎస్. గొల్లపల్లి వారి సౌజన్యంతో

## ఎం.పి.టి.సి. జాబితా

| క్ర.సం | పేరు | |
|---|---|---|
| 1. | శివాజి పాటిల్ | ప్రసిడెంట్ |
| 2. | గురువైయ్య స్వామి | వైస్ ప్రసిడెంట్ |
| 3. | మడయ్య స్వామి | |
| 4. | దశరథ | |
| 5. | శ్రీమతి నర్సమ్మ - | |
| 6. | శ్రీమతి ప్రమీలాబాయి | |
| 7. | శ్రీమతి సత్యమ్మ | |
| 8. | ఎస్. కిషన్ | |
| 9. | కుఖ్యానాయక్ | |
| 10. | బాబూమియా | కో - ఆప్టెడ్ |

శ్రీమతి పి. వీరమణి, W/o. గోపయ్య వారి సౌజన్యంతో

# కోహీర్ మండలము

కోహీర్ మండలము మండల వ్యవస్థ ద్వారా వికేంద్రీకరణ వల్ల జహీరాబాద్ తాలూకాలో 23 గ్రామాలతో ఈ మండలము ఏర్పాటయినది. ఈ మండలము కాకతీయుల కాలంలో ఒక ముఖ్య పట్టణంగా ఉండేది.

ఈ మండల భౌగోళిక విస్తీర్ణము 221 చ.కి.మీ. ఈ మండల జనాభా మొత్తం 52827. అందు పురుషులు 26882, స్త్రీలు 25945. ఈ మండలంలో ఎస్.సి.ల జనాభా 14165. ఎస్.టి.లో 1464.

ఈ మండలములో ప్రజలు ఉర్దూ, కన్నడ భాషలు కూడా మాట్లాడగలరు. ఈ మండలం ఎర్రనేలలతో కూడియున్నది.

ఈ మండలం ఏర్పడిన 1987న సంవత్సరంలో ప్రజల ద్వారా ప్రత్యక్షంగా శ్రీ మొల్లయ్యగారు ప్రప్రథమ మండలాధ్యక్షునిగా ఎన్నికై తనవంతుకృషి సల్పినారు. 1994లో మండల ప్రాదేశిక నియోజక వర్గ సభ్యుల ద్వారా శ్రీ యం. సాయన్న మండలాధ్యక్షునిగా ఎన్నికై మండలాభివృద్ధికి కృషి సల్పినారు. ఈ మండలం నుండి జిల్లా పరిషత్తునకు (జడ్.పి.టి.సిగా) శ్రీమతి శాంతమ్మగారు ఎన్నికై ఈ మండల సమస్యల గురించి జిల్లాపరిషత్ వేదికలో చర్చించి మండలాభివృద్ధికి తనవంతు కృషి సలిపినారు.

ఈ మండలంలో మూడు చెరువుల ద్వారా 1319 ఎకరాలు ఆయుకట్టు సాగుచున్నవి. కోహీర్ మండలంలో 29 ప్రాథమిక పాఠశాలలు, 6 ఉన్నత పాఠశాలలు ఒక ప్రభుత్వ జూనియర్ కళాశాల ద్వారా విద్యాభివృద్ధి జరుగుచున్నది. ఇంతేకాక 2 ఎస్.సి. హాస్టల్లు అందులో 163 మంది విద్యార్థులు బాలికలకు ప్రత్యేక ఎస్.సి. హాస్టలు అందులో 99 మంది విద్యార్థినులు. బి.సి. విద్యార్థుల కొరకు ఒకవసతి గృహము అందు 100 మంది విద్యార్థులు విద్యనార్జించుచున్నారు.

ఈ మండలంలో 15643 మంది నిరక్షరాస్యులు కలరు. కోహీర్ మండల కేంద్రంలో ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రము దానికనుబంధంగా గ్రామాల్లో ఉపకేంద్రములు ప్రజలకు వైద్య సేవలు అందించుచున్నవి. ఇవియేకాక పశువైద్య కేంద్రములు 2, ఉపకేంద్రములు 6 కలవు. ఈ మండలంలో పోలీస్ స్టేషన్, గ్రంథాలయము, వాణిజ్య బ్యాంకు, తపాల సౌకర్యమయినప్పటికీ దాదాపు ప్రతి గ్రామానికి రవాణా సౌకర్యము కలదు. కోహీర్ మండల ప్రజలు ఆర్థికంగా వెనుకంజలో ఉన్నారు. ఇచ్చట ఎర్రనేలల వల్ల ఎక్కువగా చెఱుకు, పసుపు, పత్తి, పప్పుదినుసులు, జొన్నలు, పల్లి ఎక్కువగా పండిస్తార. వరి పంట చాలా తక్కువ. ఈ మండలము ప్రభుత్వ పథకాలయిన సి.ఎం.ఇ.వై., డ్వాక్రా గ్రూపులు, నీటి వినియోగదారుల సంఘాల ద్వారా కొంతలోకొంత అభివృద్ధి సాధించుచున్నది.

శ్రీ ఆర్. రామారావు, మేనెజర్, ఎస్.పి.హెచ్., నర్సాపూర్ వారి సౌజన్యంతో

## సర్పంచ్‌ల జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | బిలాత్‌పూర్ | నర్సింలు |
| 2. | చింతల్‌గట్ | మదుసూదన్ రెడ్డి |
| 3. | దిగ్‌వాల్ | నాగేందర్ రావు |
| 4. | గోడగర్‌పల్లి | బిక్యామ్‌సింగ్ |
| 5. | గురజ్‌వాడ | ఈశ్వరరెడ్డి |
| 6. | కన్నాపూర్ | రాచయ్య |
| 7. | కోహిర్ | అబేదా తలాట్ |
| 8. | కవేలి | రామమ్మ |
| 9. | మనియార్‌పల్లి | కిష్టారెడ్డి |
| 10. | మాచిరెడ్డిపల్లి | శోభారాణి |
| 11. | మద్రి | ఖలీల్‌మియా |
| 12. | నాగిరెడ్డిపల్లి | శివరాయమ్మ |
| 13. | పీచిరిగడి | సి. హెచ్. పెంటమ్మ |
| 14. | పైడిగుమ్మల్ | నరసమ్మ |
| 15. | పర్సాపల్లి | బి. భాగ్య |
| 16. | పోతారెడ్డిపల్లి | ఇ. నర్సింహులు |
| 17. | రాజ్‌నెల్లి | విజయకుమార్ |
| 18. | సజ్జాపూర్ | రమణ |
| 19. | వెంకటాపూర్ | అంజయ్య |
| 20. | బడంపేట | యెల్లమ్మ |

మండల పరిషత్ కోహీర్ పరిధిలోని యం.పి.టి.సి, వివరవ

| గ్రామం | పేరు | |
|---|---|---|
| బిలాల్‌పూర్ | శ్రీ ముగులయ్య (ఉపాధ్యక్షులు) | |
| కోహీర్ 2 | శ్రీమతి పునెమ్మ | |
| కోహీర్ 3 | జెబునిస్సా బేగం | |
| కోహీర్ 4 | పి. జాన్ | |
| దిగ్వాల్ | శ్రీనివాస గౌడ్ | |
| గురుజ్‌వాడ | జె. దేవయ్య | |
| చింతల్ ఘాట్ | సి. లక్ష్మయ్య | |
| గోటిగార్‌పల్లి | విఠల్ నాయక్ | |
| మనియార్ పల్లి | సాదద్ బీ | |
| ఖానాపూర్ | కె. నాగయ్య | |
| మచ్చిరెడ్డిపల్లి | డి. పద్మ | |
| కావలి | ఖాజా మోహినుద్దిన్ | |
| నాగిరెడ్డి పల్లి | ఎ. మల్లయ్య | |
| బిలాల్‌పూర్ | బి. మొల్లయ్య | |
| పోడిగుమ్మల్ | బి. మల్లయ్య | |
| | కో ఆప్టెడ్ మెంబర్ అబ్దుల్ సలీం | |

# కొల్చారం మండలము

మెదకు జిల్లాలో కొల్చారం మండలము ఒక ప్రత్యేక ప్రఖ్యాతమైనది.

ఈ మండల కేంద్రము మొదట కోలాచలముగా పిలువబడినది ఇచ్చట జైన మతము విస్తృత ప్రచారమందినట్లు, ఇచ్చట బయల్పడిన జైన తీర్థంకరుల విగ్రహముల బట్టితెలియుచున్నది. తొమ్మిది అడుగుల జైన తీర్థం కరుల విగ్రహాలు ఈ గ్రామమున బయట పడగా హైద్రాబాద్‌లోని జైనులు కొందరు రోడ్డునకు ప్రక్కన విశాలమైన స్థలము కొనుగోలు చేసి జైన దేవతాలయమును నిర్మించినారు. ప్రపంచప్రఖ్యాతమైన సంస్కృత వాఙ్మయ సుధాకరుడైన కాళిదాసు మహాకవి కావ్యములకు ఈ చోటనే అమృత వర్షిణీ వ్యాఖ్యలు కోలాచలమల్లినాథ సూరిచే గావించబడినవి. దీనిచే కోలాచలము విశ్వవిఖ్యాత మైనదని చేప్పవచ్చును.

1987 లో నందమూరి తారకరామారావు ముఖ్యమంత్రిగా నుండి అతనిమదిలో మెదలిన ఆలోచనా రూపకల్పనమే మండలిక వ్యవస్థ ప్రజల వద్దకు పాలననందించి పరిపాలనా వికేంద్రీకరణ మొనరించు సదాశయములో తాలూకాలు విభజింప బడినవి. పంచాయతీ సమితులు పంచబడినవి. ఆ క్రియా కల్పమునమెదకు తాలూకా టేక్మల్, పాపన్నపేట, మెదకు, కొల్చారం మండలాలుగా మారినది.

1987 లో కొల్చారం మండలమేర్పాటైనది. 1987 ఏప్రిల్ లో మండల ప్రజా పరిషత్తు అధ్యక్ష పదవికి తొలిసారిగా ఎన్నికలు ప్రత్యక్ష పద్ధతిన నిర్వహింపబడినవి, ఈ ఎన్నికలలో మండల ప్రజా పరిషదధ్యక్షులుగా, శ్రీమతి ఎ. రుక్మిణీ బాయి గారు ఎన్నికై ఐదు సంవత్సరములు మండల పురోభివృద్ధికి తమశాయశక్తుల కృషిసల్పిరి.

ఆ తర్వాత 1995 లో రెండవ మారు మండల పరిషత్తులకు ఎన్నికలు జరిగినవి. వారిన పంచాయత్‌రాజ్ యాక్టు ప్రకారము మండలమున మండల ప్రాదేశిక నియోజకవర్గ సభ్యుల ఎన్నికలు జరిగి వారి నుండి మండలాధ్యక్ష ఉపాధ్యక్ష ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికలలో శ్రీ పి. రామచంద్రయ్య గారు అధ్యక్షులుగా శ్రీ టి. సిద్దాగౌడు గారు ఉపాధ్యక్షులుగా ఎన్నికై కర్తవ్యనిర్వాహణ గావించుచు మండల పురోభివద్ధికి కృషి సల్పుచున్నారు. ఈ మండలమునుండి జిల్లా పిరిషత్తు ప్రాదేశిక నియోజిక వర్గ సభ్యులుగా శ్రీమతి వై. కరుణమల్లారెడ్డి గారు ఎన్నికై ప్రజాసేవ చేయుచున్నారు.

కొల్చారం మండలము 16399 హెక్టార్ల వైశాల్యము కలదు ఈ మండలమున 3330 హెక్టార్ల అటవీ భూమి కలదు 2861 హెక్టార్లతరి, 4530 హెక్టార్లమెట్టభూమి కలదు. 21 గ్రామములు 15 గ్రామ పంచాయతీలు ఈ మండలమునందు కలవు.

---

శ్రీ గుడాల పురుషోత్తం, గజ్వేల్ వారి సౌజన్యంతో

కొల్చారం మండల జనాభా 1991 గణనప్రకారము 30020 యుండగా పురుషులు 15023 స్త్రీలు 14997 కలరు. యస్. సి. జనాభా పురుషులు 2409, స్త్రీలు 2365. మొత్తము 4774 యస్. టి ల జనాభాలో పురుషులు 925, స్త్రీలు 950, మొత్తము 1875 కలరు.

ఈ మండలమున మూడు ఉన్నత పాఠశాలలు జిల్లా పరిషత్తు యాజమాన్యమున నడుపబడుచున్నవి. మండల పరిషత్తు యాజమాన్యమున 3 ప్రాథమికోన్నత పాఠశాలలు 19 ప్రాథమిక పాఠశాలలు పని చేయుచున్నవి. ఒక బాలికల పాఠశాల కూడా కలదు.

ఒక బాల్వాడీ కేంద్రము 8 అంగన్‌వాడి కేంద్రములు 12 నిరంతర విద్యా కేంద్రములు ఈ మండలమున పనిచేయు చున్నవి. పాఠశాలలన్నిటికి ప్రభుత్వ భవనములు కలవు. ఈ విద్యా కేంద్రములన్నియు మండలమునందలి బాల బాలికలలో విద్యావ్యాప్తిని కల్గించుటకు ఎనలేని కృషి చేయుచున్నవని చెప్పవచ్చును.

ఈ మండలమునందు పేద విద్యార్థులకు రెండు ఉచిత భోజన వసతి గృహములు ప్రభుత్వముచే నడుపబడుచున్నవి. బి.సి. విద్యార్థులకై కొల్చారం మరియు రంగంపేటలలో ఈ హాస్టళ్లు పని చేయుచున్నవి.

కొల్చారం మండలమునందలి ప్రజలు వ్యవసాయముపై ఆధారపడి జీవింతురు, ఈ మండలమున ఘన్‌పూర్ ఆనకట్టతో మహబూబ్‌నగర్ కాలువల ద్వారా కొంత భూమి సేద్యమగుచున్నది. ఈ మండలమునందు 29 చెరువులు 79 కుంటలు కలిగి వరి భూములకు నీరందించుచున్నవి. బావులు, గొట్టపు బావులు ఇచ్చట ఎక్కువగానేయున్నవి. వీటన్నిటి ద్వారా ఈ మండలము సస్యశ్యామలమై పైరుపంటలతో కళకళలాడుచుండును. ఇచ్చట ఎక్కువగా వరి, చెరుకు పంటలు పండింతురు, మెట్టభూములందు మక్కజొన్న, కంది, పెసర, పల్లి, ప్రొద్దుతిరుగుడు మొదలగు పంటలు పండించు చున్నారు.

ఈ మండలమునందు పేదరైతులకు భూమిలేని నిరుపేదలకు ప్రభుత్వ భూమిని, సీలింగ్ మిగులు భూములను ప్రభుత్వము పంపిణీ చేసినది. ఈ మండలమునందు 5005 ఎకరముల ప్రభుత్వభూమి యుండగా S.C. లకు 1008 మందికి 1088 ఎకరములు S.T. లకు 492 మందికి 779 ఎకరములు, B.C. లకు 2635 మందికి 2614 ఎకరములు ఇతరులు 180 మందికి 280 ఎకరములు పంపిణీ చేయబడినది. అట్లే ఈ మండలమున సీలింగ్ మిగులు భూమి ఎకరములు 191.19 గుంటలు యుండగా S.C. 87 మందికి 62 ఎకరములు, S.T. లు 27 మందికి 36 ఎకరములు, B.C. లు 62 మందికి 70 ఎకరములు, ఇతరులు 14 మందికి 9 ఎకరములు పంపిణీ చేయబడినది.

---

శ్రీ గుడాల భావనానందమ్, ప్రజ్ఞాపూర్ వారి సౌజన్యంతో

కొల్చారం మండలమునందు 16 చౌకధర దుకాణములు కలవు. తెల్లకార్డులు 3465 గులాబీ రంగు కార్డులు 1584 మొత్తము 5049 కార్డులు కలవు.

వీరందరికి ప్రభుత్వ పౌరసరఫరా ద్వారా నెల 1 కి, 630.05 క్వింటాళ్ల బియ్యము, 88.4 చెక్కర, 14890 లీటర్ల కిరోసిన్ పంపిణీ చేయబడుచున్నది.

కొల్చారం మండలమున రెండు ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు కలవు. రంగంపేటలో ఒకటి, కొల్చారంలో ఒకటి ఈ కేంద్రములున్నవి. ఈ ప్రాథమిక ఆరోగ్యములకు తగినంత భవన వసతి ప్రభుత్వముచే ఏర్పాటు చేయబడియున్నది. ఈ ఆరోగ్య కేంద్రములో కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు వారమున కొకమారు జరుగును. రోగ నివారణ టీకాలు, ప్రాథమిక ఆరోగ్యమునకు సంబంధించిన మందులు మొదలగునవి ఇచ్చటి డాక్టర్లు ఇచ్చుచున్నారు. ఈ ప్రాథమిక ఆరోగ్య కేంద్రములకు అనుబంధముగా ఉపకేంద్రములు కూడా కలవు. పల్లెలలోని ప్రజల ఆరోగ్య అవసరాలను ఇవి తీర్చుచున్నవి.

ఈ మండలమున లాల్జీపథకము ద్వారా 4లా భోక్తులకు 2000-00 (రెండు వేల రూ.) చొప్పున పంపిణీ చేయబడినవి. నితంతువులు 25 మందికి ఈ మండలమున పించన్లు పంచబడుచున్నవి. అట్లే గర్భిణీ స్త్రీ ల కిచ్చు పించన్లు ఇప్పటికి 49 పంచబడినవి. 459 వృద్ధులకు పించన్లు ఈయబడుచున్నవి.

కొల్చారం మండలమున 91 డ్వాక్రా గ్రూపులలో 1365 మంది 1228500 పొదుపు చేసి తగు రుణ సదుపాయములు పొంది స్వతంత్ర సంపాదనమును పొందుచున్నారు.

ఈ మండలమున పశు వైద్యశాల కలదు దీనికి అనుబంధముగా 3 ఉపకేంద్రములు పనిచేయుచున్నవి.

ఈ మండలమునందు పోతిరెడ్డి పల్లి, చిన్నఘనపూర్ గ్రామాలలో విద్యుత్తు సబ్ స్టేషన్లు కలవు. అవసరమైన మేరకు ట్రాన్స్‌ఫార్మర్లు కలిగి మండలమునందలి అన్ని గ్రామములకు విద్యుత్తు సరఫరా చేయబడుచున్నది.

కొల్చారం మండలమున పది రైసుమిల్లులు కలవు. ఒక చక్కర ఫ్యాక్టరీ కలదు కాని ప్రస్తుతము పని చేయుట లేదు.

ఈ మండలమునందు మండలకేంద్రమున ఒక టెలిఫోన్ ఎక్స్‌చేంజి కలిగి పరిసర గ్రామాలకు టెలిఫోన్ సౌకర్యము కల్గించుచున్నది. ఈ మండలమున 15 బ్రాంచి పోస్టాఫీసులు కలవు.

మండల కేంద్రమునందు ఒక పోలీసు స్టేషన్, ఒక సిండికేటు బ్యాంకు, ఒక నర్సరీ, ఒక గ్రంథాలయము కలదు.

---

శ్రీ కె. కేశవ రెడ్డి, శాంతినికేతన్, గజ్వేల్ వారి సౌజన్యంతో

## మండల పరిషత్ కొల్చారం పరిధిలోని సర్పంచ్‌ల వివరములు

| క్ర. సంఖ్య | పేరు | గ్రామ పంచాయతి పేరు |
|---|---|---|
| 1. | ఏ. కిష్టయ్య | కొల్చారం |
| 2. | జి. విజయలక్ష్మి | అంసాన్‌పల్లి |
| 3. | లంబాడి నర్సింగ్ | పోత్‌రెడ్డిపల్లి |
| 4. | పరుశురాంరెడ్డి | కొంగోడ్ |
| 5. | సి.హెచ్. విజయలక్ష్మి | పోతంశెట్టిపల్లి |
| 6. | భాగ్యలక్ష్మి | కిష్టాపూర్ |
| 7. | సి. విఠల్‌రెడ్డి | రాంపూర్ |
| 8. | నారాయణగౌడ్ | చిన్నఘణపూర్ |
| 9. | ఏ. లక్ష్మీనర్సింలు | వరిగుంతం |
| 10. | రుక్కమ్మ | సంగాయిపేట |
| 11. | జి. ధర్మాగౌడ్ | రంగంపేట |
| 12. | జె. సామెల్ | పైతర |
| 13. | కన్నారం భూమమ్మ | కోనాపూర్ |
| 14. | యం. పాండరి | ఏటిగడ్డమందాపూర్ |
| 15. | కె. మొగులయ్య | యెనగండ్ల |

## మండల పరిషత్ కొల్చారం పరిధిలోని యం.పి.టి.సి, జడ్.పి.టి.సి వివరములు

| క్ర. సంఖ్య | పేరు | గ్రామము |
|---|---|---|
| 1. | వై. కరుణామల్లారెడ్డి, జడ్.పి.టి.సి | పైతర |
| 2. | పి. రాంచంద్రయ్య అధ్యక్షులు, మం.సభ్యం | కొల్చారం |
| 3. | తూర్పు సిదాంగౌడ్, ఉపాధ్యక్షులు | రాంపూర్ |
| 4. | లంబాడి రూప్లా | అంసాన్‌పల్లి |
| 5. | రాంరెడ్డిగారి కాంతమ్మ | యెనగండ్ల |
| 6. | వడ్ల లక్ష్మీపతి | చిన్నఘణపూర్ |
| 7. | పండెం జయరాంలు | పైతర |
| 8. | కన్నెబోయిన రాధ | పోతంశెట్టి పల్లి |
| 9. | మనెపల్లి భూమయ్య | రంగంపేట |
| 10. | లంబాడి అమ్నియా | వరిగుంతం |
| 11. | శేఖ్ బందే అలి కో- ఆప్షన్ సభ్యులు | |

శ్రీ శ్రీనివాస్ రెడ్డి, హెచ్.ఎం., శాంతినికేతన్, గజ్వేల్ వారి సౌజన్యంతో

# కొండపాక మండలము

మెదకు జిల్లాలో కొండపాక మండలము ఒక ప్రత్యేకత కల్గినట్టిది.

1987 లో నందమూరి తారకరామారావు గారు ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రిగా యుండినపుడు. ప్రభుత్వమును ప్రజల సమీపమునకు చేర్చవలెనను మహదాశయముతో మండల వ్యవస్థను ఏర్పాటు చేసిరి. తాలుకాలను విభజించి మండలములను ఏర్పాటు చేసిరి. తాలుకాలోనున్న రెవెన్యూ, పంచాయితీరాజ్ మొదలగు కార్యాలయములన్నింటిని మండలమునకు తరలించిరి. ప్రతి మండల కేంద్రమున కనీసము ఒక ఉన్నత పాఠశాల, ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఒక పశు వైద్యశాల యుండునట్లుగా ఏర్పాట్లు గావించిరి.

సిద్దిపేట తాలుకాని విభజించగా కొండపాక, నంగునూరు, చిన్నకోడూరు, సిద్దిపేట, మండలాలు ఏర్పడినవి. కొండపాక మండలము భౌగోళిక వైశాల్యము 80,890 ఎకరములు కలదు. ఇందులో 10,643 ఎకరములు అటవీ భూమి కలదు. ఇందులో మండలమునందు వ్యవసాయోగ్యమైన భూమి 37,688 ఎకరములు. ఇందు తరిభూమి 7481 ఎకరములు ఉండగా మెట్టభూమి 29847 ఎకరములు కలదు.

కొండపాక మండలమున 29 గ్రామములు, 16 మదిరలు కలవు ఈ మండలమునందు 57,600 మంది 1991 జనాభాగణన ప్రకారం కలరు. ఈ జనాభాలో పురుషులు 28,734 స్త్రీలు 28,666 ఉన్నారు. యస్. సీ.లు 11,767 జనాభా, యస్. టీ. లు 646 జనాభా నివసించు చున్నారు.

కొండపాక మండలమున 26 గ్రామ పంచాయితీలు కలవు. కొండపాక దుద్దెడ గ్రామములు మేజర్ గ్రామ పంచాయితీలు కాగా, లక్కిన 24 మైనర్ గ్రామ పంచాయితీలు, 26 గ్రామ పంచాయితీలు, ఎన్నికైన సర్పంచులు కలరు.

కొండపాక మండలము ఏర్పాటైన తర్వాత 1987 ఏప్రిల్‌లో జరిగిన ప్రప్రథమ మండల ప్రజాపరిషత్ ఎన్నికలు ప్రజలచే ప్రత్యక్షముగా మండల ప్రజాపరిషత్ అధ్యక్షుని ఎన్నిక జరిగినది. ఈ ఎన్నికలలో శ్రీ ఎం. పోచయ్యగారు, అధ్యక్షులు గా ఎన్నికైరి. 1995 లో మండల పరిషత్తునకు రెండవ పర్యాయము ఎన్నికలు జరిగినవి. ఈ మారు పంచయతీరాజ్ యాక్టు మార్చబడినది. మండలమున ప్రాదేశిక నియోజక వర్గములు ఏర్పడినవి. కొండపాక మండలమున 16 ప్రాదేశిక నియోజిక వర్గములు ఏర్పడి ఎన్నికలు నిర్వహింపబడినవి. ఎన్నికయిన మం. ప్రా. స. సభ్యులచే అధ్యక్ష ఎన్నిక జరుపబడినది. ఈ ఎన్నికలలో కొండపాక మండలమునకు శ్రీమతి ఎల్లవ్వ గారు అధ్యక్షులుగా, శ్రీ లక్కిరెడ్డి ప్రభాకర్ రెడ్డి ఉపాధ్యక్షులుగా ఎన్నకైనారు.

**హెడ్ మాస్టర్ & స్టాఫ్,** జడ్.పి.హెచ్.ఎస్., ప్రజ్ఞాపూర్ వారి సౌజన్యంతో

ఈ మండలము నుండి జిల్లా పరిషత్ ప్రాదేశిక నియోజక వర్గసభ్యులుగా శ్రీ. ఎన్. కేశవరెడ్డి గారు ఎన్నికై, (జడ్.పి.) ఉపాధ్యక్షులుగా పదవీ బాధ్యత నిర్వహించుచున్నారు. మండల అధ్యక్ష, ఉపాధ్యక్షులు, జిల్లాపరిషత్ ఉపాధ్యక్షులుగా ఎన్నికైన ఈ నాయకులు కొండపాక మండలమును అభివృద్ధి గావించుటలో ఎనలేని కృషి గావించుచున్నారు.

కొండపాక మండలము, వ్యవసాయిక ప్రాధన్యము గల మండలము ఈమండలమునందు 100 ఎకరములకు పైగా నీరందించు చెఱువులు 24, అంతకు తక్కువగా నీరందించుకుంటలు 178 కలవు. ఈ మండలమున 77 సామూహికవ్యవసాయ బావులు కలవు. ఈ మండలమునందు రైతులు నవీన వ్యవసాయ పద్ధతులతో వ్యవసాయం చేయుచు హితోధికమైన పంటలు పండించుచున్నారు. ఇచట భూగర్భజల ఉత్పత్తి తక్కువైనప్పటికి రైతులు పంటల బాగుగానే పండింతురు. వరి, మొక్క, జొన్న, సజ్జధాన్యాలు, పొద్దుతిరుగుడు, ప్రత్తి మొదలగు పంటల్ని పండింతురు.

కొండపాక మండలమున 10 ఉన్నత పాఠశాలలు; 4 ప్రాథమికోన్నత పాఠశాలలు; 38 ప్రాథమికపాఠశాలలు, 11 నిరంతర విద్యాకేంద్రములు పనిజేయుచున్నవి. ఇక్కడి పాఠశాలలన్నింటికి చక్కని భవన వసతులు కలవు. ఈ మండలమున 10వ తరగతి తర్వాత చదువు విద్యార్థులకు ఉన్నత విద్యను అభ్యసించుటకై వసతులు లేకుండుట విచారకరము. ఇంత పెద్ద మండలమున కనీసము ఒక జూనియర్ కళాశాలనైన లేకపోవుటచే పైచదువులకై విద్యార్థులకు ఆశాభంగము కల్గుచున్నది. ఈ మండలము నందు విద్యార్థివసతి గృహములు మూడు కలవు. అందులో విద్యార్థులకు 2 విద్యార్థినులకు 1 ఏర్పాటు చేయనైనవి.

కొండపాక మండలమున మండల కేంద్రమయిన కొండపాకలో ఒకటి మరియొక్కటి దుద్దెడలో ప్రాథమిక ఆరోగ్యకేంద్రములు కలవు. ఈ ఆరోగ్యకేంద్రములలో ఇద్దరు డాక్టర్లు తగినవైద్య సిబ్బంది కలిగి ప్రజారోగ్య విషయమును శ్రద్ధవహించుచున్నారు. ఈ ఆరోగ్య కేంద్రమునకు అనుబంధముగా ఉపకేంద్రములు (ఆరోగ్య) కలవు. వీటిలో పనిచేయు ఆరోగ్య కార్యకర్తలు ముఖ్యముగా రోగనివారణ టీకాలిచ్చుట; కుటుంబ సంక్షేమ కార్యక్రమములు చూచుట, ప్రజల్లో అధిక సంతానము కలగకుండునట్లుగా; కుటుంబ సంక్షేమమును ప్రచారము చేయుచు వైద్య, ఆరోగ్య విషయములలో ప్రజలకు సేవలందించు చున్నారు.

మండలము నందు రెండు (2) పశు వైద్యశాలలు కలవు, పశువులకు టీకాలిచ్చుట, కృత్రిమ గర్భోత్పత్తి కావించుట మొదలగు కార్యక్రమములను ఇందలి వైద్యులు చేయుచున్నారు.

కొండపాక మండలమునందు (3) విద్యుత్ సబ్ స్టేషనులు కలవు.

కొండపాక మండలమున (2) ఆంధ్రాబ్యాంక్ శాఖలు (2) మంజీరా గ్రామీణ బ్యాంక్ శాఖలు పనిచేయుచున్నవి.

హెడ్ మాస్టర్ & స్టాఫ్, జడ్.పి.హెచ్.ఎస్., ప్రజ్ఞాపూర్ (బాలుర) వారి సౌజన్యంతో

ఈ బ్యాంకులు ముఖ్యముగా వ్యవసాయదారులకు పంట ఋణములను ఇతర ఋణములను అందించుచు వ్యవసాయాభివృద్ధికి తోడ్పడుచున్నవి. వ్యవసాయమునకే కాక పాడి పరిశ్రమ, పౌల్ట్రీ, మొదలగు వాటికి కూడా ఋణములందించుచున్నవి. ఈమండలమున ఆరు (6) ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘములు కలవు. ఈ సంఘములద్వారా రైతులకు పంట ఋణములు లభించుచున్నవి.

ఈ మండలము నందు 3559 ఎకరములు ప్రభుత్వ భూమి కలదు. ఇట్టి భూమి, భూమిలేని పేదలకు పంపణీ చేయబడినది. అందు S.C లు 1026 మందికి 1421 ఎకరములు, S.T లు 40 మందికి 40 ఎకరములు, B.C లు 1522 మందికి 1800 ఎకరములు, ఇతరులైన 240 మందికి 311 ఎకరములు పంపణీ చేయబడినవి. అట్లే సీలింగ్ యాక్ట్ ప్రకారం భూస్వాముల నుండి సేకరించిన మిగులుభూమి 1485 ఎకరములు, ఈ మొత్తం భూమిని భూమిలేని పేదలకు పంపిణీ చేయడం జరిగినది. ఇందు 516 మంది S.C లకు 604 ఎకరములు, 31 S.T లకు 39 ఎకరములు, 559 మంది B.C లకు 652 ఎకరములు, 102 O.C లకు 100 ఎకరములు పంపిణీ చేయబడినది.

ఈ మండలమునందు 184.34 ఎకరముల భూమిని 2865 మందికి ఇండ్ల నిర్మాణములకై కేటాయించబడినవి.

ఈ మండలమునందు 67 రక్షిత మంచినీటి సరఫరాపథకములు 208 గొట్టపు బావులు త్రాగునీరు వసతులు కల్పించుచున్నవి. ఈ మండలమున సామూహిక వ్యవసాయ బావులు నేటికి పూర్తి గావింపబడినవి S.C లవి 258; S.T లవి 7; B.C లవి 36; కలవు. ఈమండలము నందు 49 పితంతు పింఛనులు, మంజూరీ చేయబడి వరుసగా ఈయబడుచున్నవి. అట్లే నేటికి 758 మంది గర్భిణీస్త్రీలకు 3,79,000/- రూ.లు. పంపిణీ చేయబడినవి. వికలాంగులకు 10 మూడు చక్రముల సైకిళ్లు పంపిణీచేయబడినవి. 149 మందికి కంటి అద్దములు ఒసంగబడినవి. కొండపాక మండలమున ప్రజాపంపిణీ వ్యవస్థలో 10549 తెల్లకార్డులు; 3288 గులాబీకార్డుల వారికి ప్రతినెల 1824.84 క్వింటాళ్ల బియ్యము;179.63 క్వి. చక్కెర, 36235 లీ. కిరోసిన్ పంపణీచేయబడుచున్నవి.

కొండపాక మండలమున 880 మందికి వృద్ధాప్యపింఛన్లు, 350 ఇతరపింఛన్లు ఈయబడుచున్నవి. 1999 వ సంవత్సరమునాటికి 758 గర్భిణీస్త్రీలకు 3,79,000/- రూ ఆర్థిక సహాయము చేయబడినది. ఈ మండలమున 60 డ్వాక్రా గ్రూపులుండగా వారు 90,000 (తొంబది వేల రూ) పొదుపుచేసిరి.

కొండపాక మండలము చారిత్రాత్మకముగా ప్రసిద్ధిగన్న ప్రదేశము. ఇచ్చట కొండపాక గ్రామమున రుద్రేశ్వరాలయము కాకతీయులకాలమున నిర్మించబడినది. రుద్రేశ్వరాలయమను పేరు ఇచ్చుటనే నిర్మించెను.

---

శ్రీ గోపరాజు, వెంకటేశ్వర రావు దేశ్‌ముఖ్, దతార్‌పల్లి వారి సౌజన్యంతో

ఈ ఆలయము శిల్పకళా శోభితమైయున్నది. ఈ మండలమునందలి దుద్దెడ గ్రామమున గల శివాలయము అత్యంత శిల్పకళాశోభితమై చిత్రాతి చిత్రములైన చిత్రములతో అలరారుచున్నది. ఈ దేవాలయమునందు జైనమత చిహ్నములైన కొన్ని విగ్రహములు కనం దేవాలయమునందు శిలా

ఈ మండలము గ్రామమున కాకతీయు కళాత్మకమైన దేవాలయం

## సర్పంచ్‌లు జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | అంకిరెడ్డి పల్లి | సర్వశ్రీ తాళ్ళ లింగం |
| | తాళ్లపల్లి లింగం | తులసి నర్సప్ప |
| 2. | బందారం | నీల నర్సింలు |
| 3. | బండారుపల్లి | మచ్చ నర్సవ్వ |
| 4. | దుద్దెడ | వెద్దెంకుల రామస్వామి |
| 5. | ఎర్రవల్లి | అల్లం లక్ష్మీనారాయణ |
| 6. | ఏటిగడ్డ | దామరంచ ప్రతాపరెడ్డి |
| 7. | కొండపాక | అంబటి సత్యనారాయణ |
| 8. | కుకునూరుపల్లి | తూము అంజిరెడ్డి |
| 9. | కోనాయిపల్లి | పిట్ల యాదయ్య |
| 10. | ఖమ్మంపల్లి | జిర్ర నర్సయ్య |
| 11. | లకుడారం | ఎల్లు వసంత |
| 12. | మర్పడగ | యస్. పోచయ్య |
| 13. | మంగోళ్ | లగిశెట్టి శోభ |
| 14. | మాధ్‌పల్లి | శేరిపల్లి లచ్చయ్య |
| 15. | మెదినీపూర్ | సంగ యెల్లయ్య |
| 16. | వెద్దమాసాన్ పల్లి | మెట్టు లక్ష్మి |
| 17. | పల్లెపహాడ్ | కీసరి లక్ష్మి |
| 18. | సిరిసెనగండ్ల | దేవిరెడ్డి నర్సింహారెడ్డి |
| 19. | తొగుట | మంగలపల్లి బాలనర్సయు |
| 20. | తిప్పారం | గూడూరి నర్సమ్మ |
| 21. | తుక్కాపూర్ | గడీల లక్ష్మరెడ్డి |
| 22. | తిమ్మారెడ్డిపల్లి | బూర్గొజి బాలబ్రహ్మం |
| 23. | వేములఘాట్ | చిరుల పోచమ్మ |
| 24. | వెల్‌కటూరు | బత్తిసి రాములు |
| 25. | ఎల్లారెడ్డి పేట | నందారం అనసూయ |
| 26. | జప్తినాచారం | ముస్త్యాల బాలమల్లు |

శ్రీ గోపరాజు సత్యాబాయి, W/o. దతార్‌పల్లి వారి సౌజన్యంతో

## సర్పంచ్‌లు జాబితా

| | యం.పి.టి.సి. | |
|---|---|---|
| 1. | చెప్యాల చంద్రయ్య | |
| 2. | ఎల్. ప్రభాకర్ రెడ్డి | |
| 3. | పి. ఆశా గౌడ్ | |
| 4. | ఎన్. లచ్చుమ్మ | |
| 5. | టి. అంజి రెడ్డి | |
| 6. | ఎం. శ్రీనివాస్ | |
| 7. | ఎ. రంగా రెడ్డి | |
| 8. | ఎం. ఎల్లవ్వ | |
| 9. | జి. అంజయ్య | |
| 10. | బి. రామ్ చంద్రా రెడ్డి | |
| 11. | జె. జయమ్మ | |
| 12. | వి. చంద్రమ్మ | |
| 13. | ఎల్. భారతమ్మ | |
| 14. | బి. లక్ష్మి | |
| 15. | డి. చిన్న లక్ష్మారెడ్డి | |
| 16. | వై. యాదయ్య | |
| 17. | కో ఆప్టెడ్ మెంబర్ | ఖాజా మొహినుద్దీన్ |

# కొండాపూర్ మండలము

మెదకు జిల్లాలో కొండాపూర్ మండలానికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. పరిపాలన వికేంద్రీకరణలో భాగంగా సంగారెడ్డి తాలూకాలో 6 మండలాలు ఏర్పడగా అందులో కొండాపూర్ ఒకటి.

ఈ మండలము 2వ శతాబ్దంలో ఒక ముఖ్య పట్టణముగా విరాజిల్లింది. పురావస్తుశాఖ వారి త్రవ్వకాలలో ఎన్నో ప్రాచీన కళాఖండాలు బయల్పడినవి. శాతవాహనుల కాలంలో నిర్మితమైన పట్టణాలలో ఈ మండలం ఒకటి. ఈ మండలానికే తలమానికంగా పురావస్తు ప్రదర్శనశాల ఏర్పాటయింది.

ఈ మండలము వైశాల్యము 149 చ.కి.మీ. ఈ మండలములో 23 పంచాయితీలు కలవు.

ఈ మండలమునందు 1991 జనాభాలెక్కల ప్రకారం మొత్తం జనాభా 36619 అందులో పురుషులు 18705, స్త్రీలు 17914 కలరు. ఈ జనాభాలో ఎస్.టి.లు 2633, ఎస్.సి.లు 8971 కలరు.

కొండాపూర్ మండల పరిషత్ ఏర్పాటయిన తరువాత బి. మోహన్‌రెడ్డిగారు ఎన్నికైనారు. వారు 5 సంవత్సరాలు మండలాభివృద్ధికై తనవంతు కృషి చేశారు. 1994లో పంచాయితీ చట్టం మార్పుచెంది ఎం.పి.టి.సి.ల ద్వారా అధ్యక్షస్థానానికి పోటి జరుగగా జి. వసంత, జడ్.పి.టి.సి.గా బి.విజయ్‌కుమార్‌గార్లు ఎన్నికైనారు.

ఈ మండలము ఎక్కువగా వ్యవసాయాధారిత ప్రదేశము. ఈ మండలములో పండించే ప్రధాన పంటలు చెఱుకు, జొన్న, పెసర, కందులు, ప్రత్తి, మిర్చి మొదలగునవి, ప్రధాన వాణిజ్య పంట పసుపు మరియు కొద్ది మోతాదులో వరి.

ఈ మండలమునందు 28 ప్రాథమిక పాఠశాలలు, 4 మండల పరిషత్ ఆధీనంలో పని చేయుచున్నవి, 6 ఉన్నత పాఠశాలలు జిల్లా పరిషత్ యాజమాన్యంలో పని చేయుచున్నవి. మండల కేంద్రంలో ప్రభుత్వ కార్యాలయాలు పక్కా భవనములో యున్నవి.

ఈ మండలమునందు ఒక రక్షకభట నిలయము ఒక గ్రంథాలయము కలదు.

ఈ మండలమునందు 3 పశు వైద్య కేంద్రములు కలవు.

ఈ మండలములో చిన్న పెద్ద చెఱువులు కుంటలు 7 ఉన్నాయి. ఈ చెరువుల వల్ల 3820 ఎకరాల ఆయకట్టు సాగవుతున్నది.

ఈ మండలమునందు 19 చౌకధరల దుకాణాల ద్వారా 4333 తెల్లకార్డుల వారికి 2898 గులాబి రంగు కార్డుల వారికి పౌరసరఫరాల శాఖ ద్వారా చక్కెర, బియ్యం, గోధుమలు, కిరోసిన్ పంపిణీ అగుచున్నది.

ఈ మండలములో పురావస్తు శాఖ వారు ఏర్పాటు చేసిన మ్యూజియం ద్వారా పర్యాటక కేంద్రంగా అభివృద్ధి చెందుతున్నది.

---

**శ్రీ వి. గోపాల్ రెడ్డి,** ప్రిన్సిపాల్, జి.ఎం.ఆర్. జూనియర్ కాలేజ్, గజ్వేల్ వారి సౌజన్యంతో

## సర్పంచ్‌లు జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | అనంతసాగర్ | బి. మోహన్ రెడ్డి |
| 2. | గొల్లపల్లి | పద్మ |
| 3. | గారకుర్తి | కె. అంజయ్య |
| 4. | గిర్మాపూర్ | పి. ప్రమీల |
| 5. | గుంతపల్లి | పి. దుర్గమ్మ |
| 6. | హరిదాస్‌పూర్ | డి. శివరాజ్‌గౌడ్ |
| 7. | సి. కోనాపూర్ | ఎన్. దేవయ్య |
| 8. | మీరేపల్లి | వెంగలదాస ప్రభ |
| 9. | మల్కాపూర్ | జె. వెంకటమ్మ |
| 10. | మన్‌సాన్‌పల్లి | గంగమ్మ |
| 11. | మునిదేవునిపల్లి | పుష్పమ్మ |
| 12. | సైదాపూర్ | సి. మల్లాగౌడ్ |
| 13. | తోగరపల్లి | కె. జలేందర్ |
| 14. | తేర్‌పోత్ | వడ్డే ప్రభ |
| 15. | మల్లేపల్లి | సి. హెచ్. దేవయ్య |
| 16. | గోపులారం (చెర్ల) | పి. రత్నయ్య |
| 17. | గంగారం | ఎ. చంద్రయ్య |
| 18. | మారెపల్లి | ఎల్. మోతి |
| 19. | కొండాపూర్ | టి. మోహన్‌రెడ్డి |
| 20. | అలియాబాద్ | రాములమ్మ |
| 21. | దూబగుంట | ఎల్. హరిచందర్ |

డా. మెరుగు వైకుంఠం, ప్రజ్ఞాపూర్ వారి సౌజన్యంతో

ఎం.పి.టి.సి.ల జాబితా

| | గ్రామం పేరు | యం.పి.టి.సి. | |
|---|---|---|---|
| 1. | అనంత సాగర్ | పి. యాదయ్య | |
| 2. | గంగారాం | మొనియా | |
| 3. | మునిదేవునిపల్లి | విజయమ్మ | |
| 4. | కొండాపూర్ | వి. అంజన్ కుమార్ గౌడ్ | |
| 5. | తొగర్‌పల్లి | వై రాజమల్లారెడ్డి | |
| 6. | మల్లేపల్లి | హరిజన్ జోసెఫ్ | |
| 7. | తేర్‌పోల్ | విజయ | |
| 8. | మల్కాపూర్ | మల్లమ్మ | |
| 9. | మర్రెపల్లి | జి. అనంతయ్య | |
| 10. | గొల్లపల్లి | జి. వసంత | |

# కౌడిపల్లి మండలము

కౌడిపల్లి మండలము మెదకు హైద్రాబాదు వయా నర్సాపూర్ రోడ్డు పై కలదు. కౌడిపల్లి హైద్రాబాదుకు 77 కి. మీ దూరమున మెదకునకు 22 కి. మీ దూరముననున్నది.

కౌడిపల్లి మండలము యొక్క భౌగోళిక వైశాల్యము 22984 హెక్టార్లు కలదు, కౌడిపల్లి మండలమునకు తూర్పున వెల్దుర్తి మండలము, పడమట టేక్మాల్ మండలము, దక్షిణమున నర్సాపురం మండలము, ఉత్తరము కొల్చారం మండలములు ఎల్లలుగానున్నవి.

ఈ మండలమునందు 35 గ్రామములు, 14 మదిర గ్రామములు కలవు.

కౌడిపల్లి మండలము మొదట నర్సాపురం తాలూకాలో చేరి యుండెను. 1987 సంవత్సరమున ఆనాటి ముఖ్యమంత్రి నందమూరి తారకరామారావు గారి ఆలోచనా సరళి మేరకు ప్రభుత్వ పాలనమును ప్రజలకు అతి సన్నిహితముగా చేసి పరిపాలనా వికేంద్రీకరణము ఒనర్చుటకై గావించిన ప్రయత్నమే మండలముల సృష్టియని చెప్పవచ్చును. నర్సాపురం తాలూకాను జిన్నారం, హత్నూర్, శివంపేట, నర్సాపూర్, కౌడిపల్లి(5) మండలాలుగా విభజించుట జరిగినది.

కౌడిపల్లి మండలము నర్సాపూర్ శాసనసభా నియోజక వర్గమునకు సంబంధించినది. ప్రస్తుత నర్సాపురం శాసన సభ్యులు శ్రీ చిలుముల విఠల్‌రెడ్డి గారు ఈ కౌడిపల్లి గ్రామ వాస్తవ్యులు.

ఈ మండలమునకు 1987 లో జరిగిన మండల ప్రజా పరిషత్ ఎన్నికలలో లంబాడి నామ్యా నాయక్ అధ్యక్షునిగా, శ్రీ చిలుముల అశిరెడ్డి ఉపాధ్యక్షులుగా ఎన్నికై తమ పదవీకాలమున మండలాభివృద్ధికై తమవంతు కృషి సలిపినారు.

1995 లో జరిగిన మండల పరిషత్తు ఎన్నికలలో శ్రీ జి. రుద్రప్పగారు అధ్యక్షులుగా, శ్రీ చిలుముల ఆశిరెడ్డిగారు ఉపాధ్యక్షులుగా ఎన్నికై మండలమును అభివృద్ధి బాటలో నడుపుటకు కృషి సలుపుచున్నారు. ఈ మండలమున 13 మంది మండల ప్రాదేశిక సభ్యులున్నారు. ఈ మండలమునుండి జిల్లా పరిషత్ ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులుగా శ్రీమతి యల్. మాధవి ఎన్నికయి ప్రజాసేవ యొనరించుచున్నారు.

కౌడిపల్లి మండలమున 44954 మంది 1991 జనాభా గణన ప్రకారము కలరు. అందు స్త్రీలు 22779, పురుషులు 22175 కలరు. ఈ మండలమునందు పురుషులు 12181, స్త్రీలు 7736 మొత్తము 19917 మంది అక్షరాస్యులై ఉనారు, అనగా 50% లోపు మాత్రమే అక్షరాస్యత కలిగియున్నది.

---

శ్రీ నూర్ లక్ష్మయ్య గారి రామలింగం, ప్రజ్ఞాపూర్ వారి సౌజన్యంతో

కొడిపల్లి మండలమున వ్యవసాయ యోగ్యమయిన భూమి 10887 హెక్టార్లు కలదు. ఇందులో మెట్టభూమి 4262 హెక్టార్లు ఉండగా మాగాణి భూమి 6625 హెక్టార్లు కలదు. ఈ మండలమున అటవీభూమి 5432 హెక్టార్లు.

ఈ మండలమునందు మాగాణి వ్యవసాయము చెరువు, కుంటలపై కన్న ఎక్కువగా బావులు, గొట్టపు బావులపై ఆధారపడి యున్నది. ఈ మండలమున వరి, చెఱుకు, మొక్కజొన్న, వేరుశనగ, పప్పు ధాన్యములు ఎక్కువగా పండగలవు. ఈ మండలము నందు కొడిపల్లి, చిట్కూల్ గ్రామాలలో ఖండసారి చెక్కర ఫాక్టరీలు ప్రైవేటు యాజమాన్యమున నడుపబడుచున్నవి. అందుచే ఈ మండలమున చెఱుకు ఉత్పత్తి అధికముగానుండును. కొందరు చెఱుకు ఉత్పత్తి దారులు తమ వ్యవసాయ క్షేత్రములలోనే బెల్లము తయారీని చేపట్టి విజయవంతములయిన లాభములు గడించుచున్నారు.

ఈ మండలమునందు బియ్యపుమిల్లులు కూడా కలవు. వీటివలన వరిని ఉత్పత్తి కర్షకులు ఎక్కువగా ఎంచుకొనుటకు ఉత్సాహము చూపుచున్నారు.

కొడిపల్లి మండలమున వెలిమకన్నె, కొడిపల్లి, చెండూరు గ్రామాలలో జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాలలు కలవు. ఈ మండలమున 9 ప్రాథమికోన్నత పాఠశాలలు, 39 ప్రాథమిక పాఠశాలలు కలవు. ఈ పాఠశాలలు మండలములోని బాలబాలికలకు విద్యార్జన చేయుటలో తోడ్పడుచున్నవి. ఇవేకాక పాఠశాలకు రాని బాలబాలికలకు, యువతీ యువకులకు అక్షరాస్యతను కల్పించుటకై 22 నిరంతర విద్యా కేంద్రాలు రాత్రిబడులు నడుపబడుచున్నవి. స్త్రీ, శిశు, సంక్షేమమున్నకై 22 అంగన్‌వాడీ కేంద్రములు కలవు. ఈ కేంద్రములయందు పనిచేయుచున్న అంగన్‌వాడీ కార్యకర్తలు 5 సంవత్సరాల లోపలి బాలబాలికలకు విద్యపై శ్రద్ధ కలిగించుచు వారికి ఆరోగ్య విషయమున శ్రద్ధ వహింతురు. ఈ కేంద్రముల నుండి భావి విద్యార్థులు తయారగుదురు. ఈ మండలమున యస్.సి, య్స్.టి, బి.సి విద్యార్థులకై 4 విద్యార్థి వసతి గృహములు కలవు. ఈ విద్యార్థి వసతి గృహములలో సుమారు 400 మంది విద్యార్థులకు వసతి భోజనములు కల్పింపబడుచు వారి విద్యాభివృద్ధికి దోహదమగుచున్నవి.

కొడిపల్లి మండలమున 4 సబ్‌స్టేషనులు అధిక మొత్తములో ట్రాన్స్‌ఫార్మర్లు కలిగి వ్యవసాయ గృహ వ్యాపార పారిశ్రామిక సంస్థలకు సక్రమముగా విద్యుత్తు సరఫరా చేయబడుచున్నది.

ఈ మండలమున 20 సబ్ పోస్టాఫీసులు కలిగి తంతి తపాలా సౌకర్యమును కలుగ జేయుచున్నవి. అట్లే టెలిఫోన్ సౌకర్యము కూడా కలదు.

కొడిపల్లి మండల కేంద్రమున ప్రాథమిక ఆరోగ్యకేంద్రము సమస్త సదుపాయములతో విశాలమయిన స్వంత భవనముతో కలదు.

**శ్రీ దేవర నారాయణ రావు,** అంసాన్‌పల్లి వారి సౌజన్యంతో

ఈ ప్రాథమిక ఆరోగ్య కేంద్రమున ఇద్దరు లేడీ డాక్టర్లు ఒక మగ డాక్టరు 4 సూపర్‌వైజర్లు, 1 కంపౌండర్, 1 స్టాఫ్ నర్సు కలరు. ఈ ప్రాథమిక ఆరోగ్య కేంద్రమునకు అనుబంధముగా 10 ఉపకేంద్రములు పనిచేయు చున్నవి. వ్యాధి నిరోధక టీకాలనిచ్చుట, కుటుంబ సంక్షేమ ప్రచార మొనర్చుట ఆపరేషన్ చేయుట మొదలగు ఆరోగ్య కార్యక్రమములు పి.హెచ్.సి ద్వారా చేపట్టబడుచున్నవి.

ఈ ఆరోగ్య కేంద్రమునకనుబంధముగా ఉపకేంద్రములు కలిగి ఆ కేంద్రములందున్న వైద్యసిబ్బంది ఆయాగ్రామములందు రోగనిరోధక టీకాలను గర్భిణీ స్త్రీలకు తగు వైద్య సేవలను అందించుచు ప్రజలలో కుటుంబ సంక్షేమమును ప్రచారమొనర్చుచు కుటుంబ నియంత్రణ కార్యక్రమములందు పాల్గొందురు.

ఈ మండలమున 692 వృద్ధాప్య పింఛనులు 300 గర్భిణీ పింఛనులు ప్రభుత్వముచే క్రమముతప్పక ఈయబడుతున్నవి. ఈ మండలములో మహిళలకు కుట్టు మిషన్లు సబ్సిడీ పై సరఫరా చేయబడినవి. 20 (సి.ఎమ్.ఇ.వై.) గ్రూపులకు ఆర్థిక సహాయం ఒనరింపబడి యువకులలో సృజనాత్మక శక్తిని, స్వయం ఉపాధిని కల్గించుకొనుటకై వారికి స్వావలంబన ఆర్థిక వ్యవస్థను సమకూర్చుకొనుటకు ఉపయోగ పడుచున్నవి.

ఈ మండలమున కౌడిపల్లిలో ఒక పోలీస్ స్టేషన్, ఒక గ్రంథాలయము కేంద్రమయిన కౌడిపల్లిలో కలవు. ఈ మండలమున కౌడిపల్లిలో స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా మరియు మండలమున రెండు మంజీరా గ్రామీణ బ్యాంకులు కలవు. ఇవి వ్యవసాయదారులకు వ్యవసాయాభివృద్ధి కై తక్కువ వడ్డీతో ఋణ సదుపాయమును కలిగించుచు అధికోత్పత్తికి తమవంతు చేయూత నందించుచున్నవి.

కౌడిపల్లి మండలమున నిత్యావసర సరుకుల పంపిణీ వ్యవస్థలో 19 చౌకధర దుకాణములు కలవు. తెల్లరంగు కార్డులు 7503, గులాబిరంగు కార్డులు 1492 మొత్తము 8995 కార్డులకు నిత్యావసర సరుకులు పంపిణీ చేయబడుచున్నవి. ప్రతినెలా 1277.24 క్వింటాళ్ళు బియ్యము, 109.08 క్వింటాళ్ళు చక్కెర, 50 క్వింటాళ్ళ గోధుమ, 23100 లీటర్ల కిరసనాయిలు పంపిణీ చేయబడుచున్నది.

ఈ మండలము నందలి వెలిమకన్నె గ్రామము చారిత్రకముగా గొప్పనయినదని చెప్పుటకు ఆధారములు నేటికిని కనిపించుచున్నది.

వెలిమకన్నె గ్రామమునకు మదిర గ్రామమయిన 'కొట్టాల' లో కాకతీయులచే నిర్మించబడిన శివాలయం కలదు. ఆ దేవాలయము నేడు పంట పొలములలో నున్నది. ఆ దేవాలయం వెనుక భాగమున రాతి కట్టడముచే నిర్మించబడిన కోనేరు కలదు. ఆ కోనేరు మట్టితో కూరుకొని పోయినది. చుట్టూ పెద్ద వృక్షములు పెరుగటచే కోనేటి కట్టడము కూలిపోవుచున్నది.

---

శ్రీమతి లక్ష్మీనర్సమ్మ, అంసాన్‌పల్లి వారి సౌజన్యంతో

ఈ దేవాలయము నేడున్న పరిస్థితిని బట్టి ఊహించినచో నిర్మింపబడిననాడు ఒక విశాలమయిన కళాన్వితమయిన ఆలయముగా ఊహించవచ్చును. ఈ ఆలయము వీరశైవ సాంప్రదాయానుసారముగా ఉన్నది. ఆలయము నందలి నంది విగ్రహము కడు రమణీయముగానున్నది. ఈ గుడికి నేటికినీ 'తమ్మళి' వారు పూజారులుగా నున్నారు.

వెలిమకన్నె గ్రామమునందు గ్రామమున కావల వెంకటేశ్వర స్వామి దేవాలయం కలదు. ఈ ఆలయము సుమారు 200 ల సంవత్సరాల పూర్వము నిర్మింపబడిన దని అచ్చట జనులచే చెప్పబడినది. ఈ ఆలయంచుట్టూ సత్రములు నిర్మించబడియున్నవి. ఈ ఆలయమును భువనగిరి వెంకటేశ్వర ఆలయమని పిలుతురు. ఈ ఆలయమున పంచములయిన మిత్తుల అయ్యవార్లు పూజారులుగానుండుట విశేషము. జిల్లాలో అనేక దేవాలయములున్నను ఈ దేవాలయము నందు వంశపారంపర్య పూజారులుగా దళితులుండుట విశేషమని చెప్పవచ్చును.

వెలిమకన్నె గ్రామమునకు చుట్టూ కోటగోడ, గోడకావల కందకము ఉన్నట్లు నేటికీ అగుపించుచున్న శిథిలాల వలన తెలియుచున్నది. ఇచ్చట కోటగోడకానుకొని ఒక సొరంగమార్గము కలదు. ఈ మార్గము ఇక్కడి నుండి పాపన్నపేటకు కలదని చెప్పుదురు. ఈ సొరంగమార్గ ప్రవేశము కడుచక్కని ఆలోచనాత్మకమయిన నిర్మాణము వలెనున్నది. భూమిపై మొదట ఒక చిన్నని రహదారి ఆ రహదారి నుండి కొన్ని మెట్లు ఈ మెట్లు రాతిచే చుట్టూ నిర్మించబడిన ఒక బావి వరకు కలవు. ఈ బావి సుమారు 25 అడుగులు లోతు కలదు. బావి అడుగు నుండి సొరంగమార్గము కలదు. ఈ సొరంగమున ఇరువురు అశ్వికులు ఎదురెదురుగా వచ్చునంతటి విశాలముగా కలదు. నేడు ఈ ప్రాంతమంతయు చెట్లపొదలతో అగమ్యముగా నున్నది. ఇట్టి ప్రాచీన కట్టడములను భద్ర పరచుకొనుట నేటి ప్రభుత్వాల తక్షణ కర్తవ్యము కాని వీటి బాగోగుల గురించి పట్టించుకొను నాథుడు లేనట్లుగా తోచుచున్నది. ఇప్పటికయినను వీటిని సంరక్షించుకొనుట ప్రజల, ప్రభుత్వ కర్తవ్యమని చెప్పక తప్పదు.

ఈ మండలమున చెండూరు అను గ్రామము కలదు. ఆ గ్రామమున ఎత్తయిన గుట్టపై ఒక దేవాలయం కలదు ఈ దేవాలయము శిల్పకళా చాతుర్యముతో ఒప్పారుచుండును. మెదకు జిల్లాకే మకుటాయమాన మయిన మంజీరానది ఈ మండలమునకు పశ్చిమ పుటెల్లగా చిట్కూల గ్రామమునానుకొని ప్రవహించుచున్నది ఈ నదీ తీరమున గొప్ప శాక్తేయుడయిన వెంకట్రామయ్యగారు చాముండేశ్వరీ దేవాలయ నిర్మాణమును గావించిరి. అతి విశాలమయిన ప్రదేశమున ఈ దేవాలయము నిర్మించబడినది. ఈ దేవాలయములోని చాముండేశ్వరి విగ్రహం ప్రపంచంలో ఎక్కడాలేని విధంగా 18 భుజాలతో 11 అడుగుల ఎత్తున కలిగి ఉన్నది. ఈ ఆలయ గర్భగుడికి ఎదురుగా బ్రహ్మ కాళి వైష్ణవి విగ్రహాలు ప్రతిష్ఠించబడినవి.

ఈ దేవాలయముచే కౌడిపల్లి మండలము ప్రశస్తి వహించినది.

శ్రీ దేవర వాసుదేవ రావు, అంసాన్‌పల్లి వారి సౌజన్యంతో

## మండల పరిషత్తు కార్యాలయము కౌడిపల్లి సర్పంచ్‌ల జాబితా

| క్ర.సం | గ్రామము | ఎం.పి.టి.సీ |
|---|---|---|
| 1. | చండూర్ | సర్వశ్రీ పద్దగొల్ల నారాయణ |
| 2. | చిట్కుల్ | కే. నారాయణ రెడ్డి |
| 3. | చిలిపిచెడ్ | గొట్టం మల్లయ్య |
| 4. | బుజిరంపేట | చింతల దుర్గయ్య |
| 5. | సమ్మక్కపేట | కే. నందలాల్ |
| 6. | ఫైజాబాద్ | డి. విజయ కుమార్ |
| 7. | సలాబత్‌పూర్ | కే. శంకర్ |
| 8. | కూకట్‌పల్లి | బొడ నారాయణ |
| 9. | అజ్జమర్రి | బేగరి మొగులయ్య |
| 10. | బండపోత్‌గల్ | ఇంటివెనుక దుర్గయ్య |
| 11. | కౌడిపల్లి | కే. శివాంజనేయులు |
| 12. | వెల్మకన్నె | బొడ్ల భూమయ్య |
| 13. | దేవులపల్లి | కర్రె పోచయ్య |
| 14. | సదాశివపల్లి | పి. బాలకిషన్ |
| 15. | కంచన్‌పల్లి | వర్రె విఠల్ |
| 16. | ధర్మాసాగర్ | ఎల్లాగౌడ్ |
| 17. | వెంకట్రావుపేట | జి. యాదగౌడ్ |
| 18. | తిమ్మాపుర్ | సార రామాగౌడ్ |
| 19. | గంగారం | ఇ. మరియమ్మ |
| 20. | జగ్గంపేట | పట్లోల శేకమమ |
| 21. | కొట్టాల్ | గొల్ల గంగమ్మ |
| 22. | మహ్మాద్‌నగర్ | బదావత్ సామి ని |
| 23. | రాజ్‌పేట | పి. కిష్టమ్మ |
| 24. | ముట్రాజిపల్లి | వజ్జె శివ్వమ్మ |
| 25. | తునికి | తాళ్ల స్వరూప |
| 26. | రాయిలాపూర్ | కే. ఇందిరమ్మ |
| 27. | గౌతాపూర్ | బొనోత్ లాల్య |
| 28. | రాందాసుగౌడ్ | గాండ్ల నర్సింలు |

శ్రీ డి. అనంతరెడ్డి, సోలక్ పల్లి వారి సౌజన్యంతో

## మండల పరిషత్తు కార్యాలయము కౌడిపల్లి యం.టి.సి.లా జాబితా

| క్ర.సం. | గ్రామము | ఎం.పి.టి.సీ |
|---|---|---|
| 1. | కౌడిపల్లి | సర్వశ్రీ జి. రుద్రమ |
| 2. | బుజురంపేట | సర్వశ్రీ సీ.హెచ్. ఆశిరెడ్డి |
| 3 | రాయిలాపూర్ | శ్రీమతి ఆకుల కమలమ్మ |
| 4. | జగ్గంపేట | బదావత్ మాన్‌సింగ్ |
| 5. | కూకట్‌పల్లి | భాషుమియా |
| 6. | చండూర్ | యం. లింగయ్య |
| 7. | వెల్మకన్నె | సి.హెచ్. విజయరెడ్డి |
| 8. | కందనపల్లి | నాయిని సత్యం |
| 9. | సమ్మక్కపేట | కే. నామ్యా |
| 10. | మహ్మద్‌నగర్ | జాన్వాడ జనాబాయి |
| 11. | ముట్రాజుపల్లి | కే. బాలమణి |
| 12. | చిట్కూల్ | లంబాడి మాలి |
| 13. | | సయ్యద్ ఉస్సేన్ కో- ఆప్షన్ మెంబర్ |

కీ.శే. డి. రాంరెడ్డి, సోలక్‌పలి వారి సౌజన్యంతో

# మనూరు మండలం

మెదక్ జిల్లాలో పశ్చిమోత్తరమున పూర్వపు నారాయణఖేడ్ తాలుగా యందు మండల కేంద్రముగా ఏర్పాటు చేయబడినది మనూరు మండలము.

నారాయణఖేడ్ తాలుక మనూరు, నారాయణఖేడ్, కంగ్టి, కల్హేర్, అను నాలుగు మండలాలుగా అధికార వికేంద్రీకరణలో భాగంగా తేది.15-1-1987 న విభజింపబడింది. మార్చి 1987లో మండల ప్రజాపరిషత్తు తొలి ఎన్నికలు జరిగినవి. మొట్టమొదలు మండలాధ్యక్షులుగా శ్రీ జె. శంకరయ్య స్వామి మనూరు మండలమునకు ఎన్నికైనారు.

ప్రస్తుతము ఈ మండలమునకు మండలాధ్యక్షులుగా శ్రీమతి. జె. పెంటమ్మగారు ఎన్నికై కార్యనిర్వాహక బాధ్యతలు చేపట్టినారు. పంచాయత్ రాజ్ చట్టపు మార్పులకనుగుణంగా మనూరు మండలం నుండి జిల్లా పరిషత్ ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులుగా శ్రీయుత రాజలక్ష్మణ్ గారు ఈ మండలమునకు ప్రాతినిధ్యము వహించుచున్నారు.

ఈ మండలమునందు మండల ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులు 12 కలరు, మండల ఉపాధ్యక్షులుగా శ్రీ మేహన్‌రావు గారు ఎన్నికై మండలాభివృద్ధిలో తమవంతు కృషిచేయుచున్నారు.

ఈ మండలమునకు ఈ జిల్లాలోనే ఒక ప్రత్యేకత కలదు. మెదక్ జిల్లాకు ఏకైక నదియగు మంజీర ఈ జిల్లాలో మనూర్ మండలంలోనే ప్రవేశించుచున్నది.

నారాయణ ఖేడ్ నియోజక వర్గంలోని ఈ మండలం జిల్లా కేంద్రానికి దూరంగా కర్ణాటక రాష్ట్ర సరిహద్దుగా ఉండడం వల్ల కర్ణాటక రాష్ట్ర భాషా సంస్కృతులు ఇచట అధికంగా కన్పిస్తాయి. మంజీరా నది, ఈ మండలం పొడువునా పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహించినప్పటికి, ప్రధానమైన ప్రాజెక్టులేవి లేక పోవుట చేత, మండలంలోని సాగునీటికి మరియు త్రాగు నీటికి నేటికి సమస్యగానే ఉన్నది. కమలాపూర్ వద్దగల ఒక ప్రాజెక్టు మాత్రమే ప్రజల అవసరాలను స్వల్పంగా తీరుస్తున్నది.

నెదర్లాండ్స్ ప్రభుత్వ సహాయ సహకారముతో ఈ మండలంలోని బోరంచ శాపురా N.A.P గ్రామాలలో త్రాగునీటి సౌకర్యము, రోడ్ల సౌకర్యములు కల్పించబడినవి.

మండలంలోని కారముంగి, గౌడ్‌వాల్ జన్‌వాడా, శికాకు ఖాన్, మొర్గి, గ్రామాలు కర్ణాటక ముఖ్య పట్టణమైన బీదరు కు దగ్గరగా ఉండడంచేత కన్నడ భాష ఈ మండలంలో తెలుగు కన్న ఎక్కువగా వ్యాప్తిలో ఉన్నది. ఉర్దూ మాత్రము దాదాపు అందరూ మాట్లాడ గలగడం విశేషం. ఇక్కడి ప్రజలు అధిక శాతం నిరక్షరాస్యులే.

---

శ్రీ పి. యాదగిరి, జడ్.పి.హెచ్.ఎస్., జిన్నారం వారి సౌజన్యంతో

మానూరు మండల విస్తీరణము 293 చ.కి.మీ 27 గ్రామ పంచాయతీలలో 45 గ్రామాలతో పాటు 20 తండాలను కూడా కలిగి ఉన్న పెద్ద మండలమిది. మండలం యొక్క జనాభా 40,343 కాగా అందులో 6749 S.C. లు 2581 మంది S.T కలరు, పురుషులు- 20419, స్త్రీలు - 19924 మంది కలరు. మండలంలో 47,493 ఎకరాల భూమి సాగులోకి తేబడినది. సగటు వర్షపాతం 651.8 మి.మీ. వరి, గోధుమ, జొన్నలు ప్రధాన పంటలు. మండలంలోని పక్కా రోడ్ల పొడవు 128 కి.మీ. కాగా కచ్చా రోడ్ల పొడువు 27.కి.మీ. ఉండగా, 13 గ్రామాలకు బస్సు సౌకర్యము కల్పింపబడినది.

మనూరు మండల పరిషత్తు పరిధిలో మొత్తము 44 పాఠశాలలు కలవు. వీటిలో మనూరు లో తెలుగు మీడియం లో S.S.C వరకు. కారముంగిలో కన్నడ మీడియం లో 9 వ తరగతి వరకు బోరంచలో తెలుగు మీడియంలో 9 వ తరగతి వరకు గల మూడు ఉన్నత పాఠశాలలు మరియు తెలుగు మీడియంలో 5 ప్రాథమికోన్నత పాఠశాలలు ఉండగా, ప్రాథమిక పాఠశాలలు 35 కలవు. 5 నిరంతర విద్యా కేంద్రాలు కూడా మండలంలో విద్యావ్యాప్తికి కృషి చేయుచున్నవి. మండలం విద్యాధి కారిగా శ్రీ వాసుదేవ రావు విధులు నిర్వహించుచున్నారు. S.C విద్యార్థుల కొరకై ఒక వసతి గృహం కూడా నిర్వహింపబడుచున్నది. మండల మందు ఒక గ్రంథాలయం కూడా కలదు.

మండలంలోని ప్రజలకు వైద్య సేవలు అందించేందుకై ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రము తో పాటు 1.మనూరు, 2.బెల్లాపూర్, 3. పులుకుర్తి 4. రాయిపల్లి 5. కరస్‌గుత్తి, 6. కారాముంగి, 7. శేరిదామరగిడ్డ, 8. డోవ్వూరు లలో మొత్తము 8 ఉపకేంద్రాలు పని చేయుచున్నవి. ఒక వైద్యాధికారి వీటి పర్యవేక్షణ గావించు చున్నాడు.

మండలంలో - 6875 ఆవులు, 5563 బఱ్ఱెలు, 12395 గొఱ్ఱెలు తో పాటు 13920 కోళ్లు ఉన్నాయి. వీటి సంరక్షణ నిమిత్తమై రెండు పశు పర్యవేక్షణ కేంద్రములు బోరంచ, మనూరులలో నాలుగు పశు సంవర్థక (ఆర్.ఎల్.ఐ.ఎస్) కేంద్రాలు బెల్లాపూర్, కరస గుత్తి, మొర్గి, తోర్నాల్ లలో పని చేయుచున్నవి.

ముక్తాపూర్, బోరంచ గ్రామాలలో నిర్మింపబడిన రెండు విద్యుత్ సబ్‌స్టేషన్లతోనూ, 57 ట్రాన్స్‌ఫార్మర్లతోనూ మండలంలోని గ్రామాలకు విద్యుత్ సౌకర్యము కల్పింప బడినది. విద్యుత్ సహాయంతో ప్రస్తుతం 987 వ్యవసాయ పంపుసెట్లు పని చేయుచున్నది.

మండలంలోని 17 గ్రామాలలో ఉన్న తపాలాశాఖలు మండల కేంద్రమైన మనూరులో ఉన్న టెలిఫోన్ ఎక్స్చేంజ్ మండల ప్రజలకు కమ్యూనికేషన్ సౌకర్యాలు అందుబాటులోకి తెస్తున్నాయి.

---

**శ్రీమతి శారదా యాదగిరి, జిన్నారం వారి సౌజన్యంతో**

మండలంలోని ఒకే ఒక్క బ్యాంకు అయిన గ్రామీణ బ్యాంకు మండల ప్రజలకు తన సేవలు అందించు చున్నది. మండలము నందు ప్రస్తుతం 57 డ్వాక్రా గ్రూపులు 10 సెల్ఫ్‌హెల్ప గ్రూపులు. ఒక్కొక్క గ్రూపుకు 15 మంది సభ్యుల చొప్పున పని చేయుచున్నది. ఇంత వరకు డ్వాక్రా గ్రూపులు 3,07,000 రూ.సెల్ఫ్‌హెల్ప్ గ్రూపులు ముప్ప వేల రూపాయలు మొత్తమును పొదుపు చేసి అభివృద్ధి పథంలో పయనిస్తున్నది.

మండలంనందు గల రెండు సింగిల్ విండోలలో మనూరు సింగిల్‌విడోకు బి.నర్సింహ్మారెడ్డి, కరస్‌గుత్తి, సింగిల్ విండోకు హనువండ్లు అధ్యక్షులుగా తన సేవలు అందించుచున్నారు.

మనూరు మండల పరిషత్తునందు 661 వృద్ధాప్య ఫించనులు, 439 గర్భిణీ ఫించనులు కూడా అర్హులైన వారికి అందింపబడుచున్నవి.

మండలంలోని బోరంచ గ్రామంలో నెలకొనియున్న నల్ల పోచమ్మమ దేవాలయము ప్రసిద్ధి గాంచినది. ఇచట ప్రతీ సంవత్సరం వైశాఖ మాసంలో ప్రతీ గురువారం జాతర నిర్వహింప బడుచున్నది. మహారాష్ట్ర, కర్ణాటక, రాష్ట్రలలోని భక్తులతో పాటు రాష్ట్రంలోని నలుమూలల నుండి వచ్చిన భక్తులు ఈ ఉత్సవాలలో పాలు పంచుకుంటారు.

---

శ్రీ కె. **భిక్షపతి రెడ్డి**, గుమ్మడిదల వారి సౌజన్యంతో

## యం.పి.టి.సి.ల జాబితా

| | గ్రామం పేరు | యం.పి.టి.సి. |
|---|---|---|
| 1. | ఎస్గేయి | గీతమ్మ |
| 2. | ఔదత్ పూర్ | ప్రమీలబాయి |
| 3. | బోరంచ | అడివయ్య |
| 4. | బెల్లాపూర్ | సంగారెడ్డి |
| 5. | మనూర్ | మోహన్ రావు |
| 6. | వాల్తుర్ | అంజిరెడ్డి |
| 7. | దామర గిద్ద | ఉత్తమ్ రావ్ |
| 8. | మార్గి | లక్ష్మి |
| 9. | రాయిపల్లి | దామోదర్ |
| 10. | శల్గిర | పెంటమ్మ |
| 11. | మాయికోడ్ | ఉమాకాంత్ |
| 12. | ఏరాడ్లపల్లి | శంకర్ |

## సర్పంచ్‌ల జాబితా

| | గ్రామం పేరు. | యం.పి.టి.సి. |
|---|---|---|
| 1. | తుమ్మనూర్ | నిర్మలాబాయి |
| 2. | అత్మ్యాల్ | శ్రీమతి రామవ్వ |
| 3. | ఔదాత్‌పూర్ | శ్రీ శంకరప్ప |
| 4. | ఎన్గోయి | మహాదేవి |
| 5. | బోరంచ | బోగిరెడ్డి |
| 6. | బదన్‌గావ్ | గల్గొండ |
| 7. | బెల్లాపూర్ | ఏ. లక్ష్మారెడ్డి |
| 8. | దేవ్‌నూర్ | నాగయ్య |
| 9. | దామరగిద్ద | రామచందర్ |
| 10. | దూద్‌గొండ | బాబుగొండ |
| 11. | ఎర్కాపల్లి | తిమ్మాబాయి |
| 12. | తిమ్మాపూర్ | నిర్మలాబాయి |
| 13. | ధనవార్ | శ్యామయ్య |
| 14. | గూడూరు | బి. మాణిక్ రెడ్డి |
| 15. | కరసగుత్తి | విమలాదేవి |
| 16. | ఎలగోయి | నమదేవరావు |
| 17. | కారాముంగి | గాలమ్మ |
| 18. | యెంకపల్లి | రామవ్వ |
| 19. | మనూర్ | సి. అంజయ్య |
| 20. | మాయకోడ్ | మల్లప్ప |
| 21. | మావీన్‌హల్లీ | జ్యోతిబాబు |
| 22. | గొండేగావ్ | తేజమ్మ |
| 23. | హుకురానా | కాశీనాథరావు |
| 24. | నాగల్‌గిద్ద | అర్జున్ |
| 25. | పుల్‌పుర్తి | వెద్యనాథ్ |
| 26. | రాయేపల్ల | ఎన్. భూమయ్య |
| 27. | శాలిగిర | మాణిక్యమ్మ |
| 28. | తోర్నాల్ | పి. జగదేవి |

**శ్రీ బి. లక్ష్మీనారాయణ, నర్సాపూర్ వారి సౌజన్యంతో**

# మెదకు మండలము

మెదకు జిల్లా పేరుతో గలిగిన మండలము మెదకు మండలము. మెదకు జిల్లాలోని రెవెన్యూ డివిజన్లలో ఒకటి మెదకులో ఉంది. అంతేగాక మెదకు తాలూకా కేంద్రమైయుండేది.

ఒకనాడు గుల్షనాబాదు సూబాకు కేంద్ర స్థానంగానున్న మెదకునేడొక మండలమునకు కేంద్రము. మెదకును కొంతకాలం రాచవీడుగా పిలిచినట్లు చరిత్రాధారము కలదు.

మెదకు మండలము ఇన్ని ప్రశస్తులతో కూడినది.

ఈ మెదకు మండలము భౌగోళికవైశాల్యము 79,839 ఎకరములు కలిగియున్నది. ఈ మండలమున 57 గ్రామములు, 35 గ్రామ పంచాయతీలు కలవు.

మెదకు స్థానికముగా నగర పంచాయితి కలదు.

మెదకు పట్టణమునందు 1991 జనాభా గణన ప్రకారము 35,775 మంది, మెదకు మండలమున 58,283 మంది నివసించుచున్నారు. ఈ జనాభాలో ఎస్.సిలు - పురుషులు 6516, స్త్రీలు 5876, మొత్తము 13392. ఎస్.టి.లు - పురుషులు 2519, స్త్రీలు 2512, మొత్తము 5031. ఇతరులు - పురుషులు 37719, స్త్రీలు 37916, మొత్తము 75,635. మొత్తం జనాభాలో పురుషులు 46754, స్త్రీలు 47304, మొత్తము 94058 మంది జీవిస్తున్నారు.

ఈ మండలము ఏర్పాటైన తర్వాత మండల ప్రజాపరిషత్తునకు ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికలలో శ్రీమతి రాజ్యలక్ష్మిగారు ఎన్నికై ఐదు సంవత్సరములు ప్రజా సేవ యొనరించినారు.

ఆ తర్వాత రెండవ మారు పంచాయతిరాజ్ చట్టమున వచ్చిన మార్పులచే (ఎం.పి.టి.సి) మండల ప్రాదేశిక నియోజక వర్గములు ఏర్పడినవి. వీటి ద్వారా ఎన్నికైన యం.పి.టి.సి. ల నుండి మండల పరిషత్తునకు అధ్యక్షులుగా శ్రీ పుట్టివీరేశంగారు ఎన్నికైనారు. వీరు తన పదవీకాలమున మండలాభివృద్ధికై తగు కృషి సల్పినారు.

ఈ మండలమునందలి ప్రజలు వ్యవసాయముపై ఆధార పడి జీవింతురు. ఈ మండలమునందు తరి భూమి 15,419 ఎకరములు, మెట్టభూమి 26,698 ఎకరములు కలదు. ఈ మెదకు మండలమునకు మహబూబ్‌నహర్ ప్రాజెక్టు కాలువల ద్వారా తరి సేద్యము జరుగుచున్నది. ఎన్నో చెరువులు, కుంటలు, బావులు సేద్యమునకుపయోగ పడుచున్నవి. బోర్ బావులచే ఈ మధ్యకాలమున అనేక మెట్టభూములు తరి భూమిగా మార్చబడి అధిక దిగుబడుల నందించుచున్నవి.

---

**శ్రీ సిద్ధిరాంరెడ్డి, బొంతపల్లి వారి సౌజన్యంతో**

ఇచ్చట వరి, చెరుకు ప్రధాన పంటలని చెప్పవచ్చును. నిజాం షుగర్ ఫ్యాక్టరీ మంబోజిపల్లిలో నుండుటచే చెరుకు ఉత్పత్తి ఈ ప్రాంతమున అధికమైనది.

మెదకు మండలమున విద్యాభివృద్ధికి అనువైన వాతావరణం కలదని చెప్పవచ్చును. ఈ మండలమున 56 ప్రాథమిక పాఠశాలలు, 11 ప్రాథమికోన్నత కళాశాలలు, 8 ఉన్నత పాఠశాలలు, 2 జూనియర్ కళాశాలలు, 1 పాలిటెక్నిక్ బాలికల కళాశాల, 1 ప్రభుత్వ డిగ్రీ కాలేజి. 1 పి.జి. సెంటర్, 1 బాలికల ఆవాస విద్యాలయము, 1 డైట్ సెంటర్ ప్రభుత్వ పరముగా నడుపబడుచున్నవి.

ఇవేగాక అనేకమైన ప్రాథమిక పాఠశాలలు 4 ఉన్నత పాఠశాలలు, 3 జూనియర్ కళాశాలలు ప్రైవేట్ యాజమాన్యమున నడుపబడుచున్నవి.

ఈ మండలమునందు విద్యార్థులకై ప్రభుత్వ వసతి గృహములు కలవు. ఎస్.సి విద్యార్థినీ విద్యార్థులకు 1+1(2), ఎస్.టి.లకు 1, బి.సి.లకు 3 నడుపబడుచున్నవి.

మెదకులో వందపడకల ప్రభుత్వ వైద్యాలయము కలదు. సర్దైన గ్రామంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రము, మెదకు, సర్దైనలలో ఆయుర్వేద దవాఖానాలు గలవు. ఇవేగాక ఇచ్చట ఉన్నత వద్యావంతులైన డాక్టర్లచే నడుపబడు ప్రైవేటు నర్సింగ్ హోంలు కూడా కలవు.

మెదకు మండలమున ప్రభుత్వ భూమి 106 ఎస్.సి.లకు 147.25 ఎకరములు, 111 ఎస్.టి.లకు 138.07, 371 బి.సి.లకు 359.16, 96 ఓ.సి.లకు 75.09 ఎకరములు, మొత్తమును 764 మందికి 720.15 ఎకరములు అసైన్ చేయబడినది.

మెదకు పట్టణమున 214 ఎస్.సి.లకు 1147, ఎస్.టి.లకు 781, 123 బి.సి.లకు 2026, 82 ఓ.సి.లకు 663, మొత్తము 419 మందికి 4617 ఇండ్ల స్థలములకై పట్టాలీయబడినవి.

ఈ మండలమున డ్వాక్రా గ్రూపులు 142, సి.ఎం.ఇ.వై గ్రూపులు 18 చక్కగా పని చేయుచున్నవి.

మెదకు మండలమున అత్యవసర సరకుల ప్రభుత్వ పంపిణిలో 15095 తెల్లకార్డులు 8794 గులాబి కార్డుల ద్వారా ప్రతి నెల బియ్యం 2662 క్వింటాళ్లు, చెక్కర 426 క్వింటాళ్లు, కిరోసిన్ 87235 లీటర్లు సరఫరా చేయబడుచున్నవి.

ఈ మండలమున వృద్ధాప్య పింఛన్లు 1615, వితంతు పింఛన్లు 134 అందించబడుచున్నవి.

మెదకులో ఒక గ్రంథాలయము, క్రీడా ప్రాంగణము, చిల్డ్రన్స్ పార్కు, సినిమా థియేటర్లు ఇచ్చట ప్రజల మానసికోల్లాసమునకు తోడ్పడుచున్నవి.

మెదకులోగల కోట, చర్చి, రామాలయములు కూచన్‌పల్లిలోని శ్రీ వెంకటేశ్వరాలయము, మంత్రాయి కోటలోని ఈశ్వరాలయము ఈ మండలమున ప్రసిద్ధ క్షేత్రములు.

శ్రీ పి. రత్నమాల, గుమ్మడిదల వారి సౌజన్యంతో

## మెదకు మండల సర్పంచుల పేర్లు – పంచాయితీలు

| క్ర.సం. | గ్రామము పేరు | సర్పంచ్ పేరు | యం.పి.టి.సి పేరు |
|---|---|---|---|
| 1. | పెరూర్ | ఎ. సత్యమ్మ | |
| 2. | మాచారం | యూ. రాజేశ్వరి | |
| 3. | ర్యాలమడుగు | సత్యనారాయణ | సాంబశివరావు |
| 4. | మంబోజిపల్లి | ఎన్. బాలయ్య | |
| 5. | చిట్యాల్ | లంబాడి ఇస్ర | శ్రీమతి సురలీ |
| 6. | తిమ్మానగర్ | నారాయణ | |
| 7. | మక్తాభూపతిపూర్ | యాదమ్మ | శ్రీమతి ఎస్. లక్ష్మి |
| 8. | శివ్వాయపల్లి | సిద్దయ్య | |
| 9. | వెంకటాపూర్ | ఎం. కొండయ్య | పి. బాలయ్య |
| 10. | ఖాజిపల్లి | రంగయ్య | |
| 11. | రాజిపల్లి | శ్రీమతి ఎం. నిర్మల | శ్రీమతి భూమవ్వ |
| 12. | జక్కన్నపేట్ | సి.హెచ్. సత్యనారాయణ | |
| 13. | బి.భూపతి | పి. బాలమ్మ | |
| 14. | నాగాపూర్ | హెచ్. సిద్దయ్య | |
| 15. | తొగిట | మతి కె. లక్ష్మి | కె. మానిక్ రెడ్డి |
| 16. | సర్దెనా | రామ్‌రెడ్డి | పి నర్సమ్మ |
| 17. | ఫరీద్‌పూర్ | పోచమ్మ | |
| 18. | ముత్తాయిపల్లి | వెంకటి | శ్రీమతి కె. నర్సమ్మ |
| 19. | కూచన్‌పల్లి | రాంచంద్రారెడ్డి | శ్రీమతి ఎస్. లక్ష్మి |
| 20. | మద్దుల్‌వాయి | జి. సత్యమ్మ | శ్రీ పి. సునిత |
| 21. | కొత్తపల్లి | రాంరెడ్డి | |
| 22. | రాజిపేట్ | సి.హెచ్. నాగేశ్వర్ రావు | ఎస్.ఎమ్. సాయిలు |
| 23. | వాడి | ఇ. విజయలక్ష్మి | |
| 24. | బూర్గుపల్లి | ఎల్. కిష్టయ్య | కె. సిద్దిరాములు |
| 25. | హవెలిలింగాపూర్ | ఎమ్. అంజమ్మ | వై రఘువీర్ |
| 26. | యాతోల్ | విట్టల్ | |
| 27. | వి. తిమ్మాయపల్లి | ప్రభాకర్ రెడ్డి | వై. కిషన్ రెడ్డి |
| 28. | లింగసాన్‌పల్లి | ఎల్. కోమ్మి | |
| 29. | మక్దూంపూర్ | ఎమ్. దుర్గయ్య | |
| 30. | గంగాపూర్ | సంజీవయ్య | పి. సిద్దిరాములు |
| 31. | శమ్మాపూర్ | పోచయ్య | |
| 32. | రాయన్‌పల్లి | నాగభూషనమ్ | |
| 33. | పాతూర్ | సిద్దవ్వ | |
| 34. | ఔసులపల్లి | విశ్వమ్ | |
| 35. | ఔరంగాబాద్ | ఎల్. భద్య | |

శ్రీ పి. భూపతిరావు, గుమ్మడిదల వారి సౌజన్యంతో

# మిర్‌దొడ్డి మండలము

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వము 1987లో జరిపిన పరిపాలనా వికేంద్రీకరణలో తాలూకాలస్థానమున మండలము లేర్పడినవి. రెవెన్యూశాఖలో మండల రెవెన్యు కార్యాలయము, పంచాయతీ రాజ్‌శాఖలో మండల ప్రజా పరిషత్తు కార్యాలయములు ఏర్పాటైనవి. పంచాయతి సమితులు విభజింపగా నేర్పడినవే మండల ప్రజా పరిషత్తు.

ప్రతిమండల కేంద్రమున కనీసము ఒక ఉన్నత పాఠశాల, పోలీస్ స్టేషన్, ప్రాథమిక ఆరోగ్యకేంద్రము, పశువైద్యశాల, ఒక బ్యాంకు ఉండునట్లు ఏర్పాటు చేయబడినవి.

దుబ్బాక తాలూకా ను విభజించగా దుబ్బాక్, మిర్ దొడ్డి మండలము లేర్పాటైనవి.

మిర్‌దొడ్డి మండలము 24 గ్రామములు 8 మదిరల తో ఏర్పాటైనది.

ఈ మండలము భూవైశాల్యము 21,469.24 హెక్టార్లు కలదు. ఈ మండలమునకు తూర్పున సిద్దిపేట, కొండపాక, మండలములు, దక్షిణమున దౌలతాబాదు మండలములు, పడమర రామాయంపేట మండలము, ఉత్తరమున దుబ్బాక మండలములు కలవు.

మిర్‌దొడ్డి మండలమున 8885 కుటుంబములు కలవు. ఈ మండలజనాభా 46,924 అందు పురుషులు 23,405, స్త్రీలు 23,519 కలరు. ఈ జనాభాలో S.C. లు పురుషులు 4,912, స్త్రీలు 4842 మొత్తము 9754 కలరు. S.T. లు ఈ మండలమున చాలా తక్కువ పురుషులు 243 స్త్రీలు 251 మొత్తము 494 మాత్రమే కలరు.

ఈ మండలమునందు 24 గ్రామ పంచాయితీలు కలవు ఇచ్చట ప్రతి గ్రామము స్వంత గ్రామ పంచాయితి కలిగియున్నది.

ఈ మండలము నందలి ప్రజలు ముఖ్యముగా వ్యవసాయముపై ఆధారపడి జీవింతురు. ఇక్కడి సాధారణ వర్ష పాతము 760 సె. మీ. ఈ ప్రాంతమున భూగర్భజల సంపద తక్కువయని చెప్ప వచ్చును. ఈ మండలమునందు చెరువులు 22 కుంటలు 189 కలవు. 332 బావులు, గొట్టపు బావులు కలవు ఈ బావులన్నింటికి విద్యుత్ సరఫరా కల్పించబడినది.

ఈ మండలమునందు తరిభూమికన్న మెట్టభూమి యే అధికము. వర్షాధార పంటలే ఇచ్చట ఎక్కువగా పండించబడును. వరి, చెరుకు మొదలకు పంటలు నీటి వసతి స్వంతము గా గలినవారే పండింతురు.

---

వివేకానంద హై స్కూల్, గుమ్మడిదల వారి సౌజన్యంతో

వర్షాలు బాగా కురిసిన చెరువులు నిండినచో తరిభూములలో వరి పండును. ఇచ్చట ముఖ్యముగా మెట్ట పంటలైన జొన్న, మొక్కజొన్న, కంది, మొదలగునవి ఎక్కువగా పండింపబడుచున్నవి.

ఈ మండలమును ప్రభుత్వ భూమి ఎ.7383.34 గుంటలుండగా దానిని S.C. లకు 2842 మందికి ఎ.2567.32 గుంటలు S.T. లకు 83 మందికి ఎ.88.27 గుంటలు B.C. లకు 3782 మందికి ఎ.3856.34 గుంటలు, O.C. లకు 669 మందికి ఎ. 870.21 గుంటలు మొత్తము 7376 ఎకరములు పంపిణీ చేయనైనది.

ఈ మండలమునందు సీలింగ్ యాక్ట్ ప్రకారము పెద్ద భూస్వాములు వదిలిన భూమి హెక్టార్లు 923.59 యుండగా అందు 919.94 హెక్టార్లు భూమి పంపిణీ చేయబడినది. S.C. లకు 298 మందికి 302.01 హె. S.T. లకు 62 మందికి 39.37 హె. B.C. లకు 397 మందికి 551.05 హె. O.C. లకు 31 మందికి 27.51 నేటికి పంచబడి పట్టా సర్టిఫికెట్లు ఈయబడినవి.

మిర్‌దొడ్డి మండలము ఏర్పడిన తర్వాత మండల ప్రజాపరిషత్తునకు ఎన్నికలు జరిగినవి ఈ ఎన్నిక మండలాధ్యక్ష పదివికి ప్రత్యక్షముగా జరిగినవి.

మిర్‌దొడ్డి మండలమున 9 ఉన్నత పాఠశాలలు, 8 ప్రాథమికోన్నత పాఠశాలలు, 32 ప్రాథమిక పాఠశాలలు పనిచేయుచున్నవి. 5 బాల్వాడీ కేంద్రములు 16 నిరంతర విద్యా కేంద్రములు పని చేయుచున్నవి. ఈ మండలమున విద్యాభివృద్ధిశాతము ఇప్పుడిప్పుడే పెరుగుచున్నది. నేటికి ఈ మండలమున అక్షరాస్యులు పురుషులలో 7155, స్త్రీలలో 1991 మొత్తము 9146 మాత్రమే కలరు. ఈ మండలమునందు 1. S.C, 1 B.C, విద్యార్థులకై విద్యార్థి వసతిగృహములు కలవు. మిర్‌దొడ్డి మండల కేంద్రమునందు ఆంధ్ర బ్యాంకు, ఖాజాపూర్ గ్రామమున మంజీరా గ్రామీణ బ్యాంకులు కలవు. ఇవి ముఖ్యముగా వ్యవసాయ దారులకు తక్కువ వడ్డీలకు ఋణ సౌకర్యమును కల్పించుచు వ్యవసాయాభివృద్ధికి తోడ్పడుచున్నవి. వ్యవసాయము నకే గాక చిన్న, పెద్ద వ్యాపారములకు కూడా ఋణ సౌకర్యము కల్పించుచున్నవి.

ఈ మండలమున ఐదు ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘములు కలవు. ఈ సంఘములు ముఖ్యముగా రైతులకు పంటరుణాలను, దీర్ఘకాలిక వ్యవసాయ రుణాలను ఇచ్చుచున్నవి.

ఈ మధ్యకాలమున మిర్‌దొడ్డి మండలమున అనేక రహదారులు క్రొత్తగా వేయబడినవి. ఈనాడు ఈ మండలమున 23 గ్రామములకు బస్సు సౌకర్యము కలదనిన ఇచ్చటి రహదారుల అభివృద్ధిని గూర్చి విశేషముగా చెప్పుకొన వచ్చును.

ఈ మండలమునందు 15 గ్రామాలలో తపాలా సౌకర్యము 5 గ్రామాలకు టెలిఫోన్ సౌకర్యము కలదు.

శ్రీ సి.హెచ్. మహిపాల్ రెడ్డి, గుమ్మడిదల

మిర్దొడ్డి మండలమున 32 రక్షిత మంచినీటి భండాగారవములున్నవి. 99 బావులు, 173 బోర్‌బావులు ఈ మండలమునందలి దాహార్తులకు మంచి నీరందించుచున్నవి.

ఈ మండలము ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు(2) కలవు. ఈ ఆరోగ్య కేంద్రమున ఇద్దరు డాక్టర్లు తదితర వైద్య సిబ్బంది మండల ప్రజలకు ఆరోగ్యసేవల నందించుచున్నారు. ఈ ఆరోగ్య కేంద్రమునకు అనుబంధముగా ఉపకేంద్రములుండి వాటి ద్వారా మండల ప్రజలకు రోగ నిరోధక టీకాలు, స్త్రీ, శిశు సంరక్షణలు జరుపబడుచున్నవి. కుటుంబ సంక్షేమ ఆపరేషన్లు ఈ ప్రాథమిక ఆరోగ్య కేంద్రములో చక్కగా చేయబడుచున్నవి. ఈ మండలమునందు ఒక యూనాని దవాఖాన కూడా కలదు.

మండల కేంద్రమైన మిర్దొడ్డి లో పశు సంరక్షణకై పశువైద్యశాల ఒకటి ఏర్పాటు చేయనైనది. దీనికి అనుబంధముగా ఉప కేంద్రములు పనిచేయుచున్నవి.

ఈ మండలమునందు 4 రైసుమిల్లులు కలవు. మిర్దొడ్డి మండలమున వితంతు పింఛనులు 55 ప్రభుత్వము ద్వారా పంపిణీ చేయబడుచున్నవి ఇచ్చట లాల్జీ స్కీం ద్వారా 227 మందికి జీవిత భీమా భద్రత కల్పించబడినది.

---

శ్రీ పి. వెంకటేశం గుప్త, జిన్నారం వారి సౌజన్యంతో

## మిర్‌దొడ్డి మండల సర్పంచులు

| క్ర.సం. | సర్పంచు పేరు | గ్రామము |
|---|---|---|
| 1. | బి. ఎదుల్లా | ఖాజీపూర్ |
| 2. | యన్. శకుంతల | మోతె |
| 3. | చాంద్‌పాష | వీరారెడ్డి పల్లి |
| 4. | టి. రామస్వామి | కాసులాబాద్ |
| 5. | పి. లక్ష్మణ్‌గౌడ్ | వెంకట్రావుపేట |
| 6. | ఎమ్.డి. గఫూర్ | గుడికందుల |
| 7. | బి. బాగయ్య | భూంపల్లి |
| 8. | ఎ. కనకారెడ్డి | లక్ష్మీనగర్ |
| 9. | ఎన్. లింగం | చందాపూర్ |
| 10. | జి. నర్సింలు | అల్వాల |
| 11. | వి. కిష్టయ్య | మిరుదొడ్డి |
| 12. | బి. నాగయ్య | చెప్యాల |
| 13. | కె. భూలక్ష్మి | రుద్రారం |
| 14. | ఎన్. పెద్దలచ్చాగౌడ్ | మల్లుపల్లి |
| 15. | కె. బాల్‌లక్ష్మి | లింగాపూర్ |
| 16. | కె. లక్ష్మి | జప్తిలింగారెడ్డిపల్లి |
| 17. | వి. నర్సాగౌడ్ | అక్బర్‌పేట |
| 18. | కె. నర్సయ్య | ధర్మారము |
| 19. | జి. జయప్రద | కొండాపూర్ |
| 20. | ఎమ్. సత్తయ్య | గొవర్ధనగిరి |
| 21. | జె. ఆనందం | అందె |
| 22. | సి.హెచ్. మల్లయ్య | కాన్గల్ |
| 23. | అంజయ్య | అంగంపేట |
| 24. | అబ్దుల్ బీ | జంగపల్లి |

డా. ఎ. కిషన్ రావు, పటాన్‌చెరు వారి సౌజన్యంతో

## మండల ప్రాదేశిక సభ్యుల వివరములు – మిరుదొడ్డి మండలము

| క్ర.సం. | ఎం.పి.టి.సి పేరు | గ్రామము |
|---|---|---|
| 1. | బొారెంయాదయ్య | మోలె, ధర్మారం, కాసులాబాద్ |
| 2. | వడ్ల నర్సింహ్మాచారి | అల్వాల, మల్లుపల్లి |
| 3. | చిట్యాల జయశ్రీ | రుద్రారం |
| 4. | కంచం రాములు | జంగపల్లి, వీరారెడ్డిపల్లి, అల్మాన్‌పూర్ |
| 5. | చుక్క భూదమ్మ | భూంపల్లి, అక్బర్‌పేట, కూడవెల్లి బేగంపేట, గుర్రాలపల్లి. |
| 6. | ఖాళీ | మిరుదొడ్డి I, లక్ష్మీనగర్, ఆరెపల్లి |
| 7. | నేరండ్ల సులోచన | మిరుదొడ్డి - II |
| 8. | కాలుగూరి యాదగౌడ్ | జప్తలింగారెడ్డి పల్లి, అంగంపేట, లింగాపూర్, బంజరుపల్లి |
| 9. | కట్టరాజయ్య | చెప్యాల, లింగుపల్లి |
| 10. | కె. రాంచంద్రారెడ్డి | వెంకట్రావుపేట, చందాపూర్ |
| 11. | అంకం రాజమౌళి | గుడికందుల, కొండాపూర్, గోవర్ధనగిరి వరదరాజుపల్లి |
| 12. | జక్కిరెడ్డి ఇందిరమ్మ | అందె, కాన్గల్ |
| 13. | కర్రె అరుణ | ఖాజీపూర్ |

శ్రీ ఎ. సత్యానంద ప్రసాద్, కూకట్‌పల్లి వారి సౌజన్యంతో

# ములుగు మండలము

మెదకు జిల్లాలో ములుగు మండలము గజ్వేల్ తాలూకా నుండి ఏర్పడినది. ఈ మండలము రంగారెడ్డి జిల్లా సరిహద్దు ప్రాంతము.

ములుగు మండలము వైశాల్యము 17,697.14 చ.కి.మీ.

ఈ మండలమున 1991 జనాభా గణన ప్రకారము 6637 నివాస గృహములు కలవు. ఇచ్చట జనాభా మొత్తము 35823.

ములుగు మండలము ఏర్పడిన తర్వాత మండల పరిషత్తునకు ఎన్నికలు జరిగినవి. తొలి అధ్యక్షులుగా టి. బాల్‌లింగం ఎన్నికైరి. ఆ తర్వాత 1994 జరిగిన ఎన్నికలలో మండలాధ్యక్షులుగా శ్రీమతి దాసరి రాములమ్మ ఎన్నికై ప్రజాసేవ నొనరించిరి. శ్రీమతి రాములమ్మా మరణించగా ఉపాధ్యక్షులుగానున్నారు. ఎన్. నర్సింహారెడ్డిగారు అధ్యక్ష బాధ్యతలను నిర్వహించిరి.

జి. ఎల్లాగౌడ్ జడ్.పి.టి.సి. మెంబర్‌గా ఎన్నికై మండలాభివృద్ధికై తనవంతు కృషి గావించినారు.

ఈ మండలమున 22 గ్రామ పంచాయతీలు గలవు. వీటిలో 10 గ్రామ పంచాయతీలు స్వంత కార్యాలయ భవనములలో పని చేయుచున్నవి.

ములుగు మండలమునందు 35 ప్రాథమిక పాఠశాలలు, 3 ప్రాథమికోన్నత పాఠశాలలు, 4 ఉన్నత పాఠశాలలు, పంచాయతీ రాజ్ వ్యవస్థలో పని చేయుచున్నవి.

ప్రతి పాఠశాల స్వంత భవనము కలిగియున్నది. ఈ మండలమునందు ప్రాథమిక ఉపాధ్యాయులు 129 మంది పని చేయుచున్నారు. జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో తగిన ఉపాధ్యాయులు కలరు.

ఈ మండల కేంద్రమయిన ములుగులో 50 మంది విద్యార్థినులకై ఒక బి.సి. వసతి గృహము ఏర్పాటు చేయనైనది.

ఈ మండలమున, సింగన్నగూడ మరియు ములుగు గ్రామాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు పని చేయుచున్నవి. వీటికి అనుబంధముగా 8 ఉపకేంద్రములు పని చేయుచున్నవి. ఈ మండలమునందలి మార్క్యాక్ గ్రామమున హోమియోపతి వైద్యశాల పని చేయుచున్నది.

ములుగు మండలమున మర్క్యాకు, ములుగులలో పశువైద్యశాలలు పని చేయుచూ వీటి కనుబంధముగా కొక్కొండ, తున్కిబొల్లారం గ్రామాలలో సబ్ సెంటర్లు పని చేయుచున్నవి.

ఈ మండలమున 10 బ్రాంచి పోస్టాఫీసులు, 17 గ్రామాలలో టెలిఫోన్ సౌకర్యములు కలవు.

**ఎ. శైలజ,** టీచర్, జడ్.పి.హెచ్.ఎస్., గుమ్మడిదల వారి సౌజన్యంతో

ములుగు మండలము ప్రధానముగా వ్యవసాయక మండలము.

ఈ మండలమునందు 8 చెరువులు, 145 కుంటలు కలవు. చెరువుల క్రింద 1296 ఎకరములు, కుంటల క్రింద 1957 ఎకరములు సేద్యము చేయబడుచున్నవి. ఇచ్చట ఎక్కువగా వరి, మెట్ట పంటలు పండింపబడును. ఈ మధ్యకాలమున ప్రభుత్వ సహాయంతో పండ్లతోటల పెంపకము చేపట్టబడినది.

ములుగు మండలమున ప్రభుత్వ భూమి 4531.15 ఎకరములు ఉండగా 4263 మంది బీదలకు పంపిణీ చేయనైనది.

ఇందు S.C. లు 1841 మందికి 1686.17 ఎకరములు, S.T. లు 22 మందికి, 28.18 ఎకరములు, లు B.C. 1895 మందికి 1991.26 ఎకరములు, O.C. లు 505 మందికి 822.20 ఎకరములు పంచబడినది.

సీలింగ్ మిగులు భూమి ఈ మండలమున 963.55 ఎకరములు ఉండగా 928.39 ఎకరాలు బీద సాదలకు పంచబడినది.

ములుగు మండలమున 1146 మందికి అందులో 597 S.C. లకు, 6 S.T. ల, 543 B.C. లకు, ఇండ్ల స్థలాలు. పంపిణీ చేయనైనది. ఇదిగాక ప్రత్యేక పంపిణీ కార్యక్రమము క్రింద 138 మంది S.C. లకు 5 ఎకరములు 343 మంది S.C. లకై 7.04 ఎకరములు ఇండ్ల స్థలాల పట్టాలు పంచబడినవి.

ఈ మండలమున ఒక పోలీసు స్టేషన్, ఒక గ్రంధాలయము కలవు.

ములుగు మండలమున ప్రజాపంపిణీ వ్యవస్థలో 6634 తెల్లకార్డులు, 1207 గులాబీ కార్డులు కలవు. ఈ కార్డుల ద్వారా బియ్యము, 1,102.40 క్వింటాళ్లు, చక్కెర 92.20 క్వింటాళ్లు, పామాయిల్ 23,520 లీటర్లు, గోధుమలు 20 క్వింటాళ్లు, పంపిణీ చేయబడుచున్నవి.

ఈ మండలమున మర్కూకు గ్రామ పరిసరాలలో భావానందయతీంద్రుని ఆశ్రమము అధ్యాత్మిక సంపదకు ఆలవాలమై భక్తుల కోరికల తీర్చుచున్నది. ఈ ఆశ్రమమున ప్రతి ఆషాఢ శు. ఏకాదశి ఆషాఢి అనుపేర ప్రత్యేక పూజలు, అన్నదాన కార్యక్రమము జరుగును.

ఈ మండలమున 61 వితంతు పించన్లు, 39 బాలికా సంరక్షణా పథకములు, 80 కుటుంబ సంక్షేమ పథకములు, 60 మందికి అన్నపూర్ణ పథకమున, 847 మంది కరువు పథకమున, 134 లబ్దిదారులకు దీపం పథకమున, 396 మందికి ఆదరణ పథకము ద్వారా 740 మందికి వృద్ధాప్య పించన్ల ద్వారా లబ్దిదారులు ప్రభుత్వ సహాయం పొందుచున్నారు. 13 గ్రూపులు యువ శక్తి పథకము, 13 సి.ఎమ్.ఇ.వై లబ్దిదారి గ్రూపులలో 7 గ్రూపులు లబ్ది పొందినారు. ఈ మండలమునందు 99 డ్వాక్రా గ్రూపులు 143 సెల్ఫ్‌హెల్ప్ గ్రూపులు పనిచేయుచున్నవి.

ఈ మండలమునందు అటవీ పరిశోధనా క్షేత్రము కలదు. ఇందు సెర్వీకల్చర్ విధానము ప్రవేశపెట్టబడినది.

---

శ్రీ కె.వి.ఎన్. చారి, గుమ్మడిదల వారి సౌజన్యంతో

## సర్పంచ్‌ల జాబితా – మండల పరిశద్ ములుగు.

| | సర్పంచులు | గ్రామపంచాయతీ |
|---|---|---|
| | సర్వశ్రీ | |
| 1. | గండారీ నర్సయ్య | ములుగు |
| 2. | మహదేవుని చంద్రయ్య | నాగిరెడ్డి పల్లి |
| 3. | గుండ్ల కళమ్మ | క్షీరసాగర్ |
| 4. | బాతినీ రాములు | జప్తి సింగాయపల్లి |
| 5. | కోమరెడ్డి సత్యనారాయణ రెడ్డి | లక్ష్మక్కపల్లి |
| 6. | కె. చిన్న బాలయ్య | అలియాబాద్ |
| 7. | సలెంద్రి సత్తయ్య | అచ్చాయపల్లి |
| 8. | షెక్ ఖైరుద్దిన్ | నర్సాపూర్ |
| 9. | దాసరి రాములు | శ్రీరాంపూర్ |
| 10. | ఎన్. బాలమణి | సింగన్నగూడ |
| 11. | బద్రి అనురాధ | కొక్కొండ |
| 12. | ఎన్. కృష్ణ | బస్వాపూర్ |
| 13. | టి. సరళ | బండమైలారం |
| 14. | పి. విజయలక్ష్మి | కొత్తూర్ |
| 15. | కె. ఎల్లమ్మ | కర్కపట్ల |
| 16. | డి. కిష్టమ్మ | కాసిరెడ్డిపల్లి |
| 17. | ఎన్. రామయ్య | బైలాపూర్ |
| 18. | ఇ. లక్ష్మి | మామిడ్యాల్ |
| 19. | జి. గణేశ్ | కొత్యాల్ |
| 20. | ఆర్. బాలయ్య | మర్కూక్ |
| 21. | రాములమ్మ | దామరకుంట |
| 22. | ఎస్. రఘురాములు | తుంకి బొల్లారం |

## ఎం.పి.టి.సీల జాబితా

| | | |
|---|---|---|
| 1. | ఓ.ఎస్. సత్యానంద రావ్ | ములుగు |
| 2. | పి. భాస్కర్ రెడ్డి | క్షీరసాగర్ |
| 3. | వి. నర్సింహా రెడ్డి | తుంకి బొల్లారం (ఉపాధ్యక్షులు) |
| 4. | జాజుల నారాయణ | కొక్కొండ |
| 5. | నఖిర్తి సురేందర్ | నర్సాపూర్ |
| 6. | వి. మల్లేష్ | మామిడ్యాల్ |
| 7. | ఎన్. మల్లయ్య | బైలంపూర్ |
| 8. | శ్రీమతి దాసరి రాములమ్మ | కొత్తూర్ (కీ.శే. అధ్యక్షులు) |
| 9. | శ్రీమతి వి. ఈరమ్మ | మర్కూక్ |
| 10. | శ్రీమతి జె. ఎల్లమ్మ | దామరకుంట |
| 11. | మొహమ్మద్ జహంగీర్ | కో-ఆపరేటివ్ మెంబర్ |

**శ్రీమతి భూదేవి,** W/o. కుంచార్, గుమ్మడిదల వారి సౌజన్యంతో

# మునిపల్లి మండలము

సదాశివపేట తాలూకాను విభజించగా 3 మండలములు ఏర్పడినవి. అందు మునిపల్లి ఒకటి. మునిపల్లి మండలము యొక్క భూ వైశాల్యము 209 చ. కి. మీ. కలదు.

ఈ మండలము నందు జనాభా 32138 అందు పురుషులు 16471, స్త్రీలు 15667 అందు ఎస్. సీ. లు 8285, ఎస్. టి. లు 286 కలరు.

మండలము నందు 29 గ్రామాలు 3 మధిరలు ఉన్నవి. గ్రామ పంచాయితీలు 32 కలవు.

1987లో జరిగిన మండల ప్రజాపరిషత్ తొలి ఎన్నికల్లో బి. రాజేశ్వర్ మండలాధ్యక్షునిగా ఎన్నిక కాబడి 5 సంవత్సరములు తన పాలన కాలమున మండల అభివృద్ధికి ఎనలేని కృషి చేసినారు. పంచాయితీ రాజ్ చట్టం మార్పు చెందుటచే మండలాలకు అధ్యక్షఎన్నిక ప్రత్యక్షముగా జరుగలేదు. ఎం. పి. టి. సి. లు సృష్టించబడుటచే వారి నుండే పరోక్షపద్ధతిన మండల పరిషత్ అధ్యక్షునకు ఎన్నిక జరిగినది. ఈ ఎన్నికల్లో శ్రీ రాజేశ్వర్ ఎన్నిక కాబడి మండలమును పురోభివృద్ధిలో నడుపుటకు తనవంతు కృషిసల్పినారు.

మండలము నుండి జిల్లా పరిషత్ ప్రాదేశిక నియోజక వర్గ సభ్యునిగా (జడ్. పి. టి. సి) ఎం. శ్రీనివాస్ ఎన్నికై మెదక్ జిల్లా పరిషత్‌నకు ప్రాతినిధ్యం వహించి, మండలాభివృద్ధికి చేయూత నొసంగినారు.

ఈ మండలము నందు 24 ప్రాథమిక పాఠశాలలు, 5 ప్రాథమికోన్నత పాఠశాలలు, 3 ఉన్నత పాఠశాలలు కలవు. ఇవన్నియు ఈ మండల విద్యావ్యాప్తికి కృషి సల్పుచున్నవి.

ఈ మండలము వ్యవసాయిక మండలము. ఇక్కడి భూములు ఎక్కువగా నల్లరేగడి భూములు.

ఈ మండలమునందు ప్రధానంగా జొన్న, చెరుకు, మిర్చి, పసుపు పప్పుధాన్యాలు, పల్లి, వరి, పండించుచున్నారు. ఈ మండలంలో ఆరోగ్య కేంద్రము, పోలీసు స్టేషన్, గ్రంథాలయము కలదు.

మండలంలో 27 రేషన్ దుకాణాలు అందు 3525 తెల్లకార్డు, 5287 గులాబి రంగు కార్డుల ద్వారా నిత్యవసర సరకులు కిరోసిన్, గోధుమలు, చక్కెర మొదలగునవి ప్రభుత్వం ధరలకే ప్రజలకు అందుబాటులో దొరుకుచున్నది.

---

శ్రీ **పి. లక్ష్మీకాంత్ రావు,** జడ్. పి. హెచ్. ఎస్., గుమ్మడిదల వారి సౌజన్యంతో

## సర్పంచ్‌ల జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | అంతారం | కిస్మత్ మల్లయ్య |
| 2. | గార్లపల్లి | జి. నాగేందర్ |
| 3. | బూసారెడ్డిపల్లి | మిస్తఫా |
| 4. | బుదేరా | డి. శంకర్ గౌడ్ |
| 5. | బెల్లూర్ | మంతూరి లక్ష్మి |
| 6. | చల్మెడ (చిన్న) | వై. బాలకిష్ణ |
| 7. | చీలపల్లి | జి. నాగేందర్ |
| 8. | కమ్మరిపల్లి | మల్లయ్యగౌడ్ |
| 9. | లోనికలన్ | టి. కళావతి |
| 10. | మక్తకేసరం | బి. రాచమ్మ |
| 11. | మునిపల్లి | మాధురి అనంతి |
| 12. | మల్లికార్జునపల్లి | ఎన్. విష్ణువర్ధన్‌రెడ్డి |
| 13. | మేలాసంఘం | కె. రాచమ్మ |
| 14. | కంకోల్ | కె. శ్రీశైలం |
| 15. | మగ్దుంపల్లి | బోయిని నరసమ్మ |
| 16. | పెద్దచెల్మెడ | పి. దుర్గయ్య |
| 17. | తక్కడపల్లి | గొల్ల చంద్రమ్మ |
| 18. | గోపులారం | సి. చంద్రయ్య |
| 19. | పొల్కంపల్లి | పి. శివమ్మ |
| 20. | లింగంపల్లి | --- |
| 21. | బోడ్‌సెట్‌పల్లి | జి. బక్కప్ప |
| 22. | తాట్‌పల్లి | ఎమ్. లక్ష్మయ్య |
| 23. | లోనికుర్ద్ | జి. సైలు |
| 24. | బోడపల్లి | హమీదాబీ |

శ్రీ పి. స్వరూప రాణి, W/o. లక్ష్మికాంత రావు, దామల చెరువు వారి సౌజన్యంతో

**ఎం.పి.టి.సి.ల జాబితా**

| | గ్రామం పేరు | ఎం.పి.టి.సి. |
|---|---|---|
| 1. | మునిపల్లి | ఆర్. అంజయ్య |
| 2. | కమ్మరిపల్లి | కె. దుర్గయ్య |
| 3. | మల్లికార్జున్ పల్లి | వెంకట్‌రెడ్డి |
| 4. | కంకోడ్ | జి. వీర్ శెట్టి |
| 5. | లింగంపల్లి | బి. రాజేశ్వరరావు |
| 6. | లోనికలాన్ | పి. బస్వరాజమ్మ |
| 7. | తాటిపల్లి | ఎం. రాములు |
| 8. | మక్తా క్యాసనమ్ | లింగమ్మ |
| 9. | గోప్లాన్ కలాన్ | ఎం. భ్రమరాంబ |

# నంగునూర్ మండలము

మెదక్ జిల్లాలోని సిద్దిపేట తాలుకాను పరిపాలన వికేంద్రీకరణలో విభజింపగా నంగునూర్ మండలము ఏర్పాటయినది.

ఈ మండలము యొక్క భౌగోళిక విస్తీర్ణము 176 చ.కి.మీ. మండలములోని 21 రెవెన్యూ గ్రామాలు, 9 మధిరలు, 20 పంచాయితీలు ఉన్నాయి.

36,243 జనాభాగల ఈ మండలములో పురుషులు 18,421, స్త్రీలు 17,872 మంది గలరు. ఈ జనాభాలో S.C. లు 5,874 మంది, S.T. లు 814 మంది కలరు.

నంగనూరు మండలము వ్యవసాయాధారిత ప్రాంతము. ఇచ్చటి వ్యవసాయ భూమి దాదాపు 43,370 ఎకరాలు. అందులో 35,415 ఎకరాల తరి, 39,425 ఎకరాల మెట్ట భూమి కలదు. ఇక్కడ 2442 చిన్నకారు రైతులు, 4794 రైతలు సన్నకారు ఉన్నారు.

ఈ మండలములో 100 చెరువులు, 102 కుంటలు ఉన్నాయి.

ఈ మండలములో అసైన్‌మెంట్ భూమి 1102 మంది S.C. 1123 ఎకరాలు, 10 మంది S.T. లకు 8.28 ఎకరాలు, 1602 మంది B.C. లకు 1300.11 ఎకరాలు, O.C. లకు 181.17 ఎకరాల భూమిని సీలింగ్ యాక్ట్ ప్రకారము పంపిణీ చేయబడింది.

ఈ మండలములో వృద్ధాప్య పింఛన్ల సంఖ్య 620.

ఈ మండలములో ప్రాథమిక పాఠశాలలు 25 ప్రాథమికోన్నత పాఠశాలలు 9, మండల పరిషత్ ఆధీనములో పనిచేయుచున్నవి. మొత్తం ఉపాధ్యాయుల సంఖ్య 97.

ఈ మండలములో ప్రాథమిక ఆరోగ్య కేంద్రము 30 పడకల ఆసుపత్రి కలదు, అందులో ముగ్గురు డాక్టర్లు, విధులు నిర్వహిస్తున్నారు.

వీటికి అనుబంధంగా 8 ఉపకేంద్రాలు కలవు.

ఈ మండలములో 1 పశువైద్యశాల, 3 ఉపకేంద్రములు పని చేయుచున్నవి.

ఈ మండలములో విద్యార్థి వసతి గృహములు కలవు.

ఈ మండలములో ఆంధ్ర బ్యాంకు కలదు.

ఈ మండలములో నిత్యావసర సరుకులు కేటాయింపునకై 8,416 కార్డులు కలవు, అందులో తెలుపు 5841, గులాబి 2575 కార్డులు కలవు. చౌకధరల దుకాణాల ద్వారా బియ్యం దాదాపు 918 క్వింటాళ్ళు, చక్కెర 115 క్వింటాళ్లు, కిరోసిన్ దాదాపు 25,440 లీటర్లు పంపిణీ చేయబడుచున్నది.

ఈ మండలములో ఒక రక్షకభట నిలయము కలదు.

---

శ్రీమతి కరుణ కుమారి, జె.సి., తూప్రాన్ వారి సౌజన్యంతో

ఈ మండలములో డ్వాక్రా గ్రూపులు, సి.ఎమ్.ఈ.వై. లబ్ధిదారులు గలరు.

ఈ మండలములో ప్రభుత్వ నిధుల ద్వారా D.R.D.A .చైతన్య, ఆదరణ చేయుత ద్వార మండలాభివృద్ధి జరుగుతున్నది.

ఈ మండలములో వ్యవసాయోగ్యమైన భూమి కలదు. ఇక్కడ వ్యవసాయానికి 4,406 బావులు, 939 బోర్లు ఉపయోగపడుతున్నవి. ఇక్కడ ప్రధాన పంటలు కూరగాయలు, వరి.

ఈ మండలములో కోళ్ళ పరిశ్రమ అభివృద్ధి చెందింది. ఈ మండలములో 1 రైసుమిల్లు, 1 సినిమా థియేటర్ కలదు.

ఈ మండలములో S.C. 130, S.T. 23, B.C. 47, O.C. లకు 75 ఇళ్ళ స్థలాలు కేటాయించబడినవి.

ఈ మండలము ఏర్పాటయిన తరువాత మొట్టమొదటి అధ్యక్షులుగా కె. చంద్రయ్యగారు ఎన్నికై ఐదు సంవత్సరములు తన వంతు కృషి చేశారు. 1994లో ఎం.పి.టి.సి ల ద్వారా అధ్యక్షస్థానమునకు ఎన్నికలు జరుగగా శ్రీమతి లచ్చవ్వగారు అధ్యక్షులుగా ఎన్నికైనారు. ఉపాధ్యక్షులుగా సాయిరెడ్డి ఎన్నికైనారు. జెడ్.పి.టి.సిగా డి. మల్లయ్య ఎన్నికై 5 సంవత్సరముల మండల అభివృద్ధికి విశేష కృషి చేశారు.

ఈ మండలములో ప్రాచీనమైన దేవాలయములు గలవు.

## నంగునూరు ఎం.పి.టీ,సి జాబితా

| క్ర.సం. | గ్రామము | ఎం.పి.టి.సి. పేరు |
|---|---|---|
| 1. | నంగునూరు | శ్రీమతి టి. నిర్మల |
| 2. | సిద్దన్నపేట | శ్రీ పి. సాయిరెడ్డి |
| 3. | బద్దిపడగ | శ్రీ ఎస్. రాజయ్య |
| 4. | రాంపూర్ | శ్రీమతి ఎల్. లచ్చవ్వ |
| 5. | రాజ్‌గోపాల్‌పేట | శ్రీ గంప మహేందర్ |
| 6. | మండ్రాయి | శ్రీ యూ. నారాయణ రెడ్డి |
| 7. | కొనాయపల్లి | ఆర్ కనకయ్య |
| 8. | అంక్సాపూర్ | శ్రీమతి ఎస్. రమణ |
| 9. | అక్కన్నపల్లి | శ్రీ కె. ప్రభాకర్ |
| 10. | ఖాతా | బి. వెంకటయ్య |

శ్రీ జి. రఘురామశర్మ, గుమ్మడిదల వారి సౌజన్యంతో

## నంగునూరు మండల సర్పంచులు

| క్ర.సం. | పంచాయతి పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | నంగునూరు | టి. వీరయ్య |
| 2. | సిదన్నపేట | ఎస్. పురేందర్ |
| 3. | బద్దిపడగ | జెమ్మనాయర్ |
| 4. | దర్గాపల్లె | జి. మల్లేశం |
| 5. | పాలెంపల్లె | ఎ. బుచ్చిరాములు |
| 6. | రాంపూర్ | శ్రీమతి జి. రుక్మిణి |
| 7. | మగ్దుంపూర్ | ఎ. మల్లయ్య |
| 8. | ఓబులాపూర్ | కె. రాములు |
| 9. | రాజ్‌గోపాల్‌పేట | శ్రీమతి ఎన్. రాజవ్వ |
| 10. | మండ్రాయి | శ్రీమతి సరవ్వ |
| 11. | వెల్కటూర్ | ఎమ్. రాంచంద్రన్ |
| 12. | కొనాయపల్లె | శ్రీమతి ఎన్. నాగలక్ష్మి |
| 13. | తిమ్మిపల్లి | శ్రీమతి మొహియుద్దిన్ |
| 14. | వెంకటాపూర్ | పి. చంద్రయ్య |
| 15. | నార్మెట్ట | శ్రీమతి ఎమ్.డి. జమల్ బీ |
| 16. | అంక్సాపూర్ | శ్రీమతి అనసూయ |
| 17. | ఖానాపూర్ | ఎస్. జనార్దన్ రెడ్డి |
| 18. | నాగరాజ్‌పల్లె | సి.హెచ్. బాలయ్య |
| 19. | అరెన్నపల్లె | బి. భూపతిరెడ్డి |
| 20. | గట్లె మల్లల్ | జి. రాజేశం |
| 21. | కొండెంరాజ్‌పల్లి | జి. మైసయ్య |
| 22. | ఖాతా | శ్రీమతి సలీమ |
| 23. | ఘనాపూర్ | కె. ఇంద్రసేన్ రెడ్డి |

**శ్రీ అవమ్మన్నగారి విశ్వనాథులు,** మెదకు వారి సౌజన్యంతో

# నారాయణ్ ఖేడ్ మండలము

మెదకు జిల్లాలో పరిపాలనా వికేంద్రీకరణలో భాగంగా నారాయణ్ ఖేడ్ తాలూకాను విభజింపగా 4 మండలాలు ఏర్పడ్డాయి. అందులో నారాయణ్ ఖేడ్ మండలమొకటి.

ఈ మండలము యొక్క విస్తీర్ణము 209 చదరపు కిలోమీటర్లు. ఈ మండలము యొక్క జనాభా 54,973 ఇందులో స్త్రీలు 26,967, పురుషులు 28,006 కలరు. అందులో ఎస్.టి.లు 6365, ఎస్.సి.లు 7924 కలరు.

ఈ మండలములో మొత్తము 36 గ్రామాలు, 33 పంచాయితీలు, 3 మధిరలు కలవు.

ఈ మండలము ఏర్పాటయిన తర్వాత మొట్టమొదటి అధ్యక్షులుగా జీవులా నాయక్ ఎన్నికయినారు. అతను అయిదు సంవత్సరాలపాటు మండలాభివృద్ధికై తనవంతు కృషిచేసినారు. 1994లో ఎం.పి.టి.సి.ల ద్వారా అధ్యక్షస్థానమునకు చావులీ బాయి ఎన్నికయినారు.

ఈ మండలమునందు 48 ప్రాథమిక పాఠశాలలు, 7 ప్రాథమికోన్నత పాఠశాలలు, మండల ప్రజల విద్యాభివృద్ధికై పాటుబడుచున్నది. 5 ఉన్నత పాఠశాలలు జిల్లా పరిషత్ యాజమాన్యంలో పని చేయుచున్నవి.

నారాయణ్ ఖేడ్ మండలము నందు విద్యార్థి వసతి గృహములు కలవు.

ఈ మండల ప్రజల ఆరోగ్య పరిరక్షణకై ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రము కలదు. దీనికి అనుబంధ 6 కేంద్రములు పని చేయుచున్నవి. ఒక ఆయుర్వేదిక డిస్పెన్సరి కలదు.

ఈ మండలములో వాణిజ్య బ్యాంకులు కలవు.

శాంతి భద్రతల దృష్ట్యా ఈ మండలము నందు ఒక పోలీస్ స్టేషన్ కలదు. ఒక గ్రంథాలయము మండల ప్రజల పఠనాభిలాషను తీర్చుచున్నది.

ఇక్కడి ప్రజలు ఎక్కువగా మెట్టపంటలను పండిస్తారు. అందులో జొన్న, ముఖ్యమైనది. మిర్చి, పసుపు, వేరు శెనగ, చెరుకు పంటలను కూడా పండిస్తారు. వరి చాలా తక్కువ, వ్యవసాయ మార్కెట్ కమిటీ కలదు.

జిల్లాకు, రాష్ట్రానికి సరిహద్దుగా ఉండుటవల్ల పాలకుల దృష్టి దీనిపై ఎక్కువగా పడి అభివృద్ధి వైపు పయనమవుతున్న మండలమని చెప్పవచ్చు.

జన్మ భూమి ద్వారా వాటర్‌షెడ్, పథకాల ద్వారా, కర్షకులు సి.ఎం.ఇ.వై., పి.ఎం.ఆర్.వై. ద్వార యువకులు, డ్వాక్రా ద్వారా మహిళలు అభివృద్ధి చెందుతున్నారు.

ఇక్కడి ప్రజలు తెలుగు భాషతో పాటు ఉర్దూ, కన్నడ, భాషలు అనర్గళంగా మాట్లాడుతారు.

---

శ్రీ శాస్త్రుల కృష్ణమూర్తి, మెదక్ వారి సౌజన్యంతో

## సర్పంచ్‌ల జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్‌లు |
|---|---|---|
| 1. | అబేంద | సంగారెడ్డి |
| 2. | అనంతసాగర్ | సంగయ్య |
| 3. | అంత్వార్ | లింగయ్య |
| 4. | చాప్టా (కాదీం) | నర్సింహారెడ్డి |
| 5. | హన్మంతరావు పేట | సి. హెచ్. రాములు |
| 6. | లింగాపూర్ | ఎన్. తుకారాం |
| 7. | నారాయణ్ ఖేడ్ | ఎం. కిష్టయ్య |
| 8. | నర్సాపూర్ | దుర్గయ్య |
| 9. | నిజాంపేట్ | బాలయ్య |
| 10. | రాయలమడుగు | నర్సమ్మ |
| 11. | రాయికల్ | రాజేశ్వర్ |
| 12. | రుద్రార్ | రామవ్వ |
| 13. | సంజీవన్ రావు పేట | రాంరెడ్డి |
| 14. | వెంకటాపూర్ | మాణిక్యమ్మ |
| 15. | పంచగాంవ్ | సత్యమ్మ |
| 16. | పైడిపల్లి | వాకంట్ |
| 17. | గంగాపూర్ | సంగయ్య |
| 18. | కొండాపూర్ | జల్‌మాల్ బీ |
| 19. | హుంగేర్ గా (కె) | కిషన్ |
| 20. | హుంగేర్ గా (బి) | సావిత్రి |
| 21. | మద్వార్ | పెడకయ్య |
| 22. | నిమిల్‌మెట్ట | వీరమణి |
| 23. | తుర్కపల్లి | ఈశ్వరప్ప |

(శ్రీ) కృష్ణారావు, మేనేజర్, ఎం.జి.బి. నర్సాపూర్ వారి సౌజన్యంతో

## ఎం.పి.టి.సి.ల జాబితా

| | గ్రామం పేరు | ఎం.పి.టి.సి |
|---|---|---|
| 1. | అబేంద | కె. విఠల్ |
| 2. | అనంతసాగర్ | కె. పెంటయ్య |
| 3. | అంత్వార్ | |
| 4. | చాప్టా (కాదీం) | రాధమ్మ |
| 5. | హన్మంతరావు పేట | జయమణి |
| 6. | లింగాపూర్ | |
| 7. | నారాయణ్ ఖేడ్ | |
| 8. | నర్సాపూర్ | |
| 9. | నిజాంపేట్ 1. | అరుణాబాయి |
| | 2. | విఠల్ రెడ్డి |
| | 3. | |
| 10. | ముద్వార్ | సత్యమ్మ |
| 11. | పాంచ్‌గావ్ | పెంటమ్మ |
| 12. | సంజీవన్ రావు పేట | జి. భావ్ రెడ్డి |
| 13. | రాయికల్ | విఠల్ |
| 14. | యాలమడుగు | చాన్లి |
| 15. | నారాయణ్ ఖేడ్ 1 | అంజయ్య |
| | 2. | సుల్తాన్ అహ్మద్ |
| | 3. | ఎం. సురేష్ |
| | 4. | నర్సింలు |

శ్రీనివాస్ రెడ్డి, డి.ఇ., సిద్దిపేట వారి సౌజన్యంతో

# నర్సాపూర్ మండలము

మెదకు జిల్లాలో నర్సాపూర్ మండలము ప్రత్యేకమైనది. చుట్టూ కొండలు దట్టమైన అడవులు, చిన్నవాగులు, చెరువులు, ప్రకృతిరామణీయకత ఇవన్నీ నర్సాపూర్ కు ఆభరణాలు.

నర్సాపూర్‌ను ఒక సారి జూచినవారు ఉహాలోకంలో విహరించగలరు.

హైద్రాబాదు నుండి మెదకు వెళ్లే రహదారిలో 54కి.మీ. రాతి వద్ద అగుపించే అందమైన గ్రామం నర్సాపూర్. సంగారెడ్డి నుండి గజవెల్లికి పోయే రహదారి హైద్రాబాదు మెదకు రహదారిని ఈ ఊళ్ళోనే కలిసి పలుకరిస్తుంది. ఈ పలకరింపును అల్లంత దూరాన ముందు వెనుకలున్న రెండు సినిమా హాళ్లు హల్లో అంటూ ప్రదిధ్వనిస్తుంటాయి. నర్సాపూర్‌కు గండి నర్సాపురం అనే పేరు నేటికి అక్కడక్కడా వినిపిస్తుంది. అంటే ఈ గ్రామానికున్న చెరువు రెండు గుట్టలకు అడ్డంగా కట్టబడింది. ఒక మారు ఆ చిన్న కట్టతెగి గండి పడిందట. అప్పటి నుండి ఈ చెరువుకున్న ప్రాశస్త్యంతో ఈ ఊరే గండి నర్సాపూర్ గా పిలువబడింది. నర్సాపూర్ మెదకు జిల్లాలో ఒక తాలూకా కేంద్రము.

1987 నాటి ముఖ్యమంత్రి నందమూరి తారకరామారావు గారి మది మెదిలిన కదలిక మండల వ్యవస్థ రూపకల్పన. దానితో నర్సాపూర్ తాలూకా 5 మండలాలుగా విభజింపబడినది. నర్సాపూర్ తాలూకా కేంద్రము నుండి మండల కేంద్రముగా మారినది.

నర్సాపూర్ మండలమునకు తూర్పున శివంపేట మండలము దక్షిణమున జిన్నారం మండలము పడమర హత్నూర మండలము ఉత్తరాన కౌడిపల్లి మండలములు ఎల్లలుగా కలవు.

నర్సాపూర్ మండల భౌగోళిక విస్తీర్ణము 44277 ఎకరములు. ఈ మండలమున 35 గ్రామములు, 19 గ్రామ పంచాయితీలు కలవు.

ఈ జనాభాలో యస్.సి లు 6057, గిరిజనులు 4842 మంది నివసించుచున్నారు. ఈ మండలమునందలి మొత్తము కుటుంబముల సంఖ్య 6835.

మండలవ్యవస్థ ఏర్పడిన పిదప నర్సాపూర్ పంచాయితి సమితి మండల ప్రజా పరిషత్తు గా మారినది. 1987లో మండల ప్రజా పరిషత్తు ఎన్నికలు పార్టీల గుర్తులతో ప్రత్యక్షముగా జరిగినవి. ఆ ఎన్నికలలో మండల ప్రజా పరిషత్తు అధ్యక్షులుగా శ్రీ చంద్రాగౌడ్ గారు ఎన్నికైనారు. మండల ఉపాధ్యక్షులుగా శ్రీ వెంకట్రామిరెడ్డి గారు ఎన్నికైరి. వీరు తమ 5 సంవత్సరముల పదవీ కాలములో ప్రజోపయోగ కార్యక్రములు తమ శక్తి మేరకు ఒనరించిరి.

---

**శ్రీ జి. కృష్ణారెడ్డి,** టీచర్, పెద్దా శెట్టి ముక్లా వారి సౌజన్యంతో

1995న మండల పరిషత్తునకు రెండవ పర్యాయము ఎన్నికలు జరిగినవి. పంచాయత్‌రాజ్ చట్టమున మార్పులు వచ్చినవి. మండలమునకు ప్రాదేశిక నియోజకవర్గములు ఏర్పాటైనవి. నర్సాపూర్ మండలమున (11+) మండల ప్రాదేశిక నియోజక వర్గములకు ఎన్నికలు జరుపబడినవి. యం.పి.టి.సీ. లు మండల సభ్యులైరి వారిచే మండల అధ్యక్ష - ఉపాధ్యక్ష పదవులకు ఎన్నిక జరిగినది. ఈ ఎన్నికలో శ్రీమతి గుండం శాంతి గారు అధ్యక్షులుగా ఉపాధ్యక్షులుగా శ్రీ దుర్గప్ప గారి నారాగౌడుగారు ఎన్నుకొనబడినారు. ఈ మండలము స్త్రీలకు కేటాయించబడినది. ఎన్నికైన అధ్యక్ష - ఉపాధ్యక్షులు తమ పదవీ కాలమున ప్రజలకు సేవలందించుచున్నారు. ఈ మండలము నుండి జిల్లా ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులుగా శ్రీ దేవసోత్ లష్కర్‌గారు ఎన్నికై ప్రజా సేవయొనరించుచున్నారు.

నర్సాపూర్ మండలమున 1998 లో ప్రైవేటు యాజమాన్యమున బి.వి. రాజు ఇన్స్‌ట్యూట్ ఆఫ్ టెక్నాలజి ఇంజనీరింగ్ కాలేజి ఏర్పాటై స్వంత భవనాలతో అందముగా అలరారుచున్నది. ఈ మండల కేంద్రమున ప్రభుత్వ జూనియర్ కళాశాల విశాలమైన మైదానములో చక్కనైన భవనములో కలదు. ఈ కళాశాలకు ఒక ఆడిటోరియం కూడా నిర్మింపబడినది. జన్మభూమి గ్రాంటులో గిరిజన ఆవాస గురుకుల జూనియర్ కాలేజి నర్సాపూర్ గ్రామ పరిసరమున ఏర్పాటు గావింపబడి నిర్మాణమగు చున్నాది. ఈ మండలమున స్థానికముగా బాలికలకై ప్రత్యేకముగా ఉన్నత పాఠశాల కలదు. రెడ్డి పల్లి గ్రామంలో జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల కలదు.

రుస్తుంపేట, ఆవంచ, కాగజి మద్దూరు గ్రామంలలో ఉన్నత పాఠశాలలు ఏర్పాటగుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఇవి ప్రస్తుతము ప్రాథమికోన్నత పాఠశాలలు గా గలవు. ఈ మండల పరిషత్తు యాజమాన్యమున 24 ప్రాథమిక పాఠశాలలు, 102 మంది ఉపాధ్యాయులతో పని చేయుచున్నవి. మహమ్మదాబాద్‌లో గిరిజన ఆశ్రమ పాఠశాల 1 నుండి 5 వ తరగతుల వరకు సాంఘిక సంక్షేమశాఖచే నడుపబడుచున్నది. స్త్రీ శిశు సంక్షేమ శాఖ ఆధ్వర్యమున ఈ మండలమునందు 18 అంగన్ వాడి కేంద్రములు గలవు. స్త్రీ, శిశువులకు పోషకాహారము లనందించుట, ఐదు సంవత్సరముల లోపు బాలబాలికలకు విద్య యందాసక్తి కలుగుటకు ప్రాథమిక అవగాహన కలిగించుట అంగన్ వాడీ కార్యకర్తల కర్తవ్యమైయున్నది. వీరు తమ కర్తవ్యమును చక్కగా నిర్వహించుచున్నారు. ఈ మండలమున పాఠశాలలకు వెళ్లలేని బాలబాలికలకు యువకులకు అక్షరాస్యతను కలిగించుటకై నిరంతర విద్యా కేంద్రములు పని చేయుచున్నవి. ప్రైవేటు యాజమాన్యములలో రెండు ఉన్నత పాఠశాలలు ఒక జూనియర్ కాలేజి కూడా ఈ మండల కేంద్రమున విద్యాభివృద్ధికై పాటు పడుచున్నవి. ఈ మండలమున సెకండరీ - ఇంటర్ స్థాయి వరకు మాత్రమే చదువుకొను వసతులు కలవు.

---

శ్రీ ఎన్. అంజన్ గౌడ్, జి.ఎల్., సదాశివపేట వారి సౌజన్యంతో

ఇక్కడి విద్యార్థులు డిగ్రీ చదువులు చదువలేనన్న కనీసము 30 కి.మీ ప్రయాణము చేసిన గాని సాధింపజాలరు. అనేక మంది విద్యార్థులు ఇంటర్ వరకే చదివి మధ్యంతరముగా వారు చదువులనాపుకొను చున్నారు. అంతేగాక నర్సాపూర్ మండలమునకు చుట్టు ప్రక్కలనున్న మండలములలో కూడా డిగ్రీ చదువు వసతి లేకుండుటచే విద్యార్థులలో నైరాస్యత ఏర్పడుచున్నది. కావున ఇక్కడి విద్యాభివృద్ధి కారకులు, నాయకులు నర్సాపూర్ కేంద్రమున డిగ్రీ కళాశాల ఏర్పాటు చేయుటకు శ్రద్ధ వహించవలసిన అవసరమెంతేని కలదు.

ఈ మండల కేంద్రమున బీద విద్యార్థులకై యస్.సి -1, యస్.టి -2, బి.సి - 2 విద్యార్థి వసతి గృహములు ప్రభుత్వపరముగా నడపబడుచున్నవి.

నర్సాపూర్ మండలము భాగ్యనగరమునకు దగ్గరగానున్నప్పటికి ఇక్కడి వారు వ్యవసాయమే ప్రధాన వృత్తిగా జీవించుచున్నారు. అడవీ ప్రాంతమగుటచే ఇక్కడ వర్ష పాతము సాలుసరి. 780 మి.మీ కన్న అధికముగానుండును. అంతే గాక నర్సాపుర్ ప్రాంతమున భూగర్భజలము తగు మోతాదులో నున్నది.

ఈ ప్రాంతమున నివసించు కర్షకులు బాగుగా శ్రమ పడువారు. ఈ మండలమునందున్న గిరిజనులు చక్కని వ్యవసాయమునొనరించుటలో నేర్పరులు. ఈ మండలమున ప్రధాన వరి, చెరకు పండింతురు మెట్టభూములలో వర్షాధారముగా మక్కజొన్న, ప్రొద్దుతిరుగుడు, పల్లి, కంది, పెసర, నువ్వులు, ఆముదము, మొదలగు పంటలు పండింతురు. ఈ మధ్యకాలమున కూరగాయలు అధికముగా పండించు చున్నారు. ఈ మండలమునందు చెఱుకును ఎక్కువగా పండించుటచే మూడు(3) చెక్కర కర్మాగారములు నెలకొల్పబడి నేటికిని చక్కగా నడుపబడుచున్నవి. ఈ మండలమునందు వరి ఎక్కువగా పండించుటచే 6 రైసుమిల్లులు చక్కగా పని చేయుచున్నవి.

నర్సాపూర్ మండల కేంద్రమున 1 స్టేటు బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్ 2 స్టేచ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా 3 మంజీరా గ్రామీణ బ్యాంకు 4 కో ఆపరేటివ్ బ్యాంక్ ముఖ్యముగా వ్యవసాయదారులకు స్వల్పకాలిక, ధీర్ఘకాలిక రుణములిచ్చుచు వ్యవసాయాభివృద్ధికి తమ చేయూత నందించుచున్నవి. ఈ బ్యాంకులు చిన్న వ్యాపారులకు పరిశ్రమలకు ఇతోధికముగా రుణ సౌకర్యము కల్పించుచున్నవి. ఈ మండలమున, మూడు ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘములు కలవు. ఈ సహకార సంఘముల ద్వారా వ్యవసాయదారులకు రుణ సౌకర్యము లభించుచున్నది.

నర్సాపూర్ మండలమున 18062 ఎకరముల ప్రభుత్వ భూమి కలదు. ఈ ప్రభుత్వ భూమి నుండి పేదవారికి 6946.17 ఎకరముల పై పట్టాలు ఈయబడినవి. ఇంకను నేటికి 154 ఎకరములు ఈయవలసిన భూమి కలదు. పోగా మిగిలిన భూమి అటవీ ప్రాంతము.

---

శ్రీ కృష్ణమూర్తి, హెచ్.ఎం., సి.పి.ఎస్., గుమ్మడిదల వారి సౌజన్యంతో

ఈ మండలమునందు నర్సాపూర్‌లో వైద్య విధాన పరిషత్తు వారి చికిత్సాలయము 30 పడకలతో కలదు. 1999 సం.న ఈ ఆరోగ్యశాల నూతనముగా నిర్మింపబడి అనేక వసతులు సమకూర్చబడినవి. ఈ దవాఖానాలో 4 డ్యాక్టర్లు పని చేయుచున్నారు.

ఇతరవైద్య సిబ్బందిలో నర్సాపూర్ గ్రామంలో ప్రభుత్వ చికిత్సాలయముతో పాటు రెండు నర్సింగ్ హోంలు ప్రైవేటు డ్యాక్టర్ల చే నడుపబడుచున్నవి.

నర్సాపూర్ లో డాంగోరియా చారిటబుల్ ట్రస్టు యాజమాన్యము ఒక నర్సింగ్ హోం నడుపబడుచున్నది. ఈ వైద్యశాలలో ప్రత్యేకంగా స్త్రీలకు, మరియు శిశువులకు చికిత్స జరుపబడుచున్నది. రామానాయుడు చారిటబుల్ ట్రస్టులో వృద్ధులకు పునరావాసముతో పాటు ఆరోగ్య విషయమున శ్రద్ధగైకొనబడుచున్నది.

నర్సాపూర్ లో పశువైద్యశాల కలదు. ఈ పశు వైద్యశాలలో ఒక డ్యాక్టరు, ఒక కంపౌండరు పనిచేయుచు పశువులకు రోగ చికిత్స చేయుచు పశురక్షణ మరియు కృత్రిమ గర్భోత్పత్తి కార్యక్రమములు చేయుచున్నారు. ఇచ్చుట పశు సంవర్ధక శాక అసిస్టెంటు డైరెక్టరు కార్యాలయము కలదు.

నర్సాపూర్ మండలమున రామచంద్రాపురం గ్రామంలో కల్యాణి చాళుక్యుల కాలంనాటి శాసనము, మరియు కాగజిమద్దూరు గ్రామంలోను కల్యాణి చాళుక్యుల నాటి శాసనములు రెండు శిలా శాసనములు లభ్యమైనవి.

నర్సాపూర్ మండలమునందు స్థానికముగా రెండు ఖండసారి ఫ్యాక్టరీలు, రెడ్డిపల్లిలో ఒక ఖండసారి చెక్కర ఫ్యాక్టరీలు పని చేయుచు ఇచ్చుట పండించు చెరుకును కొనుగోలు చేసి చక్కెర ఉత్పత్తి చేయుచున్నవి.

నర్సాపూర్ సమీపమున దివ్యశక్తి గ్రానైట్స్ మరియు జయకృష్ణ అల్యూమినియం, ఫ్యాక్టరీలు పెద్ద ఎత్తున ఉత్పత్తి కొన సాగించుచున్నవి.

నర్సాపూర్ మండలమున 24 పౌర సరఫరాల దుకాణములున్నవి. ఈ మండలమునందు తెల్లకార్డులు 5910 గులాబి కార్డులు 2310 కలవు. వీరికి ప్రతినెల 945 - 80 క్వింటల్ల బియ్యము, 128.55 క్వింటాళ్ల చక్కెర సరఫరా చేయబడుచున్నది.

శ్రీ శ్రీవాండ్ల చంద్రశేఖర్ రావు, మెదక్ వారి సౌజన్యంతో

## నర్సాపూర్ మండలము

| గ్రామము | ఎం.పి.టి.సి | సర్పంచ్ |
|---|---|---|
| నర్సాపూర్ | మురళీధర్ రావు<br>గులాంమహ్మద్<br>గుండం శాంతి | మురళీధర్ యాదవ్ |
| కాగజమద్దూర్ | | బి. రాములు |
| నత్నాయిపల్లి | | కె.ఎ. కృష్ణారావు |
| రెడ్డిపల్లి | | లక్ష్మీ నారాయణ |
| నాగులపల్లి | వై. లక్ష్మి | లోహిత రెడ్డి |
| బిప్పల్‌తుర్తి | జనార్ధన్ | ఎల్. నంద్యా |
| ఆవంచ | ఎన్. సువర్ణ | ఆర్. సంజీవ |
| రాంచంద్రాపూర్ | | ఎస్. సత్యనారాయణ |
| బ్రాహ్మణపల్లి | | ఎస్. అంజనేయులు |
| తుజాల్‌పూర్ | | కే. అంజనేయులు |
| రుస్తుంపేట | ఈ. శివకుమార్ | ఈ. అరుణ |
| మూసాపేట | | జీ. చక్రవేణి |
| పెద్దచింతకుంట | | జీ. శివ్వమ్మ |
| చిన్న చింతకుంట | సి.హెచ్. సుహాసిని | భాగ్యమ్మ |
| ఖాజీపేట | కె. రామయ్య | వెంకటమ్మ |
| లింగాపూర్ | డి. నారాగౌడ్ | రాజ్యకళ |
| ఇబ్రహీం బాద్ | | సక్రిబాయి |
| అహ్మద్‌నగర్ | ఎల్. హంసు | కే. మల్లయ్య |
| నారాయణపూర్ | | ఎన్. భిక్షపతి |

శ్రీ అమ్మన గారి రామచంద్రారావు, మెదక్ వారి సౌజన్యంతో

# న్యాల్‌కల్ మండలము

నారాయణ్‌ఖేడ్ తాలూకాను విభజించగా ఐదు మండలాలు ఏర్పాటైనవి. అందులో న్యాల్‌కల్ మండలము ఒకటి.

ఈ మండల ప్రాంతము జిల్లాకు కొట్టకొనన నున్నది. కర్ణాటక రాష్ట్రమునకు సరిహద్దులుగా ఈ మండలమునందలి కొన్ని గ్రామములు కలవు. ఈ మండలమునందలి ప్రజల ఆచార వ్యవహారములు, భాష ఎక్కువగా, కన్నడ ప్రాంతమును పోలియుండును.

మెదకు జిల్లాలో నారాయణఖేడ్ తాలూకాయే వెనకబడిన ప్రాంతము అందును న్యాల్‌కల్ మండలము మిక్కిలి వెనుకబడిన ప్రాంతముగా చెప్పవచ్చును.

న్యాల్‌కల్ మండలము 31 గ్రామాలతో 31 గ్రామ పంచాయితీలతో ఏర్పాటయినది. ఈ మండల జనాభ మొత్తం (1991 గణాంక ప్రకారం) 46669 మందితో 254 చ.కి.మీ. వైశాల్యంము కలగియున్నది. మండల జనాభాలో పురుషులు 23596 కలిగి యున్నది. మండల జనాభాలో పురుషులు 23596 కలిగియున్నది. మండల జనాభాలో పురుషులు 23596, స్త్రీలు 23073 అందున ఎస్.సి.లు 9290, ఎస్.టి.లు 729 కలరు.

ఈ మండలము ఏర్పాటయిన మొట్టమొదటి మండల ప్రజాపరిషత్ ఎన్నికల్లో శ్రీ ఎన్. అడవి రెడ్డి గారు ఎన్నికై మండలాభివృద్ధికి తన వంతు కృషి సల్పినారు. రెండవ సారి పరోక్ష పద్ధతిలో ఎం.పి.టి.సి.ల ద్వారా శ్రీమతి చిన్నమ్మగారు ఎన్నికై తన హయాంలో మండలాన్ని అభివృద్ధిలో తీర్చిదిద్దారు. శ్రీ చంద్రప్ప గారు జడ్.పి.టి.సి.గా ఎన్నికై జిల్లా పరిషత్ వేదిక ద్వారా మండల సమస్యలను పరిష్కరించి, మండల అభివృద్ధికి తన వంతు కృషి సల్పినారు.

ఈ మండలమునందు ప్రాథమిక పాఠశాలలు 36 ప్రాథమికోన్నత పాఠశాలలు 7 మండల పరిశషత్ ఆధీనంలో నడపబడుచున్నవి. జిల్లా పరిషత్ ఆధీనంలో 3 ఉన్నత పాఠశాలలు కలవు. ఈ మండలమునందు బీద విద్యార్థులకు బి.సి. హాస్టళ్లు, ఎస్.సి. హాస్టళ్లు నడపబడుచున్నవి.

ఈ మండల కేంద్రములో ప్రాథమిక ఆరోగ్య కేంద్రము, దానికనుబంధముగా ఉప-కేంద్రములు, గ్రామాల్లో ఎన్.ఎమ్.ఎ.లు పని చేయుచు మండల ప్రజల ఆరోగ్య సంరక్షణ చూస్తున్నారు. పశువుల వైద్యకేంద్రము, గ్రామాల్లో ఉపకేంద్రములు నడుపబడుచున్నవి. రక్షకభ నిలయము, గ్రంధాలయము, వాణిజ్య బ్యాంకులు కలవు.

ఈ మండలమున చౌక ధరల దుకాణాల ద్వారా ప్రజలకు నిత్యావసర సరకులు చక్కర, కిరోసిన్, బియ్యం, పామోలిన్ సరఫరా చేయబడుతున్నది.

---

శ్రీ టి. రాధాకృష్ణశర్మ, మెదక్ వారి సౌజన్యంతో

ఈ మండలములో డ్వాక్రా గ్రూపులు, సెల్ఫ్‌హెల్ప్ సెంటర్‌లు, సి.ఎమ్.ఇ.వై., పి.ఎమ్.ఆర్.వై., దీపం లబ్ధిదారులు కలరు.

న్యాల్‌కల్ మండలములో ఎక్కువగా మెట్ట పంటలపై వ్యవసాయదారులు ఆధారపడుదురు. ఇక్కడ వర్షాభావ పరిస్థితులు ఎక్కువ. ఎక్కువగా మండలంలో వాణిజ్య పంటలైన జొన్న, మిర్చి, పసుపు, వేరుశెనగ, ప్రత్తి పంటలను పండిస్తారు. ఒక మోస్తారుగా చెఱుకు, తక్కువగా వరి పంటలను పండిస్తారు.

**ఎం.పి.టి.సి.ల, జాబితా**

| క్ర.సం. | గ్రామము | పేరు |
|---|---|---|
| 1. | న్యాల్‌కల్ | ఈశ్వరప్ప |
| 2. | ముంగి | చిట్టమ్మ |
| 3. | హద్నూర్ | అంబమ్మ |
| 4. | రేజింతల్ | మానయ్య |
| 5. | మిర్జాపూర్ | తిప్పారెడ్డి |
| 6. | కల్బేముల్ | చిన్నమ్మ |
| 7. | మామిడ్గి | యేశయ్య |
| 8. | హెసెల్లి | శివాజీ రావు |
| 9. | గుంజోటి | రుద్రయ్య |
| 10. | డప్పూర్ | సుమిత్రాబాయి |
| 11. | మార్గి | లక్ష్మీ బాయి |
| 12. | చీకుర్తి | రామారావు |
| 13. | చాల్కి | క్ష్మనమ |

శ్రీ కె. చంద్రశేఖర్, Ex.జె.సె., పి.ఆర్.టి. మెదక్ వారి సౌజన్యంతో

## సర్పంచ్‌ల జాబితా

| క్ర.సం. | గ్రామము | పేరు |
|---|---|---|
| 1. | హద్నూర్ | ప్రభావతి |
| 2. | అమీరాబాద్ | అనసూయాబాయి |
| 3. | బసంతాపూర్ | ఏసయ్య |
| 4. | చాల్కి | సుధాకర్ |
| 5. | చింగపల్లి | జైరన్ బీ |
| 6. | చికుర్తి | నర్సారెడ్డి |
| 7. | హుస్సేన్ నగర్ | బాబూరావు |
| 8. | డప్పూర్ | రవీందర్ |
| 9. | గంగ్వార్ | విజయ |
| 10. | నియమతాబాద్ | సిద్దప్ప |
| 11. | గుంజోటి | నాగిశెట్టి |
| 12. | హద్నూర్ | అంజయ్య |
| 13. | టేకోర్ | మాణయ్య |
| 14. | హుస్సెల్లి | నర్సింలు |
| 15. | రాజోలా | కే. సాయమ్మ |
| 16. | ఇబ్రహీంపూర్ | సుగుణమ్మ |
| 17. | కల్‌బెముల | విశ్వనాథ్ పటేల్ |
| 18. | కాకి జెన్వాడ | నర్సమ్మ |
| 19. | ముంగి | కిష్టమ్మ |
| 20. | మిర్జాపూర్ (బీ) | మునిరుల్లా హసన్ |
| 21. | కలీల్ పూర్ | చంద్రయ్య |
| 22. | మెటల్‌కుంట | దశరత్ |
| 23. | మామిడిగి | మాణిక్‌రెడ్డి |
| 24. | మాల్గి | పి. విఠల్ రెడ్డి |
| 25. | మిర్జాపూర్ (ఎన్) | తులసమ్మ |
| 26. | న్యాల్‌కల్ | జి. మహరాజ్ |
| 27. | రాఘవాపూర్ | కిష్టయ్య |
| 28. | రతనూర్ | నర్సమ్మ |
| 29. | మిర్యంపూర్ | బసవరాజ్ |
| 30. | రేజింతల్ | ముకుందరెడ్డి |
| 31. | వాడి | పండప్ప |

శ్రీ సి. నర్సింలు, చెర్యాల వారి సౌజన్యంతో

# పాపన్నపేట మండలము

మెదకు జిల్లాలో ఒకప్పటి జాగిర్దారీ సంస్థానులలో ఈ పాపన్నపేట ఒకటి. ఇది మెదకు తాలూకాలో పరిపాలనా వికేంద్రీకరణలో భాగంగా ఈ మండలము ఏర్పాటయినది. ఈ మండల కేంద్రములో సంస్థానాధీశులు నిర్మించుకొన్న పురాతన కోట కలదు.

ఈ మండలము యొక్క విస్తీర్ణము 195 చ.కి.మీ. జనాభా మొత్తం 47748, అందు పురుషులు 23817, స్త్రీలు 23931 గలరు (1991 జనాభా లెక్కల ప్రకారం). అందులో ఎస్.సి.లు 8697, ఎస్.టి.లు 2916 జనాభా కలదు.

ఈ మండలములో 26 గ్రామాలు, 26 గ్రామపంచాయితీలు కలవు.

పాపన్నపేట మండలము ఏర్పాటయిన మొదటి ఎన్నికల్లో (1987 సంవత్సరంలో) ప్రత్యక్ష ఎన్నికల వల్ల శ్రీ సుధీర్‌చంద్ర దేశ్‌పాండే అధ్యక్షులుగా ఎన్నికై తన 5 సంవత్సరముల పదవీకాలంలో మండలాభివృద్ధికి తన వంతు కృషి చేసినారు. రెండవ మారు 1994 సంవత్సరంలో పంచాయితీ రాజ్ వ్యవస్థలో మార్పుల వల్ల ఎం.పి.టి.సి.ల ద్వారా శ్రీ బాలాగౌడ్ అధ్యక్షులుగా ఎన్నికై మండల అభివృద్ధికి ఇతోధికముగా కృషి చేసినారు. ఈ మండలము నుండి జిల్లా పరిషత్‌కు ప్రాతినిధ్యముగా, జడ్.పి.టి.సిగా శ్రీమతి మీరాబాయి దేశపాండే ఎన్నికైనారు.

ఈ మండలములో ప్రాథమిక పాఠశాలలు 33, ప్రాథమికోన్నత పాఠశాలలు 6, మండల పరిషత్ ఆధీనంలో; 5 ఉన్నత పాఠశాలలు జిల్లా పరిషత్ యాజమాన్యంలో పని చేయుచున్నవి.

ఈ మండలములో విద్యార్థి వసతి గృహములు 1 ఎస్.సి., 2 బి.సి.లకు గలవు. మరియు వైద్య సౌకర్యములకు ప్రజలకు మండల కేంద్రములో 1 ప్రాథమిక ఆరోగ్య కేంద్రము, దానికనుబంధముగా ఉపకేంద్రములు పని చేయుచున్నవి. పశువుల చికిత్సకై 8 వైద్య కేంద్రములు కలవు.

ఈ మండలంలో వ్యవసాయదారులకు, వ్యాపారులకు ఉపయోగకరముగా వాణిజ్య బ్యాంకులు పని చేయుచున్నవి.

ఈ మండలంలో రక్షక భట నిలయము, గ్రంథాలయము కలవు. ప్రజలకు ప్రభుత్వము ద్వార సరఫరా అయ్యే చౌకధరలదుకాణములు 26 గలవు. అందు తెల్లకార్డులు 6297 గులాబికార్డులు 6235 ద్వారా గోధుమలు, చక్కెర, బియ్యము, కిరోసిన్, పామాయిల్ సరఫరా జరుగుతున్నది.

ఈ మండలము పూర్తిగా వ్యవసాయాధారిత ప్రాంతము. మండలములో చెఱువులు 24 కలవు.

వీటి ద్వారా 3569 ఎకరాల భూమి ఆయకట్టు జరుగుతున్నది. ఇక్కడ ప్రధాన పంటలు వరి, చెఱుకు, వాణిజ్య పంటలు కూరగాయలు, అక్కడక్కడ వేరుసెనగ, ఉల్లి పంటలను పండిస్తున్నారు.

---

శ్రీ బి. నర్సింహారెడ్డి, టీచర్, జడ్.పి.హెచ్.ఎస్. కంది వారి సౌజన్యంతో

ఈ మండలంలో కొత్తపల్లి సహకార సంఘం జిల్లాలో అతి ప్రాచీనమైనది. మరియు వివిధ కార్యక్రమముల ద్వారా అభివృద్ధి పథాన నడుస్తున్నది.

పాపన్నపేట మండలమునగానే మొదటగా గుర్తొచ్చేది ప్రసిద్ధి చెందిన ఏడుపాయల దుర్గాభవాని దేవస్థానం ఇక్కడ శివరాత్రి పర్వ దిన పురస్కరించుకొని ప్రతియేటా ఉత్సవము జరుగును.

## సర్పంచ్‌లు జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | చిత్రియాల్ | పి. వెంకయ్య |
| 2. | బాచారం | కె. విఠల్ |
| 3. | నార్సింగి | జె. చంద్రయ్య |
| 4. | అర్కేలా | సి. రాములు |
| 5. | చీకోడ్ | సుధీర్ చంద్ర |
| 6. | లింగాయిపల్లి | ఎన్. నారాయణ |
| 7. | మల్లంపేట | ఎస్. పోతగౌడ్ |
| 8. | రామతీర్థ్ | ఎం. దుర్గయ్య |
| 9. | పాపన్నపేట | పి. రుక్మిణి |
| 10. | మిన్‌పూర్ | ఎస్. సుశీల |
| 11. | కుర్తివాడ | కె. స్వరూపారాణి |
| 12. | యూసుప్‌పేట | ఎస్. రుక్కమ్మ |
| 13. | గాంధారిపల్లి | కె. ప్రమీల |
| 14. | ఎల్లాపూర్ | టి. సాములు |
| 15. | నాగ్సాన్‌పల్లి | కె. దుర్గయ్య |
| 16. | కోడ్‌పాక | ఎం. కృష్ణమూర్తి |
| 17. | అన్నారం | డి. భీమయ్య |
| 18. | అబలాపూర్ | ఎస్. రాజ్యలక్ష్మి |
| 19. | కొత్తపల్లి | ఎల్. మల్లయ్య |
| 20. | లక్ష్మీనగర్ (బి) | ఆర్. రాజ్యలక్ష్మి |
| 21. | పొడ్చన్‌పల్లి | డి. ప్రతాప్‌రెడ్డి |
| 22. | పోచన్‌పల్లి తండా | డి. దురిగ్యా |
| 23. | గాడులగూడ | జె. జేసిక్క |

కీ.శే. బి. విజయభాస్కర్ రెడ్డి వారి సౌజన్యంతో

## ఎం.పి.టి.సి.ల జాబితా

| | గ్రామం పేరు | ఎం.పి.టి.సి |
|---|---|---|
| 1. | పాపన్నపేట | బి. కమల |
| 2. | యూసుఫ్ పేట | బి. పద్మావతి |
| 3. | కొత్తపల్లి | బి. దుర్గయ్య |
| 4. | పొడ్చన్ పల్లి | వి. రవీందర్ |
| 5. | కొడిపాక | ఎం. మాణిక్యం |
| 6. | చీకోడ్ | బి. నారాయణ |
| 7. | మిన్‌పూర్ | హెచ్. శాంత |
| 8. | కర్తి వాడ | ఎ. గంగుబాయి |
| 9. | లింగాయిపల్లి | పి. బాలయ్య |
| 10. | ఎల్లాపూర్ | జి. లక్ష్మి |
| 11. | బాచారం | ఎల్. బాలాగౌడ్ |
| 12. | అర్కేలా | ఎల్. శంకర్ |
| 13. | అన్నారం | షేక్ ఉస్ఫేన్ |
| 14. | మల్లంపేట్ | పి. మోహన్ రెడ్డి |

ఎస్. లక్ష్మి నర్సింహాచార్యులు, తె.పం. జడ్.పి.హెచ్.ఎస్., కంది వారి సౌజన్యంతో

# పొటన్‌చెరువు మండలము

మెదుకు జిల్లాలో పొటన్ చెరువు మండలమునకొక ప్రత్యేక స్థానము కలదు.

పొటన్ చెరువును మొదట పొటన్ కెరె అని పొట్ల చెరువు అని పిలిచేవారు, రాను రాను పొటన్ చెరువుగా పిలువబడుచున్నది. ఈ ప్రాంతము చారిత్రికముగా సుప్రసిద్ధము. ఈ ప్రాంతము బౌద్ధ, జైన మతములు సువ్యాప్తమైనట్లు ఇక్కడి శిథిలాలు కథలు చెపుతాయి.

అమీన్‌ఖాన్ అనే సంస్థానాధీశుడు పొనగంటి తెలగనార్యునితో మొట్టమొదటి అచ్చుతెనుగు కావ్యాన్ని 'యయాతి చరిత్ర'ను వ్రాయించి అంకితమందినాడు. మల్కి 'భ' రాముడుగా ప్రసిద్ధమైనాడు.

నిజాంనవాబు భారతదేశసైన్యంకు లొంగి పోయి తనరాజ్యాన్ని స్వతంత్ర భారతదేశంలో విలీనం చేసిన ప్రాంతం పొటన్‌చెరువే.

ఈ విధంగా చారిత్రికంగా పేరు మోసిన పొటన్‌చెరువు నేడు రాష్ట్రంలోనే ఒక పెద్ద పారిశ్రామిక కేంద్రంగా విలసిల్లింది. అనేక కర్మాగారాలు ఈ ప్రాంతంలో వెలిసినవి.

పొటన్ చెరువు మొదట సంగారెడ్డి తాలూకాలో ఉండేది. కాని పంచాయితీ రాజ్ వ్యవస్థలో పంచాయతి సమితి కార్యాలయము సంగారెడ్డిలో కాక పొటన్‌చెరువులో ఉండేది.

మండల వ్యవస్థ ఏర్పాటైన పిదప పొటన్‌చెరువు ఒక మండలంగా ఏర్పడింది.

పొటన్‌చెరువు మండలంవైశాల్యము 22,704 హెక్టార్లలో కలదు. ఈ మండలమునందు 26 గ్రామములు, 23 గ్రామ పంచాయతీలు కలవు.

ఒకప్పుడు పొటన్‌చెరువు సామాన్య గ్రామమై అతి తక్కువ జనాభాతో ఉండేది.

పారిశ్రామికంగా అభివృద్ధి చెందినకొద్ది ఈ గ్రామము పట్టణంగా రూపుదిద్దుకొని అధిక జనాభాతో అలరారుతున్నది.

ఈ మండల జనాభా 1991 గణన ప్రకారము 79582 కలదు. ఇందు పురుషులు 41948, స్త్రీలు 37634 ఉన్నారు.

ఈ మండలమునందు చెరువులు 17, కుంటలు 168 కలవు. ఇక్కడ ఎక్కువ వరి, కూరగాయలు పండింతురు.

ఈ మండలమునందు 10051 ఎకరములు ప్రభుత్వ భూమి కలదు. దీనిలో వ్యవసాయ యోగ్యమైన భూమి 4401 ఎకరాలు మాత్రము. భూమి లేని నిరుపేదలకు పంపిణి చేయనైనది. అట్లే 708 ఎకరాల సీలింగ్ మిగులు భూమిలో 382 మంది లాభోక్తులకు 559 ఎకరాలు పంపిణి చేయబడినది. 125 ఎకరాల భూమి ఇండ్ల స్థలాలకై మంజూరి చేయబడినది.

---

శ్రీ ఎస్. రాములు, టీచర్, జడ్.పి.హెచ్.ఎస్., కంది వారి సౌజన్యంతో

పొటన్‌చెరువు మండలమున ప్రభుత్వ విద్యాలయాలతో పాటు అనేక ప్రైవేటు బడులు కూడా కలవు. ప్రభుత్వ యాజమాన్యమున 24 ప్రాథమిక పాఠశాలలు, 12 ప్రాథమికోన్నత పాఠశాలలు, 9 ఉన్నత పాఠశాలలు, 1 జూనియర్ కళాశాల కలవు. చిట్కూల్ గ్రామమున బాలికల ఆవాస విద్యాలయము కలదు. ఈ మండల పరిషత్తు యాజమాన్యమున స్కూల్ అసిస్టెంటు-II గ్రేడు ఉపాధ్యాయులు 14, యస్. జి. టి. లు 137, తెలుగు పండిత II గ్రేడువారు. 7, పని చేయుచున్నారు. వీరుగాక జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలలో వివిధ కేటగిరీలకు చెందిన ఉపాధ్యాయులు పని చేయుచున్నారు.

ఈ మండలమునందు సాంఘిక సంక్షేమ బాలుర వసతి గృహములు 3 కలవు.

ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు 2, పశువైద్యశాలలు 2, ఈ మండలమున పని చేయుచన్నవి.

ఈ మండలమునందు ప్రతి గ్రామమునకు పోస్టు మరియు టెలిఫోను వసతి సౌకర్యములు గలవు. పొటన్ చెరువు మండలము ప్రభుత్వము చే వృద్ధాప్య పింఛనులు 1200 వితంతు పింఛన్లు 120 మంజూరి చేయబడినవి.

ఈ మండలమున నిత్యావసర సరకుల పంపిణీకై 37 మంది డీలర్లున్నారు.

ఈ ప్రాంతమునందలి జనులు ముఖ్య వృత్తి పరిశ్రములలో పని చేయుట అని చెప్పవచ్చును. పల్లె, పట్టణమైన తర్వాత వ్యవసాయము కన్న వ్యాపారము లాభసాటిగా మారినది.

పొటన్ చెరువు మండల కేంద్రమున మండల రెవెన్యూ కార్యాలయము, మండల పరిషత్ కార్యాలయము, పోలీసు ఇన్స్పెక్టర్, ఇంజనీరింగ్, విద్యుత్తు, వ్యవసాయ శాఖ, మొదలగు కార్యాలయములు కలవు.

ఈ మండల కేంద్రము బొంబాయి ప్రధాన రహదారిపై కలదు. ఇక్కడ ఆర్. టి. సి. వారి ప్రయాణ ప్రాంగణము విశాలముగా నిర్మింపబడి యున్నది.

ఈ మండలమునందే వ్యవసాయ పరిశోధనాగారముగా వాసికెక్కిన 'ఇక్రిశాట్' కలదు. పల్లి, మక్క, కంది మొదలగు మెట్ట పంటల కొత్త వంగడాలు ఇక్రిశాట్‌లో కనుగొనబడి దేశం నలుమూలలా పంపబడతాయి. తద్వారా వ్యవసాయాభివృద్ధి జరుగుతుంది.

ప్రభుత్వరంగ సంస్థలైన ఆల్విన్ వాచ్, ఏ. పి. స్కూటర్స్ అనే ఫ్యాక్టరీలు నష్టాలకులోనై ఈ మధ్య కాలంలో మూతబడ్డాయి.

ఈ మండలంలో భారీ పరిశ్రమలు, చిన్న పరిశ్రమలు ఎన్నో ఉన్నాయి. ఎన్ని పరిశ్రమలున్నప్పటికి ఈ జిల్లా ప్రజల నిరుద్యోగాన్ని పోగొట్టుట లేవు.

శ్రీ ఎస్. రాములు, టీచర్, జడ్. పి. హెచ్. ఎస్., కంది వారి సౌజన్యంతో

పొటన్‌చెరువు మండలము పారిశ్రామికముగా బాగా ఎదిగి మెదకు జిల్లాకు ప్రత్యేకముగా కలిగించిన లాభమేదియు లేదని చెప్పవచ్చును. ఇక్కడి పరిశ్రమలలో ఈ జిల్లా వాసులకంటె ఇతర ప్రాంతాల వారికే ఎక్కువగా ఉద్యోగములు లభించినవి. లభించిన ఉద్యోగాలు కూడా పెద్ద తరగతివి కాక లేబర్ క్యాడర్‌లోనే అధికము. ఈ విధంగా జిల్లా వాసులకు నష్టం కలుగడమేగాక ప్రత్యేకంగా ఈ పరిశ్రమల నుండి వెలువడే కాలుష్యంతో ఈ ప్రాంతం అంతా పర్యావరణ కాలుష్యం ఏర్పడి నివసించడానికి దుర్భరమైన పరిస్థితిని కలిగిస్తున్నదని చెప్పక తప్పదు. ఈ మధ్యకాలంలో ప్రజలలో వచ్చిన చైతన్యము ప్రభుత్వాల కఠిన నిర్ణయాలు కొంత వరకు కాలుష్య భూతాన్ని తగ్గిస్తున్నదని చెప్పక తప్పదు.

## సర్పంచ్‌లు జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు | |
|---|---|---|---|
| 1. | అమీన్‌పూర్ | కె. ధర్శన్ గౌడ్ | |
| 2. | భానూర్ | బి. దశరథ్ రెడ్డి | |
| 3. | చిట్కూల్ | ఎం. నరేందర్ రెడ్డి | |
| 4. | చినకంజర్ల | కె. రాంప్రసాద్ యాదవ్ | |
| 5. | ఇస్నాపూర్ | వై. మల్లారెడ్డి | |
| 6. | క్యాసారం | కె. భాగ్యమ్మ | |
| 7. | లక్డారం | శోభ | |
| 8. | ముత్తంగి | జె. సత్యనారాయణ శర్మ | |
| 9. | నందిగామ | ఎన్. నర్సమ్మ | |
| 10. | పోచారం | రాజారామ్ సింగ్ | |
| 11. | పాశమైలారం | హెచ్. నారాయణ | |
| 12. | పెదకంజర్ల | వి. బాలమణి | |
| 13. | రుద్రారం | కె. వెంకయ్య | |
| 14. | ఇంద్రేశం | జి. నారాయణ | |
| 15. | ఐనోల్ | కే. పాపమ్మ | |
| 16. | సుల్తాన్ పూర్ | ఎన్. విజయలక్ష్మి | |
| 17. | వడక్‌పల్లి | వి. లక్ష్మి | |
| 18. | కృష్ణారెడ్డి పేట | బి. నాగలక్ష్మి | |
| 19. | ఐలాపూర్ | సురేశ్ | |
| 20. | పాటిఘన్‌పూర్ | ఆర్. చంద్రశేఖర్ రెడ్డి | |
| 21. | కర్దనూర్ | ఇ. యాదగిరి | |
| 22. | పాటి | ఎన్. భూపాల్‌రెడ్డి | |
| 23. | పొటన్‌చెరు | శంకర్ యాదవ్ | |

శ్రీ ఎస్. రఘురాం రెడ్డి, టీచర్, జడ్.పి.హెచ్.ఎస్.,కంది వారి సౌజన్యంతో

## ఎం.పి.టి.సి.ల జాబితా

| | గ్రామం పేరు | ఎం.పి.టి.సి | |
|---|---|---|---|
| 1. | అమీన్‌పూర్ | ఎల్. గీత | |
| 2. | ఇంద్రేశం | జి. మల్లయ్య | |
| 3. | ఇస్నాపూర్ | టి. నర్సింలు | |
| 4. | ఐనోల్ | ఎస్. రామయ్య | |
| 5. | కిష్టారెడ్డిపేట్ | ఎన్. జంగయ్య | |
| 6. | ఘన్‌పూర్ | ఎస్. సత్యనారాయణ | |
| 7. | చిట్కూల్ | వై. రాములు యాదవ్ | |
| 8. | నందిగామ | ఎ. పుష్పమ్మ | |
| 9. | పాటన్‌చెరువు 1. | జి. మహిపాల్‌రెడ్డి | |
| 10. | 2. | ఎమ్. మల్లేష్ | |
| 11. | 3. | ఎన్. మాణిక్యం | |
| 12. | 4. | కె. నర్సింహా చారి | |
| 13. | 5. | ఎమ్. డి. మఖ్దూం అహమద్ | |
| 14. | 6. | ఎమ్. సపాన్ దేవ్ | |
| 15. | 7. | జి. మాణిక్ ప్రభు | |
| 16. | 8. | --- | |
| 17. | పెదకంజర్ల | ఎల్. పెంటమ్మ | |
| 18. | పోచారం | వై. యాదమ్మ | |
| 19. | భూనూర్ | ఎ. రాములు | |
| 20. | ముత్తంగి | బి. లక్ష్మి | |
| 21. | రుద్రారం | కె. నిర్మల | |
| 22. | లక్డారం | భాగ్యలక్ష్మి | |
| 23. | సుల్తాన్‌పూర్ | కె. మంజుల | |
| 24. | కో ఆప్టెడ్ మెంబర్ | ఎం.ఎ. వహీద్ బేగ్ | |

# పుల్కల్ మండలము

పుల్కల్ మండలము మెదకు జిల్లాలో ఒక ప్రత్యేకత కలిగియున్న మండలము. మెదకు జిల్లాలోనున్న ఏకైక ప్రాజెక్టు సింగూరు ఈ మండలమున కలదు అందుచే జిల్లాలోనే ప్రత్యేకత సంతరించుకొన్న మండలముగా చెప్పవచ్చును.

తాలూకా లను పరిపాలనా వికేంద్రీకరణలో భాగంగా 1985 లో మండలాలుగా విభజించుట జరిగినది. పర్యావసానముగా అందోలు తాలూకాలో చేరిన ఈ ప్రాంతము పుల్కల్ మండలముగా నేర్పడినది.

సంగారెడ్డి-జోగిపేట రోడ్డులో సంగారెడ్డి నుండి 22 కి.మీ. దూరముగల శివ్వంపేట నుండి పుల్కల్ మండలము ప్రారంభమగును. ఈ రోడ్డు నుండి పుల్కలుకు రోడ్డు గలదు. ఈ రోడ్డు సింగూరు ప్రాజెక్టు వరకు వేయబడినది. ఈ రోడ్డుకిరు వైపుల, నున్న ప్రాంతమంతయు పుల్కల్ మండలమున చేరును.

పుల్కల్ మండలమునకు తూర్పున హత్నూరు మంజీరానది, పశ్చిమమున మంజీరనది కున్న సింగూరు ఆనకట్ట మునిపల్లి మండలము, దక్షిణమున మంజీరానది కావల సంగారెడ్డి మండలము ఉత్తరాన అందోలు మండలము ఎల్లలుగానున్నది.

పుల్కల్ మండలము భౌగోళికముగా చాలా విశాలమైనది.

ఈ మండల జనాభా 1991 గణన ప్రకారము 42256 మంది కలరు. ఇందులో స్త్రీలు 20841 పురుషులు 21415 ఉన్నారు. వీరిలో S.C. లు 9845. S.T. లు 2658 కలరు. మండలములోని ఓటర్లు స్త్రీలు 15405, పురుషులు 15279 మొత్తము 30684 గురు కలరు. ఈ మండలమునందు 30 గ్రామములు 7 మదిరలు కలవు. 25 గ్రామ పంచాయితీలు ఈ మండలమునందున్నవి.

1987 లో మండల ప్రజాపరిషత్తు ఏర్పడగానే జరిగిన ఎన్నికలలో శ్రీ సుభాష్‌రెడ్డిగారు ఎన్నికై ప్రజా సేవచేసిరి ఆ తర్వాత పంచాయితీరాజ్ యాక్ట్‌లో జరిగిన స్వల్ప మార్పులతో 1995లో ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికలలో మండల పరిషత్తు అధ్యక్షుని పరోక్షముగా ఎన్నుకోబడుట జరిగినది. మండల అధ్యక్షునిగా శ్రీ. జె. నాగేంద్రప్ప ఉపాధ్యక్షునిగా శ్రీ. ఎన్. దుర్గయ్య గారులు ఎన్నుకోబడిరి. ఈ మండలములో 12 మంది M.P.T.C. లు ఎన్నుకోబడినారు. ఈ మండలము నుండి Z.P.T.C. గా శ్రీమతి కే. శాంతమ్మ ఎన్నుకోబడి జిల్లా పరిషత్తు నందు ప్రాతినిధ్యము వహించున్నారు.

---

**శ్రీ సి. అంజిరెడ్డి**, రిటైర్డ్ టీచర్, సంగారెడ్డి వారి సౌజన్యంతో

ఈ మండలమునందు వ్యవసాయ యోగ్యమైన భూవిస్తీర్ణము 32583 ఎకరములు. అందు మాగాణి 6069 ఎకరవులు మెట్ట 26514 ఎకరవులు బీడు భూవి 1146 ఎకరవులుకలదు. ఈ మండలములు మాత్రము ప్రభుత్వ భూమి 3157 ఎకరములు అసైన్‌మెంటు చేయబడి బీద రైతులకు వ్యవసాయమున కొసంగబడినది. ఈ మండలమున ఎక్కువ భాగము నల్లరేగడి భూములు ఎక్కువ తక్కిన భూమి అచ్చుటచ్చుట ఎర్రనేల కలదు. ఒక్కొక్క చోట నలుపు, ఎరుపు కలిగిన మిశ్రమ భూములు కూడా ఈ మండలమున అగుపించును. పక్కపక్కనే నల్లరేగడి భూమి నానుకొని ఎరపు రంగునగల చెలకభుములు అగుపించుచున్నవి. ఈ మండలమున గల బస్వాపూర్ గ్రామమున గల చెరువునకు ఎర్ర నల్ల చెరువు అని పేరున్నది. ఇక్కడ సంవత్సర వర్షపాతము సరాసరి 900 మి. మీ. ఈ మండలమున చెరువు కుంటలు 122 కలవు. బావులు చాలా తక్కువ. ఈ మధ్య కాలమున గొట్టపు బావుల త్రవ్వకము జరుగుచున్నది. ఈ ప్రాంతవంతయు మెట్ట వ్యవసాయవుుపై నే ఆధారపడియుండను. రేగడి భూములలో జొన్న, పప్పు, దినుసులు, నూనె గింజలు, మిరప ఎక్కువగా పండింతురు. అక్కడక్కడ పత్తి కూడా పండించుట కలదు.

ఈ మండలమునకు జిల్లాకే గర్వకారణమైన జిల్లాలోని ఏకైకమైన మంజీరా నదికి ఆనకట్ట వేయబడి సింగూరు ప్రాజెక్టు గా పిలువ బడుచున్నది. పేరుకు సింగూరు ప్రాజెక్టు. ఇందులోని నీటి బొట్టు కూడా ఈ మండల వాసులకు త్రాగుటకు యోగ్యము లేదు. ఈ మండలవులోని భూవులకు ఈ ప్రాజెక్టునీరు ఆకాశ గంగవలె నావూవశిష్టవు. సింగూరు ప్రాజెక్టు నిర్మాణము నాడు ఈ ప్రాజెక్టులోని నీరు కొంత ఇక్కడి వ్యవసాయమునకు ఇచ్చుటకు ఒప్పందము కలదందురు. కాని నేడు మాత్రము ఈ ప్రాజెక్టు నీరంతయు భాగ్యనగర వాసుల పానయోగ్యముగానున్నది. ఆనాటి రంతి దేవునివలె ఈ వుండల ప్రజలు తవు నీరును ఇతరులకు ధారపోయుచున్న త్యాగధనులు.

పుల్కల్ మండలము చుట్టును మూడువైపుల వుంజీరానది ప్రవహించుచున్నది. అచ్చుటచ్చుట కరెంటు మోటర్లతో నదీ పరీవాహిక భుములకు నీరు పారించు కొనును భూ వ్యవసాయము చేయుదురు.

పుల్కల్ మండలమున చౌటకూరు, పుల్కల్ గ్రావూలలో 2 టెలిఫోన్ ఎక్స్‌చేంజీలుండి గ్రావు ప్రాంతాలలో టెలిపోల్ వసతిని కల్పించుచున్నవి. ఈ వుధ్య కాలంలో పుల్కల్ టెలిఫోన్ ఎక్స్‌చేంజిని ఎస్.టి.డి.గా వూర్చుటచే దూర ప్రాంతాలకు సహితవు ఫోన్ సౌకర్యవుతో సాన్నిహిత్యవు కల్పించినట్లైనది. మండలమున 16 సబ్ పోస్టాఫీసు లుండి తపాలా సౌకర్యమును ప్రజలకందించుచున్నవి.

ఈ మండలమునందు ఇసోజీపేటలో ఒకే ఒక బియ్యపు మిల్లు కలదు. చార్‌మినార్ బీవరస్ పేట శివ్వంపేట గ్రామ సరిహద్దులో ఒక అల్కాహాల్ ఫ్యాక్టరీ నిర్మింపబడి ఉత్పత్తి సాగించుచున్నది.

పుల్కల్, శివ్వంపేట, చౌటకూరు గ్రామాలలో మంజీరా గ్రామీణ బ్యాంకు శాఖలు వ్యవసాయాభివృద్ధికై తగు రుణముల మంజూరి చేయుచు రైతులకు ఇతోధిక సహాయమొనర్చుచున్నవి.

ఈ మండలమునందు పుల్కల్, ముదిమాణిక్యం పోచారం, మిన్‌పూర్, కొర్పోల్, శివ్వంపేటలలో 6 ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘములు కలవు. ఈ సంఘముల ద్వారా వ్యవసాయ దారులకు పంట రుణములు, దీర్ఘకాలిక రుణములు లభించుచున్నవి. మండల పరిషత్తు ద్వారా 55 మానాగండ్లు, 5 పవర్‌స్ప్రేలు, 8 ప్యాడీప్లీడర్స్ సబ్సిడీ ధరలపై వ్యవసాయ దారులకు అందించబడినవి.

ఈ మండలమున 116 డ్వాక్రా గ్రుపులుండి 175 మంది సభ్యులు కలిగి 1.5 లక్షల రూపాయలు పొదుపు మొత్తములు కలిగియున్నవి. అంతే మోతాదులో ప్రభుత్వ రుణమును పొందిన ఈ డ్వాక్రా గ్రూపులలోని స్త్రీలు స్వశక్తితో కుటీర పరిశ్రమల నేర్పాటు చేసికొని కుటుంబ పోషణలో తమ వంతు పాత్రను చక్కగా నిర్వహించు చున్నారు.

చెరువు కుంటలు కింద, బావుల కింద తరిసేద్యము చేయుదురు. వరిపంట ఈ మండలమున చాలా తక్కువ అని చెప్ప వచ్చును. అచ్చటచ్చట చెరకు పంట కూడా పండింపబడుచున్నది. ఈ మధ్యకాలమున గణపతి షుగర్స్, చెక్కర ఫ్యాక్టరీ ప్రారంభమైనది దీంతో మండలమున చెరుకు పంట గణనీయముగా పెరిగినది.

పుల్కల్ మండలమున శివ్వంపేట - చౌటకూరు - ముదిమాణిక్యం-పుల్కల్ గ్రామాలలో (4) ఉన్నతపాఠశాలల కలవు ఇంకను 2 పాఠశాలలు ఉన్నత పాఠశాలలగా రూపాంతరము చెందుచున్నవి. 4 ప్రాథమికోన్నతపాఠశాలలు 27 ప్రాథమిక పాఠశాలలు ఈ మండలమున విద్యావాప్తికి నిరంతరకృషి సల్పుచున్నవి.

S.C, B.C . బాలురలో విద్యా వ్యాప్తి కలిగించి వారిని చైతన్య వంతులుగా వించుటకై ఈ మండలము నందు S.C, B.C . విద్యార్థి వసతి గృహములు మూడుగలవు.

ఈ మండలమున పుల్కల్‌లో ఒక ప్రాథమిక ఆరోగ్యకేంద్రము స్వంతభవనముతో అన్ని వసతులతో నెలకొల్పబడినది. ఈ ఆరోగ్యకేంద్రమున ఇరువురు డాక్టర్లు (మగ + ఆడ), నర్సులు, ఆయాలు, తగురీతిలో నియమింపబడిరి. ఈ ఆరోగ్య కేంద్రమునకు అనుబంధముగా 9 ఉపకేంద్రములు పని చేయుచున్నవి. ఈ ఉప కేంద్రములలో నర్సులు ఆరోగ్య కార్యకర్తలు పని చేయుదురు.

వీరు గ్రామములలో స్త్రీల, శిశువుల ఆరోగ్యసంరక్షణ లోపాలుపంచుకొనుచు కుటుంబ నియంత్రణ, రోగనిరోధక టీకాలు, ప్రసూతులు మొదలగు ఆరోగ్య కార్యక్రమముల నిర్వహింతురు. ఈ మండలమున ఒక పశు వైద్యశాల కలదు. అనుబంధముగా 3 ఉపకేంద్రముల కలవు, ఇవి ఈమండలములో పశువుల సంరంక్షించుచు, కృత్రిమ గర్భధారణలగావించుచు పశుపోషణలో తగుసలహాలనిచ్చుచు విధులను నిర్వహించుచున్నవి.

పుల్కల్ మండలమున సంజయ్ గ్రామీణ విద్యుదీకరణ సంస్థ ద్వారా విద్యుత్తు సరఫరాయగు చున్నది. ఈ మండలమున రెండు సబ్‌స్టేషన్‌లు కలిగి 135 ట్రాన్స్‌ఫార్మర్లు కలవు. సుమారు 1700 వ్యవసాయ పంపుసెట్లకు విద్యుత్తు నందించుచున్నారు.

పుల్కల్ మండలమున 646 వృద్ధాప్య పింఛనులు మంజూరియైవృధ్ధులకుక్రమముగా అందిపబడుచున్నవి.

ఈ మండలమున 8 మహిళామండళ్లు చక్కగాపనిచే యుచున్నవి. మండలకేంద్రమైన పుల్కల్‌లో గ్రంధాలయము కలదు. 14 నీటిసంఘులు, 37 విద్యాసంఘాలు పనిచేయుచున్నవి.

పుల్కల్ మండలమున 1. శ్రీ కాశఅంజయ్య 2. శ్రీ కాశనర్సింలు 3. కీ.శే. గాండ్లరామలింగ్ 4.కీ.శే.సాలెరాములు గారులు నిజాం విమోచనో ద్యమంలో పాల్గొని చెరసాలలపాలై తమ జీవితములను ధన్యతగా వించుకొనిన స్వాతంత్ర్య సమరయోధులు.

ఈ మండలమున 6771 తెల్లకార్డులు, 2608 గులాబీకార్డులు కలవు. ప్రతినెల ఈ మండలమున చౌకధర దుకాణముల ద్వారా బియ్యము 1101-20 క్విం. చక్కెర 126.80 క్విం. గోధుమ 20 క్విం. కిరోసిన్ 24750 లీటర్లు సరఫరాచేయబడుచున్నవి.

## మండలంలోని ఎం.పి.టి.సీ.ల పేర్లు

| క్ర.సంఖ్య | విలేజ్ | యం.పి.టి.సి | |
|---|---|---|---|
| 1. | పుల్కల్ | శ్రీ బి. మనయ్య | |
| 2. | పోచారం | శ్రీ కె. శాంతమ్మ | |
| 3. | సింగూర్ | శ్రీ పి. రాములు | |
| 4. | పెద్దారెడ్డి పేట్ | శ్రీమతి పి. సుభద్ర బాయి | |
| 5. | మంతూర్ | శ్రీ సత్తర్ పటేల్ | |
| 6. | మిన్‌పూర్ | శ్రీ యమ్. పాండురంగం | |
| 7. | ముద్‌మానిక్ | శ్రీ జే. నాగేంద్రప్ప | |
| 8. | యస్. ఇటిక్యల | శ్రీ ఓం సింగ్ | |
| 9. | శివ్వంపేట్ | శ్రీ దుర్గయ్య | |
| 10. | చెక్రియల్ | ఆర్. పండరి | |
| 11. | కోర్‌పాల్ | శ్రీమతి పోచమ్మ | |
| 12. | చౌటకూర్ | శ్రీ మేటి ప్రశాంత్ కుమార్ | |

## సర్పంచ్‌ల జాబితా

| క్ర.సం | మండల్ | సర్పంచ్ |
|---|---|---|
| 1. | పుల్కల్ | యమ్. సిద్దయ్య |
| 2. | ముద్దాయిపేట్ | బి. నర్సమ్మ |
| 3. | పోచారం | కె. చంద్రకళా |
| 4. | సింగూర్ | మల్లయ్య |
| 5. | పెద్దారెడ్డి పేట్ | యమ్. సాంగయ్య |
| 6. | రాయ్‌పాడ్ | ఆదివమ్మ |
| 7. | కోడుర్ | ఆర్. భాగ్యమ్మ |
| 8. | మిన్‌పూర్ | జి. గోపాల్ |
| 9. | మంతూర్ | యమ్. శంకరయ్య |
| 10. | బస్వాపూర్ | బి. మహేందర్ రెడ్డి |
| 11. | మునిమానిక్ | ఏ. పెంటయ్య |
| 12. | యస్. ఇటిక్యాల్ | మొగులమ్మ |
| 13. | శివ్వంపేట్ | యమ్. విట్టల్ |
| 14. | చెక్రియల్ | పి. వెంకట్ నర్సింహా రెడ్డి |
| 15. | ఐసోజిపేట్ | యన్. వెంకటమ్మ |
| 16. | వేండికోల్ | జి. రామయ్య |
| 17. | వెంకట్ కిష్టాపూర్ | యమ్. చంద్రయ్య |
| 18. | సుల్తాన్‌పూర్ | జి. రత్నమ్మ |
| 19. | కోర్‌పోల్ | జి. దుర్గాబాయి |
| 20. | చౌటకూర్ | కె. చెన్నయ్య |
| 21. | ఉప్పరిగూడెం | గొల్ల శివ కుమార్ |
| 22. | లక్ష్మీ సాగర్ | శివ రాములు |
| 23. | బొమ్మారెడ్డి గూడెం | శోభ |
| 24. | గొంగులూర్ | యన్. వెంకటేశమ్ |
| 25. | గంగోజీ పేట్ | యన్. ప్రతాప్ రెడ్డి |

# రాయికోడ్ మండలము

పరిపాలన వికేంద్రీకరణలో భాగంగా మెదకు జిల్లాలో సంగారెడ్డి డివిజన్ పరిధిలో ఈ మండలము ఏర్పాటైయినది. రాయికోడ్ మండల విస్తీర్ణము 291 చ.కి.మీ. మొత్తం జనాభా 30740 ఇందులో పురుషులు 15781, స్త్రీలు 14959 గలరు. అందు ఎస్.సి.లు 7107, ఎస్.టి.లు 128 జనాభా కలిగి యున్నది.

ఈ మండలములో మొత్తం 37 గ్రామాలు, 37 గ్రామపంచాయితీలు కలవు.

ఈ మండలమేర్పాటయిన తరువాత జరిగిన మొట్టమొదటి ఎన్నికల్లో ఈ మండల ప్రజాపరిషత్తుకు అధ్యక్షులుగా శ్రీ వీరయ్య స్వామి ప్రత్యక్షంగా ప్రజలచే ఎన్నికై తన 5 సంవత్సరముల పదవీ కాలంలో మండలాభివృద్ధికి విశేషకృషి సల్పినారు. 1994 సంవత్సరంలో పంచాయితీరాజ్ చట్టం మార్పు చెంది మండల ప్రాదేశిక నియోజక వర్గములు ఏర్పడినవి ఈ ఎం.పి.టి.సిల నుండి ఒకరిని అధ్యక్షునిగా ఎన్నికోవటం జరిగినది. ఆ విధంగా ఈ మండల పరిషత్తు అధ్యక్షులు శ్రీ బి. అంజయ్య ఎన్నికై తన పదవీకాలంలో మండలాభివృద్ధికి తనవంతు కృషి సల్పిరి. ఈ మండలం నుండి జిల్లా ప్రాదేశిక నియోజక వర్గ సభ్యునిగా (జడ్.పి.టి.సి.గా) శ్రీ ఎమ్. ఏసు రత్నం ఎన్నికై జిల్లా పరిషత్‌లో మండల సమస్యలపై చర్చించి పదవీకాలంలో మండలాభివృద్ధికి తన వంతు చేసినారు.

ఈ మండలములో యున్న భూమి చాలా భాగవు వ్యవసాయెూగ్యవు కానందున ఈ ప్రాంతరైతులు చాలా దుర్భర జీవితాన్ని గడుపుతున్నారు. మరియు నీటి పారుదల సౌకర్యాలు తక్కువ కాబట్టి రైతులు మెట్టపంటలను పండిస్తారు.

ఇక్కడ జొన్నలు, మినుములు, కందులు, మిర్చి పంటలను పండిస్తారు.

ఈ మండలములో అక్షరాస్యత చాలా తక్కువ. ఈ మధ్యన ప్రవేశపెట్టిన అక్షర సంక్రాంతి, రాత్రి బడుల ద్వారా కొంత వరకు అక్షరాస్యత కల్గుతున్నట్లు తెలుస్తున్నది.

ఈ మండలంలో పరిషత్ యాజమాన్యంలో 30 ప్రాథమిక పాఠశాలలు 3 ప్రాథమికోన్నత పాఠశాలలు, పనిచేయుచున్నవి. జిల్లా పరిషత్ ఆధీనంలో ఒక (1) ఉన్నత పాఠశాల నడుపబడుతున్నది.

ఈ మండలంలో విద్యార్థుల వసతి గృహములు 3 కలవు. ప్రజల ఆరోగ్య సంరక్షణకై మండలంలో ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రము, దానికనుబంధంగా ఉపకేంద్రములు నడుపబడు చున్నవి. మరియు మూడు పశువైద్య కేంద్రములు, రక్షకభట నిలయం గ్రంథాలయములు కలవు.

ఈ మండలంలో 29 చౌకధరల దుకాణములు కలవు.

ఈ మండల కేంద్రములో అతి ప్రాచీనముయిన వీరభద్రస్వామి దేవాలయము కలదు. ప్రతిఏటా జాతర జరుగును మం. లంలోని అ గ్రామాల ప్రజలు ఈ జాతరలో పా పంచుకొందురు.

## సర్పంచ్‌ల జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | ఔరంగా నగర్ | పి. ఎలగొండ |
| 2. | ధర్మాపూర్ | బిచ్చప్ప |
| 3. | హన్నాబాద్ | ప్రమీల |
| 4. | హల్‌జీరా | ఆర్. బకప్ప |
| 5. | శంశీదినూర్ | చౌదరి |
| 6. | ఇన్‌దూర్ | ఎం. వీరమ్మ |
| 9. | ఇటిక్ పల్లి | రతన్‌లాల్ |
| 10. | జంబ్‌గి (కె) | పి. శివరుద్రప్ప |
| 11. | మరెట్‌గావ్ | నర్సయ్య |
| 12. | కుష్నూర్ | వీరమణమ్మ |
| 13. | కోడూర్ | ఎ. నర్సింలు |
| 14. | కర్చాల్ | నర్సమ్మ |
| 15. | నాగన్‌పల్లి | సలీమా బి |
| 16. | మందాపూర్ | బసవరాజ్ |
| 17. | మామిడిపల్లి | మహబూబ్ అలీ |
| 18. | నల్లంపల్లి | మణెమ్మ |
| 19. | నిగ్వార్ | డేలప్ప |
| 20. | పాంపాడ్ | నర్సింగ్‌రావ్ |
| 21. | పీపల్ పల్లి | సుభాష్ |
| 22. | రాయికోడ్ | బక్కాగౌడ్ |
| 23. | రాయిపల్లి (సి.కె.) | ఎస్. బీరగొండ |
| 24. | సంగాపూర్ | రమణ |
| 25. | సింగీతం | పి. మల్లికార్జున్ |
| 26. | సిరూర్ | ఇస్మాయిల్ పటేల్ |
| 27. | యూసఫ్ పూర్ | అంజమ్మ |

## ఎం.పి.టి.సి.ల జాబితా

| | ఎం.పి.టి.సి. | |
|---|---|---|
| 1. | ఎం. మానయ్య (ఉపాధ్యక్షులు) | |
| 2. | ఎన్. ఆగమయ్య | |
| 3. | పి. సిద్దప్ప | |
| 4. | నివర్తి | |
| 5. | ఎ. వీరయ్య స్వామి | |
| 6. | నాగమణి | |
| 7. | జె. పార్వతమ్మ | |
| 8. | జి. సుజాత | |
| 9. | జాదత్ ఖాన్ | కో ఆప్టెడ్ మెంబర్ |

# రామచంద్రాపురం మండలం

మెదక్ జిల్లాలో రామచంద్రాపురం మండలానికి ఒక విశిష్ట స్థానం ఉంది. పరిపాలనా వికేంద్రీకరణలో సంగారెడ్డి తాలూకాలో 6 మండలాలు ఏర్పడగా అందులో రామచంద్రాపురం ఒకటి. ఈ మండలము హైదరాబాద్ - పూణే జాతీయ రహదారిపై యున్నది.

ఈ మండలము పట్టణవాతావరణముతో పాటు గ్రామీణ వాతావరణం కలగలసియున్న ప్రాంతమిది. ఈ మండల కేంద్రము పారిశ్రామికంగా అభివృద్ధి చెందింది. మెదక్ జిల్లాకే మకుటాయమానమైన బి.హెచ్.ఇ.ఎల్. ఈ మండలములోనే యున్నది.

రామచంద్రాపురం మండలం వైశాల్యయం 8933 హెక్టార్లు. ఈ మండలము నందు గ్రామాలు 9, 9 పంచాయితీలు కలవు.

ఈ మండలము నందు 1991 జనాభాగణన ప్రకారం 39349 పురుషులు, 36054 స్త్రీలు, 75403 మొత్తం కలరు. ఎస్.సి.లు 11012, ఎస్.టి.లు 1298.

రామచంద్రాపురం మండల పరిషత్ ఏర్పాటయిన తరువాత తొలి అధ్యక్షులుగా వి. భూపాల్‌రెడ్డి ఎన్నికైనారు. 1994లో పంచాయితీ చట్టం మార్పు చెంది ఎం.పి.టి.సి.ల ద్వార అధ్యక్ష స్థానానికై పోటి జరుగగా సపాన్‌దేవ్ గారు ఎన్నికైనారు. జడ్.పి.టి.సి.గా కె. పాపిరెడ్డి గారు ఎన్నికై జిల్లా పరిషత్‌కు ప్రాతినిధ్యం వహించారు.

ఈ మండలమునందు చిన్న, మధ్య భారీతరహా పరిశ్రమలు వెలసి పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి చెందినది. అయినప్పటికీ పలుగ్రామాలు వ్యవసాయం ప్రధానంగా అభివృద్ధి చెందుతున్నవి. ఈ మండలములో 5 చిన్న పెద్ద చెఱువులు గలవు. ఆయకట్టు 634 ఎకరాలు.

ఈ మండలమునందలి వ్యవసాయదారులు నూతన వ్యవసాయ పద్ధతులతో అధిక దిగుబడులు సాధిస్తున్నారు.

ఈ మండలమునందలి 10 ప్రాథమిక పాఠశాలలు, 2 ప్రాథమికోన్నత పాఠశాలలు మండల పరిషత్ యాజమాన్యంలో నడుపబడుచున్నవి. ఈ మండలములో 7 ఉన్నత పాఠశాలలు జిల్లా పరిషత్ యాజమాన్యంలో ఉన్నవి. ఈ మండలమునందు ప్రైవేటు యాజమాన్యమున కూడా అనేక ప్రాథమిక, ఉన్నత పాఠశాలలు కలవు. ఇవన్నియు విద్యావ్యాప్తికై ఎనలేని కృషి చేయుచున్నవి.

ఈ మండలమునందు 1 ప్రాథమిక ఆరోగ్య కేంద్రము, 3 పశువైద్యశాలలు కలవు.

## రామచంద్రాపురం మండల పరిషత్తు

| క్ర.సం. | పేరు | ఎం.పి.టి.సి |
|---|---|---|
| 1. | శ్రీ డి. మానిక్ ప్రభు | రామచంద్రాపూర్ |
| 2. | శ్రీ ఈ. సత్యనారాయణ | ,, |
| 3. | శ్రీ ఎమ్. ప్రభు గౌడ్ | ,, |
| 4. | శ్రీ బాల నర్సింహ | ,, |
| 5. | శ్రీ జ్ఞానేశ్వర్ గౌడ్ | ,, |
| 6. | శ్రీ ఆర్. భిక్షపతి యాదవ్ | ,, |
| 7. | శ్రీనివాస్ గౌడ్ | ,, |
| 8. | శ్రీ వీరభద్ర గౌడ్ | ,, |
| 9. | శ్రీమతి స్వర్ణ | ,, |
| 10. | శ్రీమతి ఎస్. లక్ష్మి | ,, |
| 11. | శ్రీమతి కె. లక్ష్మి | ,, |
| 12. | శ్రీమతి ఎస్. లలిత | ,, |
| 13. | శ్రీమతి అనసూయ యాదవ్ | ,, |
| 14. | శ్రీ మేహర్ మంగ | ,, |
| 15. | శ్రీ బి. లక్ష్మి దేవి | ,, |
| 16. | శ్రీ కె. మోహన్ సింగ్ | ,, |
| 17. | శ్రీ అబ్దుల్ సత్తార్ | ,, |
| 18. | శ్రీ చెన్నా రెడ్డి | ,, |
| 19. | శ్రీ రాధా కృష్ణ | ,, |
| 20. | శ్రీ జగదీష్ | కొల్లూరు |
| 21. | శ్రీ యాదయ్య | పులిమెల |
| 22. | శ్రీమతి కమలమ్మ | తెల్లాపూర్ |
| 23. | శ్రీ షేక్ హబీబ్ కో ఆపరేటివ్ | మెంబర్ |

## రామచంద్రాపురమ్ మండల సర్పంచ్‌లు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వి. రాజేశ్వర్ రెడ్డి | రామచంద్రాపూర్ |
| 2. | శ్రీ జె. అనంత్ రెడ్డి | కొల్లూరు |
| 3. | శ్రీ కుమార్ గౌడ్ | తెల్లాపూర్ |
| 4. | శ్రీమతి ఆర్. సత్యవతి | ఎలిమల |
| 5. | శ్రీ బి. రాములు గౌడ్ | ఎదుల నాగుల పల్లి |
| 6. | శ్రీ పి. రామేశ్వర్ | ఉస్మాన్ నగర్ |

# రామాయంపేట మండలం

రామాయంపేట మండలం మెదక్ జిల్లాలో ఒక ప్రత్యేకతను కలిగి యున్నది రామాయంపేట ఒకనాడు మెదక్ తాలుకాలో రెవెన్యూ అధికారమును కలిగి ప్రత్యేకమైన పంచాయితీసమితిగా నుండెను. 19 లో మెదకు జిల్లాలో ఏర్పడిన తాలుకాల విభజనలో భాగంగా రామాయంపేట ప్రత్యేక తాలూకా కేంద్రంగా ఏర్పడినది.

రామాయంపేట తాలుకా ఏర్పడిన తర్వాత 1987లో ఆనాటి ప్రభుత్వము గావించిన ఆలోచనల మేరకు పరిపాలనా వికేంద్రీ కరణలో భాగంగా మండల వ్యవస్థ ఏర్పాటై, రామాయంపేట తాలుగా 4 మండలాలుగా విభజింపబడినది. 1.రామాయంపేట 2.చేగుంట 3. శంకరం పేట 4.వెల్దుర్తి మండలాలు ఏర్పటైనవి.

రామాయంపేట మండలము తూర్పున మిడిదొడ్డి మండలము, పడమటి మెదక్ మండలము, దక్షిణాన చేగుంట శంకరంపేట, మండలములు, ఉత్తరాన నిజామాబాద్ జిల్లాలోని బిక్కనూరు మండలములను ఎల్లలుగా కలిగినది.

రామాయంపేటమండల భూవిస్తీర్ణమువు 59,683 ఎకరములు. ఈ మండలమున సమితోష్ణము కలిగి సాధారణ వర్షపాతము 953 మి.మి. ఉండును.

రామాయంపేట మండలమున 22 గ్రామములు కలిగి 22 గ్రామపంచాయతీలు కలవు.

రామాయం పేట మండలమేర్పడిన తర్వాత 1987 లో మొట్టమొదటి పర్యాయము మండల ప్రజా పరిషత్తునకు పార్టీల పరంగా ప్రత్యక్ష ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికలలో తెలుగుదేశం పక్షాన యువకుడైన మోహనాచారి మండలాధ్యక్షుడుగా ఎన్నికై 5 సంవత్సరములు మండలాభివృద్ధికి ఎనలేని కృషి చేసెను. ఆ తర్వాత రెండవ పర్యాయములుగా 1995లో మండల పరిషత్తునకు ఎన్నికలు జరిగినవి. పంచాయతీ రాజ్ చట్టము మార్పుచెంది 4 మండలములకు, మండల ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులు ప్రాతినిధ్యం వహించుటకు జిల్లా పరిషత్తుకు జిల్లా ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులు ప్రాతినిధ్యం వహించునట్లు, అధ్యక్ష ఎన్నికలు పరోక్షముగా నిర్వహింపబడినవి. రామాయంపేట మండలమున 17 ప్రాదేశిక నియోజక వర్గస్థానాలకు ఎన్నికలు జరిగినవి. ఒక సభ్యుడు కో-ఆప్షన్ సభ్యుడుగా మైనారిటీ వర్గము నుండి ఎన్నిక కాబడెను.

ఈ మండలమునకు జరిగిన అధ్యక్ష ఎన్నికలలో తెలుగుదేశం పక్షాన ఎన్. ప్రభాకర్ గారు ఎన్నికైనారు. ఇతడు B.Sc (డైరీ) విద్యార్హతలు కలిగియుండి, ప్రజాసేవాభిలాష కల్గిన యువకుడు.

ఉపాధ్యక్షుడుగా యువకుడైన ఎం. శ్రీనివాస్ గారు, ఎన్నికైనారు. ఈ మండలము నుండి Z.P.T.C సభ్యులుగా శ్రీమతి చాంద్ బీ గారు ఎన్నికైనారు. వీరందరూ రామాయంపేట మండలమును పురోభివృద్ధి గావించుటలో తమ శాయశక్తుల సేవలందించు చున్నారు. ప్రస్తుతము ఈ మండలమునకు M.P.D.O. గా శ్రీ ఇమాముద్దీన్‌గారు పని చేయుచున్నారు.

రామాయంపేట మండలమున 55266 మంది 1991 జనాభా లెక్కల ప్రకారం కలరు. ఇందులో 27,817 స్త్రీలు, 27,449 మంది పురుషులు కలరు. 19,080 మంది స్త్రీలు 18,644 పురుషులు, మొత్తం 37,724 మంది ఓటర్లు ఈ మండలమునందున్నారు. ఈ మండలమందలి ప్రజలలో 14,560 మంది అక్షరాస్యత కలిగి యున్నారు.

రామాయంపేట మండలము విద్యాభివృద్ధిలో గణనీయమైన ప్రగతిని సాధించినది అని చెప్పవచ్చు. ఈ మండలము నందు రామాయంపేటలో ప్రభుత్వజూనియర్ కాళశాల కలదు. 13 ఉన్నత పాఠశాలలు, ఒక బాలికోన్నత పాఠశాల, 4 ప్రాథమికోన్నత పాఠశాలలు, ఇచట పనిచేయుచున్నవి.

మండల పరిషత్తు అధీనమునందు 23 బాలుర పాఠశాలలు, ఒక బాలికల పాఠశాల ప్రాథమిక పాఠశాలలుగానున్నవి. ఈ పాఠశాలలన్నియూ స్వంత భవనములు కలిగి సరియగు వసతులతో తగు వెూతాదులోని సిబ్బందితో పని చేయుచూ మండలమందలి విద్యార్థిని విద్యార్థులకు విద్యాబోధన జరుపుచున్నవి. 5 సంవత్సరాల లోపలి బాలబాలికలకు 25 అంగన్ వాడీ కేంద్రములలో శిశు పోషణ జరుగుచూ వారిలో విద్యార్జనాసక్తిని పెంచుటకు తోడ్పడుచున్నవి. అట్లే పాఠశాలలకు రాలేని బాలబాలికలకు యువకులకు నిరంతర విద్యాకేంద్రములు పని చేయుచున్నవి. ఇవి ఇచట 22 కలవు. పల్లె పట్టులలోని బీద విద్యార్థులకు భోజన సదుపాయములు కల్పించి విద్యాలయములకు సక్రమంగా హాజరగుటకై ఇచట 7 విద్యార్థి వసతి గృహములు కలవు.

రామాయంపేట మండలము నందలి ప్రజలు ముఖ్యముగా వ్యవసాయముపై ఆధారపడి జీవించువారు. ఈ మండలమందలి నేలలు ఎక్కువ శాతము ఎర్ర నేలలు. కొంత మాగాణీ భూమి. ఈ మండలమున వ్యవసాయ యోగ్యమైన భూమిలో మెట్ట భూమి 18,499 ఎకరాలు. మాగణీ భూమి 6,670 ఎకరాలు కలదు.

ఈ మండలము నందు 100 పైగా ఎకరములకు నీరు అందించు చెఱువులు 17 కలవు. మరెన్నో కుంటలు కలవు. బావులు, గొట్టపు బావులు అధికముగానే యున్నవి. వీటన్నిటి ఆధారముగా ఇక్కడ వరి, చెఱుకు, పంటలు అధికంగా పండుచున్నవి.

మెట్ట భూములలో వర్షాధారకమున మొక్కజొన్న, జొన్న, ప్రొద్దు తిరుగుడు, పప్పుదినుసులు, వేరుశెనగ మొదలగు పంటలు పండింపబడుచున్నవి. ఇక్కడ కూరగాయల ఉత్పత్తి కూడా ఎక్కువగానే జరుగును.

ఈ మండలమున చెఱుకు పండించు రైతులు కొందరు ఖండసారి చక్కెర మిల్లులకు పంపగా, పెద్ద మొత్తములో ఈ మండలమున బెల్లము తయారు చేయుట జరుగును. ఇచ్చట పండించు వరికి సరియైన ధరనిచ్చి కొనుగోలు చేయుటకు రైసుమిల్లులున్నవి.

రామాయంపేట మండలమున 9 ప్రాధమిక వ్యవసాయ సహకార సంఘములు కలవు. ఈ సంఘముల ద్వారా రైతులకు తక్కువ వడ్డీకి పంట ఋణములు లభించుచున్నవి. ఈ మండలము నందు రామాయంపేటలలో సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు, కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్, మంజీర గ్రామీణ బ్యాంక్‌లు కలవు. నిజాంపేట, లక్ష్మీపూర్ గ్రామాలలో 'మంజీర గ్రామీణ బ్యాంక్'లు పని చేయు చున్నవి. ఈ బ్యాంకులు ఈ మండలము నందలి ఆర్ధిక అవసరములను తీర్చుచున్నవి. ఈ బ్యాంకులు వ్యవసాయ పరిశ్రమలకే గాక చేతి వృత్తుల వారికి, స్వయం ఉపాధి పధకముల ద్వారా యువకులకు ఆర్ధిక సహకారము నందించుచున్నవి.

రామాయంపేట మండలము నందు 3 విద్యుత్ సబ్‌స్టేషన్లు కలవు. అవి రామాయంపేట, నిజాంపేట, లక్ష్మపూర్ గ్రామాలలో నెలకొల్పబడి, అవసరమైనన్ని ట్రాన్స్‌ఫార్మర్లతో లో-వోల్టేజీ బాధను తప్పించుచున్నవి.

రామాయంపేట మండలమందు పూర్వకాలమునందే దామర చెఱ్వు గ్రామం లో 'పెంకుల పరిశ్రమ' నెలకొల్పబడి నేటికిని ఉత్పత్తి కొనసాగించుచున్నది. రామాయంపేట లో ఒక ఆయిల్‌మిల్లు కలదు. ఈ వివిధ గ్రామాలలో 10 పౌల్ట్రీ ఫాం లు ఉన్నవి. రామాయంపేట ప్రాచీన కాలమున ఇత్తడి పరిశ్రముకు నిలయమై ఉండెడిది. ఇచ్చట ఇత్తడి, రాగి లోహములతో గృహావసర పాత్రలే గాక వివిధ కళాఖండములు గూడా తయారగుచున్నవి. ఈ మండలమునందు ప్రతి గ్రామాన కుటీర పరిశ్రమగా బీడీల తయారీ సాగుచున్నది.

రామాయంపేట మండలమున రామాయంపేట నిజాంపేటలలో సబ్-పోస్టాఫీసులు, టెలిఫోన్ ఎక్స్చేంజీలు కలిగి ప్రతీ గ్రామానికి తపాల సౌకర్యమును మరియు 344 టెలిఫోన్లతో కమ్యునికేషన్ సౌకర్యమును కల్పించబడుచున్నది.

ప్రభుత్వం ఇచ్చుచున్న వివిధములైన పెన్షనులలో వృద్ధాప్య ఫించనులు నెలకు 75/- చొప్పున 841 మందికి అనాధలకిచ్చు ఫించెనులు 73 మందికి, కరువుఫించనులు 389 మందికి ఈ మండలమున అందింపబడుచున్నవి.

ఈ మండలమునందు 154 డ్వాక్రా గ్రూపులలో 2310 మంది మహిళలు కలరు. వీరు 3 లక్షల 25 వేల రూపయలు పొదుపు చేసిరి. ప్రభుత్వము నుండి తగు మేతాదులో ఋణమును పొంది డ్వాక్రా గ్రుపులలోని మహిళలు కుటీర పరిశ్రమలను నడుపుకొనుచు స్వావలంబన రీతిలో ముందంజ వేయుచున్నారు.

రామాయంపేటలో ప్రభుత్వ ఆధ్వర్యమున నడపబడు విత్తన విక్రయ కేంద్రము కలదు, వ్యవసాయ గిడ్డంగులు కూడా ఇక్కడ కలవు, వ్యవసాయ శాఖ వారిచే వివిధ గ్రామములలో ఉన్న రైతులకు సబ్సిడీలో వ్యవసాయ పనిముట్లు అందజేయబడుచున్నవి.

ఈ మండలమునందు 154 డ్వాక్రా గ్రూపులలో 2310 మంది మహిళలు కలరు. వీరు 3 లక్షల 25 వేల రూపాయులు పొదుపు చేసిరి. ప్రభుత్వమునుండి తగు మోతాదులో ఋణమును పొంది డ్వాక్రా గ్రూపులలోని మహిళలు కుటీర పరిశ్రమలను నడుపుకొనుచు స్వావలంబన రీతిలో ముందంజ వేయుచున్నారు.

రామాయంపేటలో ప్రభుత్వ అధ్వర్యమున నడపబడు విత్తవ విక్రమ కేంద్రము కలదు, వ్యవసాయ గిడ్డంగులు కూడా ఇక్కడ కలవు. వ్యవసాయశాఖ వారిచే వివిధ గ్రామములలో ఉన్న రైతులకు సబ్సిడీలో వ్యవసాయ పనిముట్లు అందజేయబడుచున్నవి.

రామాయంపేట మండలమున హైద్రాబాద్- - నాగపూర్ ఏడవ జతీయ రహదారి పై కలదు. మెదకు నుండి సిద్దిపేటకు పోవు మార్గము రామాయంపేట మీదుగనే కలదు. కావున ఇది రహదారుల కూడలి కేంద్రము. ఇచ్చట ఒక ప్రయాణ ప్రాంగణము R.T.C. వారిచే నిర్మింపబడి యున్నది.

రామాయంపేట నందు ఆర్. టి. సి. బస్‌డిపో ఏర్పాటు చేయుటకు నిర్ణయము గైకొనబడినది. కొలిది కాలమున అట్టి నిర్మాణము జరిగి ప్రయాణ సౌకర్యములు ఇతోధికమగును. ఈ మండలము నందలి ప్రతి గ్రామమునకు మండల కేంద్రము నుండి బస్సు సౌకర్యము కలదు.

రామాయంపేటకు 4 కి.మీ. మన్మాడ్ రైలు మార్గము అక్కన్నపేట రైల్వే స్టేషన్ నుండి పోవు చున్నది. మెదకు జిల్లాకు ఉన్న అతికొద్ది రైలు సదుపాయములో అక్కన్న పేట కొందరికైననూ అక్కరకు వచ్చుచున్నది.

రాయాయంపేట మండలమున స్థానికముగా వైద్య విధాన పరిషత్తు ఆరోగ్య కేంద్రము కలదు. అట్లే ఆయుర్వేద వైద్యాలయము ఇచట పనిచేయుచున్నది. మండలమందలి 'దొంగల ధర్మారం' గ్రామంలో ప్రాధమిక ఆరోగ్య కేంద్రము పని చేయుచున్నది. ఈ ఆరోగ్య కేంద్రములకు వివిధ గ్రామాలలో ఉప కేంద్రములు కలవు.

ఈ మండలమందలి ఝాన్సీలింగాపూర్ గ్రామమందు విరిగిన ఎముకలను తమదైన రీతిలో కట్లు కట్టి, మందులిచ్చి బాగుచేయు వైద్య కుటుంబము కలదు.

ఈ మండలమున రెండు పశువైద్యశాలలు 2 పశు సంవర్ధక కేంద్రాలు పని చేయుచున్నవి. ఇందలి వైద్యులు పశు సంపదను ఆరోగ్యముగా నుంచుటలో కృత్రిమ గర్భ ధారణాది కార్యక్రమములో, రోగ నిరోధక టీకాల నిచ్చుటలో ప్రముఖ పాత్ర వహించుచున్నారు.

రామాయంపేట మండల కేంద్రమున సర్కిల్ ఇన్స్పెక్టర్ ఆఫ్ పోలీస్ (C.I), S.I. కార్యాలయములు కలవు. రామాయంపేటలో నవజ్యోతి, సహాయతా అను రెండు స్వచ్ఛంద సంస్థలు గ్రామీణాభివృద్ధికి పాటుపడుచున్నవి. ఇచట లయన్స్ క్లబ్. సభ్యులు ప్రజోపయోగ కరమైన కార్యక్రమములెన్నియో చేపట్టుచున్నారు.

రామాయంపేటలో గ్రంథాలయము కలదు. ఇది స్థానికులలో విద్యావైజ్ఞానిక సంపదను గూర్చుచున్నది. స్థానికముగా రెండు సినిమా థియేటర్లు, నిజాంపేటలో ఒక సినిమా హాలు ఉండి ప్రజలకు వినోద సౌకర్యములు కల్పించుచున్నవి.

రామాయంపేటకు సమీపాన తిప్పన గుళ్ల గ్రామమున శిలాశాసనము లభించినది.

ఈ మండలము నందు ప్రముఖ దేవాలయము కలదు.

రామాయంపేట విద్యా, వైజ్ఞానిక, వ్యాపార రంగంలోనే గాక ఆధ్యాత్మికముగా కూడా ప్రశస్తి కెక్కినది. ఇచట స్వామి తురీయా శ్రమమున నుండెను

రామాయంపేట 'దోర్భల విశ్వనాథశర్మ' గారు సంస్కృతాం ధ్రాంగ్లములలో చక్కని పాండిత్యమును కలిగి జిల్లాలోని పండితలోకమునకు ఆదర్శ ప్రాయుడుగా జీవించుచున్నాడు.

రామాయంపేట మండలమున పౌరసరఫరాల సంస్థ ద్వారా 32 రేషన్ షాపులు కలవు 1040 తెల్లకార్డులు, 3506 గులాబీ కార్డుల వారికి ప్రతినెలా బియ్యం 1777.52 క్వింటాళ్లు శక్కరి 134.85 క్వింటాళ్లు సరఫరా చేయబడుచున్నవి.

రాష్ట్రప్రభుత్వం చే పెన్షను పొందుచున్న వారు 6 గురు కేంద్ర ప్రభుత్వంచే పెన్షను పొందుతున్న వారు 7 గురు స్వాతంత్ర సమర యోధులు మండలమందు కలరు.

## మండల పరిషత్ రామాయంపేట ప్రాదేశిక నియోజిక వర్గ సభ్యుల వివరములు 1995 సంవత్సరము నుండి

| క్ర.సం | సభ్యుల పేరు | ప్రాదేశిక నియోజిక వర్గము పేరు | |
|---|---|---|---|
| 1. | శనిశెట్టి ప్రభావతీ గారు అధ్యక్షులు | నందిగామ 1 | |
| 2. | మల్లన్నగారి శ్రీనివాస్ ఉపాధ్యక్షులు | లక్ష్మాపూర్ | |
| 3. | చౌదరీ సుప్రభాతరావు | రామాయంపేట-I | |
| 4. | చిలుకముత్యాలు | రామాయంపేట-II | |
| 5. | కే. రత్నమని | రామాయంపేట-III | |
| 6. | లంబాడి రాములు | కాట్రియాల | |
| 7. | పోదేండ్లలక్ష్మనీ | రాయలాపూర్ | |
| 8. | తాళ్ళపల్లి లక్ష్మి | నిజాంపేట | |
| 9. | బొడ్డు రాజమణి | దొంగల ధర్మారం | |
| 10. | ముత్యాల రాధమ్మ | వెంకటాపూర్ (K) | |
| 11. | బండి చంద్రకళ | కోనాపూర్ | |
| 12. | కల్లచ్చుగారి వెంకూరాములు | కల్వమంట | |
| 13. | రావిపల్లి అమరసేనారెడ్డి | నార్లాపూర్ | |
| 14. | అమముల యేసుమణి | అక్కన్నపేట | |
| 15. | జమ్మికల లక్ష్మి | చల్మెడ | |
| 16. | జక్కన్న గారి ఎల్లాగౌడు | నస్కల్ | |
| 17. | హుస్సేన్ | కో- ఆపరేటివ్ చాంబరీ | |

మండల పరిషత్ రామాయంపేట సర్పంచుల వివరములు

| క్ర.సం | సర్పంచులు | గ్రామ పంచాయతీ పేట |
|---|---|---|
| 1. | శ్రీమతి కే. ప్రమీలా వెంకటగౌడ్ | రామాయంపేట |
| 2. | శ్రీ కే. చిన్నబాలమ్మ | కాప్రియాల్ |
| 3. | శ్రీ యన్. కిషన్ | పర్వతాపూర్ |
| 4. | శ్రీ వీ. కిషన్ రావు | దండపల్లి |
| 5. | శ్రీ సి. వెంచీ నారాయణ | లక్ష్మపూర్ |
| 6. | శ్రీమతి జి. వెంకయ్య | దామర చెర్వు |
| 7. | శ్రీ నారాగౌడు | రజాలీ పల్లి |
| 8. | శ్రీమతి జి. కిష్టయ్య | తిప్పన గుళ్ళ |
| 9. | శ్రీ వీ. బ్రహ్మాచారి | నందిగామ |
| 10. | శ్రీ వీ తిర్మలయ్య | నిజాంపేట |
| 11. | శ్రీ గుమ్మల విజయ | నస్కిలీ |
| 12. | శ్రీమతి డి. లక్ష్మి | కోనాపూర్ |
| 13. | శ్రీ పి. వెంకటాగౌడు | బచ్చురాజు పల్లీ |
| 14. | శ్రీ పి. సిద్దయ్య | తోనగండ్ల |
| 15. | శ్రీ డి. భిక్షపతి | చల్మెడ |
| 16. | శ్రీమతి పి. లక్ష్మి | అక్కన్నపేట |
| 17. | శ్రీ జి. యెల్లమ్మ | జె. లింగాపూర్ |
| 18. | శ్రీమతి మందేలీషా | వెంకటాపూర్(K) |
| 19. | శ్రీమంచీన్నరామయ్య | దొంగలధర్మారం |
| 20. | శ్రీ బీ. రామాగౌడ్ | కల్వకుంట |
| 21. | జి. నర్సింలు | నార్లాపూర్ |
| 22. | ఖాళీ | దాయిలాపూర్ |

# రేగోడ్ మండలము

మెదకు జిల్లాలో రేగోడ్ మండలమునకు ఒక ప్రత్యేక స్థానముకలదని చెప్పవచ్చును ఈ మండలమునా నుకొనివంజీరానది ప్రవహించుచున్నది. సింగూరుప్రాజెక్టు నీరు ఈ మండలము వారు ప్రతిదినము ఉదయముననే దర్శింతురు. వీరిని సింగీరు ప్రాజెక్టునీరు కన్నుల కానందమును కల్గించునే కాని ఫలితముసున్న.

జోగిపేట తాలూకాను1987 లో పరిపాలనా వికేంద్రీకరణలో మండలాలుగా విభజించుట జరిగినది ఆ కార్యక్రమంలో రేగోడ్ ఒక మండల కేంద్రముగా ఏర్పడినది. మండల ప్రజాపరిషత్తులేర్పడిన తర్వాత మొట్టమొదట జరిగిన అధ్యక్ష ప్రత్యక్ష ఎన్నికలలో శ్రీ రాజేశ్వర జ్యోషీ గారు ఎన్నికైరి వీరు తమ 5 సంవత్సరముల పదవీ కాలంలో మండలాభివృద్ధికై ఎనలేని సేవ చేసిరి. 1995 లో మండల పరిషత్తు గా మారిన తర్వాత కొత్త పంచాయత్‌రాజ్ చట్టము ప్రకారము మండలమున మండల ప్రాదేశిక నియోజక వర్గము సభ్యుల ఎన్నిక జరిగినది. ఈ మండలమున యం.పి.టి.సి.లు ఎన్నికైరి. వీరు మండలాధ్యక్షుని ఎన్నికలలో ఓటర్లుగాను మండలమున గౌరవ సభ్యులుగను ఉండి మండలాభివృద్ధి కార్యక్రమముల నిర్వహింతురు.

రేగోడ్ మండలము నుండి జిల్లా పరిషత్తు ప్రాదేశిక నియోజక వర్గ సభ్యులు పదవీ నిర్వాహణ చేయుచు మండలాభివృద్ధికి చేయుత నొసంగు చున్నారు.

రేగోడ్ మండలము 15171.31 హెక్టార్ల భౌగోళిక విస్తీర్ణము కలిగి అందు 740.19 ఎకరములు అడవి కల్గియున్నది. ఈ మండలమున 25 గ్రామములు 19 గ్రామ పంచాయతీలు కలవు. ఈ మండలము యొక్క జనాభా 1991 గణనప్రకారము 27484 మంది కలరు. ఇందులో S.C. 5593, S.T. 1639 మంది నివసించుచున్నారు. ఈ మండలము నందలి కుటుంబ ముల సంఖ్య 4695 కలవు. రేగోడ్ మండలము నందలి ప్రజలు వ్యవసాయముపై ఆధారపడి జీవించెదరు. ఇక్కడి భూమి ఎక్కువగా నల్లరేగడి భూమి ఈ మండలము నందు వ్యవసాయ యోగ్యమైన భూమి విస్తీర్ణము 26385 ఎకరములు కలదు. ఇందు మాగాణిభూమి 1688 ఎకరాలు. మెట్టభూమి 24697 ఎకరములు ఈ మండలము నందు చెరువులు 8 కుంటలు 30 కలవు. ఇచ్చట బావులు తక్కువ ఇప్పుడిప్పుడే గొట్టపు బావుల త్రవ్వుచున్నారు. ఈ మండలము నందు సన్నకారు రైతులు 2372 కాగా చిన్న కారు రైతులు 3556. ఈ మండలమున రేగడి పంటలే ఎక్కువ. జొన్న, మిరప, పప్పు ధాన్యములు, నూనెగింజలు ఎక్కువగా పండితురు. వరి, చెఱుకు, మొదలగు మాగాణి పంటలు అక్కడక్కడ నీటి వసతులను బట్టి పండించుచున్నారు.

రేగోడ్ మండలములమున నాలుగు జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాలలు 27 మండల పరిషత్ ప్రాథమిక పాఠశాలలు పనిచేయుచున్నవి. ఇక్కడ విద్యావంతుల శాతము తక్కువ ఐనను ఈ మధ్య కాలమున ప్రజలు తమ పిల్లలు విద్యావంతులు కావలయునని ఆలోచించుచున్నారు. ఈ మండలమున స్త్రీ, శిశు సంక్షేమముచే 42 అంగన్‌వాడి కేంద్రములు పని చేయుచున్నవి. వీటిలో పని చేయు అంగన్‌వాడి కార్యకర్తలు స్త్రీల మరియు శిశువుల ఆరోగ్య సంరక్షణ పౌష్టికాహారములు చూచుటే కాక ఐదు సంవత్సరముల లోపు పిల్లలలో విద్యాభ్యాసంగముపై పు దృష్టి సారించుటకు తగు శ్రద్ధ వహింతురు. పాఠశాలలకు వెళ్లలేని వారికై 20 నిరంతర విద్యా కేంద్రములు ఇచ్చట పనిచేయుచు విద్యావ్యాప్తికి కృషి చేయుచున్నవి.

ఈ మండలమున బీద విద్యార్థుల కొరకై రెండు యస్.సి. విద్యార్థులకై ఒకటి బి.సి. విద్యార్థులకు వసతి గృహములు కలవు. రేగోడ్ మండలమున ఒక ప్రాథమిక ఆరోగ్యకేంద్రము సమస్త సదుపాయములతో నెల కొల్పబడి ఈ ప్రాంత ప్రజలకు ఆరోగ్య సేవచేయుచున్నది. ఈ కేంద్రమున కుటుంబ సంక్షేమ ఆపరేషన్లు చక్కగా జరుపబడుచు రోగనివారణ టీకాలు ఈయబడుచున్నవి.

ఈ మండలమునందు ఒక పశువైద్యశాల దాని కనుబంధముగా 3 ఉపకేంద్రములు పని చేయుచూ పశువుల ఆరోగ్య సంరక్షణ లో కృత్రిమ గర్భోత్పత్తి కార్యక్రమములోను పాల్గొనుచున్నవి.

రేగోడ్ మండలమున ఐదు పోస్టాఫీసులు కలవు టెలిఫోన్ సౌకర్యము మండల కేంద్రమునకు గలదు.

ఈ మండలమునందు ఒక స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా శాఖ, మరియు మంజీర గ్రామీణ బ్యాంకు శాఖకు ఒకటి యుండి ఇచ్చటి ప్రజల ఆర్థికావసరము లను తీర్చుచు వ్యవసాయమును, వ్యాపారమును అభివృద్ధి పరచుటలో తమ వంతు సాయమునందించు చున్నవి.

ఈ మండలమునందు కేంద్ర సహకార బ్యాంక్‌కు అనుబంధముగా ప్రాథమిక సహకార కేంద్రములు పనిచేయుచున్నవి.

ఈ మండలమునందుగల ప్రభుత్వ భూమి నేటి వరకు 2125 ఎకరములు లావుణీపై ప్రజలకు పంపిణీ చేయనైనది. ఇంకను 200 ఎకరములు చేయ వలసిన భూమి ఇచ్చట గలదు. సీలింగ్ యాక్ట్ ప్రకారము మిగులు భూమి 555 ఎకరములు కాగా మొత్తము బీదరైతులకు పంచనైనవి. 420 వృద్ధాప్య పింఛన్లు 12 వితంతు పింఛన్లు, 350 కరువు పింఛన్లు ఈ సంవత్సరమున పంపిణీ చేయబడినది.

రేగోడ్ మండలమునందు 24 చౌకధర దుకాణ ములు కలవు. 4533 తెల్లకార్డులు, 1400 గులాబీ కార్డులు ఈ మండలమున కలవు. పౌరసరఫరాల విభాగములుచే ప్రతి నెల 793-96 క్వింటాళ్ల బియ్యము, 76-38 క్వింటాళ్ల చెక్కర సరఫరా చేయబడుచున్నది.

## సర్పంచ్‌లు, ఎం.పి.టి.సి లు జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | రేగోడ | ఎం. విజయభాస్కర్ |
| 2. | మర్పల్లి | సి.హెచ్. విఠల్ |
| 3. | దేవ్‌నూర్ | సి.హెచ్. భాగయ్య |
| 4. | గజ్వాడ | ఎం. పాపయ్య |
| 5. | మేడికొండ | ఎన్. రామారావు |
| 6. | దుదియాల్ | పి. శ్రీరామ్ |
| 7. | దోసపల్లి | ధర్మనాయక్ |
| 8. | ప్యారారం | పి. చంద్రమ్మ |
| 9. | కొత్వాల్‌పల్లి | కాశమ్మ |
| 10. | ఎతిక్యాల్ (ఆర్) | మణెమ్మ |
| 11. | జగ్రియాల్ | ఎం. మోతిరాం |
| 12. | ఖాదీరాబాద్ | ఎన్. దుర్గయ్య |
| 13. | సాయిపేట | ఎన్. నర్సింలు |
| 14. | నిర్జప్ల | బాలయ్య |
| 15. | ఉసిరికపల్లి | ఎం. నర్సింలు |
| 16. | టి. లింగంపల్లి | గులామ్ బీ |
| 17. | సిందోల్ | ఏ. నాగమ్మ |
| 18. | చౌదరిపల్లి | డి. లక్ష్మారెడ్డి |

## ఎం.పి.టి.సి లు జాబితా

| | గ్రామం పేరు | ఎం.పి.టి.సి.లు |
|---|---|---|
| 1. | దేవ్‌నూర్ | పి. భూం రెడ్డి (ఉపాధ్యక్షులు) |
| 2. | కొత్వాన్‌పల్లి | లక్ష్మయ్య |
| 3. | ఖాదిరాబాద్ | ఆగమ్మ |
| 4. | రేగోడ్ | కె. విద్యావతి |
| 5. | టి. లింగపల్లి | కొండమాయి |
| 6. | నిర్జప్ల | శంకరయ్య |
| 7. | దోసపల్లి | విఠ్యానాయక్ |
| 8. | కో ఆప్టెడ్ మెంబర్ | అక్బర్ అలీ |

# సదాశివపేట మండలము

ఒకనాడు పంచాయతి సమితిగా నుండి తర్వాత కొంత కాలానికి తాలూకాగా మారిన సదాశివపేట మండలాల ఆవిర్భావంతో ఒక మండల కేంద్రంగా మారినది.

ఒక గొప్ప వ్యాపార కేంద్రంగా జిల్లాలో పేరొందిన సదాశివ పేట చారిత్రికంగా కూడా ప్రఖ్యాతమైనదే!

సదాశివపేట మండలము యొక్క వైశాల్యము 60340 ఎకరములు.

ఈ మండలమునందు 30 గ్రామములు, 3 మదిర గ్రామాలు ఉన్నాయి. 26 గ్రామ పంచాయతీలతో సదాశివపేట మున్సిపాలిటితో ఈ మండలం స్థానిక స్వపరిపాలనను చవిచూస్తున్నది.

ఈ మండలమేర్పాటైన తర్వాత తొలి ఎన్నికలలో శ్రీ కె. రామకృష్ణాగౌడ్ గారు మండలాధ్యక్షులుగా ప్రజలతో ప్రత్యక్షముగా ఎన్నిక కాబడి 5 సంవత్సరముల పాటు ప్రజాసేవ నొనరించినారు.

1994లో పంచాయత్‌రాజ్ చట్టంలో మార్పులు తేబడినవి. మండల ప్రాదేశిక నియోజక వర్గములు సృష్టించబడినవి. వీటి నుండి ఎన్నిక కాబడిన ఎం.పి.టి.సి లలో నుండి అధ్యక్ష, ఉపాధ్యక్ష ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికలలో అధ్యక్షులుగా శ్రీమతి జోగిపేట ప్రభావతిగారు, ఉపాధ్యక్షులుగా శ్రీ అశోక్ కుమార్‌గౌడ్ గారు ఎన్నికై 5 సంవత్సరములు మండలమును అభివృద్ధి పథంలో నడిపినారు. ఈ మండలమునకు జిల్లా పరిషత్ నియోజక వర్గ సభ్యులుగా (జడ్.పి.టి.సి) శ్రీ బి. మాణయ్యగారు ఎన్నికై మండలము నుండి జిల్లా పరిషత్తునకు ప్రాతినిధ్యము వహించినారు.

ఈ మండలమునందలి జనాభా 1991 గణన ప్రకారం ఈ విధంగా ఉంది.

| | పురుషులు | స్త్రీలు | మొత్తము | ఎస్.సి. | ఎస్.టి. | ఇతరులు |
|---|---|---|---|---|---|---|
| సదాశివపేట మున్సిపాలిటి | 15865 | 15050 | 30915 | 2460 | 521 | 27934 |
| మండలము | 22030 | 20985 | 43015 | 9934 | 699 | 32382 |
| మొత్తము | 37895 | 36035 | 73930 | 12394 | 1220 | 60316 |

సదాశివపేట మండలము వ్యవసాయాధారిత ప్రాంతము. ఈ మండలమున 4371 ఎకరములు మాగాణి, 48503 ఎకరములు మెట్ట భూములు కలవు. ఇక్కడి మెట్ట భూమి కూడా చాలా సారవంతమైన నల్లరేగడి భూమి. ఇక్కడ ఎక్కువగా వరి, చెరుకు, జొన్న, మిరప, ఉల్లి, పప్పుధాన్యములు పండింపబడుచున్నవి. ఈ మండలమునందలి నీటి వనరులు 359 బావులు, 68 చెరువులు అనేకమైన బోర్‌బావులు కలవు.

ఈ మండలమున ప్రభుత్వ భూమిని 1423 ఎస్.సి.లకు 1900 ఎకరములు, 131 ఎస్.టి.లకు 177 ఎకరములు, 695 బి.సి.లకు 1036 ఎకరములు, 224 ఇతరులకు 489 ఎకరములు పంపిణీ చేయబడినది. అట్లే సీలింగ్ మిగులు భూమిని 227 ఎస్.సి.లకు 174 ఎకరములు, 8 ఎస్.టి.లకు 14 ఎకరములు, 145 బి.సి.లకు 168 ఎకరములు, 39 ఇతరులకు 63 ఎకరములు పంపిణీ చేయబడినిది.

సదాశివపేట మండలమున విద్యావకాశములు బాగుగనేయున్నవని చెప్పవచ్చును. ఈ మండలమునందు 41 ప్రాథమిక పాఠశాలలు, 11 ప్రాథమికోన్నత పాఠశాలలు, 7 ఉన్నత పాఠశాలలు. 1 జూనియర్ కళాశాల, 1 డిగ్రీ కళాశాల ప్రభుత్వ యాజమాన్యమున నడచుచున్నవి. ఇవిగాక అనేక ప్రాథమిక, ఉన్నత, పాఠశాలలు ప్రైవేట్ యాజమాన్యమున నడపబడుచున్నవి.

ఈ మండలమునందు ఎస్.సి. విద్యార్థులకై 3, బి.సి. విద్యార్థులకై 2, మొత్తము 5 విద్యార్థి వసతి గృహములు కలవు.

ఈ మండలమున సదాశివపేటలో ప్రభుత్వ ఆసుపత్రి, ఆత్మకూర్‌లో ప్రాథమిక ఆరోగ్యకేంద్రము. నంది కంది, ముబారక్ పూర్, నిజాంపూర్, తంగడపల్లి గ్రామాలలో సబ్ సెంటర్లు పని చేయుచున్నది. ఇవిగాక ప్రైవేటు డాక్టర్లచే నర్సింగ్ హోంలు నడపబడుచు ఇచ్చట ప్రజల ఆరోగ్యమును సరిచూచుచున్నవి.

ఈ మండలమున స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా 2 బ్రాంచీలు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్, మంజీరా గ్రామీణ బ్యాంక్, యూనైటెడ్ కమర్షియల్ బ్యాంక్, వైశ్యాబ్యాంక్‌లు కలవు. జిల్లా సహకార బ్యాంకు వారి శాఖ ఒకటి, ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘములు (సింగల్‌విండోలు) 6 పని చేయుచున్నవి.

సదాశివపేట మండలమున యం.ఆర్.యఫ్. ఒక గొప్ప పారిశ్రామిక సంస్థ. ఇది గాక మరి కొన్ని పారిశ్రామిక సంస్థలు ఇచ్చట గలవు.

ఈ మండలమున 25 పోస్టాఫీసులు, టెలిఫోన్ సౌకర్యములు కలవు.

ఇచ్చట 130 డ్వాక్రా గ్రూపులు 1950 మంది సభ్యులచే 6 లక్షల రూపాయల పొదుపు మొత్తాలతో నడపబడుచున్నవి.

ఈ మండలమునందు 887 వృద్ధాప్య పింఛన్లు పంపిణీ చేయబడుచున్నవి.

ఈ మండలమున ఒక పోలీసుస్టేషన్, ఒక లైబ్రరీ, ఒక మార్కెట్ యార్డు కలవు.

సదాశివపేట మండలములో 4333 తెల్లకార్డులు, 3465 గులాబి కార్డులు, సదాశివపేట స్థానికంగా 6072 తెల్లకార్డులు, 2851గులాబి కార్డుల ద్వారా ప్రతినెల 1907 క్వింటాళ్ల బియ్యము 424 క్వింటాళ్ల చక్కెర సివిల్ సప్లయ్ ద్వారా పంపిణీ చేయబడుచున్నది.

## ఎం.పి.టి.సి. మరియు సర్పంచుల జాబితా

| క్ర.సం. | గ్రామ పంచాయతి పేరు | సర్పంచ్ పేరు | యం.పి.టి.సి పేరు |
|---|---|---|---|
| 1. | ఆత్మకూర్ | శ్రీ పి. అమరేందర్ రెడ్డి | నర్సింలు |
| 2. | ఆరూర్ | శ్రీమతి సిద్దమ్మ | వీర మణెమ్మ |
| 3. | అంకెనపల్లి | శ్రీమతి బి. లక్ష్మి | పి. సంగప్ప |
| 4. | బాబిల్గాం | జి. మొగులయ్య | కె. సుధాకర్ రావు |
| 5. | చందాపూర్ | వై. సంజీవులు | పి. సంగప్ప |
| 6. | కొల్కూరు | జె. స్వరూప | పెంటమ్మ |
| 7. | కంబాలపల్లి | ఇ. రాములు | కాళయ్య |
| 8. | కొనాపూర్ | అబిద్‌హుస్సేన్ | వీర మణెమ్మ |
| 9. | ముభారక్‌పూర్ | బి. బాగయ్య | డి. సుందర్ |
| 10. | మాచిరెడ్డిపల్లి | బి. పారమ్మ | పెంటమ్మ |
| 11. | మద్దికుంట | శహదాబేగం | గాలయ్య |
| 12. | మెలిగిరిపేట | యం. చంద్రమ్మ | జి. కళావతి |
| 13. | నందికంది | యం. శ్రీనివాస్ | పి. అశోక్‌గౌడ్ |
| 14. | నాగులపల్లి | కె. బాలయ్య | పి. సంగప్ప |
| 15. | నిజాంపూర్ | డి. అంజయ్య | పి. వెంకటరెడ్డి |
| 16. | వట్‌పల్లి | పి. సదాశివుడు | పెంటమ్మ |
| 17. | పెద్దాపూర్ | యం. అంజనేయులు | జె. ప్రభావతి |
| 18. | రేజింతల్ | యం. నాగమ్మ | గాలయ్య |
| 19. | సూరారం | నయిముద్దీన్ | కళావతి |
| 20. | సిద్దాపూర్ | యం. విద్యాసాగర్‌రెడ్డి | పి. అశోక్‌గౌడ్ |
| 21. | తంగడపల్లి | ఎల్. మాన్‌సింగ్ | బి. కళావతి |
| 22. | వెల్బూరు | జి. నర్సింహగౌడ్ | డి. సుందర్ |
| 23. | వెంకటాపూర్ | జి. శారదమ్మ | నర్సింలు |
| 24. | ఎల్లారం | పూలమ్మ | నర్సింలు |
| 25. | ఎన్నేపల్లి | యం. మొగులయ్య | నర్సింలు |
| 26. | ఏటిగడ్డసంఘం | యస్.గోపాల్ | కె. సుధాకర్ |

# సంగారెడ్డి మండలము

మెదకు జిల్లాలో సంగారెడ్డి మండలమునకు ఒక ప్రత్యేకత కలదు. ఈ మండలము మెదకు జిల్లాకు కేంద్ర స్థానము. జిల్లాలో నుండు కార్యాలయములు మొత్తము సంగారెడ్డిలోనే కలవు. కలక్టరేటు, జిల్లా పరిషత్తు మొదలైన జిల్లా కార్యాలయములు సంగారెడ్డిలోనున్నవి.

సంగారెడ్డి ఒకప్పుడు చాలా చిన్న పల్లెటూరు. సంగారెడ్డి ప్రక్కనున్న కల్పగూరు రాచరికముగా ప్రసిద్ధి నందినది. కాకతీయుల కాలము నుండియు కల్పగూరు పరిపాలనా కేంద్రముగానున్నట్లు చారిత్రికాధారములున్నవి. నిజాముల జమానా వరకు కూడా కల్పగూరు తాలూకా కేంద్రముగా నుండెడిది తరువాత జరిగిన కాల పరిణామమున సంగారెడ్డి మెదకు జిల్లా కేంద్ర పట్టణముగా అయినది. మధ్యకాలమున మెదకు పట్టణము జిల్లా కేంద్రముగా కావలయునను ఉద్యమములు వచ్చినప్పటికి సఫలము కాలేదు.

సంగారెడ్డి జిల్లా కేంద్రపట్టణముగా నుండి సమస్త సౌకర్యములతో సర్వాంగ సుందరముగా అభివృద్ధి గాంచుచున్నది.

మండలవ్యవస్థ ఏర్పడక ముందు సంగారెడ్డి తాలూకా కేంద్రము, తహసీలు కార్యాలయము సంగారెడ్డిలో నున్నప్పటికి పంచాయితి సమితి కార్యాలయము పటంచెరువులో నుండెను.

మండలవ్యవస్థ ఏర్పాటుతో ఇచ్చట మండల రెవెన్యూ కార్యాలయము, మండల పరిషత్తు కార్యాలయములేర్పాటైనవి.

సంగారెడ్డి మండలమును అర్బన్, రూరల్‌గా విభజించినచో సంగారెడ్డి స్థానిక మున్సిపాలిటి పాలనలో రూరల్ మండల పరిషత్తు పాలనలో నుండును.

సంగారెడ్డి మండలము 53987 ఎకరముల వైశాల్యముతో కలదు. 29 గ్రామములు, 8 మదిరలు, 6 లంబాడి తండాలు ఈ మండలమునందున్నవి.

ఈ మండలమునందు జనాభా మొత్తము 1991 గణన ప్రకారము 106223 కలరు. ఇందు పురుషులు 54582, స్త్రీలు 51656 మంది కలరు. వీరిలో నేటికి విద్యావంతులైన పురుషులు 29783, స్త్రీలు 17204 మొత్తము 46987 ఉన్నారు.

సంగారెడ్డి మండలము ఏర్పడిన తర్వాత జరిగిన మండల ప్రజా పరిషత్తు మొదటి ఎన్నికలలో శ్రీ శంకరంగౌడ్‌గారు ఎన్నికై 5 సంవత్సరాలు మండల ప్రజలకు సేవయొనర్చిరి. ఆతర్వాత జరిగిన రెండవ ఎన్నికలలో శ్రీ పోన్నాలరంగారెడ్డిగారు మండల అధ్యక్షులుగా, శ్రీ జి. పండరి ఉపాధ్యక్షులుగా ఎన్నికైనారు. వీరు మండలాభివృద్ధికి తమ వంతు కృషి గావించు చున్నారు.

మండల వ్యవస్థలో వచ్చిన మార్పులతో సంగారెడ్డి మండలము నుండి జిల్లా పరిషత్తు ప్రాదేశిక నియోజక వర్గ సభ్యునిగా శ్రీ ఆర్. శ్రీనివాస్‌గౌడ్ గారు ఎన్నికై మెదకు జిల్లా పరిషత్తు అధ్యక్షులుగా ఎన్నికైనారు.

సంగారెడ్డి మండలమున విద్యావ్యవస్థ కూడా చక్కగానున్నది. ఇచ్చట ప్రభుత్వపరముగా 2 డిగ్రీ కాలేజీలు, 2 జూనియర్ కాలేజీలు కలవు. వీటిలో ఒక్కొక్కటి బాలికలకు ప్రత్యేకముగా కలవు. 12 ఉన్నత పాఠశాలలు, 8 ప్రాథమికోన్నత పాఠశాలలు, 38 ప్రాథమిక పాఠశాలలు కలవు. ఇవికాక గాంధి స్మారక ఉన్నత పాఠశాల, సరస్వతీ శిశు మందిర్ ఉన్నత పాఠశాల, క్రైస్తవ మిషనరీ పాఠశాలలేకాక ప్రైవేటు యాజమాన్యమున నడుచు పాఠశాలలెన్నో విద్యాభివృద్ధికి ఎనలేని కృషి చేయుచున్నవి. జూనియర్ కాలేజీలు ప్రైవేటు యాజమాన్యమున నడపబడుచు పోటీ పరీక్షలకు కూడా విద్యార్థులను సిద్ధ పరచుచున్నవి.

సంగారెడ్డి మండలమున పేద విద్యార్థుల విద్యాభివృద్ధికై ప్రభుత్వ విద్యార్థి వసతి గృహములు 14 కలవు. వాటిలో యస్.సి. బాలురకై 7, బాలికలకై 2 కలవు. యస్.టి. బాలురకు 1, బాలికలకు 1, బి.సి. బాలురకు 2, బాలికలకు 1 కలవు.

సంగారెడ్డి మండల కేంద్రమున 100 పడకల సివిల్ ఆసుపత్రి సువిశాలమైన ప్రదేశముననున్నది. ఈ మధ్య కాలమున ఈ వైద్యశాల కొంగ్రొత్త భవనాలతో సకాల సదుపాయములతో అలరారుచున్నది.

ఈ మండలమున 17 చెరువులు 101 కుంటలు కలవు. ఇవికాక బావులు, బోర్లు ఇచ్చట వ్యవసాయమునకు నీరందించుచున్నవి. ఈ మండలమునందు వరి, చెరుకు, జొన్న, మిర్చి మొదలగు పంటలు పండించబడుచున్నవి.

సంగారెడ్డి మండలమున ప్రభుత్వ భూమి ఎకరాలు 4,412.36 ఉండగా ఇట్టి భూమిని 350 మంది ఎస్.సిలకు ఎకరాలు 1341.25, ఎస్.టిలకు 182 మందికి ఎకరాలు 302.03, బి.సి.లకు 1176 మందికి ఎకరాలు 1521.18, మైనారిటీలకు 26 మందికి 27.16 గుంటలు. ఇతరులు 419 మందికి 554 ఎకరములు సామాజిక వనరులకై 666 ఎకరములు పంపిణీ చేయనైనది. అట్లే సీలింగ్ చట్టము ప్రకారము మిగులు భూమి 718 హె. 94 సెంట్లుండగా ప్రభుత్వము స్వాధిన పరచుకొని అట్టి భూమిలో 547 హె. 44 సెంట్లు పంపిణీ చేయబడినది.

సంగారెడ్డి మండలమున ప్రతి గ్రామమునకు రక్షిత మంచినీటి సరఫరా కలదు. సంగారెడ్డి పట్టణమునకు మంజీరా నది నీరు సరఫర చేయబడుచున్నది.

సంగారెడ్డి మండలమునందు స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్ బ్రాంచీలు 2, స్టేట్ బ్యాంక్ ఆఫ్

ఇండియా బ్రాంచీలు 5, యూకో బ్యాంక్ బ్రాంచీలు 2, మంజీరా గ్రామీణ బ్యాంకు, జిల్లా సహకార కేంద్ర బ్యాంకులు ఇచ్చుటి ప్రజలకు ఆర్థిక పుష్టిని కలిగించుచున్నవి.

సంగారెడ్డి కేంద్రమున బస్సుడిపో యుండుటచే మండలమునందు రవాణా సౌకర్యము చక్కగా కొనసాగుచున్నది.

సంగారెడ్డి పట్టణమున గల ఫలపరిశోధనా కేంద్రము ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమునకే గర్వకారణముగానున్నది. ఇచ్చుట ముఖ్యముగా మామిడి పండ్ల చెట్లపై జరుగుచున్న పరిశోధన అనేక కొత్త రకముల రూపకల్పన చేయబడుచున్నది.

సంగారెడ్డి పట్టణము ఇప్పుడిప్పుడే వ్యాపార కేంద్రముగా అభివృద్ధి నందుచున్నది. అట్లే పారిశ్రామికముగా కూడా అభివృద్ధి దశలో పయనించుచున్నది.

సంగారెడ్డి మండలమున ప్రజోపయోగ కార్యక్రమములెన్నియో చేపట్టబడినవి.

నిత్యావసర సరకుల పంపిణీ సక్రమముగా జరుపబడుచున్నది. ఈ మండలమునందు స్థానికకముగా 23, గ్రామములలో 37, మొత్తము 60 చౌకధర దుకాణములున్నవి. 14780 తెల్లకార్డులు, 12521 గులాబి కార్డుల వారికి ప్రతి నెల బియ్యము 2662.21 క్వింటాళ్లు. చక్కెర 587.31 క్వింటాళ్లు, కిరోసిన్ 108240 లీటర్లు సరఫరా చేయబడుచున్నవి.

## మండలంలోని సర్పంచ్, మరియు ఎం.పి.టి.సి.ల జాబితా - 1999

| క.సం. | గ్రామ పంచాయతి పేరు | సర్పంచ్ పేరు | యం.పి.టి.సి పేరు | |
|---|---|---|---|---|
| 1. | తోపుగొండా | జి. రాములు | ఎన్. నారాయణ రెడ్డి | |
| 2. | జూల్‌కల్ | మాణమ్మ | ,, | |
| 3. | చెర్లగూడెం | ఎ. వెంకటస్వామి | నరసింహాగౌడ్ | |
| 4. | కలినేముల | పార్వతమ్మ | ,, | |
| 5. | కాశీపూర్ | చెన్నయ్య | ,, | |
| 6. | కంది | శంకర్‌గౌడ్ | బి. ధశరధ్ | |
| 7. | చిమ్నాపూర్ | | ,, | |
| 8. | ఎద్దుమైలారము | కె. ప్రకాశ్‌రావు | కె. రామయ్య | |
| 9. | ఇంద్రకరణ్ | కె. దుర్గయ్య | శ్రీమతి లక్ష్మి | |
| 10. | చెర్యాల్ | నాగమ్మ | జయమ్మ | |
| 11. | కొలంపేట్ | ఎన్. యాదయ్య | అనసూయ | |
| 12. | మామిడి పల్లి | రామయ్య | ,, | |
| 13. | మక్తె అల్లూర్ | రామయ్య | పి. రత్నమ్మ | |
| 14. | కొల్లాపూర్ | పి. సామేల్ | ,, | |
| 15. | ఉత్తరపల్లి | అనంతమ్మ | ,, | |
| 16. | పోతిరెడ్డిపల్లి | రాజాగౌడ్ | పి. రంగారెడ్డి | |
| 17. | బ్యాతోల్ | అంజమ్మ | శారదమ్మ | |
| 18. | యెద్దనూర్ | ఎన్. నీలమ్మ | ,, | |
| 19. | ఇస్మాయిల్‌ఖాన్ పేట్ | లక్ష్మినారాయణ | ఎ. పండరి | |
| 20. | చిద్రుప్ప | సుధారాణి | భారతమ్మ | |
| 21. | ఆరుట్ల | అంజమ్మ | భారతమ్మ | |
| 22. | ఫసల్ వాది | కల్పలత | పి. మాణిక్యం | |
| 23. | కులబ్‌గూర్ | భాగ్యమ్మ | | |
| 24. | తాళ్లపల్లి | పి. సంగన్న | పి. రత్నమ్మ | |
| 25. | నాగాపూర్ | సి. బుచ్చయ్య | పి. రంగారెడ్డి | |
| 26. | ఇక్రిపల్లి | టి. రత్నయ్య | ఎం. రత్నయ్య | |
| 27. | చింతల్‌పల్లి | రాంకిష్టయ్య | | |
| 28. | కలబ్‌గూర్ | కృష్ణారావు | పండరినాధ్ | దుర్గాగౌడ్ |

# శంకరంపేట మండలము

శంకరంపేట మండలము పూర్వపు అందోలు తాలుకా నుండి విభజింపబడి పరిపాలనా వికేంద్రీ కరణకై ఏర్పాటుచేయనైనది.

శంకరంపేట గ్రామము అందోలు సంస్థానాధీశులైన రాణీ శంకరమ్మ గారి పేరిట ఈ గ్రామము వెలసినది. ఈ గ్రామమునకు రక్షాకవచముగా. చుట్టు గోడయుండి కాలగర్భమున కలసి పోయినది. నేటికిని నాటి వైభవమును చాటు బురుజు గ్రామ మధ్యమున గలదు. ఈ బురుజు పెద్ద పెద్ద రాళ్లచే నిర్మించబడి శత్రుదుర్భేధ్యముగా నుండి చాలా ఎత్తుగా నిర్మించబడినది. ఈ బురుజు గ్రామానికే ఆకర్షణగా గలదు.

ఈ గ్రామంలో జన్మించిన శ్రీ. రాజేశ్వరజ్యోషి స్వాతంత్ర్యసమరయోధుడు. ఈ తడు గాంధీగారి అడుగుజాడలలో భారత స్వాతంత్ర్య సంగ్రామంలోను చేరెను. ఆంధ్రజన సంఘ సభ మొట్టమొదట అందోలులో నిర్వహించుటలో శ్రీ రాజేశ్వర జ్యోషిగారి ప్రమేయమే ఎక్కువ అటు భారత స్వాతంత్ర్య సంగ్రామంలోనే గాక నిజాం వ్యతిరేకోద్యమమునందు కూడా పాల్గొని ఎన్నోకష్ట నిష్ఠురములకోర్చి చెర సాలలో జీవితమును కూడా గడిపెను. వీరు అందోలు నియోజక వర్గమునకు మొట్టమొదట శాసన సభ్యునిగా యెన్నికై శంకరంపేట గ్రామానికే కీర్తి తెచ్చినారు.

శంకరంపేట మండలం నిజాంసాగర్ నీటిని ఆనుకొనియుండెను. కొప్పోల్ గ్రామంలో వెలసిన సంగమేశ్వర స్వామి నిజాంసాగర్ తీరంలో వెలసిన క్షేత్రము.

శంకరంపేట మండలమునకు ప్రప్రధమ మండలాధ్యక్షులుగా శ్రీ వి. రామాగౌడ్‌గారు ఎన్నికై మండలాభివృద్ధికి ఎనలేని సేవ చేసిరి.

ప్రస్తుతము శ్రీ రామాగౌడ్‌గారి కుమారులు శ్రీ శ్రీనివాసగౌడ్ గారు మండలా ధ్యక్షులుగా ప్రజాసేవజేయుచున్నారు.

శంకరంపేట మండలమునకు తూర్పున టేక్మాల్ మండలము దక్షిణమున అల్లాదుర్గ్, రేగోడ్ మండలములు పడమట నారాయణఖేడ్, మండలము ఉత్తరాన కల్హేర మండలము కలవు.

శంకరంపేట మండల విస్తీర్ణము 12565 హెక్టార్లు. ఈ మండలమున 25 గ్రామములు 19 గ్రామ పంచాయతీలు కలవు.

ప్రస్తుతము శంకరంపేట మండల అధ్యక్షులుగా శ్రీనివాస్‌గౌడ్ మండల ఉపాధ్యక్షులుగా శ్రీ బక్కారెడ్డి మండలము నుండి జిల్లా పరిషత్తు ప్రాదేశిక నియోజక వర్గసభ్యులుగా శ్రీమతి బోనాల లలిత గారలు ప్రజాసేవ చేయుచున్నారు.

శంకరంపేట మండల రెవెన్యు అధికారిగా శ్రీ హస్తాలపురం శ్రీధర శర్మగారు వ్యవహరించు చుండగా మండల అభివృద్ధి అధికారిగా శ్రీ ఎ. శ్రీనివాస్‌గారు మండల విద్యాధికారిగా శ్రీ లక్ష్మయ్యగారు బాధ్యత నిర్వహించుచున్నారు.

శంకరంపేట మండలమున స్థానికముగా ఒక ప్రభుత్వ జూనియర్ కళాశాల, ఒక ప్రభుత్వ ఉన్నత పాఠశాల, జిల్లా పరిషత్తు బాలికల ఉన్నత పాఠశాల కలవు. మండలములో ప్రాథమికోన్నత పాఠశాలలు 2 ప్రాథమిక పాఠశాలలు 25 కలవు - సమగ్ర శిశు స్త్రీ సంరక్షణ (ఐ.సి.డి.ఎస్) వారి ద్వారా నిర్వహించు అంగన్‌వాడీ కేంద్రములు 34 కలవు. అనియత విద్యా కేంద్రములు 12 కలిగి మండలములో విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నవి.

ఈ మండలమున ఒక షెడ్యూల్డ్ క్యాస్టు (దళిత కుల), ఒక షెడ్యూల్డ్ ట్రైబ్ (గిరిజన), ఒక బి.సి (వెనుక బడ్డ తరగతులు) విద్యార్థుల వసతి గృహములు మండల కేంద్రములో గలవు.

ఈ మండలమునందు రైతులకు వ్యవసాయాభివృద్ధికై ఋణములందించుటకుగాను. 2 వ్యవసాయ సహకార పరపతి సంఘములు పని చేయుచున్నది. స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్, మంజీరా గ్రామీణ బ్యాంక్‌లు ఈ మండలమున కలవు. ఈ బ్యాంకులు వ్యవసాయ ఋణములతో పాటు వివిధ వ్యాపారములకు కూడా ఋణములనొసంగుచు మండలాభివృద్ధికి తమవంతు సహకారము నందించుచున్నవి.

శంకరంపేట మండలమునందు 1991 జనాభాగణన ప్రకారము స్త్రీలు 14590 పురుషులు 16606 మొత్తము 31196 మంది కలరు.

ఈ జనాభాలో హరిజనులు స్త్రీలు 2246, పురుషులు 2147 గిరిజనులు - స్త్రీలు 467, పురుషులు 472, వెనుక బడిన తరగతులు స్త్రీలు 7960, పురుషులు 8301, ఇతరులు స్త్రీలు 3897, పురుషులు 5685 లుకలరు.

ఈ మండలము నందు హరిజన కుటుంబములు 835 గిరిజన కుటుంబములు 190, వెనుతరగతులు 3252 ఇతర కుటుంబములు 2347 మొత్తము 6624 కుటుంబములు కలవు.

శంకరం పేట మండల భౌగోళిక విస్తీర్ణము 12,565 హెక్టార్లుకాగా అందు అటవీ విస్తీర్ణము 193 హెక్టారుల వ్యవసాయయోగ్యమైన భూమి 16,072 -25 ఎకరములు అందు మాగాణి 3425 ఎకరములు మెట్ట 12647-25 ఎకరములు కలదు.

ఈ మండలములో వ్యవసాయమునకై వినియోగించు వనరులు. ఈ క్రింది విధముగా కలవు.

| నీటి వనరులు | సంఖ్య | భూవిస్తీర్ణము |
|---|---|---|
| చెరువులు | 12 | 2021-06 ఎ.క |
| కుంటలు | 97 | 1518-15 ఎ.క |
| బావులు | 153 | 449ఎకరములు |
| గొట్టపు బావులు | 51 | 164 ఎకరములు |
| సాముహిక వ్యవసాయ | | |
| బావులు | 42 | 142 లాభోక్తుల |

ఈ మండలమునందు సన్నకారురైతులు 1385 మంది చిన్నకారురైతులు 1527 మంది కలరు.

ఈ మండలము నందు ప్రభుత్వ భూమి 3603 ఎకరములుండ గా నేటి వరకు లావుణీ పై పట్టాలిచ్చిన భూమి 3553 ఎకరవులు ఇంకను ఈయవలసిన భూమి కేవలము 50 ఎకరములు మాత్రము కలదు. శంకరంపేట మండలమునందు వరి, జొన్న, మిరప, పప్పు దినుసులు, నూనె గింజలు ఎక్కువగా పండింతురు.

శంకరంపేట మండలమున విద్యుత్ సరఫరాకై ఒక సబ్‌స్టేషన్, 76 ట్రాన్స్‌ఫార్మర్లు కలవు. మండల కేంద్రమున ఉండవలసిన అన్ని ప్రభుత్వ కార్యలయాలు ఇచ్చుట కలవు.

ఈ మండలమునందు ప్రధాన తపాలా కార్యాలయములు మండల కేంద్రమున గల్గి మండలమునందు 12 పోస్టాఫీసులు బ్రాంచిలు కలవు. టెలిఫోన్ ఎక్స్‌చేంజి మండల కేంద్రమున గలిగి 20 టెలిఫోన్లు పనిచేయుచున్నవి.

శంకరంపేట మండల కేంద్రమున ఒక ప్రాధమిక ఆరోగ్య కేంద్రము కలదు, దానికి అనుబంధముగా అసబ్ సెంటర్లున్నవి. ఒక డాక్టరు వీటన్నిటిని పర్యటించుచు వైద్యసదుపాయము గల్పించుచున్నారు. ఈ మండలమున ఒక పశు వైద్యశాల అందొక పశువైద్యుడు కలడు. శంకరంపేట మండలమున పోలీసు స్టేషను కూడా కలదు.

ఈ మండలమునందు 1890 మంది సభ్యులున్న 126 డ్వాక్రా గ్రూపులు పని చేయుచున్నవి. ఈ మండలమునందు ప్రభుత్వము నుండి లభించే ఫింఛనులు లో వృద్ధాప్య పింఛన్లు 62, వ్యవసాయ కూలీల పింఛనులు 209, వితంతు పింఛనులు 18 మొత్తము 309 వివిధ రకములైన పింఛనులు కలవు.

శంకరంపేట మండలములో మండల కేంద్రము మంచి వ్యాపార కేంద్రము, ఈ మండలమున 5 రైసు మిల్లులు కలవు, వివిధ రకాలైన వస్తువులు అమ్మకము కొనుగోళ్ళు ఇచ్చుట జరుగును. మండలములోని అన్ని గ్రామములకు శంకరంపేట వ్యాపారకూడలిగా నున్నది . వారమునకొకమారు జరుగు సంతకు మండలమునుండి అన్ని గ్రామముల ప్రజలు తండోపతండాలుగా తరలి వచ్చి వారికి కావలసిన సరకులను కొనుగోలుచేసి కొని పొందురు.

ఈ మండలమునందు చెప్పుకొన దగిన పండితులు కవులు గలరు. నిర్మల పబ్లికేషన్స్ అను సాహితీ సంస్థ యధోచిత రీతిలో సాహిత్య సేవచేయుచున్నది.

## సర్పంచ్‌ల జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | శంకరంపేట (ఎ) | వి. నారాయణ గౌడ్ |
| 2. | మల్కాపూర్ | డి. అనసూయ |
| 3. | గొట్టిముక్కుల | బి. నరేందర్ |
| 4. | బద్దారం | ఎం. కామేశం |
| 5. | చెల్లపల్లి | వై. హనుమయ్య |
| 6. | ఎం. లక్ష్మాపూర్ | సర్దార్ సాబ్ |
| 7. | మూసాపేట | ఎం. జగ్గయ్య |
| 8. | భూర్గుపల్లి | ఎల్. లాలయ్య |
| 9. | హత్నూర్ | ఆర్. దుర్గయ్య |
| 10. | రామోజిపల్లి | డి. భూషణం |
| 11. | మడిసెటిపల్లి | కె. మానెమ్మ |
| 12. | జూకల్ | భవాని |
| 13. | జంబికుంట | ఎం. సాయమ్మ |
| 14. | కమలాపూర్ | కె. శ్రీనివాస గౌడ్ |
| 15. | వీరోజిపల్లి | పెద్దలక్ష్మయ్య |
| 16. | కొత్తపేట | కె. మంజుల |
| 17. | టెంకటి | కె. భూమన్న |
| 18. | బుజురంపల్లి | నారాయణ గౌడ్ |
| 19. | కొల్లపల్లి | భూమయ్య |

## ఎం.పి.టి.సి.ల. జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | కోళ్లపల్లి | శ్రీనివాసగౌడ్ |
| 2. | మాసాయిపేట | బక్కారెడ్డి |
| 3. | శంకరంపేట I | శ్రీమతి జి. పుష్పవతి |
| | శంకరంపేట II | వి. సుభాష్‌గౌడ్ |
| 4. | మాసెట్‌పల్లి | శ్రీమతి జె. విజయలక్ష్మి |
| 5. | టెంకటి | ఏసయ్య |
| 6. | వీరోజుపల్లి | కె. రామాగౌడ్ |
| 7. | ఉట్లూర్ | టి. చంద్రయ్య |
| 8. | గొట్టిముక్ల | బి. సంగయ్య |
| 9. | కో-ఆప్టెడ్ | హిఫీజ్‌ఖాన్ |

# శివంపేట మండలము

మెదకు జిల్లాలో నర్సాపూర్ తాలుకాను ఐదు (5) మండలములుగా విభజించిరి. శివంపేట మండల కేంద్రముగా సమస్త ప్రభుత్వ కార్యాలయాలతో ఏర్పాటైనది.

శివంపేట నైజాం రాష్ట్రమున ప్రధానమంత్రిగా నున్న మహరాజా బహదూర్ సర్‌కిషన్ ప్రసాద్ యొక్క జాగీర్‌గానుండెను. ఆ జాగీరుకు దేవవ్ అల్వాల్ జిల్లా కేంద్రముగా నుండెను. శివంపేట తాలుకా కేంద్రముగా నుండెను. కొన్నాళ్లకు శివంపేట తాలుకా కేంద్రము అల్వాలకు మార్చబడినది. శివంపేట నడిబొడ్డున తహసీల్ ఆఫీసు, పోలీస్ స్టేషన్ ఉండేవి.

శివంపేట మండలమునకు తూర్పున తూప్రాన్, పడమర నర్సాపూర్, ఉత్తరాన వెల్దుర్తి, దక్షిణమున జిన్నారం, నర్సాపూర్ మండలములు ఎల్లలుగా కలవు.

శివంపేట మండలము భౌగోళిక విస్తీర్ణము 20324 హెక్టార్లు. ఈ మండలమునందు 21 గ్రామములు 21 గ్రామ పంచాయితీలు కలవు.

శివంపేట మండల ప్రజా పరిషత్తునకు అధ్యక్షులుగా "వాకిటి రామచంద్రారెడ్డి" గారు ఎన్నికై మండలాభివృద్ధికి కృషి సల్పిరి. 1995లో జరిగిన మలిఎన్నికలలో ఈ మండలాధ్యక్ష పదవి మహిళ బి.సి. లకు కేటాయించగా అధ్యక్ష ఎన్నిక జరుగలేదు. ఉపాధ్యక్షులుగా ఎన్నికైన గోలివెంకటేశం అధ్యక్ష బాధ్యతలను స్వీకరించి మండలాభివృద్ధి కార్యక్రమములు చేపట్టిరి. ఈ మండలము నుండి జిల్లా పరిషత్తు సభ్యులుగా వి. లక్ష్మారెడ్డి ఎన్నికై ప్రజాసేవ యొనరించిరి.

శివంపేట మండలమున 1991 జనాభాగణన ప్రకారము 38904 మంది కలరు. అందు 19719 మంది పురుషులు 19185 మంది స్త్రీలు ఉన్నారు.

ఈ మండలమునందలి ప్రజలు వ్యవసాయమే ప్రధాన వృత్తిగా కలవారని చెప్పవచ్చును. ఈ మండలమున 6272 ఎకరముల తరి 10077 ఎకరముల మెట్టి భూములు వ్యవసాయయోగ్యమై యున్నవి. 16 చెఱువులు, 202 కుంటలు వ్యవసాయమునకు ఉపయుక్తమై యున్నవి.

ఈ మండలమున భూగర్భ జల సంపద పుష్కలముగానున్నవి. ఇచ్చట బోర్లు రాకముందు బావులు ఎక్కువగా నుండెడివి. ఆ తర్వాత బోరు బావులు అధికమైనవి. ఎకరా, రెండెకరములుగల వారు సైతము బోరు త్రవ్వించుకొని వ్యవసాయ ఫలమును పొందుచున్నారు.

ఈ మండలమునందు వరి, చెరకు, పంటలు అధికముగా పండింతురు. కూరగాయల పంట కూడా ఎక్కువగా పండింపబడుచు హైద్రాబాదునకు ఎగుమతి అగుచుండును.

శివంపేట - మండలము అరణ్య ప్రాంతమైనప్పటికి గడిచిన మూడు నాలుగు సంవత్సరములలో వర్షపాతము గణనీయముగా పడిపోయినది. ఇచ్చటి సగటు వర్షపాతము 813 మి.మీ. కాని 1997 లో 373 మి.మీ. 1998లో 547 మి.మీ. 1999 లో 541 మి.మీ వర్షపాతము మాత్రము సంభవించినది.

శివంపేట మండలమునందు 25 ప్రాథమిక పాఠశాలలు, 2 ప్రాథమికోన్నత పాఠశాలలు కలవు. ఆరు (6) ఉన్నత పాఠశాలలు కలవు. వీటిలో గోమారం శివంపేట, దొంతి, ఉన్నత పాఠశాలలు ప్రాచీనమైనవి. కొంతాన్‌పల్లి, పిల్లుట్ల, రత్నాపూర్ పాఠశాలలు ఉన్నత పాఠశాలలే4 సంవత్సరములైనవి. ఈ మండలమున్నందు జూనియర్ కళాశాలలేకుండుట విచారకరము. ప్రతి గ్రామమునందు పాఠశాలలకు స్వంత భవనములున్నవి. (ఒ.బి.బి) డిపెప్ పథకము ద్వారా పాఠశాలలకు చక్కని భవన వసతి కల్గింపబడినది. అట్లే ఉపాధ్యాయుల సంఖ్య కూడా పెంచబడినది. ప్రాథమికపాఠశాలలో ఉపాధ్యాయులు, ప్రాథమికోన్నత పాఠశాలలలో, 55 ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులు పని చేయుచున్నారు. పేద విద్యార్థులకై వసతి గృహములు కలవు. గోమారం, దొంతి పాఠశాలలో చదువు విద్యార్థులకు బి.సి. హాస్టళ్లు, శివంపేటలో ఎస్.టి. హాస్టళ్ల చక్కని భవన వసతితో కలవు. ఈ హాస్టళ్లలో సుమారు 300 మంది విద్యార్థులు భోజనవసతి సౌకర్యములు పొందుచున్నారు.

ఈ మండలమునందు పురుషులలో 40.77%, స్త్రీలలో 14.07% అక్షరాస్యులున్నారు.

శివంపేట మండలమునందు స్థానికముగా ప్రాథమిక ఆరోగ్య కేంద్రము విశాలమైన ప్రదేశమున స్వంత భవన సముదాయముతో కలదు. ఈ కేంద్రమునకు 4 ఉపకేంద్రములు సహాయకారిగా పనిచేయుచున్నవి. సామాన్యమైన రోగములకు తగు చికిత్స ఇచ్చుట లభించుచున్నది.

ఇద్దరు డాక్టర్లుతగు మోతాదులో ఇతర సిబ్బంది ఈ ఆరోగ్య కేంద్రమున పని చేయుచున్నారు. ఈ కేంద్రమునకు ఒక జాబు సౌకర్యముండెను. కేంద్రమునందలి గ్రామములకు వైద్యబృందము వెళ్లి ఆరోగ్య సలహాలనిచ్చుచు వైద్య సహాయము నందించెడివారు. ఈ ఆరోగ్య కేంద్రమునందు కుటుంబ సంక్షేమ ఆపరేషన్లు దిగ్విజయముగా జరుపబడుచుండెను. ఈ మండలమునందు రత్నాపూర్‌లో ఒక ఆయుర్వేదవైద్యశాల, దొంతిలో హోమియోపతి వైద్యశాలలు శారీరక ఆరోగ్యాలకు తోడ్పడుచున్నవి. దొంతిలో కార్మిక వైద్యాలయము కూడా కలదు.

శివంపేట మండల కేంద్రమున ఒకటి, గోమారం గ్రామమందు ఒకటి పశువైద్యశాలలు కలవు. వీటికనుబంధముగా ఉపకేంద్రములు కూడా కలవు. ఇవి ఈ మండలమునందలి పశువులకు వైద్య సౌకర్యమును కల్పించుచున్నవి.

శివంపేట మండలమున పారిశ్రామికముగా కూడా అభివృద్ధి చెందుచున్నది. ఈ మండలమునందు ఒక ఖండసారి చెక్కెర కర్మాగారము కలదు. ఈ షుగర్ ఫ్యాక్టరీ మండలము నందలి చెరుకు ఉత్పత్తి దారులకు యుక్తముగా నున్నది.

"సాప్రమాట్ స్పిన్నర్స్" అను పారిశ్రామిక సంస్థ సుమారు వేయి మంది కార్మికులకు భృతి కల్పించుచు ఉన్నత ప్రమాణాలతో పని చేయుచున్నది. అట్లే ప్లేయింగ్ కెమికల్స్ లిమిటెడ్, లక్ష్మీ ఇంజనీరింగ్ ఫ్యాక్టరీలు ఈ మండలమునందున్న కర్మాగారాలు తిమ్మాపూర్, శికింద్లాపూర్ గ్రామ పరిసరాలలో కోళ్ల పెంపకము (హ్యాచరీస్) పెద్ద ఎత్తున కలవు.

శివంపేటకు సమీపాన గూడూరులో పూర్వము కాగితపు పరిశ్రమ యుండేది. ఇప్పటికి ఆ పరిశ్రమ నడిచిన చాయలు ఆ ప్రదేశంలో అగుపడుతాయి. శివంపేట మండలమునందు "దొంతి" సంస్థానము చెప్పుకోదగినది.

ఈ మండలమున దొంతిలో వేణుగోపాల స్వామి ఆలయము, గూడూరులో పెద్దగొట్టిముక్కలో సంగమేశ్వరాలయము, రత్నాపూర్‌లో తిర్మలస్వామి దేవాలయము, గోమారంలో రామప్పగుట్ట పైనున్న రామలింగేశ్వరాలయము, చండిలోని చండికాలయము, శికింద్లాపూర్ నరసింహస్వామి ఆలయములు అతి ప్రాచీనమైనవి. కడు ప్రసిద్ధమైనవి. వీటిలో గోమారం రామప్ప గుట్టపైని రామలింగేశ్వరా లయమున రాష్ట్రకూటుల నాటిదిగ తెలియుచున్నది. శికింద్లాపూర్ నర్సింహస్వామి జాతర సంవత్సరమున సంక్రాంతి నెలలో 7 ఆదివారములు జరుగును.

ఈ మండలమున ప్రభుత్వభూమి 5569 ఎకరములు 3842 మంది లాభోక్తులకు పంచనైనది. అట్లే సీలింగ్ యాక్టు మిగులు భూమి 1107 ఎకరములు భూమి లేని పేదలకు పంపిణీ చేయనైనది.

ఈ మండలమునందు 27 నిత్యావసర సరుకుల డీలర్లు కలరు. వీరిద్వారా ఒక్కొంటికి బియ్యము 1024.36 క్వింటాళ్లు, పంచదార 114.59 క్వింటాళ్లు పంపిణీ చేయబడుచున్నది.

## సర్పంచ్‌ల జాబితా

| . | గ్రామం పేరు | సర్పంచ్ పేరు | |
|---|---|---|---|
| 1. | నవాబ్‌పేట | సత్యనారాయణ చారి | |
| 2. | పెద్దగొట్టిముక్ల | ధర్మారెడ్డి | |
| 3. | పిల్లుట్ల | గౌరమ్మ | |
| 4. | పాంబండ | జి. జశ్వంత్ | |
| 5. | పోతులబ్ గూడ | జి. నర్సయ్య | |
| 6. | పరికి బండ | వై. లక్ష్మాగౌడ్ | |
| 7. | సికింద్లాపూర్ | చంద్రాగౌడ్ | |
| 8. | పోత్వారం | కె. వెంకటేశ్ | |
| 9. | గోమారం | డి. లక్ష్మి చంద్రాగౌడ్ | |
| 10. | బిజిలీపూర్ | బి. అంజయ్య | |
| 11. | | రత్నాపూర్ | పి. అరుణ |
| 12. | | కొత్నాపేట | లంబాడి ర్యాప్లా |
| 13. | | అల్లీపూర్ | డి. యాదగిరి |
| 14. | | కొంతాన్‌పల్లి | సి. విజయ |
| 15. | | గుండ్లపల్లి | టి. శంకరయ్య |
| 16. | | దొంతి | ఆర్. ఉమారాణి |
| 17. | | శభాష్ పల్లి | జి. మల్లయ్య |
| 18. | | ఛంది | లంబాడి సుచంద్ర |
| 19. | | గంగాయిపల్లి | జి. మల్లయ్య |
| 20. | శివంపేట | జి. ప్రసాద్ | |
| 21. | | చిన్న గొట్టిముకుల | వై. మోహినమ్మ |
| 22. | | తిమ్మాపూర్ | భిక్షపతి గౌడ్ |
| 23. | | ఏదులాపూర్ | బి. పోచయ్య |
| 24. | | ఉసిరికపల్లి | ఎం. లక్ష్మి |

## యం.పి.టి.సి.ల జాబితా

| | గ్రామం పేరు | యం.పి.టి.సి. |
|---|---|---|
| 1. | గోమారం | భాగ్యమ్మ |
| 2. | పెద్దగొట్టిముక్ల | శాంతమ్మ |
| 3. | పిల్లుట్ల | పి. సువర్ణ |
| 4. | ఛంది | రాజారాం |
| 5. | పోతారం | నారాయణ గౌడ్ |
| 6. | శివంపేట | 1. గోలివెంకటేశం |
| | | 2. --- |
| 7. | దొంతి | నారాయణ |
| 8. | కొంతాన్‌పల్లి | కళావతి |
| 9. | పామ్‌బండ | శరబయ్య |
| 10. | రత్నాపూర్ | పెంటయ్య |

# సిద్దిపేట మండలము

మెదకు జిల్లాలో సిద్దిపేటకు ఒక ప్రత్యేకత కలదు. మెదకునకు తూర్పువైపున జిల్లా సరిహద్దుగా ఈ మండలమున్నది.

మెదకు జిల్లాలో సిద్దిపేట రెవెన్యూ డివిజను కేంద్రము, మండల వ్యవస్థ కన్నా ముందు తాలూకా కేంద్రము. ఈ తాలూకా సిద్దిపేట, కొండపాక, నంగనూరు, చిన్నకోడూరు అను నాలుగు మండలములుగా విభజింపబడినది.

సిద్దిపేట మండలమున స్థానిక సిద్దిపేట మున్సిపాలిటి పాలనలోనూ గ్రామీణ ప్రాంతము మండల పరిషత్తు పాలనలోను కొనసాగుచున్నది.

సిద్దిపేట సాంస్కృతికముగా, ఆర్థికముగా, వ్యాపారాత్మకముగా, రాజకీయముగా కడు ముందంజలోనున్నది. జిల్లాలో ఎక్కడా లేని నాడు ఇక్కడ డిగ్రి కళశాల ఏర్పడి జిల్లాలోని విద్యార్థులకే కాక పొరుగు జిల్లాల వారి విద్యాభ్యాసమునకు తోడ్పడినది.

సిద్దిపేట ఒక కళాక్షేత్రము. వివిధ రకములైన ఇత్తడి, కంచు పరిశ్రమలేకాక పట్టు వస్త్రముల నేతకు ఇదీ కేంద్ర స్థానమై యుండెను.

ఇచ్చట జన్మించిన కాపురాజయ్యగారు నేటి చిత్రకళా ప్రపంచమునకు మణిదీపము. లలితకళలన్ని సిద్దిపేటను వరించినవి. శిల్పము, చిత్రము, నాట్యము, సంగీతము, సాహిత్యము సిద్దిపేటలో తాండవమాడు చుండును. ప్రాచీన దేవాలయము శరభేశ్వరాలయము, మొదలగు వాటితోపాటు నిర్మించిన కోటిలింగాలు, ఎల్లమ్మ, లలితా పరమేశ్వరీ దేవాలయములు ఇచ్చట ప్రజల ఆధ్యాత్మిక సంపదను వెల్లడించుచున్నవి.

సిద్దిపేట మండలముగా నేర్పడిన తర్వాత ఈ మండలము భౌగోళిక విస్తీర్ణము 66331 ఎకరములు, ఇందు కేవలము 435 ఎకరములు మాత్రము అటవీ ప్రాంతము, 58832 ఎకరములు వ్యవసాయయోగ్యమైన భూమిలో మాగాణి 8341 ఎకరములు మెట్ట 50941 ఎకరములు కలదు.

సిద్దిపేట మండలమున 1991 జనాభా గణన ప్రకారము పురుషులు 60351, స్త్రీలు 61457, మొత్తము 1,21,808 మంది కలరు.

ఈ మండలమున 17 చెరువులు, 180 కుంటలు సుమారు ఏడువేల బావులు, బోర్లు వ్యవసాయాధారమైయున్నవి.

ఈ మండలమున వరి, మొక్క, చిరుధాన్యములు ఎక్కువగా పండింతురు. ఈ మధ్యకాలమున పొప్పడి పండ్లతోటలు, పట్టు పురుగుల పెంపకము ఎక్కువగా సాగించుచున్నారు.

సిద్దిపేట మండలమేర్పడిన తర్వాత జరిగిన తొలి మండల ప్రజా పరిషత్తు ఎన్నికలలో శ్రీ అయిరేని మల్లయ్యగారు ఎన్నికై ఐదు సంవత్సరములు ప్రజా సేవయొనరించిరి.

కొమురయ్య అధ్యక్షులుగా శ్రీమతి అనిత ఉపాధ్యక్షురాలిగా ఎన్నికై మండలాభివృద్ధికై తమ వంతు ప్రయత్నమొనరించు చున్నారు. ఈ మండలము నుండి జిల్లా పరిషత్తు ప్రయోజక నియోజకవర్గ సభ్యునిగా శ్రీమతి బూర విజయా మల్లేశంగారు ఎన్నికై మండలాభివృద్ధికి తమ చేయూతనందించు చున్నారు.

ఈ మండలము నందు 25 గ్రామములు, 15 మదిరలు కలవు. 30 గ్రామ పంచాయతీలు కలవు. 30 గ్రామ సర్పంచులు, 20 మంది మండల ప్రాదేశిక సభ్యులు కలరు.

ఈ మండలమున విద్యా వ్యవస్థ అభివృద్ధి పథములో కలదు. సిద్ధిపేటలో ప్రభుత్వ పాఠశాలలు గ్రామీణ ప్రాంతములలో పంచాయతి రాజ్ పాఠశాలలు ఇచ్చటి విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నవి. ఈ మండలమున సిద్ధిపేటలో 5 ప్రభుత్వ ఉన్నత పాఠశాలలు కలవు. వీటిలో ఒకటి బాలికలకు ప్రత్యేకించగా ఒకటి ఉర్దూ మీడియం పాఠశాల కలదు. గ్రామీణ ప్రాంతములో 12 జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలు, 9 ప్రాథమికోన్నత పాఠశాలలు, 27 ప్రాథమిక పాఠశాలలు ప్రభుత్వ పరముగా నడచుచున్నవి. ఈ పాఠశాలలన్నియు స్వంత భవనములు కలిగి సువ్యవస్థితమైయున్నవి. ఇవేకాక రాత్రిబడులు, నిరంతర విద్యా కేంద్రాలు, ఇచ్చట పని చేయుచు విద్యావ్యాప్తికి కృషి చేయుచున్నవి.

సిద్ధిపేటలో ప్రభుత్వ జూనియర్ కళాశాల బాలురకొకటి, బాలికలకొకటి ప్రత్యేకముగానున్నవి. ఇచ్చట డిగ్రీ కళాశాలలో ఆర్ట్స్, సైన్సు, విషయములు బోధింపబడుచున్నవి. పోస్టు గ్రాడ్యుయేషన్ సెంటరు ఇచ్చట కలదు.

సిద్ధిపేటలో ప్రభుత్వ విద్యా సంస్థలేకాక ప్రైవేటు యాజమాన్యమున నడుచు విద్యా సంస్థలనేకములున్నవి. ప్రాథమిక పాఠశాలలు, ప్రాథమికోన్నత పాఠశాలలు, ఉన్నత పాఠశాలలు జూనియర్ కళాశాలలు ఇచ్చట విరివిగా కలవు.

సిద్ధిపేటలో ఉపాధ్యాయ శిక్షణా సంస్థ (ఎస్.జి.బి.టి., మరియు ఇ.జి.బి.టి.) యుండెడిది. ఈ కోర్సులు తొలగించిన తర్వాత ప్రస్తుతము సంస్థ పని చేయుట లేదు.

ఈ సంవత్సరము బి.ఇడి. ఉపాధ్యాయ శిక్షణా సంస్థ ప్రైవేటు యాజమాన్యమున నడుపుటకు ప్రారంభింపబడినది. ఈ విధముగా సిద్ధిపేట మండలము విద్యారంగమున పురోభివృద్ధి సాధించినదని చెప్పవచ్చును.

సిద్ధిపేట మండలమున 8 ప్రభుత్వ విద్యార్థి వసతి గృహములు, పేద విద్యార్థులకు ఇతోధిక సహాయమునందించుచున్నది.

సిద్ధిపేట చక్కని వాణిజ్య కేంద్రము. ఇచ్చట అన్ని రకముల వ్యాపారములు సాగును. బట్టల దుకాణము మొదలుకొని బంగారు దుకాణముల వరకు సమస్త రకములైన దుకాణములిచ్చటనున్నవి.

సిద్దిపేటలో నున్న మార్కెటు యార్డుకడు పెద్దది. అనేక గ్రామముల నుండి పండించిన పంట ఇచ్చటికి తేబడి అమ్మకము జరుగును.

సిద్దిపేటలో బియ్యపు మిల్లులు, అటుకుల మిల్లులు, ఆయిల్ మిల్లులు అనేకమున్నవి. బెంగ్లూర్ టైల్స్ తయారు చేయు కర్మాగారములు సిద్దిపేటలో గలవు. ఇన్ని విధములుగా అభివృద్ధి చెందినప్పటికి సిద్దిపేట పారిశ్రామిక ముగా వెనుకబడియున్నదని చెప్పవచ్చును.

ఇచ్చట ఒక ప్రభుత్వపరమైన లేదా ప్రైవేటు యాజమాన్యములైన పరిశ్రమలేకుంట శోచనీయము.

సిద్దిపేట మండలమున స్థానికముగా వైద్య విధాన పరిషత్తు 100 పడకల చికిత్సాలయము ఏర్పాటై సువిశాలమైన ప్రదేశమున చక్కని వసతులతో ప్రజలకు సేవలందించుచున్నది. అట్లే లిప్రసీ కంట్రోల్ యూనిట్, ఫైలేరియా యూనిట్‌లు వైద్య సేవలందించు చున్నవి.

ఈ మండలమునందు పుల్లూరు మరియు నారాయణ్‌రావు పేట కేంద్రములకు ఉపకేంద్రములు కూడా కలవు.

ప్రభుత్వ చికిత్సాలయములే కాక సిద్దిపేటలో ప్రైవేటు నర్సింగ్‌హోంలు చక్కని వసతులతోనున్నవి.

సిద్దిపేట మండలమున తపాలా సౌకర్యమున్నకై 6 పబ్ పోస్టాఫీసులు, 17 బ్రాంచి పోస్టాఫీసులు పని చేయుచున్నవి. టెలిఫోన్ ఎక్స్‌చేంజ్ (దూరవాణి కేంద్రము) కలిగి పట్టణమునేకాక పరిసర గ్రామములు సైతము టెలిఫోన్ వసతి కలిగింపబడియున్నది.

ఈ మండలమున స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఆంధ్రా బ్యాంక్, వైశ్య బ్యాంక్, మంజీరా గ్రామీణ బ్యాంక్, కో-ఆపరేటివ్ కమర్షియల్ బ్యాంకులు తను శాఖల ద్వార ఆర్థిక సేవలందించుచున్నవి.

సిద్దిపేట మండలమునందు సిద్దిపేటతో పాటు తోర్నాల, ఎన్సాన్‌పల్లి గ్రామాలలో పశువైద్యశాలలు కలవు. ఈ వైద్యశాలలకు ఉపకేంద్రములుగా రావురూకుల, రాఘవాపూర్, పుల్లూర్, ఇద్‌కోడ్, మిట్టపల్లి, బక్రీచెప్యాల గ్రామాలలో పనిచేయుచున్నవి.

సిద్దిపేటలోని గ్రంధాలయము అతి ప్రాచీనమైనవి. మెదకు జిల్లాలో స్వాతంత్ర్యముకన్న ముందు వెలసిన గ్రంధాలయములలో సిద్దిపేట ఒకటి. కాని ఈ గ్రంధాలయము నేడు శిథిలమగుచున్నది. చదువరులక్కు సంపూర్ణ వసతిని కలిగించలేకున్నది. ఈ గ్రంధాలయమునకు చక్కని భవన వసతి కల్పించుట అత్యంతావశ్యకమైనదని చెప్పక తప్పదు.

సిద్దిపేటలో మానసికోల్లాసము కలిగించు సినిమా హాళ్లు, నవీన వసతులతో చక్కగా సొంపుగానున్నవి.

ఈ విధముగా సిద్దిపేట మండలము మెదకు జిల్లాలో సర్వాంగ సుందరమైనదని చెప్పవచ్చును.

## సిద్దిపేట మండల సర్పంచులు - యం.పి.టి.సి.లు

| క్ర.సం. | గ్రామము పేరు | సర్పంచ్ పేరు | యం.పి.టి.సి. మం.ప్ర ని.వ.సభ్యులు పేరు |
|---|---|---|---|
| 1. | పొన్నాల | టి. బాలరంగము | వంగ ఇంద్రసేనారెడ్డి |
| 2. | నాంచారు పల్లి | డి. శ్రీనివాస్ | |
| 3. | బక్రిచెప్యాల | పి. జీవన్‌రెడ్డి | డి. అనిత |
| 4. | ఇమాంబాద్ | జె. బాలయ్య | ఎముల నర్సయ్య |
| 5. | చిన్న గుండవెల్లి | యం. నారాయణ గౌడ్ | " |
| 6. | ఇర్కోడు | రామకృష్ణారెడ్డి | |
| 7. | మాబాపూర్ | ఎ. భాగ్యలక్ష్మి | |
| 8: | వెంకటాపూర్ | ఇ. యాదవ్వ | |
| 9. | ఘనపూర్ | పి. రాజవ్వ | జి. అంజమ్మ |
| 10. | నారాయణరావు పేట | కే. దేవమ్మ | జి. అంజమ్మ<br>1. పి. ఎల్లయ్య<br>2. బి. చంద్రవ్వ |
| 11. | పెద్దలింగారెడ్డిపల్లి | టి. కళావతి | |
| 12. | పుల్లూరు | యం. అనసూయ | కె. వెంగళరావు |
| 13. | చింతమడక | జి. రాధ | యం. లక్ష్మి |
| 14. | రావురూకుల | బి. సరోజని | యన్. సత్తెమ్మ |
| 15. | బుస్సాపూర్ | కె. రాజిరెడ్డి | జి. ఎల్లవ్వ |
| 16. | తడ్కపల్లి | జి. చెన్నయ్య | ఎ. నాంపల్లి |
| 17. | తోర్నాల | బి. నారాగౌడ్ | - |
| 18. | రాఘవాపూర్ | యం. యాదగిరి | జి. దుర్గయ్య |
| 19. | కోదండరావు పల్లి | ఆర్. అంజయ్య | - |
| 20. | ఇబ్రాహింపూర్ | బి. శ్రీను | - |
| 21. | బూర్గుపల్లి | జె. యాదాగౌడ్ | - |
| 22. | మిట్టపల్లి | పి. రామకృష్ణ పి.ఐ. | బి. లింగం |
| 23. | ఎల్లుపల్లి | కె. ఆదిరెడ్డి పి.ఐ. | |
| 24. | ప్రశాంత్ నగర్ | తక్సిర్ అహ్మద్ పి.ఐ. | యం.డి. తక్సిర్ |
| 25. | గాడి చెర్లపల్లి | యం. తిరుపతి పి.ఐ. | |
| 26. | హనుమాన్ నగర్ | బి. గంగారామ్ పి.ఐ. | |
| 27. | లింగారెడ్డిపల్లి | టి. పోచిరెడ్డి | 1. బి. శ్రీనివాస్<br>2. జి. నరేశ్‌కుమార్<br>3. వి. జనార్దన్<br>4. పి. సక్కుబాయి |
| 28. | రంగదాంపల్లి | వి. నాగిరెడ్డి పి.ఐ. | |
| 29. | నర్సాపూర్ | టి. లింగయ్య పి.ఐ. | యం. కొముురయ్య |
| 30. | ఎన్సాన్‌పల్లి | పి. నర్సిహ్మారెడ్డి పి.ఐ. | యన్. నర్సింహారెడ్డి |

# టేక్మాల్ మండలము

మెదకు తాలుకాలోగల టేక్మాల్ మండల వికేంద్రీకరణలో భాగంగా మండలముగా ఏర్పడినది. ఈ మండల విస్తీరణము 14,312 హెక్టార్లు. ఈ మండల జనాభా 29401 అందు స్త్రీలు 14599, పురుషులు 14802, మండలమందు 20 గ్రామాలు, 18 గ్రామపంచాయితీలు.

టేక్మాల్ మండలము ఏర్పాటయిన తర్వాత మండల ప్రజాపరిషత్తునకు ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికలలో ప్రజల నుండి నేరుగా శ్రీ బాల కిష్టయ్యగారు అధ్యక్షులుగా ఎన్నిక కాబడి 5 సంవత్సరములు మండల అభివృద్ధికి కృషి సల్పినారు.

రెండవ పర్యాయము 1994 పంచాయతీరాజ్ ఎన్నికల చట్టం వారి యం.పి.టి.సి.లు, జడ్.పి.టి.సి. పదవులు సృష్టించబడినవి. ఎం.పి.టి.సి.లు ప్రజల నుండి ఎన్నిక కాబడి వారి నుండి మండల పరిషత్ అధ్యక్ష ఎన్నిక జరిగినది. ఈ ఎన్నికలలో శ్రీ దేసులీ అధ్యక్షురాలిగా ఎన్నికై తన పదవీ కాలమున మండలాభివృద్ధికి కృషి చేసినది.

ఈ మండలమునందు 26 ప్రాథమిక పాఠశాలలు పని ఏచయుచున్నవి. జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలు 2, పనిచేయుచున్నవి. ప్రభుత్వ జూనియర్ కళాశాల టేక్మాల్‌లో కలదు. వీటన్నింటికి స్వంత భవనములు కలిగి అన్ని వసతులతో ఏర్పాటై యున్నవి.

ఈ మండలము సాంఘుక సంక్షేమ శాఖ ద్వారా 1 ఎస్.సి., 1 బి.సి., హాస్టళ్లు కలవు.

ఈ మండలమునందు ప్రజల ఆరోగ్య సంరక్షణకై ఒక ప్రైమరీ హెల్త్ సెంటర్ పని చేయుచున్నది. దీనికనుబంధంగా సబ్‌సెంటర్లుండి స్థల ప్రజలకు ఆరోగ్య సంరక్షణకై అందుబాటులోనున్నవి.

టేక్మాల్ మండలమున పశుసంరక్షణ శాఖ ద్వారా నిర్వహింపబడుచున్న పశువైద్యశాల ఏర్పాటైయున్నది.

ఈ మండలమునందు 1 పోలీస్ స్టేషన్, 1 విద్యుత్ సబ్‌స్టేషన్ కలవు.

టేక్మాల్ మండలము నందలి ప్రజలు వ్యవసాయ వృత్తిపై ఆధారపడి జీవింతురు. మండలమున తరి భూమి 4037 ఎకరములు, మెట్టభూమి 20322 ఎకరములు కలదు. 6 పెద్ద చెరువులు, 144 కుంటలు, 206 బోర్లు ఇక్కడి వ్యవసాయమునకు జలాధారము నందించుచున్నవి. ఈ ప్రాంతము వరి మొదలగు మాగాణీ పంటలేకాక జొన్న, పప్పు దనుసులు, రేగటి, మెట్టభూముల్లో పండింపబడుచున్నవి.

ఈ మండలము నందు 3 రైస్‌మిల్లులు కలవు. ఈ మండల కేంద్రమున జన్మించిన శ్రీ శ్రీ శ్రీ మదనానందస్వామి వారు అనేక ధార్మిక కార్యక్రమములను ఒనరించినారు.

ఈ మండల కేంద్రమున స్వాతంత్ర్య సమర దినముల్లో ఎన్నో ఉద్యమములు జరిగినవి. టేక్మాలలో జన్మించిన సదాశివ శర్మ, పురుషోత్తమాచార్యులు మొదలగు వారు స్వాతంత్ర్యోద్యమములో పాల్గొని చెరసాల పాలై జీవనమును ధన్యము చేసుకొన్నారు.

ఈ మండలమునందు వేల్పుగొండ గ్రామములో తుంబురేశ్వరాలయము, కాక కళాప్రాభవమునకు శిల్పి నిర్మాణ చాతుర్యమ ఆలవాలముగా చెప్పవచ్చును. వేల్పుగొండలో 2 శాసనములు కలవు. టేక్మాలులో వెలసిన శా మొట్టమొదటి తెలుగు శాసనముగా చెప్పుదురు

## సర్పంచ్‌ల జాబితా

| క్ర.సం | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | కోరంపల్లి | నాగయ్య |
| 2. | బోడ్మట్‌పల్లి | శ్రీనివాస్ గౌడ్ |
| 3. | కడ్లూర్ | అనీల్ కుమార్ |
| 4. | ధనూర | శోభా బాయి |
| 5. | పాలువంచ | దుర్గయ్య |
| 6. | దాదాయపల్లి | పవన్‌కుమార్ |
| 7. | కుసంగి | రామకృష్ణారెడ్డి |
| 8. | తంపుల్లూర్ | సరోజ |
| 9. | ఎల్లుపేట | వి. శంకర్ |
| 10. | బోధగాట్ | నాగమణి |
| 11. | ఎల్‌కుర్తి | దేవప్రసాద్ |
| 12. | అచ్చన్నపల్లి | యాదగిరి |
| 13. | వేల్పుగొండ | లలిత |
| 14. | సూరంపల్లి | సుధాకర్ రావు |
| 15. | టేక్మాల్ | అంజయ్య |
| 16. | ఎల్లంపల్లి | లంబాడి మహారాణి |
| 17. | వెంకటాపూర్ | సక్కుబాయి |

## ఎం.పి.టి.సి.ల జాబితా

| క్ర.సం | గ్రామం పేరు | ఎం.పి.టి.సి | |
|---|---|---|---|
| 1. | వేల్పుగొండ | శ్రీమతి ఎం. దేసులి | |
| 2. | టేక్మాల్ I | బి. వీరప్ప | |
| | టేక్మాల్ II | మానిక్ కిషన్ | |
| 3. | ఎలకుర్తి | పద్మయ్య | |
| 4. | పల్వంచ | అన్నారం మాణయ్య | |
| 5. | కు సంగి | శ్రీమతి మన్నె గంగమ్మ | |
| 6. | తంప్లూర్ | ఎస్. దుర్గమ్మ | |
| 7. | కోరంపల్లి | ఎం. మాణయ్య | |
| 8. | బర్దిపూర్ | శ్రీమతి బీంబాలు | |
| 9. | కో-ఆప్టెడ్ | తస్కిన్ మొయినొద్దీన్ | |

# తూప్రాన్ మండలము

మెదకు జిల్లాలో తూప్రాన్ ఒక చక్కని అభివృద్ధి చెందిన మండలము.

తూప్రాన్ జాతీయ రహదారి 7 పై హైదరాబాదుకు కేవలము 55 కి.మీ. దూరము గలదు. సంగారెడ్డి - గజవెల్లి రోడ్డు మార్గము కూడా తూప్రాన్ మండల కేంద్రము నుండియే పోవుచున్నది. తూప్రాన్ రోడ్డులో కూడలిగా నుండి వ్యాపారము మిక్కిలి అభివృద్ధి సాధించుచున్నది.

తూప్రాన్ మండలము నుండి రైలు మార్గము మనోహరాబాదు - బ్రాహ్మణపల్లి స్టేషన్ల ద్వారా వెళ్లుచున్నది. ఈ రైలు మార్గము సికింద్రాబాదు నుండి మన్మాడ్ వరకు కలదు.

7వ జాతీయ రహదారిపై నుండుటచే వ్యాపార పరముగానే గాక పారిశ్రామికముగా కూడా అభివృద్ధి లోనున్నది. మండలములోని కాళ్లకల్ (కాలకంటి) ప్రాంతము పారిశ్రామికవాడగా విరాజిల్లుచున్నది. ఇచ్చట సుమారు 30 పరిశ్రమలు నెలకొల్పబడి చక్కగా పనిచేయుచు, ఇతోధిక ఉత్పత్తిని చేయుచున్నవి.

తూప్రాన్ మండల ప్రాంతము మండలాలేర్పడక ముందు గజవెల్లి తాలుకాలో నుండెడిది. జనవరి 1985లో స్వర్గీయ నందమూరి తారక రామారావు ముఖ్యమంత్రిగారి ఆలోచనా సరళిమేరకు పరిపాలనా వికేంద్రీ కరణమునకై తాలూకాలు మండళ్లుగా విభజింపబడినవి. ఆ కార్యక్రమంలోని భాగంగా గజవెల్లి తాలూకా ఆరు మండలాలుగా విభజింపబడినది తూప్రాన్ ఒక మండల కేంద్రముగా వెలసినది.

తూప్రాన్ మండల కేంద్రము అన్ని వసతులలో సమస్త సౌకర్యములు గలిగి నట్టిది.

తూప్రాన్ మండలమునకు తూర్పున వర్గల్ మండలము పడమట శివ్వంపేట మండలము ఉత్తరాన వెల్దుర్తి మండలము, దక్షిణ దిశలో రంగారెడ్డి జిల్లాలోని మేడ్చల్ మండలములు కలవు ఈ మండల విస్తీర్ణము 42,467 ఎకరములు.

మార్చి 1987న జరిగిన మొట్ట మొదటి మండల ప్రజా పరిషత్తు ఎన్నికలలో తలారి సత్తయ్య మండలాధ్యక్షులుగా ఎన్నిక కాబడి ఐదు సంవత్సరములు మండలాభివృద్ధికి తన వంతు కృషి నందించినారు.

1995 లో జరిగిన పంచాయతీరాజ్ యాక్టులో తెచ్చిన మార్పున కనుగుణముగా పరోక్ష పద్ధతిన జరిగిన ఎన్నికలలో ఎన్నికైనారు. వీరు విద్యావంతులైన యువకులు. మండలమున అభివృద్ధి పథములో నడుపుటకు నిరంతర కృషి సల్పుచున్నారు. ఈ మండల పరిషత్తునకు 12 మంది మండల నియోజకవర్గ సభ్యులు ఎన్నిక కాబడినారు.

మండల ఉపాధ్యక్షుడుగా శ్రీ పెద్దెల్క మధుసూదనరెడ్డి ఎన్నిక కాబడి మండలాభివృద్ధిలో అధ్యక్షునకు తన సహకార మందిస్తున్నారు.

తూప్రాన్ మండలమున 1991 జనాభాగణన ప్రకారము స్త్రీలు 21,343 ఉండగా పురుషులు 22,285 కలరు మొత్తము జనాభా 43,628. ఇందులో ఎస్.సీ.లు 3,600, స్త్రీలు 3,723 పురుషులు గిరిజనులు స్త్రీలు 263. పురుషులు 232, వెనుకబడిన తరగతులవారు మరియు ఇతరులలో స్త్రీలు 17,450, పురుషులు 18,280 ఉన్నారు.

తూప్రాన్ మండలమున 35 రెవెన్యూ గ్రామాలు 6 మదిర గ్రామాలు కలవు. ఈ మండలమున 22 గ్రామపంచాయతీలు కలవు మండలకేంద్రమైన తూప్రాన్ మేజర్ గ్రామ పంచాయతిగా పేర్కొనబడును.

తూప్రాన్‌లో ప్రైవేటు యాజమాన్యమున ఒక డిగ్రీ కళాశాల మరియు ఒక జూనియర్ కళశాలలు కలవు. ప్రభుత్వ జూనియర్ కళాశాల 1998 న ఏర్పాటు చేయనైనది. జిల్లా పరిషత్ బాలుర, బాలికల, ఉన్నత పాఠశాలలు విద్యాభి వృద్ధికి తోడ్పడుచున్నవి. ఈ మండలమునందు మనోహరాబాదు, ఘన్‌పూర్, కాళ్లకల్, గ్రామాలలో జిల్లాపరిషత్. ఉన్నత పాఠశాలలు స్వంత భవనములు కలిగి అన్నివసతులతో నడపబడుచున్నవి. యావాపుర్, బ్రాహ్మణపల్లి, కూచారంలలో ప్రాథమికోన్నత పాఠశాలలు కలవు.

ఈ మండలమునందు 41 ప్రాథమిక పాఠశాలలు పని చేయుచున్నవి. ఈ మండల అధీనమున 111 మంది ఉపాధ్యాయులు పని చేయుచున్నారు. ఇంతేగాక 18 నిరంతర విద్యా కేంద్రాలకు రాలేని యువకులకు, యువతులకు విద్యాబోధన సల్పబడుచున్నది.

తూప్రాన్ మండలమున విద్యార్థి వసతిగృహములు మండలకేంద్రమున మాత్రము S.C. మరియు B.C. ల విద్యార్థులకై పని చేయుచున్నవి. తక్కిన మూడు ఉన్నతపాఠశాలలున్న గ్రామములందు కూడా వసతిగృహముల అవసరము ఎంతైననుకలదు.

తూప్రాన్ మండలమునందు వైద్య సదుపాయములు చక్కగానున్నవి జిల్లాలో ఏకైక ప్రాథమిక ఆయుర్వేద ఆరోగ్యకేంద్రము తూప్రాన్‌లో కలదు. ఈ కేంద్రమున ఇద్దరు ఆయుర్వేద (పురుష + స్త్రీ) డాక్టర్లు పనిచేయుదురు. ఈ ఆయుర్వేద కేంద్రమునకు చక్కని భవనము మరియు ఇతరపరిశోధికలు సమస్తవసతులు సమకూర్చబడినవి. ప్రాథమిక ఆరోగ్య కేంద్రము కూడా ప్రత్యేకముగా ఇచ్చట నెలకొల్ప బడి భవనము ఇతర వసతులు సమకూర్చబడి మండలములో వైద్య సహాయము నందించుచున్నది. ఇచ్చట ప్రైవేటు నర్సింగ్ హోంలు కూడా కలవు. వాటి ద్వారా కూడా వైద్యసాయము మండల ప్రజలకు లభ్యమగుచున్నది.

ఈ మండలమునందు పశువైద్యశాల తూప్రాన్ లోనున్నది. ఈ పశు వైద్యశాలకు అనుబంధముగా కాళ్లకల్, కూచారం, ఘన్‌పూర్‌లలో పశు వైద్య ఉప కేంద్రములు పని చేయుచున్నవి.

తూప్రాన్ మండలము నందు వ్యవసాయ యోగ్యమైన భూమి మాగాణి 5519 ఎకరము 27 గుంటలు. మెట్ట 1983.32 ఎకరములు గలదు. ఈ మండలమునందు 44 చెరువులు, 173 కుంటలు, కలవు బావులు, గొట్టపు బావులు కూడా అధికముగ నేయున్నవి, సామూహి కవ్యవసాయ బావులు 150 కల్గి 446.37 ఎకరముల భూమి సాగు చేయబడుచున్నది. ఈ మండలమున ప్రధానపంటలువరి, చెరకు, మొక్కజొన్న, ఈ మధ్యకాలము కూరగాయలను కూడా ఎక్కువగా పండించుచున్నారు. రైతులకు ప్రభుత్వ సబ్సిడీలో స్ప్రేయర్లు - మరనాగండ్లు సప్లై చేయబడినవి.

ఈ మండలమునందు తూప్రాన్, అల్లాపూర్ రావెల్లి నాగులపల్లి గ్రామాల్లో (4) ఖండసారి చక్కెర కర్మాగారములు గలవు. ఈ చక్కెర కర్మాగారము లుండుటచే ఈ ప్రాంతమున చెరుకు ఉత్పత్తి అధికముగానున్నది.

ఈ మండలమున బియ్యపు మిల్లులు కూడా ఎక్కువగానేయున్నవి. స్వాతంత్రపూర్వమే ఈ మండలమున బ్రాహ్మణపల్లి, తూప్రాన్‌లలో బియ్యపుమిల్లులు పని చేసెడివి.

ఈమండలమునందు తూప్రాన్‌లో ప్రోఆగ్రోసీడ్స్ కాళ్లకల్ లో మహికో సీడ్స్ పెద్దయెత్తున విత్తన కేంద్రములు నెలకొల్పబడి పరిశుద్ధమైన, క్రొత్తరకమైన విత్తనములను రైతుల కందించుచు వ్యవసాయాభివృద్ధికి తోడ్పడుచున్నవి.

ఈ మండలమునందు తూప్రాన్‌లో స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా వ్యవసాభివృద్ధిశాఖ, కార్పోరేషన్ బ్యాంకు కోఆపరేటివ్ బ్యాంకు, మంజీర గ్రామీణ బ్యాంకు శాఖలు కలవు. మనోహరాబాదులో మంజీరా గ్రామీణ బ్యాంకు కలదు. ఈ బ్యాంకలన్నియు తమ పరిధిలోని గ్రామములలో వ్యవసాయమునకు, చిన్న, పెద్ద పరిశ్రమలకు విరివిగారుణ సదుపాయ ములు గల్పించుచు, వ్యవసాయాభివృద్ధిని వ్యాపారా భివృద్ధికి తోడ్పడుచున్నవి. ఈ మండలమున తూప్రాన్, ఇస్లాంపూర్, యావాపూర్, మనోహరాబాద్, కాళ్లకల్ గ్రామాలలో (5) వ్యవసాయ సహకార సంఘములుగలవు ఈ సహకార సంఘములద్వారా వ్యవసాయమునకు రుణములు లభించుచున్నవి.

ఈ మండలమున తూప్రాన్‌లో 33/11 కె.వి. సబ్‌స్టేషన్ మనోహరాబాద్‌లో 133/11 కె.వి. సబ్‌స్టేషన్లు గలిగి ఎక్కువ మొత్తములో ట్రాన్స్‌ఫార్మర్లు బిగించబడినవి దీనితో ఈ మండలమునందు విద్యుత్తు సౌకర్యము చక్కగా లభ్యముగుచున్నది.

తూప్రాన్ మరియు కాళ్లకల్ గ్రామములలో సబ్‌పోస్టాఫీసులును, టెలిఫోన్ ఎక్స్ఛేంజీలును కలవు.

ఈ మండలములో కాళ్లకల్ గ్రామ పరిసరములలో 30 (ముప్పదికి) పైగా పరిశ్రమలు పనిచేయుచు పారిశ్రామికాభివృద్ధికి గణనీయమైన సేవలనందిం చుచున్నవి.

ఇన్ని పరిశ్రమలున్నప్పటికిని స్థానికులకు ఈ పరిశ్రమలలో తగిన ఉద్యోగము లిచ్చుట లేదను అపప్రధకలదు.

ఈ మండలమున 10 మహిళామండళ్లు చక్కగా నిర్వహింపబడుచున్నవి. తూప్రాన్‌లో 3 లింగారెడ్డి పేట, బ్రాహ్మణపల్లి, పగుడాలపల్లి, జిండాపల్లి, కోనామిపల్లి యావాపూర్, రామాయిపల్లి గ్రామాలలో ఈ మహిళా మండళ్లు కలవు.

తూప్రాన్ మండలమున మహిళలచే నిర్వహింపబడు డ్వాక్రాగ్రూపులు 133 గలవు. ఒక్కొక్క గ్రూపునందు 15 గురు మహిళలుందురు. ఇందు 100 గ్రూపులు 1988 నుండి 1500 సభ్యులతో సుమారు 2 లక్షల (200000-00) రూ. మూలధనముతో అంతే మొత్తపు ప్రభుత్వరుణముతో పనిచేయుచున్నవి. 199లో 33 గ్రూపులు (కొత్తగా నేర్పడి సుమారు (2,50000-00) రెండు లక్షల ఏబదివేలమూలధనముతో నిర్వహింపబడుచున్నవి. ఇవిగాక 28 సెల్ఫ్‌హెల్ప్ గ్రూపులు 50 వేలరూపాయల పొదుపుతో నడపబడుచున్నవి. డ్వాక్రా పథకము క్రింద 60 టీ.వీ.లు సగముధరకు డి.ఆర్.డి.ఏ ద్వారా ఒసంగబడినవి, ట్రైజం పథకాలతో 100 కుట్టు మిషన్లు ఈయబడినవి. బ్రాహ్మణపల్లి, పవుడాలపల్లి గ్రామాలలో డ్వాక్రాద్వారా లబ్దిదారులు పురోభివృద్ధిని సాధించుచున్నారు.

తూప్రాన్ మండలమున బలహీన వర్గాల గృహనిర్మాణ పథకముతో 1000 S.C. లకు 50 S.T. లకు. 800 "B.C. లకు 200 ఇతరులకు లాభము చేకూరినది. ఈ మండలమున పౌరసరఫరా విభాగము నుండి తెల్లకార్డులు 8150 గులాబికార్డులు 1551 మొత్తము 9701 కార్డులుగలవు. వీరికి ప్రతినెల చక్కెర, బియ్యము, కిరోసిను సరఫరా చేయబడుచున్నవి.

ఈ మండలమునందు మొదట 4 రక్షిత మంచి నీటి సరఫరాలుండగా మండల మేర్పడినత ర్వాత 2 లక్షల 20 వేల రూపాయలు ఒక్కొక్కటి చొప్పున 22 గ్రామాలలో రక్షిత మంచినీటిని అందించుటకు వసతులేర్పర చబడినవి. ఇవేగాక 6 మినీ వాటర్ సప్లైస్కీంలు కూడా కలవు.

తూప్రాన్ మండలమునందు మనోహరాబాద్, తూప్రాన్‌లలో సోషల్ ఫారెస్ట్‌వారి, నర్సరీలలో మొక్కలపెంపకము జరుపుచు ప్రజలకందింప బడుచున్నవి.

ఈ మండలమునందు వృద్ధాప్యపింఛన్లు 666, గర్భిణీ పింఛన్లు 142 పంపిణీ చేయబడుచున్నవి. డి.ఆర్.డి.ఏ. ద్వారా 4 లక్షల రూపాయల సబ్సిడి ఈ మండల మునకు లభించినది. బి.సి. కార్పోరేషన్ ద్వారా 20 సబ్‌మెర్సిబుల్ పంపు సెట్లు లా భోక్తులకు పంచబడినవి.

నాబార్డ్ నిధులతో 40 లక్షల రూపాయలతో వట్టూరు బ్రిడ్జి మరియు మల్కాపూర్ B.T రోడ్డు వేయుబడినవి. టెంత్ఫైనాన్స్ ( $10^{th}$ Finance ) నిధులతో 10 లక్షలతో తూప్రాన్ నుండి కిష్టాపూర్ రోడ్డు 16 పాఠశాల గదులు మరియు 2 నిరంతర విద్యాకేంద్రమునకు గదులు నిర్మింపబడినవి. 25 లక్షల రూపాయల వ్యయముతో యం.పి నిధుల నుండి కిష్టాపూర్ వద్ద చెక్డ్యాం నిర్మించి దానినుండి తూప్రాన్కు త్రాగు నీరువసతి కలిపింసబడినది.

తూప్రాన్ మండలమునందు జన్మభూమిలో 46.53లక్షల రూపాయలతో ఈ క్రిందిపనులు చేపట్ట బడినవి.

8 లక్షల రూ. వ్యయముతో $NH_7$ నుండి కూచారం రోడ్డు

3 లక్షలతో $NH_7$ నుండి కొండాపూర్ via ముప్పిరెడ్డి పల్లిరోడ్డు

8 లక్షలతో $NH_7$ నుండి జీడిపల్లిద్వారా గొల్లగడ్డ. రోడ్డు

3 లక్షలతో $NH_7$ నుండి పాలాట రోడు

4.5 లక్షలతో $NH_7$ నుండి ఇమాంపూర్ రోడ్డు

1 లక్షలతో రామాయపల్లి నుండి ఘన్పూర్ రోడ్డు

2 లక్షలతో గజ్వేల్ P.W.D రోడ్డు నుండి అల్లాపూర్ రోడ్డు

5 లక్షలతో తూప్రాన్ నుండి గుండ్రెడ్డి పల్లి రోడ్డు

1 లక్షలతో మల్కాపూర్ నుండి గుండ్రెడ్డిపల్లి రోడ్డు

3 లక్షలతో P.W.D. రోడ్డు నుండి బుర్హాన్పల్లి రోడ్డు.

10 లక్షలతో తూప్రాన్ నుండి కిష్టాపూర్.

2 లక్షలతో కాళ్లకల్ స్కూల్బిల్డింగ్

1 లక్షలతో కూచారం S.C. బిల్డింగ్.

N.R.E.D. నిధుల నుండి 1990 లో 14 లక్షల రూపాయలతో తూప్రాన్ - వెల్దుర్తి రోడ్డు నిర్మాణము జరుపబడినది. - తూప్రాన్ మండలమున స్వాతంత్ర్య సమరయోధులుగా కీర్తికెక్కిన వారు గలరు.

| గ్రామము | నామము |
|---|---|
| తూప్రాన్ | శ్రీ గోపాల్రెడ్డి |
| ,, | శ్రీ. R. సత్యనారయణగౌడ్ |
| ,, | శ్రీ. రామస్వామి గౌడ్ |
| నాగులపల్లి | శ్రీ. పాలెబాలయ్య |

వీరు నిజాంవిమోచనోద్యమములో పోరాడి. కారాగార వాసము చేసిరి.

తూప్రాన్ గ్రామ నివాసియగు శ్రీ నర్సింహాచారి గారు ఆంధ్రప్రదేశ విధాన మండలీ సభ్యులుగా చాలాకాలము పని చేసి ప్రజాసేవ యొనర్చిన నాయకులు ప్రజా గాయకుడుగా పేరుగాంచిన గద్దర్ తూప్రాన్ గ్రామమున జన్మించిన కళాకారుడు.

ఈ మండలమున ప్రాచీన శిలాశాసనములు మూడుగలవు (1) తూప్రాన్ బ్రాహ్మణవాడలో నిశిలాశాసనము (2) మనోహరాబాదు మజీదు దగ్గర శిలాశాసన (3) పాలాటమజీదు దగ్గర శిలాశాసనము.

ఈ మూడు శాసనములును కాల్యాణీ చాళుక్యుల కాలమున వేయించిన దానశాసనములు

ఈ మండలమున ఇస్లాంపూర్ రామప్పగుట్ట పైనున్న రామలింగేశ్వర స్వామి దేవాలయము ప్రసిద్ధ

క్షేత్రము. ఇచ్చట ఈ కొండపై ప్రాచీన కాలమున పాతిపెట్టిన ధనరాసులున్నవని ప్రజలు అనుకొందురు. ఈ దేవాలయ నిర్మాణమును గాంచినచో రాష్ట్రకూటుల నాటి దేవాలయ నిర్మాణము అని తోచుచున్నది. రాష్ట్రకూటులకాలమున పెక్కు రామలింగేశ్వరాలయములు నిర్మాణము గావించ బడినవి. అంతేగాక ఈ దేవాలయములు ఎత్తు చాలా తక్కువగానున్నవి. ద్వార బంధముల కూడా చాలా తక్కువ ఎత్తులో సుమారు 4 లేక 5 అడుగుల ఎత్తుతో మాత్రమే నిర్మితమైయున్నవి. తెలంగాణమున "రామలింగేశ్వర" నామముతో అనేక దేవాలయములు గలవు. ఈ దేవాలయములన్నియు ఒకే రకమైన నిర్మాణముతోనున్నవని చెప్పవచ్చును.

తూప్రాన్ మండలకేంద్రము మండలప్రజాపరిషత్తు, రెవెన్యూమండలకార్యాలయము, డివిజనల్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ (D.S.P) సర్కిల్ ఇన్స్పెక్టర్ ఆఫ్ పోలీస్ (C.I) సబ్ ఇన్స్పెక్టర్ ఆఫ్ పోలీస్ (S.I) ఎలక్ట్రిక్ సిటీ (విద్యుత్తు) ఇంజనీర్ (J.E.). డాక్ బంగ్లా మొదలగు ప్రభుత్వ కార్యాలయములు స్వంతభవనములతో గలవు. ఇచ్చట ప్రభుత్వజూనియర్ కళాశాలకు, బాలికల జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాలకు స్వంత భవనములు లేక ప్రస్తుతము బాలుర జి.ఎ. ఉన్నత పాఠశాలలో నిర్వహింపబడుచున్నవి.

# తూప్రాన్ మండలము

| క్ర సం | గ్రామ పంచాయతి | సర్పంచ్ | యం.పి.టి.సి |
|---|---|---|---|
| 1. | అల్లాపూర్ | సర్వశ్రీ యం. కమలమ్మ | సర్వశ్రీ బి. లక్ష్మి |
| 2. | ఇస్లాపూర్ | అంబటి శంకరయ్య | |
| 3. | ఇమాంపూర్ | శ్రీమతి అల్లాడి సరోజని | |
| 4. | కాళ్లకల్ | వి. అనంత రెడ్డి | ఇంద్రకరన్ గిరిధర్ రెడ్డి |
| 5. | కిష్టాపూర్ | సి. కిషన్ | |
| 6. | కూచారం | చిన్నరాయులు | |
| 7. | కోనాయిపల్లి | వై. సుధాకర్ రెడ్డి | |
| 8. | గుండ్రెడ్డి పల్లి | శ్రీమతి సరోజని | గంగుమళ్ల ప్రతాపరెడ్డి |
| 9. | ఘనపూర్ | విజయభాస్కర్ రెడ్డి | శ్రీమతి కె. లక్ష్మి |
| 10. | జీడిపల్లి | పి. గంగారాం | బి. సత్తయ్య |
| 11. | తూప్రాన్ | ఆర్. వీరకుమార్ గౌడ్ | 1. ఆర్. చంద్రయ్య,<br>2. బి. శంకర్ |
| 12. | నాగులపల్లి | కె. మల్లేశం | పి. మధుసూదన్ రెడ్డి |
| 13. | బ్రాహ్మణపల్లి | పి. సుశీల | బి. అంజయ్య యాదవ్ |
| 14. | మనోహరాబాద్ | సి. ఇల్లయ్య యాదవ్ | శ్రీమతి బి. భారతి |
| 15. | మల్కాపూర్ | శ్రీమతి పోచమ్మ | శ్రీమతి బి. లక్ష్మి |
| 16. | ముప్పిరెడ్డి పల్లి | చిన్నసాయులు | |
| 17. | యావాపూర్ | శ్రీమతి ఆర్. లక్ష్మి | |
| 18. | దామాయపల్లి | ఆర్. కిష్టయ్య | |
| 19. | రగాయపల్లి | వి. విఠల్ రెడ్డి | శ్రీమతి. వి. భారతి |
| 20. | రావెల్లి | వీరయ్య | |
| 21. | లింగారెడ్డి పల్లి | కె. రాములు | |
| 22. | వెంకటాయ పల్లి | శ్రీమతి. బొబ్బిలి నర్సమ్మ | |
| | మండల పరిషత్తు | కో ఆప్షన్ సభ్యులు | యం.డి.షకీల్ అహ్మద్ |
| | | 22 సర్పంచులు | |

# వెల్దుర్తి మండలము

మెదకు జిల్లాలో వెల్దుర్తి మండలమును ప్రత్యేకముగా పేర్కొనవచ్చును. ఈ మండల కేంద్రమును ఆనుకొని పసుపుటేరు ప్రవహించు చున్నది.

వెల్దుర్తిమండలము ఏర్పడకముందు రామాయంపేట తాలూకా అంతర్భాగముగానున్నది. 1987న జరిగిన అధికార వికేంద్రికరణ, ప్రజల సమీపమునకు ప్రభుత్వమును విధానములచే తాలూకాలు మండలాలుగా విభజింపబడినవి. ఆ విభజనలో భాగముగా రామాయంపేటతాలూకా (1)రామాయంపేట (2) చేగుంట (3) శంకరంపేట (రా) (4) వెల్దుర్తి మండలాలుగా విభజింపబడినది.

వెల్దుర్తి మండలము భూవిస్తీర్ణము 51,969 ఎకరములు. ఈ మండలమునకు ఎల్లలుగా తూర్పున శంకరంపేట (రా) మండలము పడమట కొల్చారం మండలము దక్షిణాన శివంపేట మండలము ఉత్తరాన మెదకు మండలములుకలవు.

ఈ మండల కేంద్రమున 1.మండల రెవెన్యూ కార్యాలయము. 2. మండల పరిషత్తు కార్యాలయము 3. ప్రాథమిక ఆరోగ్యకేంద్రము 4. టెలిఫోన్ఎక్స్చేంజి 5.పోలీస్‌స్టేషను 6. విద్యుత్ సబ్‌స్టేషన్ కార్యాలయములున్నవి. మండల కార్యాలయములైన మండల పరిషత్తు, రెవెన్యూ మండలములకు స్వంతభవనములులేక అద్దె భవనములలో నడుప బడుచున్నవి.

వెల్దుర్తి మండలమేర్పడిన తర్వాత 1987 లో వెల్దుర్తి మండల ప్రజాపరిషత్తునకు ఎన్నికలుజరిగినవి. అప్పటి పంచాయత్‌రాజ్ చట్టము ప్రకారము మండలాధ్యక్షుల ఎన్నికపార్టీ పరముగా ప్రజలతో ప్రత్యక్షరీతిలో జరిగినవి. ఆ ఎన్నికల లో వెల్దుర్తి మండల అధ్యక్షపదవి స్త్రీలకు కేటాయించనైనది. ఆ ఎన్నికలలో శ్రీమంతి జి. శకుంతలమ్మగారు ఎన్నికైనారు. వీరు 5 సంవత్సరములు మండలాభివృద్ధికై తన వంతు కృషినిగావించినారు.

తిరిగి 1995 లో మండల పరిషత్తునకు రెండవపర్యాయము ఎన్నికలు జరిగినవి. ఈమ్మారు పంచాయత్ రాజ్ చట్టము మార్పులకు లోనైనది. మండలమును ప్రాదేశిక నియోజక వర్గములు గావిభజింపబడినది. ప్రా.ని. సభ్యులు ప్రజలచే పార్టీగుర్తులపై ఎన్నుకోబడుదురు. ప్రా.ని. సభ్యులు (యం.పి.టి.సి) అధ్యక్ష ఎన్నికలలో పాల్గొందురు. ఆ విధముగా వెల్దుర్తి మండలమున 10 ప్రాదేశిక నియోజక వర్గసభ్యులు ఎన్నికై మండలమున మండలాధ్యక్షునిగా శ్రీ నాళ్ల చెరువు శంకరగౌడ్ ఉపాధ్యక్షునిగా నాగుల పల్లి అంజిరెడ్డి ఎన్నికైనారు.

ప్రతి మండలము నుండి జిల్లా పరిషత్తునకు జిల్లా ప్రాదేశిక మియోజక వర్గ సభ్యుని ఎన్నిక జరిగినది. వెల్దుర్తి Z.P.T.C.(జడ్.పి.టి.సి.)గా శ్రీమతి శకుంతలమ్మ ఎన్నికైనారు. వీరుతమ పదవీ కాలమున మండలాభివృద్ధికై యధోచిత సేవలనందించినారు.

వెల్దుర్తి మండలమున 22 గ్రామములు 19 మందిరాలు గలవు. ఈ మండలము నందు 20 గ్రామపంచాయతీలు కలవు.

ఈమండల జనాభా 1991 గణన ప్రకారము 36220 అందు స్త్రీలు 18109 పురుషులు 18111 కలరు. వీరిలో S.C. లు 6307 S.T. లు 1599. మండలమందలి స్త్రీ, పురుషులలో అక్షరాస్యులైన వారిసంఖ్య 7769 మాత్రము. మండలమునందు నివాస గృహములు 7874 కలవు.

వెల్దురి మండలము భూవిస్తీర్ణము 51,969 ఎకరములుకాగా అటవీవిస్తీర్ణము 10,127 ఎకరములు. వ్యవసాయుయోగ్యము కాని భూమి. 11782 ఎకరములు. ఈ మండలమున లావునిభూమి 21474 ఎకరములు ఈ భూమిలో 8463 ఎకరములు అసైనుచేసి భూమిలేని నిరుపేదలకు పంచబడినది. సుమారు 30 వేల ఎకరములు ఈ మండలము నందు వ్యవసాయుయోగ్యమైన భూమి కలదు. ఈ మండలమున సాలుసరివర్షపాతము 942 మి.మీ. మండలము నందు 100 ఎకరములకు పైగానీరందించు పెద్ద చెరువులు 20 - కుంటలు 156 కలవు. బావులు, బోర్లు కలిపి 1398 వ్యవసాయమునకు పయుక్తమగుచున్నవి. ఇవికాక ఈ మండలమున పసుపేరు ప్రవహించుచున్నది. వీటికి పంపుమోటార్లు బిగించుకొని అనధికారముగా కొందరు వ్యవసాయదారులు పంటలు పండించుచున్నారు. ఈ మండలమున 10456 పట్టాదారు పాసుపుస్తకాలు పంపిణిచేయబడినవి. ఈ మండలమున వరి పంట, చేరుకుపంట అధికముగా పండింతురు. పల్లి, ఉల్లి, పప్పుధాన్యములు, మొదలగు చిరుధాన్యములు మెట్ట భూములలో పండింపబడును.

వెల్దుర్తి మండలముననే హకీంపేట గ్రామమువద్ద హల్దీవాగు ప్రాజెక్టు, నిర్మాణము చేపట్టబడినది. ఈ ప్రాజెక్టు ప్రారంభమై 15 సంవత్సరములుదాటినను నేటకిని పూర్తికాలేదు. ప్రాజెక్టు నుండి పంట కాలువలునేటికిని పూర్తిగా త్రవ్వబడలేదు.

మెదకు జిల్లాలో పరీవాహకనదులే లేవు. ఉన్నకొద్దివాగుల నీటిని వృధా చేయుచున్నారు. కాని సద్వినియోగముచేయుటలేదు. పథకములు వేయుటే ఆలస్యము పని ప్రారంభించుటకు ఆలస్యం. ఇవన్నిటి తరువాత నిధుల మంజూరి సరిగా జరగదు నిధుల కొరత. ఇన్ని సమస్యలు వీటితో హల్దీవాగు ప్రాజెక్టు ద్వారాపంటలు పండించవచ్చునన్న ఆశయడియాస యగుచున్నది. ఈమధ్య కాలమున హల్దీవాగు ప్రాజెక్టునుండి తూప్రాన్ -గజ్వేల్ గ్రామాలను త్రాగునీటి సరఫరాచేయుటకు సాయిబాబా ట్రస్టువారు పూనుకొనినారు.

ఇందుకు ప్రభుత్వము సుముఖమే కాని ఉతర్వులు వెలవడలేదు. అప్పుడే నిరసనలు మొదలైనవి.

వెల్దుర్తి మండలమునందు 6 సింగిల్‌విండోలు ప్రాధమిక వ్యవసాయసహకారసంఘములు గలవు. దామరంచ, బండపోసాన్ పల్లి, ఉప్పులింగాపూర్, కుకున్నూరు, మంగల్‌పర్తి, వెల్దుర్తి గ్రామాలలో ఈ ప్రాధమిక వ్యవసాహకార సంఘములకలవు, ఈ సంఘముల ద్వారా రైతులకు స్వల్పికాలిక, దీర్ఘకాలికఋణములు మంజూరి చేయబడు చున్నవి.వెల్దుర్తి లో సెంట్రల్ బ్యాంక్‌ఆఫ్ ఇండియా, మాసాయిపేట లో కెనరా బ్యాంక్‌శాఖలు పనిచేయుచు వ్యవసాయ, వ్యవసాయేతర రుణములను రైతుల కు అందజేయుచున్నవి.

'. వెల్దుర్తి మండలమునందు కుకున్నూరు, మంగల్పర్తి, వెల్దుర్తి, మాసాయిపేట, గ్రామాలలో ఉన్నత పాఠశాలలు జిల్లా పరిషత్ యాజమాన్యమున నడపబడుచున్నవి. ఈ పాఠశాలలకు స్వంత భవనములు కలవు. ఈ మండలమునందు 1.బండపోసానిపల్లి,. 2. శెట్‌పల్లి కాలాన్, 3. ఉప్పులింగాపూర్ గ్రామములలో ప్రాధమికోన్నత పాఠశాలలు స్వంతభవనాలను కలిగియున్నవి. ఈ మండలమున 31 ప్రాధమిక పాఠశాలలు కలవు. ఇవన్నియు మండలమునందలి బాలబాలికల విద్యావ్యాప్తి కి తోడ్పడుచున్నవి పాఠశాలలకు రాని బాలబాలికలకు · యువకులకు అక్షరాస్యత కల్పించుటకై నిరంతర విద్యాకేంద్రములు పని చేయుచున్నవి. వెల్దుర్తి మండలమున రామాయపల్లి, వెల్దుర్తి గ్రామములలో రెండు ఖండసారి చెక్కర పరిశ్రమలు పని చేయుచున్నవి. ఇవి ఇచ్చట పండించే చెఱుకును రైతుల నుండి చెఱుకును కొనుగోలు చేసి చెక్కర ఉత్పత్తి చేయుచున్నది. **ఏడు బియ్యపు** మరలు (రైసు మిల్లులు) **ఈ మండలమునందు గలవు.**

ఈ మండలమున వెల్దుర్తిలో ఒక సినిమా థియేటర్ కలదు. దీని ద్వారా మండలమందలి ప్రజలు వినోద ప్రదర్శనములను తిలకింతురు. ఇచ్చట ఒక గ్రంధాలయమున్నది.

మండల కేంద్రమైన వెల్దుర్తిలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రము చక్కని వసతులతో సొంత భవనమున గలదు. ఈ ఆరోగ్య కేంద్రమున ఇద్దరు డాక్టర్లు తగినంత వైద్య సిబ్బందితో ప్రజలకు సేవలందించు చున్నారు. డాక్టర్లకు, నర్సులకు మరియు ఇతర సిబ్బందికి ప్రభుత్వ వసతి గృహములు నిర్మింపబడి యున్నవి. వెల్దుర్తి మండలమున పశు వైద్యశాల యొకటి గలిగి దాని అనుబంధముల మూడు ఉప కేంద్రములు పని చేయు చున్నవి.

వెల్దుర్తి గ్రామమున కాకతీయ రుద్రమదేవుడు వేయించిన శిలాశాసనము కలదు. రంగనాధ స్వామి దేవాలయము ప్రాచీన కాలమున నిర్మింపబడినట్టిది. ఈ దేవాలయమున కెదురుగా సుమారు 100 గజాల దూరమున ద్వార బంధము కలదు.. ద్వారబంధము శిలలచే నిర్మించబడినది.

ఇది 27 అడుగులు ఎత్తు గలిగి పై భాగము ఉత్తరాశి (పైకడప) చక్కని కళాఖండముగానున్నది. దానిపై సముద్ర మథన చిత్రము కలదు. పై ఉత్తరాశికి ఆరు రంధ్రములన్నవి. ఈ ఒక్కొక్క రంధ్రము ద్వారా ఆయారుతువులలో సూర్యకిరణములు ప్రవేశించి రంగనాథుని కాళ్ళపై ప్రసరించును. ఇచ్చట 300 సంవత్సరముల క్రిందట నిర్మించిన విఠలేశ్వరాలయము, సుమారు 100 సంవత్సరముల క్రింద నిర్మించిన శివాలయములు కలవు.

ఈ ప్రాంతమున శిథిలమైన జైన పార్శ్వంకర విగ్రహములున్నవి. నాగపణి గలిగి యుండుటచే జైన పార్శ్వంకరుల చేపడుచున్నది. ఈ దేవాలయాల వద్ద రెండు ఎత్తయిన ధ్వజ స్తంభములు గలవు / ఇచ్చట ఒర విష్ణు మూర్తి విగ్రహం ఆభరణ, భూషణములతో చెక్క బడినది. ఒకే రీతిలో మధ్యన ఎత్తైన విష్ణు విగ్రహము దాని చుట్టు దశావతారములు చెక్క బడినవి రాళ్లపై చెక్కిన 8 నాగ విగ్రహములు ఇక్కడ కనుపించుచున్నవి. చక్కగా మలచిన భైరవ విగ్రహము శిథిలమై మట్టిలో కూరుకొని పోయియున్నది. అందమైన అలంకరణలతో మలచిన నంది విగ్రహము నిరాధారముగా కొంత భగ్నమై కనిపించుచున్నది. వీటన్నిటిని బట్టిచూడ ఈ ప్రాంతమున మొదట జైనాలయము తర్వాత శివాలయము ఆతర్వాత రంగనాథాలయముగా రూపాంతరమొందినట్లు ఊహింపబడుచున్నది మొత్తము మీద ఈ దేవాలయ ప్రాంతమున పూర్వము ఒక గొప్పనైన దేవాలయము ఉండి యుండవచ్చును. ప్రక్కన ఒక కోనేరు కూడా యున్నట్లు అనుమానింపబడుచున్నది.

వెల్దుర్తి గ్రామము నిజాం మోచనోద్యమమున గంభీరమైన పాత్రను పోషించినది. ఇచ్చట రజాకార్ల ఆఫీసు యుండెను. కాశింరజ్వి 3000 మంది రజాకార్లతో ఈ గ్రామమున ప్రవేశించగా ఇచ్చటి కాంగ్రేసు నాయకులు విఠల్ నర్సయ్య, మొదలగు వారి నాయకత్వమున 4000 మంది పరిసర గ్రామ ప్రజలతో రజాకర్లానెదిరించి పారద్రోలిరి. 14-8-1947 నాటి రాత్రి భారత స్వాతంత్ర్య త్రివర్ణ పతాకమును ఎగురవేసిరి.

వెల్దుర్తి మండలమున ప్రభుత్వముచే తెల్లకార్డులు 6042 గులాభీ రంగు కార్డులు 1750 కలిగియున్నవి. పౌరసరఫరాలు ప్రతినెల బియ్యము 1038.20 క్వింటాళ్లు చక్కెర 100-55 క్వింటాళ్లు కిరోసిను 12,000-00 లీటర్లు సరఫరా చేయబడుచున్నవి.

# మండలంలోని సర్పంచులు వివరాలు

| క్ర.సం. | సర్పంచులు, | గ్రామము |
|---|---|---|
| 1. | ఏ. అంజనేయులు | వెల్దుర్తి |
| 2. | శ్రీమతి కే. పద్మ | ఏదులపల్లి |
| 3. | టీ. మల్లేశ్ | కుకున్నూర్ |
| 4. | పి. కిష్టమ్మ | బండపోసాన్‌పల్లి |
| 5. | పి. నర్సింలు | శెట్టిపల్లి |
| 6. | టి. రాఘవులు | జలాల్‌పూర్ |
| 7. | శ్రీమతి రుక్కమ్మ | దామరంచ |
| 8. | చంద్రయ్య | ధర్మారం |
| 9. | రామచంద్రం | నాగ్‌సాన్‌పల్లి |
| 10. | జంగం సోమప్ప | మానేపల్లి |
| 11. | ఎం. పరశురాములు | అందుగుల పల్లి |
| 12. | కే. అడివయ్య | మంగళపర్తి |
| 13. | టి. పోచమ్మ | యశ్వంతరావుపేట |
| 14. | ఎల్. కిష్టయ్య | ఉప్పులింగాపూర్ |
| 15. | రాంచెంద్రం | హకీంపేట |
| 16. | లంబాడి రాంలా | రామాంతపూర్ |
| 17. | వి. యాదయ్య | కొప్పులపల్లి |
| 18. | శ్రీమతి జి. లక్ష్మి | నెల్లూరు |
| 19. | కే. కిష్టమ్మ | హస్తాల్‌పూర్ |
| 20. | బ్యాగరి బూదయ్య | మాసాయిపేట |

## ఎం.పి.టి.సి.లు వెల్దుర్తి

| క్ర.సం. | పేరు | గ్రామము |
|---|---|---|
| 1. | శంకర్‌గౌడ్ | వెల్దుర్తి |
| 2. | అంజిరెడ్డి | ధర్మారం |
| 3. | శ్రీమతి కే. స్వరూప | వెల్దుర్తి |
| 4. | పర్వ గోనిరమేష్ గౌడ్ | కుకున్నూరు |
| 5. | శ్రీనివాస రెడ్డి | బండపోసానపల్లి |
| 6. | గొల్ల బాగయ్య | మానేపల్లి |
| 7. | శ్రీమతి ఎం. జమున | మంగళ్పర్తి |
| 8. | లంబాడి వసురాం | ఉప్పులింగాపూర్ |
| 9. | అశోక్ | మాసాయిపేట |
| 10. | శ్రీమతి పోతుల బొగుడ లక్ష్మి | హస్తాల్‌పూర్ |
| 11. | భాజమెహిమొద్దీన్ | కో- ఆప్టెడ్ మెంబర్ |

# వర్గల్ మండలము

వర్గల్ మండలముగా ఏర్పడకముందు ఈ ప్రాంతము గజ్వేల్ తాలూకాలో నుండెడిది. ఈ మండలమునకు తూర్పున జగదేవపూర్, దక్షిణాన ములుగు, పశ్చిమాన తూప్రాన్, ఉత్తరాన గజ్వేల్ మండలాలు ఉన్నవి.

వర్గల్‌ను పూర్వము వొరుగంటి, వరగంటి పేర్లతో పిలిచేవారి. ఇచ్చట శంభుదేవుని గుట్ట ప్రసిద్ధమైన క్షేత్రము. ఈ గ్రామమున వేణుగోపాల స్వామి దేవాలయము సుందరముగానున్నది. ఈ మండలమున నాచగిరి నరసింహ స్వామి దేవాలయము సుప్రసిద్ధమైన క్షేత్రము. వర్గల్ స్థానికంగా ఈ మధ్యకాలమున శ్రీ విద్యా సరస్వతి, శనైశ్చర దేవాలయములు, శంభుదేవుని గుట్టపై కడు సుందరముగా నిర్మింపబడినవి.

వర్గల్ మండలం యొక్క భౌగోళిక విస్తీర్ణం 15,057 చ.కి.మీ కల్గియున్నది. ఈ మండలమున 24 రెవెన్యూ గ్రామాలు, 10 మధిరలు గలవు. ఈ మండలము నందు 17 గ్రామ పంచాయతీలు కలవు.

1994లో జరిగిన ఎన్నికలలో శ్రీమతి జి.రాజమణిగారు ఎన్నికై ప్రజాసేవనొనరించిరి. ఈ మండలము నుండి జడ్.పి.టి.సి. గా శ్రీ యాదాగౌడ్ ఎన్నికై జిల్లా పరిషత్తునకు ప్రాతినిధ్యము వహించిరి.

వర్గల్ మండలము 6,448 నివాసిత గృహాలుండగా, ఇచ్చట జనాభా 1991 ప్రకారం 36,771. అందులో పురుషులు 18,732, స్త్రీలు 17,979. ఈ జనాభాలో ఎస్.సి.లు 6,018, ఎస్.టి. 840 మాత్రం ఉన్నారు.

ఈ మండలమున 14 చెరువులు 127 కుంటలు కలవు. ఈ మండలమున వరి, మక్క, ప్రత్తి, కూరగాయలు పండించుచున్నారు.

వర్గల్ మండలం నందు 29 ప్రాథమిక పాఠశాలలు, 5 ప్రాథమికోన్నత పాఠశాలలు, 1 మండల పరిషత్ ఉన్నత పాఠశాల, మండల పరిషత్ యాజమాన్యంన నడుపబడుచున్నవి. ఈ మండలం నందు 7 ఉన్నత పాఠశాలలు జిల్లాపరిషత్ యాజమాన్యమున నడుపబడుచున్నవి. ఈ మండలమున 93 మంది సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయులు, 2 ఉర్దూ మీడియం ఉపాధ్యాయుల, 6 స్పెషల్ హెడ్ మాస్టర్ లు, ఎస్.ఎ-II లు, ముగ్గురు భాషా పండితులు, 4 గురు పనిచేయుచున్నారు. ఈ మండలమున ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల యందు 6040 మంది విద్యార్థులు ఉన్నత పాఠశాలలో 1870 మంది విద్యార్థులు విద్యనభ్యసించు చున్నారు.

ఈ మండల కేంద్రమున ప్రాథమిక ఆరోగ్య కేంద్రము కలదు. ఈ మండలంనందు పశువైద్యశాల కలిగి కొన్ని అనుబంధ కేంద్రాలు గ్రామములలో పనిచేయుచున్నవి.

వర్గల్ మండలంలో కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో నవోదయ పాఠశాల నడుచుచున్నది.

## మండల ప్రజా పరిషత్ వర్గల్ – ఎం.పి.టి.సి మరియు సర్పంచ్‌ల జాబితా

| క్ర.సం. | ఎం.పి.టి.సి పేరు | గ్రామం పేరు |
|---|---|---|
| 1. | జి. రాజమణి | అధ్యక్షులు, మం.ప. వర్గల్ |
| 2. | కె. ముత్యం రెడ్డి | ఉపాధ్యక్షులు మం.ప. వర్గల్ |
| 3. | యం. యాదగిరి | యం.పి.టి.సి. వర్గల్ - I |
| 4. | జి. యాదగిరి | ,, వర్గల్ - II |
| 5. | యం. ప్రభాకర్ | ,, వేలూర్ |
| 6. | జె. చంద్రగౌడ్ | ,, నాచారం |
| 7. | ఫిర్సాత్ ఉన్నిసాబేగం | ,, మజీద్‌పల్లి |
| 8. | టి. గణేశ్ | ,, పాములపర్తి |
| 9. | ఆర్. నర్సాగౌడ్ | ,, అంబర్‌పేట |
| 10. | యం. రాజవ్వ | ,, తునికి |
| 11. | వాజిద్‌పాషా | యం.కో. సభ్యులు, వర్గల్. |

| | సర్పంచ్ పేరు | గ్రామం పేరు |
|---|---|---|
| 1. | యం. నర్సయ్య | అంబర్‌పేట |
| 2. | ఎర్ర మల్లయ్య | అనంతగిరి పల్లి |
| 3. | యల్. కిష్టయ్య | చౌదర్‌పల్లి |
| 4. | పి. సాయులు | గిర్మాపూర్ |
| 5. | కె. బాల్‌రెడ్డి | గౌరారం |
| 6. | జి. అనంతలక్ష్మి | మజిద్‌పల్లి |
| 7. | వి. వీరయ్య | మైలారం |
| 8. | జె. లలిత | మీనాజిపేట |
| 9. | యం. లక్ష్మారెడ్డి | నెంటూర్ |
| 10. | జి. రాములు | నాచారం |
| 11. | జె. కృష్ణమూర్తి | నర్సంపల్లి |
| 12. | కె. రామాగౌడ్ | పాములపర్తి |
| 13. | బి. అనసూయ | పాతూర్ |
| 14. | జి. పోచమ్మ | తున్కి |
| 15. | పి. సత్యనారాయణ | వేలూర్ |
| 16. | టి. మణెమ్మ (పర్సన్ ఇంచార్జి) | వర్గల్ |
| 17. | కె. సత్తయ్య ( ,, ) | గుంటిపల్లి |

# జహీరాబాద్ మండలము

జహీరాబాద్ తాలుకా కేంద్రము.

మండల వికేంద్రీకరణలో భాగముగా జహీరాబాద్ మండలముగా ఏర్పడినది. ఈ మండల విస్తీరణము 36455 హెక్టార్లు. ఈ మండలమునందు జనాభా 1991 లెక్కల ప్రకారము 1,15,332 అందులో పట్టణ ప్రాంతంలో 39613 జనాభా, గ్రామీణ ప్రాంత జనాభా 75719. ఈ మండలమునందు పురుషులు 58953, స్త్రీలు 56379 అందులో ఎస్.సి.లు 16975, ఎస్.టి.లు 7963 జనాభా కలదు.

జహీరాబాద్ మండలములో మొత్తం గ్రామాలు 38, గ్రామపంచాయితీలు 37, 1 మున్సిపాల్టీ.

జహీరాబాద్ మండలము ఏర్పడిన మొట్టమొదటి ప్రత్యక్ష ఎన్నికల్లో ఈ మండల ప్రజా పరిషత్తు ఆధ్యక్షులుగా శ్రీ సి. బాగన్నగారు ఎన్నికై 5 సంవత్సరములు మండల అభివృద్ధి పాటుపడినారు. ఈ మండలము నుండి జిల్లా పరిషత్‌కు ప్రాతినిద్యం వహించుటకు జడ్.పి.టి.సి.గా శ్రీ మహమూద్ మియా గారు ఎన్నికై జిల్లా పరిషద్ లో వారి మండల అభివృద్ధికి కృషి సల్పిరి.

జహీరాబాద్ మండలమునందు మండల పరిషత్తు యాజమాన్యంలో 56 ప్రాథమికపాఠశాలలు, 6 ప్రాథమికోన్నత పాఠశాలలు నడపబడుచున్నవి. జిల్లా పరిషత్ ఆధ్వర్యంలో 9 సెకండరీ గ్రేడు ఉచిత పాఠశాలలు, ప్రభుత్వ నిర్వాహణలో, 1 జూనియర్ కళాశాల, 1 డిగ్రి కళాశాల, 1 పాలిటెక్నిక్ కళాశాల నడుపబడుచున్నవి.

జహీరాబాద్ మండలమున సాంఘిక సంక్షేమ శాఖ వారి ఆధీనంలో 2 ఎస్.సి., 3 బి.సి., 2 ఎస్.టి. హాస్టళ్లు నడుపబడుచున్నవి.

ఈ మండలమున స్త్రీ మరియు శిశు సంక్షేమ శాఖ ఆధీనంలో క్రాఫ్ట్ ట్రైనింగ్ సెంటర్ 30 మందితో నడుపబడుచున్నది.

జహీరాబాద్ మండలము ప్రజల ఆరోగ్య సంరక్షణకై 2 పి.హెచ్.సి. కలవు. పశువైద్యమునకై 1 వెటరినరీ హస్పెటల్, 2 ఎల్.ఎస్. యూనిట్లు, 9 గ్రామీణ ఎల్.ఎస్. యూనిట్లు కలవు.

జహీరాబాద్ మండలములో వివిధ రకములైన 9 బ్యాంక్‌లు కలవు.

ఈ మండలమున 1 పోలీస్‌స్టేషన్, 1 విద్యుత్ సబ్‌స్టేషన్, 1 టెలిఫోన్ ఎక్స్ఛేంజ్, 1 గ్రంథాలయము కలవు.

ఈ మండలములో నిత్యావసర సరకులు (65 (రేషన్) దుకాణములు కలవు. ఇందులో బియ్యం, కిరోసిన్, పంచదార, గోధుమలు ప్రజలకు చౌక ధరలకే ప్రభుత్వం సరఫరా చేయుచున్నది.

జహీరాబాద్ మండలము వ్యవసాయ ప్రాంతము ఎర్రనేలలు ఎక్కువ. ఇక్కడ మెట్టపంటలు జొన్న, పప్పు దినుసులు, మిర్చి పండించుదురు. ఈ మండలములో చెరకు కూడా పండించుచున్నారు.

## సర్పంచ్‌లు జాబితా

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 1. | అల్‌గోలా | గుండమ్మ |
| 2. | అల్లీపూర్ | శ్రీశైలం |
| 3. | ఆనెగుంట | నారాయణ |
| 4. | బూచెన్‌పల్లి | అంజిరెడ్డి |
| 5. | బత్తిపాడ్ | జి. లాలప్ప |
| 6. | చిరరాపల్లి | ఎ. విద్యానాథ్ |
| 7. | ధనసిరి | కమలాబాయి |
| 8. | దిగ్గాం | బాబుమయ్య |
| 9. | గుడుపల్లి | పి. చంద్రారెడ్డి |
| 10. | గౌసాబాద్ | సిద్దప్ప |
| 11. | గోపాన్‌పల్లి | సి. రామచందర్ |
| 12. | ఆసాద్‌గంజ్ | చోటి బీ |
| 13. | గొడగార్‌పల్లి | పుండరీక్ రావు |
| 14. | గోవిందాపూర్ | బక్కమ్మ |
| 15. | హోతి (బి) | వెంకట్‌రెడ్డి |
| 16. | హైదరాబాద్ | శుశీలమ్మ |
| 17. | హోతి (కె) | కె. లింగమ్మ |
| 18. | హుగ్గేలి | ఎం.జి.రాములు |
| 19. | ఇప్పేపల్లి | విఠల్ |
| 20. | గడిమల్కాపూర్ | రంగమ్మ |
| 21. | కొత్తూర్ (బి) | తారాబాయి |

| | గ్రామం పేరు | సర్పంచ్ పేరు |
|---|---|---|
| 22. | కాసిమ్ పూర్ | నాగేశం |
| 23: | మొగుడంపల్లి | పి. రాములు |
| 24. | వినాయక్ తండ | పామ్‌నాయక్ |
| 25. | మత్తి | మల్లికార్జున్ |
| 26. | మల్‌చెల్మా | వేమారెడ్డి |
| 27. | మన్నాపూర్ | నారాయణ |
| 28. | రాయపల్లి (పి. ఎమ్) | సోనీబాయి |
| 29. | పస్తాపూర్ | వి. నర్సయ్య |
| 30. | శేఖాపూర్ | పాషాబేగం |
| 31. | సత్వార్ | శంకరమ్మ |

**ఎం.పి.టి.సి.ల జాబితా**

| | గ్రామం పేరు | ఎం.పి.టి.సి.ల పేరు |
|---|---|---|
| 1. | మలిచెల్మా | గౌసుద్దీన్ (ఉపాధ్యక్షులు) |
| 2. | పస్తాపూర్ | రాములమ్మ |
| 3. | రంజోల్ | వెంకటాచలం |
| 4. | హుగ్గెల్లి | కోనేటి గంగమ్మ |
| 5. | హోతి (కె) | ఆర్. కిష్టన్న |
| 6. | శేఖాపూర్ | నారాయణ్ గౌడ్ |
| 7. | గడిమల్కాపూర్ | సౌలీబాయి |
| 8. | మన్నాపూర్ | ఎం. రాధమ్మ |
| 9. | హోతి (బి) | ఆశయ్య |
| 10. | మొగుడంపల్లి I | ఆర్. కిషన్ రావు |
| 12. | మొగుడంపలి II | హనుమంత్ రెడ్డి |
| 13. | కొత్తూర్ (బి) | నర్సింహారెడ్డి |
| 14. | చిరాగ్‌పల్లి | నారాయణ |
| 15. | గోపన్‌పల్లి | కమలమ్మ |
| 16. | అస్గోల్ | తెనుగు తుక్కమ్మ |
| 17. | ఖుర్తిపాడ్ | నర్సింలు |
| 18. | సప్వార్ | మాణిక్యప్ప |
| 19. | కాసింపూర్ | సుందరమ్మ |
| 20. | గూడ్‌పల్లి | సిద్దయ్య |
| 21. | ధనసిరి | శారదా బాయి |
| 22. | కో ఆప్టెడ్ సభ్యుడు | ఎం.డి. యూసుఫ్ |

# మెదక్ జిల్లాలోని ప్రముఖ గ్రామాలు

ఏ దేశానికైనా జీవనాడి - ఆ దేశపు పల్లెసీమలే అనాదిగా భారతీయ సంస్కృతీ, సంప్రదాయాలకు పట్టుగొమ్మలు మన పల్లెపట్టులు.

గ్రామాలంటే - కళకళలాడే పైరు పచ్చలు, పొంగిపొర్లే పాడి పంటలూ, సామరస్యంతో సహజీవనం సాగించే పెద్ద పెద్ద కుటుంబాలు. ఇదీ పైకి కన్పించే ముఖ చిత్రం. కానీ తెరచిచూస్తే ఒక్కో గ్రామానికి ఒక్కో చరిత్ర, ఒక్కో ప్రత్యేకత హృదయాన్ని ఆర్ద్రం గావించే సంఘటనలూ, పౌరుషం పొంగి పొర్లిన వీరగాధలు గ్రామీణుల మనస్సు నేటికీ తాజా జ్ఞాపకాలు! మెదక్ జిల్లాలోని గ్రామీణ జీవనం ఇందుకు సజీవ తార్కాణం.

దుర్భేద్యమైన కోటగోడల శిథిలాల వెనుక దాగిన చారిత్రిక నేపథ్యం ఒక వంక, స్వాతంత్ర్య సమర గాథలు మరో వంక, పాలితుల దుశ్చర్యలకు - బలైపోయిన పీడితుల ఆక్రందనలు, ఎదురొడ్డి నిలిచిన వీరుల నిస్వార్థత్యాగాలు - మన ఆత్మను తట్టి లేపుతాయి. ఇంకా - 'మంజీరా' నదీమతల్లి చల్లటి ఒడిలో ఊపిరులూదుకొన్న జానపద కళారూపాలు, సాహిత్య సంగీతాలు, అన్నిటికి మిన్నగా ఆరాధ్య దైవాలుగా వెలిసిన గుడి, గోపురాలు మనల్ని పలకరిస్తూ ఉంటాయి. ప్రకృతి సహజమైన స్వచ్ఛ సౌందర్యాలతో ఆహ్వానిస్తూ ఉంటాయి.

అనాది నుండి ఆధునిక కాలం దాకా వివిధ రకాలుగా ప్రత్యేకరీతులతో విలసిల్లిన కొన్ని ప్రముఖ గ్రామాల్ని వాటి చారిత్రిక వైభవాన్ని స్థూలంగా పరిశీలన జరుపబడు చున్నది. ఇక్కడ ఉట్టంకించిన గ్రామాలే కాక అనేక గ్రామాలున్నాయి. ఏ గ్రామానికా గ్రామం ప్రత్యేక చరిత్ర కలిగియున్నది. స్థాలీపుక న్యాయంగా కొన్ని గ్రామాలను మాత్రం స్పృశించడం జరిగింది.

## నర్సాపూర్

ఒకప్పుడు కుగ్రామంగా, అతివృష్టి కారణంగా నలుమూలలో దిబ్బలతో కారడవిలోనుండి 'గండి నర్సాపూర్' గా పిలువబడిన ఈ గ్రామం ప్రస్తుతం 'నర్సాపూర్' గా జిల్లాలోని ఒక ప్రముఖ పట్టణంగా రూపుదిద్దుకున్నది.

పూర్వపు సమితి కేంద్రంగా, పాత తాలూకా కేంద్రంగా, ప్రస్తుతం నియోజకవర్గ కేంద్రంగా నర్సాపూర్ రాజకీయాలకు కేంద్రబిందువైంది. నర్సాపూర్ పరిసరాలలో పరిశ్రమలు నెలకొల్పబడినవి.

ప్రస్తుతం 12 వేల జనాభాతో ఉన్నత పాఠశాలలు జూనియర్ కళాశాలలు బి.వి. రాజు ఇంజనీరింగ్ కాలేజ్, ఆస్పత్రి, విద్యుత్ సబ్‌స్టేషన్, పలు ప్రభుత్వ కార్యాలయాలు, బ్యాంకులు, సినిమాహాళ్ళు, పెట్రోల్ బంకులు అనేక ప్రైవేటు

కంపెనీలు, గిరిజన గురుకుల పాఠశాల ఆధునిక వినోద సౌకర్యాలు, రవాణా, కమ్యూనికేషన్ సదుపాయాలు ఏర్పడి - సదాశివపేట పట్టణంగా శరవేగంగా అభివృద్ధి సాధిస్తున్నది.

## అల్లాదుర్గం

జైన మత ప్రాబల్యం కలిగిన ప్రాచీననగరం "అల్లాదుర్గం".

ఈ గ్రామం $17^0$-$57'$ ఉత్తర అక్షాంశము, $77^0$-$48'$ తూర్పు రేఖాంశాల మధ్య ఉన్నది.

వీరశైవ మతస్థాపకుడైన 'బసవేశ్వరుని' కి సమకాలికుడైన 'అల్లమ ప్రభువు' అనే మహేశ్వరుని పేరుమీద 'అల్లాదుర్గం' ఏర్పడినట్లు తెలుస్తున్నది.

అల్లాదుర్గంలో - కళ్యాణి చాళుక్యరాజైన 'త్రిభువన మల్లదేవర' వేయించిన శాసనమొకటి 'కన్నడ భాష' లో ఉంది. ఇతడికి 6వ విక్రమాదిత్యుడనే మరో పేరు ఉన్నది. ఇతనికి సామంతుడుగా ఉన్న 'పరివునందిరాజు' ఒక జైన ఆలయాన్ని నడపడానికి కొంత భూమిని దానం చేసినట్లు ఈ శాసనంలో ఉన్నది. ఈ శాసనకాలం క్రీ.శ. 10-11 శతాబ్దాల కాలం నాటిది. దీన్నిబట్టి అల్లాదుర్గం జైనమతా ప్రాబల్యం కల్గినదని తెలుస్తున్నది.

ఇక్కడగల వీరభద్రాలయం, దాని ముందున్న పెద్ద నంది మిక్కిలి ప్రసిద్ధం. ఇక్కడున్న శిల్పకళా సంపద పురాతత్త్వ ప్రాధాన్యం కలిగినది. ఇక్కడ 'బేతాళునికి' గుడి ఉండడం - ఏప్రిల్‌నెలలో జాతర జరగడం విశేషం.

నిజాం రాజుల పరిపాలన చిహ్నంగా అల్లాదుర్గంలో బురుజులు, కోట దుర్భేధ్యంగా కన్పిస్తాయి. అల్లాదుర్గంలో ఎక్కడతవ్వినా ఏదో ఒక శిలాఖండం బయల్పడుతుంది.

'అల్లాదుర్గం' - ప్రస్తుతం మండలంగా, ఉన్నత పాఠశాల పోలీస్‌స్టేషన్ హాస్టళ్ళు, రక్షితనీరు రవాణా సౌకర్యాలు కలిగి ఒక పెద్ద గ్రామంగా విలసిల్లుతున్నది.

## కొండాపూర్

శాతవాహనుల సంస్కృతినీ, పరిపాలనా వైభవాన్ని చాటిచెప్తూ - పురావస్తు త్రవ్వకాలలో లభించిన, ఆ కాలంనాటి వస్తువులతో ఏర్పాటు చేసిన 'కొండాపూర్ - పురావస్తు ప్రదర్శనశాల' ప్రపంచ ఖ్యాతి నార్జించింది.

కొండాపూర్‌లోని ఓ పెద్ద గుట్టమీద నిర్మించిన ఈ మ్యూజియంలో - శాతవాహనుల కాలంనాటి మట్టిపూసలు, మట్టిగోళాలు, నాణాలు చూడవచ్చును. మ్యూజియం పరిధిలో అన్నిరకాల త్రవ్వకాలను ప్రభుత్వం నిషేధించింది.

పురాణాలలో కుండిన నగరం కుండినపురంగా ప్రసిద్ధి చెందినది. రుక్మిణీ దేవి జన్మస్థలంగా, దమయంతి పుట్టిన ఊరుగా ఈ నగరం ప్రసిద్ధి చెందినది.

శాతవాహనుల పరిపాలనా కాలంలో ఆనాడున్న 30 మహానగరాలలో కొండాపురం ఒక్కటిగా ప్రసిద్ధికెక్కింది. ఇచ్చట శాతవాహన రాజుల టంకశాల యుండేది.

ఈ మహానగరం బౌద్ధుల విహార కేంద్రంగా విలసిల్లిందని చెప్పడానికి ఇక్కడి త్రవ్వకాలతో వెల్లిన స్థూపాలే సాక్షాలు. త్రవ్వకాలలో రోమ్ చక్రవర్తుల నాణాలు బయట పడిన్నవి. అంటే ఇచ్చుటి ఆనాటి విదేశ వ్యాపారాన్ని ఊహించవచ్చు.

ఈనాడు అలనాటి కుండిననగరం కొండాపురం ఒక మామూలు గ్రామముగా ఉంది. మండలాల ఏర్పాటుతో ఇక్కడ మండల కార్యాలయముతో పాటు వివిధ ప్రభుత్వ కార్యాలయాలు పాఠశాలలు వెలసినవి.

## అల్లీపూర్

స్వతంత్ర భారతం, స్వేచ్ఛావాయువులను శ్వాసిస్తున్న వేళ - తెలంగాణా ప్రాంతం మాత్రం, నిజాం నిరంకుశ రజాకార్ల దురాగతాలకు బలైపోతూ, అమాయక ప్రజల రక్తతర్పణాలు అర్పిస్తూ ఉన్నది. ఆ ఉద్రిక్త సమయంలో, రోజురోజుకూ పెచ్చుమిరిపోతున్న నిజాం అనుచరుల అగడాలను ఎదురొడ్డి నిలిచి ప్రాణాలు అర్పించిన యోధులెందరో - గ్రామాలెన్నో ! ఆ గ్రామాలలో పేరుపొందినదే అల్లీపూర్.

1947 సెప్టెంబర్ 4న రాధాకిషన్‌రావు అనే సమరయోధుని నాయకత్వంలో జిల్లాలోనే తొలిసారిగా అల్లీపూర్‌లో మువ్వన్నెల జండా ఆవిష్కరింపబడింది. వ్యూహం ప్రకారం నిజాం పరిపాలనకు ఎదురొడ్డి నిలిచి చరిత్రలో నిల్చిపోయారీ గ్రామస్థులు.

ప్రస్తుతం చిన్న కోడూరు మండలంలో భాగంగా - విద్యుత్ రవాణా ఆయుర్వేద అస్పత్రి, కుష్టురోగుల పునరావాస కేంద్రం పాఠశాల పశువైద్యశాల మొదలైన వసతులన్నీ కలిగి ప్రగతి పథంలో పురోగమిస్తున్నది.

## కొండపాక

కొండగుట్టల మధ్య పాకలతో ఏర్పడిన గ్రామం కావడం వల్ల దీనికి 'కొండపాక' అనే పేరు వచ్చిందని చెప్పుకొవచ్చు.

శతాబ్దాల నాటి రాక్షసగుళ్లు గ్రామంచుట్టూ ప్రకృతి సహజంగా ఉన్న అటవీ ప్రాంతం, కొండలు, జలాశయాలు ఈ గ్రామ ప్రత్యేకతలు.

గ్రామంలో ఉన్న ఏడు గ్రామనాభీశిలల ఆధారంగా - కొత్తపేట, పాటిగడ్డ, పెద్దమ్మగడ్డ, కొత్తనూతుల, పల్లిడుగుగడ్డ, దమ్మకపల్లి వంటి ఏడు గ్రామాలు కలిసి కొండపాక గ్రామంగా ఏర్పడినట్లు తెలుస్తుంది. గ్రామంచుట్టూ - దక్షిణగంగ, పోతరెడ్డి చెరువు, అంకారెడ్డి చెరువు అన్నారెడ్డి చెరువు, మల్లంచెరువు, నల్ల చెరువు, మల్లంకోటలనే "ఏడుచెరువులున్నాయి".

సప్తాంజనేయ సప్తశీతల, సప్తజలాశయ, సప్తనాభీ శిలాదులచే ... అని గ్రామవాడుకలో ఉన్న ఇవన్నీ కొండపాక గ్రామ ఏడల సంఖ్యతో ఒక విశిష్టతను కలిగి ఉన్నదని తెలుస్తున్నది.

గ్రామంలోని రామాలయాలు, గోపాలస్వామి ఆలయంవము, సప్తాంజనేయ శంభుదేవ, త్రికూటేశ్వరాలయాలు నాటి ఆధ్యాత్మిక చింతనకు చారిత్రక సాక్ష్యంగా నిలుస్తుంది.

హిందుస్తానీ బాణిలో ఆరునెలలపాటు చెప్పిన కథ చెప్పకుండా ఏకధాటిగా హరికథలు చెప్పే విద్వాంసుడిగా ప్రసిద్ధి పొందిన 'బారీకర్ నరహరి భావే' ఇక్కడ స్థిరపడినవారే.

ఈ విధంగా ఆధ్యాత్మిక, కళారంగ నిలయమైన కొండపాకలో - స్వాతంత్ర్యానికి పూర్వమే ప్రాథమిక పాఠశాల (4 వ తరగతి వరకు బాలికలకు ప్రత్యేక పాఠశాల ఉండడం గమనించదగిన అంశం.

ప్రస్తుతం - మండల కేంద్రంగా, 6000 వరకు జనాభాతో ఉన్నత పాఠశాల, ఆయుర్వేద వైద్య కేంద్రం, రక్షిత మంచినీరు. రాజీవ్ రహదారికి మార్గం, సాంఘీక సంక్షేమ హాస్టళ్లతో విలసిల్లుతూ - విదాయ సామాజిక ఆర్థికాభ్యున్నతిలో ముందంజ వేస్తున్నది.

## జోగిపేట

క్రీ.శ.11 - 12వ శతాబ్దాల్లో ఇక్కడ జైనమతం విశేషవ్యాప్తిలో ఉండెను. దానికి సాక్ష్యంగా ఇక్కడ జైన వసతి, జైన తీర్థంకరుల విగ్రహాలు కన్పిస్తాయి.

క్రీ.శ. 1547లో మెదక్ సంస్థానాన్ని పరిపాలించిన అల్లమరెడ్డి చౌదరి సంతానం కొరకు 'రామజోగి' సలహా ప్రకారం వైక్రాంతగిరి మీద శివలింగ ప్రతిష్టచేసి, పుత్రకామేష్టి యాజ్ఞాన్ని చేయగా సంతానం కల్గిందట. అందుకు కృతజ్ఞతా సూచకంగా ఈ గ్రామానికి 'రామజోగిపేట' అని నామకరణం చేశారని, అది క్రమంగా జోగిపేటగా స్థిరపడిందని ఒక ఐతిహ్యం. కాగా దక్ష యజ్ఞం తర్వాత శివుడు జోగి కాలం వెళ్లబుచ్చినందున ఇది 'జోగిపేట' అయిందని కూడా వాడుక.

సుప్రసిద్ధ పరిశోధకులు శ్రీ.శే. సురవరం ప్రతాపరెడ్డి గారు తమ ఆంధ్రుల సాంఘిక చరిత్రలో ఈ గ్రామం 'జైనజోగుల వసతి' గా ఉండడం వల్ల జోగిపేట అయిందని పేర్కొనినారు.

ప్రస్తుతం జోగిపేట - డిగ్రి కళాశాల, పెద్ద మార్కెట్టు ఫైర్‌స్టేషన్, మొదలగు వసతులన్నీ కలిగి పట్టణంగా వ్యాపార కేంద్రంగా విలసిల్లుతోంది.

## జహీరాబాద్

భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడకముందు, ప్రస్తుత కర్ణాటక రాష్ట్ర - బీదర్ జిల్లాలోని మారుమూల కుగ్రామంగా ఉండి, నిజాం నిరంకుశ పరిపాలననుండి విముక్తి పొంది, ఆంధ్ర ప్రదేశ్ ఆవిర్భావం తర్వాత మెదక్ జిల్లాలో అంతర్భాగమైన ఎక్కెల్లి - గ్రామమే - నేడు మెదక్ జిల్లాలోని పట్టణం "జహీరాబాద్".

